శ్రీ

# సూర్యరాయాంధ్రనిఘంటువు

## ఏడవ సంపుటము.

వ — వైరి

పండితసాహాయ్యమున

కాకినాడ

ఆంధ్ర సాహిత్యపరిషత్తు

వారిచేఁ బ్రకటింపఁబడినది.



శంకర్ ప్రింటర్స్ ముద్రాక్షరశాలలో ముద్రితము

మద్రాసు.

1958





మహారాజా రావు వేంకట కుమార మహీపతి

సూర్యారావు బహద్దరు C. B. E. గారు

45వ ఆంధ్రసాహిత్యపరిషద్వార్షికసమావేశము

శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు 5-6 సంపుటములఆవిష్కృతి.



శ్రీ దంటు భాస్కరరావు - శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణపండితులు.



# సూర్యరాయాంధ్ర నిఘంటువు

## వ

వ. ఊష్మ. ఒక యక్షరము.

వ. సం. వి. అ. పుం. ౧. సాంత్వనము, ఓదార్చుట. ౨. వాయువు.

పుం. ౩. వరుణుఁడు. (మే. ని.)

అవ్య. ఇవార్థకము.

(దీనికిఁ దెనుఁగున వ్యస్తప్రయోగము లేదు.)

వంక¹ = వంకర. (√ వంగు. సం. వక్రః. వంకః ప్రా. వంకో. క. వంక. త. వంగిమ్.)

౧. వక్రత.

గీ. కోరగించిన కఱకంటి కొలికిఁ జూచి, వాఁడి
వాలికఁ పూఁదూపు వంకఁదీర్చి, చొరగి
తవిలి విషాలిండ్ల నొత్తిగిలిన యించు విలు
కొని వ్రాసినారిడుపునందు.

నైష. ౪. ౧౫౦.

సీ. ఇవ్విధంబునఁ గుబ్జయిచ్చిన లేపంబు లన్న
ముకుందాను గ్రహమున నలఁది, కొనిప్రసన్నత
నొంది కుబ్జమువ్వంకల యొడలు సక్కఁగ
నొత్తఁగను పడలఁచి ...

భాగ. ౧౦. పూ. ౧౨౪౪.

ఉ. ... దిద్దునెవ్వఁ డీల నేఱులవంకలు వారి
డొంకలున్ ... ఆము. ౬. ౧౧౪.

౨. వంపు.

ఉ. దిగ్గియనంచదూఁడుగాని తీరవనేఱువు
వంకమీఁగుగా, నగ్గడ ఫుల్లకేసరమునందు
వసింపఁగ నెక్కునూలిను, నప్రిగ్గము నందఁ
గాఁ దరుమరందసరోమకరంద గోష్ఠికిన్,
వెగ్గలమాడు తేంట్లు మరువింటికిఁ బూని
గుణద్వయత్వమున్. ఆము. ౫. ౧౨౨.

౩. వంకరపని, కుత్సితపు పని.

గీ. కవులెటులు నిన్ను వర్ణింపఁ గడఁగిరొకొ,
రహిఁ గళల్ గులుకు చక్కని రాజవనుచు,
వంక జనియించె నీ వంక శంకలేవొ, వంక
లేకనైన మానలేవా శశాంక.

ఇంగు. ౪. ౪౩.

౪. తప్పు.

వ. ... అవ్వెంగలి విత్తులఱచు నీచిడి యోఱపు
లను వంకలొత్తి మాఱు సెప్పుటయు ...
భార. ఉద్యో. ౩. ౨౩౫.

(వంకలొత్తు = అన్యథానయనము చేయు.)

ద్వి. బాడిగ నీకిచ్చి పతికి త్తిసేయ, జాడ
లన్నియు నీకు సంగడి నేర్చి, నీవు వంకలు

దీర్చు నీ పంపు పనులు, గావించుచుండెదఁ
గాక వేగిరమె. ద్వి. హరిశ్చ. ఉ. ౧౯౨.

ఉ. ... ఆగమశాస్త్రపురాణము ల్విరా, తంక
ముసం బతించునెడఁ దాపసపుత్రులకుం
గవుల్గొగిఁ ... హరిశ్చ. ౨. ౫౩.

౫. సెలయేఱు.

సీ. ఈ వంక నే వంక నెనసినసుహినాంబు లీ
వంకఁ బూఁదెప్ప నీఁదవలయు ...
వసు. ౨. ౫౮.

సీ. ... తలఁప మాగములు తమ్ముల వేరువిత్తులు
వర్ణింప మారొక వంకవార ...

గీ. లు ..., పొంచియుండక చనుఁడు రాయం
చలార ... చంద్రా. ౪. ౬౧.

సీ. ఒక మాట చాలఁ దియ్యల్లోలకల్లోలముగఁ
దెనెవంకలు నిగుడఁజేయ ...
వాల్మీ. ౩. ౧౨౪.

గీ. పలుఁదరాయంచగమియు వంకల నణంగ,
మనుపకుల మెల్లఁ దమ్ముల మఱువు సొచ్చె.
చిత్రభా. ౩. ౧౦౩.

విణ. వంకరకలది, వక్రమైనది.

చ. మడవక ముష్టియోగ్యమగుమధ్యముతో నెల
వంకయైన యప్పుడఁతుక భ్రూలతాధనువు
*పట్టి మనోభవుఁడు ... నైష. ౫. ౧౨.

క. ఆ ముఖలక్ష్మికిఁ బెట్టెడు, చామరల సద్వ
జ్మరీచి జలనిధిలహరీ, స్తోమమునఁ బోలుచు
నగజకుఁ, గామధనుఃఖండభాతిఁ గటివంక
బొమల్. కు. సం. ౩. ౩౧౧.

వ. ... సుమకోదండవల్లీమతల్లులగు కటివంక
బొమలును ... ఒప్ప ... హర. ౩. ౨౩.

వంక². వి. ప్రక్క, వైపు; దిక్కు.

ఉ. ... బాల్యాంక విచేష్టఁ దుండమున నవ్వ
లిచ నబలింపఁ బోయి యా, వంకఁగుచంబుఁ
గాన కహివల్లభహారముఁ గాంచి ...
మనుచ. ౧. ౪.

ఉ. పొంకముతోడ విస్ఫురదపూర్వవలాహక
భంగిఁ బొంగియే, వంకలఁ జీకటుల్ గవియ
వచ్చె యదూర్వహముపై రయంబునన్ ...
హరి. పూ. ౮. ౪౫.

సీ. తలచూపె నొకవంక దరదళ త్సేమంతికా
గంధినీహారకణభరములు ...
పారి. ౩. ౪౬.

గీ. ఏనొకడఁ బోయి యొక వంక నెత్తికొంటి,
నాతఁ డొకవంక నెత్తె మోపద్రి తనయ ...
హర. ౨. ౧౧.

క. ఇరువంకలఁ దన్నుఁ బొదవి, గొరవంకలుఁ
గుమ్మెదలును గోయిలు లుండ, క్రొక్కిచిలు
కలుఁ బరిపులుఁగులు, గొరగొర రా మరుఁడు
వెడలెఁ గొమ్మఁ గలంపన్. నీలా. ౩. ౧౧.

ఉ. బాలురు వీర లిద్దరణిభాగము క్రిందును
మీఁదు దిక్కులున్, మూలలు నెంతయు
క్కొలఁది ముందర నిక్క మెఱింగి
కొకయు, క్కిలయి యిట్లు సృష్టిపనికిం
దమకింపఁగఁజన్నె యున్నవా, రోలిన
యన్ని వంకలకు నొక్కటి నారయ నేఁగి
రందఱున్. హరి. పూ. ౧. ౭౨.

ద్వి. వారిజాప్తుఁడు దూర్పువంకఁ గ్రుంకినను.
ద్వి. హరిశ్చ. పూ. ౩౩౨. పం.

క. కేవలనూతుల తోడన, పోవుటగని వారిఁ
జేరఁ బోవక యదియుం,కే వంకఁ బోవు
నొకొయను, భావనఁ బోయితిమి ...
భార. విరా. ౩. ౧౪.

౨. పక్షము, ఎడ.

గీ. ఎగురుగా నేఁగుదెంచుచో నింద్రమయ్యెఁ,
బెండ్లి యిరువంకచుట్టంపుఁ బెద్దలకును ...
నైష. ౬. ౧౪.

ఉ. పంకజనాథ మాపడినపాటులు రాజ్యము
గోలుపోకయుం, గింకకు మూలమైకడఁగి
గెల్వ కిరీటికి నీఁ దలంచి యా, వంకకు
ప్రాలి భక్తజనవత్సలతన్ రథచోదకుండవై,

తింకిట మమ్ముఁ గావుమని యేటికిఁ జెప్పఁగ మాటిమాటికిన్. భార. ద్రో. ౨. ౧౩.

మ. ... నీకిప్పుడా, సుడివాల్దాలుపుకన్న వేలు కలరే చుట్టంబులే వంకలన్ ... నీలా. ౧. ౯౫.

3. స్థలము, చోటు.

ఉ. వారక కాశియందు నలువంకలఁ బుట్టెడు దుర్నిమిత్తముల్ ... కాశీ. ౬. ౬౩.

ఉ. ... ఆ, వంకఁ దశోధనుల్ హృదయ వత్సలతం బ్రియమంది చూడఁగన్ ... హర. ౩. ౬౧.

౪. కారణము, నిమిత్తము.

శా. ... తథ్యంబు నావంకకై, తాడస్సెన్ నవలాయటంచు నొఱగెన్ దల్పప్రఘూణంబునన్ ... వసు. ౪. ౯౪.

ఉ. ఏము పతివ్రతాత్వము వహించిన వారల మేని నిన్నినా, ళ్లీమికొఱంతలేక చరియించితిమేని మదీయమానముల్, కామవశాత్ముఁడై చెఱుపఁగాఁ బనిఁ బూనిన యీ దశాస్యుఁడున్, గామిని వంకనే యడఁగుఁ గాక సుతానుజబంధుకోటితోన్. ఉ. రా. ౪. ౯౫.

ఉ. ... ఆ, దోసము వంక మేగిని నథోభువనంబుననుండు రాకుకై, లాసముఁ జూడనన్న వికలత్వము నొందుచుఁ గాళినాగమున్ ... కాళ. ౪. ౧౬౧.

సీ. ఖరకరుం డలిశీతకరలీల దనయందు వహియించె నీతని వంకఁగాదె, మునుగిన్న మొల సామియును రాజశేఖరత్వము దాల్చె నీతని వంకఁగాదె. విప్ర. ౩. ౩౫.

౫. నెపము, వ్యాజము.

(వ్యవ.) అతిథుల కన్నము పెట్టకుండుటకు కఱవువంక దొరికినది.

(వ్యవ.) కట్నముచాలదని వంకపెట్టి అత్తవారి యింటికి వెళ్లుట మానివేసినాఁడు.

౬. విషయము, ఎడ.

ఉ. గానిలి భర్తవంకఁ గొఱగాములు పల్కుయిదేమి సిద్ధియా, భాసునకేల చొప్పడుఁ దపఃఫలసంచితభాగ్యసంపదల్ ... విక్ర. ౩. ౭.

౭. విధము.

శా. ... పరకాంతం దెచ్చితీకార్య మే, వంకం గీడిది యేల పుచ్చుమరలన్ వైదేహి ... భా. రా. యు. ౪౨౭.

గీ. ... ఒంట రెంటను జెఱిచినాఁడె, యెల్ల వంకలఁ జెఱిచెఁగా నింగ్రు నజుఁడు ... దశా. ౭. ౧౧౦.

౮. ఒద్ద, సన్నిధి.

గీ. దర్పితేల్వలవాతాపిదమన మీరు, పెక్కుకాలాలు గడపిన పెద్ద లగుటఁ, గ్రొత్తలేమైన మీ వంకఁ గొన్నిగలుగ, వలయునవి నాకుఁ జెప్పుడు తెలియ ననిన. వరాహ. ౯. ౧౩౨.

ఉ. వాసనఁ గేతకీదళము వంకఁ గళంకములేని పైఁడి యభ్యాసము చేసెనేని యగునప్డు సమానము గంధసారచ, ర్చాసురభీకృతం బగుచుఁ జారుతట్టిల్లతికామతల్లికా, భాసురవర్ణమైననరపాలతనూభవదేహయష్టితోన్. నైష. ౬. ౪౩.

వంక³. వి. కష్టము, ఇబ్బంది.

ఆ. కొంకులేనివెతలఁ గుందెడిముగుదల, డంకతనము మీర జంకులేక, బింకమునఁ గలంచె దింకనెన్నఁడు నీకు, వంక గల్గ దోటు జింకతాల్ప. నీలా. ౩. ౨౧.

(ఇట "వక్రత" అని రెండవ యర్థము.)

వంకదార. వి. (√ వంక¹.) కోటవాకిటికి ముందుండు వంకరదారి.

సీ. ఘంటీఘటించినభటనగోళముఘంగి సంకులాం
గణమైన వంకదార ... క్రీడా. ౧౧౨.

స్వాగతవృత్తము. శంకలేక శరచాపధరుండై,
యంకుశాహతమహాకరతోడన్, వంకదార
కడ వాకిట నిల్చెన్, బింకమొప్ప సుర
భేగి విభుండున్. సుద. ౬. ౨౫.

సీ. వంకదారకుఁజేరి వాకిటి దడ్డడంబులు సెర్చి
కొమ్మల ప్రోఁకుపైచి ...
ఉ. హరి. ౩. ౩౪.

స్వ. కోటయుఁ గొమ్మలుఁ గొత్తడంబులుఁ
గ, వాటంబులును దగువంకదారలును,
బెట్టించి ... బస. పు. ౩. ౫౦౧ పం.

**వంకము¹.** వి. అశ్వశిక్షా భేదము.

సీ. వలసంబు పుట్టించి వంకంబు వలయించి
డీల్లాయి ప్రకటించి తేపఁజూపి.
పి. శకుం. ౧. ౧౧౨.

**వంకము².** వి. సం. వక్రః. నులుచునపుడు కసవును క్రిందు మీఁదుగా త్రిప్పివేసెడు వంకర కొయ్య, కొంకికఱ్ఱ. (శ. ర.)

**వంకము.** సం. వి. అ. పుం. ౧. ఏటివంపు; వంపు, వంకర. ౨. ఏటి రెండుదరుల నడుము, పాత్రము. ౩. గుఱ్ఱమునకు జీనుకట్టెడు చోటు.

**వంకర = వంక¹.** వి. (√ వంగు). ౧. వక్రత, వంపు.

(వ్యవ.) ఆ సీమ యొక్కడను వంకరలేక నిబ్బరముగా నున్నది.

౨. వక్రోక్తి, వంకర మాట.

ఉ. బోఁటి క్రియయంబుచే నిపుడువోఁ బనిలేదు
భుజంగభీతిచే, వాటముడప్పెనో ప్రియుఁడు
వంకరలాడుచు నల్కఁబూనెనో, యేటికిరాఁ
బోదోనని యింతి కుచంబున నున్న గేదఁగిన్,
గాటిలఁ బుప్పొడుల్ పడిన గంగిని గన్నుల
నించె బాష్పముల్. సంఘ. ౧. ౧౨౨.

**వంకరకొంకర.** విశే. (వంకర + కొంకర) మిక్కిలి వంకరయైనది.

గీ. వైపు దప్పిన చేతులవాఁడు మొద్దు, వ్రేళ్ళ
వంకరకొంకర కాళ్లవాఁడు ...
వరాహ. ౨. ౪౫.

**వంకరకొంకరల్ వోవు.** అ. క్రి. (√ వంకర కొంకర.) మిక్కిలి వంకరయగు.

స్వ. కుఱుచలై వంకరకొంకరల్ వోక, సల్లలై
చక్కనై సవరనై పెరిగి, వెల్లవోవని పండు
వెరుఁగులుచూచి ...
స్వ. సరమ. ౨. ౬౬. పా.

**వంకరటింకర.** విశే. (√ వంకర) పలు విధముల వంకరయైనది, నానావిధవక్రము. (శ. ర., వా.)

**వంకరబోను.** వి. (√ వంకర) మృగాదులను బట్టువల.

క. మతితెరలఁ జిక్కములు వం, కర బోనులు
త్రాళ్లు నురులుకొలఁదులును జే, గురు గం
డెలు తలముళ్లున్, గుఱిచిలుకులు వింట్లు
లోనుగాఁ గొంచువెసన్.
యయా. ౧. ౪౨.

**వంకరవోవు.** అ. క్రి. (√ వంకర) వక్రమగు. (శ. ర. వా.)

**వంకలుదిద్దు.** అ. క్రి. (√ వంక¹) వంకలు తీర్చు, ఆక్షేపించు.

సీ. ఈ సాధ్వి వర్తన కిట్టట్టు వంకలు దిద్దఁ
జూడదగము ... శశా. ౪. ౧౪౩.

**వంకలుదీర్చు.** స. క్రి. (వంకలు¹ + తీర్చు) చక్కదిద్దు.

శా. పంకేజాతములన్ గిసంగలఘుఁచున్ బాలా
మణీసాదముల్, వంకల్ దీర్చు మనోజ
సాయకములన్ వాల్చూపు లేణాంకునిన్,
శంకల్ సేయు మొగంబు జక్కవకవన్

గీ. పార్వతికి నొక్క సెజ్జెలి బాహుపురులు,
తాయెతులు వంకు లుంగరాల్ తనరఁజేసెఁ,
గాని యది రత్న మయములౌ కటకములను,
దాల్పఁ జేసితి నేనంట తంటగాదె.
పార్వ. ౫. ౧౩౭.

సీ. బంగరు కడియముల్ పచ్చలచేకట్లు రత్నాల
వంకీ లొక్కరముల వెలయ ...
వేం. మా. ౧. ౧౩౦.

**వంకిణి¹** = వంకి¹. వి. బాకు.

సీ. కరము గోకిలఘటోత్కరముచేఁ జిగురుఁ
గ్రోంబడను వంకిణి మొక్కపడఁగఁ
జూచి ... చంద్రా. ౩. ౧౧౭

చ. వెడ పలుకొఁడు నెమ్మనము వేములు
గేడఁగిఁజేకు వంకిణీ, బోడువఁగ మేను
పానుపునఁ బొండక ని స్నేహయత్రపదానమే,
నడిగెద ... రామా. ౬. ౧౪౯.

వ. ... లౌడి వంకిణి సబళ యీఁటె సెలకట్టె
సిళ్ళను ద్వాత్రింశాయుధంబులు ...
ప్రబంధ. ౭౨.

**వంకిణి²** = వంకి². వి. పరిమళద్రవ్యము లుంచు
కొనెడి పాత్ర విశేషము.

ద్వి. వలపారు గోవజవాది వంకిణులు, గల
వంపు గోరనుగ్గస్తురి పెట్టె ...
ద్వి. తి. సా. ౧. ౧౧. పా.

**వంకియ.** వి. ఏనుఁగును శిక్షించు సాధన విశేషము,
అంకుశము.

వ. ... అఁడ దేనుంగు నాము వలపుగల
చేడలేటి యొద్దునకేఁగ నడరి మావటీంద్ర
లెక్కఁగొనక నాటిన నెఱవాఁడి వంకియలు
తలలు గులిపి దొలఁగ మీటిన మేటి గారు
లును. అచ్చ. భా. ౩. ౩౨.

వ. ఓరల దారుల నాము లేనుంగు గాలింగనలి
మావటీంద్రుఁడు నాఁటు వంకియలఁ గొంకక
బాఁటి యొదలఁ జిక్కిన మక్కువ పెక్కువ
నెట్టకేని నెట్టినడచు నేనికలును.
అచ్చ భా. ౩. ౩౨. పా.

(ఈ పద మీగ్రంథమందే కనవచ్చుచున్నది.)

**వంకిలము.** సం. వి. అ. పుం. ముల్లు, కంట
కము.

**వంకుటుంగరము.** వి. (వంకి¹ + ఉంగరము.
వృత్తిని వర్ణవికారము.) అంగుళీయక విశేషము,
ఒక విధమైన యుంగరము.

ఉ. నల్లనికమ్మిపచ్చడము నామపు బొట్టును
గుచ్చుటద్దముల్, తెల్లరుమాలువల్లె మొలఁ
దిత్తికరంబునఁ గోలవ్రేళ్ళసం,ధిల్లిన వంకు
టుంగరము తీరగుపూజల జంటగుండ్లు
రం,జిల్లఁగ రెడ్డివచ్చి తనచెల్వను వాఁకిలి
దీయఁ బిల్చినన్. హంస. ౪. ౧౬౩.

**వంకె(కియ).** వి. ౧. చిలుకకొయ్య. ౨. సస్య
విశేషము. (శ. ర.) ౩. బ. భూషణవిశేషము.
(బ్రౌ. ని.)

ఉదా: పులిగోళ్ల వంకెలు.

**వంకెలు.** వి. బ. ధాన్యవిశేషము.

సీ. ఏదుకజ్జలువంకె లిసుకరాజనములు పులి
గోళ్ల వంకెలు బొగడసరులు ...
హంస. ౪. ౧౨౨.

**వంక్యము.** సం. వి. అ. న. పాగ మొ. తగి
లించెడు చిలుకకొయ్య. (శ. ర.)

**వంక్రి.** (సం. వి. ఇ. పుం. స్త్రీ. అని కొందఱు.)
౧. ప్రక్కయెముక, పర్శువు. ౨. ఇంటి
వాసము. ౩. సంగీత సాధనవిశేషము.

**వంక్షణము.** సం. వ. అ. పుం. పొత్తికడుపున
కును తొడకును నడిమిసంధి, గజ్జె.

వంగ. వి. వంగయానంగను వార్తాక నామమూ ...
ఆం. భా. ౨. ౫౯.

ద్వి. దొంగలచీరల కొంగులనున్న, వంగకాయలు
ప్రాణలింగంబు లయ్యె ...
పండితా. పురా. ౧౦౪. పా.

సీ. తీసయిల్లు దోచవచ్చిన తస్కరులు గాల్చి
వంగకాయలొనర్చి లింగములుగ ...
చెన్న. ౫. ౩౧౦.

జ: వంకాయ, వంగపండు, వంగవరులు,
వంగాకుబుడమలు.

వంగఁదీయు. స. క్రి. (వంగన్ + తీయు.)
వంచు, వంగఁజేయు.

వంగజము. సం. వి. అ. న. ౧. సింధూరము.
౨. ఇత్తడి.

వంగజీవనము. సం. వి. అ. న. వెండి.

వంగడము. వి. వంశము, వంగసము.

లయగ్రాహి. ... జహ్ను మునిపుంగవ విశాలో,
త్సంగ శిశుపుంగవిలునిం గలపుఁ జూపు
సెకలం గలయు నాసగరు వంగడము
మోాక్ష త్తుంగమణి సౌధమునకుం గడపు
తాప ... పారి. ౨. ౯౩.

క. అంగిజ హరుని ప్రసాదము,సం గలుగుచు
వచ్చె సుతుఁడు నాఁడాదిగమా, వంగడమున
నదియిప్పుడు, వెంగడమై కూఁతురుద్భవించె
న్నాకున్. విజ. వి. ౨. ౮.

క. ... వలనుగనత్తమ్మి చూలివంగడపుంజా
బలియల కోనింగని ... నీలా. ౧. ౭౬.

సీ. సంకుకొలము వంగసము వంగడము పడుగన
వంశ సంజ్ఞయై యలరుచుండు ...
ఆం. భా. ౨. ౧౭౦.

౨. (వ్యాక.) వర్గము.

క. గుదినున్న జ ఞ ణ న మములు, వదలిన యా
క చ ట త ప ల వర్గాక్షరముల్, పొదిఁడన
వంగడములలో, నదిన నకివ్వళులు వర్గ
జాఖ్యము లయ్యెన్. కావ్య. ౭. ౩౬.

విశే. సంబంధి.

చ. అని తన వంగడంబగుధరాధిపమంత్రిపదాతి
వర్గముఁన్, బనివడి కూడఁబెట్టి శతభారకు
వర్ణము దండ మెవ్వఁడై,నను డగ వాసు
దేవుఁడనునామమున న్ననుఁ బిల్వకున్నఁ
బ్రాయనిపగ వాసుదేవుఁడని యాదవు
బిల్చినఁ జాటిచెప్పితిన్. ఉ. హరి. ౩. ౫.

వ. ... చిచ్చఱ పిడుగులం బోనియమ్ములు
దిఙ్ముఖమ్ముల దీటుకొల్పుచు మేటిజోదులు
కన్నాకులయి తమతమ వంగడంబులఁ బరి
కొలిపిన నిరువాగు నద్భుత సంప్రహారం
బొనర్చనందు. హరి. ఉ. ౬. ౧౨౪.

వంగపండు. వి. (√ వంగ.). ౧. వార్తాకఫలము.
౨. పక్షి విశేషము.

సీ. కాజు బెగ్గురు నీరుకాకి కంకణమును గొంగ
డాబయు గువ్వ వంగపండు ...
యయా. ౨. ౨౪.

సీ. జిట్టువమునుగ పూజిట్టువగిజిగాఁడు వల్లడ
పొడిపిట్ట వంగపండు ...

గీ. ... ఆదిరైయినపక్షు లతఁడుదీర్చు ...
హంస. ౩. ౧౨.

వంగము. సం. వి. అ. పుం. ౧. ప్రత్తి.
౨. ఒక జాతివంగ. ‡.
న. ౧. సీసము. ౨. తగరము. ౩. దేశవిశే
షము.

వంగరేడుకూర. వి. సముద్రతీరమున నిసుక
తిన్నెలపై మొలచు నొకవిధమగు మొక్క. ‡.
(బ్రౌ. ని.)

**వంగవరులు.** వి. బ. (√ వంగ) ధాన్యవిశేషము.

క. ... ఏడాకు మొలకలు గుజ్జురుల్ బిరుసులు జొన్నఁబ్రాలు చిన్నిచుకక్కులు కళింగలు వంగవరుల్ జగన్నాథప్రియములు ...

ప్రబంధ. ౧౧౨.

**వంగశుల్బజము.** సం. వి. అ. న. కాంశ్యము, కంచు.

**వంగసము.** వి. వంశము, వంగడము.

ద్వి. మీవంగసములోన మేదినియందు, నీవన్న బుద్ధి నెన్నికకన్న దొరవు.

ద్వి. శ. సా. ౧. ౩౧౯. పం.

సీ. ఇసుమంత మాన్ని వంగసము బాలల కీన్నె రల ప్రోఁతలకు మారువలుకు గవులు ...

ప్రబంధ. ౧౧౫.

సీ. సంతుకోలము వంగసము వంగడము పదుగన వంశసంజ్ఞయై యలరుచుండు ...

ఆం. భా. ౨. ౧౭౦.

**వంగాకుబుడమలు.** వి. బ. (వంగ + ఆకు + బుడమలు) ధాన్య విశేషము.

సీ. చంద్రవంకలు జీనిసరులు కాంభోజులు వంగాకు బుడమలు పొంగుఁబ్రాలు ...

హంస. ౪. ౧౨౮.

క. ... ఈశ్వరప్రియములు యేలకిరాజనాలు పిచ్చుకగొఘ్ను వంగాకుబుడమలు ప్రయాగలు పసవు గన్నెర్లు ... ప్రబంధ. ౧౧౨.

**వంగారి.** సం. వి. ఇ. పుం. హరిదలము.

**వంగు.** అ. క్రి. (సం. వక్.) వక్రమగు, నమ్రమగు.

చ. వలవలనై సదంతములు వంగినమేనువణంకు మస్తముస్ ... విక్ర. ౨. ౧౫౫.

ఉ. ...కుసుమకార్ముకళృంగము వంగఁజేయు నీ, యీూకరపంకజాతము రతీశ్వర ...

నైష. ౧. ౧౩౭.

చ. బలసినహల్లకచ్ఛటలపైఁ దమ జొంజురు ముండ్లు రాయఁగాఁ, గలమముల్లుండుఁ బండి యొలుగంబడి నీరడలింపఁ దృష్ణతోఁ, దల కొనవంగి మున్జలము ద్రావెడు క్రిందటి వేళ్లు మీఁదట్లున్నలిపి మరంద మానుకరణి న్నికటోత్సవనానిలాహతిక్. ఆము. ౧. ౬౭.

క. పనులాకొడల్వంగక కాల్మిను లిద్దఱుఁగూడి గోళ్ళు మీఁటుచు ... శుక. ౨. ౩౩౩.

(ఒడలు వంగక = శరీరము స్వాధీనముగాక.)

జ: వంక, వంకగార, వంకరకొంకర, వంకర కొంకరల్ పోవు,వంకలుదిద్దు, వంకలుదీర్చు, వంకలు నొక్కు, వంకవంక, వంకసన్నములు, వంగఁదీయు, వంచు, వంచుకొను, వంపు, వాంచు.

**వంగుడు.** వి. రోగమువలన దేహమునందుఁ గలుగు పగులు.

సీ. ... పగులఁడు బీఁటిక వంగుడనఁగ, గీ. స్ఫోటముదనర్చు ...

ఆం. భా. ౨. ౧౩౦.

**వంగులు.** వి. బ. పడవలో అడ్డవాసములు.

(బ్రౌ. ని.)

**వంగుళ్లు.** వి. బ. నట్టొట్టు, జలధారలోనగునవి నిరంతరముగాఁ బడియుడిగిన వెనుక నచ్చోట నిలిచి నిలిచి పడెడు భొట్లు.

గీ. దవులఁ జల్లని తూలి సంతకు మునుపటి, జల్లు నీరానివచ్చు నాజల్లు మొదలి, గాలి యొలగొలుచేఁ గొమ్మగదలి జల్లు, దలపడక మున్నవంగుళ్ళఁ దడిసెదరులు.

ఆము. ౪. ౧౩౦.

సీ. గొబ్బునజల్లు పైకొన్నఁ జెట్లను జేరి వంగుళ్లు ఘనమైన వణఁకువారు. చంద్ర. ౫. ౩౯.

గీ. వానవెలిసియుఁ జారునఁ బడిననీరు, బొట్టు వంగుళ్ళు నాఁగ నట్టొట్లు నాఁగఁ, బేరులు వహించ్లు ... ఆం. భా. ౧. ౭౫.

వంచే1. స్త్రీ. ఒకటి, ఏకము.

క. అత్తీవంచతిగఁగఁగయు, సత్తావచ్చెకవంచే చొవంచీరై, దిత్తిగ యిద్దుగబద్దలు, చిత్తంబునఁ దలఁచినట్లు చేతికిఁ దెచ్చున్. ఉ. హరి. ౩. ౧౨౧.

వంచే2(ము). విశే. ముఖ్యము.

ఉదా: గిరివంచే బొల్లము. (శ. ర.)

వంచే3. వి. కోణము.

చూ. ముప్పంచు, ముప్పంచాకు.

వంచే4. వి. ఒక ప్రదేశము. (బ్రౌ. ని.)

వంచకము. సం. వి. అ. పుం. ౧. గుంటనక్క. ౨. చేంచె. ౩. పెంపుడుముంగిస.

వంచకుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ౧. మోసముచేయువాఁడు. మాయ చేయు వాఁడు. వంచించువాఁడు. ౨. ఖలుఁడు, చెడ్డవాఁడు.

వంచథము. సం. వి. అ. పుం. ౧. పికము, కోకిల. ౨. వంచనము. మోసము.

వంచథుఁడు. సం. విశే. వంచకుఁడు, మోసకాఁడు.

వంచేన. వి. (సం. వంచనా.) మోసము.

రగడ. అలసగమనముఁ జూపి చెలినీ వంచే వంచేన సేసి పట్టితి. పారి. ౪. ౧౬.

వంచన. సం. వి. ఆ. స్త్రీ. ౧. మోసము. ౨. కుట్ర, ప్రతారణము. ౩. భ్రాంతి, భ్రమ. ౪. నాశము, నష్టి.

వంచోడించు. అ. క్రి. లక్ష్యపెట్టు. (చి. ని. "బెదరు" అని శ. ర.)

క. వంచాడించక తాలిమి, డించక బిగువెడలి తల్లడించక మదిలో, నించుక యైనను రాఁజలి, యించక యాఁగట్టివాయి యిట్లని పలికెన్. సారంగ. ౩. ౨౦౬.

వంచి. స. వంచే, ఒకటి.

ద్వి. వనిత మెచ్చవుపంచి వైచిన ననుచు, నన ఘుఁడు చొవంచి యనుదాయమాడు ... పండితా. పురా. ౧౨౫. పా.

వంచించు. సం. స. క్రి. వంచనచేయు, మోసపుచ్చు.

వ. ... ఆ సురియగు మాయెడంరి బ్రయోగించి వంచించి యపహసించితివి ... మనుచ. ౫. ౧౯.

వంచితము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. మోసపుచ్చఁబడినది, వంచింపఁబడినది. ౨. నశింపఁజేయఁబడినది.

వంచు. (√ వంగు). ౧. వంగఁజేయు.

చ. అనుపమదివ్యవిక్రమసమగ్రుఁడు రామవిభుండు జిష్ణుఁడా, యనితరభేద్య రౌద్రధనువక్రమభంగిగ వంచి బాహులీల నెరపె ... రాఘవ. ౨. ౫౫.

సీ. కల్యాణగోత్రంబు గరిమ వంచినదూరు సరసులనింకించు పరుసఁదనము ... వసు. ౧. ౧౦౭.

సీ. బటువు పెందొడలు రంభల వంచుటే చిత్రమిభహస్తములరీతి నేపు చూప ... దశా. ౨. ౨౬౩.

(ఇట నౌపమ్య ద్యోతకము.)

౨. వశపఱచు, లొంగఁదీయు.

ఆ. ... యోగి ముహూర్తార్థ, మింద్రియా
నుషంగి మింతలేక, ప్రాణములను వంచి
బ్రహ్మరంధ్రము చించి, బ్రహ్మమందుఁ
గలయుఁ బారమేంద్ర. భాగ. ౨. ౨౯.

3. భ్రమ్మరించు.

చ. పతియభిషేకవేళఁ గరభావిత కుంభకరం
గస్ఫుగ్మణి, ప్రతిమలు నిర్జరీసుముఖభావము
గన్గొని నీరువంచి యు,య్యాలివలు సిగ్గునం
గనలి యాస్యము వంచిన నూరకుండె ...
వసు. ౧. ౭౮.

సీ. తరుణులు వెలి పట్టు తెరవట్టఁగా నళ్వ
తరుఁడు దేవి పసిండి తలుకు గిండిఁ, బన్నీరు
వంప భూపాలు పాదాబ్జముల్గడిగి ...
కువల. ౫. ౯౬.

తే. నెలఁతఁ గుచకుంభయుగళి ముండియు
వియోగ, జలధియీఁదింప లేదయ్యె సఖులు
వంచు,చున్న పన్నీటివెల్లి లోఁగొన్నకతన.
ఆము. ౫. ౧౫౧.

౪. నశింపఁజేయు, పోఁగొట్టు.

క. సంపద సెడియును దైన్యముఁ, గంపంబును
లేక తొంటికంటెను బెంపుం, దెంపును
నెఱుకయు ధైర్యము, వంపని సురవైరిఁ
జూచి వటుఁ డిట్లనియెన్.
భాగ. ౮. ౬౪౦.

౫. వడ్డించు.

క. పులిచారు వంచెనొక్కఁ డె, పులిచాఱల చీరఁ
గట్టి భోక్తలకేకొ,వలి చారు చంచరీకా,
వళిచారుల సత్కృచాళివహిమహిఁబొగడన్.
బహు. ౪. ౨౫.

క. జిడ్డుగడలి దొరల్లుం, డొడ్డుకొనం దొడఁగెఁ
గేలియొడ్డు స్నవలా,లిడ్డ తెలినిగ్గుటిడ్డెన,
వడ్డనకుం దొడ్డలడ్డువా ల్వంచుటకున్.
బహు. ౪. ౩౧.

వంచుకము. సం. విణ. (అ. ఈ. అ.) మోసపు
చేయునది, వంచించునది.

వి. అ. పుం. గుంటనక్క.

వంచే(చి)కొను. స. క్రి. (వంచు + కొను -
స్వార్థమున). ౧. వంగఁజేయు.

గీ. ప్రాఁతమైనన్నురమ్ము పొమ్మను నృపాలు,
నెదురఁ దలవంచికొని యుండ నెట్లు
నేర్తు ... నైష. ౨. ౬౬.

(తలవంచుకొనుట మానభంగసూచకముగాన
నట్లు ప్రయోగింపఁబడెను.)

సీ. భుజమూల మీక్షింపఁ బొదలు సిగ్గున నీవు
వడ్డింపనని కేలువంచికొనుచు ...
దశా. ౨. ౩౫౮.

౨. వశపఱచుకొను, స్వాధీనముచేసికొను.

సీ. ఆలిని వంచుకోఁ జాలక తగవర్ల బ్రతిమాలు
కొనువాని బ్రతుకు రోఁత ...
వేణు. ౧౮.

వంచె(చియ). వి. అట్టెడ, తూమెడు గింజలు
పట్టెడు గోనె.

(కసవులోనగునవి కోయువారు వాని నుంచు
టకు వెనుక పిఱుఁదుల మీఁద జాఱఁగట్టు
కొనెడి యొడి. శ. ర.)

సీ. ... వంచెయసంగి నట్టెడ యుంచన నాథ
కమితగోణితగు ... అం. భా. ౨. ౨౬౬.

వంజే¹. వి. (సం. వంధ్యా. ప్రా. వంఝా.) ౧.
గొడ్డుటావు, వశ.

సీ. వంజెలనైనను వల నేర్పడఁగ నొకభంగిఁ
జేఁపఁగఁ జేసి పాడిగొనఁగ ...
భార. విరా. ౧. ౧౦౧.

౨. గొడ్రాలు.

ద్వి. వంజెలై తిరిగెడు వారకాంతలకు, ...
(Pal. 337. బ్రా. ని.)

**వంజె².** వి. గొడుగులోపలి శలాకకూఁతగా చేర్పఱిచిన కమ్ములు.

చ. గొడుఁగుగఁ జేసి గోవులకు గోపకుమారుల కున్నగంబు నిశ్చల్లోడఁబడ వచ్చుఁ బొమ్మ నఁగ నొప్పెడు వ్రేళులు వంజెమాడ్కియై, యడరినమీఁది మేఘతతి యావృతియై శిఖరంబు గుబ్బయై, కడుఁబెడఁ గొండు హస్తమను కామ దిరంబుగఁ దాల్చి పోల్చుటన్. హరి. పూ. ౭. ౧౭౮.

**వంజెరము = వంజె.** వి. ఒకవిధమగు చేఁప. (శ. ర., బ్రౌ. ని.)

**వంజుల.** సం. వి. ఆ. స్త్రీ. ఎక్కువగా పాలిచ్చెడియావు.

**వంజులప్రియము.** సం. వి. అ. పుం. పేము.

**వంజులము.** సం. వి. అ. పుం. ౧. అశోకము. †. ౨. తినిశము. †. ౩. వేతసము, ప్రబ్బ. †. ౪. స్థలపద్మము. †. ౫. పక్షివిశేషము.
విశే. (అ. ఆ. అ.) వక్రము, వంకరయైనది.

**వంజెవాఱు.** అ. క్రి. (క. వంజె.) బలహీనుఁడగు.

ద్వి. కరములు నొచ్చి యంగములు నొచ్చి యును, శరవహ్నిఁ జొచ్చియు శరణు జొచ్చియును, వడిఁగూడఁ బాఱియు వంజు వాఱియును, జడబుద్ధి మీఱియు సఖులఁ జేఱియును. ద్వి. భార. విరా. ౪. ౫౯. పా.

**వంట.** వి. (√ వండు²). పాకము, వండుట. (చూ. వంటయిల్లు.)

**వంటకట్టె (ట్టియ).** వి. (√ వంట). వంటకై పొయ్యి మండుటకు వేసెడు కట్టె, వంటచెఱకు.

గీ. వంట కట్టెలకని తెచ్చి వాము లిడిన, యగరు ప్రాఁకులపై నిండ నారఁబెట్టు, కప్పురంపుటనంటులు గలిగి మెఱయు, చెఱుకుపల్లియ లొక కొన్ని యెదుటఁగాంచి. యయా. ౧. ౪౭.

ఆ. బియ్యములును నేయుఁ బెరుగును గూర గాయలును వంటకట్టియలును గడ్డి, కవ ణములును బెల్లుగా నొడఁగూర్చి నిగూఢ వృత్తిఁ దానుగూడ నిలిచె. భార. ఉద్యో. ౧. ౯౩.

క. ఊరులింగము బోధించిన, కరణిన్ గ్రుమ్మరుచు వంటకట్టియ లొక మోపరుదుగ వారల గేహావరణములో బయలనుండి వైచుచునుండెన్. చెన్న. ౫. ౨౨౪.

గీ. గంధసారాగురుద్రుమ కాష్ఠఖండ, చయము దమయింటి వంటకట్టియలు గాఁగఁ, జేయు దురు కాపురంబులు సేయునపుడు, చెంచె తలు చెంచులనుగూడి చిత్రలీల. కాళ. ౩. ౪.

**వంటక(త్తె) త్తియ.** విశే. (వంట + కత్తియ) వంటచేయునది, పాచకురాలు. (శ. ర.)

**వంటకము.** వి. (√ వండు²). ౧. పాకము.

సీ. గుడిప్రాని పొంతను గుహలోన నుండుచు దంపకసులకు వంటకములకును, గీ. భోజన ములకుఁ దఱియైన ప్రొద్దు గడపి, భిక్షు గొను ... భార. శాం. ౫. ౩౯౩.

క. ... అదియు, దనయుం గనుఁగొని వంటక, మొసరింపుము సీరికని నియోగించుటయున్ ... దశకు. ౧౦. ౧౦౪.

౨. అన్నము, ఓగిరము.

చ. కని భ్రుకుటీమహోగ్రపరికంపితఫాలభయం కరాస్యసం,జనితని దాఘవారికణజాలవిజృం భణరౌద్రమూర్తియై,యనియెఁ గణంగి యోరి మనుజాధమ నిచ్చలుఁ దెచ్చు వంటకం,బును నులివేఁడికూరలు నపూపములుం గొనిరా కహంకృతిన్. విక్ర. ౫. ౨౧౯.

సీ. అపుడు వసిష్ఠసంయమివచ్చి - ధర్మాత్మ కట కటా స్వామిద్రోహ భక్షణము నీకు, గీ. నుచిత మేయన్న నేమి చేయుదు మునీంద్ర, యున్ని నీవైన వంటకం బింపుకైనఁ, దొల్లి దానంబు చేయని దుష్కృతమున, నిర్భరక్షుత్పిపాసలు నిలువ వనిన. వరాహ. ౧౨. ౬౬.

౩. ఆహార పదార్థము.

క. కోరిన వంటకములు నా, నేరిమిఁదగ నెఱపి కొలుతు నిశ్చల భక్తిన్ ... భార. విరా. ౧. ౨౧౯.

సీ. సిరియిల్లు మేల్కనఁ జేసి జేజేలకు వంటకం బిడు కన్నుదంటవాఁడు ... రా. వి. ౧. ౮౧.

చ. కుడువఁడ వంటకంబుఁ గనఁ గోరఁడొకిం చుక నూనశయ్య ... విజ. వి. ౨. ౧౨.

**వంటకము.** సం. వి. అ. పుం. ౧. పంచి పెట్టుట, భాగములప్రకార మిచ్చుట. ౨. వాటా, భాగము.

**వంటకుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) పంచి పెట్టువాఁడు, భాగములప్రకార మిచ్చెడు వాఁడు.

**వంటకూలి.** వి. (వంట + కూలి.) వంటచేసి పెట్టు నందుల కిచ్చెడు కూలి.

గీ. అలరు నొకవంటకూలి యొయ్యారియిల్లు ... శుక. ౪. ౪.

(వంటకూలియొయ్యారి యిల్లు = వంటపూటి దానియిల్లు.)

**వంటకొట్టము.** వి. (వంట + కొట్టము) వంట సాల. మహానసము.

సీ. వంటకొట్టము చిలువానముంచిన మిద్దెపట్టి మంచముతోడి పడుకయిల్లు ... శుక. ౩. ౮౭౭.

**వంటచేమురు.** వి. (వంట + చేమురు.) తిండి వంటచేయఁగా బాణలిలో మిగిలిన చేమురు. (శ. ర.)

**వంటచేలిమిడి.** వి. (వంట + చేలిమిడి.) భక్ష్య విశేషము, పాకపు చేలిమిడి.

గీ. గారె లరిసెలు బొబ్బట్లు గరిజెకాయ, లట్లు బూరెలు జంతికచుట్లు మణుగుఁ, బూలు వెన్నప్పములు చిటిబూరె లిడ్డెనలు మనో హరములు వంటచేలిమిడియును. చెన్న. ౪. ౩౫౮.

**వంటచెఱకు.** వి. (వంట + చెఱకు). ౧. వంట కట్టియ.

గీ. వంటచెఱకులు లేకున్న వానులైన, వస్త్ర ములు తైలమున ముంచి వహ్నిఁగూర్చి. హర. ౨. ౩౦.

క. విఱుతునో ద్రింగుదునో తల, దఱుగుదునో యేను జ్వరుఁడఁ దానుం జ్వరుఁడా, కఱకం తు నేయ విల్లగు, చెఱకుం జెఱకైన వంట చెఱకుం జెఱకే. ఉ. హరి. ౬. ౧౦౯.

క. ఈజాడ లేమిచేఁ గడుఁ, దేజము చెడి వంట చెఱకుఁ దెచ్చుచుఁ బర నారీజనుల కమ్మ యాతఁడు ... శుక. ౩. ౨౪౬.

౨. గుడపాకయోగ్యమగు రసముతో నిండి యుండు నిక్షువు, చెఱకు.

క. నానిశిఖి వంటచెఱకుల, చే నఱ నవి వెండి వంటచెఱకు లెయగుటం, బోనంబు ప్రజకు జక్కల, బోనంబులె యయ్యెఁ బొయ్యి సొగయమి వృష్టిన్. ఆము. ౪. ౧౨౫.

**వంటనము.** సం. వి. అ. న. పంచిపెట్టుట.

**వంటపని.** వి. (వంట + పని.) వంటవండుట, పాకముచేయుట.

గీ. వచ్చు తెరువరు లందఱు వంటపనికి, నన్ను
మెత్తురటంచు సందములు సూపి ...
శుక. ४. ౭.

**వంటపూటవాఁడు.** విణ. (√ వంట). అన్న విక్రేత.

సీ. పాచకుండొప్పు సువారంపు వాఁడనఁగను
బూటకూళ్ళవాఁ డనఁగ వంట,పూట వాఁ
డనఁగను ... ఆం. భా. ౨. ౨౮౬.

**వంటపూటిల్లు.** వి. (√ వంట). అన్నవిక్రయము చేయుగృహము.

సీ. వంటపూటింటి కెప్పంటికం టెను బాలు
పెరుగు నే గూర లం పెడు తెగువలు ...
ఆము. ౬. ౭౧.

**వంటము.** సం. వి. అ. పుం. ౧. భాగము. ౨. కొడవలి మున్నగు వాని పిడి.

**వంటయుప్పు.** వి. (వంట + ఉప్పు.) వండిన యుప్పు, విడంగము. (శ. ర.)

**వంటరాయి.** వి. (వంట + రాయి). మన్ను వండిచేసిన కృత్రిమ రత్నము. (శ. ర.)

**వంటరి.** విణ. (వంట + అరి³). పాచకుఁడు, వంట సేయువాఁడు. (శ. ర.)

**వంటలక్క.** వి.. (వంటలు + అక్క.) వంట వండెడి స్త్రీ.

ఆ. నేతవేఁచి నట్టి నిడుపుఁ గాకరకాయ, వరుస
నిడియె నొక్క వంటలక్క.
పాంచా. ४. ४౬.

క. ఆరీతిఁ బాక గేహముఁ జేరిన యా వంటలక్క
చిలుకం దఱుగం,గోరి ... శుక. 3. ౫౭.

**వంటలక్కతనము.** వి. (వంటలక్క + తనము.) వంటచేయుస్త్రీ ధర్మము.

గీ. హుతవహాఖ్యఖ్య యాఢి యస్మతి ఘటింప,
గార్హపత్యాదియగు పావక త్రయంబు,
వంటలక్కతనంబె రావణుని యింట, జరి
పెడు ఘనాఘనఘనాథ జలజనాథ.
చం. రా. ౨. ౨౯.

**వంటలవాఁడు.** (√ వంట). విణ. వంటచేయువాఁడు, పాచకుఁడు.

చ. వలలుఁడన న్విరాటుకడ వంటల వాఁడయి
భీముఁడుణ్ ... భార. ఉద్యో. ४. ౨౦౦.

గీ. ఏను వంటల వాఁడనై యా నరేంద్రుఁ,
గొలిచి గరగరగాఁ గూఁడు గూరచిత్త,
మునకువచ్చిన చందంబునన యొసర్చి, నేర్చి
మెలఁగుదుఁ గరము వినీతి మెఱసి.
భార. విరా. ౧. ౭౯.

**వంటవాఁడు = వంటలవాఁడు.** (శ. ర.)

**వంటసరకు.** వి. (వంట + సరకు). వంటకట్టియ. (శ. ర.)

**వంటసాల.** వి. (వంట + సాల.) మహానసము.

గీ. ... అహితకాలుఁ, డోలి గోపురమును
వంటసాలయు గణ,జంబుఁ గట్టించుటకు
మానసమునఁ దలఁచె. పరమ. ౫. ४౬.

**వంటా(డా)లము.** సం. వి. అ. పుం. ౧. వీరుల యుద్ధము. ౨. పాఱ; త్రవ్వుగోల. (మే. ని.) 3. పడవ, నావ (మే. ని.)

**వంటి.** విణ. సదృశము., బోటి.

(ఇది తఱచుగా షష్ఠీ విభక్తితో సమసించును. కొన్నికొన్ని యెడల ద్వితీయా విభక్తితోఁ గూడఁ గూడియుండును.)

ద్వి. నీవంటిప్రియురాలి నీవంటిసఖిని, నీవంటి
నయగుణనిధి నెందుఁగాన ...
రం. రా. అయో. ౯౦. పా. ౨౭. పం.

క. మీవంటి భాగవతులుం, భావనలుఁగఁ జేయ
రేని ... ఆము. ౬. ౫౫.

క. గావిని ముని యిట్లను వ్రత్యా విను మావంటి
త్రైర్థికావళి కెల్లన్, మీవంటిగృహస్థులసుఖ,
జీవనముఁ గాదె తీర్థసేవయుఁ దలఁపన్.
మనుచ. ౧. ౬౫.

చ. ... పలుకవు నిన్నువంటికులభామలఁ గానవు
వారికాత్మసాధ్వుల పయి బాళి లేదొ తమి
దొట్టిన పట్టున మట్టుపెట్టరో ...
కువల. ౩. ౪౩.

సీ. ... నూఁబూవువంటినాసికయు.
హర. ౩. ౨౩.

వంటి(టయి)ల్లు. వి. దే. (వంట + ఇల్లు.) మహానసము, వంటచేసికొను గృహము.

సీ. వంటిల్లు యామినీశ్వరకలామాలికిఁ దరి
చోటు నిఖిలబృందారకులకు ...
భీమ. ౩. ౫౧.

ఉ. బుద్ధికిఁ జూడ్కికిన్ వెలుఁగుఁ బూన్చె
గృతాంతుని వంటయిల్లనన్ ...
ఉ.రా. ౩. ౩౭౫.

శా. ... డాఁగఁబోయినఁ దలారిల్లయ్యెనేఁ
జేడకుం, బోనాఁ జిక్కెతి వంటయింటి
శశమై బోనంపుఁ బెన్గూటికిన్ ...
దశా. ౧. ౨౯౭.

ఉ. ... వంటయింటి కుం, లిది యొందుఁబోఁ
గలదు. ... విజ. వి. ౧. ౬.

సీ. వంటయిల్లనఁగను వంటిల్లనంగను బొసఁగు
చుండును మహానససమాఖ్య ...
ఆం. భా. ౨. ౨౪౨.

వంటు. వి. అనుకూల్యము.

ఆ. వంటుదప్పువేళ వంటకము విషంబు, కంటఁ
జూడఁగానె కంటగించు.
(బ్రౌ. ని., శ. ర.)

వంటుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) పెండ్లి కానివాఁడు. వి. అ. పుం. బ్రహ్మచారి.

వంటెము. వి. సీమైకదేశము.

సీ. వంటెమంచనఁగను వణిత మంచసఁగను
సీమైకదేశమై చెలంగుచుండు ...
(ఆం. భా. ౨. ౭.)

("తాలూకా" అని బ్రౌ. ని.)

వంఠము. సం. వి. అ. పుం. చిన్న యీఁటె.

వంఠరము. సం. వి. అ. పుం. ౧. లేఁతవెదురు పైనుండెడిపొర. ౨. తాటిచెట్టు మొలక. ౩. మేఁకను గట్టెడు త్రాడు. ౪. కుక్క. ౫. కుక్కతోఁక. ౬. మేఘము. ౭. స్తనము.

వంఠుఁడు. సం. విశే. (అ. ఆ. అ.). ౧. పెండ్లి కానివాఁడు. అవివాహితుఁడు. ౨. మఱుగుజ్జు. పొట్టివాఁడు. ౩. కుంటివాఁడు.
వి. అ. పుం. ౧. బ్రహ్మచారి. ౨. సేవకుఁడు, భృత్యుఁడు. ౩. మఱుగుజ్జువాఁడు.

వండ = వండలి, వండు[1]. వి. ౧. చెఱువు లోనగు వానియందడుగున నుండెడి యొండిన బురద. (శ. ర.)
౨. ఆపద, కష్టము. (శ. ర.)

వండ. సం. వి. ఆ. స్త్రీ. రండ. వ్యభిచారిణి యగుస్త్రీ. (మే. ని.)

వండము. సం. వి. అ. పుం. తోఁకలేని యెద్దు.

వండరుఁడు. సం. వి. అ. పుం. ౧. లోభి. పిసినారి. నపుంసకుఁడు.

వండఱు. అ. క్రి. (వండు[1] + అఱు.) బురద విఱుగు, తేఱు, నిర్మలమగు.

వ. ... దోస దొరగిలం బాఱెఁ బయ్యెర విసర
వారి వండఱియెఁ గరిమదంబుఁ గురిసె. ...
కాశీ. ౩. ౨౩.

వండలి. వి. చెఱువు లోనగువాని యడుగున నుండెడి బురద, వండ. (శ. ర.)

వండు[1]. = వండ. వి. బురద.

సీ. తురగఖురోద్ధూతధూళి తన్చెరసిన వననిధి పిండలి వండుగాఁగ ...
భార. విరా. 3. ౧౫౬.

సీ. వానకాలమునాఁడు వండు వట్టిన నీటి కాలుష్యముడిపెడు కతకఫలము ...
కాశీ. ౧౬౦.

గీ. అతని తపమున లోకంబు లడరె గిరులు, వడఁకె జలధులు పిండలివండులయ్యె, ధరణి కంపించె సూర్యచంద్రరుచు లడఁగెఁ, దారకంబులు రాలె దిక్తటులు ప్రేలె.
చిత్ర. భా. ౨. ౫3.

జ: వండలు.

వండు[2]. అ. క్రి. పాకముచేయు, వంటచేయు.

శా. సేవాదక్షత యొండుమై నెఱుఁగ నీచిత్తంబున న్మెచ్చున, త్లేవండం గడునేర్తు ...
భార. విరా. ౧. ౨౧౭.

గీ. వండనలయదు వేవురు వచ్చిరేని, సన్నపూర్ణకు నుద్ది యానతనిగృహిణి ...
మనుచ. ౧. ౫౬.

వండినకుడుము=ఇది భోగ్యపదార్థము సిద్ధముగా నున్న దనుట కుపమానముగా గ్రహింపఁబడినది.

క. తిండి కతంబునఁ గండలు, మెండుగఁబాఁ బెంచి మగఁడు మెదలఁ డనుచున్నుద్దండత నది మిండనికిన్, వండినకుడు మనఁగ దుడ్డు వైఖరి మెలఁగున్. శుక. ౨. ౧౦౨.

జ: వంట, వంటకట్టె, వంటకత్తియ, వంటకము, వంటకూతి, వంటకొట్టము, వంటచమురు, వంటచలిమిడి, వంటచెఱకు, వంటపని, వంటపూటవాఁడు, వంటపూటిల్లు, వంటయుప్పు, వంటరాయి, వంటరి, వంటలక్క, వంటలక్కతనము, వంటలవాఁడు, వంటవాఁడు, వంటసరకు, వంటసాల, వంటిల్లు.

వండుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వికలాంగుఁడు, అంగవైకల్యము గలవాఁడు. ౨. పెండ్లికానివాఁడు. 3. నపుంసకుఁడుగాఁ జేయఁబడినవాఁడు. ౪. లింగాగ్రచర్మము లేనివాఁడు.

వంత[1]. వి. ఏఱు, నది.

క. వంతలఁ బొంతలఁ బడిపలు, వంతలఁగా సిలఁగఁడగునె వలిగొజ్జఁగిపూ, బంతీ యింతీ సొగసుల, దొంతీ మము నింతఁ గలఁప దోసనుగాదే. అచ్చ. రా. అర. ౯౯.

క. సుడివడి యడలుచు బన్నము, వెడచూపక పొడమవంత వెలయఁగఁ గడులో, నుడుకుచు నుండెడివారల, యెడదొరలకుఁ గినియఁబోలునే యెకిమీఁడా.
అచ్చ. రా. యు. ౭౭.

(ఇట 'మనోవ్యథ' యని రెండవ యర్థము.)

ద్వి. వాఁగువంతల నోరవరలు నీరంబు ...
నవ. ౨. ౧౦౨. పా. ౧౦. పం.

వంత[2]. వి. ౧. సంతాపము, చింత.

సీ. సంతోషయుతుఁడనై వంతయు భయమును శీతాతపంబులు వాతగతియు, నెఱుఁగక.
భార. ఆది. ౫. ౬౦.

సీ. వంతఁ బానుపుమీఁద వైచె మేను ఘృతాచి ... నైష. 3. 3౬.

చ. ... పెల్లలము వియోగవహ్ని భవదంతర సైకతపంక్తిపొంత వం, తలఁ బొరలించి తౌదు శమనస్వస పుగ్రమయూఖనందనీ.
ఆము. ౫. ౩౦.

౨. బాధ.

క. ...మిఁక్కుటమగు వంతలఁగుందుచు ...
నీలా. ౨. ౬౧.

సీ. ... వంత, గాసి వెతారము కాఱియ వెత ... చను వ్యథ ...
ఆం. భా. ౧. ౧౫౦.

3. ఏడుపు.

గీ. వంతఁ బొంగుచుఁ దనదు వృత్తాంతమెల్ల, నెఱుఁగఁ జెప్పెటఁ దును మృపాకృప దలిర్ప, నాసహోదరి నీవు కాంతాలలామ, యేడ్వఁగా నేమిటికి నీకు నివ్విధమున.
హరిశ్చ. ౫. ౧౧౪.

(ఈయర్థ మితరగ్రంథములయందుఁ గానరాదు.) (శ. ర.)

జ: వంతచేయు.

**వంతచేయు.** అ. క్రి. (వంత² + చేయు.) దుఃఖపడు.

చ. ... ఆ తపసి పాల్పడి మిక్కిలి వంతచేయు దో, యని యనిశంబు దద్దయు భయంపడు చున్నది లోకమింతయున్.
కు. సం. ౬. ౮౫౪.

**వంతు.** వి. భాగము.

సీ. పంపుపాల్ వంతు నాభాగంబు విలసిల్లు ...
ఆం. భా. ౨. ౨౬౫.

ఉ. కొంతని కాదు చాలఁ దొడుఁగుల్ మడుఁగుల్ గొడుగుల్ సువర్ణముల్, దొంతిగనుప్పతోఁ గలుగు తొమ్మిదియుం గొని యేఁటికేఁటికే, వంతుగ నాపెచే మనని వారలు లేరు నిజంబుగా ...
ఘటికా. ౧. ౪3.

క. అంత నొకవారమునఁ దన, వంతగుటయు నిశితబుద్ధివహనము ధీర, స్వాంత మొకఘూర్త శశకము, దంతిప్రతిపక్షికడకుఁ జనియించు టకున్.
వేం. పంచ. ౧. 3౪౫.

౨. పోటి, స్పర్ధ.

ఉ. ...పతిఁ గూర్చుదానవా, యంతటి వారలేరని యహంకృతి నెప్పుడు విఱ్ఱ వీఁగుచున్, వంతునవచ్చు సత్య గరువం బిఁకఁ జెల్లదటంచు మానినీ. పారి. ౧. ౮౦.

రగడ. ... వంతేఁటికి గోరంతే మల్లెల, వంతున కానే వంతులఁ జెల్లెల, ...
యయా. ౪. ౨౫.

గీ. మాచిపత్రియుఁ గురువేరు మరువకంబు, దవనమును గగ్గెరయు బిల్వదళము లాది, యైనపూజార్హవస్తువు లపుడు దెచ్చి, వంతు లకుఁ గొండపాడవుగా వైచుట కును.
ఉ. రా. 3. ౨౦౧.

3. సామ్యము.

వ. ... వంతుమీఱు చేమంతుల చెంత నండ గొన్న బొండుమల్లియలం గలసి ...
ఉ. రా. ౬. ౨౪.

ఉ. వింతలె నిన్నువంటియవివేకిను లెందఱు లేరువారినే, వంతుకుఁ దేను నా మనసు వచ్చినజాణ యొకర్తె తారయే, కాంతుని వజ్జమాని వగకాఁడగుచంద్రునిఁ గూడ నేల ... దశా. ౬. ౮3.

౪. వరుస.

గీ. చిగురువిలుకానిజాతర సేయఁబూని, కొలము సాములనందఱుఁ గూడఁబెట్టి, వంతు గలయంగ బువ్వంపుబంతివిందు, పెట్టె గెలమిఁ జకోరపుఁ జేరఁటాంద్రుఁడు.
పారి. ౨. ౪౮.

రగడ. బంతులాడుదము వంతులు గట్టుక, చెంతకు రమ్మా చెలిఁజేపట్టుక.
బిల్హ. ౨. ౨౯.

వంతువోవు = భాగము తెగు.

చ. ఇల నిజసామ్యవర్తులపయిం దమవారిఁ గదల్చు నాత్మహ, స్తలలితధర్మకుంభముల దంభ మణంపఁగ వంతువోక యాన్యులగతి

నీవు నీవనుచు నొంటక గుబ్బలురాయిడిం
పఁగా, జలకముడేల్చిరిద్ద ఱలి జాలకనీలకచా
శిరోమణుల్. రా. వి. ౫. ౫౪.

జ. వంతువడు.

వంతువడు. అ. క్రి. (వంతు + పడు) వంతులు వేసికొను.

గీ. దివిజరాజాదిదిక్పాలదేవతాక, విశిఖముల
నిట్లు దైతేయవిశసనంబు, సలిపి రిష్వాకు
సుకుమారు లలయ కెలమిఁ, గొంతవడి వంతు
వడి మరుత్కోటి వొగడ.

కకు. ౨. ౧౧౫.

వంతెన. వి. ఏఱులోనగు వానికి నీళ్ళుపోవుటకు తూములు విడిచి మీఁద నడచిపోవుట కను వుగాఁ గట్టిన కట్ట. (శ. ర.)

వంద[1] = వందె, వదియ, వదె. వి. ఒక విధ మగు తృణసముదాయము, తృణతతివిశేషము.

సీ. వంద వదియ వదె వందె యంచనఁ దృణతతి
విశేషంబొప్పు ... ఆం. భా. ౨. ౭౭.

వంద[2]. స. నూఱు, శతము. (శ. ర., బ్రౌ., వా.)

వంద. సం. వి. ఆ. స్త్రీ. ౧. యాచకురాలు. ౨. వేఱొక చెట్టుపై మొలచెడుతీఁగ, బదనిక.

వందకము. సం. వి. అ. పుం. చిఱుతేఁకు. ‡. (శ. ర.)

వందకుఁడు. సం. వి. అ. పుం. ౧. స్తోత్ర పాఠకుఁడు, వంది.

వందథుఁడు. సం. వి. అ. పుం. ౧. స్తోత్ర పాఠకుఁడు, వంది, బట్టు. ౨. స్తోత్రపాత్రము, స్తుతింప నర్హుఁడైనవాఁడు. (విల్సన్.)

వందన. సం. వి. ఆ. స్త్రీ. ౧. పూజ. ౨. స్తుతి, స్తోత్రము.



వందనమాల. (విక.) సం. వి. ఆ. స్త్రీ. తోరణము, ఉత్సవములందు గుమ్మముల కడ్డముగాఁ గట్టు తోరణము. (హాలా. ని.)

వందనము. సం. వి. అ. న. ౧. నమస్కారము, పాదములను స్పృశించుచుఁ జేయు నమస్కారము, దండప్రణామము. ౨. గౌరవము. ౩. స్తోత్రము. ౪. ఒక విధమైన చర్మరోగము, గండమాల వ్యాధి.

వందని. సం. వి. ఈ. స్త్రీ. ౧. పూజ. ౨. స్తోత్రము ౩. ప్రార్థన. ౪. సంజీవని, చని పోయినవారిని బ్రతికించెడు నోషధి.

వందనీయ. సం. వి. ఆ. స్త్రీ. గోరోచనము.

వందనీయము. సం. వి. అ. పుం. పచ్చగుంట గలిజేరు. ‡.

వందనీయుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నమస్క రింపఁ దగినవాఁడు.

వందఱ. వి. ఖండను.

(ఇది వ్యాసమున "చిందఱ" శబ్ద పూర్వకము
గానే కన్పడుచున్నది. చూ. చిందఱ
వందఱ.)

జ. వందఱలాడు.

వందఱలాడు. స. క్రి. (వందఱలు + ఆడు) చెల్లాచెదరు కావించు.

(ఇది "వ్రచ్చు" ధాతువుతోఁ గలసియే కాన
వచ్చుచున్నది.)

క. ... రతులఁ గులిశనిశాతనఖా,వలిఁ బక్షిం
ద్రుండు వ్రచ్చి వందఱలాడెన్ ...

భార. ఆది. ౨. ౧౦౦.

సీ. ప్రబలబలాహకప్రకరంబు వ్రచ్చి వందఱ
లాడుఁ బటుమారుతంబు మాడ్కి ...

నృసిం. ౨. ౧౨౮.

సీ. వారలఁ గరచక్రధారల వ్రచ్చి వందఱలాడె
వారి ... వరాహ. ౬. ౧౧౪.

ద్వి. అచ్చుగా నార్చుచు హరుఁ డిభదైత్యు,
వ్రచ్చినగతి వ్రచ్చి వందలలాడు.
బస. పు. ౪. ౯౯. పం.

వందాక = వందాకము. సం. వి. ఆ. స్త్రీ.

వందాకము. సం. వి. అ. పుం. వంద, బదనిక.

వందాకి. సం. వి. ఈ. స్త్రీ. వంద.

వందారము = వందాకము.

వందారు(ఁడు)వు. సం. విశే. ఉ. ౧. స్తోత్రము చేయువాఁడు. ౨. గౌరవపాత్రము.

వి. ఉ. న. స్తోత్రము, పొగడ్త.
పుం. బట్టువాఁడు, స్తోత్రపాఠకుఁడు.

వంది. సం. వి. న్. పుం. ౧. స్తోత్రపాఠకుఁడు, బట్టువాఁడు, (శూద్ర స్త్రీయందు క్షత్రియునకుఁ బుట్టినవాఁడు.)

౨. ఖైదీ, చెఱలో నుంచఁబడినవాఁడు.

వందించు. సం. స. క్రి. ౧. నమస్కరించు.
౨. స్తుతించు.

క. ఇందాఁక వాఁడు బ్రదికిన, సందేహము లేదు దేహచాతుర్య వయస్సౌందర్యంబుల లోకులు, వందింపఁగ నితని యంతవాఁడగుఁ జుమ్మీ. భాగ. ౧౦. ఉ. ౩౩.

వందితుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ౧. నమస్కరింపఁబడినవాఁడు. ౨. స్తుతింపఁబడినవాఁడు.

వందు. అ. క్రి. ౧. సంతాపించు.

క. ... మనమున సహింపనోపక, వనరుచు ధృతరాష్ట్రసుతులు వందిరి తమలోన్ ...
భార. ఆది. ౫. ౨౪౭.

క. ఇదియేమి శోకమున వం, దెదు పుట్టినవారి కెల్లఁ దెరువారయఁగా, నిదియు ...
భార. శాం. ౪. ౭.

చ. దుష్టరాక్షసా, వలియెడ నిర్భయుండు మది వందకు నీ సుతువజ్రవర్మమై, యలవడఁగాచి తెచ్చెద సమగ్రతరంబగుమేలు నిచ్చెదన్. భా. రా. బాల. ౧౭౪.

౨. దుఃఖపడు.

ఉ. చచ్చె ఘటోత్కచుండు మన సైన్యము లెల్లఁ గలంగి నల్గడ, న్విచ్చెటఁ జూచి యేము వగనెక్కున వందెద మిప్పు డెమ్మెయి,న్వచ్చెఁ బ్రమోదము.
భార. ద్రో. ౫. ౨౩౭.

క. అని వందుచు నంగనదెస, వనటకు సామ్రాజ్య వివిధవర్తనమునకున్, దన చిత్తము పొక్కఁగ నమ్మనుజేంద్రుఁడు దాత్తవృత్తి మహి నేలునెడన్.
నిర్వ. ౯. ౯౩.

సీ. కొడుకు సుద్యుమ్నుండు ఘోరాటవులకేఁగ వందుచు మనువు వైవస్వతుండు, దనకు బిడ్డలుగల్గఁ దపమాచరించెను ...
భాగ. ౯. స్క. ౩౩.

చ. ... విరక్తచిత్తుఁడై, యనుదినమున్ ధనంబుఁ గలయ స్వేదచల్లుచు నొయ్య నొయ్య నిర్ధన దశనొంది వందియును దాపమునొందుచుఁ గందికుందుచున్. ద్వా. ౫. ౨౭౭.

౩. వాడు, మ్లానమగు.

చ. దినమునసెల్ల నుష్ణకరదీప్తులు పర్వి రసంబుఁ జీల్పపం, దనసకలౌషధప్రవితతిం దెలి పొందఁగ జేయు నేర్పు గల్గిన తనరశ్మిజాలమున లీలఁ జకోరముల స్మదింపఁజేయు నుదయమై వెలింగె నమృతాంశుఁడు సేనకుఁ దన్పు సేయుచున్. భార. శాం. ౨. ౧౨౬.

సీ. కొంకక క్రొమ్మెఱుంగుంబోడిగావున జాత
నిర్ఘాతజీమూతవేళ, వందక శీతాంశువదన
వున దీర్ఘయామినీఘోరనీహారవేళఁ,
గీ. దపముగావింప వెడలె వత్సరసహస్ర,
ములు ... వరహ. ౬. ౧౬.

౪. వివర్ణమగు, వెలవెలఁబాఱు.

గీ. చిదిమిపైచినసెత్తమ్మిఁ జెనసివాడి, వందినది
నీముఖంబు వివర్ణతారకంబులై యొప్పు
సెడినవి కన్ను లిట్టి, శూన్యభావమే
మెమ్మెయిఁ జూతు మనఘ.
హరి. పూ. ౯. ౧౪౭.

౫. చేచ్చు.

వ. ... కందర్ప దర్పంబున నలంగురి వందుదు
ననిన నవ్వేలంది వెండియు నిట్లనియె.
భార. విరా. ౨. ౬౭.

శ్లో. "యదీయమనవద్యాంగీ, నమామద్యాపి
కాంక్షతే, చేతసాభిప్రపన్నేన, గతోస్మి
యమసాదనమ్."
సం. భార. విరా. ౧౭. ౬.

**వందురు.** అ. క్రి. ౧. దుఃఖపడు.

క. ...శాపభయమునఁ మాద్రికడఁ, వందురి
వారింపఁగ బలిమిం దత్సంభోగసుఖసమీ
హితుఁడయ్యె ... భార. ఆది. ౫. ౧౪౨.

క. కొడుకులదెస నెవ్వగఁజే,డ్పడి వందిరియున్న
యానృపాలుఁ నడుగులం,బడి ...
భార. భీష్మ. ౧. ౪౫.

క. ఎందునుగానక తద్దయు, వందురి యెలుఁ
గెత్తి పిలిచి వనజముఖి నీ వెందున్నదానవే
యీ, చందంబునఁ బిల్వఁ బల్కఁజనదే
నీకుఁ. భోజరా. ౫. ౫౪.

చ. మనమునఁ జింతనొందక యమానముతోఁ
జనుతారనీవు నీ, వనితలు నన్ను వందురుచు
వాలినిఁ గౌఁగిటఁజేర్చి ...
భారా. కిష్కిం. ౨౧౬.

౨. సంతాపించు, పరితపించు.

క. బాలలుఁ దరుణులుఁ బ్రౌఢలుఁ, దూలెడు
వికలాంగకములతో డెందములన్, వాలిన
విరహానలముల,పాలై వందురెద రొక్క
భంగిన యకటా. భార. స్త్రీ. ౨. ౫౧.

ఉ. వారలు శౌరిఁ గానమికి వందురుచున్
దురపిల్లి యక్కటా, శ్రీరమణీమనోహ
రుఁ డశేషజనావనతత్పరుండు మా, కోరిక
నీయఁడయ్యె ... ఘటికా. ౨. ౨౩౯.

౩. క్లేశపడు.

ఉ. తల్లి మొగంబుగాన కటు తండ్రికి దవ్వయి
గంటలోఁ గడుం, దల్లడమంది పుర్వుల
విధంబున వందురుచున్న మమ్ము నుత్ఫుల్ల
దయామతి నిర్గతదుఃఖులఁ జేసితి ...
మార్కం. ౧. ౬౨.

గీ. ... ధరిత్రి, యఱువదేడు లనావృష్టియైన
కతనఁ, దద్ద వందురి కడు నుపద్రవము
నొంద కాశీ. ౫. ౨౬౬.

క. వంగురి వగలన్ [illegible]హము, పొం దెడలఁగఁ
జూచు నన్నుఁ బొడగని దివిఁ దా, నెందుల
కేఁగుచు నొగిఁ,నందన దిగి వచ్చి కరుణ నా
కిట్లనియెన్. మనుచ. ౬. ౫౫.

౪. వ్యధ, నొగులు.

సీ. ... వంత గాసి వెతారము కొరియ వెత,
బారి నెంగులు నొప్పి బాధ నెగులు నొవ్వి
వందురు దురపిల్లు కొందలంబు, సలుపు
నోవి యనంగఁ జను వ్యథ ...
ఆం. భా. ౧. ౧౫౦.

**వందె** = వంద[1]. వి. తృణతతివిశేషము.

సీ. వంద వదియ వదె వందె యంచనఁ దృణతతి
విశేషం బొప్పు ... ఆం. భా. ౨. ౩౩.

**వందొందు.** వి. మత్స్యవిశేషము. (శ. ర.)

**వంద్యా.** సం. వి. ఆ. స్త్రీ. ౧. వంద, బదనిక. ౨. గోరోచనము.

**వంద్యుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. గౌరవింపఁ దగినవాఁడు. ౨. నమస్కరింపఁ దగినవాఁడు. ౩. శ్లాఘ్యుఁడు, కొనియాడఁదగినవాఁడు.

**వంశ్యా.** సం. వి. ఆ. స్త్రీ. గొడ్రాలు.

**వంధ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) నిష్ప్రయోజనము, నిష్ఫలము, వ్యర్థము.

వి. అ. పుం. పండ్లుపండని చెట్టు.

**వంధ్యా(ధ్య)కర్కోటకి.** సం. వి. ఈ. స్త్రీ. గొడ్డుఁదనమును పోఁగొట్టునది, గొడ్డుఁగాఁకర. (రా. ని.)

**వంపు.** స. క్రి.( √ వంచు). వంగునట్లుచేయు, నమ్రముగాఁజేయు, వంచు.

సీ. పరువంపుమంకెన విరివంపునరవంపువాతెఱ చెంద్రంపు వాన గురియు ...

ఆము. ౫. ౬౩.

వి. ౧. వంగుట.

సీ. తలకొన్నధారుణీస్థలి మెడవంపులఁ బడ నుల్కిపడి క్రుంగ్గిపడ నహీంద్రుఁడు ...

కు. సం. ౧౧. ౫౩౩.

౨. వంకర, వక్రత.

వ. ... ధనుర్లతలవంపుదింపులకుఁ దెచ్చు కొమరుగల కనుబొమలును గమలదళవిదళనావహచరిత్రంబులగు నేత్రంబులును ...

చం. రా. ౩. ౯౨.

చ. ... నీరుకోళ్, కొలకొలమంచుఁ గ్రుంకు మెడగుంపులవంపులఁదోఁప ... పురాతన తీర్థకుండముల్.

ఆము. ౧. ౩౧.

౩. పార్శ్వము, ప్రక్క.

ఉ. వాచపులీఁగడంగి నలువంపులఁ దుంపురులీను తేనెఁ జెల్వొచలివాఁక చేవనపుటాకునఁ గాంతులఁ బొల్చి పూఁచి పెల్లేచినగుజ్జుమావిక్రింద నెల్లెడ నీడలు గానవచ్చు రేరాచే మెఱుంగుటాజగితిఁగ్రమ్మిన కమ్మని తమ్మిపొన్నపన్.

రా. వి. ౪. ౩౬.

విణ. వంగినది.

గీ. వంపుగుడిసెల సామగ్రి దంపురోళ్ళు, కురుచరోఁకండ్లు చిన్నదాగిరులు మొదలు,గాఁగలుగు వస్తుజాతంబు గార్దభములు, మోఁచితేవెంట సూకరములు చనంగ.

చెన్న. ౨. ౨౦౪.

**వంపుడు.** విణ. ( √ వంపు). వంగినది.

ఉ. వెచ్చనితీర్థమాడి నులివెచ్చపదార్థము లారగించి బల్లపచ్చడము ల్మసుంగులిడి పైఁ జలిసోఁకని కమ్మటిండ్లలో, ముచ్చముడింగి యింటిపని ముమ్మరమెల్లనుదీర్చి పక్కకున్, వచ్చినప్రోఢయాంద్రకురువంపుడు బల్చనుగొండలూన ఔమ్మిచ్చి కవుంగలించి సుఖయించిరి ప్రౌఢగృహస్థు లయ్యెడన్.

కవిరాజ. ౪. ౭౯.

**వంశకఠినము.** సం. వి. అ. పుం. వెదురుడొంక, వెదురు పొద.

**వంశకఫము.** సం. వి. అ. పుం. గాలిలో నెగిరెడి దొక జాలి దూదిగల గింజ.

**వంశకము.** సం. వి. అ. పుం. ౧. ఒకజాతి చెఱకు. ౨. వెదురుగనుపు. ౩. ఒకజాతి చేఁప. ౪. అగరు.

**వంశకరుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. వంశకర్త, వంశస్థాపకుఁడు. ౨. వంశమును శాశ్వతముగా నిలుచునట్లు చేయువాఁడు.

వి. అ. పుం. ౧. పుత్త్రుఁడు. ౨. పూర్వికుఁడు. ప్రాచీనపురుషుఁడు.

వంశకర్పూరరోచన. సం. వి. ఆ. స్త్రీ. వంశరోచన, వెదురులో నుండెడి కర్పూరమువంటి వస్తువిశేషము, (వెదురు బియ్యము.)

వంశకృత్తు. సం. వి. త్. పుం. వంశకర్త, వంశస్థాపకుఁడు.

వంశక్రమము. సం. వి. అ. పుం. వంశపరంపర, తరతరము.

వంశక్షీరి. సం. వి. ఈ. స్త్రీ. = వంశరోచన.

వంశచింతకుఁడు. సం. వి. అ. పుం. వంశపరంపరను (వంశ వృక్షమును) విమర్శించు పురుషుఁడు.

వంశచ్ఛేత్త. సం. విశ. (ఋ. త్రీ. ఋ.) వంశమునకుతుదివాఁడు.

వంశజ. సం. వి. ఆ. స్త్రీ. = వంశరోచన.

వంశజము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. వెదురునఁ బుట్టినది. ౨. వెదురుతోఁ జేయఁబడినది. ౩. మంచి వంశమునఁ బుట్టినది.
వి. అ. పుం. ౧. సంతతి. ౨. వెదురువిత్తనము. ౩. వెదురుబియ్యము.

వంశతండులము. సం. వి. అ. పుం. వెదురు బియ్యము.

వంశధరుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) ౧. కుటుంబమును స్థిరపఱచువాఁడు. ౨. కుటుంబపోషకుఁడు.

వంశనర్త. సం. వి. న్. పుం. హాస్యగాఁడు, పరిహాసకుఁడు.

వంశనేత్రము. సం. వి. అ. న. చెఱకువేరు.

వంశపత్త్రికము. సం. వి. అ. పుం. ౧. రెల్లు. ౨. తెల్లచెఱకు. ౩. మత్స్యవిశేషము. ౩. ఒక జాతిచేప.
న. తాళకము.

వంశపత్త్రపతితము. సం. వి. అ. పుం. (ఛంద) ఒకానొక వృత్తము.
(దీనికి ప్రతిపాదమందును భ, ర, న, భ, న, లగములతోఁ బదునే డక్షరము లుండును.)

వంశపత్త్రము. సం. వి. అ. న. వెదురాకు.
పుం. రెల్లు.

వంశపరంపర. సం. వి. ఆ. స్త్రీ. వంశక్రమము, వంగడమువరుస.

వంశపూరకము. సం. వి. అ. న. చెఱకువేరు.

వంశభోజ్యము. సం. విశ. (అ. ఆ. అ.) వంశపరంపరగా ననుభవింపవలసినది. తరతరము లనుభవింపఁ దగ్గది.
వి. అ. న. వంశపరంపరగా వచ్చెడి యాస్తి.

వంశము. సం. వి. అ. పుం. ౧. వెదురు. ౨. అన్వయము, వంగడము. ౩. అమ్ము, బాణము. ౪. పిల్లనగ్రోవి. వాద్యభేదము. ౫. సజాతి వస్తు సమూహము.

వంశరో(లో)చన. సం. వి. ఆ. స్త్రీ. వంశకర్పూరరోచన, వెదురుబియ్యము.

వంశవితతి. సం. వి. ఈ. స్త్రీ. ౧. వంశపరంపర. ౨. వెదురుపొద.

వంశవృక్షము. సం. వి. అ. పుం. వంశపరంపర.

వంశశర్కర. సం. వి. ఆ. స్త్రీ. వంశక్షీరి, వెదురుబియ్యము.

వంశశలాక. సం. వి. ఆ. స్త్రీ. ౧. వెదురుచీల; వీణక్రింది తుదను వేయఁబడు చిన్నవెదురుచీల. ౨. అవురుగంటివేరు, ఉశీరము.

**వంశాంకురము.** సం. వి. అ. పుం. వెదురు మొలక, కరీరము.

**వంశానుచరితము.** సం. వి. అ. పుం. ౧. వంశముయొక్క చరిత్రము. ౨. పురాణము లందు వర్ణింపఁబడు ప్రాచీనరాజవంశముల చరిత్రము.

**వంశి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. పిల్లనగ్రోవి. ౨. రక్తనాళము. ౩. వెదురుబియ్యము. ౪. పరిమాణవిశేషము.

(క.) నాలుగుకర్షముల యెత్తు, (చ) నాలుగు స్తోమముల పరిమాణము, ౩౭౪ అంగుళముల పొడవుగల పరిమితి.

**వంశిక.** సం. వి. ఆ. స్త్రీ. పిల్లనగ్రోవి.

**వంశికము.** సం. విశే. (అ. ఆ. అ.) వంశ సంబంధమైనది, వంశపరంపరగా వచ్చునది.

వి. అ. న. అగురుచెక్క.

**వంశీధరుఁడు.** సం. వి. అ. పుం. ౧. కృష్ణుఁడు. ౨. పిల్లనగ్రోవి యూఁదువాఁడు.

**వంశీధారి.** సం. వి. న్. పుం. = వంశీధరుఁడు.

వి. అ. న. అగురుచెక్క.

**వంశ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. వెన్ను బద్దకు సంబంధించినది. ౨. వెన్నెముకతోఁ గలసియున్నది. ౩. సద్వంశమునకుఁ జెందినది. ౪. వంశపరంపరకు సంబంధించినది.

వి. అ. పుం. ౧. వాసము. ౨. చేతియెముక, కాలియెముక. ౩. కనుపాప.

**వంశ్యుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) సద్వంశమునఁ బుట్టినవాఁడు

వి. అ. పుం. ౧. వంశస్థుఁడు. సంతతివాఁడు. ౨. పూర్వుఁడు. ౩. ఏడుతరముల వెనుక వాఁడును, ఏడుతరముల ముందువాఁడును నగుజ్ఞాతి.

**వకవకలు** = పికపికలు, పికాపికలు, వకావకలు.

వి. బ. ౧. చెదరుటలు.

క. ఒకమొగముగాక దివిజులు, తికమక గొని
వైరులెల్ల దీకొని తమ్ముం, బకపక నగ వక
వకలై, లుకలుకఁ బరువెత్తి రోడి లోఁగొను
భీతిన్. భాగ. ౩. ౨౭౫. (శ. ర. పా.)

౨. బ్రద్దలు, ముక్కలు.

ద్వి. ... నోరుశిరము, వకవకలైపోవ వా
పోయి ... ధర్మా. ౧. భా. (శ. ర.)

సీ. కరికాండతుండప్రఘునతాడనంబుల వక
వకలై కృకాటికలు వగుల ...
రంగా. ౩. ౨౧౯.

**వకారుఁడు.** వివ్ణ. గ్ర. (నామైకదేశగ్రహణము.)

ఉ. మిన్నక యిట్లు భర్త తనమీఁద విరాళి వహిం
పకున్న నాకన్నియ చూచి యీముదివ
కారునితోఁ బనియేమి నా కటంచు న్నిర
సించి పంచశరసుందరరూపుల జారవీరు
లన్, గ్రొన్ననవింటివాని మొనకుం గది
యించెద నంచు నెంచుచున్.
హంస. ౩. ౨౦౭.

**వకాలతు.** వి. (హిం. వకాలత్.) న్యాయవాది, వకీలు.

సీ. ... వరుస బత్తీచిత్తవైకల్యుఁడైనను గడు
దీర్ఘనత్తి వకాలతైన ... వేణు. ౪. ౪౬.

**వకావకలు** = పికపికలు, పికాపికలు, వకవకలు.

వి. బ. ౧. బ్రద్దలు.

మ. కకుబంతంబులు మాసె గ్రోసె సకలా
కాశావకాశంబులన్, శకునంబుల్ శకు
నంబులయ్యెఁ గులటాచంద్రాస్య కజ్జంబు
కో, రకమయ్యెన్ రకమయ్యెఁ గైరవము
చక్రశ్రేణి గుండెల్ వకా, వకలయ్యెన్
సెకలయ్యెఁ బాంధజనతాస్వాంతంబులం
తంతకున్. బహు. ౩. ౪౩.

౨. చెదరుటలు.

సీ. ఘణి ఘణిల్లని పాదకటకనిక్వణనముల్
వ్రతులధైర్యము వకావక లొనర్ప ...
ఘటికా. ౨. ౨౧౩.

ఉ. ఆ నలినాక్షి నవ్వుటయు నంతట నా మహి
మంబు తూలెనో, కాని వసుంధరాధిప వకా
వకలై చెడిపోయె బ్రహ్మవిజ్ఞానము వేద
శాస్త్రపఠనప్రతిభావిభవంబు గానవిద్యా
నిపుణత్వముం దపము ధర్మవిధిజ్ఞతయున్
వివేకమున్. వరాహ. ౧. ౯౫.

సీ. క్రొవ్వాఁడికొమ్ములకొనల చిమ్మ నవలా
హకసమూహము వకావకలు గాఁగ ...
అని. ౪. ౪౫.

చ. దురితలతానుసారి భవదుఃఖకదంబము రామ
నామభీకరతరహేతిచేఁ దెగి వకావకలై
చనకుండ నేర్చునే, ... దశ. ౮౧.

జః వకావకలుసేయు.

**వకావకలుసేయు.** స. క్రి. (వకావకలు + చేయు.) బ్రద్దలుసేయు.

సీ. తనశతకోటి పర్వనితాంతమహిమ యంతిక
నగంబుల వకావకలుసేయ ...
వసు. ౬. ౪౫.

**వకాసుకుట్టు.** వి. ఒకవిధమగు కుట్టుపని.

ఉ. పట్టుగుడారముల్ చికిలిబంగరుచ్రాఁతల
చిక్కుబిగవుం, బెట్టెలుఁ బచ్చతాపలక
పీటలు మేలివకాసుకుట్టు మేల్కట్టులుఁ
గ్రొత్తసొత్తపలకల్ తెరలుం బికదారిఁబారు
వాపిల్లలగూండ్లుఁ గ్రొమ్మెఱుఁగు బిందెలుఁ
గొండలు తెచ్చి రయ్యెడన్.
వాల్మీకి. ౩. ౮౪.

**వకీలు.** వి. ౧. న్యాయవాది.

సీ. ... వెంటనే కేలుమొగిడ్చి వకీలు చెప్ప.
వేణు. ౫. ౧౬.

౨. వాదము.

ఉ. ఏలనెజాలి సర్వజగదీశ్వరుఁడైన సురేశ్వ
రుండు నిన్నేలఁదలంచె మేలుగనవే
వినవే యఱచేతి కబ్బులిబ్బెలను బేల
నుంబలె బలేపలుకం దొరకొంటి వైన నీ
కీలునొకిం తెఱుంగుదు వకీలొనరింతు విఁకీలు
వేటుకే. అహ. ౩. ౩౦.

**వకులము.** సం. వి. అ. పుం. పొగడ. ꝉ.

**వకోటము.** సం. వి. అ. పుం. వక్కుకొంగ, బకము. (త్రి. ని.)

**వక్క.** వి. (సం. వల్కమ్) పూగఖండము, పోఁకచెక్క.

ద్వి. వక్కసేయనిలేకివాఁడని నన్ను, లెక్క
సేయక కరాళించెనీరాజు ...
ద్వి. హరిశ్చ. ఉ. ౧౪౪౪. పం.

సీ. సొంపువాసన వక్కలిచ్చి చుట్టిన యాకు
మడుపు లీఁదివిరెడు నడపదాని ...
ఉ. రా. ౪. ౨౨౩.

జః వక్కాకు.

**వక్కణ(ము)** = **వక్కాణము.** వి. (సం. వ్యాఖ్యానమ్. ప్రా. వక్ఖాణమ్.)

౧. వ్యాఖ్యానము, వివరణము.

గీ. మఱియు నొకకొందఱకు సుధామధుర
వాక్య, సమితి భారతరామాయణములు
దెలియ, వరుసవక్కణ మొనరించు వ్యాస

శిష్యు, వాగ్విరాజితు నుగ్రశ్రవసునిఁ
జూచి. రుక్మాం. ౧. ౫౨.

గీ. పంచమపుఁ దంతి బయకాఁడు పట్టిమీట,
గమ్మ్రమనునాదమును గ్రమ్మ్రకరణిఁ గాఁగ,
వెలితిఁ బోనీక రసికులు వినుచు మెచ్చ,
వక్కాణలువెట్టి యేడ్చె నప్పుణంతి యిట్లు.
పార్వ. ౩. ౫౭.

౨. జాబునందు మొదట వ్రాయుపద్ధతి, మత
లబు.

శా. వ్రాయుం గమ్మల వక్కాణల్ వరుసనే పద్దెంబు లౌనట్లు గాఁ, జేయున్ సత్కృప భాంధవాప్తసుజనశ్రేణుల్ ప్రహర్షింపఁగా ... భోజసుతా. ౧. ౪౧.

గీ. తనయులును దాము రావలె ననుచుఁజాలు,
మానుసులు దశరథరాజ మాళిగోడఁ, దెలి
పెడిదియను వక్కాణ గలిగినట్టి, యుత్తరం
బును వినిపింప నుత్సహించి.
దశా. ౭. ౨౨౫.

౩. జాబునందలి వృత్తాంతము.

గీ. ఇపుడు భవదీయనందను నిటకుఁ బంప,
వలయు శీఘ్రమ్ముగ వివాహవైభవంబు,
దనరు ననియున్న వక్కాణ వినిప్రహర్ష,
మలర మంత్రులతోడని ట్లనియె నతఁడు.
ఇందు. ౫. ౧౬.

**వక్కాణించు.** స. క్రి. (√ వక్కాణము)
వచించు, పలుకు.

సీ. మ్రొక్కుగు నీపాదములకు జిహ్వాపీథి
నీనామములు వక్కాణింతు నెపుడు ...
పాండు. ౪. ౯౨.

(శ. ర. పా. "వక్కాణింతు" ముద్రి. పా.)

**వక్కరము.** విణ. (సం. వక్రమ్) వంకరైనది.

వి. వంకర. (శ. ర.)

జః వక్కరాలు, వక్కరించు.

**వక్కరాలు.** వి. (వక్కరము + ఆలు) కుటిల
బుద్ధిగలది, వంకరబుద్ధిగలయాఁడుది.

చ. ... ఆ, పెనుపరివక్కరాలు మొఱ పెట్టుచు
నీడిగిలంగ నందలం, బునవడిఁ గట్టు
వైచుకొని పొండని చెప్ప సుదేవుఁ
డంతటన్. జై. భా. ౨. ౧౧౧.

క. అని యచ్చటి పైకావలి, వెనురక్కసి
వక్కరాంద్రఁ బిలిచి తినుం డీ,వ్వనిత నిఁక
రెండు నెలలగు, దనుకంజూచి యనిచెప్పి
దైత్యుఁడు పోయెన్. రామా. ౬. ౧౭౧.

**వక్కరించు = వక్కళించు.** (√ వక్కరము)

అ. క్రి. ప్రతిఘటించు, మాఱుమలయు.

సీ. కరికుంభముల మీఁదఁ గాలు ద్రవ్వటగాక
జక్కవకవతోడ వక్కరించు ...
విక్ర. ౮. ౪౪.

గీ. మృదులగోధూమసరులతో మేళవించి, వన్నె
కుచ్చుల పేరుతో వక్కరించి, పుష్పడుండు
భకంబులోఁ బొత్తువచ్చు, పడఁతి పాలిండ్ల
పైనొప్పు పసిఁడిపేరు. శివరా. ౨. ౬౧.

ద్వి. వలదన్న మానవు వక్కరించెదవు ...
పండితా. పురా. ౧౧౬. పా.

స. క్రి. విడుచు.

గీ. ఆత్మవంశపరంపరాయాతమైన, వైదికా
చారమార్గంబు వక్కరించి, యారజము
రాచటికమును నలవరించి, నగరికీగుఁలఁ
జరియించుఁ బ్రాగడసుతుఁడు.
శివరా. ౨. ౯౦.

**వక్కళము.** వి. ప్రతిఘటించుట, మాఱుమల
యుట.

వ. ... వక్కళంబు గానీక ...
ఉ. హరి. ౩. ౬౪.

జః వక్కళించు.

**వక్కళించే** = వక్కరించే. అ. క్రి. (√ వక్క
శము). ప్రతిఘటించు, మాఱుమలయు.

సీ. చాలనిగ్గులుగుల్కు పాలతెక్కల కుచ్చు
వామకర్ణంబుతో వక్కళింప ...
క్రీడా. ౧. ౨౨౩.

సీ. కరులతొండములసంగిడి నిక్కి తాలాంకు
వలుదనాఁగటితోడ వక్కళింప ...
ఉ. హరి. ౬. ౬౦.

**వక్కాకు.** వి. వక్క + ఆకు. తాంబూలము.

క. వక్కాకిడి సద్భక్తని, మ్రొక్కి కనుంగీటి
శకునములు చూడు వరుం, డెక్కార్యం
బున కేఁగెనొ, యక్కార్యము లెస్సఁగ
సఫలమౌనో కావో. హంస. ౪. ౫౩.

క. నీ కీవఱకెన్నఁడు వక్కాకున కీలేగు నిద్ద
యామతినేలా,కోకోమ్మాయని పిడికెఁడు,
రాక లాడిం జల్లియాతురుండై మతిఁగూర్పన్.
శుక. ౨. ౨౫.

సీ. వేల్మివేల్చినచేత వెసనీకు వక్కాకు
లిచ్చినఁ గాదనే లొందుపడక.
శుక. ౨. ౪౭౬.

**వక్కాణ.** వి. = వక్కాణము. (శే. ప.)

జః వక్కాణించు.

**వక్కాణము** = వక్కణము, వక్కాణ.

వి. ౧. పొత్తమునందు వ్రాయఁబడు వృత్తాంతము.

క. పరయానతిఁ దప్పిన, యావివరం బేది
యని స్వహస్తలిఖితనే, భావాచికంబుఁ
జూపిన, నావక్కాణంబుఁ జూచి యద్భుత
పడఁగన్. శై. భా. ౬. ౮౯.

౨. వైఖరి, రీతి.

క. చూపులవక్కాణంబున, నాపుష్పకరండ
కాఖ్యుఁ డదరుదెంచిన మా,యోపాయపుఁ



గార్యస్థితి, దీపించినఁ బరిణమించి తిలకించి
మదిన్. వి క్ర. ౬. ౨౬.

**వక్కాణించే.** స. క్రి. (√ వక్కాణ). ౧.
వ్యాఖ్యానముచేయు, వివరించి చెప్పు.

గీ. పట్టియేదర్శనంబైనఁ బ్రతిభకలిమి, వలసి
నట్లు వక్కాణింప వచ్చియుండు.
నైష. ౭. ౭౩.

శా. గంధర్వోపనిషద్రహస్యములు వక్కాణింతు
రాలాప సంబంధ ప్రస్ఫుటఝుంటఝుంట
పదగుంభస్థాపవర్గావళీ, సంధానక్రమదివ్య
మంత్రకములన్ సాయాహ్నకాలంబులన్,
గంధర్వాప్సరసల్ పురోపవనికాకల్ప
ద్రుమచ్ఛాయలన్. భీమ. ౧. ౯౦.

౨. వచించు, చెప్పు.

మ. బలువిూసల్ వడిఁగొల్పుచున్ బిగువుతోఁ
బౌలస్త్యుఁడే మంటివా, వలసల్ దీసెనె
యూర్ధ్వలోకములు దేవర్షీంద్ర యత్నైన
సంగరకేళిం బనియేమి శౌర్యమున
నన్నుం గూఁకి పోరాఁడఁగాఁ, గలవాఁ
డెక్కడ నుండు నిక్కముగ వక్కా
ణింపవే నావుడున్. ఉ. రా. ౫. ౨౦౦.

౩. ప్రకటించు.

వ. ... దాని యిహలోకంబునందు వక్కాణింప
నాగముం బనిచె ...
భార. ఆది. ౧. ౬౬.

సీ. పరమార్థతత్వానుభవము వక్కాణించు
సమధికబ్రహ్మవర్చసము వాని ...
కృ. శకుం. ౩. ౭౩.

౪. స్తుతించు, వర్ణించు.

మ. కవులం బంకజగర్భసన్నిభుల వక్కా
ణింతు వల్మీకసంభవునిన్ వ్యాసునిఁ
గాళిదాసు బిల్హణున్ బాణున్ మయూ
రున్ శుకున్. ... భా. [illegible]

సీ. శాకపాకంబులచేవులు వక్కాణించుగతిఁ గంకణంబులు గల్లుమనఁగ ...
పారి. ౨. ౧౯.

**వక్కి.** విశే. బక్కి, కృశము. (శ. ర.)

జః వక్కికట్టె.

**వక్కికట్టె (ట్టియు).** విశే. (వక్కి + కట్టె) బక్కటిల్లినవాఁడు, కృశుఁడు. (శ. ర.)

**వక్కు**[1] = **వగ్గు**[1]. అ. క్రి. ౧. లోఁబడు, అధీనుఁడగు.

క. ... నీ, దిక్కటేఁగిన దృఢభక్తుఁడు, వక్కం డెవ్వరికిఁ గార్యభారమున శివా.
శివ. సా. ౧౬౩.

౨. బక్కటిల్లు, కృశించు.

ఆ. మునిఁగి మునిఁగి మునిఁగి ముద్దయై ముద్దయై వనరి వనరి వనరి వక్కివక్కి, తిరిగి తిరిగి తిరిగి దిమ్మరై యుండును. వేమ. ౨. ౪౧౩.

**వక్కు**[2] = **వగ్గు**[2]. వి. (సం. బక) ఒకజాతి కొంగ.

గీ. బకము విలసిల్లువారణపక్కివక్కు, వగ్గటంచన ... ఆం. భా. ౨. ౯౩.

**వక్కుపులుఁగు.** వి. వక్కుకొంగ, బకము. (శ. ర.)

**వక్త.** సం. విశే. (ఋ. స్త్రీ. ఋ.) ౧. మాటలాడెడివాఁడు; చక్కఁగా మాట్లాడువాఁడు. ౨. వాగ్ధాటిగలవాఁడు. ౩. బోధించువాఁడు, బోధకుఁడు.

**వక్తవ్యత.** సం. వి. స్త్రీ. ఆ. నింద, అపవాదము. నిందింపఁ దగియుండుట.

**వక్తవ్యత్వము.** సం. వి. అ. న. = వక్తవ్యత.

**వక్తవ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. చెప్పఁదగినది, పలుకఁదగినది; ప్రకటింపఁదగినది. ౨. నింద్యమైనది, నిందింపఁదగినది. ౩. నీచమైనది, కుత్సితము. ౪. ఉత్తరవాది, పూచీపడినది. ౫. దుష్టము, చెడ్డది.

వి. అ. న. ౧. పలుకుట, పలుకు, మాట. ౨. శాసనము, రాజాజ్ఞ. ౩. నింద, దూఱు.

**వక్త్రఖురము.** సం. వి. అ. పుం. దంతము. పల్లు.

**వక్త్రజము.** సం. వి. అ. పుం. నోటంబుట్టినది. పల్లు, దంతము.

**వక్త్రజుఁడు.** సం. వి. అ. పుం. బ్రహ్మముఖమునఁ బుట్టినవాఁడు. బ్రాహ్మణుఁడు.

**వక్త్రతుండుఁడు.** సం. వి. అ. పుం. గణపతి, విఘ్నేశ్వరుఁడు.

**వక్త్రదలము.** సం. వి. అ. న. అంగుడు.

**వక్త్రభేది.** సం. విశే. (న్. నీ. న్.) ౧. తీవ్రమైనది. కారముగలది. ౨. చేఁదైనది.

వి. న్. పుం. చేఁదు, తిక్తరసము.

**వక్త్రము.** సం. వి. అ. న. ౧. నోరు. ౨. ముఖము. మోము. ౩. పంది మొదలగువానిముట్టె. ౪. పిట్టముక్కు. ౫. ప్రారంభము. మొదలు. ౬. అమ్ము మొన. ౭. నీరుపోవుగొట్టము. ౮. ఒకవిధమైనవస్త్రము. ౯. అనుష్టుప్పుతో సమానమైనయొకఛందస్సు, ఛందోభేదము. ౧౦. (గణిత) శ్రేఢులలో మొదటిది. (చూ. శ్రేఢి.)

**వక్త్రరంధ్రము.** సం. వి. అ. న. ముఖద్వారము.

**వక్త్రవాసము.** సం. వి. అ. పుం. ౧. నారంగము. నారింజ. ౨. ముఖమువాసన.

**వక్త్రశోధనము.** సం. వి. అ. న. ౧. నోరుశుద్ధపఱుచుట. ౨. తాంబూలాదికము. ౩. నిమ్మకాయ; దబ్బకాయ.

**వక్త్రశోధి.** సం. వి. న్. న. ౧. తాంబూలము మొదలగునవి. ౨. దబ్బకాయ; నిమ్మకాయ. పుం. దబ్బచెట్టు; నిమ్మచెట్టు.

**వక్త్రాసవము.** సం. వి. అ. పుం. అధరరసము. (త్రి. ని.)

**వక్రకంటకము.** సం. వి. అ. పుం. ౧. ఖదిర వృక్షము. చండ్రచెట్టు. ౨. రేగుచెట్టు, బదరీ వృక్షము. (రా. ని.)

**వక్రఖడ్గము.** సం. వి. అ. పుం. మిక్కిలి వెనుకకు వంగిన మొనగల పట్టాకత్తి. వంపుకత్తి.

**వక్రగతి.** సం. విణ. ఇ. ౧. వంకరగాఁబోవునది. వంకరయైన గమనముగలది. ౨. మోసముచేయునది.

వి. ఇ. స్త్రీ. వంకరనడక, చుట్టునడక.

**వక్రగ్రీవము.** సం. వి. అ. పుం. వంకరమెడ గలది - ఉష్ట్రము. ఒంటె. (త్రి. ని.)

**వక్రచంచువు.** సం. వి. ఉ. పుం. వంకర ముక్కుగలది - శుకము, చిలుక.

**వక్రత.** సం. వి. ఆ. స్త్రీ. ౧. వంకర. ౨. అంగారకాదిగ్రహములవక్రగతి, వెనుకకు నడచుట. ౩. తప్పిపోవుట. ౪. వంకరబుద్ధి, కుటిల స్వభావము.

**వక్రతుండము.** సం. వి. అ. పుం. శుకము, చిలుక.

**వక్రతుండుఁడు.** సం. వి. అ. పుం. విఘ్నేశుఁడు, గణపతి.

**వక్రత్వము.** సం. వి. అ. న. = వక్రత.

**వక్రదంష్ట్రము.** సం. వి. అ. పుం. వరాహము' అడవిపంది.

**వక్రదృష్టి.** సం. విణ. ఇ. ౧. మెల్లకన్ను గలవాఁడు, వంకరచూపు గలవాఁడు. ౨. చెడుదృష్టి గలవాఁడు. ౩. సహనము లేనివాఁడు, చూపోపనివాఁడు.

వి. ఇ. స్త్రీ. మెల్లచూపు, వంకరచూపు.

**వక్రనాసికము.** సం. వి. అ. పుం. గుడ్లగూబ, ఉలూకము.

**వక్రపుచ్ఛ(చ్ఛిక)ము.** సం. వి. అ. పుం. కుక్క. (త్రి. ని.)

**వక్రపుష్పము.** సం. వి. అ. పుం. పలాశము, మోదుగుచెట్టు.

**వక్రమము.** సం. వి. అ. పుం. అవక్రమము. క్రిందికి దిగుట.

**వక్రము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. వంకరయైనది. ౨. చుట్టుతిరిగినది. ౩. చుట్టుకొన్నది. ౪. మర్యాదలేనిది, అనార్జవము. ౫. క్రూరము.

వి. అ. పుం. ౧. అంగారకగ్రహము. ౨. శనిగ్రహము.

న. ౧. ఏటివంపు. ౨. గ్రహములవక్రగమనము.

**వక్రయము = అవక్రయము.** ౧. వెల. ౨. అద్దె. ౩. అద్దెకిచ్చుట. ౪. రాజున కిచ్చుపన్ను. ౫. కూలి; జీతము.

**వక్రవక్త్రము.** సం. వి. అ. పుం. అడవిపంది. వరాహము.

**వక్రాంగము.** సం. వి. అ. న. వంకరదేహము. వంకరయవయవము.

పుం. ౧. బాతు. ౨. రాజహంస. రాయంచ. ౩. సర్పము.

విణ. (అ. ఆ. ఈ. అ.) వంకర యవయవములు గలది.

**వక్రాంగి.** సం. వి. ఈ. స్త్రీ. కటుకరోహిణి. (శ. ర.)

**వక్రి.** సం. విణ. (న్. ణీ. న్.) ౧. వంకరయైనది. వంపుగలది.

౨. వెనుకకు నడచునది. (కుజాదిగ్రహము.)

వి. (న్.) పుం. జైనుడు.

విణ. (ఇ.) ౧. సందిగ్ధముగా మాటలాడువాడు. ౨. అసత్యము చెప్పువాడు.

**వక్రించు.** సం. అ. క్రి. ౧. వెనుకకు నడచు, మఱలు.

ద్వి. వక్రించెc గుళికసంభవ రాహు విపుదు ...
ద్వి. హరిశ్చ. ఉ. ౧౭౯. పం.

ఆ. నెఱయ గురుడు రోహిణీమధ్యమున నుండి, వక్రయుక్తుడైన వాన లేదు, వాయుతార లందు వక్రించి నిలిచిన, వారిమయముచేయు వసుధయెల్ల. సస్యానందము. ౪. ౧౬. పా.

౨. ప్రతిఘటించు, మార్కొను.

మ. ధరణీమండలి నెందునుం దొడరి దోర్దర్పోద్ధతిం గ్రాలు భూవరులం బల్వుర నుక్కడంచితిc గడున్ వశ్యాత్ములై వారు నాకరిగా నాత్మధనావళుల్ వరుసc బ్రత్యర్పంబు నర్పింతు రెవ్వరు నస్మత్ప్రటువిక్రమ స్ఫురణకున్ వక్రింప రెక్కాలమున్.
హరి. ఉ. ౬. ౧౯.

**వక్రితము.** సం. విణ. (అ. ఆ. అ.) వంకరగాc జేయcబడినది, వంపcబడినది.

**వక్రిమ(ము).** సం. వి. న్. పుం. ౧. వంకర, వంపు. ౨. రెండర్థములగునట్లు చెప్పుట, సందిగ్ధముగాc జెప్పుట. ౩. కాపట్యము, వంచన. ౪. డొంకతిరుగుడు.

**వక్రుడు.** సం. వి. అ. పుం. ౧. అంగారకుడు. ౨. శనైశ్చరుడు. (శ. ర.)

విణ. ౧. వంకరయినవాడు. ౨. క్రూరమైనవాడు.

**వక్రోక్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. ఒకానొక అర్థాలంకారము.

శ్లో. వక్రోక్తిః శ్లేషకాకుభ్యామపరార్థప్రకల్పనమ్. చంద్రాలోకము.

౨. సందిగ్ధముగాc జెప్పుట, సూచన. ౩. అపహాస్యము. వేళాకోళము.

**వక్రోష్ఠి.** సం. వి. ఇ. స్త్రీ. చిఱునవ్వు.

**వక్రోష్ఠిక.** సం. వి. ఆ. స్త్రీ. = వక్రోష్ఠి.

**వక్షణ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. కుక్షి, కడుపు, జీర్ణకోశము, ౨. పార్శ్వము, ప్రక్క. ౩. నదీగర్భము. ౪. నది, ఏఱు.

**వక్షణము.** సం. వి. అ. న. ౧. వక్షస్సు, ఱొమ్ము. ౨. విశ్రాంతి, అలసట తీర్చుకొనుట. ౩. అగ్ని.

**వక్షము(సు.)** సం. వి. స్. న. ఱొమ్ము, హృదయము.

పుం. వృషభము, ఎద్దు. (విల్యమ్సు.)

**వక్షోజము.** సం. వి. అ. పుం. కుచము, చన్ను.

**వక్షోరుహము.** సం. వి. అ. పుం. = వక్షోజము.

**వగ.** వి. (√ వగచు.) ౧. దుఃఖము.

సీ. కుందంగ నడలుట మందబుద్ధిత్వంబు వగc గీడు మానునే వలవదడల ...
భార. శాం. ౧. ౧౧౭.

ఆ. కాలకల్పుఁడైన కాశికుఁ డేతెంచి, శిశిర
వారి వారి నేదఁగొల్చి, యేల నేలఁ బడఁగ లే
లెమ్ము నృపయాగ, రాని యప్పు వగల
నీనకున్నె. మార్కం. ౧. ౨౦౪.

గీ. పెక్కువగ లందెద వేమి బిసరుహాస్త్ర,
చిన్నపోయెద వదియేమి శీతకిరణ ...
దశా. ౨. ౭౫.

ఉ. రోదన మాచరించు వగఁ గ్రోధమనోభవ
కామలోభమో, హోదులఁగూడి తీరముల
యందఘముల్ ... కాశీ. ౫. ౪౩.

౨. సంతాపము.

సీ. ... నారదుఁగని భక్తితోడ, మ్రొక్కిన
మమ్ము నమ్ముని నూచి యిట్లేల వగఁబొంది
కందిన వార లనియు, నడిఁగి ...
భార. ఆది. ౮. ౧౬౧.

౩. వలవంత.

క. ఆ తనువుల వేరుగదా, నాతులు మతికాక
కలిగినన్ వగ తిర్యగ్జాతికి నీజాతికిఁగల,
యీ తీవ్రతగలదె ... ఆము. ౫. ౪౨.

౪. శోకము.

ఆ. వలస బెదర నృపతి కలఁగక ప్రజవగ,
లార్పఁబనిచి ... ఆము. ౩. ౨౭.

క. ఇది నా కర్యం గాఁగల, యదిషైయె యను
గాఢనిశ్చయం బెవ్వనికెమ్మదిఁ గలుగు
నుబ్బు వగ సం, పద యాపద గలుగ వట్టి
భవ్యున కింద్రా. భార. శాం. ౪. ౪౧౪.

౫. ఆలోచన, తలఁపు.

క. వరపుత్త్రిఁ గలసి తనయులు, పరువడిఁ దుడు
వంగఁ గృష్ణఁ బనుచువగన్ భ్రాతృసురరాజ్య
దర్పమొప్ప వ్రిగురుఁ జెచ్చెరఁ బంచె దానిఁ
దోడ్కొని తేరన్. భార. సభా. ౨. ౨౦౦.

౬. అభిలాష.

ఉ. వారలఁజూచి కేశవుఁడు వచ్చినకార్యము
సెప్పఁ డన్న నృక్కౌరవనాథుఁ డిట్లనియెఁ
గయ్యము సేయువగన్ సహాయముం,
గోరి భవత్సకాశమునకుం జనుదెంచితి ...
భార. ఉద్యో. ౧. ౬౯.

౭. విలాసము.

చ. గగనముదాఁకి చిత్రగతకాననసంహతిఁ
బొల్చుహర్మ్యముల్, నగములు సావి
యూఁగినమనంబులఁ స్వర్ణసరోవరంబు
లన్, వగ జలకేళి సల్పనని వచ్చి యొకింగి
వియచ్చరాంగనల్, మగుడుట చూచి నవ్వ
దురు మాడువులం దురమించుదంపతుల్.
కు. సం. ౭. ౯౪౮.

౮. ఉపాయము.

క. ఏవంక మనము సీతాదేవిని వెదకఁదగు
నెవ్విధిన్ ఖలుని దశగ్రీవు వధింపుద మీ
వగ, యేవగ మాన్చెదవు తెలుపు మిపు డిన
తనయా. రామా. ౫. ౨౮౬.

౯. విధానము.

సీ. మునుధాత కల్పాంతమున నిద్రదెలిసి లోక
వినిర్మితికి వగ గానలేక, సంక్షుబ్ధుఁడైన
రజస్త మోగుణము లుద్రేకంబుఁజూపె ...
వరాహ. ౭. ౩౬.

౧౦. గతి, దిక్కు.

క. వెలయాలివలపు కడుకో, వెలకున్ వగలేక
వాఁడు వెసఁ జీకటులన్, గలవారియిండ్లఁ
జెలులకుఁ, గలవారపుసొమ్ము వెరఁజి
దైకొనఁ జొచ్చెన్. శేష. ౪. (శ. ర.)

౧౧. విధము.

క. అవ్వల నొకనికి మీఁదుఁగ, జవ్వన మిటు
గట్టియున్న జలజేక్షణతో, నెవ్వగఁ బలు
కులు పలికిన, నెవ్వగయే కాని చేరనేరవు
కోర్కుల్. కువల. ౩. ౩౯.

క. తోఁచినవగ రచియించెదఁ, దోఁచనిచోఁ
జెలువగట్టు దొరతోడై వ్యాయాఁచక నె

యానతియ్యఁగఁ, దోఁచ దసాధ్యంబు కవన
ధోరణిపట్లన్. ప్రబంధ. ౨. ౨౫.

౧౨. రకము.

ఉ. మైనపుటంటుపల్వగల మచ్చులచాలఁగ
గల్లు కట్టెలున్. శుక ౧. ౪౨౧.

౧౩. రసము, రుచి.

తే. ఉప్పునైనట్టి చక్కరలప్పలీడె, చేఁగగ
గల యమృతంపుఁజెలమ యొసయో, పుల్ల
నుండెడు తేనెకరుళ్ళు సరియో, వనిత కడుఁ
దియ్యనానీగువాతెఱకును.

సారంగ. ౨. ౨౦౯.

౧౪. వర్ణము, గుంపు.

వ. ... ఒకక్కరగ ఘంటాకర్ణమహోదరు
లును ... కాశీ. ౬. ౩౫.

౧౫. ఒద్దు, దగ్గఱ.

ఉ. ... ఈ, ముద్దియ నాదకోడలిట గుండట
నావగి నెమ్మి నుండనీ. హర. ౧. ౯.

౧౬. యోగ్యత.

ద్వి. వగదప్పి మృతిఁబొందు వారికి రాజ, మొగి
సముద్రము చూడ మొకాలిబంటి ...

ద్వి. శ. సా. ౧. ౮౫౭. శం.

౧౭. శక్తి, సామర్థ్యము.

సీ. పంచెమొగ్గినఁగూడఁ బగిలిగెల్చు కటారి
యిది దీనివగి నిశ్చయింపఁగలిగె ...

కువల. ౨. ౪౫.

విశే. విలక్షణము, ఒకవిధమైనది.

క. ... పురిన్, దగఁ గోటకొనలఁ గట్టిన,
వగ జిగిముత్తెముల చందువాచందమునన్.

అని. ౧. ౫౭.

**వగకత్తె.** విశే. (వగ + కత్తె) విలాసిని. (శ. ర.)

**వగకాఁడు.** విశే. (వగ + కాఁడు). ౧. విలాస
వంతుఁడు.

ఉ. ... తారయే, కాంతుని పజ్జమాని వగకాఁ
డగుచంద్రుని దక్కనేల ...

దశా. ౭. ౮౩.

క. ఎన్నడోకద వగకాని కింపుమెఱయఁ,
గంతుకేళిని వింతలు గానుపించి, హవుసు
చెల్లింతు ... అహల్యా. ౩. ౫౨.

చ. ... చూచుచున్, గదియఁగఁ గొంకు వీథి
వగకాఁ డెవఁడైన మెలంగనేనియున్ ...

ఉ. హరిశ్చ. ౪. ౧౭.

౨. వల్లభుఁడు.

ఆ. ఇరులగొంగ తమ్మివిరిబోఁడి వగకాఁడు,
ప్రొద్దు తూర్పుకలను బొడమె నపుడు

నీలా. ౩. ౪౫.

**వగచు.** అ. క్రి. ౧. దుఃఖించు.

సీ. శుభలక్షణాంగి యీ సుందరి సైరంధ్రియగు
టెట్లొకోయని వగచువారు ...

భార. విరా. ౨. ౧౪౬.

గీ. చెన్ను దఱిగిన సొగసుతో విన్ననైన, మోవ
యానఁ గనుంగొని తెగచి వగచి ...

యయా. ౩. ౮౩.

౨. ఏడ్చు, విలపించు.

ఆ. ఎఱిఁగి నాకుఁ జెప్ప మిదియేమి యెవ్వరి,
వలన నింత యయ్యె వగవనేల

భార. ఆది. ౬. ౨౪౩.

గీ. ఇంక నెవ్వరి వేఁడుదు నేది దిక్కు, హాశిథీ
యెంతచేసితి వనుచు వగచి ...

దశా. ౨. ౪౮.

క. కీనాశునిసమ్ముఖమునఁ దా నూనిన ప్రతినఁ
దలఁచి దశరథనూనుం, డాననము వంచి
ధైర్యవిహీనుండై దీనవృత్తి నిట్లనివగచెన్.

ఉ. రా. ౮. ౨౧౩.

౩. పశ్చాత్తాపపడు.

తరలము. వగవనేటికి నింకనైనను వారలం బిలిపించి యీ, జగతి నెప్పటియట్ల యేలుచు ... భార. సభా. ౨. ౩౧౪.

క. మదిమఱపునఁ జాపము తన, కోదవుట యును బిదప వగచి యొకసగమును నే, నిది సేయ నింక ననియెడు, మదిపెఱసగమునుగ నరుఁడు మలపు నఘంబున్.

భార. అర. ౫. ౪౧.

చ. వగవకు మీయఘంబు చన వాసవ వైష్ణవ యాగ మంచితం, బుగ నొనరింపు ...

ఉ. రా. ౫. ౩౪.

౪. సంశయించు, సందేహపడు.

చ. వగవక మాకు నేవురకు వారిజలోచనఁ గృష్ణ నీఁదగున్ ... భార. ఆది. ౭. ౨౫౦.

స. క్రి. ౧. భావించు.

క. ... నీ, వారకములుగాఁగ మున్ను వగ వుము బుద్ధిన్ ... భార. ఆది. ౩. ౧౫౨.

గీ. అప్పు డాజంత పలుకు వాక్యంబులెల్ల, మనములోపల నిక్కంబు లనుచు వగచి

విప్ర. ౩. ౮.

౨. తలఁచు, తలపెట్టు.

క. తనవగచిన కార్యము దొర, కొనుటకు ధృత రాష్ట్రిపుత్రకుఁడు పొంగి ...

భార. ఆది. ౬. ౧౩౭.

౩. ఆలోచించు.

సీ. ... అసుర, గీ. పలను సూడ కొండు వగ వక యెప్పటి, యట్ల కుడుచుచున్న నలిగి బకుఁడు భార. ఆది. ౬. ౨౯౨.

చ. వగవఁగ నద్రిరాజు హిమవంతుఁడు తండ్రి ... కు. సం. ౭. ౮౫౨.

క. తగువరునిఁ బిలిచి కన్యకఁ, దగినయలంకార మిచ్చి ధారాపూర్వం, బుగఁ బెండ్లిసేయు టయి నిది, వగపఁగ బ్రాహ్మంబనెడి వివా హంబ య్యెన్. విజ్ఞా. ఆచా. ౯౫.

౪. విమర్శించు, విచారించు, పరిశీలించు.

క. అగు దేశకాలబలయుత, ముగఁ జేసిన పోర నర్థములు పెంఱుసులై, తెగఁబాఱి తమ్ము నెదిరిని, వగవక తొడరుటలఁ గీడు వర్తిల్లుఁ దుద్దిన్. భార. విరా. ౪. ౨౦౮.

క. తగు నిది తగ దని యెదలో, వగవక సాధు లకుఁ బేదవారల కెగ్గుల్ ...

భార. ఆది. ౧. ౮౫.

జ: పగ, పగకత్తె, వగకాఁడు, వగడెంచు, వగడెగు, వగపించు, వగపు, వగలాఁడి, వగలాఁడు.

**వగడెంచే.** స. క్రి. (√ వగడెగు.) పరిష్కరించు, నిర్ణయించు.

చ. పరుఁడిపుడే పఘూటిఁ జెఱపట్టిన వాని వధించి సాధ్వి యీ, తరుణి యటంచుఁ జేకొ నుట ధర్మవుగా వగడెంచె రాఘవేశ్వ రుఁడు ...

ఉ. రా. ౬. ౨౧౧. (శ. ర. పా.)

క. అనిరట్టు సేయ నచ్చుటి, జనములు సామ్మి యకునికి చన దని వగడెంచిన దానిఁ దోడు కొనిపో, యె నతం డింటికిని రొక్కమిచ్చెద ననుచున్. శుక. ౩. ౪౧.

**వగడెగు.** అ. క్రి. (వగ + తెగు) పరిష్కృతమగు, నిర్ణీతమగు. (శ. ర., బ్రౌ.)

**వగపించే.** స. క్రి. (√ వగచే.) ౧. ఏడిపించు, విలపింపఁజేయు.

వ. ... వనాంతసఖులగు కిన్నరరాజకన్యల వగ పించుచు ... హర. ౪. ౨౬.

౨. దుఃఖింపఁజేయు.

గీ. వృద్ధవేశ్యల వగపించు రుద్ధతప్ర, వర్తులగు ధూర్తవిటులు దుర్వారనటులు.

వైజ. ౩. ౭౨.

**వగపు.** వి. (√ వగచే.) ౧. దుఃఖము, పగ.

క. వగ పుణ్యగతికి మూలమె, వగ పెల్లవిధముల నుడుగవలయు నరేంద్రా.

భార. స్త్రీ. ౧. ౨౦.

ఉ. ... దైవమె యిట్లు చేసినన్, విన్నఁదనంబుఁ జెందఁ దగునే వగపేటికిఁ బావురుండవే, యన్నఁ గలంకదేఱె నతఁ డర్కకులేశ్వర వారిమాటలన్. ఉ. రా. ౨. ౨౦౭.

౨. శోకము.

క. జననీజనకులును సుహృజ్జనులును దెగునప్పుడు గావఁజనమి తెలియుదే, ధనములు వారలకంటెనె, ననుకేశ్వర వగపు వాని మఁగిడించునొకో. భార. శాం. ౩. ౨౯.

౩. కీడు.

ఉ. ఈకరుణాకటాక్షు మొకయించుక నాపయి నిల్చియున్నచో, నేకడ మేలుగాక వగపేటికిఁ గల్గెడు దానవేంద్ర ...

దశా. ౨. ౧౨౮.

౪. విధము.

క. ... ఊడిగంపుచేడియలు బలువగపులఁ దన్నారడింపుచు మరందంబు లానుమిళింద బృందంబుల యందంబున విరిపడుపునం బోఅలుపెన్నెరులు సందెల్గం బట్టి ...

నృ. వి. ౨. ౭౪.

**వగరము = వగరు.** వి. (వగర్చు) వగరుపు, శ్వాసరోగము.

చ. పలుకనిమోముఁ దొట్రుపడుపాదములున్ వగరంపుటూర్పులన్, వలపలనైన దంతములు వంగినమేను వణంకు మస్తమున్, నిలుపఁగరాని యుక్కిసయు నెమ్మొయి నెక్కొను దప్పి పెంపుఁ జే, వెలుఁగునఁ జూచు చూపుఁగల వృద్ధమహీసురుఁ డమ్మహీశ్వరున్. విక్ర. ౨. ౧౫౫.

**వగరించే.** అ. క్రి. (√ వగరు.) వగర్చు, నిట్టూర్చు.

సీ. వేఁటకుక్కలుడస్సి వివృతాస్యముల నిల్చి వగరించుచున్నవి దగలుదొట్టి ...

పి. శకుం. ౧. ౧౨౩.

**వగరు = వగరము.** వి. శ్వాసరోగము, ఉబ్బసము; శ్వాసము.

క. ... పళ్లీ, పలితంబు లయ్యె వగరును, దలదేరును నుక్కిసయును దలకొనుదెంచెన్.

భార. ఆది. ౩. ౧౯౧.

ఆ. వగరు పుట్టె నంతఁ బిగలె దంతంబులు, నుక్కిసయును దగ్గు లెక్కటిల్లె, శిరసు నొవ్వఁ దొడఁగెఁ జెదరె మానంబంతఁ, గడిదియైన ముప్పుకాలమునకు.

భాగ. ౬. ౬౧.

చ. అటఁ బరకేశికుల్ ... దప్పినోష్ఠసంపుటములు వాడఁగా వగరు పుట్టఁగవచ్చిరి వెచ్చనూర్చుచున్. ద్వా. ౧౧. ౧౦.

వ. ... ఏచినమహాతపోష్ణంబునం దృష్ణపొడమి దగనిగుడ వగరడరి ... తూలు కాలేఁగ కమ్ముల ... మనుచ. ౪. ౬౦.

**వగరుపు(ర్పు).** వి. (√ వగరుచు). ౧. శ్వాసము.

సీ. గొండు రోఁజు వగర్పు రొప్పన శ్వాసము ... ఆం. భా. ౨. ౧౨౮.

౨. శ్వాసరోగము. (శ. ర.)

**వగర్చు(రుచే).** అ. క్రి. నిట్టూరుచు.

ఉ. కొమ్మ మెఱుంగుఁజన్నుఁగవకొత్తల భిన్నములైన యాత్మకుం, భమ్ములఁ జూచియాసతిసాబంగుఁ దొడల్ దొడరన్ వగర్చు హస్తమ్ములఁ జూచి తన్మృదుపదమ్ములు పుష్కరమూన వ్రాలు నాగమ్ములఁ బ్రోవ బాలగజగామినియున్బిరుదంబుఁ గైకొనెన్.

కృ. శకుం. ౨. ౧౬.

చ. అనుజునిఁ జూడ శోకము దశాననుఁ జూడ వగర్చురోషముం, బెనఁగొన రామభూవి భుఁడు పేర్చి ... దశా. 3. ౧౪౬.

జ: వగరము, వగరించు, వగరు, వగరుపు.

**వగలాఁడి.** వి. (వగలు + ఆఁడి) విలాసములుగల యాఁడుది, విలాసవతి, ఒయ్యారి.

సీ. వగలాఁడి యిచట సువర్ణము ల్గలుగునే ... ఉ. రా. ౧. ౩౨.

ఉ. ఏవగఁ ద్రోచిన న్విడువ నీ వగలాఁడి బళారె ... శకుం. 3. ౩౫.

గీ. ఎలుక వగలాఁడి కోరినవెల్ల నొసఁగి, ... శుక. ౧. ౧౧౧.

ద్వి. వగలాఁడి బహుమాయవాద మూహించి, పగిడంపుఁ గంబంబు పట్టుక లేచి ... ద్వి. శ. సా. ౧. ౩౯. పా. ౧౫. పం.

**వగలాఁడు.** వి. (√వగ) విలాసములుగల పురుషుఁడు. వా.) (విణ. వగకాఁడు. (శ. ర.)

**వగవగ.** వి. (ఇది "వగ"కు ఆమ్రేడిత రూపము.) పలువిధములు, రకరకములు.

సీ. వగవగ కూరలు వరుగు లప్పడములు నొలుపుఁబప్పునుమించు టోగిరములు ... ఉ. రా. ౬. ౧౨౧.

విణ. రకరకములుగల, పెక్కురకముల.

సీ. ... క్రొత్త, రంగుల అవికెలు బంగారుఁ బూఁగొప్పు సవరముల్ వగవగ సన్నచీర,
గీ. అద్దముల్ పరిమళములు నాదిగాఁగ ... దశా. ౬. ౩౪.

**వగాహము.** సం. వి. అ. పుం. = అవగాహము.

**వగ్గము.** వి. (సం. వర్గః = ఋగ్వేదము నందలి యధ్యాయములయొక్క యొకభాగము - ఆ. ని.) వేదభాగము.

మ. నిగ దువ్వన్ ముడివైచు దువ్వు మఱియుం జేఁదోయి బిట్టెత్తుచున్, బిగియు న్నిక్కుచుఁ బెక్కుచేష్ట లొలయన్ బిట్టావలించున్ నఖాగ్రగతిం జీరి తటుక్కునం బయిఁ బడన్ ఘర్మాంబువుల్ చిమ్ముచున్, వగ గావగ్గము నుగ్గడించు ఘనరావస్ఫూర్తి కంఠధ్వనిన్. ఘటికా. ౨. ౩౦.

**వగ్గు**[1] = వక్కు[1]. అ. క్రి. బక్కచిల్లు, కృశించు. (శ. ర.)

విణ. బక్కచిల్లినవాఁడు, కృశుఁడు; బక్కచిల్లినది, కృశము.

గీ. ఉగ్గడించి మమ్ము నొంటివగ్గులఁ గనుం, గొనుము వంత దీర్పు మనియె నధిప. భార. అశ్వ. ౧. ౬.

చ. లలన యొకర్తు వగ్గుకృకలాసముఁ జేరఁగఁ దెచ్చి వంచనన్, నలుసకుఁ గుంచెవట్టు సెల నాఁగ పదద్వయమధ్యమంబునన్, నిలిపిన ... నైష. ౬. ౧౧౧.

క. జననాథ యేమిచెప్పుదుఁ, గనలుచు నవ్వగ్గుతపసికటము లదరఁగాఁ, దనచేతి నాగ బెత్తముఁ, గొని పసరముఁ గొట్టినట్టు గొట్టె నదయుఁడై. మనుచ. ౪. ౫౫.

సీ. ... ఓసిచెల్లి యిమ్ముసలివగ్గు, నీకుఁ దోడై వచ్చునో కలదో మఱియేమైన ననుచు ... కళా. ౩. ౧౭౩.

జ: వగ్గుఁదనము, వగ్గుపడు.

**వగ్గు**[2] = వక్కు[2]. వి. (సం. బకః.) ౧. ఒకజాతి కొంగ.

తే. బకము విలిమిల్లు నారణపక్కి వక్కు, వగ్గ టంచన ... ఆం. భా. ౨. ౯౩.

**వగ్గుఁదనము.** వి. (వగ్గు[1] + తనము) కృశత్వము, బక్కచిల్లుట.

ఉ. వగ్గుఁడనంబునం జనెడువాయునుతుం గని
నీవు నవ్వినన్, భగ్గునమండి నన్నుఁగని
పల్కె నతం డతిరూక్షవీక్షణన్.
సమీర. ౨. ౨౧.

**వగ్గువడు.** అ. క్రి. (వగ్గు¹ + పడు స్వార్థమున.) వగ్గగు, బక్కటిల్లు, కృశించు.

వ. ... జిగిదగి బిగి వదలి స్రగ్గి వగ్గువడి తరంగితాయమానంబైన సర్వాంగీణచర్మంబును.
కవిక. ౫. ౧౧౦.

**వగ్గెర.** వి. వల.

క. పులుఁగులఁ బినుఁగుకిరాతుఁడు, వలఁదవు
లఁగఁదిగిచి తగ్గి వగ్గెరపగ్గం, బలఘుతరకీల
మునసం, వలనముఁ గావింపుచుండె వలసిన
భంగిన్. వేం. పంచ. ౨. ౧౨.

**వగ్రహము.** సం. వి. అ. పుం. అవగ్రహము.

**వచ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. మనుష్యునివలె మాటలాడెడి పక్షివిశేషము, ఒక జాతి పిట్ట. ౨. పరిమళముగల ఔషధివిశేషము, వస. *.

**వచనకరుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) విధేయుఁడు. పనిచినదానిని చేయువాఁడు.

వి. అ. పుం. సూత్రకారుఁడు, ధర్మనిబంధన గ్రంథకర్త.

**వచనకారి.** సం. విణ. (న్. ణీ. న్.) = వచనకరుఁడు.

**వచనగ్రాహి.** సం. విణ. (న్. ణీ. న్.) విధేయుఁడు, ఆజ్ఞాప్రకారము చేయువాఁడు.

**వచనమాత్రము.** సం. వి. అ. న. మాట మాత్రము, నిరాధారవాక్యము.

**వచనము.** సం. వి. అ. న. ౧. కథనము, చెప్పుట. ౨. మాట, పలుకు; వాక్యము. ౩. ఆవృత్తిచేయుట. ౪. సిద్ధాంతము. (శాస్త్రవచనము, శ్రుతివచనము, స్మృతివచనము మొ.) ౫. ఆజ్ఞ.

క. నావచనమున నపత్యముఁ, గావించుము
గుంతి నీవుఁ గడునెయ్యముతోఁ ...
భార. ఆది. ౫. ౧౩౧.

క. వసునిభుఁడు పైతృకంబగు,వసుధారాజ్యంబు
భీష్మువచనమున గత,వ్యసనుఁడయి తాల్చెఁ
దేజం, బెసఁగంగ విచిత్రవీర్యుఁ డిద్ధ
యశుండై. భార. ఆది. ౪. ౧౯౬.

౬. ఉపదేశము, ఆలోచన, సలహా. ౭. ప్రకటన. ౮. వర్ణోచ్చారణము, అక్షరముల పలుకుబడి. ౯. (వ్యాక.) ఏకవచనాది, (ఏకవచనము, ద్వివచనము, బహువచనము.) ౧౦. సొంటి, శుంఠి. ౧౧. చెప్పినపని చేయుట.

తరలము. చెడకు నావచనంబు సేయుము చెచ్చె
రన్ ధరణీశులన్, విడిచిపుచ్చుము ...
భార. సభా. ౧. ౧౯౨.

**వచనవిరోధము.** సం. వి. అ. పుం. శాస్త్రాది వాక్యములకుఁ బరస్పరవిరోధము - అసంగతత్వము.

**వచనీయము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. చెప్పఁదగినది, పలుకఁదగినది. ౨. నింద్యమైనది, నిందింపఁదగినది.

వి. అ. న. నింద, దూఱు.

**వచనే(న)స్థితుఁడు,** సం. విణ. (అ. ఆ. అ.) విధేయుఁడు, చెప్పినట్లు చేయువాఁడు.

**వచనోపక్రమము.** సం. వి. అ. పుం. ఉపోద్ఘాతము, అవతారిక.

**వచరము.** సం. వి. అ. పుం. కోడిపుంజు.

**వచరుఁడు.** సం. వి. అ. పుం. శఠుఁడు, దుష్టుఁడు.

వచసాంపతి. సం. వి. ఇ. పుం. బృహస్పతి; బృహస్పతిగ్రహము.

వచస్సు. సం. వి. స్. న. ౧. మాట, వాక్యము. ౨. ఆజ్ఞ, శ్రుత్యాదివచనము. ౩. ఆలోచన, ఉపదేశము. ౪. వేదమంత్రము. ౫. పక్షి గానము. ౬. (వ్యాక.) ఏకవచనాది.

వచించు. సం. స. క్రి. ౧. పలుకు, భాషించు, వాక్రుచ్చు.

మ. సముఖాయంచును వేత్రహస్తులు వచించన్
డిగ్గనన్ లేచి ... దశా. ౨. ౧౨౪.

౨. చెప్పు, వర్ణించు.

క. హరిదినమున కే ధర్మము, సరిగా దే తీర్థ
ములును సరిగావు గుణాకర యెందును
పోషణ జాగరములనగు పుణ్య మలవిగాదు
వచింపన్. జాహ్నవీ. ౩. ౯౩.

వచోగ్రహము. సం. వి. అ. పుం. చెవి. శ్రవణము.

వచ్చ. వి. ౧. చెట్టునకు పట్టి బొత్తిగా నాశము చేసెడి యొక దినుసు చీడ.

౨. ఇచ్ఛ, కోరిక. (శ. ర.)

వచ్చు. అ. క్రి. (క. బర్. త. వరు.)

(దీనికి ప్రార్థనాద్యర్థమునందు రమ్ము, రారండు అనురూపములును, తుమున్నాద్యర్థము నందును, వ్యతిరేకార్థమునందును రాన్, రాఁడు, రాక, రామి మున్నగు రూపములును గలుగును.)

దరిచేరు, డగ్గఱు, ఏతెంచు.

క. నారదుఁడు వచ్చెఁ దద్వచ, నారంభుల రగుఁడు
మీర లని కఱపి మహో,దారుఁడు వారల
వీడ్కొని, నారాయణుఁ డరిగెఁ దక్షిణమ
తనపురికిన్. భార. ఆది. ౭. ౭౭.

క. దేవర యానతి యిచ్చిన, యీవాక్యము లెస్స
నాఁడు నీవ యుపేక్షం,బో విడిచితి వింకను
నీ,చేవత్తురు వారు వీరిచే టొప్పుదు రే.
భార. ఉద్యో. ౨. ౨౦౨.

ఉ. అంతట నొక్కనాఁడు ధవళాంబుజ
నేత్రుఁడు వచ్చి ... పారి. ౧. ౪౩.

గీ. అనుచు నడలెడుతల్లి నూరార్చి యంప,
దొనలు విల్లును గయికొని చనఁ దలంచు,
నెడల నడ్డంబుగా వచ్చి పుడమి కొన్ను,
వలపుగులుకంగ మెల్లనఁ బలికె నపుడు.
అచ్చ. రా. అయో. ౬౯.

చ. ... ఈ యఘమయాత్ముని ఘోరవిధి వ్యధిం
చిర, మ్మనవుడుఁ బూరుషార్థముగ నవ్విభు
తోడ బహుశ్రుతుం డనున్ ...
విక్ర. ౩. ౬౨.

సీ. వ్రాసి పంపితిమి భూవరులకు మత్పురంబు
నకు వేవేగ రమ్మనుచు వేడ్క ...
ఇందు. ౫. ౧౬.

రగడ. వేమాకందము లేమాకంపము, రామా
మెల్లన రామా కంపము ...
ఇందు. ౩. ౩౫.

(ఇందు "రమ్మా" యనుటకు మాఱుగ "రామా" యని ప్రయోగింపఁబడెను.)

మ. ... ఎల్లరున్, వినఁగాఁ బల్కె కుమారునిం
దెలిసి రండీ యంచు రా జంపినన్ ...
సారంగ. ౩. ౭.

శా. ... ఇం,దేలా యాటలు సాలుసాలు నిఁక
రారేయంచు వా రేఁగుచున్ ...
ఉ. రా. ౧. ౧౮౩.

ఉ. సోరణగండ్ల రాఁగొదమచుక్కలు పట్ట
సను లక్కవాటముల్, చేరుప ...
ఆము. ౨. ౧౩.

౨. సంభవించు, తటస్థించు.

ఉ. ... నపుంసకజన్మ మవశ్యభోగ్యమై,
వాఁడిమి గల్గుశాపమున వచ్చె ...
భార. విరా. ౧. ౨౩౮.

శా. లోకాలోకనగంబుదాపలకుఁ గల్లోలాహ
తాంభోధి వేలాకుంజంబులకుం జనం జనఁగ
నాలావంత చింతాభరం బాకంపంబు మనం
బునం బెనుపఁగా నైరావతో, చ్చైశ్శ్రవ
స్స్వీకారంబున దిక్కులం దిరుగ వచ్చెన్
దేవకీనందనా. ఉ. హరి. ౧. ౧౩౩.

౩. లాభించు.

గీ. దుష్కరంబైన తపమిట్లు దొడరి చేసి, మేను
డయ్యించుకొనఁగ నేమిటికి వచ్చె ...
హర. ౪. ౨౩.

౪. కలుగు, ఉద్భవించు.

క. ఆ సాత్యకి వేఱొకవిల్లా సురగతి నెత్తియు
గ్రమగు నారాచం,బేసిన నాతఁడు కేతు,
వ్యాసక్తుండయ్యె మూర్ఛవచ్చి నరేంద్రా.
భార. భీష్మ. ౩. ౨౧౦.

సీ. ... ఇట్టి బంధులఁబాసి యేనొకండ, రా
బుద్ధిరాదు తారక రాజశేఖర ...
హర. ౨. ౧౩౯.

క. తమతల్లి పురంధ్రీ జా,తమతల్లిగదా తదీయ
తనుజుఁడనఁట హా, తరుణీ యేతటినైనను,
రమణీయేతరగుణంబు రానేర్చు నొకో.
సారంగ. ౨. ౧౦౪.

మ. బెరసెన్ మేన నిగిడ్చినట్లు వళులు ...
వృద్ధాలికిన్, మరలం బ్రాయము వచ్చెఁ
దత్తరుచలన్మందానిలా,సంగతిన్ ...
పారి. ౫. ౪౬.

గీ. విబుధనాయక నీ వెంత వేఁడికొనిన, నాకు
దయరాదు ... దశా. ౨. ౩౯.

౫. (పండ్లు) మొలచు, అంకురించు.

సీ. పలు రాకమును వచ్చి బాలువేలుపు మన్నఁ
బండ్లు లేకుంట నభావ్యుఁ డనిరొ,
బండ్లు రాఁజూచి డింభకుని వేలుపుమన్నఁ
బడిపండ్లురామి నభావ్యుఁ డనిరొ ...
భాగ. ౯. ౧౯౬.

క. అఱపు లుడిగి పోపో నీ, యఱచేతం బండ్లు
వచ్చినప్పుడు మమ్ముం, గఱచెదవుగాని
తగునెడ, మొఱయిడు మది యెట్టిదైవములు
వినియెడినో. కళా. ౩. ౨౩౦.

౬. లభించు, దొరకు.

ఆ. ఆభిచారికఘనగరాంబు దూషితరుజ్ఞ, రంతి
రాద్రిగహనదంతురోగ్ర, కీకటోర్వి మేరు
గిరి సమార్ఘ్యమువచ్చు, నేని చొరకు పంపె
యిడుముకొనఁగ. ఆము. ౪. ౨౬౮.

చ. వెలుపల వడ్డికిచ్చినను వీసము వచ్చునునట్టు
లారయునో ... శుక. ౨. ౫౭౯.

క. కోపమునఁ జూచి యపుడా, భూపాలకుమా
రుఁ డను సుబుద్ధికి నానా, పోపో మ్మూర్ఖక
పలవని, పాపముఁ గట్టెదవు చాలుఁ బది
వేల్ వచ్చెన్. సారంగ. ౨. ౧౭.

౭. చెందు, ముట్టు.

ఆ. కాన విష్ణుఁడైనఁ గానిమ్ము రాముతో,
విగ్రహంబె కాని వినయమొల్ల, ననికిఁ జాలు
నిచను చాలవేని నీ, పోటువచ్చె నిదుర
వోవఁబోకుమ్ము. భా. రా. యు. ౮౯౫.

ఉ. అండజయాన నీయొసఁగునట్టి సపర్యలు
మాకువచ్చె ... మనుచ. ౨. ౪౮.

౮. (గ్రహాదులు) ఆవేశించు, పూను.

గీ. అట్టియెడ వేల్పు పచ్చిన యట్ల మేను, వొంగ
నలిరేఁగి పాండవపుంగవుండు, మత్స్య
నృపనందనుని బలుమాటలోడి, యేపుసెవి
కిని జూడ్కికి నింపునొసఁగ.
భార. విరా. ౫. ౪౦.

చ. ... అవ్వనరుహాలోచనల్, సివమువచ్చిన
యండముఁ జూపి రందఱున్.
శుక. ౩. ౧౧౯.

౯. ఇష్టమగు, అనుకూలమగు.

(ఈ యర్థమున నీ శబ్దమునకుఁ బూర్వము "మనసు" అను నర్థముగల పదము వచ్చును.)

గీ. ఏను వంటలవాఁడనై యానరేంద్రుఁ, గొలిచి గరగరగాఁ గూడు గూర చిత్తమునకు వచ్చినచందంబునన యొనర్చి, నేర్చి మెలఁగుదుఁ గరము వినీతి మెరసి. భార. విరా. ౧. ౭౬.

గ. ... రెండుదిక్కుల హితంబును బెంపును గల్గునట్టి చొప్పున విదురాది సజ్జనుల బుద్ధికి రానుచితంబులోడి మెల్పునఁ బరుసందనంబునను భూపతులెల్ల నెఱుంగనాడుమా. భార. ఉద్యో. ౩. ౨౩.

వ. అది యెఱింగి వసిష్ఠుండు గనలి యోరీ నీవు తండ్రి చిత్తంబునకు రామియు గురుదోగ్ధ్రీ వధంబును నప్రోక్షితమాంసోపయోగంబును ననుమూఁడు తెఱంగుల హృదయశంకువులు గావించితివి త్రిశంకుండ వయితివి ... హరి. పూ. ౨. ౪౫.

గీ. వనిత నీచిత్తమున కేను వత్తునేని, కామతంత్రంబునకు సంచకర్వుగాఁగఁ, జుంబనము సేయుని మ్మోష్ఠబింబ మిపుడు, గండుఁ గోయిల చిగురాకుఁ గమిచినట్లు. శివరా. ౩. ౬౭.

ఉ. ... ఆ నృపతి పాలికిఁ బోయెద వేమొ పొమ్ము నీ, యిచ్చకు వచ్చినట్లు రమియింపుము ... శుక. ౨. ౬౭.

౧౦. ప్రసన్నమగు.

చ. సరసతరోక్తి నేఁగి మునిసత్తముఁ జిత్తము వచ్చునట్లుగా, వరఁకులఁ బెట్టి తెచ్చెదరు వారవిలాసిను లెన్నిభంగులన్ ... భా. రా. బాల. ౬౩.

సీ. ... భార్గవులచే బలి యొట్టుకేలకు బ్రదికి వారి, చిత్తంబు రాఁగొల్చి శిష్యుఁడై వర్తింప ... భాగ. ౮. ౪౩౯.

సీ. హెచ్చుమాటల కేమి యింకనొక్కటి మనేదారులు దారినఁ దారసిలినఁ, బంపుచేతనె పోరఁ బట్టించినపుడుగదా స్వామివారి చిత్తంబు వచ్చు ... రా. వి. ౫. ౪౨.

క. ఆ యోగవిద్య యొరులకు, నోయామున లేదొకింతయును గావున నీ, వాయనచిత్తము రాఁ బ్రజ్ఞాయుక్తిం గొలిచి దాని సాధింపఁదగున్. పరమ. ౫. ౧౯౩.

౧౧. అలవడు, అభ్యస్తమగు.

గీ. వాని కీరేడువిద్యలు వచ్చియుండు. నైష. ౬. ౨౫.

ఉ. ... విద్యలు వచ్చునంచు నేఁ, గ్రొవ్వున విప్రులన్ సరకుకోక తిరస్కరణంబు చేసినన్. వరాహ. ౭. ౧౪.

ఉ. అక్కట పుట్టించిన నొకతురమైనను రాదు లెక్కలుం, దక్కలెకాని యమ్మని నథ మ్మన నేరఁడు ... శుక. ౨. ౪౩౭.

౧౨. అగు.

చ. ఇతని కితండె సాటియగు నీతని కీతఁడె సాటి వచ్చు ... ఉ. హరి ౪. ౨౫౭.

చ. ... నిన్నొరసి తారె సరాక కదా నిలింపభూజులు వహించు దుర్యశము ... ఆము. ౧. ౪౩.

చ. ... దుర్జయుఁడగు నా నృపాలుని పరాక్రమలీలకు రాజులెల్ల నొరయ సరి షోడశాంశమును రారు ... జై. భా. ౭. ౩౪.

౧౩. సాటియగు.

సీ. కడుమృదురీతి నీనడపాడు గతికిరాననిక్రాలి నడచు రాయంచ లివియు ... కు. సం. ౬. ౬౭౭.

౧౪. ప్రవర్తించు, నడచుకొను.

క. నేరిచిన నేరమన్నను, గూరుచుకొని రాక
మీరి కోపించిన ... దశా. ౨. ౩౭.

ఉ. ... నారదమునీంద్రుఁడు ... పలికెజ ...
బలిఁగూర్చుదాన నా, యంతటివారు లే రని
యహంకృతి నెప్పుడు విఱ్ఱవీఁగుచుఁజ, వంతు
న వచ్చుసత్యగరువం బిఁకఁ జెల్లదటంచు
మానినీ. పారి. ౧. ౮౦.

౧౫. ప్రసక్తమగు.

వ. ... ఇంకఁ బ్రకృత కథ వచ్చుచున్నది
యాకర్ణింపుము. కళా. ౪. ౪౦.

౧౬. వర్ధిల్లు.

క. ... వరుసన యెడ తెగక యిట్లువచ్చిన వం
శం,బురుభుజ ... భార. ఆది. ౪. ౨౨౧.

౧౭. సమర్థమగు.

సీ. భ్రూభంగములు లేవె యాభీల వింధ్యగర్వ
స్తంభనమునకు రావుగాక ...
పాండు. ౫౧౭౬.

౧౮. నెఱవేఱు, సిద్ధించే.

మ. ... ప్రపితామహప్రతతుల న్నాకంబు
నొందంగఁ దెచ్చితి నాకొపగ నింక నీ
ప్రతిన వచ్చెన్ ...
భా. రా. బాల. ౪౬౧.

౧౯. కాఱు, స్రవించు.

సీ. ఇందాఁక నెఱుఁగక యేమి యంటినొ మిమ్ము
ననుచుఁ గన్నీళ్లురా నడఁచుకొనుచు, ...
కళా. ౪. ౧౭౧.

౨౦. పొంగు, నిండిప్రవహించు.

వ్యవ. గోదావరి వచ్చినది.

ఆ. ఎంచఁ జనఁగరాని యిక్కట్టు ప్రాప్తించెఁ
గృష్ణరాఁ దొడంగెఁ గృష్ణరాయ, లివలఁ
దఱుమఁ జొచ్చె ... కృష్ణ. ౩. ౪౩.

౨౧. తగు, యుక్తమగు.

(ఈ యర్థములందు అన్నంత క్రియలతోఁ గూడి
కొనవచ్చును.)

ఆ. ఎల్లభువనములను నేలుటకైనను, నిట్టి
క్రూరకర్మ మెట్టు సేయ,వచ్చుఁ గడఁగి
యెదిరి వా రేమి సేసిన, మాఱుసేయ నాకు
మనసురాదు. భార. భీష్మ. ౧. ౧౮౫.

క. అనవుడు మునినాయకుఁ డి,ట్లనియె నృపతి
నిన్నుఁ బంపునఁట వినుము విరో,చన పరు
లకు నిది యీవ,చ్చిన నిచ్చెద దాఁచనేల
చెప్పు మటన్నన్. వరాహ. ౫. ౧౧.

(ఈవచ్చున్ = ఈయఁదగును.)

ఉ. బుద్ధియ కర్తనేని కొనిపోవుఁడు ధర్మము
నూత్కృమీ యసం,బద్ధములైన న్యాయ
ములఁ బంతము వచ్చునె మేము దెంపుమై,
యుద్ధము సేయఁజాలకయ యోహరిసాహరి
నెంత చెప్పిన, న్నిద్ధరణీతలామరుని నీరు
చలంబున మీకుఁ దక్కునే.
శివరా. ౪. ౬౨.

ఉ. ... రాజులే,పార ననేకమార్గముల నప్రియము
లం దెగఁజూతు రేర్పడన్, వారి నెఱుంగఁ
గావలయు వచ్చునె నమ్మఁగ నెందు రాజు
లన్. భా. రా. కిష్కిం. ౧౧.

గీ. శివకళత్రమునకు శివక్షేత్రమునకు, శివుని
మూర్తికి శ్రీసదాశివునికీర్తి, కితరతీర్థంబు
సరిపోల్ప నెట్లు వచ్చు, దక్షవాటంబునకు
మహాస్థానమునకు. భీమ. ౩. ౧౨౯.

ఉ. అచ్చపుబ్రహ్మచర్యము ప్రయత్నమునం
జరియించుచుండి నేఁ,డొచ్చెల కూద్రభామి
నికి నువ్విళులూరిపథంబు దప్పఁగా, వచ్చునె
తెద్దునాకి యుపవాసము మాన్పికొనంగ
నేటికిన్. విక్ర. ౧. ౧౫౦.

ఉ. ... ఇం, దుండఁగరాదు పోవలయు నూరికి
నింటికి ... మనుచ. ౨. ౪౮.

౨౨. శక్యమగు, వలనుపడు.

గీ. ఇమ్మహాస్త్రంబుఁ గడిమిమైఁ బ్రమ్మరింప,
నెవ్వరికి రామిఁజేసిఁగా కేము శక్యమైన
నూరక యుండుదుమయ్య ...
భార. ద్రో. ౫. ౩౮౭.

క. కావున వంచనబాహిర, పావకయుండంగ
మనరిపుం బరిమార్పంగావచ్చునేని యట్టిద,
నా వలపటుగాక తక్కినను వలదు సుమీ.
భార. విరా. ౨. ౨౮౭.

గీ. దురితకరముల యని వానిఁ దొడరకుండ,
వలదె లెస్సగ నెఱిఁగిన వచ్చుఁ దొలఁగ.
భార. శాం. ౫. ౬౦౦.

ఉ. ఎవ్వరికైనఁ జేరఁజొర నెన్నడురాని నిశా
చరాస్పదం, బివ్వసభూమి ...
హరి. పూ. ౭. ౮౯.

క. మిహిరలవంబులఁ దారాగ్రహ నక్షత్రము
లవచ్చు గణుతింప భవన్మహిమార్ణవ గుణ
రత్నము, లహిభూషణ యెవరికైన నలవియె
పొగడన్. భీమ. ౫. ౧౨౭.

గీ. తివిరి యిసుమునఁ దైలంబుఁ దీయవచ్చుఁ,
దవిలి మృగతృష్ణలో నీరు ద్రావవచ్చుఁ,
దిరిగి కుందేటికొమ్ము సాధింపవచ్చుఁ, జేరి
మూర్ఖుల మనసు రంజింపరాదు.
భర్తృ. నీతి. ౫.

౨౩. సిద్ధముగ నుండు.

గీ. ... నీ పందెమాడుకొమ్మెల యాలమింప
నీయాట యోడవచ్చినది యనియె ...
కళా. ౬. ౧౧౭.

క. తనరాష్ట్రము చెడవచ్చిన, ననిమిషపతి
విప్రుఁ డనకయాచార్యుఁ డ్రిశీర్షునిఁ దును
మఁడె ... ఆము. ౩. ౩౭.

౨౪. పూను, ఉద్యమించు, యత్నించు.

(ఈ యర్థమున నిది తుమున్నంతమునకును
ప్రయుక్తమగును.)

ఉత్సాహ. ఎన్న నే వరించునురుసమిన్మహావనం
బులో, నన్నగారి గినిసినను ఘనాతిచండ
కాండవృష్టి న్నలంపవచ్చు జగదజేయదండ
నుండు మాయన్న బ్రాహ్మణునకు విరచి
తాంజలి యగు భక్తితోన్.
రాఘవ. ౨. ౧౦౫.

పంచచామరము. ... త్రిమ్మరీ మఱిట్లు వచ్చి
సారె సారె నన్నుఁ గెర్లఁజేయ రాక
పొమ్మికన్. విప్ర. ౪. ౫౯.

క. అతివా ముదియఁగ ముదియఁగ, మదిదప్పెనొ
కాక నీకు మనమున నియమవ్రతపరుల
శూద్రరమణీరతికై బోధింపవత్తురా యిది
తగవా. విక్ర. ౧. ౧౪౪.

గీ. ... మాకు, బుద్ధిచెప్పఁగ వచ్చితే ప్రౌఢ
యనుచు, నలిగి ... దశా. ౪. ౨౦౧.

౨౫. తొడఁగు, ఉపక్రమించు.

సీ. ... దాన గర్వముదయింపవచ్చిన నుడుపం
గవలయు గర్వంబున గురుసమారాధనంబు,
వదలిన ... భార. అను. ౩. ౩౨౧.

౨౬. తలఁచే.

గీ. కోరి తొలుమేనఁ దనకైన కొదువలెల్ల,
మాన్పుకొనవచ్చి ధవనైకమాన్యలీల ...
పారి. ౧. ౧౭.

౨౭. ఇది కను, విను మొదలగుధాతువుల కను
ప్రయుక్తమగుచోఁ గర్మార్థక "పడు"
ధాతువు నర్థమిచ్చును.

కానవచ్చెన్ = కనపడెను.

గీ. ఎడపఁదడపఁ ధనూభవుం డేచట నుండుఁ,
గానరాఁడని గృహభర్త కాంతనడుగ, నింత
డడవును నారొద్ద నిచట నుండి, యరిగెఁ
జదువంగనని భర్త కతివ యొఱఁగు.
కాశీ. ౪. ౮౫.

సీ. హరిబహిఃప్రాణంబ వగుట నేఁ డెఱుఁగంగ
వచ్చె నీ కిపుడిది యిచ్చెఁ గాన ...
పారి. ౧. ౫౮.

(ఎఱుఁగంగవచ్చెన్ = ఎఱుఁగంగఁ బడెను.)

మ. ... అం దొకక్కకల స్వనంబు వినవచ్చెఁ
మాధురీధుర్యమై. వసు. ౨. ౧౩.

౨౮. ఇది కొన్నిపట్ల "పోవు" మున్నగు ధాతువులకు వాక్యాలంకారముగా ననుప్రయుక్తమగును.

సీ. పరమ కల్యాణి యో భాగీరథీగంగ వార్ధి
భామిని పోయివత్తునమ్మ ...
కాశీ. ౨. ౧౩౬.

గీ. ... మీరిరువురు, నీ యెఱుక ఘఱచెదరు
సూ పోయివత్తు ... ప్రభా. ౩. ౬౪.

సీ. ... అందుఁ ద్రేతాయుగమునకు సమకాల
ధర్మముల్ జరిగివచ్చుఁ, గీ. గృతయుగాద్య
వస్థలులేవు సతతమును మనోహరములైన
రాజధానులు వనములు, సంబుజాకరములు
నెన్నియైనఁ గలవు. వి. పు. ౩. ౫౧.

గీ. అంతకంతకు గతివేగ మగ్గలింప, రాఁక వాగె
యెచ్చరిక పరాకుజియ్య, యను జనులు తిచ్చ
వడి తమపని మఱవఁగఁ, బఱఁగు నమ్మోటి
నెఱరాతు ప్రౌఢికతన. ప్రభా. ౨. ౩౩.

వాడుకలోని విశేష ప్రయోగములు.

౧. ప్రొద్దు గ్రుంకవచ్చినది.

౨. మొత్తములో కొంతసొమ్ము లోటువచ్చినది.

౩. వానికి ఓ అన్న న రాదు.

౪. వానికి భూములమీఁదఁ బదివేల రూపాయిలు వచ్చును.

౫. నిష్కారణముగా నూఱు రూపాయిలు దండుగ యిచ్చుకోవలసి వచ్చినది.

౬. మాటమీఁద మాట వచ్చును.

౭. వానికి జ్వరము వచ్చినది.

౮. ఎందుకు వచ్చిన గొడవ యిది?

౯. ఈ పిల్లవాఁడు తప్పక పనికివచ్చును.

విణ. విపులము.

ఉ. ఒయ్యన వెల్లు నూపి జడి నుబ్బరవోయెడి
ప్రాణికోటికిఁ, దయ్యమునె త్తికోలు తుది
దాఁకఁగఁ దూరుపు తెల్లవాఱె, తెల్ల
య్యెను నీరవీథిఁబడి యంబుధి కేఁగె నదీ
ముఖంబునఁ, బయ్యరవట్టె మేఘములు
వచ్చుగఁబాఱె నుదఙ్ముఖంబులై.
హర. ౨. ౨౪.

జ: రప్పించు, రాఁబట్టు, రాక, రాకడ, రాకాపోక, రాకొట్టు[2], రాబడి, రావించు, రావెడలు, వచ్చుబడి, వచ్చురాములు.

వచ్చుబడి. వి. ధనాగమము, ఆయతి. (శ. ర.)

వచ్చురాములు. వి. బ. (వచ్చుట + రామి), వచ్చుటయు రామియు.

గీ. నాఁడు మఱునాఁడు నవ్విప్రనందనుండు,
ధాతమాటలచేందంబు దానవారి, తనకడకు
వచ్చురాములుఁ దలఁచితలఁచి, ముచ్చెటల
యేటితరగల మునిఁగి మునిఁగి.
పాండు. ౪. ౬౬.

వజె. వి. (సం. వచా. క. వజె, బజె.) వస, ఓషధీ విశేషము.

గీ. ... వసయన వజెయనంగ, వచకుఁబేరు
చెలఁగు ... అం. భా. ౨. ౫౫.

వజీరు(ఁడు) = వజ్జీరు(ఁడు), వజ్రీఁడు. వి. (హిం. వజీర్. బ. వజీరులు, వజీర్లు.)

౧. యోధుఁడు, శూరుఁడు.

గీ. చిల్క సామ్రాణి తేజివజీరుఁగేరు, కృష్ణ
మంత్రీంద్రు చెలువు వర్ణింపఁదరమె
దశా. ౧. ౭౧.

సీ. జగమెల్ల గెలువఁ గంజగురుటాకుజిరా
వజీరున కిదిగదా జీవగఱ్ఱ
చం. రా. ౩. ౪౫.

గీ. పచ్చపచ్చని యచిల్క బాబావజీరుఁ, దుల్ల
ముల్లోలముగఁ జేయఁ దల్లడించు.
శుక. ౧. ౧౧౩.

ఉ. ముందు పసిండి తమ్మిబలుఁ బొగ్గలబొగ్గర
మావరించు మేల్చిందెదు వేల్పు గుబ్బలి
వజీరునిజీరు సధఃకరింపఁగాఁ, గ్రొందలి
రాకుబాకు వారకుణా దొరకించు భవంబు
చెల్లరే, చందనగంధి చేసన్నఁగఁగ చంద్రుఁడో
యింద్రుఁడో యా యుపేంద్రుఁడో.
కృ. శకుం. ౨. ౧౨.

౨. మంత్రి, సచివుఁడు.

మ. ... నిజామాదుల్ వజీరుల్ భజింపఁగురు
సమ్రాత్వముఁ గానల్ ముసలిమానుల్‌గా
వితర్కింపఁగణా. వసు. ౧. ౪౪.

సీ. కలువలదొర చల్లగాలి వజీరులు పూని
రాస్తాను చపానుగొలువ, ...

గీ. ... మదనుపాదుషహా దండుగ దలె నపుడు.
అని. ౩. ౯.

౩. సామంతరాజు.

క. గడి దుర్గంబులకోటల, నిడుతాణపుదొరల
కెల్ల నెప్పుడు జెల్లే, పుడమియు మన్నెవ
జీర్లకు, నడుచు ముఖాపాలుగాక నగరి
ధరిత్రిణా. ఉ. హరిశ్చ. ౧. ౬౬.

వజా. విశే. ఇంపైనది, మనోహరము.

మణిమాల. అజహాత్పయోదధి ఘృతమ్ము లమ్ముచు
మురారిఁబాడి రెలమిన్, వజాఁగాఁ దదీయ
చరణాస్తసవ్యహృదయారవింద లగుచున్.
అప్ప. ౪. ౧౫౫.

వజ్జ. వి. ౧. ఉపాయము, వెరవు. (శ. ర.)
౨. ఉపమ, పోలిక ; (శ. ర.)

వజ్జెము. వి. (సం. వర్జ్యమ్) విషఘటికాక్రాంత సమయము.

ద్వి. వజ్జంబొ వారంబొ వారిపాజంబొ, వెజ్జఁ
జూపించరు వేల్పుల కిదరు ...
ద్వి. పరమ. ౩. ౧౫౪. పా. ౯. ౨౦. పం.

వజ్జిరము. వి. సముద్రపు మత్స్యవిశేషము.
(శ. ర.)

వజ్జీరు(ఁడు) = వజీరు.

గీ. ... ఎల్లరు వెఱఁగంద నలరు నెపుడు, మేలు
వజ్జీర్ల గమికొండ గోలకొండ.
యయా. ౧. ౩.

గీ. ఎట్టి వజ్జీర్ల నెన్నంగ నీడుగారు ... బడేమి
యా పుడమి కెన్నిక ... యయా. ౧. ౯.

వజ్ర. సం. వి. ఆ. స్త్రీ. ౧. చెముడు ; ఒకజాతి చెముడు ¶. ౨. తిప్పతీఁగ. ౩. దుర్గాదేవి.

వజ్రకంకటుఁడు. సం. వి. అ. పుం. హనుమంతుఁడు.

వజ్రకము. సం. వి. అ. న. ౧. చర్మరోగములను బోఁగొట్టెడు పలుతెఱఁగుల మూలికలతోఁ జేసిన తైలము. ౨. కంటి కగపడు నొకానొక యాకాశభాగము.

వజ్రకాలిక. సం. వి. ఆ. స్త్రీ. బుద్ధునితల్లి పేరు.

వజ్రకీటము. సం. వి. అ. పుం. సాలగ్రామము లోపలనుండి తొలిచెడు పురుగు. (శ. ర.)

వజ్రకీలము. సం. వి. అ. పుం. పిడుగు.

వజ్రకూటము. సం. వి. అ. న. వజ్రములు శిఖరమందుఁగల యొకానొక పర్వతము.

వజ్రకేతువు(ఁడు). సం. వి. ఉ. పుం. నరకాసురుఁడు.

వజ్రగార = వజ్రగారె. (వజ్రము + గార[1].)

ద్వి. గోమేదకంబుల కొణిగలు బవిరి, గా మల్చి
పై వజ్రగార యొసంగి ...
రం. రా. బాల. 83. పా. ౨. పం.

వజ్రగారె = వజ్రగార. (వజ్రము + గారె) మి. ని. వజ్రము పొడి కలిపి తయారుచేసినగార.
మ. వజ్రగారెలఁ జెన్నారొకగట్టిచప్పరములో
రేరాచరాతిన్నెపై ... దశా. ౪. ౪౯.

వజ్రగోపము. సం. వి. అ. పుం. ఇంద్రగోపము, ఆరుద్రపురుగు.

వజ్రచంచువు. సం. వి. ఉ. పుం. రాపులుఁగు.

వజ్రచర్మము. సం. వి. న్. పుం. గండకము. ఖడ్గమృగము.

వజ్రజిత్తు. సం. వి. త్. పుం. గరుడుఁడు. గరుత్మంతుఁడు.

వజ్రజ్వాల. సం. వి. ఆ. స్త్రీ. విద్యుత్తు. మెఱుపు.

వజ్రతుండము. సం. వి. అ. పుం. ౧. రాబందు, రాపులుఁగు. ౨. మశకము, దోమ.

వజ్రతుండుఁడు. సం. వి. అ. పుం. ౧. గరుత్మంతుఁడు. ౨. విఘ్నేశ్వరుఁడు.

వజ్రదండము. సం. వి. అ. పుం. వ్రణములో పుట్టెడు పురుగు. (బ్రౌ. ని.)

వజ్రదంతము. సం. వి. అ. పుం. ౧. సూకరము, పంది, అడవిపంది. ౨. ఎలుక.

వజ్రదంష్ట్రము. సం. వి. అ. పుం. కీటభేదము, ఒకజాతి పురుగు.

వజ్రదశనము. సం = వజ్రదంతము.

వజ్రదేహుఁడు. సం. విశే. అ. ఆ. అ. కఠినమైన (గట్టి) దేహము గలవాఁడు.

వజ్రద్రుమువు. సం. వి. ఉ. పుం. ఆకుజెముడు ?.
(శ. ర.)

వజ్రధరము. సం. వి. అ. పుం. గుడ్లగూబ.

వజ్రధరుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

వజ్రనాభము. సం. వి. అ. పుం. కృష్ణుని చక్రము, సుదర్శనము.

వజ్రనిర్ఘోషము. సం. వి. అ. పుం. పిడుగు యొక్క ధ్వని.

వజ్రనిష్పేషము. సం = వజ్రనిర్ఘోషము.

వజ్రపట్టులు. (వజ్రము + పట్టులు) మి. వి. బ. వస్త్రవిశేషము, ఒకవిధమగు పట్టుబట్ట.
వ. ... ఉదయరాగపట్టులును నేత్రపట్టులును
వజ్రపట్టులును నను పేళ్లుగల పుట్టంబులు
గట్టుకొని ... ద్వా. 3. ౧౫౭.

వజ్రపాణి. సం. వి. ఇ. పుం. ౧. ఇంద్రుఁడు. ౨. గుడ్లగూబ.

వజ్రపుఁదళుకులు. వి. బ. (వజ్రము + తళుకులు) ధాన్యవిశేషము.
సీ. వజ్రపుఁదళుకులు వాసనరాజనాల్ జవ్వాజి
వంకెలు గవ్వసరులు ...
హంస ౪. ౧౨౭.

వజ్రపుటము. సం. వి. అ. న. ఔషధములు వండెడి యొకవిధమగు పాత్రము.

వజ్రపుష్ప. సం. వి. ఆ. స్త్రీ. శతపుష్ప, సదాప ?.

వజ్రపుష్పము. సం. వి. అ. న. ౧. నువ్వుపువ్వు. ౨. ప్రశస్తమైన పుష్పము.

వజ్రభృత్తు. సం. వి. త్. పుం. ఇంద్రుఁడు.

వజ్రమయము. సం. విశే. అ. ఈ. అ. ౧. వజ్రములతోఁ బ్రచురమైనది. ౨. వజ్రమువలె కఠినమైనది ; కఠినహృదయముగలది. ౩. క్రూర మైనది.

వజ్రము. సం. విశే. అ. ఆ. అ. ౧. కఠినమైనది. ౨. క్రూరమైనది. ౩. పాయలైనది. ౪. అడ్డ ముగా నున్నది.

వి. అ. పుం. ౧. వ్యూహభేదము, ఒకవిధమైన మొగ్గరము. ౨. ఒక జాతిదర్భ. ༒. ౩. ఒక విధమగు స్తంభము. ౪. ములుగోలిమిడి. ༒.

పుం. న. ౧. వజ్రాయుధము, పిడుగు. ౨. వజ్రా యుధము వంటి వినాశకరమైనయాయు ధము. ౩. రత్నములకు బెజ్జములు వేయు వజ్రపుసూది. ౪. నవరత్నములలో నొకటి యగు వజ్రమణి. ౫. పులిగంజి. ౬. కత్తుల నతికించు బంక, సరేసు.

న. ౧. ఉరుకు. ౨. ఒక విధమైన అభ్రకము. ౩. పరుషభాషణము. ౪. బాలకుఁడు. ౫. ఉసిరికాయ, ధాత్రీఫలము. ౬. నువ్వు పువ్వు. ౭. (జ్యోతి) ఇరువదియేడుయోగ ములలో నొకటి. ౮. ఒక విధమగు గట్టి సున్నము.

వజ్రరదము. సం. వి. అ. పుం. సూకరము, పంది ; అడవి పంది.

వజ్రలేపము. సం. వి. అ. పుం. ఒక విధమైన గట్టి సున్నము.

వజ్రలోహ(క)ము. సం. వి. అ. పుం. సూదంటు రాయి, అయస్కాంతము.

వజ్రవల్లి. స. వి. ఈ. స్త్రీ. నల్లేరు. ༒.

వజ్రవ్యూహము. సం. వి. అ. పుం. ఒక విధ మైన మొగ్గరము. యుద్ధమున సైనికులను వరు సగా నిలుపుటలో నొక భేదము.

వజ్రసారము. సం. విశే. అ. ఆ. అ. వజ్రము వలెఁ గఠినమైనది.

వజ్రహృదయము. సం. వి. అ. న. వజ్రము వంటి మనసు ; కఠిన హృదయము.

వజ్రాంగము. సం. వి. అ. పుం. సర్పము, పాము.

వజ్రాంగి. సం. వి. న్. పుం. వజ్రమయ కవచము. (శ. ర.)

వజ్రాంగిజోడు. (వజ్రాంగి + జోడు.) మి. వి. వజ్రమయమయిన కవచము.

గీ. వత్స నీవు పదాతివి వారు రథికు,లెట్టు పంపుదు నిను మదిగట్టిచేసి, యనిన నీ కృప నాకు వజ్రాంగిజోడు, చింత వలవదు పనుపు మాజికిని ననుచు. జై. భా. ౨. ౫౨.

వజ్రాఘాతము. సం. వి. అ. పుం. ౧. పిడుగు దెబ్బ. ౨. ఆకస్మికదుఃఖము.

వజ్రాభ్యాసము. సం. వి. అ. పుం. (గణిత.) ఒక విధమగు గుణకారము.

వజ్రాసనము. సం. వి. అ. న. (యోగ.) ఆసన విశేషము, యోగులు కూర్చుండు విధములలో నొక భేదము.

వజ్రి. సం. వి. న్. పుం. ౧. ఇంద్రుఁడు. ౨. గుడ్లగూబ.

వజ్రిక. సం. వి. ఆ. స్త్రీ. ములుఁజెముడు. ༒. (శ. ర.)

వజ్రీఁడు = వజీరుఁడు. వి. ౧. వజ్జీరుఁడు, యోధుఁడు.

గీ. కవులముంగొంగు పసొన్ను లోకములకన్ను, పచ్చగుత్తుపువజ్రీఁడు పగటిఱేఁడు ... ఇందు. ౪. ౭౧.

౨. ప్రభువు, ఱేఁడు.

శా. ... విదేహాత్మజా,కాంతుం గోసలమాత్ర ధాత్రికిఁ బలిం గావింప రా జాత్మలోఁ, జింతించెఁ జగ మెల్లఁ దాల్పఁగలజేజేగట్టు వజ్రీనిసై, శాంత స్తంభధురంధరత్వ మెన యించంబూను చేందంబునన్.

చం. రా. ౫. ౩.

**వటకము.** సం. వి. అ. పుం. ౧. భక్ష్యవిశేషము, గారె.

౨. గుండ్రని చిన్నముద్ద, ఉండ, మాత్ర,

**వటగ.** విశే. నేర్పరి. సమర్థుఁడు. (శ. ర.)

**వటపత్ర.** సం. వి. ఆ. స్త్రీ. బొండుమల్లె. త్రిపురమల్లి. శ్రీ.

**వటపత్రము.** సం. వి. అ. న. సితార్జకము. తెల్లతులసి. శ్రీ.

**వటము.** సం. వి. అ. పుం. ౧. మఱ్ఱిచెట్టు ౨. గవ్వ. ౩. చిన్నగోళము; ఉండ, మాత్ర. ౪. పూర్ణబిందువు, నిండుసున్న. ౫. గారె. ౬. జనపత్రాడు. ౭. ఆకారసామ్యము, పోలిక. ౮. (చదరంగములో) బంటు.

**వటర.** విశే. ౧. వదరుఁబోతు, వాచాలుఁడు; వాచాల.

ద్వి. మటుమాయలాడి భ్రమ్మరిగబ్బితొత్తు, వట రయై చంచలవాణి సాఁబరఁగు ...

పరమ. ౪. ౩౨౨. పా. ౨౦. పం.

౨. సమర్థుఁడు, నేర్పరి.

సీ. వటర యంచనఁగ నేర్పరి యన తవ రన దంటనా జాణనాఁ దగు సమర్థుఁడు ...

ఆం. భా. ౩. ౩.

("వటగ" శ. ర. - ప్రాఁత ఆం. భా.)

**వటరము.** సం. వి. అ. పుం. ౧. కోడిపుంజు. ౨. చాప. ౩. తలపాగ. శిరస్త్రాణము. ౪. కవ్వము. ౫. సువాసనగల తృణవిశేషము.

**వటరుఁడు,** సం. విశే. అ. ఆ. అ. దుర్మార్గుఁడు. దుష్టుఁడు.

వి. అ. పుం. దొంగ, చోరుఁడు; బందిపోటు దొంగ.

**వటవట**[1]. వి. ఊఁణించుటయం దగుననుకరణము. (చూ. వటవటనగు.)

జ: వటవటనగు.

**వటవట**[2]. వి. వాఁగుటయం దగుననుకరణము.

వ్యవ. ఎందుకట్లు వటవట వాఁగెదవు.

**వటవటనగు.** అ. క్రి. (√ వటవట[1]) తగ్గు, ఊఁణించు.

చ. కిటకిటనయ్యె నెన్నడుము కేసరిమధ్యకు నాఁడునాఁటికిం, బుటపుట నయ్యె నారు కడుఁబొల్పు వహించెఁ దనూలతాగ్యకుల్, నిటనిటనయ్యె సోలను జనించి విశాలవిలోచనంబులున్, వటవట నయ్యె సొంపుగల వాతెఱ కెంపును బూఁటపూఁటకున్.

పి. శకుం. ౪. ౫౪.

**వటాకరము.** సం. వి. అ. పుం. దారము. త్రాడు.

**వటారము = వటారు.** వి. నగరు.

క. అని వర్ణించుచు సజ్జాఁ,సనుఁడు సుధాంధసులుఁ దాను సపులకకలికాఁ, తనులై తత్కుధరాగ్రం,బునకు నరిగి వారువటారము గనుంగొనుచున్.

వరాహ. ౬. ౭౭.

ద్వి. వడి ద్రేయ వచ్చినవారి వారించి, ఫుడమిఁ కుఁ డాతనిపోలికఁ దెలిసి, దరహాస మిసు

రొత్తఁ దనవటారముకు, నరిగి మంత్రులు
కొలదలగువారి ననిపి.

నవ. ౪. ౧౩౧. పా. ౧౬. పం.

**వటారి** = వఠారి. విశ. సమర్థము.

వ. ... వటారితనంబునం గటారులు వెతికి
కొని ... ఉ. హరి. ౬. ౧౭౯.

(శ. ర. పా. "వఠారితనము" - వీరేశ. పా.)

**వటారు** = వటారము. వి. నగరు, రాజభవ
నము.

ద్వి. తల్లి చెప్పినమాట తనమదిలోన, తలపోసి
యప్పుడు తనవటారునకు, వచ్చినపరువడి ...
Pal. 200. (బ్రౌ.)

సీ. ఆవారణాసీపురాధీశ్వరువటారు ఛీకరం
బుగఁ గన్నఁబెట్టి చొచ్చి ...
హరిశ్చ. ౫. ౧౧౨.

(శ. ర. పా. "ఆవారణాసీపురాధీశునగరిలో"
ముద్రి. పా.)

**వటారుబంటు.** వి. నగరు సేవకుఁడు.

ఉ. ... రమణీయవిశాలవిలోచనంబులు, న్జక్రగ
మించు రాసుతుఁడు నాదుకవుంగిటఁ గాపు
రంబున, న్దిక్కుల నేల సేమకరచిహ్నము
వానివటారుబంటుగఁ ...
తపతీ. ౩. ౫౨.

(వఠారు పట్టుగఁ. ముద్రి. పా.)

**వటి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. త్రాడు, దారము.
౨. ఉండ; మాత్ర; పెద్దమాత్ర.

**వటించు.** అ. క్రి. పస్తుపడు, ఉపవసించు.
(శ. ర., బ్రౌ.)

**వటిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఉండ, మాత్ర.
౨. చేదరంగపుబంటు. ౩. భక్ష్యవిశేషము, వడ.

**వటికము.** సం. వి. అ. పుం. చేదరంగపు బంటు.

**వటివేరు.** వి. వట్టివేరు, ఉశీరము.

రగడ. ఏకాంత మని తోలఁగ దిందు నీవఁటె
వేలు, చేకొనవె మున్నాడి చెలువ యీవటి
వేరు ... మనుచ. ౩. ౭౪.

సీ. వటివేళ్లసురటి జవ్వాది పక్కనతట్టు
పునుఁగుఁ బింగాణి కప్పురపుఁగ్రోవి ...
వైజ. ౩. ౭౪.

**వటుకుఁడు.** సం. వి. అ. పుం. ౧. బాలుఁడు,
కుఱ్ఱవాఁడు. ౨. బ్రహ్మచారి. ౩. అవివేకి,
మూర్ఖుఁడు.

**వటువు.** సం. వి. ఉ. పుం. ౧. బాలుఁడు,
కుఱ్ఱవాఁడు.
౨. బ్రహ్మచారి.

**వట్ట**[1]. వి. చెఱకు గానుఁగకు వేసెడి అడ్డమ్రాను.
(శ. ర.)

**వట్ట**[2]. వి. బ. వృషణము, అండకోశము. (బ్రౌ.)

**వట్టము.** వి. ౧. తక్కువతనము, న్యూనత.

సీ. ... ఏడు వాడలవార మేముగలసి, వత్తిల్లు
దుము వాని వట్ట మేమియు లేక ...
హర. ౨. ౧౩౯.

గీ. దానిసెమ్మని మెఱుఁగుఁ దాఁ బూనఁ గడఁగి,
పుత్తడివెలందిచిద్రుపలై ముద్రవోసి, యొఱపి
వట్టంబు వడికాఁగి సెఱయఁజిమిడి, కరఁగి
నీరయిపోవును గలువకంటి.
హంస. ౩. ౧౯౫.

ద్వి. అట్టును గా కుత్తమాధమనదులు, వట్టంబు
దోఁచునే వారాశిఁ గలయ ...
పండితా. దీక్షా. ౭౪. పా.

౨. చిల్లర మార్చునపుడు పెట్టునష్టము, తరుగు.

గీ. ... వట్టమంచనఁగ వెలము, హేయ దీనా
రముఖ భాగధేయసంజ్ఞ ...
ఆం. భా. ౨. ౧౯౨.

గీ. క్రొత్తతిరువాడఁగని ప్రాఁతరూక యంచుఁ, బ్రాఁతహణఁ జూచి నాడెంపుఁబణము టంచు, నాణెమొరయుంచు నొరదైన నాగ రంబు, ధవళిసెడ వెట్టటంచు వట్టంబుఁ దివియు. బహు. ౫. ౧౪.

వట్టి. విణ. (√ వట్టు.) ౧. రిక్తము, శూన్యము, ఏమియు లేనిది.

ద్వి. కఱకంఠు శ్రీపాదకమలంబు మీఁద, తెఱ గొప్ప నీ పూలి తేఁటియై వ్రాలు, నట్టి నీమస్త కం బకట యిచ్చోట, వట్టి నేలను గూల వలసె నేమందు.
రం. రా. కిష్కిం. ౨౧౫. పా. ౨౦. పం.

గీ. తజ్జ్ఞునం దర్గ నగుఁ గవితావిశేష, మజ్జ్ఞునం దేమి యెఱుఁగంగ నగు సమస్త, కనకవర్ణో త్కరంబునఁ గానవచ్చు, వన్నె లెఱుఁగంగఁ బోలునే వట్టిరాత. కు. సం. ౧. ౩౨.

గీ. రమణి మఱికొంతవడిదాఁక రథముఁ జూచుఁ, దరుణి మఱికొంతసేపు కేతనముఁ జూచుఁ, గాంత మఱిమీఁద రథపరాగంబుఁ జూచుఁ, బడఁతి మఱియంతటను వట్టి బయలునూచు. ఉ. రా. ౬. ౨౯౯.

౨. ప్రయోజనము లేనిది, నిష్ఫలము, వ్యర్థము.

చ. హృదయము లెప్పుడు న్గదియకే తఱచౌ వెడ కౌఁగిలింతలున్, గదిగెడు మేలు కార్య ములఁ గల్గక మాటలయందె కల్గు పెన్నగు రులు వట్టి శైత్యములఁ జాలఘనంబయి మందువేసవిన్, బొడలఁగ నిల్చె దంపతుల పొందు లనార్యులపొంగుకైవడిన్.
అను. ౨. ౬౨.

గీ. అని పలికి రెండుమూఁడునా లట్ల యనిపె, నల్లునొద్దకుఁ బుత్త్రిక నపుడతండు, నాది నేభావమునఁ జూచె నట్ల చూచె, వట్టిరాక పోక లొనర్చె వానిసతియు.
కళా. ౪. ౬౪.

ద్వి. వడుగు చేసినభక్తి వట్టి పాటగునె, నోడు వరితనమునఁ గడువనాడెదవు ...
బస. పురా. ౧. ౨౧౯.

గీ. గర్వితారాతిరాజన్యకాండకతిన, కంఠలుం ఠనజాతరక్తాంబుపూర, మజ్జనవ్రతదీక్షాభి మానఘనులు, రావువారలు వట్టివారా తలంప. రంగా. ౨. ౧౦౭.

౩. కారణముమాలినది, నిష్కారణము.

గీ. వెడలిపోయితి నిర్వ్యధి వెంటనరుగు, పెండ్లి వారలఁ జూడ నా చిన్నతనము, గూల నింత టిలో వట్టికోపమెత్తి, తలుపు బిగియించె మగఁ డేమి తలఁచినాఁడో.
శుక. ౨. ౧౩౧.

గీ. మొలకనిగ్గులు వట్టి కొంకులును వలపు, చాటునిలుకడ లలఁతివేసములుఁ జూపు, గడియలో వాని దారునఁ గన్నయపుడు, కొమ్మ మారునిజెంత్రంబుబొమ్మకరణి.
శుక. ౨. ౪౩౪.

౪. శుష్కము, ఎండిపోయినది.

గీ. ఎలమిఁ గూర్చుండి యెలుఁగెత్తి యింపు మిగుల, వట్టి ప్రమాఁకులు చివుళులు పెట్ట నలిప, పాడె ... మార్కం. ౧. ౨౬.

వ. అనికిం దనివిసనక వెనుకం దవిలి వట్టియడవి ముట్టి యేర్చు కార్చిచ్చుచందంబునం జతు రంగబలంబులు బారిసమరిన ...
భార. ద్రోణ. ౨. ౬౦.

ద్వి. కనుఁగొని బసవయ్య కన్నుల నగుచు, వట్టి యాకులు గాలివడిఁ దూలుఁగాక, మెట్టులు తూలునే మేటిగాడ్పునను ...
బస. పు. ౧౯౨. పా. ౨౦. పం.

౫. పాలుడిగినది.

ఉదా. వట్టిగొడ్డు.

సా. వట్టిగొడ్డుతాకట్టు, వట్టిగొడ్డు అరుపుల చేటు.

వట్టికాలు. వి. (వట్టి + కాలు) పిక్క— వెలుపటి కాలు. (శ. ర., బ్రౌ.)

వట్టిపోవు. అ. క్రి. (√ వట్టి.) ఎండిపోవు, వాడిపోవు.

సీ. చెక్కు—పైఁ జేర్చినచిగురుకెంగేలును వట్టి పోయిన యట్టి వాతెఱయును ... హరిశ్చ. ౫. ౭౧.

వట్టిమాట. వి. (వట్టి + మాట) లేనిమాట, అపవాదము. (శ. ర.)

వట్టివరి. వి. √ వట్టి. సస్యవిశేషము, అడవిగోధుమ ?.

బ. ధాన్యవిశేషము, అడవిగోధుమలు. (శ. ర.)

వట్టివేరు. వి. ఉశీరము ?.

గీ. ... వట్టి, వేరునాఁగ నుశీరంబు వెలయుచుండు ... ఆం. భా. ౨. ౭౫.

సీ. మరు వమ్మ నొందింపుమా నన్నుఁ జేపట్టి వట్టివే రేటి కేవనరుహాక్షి ... రామా. ౧. ౧౪౮.

ఉ. ... నేఁపుమీఱఁగ వట్టివేళ్లఁ గావించిన తాళవృంతమున వీచుచునుండె ... నైష. ౬. ౧౧౭.

వ. ... తమతమమేనితావులకుఁ దావలంబగు వట్టివేళ్లసురఁటుల కమ్మనెత్తావులు తాళవృంతానిలంబుల నోలయింప ... ఉ. రా. ౫. ౨౪౮.

వట్టు. అ. క్రి. ౧. ఇంకు.

క. బలరిపుఁడు నాకు నిచ్చిన, యలఘునిశాతముఖశోషణాస్త్రమ్ము విని, గ్గళదవిరళజలధారా, వళినెల్లం దత్క్షణంబు వట్టఁగఁ జేసెన్. భార. అర. ౪. ౬౭.

ఆ. వరము వడసినైన శరము ప్రయోగించి, వట్టఁజేసినైనఁ గట్టినైన, వనధిదాఁటవెట్లు వచ్చుఁబో ... భా. రా. యు. ౧౪.

ద్వి. మడుఁగులు గడువట్టె వఱిగె లోకములు, నిడుములు దఱుచయ్యె నెల్లవారలకు ... రం. రా. ఉ. కాం. ౧౬౪. పు. ౨౫. పం.

౨. శుష్కించు, ఎండు.

క. ఏన చని వట్టిపోయిన, కానలఁ గార్చిచ్చు గాల్చు కైవడి బాణా, సనమున నాసరులను ... భా. రా. యు. ౩౬౨.

వ. ... విప్రప్రయోగవేదనాదూయమానమానసుండై వదనంబు వెఱువట్లు వట్టక ... కాశీ. ౨. ౧౪౧.

౩. కృశించు.

ఉ. ... దుర్వారవిచారభావమున వట్టుచు మోమున దైన్యమొందఁ బూజారివధూటి వచ్చి జలజాయతలోచనఁ జేరి యిట్లనున్. విక్ర. ౬. ౧౨౪.

క. అతుల నిరాహారతపోవ్రత దారుణనియతి నొడల వట్టినరము లున్నతిమై తోఁపఁగ మరణేప్సితమతి నయ్యబల దొట్టి పెద్దయు నార్తిన్. మార్కం. ౮. ౧౩౯.

క. మెట్టక పెట్టక వట్టక, గిట్టక తీర్థముల ముట్టకిం జనరాదే, తొట్టక పొరక యిమ్మెయిఁ, గట్టెదుటను శ్రీ నగంబుఁ గన్నం జాలున్. ద్వా. ౮. ౧౪౦.

ఉ. పయ్యరవట్టె మేఘములు వచ్చుగఁ బాటె నుదఙ్ముఖంబులై ... హర. ౨. ౨౪.

౪. (పశువు)పాలు లేనిదగు.

లయవిభాతి. విసరెఁ బెనుగాడుపులు మసలె జలదాగమము పసిమిచెడె సస్యములు కసవు దినలేమిం, బసరములు వట్టె ... వరాహ. ౧౦. ౨౮.

వి. ౧. పక్క—.

ద్వి. మెడటి వట్టులుగట్టి మెలికలు గొన్న, ముదురుజుంజులు మీసముల నులికొల్పి ... హరిశ్చ. పూ. ౭౦౬౨. పం.

౨. వఱుగు, శుష్కశలాటువు, ఎండుకాయ.

గీ. మనుసు శుష్కశలాటు నామంబు వట్టు, వఱ
గ సంగను ... ఆం. భా. ౨. ౩౮.

3. దూలము లోనగువానికి బలముగ కయి
వేసెడు కట్టు. (శ. ర.)

జః వట్టి, వట్టికాలు, వట్టిపోవు, వట్టిమాట, వట్టివరి, వరువట్టు, వలువట్టులు, వలువట్లు గొను.

**వట్నము.** వి. ధాన్యాదులు నించినగోనె. (శ. ర.)

**వట్ర.** విశే. సం. వర్తులమ్. క. వట్ర. వర్తులము, గుండ్రము. (శ. ర.)

జః వట్రన, వట్రించు, వట్రిలు.

**వట్రన.** వి. (√ వట్ర.) వర్తులత్వము, గుండ్రన. (శ. ర.)

**వట్రపడు.** (వట్రము + పడు.) అ. క్రి. తక్కువగు.

చ. సరియగు నాకు దివ్యశరజాలములం దశ
పోసిచూడ నన్నరుఁడు దృఢత్వలాఘవ
గుణంబులఁ దక్కువ దూరపాతవిస్ఫురణఁ
గతంబు వట్రపడు భూవర సౌష్ఠవరేఖ
నేమియుం, దొరయఁడు ధైర్యశౌర్యపటు
దోర్విభవంబుల హీనుఁ డెంతయున్.
భార. కర్ణ. ౧. ౨౩౧.

గీ. సిద్ధమునికోటి గొనియాడ జిష్ణుబలము, వర్ధ
నము నొందెఁ దమలోన వట్రపడక ...
హరి. ఉ. ౧౦. ౧౫౨.

క. జననాథ యిది శకుంతల, యనసూయారుం
ధతులకు నణుమాత్రం బైనను వట్రపడగు
శీలంబున నీయెడ కింతి ననిచి ప్రవర్తించు
టయున్. పి. శకుం. ౪. ౧౦౯.

**వట్రపెట్టు.** స. క్రి. (వట్రము + పెట్టు.) ౧. తక్కువపఱచు, తగ్గించు. ౨. లక్ష్యపెట్టు.

ఉదా: వాఁడు నామాట వట్రపెట్టఁడు. (శ. ర.)

**వట్రము.** వి. తక్కొకుతిత్తి.

ఉ. మైనపుటంటుపల్వగల మచ్చులచాలొర
గల్లు కట్టెలుగా, దూనిక నాలుగేనొరలతోఁ
దగువట్రములోననున్న నా, నానగరోద్భవం
బులగు నాణెము లుండెడుసంచిఁ గొంచు
బేరానకు వచ్చు సన్నయ ధురంధరుఁ
డంగడికిన్ గణింపఁగన్. శుక. ౧. ౪౨౦.

చ. మెలివడు తీఁగచుట్లజిగిమించినపాగ జెనుంగ
పచ్చడం బలవడు చల్వదోవతి యొయారపు
గందపుఁబూఁతడొల్లు పోగులు మణిముద్రిక
ల్వాలపుగుల్కెడుపీద్యము చంకవట్రమం,
బ్రములసుద ముచ్చెలున్ వెలయుగుప్తగుణుం
డను వైద్యుఁ డొప్పగున్.
హంస. ౧. ౨౩౩.

విశే. హ్రస్వము, పొట్టిది. (చూ. వట్రపడు.)

జః వట్రపడు, వట్రపెట్టు.

**వట్రించు.** అ. క్రి. (√ వట్ర.) తిరుగు, పరిభ్రమమగు.

గీ. వాహనము నెక్కి కైదువులను మిగులఁ,
బట్టి మొనలల నెంతయు భయరసంబు,
గఱి వట్రించు నృపులకుఁ గలుగు భ్రూణ,
హత్యఁబోలుపాపం బని రాదిమునులు.
హరి. ఉ. ౮. ౧౦౫.

**వట్రిలు(ల్లు).** అ. క్రి. (√ వట్రించు.) ౧. ప్రవర్తిల్లు.

చ. నినుఁ గొనియాడ నేర్తు నన నెక్కడి
వెవ్వఁడు శక్తియుక్తుఁ డెవ్వనిమనము
న్మనీషయును వట్రిలు నెవ్వనిజిహ్వపొగ
డే, యనువు ప్రశంసచెప్ప సకలార్థ
సహిష్ణుఁడ వీవు ... హరి. ఉ. ౬. ౫౦.

ద్వి. వంగకాయలు కట్టుకొంగులఁ బొదివి,
లింగసన్నిహితుల భంగి వ్రట్టిల్ల ...
బస. పు. ౨. ౩౯౧.

ద్వి. అక్రాజ్ఞం బొలయ నుదాత్తత వెలయ,
నిక్రంబు సంధిల్ల నియతి వ్రట్టిల్ల ...
పండితా. పురా. ౧౩౪. పా.

౨. కలుగు, జనించు.

క. దమఘోషసుతుఁడు తద్వాక్యవము నూఁచి
సహింప కలుక వ్రట్టిలఁగాఁ బీఠముడిగ్గి
నిలిచి నిజహస్తము లెత్తి మనోభయంబు
దక్రసవాఁడై. భాగ. ౧౦. ఉ. ౪౭౬.

ద్వి. అసవుడు హర్షించి యాశిగ్రజుని, సనిత
పుత్రులునాకు వ్రట్టిల్లిరేని, ఇంబిపేరిడుగు
దాసలి నెందగ్రైన ...
పండితా. మహిమా. ౨౭౪. పా.

ద్వి. పువ్వు వ్రట్టిల్లనోపునొ కంటిపోటొ ...
బస. పు. ౬౬. పా. ౩౦. పం.

౩. తిరుగు.

ఉ. వ్రటువగుబ్బలుం దొగరువాతెఱయుం జెఱు
నవ్వువెన్నెలల్, దొట్రిలుముద్దుమోమును
దళుక్రనుమేను వెడందసోగర్మై, వ్రట్టిలు
కన్నుఁదోయి నిడువాలుఁగురుల్ ...
విజ. వి. ౨. ౮౬.

వ్రటువ. వి. వ్యంజనముతోఁ జేరిన ఋకార
చిహ్నము.

గీ. వ్రటువయు ద్విత్వమును గలవ్యంజనంబు,
ప్రాసమై యుండునెడఁ బెఱప్రాసములకు,
వ్యంజనంబు సమాతురంబైనఁ జాలు, వాని
పై నేస్వరం బైనఁ బూనవచ్చు.
అప్ప. ౩. ౨౯౩.

విశే. గుండ్రము, వర్తులము.

సీ. నడుము వ్రటువగాఁగ వెడఁదయై కఱకెక్కి
యొప్పార వెలసి పేరురము దనర ...
హరి. పూ. ౬. ౧౪౪.

క. తూమెఁడు రసమునకుం దగ్గవామెఁడు
పుండ్రేక్షులతలు వ్రటువగలతా,దామములఁ
గట్టి ... హర. ౨. ౯.

క. అనుటయు రసలింగము నిడు, తనవ్రటువ
ప్రేఁపసజ్జే దంతపుబరణిన్, ...
మనుచ. ౧. ౪౭.

క్రి. విశే. గుండ్రముగా, వర్తులముగా.

ద్వి. సురఁటి వ్రటువగాలి సుడియంగఁ
గ్రిప్ప ... హరిశ్చ. పూ. ౪౭౨.

వ్రటువము స్త్రి. వి. చక్రల. †. (శ. ర.)

వ్రటువసుడి = వ్రటువ, వ్రటుసుడి. (శ. ర.)

వ్రటుసుడి = వ్రటువ. వి. వ్యంజనముతోఁ
జేరిన ఋకారమునకు గుర్తు.

గీ. కొమ్ము ఱకారలు మఱి ద్విత్వమ్ము లగుట,
వానియెడమవి గురువులు వ్రటుసుడులు,
ప్రాణములు గాన వానిడాపలను గల్గు,
నక్రరములెల్ల లఘువులు నిక్రముగను.
అప్ప. ౮. ౮౯.

వఠర. విశే. (వటర ?). సమర్థుడు, నేర్పరి.

ద్వి. వఠరవై కొంచెపువారిపైఁ జూపు, నటన
మాను మందఱ నడవ దెల్లపుడు ...
ద్వి. భాగ. ౭. స్కం.

("ఠపర" కు మాఱు రూపము. శ. ర.)

వఠరము. సం. వి. అ. పుం. నీటికుండ.

వఠరుఁడు. సం. విశే. అ. ఆ. అ. ౧. మొద్దు,
మందబుద్ధి, మూఢుఁడు. ౨. దుష్టుఁడు.

వి. అ. పుం. ౧. బుద్ధిహీనుఁడు, అవివేకి,
మూర్ఖుఁడు.

౨. శఠుఁడు, దుష్టుఁడు. ౩. వైద్యుఁడు.

వఠాణి = వటాణి. విశే. సమర్థము. .

సీ. మకరంద మ్మాని... మై మఱచిన గొనయంబు
వెడ ప్రోయఁ గడిపోని వింటితోడ, జలజ
కేసరరాజిఁ జల్లెడు మూఁకగా దాఁటు
వతారిరథ్యములతోడ, ...
గీ. ... నిండునెలతోడ వలరాజు నిర్జరేంద్రు,
సభకు నేతెంచె భుజబలోత్సాహ మెసఁగ.
ఉ. హరి. ౨. ౧౯౪.

వడ¹. వి. ౧. వేఁడిమి, పరితాపము.
సీ. అడరునిట్టూర్పులు వడచల్లఁగా ముక్కు
పుటము లొండొంట నుప్పొంగి తనర ...
హరి. ఉ. ౯. ౨౨౫.
వ. సత్యభామ సానూయంబుగ వాసుదేవున
కిట్లనియె.
క. కలిగె నొకజాంబవతి కె, న్నెల వడఁబడె
డేల వలపు నీతల వేగెఁ, బులియకు వేస
వతులుగల, పాఁలతులచే పాటువడక
పోరా దనియెన్. ఉ. హరి. ౩. ౧౧౫.
సీ. ఉడివోనివేఁడినిట్టూర్పుగాడుపుల బల్వడలఁ
గంజిగిమోవి వాడువాఱ ...
నీలా. ౨. ౭౩.
మ. కమలాప్తోన్నమదంశుజాలములు దిగ్భాగం
బులం గ్రమ్మినం, గుముదాంతఃస్థితలక్ష్మి
యొండవడసోఁకుల్ పైఁపఁగాలేక పత్త్ర
ముల న్మాటుగఁ జేసి కప్పుకొనియెన్ ...
పారి. ౨. ౬౭.
౨. వేఁడిగాలి.
మ. స్ఫురదారణ్యమహీధరాపరసముద్భూతోగ్ర
జీవానలోత్కరవిస్ఫారశిఖాలిఁ గూడి ...
వీచెవడ ... లోకుల్ భీతిఁ గంపింపఁగన్.
కు. సం. ౬. ౪౯౩.
౩. తాపము.
ఉ. ...నృపాలతనూజుఁడు చిన్నవోయి మధ్యం
దిన వేళ ... అగశపూరిత తోయమందుఁ
దృష్టిం దురగంబుఁ దాను వడఁదేలి మహా
తపభీతి నయ్యెడన్. విక్ర. ౩. ౪౪.
సీ. వేఁడిమి వెదచల్లు వెన్నెల వడకునై చెయ్యి
మోమున మాటు చేసికొనుచు ...
యయా. ౫. ౧౧౭.
ఆ. వేల్పుగట్టుగవుల వెలువడి వడ తెఱ జోదలు
వాఁకనీట జలకమాడి ... పారి. ౪. ౪౪.
౪. శ్రమము, బడలిక.
క. ... కవేర దుహిత్రము, రాళిధ్వను లెసఁగు
గాడ్పు ప్రతివడ యుడిపెన్.
ఆము. ౬. ౯౨.
ఉ. తేలెడుకన్నుదోయి వడదేఱెడు ముద్దు
మొగంబు సారెఁ గై, వ్రాలెడుగొప్ప
కొప్పు వసివాడెడుసన్నపుగాను కౌఁకలం,
దూలెడులేఁత మేను నయి తొట్రిలు నమ్మగ
వాలు ... పాండు. ౩. ౬౫.
వ. వెండియు నక్కుండలీశయనుండు ...
భీతుల వడఁదీర్చుచు నూతులఁ గడతేర్చుచు.
ఉ. రా. ౨. ౬౧.
౫. అంకటిబాధ, క్షుద్బాధ.
చ. ... ఇప్పుడొక్క కాకియుచే వెతఁజెంది నాఁడ
విద్దినమున నీకుఁ గ్గు వడఁదేఱఁగఁ
గర్కరికాఫలావళుల్. శుక. ౩. ౪౧౪.
౬. దప్పి, దాహము.
చ. తొడిఁబడ నమ్మ యక్క యని తూలుచు
దీనత దోయిలొగ్గుచున్, వడమతి సోఁలు
సలవాక్యము లెన్నక ...
ఆము. ౨. ౫౯.
చ. చెలినును మోవిపానకముచే వడఁ దేఱక మోము
మోమునం, బలుమఱు తేర్చి ...
ఉ. రా. ౩. ౧౨౨.
రగడ. కొడిసె తింత్రిణీకులము విదిర్చె, వ్వడ
పింది జనావళివడఁ దీర్చెన్ ...
బహు. ౨. ౧౩.

౨. హిమము, మంచు.

ద్వి. మడువులలోన హేమంతకాలమున, వడఁ
జల్లుతతిఁ బంచవహ్నిమధ్యమున ...
ద్వి. పరమ. ౨. ౫౦. పొ. ౧౬. పం.

విశే. ఉష్ణము, వేడియైనది. (చూ. వడగాలి.)

జ: వడంబలి, వడగాలి, వడగోను, వడదాఁకు, వడఁదేఱు, వడపప్పు, వడపిండె, వడముడి.

**వడ².** వి. గారె.

సీ. పాల్బు మాపాపూపను వడయుఁసంగను ...
ఆం. భా. ౭. ౨౫౫.

సీ. ఖండశర్కర జున్ను కండచక్కెరలు
దోసెలుపడల్సే మెపాసెములతోడ ...
భీమ. ౧. ౬౦.

౨. మిరెపకాయలు లోనగుసంబారువులుచేర్చి చేసినగారె.

సీ. కలవంటకము లిడ్డెనలు వడలప్పుము లతిర
సమ్ములు తేనియలు ఫలములు ...
ఉ. రా. ౬. ౧౨౨.

వ. కలమాన్నంబులు పప్పు లప్పడములున్
గారెల్ వడల్ బూరెలున్, ఫలముల్
చక్కెర లుక్కెరల్ నిగరలుం బచ్చళ్లు
సద్యోఘృతంబులుఁ దేనెల్ పరమాన్న
ముల్, పలురసంబుల్ కూరలు న్మున్నుగాఁ,
గల నానావిధభక్ష్యభోజ్యములు వేడ్కన్
సీత వడ్డించినన్. సమీర. ౫. ౧౧౫.

**వడ.** సం. వి. అ. స్త్రీ. భక్ష్యవిశేషము, గారె.

**వడంబలి.** వి. (వడ¹ + అంబలి) ఒకవిధమైన అంబలి, తాపమును పోఁగొట్టునట్టి అంబలి.

వ. ... పుండ్రేక్షురసపానకంబులు వడంబలి
చేడలు వేపుడుపెనగ లనుపగుగ్గిళ్లు ...
ప్రబంధ. ౧౧౨.

**వడఁకాడు.** అ. క్రి. (వడఁకు + ఆడు. స్వార్థమున.) కంపించు, వడఁకు.

క. సమరాంగణంబు *కడుఘోరముగా నిరు
వాఁగుఁబోరు** రథసంబున ది, క్ష్మమితి
వడఁకాడె ... భార. భీష్మ. ౨. ౫౦.

క. పెడవిలుకుకీర్తిజాలము, వడుపునఁ జంద్రా
తపంబు వాలుటయును మున్నుడుకెత్తిన
డెందముతో, వడఁకాడెడుధైర్య మెపల
వగలఁ బొగులుచున్. భా. రా. యు. ౩౮.

క. పెలఁదికి మన మొనరించెడు, చలువలు రవి
మేనసైన శైత్యము నొందున్, బలుకులు
వేయును సేఁటికి, వలిగొని వడఁకాడుచుండు
వైశ్వానరుఁడున్. వి. శకుం. ౩. ౪౫.

శా. ... వహ్నియత్యంతంబున్ శిశిరత్వ
మొందినను గోత్రాళుల్ వడంకాడినం,
గుంతీసూనునిచేతఁ గర్ణున కనిం గోల్పాటు
వాటిల్లునే. భార. కర్ణ. ౩. ౨౭౫.

**వడఁకు** = వణఁకు. (రూ. వడంకు.) అ. క్రి. కంపించు.

సీ. పడఁతి నీకరములు పట్టంగఁ దివిరి శంకించి
వడంకెడుఁ గేలుసూడు ...
భాగ. విరా. ౨. ౪౭.

ఉ. ఢాక నరాతు లెల్లను వడంకుచుఁ గప్పము
లీకయానతు, ల్గాక ... విప్ర. ౧. ౪౩.

క. మేను గరుపాఱఁ దమి నమ్మౌని జపముఁ
దపముఁ దన్ను మఱచి యనంగ, గ్లానిఁ బడి
కదిసి వడఁకుచు, హీనస్వర మెసఁగఁ
బ్రోవవే నన్ననుచున్. మనుచ. ౬. ౩౪.

క. ఉసురసు రనుచుం బొరలును, గసరును బెగ
దఱిఁగి పెసను గడగడ వడఁకున్ ...
నీలా. ౨. ౭౪.

వి. ౧. కంపము.

సీ. వైవర్ణ్యములు పెంది వడఁకులు దొడరి
యశ్రులు జాఱి గద్గదికలు కడంగి ...
హరి. పూ. ౮. ౧౭౩.

సీ. చిలువమేపరి ఫుల్గు బలు చట్టు పలఁబుట్టు గాడ్పుచే నొదవిన కొర్లవడఁకు ...
ఉ. రా. ౨. ౨౧౪.

మ. బెరసె న్మేన నిగిడ్చినట్లు వళు లుబ్బెన్ దుర్బలాంగంబు లం, కురము ల్వ్రాపె రదంబు లంఘ్రులవడంకు ల్దీఱె వాలారుసై ...
పారి. ౫. ౪౬.

క. శిశిర మసిఁ దెంచె నంతట, నిశలాయతగతి వహించె నెత్తమ్మితెగల్, కుశలత డించె దినంబులు, కృశియించె వడంకుముంచె నెల్లజనములన్.
ఉ. రా. ౫. ౨౭౯.

సీ. వడఁ కనఁ గంపాఖ్య యడరును ...
ఆం. భా. ౧. ౧౪౩.

౨. హిమము, మంచు.

(చూ. వడఁకుగుబ్బలి, వడగల్లు.)

జః వడఁకాడు, వడఁకుఁగొండ, వడఁకుమల, వడఁకుగుబ్బలి, వడఁకుమెట్టు, వడగల్లు, వడగవ్వ, వడవడఁకు, వడవడఁకులుగొను.

**వడఁకుఁగొండ.** వి. (వడఁకు + కొండ.) చేలిమల, హిమవత్పర్వతము.

ఉ. ... కయ్యపుం,బబ్బము లాచరించు మునిఁ బాఱఁగఁబట్టి వడంకుఁగొండ పేరుబ్బడఁగించి ...
రామా. ౧. ౨౬.

**వడఁకుమల.** వి. (వడఁకు + మల.) చేలిమల, హిమవత్పర్వతము.

మత్తకోకిల. ... మరుమేపుకందొర మానుగా, నేటి నీటితపంబుచేసెనొ యీవడంకుమలంచుఁ దా, మాటికిం గొనియాడుచుం జని మన్నుఁజేఁ డట నుండటన్ ...
యయా. ౨. ౪౧.

**వడఁకుగుబ్బలి.** వి. (వడఁకు + గుబ్బలి). చేలిమల, హిమవత్పర్వతము.

సీ. కలశపారావారకన్యకామణి నాఁగఁ గమ్మదమ్మి వసించు గట్టుపట్టి, వడఁకుగుబ్బలిరాచవారికుమారి నా సింగంబు నెక్కుడు సింహతనయ ...
వరాహ. ౯. ౫౭.

సీ. తనమేను గరుపారఁ దమి మీఱి శశిధారి వడఁకుగుబ్బలికన్నె వడఁకుఁ దీర్ప ...
ఉ. రా. ౨. ౨౭.

క. ... ఉడుగక పొడమెడుభయమున, వడఁకులగుబ్బలికుమారి వడవడ వడఁకెన్ ...
హర. ౭. ౭౭.

**వడఁకుమెట్టు.** వి. హిమగిరి.

మ. పడవాలున్ ఘటియింపు మంచు దివిజుల్ ప్రార్థింప నవ్వాహ్నియుం, దొడుకుంద త్తడి జోదు తేజము సుధాంధోవాహినీవారి ని,ల్పుడు నయ్యేఱు వడంకుమెట్టకడ తెల్లం దార్చ నా తెల్లునం, బొడమెన్.
చం. రా. ౩. ౬.

గీ. చారు లెఱిఁగింప వింటి దుర్వారభయద, మైన యీ వార్త నీవు నా యాజ్ఞవడసి, తడయకించుక యిప్పు డివ్వడఁకుమెట్టు,దొర గడియ నేఁగి నీనేర్పు కరము మెఱయ.
పె. శకు. ౧. ౨౩౬.

**వడఁబోయు.** స. క్రి. (వడియన్ + పోయు.) వడిఁగట్టు, వడియఁగట్టు. (శ. ర.)

**వడగల్లు.** వి. దే. (వడఁకు + కల్లు.) బ. వడగండ్లు, వడగండులు. వర్షోపలము, వానకురియునపుడు పడెడిరాయి, వానరాయి.

మ. వడి నమ్మేఘచయంబులం దొరఁగు దుర్వారాద్భుతాసారముల్, వడగండ్లుం బెరయంగఁ దీవ్రవిసరద్వాతూలుతోఁ గూడి ...
హరి. పూ. ౭. ౧౬౪.

చ. తరుణులు చంచలాలతలు తత్కరఖాండని కాయ మంబుదోత్కరములు పాలుఁ జేనెలు ఘృతంబులు వానల ఖండ ఖండ శర్కర

లును ద్రాక్షపండ్లు వడగండ్లును శోభనభుక్తి వేళ దొల్కరిసమయంబు; పేరెలమిఁ గైకొనకుండునె భోక్తృసస్యముల్.
నైష. ౬. ౧౨౧.

వ. అప్పటప్పటి కుప్పతిల్లు కప్పురంపుటురవడి వడగంటి చాలు నేలుకొన ...
సమీర. ౬. ౧౫౨.

క. పుడమిఁ దనయాజ్ఞ సేకొని, నడపిన దంపతులమీఁద నలి మరుఁ డింపేర్పడఁ బుష్పవృష్టిఁ గురిసిన, వడువునఁ దొలువాన గురిసె వడగండులతోఁ. కు. సం. ౬. ౮౫౫.

సా. దరిద్రుఁడు తలఁగడిగిన వడగండ్లవాన.

**వడగవ్వ.** వి. (వడఁకు + గవ్వ.) మత్స్యవిశేషము. (శ. ర.)

**వడగాలి.** వి. (వడ¹ + గాలి). వేసవియందు పడమరనుండి వీచునిప్పుగాలి.

సీ. వడగాలియైన నప్పడఁతియూర్పుల చెంతఁ బరఁగిన మలయాద్రి పవనుఁబోలు ...
భా. రా. అర. ౨౪౮.

సీ. తనలోన బడబాగ్ని దరికొని మండియు వడగాలి మీలపై సుడియనీక ...
ద్వా. ౨. ౧౯౦.

సీ. పగలింటి ..., వేసవి వడగాలి నోసిన లేఁదీఁగ క్రొక్కారుఁ గని మవ్వమెక్కినట్లు ... కు. సం. ౪. ౮౯౪.

**వడగొను.** అ. క్రి. (వడ + కొను.) వేసవిని వీచు నిప్పుగాలిచే తాపమునొందు.

ఆ. అకట మనము వచ్చినది గడుదవ్వ నేఁడప్పూరంబు సొత్తమని తలంచి, తఱిమి నడచితిమి లతాతన్వి యిది వడఁగొనియె మోచి తెమ్ము కొంతదవ్వ.
భార. విరా. ౧. ౧౫౧.

**వడచే - వడుచే.** స. క్రి. (√ వడియు). పోయు, కార్చు. (శ. ర.)

**వడదాఁకు.** అ. క్రి. (వడ + తాఁకు). నిప్పుగాలి సోఁకు.

క. కొండవడ దాఁకి వాడి యొక్కొండును దెస లేక యేడ్చు కోమలతను నాఖండలసమానుని శిశువు, నిండినకృపగోరి చేరి నెఱి నంబుదముల్. హరి. ఉ. ౯. ౯.

క. ఉడురాజదీధితులఁ దిరు, గుడుపడి తపియించుచును శకుంతల యుండెన్, బుడమి జనంబులు వెన్నెల, వడదాఁకనుమాట నిక్కువం బై యుండెన్.
పి. శకు. ౩. ౧౪౮.

**వడఁదేఱు.** అ. క్రి. (వడ¹ + తేఱు.) శ్రమనొందు.

ఉ. తేఁకువ దప్పి దప్పి వడదేఱెడుఁ గన్నులు మున్నువంటియా, తూఁకువ లేక మేను గడుఁ దూలియయున్నది ...
పి. శకుం. ౩. ౬౯.

**వడదోలు.** వి. (వడము + తోలు) ౧. గవుండ్లవాఁడు మొలకు కట్టుకొనెడు నిడుపుతోలు.

క. మోకును నిచ్చెనయును దా, టాకులబందంబు మెత్తనగువడదోలున్, జోకగుకత్తుల దొనయును, దూకంబునఁ బూని నిల్చెఁ దొయ్యలియెదుటన్. సుం. భాం. ౫౮.

మ. మొలచుట్టున్ వడదోలు ... తనరఁ బ్రాతఃకాలమం దెప్పుడున్ ...
చెన్న. ౫. ౨౫౨.

౨. వేఁటకాఁడు శరీరమునకుఁ గప్పుకొనెడు నిడుపుతోలు.

క. వడతోళ్లను ముప్పిళ్లును, నడిదంబులు వెడఁదవాలియలుఁగుల పొదలున్, దడ

వింట్లుఁ బంగిగోళ్లను, గడలుం ధరియించి
భటులు కెలఁకులఁ గొల్వన్.
భల్లా. 3. (శ. ర.)

**వడప.** వి. కొబ్బరి మొ. చెట్ల మొదళ్లను చుట్టి యుండు వలవంటికప్ప. (బ్రౌ. ని.)

**వడపప్పు.** (వడ[1] + పప్పు.) శ్రమపరిహారార్థమై నానఁబెట్టిన పెసరపప్పు.

సీ. ... కప్పులేతీసి వడపప్పుతోడ ...
ఆము. ౨. 83.

సీ. బడలినవారికి వడపప్పు పానకా లనఁటి పం డ్లొపినయన్ని గలవు ...
ప్రబంధ. ౫8.

**వడపిండె.** వి. (వడ[1] + పిండె) ౧. తాపము తీఱుటకై వాడెడు ఊరఁబెట్టిన మామిడిపిండె.

చ. అరుణగభస్తిబింబ ముదయాద్రిపయిం బొడతేర గిన్నెలోఁ, బెరుగును వంటకంబు వడపిండెలునుం గుడువంగఁబెట్టి ...
కాశీ. ౪. ౧౧౪.

(వడపిండెలను విశాఖమండలమున నీరు కాయ లందురు.)

చ. పలుచని యంబళుల్ చెఱుకుపా లెడనీళ్లు రసావళుల్ ఫలంబులును సుగంధి శీతజలముల్ వడపిండెలు నీరుఁ జల్లయున్ ...
ఆము. ౧. ౬౧.

రగడ. కొడిసె తింత్రిణీకులము విదిర్చెన్, వడపిండె జనావళివడఁ దీర్చెన్ ...
బహు. ౨. ౧౩.

౨. వేఁడిచేత రాలిపోవు పిండె.

క. ఏల పలుమాట లనిమిష,పాలక యొల్లింట నేఁట ఫలియించు తరు,త్తాలతపఃకల్పకమున, రాలెడువడపిండె నీదురాజ్యం బనఁగన్.
కవిక. ౬. ౪౭.

**వడపు.** వి. కొండపై పఱుకుక్రింద నుండు గుహవంటి చోటు. (బ్రౌ. ని.)

**వడపోయు.** స. క్రి. (√ వడియు.) వడియఁగట్టు, నీళ్లలోనగునవి గుడ్డతో తేర్చు.

వ. వడపోసినట్లున్న కన్నెలనిగ్గు నాటుకొన్నట్లు విరహపాండురంబగుతనువు తనపయిం జేర్చుకొని ...
మృ. వి. ౨. ౭౪.

**వడభి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ = వలభి.

**వడము.** వి. దండ.

సీ. ముత్తియములు, కట్టువడంబులు గట్టినూళ్లను సుద్ది సరితేఁగ మినుకులు సందిదండ్లులు.
దశకు. 3. 88.

ద్వి. తిరముగా నిడుపట్టైతిరునామములును, దిరుమణి వడములుఁ దిరుచూర్ణములును, ...
ద్వి. పరమ. 3. ౧౬8. పా.

జ: వడదోలు.

**వడముడి.** వి. (వడ[1] + ముడి) (శత్రువులకు) తాపము కూడించుచోటు, భీముఁడు.

సీ. వడిముడియును నీవు వాయువాసవుల శక్తులు ధరియించిన దుర్జయులరు ...
భార. శాం. ౧. ౧౪౦.

క. ... వడముడి యరిగిన తెరు వేర్పడఁగని వేవేగ రథము వఱపెం గరియన్.

వ. ఇట్లు భీమసేనుఁ జేరంబోయి ...
భార. భీష్మ. ౨. 3౬౯.

సీ. పెనఁగి వాయుతనూభవుని నిర్వ్యథమ్ముగాఁ బడవేయ నవ్వడముడియుఁ గినిసి ...
హై. భా. ౨. ౬౫.

**వడలు.** అ. క్రి. పుష్పాదులువాడు. (శ. ర., బ్రౌ. ని.)

**వడవడ.** వి. వడఁకుటయం దగు ననుకరణము.

గీ. ధూళి పెల్లుగ నెగయంగ నేల గోడి, వడఁగఁ
జనుమూఁకఁ గని వడవడ వడంకి ...
భార. విరా. ౫. ౨౮౬.

క. వడవడ వడఁకుచుఁ గ్రమ్మఱ, నడుగుల పైఁ
బ్రాలి రో మహామతి యే నెక్కడ కర్మ
శేష మెక్కడ, వడలింపఁ గదయ్య దురిత
విషనిధి వలనన్. భోజ. రా. ౩. ౭౮.

గీ. గొఱగొఱం జను పందుల ఘుర్ఘురంబు, బెడిదములఁ బుడమిఁ దూఁ వడవడ వడంక, నెపుడు
నెడయూని చీకట్ల నివము గొనుచు, నొంటిఁ
జొరరానియట్లుగా నుండె మఱియు.
యయా. ౧. ౪౪.

**వడవడఁకు.** వి. (వడఁకు + వడఁకు.) మిక్కిలి వడఁకుట.

సీ. వడఁకనఁ గంపాఖ్య యడరును వడవడఁకన
నతికంపంబు దనరుచుండు.
ఆం. భా. ౧. ౧౫౩.

(చూ. వడవడఁకులుగొను.)

**వడారము.** క్రి. విశే. బొత్తిగా. (శ. ర.)

**వడవడ(ఙ)కులుగొను.** అ. క్రి. (వడఁకు + వడఁకు + కొను.) మిక్కిలి వడఁకు.

క. కుడిచేత మాంసఖండము, లెడకేలను మద్య
రససహితమగు కంచుం, గుడుకయు ధరించి
ముదమున, వడవడఁకులు గొంచు నతఁడు
వచ్చెం గుడికిన్. శివరా. ౪. ౩౭.

**వడసాలె.** వి. తంతువాయ భేదము, సాలీలలో నొక తెగ.

వ. ... కమ్మరి వడ్రంగి కాసె కంచర
యగసాలవారును ఆణికారి వడసాలె సాలె
పాతుపాతీన సాతాని కటిక వారును ...
హంస. ౩. ౨౭.

**వడి[1].** వి. ౧. వేగము.

చ. ... వడిగొని వార్ధి నిట్లు దరువం దరువన్
విషముద్భవిల్లి ... భార. ఆది. ౨. ౧౫.

క. ఆ రథనివహంబులు స, వ్యాపసవ్యములఁ దిరలి
మరలి వడిఁ బఱచుటయున్ ...
భార. భీష్మ. ౨. ౨౯౪.

ఉ. ... కృతాభ్యసనలోటను దంతపుమెట్ల
వెంబడిం, జేవడి వీణె మీటుటలు ...
ఆము. ౧. ౬౨.

(చేవడి = చేతివేగము.)

క. కావేరి దరులు గట్టంగ, వేవే పల్లవుండు
దనదుపెట్టికి రామినిం, ద్వా వానినుగుటి
కనువోం, గా వడింగరికాలవిభుండు గాలం
దుడిచెను.
కొణిదెనశాసనము. శ. స. ౧౧౪౬.

౨. శౌర్యము.

చ. ... ఎంతయు భీతిఁబొంది రా, హరియు
నరుండు గర్ణువడి కంత విధాతృఁడు దప్పె
వానికిన్ ... భార. కర్ణ. ౩. ౩౮౮.

క. ఉడుపతి దరమిన వడిచెడి, గుడిగుండంబుల
మరుంగుగొని యలశశియున్, బడపఁటి
కరిగిన వెనుకను, బడి చనుతమమనఁగ నీడ
ప్రాగ్దిశఁ దిరిగెన్ ... రా. వి. ౩. ౨౨.

సీ. విభవంబు గలనాఁడె వెనువెంటఁ దిరుగుట
వడియున్ననాఁడె మావార లనుట ...
రామ. శ. ౮౮.

౩. శక్తి, సామర్థ్యము.

క. తడి గంట నెపుడుఁ దఱుఁగక, కడి దఱుఁ
గఁగ వడియుఁ దఱఁగి గాసిం బుడమిం,
బడిసఁ గనరాక మంచేపుఁ, దొడుగఁ జల్లై
రట్టె రుజలతో నేమందున్.
భానుచ. ౩. ౧౩౧.

శా. అన్నా నే ముదివాఁడ లేవ వడి లే
దెందెందో నీ వేఁగఁగా, సన్నాహంబున
వచ్చినాఁడవు గదా ... సమీర. ౮. ౬౫.

ద్వి. దడదడఁ దాఁకుచుఁ దగులుచు మతికి, వడిదెచ్చుకొనుచుఁ బోవక నిల్చు కొనుచు

పండితా. వాద. ౨౦౨.

౪. తైక్ష్ణ్యము.

క. ఎండవడిచేత వాతెఱ, యెండ వడి న్నడచి మారుతేరితలహరీ, మండలతాండవఖండన, పాండిత్యమునం దనర్చుపాటేటిదరిన్.

పరమ. ౪. ౨౨౩.

౫. కాలము.

సీ. వడిసావి యెఱుకు విన్ బడి గంటబలుమబ్బు కొక్కు గుంపుల కిడ్డ కొఱుకులనఁగ ...

చంద్రా. ౫. ౫౨.

క. ఇంత యెఱుంగవు సైన్యము, లింతవడిం దలలు చీర లెఱుఁగక మోహో, క్రాంతులు బులయ్యె ... భార. విరా. ౫. ౨౧౫.

సీ. వల్లభ చూచితే వైధవ్య మెక్కెంత వడి యైనఁ గైకొన వలసె నాకు ...

భా. రా. యు. ౩౯౨.

క. వెడఁగుపడి యచటఁ బెద్దయు, వడి నిలిచి తలంచుకొని యవశ్యంబును నిప్పు డితనిఁ దెగఁ జూడక చొప్పడునే యావిప్రశిశువు ప్రాణం బనుచున్. నిర్వ. ౧౦. ౭౮.

సీ. ఇందిరాధిప నాకు నింక నొక్క విచిత్ర రూపవిలాసంబు చూపు మనినఁ, దాప సోత్తము నన్నుఁ దప్పక యించుకవడిఁ జూడు మన మానివరుఁడు నట్లు చూడంగ ...

పరాహ. ౯. ౧౧౧.

(కాల మనునర్థమునం దిది ఇంచుకాదిశబ్ద పూర్వకముగానే ప్రయోగింపఁబడు. ఉ. ఇంచుక వడి.)

౬. దారము మొదలగువాని పిడి.

సీ. నులిగొన్న చెలఁగి పుర్వులనూలిపట్లునా సమగెడు ముడుతకన్పొమలవలన ...

కళా. ౩. ౭౩.

క. వడి దారము చెవులుం ద్రొక్కుడు పల కయు దిండు కదురు గుంజులునుం ద్రొక్కుడుబొమ్మయునుం ద్రిప్పుడు, ఫుడకయునుం గలుగు రాట్నములు గైకొను చున్. శుక. ౨. ౪౧౯.

చ. ... శాటిసెన్నడుము బిగించి పాగజతనంబునఁ గైఁగరమంటి మీసముల్, వడినిడి యంగి చేతులెగవైచుచు వచ్చి రమాత్యులత్తఱిన్. రా. వి. ౫. ౩౭.

౭. పురిబిగువు. (శ. ర.)

౮. పురిబిగువునఁ బడుచిక్కు. (శ. ర.)

౯. వడియఁబోఁత.

ద్వి. కడివోనిపన్నీటఁ గడుఁబెక్కుమార్లు, వడులు దేరిచి మించ వాసనం గట్టి, ... నవనీతంబుచాయఁ, గలిగి వెన్నెలసోగకణికలో యనఁగఁ, దెలివొందు నిడువాలు తిరుమణుల్ ...

ద్వి. పరమ. ౧౭౭. పా. ౧౦. పం.

౧౦. కొన్నియెడల నిది వాక్యాలంకారముగా నుపయోగింపఁబడును.

సీ. వాహినియగు దానివడి మూఁట గుణియింపఁ బృతనా నాఁ బరగు ...

భార. ఆది. ౧. ౭౦.

## విశేషప్రయోగములు.

౧. వడిగుప్పిగంతులు. బ. బాలక్రీడా విశేషము.

సీ. వామనగుంటలు వడిగుప్పిగంతులు చెఱకుల పందెముల్ చిమ్మనాయి ...

హంస. ౩. ౧౪౬.

క్రి. విశే. వేగముగా.

చ. కడుపున శూలయెత్తి వడి గాసిలి ప్రాణము లేఁగునట్లయై, లొడిఁబడ ...

హంస. ౧. ౨౫౪.

లొడ్డికొని వాతలువిచ్చి ఖరాగ్రపాతనం, బుడమిఁ బగుల్చుచుఁ ...
హరి. పూ. ౬. ౨౭.

క. ఎడఁబడక యహోరాత్రులు, వడిగొని చదివింప నిట్లు వలయునె శిష్యుల్, గడునిద్ర లేమి సెంతయు, జడమతులై చదువుదప్పఁ జదువుచునుండన్. భార. ఆర. ౩. ౨౩౭.

౨. మెలిగొను.

"వడిగొన్న సరులతో" క్షేత్రయ. (శ. ర.)

౩. వడియు, కాఱు, స్రవించు.

వ. మృదుదళపుటాంతరంబుల వడిగొనిన తేట తేనియన్ ... వసు. ౪. ౨౩.

**వడిగొలుపు(ల్పు).** స. క్రి. (వడి[1] + కొలుపు.) వడిగొనఁజేయు, మెలిపెట్టు, వడివేయు.

మ. బలుమీసల్ వడిగొల్పుచున్ బిగువుతోఁ బౌలస్త్యుఁడు ... ఉ. రా. ౫. ౨౦౦.

సీ. వడిగొల్పి యొక కేల ముడిచిన క్రొమ్ముడి గొబ్బునఁ గటిఁ జుట్టుకొన్న చేలము ...
కాశీ. ౧. ౪౭.

**వడిచుట్టు.** వి. (√ వడి[1]). చిక్కు, ఇక్కట్టు.

ఉదా. ఈమధ్య వానికి చాలవడిచుట్లు వచ్చినవి.

**వడిపె(వె)ట్టు.** స. క్రి. ౧. మెలిపెట్టు.

ద్వి. గొనకొని వడిపెట్టు కోకచందమునఁ, బని లేనిసెలసులు వట్టఁ దొడంగె ...
హరిశ్చ. పూ. ౧౪౨౩.

చ. చెలఁగికటారి బిత్తరము చిమ్మ వికారపు నవ్వు నవ్వు మీసలు వడిపెట్టు నూరకమ జాయనుఁ డ న్ననయంబు
విక్ర. ౭. ౧౭.

సీ. తతితీపు పుట్టించి తక్కచేకొసెల్లవడి వెట్టిరాఁడీగయువారిఁ జూచి ...
విప్ర. ౪. ౧౬.

వ. కోటికత్తైలు పుడికినం దేఁటిదాఁటునకు సెరసులేకుండ నొడికంబుగా వడివెట్టిన నావికుప్పలంబోలె నొప్పి పూచినయశోక భూజాత పోతంబులును ...
కేయూర. ౪. ౫౦.

౨. నులుము.

సీ. గీ. అలుకచేనుండ బుగ్గలు నులిమి త్రిప్పి, తొడలు వడిపెట్టి కోదండ మదరఁ గట్టి, రెట్టలెగఁబెట్టఁ బట్టించు గుంజుమాపుఁ, గొట్టిబెట్టఁగ సజ్జన కోలదెగను.
హంస. ౩. ౧౪౧.

**వడియఁగట్టు.** స. క్రి. (వడియన్ + కట్టు.)
క. ఒడిఁగట్టు.) వడియఁబోయు, వడిఁగట్టు.

సీ. తగువాసనావాసితములైన పచ్చళ్ళు వడియఁగట్టిన యూరవాలపెరుఁగు ...
విక్ర. ౪. ౧౭౭.

**వడియఁబోఁత.** వి. (√ వడియఁ బోయు.) వడియఁబోయుట. (శ. ర.)

**వడియఁబోయు.** స. క్రి (వడియన్ + పోయు.) బియ్యములోనగువానిని కడిగి నీళ్ళుపోవు నట్లుంచు. (శ. ర.)

**వడియము.** వి. (సం. వటకః.) (ప్రా. వడయు.) వటకము, భోజనములో నంజుకొను వ్యంజన విశేషము.

చ. ... నాలుగేన్, పొగపిన కూరలు వ్వడియముల్ వరుగుల్ పెరుఁగున్ ఘృత పుతిన్ ... ఆము. ౧. ౭౦.

వ. ... పచ్చడులుం గిచ్చడులును బజ్జులుం గిజ్జులును వడియంబులు గడియంబులును ...
కాశీ. ౭. ౧౭౫.

వ. ... వలుగులు వడియంబులు పెగుఁగువడియంబులు ... హంస. ౧. ౧౦౫.

**వడియు.** అ. క్రి. ౧. కాఱు, స్రవించు.

క. అత్తఱిఁ గడుఁ బెల్లుగఁ గ్రొన్నెత్తురు వడియుటయు నతఁడు నిర్భరమూర్ఛాయత్తుఁ డగుడు ... భార. కర్ణ. ౧. ౧౯౬.

చ. కడఁక దలిర్ప నీవు మధుకైటభదైత్యులఁ జక్రధారచే, మెడలు దెగంగ వ్రేయు నెడ మిక్కుటమైన తదీయరక్తముల్, వడిసిన రోడికల్ నెరయ వ్రాసిన లత్తుకభంగిఁ జోద్యపుం, దొడవుగ నొప్పు నీతొడవు తోరపుటొప్పుఁ దలంతు మాశ్వరా. నృసిం. 3. 33.

క. ఆ డిసఁ గూడిసకినుకన్, నీడిసజడముడియుఁ బోగలు వెడలినచూపుల్, షోఁడిమి గొను నిట్టూర్పులు, వాడినదొండమును మేనవడియు చెమరునై. పాండు. ౫. ౨౦౪.

సీ. కుచసురాద్రి గరంగ ఘోర తాపార్చినా వడియు పుప్పొడి తోడివలపుఁజెమట ... వసు. 3. ౧౧౦.

క. గడగడ వడఁకుచు నశ్రులు, వడియఁగఁ జేదోయి మొగిచి స్వామీ కోపం, బుడుగుము శాపంబునకున్, విడుమర యెన్నఁడగుఁ జెప్పవే కృపతోడన్. భోజరా. ౬. 3౪౯.

క. తలిరులతుదఁ జినుకులుజల, జల వడియఁగఁ దడిసి మెలఁగు చలికరువలి న్పొన్పొలప మున విరియు పరువపుఁ, దొలుమొగడల వలపుదెలుపు తోటలలోనన్. పారి. ౫. ౧౦3.

౨. ఇంకు, శోషిల్లు.

సీ. దళితారిరక్తాపగలు నిండి పాలమి వారిధులిటమీఁద వడియుకున్న ... రాజ. చ. ౨. ౧౨.

3. కృశించు, చిక్కు.

సీ. గీ. వడియు నెమ్మేని కొక వింత బెడఁగు నెఱపు, సరిగ చెంగావిసాపడ చలువవలువ, చెలువు గులుకంగ ... దశా. ౭. 32౭.

జ: వడఁబోయు, వడచు, వడపోయు, వడిఁగట్టు, వడిఁబెట్టు, వడియఁగట్టు, వడియఁబోఁత, వడియఁబోయు, వడుచు, వడుపు.

**వడిఎక్కు.** అ. క్రి. (వడి[1] + ఎక్కు.). వడిగొను, మెలిపడు.

క. విడువని యభ్యసనంబున, వడిఎక్కిన స్నేహమాత్ర పల్లులఁ బెనుపం, బడిన ఘన మోహపాశము, విడిపించు కొనంగలేక వేఁగెద ననిశన్. ప్రబోధ. ౫. ౨౭.

**వడిలము.** సం. వి. అ. న. = బడిశము.

**వడివడు.** అ. క్రి. (వడి + వడు) వేగముచెడు.

మహాస్రగ్ధర. ... పాండురంగా, వనిఁబౌనః పున్యజన్య వ్యవహృతిఁగన వేవంకదుప్పంక శంకన్, నరరాశింజొచ్చు నేగ్ణ వడి వడియడఁగన్ వారిజభ్రూణమూతీ ... పాండు. 3. ౧౨౭.

**వడివేయు.** స. క్రి. (వడి + వేయు.) వడిపెట్టు.

వ్యవ. వాఁడు దూరక మీసలు వడివేయుచున్నాఁడు. (శ. ర.)

**వడిసెల** = ఒడిసెల.

ఁ. వడిసెలచేతఁ బట్టుకొని వాఁడిరి చక్కని పైట జాఱఁగా ... దొడదొడ మంచె మెక్కి నొకదొడ్డ మిటారపు రెడ్డి కూతురున్ ... వీధినాటకము. 3౦. ప.

**వడుకు.** స. క్రి. కదురు మున్నగువానిని త్రిప్పి దూదిని నూలుగా తీయు.

సీ. కాలచక్రముఁ ద్రిప్పు కమలనాభునిశక్తి నా నూలు వడుక రాట్నంబుఁ ద్రిప్పు ... శుక. ౨. ౪౧౦.

ఉ. ప్రత్తిని గ్రోఁజుచున్ వడికి బ్రాహ్మణుఁ
డిచ్చుపవిత్రతంతువుల్ ...
ఉ. హరిశ్చ. ౪. ౩౦.

సీ. సంతలోఁ బత్తిబిచ్చముల్త్తి నూలాలు
వగల జన్నిదములు వడికివడికి ...
శుక. ౪. ౧౦౯.

జ: వడుకుడు.

**వడుకుడు.** వి. (√ వడుకు). వడుకుట. (శ. ర.)

గీ. వడుకు దనఁగను దంతుసంభవనహేతుక
క్రియ ... ఆం. భా. ౨. ౨౯౪.

**వడుగఁడు.** వి. (సం. వటుకః.) (ప్రా. వడుఓ.)
బ్రహ్మచారి.

ఆ. గోఁచి బిగియఁగట్టుకొనిన యావడుగని,
మత్తికాని రతికి వరపవలదు ...
భాగ. ౯. ౬౭౭.

క. వడుగఁడవై మూఁడడుగులు, అడిగితివౌ
భళిరభళిర ... కృష్ణ. శ. ౪౧.

**వడుగు.** వి. (సం. వటుః.) ౧. వడుగయిన
బాలుఁడు, బ్రహ్మచారి.

క. ఒడల నసలుకొను నెత్తురు, గడిగి రఘూద్వ
హుని సమ్ముఖముచేయుదు నివ్వడుగు నని
తన రథముపై, నిడుకొని చనియె స్మఖాశ్వ
మేఁగెడు దెసకుఁ. జై. భా. ౬. ౧౨౭.

గీ. దబ్బ వ్రేలి యుంగరము మేధావిబొట్టు,
వడుఁగు పేలిక తన కెడవడుగుగాఁగ ...
హరి. ఉ. ౧౦. ౨౩౩.

ఆ. బ్రహ్మమైనఁ గూఁతుఁ బట్టకమానఁడు,
వడుగు కింతి పొత్తు వలదు వలదు ...
భాగ. ౩. ౪౨౨.

గీ. వలుగుదామెనఁ బెనచిన గళముతోడ,
జంట వెన్నాడు క్రేపులోఁ జాల నలసి,
వడచు ధేనువు నొకచిన్న వడుగురొప్పు,
నయుతు నాశ్రమవాట మయ్యతిథి కాని.
పాండు. ౫. ౧౯౦.

౨. ఉపనయనము.

సీ. సంక్రాందు మొదలు నిర్వదినాళ్లుతుదగాఁగ
వడుగు చేయఁగఁ దగు వైశ్యులకును ...
విజ్ఞా. ఆచా. ౧౭.

ద్వి. వడుగని యిదియేమి గడియించె దీవు,
జడుఁడవై శ్రీ తిపీశ్వరుని గొల్చియును ...
బ. స. పు. ౧. ౪౨౭.

ఆ. ముద్దుకొమరు లెలమిఁ బ్రొద్దు ప్రొద్దున
నొక్కొక్కవన్నె యలరఁ బెరుగుచున్న వడుగు,
లవను మెఱయఁజేసి చదువుసాములు మెఱ,
గ్గలుగు విద్దె లెల్లఁ గఱపి యంత.
అచ్చ. రా. బాల. ౭౬.

**వడుచే = వడచే.** స. క్రి. (√ వడియు). ౧.
నూనెలోనగు వానిదించి.

సీ. అలఁతి దంతంపుఁ గామలకీలి సురటులు
శోధించి వడిచిన జూంటితేనె ...
పి. శకుం. ౧. ౯౭.

సీ. కలువపువ్వాళ్ల చేఁగసటైన వెన్నెల వలిప
వెన్నలలోన వడిచితేర్చి ... పారి. ౨. ౪౭.

౨. కార్చు, స్రవింపఁజేయు.

సీ. తళుకు నిద్దంపుటద్దపు మోముకళదప్పి
వలవలకన్నీరు వడువకమ్మ ...
అని. ౨. ౭౬.

**వడువు.** వి. (√ వడియు.) వడియుట.

గీ. బుగులుకొను నావి సిరముకప్పురముతోడ,
వడుపు దివ్వని ఘుసృణ ద్రవంబుతోడఁ;
బొందుగామేళవించిన చందనంబు, నాతి
కొండొక కలకంఠి నలుగుఁబెట్టె ...
వేం. పంచ. ౪. ౩౧౦.

చ. కరఁగినడెందముల్ వడువుఁగాని కోర్కులు
పారవశ్యమున్, బొరసిన మిట్టచూపులు ...
పాండు. 3. ౯౯.

(విడువుఁగానని - ముద్రి. పా.)

**వడువు[1].** వి. విధము, రీతి.

క. ఉరగమువై యుండి మునీశ్వర వేషము దాల్చి
యున్న వడువెంతయు నచ్చెరువిది ...
భార. ఆది. ౧. ౧౫.

క. అడవులదవశిఖదరికొను, వడువున నిట్లరి
బలంబవారణఁబొడిగా, నడరియతఁడాతె.
భార. ద్రోణ. ౧. ౪౪.

క. తొడిగిన కుప్పస మూడ్చిన, వడువున
నా రాజు ... భోజరా. ౧. ౧౩౪.

సీ. వేలావనమునందు విలసిల్లు విద్రుమవల్లిక
యుదయించు వడువునోలె ...
కు. సం. 3. ౨౪౨.

క. బొత్తెంచి రామువడువఁబొత్తిన చంద
మునఁ దనువుఁబొప్పఁగ రూపా, యుత్తంబు
లైన జనముల, చిత్తములు వికాసమొంద
సీతా తనయుల్ ... నిర్వ. ౧౦. ౧౧౭.

క. వనవాసము సేసియుఁ ద్రిఘవన రాజ్యము
సేయునట్టి వడువున సంతోషనిబద్ధబుద్ధి
యగు యమ, తనూజునకు భక్తినెఱిఁగి
తానిట్లనియెన్ ... భార. ఆర ౧. ౬౬.

సీ. కడుఁజిట్టినట్టి బంగరుపూఁత పొక్కిళ్ల
వడువుఁజూపెడు మేనివళులవలన ...
కళా. 3. ౯౧.

వ. ... ఫణిభూషణున కర్దురవస్త్ర నుడువన్
బరువువిడుచున్న పశువున దవ్వుల మిడిసి
పడ ... ఉ. రా. 3. ౪౭.

గీ. ... వాసవుఁడు బలఁడును బోరువడువు
దోఁప, నట్లు గదిసి జయోల్లాస మతిశ
యిల్ల ... ఉ. హరి. ౧. ౩౮.

క. పడిఁబాము ద్రేలఁగట్టిన, వడువున నలుగడల
ముసరి వార్వహంబుల్ జడివడిఁ గరియం
దొడఁగెను, వెడవెలుపును లేక సాంద
వేయుని మీఁదన్. హర. ౭. ౧౬౭.

వ. బిలంబు తెఱచిన వడువునఁగురిసె ...
హర. ౨. ౨౩.

వ. ... కుదముట్టంజదివె నేనియు సముత్పన్న
విజ్ఞానుండై ... అలబ్ధమగుండు నిక్షేపంబును
విడుచుకడువున విడువవలయు ...
ఆము. ౧. ౭౭.

వ. మిన్నువిఱిగి పయింబడిన వడువున ...
మనుచ. 3. ౯.

క. జడియక యిఖు డా సతి యే, వడువున
బొంకంగవలయు వనరుహగంధీ, యడుగుం
దప్పిన యప్పుడె, పిడుగుడప్ప ననుమాట
పేర్కొన వినవే. హంస. ౧. ౨౪౭.

క. గడిదేతి జారవిద్యకు, వడిఁగట్టు దురంత
కంతు వనజశరాళిన్, బడఁజాలనికతమున
నా, వడువున నత్తెగట బోటివత్తిలఁ
దొడఁగెన్. హంస. ౨. ౨౫.

వ. ... పులియడుగు తపసికొడుకు వెనుకొనెడు
సాలకడలి వడువున వసంతసమయంబు
ననుసరించు కుసుమసముదయ సమృద్ధిపగిది.
చంపూ. రా. 3. ౨౫.

గీ. వఱదఁగాప్తముల్ గూడిన వడువె బంధు,
సంగమంబ వివాసిన చాడ్పుతద్వియోగ
మింత చూచినవాని సమ్మోలికము, పొగయు
నేరను దానవవరతనూజ.
భార. శాంతి. ౮. ౫౬.

గీ. ... ముదవుతీవియు నామోదమును జవంబు
వడువునొప్పంగ సంగమ్మ నడువుమమ్మ ...
భీమ. ౮. ౧౭౫.

సీ. వలరాజు సచివుల వడువున బెడఁగగు
కరకాళ్లస్తనములఁగరమువాడి, చూడ్కులఁ.
భార. ఆది. ౭. ౭౮.

సీ. ఉడుపతి సంగతి నెడపి తాఁజనలేని వడు
వున నడలందు జడనుదోఁప ...
శశాం. ౫. ౧౨౧.

క. వారుగణా గణములుపతి, వారలలోఁగలసి
మెలఁగు వడువున నయ్యై, వారి తెఱఁ
గెఱుఁగవలయును ...
భార. శాం. ౩. ౩౯.

**వడువు² = నేడుగు.** వి. (సం. వటుః). ౧. బ్రహ్మచారి.

సీ. ధర్మాబ్ధి వృద్ధిగాఁదగు వడువునకు నీ నిల్లడ
బ్రహ్మచే నిడఁగఁబడిన, యిక్కన్య ...
భార. ఆది. ౬. ౨౪౭.

గీ. ఒసఁగి యెడ పేర్పులోఁగాఁగు చున్న
యాల, పాలువడ్డించుటయు మాని పాల
వేళ, మవవివారలచేతికి నంది యిచ్చు,
వడువున భుజించెవడు విపుర్వంటకంబు.
పాండు. ౪. ౧౭౪.

వ. ... వాచంయమవంశకంఠీరవంబ యీ
శరీరసాదంబునకు నాదికారణంబగు నీ
హృదయంబని యుచ్చరించుటన నోరుపొక్కు
చున్నయది. ఉన్నయట్ల నొడువు మనవుడు
న వ్వడు విట్లనియె. పాండు. ౫. ౧౯౭.

౨. కుమారుఁడు.

ద్వి. జడియుచు వచ్చియుఁ జాలబాలెంత,
వడుపున నందుని వడువునీక్షించి ...
అ. మ. క. ౧. ౨౭. పా. ౧. పం

**వడుసు.** వి. మోటుఁతనముగా చలువ చేయుటచే వస్త్రమునందు పడుగుపేకలు సందిచ్చి వంకరగా తొలఁగుట. (శ. ర.)

జః వడుసుపోవు.

**వడుసుడి.** వి. (వడుసు + సుడి.) (గాజులకిచ్చు) దండువు. (శ. ర.)

**వడుసుపోవు.** అ. క్రి. (√ వడుసు.) వస్త్రము వడుసు కలదియగు.

వ్యవ. చాకలి యీ క్రొత్త బట్టను వడుసు
పోవునట్లు చేసినాఁడు.

**వడె(డియ.)** వి. చిలుకకొయ్య, నాగదంతకము.

గీ. చిలుకకొయ్యన వడెనాఁగఁ జెలఁగుచుండు,
నాగదంతకము ... ఆం. భా. ౨. ౨౦.

**వడ్గు = నడుగు.** వి. బ్రహ్మచారి.

ద్వి. తెఱఁగొప్పఁ జంద్రమతీ దేవితోడ, గుఱు
తులు సెప్పివడ్గులు చనిరంత ...
ద్వి. హరిశ్చ. ఉ. ౧౭౩౯. పం.

**వడ్డగి.** వి. వడ్రంగి.

వడ్డగికి ఖ౨ (వృత్తి.) చే. శా. శ. ౧౧౩౫.

**వడ్డన = వడ్డెన.** వి. (√ వడ్డించు.) వడ్డించుట.

క. బిడ్డుంగడలివారల్లుం,దొడ్డుకొసం దొడఁగెఁ
గేలి యొడ్డున్నవలా, లిడ్డ తెలినిగ్గు టిడ్డెద,
వడ్డనకున్ దొడ్డులడ్డు వాల్వంచుటకున్.
బహు. ౪. ౩౧.

సీ. అన్నాదివ్యాస మలరు వడ్డనయున ...
ఆం. భా. ౨. ౨౬౦.

**వడ్డవారము.** వి. మందవారము, శనివారము.

చ. ... పౌష్యమునసి తేతరార్కధిశౌ(సౌ)రి
దినంబున ...

వ. ... నేంటి పౌష్య బహుళసప్తమి వడ్డవార
మున ... (౧౦౬౧.) సా. శా. ౬౬౬.
(౧౦౫౦.) చే. శా. ౭౪౭.

**వడ్డవి = వడ్రంగి.**

వ. ... వడ్డవిపేరు ౧ణ్టికి చిరాకు ౪౭
దా. శా. ౧౩౭౪.

**వడ్డి.** వి. (సం. వృద్ధి.) (క. బడ్డి.) అప్పిచ్చిన వానికి అప్పు పుచ్చుకొన్న వానివలన నెలకు నూటి కింతయని పెచ్చుగావచ్చు ధనము.

క. కాలంబుజనంబుల వడ్డికిచ్చు నాతని, వల నలవడఁ బొదివి తనకు వశ్యులఁజేయున్ ...
భార. శాం. ౪. ౪౪౩.

ఉ. ఆ సభలోనఁ గొన్న ఋణమంతయు నీఁగఁగఁ గంటివడ్డితో ...
భార. కర్ణ. ౩. ౧౯౫.

గీ. నిచ్చ నిచ్చ వడ్డి నెల నెల వడ్డోడఁ, బాటి వడ్డి వడ్డిపైని వడ్డి, యనఁగ నాల్గుదెఱఁగు లయ్యె నా వడ్డి దాఁ, దగవుతోడ నెక్కుఁ డరతరంబ. విజ్ఞా. వ్య. ౬౬.

గీ. అనితంబవిలంబి కాలాహికల్ప, ఘనకచ గ్రంథి నచటి భృంగముల కసిత, దీధితులు వడ్డికొసఁగుచు దేవపూజ, విరులఁబిదిమెడి కపట భూసురునిఁగనియె. మనుచ. ౩. ౮౭.

సీ. గీ. ... వడ్డితేమాన మనఁగను వఱలు వృద్ధి ... ఆం. భా. ౨. ౨౨౪.

జ: వడ్డికాసులస్వామి, వడ్డిబ్రతుకు.

**వడ్డించు.** స. క్రి. ౧. భోజ్య పదార్థములను పాత్రమునందుంచు.

ఉ. సంచిత బాహుమూల రుచి సంపద సొంపిరి పోఁ గెలంకులన్, గుంచె యొకర్తువైవనొక కోమల పల్లవ పాణిలీల వడ్డించె నృపాల మౌళికిఁ గటీతట హాటక మేఖలాస మభ్యంచిత కింకిణీ రవము నందిరు మ్రోఁతలు సందడింపఁగన్.
రాజ. చ, ౨. ౧౩౦.

ద్వి. పాలుమాలింగంబు పళ్లెరంబు నను, వడ్డించు కొన నసువ్రతము నావుడును ...
పండితా. మహిమా. ౨౮౯. పా. ౫. పం.

సీ. ఏ తల్లి వడ్డింప నింపుతో భుజియించు జనులకు మాతృవిస్మరణ మొదవు ...
దశా. ౧. ౫౦.

సా: వడ్డించువాఁడు తన వాఁడైన కడపంక్తిని గూర్చుండు మన్నాఁడు.

౨. కజ్జలోనగు వానితోఁ గొట్టు.

క. కానేని జేతిరోఁకట, వాదులు వారించి లెస్స వడ్డించినచో,నీదిక్కున నీకెవ్వరు, రాదిక్కునిపల్కు నవ్వి యతఁడిట్లనియెన్.
విప్ర. ౪. ౬౦.

జ: వడ్డన, వడ్డించుకొను.

**వడ్డించుకొను.** స. క్రి. (√ వడ్డించు.) భాజనము నందుంచుకొను.

ద్వి. కుడువఁ జిక్కిన కాయకూర లన్నంబు, వడఁకకమటిమీఁద వడ్డించుకొనిన ...
పండితా. దీక్షా. ౩౩. పా. ౧౧. పం.

**వడ్డికాసులస్వామి.** వి. (√ వడ్డి.) వేంకటేశ్వరుఁడు.

వ. తలక్రిందఁ జేతు లిడుకొని యోవడ్డికాసుల స్వామీ యీమాఱు గాచిన బిడ్డలంగని మీపేరుఁ బెట్టెద మని మ్రొక్కుచుఁ గన్నులు మోడ్చుకొని యుండువారును ...
ప్రబంధ. ౭౮.

**వడ్డిబ్రతుకు.** వి. (వడ్డి + బ్రతుకు.) వృద్ధిజీవిక, వడ్డికిచ్చి బ్రతికెడు బ్రతుకు, సొమ్ము వడ్డికిచ్చి యా వడ్డివలన జీవించుట. (శ. ర.)

**వడ్డెన** = వడ్డన. వి. (శ. ర., బ్రౌ.)

**వడ్డోలగము.** ("ఒడ్డోలగము" నకు అపరూపము.) వి. నిండు కొలువు.

ద్వి. అరుదగు శ్రీ మల్లికార్జును దివ్యవర మంటపస్థలి వడ్డోలగమున ...
పండితా. దీక్షా. ౩. పా. ౨౩. పం.

**వ్రడంగము.** వి. వ్రడంగిపని. (శ. ర., వా.)

**వ్రడంగి = వడ్లంగి.** వి. (సం. వర్ధకిః.) ౧. కఱ్ఱ పని చేయువాఁడు.

ద్వి. కీలుపొందించి యాక్రియ రాటనముల, వాలిగూడించు నా వ్రడంగి యతఁడు.
బస. పు. ౪. ౯౫.

౨. ద్వారాఘాటము, వ్రడంగిపిట్ట.

సీ. జిట్టగొజడి డాబజీను వ్రడంగి ...
ఆం. భా. ౨. ౯౭.

జ: వ్రడంగి పిట్ట.

**వ్రడంగిపిట్ట.** వి. (వ్రడంగి + పిట్ట.) పక్షి విశేషము, ద్వారాఘాటము.

**వ్రడము.** వి. కఱ్ఱపని, వ్రడంగిపని.

గీ. ... వ్రడమనఁగఁ బరగు వర్ధకి కర్మంబు.
ఆం. భా. ౨. ౨౭౪౨.

జ: వ్రడవాఁడు.

**వ్రడము.** సం. విశే. (అ. ఆ. అ.) పెద్దది. గొప్పది. (వాచ. విల్సన్సు.)

**వ్రడ(డ్ల)వాఁడు.** వి. (√ వ్రడము.) కఱ్ఱపని చేసి జీవించు కులమువాఁడు, వర్ధకి.

సీ. ... వ్రడవాఁడనంగ.

గీ. వర్ధకి విరాజిలుచునుండు ...
ఆం. భా. ౨. ౨౭౪.

**వడ్ల.** వి. కఱ్ఱపని. (శ. ర.)

**వడ్లంగి = వ్రడంగి.** వి. ౧. పక్షి విశేషము.

సీ. పిచ్చుక కేరిజ బెగ్గురు వడ్లంగి పీడ చెమరు గాకి చిలుక ...
ప్రబంధ. ౨౩౪.

౨. వర్ధకి.

సీ. ... వడ్లంగి వ్రడవాఁడనంగ ...

గీ. వర్ధకి విరాజిలుచునుండు ...
ఆం. భా. ౨. ౨౭౪.

**వడ్లకంకణము.** వి. (√ వడ్లు.) ఒకజాతి కొంగ. (శ. ర.)

**వడ్లచిలుక.** వి. (√ వడ్లు.) ఒకజాతి చిన్న పురుగు. (శ. ర., వా.)

**వడ్లత.** వి. వర్ధకి స్త్రీ, వడ్లది. (శ. ర.)

**వడ్లు.** వి. బ. (ఏ. వరి.) శాలిధాన్యము.

సీ. ... వ్రీహిసామాన్యంబు వరివడ్లు నాఁగను వఱలియుండు ...
ఆం. భా. ౨. ౨౩౭.

క. వడ్లుడంచ్చెడు అణువాండ్లు. (కు. ౩౬.)
దా. శా. ౧౨౭౭.

క. ... వడ్లం బ్రాలునుండంచ్చి రొయ్యి క్లొత్తి ...
దా. శా. ౧౦౧౫.

సా. వడ్లను పెరుగును గలుపుట.

గీ. కలఁగివడ్లును పెరుగును గలుపుభంగి, నకట వికటంబులగు ప్రశ్నలడిగె నదియు ...
వాసిష్ఠ. ౨. ౧౩౬.

సా. వడ్లతోఁ దట్ట యొండుట = ఒక్కరితో పాటు మఱియొకరు బాధ పడుట.

గీ. ఇట్టివానికి మావారలిచ్చినపుడె, వడ్లతోఁ దట్టయొండఁగావలసి వచ్చె ...
కలువాయిశ. ౭౬.

జ: వడ్లకంకణము, వడ్లచిలుక.

**వణఁకాడు.** అ. క్రి. (వణఁకు + ఆడు. స్వార్థము.) కంపించు.

క. వాలిక మెఱుంగుఁ దూపులు, నాళీకాసనుఁడు గినుక నారాయణుపైఁ, గీలుకొనఁ జేసి యార్చెను, నాలుగు మోములను గ్రీఘ్రనము వణఁకాడన్.
శివరా. ౧. ౭౬.

గీ. ... మిగులసలముట తప్పని మేటి తరఁగ, గలుఁగు నను మాటికిని వణఁకాడఁ జొచ్చె ... అచ్చ. భా. ౩. ౪౨. సా.

**వణఁకు = వడఁకు.** అ. క్రి. (క. ఒణఁకు.)

౧. చలించు, కంపించు.

క. అరచేంగురుడెందములోఁ, జొరఁబాఱి వణంకు తోఁకచుక్క యపోలెన్, నరకుం జేసిన బాణము, హరినిటలతటంబు నాఁటి యల్లలనాడెన్. ఉ. హరి. ౧. ౧౫౩.

గీ. ... పాఱుఁడెంచి కీరంబులు పండ్లుగఱవ, వణఁకు దాడిమిఁ జూచె భూవరుఁడు వేడ్క ... శైవ. ౧: ౯౬.

ఉ. ... వలవల నైన దంతములు వంగిన మేను వణంకు మస్తముల్ ... విక్ర. ౨. ౧౫౫.

౨. భయపడు.

సీ. లేదువో గృహిణిపై మోదంబు లోకాప వాదంబునకునైన వణఁకవలదె ...
నిరం. ౨. ౯౭.

వి. ౧. కంపము, వేపథువు.

ఉదా: అతనిని చూడఁగనె శరీరమున వణఁకు పుట్టినది.

ఉ. కగ్గినచెక్కులుం జెమటగారెడు మోములు వాడివత్తలై, తగ్గినమేనులున్ వణఁకు దాఁకొనుకాళులు సారెసారెకున్, ... విన్ననిమోములు గానిపించినన్ ...
విప్ర. ౨. ౫౩.

౨. భయము.

ఉదా: రణరంగమును జూడఁగనే వీరలకు వణఁకు గలిగినది. ఎవరితోఁ జెప్పినను నాకు వణఁకులేదు.

౩. మంచు, హిమము. (చూ. వణఁకుగుబ్బలి.)

జ: వణఁకొండు, వణఁకుగుబ్బలి.

**వణఁకుగుబ్బలి.** వి. (వణఁకు + గుబ్బలి.) హిమవత్పర్వతము.

చ. విరచితభోగభాగ్యముల విశ్రుతి కెక్కిన యాదిశక్తికిన్, గురుతరమైన యావణఁకు గుబ్బలిపట్టికిఁ గోరి మ్రొక్కెదన్ ...
ధనాభి. ౧. ౬.

వణఁకుగుబ్బలిపట్టి = హైమవతి, పార్వతి.

వణఁకుగుబ్బలిరాచవారు = హిమవంతుఁడు.

సీ. వణఁకుగుబ్బలిరాచవారికూరిమికన్య భీమయ్య శుద్ధాంతభామఁ గొలిచి ...
భీమ. ౩. ౧౭౪.

**వణికము.** విశే. ఒప్పిదమైనది, మనోహరము.

సీ. వణికమా మాణిక్యకోణిగలఁ జెన్నొందు పుష్యరాగపువలభుల నెసంగి ...
ఉ. హరిశ్చ. ౨. ౧౪౯.

**వణిక్కర్మము.** సం. వి. న్. న. వాణిజ్యము, బేహారము.

**వణిక్కు.** సం. వి. జ్. పుం. ౧. బేహారి, వర్తకము చేయువాఁడు. ౨. తులారాశి.

స్త్రీ. వాణిజ్యము, బేహారము.

**వణిక్క్రియ.** సం. వి. ఆ. స్త్రీ. వాణిజ్యము, బేహారము.

**వణిక్పథము.** సం. వి. అ. పుం. ౧. వాణిజ్యము, వర్తకము. ౨. అంగడి, దుకాణము. ౩. తులారాశి.

**వణిక్సార్థము.** సం. వి. అ. పుం. వర్తకసమూహము. బేహారులగుంపు.

**వణిజము.** సం. వి. అ. పుం. తులారాశి.

**వణిజుఁడు.** సం. వి. జ్. పుం. (ఋత్విగాదిగణమందలిది.) వర్తకుఁడు.

క. ఆ వణిజుఁడు ధర్మస్థితి, దేవతలును మెచ్చునట్లు తెలియఁగఁ బలికెన్,...
భార. శాం. ౫. ౨౮౭.

**వణిజ్య.** సం. వి. ఆ. స్త్రీ. = వణిజ్యము.

**వణిజ్యము.** సం. వి. అ. న. వర్తకము, బేహారము.

***వణితము.** వి. ౧. రాజ్యభాగము. జిల్లా, తాలూకా మొ.

క. ఈ రీతిఁ జిత్రసేనధరారమణుం డల్లునకు నరుఁ డొసఁగి కుమారీరత్నమునకుఁ బసుపున, కొరకని యొక్క వణిత మొసఁగి యని యెన్ సతికిన్. చంద్రా. ౬. ౫౩.

౨. సీమైకదేశము.

సీ. ... వణిత మం చనఁగను సీమైకదేశమై చెలఁగుచుండు ... ఆం. భా. ౨. ౭.

**వతంసము.** సం. వి. అ. పుం. = అవతంసము.

**వతువు.** సం. వి. ఉ. స్త్రీ. ఆకాశగంగ.

పుం. ౧. బాట, దారి. ౨. నేత్రరోగము. (విల్సన్.)

**వతోక.** సం. = అవతోక. ౧. ఆకస్మిక ప్రమాదమువలన గర్భస్రావమైన యావు, లేక ఆట్టి స్త్రీ.

౨. గొడ్రాలు. (వాచ.)

**వత్త.** వి. వరుగు. (ఇది "వాడి" పదపూర్వకముగనే ప్రయోగములఁ గానవచ్చుచున్నది.)

ఉ. కగ్గిన చెక్కులుం జెమటగారెడు మోములు వాడివత్తలై, తగ్గిన మేనులున్ ... విన్నని మోములుఁ గానిపింపఁగన్ ... విప్ర. ౨. ౫౩.

ఉ. ఎన్నిభవంబులం గలుగు నిక్షుశరాసన సాయకవ్యథాభిన్నత వాడివత్తలయి ... మనుచ. ౨. ౫౭.

గీ. మంచిగింజంబు ... కమలి, నాళములు వాడి వత్తలై డీలు వడియె ... రసిక. ౪. ౧౫౧.

ద్వి. వాడి వత్త యిసేమి వాంఛచేసితివి ... విష్ణు. ఉ. ౫. (శ. ర.)

**వత్తి.** వి. (సం. వర్తీ. వర్తిః.) దీపపువత్తి, దీపము వెలుఁగుటకై దూది మొదలగువానితోఁ జేసి యుపయోగించువస్తువు, దశ.

సీ. వానలేనికతాన వాడివత్తులవలె సకల సస్యంబులు సమసిపోయె ... వరాహ. ౭. ౫౨.

ఉ. చిత్తజుపువ్వుఁదూపులరచించిన సుమ్మెద చెక్కుగాలిచే, వత్తటి సేసి వత్తియగు నంగన దూలినఁ దూలెఁ గాక ... నైష. ౬. ౯.

సీ. బద్దియం చనఁగను వత్తియనంగను శిఖమనఁగను వెలుఁగుదశలు ... ఆం. భా. ౨. ౧౫౩.

ద్వి. ఆనందశిరితహృద్బ్జంబె వత్తిగా నొనరించి ... ద్వి. పరమ. ౧. ౪౫. పా. ౧౧. పం.

**వత్స.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఆఁడుదూడ. పెయ్య. ౨. కన్నె, బాలిక.

**వత్సకము.** సం. వి. అ. పుం. ౧. లేఁగ, దూడ. ౨. శిశువు. ౩. కుటజము. కొడిసెచెట్టు.

న. పుష్పకాసీసము. అన్నభేది.

**వత్సకామ.** సం. వి. ఆ. స్త్రీ. లేఁగకై యత్యాశపడునట్టి యావు. ౨. బిడ్డపై మిక్కిలి ప్రేమము గల స్త్రీ.

**వత్సతంత్రి.** సం. వి. ఈ. స్త్రీ. దూడలనుగట్టెడు త్రాడు. కన్నెత్రాడు. పలుపు.

**వత్సతరము.** సం. వి. అ. పుం. మోయుటకును, దున్నుటకును పనుపడుటకుఁదగిన వయసుగల కోడె, దమ్యము; పాలు విడిచినదూడ.

గీ. రత్నములఁబోని వత్సతరంబులకట, వ్రేలు
చున్నవి లొట్టెన్గువెంటఁ దగిలి ...
భార. శాం. ౪. ౪౦.

**వత్సతరి.** సం. వి. ఈ. స్త్రీ. ఆవుపడ్డ. ఆఁబెయ్య.

**వత్సదంతము.** సం. వి. అ. పుం. బాణవిశేషము. లేఁగపంటివంటి మొనగలబాణము.

**వత్సనాభము.** సం. వి. అ. పుం ౧. వృక్షవిశేషము. ౨. ఒకానొక విషము, విషభేదము.

**వత్సనాభి.** సం. వి. ఈ. స్త్రీ. వసనాభి, విషభేదము.

**వత్సపాలుఁడు.** సం. వి. అ. పుం. ౧. దూడలను గాచువాఁడు. ౨. కృష్ణుఁడు. ౩. బలరాముఁడు.

**వత్సము.** సం. వి. అ. పుం. ౧. లేఁగ, దూడ. ౨. సంవత్సరము. ఏఁడాది. ౩. దేశవిశేషము. కౌశాంబీపురము రాజధానిగాఁగల దేశము.

న. ఱొమ్ము, వక్షస్స్థలము.

**వత్సరము.** సం. వి. అ. పుం. ఏఁడాది, పండ్రెండు నెలల పరిమితిగల కాలము.

**వత్సరాంతకము.** సం. వి. అ. పుం. ఫాల్గున మాసము. (రా. ని.)

**వత్సల.** సం. వి. ఆ. స్త్రీ. తన దూడపై అత్యాసక్తిగల యావు. ౧. బిడ్డలను మిక్కిలి ప్రేమించు స్త్రీ.

**వత్సలము.** సం. వి. అ. పుం. గడ్డినిప్పు.
పుం. న. ప్రేమము.

**వత్సలుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. బిడ్డలపైఁ బ్రేమగలవాఁడు. ౨. ప్రేమము గలవాఁడు. దయగలవాఁడు.

**వత్సశాల.** సం. వి. ఆ. స్త్రీ. పసులసాల.

**వత్సాదనము.** సం. వి. అ. పుం. తోఁడేలు.

**వత్సాదని.** సం. వి. ఈ. స్త్రీ. తిప్పతీఁగె.

**వత్సిమ(ము).** సం. వి. న్. పుం. శైశవము. బాల్యము.

**వత్సీయుఁడు.** సం. వి. అ. పుం. పసులకాపరి.

**వత్సుఁడు.** సం. వి. అ. పుం. ౧. శిశువు, పసిబిడ్డ. ౨. బాలుఁడు, చిన్నవాఁడు. ౩. కుమారుఁడు, పుత్త్రుఁడు, సంతానము, సంతతి. ౪. వాత్సల్యసూచకముగా సంబోధనాంతమై ప్రయోగింపఁబడు పదము.

బ. వత్సదేశనివాసులు.

**వద = వద్ద.** వి. సమీపము.

చ. పలితమిషంబునన్ ముదిమి భానుకులాగ్రణి
యైనరాజునీ, నులవదఁ గేకయాధిప తనూజ
భయంబున నల్లఁ జేరి నీ, సలలిత రాజ్య
లక్ష్మిని నొసంగుము ... రఘు. ౮. ౩.

ఉ. భూరివిరాడ్వికారగతిఁ బూర్వకుభృచ్ఛ
రమాద్రులన్ బదాం, భోరుహముల్
ఘటించుకొని పోకల రాకలమేన్ మలంచి
వి, ద్యారుచిఁ జొక్కుచోఁ జెవిపదన్ రవి
పోఁగునఁ గెంపువోలెఁ జె, న్నారు మహో
న్నతిన్ మఱియు నక్షర నక్షరిపున్ భజిం
చెదన్. వేం. పంచ. ౧. ౭.

చ. ఇది నిజమిందు కొఱుసెల లిమ్మొదమ మిట్లొన
రింపకున్న నీ, వదఁ బదమూన కేను వనవాస
మొనర్చెద నన్న రాజు స, మ్మదమువహించి
యోవిమలమానస ...
వేం. పంచ. ౧. ౭౪.

**వదంతి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. సంభాషణ, మాటలాడుట. ౨. జనశ్రుతి, జనప్రవాదము. (విల్సన్సు.)

**వదనము.** సం. వి. అ. న. ౧. ముఖము, మోము. ౨. నోరు, వచనేంద్రియము. ౩. ముఖవికారము. మోముజాడ. ౪. ముందుభాగము - అగ్రము. ౫. పరంపరలో మొదటి వస్తువు. ౬. (గణిత) త్రిభుజములోని మీఁదికోన. ౭. కథనము, చెప్పుట, పలుకుట.

**వదనాసనము.** సం. వి. అ. పుం. చోంగ, చోల్లు.

నదనిక = బదనిక. వి. (శ. ర.)

సీ. బదనిక వదనిక బవనిక యనవందచను ... ఆం. భా. ౨. ౫౪.

**వదన్యుఁడు.** సం. విణ = వదాన్యుఁడు.

**వదర.** విణ. (√ వదరు. సం. వద.) ౧. వదరుబోతు, ప్రేలరి.

క. అనిన నాడుగఱచి యమరద్విషుం డోరి, పడుచ నాకుఁ బుట్టి చెడుగవైతి, పేర్చినోరు మూయుమెడలల వాపొరొ, దిట్టవదర గలఁడె రొచటనైన. నృసిం. ౪. ౩౭.

క. పదునాలుగు లోకంబులు ... వదరలఁ జేయుదురు భేదవాదులనెల్లన్ ... ఉ. హరి. ౨. ౬౯.

౨. నీచుఁడు, దుష్టుఁడు.

గీ. ... వావివర్ణంబు మాలిన వదర యతఁడు, శాస్త్రములఁ జెప్పఁబడిన దోషంబులెన్ని, యున్నియును జేసె ... శివరా. ౪. ౧౬.

**వదరు[1].** అ. క్రి. (సం. వద్.) ౧. వ్యర్థవచనములు పలుకు, ఉపయోగములేనిమాట లాడు; ప్రేలు.

క. అది యట్లు లుండె నీతో, వదరం బనిలేదు నాకు ... భార. శాం. ౪. ౪౯.

ద్వి. కంగుచుఁ గుంగుచుఁ గళవళింపుచును, వంగుచు వదరుచు వడిఁ గొట్టికొనుచు ... ప్రభులిం. ౨. ౫౬. పా. ౧౭. పం.

౨. చెప్పు, పలుకు.

ఉ. ... బాపఁడా, యిచ్చుటఁ జల్లువిత్తు ఫలియించునె వేళ గుణం బెఱింగి నా, యిచ్చుకు మెచ్చుగా వదరు మిప్పు డన న్విని యూతఁ డుబ్బుచున్. శుక. ౨. ౪౪౩.

మ. వదరుండ త్తడిసానిచెంతఁ గడుకేవన్ వచ్చు లేమావిక్రొం, బదనుం గెందలి రాకుడాల్వ లపుబాబా రొక్కుడుం గండుకోఁటిగునే దారుల వెండిగండిగమిసూటిన్ మించు పూఁగేనెసం,పద కొక్కుంచుక విచ్చు క్రొం బాగడ జొంపంబుల్ వనీవీథులన్. చంద్రాం. ౪. ౭౬.

౩. డంబములుకొట్టు, దంభవాక్యములు పలుకు.

క. బ్రాహ్మగొల్లకున్న రార, మ్మ్రొగురుగ నిటువంటి మాట లిమ్మెయి నేలా, వదర్కఁగ క్రి. శా. ౬. ౨౨.

౪. అఱచు, కూయు.

రగడ. వదరెఁ గడుఁ గ్రొవ్వి పికవారములఁ గిరములు ... రాఘవ. ౨. ౬.

వి. ౧. వ్యర్థవచనము, ఉపయోగములేనిమాట, ప్రలాపము, ప్రేలుడు.

సీ. ... పైజాప్రల్లదము వదరువదావళి నాఁగఁ జెలఁగు నౌఁబ్ర,లాపాభిధ ... ఆం. భా. ౧. ౧౧౬.

తే. అట్టి కొంతాజనాంతకు నట్టి పైలం, బాధిపద్రోహి నట్టిమహాఘచిత్తుఁ, జెప్పనేమున్న దిఁక నీవు చేరినట్టి, వార్త వినిపింతుఁ గద తోరి వదరు లేల ... సీతావి. ౩. ౫౬.

౨. దంభవచనము, డంబము.

చ. వదరులు పల్కినంతటనె వచ్చెనె ధైర్యము
శౌర్యవృత్తి నీ, కొదవిసఁ జక్కనై నిలువు
మోరి నిశాచర యిన్నగంబునన్ ...
రుక్మా. ౫. ౩౩.

౩. పక్షివిశేషము, ఒకజాతిపిట్ట.

గీ. పికి సేలనెమిలి పెనుగువ్వ బకదారి పావు
రాయి నివదు పలువరింత, చేదలుకోడి గువ్వ
వదరు తోఁకలవేడి, యాదిరైన పక్షు
లతఁడుదీర్చు ... హంస. ౩. ౧౩.

వదరుపల్కులు = ప్రలాపములు, అర్థములేని మాటలు.

సీ. వదరుపల్కులు గాక శుద్ధి సాటివచ్చునె
కిన్నెరకాయలీ చన్నుఁగవకు ...
హంస. ౧. ౨౧౦.

వదరుమాటలు = ప్రలాపములు, అర్థములేని మాటలు.

సీ. వదరుమాటలు గాక వచ్చునే సరిచేయఁ
గిన్నెరకాయలీ చన్నుఁగవకు ...
వరాహ. ౯. ౧౦౧.

జః వదర, వదరుఁబోతు, వదరుకొను, వదావళి.

**వదరు[2].** అ. క్రి. అదరు, అతిశయించు.

సీ. వదరుచీఁకట్లలో వ్రాలుచుక్కలు వోలె
వేణీభరమ్ములో విరులువ్రాల ...
ఉ. హరి. ౫. ౨౪౬. (శ. ర. పా.

("వలుద చీఁకట్లలో", వావిళ్ల. పా. "వఱలు చీఁకట్లలో", వీరేశ. పా.)

**వదరు[3].** వి. ౧. చేఁతిసార. * (శ. ర.)

౨. సొరకాయ, అలాబువు.

ఆ. వరదుఁడైన యీశు వరమున నిదియొక్క,
వదరు పుట్టె నెట్టి వరమొ యనుచు, దానిఁ
జారవైవఁగానున్న నాకాశ, వాణి యిట్టు
లనియె వసుమతీశ. భార. అర. ౩. ౫౪.

ఆ. శకనరేంద్రచంద్రచరణాబ్జసంసేవ, విడిచి
యా విదర్భవిభునిఁ గలసి, వచ్చుటోడ
విడిచి వదరు పట్టుటసుమీ ...
విక్ర. ౪. ౬౪.

తే. అనిన మనుజేంద్రుఁ డిట్లను మునివరేణ్య,
మత్కులాచార మెడలి యీ మానవతులఁ,
గూడియుండుట వివరింప నోడవిడిచి,
వదరుపట్టిన యట్లపో త్రిదశవంద్య.
హరిశ్చ. ౨. ౧౭౨.

జః వదరుకాయ, వదరులాఁడు.

**వదరుఁబోతు.** (వదరు[1] + పోతు.) విశే. ఊరక ప్రేలువాఁడు, ప్రేలరి. (శ. ర.)

**వదరుకాయ.** వి. (వదరు[3] + కాయ.) సొరకాయ.

ఆ. గానభిక్షు వేడ హీనస్వరంబున, వదరు
కాయ లందివచ్చినట్టి, వీణియలకు లయలు
విప్పిచెప్పిన భంగి, నందు ముగురు వాడిరంద
ముగను. ద్వా. ౭. ౧౬౭.

**వదరుకొను.** అ. క్రి. (వదరు[1] + కొను స్వార్థమున.) ౧. ప్రేలు.

సీ. ఫలపరంపర లెల్ల నులిచిపైచిలితి మింకఁ
గొదమ చిల్కల వెంత వదరు కొనువొ ...
వసు. ౩. ౧౫౧.

౨. చెప్పుకొను.

గీ. ఎడమచేస దొడ్డుగా జైచి యేకు లెల్లఁ,
గెలసఁ బలువగ వేఁపుదుగింజ లునిచి, చేత
శీటలమీఁద నాసీనలైన, వారలై వాదివరు
సలు వదరి కొనుచు. శుక. ౨. ౪౨౦.

**వదరులాఁడు.** విశే. (వదరు[3]లు + వాఁడు.) సొరకాయలూఁదెడువాఁడు.

గీ. శ్రీన్నిదంబుగఁ బెనుఁబాము సవదరించి,
ఘంటికటకంబు ఘల్లుఘల్లనుచు మొరయ,

సాహితుండిక గరళవిద్యాధిరాజు, వచ్చెఁ
బాముల మెంగఁడు వధరులాఁడు.

క్రీడా. ౨౨౩.

**వదలించే.** స. క్రి. (√ వదలు.) విడునట్లు
చేయు.

సీ. చేయింతు నిరతంబుఁ జిత్త సంభవు పూజ
వదలింతు నితర దేవతల పూజ ...

చంద్రా. ౩. ౭౨.

ద్వి. ఓపినరీతిఁ బ్రియోక్తుల నెదిరి, కోపము
వదలించి కుశలంబు మీఱ ...

హరిశ్చ. పూ. ౧౨౮౦.

వ. ... శరంబుల వదలించుచు ...

ఉ. రా. ౨. ౬౧.

**వదలు.** అ. క్రి. ౧. శిథిలమగు, పట్టువీడు, సడలు.

క. తల వడఁకఁ దొడఁగె నింద్రియములు గర్వ
మడంగె నంగిసులు వదలె వళీ,పలితంబు
లయ్యె ... భార. ఆది. ౩. ౧౯౧.

క. మది రోష మొదవ దోవతి, వదలిన బిగి
యించుకొనుచు ... భాగ. ౧౦. ఉ. ౪౯౭.

సీ. అంగదాభరణంబులంగుఁ గీలించిన వజ్రాల
కీలన వదలకుండ ... హర. ౯. ౪౫.

౨. వీడిపోవు.

గీ. ... కొమరుమేనొప్ప సాగెకుఁ గొప్పు
వదల, నేమిటికిసైనఁ దాయున్న యేఁగి
యేఁగి, యొల్లపనులు నొసగ్చె నిం పెసఁ
మెసఁగ ... కళా. ౪. ౯౯.

చ. వదలినకేశపాశములు వాడిననిద్దపుమోము
దమ్ములుం, బదనెరపైన వాతెఱలుఁ బైకొను
నూర్పులు నుల్లసిల్లఁగాఁ, గదిసిన యయ్యు
నంగపతి గాదిలి బోటులతోడ నిట్లనున్ ...

విక్ర. ౫. ౩౮.

మ. ... లజ్జఁ బోవిడిచి యేకాంతంబుగా
నద్దెసల్ గనుచుం బైఁటదొలంగి నీవి వద
లన్ గా మాంధకారమ్ము నెమ్మనముం గప్పినఁ
గన్నుగానక ... సారంగ. ౨. ౭౯.

౩. జాఱు.

సీ. కదలెడునెఱివేణి వదలెడుపువ్వులుఁ జెమటఁ
గరంగు కుంకుమపు బొట్టు ...

గీ. ... పుంభావ సురతమయ్యతివసలిపె ...

హంస. ౨. ౫౩.

౪. క్షీణించు, తగ్గు, నశించు.

గీ. అమృతధారారసాస్వాదసముపజాత, తృప్తి
యును బోలె నాహార తృష్ణవదలె ...

కాశీ. ౪. ౨౦౮.

క. ఈ భవ్యోద్యానంబుల, ... నందన, వైభవ
మందెట్లు ప్రేమ వదలదో నీకుఁ ...

కళా. ౨. ౧౮౧.

సీ. ... వలకొఁక పెనుదప్పి వదలుటెట్లు ...

నీలా. ౨. ౩౬.

సీ. వరవంశవైఖరి వదలెనే రవిసుతాపతి
యైన దైతేయభంజనునకు ...

వసు. ౨. ౧౩౮.

౫. ఎడతెగు.

(ఈ యర్థమున దీనికి వ్యతిరేకమునందు మా
త్రమే ప్రయోగమున కనఁబడుచున్నది.

చ. ... నదినొక్కటఁ గ్రుంకిడి వత్తుగెండచో,
వదలక యాతనింట శనివారమునం బరి
దేశి వైష్ణవుల్ ... ఆము. ౧. ౭౩.

చ. మదకలకుంభికుంభ నవమౌక్తికముల్ గను
పట్టు దట్టమై, వదలక కృష్ణరాయకర
వాలమునందగు ధారనీట నభ్యుదయంబు
నొంది ... మనుచ. ౧. ౪౧.

చ. వదలక మీచరిత్రములు వర్ణనచేసిన
సంస్మరించినన్, జదివిన వ్రాసినన్ విని
ప్రసంగవశంబునఁ జేరుకొన్న ...

విక్ర. ౨. ౬౫.

(స. క్రి.) స. క్రి. ౧. విడుచు, త్యజించు.

సీ. సాధుబృందావనసరణి నాఁడును నేఁడు
వంశానురాగంబు వదలఁడయ్యె ...
పారి. పీఠి. ౧౮.

సీ. వీరమాహేశ్వరాచారంబు వదలక ...
హర. ౨. ౧౩౯.

సీ. తనుఁ బాసి చను మెఱుంగని క్షీరపానంబు
వదలి వెన్గొనునీలవసద మసఁగ ...
దశా. ౨. ౨౬౪.

౨. శిథిలముగావించు, సడలించు.

వ. ఆ భూపాలుండు హస్త పల్లవంబులు వదలి
రాజహంసంబు పొమ్ము సుఖంబుండుమని
విడిచిపుచ్చె ... నైష. ౧. ౧౦౮.

విణ. శిథిలము, బిగువుకానిది.

క. అంగన యీ తొడవులునీ, యంగములకుఁ
జాల వదలులై యుండినసే, మంగళముగఁ
దాల్పఁగభూ, రంగమునను వైచిచనితె
రయమున నకటా. భా. రా. కిష్కి. ౨౬౩.

క. లేఁగొఁ దీఁగె నితంబము, ద్రేఁగునఁ ద్రెవ్వ
టయుఁగని విరించి బిగింపఁగా, లోఁగి ముడి
యిడిరెు వదలుగ, నా ...
ఆము. ౫. ౨౮.

వి. శైథిల్యము, విడుపు.

ఉ. దానికి సద్దశాననుఁడు ... బాణహతి
నాతని ఫాలమునొంచె మూర్ఛకున్,
లోనయి చాపముష్టి వదలుం గనుమూఁత
యుఁ గల్గు నట్లుగన్.
భా. రా. యు. ౮౩౪.

జః వదలించు, వదల్చు.

**వద(లుచే)ల్చు.** స. క్రి. (√ వదలు.) ౧. వీడు
నట్లు చేయు.

గీ. ... మొక్కుచు నదల్చినను పోకముడి
వదల్చి, కరఁగఁజేసిన యాటుమీఁదఁ గౌఁగ
లించు ... కువల. ౪. ౧౯౪.

ఉ. కుప్పసముల్ వదల్చి రిఱిగుబ్బలనొత్తిలి
యొత్తి వేసుఖా, మిప్పలలర్చు గాడ్పున
కధీశు ... ఆము. ౫. ౧౦౪.

మ. ... కమ్మదామ్మురలఁ గదల్చి వారిచర
మండలి సొంపు వదల్చి రంగనల్ ...
వేం. పంచ. ౪. ౧౪౧.

మ. ... సుదతీ చిక్కితి వెంగుఁ బోయెద
వటంచుం గంచుకంబున్ వద,ల్పఁడొడం
గన్ ... ఉ. రా. ౬. ౪౮.

**వదవద.** వి. వణఁకుట యం దగు ననుకరణము.

క. మృగులతరచంద్రహాసముఁ, గదలించు
చుశుక్యవిభునిఁగని భీరువులై, మదవిమతులు
వదవద వడఁకుచును రాతఁడు మహేంద్ర పుత్ర
కుఁడు గాఁడఁ జూమీ. కావ్యా. ౧. ౪౦.

**వదాన్యుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧.
వాగ్ధాటి గలవాఁడు, వాగ్మి. ౨. మర్యాదగా
మాటలాడువాఁడు. ౩. ఔదార్యవంతుఁడు,
దానశీలుఁడు.

వి. అ. పుం. గొప్పదాత.

**వదామము.** సం. వి. అ. పుం. బాదముకాయ.

**వదాలము.** సం. వి. అ. పుం. ౧. నీటిసుడి.
జలావర్తము. ౨. మత్స్యభేదము, పాఠీనము.
ఒకజాతిచేఁప.

**వదావదుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧.
వాగ్ధాటి గలవాఁడు. బహువక్త. ౨. వదరుఁ
బోతు. వాగువాఁడు.

**వదావళి.** వి. (వదర + ఆవళి.) వదరుఁబోతు
తనము. (శ. ర.)

సీ. రోఁజుడు రొంజుడు రొష్టుడు రొండుడు
రొల్లుడు రజ్జుప్రేలుడు పలుకు పులపరింపు

పైజు ప్రల్లదము వదరుబదావళి బజారము
నాఁగఁ జెలఁగెనాఁ బ్రలాపాభిధ.
ఆం. భా. ౧. ౧౧౬.

**వది.** వి. ౧. ఏనుఁగులోనగు వానిని బట్టుటకై త్రవ్వఁబడి గుండ్లు మున్నగువానిచేఁ గప్పఁబడిన పల్లము. (శ. ర., చి. ని., బ్రౌ.)

సీ. వదులనోదాలఁ ద్రోవకదేవకరిఁ బట్టి
యొరిజక్షైపక యొక్కను నుగుటఁడనము.
రా. వి. ౩. ౪౬.

(శ. ర. పా. వనులనోదాల, ముద్రిపా.)

౨. పల్లము.

క. ఇది హల్యాణమండలంబు,వ్వది నున్నది చెంచు
పల్లె వనమధ్యమునన్, మదననిభ యీాపు
లింధ్రా,స్పదంబు వెలివాడ !...
శివరా. ౩. ౫౬.

(పసులను బట్టుటకై త్రవ్వఁబడి గుండ్లులోనగు వానిచేఁ గప్పఁబడిన పల్లము. ఇట "వల" యను పాఠము శ. ర. ములో "పసగర గొను" శబ్దము చూచినఁ గనుపట్టును.)

క. పసులకు నొడ్డిన వదియై, మసఁగిన యవ్వాన
పశుసమాజము నెల్లన్, బసగరగొని ...
హరి పూ. ౭. ౧౬౭.

౩. మఱుఁగు, మాటు.

మ. ఇదె నీక్షింపు చకోరశాబకనిభాక్షీ
దీర్ఘికా హంసయుగ్మదకాంతః ప్రతిబింబి
తున్ గగనమధ్యోపస్థితుం జంద్రునిన్,
వది నీక్షించి నిజాధినాథుఁ డనుచున్
వాత్సల్య మేపారఁగాఁ, జగురొప్పం
బరిచుంబనం బొనరుచుం జంచూపు
టాగ్రంబునన్. నైష. ౮. ౧౯౧.

౪. అధికము, మిక్కుటము.

క. వదరెడి మేనును జెక్కఁగఁ, గదిసిన కెంగేలు
గ్రాలఁగా విప్రుఁడు రే, నిడుగెఱుఁగని
నికరంటంబడి, వదియగుదురు మంటమంటప
మ్మున నుండెన్. వేం. పంచ. ౪. ౨౪౪.

జః వదిగొను.

**వదిగొను.** అ. క్రి. (వది + కొను.) నెలకొను; కడఁగు.

ద్వి. అదిగాక హరుఁ డిరువదియొక్కదినము,
వదిగొని కంచిలో వాస గుర్వింప ...
బస. పు. ౪. ౫౯౯. పం.

ద్వి. గుది యత్పరాత్పరతో శివయనఁగ, వది
గొను నుపనిషద్వాక్యముల్ వినరె ...
పండితా. వాద. ౨౩౪. పా.

చ. మృగగతి మంచి తావులకు మెచ్చు సదా
వనిఁ బావనాళి దా, వదిగొని రోయు వంక
లను వంచకసంచయ మట్టిదే కదా, చగురు
ఘుటిల్లఁజూచు సరసప్రసవంబులఁ జంచరీక
పుం, గదుపులు నిచ్చలున్ వెదకుఁగా కుణ
పంబుల నక్కలేర్పడన్.
వేం. పంచ. ౧. ౧౭.

**వదిన = వదినె.** వి. ౧. భార్యయక్క.

ఉ. నావుడు సంతసిల్లి వదినం దగులాగుల
బుజ్జగించి లీలావతితో ...
విక్ర. ౮. ౯౩.

౨. అన్నభార్య. (సం. వధూనీ.)

ఉ. అన్నయశాలి వానిహృదయం బలరంగ
బహూకరించి మా, యన్నకు సేమమే
వదిన హర్షముఁగాంచునె పుత్రులెల్ల సౌ,
ఖ్యోన్నతులే కదా ... ఉ. రా. ౨. ౩౦౧.

**వదినె(నియ).** వి. (సం. వధూనికా, వదూనీ.)

౧. అన్నభార్య, జ్యేష్ఠుని భార్య.

ఆ. అనఘ వశముగాదు మనకు గోడండ్ర మీ,
వదినెఁ జుట్టములను సదనములకుఁ, బుచ్చు
మనియె ... భార. శల్య. ౧. ౧౧.

సీ. వదినె యంచునొకింత వాత్సల్యముంచక
పౌలోమి ముందలఁ బట్టువారు ...
రళా ౩. ౯౬.

క. నన్నుఁగని కోడలనుచును, గన్నులఁ గప్పు
కొని ప్రియము గావింతురు మీ, యన్నయు
వదినెయు నటువలె, మన్నింపఁగఁ దగదె
నీవు మామవు గావే. ఉ. రా. ౪. ౨౦౯.

౨. భార్యకు అక్క. (శ. ర.)

౩. తనకంటె పెద్దదిగాగు మేనత్త మేనమామల కూఁతురు. (శ. ర.)

**వదియ(దె).** వి. త్రొక్కఁగా మిగిలిన శేషము, ఒక వీసమగు గడ్డి మోపు.

సీ. వందవదియ వదెవంచె యంచనఁ ద్విగుణతతి
విశేషం బొప్పు ... ఆం. భా. ౨. ౭౭.

**వదుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) మాటలాడు వాఁడు. చక్కఁగా మాటలాడువాఁడు.

**వదులు.** అ. క్రి. బిగువు తప్పు, సడలు.

ఆ. భాగ్యహీనునకును బరుసవేది దొరుక,
నగియు నిల్వ దపుడు వదులు గాక, వాన
తోడవచ్చు వడగండ్లు నిల్చునా, విశ్వ ...
వేమ. ౩. ౨౫.

విశ. బిగువుతప్పినది, సడలినది.

మ. మదిరాపానమదాంధుఁడాత్మపటమున్ పై
నుండినన్ జారినన్, వదులై వ్రేలినఁ
జూపఁడు ... సీతారా. ౩. ౧౭౧.

జ: వదులుడి.

**వదులుడి.** వి. (వదులు + లూటి. సంధిని వర్ణ వికారము.) బీటిక, స్ఫోటము. (శ. ర.)

**వద్ద.** వి. దే. ఒద్ద, సమీపము.

ద్వి. అంత దూషణుఁడు మిత్రారిభీషణుఁడు,
వంతనొందుచుఁ దనవద్ద యోధులను ...
రం. రా. అర. ౧౬౪. పా. ౧౦. పం.

ఉ. ... మన్మథుండు ... కడకాలమునైనఖు,
ట్యాగికుఁడై తనాథవుల వద్దికి నల్వురఁ
బిల్చి యిట్లనున్ ... జ్ఞా. ౯. ౧౦౨.

క. గద్దియ వడి డిగ్గుచుఁ దన, వద్ద సభాసదులు
లేచి వారనిభక్తిన్, సద్దడక నసంభ్రాంతులై,
దద్దయుపంపనముఁ జేసెఁ దా మును కొన
చున్ ... ఉ. హరిశ్చ. ౨. ౮.

ఉ. ఆగతి వజ్రదంష్ట్రుఁ డెగటార్చిన దైవతముల్లు
వద్దకున్, వేగమె చక్రముఖ్యులగు వేల్పులు
కిన్నరసిద్ధసాధ్యగ, గరుడాహి
బుషికోటులు కల్పకపుష్పవృష్టిన, భా
గరిసెరి. మల్లుపు. ౩. ౫౦.

**వద్దు¹ = వలదు.** అ. క్రి. ('వలయు' ధాతువ్యతిరేకార్థకరూపము. ఇది సామాన్యముగా అన్నంతక్రియల కనుప్రయుక్తమై కొన వచ్చుచున్నది. ఉదా: చేయవద్దు, చూడవద్దు ను.)

ఉ. చక్కని వారిలో మిగులఁ జక్కని దాన
వటంచు వేడ్కతోఁ, జొక్కముఁ జెప్పి
రంగులకుఁ జూచిన యంతకు నా మనో
రథం, బక్కట సిద్ధమయ్యె నలనుబ్బెను
హా యిటులుండ వద్దయో, చక్కన బొమ్మ
యంచు నరసప్రతిభాషల నిచ్చగింపుచున్.
హంస. ౧. ౮౪.

ఉ. భార్గవరామ నీవు నొక పౌరుషశాలివి
బోలె మచ్చమూ, వర్గముతోడఁ బోరదవు
వద్దిక సాహసము ... దశా. ౬. ౧౧౭.

**వద్దు².** విశ. మొద్దు, లావు, స్థూలము.

ద్వి. వద్దుమొగంబులు వలిపెంపుజెముక,
బద్దలఁ గూర్చినపచ్చడంబులును ...
పండితా. పర్వ. ౩౪౪. పా. ౩. పం.

ద్వి. వద్దు మొగంబును వలుదచేతులును, బ్రద్ద
చిరుదొడలు బరడుప్రక్కలును ...
పండితా. దీక్షా. ౪౦. పా. ౯. పం.

**వద్యము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. చెప్పఁదగినది. నింద్యముగానిది. ౨. నల్లనిది.

ఉదా: వద్యపక్షము = కృష్ణపక్షము.

౩. మాట, ఒకదానిని గుఱించి చెప్పుట.

**వధ(ము).** సం. వి. అ. పుం. (ఇయ్యది చరిత్రాది గణములలోనిది.) ౧. చంపుట - మారణము. హత్య.

క. దోష మరసి కామంబును, రోషంబును లేక తగినరూపునఁ జేయన్, బోషకమగు ధర్మమునకు, వైషమ్యవిహీనమైన వధము నమోఘా.  భార. శాం. ౫. ౨౯౭.

౨. దెబ్బ, ఘాతము. ౩. పక్షవాతము. ౪. అంతర్ధానము, మాయమగుట. ౫. (గణిత) కూడిక, కలుపుట.

**వధకుఁడు.** సం. విశే. (అ. ధికా. అ.) చంపెడివాఁడు. ఘాతుకుఁడు. హంతకుఁడు. అపాయకరుఁడు.

వి. అ. పుం. ౧. ఉరితీయు తలవరి.

౨. రోగము. ౩. మృత్యువు.

**వధజీవి.** సం. వి. న్. పుం. ౧. వేఁటకాఁడు. ౨. కసాయివాఁడు.

**వధదండము.** సం. వి. అ. పుం. ౧. దెబ్బలశిక్ష, చేబుకుతోఁ గొట్టుట మొదలగు శరీరసంబంధమైనశిక్ష.

౨. ఉరిశిక్ష.

**వధాంగకము.** సం. వి. అ. న. చెఱ, కారాగృహము.

**వధావధ.** సం. వి. అ. పుం. పలువిధములుగఁ జంపుట.

వ. మఱియు ద్రమ్యాదినవవిధదంతవధలను ... పితృసర్వలంబు లిట్లు వచ్చి వధావధ సేయుచుండె ...  కు. సం. ౧౧. ౭౦౮.

ద్వి. తలపడి పోరుచోఁ జపనుండు గ్రుంకెఁ, గ్రుంకినఁ బోక యుక్కున సేన రెండు, వంకలఁ జెగి వధావధలుగాఁ బెనచి ...
ద్వి. భార. విరా. ౧. ౨౨. పా.

**వధించు.** సం. స. క్రి. మారణముచేయు, చంపు. (శ. ర.)

**వధువు.** సం. వి. ఊ. స్త్రీ. ౧. పెండ్లికూఁతురు. ౨. భార్య. ౩. కోడలు. ౪. స్త్రీ. ఆఁడుది. ౫. తనకంటెఁ జిన్నవాఁడైన జ్ఞాతిభార్య. చిన్నదియైన స్త్రీ సంఘువు. ౬. పశుపక్ష్యాదులలో ఆఁడుది. ౭. సుగంధి. †. ౮. చిన్నకచ్చోరము. †. ౯. సుగంధి ద్రవ్యము. (మే. ని.)

**వధూజనము.** సం. వి. అ. పుం. భార్య. స్త్రీజనము.

**వధూటి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ఆఁడుది. ౨. కన్యక.

ద్వి. ఈ విధ రంగమహీనాయకుండు, శివిమైనలవధూటిని వరియించి ...
ద్వి. పరమ. ౫. ౪౩౩. పా. ౧౨. పం.

౩. కోడలు.

**వధూపక్షము.** సం. వి. అ. పుం. పెండ్లికూఁతు పక్షమువారు. పెండ్లికూఁతు వైపువారు.

**వధూ(గృహప్రవే)శము.** సం. వి. అ. పుం. పెండ్లికూఁతు రత్తవారింటఁ బ్రవేశించెడి మహోత్సవము.

**వధూవస్త్రము.** సం. వి. అ. న. పెండ్లికూఁతు వస్త్రము.
(మధుపర్కము చూడుఁడు.)

**వధోదర్కము.** సం. విశే. (అ. ఆ. అ.) చావు ఫలితముగాఁగలది. ప్రాణాంతకమైనది.

**వధోద్యతుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. ఘాతుకుఁడు.
౨. రహస్యముగాఁ జంపువాఁడు.

**వధ్య.** సం. వి. ఆ. స్త్రీ. చంపుట, మారణము, హత్య.

**వధ్యపటహము.** సం. వి. అ. పుం. ఉరితీయు నపుడు వాయించెడు వాద్యము.

**వధ్యభూమి.** సం. వి. ఇ. స్త్రీ. ఉరితీయు చోటు.

**వధ్యమాల.** సం. వి. ఆ. స్త్రీ. ఉరితీయఁ దగిన జనుని మెడలో వేసిన పూలదండ.

**వధ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. చంపఁదగి నది. చంప వలసినది.
౨. ఉరిశిక్ష వేయఁ దగినది. 3. గాయపఱుపఁ దగినది. దెబ్బలు వేయఁ దగినది. శరీర శిక్షకుఁ దగినది. భేద్యమైనది.
వి. అ. పుం. బలి, దేవతకుపహారము.

**వధ్యశిల.** సం. వి. ఆ. స్త్రీ. ఉరితీయుట కేర్ప ఱిచినశిల.

**వధ్యుఁడు.** సం. వి. అ. పుం. శత్రువు. చంపఁ దగినవాఁడు.

**వధ్రము.** సం. వి. అ. న. ౧. తోలువాఱు, చర్మరజ్జువు. ౨. సీసము.

**వధ్రి.** సం. వి. ఈ. స్త్రీ. తోలువాఱు. చర్మ రజ్జువు.

**వధ్ర్యము.** సం. వి. అ. పుం. చెప్పు, పాదరక్ష.

**వనకణ.** సం. వి. ఆ. స్త్రీ. అడవిమిరియము. †.

**వనకోలి.** సం. వి. ఇ. స్త్రీ. అడివిరేఁగు. †.

**వనఖం(షం)డము.** సం. వి. అ. న. అడవి, చిట్టడవి.

**వనగవము.** సం. వి. అ. పుం. అడవియెద్దు. వన వృషభము.

**వనగహనము.** సం. వి. అ. న. అడవియందు దిట్టముగాఁ జెట్లు గలచోటు.

**వనగుప్తుఁడు.** సం. వి. అ. పుం. గూఢ చారుఁడు. (విల్యమ్సు.)

**వనగుల్మము.** సం. వి. అ. పుం. అడవిపొద.

**వనగోచరుఁడు.** సం. వి. అ. పుం. ౧. వేఁట కాఁడు. ౨. వనౌకసుఁడు, అరణ్యవాసి.

**వనచందనము.** సం. వి. అ. న. ౧. దేవదారు వృక్షము. ౨. అగురు చందనము. †.

**వనచంద్రిక.** సం. వి. ఆ. స్త్రీ. ఒక జాతి మల్లె తీఁగ. (రా. ని.)

**వనచరము.** సం. విశే. (అ. ఆ. అ.) అడవిలో సంచరించునది.
వి. అ. పుం. ౧. శరభమృగము, ఎనిమిది పాదములు గలజంతువు.
౨. అడవి జంతువు, వన్యమృగము.

**వనచరుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) అరణ్య మున సంచరించువాఁడు, బోయజాతివాఁడు.

**వనచర్య.** సం. వి. ఆ. స్త్రీ. అడవిం దిరుగుట, అరణ్యసంచారము.

**వనచ్ఛాగము.** సం. వి. అ. పుం. ౧. అడవి మేఁక. ౨. వరాహము. అడవిపంది.

**వనజ.** సం. వి. ఆ. స్త్రీ. [illegible] †. అడవిప్రత్తి. †.

౩. చిన్న కచ్చోరము. ‡. ౪. పెన్నేరు. ‡. ౫. పెద్దసోపు. ‡. ౬. అడవిమొల్ల బచ్చలి. ‡. ౭. అడవిపెసర. ‡.

**వనజము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. అడవిలోఁ బుట్టినది. ౨. నీటిలోఁ బుట్టినది.

వి. అ. పుం. ౧. అడవి యేనుఁగు. ౨. తుంగ ముస్త. ‡. ౩. అడవి మాదీఫలము. ‡.

న. పద్మము, తామరపువ్వు.

**వనజీవి.** సం. వి. న. పుం. ఆటవికుఁడు. అడవి మనుష్యుఁడు.

**వనజ్యోత్స్న.** సం. వి. ఆ. స్త్రీ. ఒక జాతి మల్లె తీఁగ. ‡.

**వనట.** వి. (√ వనరు.) ౧. దుఃఖము. శోకము.

చ. ... నీమనంబునఁ గల చింతాసంతతియును బుచ్చెద నాకడఁ జేరి తింక నీవనటఁ గోలంగఁబెట్టి గరుపంబుగఁ జెప్పుము దీని మూలముఁ ... భార. ఉద్యో. ౪. ౨౯౫.

గీ. అనిన మునియట్లు చేసెద నధిప చెపుము, పగవఁగత మేమి నీకు నెవ్వండ నేను, వనట యెవ్వనిదగునొక్కొ యని వివేక, దృష్టిఁ బరికింపు నిను నీవె తెలిసికొనుము.

మార్క. ౩. ౨౯౩.

క. సుతులు మును నాకు లేమిని, మతి నెంతయు వనటఁ బొంది ... భా. రా. బాల. ౪౬.

౨. బాధ, కష్టము.

క. చని కందమూలఫలములు, తిని వనటలఁ జాలడస్సి ధీరాత్మకులై, వనములఁ దప ములు సలిపెదు, వనవాసులు వెఱ్ఱులమ్మ వారిజనేత్రా. వీర. ౨. ౨౩౧.

ద్వి. వ్రతములఁ గడుడస్సి వనటలఁ గ్రుస్సి, యతిదుఃఖములఁ గుంది యాత్మలోఁగంది ... రం. రా. సుం. ౨౪౭. పా. ౬. పం.

సీ. హతావనాటక వీరభట మహార్భటులచే వన మార్గమార్గముల్ వనటఁజెంద ...

ఉ. రా. ౧. ౧౧౧.

**వనధి.** సం. వి. ఇ. పుం. సముద్రము, కడలి.

**వనతిక్త.** సం. వి. ఆ. స్త్రీ. పాఠ, చిఱుబొద్ది ‡.

**వనతిక్తము.** సం. వి. అ. పుం. ౧. అడవిముని కిక ‡. (విల్వమ్ము.) ౨. కరక చెట్టు.

**వనదము.** సం. వి. అ. పుం. మేఘము. జలదము.

**వనదీపము.** సం. వి. అ. పుం. వనచంపకము. అడవి సంపంగి.

**వనదేవత.** సం. వి. ఆ. స్త్రీ. అరణ్యాధిష్ఠాన దేవత.

**వనధార.** సం. వి. ఆ. స్త్రీ. రెండు చెట్లవరుసల మధ్యభాగము.

**వనధేనువు.** సం. వి. ఉ. స్త్రీ. ౧. ఆఁడు గవయ మృగము. ౨. అడవియావు.

**వనపల్లవము.** సం. వి. అ. పుం. శోభాంజనము. మునఁగ ‡.

**వనపాంసులుఁడు.** సం. వి. అ. పుం. వేఁట కాఁడు, వ్యాధుఁడు.

**వనపు.** వి. (√ వనరు.) వనగుట, పరిదేవనము. (శ. ర.)

**వనపూరకము.** సం. వి. అ. పుం. అడవిదబ్బ ‡.

**వనప్రవేశము.** సం. వి. అ. పుం. వానప్రస్థాశ్రమమునఁ బ్రవేశించుట.

**వనప్రస్థుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) వనవాసి జీవితము గడపువాఁడు. గృహస్థాశ్రమమును విడిచి యడవిలోఁ భార్యతోఁ గూడికొని, భార్య లేక గాని, నివ్వరి ధాన్యపుటన్నమును గాని కందమూలఫలములనుగాని భుజించుచు తపస్సు చేయువాఁడు.

**వనప్రియము.** సం. వి. అ. పుం. ౧. కోకిల. ౨. చాఱ ∗.

న. దాల్చినచెక్క, లవంగపు పట్ట.

**వనబీజ(క)ము.** సం. వి. అ. పుం. అడవి దబ్బ ∗.

**వనమక్షిక.** సం. వి. ఆ. స్త్రీ. దంశము. అడవి యీఁగ.

**వనమాల.** సం. వి. ఆ. స్త్రీ. ఎల్ల ఋతువుల పుష్పములతోఁ గూర్పఁబడి మోఁకాళ్లవఱకును వ్రేలుచు నడిమిభాగమున నించుక స్థూలముగా నుండు పూలదండ.

**వనమాలి.** సం. విణ. (న్. నీ. న్.) వనమాల ధరించినవాఁడు.

వి. న్. పుం. శ్రీకృష్ణుఁడు, విష్ణుదేవుఁడు.

**వనమాలిని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ద్వారకాపురము. ౨. పాచితీఁగ, వారాహీలత.

**వనము.** సం. వి. అ. న. ౧. అడవి, చెట్లగుంపు. ౨. తామరతీఁగలుమున్నగువానిగుంపు. ౩. నివాసస్థలము, ఇల్లు. ౪. సెలయూట. ౫. జలము, ౬. కలప. ౭. అరణ్యవాసము ౮. వెలుఁగు, కిరణము. ౯. పూజించుట.

**వనము(క్కు)చము.** సం. విణ. (చ్.) నీటిని విడుచునది.

వి. చ్. పుం. మేఘము.

**వనముద్గము.** సం. వి. అ. పుం. ౧. అడవి పెసరు. ∗. ౨. పిల్లపెసరు. ∗.

**వనమూర్ధజ.** సం. వి. ఆ. స్త్రీ. వృక్షవిశేషము, కర్కటశృంగి, మాచికాయచెట్టు. (వాచ.)

**వనరాజము.** సం. వి. అ. పుం. సింహము. మృగరాజము.

**వనరాజి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. ౧. వృక్షపఙ్క్తి. చెట్లవరుస. ౨. అడవిలోని త్రోవ.

**వనరు.** అ. క్రి. ౧. శోకించు, దుఃఖించు.

క. అనిలాత్మజుబలమును, ... వనరుచు
వనోపక, వనరుచు ధృతరాష్ట్రి
సుతులు వంగిరి తమలోన్ ...
భార. ఆది. ౫. ౨౪౭.

ఆ. నీకు పితరులట్లు శోకింపఁదగునె యెవ్వరిఁ
దలఁచి యింక వనరువాఁడ, నీవు ...
భార స్త్రీ. ౧. ౯.

గీ. చచ్చినకబంధుఁ డేటికి శబరి తెలుఁగుఁ,
జెప్పెనది యేటి కినసూనుచెలిమిఁ దెల్పె,
వాలి పడనేల సుగ్రీవుఁడేలనేల, మనము
రావేల యీనేల వనరనేల.
చంపూరా. ౬. ౧౪.

౨. విలపించు.

గీ. అనుజుఁ బొడఁగాన కెంతయునడవివెనుకఁ,
బోవునప్పుడు కానలోఁ బొగిలిపొగిలి,
తండ్రిఁ జేర్రాని వనరుచు ధరణిఁ బొరలు,
చున్న తమ్మునిఁ బొడగాంచి యుమ్మలించి.
వాసిష్ఠ. ౪. ౩౯.

గీ. కొడుకుఁగుఱ్ఱలపీనుగుల్ కుంభకర్ణ, మొండె
మును బంధుతనుఖండములును బడిన, పాలి
కలనిలోన మూర్ఛలు పోవుకొనుచు, వచ్చి
నిజనాథుపై వ్రాలివనరించెను.
రామా. ౮. ౨౩౩.

3. దీనాలాపములాడు.

ఆ. ... శరణ మగుడు సుతులఁ గరుణతో రక్షింపుఁ, డనుచుఁ గుంతి పగచి వనరు చుండె ... భార. ఆది. ౭. ౨౦౭.

గీ. వనరు శాకాయుల వణాయ వాయటంచు ... పాండు. ౫. ౧౪౯.

౪. ఒప్పు.

గీ. సకలభూషణమణిరుచినికరకిరణరాజి గడు మించి నిజమందిరంబు వెడలి, పొడుపు గుబ్బలి నడుమను వెడలునట్టి, వనజ బాంధవ వైఖరి వనర నపుడు. ప్రబంధ. ౧౭౮.

౫. ఉండు, వర్తిల్లు.

క. ఆనగుణము తనకు నుండఁగ, నెనయంగా నొరునిగుణము నెంచును మదిలోఁ, దన గుణముఁ దానుదెలియక, వనరయొరుని ననెడువాఁడు భ్రష్టుఁడు వేమా. వేమా. ౧. ౬౫.

వి. ౧. శోకము, దుఃఖము.

సీ. కందర్పశరవృష్టి నందనోపక ఘృష్టి వన వాసమునఁ గ్రుస్సి వనరునూపె ... మొ. రా. బా. ౨౨.

౨. వీలు, అవకాశము.

గీ. వనరు గలిగెను మనకు రావణునిఁ జంప, వినుఁడు మీరెల్ల నామాట వేడ్కమీఱ, దశరథుండను రాజు సంతానకాంక్ష, కొనర జన్నంబు గావించు చున్నవాఁడు. మొ. రా. బాల. ౩౭.

జ: వనట, వనవు.

**వనలక్ష్మి.** సం. వి. ఈ. స్త్రీ. కదళి. అరఁటి చెట్టు. ‡.

**వనవహ్ని.** సం. వి. ఇ. పుం. దావాగ్ని, కార్చిచ్చు.

**వనవాసనము.** సం. వి. అ. పుం. పునుఁగు పిల్లి.

**వనవాసము.** సం. వి. అ. పుం. ౧. అడవి యందలి నివాసము. ౨. వన్యజీవనము; ఊరూరు తిరిగాడు బ్రతుకు.

**వనవాసి.** సం. వి. ఇ. (న్. నీ. న్.) అడవిలో నివసించువాఁడు. అరణ్యవాసి.

న్. పుం. వానప్రస్థుఁడు.

**వనవృంతాకి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. అడవి నీరువంగ. ౨. వాకుడు. ౩. నేలమునఁగ ‡.

**వనవ్రీహి.** సం. వి. ఇ. పుం. నివ్వరి ధాన్యము.

**వనశృంగాటము.** సం. వి. అ. పుం. పల్లేరు ‡.

**వనశోభనము.** సం. వి. అ. న. పద్మము. తామర పువ్వు.

**వనశ్వానము.** సం. వి. న్. పుం. ౧. గుంట నక్క. ౨. పెద్దపులి. ౩. పునుఁగుపిల్లి.

**వనసంకటము.** సం. వి. అ. పుం. కాయ ధాన్య విశేషము, మనూరము.

**వనసమూహము.** సం. వి. అ. పుం. దట్టమైన యడవి.

**వనసంశోభని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. అడవి ప్రత్తిచెట్టు. ౨. వన్యపద్మలత ‡.

**వనస్థ.** సం. వి. ఆ. స్త్రీ. అశ్వత్థ వృక్షము. రావిచెట్టు ‡.

**వనస్థీ.** సం. వి. ఈ. స్త్రీ. రావిచెట్టు.

**వనస్పతి.** సం. వి. ఇ. పుం. ౧. పూవులు పైకిఁ గనఁబడక ఫలించెడు వృక్షము. పూవక కాచెడు చెట్టు. ౨. చెట్టు. (మత్తీ మొ.) ౩. చెట్టు మొదటనుండి కొమ్మల మొదళ్లవఱకు నుండెడి భాగము, స్కంధము. ౪. స్తంభము.

౫. యూపస్తంభము. ౬. కజ్జుతాయెత్తు. ౭. పరవంజా. ౮. సన్న్యాసి. యతి.

**వనాంతము.** సం. వి. అ. పుం. ౧. అరణ్య ప్రాంతము. ౨. అరణ్య ప్రదేశము.

**వనాఖుకము.** సం. వి. అ. పుం. ముద్గము. పెసరు †.

**వనాఖువు.** సం. వి. ఉ. పుం. చెవులపిల్లి, కుందేలు.

**వనాటము.** సం. వి. అ. పుం. వనమునందు చరించు జంతువు. (బ్రౌ. ని.)

**వనాబ్జిని.** సం. వి. ఈ. స్త్రీ. నీటి తామర తీఁగ.

**వనాయుజము.** సం. విశే. (అ. ఆ. అ.) వనాయు దేశమునఁ బుట్టినది.

వి. అ. పుం. వనాయుదేశమునఁ బుట్టిన గుఱ్ఱము, ఉత్తమాశ్వము.

**వనాయువు.** సం. వి. ఉ. పుం. దేశ విశేషము. ఒకానొక దేశము.

**వనార్ద్ర.** సం. వి. ఆ. స్త్రీ. అడవిపసుపు. మ్రాను పసుపు.

**వనార్చకుఁడు.** సం. వి. అ. పుం. పూల దండలు గ్రుచ్చువాఁడు. మాలాకారుఁడు.

**వనాలక్తము.** సం. వి. అ. స. ఒక విధమైన యెఱ్ఱమన్ను.

**వనాలిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ప్రొద్దుతిరుగుడుచెట్టు. సూర్యావర్తిని. (విల్యమ్సు.) ౨. హస్తిశుండి †. (వా. చ.)

**వనాశ్రమము.** సం. వి. అ. పుం. వనవాసము; వానప్రస్థాశ్రమము.

**వనాశ్రయము.** సం. వి. అ. పుం. ఒకజాతి కాకి. కాకోలము. మాలకాకి.

**వని.** సం. వి. ఇ. పుం. ౧. అగ్ని. ౨. రాశి, ప్రోగు. ౩. యాచన, వేఁడికోలు.

స్త్రీ. ఇచ్ఛ, కోరిక.

ఈ. స్త్రీ. అడవి, చెట్లగుంపు.

న్. పుం. ౧. వనప్రస్థుఁడు, వానప్రస్థాశ్రమమున నున్నవాఁడు, యతి. ౨. చెట్టు.

విశే. ఇ. యాచించువాఁడు, అడుగువాఁడు. (వాచ.)

**వనిక.** వి. పత్రిక, చీటి, జాబు.

సీ. రతి చిల్క తనకుఁ దత్పతి ముద్దుచిల్కతో వనిక వ్రాయించుట వినవె సారిణి ...

చంద్రా. ౩. ౩౭.

**వనిక.** సం. వి. ఆ. స్త్రీ. చిన్నయడవి.

**వనిత.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఆఁడుది. స్త్రీ. ౨. భార్య. ఇల్లాలు. గృహిణి. ౩. ప్రియురాలు. వలచినకాంత. ౪. పశుపక్ష్యాదులలో నాఁడుది.

**వనితము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. యాచింపఁబడినది. అడుగఁబడినది. ౨. సేవింపఁబడినది. కొలువఁబడినది.

**వనిష్ణువు.** సం. విశే. (ఉ.) యాచించువాఁడు. అడుగునట్టివాఁడు.

**వనీ(య)కుఁడు.** సం. వి. అ. పుం. యాచకుఁడు. బిచ్చగాఁడు.

**వనీపకుఁడు.** సం. వి. అ. పుం. యాచకుఁడు. బిచ్చగాఁడు.

**వనీపుఁడు.** సం. వి. అ. పుం. వనమును పాలించువాఁడు. తోఁటమాలి.

**వనేకింశుకములు.** సం. వి. అ. పుం. బ. వ. "అడవిలోని కింశుక వృక్షములు." యాదృచ్ఛికముగాఁ గనఁబడిన పదార్థము. ఇట్లే, "వనే బిల్వకములు." (బిల్వమ్సు.)

**వనేచరము.** సం. వి. అ. పుం. ౧. అడవి మృగము. వన్యజంతువు. ౨. వనేచరి.

**వనేచరుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) వనము నందు సంచరించువాఁడు. (బోయ మొ.)
వి. అ. పుం. ౧. వనవాసి, కిరాతుఁడు. ౨. వనప్రస్థుఁడు. తృతీయాశ్రమమున నున్నవాఁడు.

**వనోత్సాహము.** సం. వి. అ. పుం. ఖడ్గమృగము.

**వనోద్భవ.** సం. వి. ఆ. స్త్రీ. అడవి ప్రత్తి చెట్టు.

**వనోపప్లవము.** సం. వి. అ. పుం. దావాగ్ని. కార్చిచ్చు.

**వనౌకసము.** సం. వి. స. పుం. క్రోఁతి. అడవి జంతువు.

**వనౌకసుఁడు.** సం. విశే. స. అడవియందు వసించువాఁడు.

**వన్నియ[1] = వన్నె.** వి. (సం. వర్ణః.) ౧. శ్వేతాది వర్ణము, రంగు.
గీ. వేలుపుల తోఁడు తనకొక వెల్లమొదవె, కల దనుచు నిక్కు నింతియకాని యిట్లు, కలవె పలువన్నియలగిడ్డికదుపులనుచు,...
నీలా. ౧. ౪౭.
౨. కాంతి, శోభ.
గీ. వినుఁడు ... దచ్చికడల, నెన్నఁదగి వన్నియలకెల్ల నిక్కుచు, ...
నీలా. ౧. ౨౬.
ఉ. ... మృగపల్లవకోమలతత్పదద్వయీ, పాటలకాంతి మౌళిమణిపంక్తికి వన్నియ వెట్ట నాజగ, న్నాటకసూత్రధారి యగు నందనుఁ డర్మిలి మ్రొక్కె మ్రొక్కెనన్.
పారి. ౧. ౧౨౦.
సీ. ... నెఱిమించుచుండు వన్నియచెక్కడపు బొమ్మచికిలి దంతపుఁబాదుకలు దొడగి ...
దశా. ౧. ౯౭.
౩. చెక్కఁడనము, ఒప్పిదము.
ఉ. కిన్నరసిద్ధసాధ్యముని ఖేచర భూచర దేవ దైత్యులం, బన్నగ ... మానసస్పృష్టి యందుఁ దా, వన్నియగా సృజింప ...
వి. పు. ౨. ౨౯౦.
క. ... వనజంబుల కెంపుగలసి వన్నియ మిగులం, దనుఁగని లోకం బలరఁగ ...
దశకు. ౬. ౬౪.
౪. ఇంపు.
ఉ. కిన్నర మీటు వీణఁ బలికింపఁగ గీతములుం ప్రబంధముల్, వన్నియఁ బాడఁజెప్ప నని వారితచాతురిగల్గునట్లుగాన్ ...
వసు. ౩. ౩౩.
౫. రంగుపూఁత. (శ. ర.)
౬. వస్త్రవిశేషము, రంగుచీర.
గీ. సర్వశృంగారముల జిగుజొకములును, చిన్ని కస్తూరిమళ్లను జిలుకజాళ్లు, వన్నియలు మంచి బొమ్మంచువన్నియలును, మొదలుగాఁ గల చీరలు మదముతోడ ...
దనాభి. ౩. ౩౭.
సీ. నిండారు ప్రాఁత వన్నియఁ దాల్చి నొక వేళ జిగి పట్టుబొమ్మంచు చీరఁగట్టి ...
ఉ. హరిశ్చ. ౪. ౧౬.
౭. బంగారము యొక్క మేలిమి, నిగ్గు.
సీ. పరఁపన్నియలకోట పసిఁడి యొడ్డణముగా సౌధశృంగము లురోజములుగాఁగ ...
దశా. ౩. ౧౧౬.

౮. ప్రసిద్ధి.

మ. శ్రుతులన్ వన్నియ కెక్కు శాస్త్రములచే సొం పగ్గలించెన్ ... విక్ర. ౧. ౩౫.

ఉ. తన్నినవాఁడు తచ్చరణతామరసంబుల ప్రాలి...సిగ్గువోవు నా,వన్నియ సన్నమా... వేం. పంచ. ౪. ౪౬౩.

గీ. ... శూర్పణఖ మేనగోడలా చూడ లంకి, జీతనూజరయి యనఁగ వన్నియకు నెక్కు... శుక. ౩. ౨౦.

౯. ప్రశస్తి, ఉత్కర్ష.

వ. ... మరాళకులాధ్యక్షువలక్షపక్షంబులకు వన్నియపుట్టించి ... ఉ. రా. ౪. ౧౬౩.

౧౦. వర్ణన.

సీ. పాలింతు నేఁగటిస్ఫూర్తివైభవమునా నేత్రాహ్వయంబు వన్నియకు నెక్క ... వసు. ౬. ౮౫.

ఉ. ... వన్నియ మీఱఁ జెల్కురా, తేజి దువాళిఁ దోలిగడి దీటినదారి మిటారి ... దశా. ౨. ౩౦౦.

౧౧. రీతి, విధము.

ఉ. ఎన్నఁడుఁ గాను నీవు మొక టిచ్చినవాఁడవు గావు నీట నీ, వన్నియ కోడెగాండ్రు తగ వారవధూటులకై యొసంగునా, చిన్నెలు నీవు చూచియు నిసీ తలవంపఁగ నేర వన్నిఁటం, బిన్నతనంబు దాల్చితివి పెద్దగ నిన్నిఁక నాడనేటికిన్. విప్ర. ౪. ౨౭.

౧౨. (వ్యాక.) ప్రత్యయము.

(వ్యతి.) ప్రకృతి. (శ. ర.)

౧౩. అలంకారము. (శ. ర.)

**వన్నియ²**, వి. అంకవన్నె. (శ. ర.)

**వన్ను**, వి. (సం. వర్ణః.) రంగు.

సీ. మణిభూషణప్రభ ... దరహాసరుచిపరా ధరకాంతి మాన్పున న్వడువునఁ గెమ్మోవి వన్నువూన్చి ... కు. సం. ౯. ౨౦౯.

**వన్నువ**, వి. విధము, రీతి.

ద్వి. అలరుచుఁ జెందుచు వలచినవన్ను, కలఁ ప్రసాదామృతవసధి నోలాడి ... బస. పు. ౭. ౧౬౭.

అ. క్రి. (√ వన్నువ) రంగువేయు.

వ. అంతం దనుసంతాపంబు వాపనోపక పరమేశ్వరురూపు చిత్రించి చూచిన నైన నూఱటయగునోయని ... సలక్షణంబుగాఁ జిత్రించి వన్నువగొలిపి కంఠేఱ దెఱచిన. కు. సం. ౫. ౫౯౭.

**వన్నువు**, వి. (సం. వర్ణః.) వన్నె, రంగు.

చ. అలకలకాంతిఁ గప్పె లలితాక్షువిభూతి... అన్నిఁటికి వన్నువు పెట్టినమాడ్కిఁ బొల్పుగాన్. కు. సం. ౯. ౨౧౦.

చ. జలనిధు లేడు నీకొలనిఁ జాలవు ... నెలవు వన్నువు నీరనివాదు సేయు పేరులివనఁ బెల్లునం జెలఁగుచుండు మదాళివిహంగ సంగముల్ ... కు. సం. ౧౦. ౩౯౨.

**వన్నె¹** = **వన్నియ**. వి. ౧. శ్వేతాదివర్ణము, తెలుపు మొ. రంగు.

సీ. ధరణీజగుల్మలతావితానము పల్లవములకుఁ గట్టెఱ్ఱ వన్నె యొసఁగి ... భార. ఉద్యో. ౨. ౧౧౪.

సీ. చెంద్రిక పూవన్నె జిలుగు దువ్వలువను దడియొత్తె నొక్కకాంతాలలామ ... పారి. ౨. ౧౨.

మ. జిలుగుం జెంద్రికవన్నెచేలలును గాశ్మీరాంగ రాగంబులున్, ... మెఱయఁగా వేల్పుం

జఱోరేఖుణల్, లలిభీమేశ్వరు రాజశేఖ
రునిఁ గొల్వవచ్చి రొకొక్కమ్మడిఁ.
భీమ. ౫. ౧౦౭.

౨. కాంతి, శోభ.

సీ. విమలవర్తనమున వేదశాస్త్ర పురాణ
వాక్యార్థసరణికి వన్నెవెట్టె ...
విక్ర. ౧. ౪౪.

సీ. అనలాక్షుఘనజటావనవాటి కవ్వాఁడు
వన్నెవెట్టునవార్తవంపుఁబువ్వు ...
మనుచ. ౧. ౧౭.

౩. చేకూఁదనము, ఒప్పిదము.

వ. మెఱుంగుఁ జన్నులఁ గన్నెతమ్మిమొగ్గల
వన్నె నటమటంచి ... మనుచ. ౫. ౧౦౧.

క. వన్నె మెఱయంగ నాసతి,యున్న గృహం
బప్పు డరసి యుచితస్థితితో, విన్ననువునఁ
జని యచ్చో, సొన్నాటంకంబుపోలుసుద
తిని గాంచెన్. విక్ర. ౭. ౫౦.

ఉ. ... తత్క్రియోచితా,హారము నెమ్మి
నిచ్చుచు ననామయధన్యలఁ జేసె వన్నె
గాఁ ... మనుచ. ౬. ౧౩.

౪. రంగుచీర.

సీ. తన్వంగి వలిపంబుఁదాల్చి వచ్చినఁబివి వన్నె
గట్టిననాఁటి చెన్నుఁదన్ను ...
విజ. ౨. ౩. ౧౩

౫. బంగారముయొక్క మేలిమి, నిగ్గు.

గీ. తజ్జ్ఞానంజేరనగు కవితా విశేష, మజ్ఞానంజేమి
యెఱుఁగంగనగు సమస్తకనక వర్ణోత్క
రంబునఁ గానవచ్చు, వన్నె తెఱుఁగంగఁ
బోలువే వట్టిరాత. కు. సం. ౧. ౩౨.

ఉ. ... నిద్దపుఁజాయ మెఱుంగునం బదా,
ర్వన్నె పసిండితోడ నొరవచ్చు నృపాలుని
యంగకమ్ములఁ ... వైప. ౬. ౫౦.

చ. ... మేలిపదియాఱువవన్నెపసిండితోడ
వేల్పుల దొరమానికంపు రవఁ బొందుగఁ
గూర్చిన చందమూఁజూమీ...నీలా. ౨. ౩౦.

వ. ... కడవన్నె పసిఁడి గద్దియ నధి
వసించి ... దశా. ౧. ౧౪.

౬. విలాసము, శృంగారచేష్ట.

గీ. వారిచొక్కులు టెక్కులువారివగలు, వారి
వన్నెలు చిన్నెలు వారిసటలు, వారిహారువులు
మురువులు వారి కళలు, వారి వలపులు సొల
పులు వశమె పొగడ. ఉ. రా. ౬. ౧౬౬.

సీ. వన్నెలు పచరించి కన్నుసన్నలుచేసి వెడ
మాటలను బ్రేమ గడలు కొలిపి ...
ప్రబోధ. ౧. ౨౫.

౭. అలంకారము.

గీ. గరగరికగాఁగఁ దన్నొమఁ గలుగుటయును,
బ్రేమ మీఱంగ వన్నెలు పెట్టుటయును,
కురులు గొప్పనఁ గూడెడు కొమరు వయసుఁ,
దెలిపె నానాట గన్యకాతిలకమునకు.
దశా. ౭. ౭౨.

౭. ప్రశస్తి, ఉత్కర్షము.

సీ. దీనిపాలిం డ్లుబ్బఁగాని కొరతచేతి కిన్నెర
ప్రమోఁతకు వన్నెగలిగె ...
ఆము. ౬. ౧౦౫.

గీ. ... అమ్మ భవనీయ చిత్రగుణాతిశయము,
వలన మాకెల్ల వన్నెరామెలఁగవమ్మ ...
వసు. ౬. ౫౬.

గీ. పడగ లెత్తక పడుకులఁ బట్టి యడఁగి,
యున్న ఫణిజాతి కిప్పుడు వన్నె గలిగె ...
ఉ. రా. ౧. ౧౫౦.

౯. ప్రసిద్ధి.

సీ. కులములో వన్నె తక్కువ యయ్యోవే
గాధిపట్టికి మేనకచుట్టరికము ...
మనుచ. ౨. ౨౩.

చ. ... యౌవన భరరూప సంపదల వన్నెకు
నెక్కుటఁ జేసి ... రాజ. చ. ౩. ౫౪.

ఉ. ... కన్నియ నన్ను వల్లభుఁడు గన్నులఁ
గప్పకొనంగ నుండి యా, వన్నెయు
వ సియుం దఱిఁగి వారు ననుం దలెత్తి
చూడఁగా ... పారి ౧. ౭౭.

రగడ. తనువలగ్న మీఁదఁ గోఁటి దాఁటు దాఁటి
జెట్టువంప, వనిత యొట్లువచ్చె వన్నె వాసి
వానిసం జరింప ... వరాహ. ౩. ౯౨.

౧౦. వర్ణన, పొగడ్త.

క. సుబలతనయ గుణమహిమన్, బ్రబలి
తసతు దారధర్మపాలనలీలన్, సొబగొంది
వన్నెఁదేఁగా, విబుధస్తుతుఁ డవ్విభుండు
వెలసెన్ ధరణిన్. రాఘవ. ౧. ౪.

క. ... చ్చిన యింటికిఁ దగని, న్నిచ్చిన యింటి
కిని వన్నె యేచందమునన్, దెచ్చెదవో
చూచెదఁ గా,నిచ్చలు మనవంగడంబు
నిన్నుం బొగడన్. యయా. ౫. ౧౩౧.

౧౧. విధము, రీతి.

సీ. ఫణిరాజతల్పంబుపైఁ బద్మనాభుండు తిన్నఁ
గా శయనించు వన్నెఁదెగడి ...
హంస. ౫. ౩౧౩.

అవ్య. విధము, రీతి.

ఉ. ... క్రొన్నెలతాల్పు ముద్దియను గూర్చి
యొనర్చిన నోము లిప్పు డే,వన్నెను బండునో
నలువవ్రాఁత తెఱం గిఁక నెట్టులుండునో ...
నీలా. ౧. ౧౦౬.

విణ. అందమైన.

గీ. రార నా వన్నెవడుగ రారా తనూజ ...
హర. ౨. ౧౩౩.

జ: వన్నెకత్తె, వన్నెకాఁడు, వన్నెకారి,
వన్నెకుఁ దెచ్చు, వన్నెకెక్కు, వన్నెకోక,
వన్నెగుడ్డ, వన్నెచెట్టు, వన్నెపులుఁగు,
వన్నెపూలు, వన్నెమణుంగులు, వన్నె
మీఱు, వన్నెలాఁడి, వన్నెలాఁడు, వన్నె
వెదరు.

వన్నె[2] = వన్నియ. వి. అంకవన్నె. గుఱ్ఱము
నెక్కుట కిరుప్రక్కల నమర్చిన యినుపమెట్టు.

ఉ. ఉక్కడమైన మంచితనువొప్పెడు నా
హయరత్నమెక్కినన్, గక్కసమేమి లేక
రవగాలును జోడన యడ్డ కేడెముల్,
లుక్కుడు వాలి జంగనడలుం గనిపించుచుఁ
బోయి పోయి రాజకుడ వన్నెసోఁక
నటిపోయనిసన్ గదలెన్ జరీలునన్.
సారంగ. ౧. ౭౨.

వన్నెకత్తె. విణ. (వన్నె[1] + కత్తె.) విలాసవతి.

ద్వి. వన్నెకత్తెలు వారవనితలు మఱియు, చప
లముల్ తగులముల్ చంచలత్వములు ...
పండితా. పురా. ౧౧౬. పా. ౨౦. పం.

వన్నెకాఁడు. విణ. (వన్నె[1] + కాఁడు.) ౧.
అందగాఁడు, సౌందర్యవంతుఁడు.

మ. ... మా,విజయుం డేగడు వన్నెకాఁడు
మది నావేశించు నెల్లప్పుడున్ ...
భాగ. ౧. ౨౧౭.

౨. విలాసవంతుఁడు.

సీ. ఏ వన్నెకాని కీలావణ్యవతిగోటిచెనకులు
గళలూరఁ జేయునొక్క ...
ఉ. రా. ౪. ౧౯౪.

సీ. సంగడికాఁ డిందుఁ జనుదెంచెనా యని
వాకిలి ద్రొక్కని వన్నెకాఁడు ...
హంస. ౫. ౨౧౪.

గీ. వాని యిల్లాలికై ధనవంతుఁడనెడి, వన్నె
కాఁడట్టి మదివట్టి వలపుఁజెందు ...
శుక. ౨. ౬౪.

౩. నేర్పరి.

గీ. మహతి నారాయణాత్మక మహితమంత్ర,
వర్ణములు పాఱఁ బల్కించు వన్నెకాఁడు.
రంగా. ౧. ౭౯.

**వన్నెకారి.** విూ. (వన్నె[1] + కారి.) విలాస వంతుఁడు.

గీ. చిలుక యిట్లనునప్పు డచ్చెలువ మోస, కారి
పెనిమిటిరో వన్నెకారి మగఁడ, యేల
చూపితి విప్పుడ యీ ధనంబు, ధనపిశా
చమ్ము లివి యథార్థమ్ము సుమ్ము.
శుక. 3. ౨౨3.

**వన్నెకుఁదెచ్చు.** స. క్రి. (వన్నెకు + తెచ్చు.) ప్రసిద్ధికెక్కించు, ప్రఖ్యాతికలిగించు.

ఉ. ... రంగయరాఘవమంత్రి నిచ్చలున్,
వన్నెకుఁ దెచ్చు నిచ్చు నభివాంఛితవస్తువు
లర్థికోటికిన్ ... పాండు. ౧. ౫౪.

(ఇట " వంశమును " అధ్యాహార్యము.)

**వన్నెకెక్కు.** అ. క్రి. (వన్నెకు + ఎక్కు.) ప్రఖ్యాతివడయు.

సీ. భ్రమరకీటన్యాయభాతి నేకవిరాజు వార్ధి దానరై వన్నెకెక్కి ... సరస. ౧. ౮.

**వన్నెకోక.** వి. (వన్నె[1] + కోక.) చిత్రవర్ణము గలవస్త్రము, పలురంగులచీర.

సీ. అరుదైనతిపిరికిన్నెరతమ్ముపడిగంబు వన్నెకోకలచంగువాపిరంగి ...
ప్రబంధ. ౭౨3.

**వన్నెగుడ్డ.** వి. (వన్నె[1] + గుడ్డ.) రంగువేసిన గుడ్డ.

ఉ. దట్టపువన్నెగుడ్డ కటిదట్టిపొరన్ సవరించి పట్టెపై, గట్టి కటారిజల్లి మడికాసుల కట్టులయొక్కవిండ్లుపై, న్నెట్టెపుగట్ట నెట్టుకొను నిద్దపు వీఁపుదోనల్ నటింప మై,

పుట్టిన నల్లబెబ్బులులెపోయనఁ బోయిబోయబల్లిదుల్. రా. వి. ౨. ౫౫.

**వన్నెచెట్టు.** వి. (√ వన్నె[1].) వర్ణపుష్పము, ఒక జాతిచెట్టు. ‡. (శ. ర.)

**వన్నెపులుఁగు.** వి. (√ వన్నె[1].) జీవంజీవము, చకోరము. (శ. ర.)

**వన్నెపూలు.** వి. బ. (√ వన్నె[1].) శాలి ధాన్య విశేషము. (శ. ర.)

**వన్నెమణుంగులు.** వి. (√ వన్నె[1].) వస్త్ర విశేషము.

వ. పీతాంబరములు నీరాగులు బురుసాలు వన్నెమణుంగులు చందురుకావులు ...
ప్రబంధ. ౬౦౫.

**వన్నెమీఱు.** అ. క్రి. (వన్నె[1] + మీఱు.) ప్రకాశించు; ఒప్పు.

సీ. ... కన్నెగేదఁగి కన్నఁబొన్న చాయసెయున్న సన్నజాజులచెన్ను వన్నె బాటె.
దశా. 3. ౮.

క. ... మిన్నేటి పసిఁడి తామర, క్రొన్నలను వన్నెమీఱఁ గోయుదు రెపుడున్ ...
నీలా. ౧. 33.

**వన్నెలాఁడి.** వి. (వన్నెలు[1] + ఆఁడి.) విలాసవతి, విలాసములు కలది.

ఉ. వెన్నెల వన్నెలాఁడి సెలవిన్నెల కొల్పెడు నవ్వుఁ బువ్వుచాల్, క్రొన్నెల కన్నెలాగునఁ దళుక్కను నిక్కనయన్ను నెన్నొసల్ ... రా. వి. ४. ౯౧.

సీ. నీ ప్రాణనాథుఁడై నిను నేలు భాగ్యమెవ్వానికిఁ గల్గెనే వన్నెలాఁడి ...
ఉ. రా. 3. ౧౦౫.

**వన్నెలాఁడు.** వి. (వన్నెలు[1] + వాఁడు.) అందగాఁడు.

గీ. ... మీఁగడ పెరుఁగు పాల్వెన్న జున్ను, లన్నియును గొల్లలాడు నవ్వన్నెలాఁడు ... నీలా. ౧. ౭౬.

సీ. కలికిరో యాతఁడే కులుకుఁ బ్రాయపు గొల్లకన్నెల వలపించు వన్నెలాఁడు ...

వన్నె వెదురు. వి. (√ వన్నె[1].) వృత్తపత్రము, వృక్ష విశేషము.

గీ. ... వన్నె వెదురన మను వృత్త పత్త్రి మభవ ... ఆం. భా. ౨. ౭౩.

వనస్య. సం. వి. ఆ. స్త్రీ. ౧. అరణ్య సమూహము. ౨. నీటివెల్లువ. ౩. ముద్గపర్ణి, పిల్ల పెసర ‡. ౪. పెద్దసోపు ‡. ౫. గురివెంద ‡. ౬. తుంగముస్త ‡. ౭. అడవిక చోరము ‡. ౮. బుడమ ‡.

వనస్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వన సంబంధమైనది. వనమందుఁ బుట్టినది. ౨. ఆరణ్యకము. పెంపఁబడనిది. ౩. కట్టిది.

వి. అ. పుం. అడవి మృగము, అడవిచెట్టు.

న. ౧. దాల్చిన చెక్క, లవంగపు పట్ట. ౨. అడవి కంద.

వప. సం. వి. ఆ. స్త్రీ. ౧. అస్థిసారము, మజ్జ. ౨. రంధ్రము, కన్నము. ౩. పుట్ట, వల్మీకము. ౪. అంత్రము. (ప్రేగు) పైనుండు పలుచని పొర, కడుపులో బొడ్డుక్రింద నుండెడి యుల్లి పొరవంటి పలుచనిపొర.

వపనము. సం. వి. అ. న. ౧. విత్తులుచల్లుట. ౨. ముండనము. గొఱుగుట. ౩. శుక్రము, రేతస్సు.

వపని. సం. వి. ఈ. స్త్రీ. ౧. మంగలికత్తి. ౨. క్షౌరశాల, వపనశాల. ౩. నేత పనిముట్టు, తురి, నాడె. ౪. తంతుశాల, నేతశాల.

వపము. సం. వి. అ. పుం. ౧. విత్తులుచల్లుట. ౨. ముండనము, గొఱుగుట. ౩. నేత, నేయుట.

వపునము. సం. వి. అ. పుం. దేవత. (వాచ.)

వపుర్ధరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. శరీరము ధరించువాఁడు. ౨. సుందరుఁడు అందగాఁడు.

వపుష్మంతుఁడు. సం. విణ. (త్. తీ. త్.) ౧. శరీరముగలవాఁడు. శరీరముధరించినవాఁడు, అవతరించినవాఁడు. ౨. సుందరుఁడు, అందగాఁడు.

వి. త్. పుం. విశ్వేదేవులలో నొకఁడు.

వపుస్సు (వు.) సం. విణ. (స్.) సుందరము, చేక్కనిది.

వి. స్. న. ౧. దేహము, ఒడలు.

క. శ్రుతియును నిన్ను మృగేంద్రా, కృతియని కీర్తింపఁగలదు కేశవమృగసం, తతికి మృగాధిపు క్రియదే,వతలకు నెల్లను నృసింహవపు వెక్కువగుట ... హరి. ఉ. ౯. ౨౨౭.

౨. తత్త్వము, స్వభావము. ౩. సుందరాకారము.

వప్త. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) విత్తులు చల్లువాఁడు, మొక్కలు నాఁటువాఁడు.

వి. ఋ. పుం. ౧. కృషీవలుఁడు, సేద్యగాఁడు. ౨. జనకుఁడు, తండ్రి. ౩. గొఱుగువాఁడు, మంగలి.

వప్పు. ౧. గంటు, గాయము.

ద్వి. కలయంగఁబులి నీళ్లు గ్రమ్మ్రుచునున్న, వలుదచన్నుల మీఁది వప్పులు చూచి ... నవ. ౨. ౯౧. పా. ౨౨. సం.

౨. శకలము, తునక.

క. దుప్పులు కుప్పించి తతోత్కటర కుటీరంబుల
నున్న పన్నగంబులఁ గొమ్ములం గ్రుమ్మి...
వెడలను మియ నెఱయుతత్ఫణామణిగణంబు
క్రొవ్వాడి వప్పుల గొప్ప కుప్పలంబఱచు
నెడల మెత్తగాలువడి ... (ఇదియా ఖేట
వర్ణనము.) ... చంద్రా. ౨. ౭౪.

**వప్రకము.** సం. వి. అ. పుం. చక్రముకై వారము. (చుట్టుకొలత.)

**వప్రక్రియ.** సం. = వప్రక్రీడ.

**వప్రక్రీడ.** సం. వి. ఆ. స్త్రీ. గజవృషభాదులు ఏటిరొడ్డు మున్నగువానిని ఉత్సాహమునఁ గొమ్ములతోఁ గ్రుమ్మి యొఱఁజిమ్ముట.

**వప్రము.** సం. వి. అ. పుం. స. ౧. అగడ్తలో నుండి యెత్తి ప్రాకారమునకు చుట్టును బలకరముగా పోయు మట్టిదిబ్బ. ౨. గజవృషభములు కొమ్ములతోఁ బొడిచెడు మట్టిదిబ్బ. ౩. పర్వతమునం దేటవాలుగా నుండెడి స్థలము. ౪. పర్వతశిఖరము. కొండకొన. ౫. నదీతీరము; తీరము. ౬. ఇంటిపునాది. ౭. కోట మొదలగు వానిచే సంరక్షింపఁబడు పట్టణము యొక్క ద్వారము. ౮. కందకము. ౯. గోళము యొక్క చుట్టుకొలత. ౧౦. విత్తులు చల్లిన పొలము; పొలము. ౧౧. గజవృషభాదులు తటము మున్నగువానిని గ్రుమ్ముట. ౧౨. రేణువు, దుమ్ము.

న. సీసము.

**వప్రాభిఘాతము.** సం. వి. అ. పుం. నదీతీరమును గాని, పర్వత ప్రదేశమునుగాని, క్రుమ్ముట. తటాఘాతము.

**వప్రి.** సం. వి. ఇ. పుం. ౧. పొలము, క్షేత్రము. ౨. సముద్రము. ౩. దుర్గతి, దుస్థితి, కష్టదశ.

ఈ. స్త్రీ. - మంటిదిబ్బ.

**వప్రుఁడు.** సం. వి. అ. పుం. ౧. జనకుఁడు. తండ్రి. ౨. ఒక ప్రజాపతి.

**వమధువు.** సం. వి. ఉ. పుం. ౧. క్రక్కుట; ఉమ్మివేయుట. ౨. ఏనుఁగు తొండమునుండి పైకిఁ జిమ్మబడిన నీరు

**వమనము.** సం. వి. అ. న. ౧. బయటికి పంపుట. ౨. క్రక్కుట. ౩. తీసికొనుట. ౪. మర్దించుట. ౫. వమనము చేయించుమందు. ౬. బలి యిచ్చుట. ౭. నొప్పి, బాధ.

పుం. గంజాయి చెట్టు. †.

**వమని.** సం. వి. ఈ. స్త్రీ. జెలగ. జలూక.

**వమనీయ.** సం. వి. ఆ. స్త్రీ. ఈఁగ.

**వమనీయము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. క్రక్కఁదగినది. ౨. వెళ్లఁగొట్టఁదగినది.

**వమి.** సం. వి. ఇ. పుం. ౧. అగిత. ౨. ఉమ్మెత. †. ౩. దుష్టుఁడు.

స్త్రీ. ౧. వమనము; వమనేచ్ఛ. ౨. వమనములు చేయించుమందు.

ఈ. స్త్రీ. డోకు, వమనము; వమనేచ్ఛ.

**వమ్ము.** విశ. ౧. వ్యర్థము.

గీ. అధిప సర్వాస్త్ర ఘాతియై యతిశయిల్లు,
నస్త్రమునఁ జిత్రముగఁ దెగయందఱుని
మెంనమ్మహాస్త్రంబు నట్లది వమ్ముగాఁగ,
నెఱిఁగి వెలఁగంది హరికతఁ డిట్టులనియె.
భార. ద్రోణ. ౩. ౨౦౫.

సీ. రహినిహ పరసుఖ ప్రదుఁబుత్రు నెత్తని
వరపుణ్యహీను భవమ్ము వమ్ము ...
రాఘవ. ౧. ౪౬.

ఉ. ఆ సమయంబునన్ జకితమై మొక మెవ్వని
మీఁదఁ బాఱె వాఁ, డేసిన యమ్ము వమ్మయి

మహింబడకొక్కటి కొండ చాలి సి్రశా
కులఁ జేయు ... మనుచ. ౪. ౪౯.

౨. నష్టము, చెడినది.

ఉ. మానవకోటి నిట్లిడినుమానవుఁ బీనుఁగులైన
వారి నెం్రదైనను గంటిమే యకట యాఁజడి
వమ్మయి పోయె దుర్జయుం్రబైనబలంబు ...
భార. నిరా. ౩. ౭.

చ. అనఘ ... కుడుచుఁ గట్టుదొడుం దన
యిచ్చ నొకర్కుఁడుణ్, దనయ సతీస్నుపా
దులకుఁ దానిడఁ డెన్నడుఁ గూడుచీరయే,
జనులకుఁ బెట్టఁడన్నరుని సంపన యాతని
తోనవమ్మగుణ్ ... సూర్కా. ౫. ౧౯.

ఉ. ... తునిసి వమ్మగు ఛ్రతము లాడు
నట్టలుణ్, దూలెడి రూపులుణ్ దొరఁగు
తోరపు నెత్తురుటేఱులంగుఁబైఁ, దేలెడు
పీనుఁగుల్ గలిగ ధీరతఁ బోరెడు రెండు
సేనలణ్ ... ఉ. రా. ౩. ౧౨.

వి. ౧. నాశము.

క. ... ఇమ్మెఁ్రబలుకఁ దగునె యక్కట నా,
వలనంగల భక్తియెల్ల . వమ్మునఁ
గలయుణ్ ... భార. భీష్మ. ౩. ౧౭౫.

ఉ. ఇమ్మెయ నర్థమెల్లను వ్యయింపఁ బురిం
గల వైశ్యులందఱుణ్, నెమ్మిఁ బురందరుం
గదిసి నీవు వణిక్కుల వర్తనంబు సర్వ
మ్మును వమ్మునం గలిపి ...
వి్రక. ౨. ౧౬౬.

౨. వైయర్థ్యము.

ఉ. వమ్మొకయింత లేక నిడువాలిక బాగును
సోగలాగునుణ్, గమ్మన వీనకాంతి గతిఁ
్రగమ్మఁగఁ జేసి దివానిశంబులుణ్, నెమ్మి
లతాంతసాయకుఁడు నిక్కముగా సవరించు
వింటికిణ్, బొమ్మలఁ బెట్టునట్టి కను
బొమ్మలు చూడఁగ నొప్పె బాపురే.
చి్రత. భా. ౩. ౬౭.

జ: వమ్మపఱుచే, వమ్మవోవు, వమ్మసేఁత,
వమ్మసేయు.

**వమ్ముపఱుచు.** స. ్రకి. (వమ్ము + పఱుచు.)
సీ. ... గీ. మమ్మునందఱఁ బోరిలోవమ్ము
పఱిచి, దుష్ట రావణుఁ ్రబాణంబు తో
డడించి, పావనుండైన తమ్ముఁడు నీవుఁ
గూడి, పోయి తటవయ్య రాక్షస మాయఁ
దగిలి. మై. ౨. ౪౯.

**వమ్ముపోవు.** అ. ్రకి. (వమ్ము + పోవు.)
౧. నష్టమగు, చెడు.
సీ. మాతం్రడి కొలువులో మానినీ తిలకంబ
రమ్మను నాపేరు వమ్మపోయె ...
ఉ. హరి. ౫. ౭౨.
౨. వ్యర్థమగు. (శ. ర.)

**వమ్ముసేఁత.** వి. (√ వమ్ముసేయు.) వ్యర్థ
పుచ్చుట.
గీ. వెలఁది జూదంబు పానంబు వేఁట పలుకు
్రపల్లదంబును దండంబు పరుసదనము,
సొమ్ము నిష్ఫ్రయోజనముగ వమ్ముసేఁత,
యనెడు సప్తవ్యసనములఁ జేనదు తగుల.
భార. ఉద్యో. ౨. ౪౪.

**వమ్ముసేయు.** స. ్రకి. (వమ్ము + చేయు.)
వ్యర్థముచేయు. చూ. వమ్ముసేఁత.

**వ్రమకూటము.** సం = వ్రమీకూటము.

**వ్రమము.** సం. వి. అ. పుం = వ్రమి.

**వ్రమి.** సం. వి. ఈ. స్త్రీ. చెదలు.

**వ్రమీకూటము.** సం. వి. అ. పుం. వల్మీకము.
పుట్ట.

**వయఃపరిణతి.** సం. వి. ఇ. స్త్రీ. వయస్సు
ముదురుట ; పెద్దవయస్సు.

**వయః ప్రమాణము.** సం. వి. అ. న. ౧. జీవిత పరిమితి. ౨. జీవితకాలము; బ్రదికెడుకాలము.

**వయనము.** సం. వి. అ. న. నేయుట.

**వయస్కరము.** సం. విశే. (అ. ఈ. అ.) బలారోగ్యములను గలిగించునది. ఆయుస్సును వృద్ధిచేయునది.

**వయస్థ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. వయస్య, చెలికత్తె, సఖి, ౨. కరకచెట్టు. ౩. చిన్న యేలకికాయ.

**వయస్థుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. యువ, ప్రాయమువాఁడు, పడుచువాఁడు. (పదియాఱేండ్లు మొదలు ముప్పది యేండ్లవఱకునుగల వయసు గలవాఁడు.) ౨. ఈడు వచ్చినవాఁడు, బాల్యమతిక్రమించిన వాఁడు. ౩. సహజమైన దేహదార్ఢ్యము గలవాఁడు.

వి. అ. పుం. స్నేహితుఁడు, చెలికాఁడు.

**వయస్య.** సం. వి. ఆ. స్త్రీ. స్నేహితురాలు, చెలికత్తె.

**వయస్యుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. సమాన వయస్సు గలవాఁడు. ౨. సమకాలికుఁడు.

వి. అ. పుం. మిత్రుఁడు, నెయ్యుఁడు.

**వయస్సంధి.** సం. వి. ఇ. పుం. ౧. జీవితమున బాల్యాది దశలలో నొకదానినుండి నొకదానికి మాఱెడి కాలము. ౨. బాల్యము వదలి యౌవనము వచ్చుకాలము, యౌవనారంభము.

**వయస్సు(సు).** సం. వి. స్. న. ౧. ఈడు (బాల్యాదికము) ౨. యౌవనము, పడుచుఁదనము. ౩. పక్షి, పిట్ట. (ఈ యర్థమునఁ దెనుఁగున వ్యస్త ప్రయోగము కానరాదు.) ౪. (సహజమైన) దేహదార్ఢ్యము. ౫. ఆరోగ్యము.

**వయారము.** వి. ఒయ్యారము.

క. మెలఁగుగ్ దలఁగుగ్ భయమునఁ, గలఁగుగ్ ములఁగుగ్ లతాంగి కపటారభటిన్, జెలఁగుగ్ వలగొను నెనరున, నలఁగుగ్ దొలఁగుగ్ నగుగ్ వయారము మీఱన్.

క్రీ. శకుం. ౨. ౧౩౭.

**వయాళి.** వి. (సం. వాహ్యాళి.) విహారము, అసివాఱు.

చ. ... మహీతలేశ్వరుఁడు రథస్థుఁడై కుసుమశాలి వనాళివయాళి వెల్వడెన్ ...

క్రీ. శకుం. ౧. ౫౯.

ఉ. ..., గిబ్బవయాళి తేజి దుమికించుచు వచ్చె మహేశుఁ డత్తఱిన్ ...

దశా. ౨. ౬౯.

సీ. మొసలితేజి వయాళి మురిపంపు జగరాతు సామిగా నోఁచు నాశకుసుకేణు.

చంపూరా. ౬. ౮౩.

**వయిచు = వైచు.** స. క్రి. ౧. త్రోయు.

శా. ... ఆరూఢోన్నత వప్రహర్మ్యతతితో నవ్వీడు దుర్వారగ, ర్వారభంబున గంగలో వయిచు వాఁడై ... హరి. ఉ. ౪. ౧౦.

౨. విసరివైచు.

చ. మఱదల రావె యంచు నొక మానిని యొక్కతెఁ జీరివచ్చున, త్తఱి విరిచెండ్లు చన్నుఁగవ దాఁకవడిన్ వయివం దటాలునన్ ... కవిరా. ౪. ౮౫.

ద్వి. వయిచుఁ డాయయగారి వాకిట శవము, దయసేయ కదియెట్లు తప్పింపవచ్చు.

పండితా. పురా. ౧౪౯. పా. ౧౨. పం.

**వయినము = వైనము.** (సం. వ్యాఖ్యానం.)

వి. ౧. వివరణము.

క. దేవర సృజియించితిరే, యీ విశ్వము దీనిఁ బ్రోవ నింద్రుని యుణఁపన్, గావ బ్రదంతు

సది సరి, యావయినము దెలియలేక యమ
రుల గడకున్. మల్లుపు. ౨. ౫౭.

మ. వయినం బింతయు బాలనెమ్మొయిని దావం
బొంద సొమ్మచ్చపుం, బయిఁడౌటన్న
సితంబుగా నయనసేవం జేయ మాను న్నిజ,
త్రయమంచున్ విరహాగ్ని మీఱ శశి జ్యో
త్స్నల్ నించె నల్దిక్కులన్.
పార్వ. ౫. ౧౬.

౨. క్రమము.

ద్వి. దయ నుపదేశించి తగ సృష్టిసేయు, వయి
నంబు బోధించి వాక్సిద్ధి నొసఁగి ...
విష్ణు. పూ. 3. (శ. ర.)

**వయునము.** సం. వి. అ. న. ౧. జ్ఞానము, తెలివి ; గ్రహణశక్తి. ౨. గుడి, దేవాలయము. 3. శాసనము, ఆజ్ఞ, ౪. ఆచారము, సంప్రదాయము, ౫. పరిశుభ్రత, శుచిత్వము.

**వయోగతము.** సం. విణ. (అ. ఆ. అ.)

౧. వయస్సును పొందినది, వయసునకు సంబంధించినది.

౨. సంవత్సరములో ముందైనది, వయసులో ముందైనది.

వి. అ. న. పడుచుఁదనము పోవుట.

**వయోతిగుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.)

౧. వయసుచే నతిక్రమించినవాఁడు, వయస్సునఁ బెద్దవాఁడు.

౨. వయస్సుదాఁటినవాఁడు ; వృద్ధుఁడు.

ఇట్లే వయోతీతుఁడు.

**వయోధికుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) వయసుచేఁ బెద్దవాఁడు.

వి. అ. పుం. వృద్ధుఁడు, ముసలివాఁడు.

**వయోరంగము.** సం. వి. అ. న. సీసము.

**వయోవృద్ధుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) వయసుచేఁ బెద్దవాఁడు.

**వయోహాని.** సం. వి. ఇ. స్త్రీ. ప్రాయము కడచుట.

౨. యౌవనోత్సాహము పోవుట.

**వయ్యంది.** వి. కుంపటి, అంగారధానిక
(శ. ర.)

**వయ్యము = వాయము.** విణ. వ్యర్థము.

క. ఎయ్యది కర్తవ్యమొకో, యెయ్యెడ నాలో
చనమున కెవ్వఁడొకో తో, డయ్యెఁడు
వాఁడీకార్యము, వయ్యముగాకుండఁ జేయ
వలయు కెరవుతోన్ ...
భోజరా. ౪. ౨౭౨.

ఉ. ... లియ్యనివిల్లుఁ బుష్పములఁ దీర్చిన
యమ్ములు శౌర్యసంపదల్, వయ్యముగాఁగ
భూమిఁ బడవైచె నిలింపులు చూచి భెగ్గిలన్.
హర. 3. ౬౬.

**వయ్యారము.** వి. ఒయ్యారము. విలాసము.

గీ. ఎండచేఁ గంది దండనాథుండుదాను, నంద
నమునకు వెడలి యానందలీల, వచ్చి వనిఁ
జొచ్చి చల్లని వసతులందు, బడలికలఁ దేలి
వయ్యారమడర నపుడు ...
ప్రబంధ. ౭౭౨.

**వయ్యాళి.** వి. (సం. వాహ్యాళిః.) స్వారి, విహారము.

ఉ. మాళవదేశవల్లభుఁ డమాను తేజుఁడు
లీలతోడ వయ్యాళికి వచ్చునట్లు మగ
ధాధిపుపై వెసనెత్తివచ్చినన్ ...
దశకు. ౪. ౯.

ఆ. వినుము ధర్మరాజా మనములో దాచక,
తెలియఁజెప్పవలయుఁ దేటపడఁగ, వాజి

చచ్చుదాఁక వయ్యాళి గలుగునే, మొనసి
నీరి కింక ముక్తిరొప్పుడు ...
సానందో. ౪. ౧౧౭.

ద్వి. మేలిమితురగంబు మీఁదట నెక్కి, లీల
వయ్యాళిఁ దోలిన బడలికయు ...
ద్వి. పరమ. ౨. ౧౨౪. పా. ౯. పం.

క. ... గయ్యాళి చిలుక లేడీ, వయ్యాళి
పిసాళిగాలి వలె నున్నంతన్ ...
సారంగ. ౧. ౧౩౬.

**వర.** వి. ౧. సస్యవిశేషము.

ద్వి. కట్టెండకావర కొవరంబడఁగ ...
విష్ణు. పూ. ౩. (శ. ర.)

**వర.** సం. వి. ఆ. స్త్రీ. ౧. త్రిఫలవృక్షములు.
కరక, తాడి, ఉసిరిక చెట్లు. ౨. పరిమళ
ద్రవ్యవిశేషము. ౩. పసుపు.

**వరండ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. బాకు, కటారి;
కత్తి. ౨. దీపపువత్తి. ౩. గోరువంక.

**వరండకము.** సం. విశే. (అ. ఆ. అ.)
౧. పెద్దది; విశాలమైనది. విరివియైనది.
౨. భయపడినది. ౩. దుఃఖకరమైనది. ౪.
చెడ్డది, దుష్టమైనది. ౫. వర్తులము, గుండ్రనిది.
వి. అ. పుం. ౧. మంటిదిబ్బ. ౨. ఏనుఁగుపై
యంబారి. ౩. గోడ. ౪. మొగము మీఁది
పొక్కు.

**వరండకము.** సం. వి. అ. పుం. ౧. సమూహము,
గుంపు. ౨. మొగము మీఁది మొటిమ,
పొక్కు. ౩. వసారా, ఇంటిపంచాది. ౪. గడ్డి
మేటి. ౫. గాలము త్రాడు. ౬. వస్తువుల
కట్ట. ౭. అతరవేది, ఏనుఁగుల పోరాటము
నందేర్పఱచిన నడిమిదిబ్బ. (వాచ.)

**వరండాలువు,** సం. ని. ఉ. పుం. ఆముదపుఁ
జెట్టు.

**వరఁకు = వరను.**

**వరఁగలించే.** స. క్రి. ప్రకాశించు, వరలు.
(శ. ర).

**వరఁత.** వి. వ్రంత, ఏటు. (శ. ర.)

**వరకము.** వి. కఠినముగా పనిచేయించు శిక్ష.
(శ. ర., వా.)

**వరకము.** సం. వి. అ. పుం. ౧. కోరిక.
ప్రార్థన. ౨. (దేవుఁడిచ్చు) వరము. ౩. ఉత్త
రీయము. పైబట్ట. ౪. వనముద్గము, అడవి
పెసరు.

న. పడవపై కప్పుగా నుపయోగించు వస్త్ర
విశేషము. ౨. తుండుగుడ్డ.

**వరకు.** వి. ౧. బంగారులోనగు వాని రేకు.
(శ. ర.)

౨. (క. వరకు) మొలాము. (శ. ర.)

**వరకుఁడు.** సం. వి. అ. పుం. కన్యార్థి, తన్నుఁ
బెండ్లాడుమని కన్నెను గోరువాఁడు.

**వరగ.** వి. ౧. పెద్దారుగు పైరు.

ద్వి. వెలువడం బుడివోరు వెరఁగయ్యె వరగ.
విష్ణు. పూ. ౩. (శ. ర.)

౨. బ. ఆ ధాన్యము. (శ. గ.)

**వరగోఁగు.** మి. వి. వృక్షవిశేషము. ఒక జాతి
గోఁగు. ‡.

సీ. కాకి తూకందుగు కానుగ వరగోఁగు
గోఁగు బొట్టుగు చిక్కిగోగు కొండ, గోగు...
హంస. ౪. ౧౧.

**వరచందనము.** సం. వి. అ. న. ౧. ఒక జాతి
సుగంధ వృక్షము. మ్రాని పసుపు చెట్టు.
౨. దేవదారు వృక్షము. ‡.

**వరట.** వి. పేఁడ యెండిన చెక్క. (శ. ర., గ్రా.)

**వరటము.** సం. వి. అ. పుం. ౧. హంస. ౨. ఒక దినుసు ధాన్యము. కుసుమ ధాన్యము. ౩. ఒక జాతి కందురీఁగ.

స. కుంద పుష్పము, మొల్ల పువ్వు.

**వరటలు.** వి. బ. తికమకలు, చిక్కులు.

ద్వి. ... పసిఁడి, వాపులు దుష్టులు వరటలు
గ్రుత్తి, రూపులు బరులువిరోధులు మృత్యువు,
కన్నెలుపంగుల గద్దరుల్ రిత్త, వన్నె
కత్తెలు వారవనితలు.

సండిశా. పురా. ౧౧౬.

**వరణ.** సం. వి. ఆ. స్త్రీ. కాశీపట్టణమున కుత్తరపు దిక్కున గంగానదిలోఁ గలియు నొకానొక నది.

**వరణమాల.** సం. వి. ఆ. స్త్రీ. పెండ్లి కూఁతురు పెండ్లి కుమారుని మెడలో వేయు పూలదండ. ఇట్లే వరణమాలిక.

ద్వి. వర పశ్చిమాంగన వరుణుపై వైచు, వరణ
మాలిక పోలె వజ్రి ధర్మంబు ...

అ. మ. క. ౨. ౭౦. పా. ౮. పం.

**వరణము.** సం. వి. అ. న. ౧. ఎన్నుకొనుట, ఎంచుట. ౨. యాచించుట, ప్రార్థించుట, వేఁడుకోలు. ౩. చుట్టువాఱుకొనుట, పరివేష్టించుట. ౪. కప్పుట, మూయుట, ౫. కన్యను వరించుట. ౬. (ఋత్విగాదులను) పూజించుట. ౭. నివారించుట, నిషేధించుట.

పుం. ౧. ప్రాకారము, ప్రహరి, చుట్టుగోడ. ౨. వంతెన. ౩. వరుణ వృక్షము. ౪. వృక్షము, చెట్టు. ౫. ఒంటె. ౬. ధనుస్సుపై నుండెడి యలంకార విశేషము.

**వరతనువు.** సం. విణ. ఉ. ప్రశస్తమైన (చక్కని) దేహముగలవాఁడు.

వి. ఉ. స్త్రీ. సౌందర్యవతియగు స్త్రీ. అందకత్తె.

**వరత్ర.** సం. వి. ఆ. స్త్రీ. ౧. వాఱు. పట్టె. ౨. గుఱ్ఱమునకుఁ గాని యేనుఁగునకుఁ గాని నడుము క్రిందినుండి కట్టెడి జీను, అంబారి కట్టెడి వాఱు, టంగు వాఱు.

**వరత్వచము.** సం. వి. అ. పుం. నింబవృక్షము. వేఁపచెట్టు. ‡.

**వరద.** సం. వి. ఆ. స్త్రీ. ౧. నదీ విశేషము. ఒకానొక నది. ౨. కన్యక. ౩. పెన్నేరు. ౪. దుర్గ.

**వరదక్షిణ.** సం. వి. ఆ. స్త్రీ. కన్యాదాత వరున కిచ్చెడు ధనము.

**వరదాచతుర్థి.** సం. వి. ఈ. స్త్రీ. మాఘశుద్ధ చతుర్థి.

**వరదుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. వరము నిచ్చువాఁడు. ౨. ప్రసన్నుఁడు. అనుగ్రహము గలవాఁడు.

వి. అ. పుం. ౧. ఉపకారి. ౨. శాంతిహోమములు చేసెడియగ్ని.

**వరద్రుమము.** సం. వి. అ. పుం. అగరుగంధపు చెట్టు. ‡.

**వరను = వరఁకు.** వి. [illegible]. (బ. వరఁకులు. దీని నువర్ణమునకు ఏకవచనమునందు నిత్యముగాను బిందు పూర్వక 'కు' వర్ణ మాదేశముగా వచ్చును.) చిక్కు.

చ. స్థిరమతి ఋశ్యశృంగు ... వరఁకుల బెట్టి
తెచ్చెదరు వారవిలాసిను లెన్నిభంగులన్ ...

భా. రా. బాల. ౬౩.

**వరప్రద.** సం. వి. ఆ. స్త్రీ. లోపాముద్ర.

**వరప్రస్థానము.** సం. వి. అ. న. వరుఁడు కన్యాదాత యింటికి తరలివెళ్లుట, పెండ్లికిఁ దరలి వెళ్లుట.

**వరఫలము.** సం. వి. అ. పుం. నారికేళము. కొబ్బెరచెట్టు. శ్రీ.

న. శ్రేష్ఠమైన ఫలము.

**వరబడి.** వి. కఱవు, క్షామము. (శ. ర.)

**వరము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. శ్రేష్ఠమై నది. ఉత్తమ మైనది.

౨. ఒకదానికంటె మంచిది, ఒకదానికంటె మేలైనది.

వి. అ. పుం. ౧. ఎన్నుకొనుట. ౨. ఎన్నిక. ౩. దేవాదులవలనఁ బొందఁబడిన కోరిక. ౪. బహుమానము, కానుక, పారితోషికము. ౫. ఇచ్ఛ; కోరిక. ౬. ప్రార్థన, వేఁడికోలు, ౭. బిచ్చము, ఈవి, దానము, ౮. చుట్టు వాఱుట, పరివేష్టించుట. ౯. ఆటంకపఱు చుట ౧౦. అరణము. ౧౧. ఊరఁబిచ్చుక.

న. ౧. కుంకుమపువ్వు. ౨. అల్లము. ౩. కురు వేరు.

**వరయాత్ర.** వరప్రస్థానము. బం. వి. ఆ. స్త్రీ.

**వరయిత.** సం. వి. ఋ. పుం. తన్నుఁ బెండ్లా డుమని కన్నెను బ్రార్థించువాఁడు.

**వరరుచి.** సం. వి. ఇ. పుం. ౧. పాణిని సూత్రా లపై వార్తికములు వ్రాసిన కాత్యాయనుఁ డనెడి యొక ముని.

౨. విక్రమార్కుని సభలోని నవరత్నములలో నొకఁడగు పండితకవి.

**వరల.** సం. వి. ఆ. స్త్రీ. ఆఁడుహంస. ౨. ఒక జాతి కందురీఁగ.

**వరలబ్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. పొందఁబడిన వరముగలది. వరమును బొందినది.

౨. వరమువలెఁ బొందఁ బడినది.

వి. అ. పుం. చంపకవృక్షము.

**వరలము.** సం. వి. అ. పుం. ఒకజాతి కందు రీఁగ.

**వరవ.** వి. నీళ్లు వచ్చుట కేర్పఱచిన కాలువ.

వ. జాహ్నవీసమాహ్వయంబు మెఱయు సరిగి సాగరుల బయింబఱవ నయ్యేటి వరవ నమ్మేటి యాఱువదివేవురు నరేంద్రనంద నులు సంక్రందనపురంబుఁ జెందిరి.

చం. రా. ౭. ౨౫.

సీ. నవ రసంబులకు దానవుదానజాలంబు సత సులకును నైన వరవగాఁగ ...

బహు. ౧. ౫౯.

**వరవత్సల.** సం. వి. ఆ. స్త్రీ. అత్త, భార్య తల్లి.

**వరవర్ణము.** సం. వి. అ. న. బంగారము.

**వరవర్ణిని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. శ్రేష్ఠమైన శరీర కాంతిగల స్త్రీ. ౨. పతివ్రతయగు స్త్రీ (మే. ని.) ౩. స్త్రీ. ౪. పసుపు. ౫. లక్క. ౬. లక్ష్మి. ౭. దుర్గ. ౮. సరస్వతి. ౯. గోరో జనము. ౧౦. ప్రియంగులత. ౧౧. పీతవర్ణము, పచ్చనిరంగు.

**వరవాళులు.** వి. ప్రవాహములు.

తరువోజ ... జలువిడిగొని జాఱు బాష్పోద కముల, బాలకన్గవ వేఁడి వరవాళు లొప్పు ...

కు. సం. ౫. ౫౮.

**వరవు = వరవుడు.** వి. (సం. భరటః.) సేవ కుఁడు, దాసుఁడు, సేవకురాలు, దాసి.

గీ. కడిమి మెఱయంగఁ బోరు త్రిగర్తనాథు, రథముఁ గనుఁగొని కడఁగి విరాట విభుఁడు, వరవునకు నల్గినట్టుల సరకు గొనక, యతుల రథసాతిరేకత నతనిఁ దాకె.

భార. విరా. ౩. ౧౮౫.

గీ. ఒనరఁ బాథేయములు కొవనోపు నట్టి, వరవు నొక్కయూర విలిచి ముప్పురను గూడి ... దశకు. ౧౦. ౧౨౩.

ద్వి. సురభిచింతామణి సురభూరుహములు, వర వులై యుండంగ వరమిగియంత ...

బస. పు. ౨. ౩౭౫.

ద్వి. రాజులు వాటించు రాణివాసముల, నోజ తో నూడిగంబొనరింపఁ దమకు, వరవు లఁగాఁ జేసి వరుస వర్ణింపఁ, బురిలోనఁ బులుకొని పురువుల తరమె.

ద్వి. హరిశ్చ. ఉ. ౪౬౨.

వరవుదానికి = సేవకురాలికి, దాసికి.

చ. ... ఈ పడుచు దక్కకపోయిన గన్న మాకు న్యుత్తరువు గదమ్మ నీవరపుదానికి నిట్టియవస్థ వచ్చు టొచ్చెరువు గదమ్మమమ్ము దరిఁ జేరుపుమమ్మ త్రిలోకమాతృకా ...

కేం. పంచ. ౧. ౧౨౩.

జ : వరవుంబడు, వరవుఁదనము.

వరవుంబడు. అ. క్రి. (వరవు + పడు. వృత్తిని వర్ణాగమము.) ప్రాణాచారముపడు, అనశన వ్రతముపూను.

వ. ... అడుగులొత్తు నిందివరకు వరవుం బడి యున్న రాహువనన్ ... ఆను. ౬. ౯౭.

వరమువడు = వరవుపడు. వరవు = దాసుఁడు.

అ. క్రి. ప్రాణాచారము పడు. (శ. ర.)

' వరముం బడియున్న ' వే. వ్యా. పా.

ఆను. ౬. ౯౭.

వరముపడు = ప్రాణాచారముపడు. గుం. మం. వ్యా.

ఇందిరకుం బరము పడియున్న (వ్రాఁత ప్రతి.)

వరముం బడియున్న (ముద్రి.)

వరము బండియున్న (ముద్రి. వ్యాఖ్య.)

దండను పెట్టుచున్న (వ్రాఁతప్రతి వ్యాఖ్య.)

ప్రాణాచారము పడియున్న (ముద్రి. వ్యాఖ్య.)

వరముపడు = అనశనవ్రతమాచరించు.

(అని బ్రౌన్.)

వరవుఁదనము. వి. (√ వరవు) ౧. సేవకత్వము, దాస్యము.

చ. అనిలుఁడు నర్కుఁడున్ శశియు నైనను గానరు, మున్ను దన్ను న, త్యనుపమ రాజ్య భోగమహిమాతిశయంబున నట్టికాంత సే, డినకుల రత్నమై వెలుఁగు నిట్టి సుతుండును దాను నాకతం, బున వరవుందనంబునకుఁ బోయెను యేగతిఁ బోగు దైవమా.

మార్క. ౧. ౨౧౯.

వరవుడము. వి. (√ వరవుడు) దాస్యము.

చ. ... నీ చెలియల్ చరించుని, వ్వరవుడపుం జరిత్రమున వచ్చెను నీకొక పేర్మి ...

భార. అను. ౧. ౨౦౯.

చ. ... వరవుడమోపి చేయుదునో వారికి మాధవ నిశ్చయింపుమా ...

భార. ఉద్యో. ౩. ౧౧౨.

గీ. వరవుడంబునఁ బనుపన బానిస మన, దాస్య నామంబులై యుండు ...

ఆం. భా. ౨. ౨౭౭.

వరవుడు = వరవు. వి. (సం. భరటః) ౧. దాసుఁడు, సేవకుఁడు ; దాసి, సేవకురాలు.

చ. పరమున కేనుఁ దాసుఁడని పల్కఁగఁ బ్రాపుఁడఁగాను మత్సుతన్, హరునకు నిత్తు నా వెలవనయ్యె సపుత్ర కళత్రమేను మీ వరవుడ మిమ్ముఁ గొల్వ గలవాఁడ ...

కు. సం. ౭. ౯౭౦.

బ. వరవుడులు, వరవుళ్లు.

చ. అరుదగు నీ తపమ్మునకు నమ్మడు వోయితి సేలు కొమ్మనీ, వరవుడనంచు కూలి

ప్రియవాక్యము లందగ గారవింపఁగా ...
హర. ౪. ౩౬.

క. వరవుల్గలనీ తనయులు, పరువడిఁ దుడు
వంగఁ గృష్ణఁ బనుచు వగన్ భ్రాతురరాజ్య
దర్పమొప్ప వ్రిదురుఁజెచ్చిరిఁ బంచెదానిఁ
దోడ్కొని తేరన్ ... భార. సభా. ౨౦౦.

గీ. వరవుడుల నూర్వురను మేలివాజు లిరువ,
దింటి నూళులుపదునాల్గు నిత్తునీకు ...
భార. కర్ణ. ౩. ౧౪౯.

సీ. నాఁటి తప్పునకు నీనసబోండ్లతో నాకు
వరవుడై యున్న దీవాలుగంటి ...
యయా. ౪. ౫౬.

ఆ. ... ఇచ్చెదేని చయ్యన వెలచెప్పు, వరవు
డెట్లు మాకు వలయునని ...
మార్క. ౧. ౨౧౩.

౨. దాస్యము.

ద్వి. భక్తుఁడై లింగంబు ప్రకృతిఁ జేకొన్న,
వ్యక్తిగా బసవన్న వరవుడు సేయు ...
బస. పు. ౧. ౧౧౦.

జ: వరవుడము, వరవుడుపని.

**వరవుడుపని.** వి. (వరవుడు + పని) దాసీ కృత్యము, దాస్యము.

సీ. బాములఁబడి సందె జామువోయినదాఁక
వరవుడు పనులు సర్వంబుఁ దీర్చి ...
హరిశ్చ. ౫. ౫౫.

**వరసంది.** వి. ఒక జాతిగట్టు.

సీ. ... వరసంది చేరువ కట్టకత్తువ కరగనిమ
యనఁగ, సేతువిశేషంబు చెలఁగును ...
ఆం. భా. ౨. ౮.

**వరసము.** వి. అశ్వశిక్షాభేదము.

సీ. వరసంబు నొందించి పల్లంబు కల్పించి
నిగుడంబు సవరొల్పి నెఱసు నెఱపి ...
పి. శకుం. ౧. ౧౧౨.

**వరసురతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. మిగులఁగాముము గలవాఁడు. ౨. రతిరహస్యము లెఱిఁగినవాఁడు.

**వరహా = వరా.** (సం. వరాహః) వరాహ ముద్రగల యొక బంగారు నాణెము.

ఉ. ... పట్టంచుల పచ్చడాలు వరహాలు
సరాలు గుత్తాలు పల్లకీల్ ...
యయా. ౧. ౨౮.

వరహా దీనికి ద్వితీయయందు ని ఆగమము.

గీ. కాటికూనికి మీఁదుగాఁ గట్టియున్న,
గట్టివరహాని వరహానిగాఁగఁ జూడ, కాడఁ
బోఁగూడ కొక్కమాటాడకుండ, గుండనికి
రంగుబంగారు గోరు సేసె ...
శుక. ౩. ౫౦.

**వరం = వరహా.** వి. వరాహ ముద్రగల ఒక బంగారు నాణెము.

చ. ... వారవనితామణి పిల్చిన నీటు
వెట్టుచుం, బలుకదు తొంటి పైఁడి తన
పాతికమాటకు మాటలాడ రూకలు పది
యైన నిద్దురకు గట్టి వరాయను నట్టి
దండునన్ ... రా. వి. ౨. ౬౨.

మ. జారుగూళ్లం దియనాళ్లు సాగిన భరంపు
న్మానిసి నోర్మియ నిష్ఠుర వృత్తి నన్నుఁ జూపి
సుంకములటంచున్ గూలియంచు న్వరాలు
రయం బారఁగ మోచి ... శుక. ౩. ౪౦౪.

**వరాంగ(క)ము.** సం. విణ. [అ. (ఆ.) ఈ. అ.[ శ్రేష్ఠమైనయవయవములు గలది.

వి. అ. పుం. ఏనుఁగు.

న. ౧. తల. ౨. శ్రేష్ఠమైనభాగము. ౩. కుంద రాకారము. ౪. స్త్రీగుహ్యము, యోని. ౫. లవంగపు పట్ట; దాల్చినచెక్క.

పుం.యేనుఁగు. (శ. ర.)

**వరాంగుఁడు.** సం. వి. అ. పుం. ౧. విష్ణువు. ౨. మన్మథుఁడు.

**వరాకము.** సం. వి. అ. న. యుద్ధము, పోరు.

**వరాకుఁడు,** సం. విణ. (అ. ఈ. అ.) ౧. దరిద్రుఁడు. ౨. దీనుఁడు, దురదృష్టవంతుఁడు. ౩. నీచుఁడు, అల్పుఁడు. ౪. అపవిత్రుఁడు, అపరిశుద్ధుఁడు.

వి. అ. పుం. శివుఁడు.

**వరాటకరజస్సు.** సం. వి. స. పుం. నాగకేసరము. శ.

**వరాట(క)ము.** సం. వి. అ. పుం. ౧. గవ్వ. ౨. తామరపువ్వులోని గుద్దు. ౩. రజ్జువు, త్రాడు.

**వరాటిక.** సం. వి. ఆ. స్త్రీ. గవ్వ.

**వరాణసి.** = వారాణసి. సం. వి. ఈ. స్త్రీ.

**వరానన.** సం. వి. ఆ. స్త్రీ. మనోజ్ఞమైన ముఖముగల స్త్రీ ; స్త్రీ ;

**వరారకము.** సం. వి. అ. న. వజ్రము, నవరత్నములలో నొకటి. (విల్యమ్సు)

**వరారోహ.** సం. వి. ఆ. స్త్రీ. ప్రశస్తమైన జఘనము గల స్త్రీ. సుందరి, అందకత్తె.

**వరారోహము.** సం. వి. అ. పుం. బాగుగా స్వారిచేయుట.

**వరారోహుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. అందమైనతుంట్లు గలవాఁడు. ౨. బాగుగా స్వారిచేయువాఁడు.

౩. గుఱ్ఱముపైఁగాని ఏనుఁగుపైఁగాని స్వారి చేయువాఁడు.

**వరార్హము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. వరమునకుఁ దగినది. ౨. చాలఁ బ్రశస్తమైనది. ౩. చాల విలువ గలది.

**వరాల(క)ము.** సం. వి. వి. అ. పుం. లవంగము.

**వరాళి.** వి. రాగవిశేషము, ఒకానొక రాగము.

ఉ. ... తుంబురుండు తా, గౌళవరాళి నాటలను గాయనరూఢికి నాటి చూపినన్ ... శ్రీరం. మా. ౪. ౧౫౩.

ఉ. భైరవినాటతోడి సిరిపాళి దిశాదిశ [illegible] మారువా, గౌరిబిళావురీ లలిత కన్నడ గౌళముఖారిదేవగాంధారి వరాళి కన్నడ ధనాసరి ఘూర్జరి పూరిబేగఁడా, యారభి రామఖల్లి మొదలై తగు రాగము లింపు మీఱఁగాన్ ... చెన్నబ. ౨. ౨౩౮.

సీ. ... సలలి, తబిలహరి కురంజి ధన్యాసి పూర్వగౌళవరాళినాట భల్లాతకి ... హంస. ౫. ౧౨౩.

౨. శోకము, ఏడుపు.

క. ...అడుగక మెల్లిగ వరాళి కారంభించెన్. పార్వ. ౩. ౭౪.

**వరాశి (సి).** సం. వి. ఇ. పుం. ముదుగుబట్ట.

**వరాసనము.** సం. వి. అ. న. ౧. శ్రేష్ఠమైన పీఠము ; కుర్చీ మొ. సింహాసనము. ౨. ముఖ్యాసనము, గౌరవాసనము. ౩. జపాపుష్పము.

**వరాసనుఁడు.** సం. వి. అ. పుం. ౧. ద్వారపాలకుఁడు. ౨. విటుఁడు ; ప్రియుఁడు.

**వరాహకందము.** సం. వి. అ. పుం. ఒక జాతి యాహారయోగ్యమైన దుంప.

**వరాహకర్ణము.** సం. వి. అ. పుం. బాణవిశేషము. ఒక విధమగు బాణము.

**వరాహకల్పము,** సం. వి. అ. పుం. విష్ణువు వరాహావతార మెత్తినకాలము.

**వరాహకాంత,** సం. వి. ఆ. స్త్రీ. ఒకజాతి యాహారయోగ్యమగు పెండలపు దుంప.

**వరాహకూర్చము,** సం. వి. అ. పుం. న. (వా. వరాకట్ట) అడవిపంది వెండ్రుకలతో కట్టఁబడి ఆభరణములను తోముటకు వాడుకొనుకుంచె. (బ్రౌ. ని.)

**వరాహక్రాంత,** సం. వి. ఆ. స్త్రీ. సోఁకుడు మునుఁగుచెట్టు, అత్తపత్తియొక్కఁ. ౹.

**వరాహద్వాదశి,** సం. వి. ఈ. స్త్రీ. విష్ణు ప్రీతికై మహోత్సవము చేయఁబడెడు మాఘ శుక్ల ద్వాదశి.

**వరాహమిహిరుఁడు,** సం. వి. అ. పుం. బృహత్సంహితాగ్రంథకర్త యగు ప్రసిద్ధజ్యోతిశ్శాస్త్రవేత్త, విక్రమార్కుని సభలో నుండిన నవరత్నములలో నొకఁడు.

**వరాహము,** సం. వి. అ. పంది. ౧. పంది; అడవి పంది. ౨. పొట్టేలు, గొఱ్ఱెపోతు. ౩. ఎద్దు. ౪. మేఘము. ౫. మొసలి. ౬. పంది యాకారముగా నేర్పఱుపఁబడిన సేనావ్యూహము. ౭. పరిమాణ భేదము. ఒక విధమైనకొలది (మే. ని.) ౮. పదునెనిమిది పురాణములలో నొకటి. వరాహపురాణము. ౯. పెండలమువంటి యాహారయోగ్యమైన యొక జాతిదుంప. ౧౦. ద్వీప విశేషము. పదునెనిమిది ద్వీపములలో నొకటి.

**వరాహుఁడు,** సం. వి. అ. పుం. ౧. విష్ణువు, వరాహావతారుఁడు.

౨. వరాహమిహిరుఁడు.

**వరి,** వి. ౧. శాలిసస్యము.

సీ. చామల కెందు నీ సరసత గలదె తొయ్యలి యన వరియింపు నిలిచి చూడు ...
రసి. ౧. ౫౮.

౨. శాలిధాన్యము.

సీ. వీడెంపు బలుకెంపు విరిసె వెన్నెల గాయ వరిగింజ నొకటఁ బల్వరుసఁ దోమ ...
ఆము. ౧. ౬౦.

జ : వరి మడి, వరి వంటకము.

**వరి,** సం. వి. ఈ. స్త్రీ. ౧. సూర్యుని భార్యయగు ఛాయాదేవి. ౨. శాతా వరి. ౹.

**వరి(యి)ంచు,** సం. స. క్రి ౧. పరిగ్రహించు.

ఉ. ... వి, ఖ్యాతుఁ బురోహితప్రవరుఁగా వరియించిరి భక్తితో ...
భార. ఆది ౭. ౧౫౭.

గీ. అసుర కింకర కోటిచే నతులకనక, శిబిక లందుఁ దెప్పించిన విబుధ కన్య, లందఱను వృష్ణివృద్ధుల యనుమతమున, దాను వరియించినాఁడయ్యెఁ దత్క్షణంబ.
హరి. ఉ. ౪. ౨౧౮.

౨. అడుగు, వాంఛించు, ప్రార్థించు.

ఉ. నావిని ... వటునాథుఁడు దానవనాథుఁ జూచి ... మెచ్చితిన్ సుకృత వర్ధన - వేడు వరం బొసంగెదన్, నావు డతండు ... నిన్ను వరింప నెద్దియున్ ...
జాహ్నవీ. ౨. ౩౪.

**వరిగ,** వి. (సం. వరకః) ౧. సస్య విశేషము.

వ. ... వరిగ వెరిగె ... కాశీ. ౩. ౨౩.

ద్వి. వరిగలు కొఱ్ఱలు పాలు నేతులును, విరి విగాఁ దెప్పించి వివిధరూపముల ...
ప్రభు. ౪. ౧౬౨. పా.

సీ. గోధుమల్ వరిగలు కొఱ్ఱలు నెయ్యని గాని ... రెట్టమతము. ౩. ౪౨.

**వరిబీజము.** వి. వృషణవ్యాధివిశేషము. ఒక ప్రక్క వాఁచిన వృషణము. (శ. ర. బ్రౌ.)

**వరిమడి.** వి. (వరి + మడి) కేదారము, వరిపండు భూభాగము.

సీ. వాహినీనాథుతో వరిమళ్ల కాలువ వ్యాళ
నాయకునితో వానకట్టె ...
చెన్నబ. ౫. ౭౧.

వ. ... తిరుమలం మంగారి చెర్వుక్రింద వరి
మడి ... కా. శా. ౭౦౨.

**వరిమము.** సం. వి. న. పుం. ప్రాశస్త్యము, శ్రేష్ఠత.

**వరివంటకము.** వి. (వరి + వంటకము) శాల్యన్నము.

ఉ. పుట్టుగు దెల్పుకొన్న గతిఁబూని సఖుండని
చూడ వచ్చినన్, వట్టి ప్రియంబులాడి వరి
వంటక మించుక పెట్టఁగాని నా, యొట్టిన
లేమిఁ జూచి తడి యొత్తుల దోవతియైన
యీఁడయే,పట్టునఁ బేదవారలకు బాంధవు
లెక్కడివారు చూడఁగన్.
పద్మ. ౧౦. ౨౪౬.

**వరివసి(స్య)తుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) పూజింపఁబడినవాఁడు, గౌరవింపఁబడినవాఁడు.

**వరివస్య.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పూజ, అర్చన ౨. సేవ, ఉపచారము.

**వరిష్ఠము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. శ్రేష్ఠమైనది. మిక్కిలి ప్రశస్తమైనది. ౨. మిక్కిలి పెద్దది. ౩. మిక్కిలి విశాలమైనది. ౪. మిక్కిలి బరువైనది. ౫. అతి హీనమైనది. అతిదుష్టము.

వి. అ. పుం. ౧. ఒకజాతి కముజు. ౨. నారింజ చెట్టు. ౹. ౩. తిత్తిరి పక్షి. తీతువు.

న. ౧. రాగి, మిరియము.

**వరీయము.** సం. విశ. (న. యస్. న.) ౧. ఒక దానికంటె మేలైనది. ప్రశస్తతరము. ౨. మిక్కిలి మంచిది. ౩. ఒక దానికంటె పెద్దది; ఉరుతరము, విశాల తరమైనది.

వి. న. పుం. (జ్యోతి) విష్కంభాది ౨౭ యోగములలో నొకటి.

**వరీవర్దము = బలీవర్దము.** సం. వి. అ. పుం. వృషభము. ఎద్దు.

**వరుఁడు.** సం. వి. అ. పుం. ౧. పెండ్లికుమారుఁడు. ౨. భర్త, పెనిమిటి. ౩. తన్నుఁ బెండ్లాడుమని కన్నెను గోరువాఁడు. ప్రార్థయిత. ౪. అల్లుఁడు. ౫. విషయాసక్తుఁడు. భోగలంపటుఁడు. ౬. విటుఁడు. ౭. జారుఁడు. ఉపపతి. ౮. ప్రసవు, ఱేఁడు.

ద్వి. వరుఁడు లోపల నమ్మవారితో నంతి, పుర
మున నేకాంతమున నున్నవాఁడు.
ద్వి. పరమ. ౩. ౧౮౯. పా. ౫. పం.

ద్వి. ఇరవొంద నీ కార్య మెఱిఁగింపకున్న,
వరునిచే వడి నాజ్ఞ వచ్చుఁబొమ్మనుచు ...
ద్వి. పరమ. ౩. ౧౮౦. పా. ౧౮. పం.

**వరుగు.** వి. ౧. తఱిగి యెండవేసిన కాయదినుసు; ఎండినమాంసపుముక్క మొ.

గీ. మనును శుష్కశలాటు నామంబు వట్టు,
వరు గనంగను ... ఆం. భా. ౨. ౩౯.

గీ. చెలిమి మీతోడఁ జేయుట చెట్టతనము,
దానఁ గీడెంత పుట్టినఁ దగిలెనాకు, నను
భవింపక పోవునే యక్కటకట, వరుగుతో
డాఁగరయు నొండవలసినట్లు ...
ఉ. హరి. ౪. ౫౪.

గీ. శ్వాపదంబుల పదవాతి ప్రస్నివలచు, వరుగు
దఱచగు మురుత్రోవ నరిగి రొమ్ముట ...
ఆము. ౬. ౧౭.

(ఇట నొకజాతిగ్రద్దయర్థమని శ. ర.)

౨. చమురులో వేయించి పొగపిన యొండిన కాయ ముక్క.

చ. ... నాలుగేన్, పొగపిన కూరలున్ వడియముల్ వరుగుల్ పెరుఁగున్ ఘృతప్లుతిన్ ... ఆము. ౧. ౭౦.

సీ. పగపగకూరలు వరుగు లప్పడములు నొలుఁపు బజ్జాను మించుటోగిరములు ...
ఉ. రా. ౬. ౧౨౨.

మ. తిరువారాధన మిట్లొనర్చి ధరణీదేవాన్వయ శ్రేష్ఠుఁ డా, వారి కర్పించుటఁ బావనంబులగు శాల్యన్నంబులున్ నేతులున్, వరుగుల్ చేరులు పప్పులప్పడములున్ దాలింపులుం బూపముల్, పరమాన్నంబులుఁ బెట్టు నెట్టన భుజింపం దల్లికిం దండ్రికిన్.
పాండు. ౨. ౨౪.

విణ. సారహీనమగునది, బలహీనమగునది.

గీ. సవనకృత్యంబు లడఁగిన నవసి నవసి, వాసవాదిసుపర్వులు వరుగులై జుగల్లతామాల కందంబు గమలనాభుఁడున్నకడ కేగి యాదశ విన్నవింప. వరాహ. ౪. ౫౨.

జ: వరుగుఁ జేప.

**వరుగుఁజేప.** వి. (వరుగు + చేఁప) శుష్కమత్స్యము, ఎండుచేప.

సీ. అలరును శుష్కమత్స్యం బుప్పఁజేఁప నావరుగుఁ జేఁపన ...
ఆం. భా. ౧. ౧౬౦.

**వరుజు.** వి. మడియొక్క గనిమ, మడికిఁజుట్టును నేర్పఱచిన చిన్నకట్ట.

క. వరుజు బడి గొంపి ద్రొక్కన్, జరణంబులఁ బెనఁగి పసిఁడి చాయకడుపులన్, బొరి నీరుకట్టె లమరెను, బిరుదులు పోలికలు దున్నఁ బెట్టిరొయనఁగన్. ఆము. ౪. ౧౨౫.

**వరుటు.** అ. క్రి. కృశించు, చిక్కిపోవు.

సీ. అశ్వగోమహిషరూప్యసువర్ణవస్త్రంబులెన్ని హెచ్చించిన నేమిఫలము, సంతతంబును గృచ్ఛ్రచాంద్రాయణాదుల వరుటుచునుంట యెవ్వరికి మెచ్చు. భీమ. ౪. ౩౨.

సీ. జఠరాగ్ని నెల్లను జల్లార్చి మిక్కిలి వరిటి నాఁడు మహోపవాసములను ...
కుచేల. ౧. ౨౪.

సీ. మిగుల వరిటిన కొకిలికి మేఠివాఁడు, మన కుచేలుఁడు ... కుచేల. ౩. ౧౧.

**వరుడము.** సం. వి. అ. పుం. నీచ జాతిభేదము, నిమ్న జాతులలో నొక తెగ.

**వరుణదైవతము.** సం. వి. అ. న. శతభిష న్నక్షత్రము.

**వరుణపాశము.** సం. వి. అ. పుం. ౧. మత్స్య భేదము, సొఱ్ఱచేప. ౨. వరుణుని చేతనుండెడి పాశము.

**వరుణము.** సం. వి. అ. పుం. ౧. సముద్రము. ౨. ఖగోళము. ౩. వరుణ వృక్షము, ఉలిమిరి. ౪. నీరు (మే. ని.) ౫. అష్టాదశ ద్వీపములలో నొకటి. ౬. పగటి పదునైదు భాగములలోఁ బదునాల్గవ భాగము పేరు.

**వరుణాత్మజ.** సం. వి. ఆ. స్త్రీ. వారుణి, మద్యము (సముద్రమునఁ బుట్టినది.)

**వరుణాని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. వరుణుని భార్య.

**వరుణాలయము.** సం. వి. అ. పుం. సముద్రము. ఇట్లే వరుణావాసము.

**వరుణుఁడు.** సం. వి. అ. పుం. ౧. మిత్రునిలోఁ గలసియుండు రాత్ర్యభిమానియైన అది

త్ముఁడు. ౨. పశ్చిమదిగధిపతియు సముద్రాధిపతియునగు దిక్పాలకుఁడు. 3. సూర్యుఁడు.

**వరుత్రము.** సం. వి. అ. న. ఉత్తరీయము, పైబట్ట.

**వరుమానము.** వి. రాఁబడి, ఆదాయము.

(శ. ర., వా.)

**వరువట్టు.** వి. (వట్టు + వట్టు) అధికముగాఁ దడి యారుట.

సీ. వలవంత వరువట్టువట్టిన నాలుక తిలమున్న మాటల మెలఁగియాడ ...

కు. సం. ౫. ౬3౪.

క. విరులుఁ జిగుళ్లును జోరువుగ, సిరిగంద పుటసలాకింత చిలచిలమనివే, గిరమ వరువట్లు గొనఁ గడుఁ, బోరలెడు తరలాక్షీ తాపముం గని కలఁకన్.

కళా. ౬. ౨౫౫.

ద్వి. తటితటి తనువులఁ దాపంబు దోఁప, వరలుచు నధరముల్ వరువట్టు పట్ట ...

పండితా. మహిమా. ౨౭౦. పొ.

ద్వి. వావిరి నూతులు వరువట్లు పట్టె ...

బస. పు. 8. 3౯.

**వరువరువులు.** వి. ౧. బ. (వరువులు + వరువులు) మిక్కిలి వరుగులు, అధికముగ ఎండినవి.

క. ఎరవలి పట్టిన కొండల, కురువడిఁ జనికొక్కి మూఁక లొక్కటఁ గొఱవుల్, వరువరువులైన పిడకలు, తఱఁ గైకొని పోయి ధీరతన్ దరికొల్పన్. వెం. పంచ. 3. ౨౯8.

**వరు(ఱు)వాత.** వి. (సం. ప్రభాతః) ప్రాతఃకాలము.

సీ. కంపించి శేషునికడ కేగియో భోగికుల నాథ యీ యద్రికూట మొకటి, వైవవే యీ మహా వాతూల వరువాత వరువాత నినుఁ బ్రతివాసరంబుఁ, దలఁచి యేము భుజించెదము గాని ... రామా. ౭. ౬౨.

క. వరువాతలేచి యీ బుధ, వరువరవుడుఁ బోల్పఁ దగిన వారివలన శ్రీ, వరుఁ గీర్తింపుచు వాకిలి, వరుసన్ ముంగిళ్లు దుడిచి వారని భక్తిన్. ఘటికాచల. ౨. ౨౦.

క. వఱువాత లేచి నీదగు, కొఱగాములు చక్కఁ ద్రోచికొనఁ బోయెదినం, బఱుగు వడిపోయె నీపను, లఱజాతివి నిన్ను నేమి యననేర్తు సుతా. హరి. పూ. ౫. ౨3౯.

**వరువు = వరిగ.**

"కొఱ్ఱ" అరువు వరువు పుట్టి ౧ ణ్ణికి చి ౬.

ద. శా. ౪. ౧3౭౪.

చ : వరువరువులు..

**వరుస.** వి. ౧. క్రమము.

గీ. మణిమయమ్ములుఁ గలధౌత మయములును సువర్ణ మయములు నాదిగా వలయునట్టి యడ్డసాళులు గలవు నా కభిమతముగ, వానిఁ గొనిపోయి చూపుగు వరుసతోడ.

భార. విరా. ౧. 8౨.

చ. వరుసను బ్రాహ్మణోత్తముఁడు వర్ణచతుష్టయ జాతకన్యలం, బరిణయమాట ధర్మ మని పల్కెడు రాది మునీంద్ర ముఖ్యులు...

విక్ర. ౧. ౧౫౫.

గీ. విష్ణుఁ డాదిత్యులకు వసువితతి కగ్ని, జలములకుఁ బాశపాణి వేల్పులకు నింద్రుఁ, డసురకోటికిఁ బ్రహ్లాదుఁ డంతకుండు, పితృ సమూహంబునకు నధిపతులు వరుస.

హరి. పూ. ౧. ౯౨.

౨. పంక్తి.

ఆ. బార లట్లు నేసి వరుసగాఁ గూర్చుండి, పసిఁడి పళ్లెరములు పన్నికొనఁగ ...

హర. ౬. ౧౧౬.

క. గురికొందఁ జైత్రుఁ డొందఁగ, గరములు
కన్నావి యపుడు కఱచిన సునువా, తెర
మీఁదఁ గాననగు పలు, వరుసయనన్
ననలు పల్లవము పై మొనసెన్.
పారి. ౩. ౪౮. ఆము. ౧. ౬౦.

క. ... పలువరుస చక్కఁదనమే, పలువరుస
నెమ్మచ్చువచ్చు బాలామణికిన్.

౩. వంగు.

సీ. ఇందుల కొఁప్రల నందఱుఁ దొల్లియిల్వరుస
గ్రమింగుచు నున్న ...
భార. ఆది. ౬. ౨౬౪.

క. తినకు నెలవరుస వచ్చిన, నినరథవహనమున
కాతఁడేఁగినవాఁడు ...
భార. శాం. ౬. ౫౬౬.

సీ. వరుసలు వెట్టి దువాళింప సుడివడి వెలి
మావు మోపడు వెనుక కాలు ...
వరాహ. ౧౦. ౧౫.

క. తరుణీశతకము బింబాధరమాధుర్యంబు
లాను తఱిఁ దమలోనన్, బరమేష్ఠినాల్గు
మోములు, వరుసలు వెట్టుకొనుఁ జెప్ప
వశమే తూర్మిన్. కాశీ. ౨. ౧౯.

౪. పరంపర.

క. నిరతింబు బ్రహ్మ మొదలుగ, వరుసన యొడ
తెగక యిట్లు ... భార. ఆది. ౪. ౨౨౧.

సీ. వరుస నేనుంగులు గురిసిన దానధారావలి
దగు కలయంబిగాఁగ ...
భార. విరా. ౭౪.

౫. బంధుత్వక్రమము.

క. అరుదెంచి పలికె నిట్లని, గురువుల సతి
నెట్టువేసికొంటివి నీవున్, వరుసా కటకట
దోషాకర యీ పాతకము సేయఁగాఁ
గాదు సుమీ. వరాహ. ౭. ౨౫.

చ. ... మిమ్మువంటి పెద్దలె తగు వావి
యున్వరుస దప్పిచరించిన సమ్మచెల్లగా...
ఉ. రా. ౪. ౨౦౫.

౬. పర్యాయము, తడవ.

క. పదియగు వరుస వినిన యభ్యుదయఫలము
నకు గొలంది యూహించి నిజం,
బిదియన ... హరి. ఉ. ౧౦. ౩౦౯.

౭. సాదృశ్యము, సాటి, తుల్యత.

సీ. ... గోవు సద్విప్రునకు నీగితద్రోమనికర
సంఖ్య, ఆ. వరుస నాకలోకవాసంబు
గావించు ... భార. అను. ౫. ౧౯౧.

చ. తనరు నిజాన్వవాయగురుధర్మదవృత్తి నరుం
ధతీసువాసిని వరుసన్నుతుల్ బుధ
విశిష్టసభం గనునట్టి సద్గుణైకనిధినిజాగ్ర
ధార. రాఘవ. ౧. ౪౩.

గీ. వాఁడు నిషధేశ్వరుండు మా వరుసవాఁడు,
కలిమహారాజ మన్నింతుగాక వాని ...
నైష. ౭. ౧౦౫.

౮. నియమము.

గీ. వర్ణములు నాశ్రమంబులు వరుసఁ దప్పె,
వేదములు నాగమంబులు విన్నఁబోయె ...
కాశీ. ౬. ౮౬.

౯. (రాగముల) వరుస, పాటలోని స్వరముల
భేదము.

సీ. తాన వరుసలు పెంచు గంధర్వగాయకు
లను జతగూడు నట్టువ కులము వారి ...
దశా. ౧. ౨౬౪.

౧౦. విధము, రీతి.

క. నరనారీ సంబంధము, వరుసగదా పురుషు
నకును ప్రకృతికి నన్యోన్యరమణము ...
భార. శాం. ౬. ౨౫.

సీ. ... యప్పుడుకేవుఁ డుండెడు విధమును
నరయుచు నయ్యింతియుంటకుండ, నాడెడు

వరుసలు నాధానసమయుంబు మొదలుగా గర్భంబు మోచు నెలలు, నెఱిఁగి ...
హరి. పూ. ౫. ౯౪.

బ. మల్లురుచేయు సాధనవిశేషము.

వ. ... కురటిపల్లటి మొదలగు లాగు వరుసలును బాలసంగడపు వరుసలును వింటాళింపు మొదలగుగా తాము వరుసలును ...
మల్లుపు. ౩. ౭౯.

విశే. మంచిది, యుక్తము.

క. అనుటయుఁ బ్రవరుం డిట్లను, వనజేక్షణ యిట్లు వలుక వరుసయె ప్రకులై, దినములు గడపెడు విప్రుల, జనునే కామింప మది విచారము వలదే... మనుచ. ౨. ౫౨.

జ: వరుసగొను, వరుసమొగ్గరము.

**వరుసగొను.** అ. క్రి. (వరుస + కొను) బారు దీరు, పంక్తిగా నేర్పడు.

వ. ... నిండాఱ బూఁచిన కనక చంపక శాఖల నైఖరిని వరుసగొని బిఱుసులు మెఱుపు నెఱపఁగొడిగొని నలుగడల తెగ కని గిడించు బహువిధ కౌతుకాగ్ని యంత్ర చిత్రంబులకు. లక్ష్మీ వి. ౫. ౭౪.

**వరుసము.** వి. (సం. వర్షః) సంవత్సరము.

ద్వి. వేయేండ్లు ధరియించి వెసదానిఁ బుచ్చి, నా యతి నాకిచ్చెనట నేను వేయు, వరుసముల్ ధరియించి వారకయున్న, తఱినీవు పుత్ర సంతానేచ్ఛ నన్నుఁ గుఱిచి వేఁడితి గానఁ గోర్కి దైవాఱ.
రం. రా. ఉ. ౯౨. పా. ౧౦. పం.

**వరుసమొగ్గరము.** వి. (√ వరుస.) దండ వ్యూహము, పంక్తులుగా నేర్పడిన సైన్యము. (శ. ర.)

**వరూథము.** సం. వి. అ. పుం. రథమును గాపాడుటకై వ్యాఘ్ర చర్మాదులతో నిర్మించిన రథముపైకప్పు, రథగుప్తి. ౨. కోకిల ౩. సమయము, వేళ.

న. ౧. కవచము. ౨. డాలు, కేడెము. ౩. సమూహము, గుంపు. ౪. ఇల్లు, గృహము.

**వరూథి.** సం. విశే. (న్. సి. న్.) ౧. కవచధారి, కవచముగలవాఁడు. ౨. కప్పుగలది. (రథాది) ౩. సంరక్షించునది, కాచునది. ౪. సేనచేఁ బరివేష్టింపఁ బడినది. ౫. రథము మీఁదనున్న వాఁడు, రథికుఁడు.

వి. న్. పుం. ౧. సారథి. ౨. అపాయమునుండి రక్షించు పురుషుఁడు.

**వరూథిని.** సం. వి. ఈ. స్త్రీ. సేన.

**వరే.** అవ్య. "కదా" అనునర్థము నిచ్చును, ప్రశ్నార్థకము.

క. మీకింత పందికంద భయాకులతం బొంది నిర్గతైశ్వర్యులరై, రాకతఁ గారణమే మిత్రి,లోకాహిత దనుజ తతికి లో బడరు వరే. కు. సం. ౪. ౩౬౫.

**వరేణ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. కోరఁ దగినది, అభిలషింపఁ దగినది. ౨. శ్రేష్ఠమైనది, ప్రశస్తమైనది. ౩. ప్రధానమైనది, ముఖ్యమైనది.

వి. అ. న. కుంకుమ పువ్వు.

**వరేణ్యుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ముఖ్యుఁడు, శ్రేష్ఠుఁడు. (శ. ర., బ్రౌ.)

**వరోటము.** సం. వి. అ. పుం. మరువము.

న. మరువక పుష్పము, మారువపు పువ్వు.

**వరోరువు.** సం. వి. (ఉ. ఊ.) స్త్రీ. ప్రశస్తమైన తొడలుగలది. సుందరాంగన, అందకత్తె.

**వరోలము.** సం. వి. అ. పుం. ఒక జాతి కందురీఁగ.

వర్కరకర్కరము. సం. వి. అ. పుం. తోలు, వాఱు, తోలుత్రాడు. మేకపిల్లనుగాని గొఱ్ఱెపిల్లనుగాని కట్టెడు తోలుత్రాడు.

వర్కరము. సం. వి. అ. పుం. ౧. పశుశాబకము (గొఱ్ఱెపిల్ల, మేకపిల్ల, జింకపిల్ల, లేఁగదూడ మొ.) ౨. మేఁక. ౩. వినోదము, క్రీడ, ఉల్లాసము. ౪. పరిహాసము, వేళాకోళము.

వర్కరాటము. సం. వి. అ. పుం. ౧. ఓరచూపు. ౨. నఖక్షతము. ౩. పూర్వాహ్ణమందలి సూర్య కిరణము.

వర్కటము. సం. వి. అ. పుం. ౧. కొయ్యచీల, అడ్డుగడియ.

వర్గఘనఘాతము. సం. వి. అ. పుం.
(గణిత) ఒక వర్గమును ఆ వర్గమూలముయొక్క ఘనముచే గుణింపఁగా వచ్చిన మొత్తము.
ఉదా. ౪ × ౮ = ౩౨.

వర్గఘనము. సం. వి. అ. పుం. (గణిత) ఒక వర్గమును ఆ వర్గముచేత మూఁడుమార్లు గుణింపఁగా వచ్చు సంఖ్య.
ఉదా. ౪ × ౪ × ౪ = ౬౪.

వర్గణ. సం. వి. ఆ. స్త్రీ. (గణిత) గుణనము. గుణకారము, హెచ్చవేయుట.

వర్గపదము = వర్గమూలము. సం. వి. అ. న.

వర్గప్రకృతి. సం. వి. ఇ. స్త్రీ. (గణిత) బీజగణితము నందలి యొక విధమగు గణనము.

వర్గము. సం. వి. అ. పుం. ౧. సజాతీయ సమూహము. సంఘము. ౨. పక్షము, వైపు. ౩. తెరము, పురుషాంతరము. ౪. ఒకగుంపుగాఁ జేర్పఁబడిన పదముల సమూహము (మనుష్య వర్గము, వనౌషధి వర్గము మొ.) ౫. వర్ణసమామ్నాయమున సవర్ణములగు హల్లుల సమూహము. (ఉదా. కవర్గము, చవర్గము మొ.) ౬. గ్రంథభాగము, అధ్యాయము. ౭. ఋగ్వేదమున నధ్యాయమునందలి భాగము. ౮. (గణిత) ఒక సంఖ్యను దానిచేతనే గుణింపఁగా వచ్చుసంఖ్య. (ఉదా. ౨ × ౨ = ౪. ౯. బలము. శక్తి. ౧౦. మండలము, గోళము. ౧౧. త్యాగము, విడుచుట.

వర్గమూలము. సం. వి. అ. న. (గణిత) ఒక సంఖ్యను ఆ సంఖ్యచేతనే గుణింపఁగా వచ్చిన సంఖ్యవర్గము. ఆ వర్గమునకు మూలము (మొదల) యినట్టి సంఖ్య.
ఉదా. ౯ కి ౩ వర్గమూలము, ౧౬ కు ౪ వర్గ వర్గమూలము.

వర్గవర్గము. సం. వి. అ. పుం. (గణిత) ఒక వర్గమును ఆ వర్గముచేత గుణింపఁగా వచ్చిన సంఖ్య. ఉదా. ౨ × ౨ = ౪, ౪ × ౪ = ౧౬.

వర్గాంత్యము. సం. వి. అ. న. కవర్గాదుల తుదివర్ణము, అను నాసికము.

వర్గి. సం. విశే. (న్. ఈ. న్.)
ఒక జాతికి సంబంధించినవాఁడు, ఒక పక్షమునకు సంబంధించినవాఁడు.

వర్గించు. సం. స. క్రి. వర్గముగా నేర్పఱుచు.
వ. ... మరణభాజులగు భూభుజుల కర్మాంబులగు నగర్హిత స్వర్గంబులు వర్గించి దివిజపతి విభజించుచున్నాఁడు ...
హరి. పూ. ౮. ౧౨౧.

వర్గీణము. సం. విశే. (అ. ఆ. అ.) వర్గమునకు సంబంధించినది. ఒక జాతికి లేక ఒక పక్షమునకు సంబంధించినది.

**వర్గీయుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. ఒక జాతికి సంబంధించినవాఁడు. ౨. ఒక తరమునకు సంబంధించిన వాఁడు.

వి. అ. పుం. సజాతీయ పురుషుఁడు.

**వర్గ(వు).** సం. వి. (ఉ. పుం. న.) సమూహము, గుంపు.

క. ఇది దేవవర్గు దీనిం, జదివిన వ్రాసినను
వినిన జనులకు నిత్యా, భ్యుదయమ్ము
లొసఁగు చుండును, వదలక కాశీనివాస
వాసుఁడు పేర్మిన్ ...

ఆం. సం. దేవ. ౪౨.

క. నవముగధరలో నీమా, నవవర్గువు వేడ్కఁ
జదివినను వ్రాసిన మా, నవులకు ననవరతం
బును, శివుఁ డవిముక్తేశ్వరుండు చెలువం
బొసఁగున్ ...

ఆం. సం. మాన. ౭౧.

**వర్గోత్తమము = వర్గాంత్యము.** సం. వి. అ. న. (జ్యోతి) పుం. నవాంశ భేదము.

**వర్గ్యుఁడు.** సం. విశే. (అ. ఆ. ఆ.) సజాతీయుఁడు సమానజాతివాఁడు.

వి. అ. పుం. ౧. సజాతీయుఁడు. ౨. సహాధ్యాయుఁడు, సహపాఠి.

**వర్చస్కము.** సం. వి. అ. న. ౧. ప్రకాశము, తళతళకాంతి. ౨. శక్తి, బలము, వీర్యము. ౩. మలము, పురీషము.

**వర్చస్వి.** సం. విశే. (న్. నీ. న్.) ౧. శక్తిగలవాఁడు, బలము గలవాఁడు, చులుకైనవాఁడు. ౨. ప్రకాశము గలవాఁడు, కాంతిగలవాఁడు.

**వర్చస్సు.** సం. వి. స్. న. ౧. బలము, శక్తి. ౨. తేజము, కాంతి, ప్రకాశము; తళతళనును కాంతి. ౩. రూపము, ఆకారము. ౪. మలము, పురీషము. ౫. శుక్రము, వీర్యము.

**వర్చోగ్రహము.** సం. వి. అ. పుం. రోగవిశేషము, మలబంధము, విరేచనము కాకపోవుట.

**వర్జకము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. చేరకుండఁ జేయునది, త్రోసివేయునది. బహిష్కరించునట్టిది. ౨. విడుచునది. తప్పించుకొనునది.

(సమాసమునం దుత్తర పదముగానే యుండును.)

**వర్జనము.** సం. వి. అ. న. ౧. విడుచుట, వదలిపెట్టుట. ౨. వినాయించుట. ౩. గాయపఱుచుట. ౪. హాని కలిగించుట. ౫. చంపుట.

**వర్జనీయము.** సం. విశే. (అ. ఆ. అ.) వర్జింపఁదగినది.

**వర్జము.** సం. వి. అ. పుం. విడుచుట, వీడుచుట.

**వర్జించు.** సం. స. క్రి. విడుచు, పరిత్యజించు.

గీ. విద్యచే భూషితుండయి వెలయుచున్నఁ,
దొడరి వర్జింపఁదగు సుమీ దుర్జనుండు,
చారు మాణిక్య భూషితశస్తమస్త, కంబ
యినపన్నగము భయంకరము గాదె.

భర్తృ. ౧. ౪౩.

**వర్జితము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. వర్జింపఁబడినది, విడువఁ బడినది. ౨. వినాయింపఁబడినది. ౩. మానఁ బడినది. ౪. బహిష్కరింపఁ బడినది. ౫. లేకుండఁ జేయఁబడినది.

**వర్జ్యము.** సం. విశే. (అ. ఆ. ఆ.) ౧. విడువఁదగినది, వర్జింపఁ దగినది. ౨. బహిష్కరింపఁదగినది. త్రోసివేయఁ దగినది. లేకుండఁ జేయఁ దగినది.

వి. అ. న. చాంద్రమాన ప్రకారము నక్షత్రకాలమున కార్యారంభమునకు విడువఁదగిన కాలము.

**వర్ణక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. వేషము. ౨. హరిదళము. ౩. చిత్తరువు వ్రాయుట కుపయోగపడు రంగు. ౪. సిందూరము. ౫. ఇంగిలీకము. ౬. మేలిమి బంగారము. ౭. ఉత్తరీయము, పైబట్ట. ౮. మంచి గందము. ౯. పిండి. ౧౦. స్త్రీ లుపయోగించు పరిమళ ద్రవ్య విశేషము.

**వర్ణకము.** సం. వి. అ. పుం. ౧. నటుని వేషము, వేషము. ౨. చిత్తరువు వ్రాయుట. చిత్తరువు వ్రాయుట కుపయోగించెడి రంగు. ౩. రంగు పదార్థము. ౪. సిందూరము. ౫. చందన వృక్షము. మంచి గందపు చెట్టు. ౬. అక్షరము, వర్ణము. ౭. (ఆం. వ్యాక.) ప్రత్యయము, డు. ము. వు.

న. ౧. ఛాయ, వన్నె. రంగు. ౨. చందనము. మంచి గందము. ౩. అధ్యాయము, గ్రంథములో భాగము. ౪. గోళము, మండలము.

**వర్ణకుఁడు.** సం. వి. అ. పుం. స్తోత్ర పాఠకుఁడు, బట్టు.

**వర్ణకూపిక.** సం. వి. ఆ. స్త్రీ. మసిబుడ్డి, సిరా బుడ్డి.

**వర్ణక్రమము.** సం. వి. అ. పుం. ౧. బ్రాహ్మణాది వర్ణముల క్రమము. ౨. రంగుల క్రమము. ౩. అక్షరముల క్రమము.

**వర్ణచారకుఁడు.** సం. వి. అ. పుం. చిత్రకారుఁడు, ముచ్చి.

**వర్ణజ్యేష్ఠుఁడు.** సం. వి. అ. పుం. బ్రాహ్మణుఁడు.

విణ. (అ. ఆ. అ.) తన వర్ణముకంటె పై వర్ణమునకు సంబంధించిన వాఁడు.

**వర్ణతూలి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. లేఖిని పేనా, కలము, రంగులు వేయు కుంచె.

**వర్ణతూలిక.** వర్ణతూలి, సం. వి. ఆ. స్త్రీ.

**వర్ణదము.** సం. విణ. (అ. ఆ. అ.) రంగుగలిగించునది: రంగు నిచ్చునది.

వి. అ. న. కాలీయకము. నల్ల అగలు, లేక, శీతచందనము.

**వర్ణదాత్రి.** సం. వి. ఈ. స్త్రీ. పసుపు. ‡.

**వర్ణదూత.** సం. వి. అ. పుం. (అక్షరరూపమగు దూత.)

౧. జాబు; వార్తా పత్రిక. ౨. లిపి. (వాచ.)

**వర్ణదూషకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) వర్ణభేదముల నుల్లంఘించు వాఁడు.

**వర్ణధర్మము.** సం. వి. అ. పుం. బ్రాహ్మణాది వర్ణముల కేర్పరుపఁబడినధర్మము.

**వర్ణన - వర్ణనము.** సం. వి. ఆ. స్త్రీ.

౧. చిత్తరువు వ్రాయుట. ౨. వర్ణించుట, ఒక యంశమును వివరించి చెప్పుట. ౩. వ్రాయుట. ౪. చెప్పుట. ౫. స్తోత్రము.

**వర్ణనకెక్కు.** అ. క్రి. (వర్ణనకున్ + ఎక్కు) ప్రసిద్ధినొందు.

సీ. ... వర్ణలెల్లచో వర్ణన కెక్కంగ రసములు దలుకొత్తి రాలు వాఱ ...

కు. సం. ౧. ౩౬.

**వర్ణనము.** సం. వి. అ. న. ౧. చిత్తరువు వ్రాయుట. ౨. ఒక యంశమును వివరించి చెప్పుట. ౩. వ్రాయుట. ౪. చెప్పుట. ౫. స్తోత్రము.

**వర్ణపాతము.** సం. వి. అ. పుం. అక్షరము లోపించుట.

**వర్ణపుష్పము.** సం. వి. అ. పుం. వన్నెచెట్టు. (శ. ర.)

**వర్ణమాత.** సం. వి. ఋ. స్త్రీ. లేఖిని, కలము.

**వర్ణమాతృక.** సం. వి. ఆ. స్త్రీ. సరస్వతి.

**వర్ణమాల.** సం. వి. ఆ. స్త్రీ. ౧. అక్షర సమామ్నాయము.

౨. (మంత్ర) అంతర్యాగమునందు పంచాశద్వర్ణాత్మకమైన వర్ణ రూపాత్మ మాల.

**వర్ణము.** సం. వి. అ. పుం. ౧. నీలాది వర్ణము. వన్నె. ౨. చిత్తరువుల రంగు, ఛాయ. ౩. కాంతి, దేహచ్ఛాయ, ఒడలిరంగు. ౪. బ్రాహ్మణాద్యదిజాతి. (చాతుర్వర్ణ్యము) ౫. రకము, విధము. ౬. (వ్యా) అక్షరము. ౭. పదము. ౮. ప్రఖ్యాతి, కీర్తి. ౯. మంచిగుణము, సుగుణము. ౧౦. స్తుతి, పొగడ్త. ౧౧. అలంకారము. ౧౨. ఆకారము, రూపు. ౧౩. ఉత్తరీయము, పైబట్ట. ౧౪. మూత, కప్పు. ౧౫. సంగీత క్రమము. ౧౬. శీలము, స్వభావము, లక్షణము. ౧౭. మత సంబంధమైన కర్మాచరణము. ౧౮. తెలియని పరిమాణము. తెలియని మొత్తము. ౧౯. ఏక సంఖ్యకు సంకేతము. ౨౦. అంగరాగము. ఒడలికి పూసికొను పరిమళద్రవ్యము. ౨౧. బంగారము. ౨౨. తాళభేదము (వాచ.)

న. ౧. కుంకుమపువ్వు. ౨. రంగుగలయంగరాగము. ౩. రంగుల తైలము.

**వర్ణరే(లే)ఖ.** సం. వి. ఆ. స్త్రీ. కఠిని, బలపము.

**వర్ణవర్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. రంగువేయు కుంచె. ౨. లేఖిని, పేనా, కలము.

**వర్ణవర్తిక = వర్ణవర్తి.** వర్ణవర్తి. సం. వి. ఆ. స్త్రీ.

**వర్ణవిపర్యయము.** సం. వి. అ. పుం. వర్ణవ్యత్యయము, అక్షరముల తారుమారు.

**వర్ణవిలాసిని.** సం. వి. ఈ. స్త్రీ. పసుపు. శ. ఇట్లే వర్ణవతి.

**వర్ణవిలోడకుఁడు.** సం. వి. అ. పుం. ౧. కన్నగాఁడు. ౨. శ్లోకముల నపహరించు వాఁడు, చోర కవి.

**వర్ణశ్రేష్ఠుఁడు = వర్ణజ్యేష్ఠుఁడు.** సం.

**వర్ణసంకరము.** సం. వి. అ. పుం. ౧. వివాహముల ద్వారమున భిన్న వర్ణములు కలియుట, జాతుల సాంకర్యము.

౨. రంగులు కలియుట.

**వర్ణసమామ్నాయము.** సం. వి. అ. పుం. అక్షరమాల, వర్ణమాల.

**వర్ణస్థానము.** సం. వి. అ. న. అక్షరముల యుచ్చారణ స్థానము (కంఠాది)

**వర్ణహీనుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. జాతిభ్రష్టుఁడు. ౨. తక్కువ జాతివాఁడు.

**వర్ణాంక.** సం. వి. ఆ. స్త్రీ. లేఖిని, కలము, పేనా.

**వర్ణాటుఁడు.** సం. వి. అ. పుం. ౧. చిత్రకారుఁడు. ౨. గాయకుఁడు. ౩. స్త్రీకృతాజీవుఁడు, భార్య సంపాదనచే జీవించువాఁడు. ౪. వల్లభుఁడు, ప్రియుఁడు. (విల్యమ్సు.)

**వర్ణాపేతుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) వర్ణము నుండి తొలఁగిన వాఁడు. జాతిబాహ్యుఁడు.

**వర్ణార్హము.** సం. వి. అ. పుం. ముద్గము, పెసరు. శ. (రా. ని.)

**వర్ణి.** సం. విశే. (న్. నీ. న్.) (సమాసాంతమునందు.)

౧. రంగు గలది. ౨. జాతికి (వర్ణమునకు) సంబంధించినది.

వి. న్. పుం. ౧. చిత్రకారుఁడు. ౨. వ్రాయసకాఁడు, వ్రాతగాఁడు. ౩. బ్రహ్మచారి. ౪. బ్రాహ్మణాది చతుర్వర్ణములలో నే వర్ణమునకైనఁ బుట్టిన వాఁడు.

**వర్ణించే.** సం. స. క్రి. స్తుతించు, పొగడు.

క. ...అనఘా పరు నిందించుట, దను వర్ణించే కొను టనుచితము లెయ్యెడలన్ ...
భార. శాం. ౫. ౪౫౩.

శా. వాచాగోచర మప్రతర్క్యము వినిర్ద్వంద్వం బసాధారణం, బాచోద్యం బతిలోక మప్ర తిమపర్యాయంబు వర్ణింపఁగా, నీ చెల్వంబు.
శ్రీ కాళ. ౨. ౧౩.

**వర్ణిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. నటుని వేషము. ౨. రంగు, చాయ. ౩. మసి, సిరా. ౬. లేఖిని, కలము. ౫. పత్రిని, బలపము.

**వర్ణితము.** సం. విశే. (అ. ఆ. అ.) వర్ణింపఁ బడినది.

౧. రంగువేయఁబడినది. ౨. వివరముగాఁ దెలుపఁ బడినది. ౩. స్తుతింపఁ బడినది.

**వర్ణిని.** సం. వి. ఈ. స్త్రీ. పసుపు. (చూ. వర్ణి)

చ. అనుడు బ్రలంబ వైరికి మురాంతికుఁ డిట్లను నిగ్గిరివ్రజం,బను నగరంబు గాచికొని యా హవనీయము నుండుచుండు న,య్యనలము చాయఁ బూవె మనమందఱము న్వరవర్ణినీ ఘన,స్తనవరవర్ణినీద్యుతికిఁ దావల మైతిమి ప్రీతి మీఱఁగన్.
హ. హరి. ౬. ౩౦.

(రెండర్థములకు నిదియే యుదాహరణము.)

**వర్ణిలింగి.** సం. వి. న్. పుం. ఉదరపోషణము నకు బ్రహ్మచారివలె వర్తించువాఁడు, కపట బ్రహ్మచారి.

**వర్ణువు.** సం. వి. ఉ. పుం. ౧. సూర్యుఁడు. ౨. ఒకానొక నదము. (వాచ.)

**వర్ణ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. వర్ణింపఁ దగినది. ౨. అలంకార శాస్త్ర గ్రంథముల యందు 'ప్రస్తుతము' అను నర్థమునఁ బ్రయోగింపఁ బడును.

వి. అ. న. కుంకుమ పువ్వు.

**వర్తక.** సం. వి. ఆ. స్త్రీ. వెలిచె పిట్ట.

**వర్తకము.** వి. వాణిజ్యము, క్రయ విక్రయ వ్యాపారము.

(శ. ర. దీనిని సం. గా గ్రహించెను.)

మ. తనుకుం జాలినవర్తకం బతనిచేతం గామి నోశంఖపద్మమహాపద్మములర్థపున్ విడిచి ప్రేమం దత్పురీవైశ్యస,త్తములం జేర ననంగ ...
కవిరా. ౧. ౭౨.

ఆ. పైరువలన మనము బ్రతికెడు వారము, గాము విపణివర్తకంబుచేత, జీవనంబు నడప మావులే దైవంబు, లనుచునుండు వారమగుటఁజేసి.
వి. పు. ౭. ౨౯.

**వర్తకము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. జీవించు చున్నది. ౨. అభినివేశము గలది.

వి. అ. పుం. ౧. వెలిచెపిట్ట. ౨. గుఱ్ఱపు డెక్క. ౩. వాణిజ్యము. వణిగ్వ్యాపారము.

ఆ. పైరువలన మనము బ్రదికెడువారము, గాము విపణి వర్తకంబుచేత, జీవనంబునడప మావు లేదైవంబు, లనుచునుండు వారమగుటఁజేసి.
వి. పు. ౭. ౨౯.

న. లోహవిశేషము.

**వర్తకుఁడు.** సం. వి. అ. పుం. వణిజుఁడు, క్రయ విక్రయ వ్యాపారము చేయువాఁడు.

(వ్యవ.) ఈ యుద్ధకాలమునఁ జాలమంది వర్తకులు మంచిలాభమును పొందినారు.

వ_ర్తనము, సం. విణ. (అ. ఈ. అ.) ౧. వసించుచున్నది. జీవించుచున్నది. ఉన్నది. ౨. స్థిరమైనది, నిలుకడ కలది, చలనములేనిది.

వి. అ. న. (ఇది చరిత్రాదులలోనిది కావున - ముపర్ణకలోపము వైకల్పికము.)

౧. జీవనము, బ్రదుకు. ౨. ఉనికి, స్థితి. 3. వృత్తి, జీవిక, వ్యాపారము. ౪. జీవనాధారము, జీవనోపాయము. ౫. గుఱ్ఱము షాళిలో దొర్లుట, గుఱ్ఱము దొర్లెడు తావు (విల్యమ్సు) (కే. ని.) ౬. చుట్టచుట్టుకొనుట. ౭. ఏర్పఱుచుట, పనిపెట్టుట. ౮. నడవడి, ప్రవర్తనము, నడచు పద్ధతి. ౯. బత్తెము, జీతము, కూలి. ౧౦. వాణిజ్యము. ౧౧. నూలువడకు కదురు మొదట నమర్చెడు బిళ్ల, తకుŋ-పిండము. ౧౨. గోళము, మండలము. ౧3. తఱచు పలుకు మాట (కే. ని.)

వ_ర్తని, సం. వి. ఇ. పుం. ౧. భరతఖండమునఁ దూర్పువైపు దేశము, తూర్పుదేశము. ౨. (మంత్రరూప) స్తోత్రము.

ఈ. స్త్రీ. ౧. బాట, మార్గము, కాలిజాడ. ౨. పక్ష్మము, కనుఱెప్ప వెండ్రుకలు. 3. చక్రము పోయినజాడ. ౪. పేషణము, నూరుట, చూర్ణీకరణము (వాచ.) ౫. నూలు వడకెడు కదురుబిళ్ల.

వ_ర్తనుఁడు, సం. వి. అ. పుం. మఱుగుజ్జువాఁడు, వామనుఁడు.

వ_ర్తనుఁ..., సం. వి.... (అ. ఆ. అ.) ౧. పొట్టివాఁడు. ౨. వర్తించువాఁడు. (శ. ర.)

వ_ర్తమానము, సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఉండునది. ౨. జీవించియున్నది. 3. చుట్టు తిరుగుచున్నది. ౪. నివసించుచున్నది.

వి. అ. పుం. ౧. (వ్యాక.) జరుగుచున్న కాలము. ప్రారబ్ధాపరిసమాప్తక్రియాశ్రయము గుకాలము.

౨. వృత్తాంతము, సమాచారము.

చ. విను మిటులుండఁగాఁ దిమిరవేణి కుబేరుఁడు కమ్మ పంపఁగా, దినసరి చీటులందు గడిర జయంగునివర్తమానముల్, విని నలకూబరుండు ... కువల. ౪. ౧౮౯.

న. సాన్నిధ్యము.

వ_ర్తము, సం. వి. అ. పుం. (ప్రాయికముగా సమాసాంతమున నుపయుక్తము.

ఉదా. కల్యవర్తము) జీవిక, జీవనాధారము.

వ_ర్తరూకము, సం. వి. అ. పుం. ౧. పల్వలము, పడియ, నీరుగల చిన్నగుంట. ౨. నీటి సుడి, జలావర్తము. 3. కాకిగూఁడు. ౪. ఒకానొకనది.

వ_ర్తరూకుఁడు, సం. వి. అ. పుం. ద్వారపాలకుఁడు.

వ_ర్తి, సం. విణ. (న్. నీ. న్.) (ప్రాయికముగా సమాసాంతమున నుండును.)

౧. నివసించుచున్నవాఁడు. ఉన్నవాఁడు.

౨. ప్రవర్తించువాఁడు.

(క.) వెళ్లుచున్నవాఁడు.

(చ.) పనిచేయుచున్న వాఁడు. ప్రవర్తించుచున్నవాఁడు.

(ట.) ఆచరించుచున్న వాఁడు.

వి. ఇ. ఈ. స్త్రీ. ౧. చుట్టచుట్టుకొనిన వస్తువు; చుట్ట. ౨. పలువిధములగు సువాసన ద్రవ్యములతో తయారుచేయఁబడిన అంగరాగము, మేపూఁత. 3. అంజనము. ౪. దీపపు వత్తి. ౫. బట్టయంచు, బట్ట చివరజాలరు. వస్త్రాంచలముగా నుండుదారము. ౬. పాత్రముల

అంచు. ౮. ఇంద్రజాల సంబంధమైన దీపము. ౭. శస్త్రవైద్యమునం దుపయోగించు సాధన విశేషము. ౯. రేఖ, గీఁత. ౧౦. కంఠమువాపు. ౧౧. లోపలఁ బగులుటచే పైని వాచుట.

**వర్తించు = వర్తిల్లు.** సం. అ. క్రి. ౧. ఉండు.

గీ. నేల నాలుగుచెఱఁగుల నృపులకొలువు, లందు నేను వర్తించితి నవనినాథ, యాగ్రహించి నాయెదుర బాహాస్ఫాలించి, కడఁగఁజాలెడు మల్లుఁ గాన నెందు. భార. విరా. ౨. ౮.

౨. నడచు, సంచరించు.

వ. కాంతేయులంగానక సంకేతస్థలంబునంగూడికొని మావర్తించిన తెఱంగుదేవరకు నెఱింగించి ... భార. విరా. ౩. ౭౮.

**వర్తిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. చిత్తరువు వ్రాసెడి కుంచె. ౨. దీపపువత్తి. ౩. రంగు. ౪. మాలవల్లంకిపిట్ట. ౫. జుట్టుపు ముక్కు. (రా. ని.)

**వర్తిధూపము.** సం. వి. అ. పుం. అగురువత్తి. (శ. ర.)

**వర్తిల్లు = వర్తించు.** సం. అ. క్రి. ౧. ఉండు.

వ. శుక్రమతంబునఁ బంచమోపాయంబైన యుపేక్ష వర్తిల్లుదానిం బ్రయోగించు భంగియుం జెప్పెద ... భార. శాం. ౨. ౪౧౮.

౨. సంభవించు, కలుగు.

క. అగుదేశ కాలబలయుత, ముగఁజేసిన పౌరనర్ధములు మాఱుకులై, తెగఁబాఱి తమ్ము నెదిరిని, మగవక తొడరుటలఁ గీడు వర్తిల్లుఁ గుఁడిన్. భార. విరా. ౪. ౨౦౭.

౩. నిలఁబడు, ఆధారపడు.

ఆ. వార్తయందు జగము వర్తిల్లుచున్నది, యది యులేనినాఁడ యఖిలజనులు, నంధకారమగ్నులగుదురు ... భార. సభా. ౧. ౫౦.

**వర్తిష్ణు(ఁడు)వు.** సం. విశే. (ఉ) వర్తించు స్వభావము గలవాఁడు, వర్తనశీలుఁడు.

**వర్తులము.** సం. విశే. (అ. ఆ. అ.) గుండ్రనిది, వర్తులమైనది.

వి. అ. పుం. ౧. ఒక విధమగు కాయధాన్యము, బటాణి. ౨. కందుకము, బంతి.

న. ౧. మండలము, గోళము. ౨. వెల్లుల్లి. ¶.

**వర్తులాభరణము.** సం. వి. అ. న. బవిర.) వర్తులాకారమైన కర్ణాభరణ విశేషము.

**వర్త్మని.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. మార్గము, బాట. (వాచ.)

**వర్త్మపాతము.** సం. వి. అ. పుం. త్రోవతప్పుట.

**వర్త్మబంధ(క)ము.** సం. వి. అ. పుం. కనుఱెప్పల జబ్బు, ఱెప్ప లంటుకొనుట ?

**వర్త్మము.** సం. వి. న్. న. ౧. మార్గము, బాట. ౨. పద్ధతి, వాడుక, మామూలు. ౩. అవకాశము, సందు, ఎడము. ౪. పక్ష్మము. కనుఱెప్ప వెండ్రుక. ౫. అంచు, అంచలము.

**వర్ధకము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. వృద్ధి పఱుచునది, పెంచునది. ౨. నిండించునది. ౩. నఱుకునది, ఖండించునది.

వి. అ. పుం. బ్రాహ్మణయష్టిక, గంటుబారంగి. ¶. (వాచ.)

**వర్ధకి.** సం. వి. ఇ. న్. పుం. వడ్రంగి.

**వర్ధకుఁడు = వర్ధకి.** సం. వి. అ. పుం.

**వర్ధనము.** సం. విశే. (అ. ఈ. అ.) ౧. పెరుగునది, వృద్ధిపొందునది. ౨. వృద్ధిపొందించునది, పెంచునది.

వి. అ. పుం. ౧. పంటిమీఁదఁ బుట్టెడి రెండవ పల్లు, దొంతరపండ్లలోఁ బైది.

న. ౧. పెరుఁగుట, వృద్ధిపొందుట. ౨. అభ్యుదయము. ౩. ఔన్నత్యము, ఉన్నతి. ౪. ఉత్సాహము. ౫. విద్య నేర్పుట. ౬. పోషించుట. ౭. ఖండించుట, త్రుంచుట, ఛేదనము, నాభివర్ధనము. ౮. బలకరమైన మందు. ౯. నిండించుట.

**వర్ధని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. చీపుఱుకట్ట. ౨. పాడె, శవవాహనము. ౩. మూతి సన్నముగా నుండెడి యొకవిధమయిన పాత్రము, జారి.

**వర్ధనుఁడు.** సం. వి. అ. పుం. ౧. ఐశ్వర్య మిచ్చువాఁడు, అభివృద్ధి గలిగించువాఁడు. ౨. శివుఁడు. ౩. విష్ణువు.

**వర్ధమాన.** సం. వి. ఆ. స్త్రీ. ప్రకృతము బర్ద్వాన యనఁబడెడి మండలము.

**వర్ధమానకము.** సం. వి. అ. పుం. శరావము, మంటిమూఁకుడు.

**వర్ధమానము.** సం. విశే. (అ. ఆ. అ.) పెరుఁగుచున్నది, వృద్ధిపొందుచున్నది.

వి. అ. పుం. ౧. ఆముదపుఁజెట్టు. ౨. గూఢప్రశ్న ; ఒక విధమైన పొడుపుకథ. ౩. ప్రకృతము బర్ద్వానయనఁబడు దేశభాగము.

**వర్ధమానుఁడు.** సం. వి. అ. పుం. ౧. విష్ణువు. ౨. అర్హతులలో (జైనమతావలంబులలో) నొకఁడు.

**వర్ధము.** సం. వి. అ. పుం. ౧. నఱకుట, ఛేదించుట. ౨. వృద్ధిపొందించుట ; వృద్ధిపొందుట. ౩. వృద్ధి. ౪. నిండించుట.

న. ౧. సీసము. ౨. సిందూరము.

**వర్ధాపనము.** సం. వి. అ. న. ౧. ఛేదనము, ముక్కలుచేయుట. ౨. నాభిచ్ఛేదము, బొడ్డు కోయుట. ౩. జన్మదివసోత్సవము. పుట్టిన దినము పండుగు. ౪. అభివృద్ధి కామునై హోమాదికముచేయు సంస్కార విశేషము.

**వర్ధితము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. పెంపఁబడినది ; వృద్ధిపొందింపఁ బడినది. ౨. విరివి చేయఁబడినది. ౩. ఖండింపఁబడినది. ౪. నిండింపఁబడినది.

**వర్ధిల్లు.** సం. అ. క్రి. వృద్ధిపొందు.

క. క్రేపులు వర్ధిల్లుటయును, గోపీ పసులు పాలు గురియుచునికియు నన్నంౘే పారమునకుఁ గలిమియు, నా పరమేశ్వరునియోగి యని యెఱుఁగు మనా. హరి. పూ. ౭. ౧౨౭.

**వర్ధిష్ణువు.** సం. విశే. (ఉ) అభివర్ధన శీలమైనది, వృద్ధి పొందునది.

**వర్ధ్రిము.** సం. వి. అ. న. ౧. తోలు. ౨. సీసము.

**వర్ధ్రి.** సం. వి. ఈ. స్త్రీ. తోలువాఱు, టంగువాఱు.

**వర్ధ్రిక = వర్ధ్రి.** సం. వి. ఆ. స్త్రీ.

**వర్మణము.** సం. వి. అ. పుం. నారింజ. ?.

**వర్మము.** సం. వి. న్. న. ౧. కవచము, బొందలము. ౨. కాపు, రక్షణము. ౩. చెట్టుపట్టు.

పుం. ౧. క్షత్రియుల నామాంతమునఁ జేర్పఁబడెడి పదము.

ఉదా : ఇంద్రవర్మ, సింహ వర్మ మొ.

**వర్మహారుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. కవచధారి, కవచముధరించువాఁడు. ౨. కవచము ధరించుటకుఁ (అనఁగా యుద్ధము చేయుటకు) దగిన వయస్సు గలవాఁడు.

**వర్మి.** సం. విణ. (న్. ణీ. న్.) కవచి, కవచము ధరియించువాఁడు.

వి. ఇ. పుం. ఒక జాతిచేఁప.

**వర్మితుఁడు.** సం. విణ. (అ. ఆ. అ. ౧. సన్నద్ధుఁడు, చేయఁబడ్డసన్నాహము గలవాఁడు. ౨. ఉద్యుక్తుఁడు, పూనుకొన్న వాఁడు.

**వర్య.** సం. వి. ఆ. స్త్రీ. ౧. తనంతట మగని వరించునట్టి కన్యక. ౨. కన్యక, పెండ్లికానిది.

**వర్యుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. వరింపఁ దగిన వాఁడు, ఎన్నుకొనఁ దగిన వాఁడు. ౨. శ్రేష్ఠుఁడు, ప్రశస్తతముఁడు. ౩. ముఖ్యుఁడు.

(కడపటి రెండర్థములయందును సమాసాంతమునఁ దఱచుగా నుపయుక్తమగును.)

వి. అ. పుం. మన్మథుఁడు.

**వర్వటము = బర్బటము.** సం. వి. అ. పుం. రాజమాషము, బొబ్బగలఁ.

**వర్వణ.** సం. వి. ఆ. స్త్రీ. నీలమక్షిక, నల్ల ఈఁగ.

**వర్వర.** సం. వి. ఆ. స్త్రీ. ౧. మక్షికాభేదము. ఒక విధమైన యీఁగ. ౨. ఒక విధమైన తులసి. నల్ల తులసి.

**వర్వరము.** సం. విణ. (అ. ఆ. అ.) చుట్టలు చుట్టలుగా నున్నది.

వి. అ. పుం. ౧. ఉంగరాల జుట్టు. ౨. ఆయుధములు ఒకదాని కొకటి తగులుట వలనఁ గలిగిన శబ్దము. ౩. నాట్య విశేషము. ౪. కృష్ణార్జకవృక్షము.

న. ౧. పీతచందనము. పచ్చ మంచిగంధము. ౨. సిందూరము. ౩. బాలెంత బోళము.

**వర్వరి = వర్వర.** సం. వి. ఈ. స్త్రీ.

**వర్వరీకము.** సం. వి. అ. పుం. ౧. చుట్టలుగాఁ జుట్టుకొనిన జుట్టు. ౨. తులసీ భేదము. ఒక విధమైన తులసి. ౩. ఒకజాతి మొక్క. గంటు బారంగి. ‡. ౪. వాయింట మొక్క. (వాచ.)

**వర్వరుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. వత్తిగా మాటలాడెడి వాఁడు. ౨. ఆరణ్యకుఁడు, అనాగరకుఁడు, మోటువాఁడు. ౩. బుద్ధిహీనుఁడు. మూర్ఖుఁడు. ౪. జాతిభ్రష్టుఁడు. వర్ణ భ్రష్టుఁడు.

**వర్వ్యాపని = వరపుడుపని.** వి. దాస్యము.

సీ. శ్రీ వాక్యచీసురసిద్ధవిద్యాధరదనుజాంగనల వర్వ్యాఁ బనులు గొనఁగ ...

కు. సం. ౭. ౧౨౨.

**వర్ష.** సం. వి. ఆ. స్త్రీ. (సంస్కృతమున బహువచనము.) ౧. వానకాలము, వర్ష ఋతువు.

**వర్షకరి.** సం. వి. ఈ. స్త్రీ. ఇలకోడి, కీఁచుటాయి.

**వర్షకోశము.** సం. వి. అ. పుం. మాసము, నెల. (వాచ.)

**వర్షకోశుఁడు.** సం. వి. అ. పుం. జ్యోతిశ్శాస్త్రజ్ఞుఁడు.

**వర్షగిరి.** సం. వి. ఇ. పుం. వర్ష పర్వతము. ప్రపంచమున వేఱువేఱు భూభాగముల నొకదానితో నొకటిని విభజించు సరిహద్దు కొండ. ఇవి యేడు.

౧. హిమవంతము. ౨. హేమకూటము. ౩. నిషధము. ౪. మేరువు. ౫. చైత్రము. ౬. కర్ణి. ౭. శృంగి అనునవి.

శ్లో. హిమవాన్ హేమ కూటశ్చనిషధో మేరు రేవచ, చైత్రః కర్ణీచ శృంగీచ సప్తైతే వర్ష పర్వతాః.

**వర్షణము.** సం. వి. అ. న. ౧. వర్షించుట, కురియుట ; వర్షము. ౨. పుష్పములు మొ. చల్లుట. ౩. ధారాళముగా నిచ్చుట.

ఉదా. ద్రవ్య వర్షణము.

**వర్షణి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. వర్షము, కురియుట ; వాన. ౨. యజ్ఞము, యజ్ఞక్రియ. ౩. కార్యము, పని. ౪. వర్తనము, ఉనికి. (విల్యమ్సు)

**వర్షధరము.** సం. వి. అ. పుం. ౧. మేఘము. ౨. వర్ష పర్వతము.

**వర్షపర్వతము = వర్షగిరి.** సం. వి. అ. పుం.

**వర్షపాకి.** సం. వి. న్. పుం. ౧. మారేడు. ౯. ౨. ఆమ్రాతకము. అంబాళము. ౯.

**వర్షపతిబంధము.** సం. వి. అ. పుం. అవగ్రహము, వానలేమి, వఱపు.

**వర్షప్రియము.** సం. వి. అ. పుం. చాతకపక్షి.

**వర్షము.** సం. వి. అ. పుం. న. ౧. వాన, వాన కురియుట. ౨. (పుష్పాదులను) చల్లుట (ఉదా) శరవర్షము, శిలావర్షము, లాజవర్షము మొ. ౩. వీర్యస్రావము, శుక్రముకారుట. ౪. ఏఁడాది, సంవత్సరము. ౫. ప్రపంచ భాగము (కురు, హిరణ్మయ, రమ్యక, ఇలావృత, హరి, కేతుమాల, భద్రాశ్వ, కిన్నెర, భారతములను తొమ్మిది. వర్షములు) ౬. జంబూ ద్వీపము, భారతవర్షము (మే. ని.) ౭. మేఘము. మబ్బు.

**వర్షవ(ధ)రుఁడు.** సం. వి. అ. పుం నపుంసకుఁడు, కంచుకి, అంతఃపురపుఁ గావలివాఁడు.

**వర్షవృద్ధి.** సం. వి. ఇ. స్త్రీ. జన్మదినము, పుట్టిన దినము.

**వర్షాంగము = వర్షాంశము.** సం. వి. అ. పుం.

**వర్షాంబుదము.** సం. వి. అ. పుం. వర్షించు మేఘము.

**వర్షాంబువు.** సం. వి. ఉ. న. వాననీరు.

**వర్షాంశ(క)ము.** సం. వి. అ. పుం. మాసము, నెల.

**వర్షాకాలీనము.** సం. విశే. (అ. ఆ. అ.) వర్షాకాలమునకు సంబంధించినది. వర్షాకాలమునఁ బుట్టినది.

**వర్షాప్రభంజనము.** సం. వి. అ. పుం. ఝంఝూమారుతము.

**వర్షాభువు.** సం. వి. (ఊ) స్త్రీ. ౧. ఆఁడుకప్ప; చిన్నకప్ప. ౨. గర్జెనపల్లిక. ౯.

పుం. ౧. కప్ప. ౨. ఆరుద్ర పురువు. ౩. ఎఱ్ఱ, వానపాము.

**వర్షాభ్వీ.** సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుకప్ప, భేకి.

**వర్షామదము.** సం. వి. అ. పుం. నెమిలి, మయూరము.

**వర్షారాత్రము.** సం. వి. అ. పుం. ౧. వాన కాలపు రాత్రి. ౨. వానకాలము.

**వర్షార్చిస్సు.** సం. వి. స్. న. అంగారక గ్రహము.

వర్షావసానము. సం. వి. అ. న. శరత్కాలము.

వర్షాశనము. సం. వి. అ. న. రాజులు మున్నగువారు పండితులు మొదలగు వారికి సంవత్సరమున కొకమారిచ్చెడి సంవత్సర గ్రాసద్రవ్యము.

వర్షించు. సం. అ. క్రి. కురియు.

సీ. ఎచట నెవ్వరుఁ గోర నచటనే వర్షించుఁ బడు గింజలనె పండుఁ బుడమి యెల్ల ... దశా. ౪. ౧౨౧.

ద్వి. గడలతాఁకుల మౌక్తికములు బిట్టెగసి, వడిఁ దదంగణ భూమి వర్షించుచుండ ... ద్వి. పరమ. ౩. ౧౪౪.

వర్షితము. సం. వి. అ. న. వర్షము, వాన.

వర్షిష్ఠుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) అందరకంటెఁ బెద్దవాఁడు.

వర్షీయుఁడు. సం. విశే. స్. (యసీ) స్. ౧. ఒకనికంటె ఎక్కువ యేండ్లు గడచిన వాఁడు ౨. మిగుల వృద్ధుఁడు.

వర్షుకము. సం. విశే. (అ. ఈ. అ.) వర్షించునది, కురియునది.

వర్షోపలము. సం. వి. అ. పుం. కరక, వడగల్లు.

వర్ష్మము. సం. వి. న్. అ. న. ౧. శరీరము, ఒడలు. ౨. చక్కని రూపము, మనోజ్ఞ రూపము. ౩. ఎత్తు, ఉన్నతి. ౪. వైశాల్యము.

వర్స, వి. "వరుస" యొక్క రూపాంతరము.

౧. క్రమము, వర్సవెంబడి. ప్ర. వంతులప్రకారముగా, క్రమానుసారమున.

గీ. రాజకులవర్యుఁ డాత్మభార్యాచతుష్క, నిలయముల వర్స వెంబడి నిద్ర సలుపు ... శుక. ౩. ౫౪౦.

౨. పంక్తి.

ద్వి. తెలుపారి మెఱుఁగొక్క పలువర్సఁ దలఁచు ... పండితా. పురా. ౧౨౩. పా.

ద్వి. ఇలువర్స దప్పూట యొగ్గు బొమ్మనక ... పండితా. దీక్షా. ౪౩. పా.

వర్హాణము = బర్హాణము. సం. వి. అ. న.

వర్హము = బర్హము. సం. వి. అ. పుం. న.

వర్హి = బర్హి. బర్హిన్. సం. వి. ఇ. పుం. వి. న్. పుం.

వర్హిణము = బర్హిణము. సం. వి. అ. పుం.

వర్హిస్సు = బర్హిస్సు. సం. వి. స్. పుం.

వఱ, వి. (క. వరె. త. వరై) మేర, హద్దు.

సీ. ఈ వఱకును సామియిచ్చలోఁ జరియించు మన్ననఁ బురుషులు మాన్యచరితు, లలభరద్వాజ కశ్యప గౌతమాత్రికౌశిక జమదగ్ని వసిష్ఠమునులు ... ఘటికా. ౨. ౯౯.

వఱకు. అవ్య. దనుకన్.

క. దేవరకంటెను మించునొ, దేవరకు సమానుఁ డగునొ తెలియఁబడదు మే, మీవఱకొవిభుఁ బోలిన, భూవరుఁ గని యెఱుఁగ మనిన బుద్ధి చలింపన్.

ఉ. రా. ౩. ౨౨౮.

కొన్ని తావులఁ బర్యంతార్థమున దనుక దాఁక శబ్దములతోఁ జేరియుఁ బ్రయోగింపఁ బడుచున్నది.

క. కావరమునఁ గానవు నీ, కావర మణఁ డిచ్చె నను చు నది చెల్లెను నీ, కీవఱకును విడువు మిఁకన్, నీవరదర్పము నణంగఁ జేడు మృగాంకా. శశాం. ౫. ౭౧.

జ: వఱగొడ్డెము.

**వఱగొడ్డెము** = ఒఱగొడ్డెము. వి. (వఱ + గొడ్డెగము.) మర్యాదమీఱిన మాట, వంకర మాట.

సీ. వరునితో నేఁప్రొద్దు వఱగొడ్డె మాడుట
భర్త మర్మంబు లేర్పఱచు చుంట ...
భల్లా. ౪. (శ. ర.)

**వఱడు**[1]. వి. ముదినక్క; నక్క.

క. ధృతరాష్ట్రు నగ్ని హోత్రాయతనంబున
నఱచె వఱడు లగ్నులు శాంతద్యుతులయ్యెఁ
గారవస్త్రీ, తతిహృదయము లధికశోక
తప్తము లయ్యెన్.
భార. సభా. ౨. ౨౫౧.

బ. వఱడులు, వఱళ్లు.

క. వఱడులు మన చేరువఁ బెల్లఱచుట పెట్టె
దురు గాలి యెదురుట గ్రద్దల్, తఱచయి
యాడుట వికృతపు, టఱపులతో లేఁగి
కాకు లఱచుట గంటే.
భార. కర్ణ. ౨. ౧౧౭. ఆం. భా. ౨. ౭౩.

గీ. ఆశ్వికరికలభాదుల యందుఁ గానఁబడుగ
వంతుల వాపోవుఁ బట్టపగలు, మొగి వఱళ్ళు
మహోత్పాతములకు శాంతి, చూడ నర్ధేవి
మరలఁ బుచ్చుటయ లెస్స.
భా. రా. యు. ౭౪.

క. వఱడు లఱచె నులక్కలు వడె, నెఱిచెడి
సురగాలి విసరె నిలువక పెలుచన్ ...
ఉ. హరి. ౨. ౨౪.

చ. ఇనుఁ డుదయాద్రి బుసేయు వఱ డెవ్వనికై
యెదురేఁగు నిష్ఠుర, ధ్వని సెలఁగంగ ...
వాఁడు యమాలయగామి భూవరా ...
మార్క. ౩. ౩౫౧.

ద్వి. వయసెల్ల దిగజాఱి వఱడుచందమున,
భయపెట్టు పెంపుడుపడుచులతోడఁ, గల
హించి కొన్ని వెక్కసము లాడినను ...
సారంగ. ౨. ఉ. పా. ౧౭. పం.

**వఱడు**[2]. స. క్రి. మలాముచేయు.

వ. వహించి నీరు వఱడిన కొ(ము)ల వెంజా
మరలు. ౨ ణ్డు ... దా. శా. ౧౧. ౯౦.

**వఱద**. వి. ప్రవాహము.

గీ. వఱదఁ గాష్ఠముల్ గూడిన వడువబంధు,
సంగమంబది వాసిన చాడ్పు తద్వి,
యోగము ... భార. శాం. ౪. ౫౭.

మ. నెఱిఁగాం బున్న మచంగురుం జెనయునీ ...
వఱదం ద్రోవఁగఁ జేసెనే యకట దైవం
బెందుఁ జొత్తున్ సుతా ...
భార. ఆర. ౭. ౩౪౨.

ఆ. పఱవ పఱద వఱద పఱతి పఱతె వఱ్ఱు
నాఁగనిటు ప్రవాహనామ మొప్పు ...
ఆం. భా. ౧. ౧౫౭.

**వఱదఁగలియు** = ౧. చెడు.

సీ. జడియక కాసేవు జాబిల్లి నీరూపు పది
యేఱు గునియవై వఱదఁగలియ ...
కలువాయిశ. ౧౪.

౨. వ్యర్థమగు.

సీ. నిష్ఠించి యిభ్భంగి నీ కేము సెప్పిన
వాక్యంబులెల్లను వఱదఁగలసి, పోయెనే.
భార. అశ్వ. ౧. ౧౨.

**వఱదఁగలుపు** = పాడుచేయు. (వఱదన్ + కలుపు.)

గీ. తనకు నదనైన మెయిమెయిఁ జనఁగనిచ్చు,
నయ్య యితరుల ననఁగ నయ్యవనివిభుని,
వ్రతము లన్నియుఁ గొనిపోయి వఱదఁ
గలిపి, చిత్తమంతయు గసిబిసి చేసి విడిచె.
భోజరా. ౪. ౧౦౦.

**వఱదఁగూర్చిన చింతపండగు** = చెడు, నశించు.

సీ. చింతింప వఱదఁ గూర్చినచింతపండయి
నీటఁ గూడె హిమాంశు సేర్పులెల్ల ...
చంద్ర. ౨ ౧౬౫.

**వఱదగొను.** అ. క్రి. (వఱద + కొను) ప్రవహించు, వఱదవాఱు.

లయవిభాతి. తఱుచు రుధిరచ్ఛటలు వఱద
గొనఁ గుంభములు పఱియలయి కుంజరము
లొఱలుచుఁబడన్ ...
భా. రా. యు. ౬౬౧.

**వఱదపాలగు** = నశించు.

సీ. నాయెల్లినీడన నరలోక మేలుదు నను
లావు వఱద పాలయ్యె నన్న ...
ఉ. హరి. ౪. ౩౦౦.

సీ. వర్షాశనంబులు వఱదపాలై పోయె మలవ
తిలను ప్రజల్ మాసి చనిరి ...
రామలిం. ౭౯.

**వఱదపాల్చేయు** = పోగొట్టు, చెఱుచు.

ద్వి. అరయంగనగు నూర మవ్వక యనఁగ,
సాధుమార్గమున నిచ్చట నుండియుండి,
వైధవ్యవ్రతనల్ వఱదపాల్ చేసి ...
పండితా. దీక్షా. ౩౯. పా.

**వఱదఁబోవు** = పోవు. (వఱద + [1]పోవు)

సీ. విడువమా యిన్నాళ్లు విడిచిన నది పోయి
యేటికిఁ జిత్రాంగి యింట వ్రాలె, వ్రాలిన
నది యట్టె వఱదఁబో నిమ్మని యూరక
యేమిటికుండ నైతి.
సారంగ. ౨. ౧౪౫.

జ : వఱదగుడి, వఱదవాఱు, వఱదలుగట్టు.

**వఱదగుడి.** వి. (వఱద + గుడి) సూర్యాదిపరివేషము. (శ. ర.)

**వఱదవాఱు.** అ. క్రి. (వఱద + పాఱు) ప్రవహించు.

ఆ. త్రిప్పి సేలవైవ దిగ్గన రక్తంబు, వదనగహ్వ
రమున వఱదవాఱ ...
భాగ. ౧౦. పూ. ౧౩౬౩.

గీ. అంత నచ్చట రామాలి వంతఁబెరయఁ,
దోడఁ బుట్టువుగాఁడిన తూపు వెలికి,
వైచి క్రొవ్వేఁడి కన్నీరు వఱదవాఱఁ, బలు
తెఱంగుల నిట్లని పలువరించె ...
అచ్చ. రా. యు. ౩౯౧.

**వఱదలుగట్టు.** అ. క్రి. (వఱదలు + కట్టు) వఱదలు వాఱు, ప్రవహించు.

చ. మఱియు బహుప్రకారముల మర్మము
లెత్తుచు నత్తదిట్ట నివ్వెఱఁగున నాశ్రమ
స్థలము వెల్వడి సత్వరయానలీలఁ గ్రిక్కిఱి
సిన చన్నుదోయి చలియింపఁగ వచ్చె
దృగంబుపూరముల్, వఱదలుగట్ట నేడ్చుచు
విలాసవతీమణి పుట్టి నింటికిన్.
వరాహ. ౨. ౧౩౬.

**వఱపు.** వి. వానలేమి, అవగ్రహము.

సీ. వహ్నియు భయమును వఱపును గఱవును
నాదిగాఁగల యొగ్గు లడఁగెఁ బుడమి ...
భార. సభా. ౧. ౨. ౪౧.

క. వఱపున సస్యము లాదవమి, నఱిముఱి
దైవంబు చెద్ది నాఁటేఁడులు పెన్, కఱ
వైన భూమిఁ గల ప్రజ ...
దశకు. ౧౦. ౪౫.
నా. పంచ. ౨. ౧౪౪.

**వఱల.** వి. వృద్ధితపస్వి. అ. ప్ర. (శ. ర.)

**వఱలు.** అ. క్రి. ౧. ప్రకాశించు, ఒప్పు.

సీ. మెఱుపునుం బోలెను వఱలు నుత్పలగంధి
బహుతరతనుసౌరభంబు గలుగు ...
భార. ఆది. ౪. ౧౫౯.

సీ. తంది కందిన నింత వఱలెడు ముఖరోచు
లెలమిన నెంత సల్లలిత మగునొ ...
కు. సం. ౭. ౮౩౮.
హరి. పూ. ౧. ౧౩౧.

౨. ప్రవర్తించు.

క. గుఱు తెఱఁగి వస్తుచయమున, కొఱఁగాడు
నా దీపవర్తియునుబోలె నిజం, బెఱఁగి
కృత వస్తుసమితికి, వఱలఁగ మదినెఱుఁగు
విబుధవర్గముఁ దలఁతున్.
కు. సం. ౧. ౨౬.

సీ. పలుమఱుఁ జలువతావులఁ జేరి పొరలుచు
వంకర నడలచే వఱలియరిది.
అచ్చ. రా. బాల. ౧౦౬.

౩. వ్యాపించు.

క. ఉఱుములతో మెఱుములతో, వఱలెడు
పెనుగాలితోడ వడగండులతోఁ, దఱచగు
పిడుగులతోడను, వఱదలపై వఱద లెగయ
వర్షము గురిసెన్. పరమ. ౧. ౮౧.

౪. కొన్నిపట్ల వాక్యాలంకారము.

క. ఉఱుముచు మెఱుముచుఁ బిడుగులు,
వఱలఁ గనలు గడలఁ బడ నవారిత
వృష్టుల్ ... భార. ఆది. ౮. ౨౭౦.
భార. ఆది. ౬. ౧౧౪.
భార. సభా. ౧. ౨౧౧.

**వఱువట్లు.** వి. బ. (వట్టులు + వట్టులు) మిక్కిలి ఱొండుటలు.

క. ఒదవెడు తృష పెల్లిదమున, వదనము
వఱువట్లు వట్టె ... భార. విరా. ౨. ౮౫.

సీ. వాలెఱు తడిలేక వఱువట్లు వట్టంగఁ బెద
వులు దడుపుచు బెదరి చూచు ...
విజ్ఞా. వ్య. కాం. ౪౫.

క. విరులుఁ జిగుళ్లును జొరువుగ, సిరిగందపుటస
లొకింత చిలచిలమని వేగిరమ వఱువట్లు
గొనఁ గడుఁ, బొరలెడి తరలాక్షి తాపముం
గని కలఁకన్. కళా. ౬. ౨౫౫.

**వఱువట్లుగొను.** అ. క్రి. (వఱువట్లు + కొను) మిక్కిలి ఱొండు.

క. విరులుఁ జిగుళ్లను జొరువుగ, సిరిగంద
పుటస లొకింత చిలచిలమని వేగిరమ
వఱువట్లుగొనఁ గడుఁ, బొరలెడి తరళాక్షి
తాపముం గని కలఁకన్.
కళా. ౬. ౨౫౫. (శ. ర.)

**వఱ్ఱియ(ఱ్ఱె).** వి. బీటిక. (శ. ర.)

**వఱ్ఱు.** వి. దే. అన. ప్రవాహము, వెల్లి.

ఉ. ... ప్రేటులఁ గ్రీడసల్పి పృథివిం బడు
వీరులఁ ద్రొక్కికొంచు నె,చ్చోటుల నైన
నగ్గలికఁ జొత్తురు నెత్తురు వఱ్ఱు సేయు
చున్. భార. విరా. ౩. ౧౬౩.

క. హీనప్రజ్ఞుఁ డకార్యము, లైనవి సేసి తుది
వగచు నతులప్రజ్ఞా, సానుమదారూఢుఁడు
వగ, నూనఁడు దురితమనువఱిలి కోడక
యునికిన్. భార. శాం. ౩. ౩౫౨.

వ. మిన్నేటి పెన్నీటి వఱ్ఱున మునుంగ
కుండ ... మనుచ. ౩. ౯.

విణ. అధికము, మిక్కుటము.

ఉ. ...గొఱ్ఱెలుపాడిపైరములు ఱోకలు రూకలు
ముందు ముందుగా, వఱ్ఱుగనిచ్చి వచ్చి తల
వాకిలిఁ గాతురు రేతిరింబగల్, గుఱ్ఱ
వయస్సుమల్లరవుఁగోఁడెలు సైరికరాట్కు
మారకుల్. వైజ. ౨. ౭౨.

క. పూనివడిఁ దిగిచి యష్టము,హా నాగమ్ములను
మిద్దియలుగా వ్రేల్లన్, మానుగఁ గొందఱు
దాల్తురు, వాని ఫణామణుల రుచులు
వఱ్ఱుగఁ బ్రమధుల్. శివతత్వ. ౩౩౬. ప.

**వఱితిపాలు** = ప్రవాహాధీనము, వ్యర్థము.

ఉ. ... నీదుసం, భావన లన్నియున్ వఱితి పాలుగఁ జేయుట నాకు. మంచిదే, జీవిత కాంతుగాదు ...

భా. రా. యు. ౧౬౭౯.

**వఱుతఁగలయు** = ప్రవాహమునఁ బడిపోవు, చెడు, నశించు.

క. కనుఁగొని సింహద్వీపా, వనినాథుఁడు తన తపంబు వఱుతం గలయున్, మనసిజభీషణ సమ్మో, హనబాణపరంపరాభిహతమాన సుఁడై. వరాహ. ౬. ౧౨౩.

క. మున్నొనరించిన పాపము, లన్నియుఁ బెను వఱుతఁ గలయు నవగాహన సం, పన్నులకు ... వి్రక. ౨. ౨౧౪.

జ: వట్రేఱు, వట్రోడి, వట్రోడు.

**వట్రేఱు.** వి. (వట్టు + ఏఱు) మంచి ప్రవాహము గల నది.

ద్వి. ఒదవంగ వట్రేట నోడ యుండంగ, వద రూడి నట్టు లీవసుమతిలోన ...

బస. పు. ౨౦౧. పా. ౨౦. పం.

ద్వి. చక్కఁడ్చి రారోటఁ ద్రొక్కి దేహంబు, గ్రక్కున వట్రేటఁ గలుపంగఁ జూచు ...

పండితా. పురా. ౧౪౪. పా.

**వట్రోడి(డ్డి)** = వట్రోడి. వి. ప్రవాహము.

ఉ. వారణ దానవాహినులవట్రోడిఁ దేలుచు నున్నవాఁడు ... కు. సం. ౧౧. ౬౮౧.

ఆ. ...అతిరయమునఁ బఱచు నయ్యేటివట్రోడ్డి, జోరు దవ్వగాఁగ భూ విభుండు ...

మార్క. ౫. ౨౩౦.

**వట్రోడి** = వట్రోడి. (√ వట్రోడు.) ప్రవాహము.

సీ. బెడిదంపు వట్రోడిఁ బడిన పేరడవి చందంబున బహుల పదాతిచయము ...

గీ. వికటముగఁ ద్రెళ్లి నలుగడ విచ్చి సొక్కి పెట్ట వెస డొల్లినిలఁ జాఁపకట్టుపడిరి ...

భార. ద్రోణ. ౩. ౬౨.

గీ. విలసితోత్తుంగశశికాంతశిలలఁ గదిసి, యరుగు శశిఁ గని శిలలెల్లఁ గరఁగి పెరిగి, తెరలి పరతెంచు వట్రోడిఁ దేలిపాఱు, నుడుగణోకుండు వెండి పేరోడవోలె.

కు. సం. ౩. ౨౫౩.

భార. అను. ౨. ౪౪౬. భార. శాం. ౩. ౩౦౮.

**వట్రోడు.** అ. క్రి. (√ వట్టు) ప్రవహించు.

క. తేనియముసురో యమృతపు, వానయొ పుండ్రేక్షురసము వట్రోడిన పెల్లో నాఁ దుంబురునారద, గానరసం బభవు నోలగంబునఁ బర్వెన్.

కు. సం. ౯. ౨౩౫.

**వల[1].** వి. (క. బలె. త. వలై.) ౧. జాలము. చేఁపలఁబట్టు సాధన విశేషము.

(దీని భేదములు - అనుకువల, ఎడవల, డొంక వల, త్రోపుడువల, దాఁటుడువల, మెడ వల, సన్నవల మొ. (శ. ర.)

ఆ. వానినెల్లఁ ద్రుంచి వల ద్రచ్చికొని లీల, నిగుడు చోఱవోలె వెగడు వడక, తఱిమి రక్తనగులు వఱపె ...

భార. కర్ణ. ౩. ౧౫౭.

క. నీవలకుఁ జిక్కి లోకము, లీవల నీవలకుఁ జిక్కదే జలరాశిన్ ... దశా. ౧. ౧౬౦.

౨. గాలము.

ఉ. ధీవరులార గాలము తుదిం బదిలంబుగ నెఱ్ఱగుచ్చి మీ, రీ వగ వైచినం దగుల నేటికి నాకిది వింత మాంసముం, గావలె నంచు వచ్చితిని గావున నీవల నేఁడు మీహయ, గ్రీవుని గ్రుచ్చివైవుఁడు ...

దశా. ౧. ౨౭౦.

౩. మృగములు పక్షులులోనగు వానిని పట్టెడు వాగుర, ఉచ్చు.

క. వెలివాలును గాలురులును, వలలుఁ దెరలు దీమములును వడిఁదీరిన కుక్కలు నారి గోలలును నుండ్రల గ్రోవులు వేఁట కొర డంబుఁ దెనుపఁగన్. ఉ. హరి. ౪. ౨౨.

ఆ. ... మూతి సరప మీసముల బోయముదు సళ్లు, పంది వలలు మోచిపఱచిరపుడు ... మనుచ. ౪. ౩౬.

౪. మాయ.

క. నీ వలకుఁ జిక్కు లోకము,లీవల నీ వలకుఁ జిక్కుదే ... దశా. ౧. ౧౬౦.

**వలలఁబడవైచు** = మోసముచేసి వశపఱుచుకొను.

గీ. తరుణులందెల్ల సమునైన దక్షిణుండు, నేరములుచేసి పెక్కు నివారణంబు, లొంది యును జేరదృష్టుండు సుందరులను, వలలఁ బడవైచు వాఁడెందు వెలయు శఠత. కంధ. ౧. ౧౭౦.

జ : వలత్రాడు, వలరాయఁడు², వలవాఁడు.

**వల².** వి. కామము, వలపు.

క. కాదంబరిఁ ద్రావింతును, జూదంబాడింతు వలలఁ జొక్కులఁ బెట్టం, బైదలుల నిరోగింతును, వైదర్భతనూజమీఁది వల పుడిగింతున్. నైష. ౭. ౧౨౦.

క. వ్రాలని నీ చన్నులతో, వ్రాలెడుజక్కవలు సరియె వలలం బెట్టం, జాలెడు నీ కన్నులతో, బాలకి సదృశములె వలలఁ బడు మత్స్యంబుల్. క్రీడా. ౧. ౯౧.

క. ఈ రీతిఁ గొంతకాలం, బారామమహా మహీధరారణ్యములం,దారామవలలఁ దగిలి విహారము సలుపంగ గర్భమై తతి యాగుడున్. మనుచ. ౬. ౩౭.

జ : వలకాఁక, వలకాఁడు, వలకారి, వలకాఱతనము.

**వల³.** విశే. కుడి, అపసవ్యము.

(వలనుశబ్దమునకు వృత్తియందు అంత్యవర్ణము లోపింపఁగా మిగిలినరూపము.)

చూ. వలకన్ను. వలకేలు మొ.

**వలంబము** = అవలంబము. సం. వి. అ. పుం.

**వలఁకు** = వలను. వి. ౧. దిక్కు.

క. నాలుగువలఁకుల నవఘన, జాలంబులు వ్రాలి కురిసె ఝంఝానిలవే, గాలోలములై బహుళ, స్థూలపయోధార లోలిఁ దునులంబులుగాన్. భార. అర. ౪. ౧౩౫.

చ. కొలఁకులు దేటఁ బద్మినులకుం గనువేఁదురు దీటె మేఘముల్, వలఁకులఁ జేటె డొంకలను వంకలఁ బంకములాటె ... కృ. శకుం. ౧. ౪౪.

క. పొంకించుఁడు మీ యిఱ్ఱులఁ, గొంకుల సీసంపుగుండ్లఁ గొమ్ముల నురులం, బొంకించి దిగువ గాలివ లంకుల బండంగి బండ్లు వఱుపుండనుచున్ ... కకు. ౪. ౭౩.

౨. పార్శ్వము.

ద్వి. వలఁకుల వ్రాసిన వన్నె చిత్రములు, దలలు గదల్చెఁ జైతన్యముం బొరసి ... ద్వి. హరిశ్చ. పూ. ౯౭౨

౩. ఒప్పిదము.

చ. వలకుఁగ మిన్ను మానికపువంగడపుం దొరలెన్నఁడేనిఁ బాఱులయెడ నల్గఁబోదురా యొఱుంగమినైన బెడంగుడాల్గనీ ... అచ్చ. రా. బాల. ౨౦౫

**వలఁకువు.** వి. వలఁకు, దిక్కు. (శ. ర.)

**వలఁతి.** విశే. ౧. ప్రవీణుఁడు, నేర్పరి.

మ. హిత మిథ్యంగిది మాట ధర్మము తెఱం
గిట్లుండు నంచేను నీ, మతి బోధింప
వలంతిసే ... భార. ఉద్యో. ౩. ౮౦.

ఆ. ... వలఁతివి నాతోడ, నాఁడు మనిన
భాగి యను మతమున ...
దశకు. ౫. ౬౮.

౨. సమర్థుఁడు, సమర్థురాలు.

మ. కురువీరాగ్రణి బాహ్లికుం డలిగినం గోదండ
పాండిత్య మెవ్వరుఁ జూపంగవలంతురే...
ఉ. హరి. ౪. ౧౨౩.

గీ. ఇతని కియ్యమకును విను మేనచువ్వ,
వలఁతి శుశ్రూష సేయంగ వత్స ...
భార. ఆశ్ర. ౧. ౧౪౮.

౩. అనుకూలము.

గీ. వరుణునకు డాఁగికొనఁ జోటు వలఁతియగుట
నుదధి నాయక భావంబు నుపకరించె ...
పారి. ౫. ౧౨.

జ: వలఁతితనము, వలఁతియీఁటె.

**వలఁతితనము.** వి. (వలఁతి + తనము) ప్రావీ
ణ్యము, నేర్పు.

గీ. ... అజ్జన్నిగట్టుఁ, గొలము తలమానికము
తన వలఁతితనము, గనఁబడఁగ నిట్టులని
తెల్పఁగాఁ దొడంగె ...

**వలఁతియీఁటె.** వి. (వలఁతి + ఈఁటె) ఒక
విధమగు ఈఁటె, కుంతవిశేషము.

గీ. వలఁతియీఁటెలు ధరియించి వచ్చి రలర,
రక్షకులు తాతతగముల ప్రాంతవారు ...
పి. శకుం. ౧. ౧౧౩.

**వలకట్టు.** స. క్రి. (వలను + కట్టు) అనుకూల
పఱచుకొను.

వ. అతఁడు దాను విద్యాధికుండు కాకుండుటం
జేసి నిజగౌరవశైథిల్యభయంబున నితరులగు
విద్యాధికులకు రాజగృహంబునఁ బ్రవే
శంబులేకయుండ దౌవారికాది సకల
పరిజనచక్రంబును వలకట్టుకొని యుండు
టయు ... కళా. ౬. ౧౫౫.

**వలకడ.** వి. (వలను + కడ) దక్షిణపు దిక్కు.
(శ. ర.)

**వలకన్ను.** (వల[3] + కన్ను) కుడికన్ను, దక్షిణ
నేత్రము.

సీ. పచ్చవార్వపుజోదు పచ్చవార్వపుజోదు
వలకనన్న కొడుకునై వలపు గులుక.
అచ్చ. రా. బాల. ౩.

**వలకాఁక.** వి. (వల[2] + కాఁక) మన్మథాగ్ని,
విరహతాపము.

సీ. సకియనుం గెమ్మోవిచక్కెర ల్జుఱ్ఱిక వల
కాఁక పెనుదప్పి వదలు టెట్లు ...
నీలా. ౨. ౩౬.

**వలకాఁడు.** విశే. (వల[2] + కాఁడు) కాము
కుఁడు. (శ. ర.)

**వలకారి.** విశే. (వల[2] + కారి) కాముకుఁడు,
వలపించువాఁడు, వలపించునది.

వ. ... నారులంబు నారతంబులకు సెలయించు
కొనిపోవువలకారుల జారుకొప్పుల దొరఁగు
విరిగుత్తులతో ... వసు. ౪. ౨౩.

సీ. ఎఱుగు నాయనఁ గూడ దిప్పుడిప్పుడు
కొంత గడిదేఱెలే వలకారి వగల ...
కువల. ౩. ౯౯.

గీ. ... తలిరులకటారి వలకారి ధాటిఘోటి,
చిలుక చిలుకలకొలికి ముంగలను నిలచె.
అచలా. ౨. ౯౪.

సీ. వక్ర భావంబులు వలకారి బాగులు వలపి
రొుల్లములును వట్టిపసలు ...
పాండు. ౩. ౪౩.

**వలకారితనము.** వి. (వలకారి + తనము) కాముకత్వము.

సీ. పలుమాఱుం దన ప్రోల కలికి చేతుల కోడి
వలకారితనమున వన్నెం బెట్టు ...
వి. పు. ౬. ౧౯.

**వలకేలు.** వి. (వల[3] + కేలు.) కుడిచేయి.

మ. వలకేల్ద్రాపలికిం గుచస్తబకసేవాలోలతం
బోవ ... కళా. ౧. ౩.

**వలక్షము.** సం. విణ. (అ. ఆ. అ.) తెల్లనిది, శుక్లము.

వి. అ. పుం. తెలుపు, శుక్లవర్ణము.

**వలగండ.** వి. శూద్రులలో నొకతెగ.

వ. వెలమ వేకరి పట్రగొల్ల బలిజ కుమ్మర వల
గండ బెస్తల చిప్పె లొంగట గాండ్ల
వారును ... హంస. ౩. ౨౯.

**వలగాక.** అవ్య. (వలనగు. ధా. వ్యతిరేకక్త్వార్థకము) వలనుపడక, వీలుపడక.

మ. దనుజాధీశతపోనలంబు త్రిజగద్దాహంబు
గావింప నెం,దును నిల్వన్ వలగాక వచ్చి
తిమి లోడ్తో వహ్నివారింపుము ...
దశా. ౪. ౩౬.

**వలగొను.** స. క్రి. (వలను + కొను.) ౧. ప్రదక్షిణించు, చుట్టు తిరుగు.

క. ... వినయంబున మ్రొక్కి బంధువితతిం
బ్రీతిన్ ... భా. రా. సుంద. ౨౦.

క. వలగొని యాలింగనముల, నలరించుచు వారి
చేత నాశీర్వాదం, బులు గైకొనుచును ...
భా. రా. సుంద. ౨౧.

చ. వెలఁగి వివాహవైభవముచేకొని రాముఁడు
సీతయున్ శిఖిన్, వలగొని వచ్చి సప్తముని
వందనమున్ గురువృద్ధబంధుమం,డలయుగ
పత్త్రణామము నొనర్చి పరస్పరలజ్జ
లాత్మరం, జిలం దగువారిలోఁడుత భుజిం
చిరి బువ్వమునన్ వధూవరుల్.
రామా. ౪. ౧౨౪.

క. అని పలికి యప్పుడ యనలము, ఘనముగ వరి
కొల్పి మది వికాసముం బొందన్, దన
వల్లభుఁ దలఁచుచు వల,గొని లీలం జొచ్చి
యతినిం గూడం జనియెన్ ...
భార. శాం. ౩. ౩౩౫.

౨. చుట్టుకొను, పరివేష్టించు.

సీ. ప్రతిరోధి వరణవర్గముం ద్రోచి తన్మహా
భోగశాలి క్షేత్రములు హరించు, వలగొన్న
బహురాజవంశ గుల్మంబులం బలువెఱంగుల
గ్రుచ్చి పాఱవైచు ... వసు. ౧. ౬౨.

సీ. మినువాఁక వలగొన్నగొనబువిన్గొప్పవై
గలిగి కొన్నెల వంక వెలయువాఁడు ...
పా. శకుం. ౧. ౧౩.

క. చెలువెల్లం దల్లడిల్లుచు, వలగొని దరినిలిచి
యకట వలవంత సొకల్, బలుపరియ్యో ...
నీలా. ౩. ౩౧.

**వలగొల్పు(లుపు).** స. క్రి. (√ వలగొను) వలగొను, వలగొనఁజేయు, వలయాకారముగ నుంచు.

చ. ఉవిద తదుక్తి కంత చెవియొగ్గక పోఁబెనఁగ
న్విభుండుకేల్, బ్దవిలిచి చుట్టునించుక యొడన్
భుజముల్ వలగొల్పి పొమ్మనన్, సువదన
వెల్వడం దిరుగ శ్రోణిభుజస్తనవేణికాధర,
శ్రవణకపోలముల్ పతిని సారెకు
సోఁకుచుం దేల్చె నింపులన్.
ప్రభా. ౫. ౪౧.

**వలగ్నము = అవలగ్నము.** సం. వి. అ. పుం. న. మధ్యము, నడుము.

**వలచు[1].** స. క్రి. (సం. వల్.) ౧. ఆపేక్షించు, కోరు.

క. దేవురఁ బోలెడు వాని మ,హావీర్యగుణాఢ్యు
నొక్కఁ డాత్మజుఁ బడయం,గా వలతు
నపేతగుణుల్, దేవుర సుతులయ్యు నెందు
విఫలము కాదే ...
భార. ఆర. ౨. ౩౫౦.

ఆ. ఎల్లవారు నెఱుఁగ నొల్లని ధర్మువు, వేల
నీకుఁ జెప్పనేల వలసె ...
భార. సభా. ౨. ౨౨౮.

గీ. నీవు చక్కనిదానవు నెలఁత ధైర్య,
రహితచిత్తులు మగవారు రాజు దీనిఁ, దలఁచి
భయమంది నిన్ను నీ వలఁచు నెడకు, నరుగు
నట్లుగఁ బ్రార్థించి యనుపు మనిరొ ...
భార. విరా. ౩. ౫౯.

వలచు, కోరు, ఇచ్ఛించు. దీనికి వ్యతిరేకార్థము లందు 'ఒల్ల' అనునది విభాష నాదేశం బగును.

ఉదా. వలవఁడు = ఒల్లఁడు.

చ. ఉరవడిఁ బోరికై కవచమొల్లరు మంత్రము
లందుఁ దక్క ... ఆము. ౨. ౩౪.

చ. ... సవినయత్వము ధైర్యము చిత్ర
మయ్యె నీ, వలచినకోర్కి లిత్తు ననివార్య
బలోజ్జ్వల వేఁడు మిచ్చెదన్ ...
బ్రహ్మోత్తర. ౪. ౨౯.

చ. వలచినయేని నభ్భువనవంద్యునకున్ శివ
యోగినేతకున్, బాలకయి గారవం బయిన
పుత్రకుఁ డొక్కఁడ ... హర. ౨. ౬౮.

౨. కామించు, మోహించు.

క. సుందరి మా యిద్దఱిలో, నం దెవ్వరి వలతు
నెప్పు మాయనవుడు ...
భార. ఆది. ౮. ౧౧౦.

చ. తన మది వల్చుభామినికి దక్కిన నిక్కఁపు
మోహిఁ బోలెనే, మనుజుఁడు బుద్ధి నిల్పు
మురిమర్దన దివ్యకథానుభూతిపై, ననిశము
మత్ప్రియుం డతఁడ యట్లగుటన్ వినుపింతు
నీకు నేఁ, గని వినియున్న గోప్యమున
గమ్యమునైన యథః ప్రపంచమున్.
పాండు. ౨. ౨౧౯.

మ. తొలుతన్ మేకొన కింతసేపు పెనఁగున్
దోర్దండ నా సక్తిమై, సలుపున్ నిబ్బితి
వల్చియున్ వలవమిన్ సైరించి యంతన్
ధృతిన్, దొలగించున్ బ్రియముప్పతిల్ల
రతులన్ సొక్కించి. మల్లభూ. ౨. ౨౪.

చ. ... వలవఁగఁ జేసె భూసతిని వశ్యవిధి
జ్ఞుఁడు గాన నేర్పునన్ ...
పారి. పీఠి. ౨౨.

ద్వి. ధర్మమా జగతిలోఁ దనయుని వలచు,
దుర్మార్గురాలని దూషించువారు ...
సారంగ. ౩. ౧౦౩. పా. ౧. పం.

౩. క్రి. ౧. తగు, యుక్తమగు.

గీ. వనమునకు వచ్చి నవయంగవలవ దుడుగుఁ,
డనిన నుడుగక మీతోన యరుగుదెంతు,
మనిరి బ్రాహ్మణుల్ ...
భార. ఆర. ౧. ౩౭.

క. వలవని ప్రేలరి మాటల, నలిగింపకు నన్ను
నేమి యాడిన నింకం, దల ద్రెవ్వ
నేయుదున్ ... భార. ద్రోణ. ౫. ౩౮౦.

చ. వలవదు తల్లి నీకుఁ దగువాని వరోరుగుణ
రూపవంతు నీ, వలచిన వానిఁ జేసెద నవ
శ్యము నీవు దపంబు సేయఁ బోఁ, దలపకు
మమ్మ ... కు. సం. ౭. ౭౭౪.

౨. అక్కఱయగు, అవశ్యకమగు.

వ్యతిరేకములందే యీ యర్థమున దీనికిఁ బ్రయోగము.

క. ... ఇందులకై, నీయత్నము వలవ దవల
నేనున్నాఁడ ... ఆము. ౨. ౯౩.

సీ. గజరాజగమనసింగారంబుఁ గనుగొనవల
వదే కన్నులు గలుగు ఫలము ...
దశా. ౨. ౩౦౩.

క. ఇక్కడ నిను మీఁ దెవ్వఁడొ, యిక్కరణిన్ మోసపుచ్చి యేలుకొనంగా, నక్కట వల వని శంకల, నక్కడనే పాడుకాపు లాగతి నుంటిన్ ... కళా. ౩. ౨౬౦.

౩. సమర్థుఁడగు.

ఆ. ద్రోణకర్ణశల్యదుర్యోధనులుఁ గృప, బాహ్లికులును జముఁడు పట్టికొన్న, వాని నైనఁ గావ వలతురు వలచిన, నొల్లకున్న నెట్టులొకొ యెఱుంగ ... భార. ద్రోణ. ౨. ౨౯౦.

(వలఁతులు భా. ల. వ్యా. పా.)

సీ. మనలోన నెవ్వరే మాత్రంబు దాటఁగా వలతురో కనుఁగొన వలయు ... దశా. ౯. ౧౦.

౪. ప్రియపడు.

గీ. ...చాల వలచితి నతని నే సత్యమిదియ ... నైష. ౨. ౨౬.

గీ. వలతు నే భక్తకోటికి వారిజాక్షి, లలన యాభక్తకోటియు వలచు నాకు ... హర. ౨. ౧౩.

ఒల్లనయ్యెద. అ. క్రి. ఒప్పనైతి.

చ. ... అ, న్నవచనవృత్తి నాదగు మనం బున నెక్కొని యున్కిఁ జేసి యా, హవమున నొల్లనయ్యెదఁ బ్రియంబులుగా వొకొ మీకుఁ బ్రాణముల్ ... భార. అశ్వ. ౪. ౪.

జ : వల², వలదొర, వలపించు, వలపు¹, వలపు గొలుపు, వలపుకత్తియ, వలపుకాఁడు, వలపుకీలు, వలపుటిక్క, వలపుదేవర, వలపురాయఁడు, వలపులరాచజోగు, వల పులరాజు, వలపులకోఁడు, వలపులాఁడి, వలరసము, వలరాకటారి, వలరాచపని, వల రాచరాచవాఁడు, వలరాచలచ్చి, వలరాచ వాఁడు, వలరాజు, వలరాటెక్కెము, వల రాయఁడు, వలకోఁడు, వలవంత, వలవంత తనము.

వలచు²(ల్చు). అ. క్రి. ౧. (వాసన) గొట్టు.

క. పొలవలచు సేమికీడ్లొకొ, కలిగాడు నని తలఁచి మనకు గలఁగఁగ ... భార. శాం. ౩. ౫౦౦.

తరలము. తనువు మీఁదొల వల్చు జాలరి దాన నట్లును గాకయే, ననఘ కన్యక ... భార. ఆది. ౩. ౪౦.

సీ. పఱిచుంచుఁ దలలును ...

ఆ. ... గదురు వలచు కంపుగాళిమచ్ఛాయ యుఁ, గలుగు నెఱుకు ముసిఁడి గనిరి సతులు ... కు. సం. ౬. ౬౯౪.

చ. ... లే జవరాలు చెక్కుగీఁటిన వసువల్చు జాలకుఁడు డెందమునం గలఁగంగ నేర్చు నే. నైష. ౧. ౧౪.

సీ. ... త్రోళ్లు ద్రేలాడెడు తుంటిపై బ్రహ్మ కమ్మల చింపి దోవతి ముఱికి వలవ,

గీ. ముసలిబ్రాహ్మణుఁడై వేదములు చదు వుచు ... వరాహ. ౬. ౧౪.

వల్వమి. వి. వల్చుధా. కృ. భా.

ద్వి. కాయధూపం బొండుగంపు వల్వమియుఁ, గాయంబుతోడన కైలాసమునకు ... అరుగు టెంతయును జోద్యము గాదె ... పండితా. పురా. ౧౩౪. పా.

౨. పరిమళించు, సువాసన గొట్టు.

గీ. వలచుఁ గస్తూరి నిగరాల తలుపు డెఱవ, గాజుటోవరిలో ధూపగంధలహరి ... నైష. ౪. ౧౫౪.

సీ. కసటుఁవో బీటెండఁ గరఁగి కజ్జల నంటి గమగమ వలచు చొక్కపు జవాజి ... మనుచ. ౨. ౫౫.

ద్వి. ... బుగ బుగ వలచు కర్పూరంబుఁ
బునుఁగు ...
ద్వి. హరిశ్చ. పూ. ౬౮౩. పం.

౩. దుర్వాసనవేయు, దుర్గంధముఁగొట్టు.

గీ. ... పడఁహాలి ప్రస్వేదవలచు, వరుగుఁ దఱ
చగు ముఱుత్రోవ నరిగి రొయుట, ...
ఆము. ౬. ౧౫.

జః వలపు², వలపుదాల్పరి, వలపుమోపరి,
వలపుకొండ.

**వలచుట్టు.** స. క్రి (వలను + చుట్టు) పరివే
ష్టించు, చుట్టుకొను.

క. సురకామిని దన నయనము, లరుదుగ వల
చుట్టివచ్చునసుట నిజముగాఁ, దిరుగుచుఁ
బరిమండలి తాం,బరపల్లవయై నటించె
మరుగొడుగుక్రియఁజ. ద్వా. ౧. ౧౩౪.

(వృత్తిని వర్ణలోపము.)

ద్వి. అలమానిసుతుఁ డున్నయట్టి కుంజంబు,
వలచుట్టియుండిరి వలచుట్టినట్లు ...
ద్వి. పరమ. ౨. ౬౬. పా. ౧౫. పం.

అ. క్రి.

ఉ. నావలచుట్టి హర్షకలనావలమానమనోం
బుజంబులో, నావలవైరిఁ బల్కు నచలా
గ్రణి ... వసు. ౫. ౨౬.

ద్వి. చనుదెంచి యాహస్తి శైలవాసునకు,
వలచుట్టి రాఁగ యాళ్వందారు వారిఁ, దెలి
యంగఁ గన్గొని ...
ద్వి. పరమ. ౪. ౫౯౧. పా. ౫. పం.

వి. వలగొనుట. (శ. ర.)

**వలచూడ్కి.** వి. (వల³ + చూడ్కి) కుడికన్ను.

సీ. అలిగి బలారి సౌరాష్ట్రంబు నిగిడింప నది
శౌరి వలచూడ్కియందు డించె ...
పారి. ౫. ౩౦.

**వలచే = వలచేయి.** వి. (వలను + చే) కుడి
చేయి.

చ. ... అడరుచు నట్టహాసముఖుఁడై వలచే
గదఁ ద్రిప్పుచుఁజ హరిజ ...
భాగ. ౧౦. ఉ. ౯౧౬.

ఉ. ...నరాధమున్ సమరకుంభినికిన్ బలియిత్త
మంచుఁ గార్చిచ్చునుబోలె మండి వలచే
భిదురంబు ధరించి సాహిణుల్, దెచ్చిన
కత్తలానిజవధిక్కృతగంధవహంబు నెక్కి
నన్. వరాహ. ౩. ౪౦.

**వలచేయి = వలచే.** వి. (వలను + చేయి) కుడి
చేయి.

మ. వలచేతఁజ వరిగింజ గిల్లి సదయత్వంబొప్ప
నా విప్రము, ఖుల్లపై నాతఁడు వైచె ...
పర. ౨. ౧౧౯.

**వలజ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. చక్కని చూపు
గల ఆఁడుది. ౨. భూమి. (శ. ర.)

**వలజము.** సం. వి. అ. న. ౧. పరిమడి. ౨.
పైరు. ౩. ధాన్యరాశి. ౪. పురద్వారము. ౫.
యుద్ధము. (శ. ర.)

**వలతి.** వి. స్థానము.

ద్వి. వసువులు ధరియించి వారకకొల్చి, వసు
పడంబడ దమవలతిగా గొనిరి ...
పండితా. దీక్షా. ౧౪. పా.

గీ. వచ్చె నలకూబరుండున్న వలతి కలిద ...
యయా. ౨. ౯౯.

(శ. ర. పా. "వలని కలిద" ముద్రిపా.)

**వలతీరు.** వి. (వలను + తీరు) కుడివైపుగా నడ
చుట.

గీ. గొనకొనంగోడి యేత్రింత కొంకినక్క,
నమిలి యీ నాలుగిటిదర్శనంబు లెస్స,

వీని వలతీరుఁ బలుకు నుర్వీజనులకుఁ, గొంగు బంగారమంద్రు శాకునికవరులు.

క్రీడా. ౫౨.

**వలత్రాడు.** వి. (వల + త్రాడు) వల్లెత్రాడు, పశుబంధనరజ్జువు.

క. వలత్రాళ్ళు వైచి యఱ్ఱొయ్యెడఁ, బలుమాఱును దఱిమి ... నీలా. ౨. ౬౫.

**వలదిక్కు.** వి. (వలను + దిక్కు) దక్షిణ దిక్కు.

ద్వి. అమితతపోధనుండగు కుంభ తనయుఁ, గ్రమ మొప్ప వలదిక్కు కడకుఁ బంచి నను ... ద్వి. పరమ. ౧. ౨౭. పా.

**వలదిరుగు.** అ. క్రి. (వలను + తిరుగు) ప్రదక్షిణము చేయు. (బ్రౌ. ని.)

**వలదు.** విణ. ౧. అధికము.

ఉ. చక్కిలిగింత వెట్టినను సారెఁ గికాకిక నవ్వుచున్ జయిం, బక్కఁబడంగఁ జక్కని కుమారుని ... నక్కట ముద్దులాడ వలదా కలదా యిటువంటి భాగ్యముల్.

సారంగ. ౧. ౧౧.

(శ. ర. 'కలదా యిటువంటి భాగ్యమున్.' తాళపత్ర ప్రతిపా.)

**వలదొర.** వి. (వలపు[1] + దొర) కాముఁడు, రతిపతి.

చ. కొలుకుల కెంపు సొంపు రహిగుల్కెడు తారల నీలిమంబు కన్, బెళుకు మెఱుంగులుం గలసి పెంపమరెన్ హరిణాక్షి చూపు ల, వ్వలదొర ముజ్జగంబు గెలువ న్నవచూతదళంబు మేచకోత్పల మరవింద మొక్కమొగిఁ బట్టి ప్రయోగము సేయు కైవడిన్. అని. ౨. ౨౯.

చ. వలదొర మెచ్చఁగా ఘనసువర్ణ పలాశక వాసనాగతిన్, గలసి రజస్స్ఫలింగములు

గ్రక్కుచు వీవలి వేగ చేరిరా, నలినిభయానఁ దావెనసి యాడెడు నెమ్మది పూనికంటివే, నలినిభయాన దావెనసి నవ్వులతల్ తెలి పూల చాలుచేన్. చంద్రి. ౪. ౫౮.

**వలన.** ప్ర. గ్ర. పంచమీ విభక్తిప్రత్యయము.

౧. విశ్లేషము, ప్రభవము, ప్రమాదము.

క. ... ఒక్క చూత ఫలంబ,య్యవనిజము వలన నమ్ముని, ప్రవరుప్పృథూత్సంగ తలముపై పడిఁ బడియెన్ ...

భార. సభా. ౧. ౧౪౨.

ఆ. మనునిభుండు ధర్మతనయుండు దాస్యంబు, వలనఁ బాయవలయు వసుమతీశ ...

భార. సభా. ౨. ౨౫౯.

ద్వి. తనరుగంగామాహాత్మ్యంబు గౌతముని, వనితను శాపంబువలనఁ బాపుటయు ...

రం. రా. బాల. ౭. పా. ౧. పం.

క. దీని తెఱఁ గెఱిఁగి నట్లమహానిపుణుఁడు విదురుఁ డురువిషాగ్నులవలనన్, మానుగ నేమఱకుండని ...

భార. ఆది. ౬. ౧౫౧.

చ. నరవరుఁడైన భీమువలనం బ్రభవించె హిడింబకున్ సుతుం, డురుతరభీమరూపుఁడు ... భార. ఆది. ౬. ౨౩౨.

౨. భయము.

చ. ... దేవతాగుల వలనన్ భయంబు ద్రుపదుం డెఱుఁగండు తదీయ దేశముల్, దలరక యొప్పె ... భార. ఆది. ౮. ౮.

క. ... అర్జును వలని భయముసెడి ల్గొ, మ్మనఁ జేయిడి నిద్రవోయె నుది తాత్మ్మండై ... భార. ఆది. ౬. ౭౨.

3. త్రాణము.

క. పరికించుచు బాహ్యేతరజనములవలన సంతతము నిజరక్షా, పరుఁడవయి పరమహీ

కుల, చరితము వీక్షింతె నిపుణచర నేత్ర
ములన్. భార. సభా. ౧. ౪౮.

గీ. ఇంద్రియంబులు దమయిచ్చ నిట్టునట్టు,
దిరిగ నేనియు దుఃఖముల్ దెచ్చు నవియు,
కట్టువడి సుఖ మొనరించుఁ గాననాత్మఁ
గావవలయు నింద్రియచోరగణమువలన.
భార. శాం. ౪. ౧౮౬.

౪. గ్రహణము.

చ. ... దేవనీ, వలన వరంబు లిట్లుగొని ...
హరి. పూ. ౪. ౨౨.

క. బహుభాషల బహువిధముల, బహుజనముల
వలన వినుచు భారతబద్ధ, స్పృహులగు
వారికి నెప్పుడు, బహుయాగంబుల ఫలంబు
పరమార్థమగున్. భార. ఆది. ౧. ౧౭.

ఆ. ... అతని, వలన నాదుకూర్మి చెలి శుభా
శుభములు, గోరి వినుట నా మనోరథంబు.
దశకు. ౫. ౬.

౫. ఉపయోగము.

క. కావున మృతసంజీవని, దేవలయును శుక్రు
వలన ధృతిఁ బడసి తప, శ్శ్రీవిభవ ...
భార. ఆది. ౩. ౧౦౫.

సీ. ... భీష్మకుఁ డనంగఁ, దనరారు నృప
తికిఁ దనయుఁడు రుక్మియహార్య ధైర్యుఁ
డుద్రుముఁడను నరేంద్రు, వలనఁ గృతా
స్త్రుఁడై వెలసి బ్రహ్మాస్త్రంబు జమదగ్ని
సూనుచే సమరఁ బడసి, గీ. శౌరితో నెల్ల
నాఁడు మచ్చరముసేయు, చుండు ...
హరి. ఉ. ౩. ౫.

౬. హేత్వర్థము.

గీ. కనకభూషణజాలంబు కతన గజము, లెర
వళులు వోవుకొండల నెనసి యొప్పె, వల్గ
నంబుల హేషల వలనలబ్ధి, ఘనతరంగంబు
లనఁ దురంగములు వొలిచె.
భార. భీష్మ. ౧. ౮౩.

గీ. ఆలమందలో నునిచి నిత్యార్చనంబు, సేయు
చుండంగ నప్సరస్త్రీయొకర్తు, గోప
కామినీరూపయై కోరి యతని,వలన
గర్భంబు దాల్చె నీశ్వరుని యాజ్ఞ.
హరి. ఉ. ౨. ౧౧౨.

సీ. సంధిల్లి ... ... ...

గీ. ... చౌక్కు మిగిలి, విటజనంబులపైఁ బరి
వెడలునట్లు, కొలను వెలలిరి జలకేళి వలనఁ
దనిసి ... కు. సం ౯. ౨౯౦.

౭. అధికరణార్థము.

ఉ. చిత్తము మెచ్చి నావలనఁ జిక్కుఁగ
వెండియు నా లతాంగి యుబ్బొత్తిన
యట్లు నాకుఁ దనయుల్లము దెల్లము సేయ
కున్కి ... భార. విరా. ౨. ౮౪.

సీ. వారిదమార్గంబువలన మహానీలవైజయంతీ
విభవంబు వెలయ ...
భార. ఆర. ౧. ౩౪౫.

మ. అరయం దప్పొకయింత నావలన లేదా
ధర్మపుత్రుండు జూఁదరి వెంటం దమకించి
సౌబలునిచేతం భూమి గోల్పోయి ...
భార. ఉద్యో. ౩. ౩౫౮.

గీ. ఆ నృసింహప్రభుండు దిప్పాంబవలన, నాగ
మాంబిక వలన నందనులఁ గాంచె ...
ఆము. ౧. ౩౧.

౮. విషయము, ఎడ.

గీ. బుద్ధిమంతునివలన దుర్బుద్ధు లధికు, వలన
హీనులు రూపసి వలనఁ గొసటి, వార
సూయలు సేయుదు రీరసమున...
భార. శాం. ౩. ౭౦.

**వలనగు.** అ. క్రి. (వలను + అగు) వీలుపడు,
వలనుపడు.

మ. దనుజాధీశ తపోనలంబు త్రిజగద్దాహంబుఁ
గావింప నెం,దును నిల్వన్ వలగాక వచ్చి
తిమి ... దశా. ౪. ౭౬.

వలనము. వి. అశ్వశిక్షాభేదము.

సీ. వలనంబు పుట్టించి వంకంబు వలయించి
డిల్లాయి ప్రకటించి శీవఁజూపి ...
పి. శకుం. ౧. ౧౧౨.

వలనము. సం. వి. అ. న. ౧. కదలుట, చలించుట. ౨. వలయాకారముగాఁ దిరుగుట. ౩. (జ్యోతి) దృక్కర్మాది సంస్కారాంగమగు సంచరణము. ౪. కలఁత, సంక్షోభము.

వలను = వలఁతు, వల్ల. వి. ఔ. ౧. దిక్కు, వైపు.

గీ. ... సమీరణపుత్రుఁ డగ్రజుండు వోయిన
దెసదప్ప నొండువలన, సమదవారణ
పతిగమనమున మత్స్యధరణి వల్లభు సభ
చేర నరుగుటయును.
భార. విరా. ౧. ౨౧౧.

ఆ. అసురవలనుగూడ కొండు వగవక యొప్పటి,
యట్ల కుడుచుచున్న నలిగి బకుఁడు ...
భార. ఆది. ౬. ౨౯౨.

క. కావున నింద్రియ చేష్టల, సేవలనికిఁ బోవ
నీమి యింతకు ముఖ్యంబు ...
భార. శాం. ౬. ౭౩.

చ. ... ఇదె పావని పోవుచున్నవాఁ డుడు
గణ వీధి లంక వల నొక్కఁడు ...
భా. రా. సుం. ౨౬.

౨. ప్రక్క, పార్శ్వము.

క. తలుగుల పొది యొక దెసఁ బెయ్యలదా
మెన యొక్కవలన నదుపై యుండఁన్,
మొలమోపి పెక్కుచుట్లం, బలుద్రాటం
జుట్టి గోపభావం బమరన్ ...
భార. విరా. ౧. ౨౪౫.

సీ. కాలన సాత్తని వైష్ణవులు ద్రోపుద్రోపాడ
వలన సంకీర్తన పరులు చనఁగ ...
విప్ర. ౫. ౧౦.

౩. పక్షము.

క. ... ఎవ్వలనఁ గలుగు ధర్మం బవ్వలనికి
జయమంగళము లవశ్యముఁ గలుగున్ ...
భార. ద్రోణ. ౫. ౨౬౬.

క. ... ఏఁగురుపతి కిచ్చిన ప్రాణం బొందు
వలనఁ జేర్పందగునే ...
భార. భీష్మ. ౧. ౧౬౫.

౪. ఎడ, విషయము.

సీ. అమ్మాయి నడపెడు నశ్వాండవాగ్రజు
వలన నిజాత్మజువలని కంటె, నక్కురు
రాజు ప్రియంబందు ...
భార. ఆశ్ర. ౧ ౧౬.

మ. ... చెంతం బొంచి నీక్షించి పోయిన
సాత్రాజితిబోటి నా వలనఁ దా నే
మేమి కల్పించెనో ... పారి. ౧. ౧౦౩.

క. ... మనమున వగవకు మిట్టిట్టని సొలవకు
రాజువలనఁ గైకేయి దెసన్ ...
భా. రా. అయో. ౫౬. భార. అను. ౫. ౪౩.

౫. అనుకూల్యము.

సీ. ఎక్కుఁడు వలనైన యెడలడ్డగించిన చలు
లనుగ్గడపుఁడు సక్కఁ బ్రాకఁ, రాని
తిప్పలు చొఁ ద్రవ్వఁ డీరములైన
ప్రాకులు బొదలును ప్రగ్గఁబొడువుఁడు...
హరి. ఉ. ౧. ౭౩.

గీ. కుతముఁ జదివింప నందంబు చూడ గంద,
మలఁదఁ బయ్యెద సవరింప వలనులేక ...
విక్ర. ౪. ౬౩.

సీ. మొగమోట తెగఁజూచి తగవు దూరము
సేసి కులము గీటునఁబుచ్చి వలనుదప్పి ...
దశకు. ౩. ౯.

౯. ఉపాయము.

క. వలనుగలమంత్రివరులం, బిలిచి పృథా
నందనులకుఁ బ్రియముగ మీరు ...
భార. ఆది. ౬. ౧౩౧.

క. తెలియనివి గొన్ని సెప్పితి, తెలియంగల
వెల్ల నింకఁ దెలుపుము కృష్ణా వల నెఱిఁగి
మెలఁగ వలయును, నలినాసనజనక భక్తన
తపదయుగళా. భాగ. ౧౧. ౧౦౮.

గీ. నడుమ విఘ్నంబుగాకుండ నడిచెనేని,
జయము చేకురు ననయంబు సంగరముల,
ననియోగావున నేఁడు నా కట్లు చేయ,
వలయు నీపగ దీర్పంగ వలను గలుగ.
భారా. యు. ౧౫. ౭౫.

౭. నేర్పు.

సీ. వంజలసైనను వలనేర్పడఁగ నొక భంగిఁ
జేఁపఁగఁ జేసి పాఁడి గొనఁగ ...
భార. విరా. ౧. ౧౦౧.

గీ. భవన వాసులఁ బిలిచి మీ రవికలముగ,
వలయునవి వేఱువేఱ మీవలను మెఱయ,
నిద్ధరా దోగ్ధ్రిఁ ద్రోవుల నెలమిఁ జేర్చి,
పిలికి కొనుఁడని పనిచె సమ్మతము మిగుల.
హరి. పూ. ౧. ౧౩౧.

క. ఆపలచింపుక వెడలిన, నావలఁ బోనీక
చెంచు లపు డడ్డంబై, యావల నుఱుమా
డినఁ గని, యావలను విభుండు మెచ్చి
హర్షము నొందెన్. సారంగ. ౧. ౧౦౪.

౮. శకునము.

గీ. వలను లెస్సైన మిక్కిలి నలరుకొనుచు,
వచ్చి యెలుకలు వేఁటాడఁ జొచ్చి
రపుడు ... ఉయా. ౨. ౩.

౯. ప్రదక్షిణము.

ద్వి. అమరేంద్రు చెస విరూపాక్షుంబు గాంచి,
ప్రమదంబు మీఱంగ వలనుగా వచ్చి ...
ద్వి. రం. రా. బాల. ౪౧. పా. ౧౦. పం.

౧౦. ఒప్పిదము.

సీ. వలరాచతూపులవలను మొగ్గలువోవ
వాలుగ్రేఁగన్నుల వాడిమియును, బాల
పల్లవములలీలలు పొలివోవ మించారు
కెంగేలి మేలిమియును.
హరి. ఉ. ౭. ౪౭.

గీ. అనుఁగుఁదల్లికి వందనం బాచరించి, వరుస
నిలువేల్పులకు మ్రొక్కి వలను మిగుల,
బ్రాహ్మణులచేత దీవెనల్ వడసి పుణ్య,
భామలిచ్చుహేమాక్షతప్రతతిఁ దాల్చి.
నైష. ౩. ౧౦౭.

సీ. వలసంది దరుల ప్రేవల నొందికొనుచు
నావల నగల్చు మహోర్మి వలన మరయ.
వసు. ౬. ౬౧.

ఇది కొన్నిపట్ల వాక్యాలంకారముగ నుపయో
గింపఁ బడును.

చ. ... ఒంటి పాటునన్, వలనుగఁ గంటి
కింపయినవానిఁ గనుంగొని ప్రేమ
హెచ్చఁగా, బలిమిని జేరు జారవలెఁ
బైకొనఁ గోరెదు నీకు మేరయే.
దశా. ౩. ౬౯.

క. పలు తెఱఁగుల దీవనలిడి, వలనుగ నత్తమ్మి
చూలివంగడపుంజా, బిలియల తేనింగని ...
నీలా. ౧. ౮౬.

౧౧. విధము.

క. ... అవంతియైన పదలకు, మేవలనను దేవ
విప్రహితకార్యంబుల్ ...
హర. ౭. ౧౪౬.

సీ. వలఁ జిక్కువలు చిక్కువల నొప్పు వ్రుదు
వల్కలంబునఁ గుచలికుచంబు లొరయ.
ఉ. రా. ౩. ౧౦౩.

క. ఆ విధిఁ డిట్లను దుఃఖం, బేవలనను గలుగ
నేర దిహపరసౌఖ్య, శ్రీ విభవంబుల
కెల్లను, దావకసందర్శనము నిదానం
బగుటన్. నై., భా. ౫. ౯౩.

గీ. ... జననాథ యెవ్వరి నెచటనుండు, వార
లను వార మమ్మాట వలను నెపుమ ...
భార. శాం. ౬. ౧౯౫.

౧౨. శక్తి, సామర్థ్యము.

గీ. ... తెలిసి యుత్తర మీ నాకు వలనులేమి...
నైష. ౩. ౨౧.

క. కులగిరులు జిఱ్ఱఁ దిరిగిన, జలరాసులు మేర
దప్పి చనుదెంచిన నీ, వలనెఱిఁగిన దృఢ
భక్తుఁడు, చలియింపఁడు ...
శివతత్వ. ౬౨.

సీ. జంత్రైదుతలలరాక్షసునిఁ గూల్చిన వాఁడు
వానితమ్మునిఁ బ్రోచు వలనువాఁడు ...
కృష్ణ. ౧. ౧౪.

౧౩. కారణము.

ఆ. ... ఇదియనుమ్ము మాకు నిచ్చలోఁ గల
కోర్కి, వోసఁగ నీదువలనఁ బొందు
పడిరె. భాగ. ౬. ౨౨౩.

౧౪. వివేకము.

క. కార్యము తెలఁ గిట్టిది నీ, వార్యచరితమునకుఁ
జొచ్చి యాడెదు నీకా, దుర్యోధనున
వినయ మని, వార్యంబని యెఱుఁగ రామి
వలనో వెడగా. భార. ఉద్యో. ౧. ౩౧౭.

౧౫. మర్యాద.

చ. ... తల్లిదం, డ్రుల రుచిమాన్చి బంధులకు
రోఁత యొనర్చుచు జారవాంఛలఁ, వల
నటి సత్కులాంగనలు వత్తురె లోకులు
నూచి మెత్తురే. భాగ. ౧౦. పూ. ౯౩౩.

౧౬. ఉచితత్వము.

గీ. వార్చి వాఙ్మనోనియతితో వలను గలిగి,
ఉత్తరం బొందఁ దూర్పు దిక్కొండె
జూచి, జానుమధ్యంబునందు హస్తంబు
లుండఁ, గుడుచునది పవిత్రాన్నంబు గుణ
వరేణ్య. మార్క. ౩. ౨౨౭.

విణ. ౧. కుడి, దక్షిణము.

సీ. పంౘ్రెండు రూపులై పగలింటి రాజాగా
వలఁతి యేదేవుని వలనఁ గన్ను ...
ఉ. హరి. ౨. ౧౬౪.

"వలనౌ హస్తంబునకా" భద్రా. ౧.
(శ. ర.)

౨. యుక్తము.

ఆ. ... జానకీ ధవుండు సంతసిల్లి, వారి నాద
రించి వలనైన సత్కృపఁ, జూచి మంద
హాసశోభియగుచు ...
భా. రా యు. ౨౪౩౧.

చ. వలనగు నమ్మహాతటినివారి నవారితకేళి
సల్పు కాంతల ... వసు. ౧. ౧౧౨.

ఉ. నామొగమోటకై వలని నాటకముల్ ఘటి
యించి ... పారి. ౧. ౭౯.

మ. సెలయేఱుల్ గడఁబ్రొత్తఁ జేయుచు లతాసీ
మంతినీనర్తనంబులు గల్పించుచు మత్త
బర్హిరుతముల్ పాల్పొందగాఁ జేయుచుఁ,
వలనై కాననమారుతంబు దనరుఁ
వాంఛాను రూపంబుగా ...
హరి. ఉ. ౧. ౫౩.

౩. శక్యము, సాధ్యము.

గీ. అంధువులసంఖ్య లెక్కింపనలవి గాదు,
కుండములసంఖ్య లెక్కింపఁ గొలఁది
గాదు, వాపికలసంఖ్య లెక్కింప వలను
గాదు, పద్మలోచన కాశికాపట్టణమున.
కాశీ. ౩. ౨౦౫.

౪. శరణ్యుఁడు.

మ. చెలివై చుట్టమవై మనస్థ్సితుఁడవై
చిన్మూర్తివై యాత్మవై, వలనై కోర్కుల
పంటవై విభుఁడవై వర్తిల్లు నిన్ను ...
భాగ. ౭. ౩౨౭.

జ: వలౌ, వలకట్టు, వలకడ, వలకన్ను, వల
కేలు, వలగొను, వలగొల్పు, వలచుట్టు,
వలచూడ్కి, వలచే, వలచేయి, వలతీరు,

వలదిక్కు, వలదిరుగు, వలనగు, వలనుపఱచు, వలనుమించు, వలనుమీఱు, వలనొప్పు, వలపల, వలపలగిలక, వలపలించు, వలబాఱు, వలముది, వలమురితాలుపు, వలమూపు, వలరెక్క, వలవంక.

**వలనుపఱచు.** స. క్రి. (వలను + పఱచు) అమర్చు, ధరించు.

సీ. శ్రేణి దుస్తరరక్తపత్త్వమున మించు జలూకవా
మహాస్తంబున వలనుపఱచు ...
దశా. ౨. ౨౯౦.

**వలనుమించు.** అ. క్రి. (వలను + మించు) ఒప్పు.

సీ. రమమాడ్కిఁ గమలజూరాణి రాణింపంగ
వాణిమాడ్కిని లక్ష్మి వలను మించ ...
ఇందు. ౧. ౧౦౬.

**వలనుమీఱు.** అ. క్రి. (వలను + మీఱు) ఒప్పు.

గీ. తన యజత్వంబు దెల్ప రాత్త్రినయమౌళి,
రాజసమెలర్ప ఘనపద్మరాగకలిత, వర్తుల
మృగేంద్ర పీఠిపై వలను మీఱి, రాజహం
సాశ్రయప్రౌఢి రంజిలంగ ...
ఇందు. ౫. ౯౪.

**వలనొప్పు.** అ. క్రి. (వలను + ఒప్పు) అనుకూలపడు.

సీ. తెఱఁగంటిదొరయింటి తెలిమ్రాఁకు తెగఁ
బ్రాకి వలనొప్పఁ దెలిదీవికెలన మెలఁగి...
నీలా. ౧. ౪౫.

ద్వి. వలపలికడఁ బంటవలఁతినెచ్చెలి, వల
నొప్పఁ దమ్ముఁ డవ్వల నొప్ప ...
ద్వి. పరమ. ౩. ౨౧౮.

**వలపల.** వి. శ్రే. (వలను + పల) కుడిభాగము, దక్షిణపార్శ్వము.

క. వలపలిదిక్కున కించుక, మలఁగంగాఁ
గుఱుమిడి కుఱుమాపుడుఁ బుట్టం, బలవడఁ
గట్ట జరఠవల్కలమున నెవ్వఁగుఁ జన్నుఁ
గవ గప్పితగన్. భార. విరా. ౧. ౨౯౧.

చ. వలపలికన్ను నీకు రవి వారిజలోచన
చందురుండు దా, పలినయనంబు కర్ణుఁడును
బార్థుఁడు దత్ప్రియనందనుండుఁ దృక్కుల
జూఁడు వీరొకం డొకనితోఁ గలహింప
సహించితి తెల్లొకో ... నైష. ౮. ౧౩౩.

వ. వలపటఁ గృపాశ్వత్థామలును దాపటం
గృతవర్మ మద్రేశ్వరులును వెనుక బాహ్లిక
సోమదత్త భూరిశ్రవసులును ...
భార. భీష్మ ౧. ౧౦౩.

గీ. కళుకు విడికెంపురవలచెక్కడపుమేడ, వల
పట నెసంగు శృంగారవనములోన ...
దశా. ౪. ౧౦౨.

**వలను.** విశే. దక్షిణము, కుడిది.

**వలకన్ను** = (వలను + కన్ను) కుడికన్ను.

క. భూతలము వడఁకె నుల్కాపాతంబులు
మింటఁ గానఁబడె ఘోషములో, శ్రేతల
కును గోపకసంఘాతముల కదరె వలపడ
కన్ను లిలేశా ... భాగ. ౧౦. పూ. ౬౪౮.

**వలపలగిలక.** వి. (వలపల + గిలక) రేఫమునకు వేఱొక చిహ్నము (రేఫము యొక్క రూపాంతర నామము) (శ. ర.)

**వలపలించు.** స. క్రి. (√ వలపల.)

౧. వలపలగా తిరుగు, కుడివైపుగా తిరుగు.

వ. గాంధారీనందనుండు వలపలించి చుట్టు
కొనిరా నది సరకుసేయక బకవైరి ...
భార. శల్య. ౨. ౨౬౪.

౨. వలఁగొను, ప్రదక్షిణముసేయు.

సీ. చూతాటవీవాటశోభమానంబైన పులు
గుత్తసోమేశు వలపలించు ...
భీమ. ౩. ౩౯.

**వలపించే.** స. క్రి. (వలచే[1].) ౧. ప్రీతి నొందించు సంతుష్టునిఁజేయు.

ఉ. ... వాసుదేవునిన్, బ్రీతిమెయిన్ భజించి వలపించితి ధన్యుఁడనైతి నింక నీ, నీతులు గీతులుం జదువు నేర్పులు గీర్పులు నాకు నేటికిన్ ... వి. పు. ౨. ౨౯౫.

౨. కామింపఁ జేయు.

సీ. వలపింప నేర్తురు వలరాజు గెలిచిన పెద్ద కాలము వేల్పు భీమనాథు ... భీమ. ౧. ౯౪.

క. ... భజిక్రియ, వలపించెం బెండ్లివారి వనితయుఁ బోలెన్ ... నైష. ౬. ౧౩౪.

సీ. చిఱుతపాయపు గొల్లతెఱవల వలపించి మఱవక పసులఁ బల్ మఱునుగాచి ... నీలా. ౧. ౩.

**వలపు[1](ల్పు).** వి. (√ వలచే.) ౧. వాంఛితము, కోరిక.

క. కావున వంచన బాహిర, పోవకయుండంగ మనతి పుండరి మార్పం, గావచ్చు నేని యట్టిద, నా వలపటుగాక తక్కినను వలదు సుమీ. భార. విరా. ౨. ౨౮౪.

తోటకము. వలపుల్ గను గోవలపుల్ గొలుపన్, దొలుకారు మెఱుంగులతో నెనయై వలరాచ సిరుల్ వలె వారొకచోఁ, దలుకాగురువెండల పందిరిలోన్. యయా. ౪. ౨౩.

క. ... మెలఁతకుఁ బతికిన్, వలపు సమంబగుట జన్మవాసన చెలియా ... మనుచ. ౬. ౬౬.

౨. మోహము.

గీ. వలపు నటియించుచును వారవార తనకుఁ, దానవారికి వారికి నైనయట్లు ... హర. ౬. ౧౦౩.

గీ. భ్రాంతి దన వల్పులంజియఁ బాయలేక, క్రీడ యించుక లేని చేబోడిబాజుఁగు ... కవిక. ౪. ౯౯.

గీ. బాఁతి తనమున లంజియఁ బాయలేక, క్రీడ యించుకలేక ...

(చూ. చేబోడి. శ. ర.)

రగడ. మితిలేక పరఁగ రతిమెలపులును వలపులును, నతివ లెంతయు మఱచి రలపులును సొలపులును. రాఘవ. ౨. ౬.

**వలపు(ల్పు[2]).** వి. (√ వలచే.) సువాసన.

చ. అలరుఁ బురంబునం దొగలనంతర దామరఁ బ్రాఁచిఁ గప్రపున్, వలపులు మీఱ ... పురాతన తీర్థకుండముల్ ...
ఆము. ౧. ౪౧.

సీ. వలపులు గులుకు చెంగలువ క్రొవ్విరుల తేకులు గానరాసేస కొప్పు ముడిచి ... వరాహ. ౩. ౧౦౯.

క. ... చలికరు వలిను, న్ప్రొలపమున విరియు పరువపుఁ, దొలు మొగడల వలపు దెలుపు తోఁటలలోనన్ ... పారి. ౫. ౧౦౩.

ఆ. కంపు గబ్బుగవులు గందంబు వలపనగంధ మొప్పు ... ఆం. భా. ౧. ౧౦౬.
మనుచ. ౬. ౩౧.

సీ. నులివాడు నాఁచు వల్లులగొం తొంగర్చి లేఁబాల వల్పుగాలివే పోకరొజిఁగి ... ఆము. ౨. ౫౩.

**వలపుల వింటివాఁడు** = పుష్ప ధన్వుఁడు, మన్మధుఁడు.

చ. వలపుల వింటివాని దళవాయి వసంతుని జోడుజోడె పాటుల బడకుండఁ గుండలికుటుంబము నాఁకలిఁ దీర్చు చందనాచల గృహమేధి యొద్ద వడచల్లని చల్లనిగాడ్పు

నీటఁ జెల్వలరతి తాంతకాంతుల యలం
తలు మానుచుఁ బ్రాణ బంధుఁడై.
రామా. ౧. ౧౫౧.

చ. వలపుల వింటివాని దళవాయి చకోర
మనోరథంబురే, వెలఁది మగండు పాల్క
డలి వెన్నునిలింప గణాన్న రాశి చుక్కల
దొర శూలి మౌళిమణి గల్వలవిందు తమంబు
గొంగ చల్వలగని జింకతాలుపు కళానిధి
తూర్పునఁ దోఁచె నత్తఱిన్.
వె. శకుం. ౨. ౧౮౪.

**వలపుఁగొల్పు.** స. క్రి. (వలపు¹ + కొల్పు.) మోహింపజేయు.

సీ. త్రేతల వలపుఁ గొల్పెడు దిస్స మొల
హత్తి గచ్చకాయల తిత్తి రచ్చసేయ ...
ఘటికా. ౧. ౧౨౮.

**వలపుకత్తియ.** విశే. (√ వలపు¹.) కామము గలది, కాముకి.

సీ. తోఁ ద్రోపులకును బోదురలై యెఱుంగవా
వలపు కత్తియలుంట కలుష కంటి ...
రా. వి. ౫. ౬౫.

**వలపుకాఁడు.** విశే. (√ వలపు¹.) కాముకుఁడు, కామము గలవాఁడు. (శ. ర.)

**వలపుకీలు.** వి. (వలపు¹ + కీలు.) పోఁకముడి, నీవి.

గీ. ... అనుచుఁదగ బుజ్జగించి హస్తాంబుజ
మున, వలపుకీలు విడల్చె భూవల్లభుండు.
నైష. ౪. ౧౪౬.

**వలపుటిక్కు.** వి. (√ ¹వలపు.) కళాస్థానము.

ఉ. అక్కల కంఠకంఠి తెలియంగని నప్పుడె
ధిక్కరింపుచున్, జక్కరఖాణ పుండరికి
సాహిణి చాయల జంటవారిమేల్,
చొక్కపు వాఁడి చెంగలువ సూరికటా
రినిఁ బోటుద్రేటుచేం, పెక్కుగ నొక్క
టన్ వలపుటిక్కువఁ బక్కన రేచియార్చి
నన్. ఉ. హరిశ్చ. ౨. ౫౬.

(వలిపు టిక్కువ.) అపముద్రి.

**వలదాల్పరి.** వి. (వలపు² + తాల్పరి.) వాయువు.

సీ. బలితంపు వలపు దాల్పరి దిండిగమితావు
గల దొరవాకిట నిలుచువాఁడ ...
ప్రబంధ. ౨౧౪ లో ౫ పుట ౪౬.

**వలపుదేవర.** వి. (√ వలపు¹ + దేవర.) వలరాజు, మన్మథుఁడు.

చ. ... పొదిరి మీఁదికి మాటిమాటికిన్,
దిరిగెడుఁ దుమ్మెదల్ వలపుదేవర పచ్చల
మేడ యెక్కియు, చ్చెరువుగఁ దుంటవింట
వడిఁ జిమ్మెడు కస్తురి యుండలోయనన్.
యయా. ౫. ౫౬.

**వలపుమోపరి.** వి. (వలపు² + మోపరి.) గంధవహుఁడు, వాయువు.

సీ. వలపుమోపరి జియ్యవల మూల దయ్యంబు
గుండుల తలకట్టు పండుదండి ...
అచ్చ. రా. బాల ౮.

**వలపురాయఁడు(లు.)** వి. (√ వలపు¹.) రతిపతి, మన్మథుఁడు.

గీ. చల్లు లాడంగ నప్పుడు చదలనెగసి,
మగుడు తెలినీటి తుంపరల్ దగిరెఁజూడ,
వారి సిరాటకును మెచ్చి వలపురాయఁ
డాని కురియించు పువ్వుల వానలనఁగ ...
యయా. ౩. ౬౩. యయా. ౫. ౧౧౨.

గీ. ఇటు చతుర్విధ దళము లుద్భటము గాఁగఁ
బాయఁగాముని దళవాయిడాయ వలపు,
రాయ లారామమున డిగ్గె రహివియోగి,
సముదయ వనతతి పలాయనములు గాఁగ.
ఉ. హరిశ్చ. ౩. ౧౩.

**వలపులకొండ.** వి. (√ వలపు².) మలయ పర్వతము.

చ. వలపుల కొండడిగ్గి కుజవారములో నటు లుత్తరంబుగా, వెలువడి వేగ నేగ వెడవిల్తుని కార్యముగాఁగ వచ్చుచోఁ, జిలువల కోఱలంజిదిమి చేరు వనంబులగంటి దంతఁ దుమ్ములు పొడకట్టె నీ శకునముల్ విత గాడుగదా మదానిలా.

క్రీ. శకుం. ౨. ౨౦౪.

**వలపులరాచజోదు.** వి. (√ వలపు¹.) మన్మథుఁడు.

చ. చెలఁగి చెలంగి మానసముచిల్లులు వోవఁగ నేసె బాలికన్, వలపుల రాచ జోగు ప్రసవంబుల పేరను గొర్వి కోలలన్ ...

పి. శకుం. 3. ౧౬౯.

**వలపులరాజు.** వి. (√ వలపు) మన్మథుఁడు.

చ. వలపులరాజు తూపులగు వారి రుహంబుల సొక్కు రెత్తునన్, గెలుపుగొనంగఁ జాలు మృగ నేత్రయపాంగ నిరీక్షణద్యుతుల్ ...

విక్ర. ౬. ౨౬.

చ. వలపులరాజు దండునకు వైచిన త్రోఁపు గుడారు నాఁగ వెన్నెల జలకంబుఁగాంచు రజని గజయానకు మోదృపదమ్మి గుబ్బల సమయాళి ముందెనెరిఁబట్టిన చందురు కావినా సముజ్జ్వల తరసాంధ్యరాగరుచి సంధిలె సౌమనసాధ్వ పీఠికన్ ...

రా. వి. ౪. ౪౦.

**వలపులతేఁడు.** వి. (√ వలపు¹ + ఱేఁడు) మన్మథుఁడు.

క. ... దేవర జాణయమీనుఖాన వలపుల ఱేఁడా ... యయా. ౫. ౧.

వ. వలపుల ఱేని చివురుటరిగెల పొలుపు దెలుపు రత్నతాటంకంబుల ...

ధర్మఖండము. 3. ౧౭3.

**వలపులాఁడి.** విణ. (√ వలపు¹) కామముగలది, కాముకి.

గీ. దొరసి యొండొంటి నొరసిక్రిక్కిఱిసి మెఱసి, యగణితస్ఫూర్తి మొగమునకెగ యూనీను, వలుదవలిగుబ్బచన్ను లోవలపులాడి ... నరస. ౫. ౧౧3.

**వలబాఱు.** అ. క్రి.(వలను + మీఱు) పార్శ్వము నకుఁ బాఱు.

ద్వి. చతురుఁడై యతఁడర్ధ చంద్రబాణమున, నితని విల్లటుత్రుంచె నేడు దూపులను, వక్షంబు నేయుచో వ్యాఘ్రంబుఁ గన్న, బుక్షంబు వలబాఱు రీతిఁ దేరుడిగి ...

భార. విరా. ౪. ౪3.పా.

**వలభి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. ౧. కొణిక, మంజూరు.

౨. ఇంటి నడికొప్పు. (హలా. ని.) 3. శిరో గృహము, చంద్రశాల. (విల్సన్సు)

**వలమానము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. తిరుగుచున్నది.

౨. చలించుచున్నది, కదలుచున్నది.

**వలము.** విణ. ౧. అధికము.

చ. పొలకయి గారవంబయిన పుత్రకుఁ డొక్కఁడ యేల మాంసమున్, వలముగ మీరు నేను నగు వారమె కామె ...

హర. ౨. ౭౮.

ఉ. తమ్ములతావితానములఁ దావలమై వలమైన గాలితో, యమ్ముల కౌమతింపఁ జటు లాలసరై వనకేళి సేయఁగాఁ, దమ్ముల తావితానములఁ దావలమైవలమైన గాలితో,

యమ్ముల కామతింపఁ జటులాలసయై వన
కేళి సేయఁగన్. కృ. శకుం ౨. ౧౬౫.

౨. స్థూలము, లావైనది.

క. ఆరెలు వలములు దొడలును, దోరము బలు
మెడయును .... దశకు. ౯. ౩౧.

క. ... నిడుదలగు తొడల బెడగున్, గడు
వల మగు నడుము గలుగు కలికిది బళిరా ...
చంద్ర. వి. ౧. ౮౫.
కళాశాస్త్రము. ౧. ౧౫.

వి. ౧. స్థౌల్యము.

సీ. వ్రేలి వలంబున వ్రేలెడు మెడనూళ్లు జాళు
వాఱుంజేతి జనులత్రాళ్లు ...
రా. వి. ౨. ౪౪.

౨. వైశాల్యము, విరివి.

గీ. ... ముప్పది యోజనముల, పొడువు పది
యోజనమ్ముల నడిమివలము, గలుగునగ్గిర
తరు మృగా వలులతోడ, ధరణితల సమా
నంబుగా ధరణిఁ గ్రుంగె ...
భా. రా. కుం. ౫౧౯.

**వలమురి.** వి. (వలను + మురి) దక్షిణావర్త
శంఖువు, శంఖము.

చ. విలసిత మౌక్తికంబులు సవిభ్రమరేఖలును
నిక్కసాటిరాఁ, దలఁచి మహోద్ధతిన్మొరసి
తన్మృదునాద విలాసకౌశలం, బలవడమిన్
మడింగి గరమై తనలో వివరం బెఱింగియా,
వలమురి దాఁ బ్రదక్షిణము వచ్చె నొయాసతి
కంఠ లక్ష్మికిన్. వసు. ౨. ౪౩.

క. వలమురి జిగినగు మెడకలు, వలమురి పెమఁ
జూపు చూపు వనజాతమునా, వలమురి
యించు మొగముసై, వలమురి విహసించు
వేణి వని తకుఁదనరున్ ...
చంద్రా. ౪. ౧౪౪.

క. అందంబున నల వలమురి, చిందంబు
ముకుందుఁ డర్థిఁ జేఁబట్టినదా, నిందగ
నెఱుఁగము ... విప్ర. ౨. ౪౨.

**వలమురితాలుపు.** వి. (వలమురి + తాలుపు)
శంఖమును ధరించినవాఁడు, విష్ణువు.

చ. వలమురి తాలుపింక నిటవచ్చుట మానుము
మచ్చకంటినా, నిలిచి ...
పాండు. ౫. ౧౩౭.

క. వలమురి దాలుపు దొరయా, వలఁబిలువఁగ
నీలవలదు వలదని పెనఁగన్, జెలికత్తె
గదిమి నీకిటు, వలెఁగూడదటంచుఁ దలుపు
వడిగాఁ దీసెన్ ... మృ. వి. ౩. ౩౫.

సీ. గట్టురా విల్లును కడలిబత్తలికయు వలమురి
దాలుపు వాడితూపు ... రామలిం. ౧.

**వలమూఁపు.** వి. (వల[3] + మూఁపు) కుడిమూఁపు.

ఉ. నీవలమూఁపు లావు మును నేల వహించిన
నాగకూర్మగో, త్రావని భృద్దిశాకరుల
కారయ నూఱట పట్టుగాదె ...
భార. విరా. ౨. ౧౯౩.

గీ. కలఁచి కబళించి కడువడి బలిమి మించి,
గెలిచి యార్వీటి వేంకట క్షితిపు తిర్మ,
శేంద్రు వలమూఁపు నను నిల్చి యిరవు
కొనియె, రాజనుతు లొప్ప ధరణీ వరాహ
మూర్తి ... రామ. ౩౭౮.

**వలయపుఁగత్తి.** మి. వి. (వలయము + కత్తి)
చక్రాయుధము.

ద్వి. వలమురి నెఱవాఁడి వలయపుఁగత్తి, బలసి
చూపట్టెడు పాణి యుగ్మమును ...
ద్వి. పరమ. ౨. ౯౪. పా.

**వలయము.** సం. వి. అ. పుం. న.

౧. కడియము, హస్తపాదకటకము, మురుగు,
అంద. మొ. ౨. చుట్టు. ౩. స్త్రీలనడి

కట్టు; ఒడ్డాణము. ౪. (సమాసాంత మున) మండలము, గుండ్రముగా నుండు వస్తువు. ౫. ఆవరణము, కంచె; ప్రహరి.

పుం. ౧. శాఖ, కొమ్మ. ౨. గొంతుకనొప్పి.

**వలయించే.** స. క్రి. (√ వలయు[2]) వలయాకారముగఁ ద్రిప్పు, చుట్టు త్రిప్పు, త్రిప్పు.

సీ. వలనంబు పుట్టించి వంకంబు వలయించి డిల్లాయి ప్రకటించి శేవచూపి ...
పి. శకుం. ౧. ౧౧౨.

ద. ఏలాగున వలయించెదో, యేలాగున నీల విభుని సొలయించెదో ...
చంద్ర. వి. ౩. ౭౦.

**వలయితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. చుట్టు వాఱు కొనఁబడినది.

౨. గిర గిర వేగముగ చుట్టును ద్రిప్పఁబడినది.

౩. మెలివేయఁ బడినది.

**వలయు[1].** అ. క్రి. (ఇది అసంపూర్ణ క్రియ దీనకి భూతార్థక ప్రథమ పురుషైక వచన బహువచనములందును తద్ధర్మార్థక ప్రథమ పురుషైక వచనమునందును వ్యతిరేకార్థమునందును క్త్వార్థమునందును భూతతద్ధర్మార్థక విశేషణము గాను టవర్ణకాంతముగాను ప్రయోగములు గానవచ్చుచున్నవి. వ్యతిరేకమున వలదు వలవదు అని రూపద్వయము కన్పట్టుచున్నది. ఇంకను విశేషములు ప్రయోగానుసారముగా గ్రహించునది.)

౧. అవశ్యకము.

గీ. ధర్మమార్గ ముల్లంఘింపఁ దగదుగాన, వలసె నిష్కృతి కులమెల్ల వెలసె నీ కృతమున సురముని పితృతర్పణములు సేయు, మరిగి బాహుదా పుణ్యతోయముల ననఘ.
భార. శాం. ౧. ౧౬౬.

గీ. ... భోగమనుభవించు, సొడను బహిరంతర రులపై దృష్టివలయు ... ఆము. ౪. ౨౪౧.

గీ. వలని నిగ్గున వెలుపునఁ గలసి మెలసి, యుండ కుంటకు మాబోటు లోర్వఁగలరె ...
కాశీ. ౩. ౬౨.

క. అన్నరు సత్యద్భుత విక్రము, పరిణతి నూడఁ గనుదోయి పదివేల్వలయుఁగా ...
భార. కర్ణ. ౨. ౨౭౩.

ఉ. ... మున్ను నిన్నెఱుఁగ నా వలదా నను నీవెఱుంగఁగఁగా ...
భార. శాం. ౪. ౩౯౬.

గీ. వలదు కుక్కల విడువంగ వలవ దేయు, నడిచి మొలపిడియఁ మ్మునఁ బొడువవచ్చున్.
మనుచ. ౪. ౨౦.

గీ. పెండ్లికని పిలవఁబంచినఁ బ్రియముతోడ, సేఁగు దించితి మిన్నాళ్లు సెల్లయొప్పి, దములఁ జూచితి మిర్యొడఁ దడవుగాఁగ, నిలువఁ దీరదు పోయిరావలయుమాకు.
భార. ఉద్యో. ౧. ౪౨.

ఆ. వలయు పదవియందు నిలిచి నారాజ్యమంత యును జక్కఁబెట్టి నయమువిక్ర, మంబు నడపునంత మానసస్థైయుండి, కుచ్చితంపు బ్రదుకు కోరఁ దగునె ...
భార. విరా. ౧. ౨౭౨.

ఉ. ... ఎల్ల వాడుందనవారిఁ దోకొనికడున్ రథసంబునఁ గూడి వార్తకుఁ, ముందఱఁ బోయి గోధనము ముట్టుకొనఁగ వలయున్ మహోగ్రతన్ ... భార. విరా. ౩. ౧౨౬.

గీ. ... పరుషములు తద్రిపుల రాయబారు లెదుటఁ బలుకకుము సంధియొకవేళ వలసి యుండు ... ఆము. ౪. ౨౬౪.

క. ఈరీతినుండ మచ్చిక, జేరన్వలసినవియెల్లఁ దెప్పించుటకై, వారసతులుబొజుఁగులతోఁ,

పోరామి యొనర్పఁ బసుల పొంగలి
వచ్చెఁ. భార. ఆది. ౪. ౧౭౬.
శుక. ౨. ౫౬౨.

క. ఈ రెండు ప్రకారంబుల, వారలకును
మమత విడువ వలయుట సరి ...
భార. శాం. ౫. ౯౭.

క. జముఁడైన వచ్చి వానిని, దమియింపఁగ
లేమి నిశ్చితంబేమి యుపాయము గలదో
కనుఁడు మీ భావమునందిటఁ బ్రజలుమీకు
వలసిరయేనిన్. హరి. పూ. ౬. ౧౨౬.

ఆ. ఎల్లవారు నెఱుఁగ నొల్లనిధర్మము, బేల
నీకుఁ జెప్పనేలవలసె ...
భార. సభా. ౨. ౨౨౭.

గీ. ఏమిరా వాసుదేవుఁడ నేన యనుచుఁ, జెప్పి
కొన వచ్చునేయింకఁ జెపుమనాకు, నిన్ను
గన్నప్డ చక్రాగ్ని నీఱుసేయవచ్చు మూద
లించుటకింత వలసెఁ జేయ.
హరి. ఉ. ౬. ౨౧౭.

౨. తప్పనిదియగు.

క. వీరెవ్వరయ్య ద్రుపద మహారాజులె యిట్లు
కృపణులయి పట్టువడఁగ, వీరికి వలసెనె
యహహ మహారాజ్య మదాంధకార మది
వానె నోకో. భార. ఆది. ౬. ౭౯.

వ. ... తత్కుండను దుష్టోరగంబు సేసిన
విఘ్నంబున నింతమసల వలసె వినుడు ...
భార. ఆది. ౧. ౧౧౭.

పడవలయు = పడుట తప్పనదియగు.

గీ. ... వెఱచి తాత, విడిచి నా పుత్రులందఱు
విఱిగి యడవి, గలిసిరొకో యాతనికిఁ బడ
వలసెనకట ... భార. భీష్మ. ౧. ౫౭.

సీ. ... అనయముఁ బ్రతి ...

ఆ. కోటిలేని నాదు కొమరున కిప్పాటు, వలసె
నకట యిది యవార్యమనుచు, వేగు వాని
చావు విని యంతజిష్ణుండు, ఖండితారిపంక్తి
కంధరుండు. రాఘ. ౪. ౧౪౩.

చంపవలయుట = చంప సంభవించుట.

ఆ. సురనదీ సుతుఁడు పరలోకగతి నిరీక్షిం
చుటకును దాను గృతకవృత్తిఁ, జంపవల
యుటకును సవిషాద మానసుం, డగుచు
నిట్టులనిరె నచ్యుతునకు.
భార. భీష్మ. ౩. ౧౦౪.

చ. అమరహితంబుఁ గోరియ సురాంగముల
న్విదళించునట్టి మాకమరులఁ ద్రుంపఁగా
వలసె నక్కటా నేఁడని సిగ్గుజెందు చంద
మున ... పారి. ౫. ౭.

౩. విహితమగు = విధియగు.

క. ఇనుఁ డస్తమింపఁ బోయిన, నసఘా
బోధింప వలసె ...
భార. ఆది. ౨. ౧౫౯.

క. వీనుమల సుండును గర్వియు, ననర్థ భాషి
యును మత్సరాలిడుఁడుఁ గ్రోధనుఁడును
గావలవదు ... భార. శాం. ౫. ౪౫౪.

(ఇట నిషిద్ధము.)

గీ. ఎల్లవారలఁ బిలిచి మీరే సుకృతను, నాచ
రింపఁగవలదు నా నా ధ్వరముల, తెరువు
పోకుడు ... హరి. పూ. ౧. ౯౭.

ఆ. కొడుకుఁబోలె నరయ గురుఁ బోలెఁ గొలు
వంగ, నగ్నిఁ బోలె నిష్ఠనర్చితుఁడుగఁ,
జేయవలయు విప్రుఁ జెప్పెద వేద
సంవాద మేకబుద్ధి నాదరింపు.
భార. అను. ౧. ౧౬౦.

క. పితృ సంకల్పము సేయఁగ, సుతులకవశ్య
మును వలయు ... భార. సభా. ౧. ౯౩.

ఆ. ... గంగ నాడవచ్చి నీవు, వలవదనిన
నుడుగు వారముగాము నీ, విఘ్న వచనము
లను వెఱతుమెట్లు ...
భార. ఆది. ౭. ౪౦.

వల్దు.

శా. ... యత్యుత్క్రాంచి ద్వితీయులేక విష్ణు సహితుం గీర్తించు చున్నాఁడు వల్దంచుం జెప్పినమాఁటఁ డంగమున ...

భాగ. ౪. ౧౮౪.

౪. యుక్తమగు, తగు, హర్హమగు.

క. వెలయ విధిదృష్ట నయమున, వలయుఁ బరా క్రమము సేయ వసుదేశ్వర యుగ్గలమగు బుద్ధియుఁ గడఁకయుఁ గల పురుషుల కిది యుచూచె కర్తవ్యమిలన్ ...

భార. సభా. ౧. ౧౩౦.

గీ. ...వందనీయులు చెనకంగ వలదు వారి ..

కాశీ. ౩. ౧౫౪.

వలయువాడు = తగినవాఁడు.

క. గోవులకు మేలుచేసిన, యావేలుపు గొల్ల వారి యర్చనలకు నెచ్చోఁవలయువాఁడు గావున, దేవేంద్రునిఁ గొలుతు మేము దృఢ తర భక్తిన్ ... హరి. పూ. ౪. ౧౨౬.

గీ. ... చెలిమి గలదానిపైఁ దలఁపు మాన, వలగుసుమి మంచి పనసపండుల మెసంగు, జాణలకు మావి పండులు చవియ కావె.

నీలా. ౨. ౩౧.

చ. బవరము సేయుచుండియును భావణ ముల్దగఁ బల్కుచుండగా, నవినయ వృత్తిమై వలవదాయుధ మార్చుటఁ దాఁకి పద్దగ్గ్రుదువు వడినం దొలంగినను ...

భార. భీష్మ. ౧. ౧౪౮.

చ. ... పస్తులన్, వసరఁగ వేడ్కయయ్యెడి నో వల్దిటువంటి కుబుద్ధు లివ్వనంబునఁ గొనమేపు నీళ్లఁ గఱవో పతిమన్నన నీకుఁ జాలదో ... వేం. పంచ. ౪. ౫౧౯.

౫. ఇష్టమగు.

చ. ... వీనిలోననీ, వలసిన వస్తువుల్ గొను ధ్రువంబుగ నిచ్చెద నీకు వావుడున్ ...

భాగ. ఆది. ౫. ౨౦౦.

"నీవలసిన" అనుచో ప్రౌ. వ్యా. కార. ౧౫ సూత్రమున నీ శబ్దమునకుఁ గర్త్రర్థమున యొక్క విభక్తియు ౧౬ సూత్రమున లోపము నగు.

క. కుడువుఁడు కట్టుఁడు గైకొనుఁ డడుగుఁడు మీ వలయునట్టి యర్థములర్థుల్, కడమ యొకింతయు వలదని, యెడపక ఘోషింపఁ బనిచె నెల్లెడ నెలమిన్ ...

హరి. ఉ. ౩. ౧౪౦.

క. మాపలికినట్టి వన్నియు, నా పుత్రునియందు వలదు నరవరధర్మ, వ్యాసాగము మను మనియం, దాపాదింపుగురు కానియని పలు కుటయుఁ. వి. పు. ౬. ౧౩౫.

గీ. పట్టియే దర్శనంబైనఁ బ్రతిభకలిమి, వలసి నట్లు వకాణింప వచ్చియుండు ...

నైష. ౪. ౪౩

౬. సంభవించు, తటస్థించు.

ఆ. ... అట్టి జెట్టినిన్ని, దినములిట్లు దొడరి పెనఁ గియు నీచేత, నేఁడు వినఁగ వలసె నేఁడి పలుకు ... భార. భీష్మ. ౩. ౧౪౪.

గీ. అప్పుడొక చారుఁడేతెంచి యసురనాథ, నీకు జయపెట్టు చున్నారు నిఖిల జనులు, కొదవ వలదెందు ... దశా. ౫. ౩౦.

గీ. ... అనఘ, సవితృ నుదయాస్త మయముల శయన మెగ్గు, నిట్లు గూర్చుండు నెడమేలు నెపుడు వలయు ... మార్క. ౩. ౨౩౬.

౪. పుట్టు, కలుగు.

ద్వి. పొలఁతుక నీతోడి భోగేచ్ఛనాకు, వల యుటఁ దలపోసి వచ్చితి ననిన ...

రం. రా. బాల. ౫౦. పా. ౧౨. పం.

గీ. ద్వాదశక్షేత్ర శివలింగ దర్శనంబు,
మొదలఁ జేయంగ వలయుట ముఖ్యపత్త్వ,
మానతీఁదగు ... భీమ. 3. ౬౯.

(చేయంగ వలయుట = చేయఁగోరుట.)

సీ. ... నృహల్య ప్రాణేశుఁడహల్య శాల్య
స్నంబు వలసినవారికి వలసినంత, ఘృత
సూప ఫలదధి క్షీరయుక్తంబుగాఁ దలఁచి
నప్పుడె పెట్టె ... వరాహ. ౧౦. 33.

వ. నీవు మమ్ము వలసినవాఁడ వగుదేని యివ్వి
ధంబున కియ్యకొను మనిరి ...
హరి. పూ. 8. ౨౧౨.

వలయు². అ. క్రి. (√సం. వల్.) చుట్టితిరుగు.

క. విడివడి జల మధ్యమునకుఁ, కడువేగమ
కమఠమేగ గ్రక్కున బోకటం, బడె
నెలుక వానిఁ బొడఁగని, వడిగాకము
నెగసె మృగము వలయం బాటెఁ.
వెం. పంచ. ౨. ౨3౫. (శ. ర. పా.)

"మృగముఁ బాటెఁ దవులఁ"
(వా. రా. శా. పా.)

వలరసము. మి. వి. (వలపు + రసము) మోహము.

చ. ... రాగులన్, వలరసమందఁ బ్రోషితులు
వందఁగ వల్మొదమంద వచ్చె ...
కు. సం. ౬. 8౮౯.

సీ. ... అ. తరుణి వలరసంబు దఱిమిపైఁ బడ
నున్న, నెఱ నెఱింగి కూడ నేరకేల, చేల
నైతి ... కు. సం. ౬. ౭౧౯.

వలరాకటారి. (వలపు¹ + రాచే + కటారి) వి. మన్మథుని కత్తి.

చ. ... కేవలము కటారి శారియని వాఁడి
కడున్ వలరాకటారికిన్ ...
చంద్రా. ౪. ౧౭3.

వలరాచేపని. వి. (వలపు¹ + రాచే + పని) గ్రామ్య ధర్మము; సురతము, మైథునము.

క. చెలువున వృష పర్వుండను, బలియుని
గారాపుఁ బట్టి పనిబిడ్డసుమీ, వలరాచ
పనులు తెలిగాఁ, గలిగిన సొంపులను నడపఁ
గాఁదగు దీనిన్. యయా. ౪. ౧౪౭.

సీ. తలిరుఁ బాయవు ముద్దుఁ జెలువలఁ గను
గీఁటి వలరాచ పనులకు వలసి పిలుచు ...
నీలా. ౧. 8౬.

వలరాచేరాచేవాఁడు వి. (వలపు¹ + రాచే + రాచే + వాఁడు.) మన్మథుఁ డనెడు క్షత్రియుఁడు.

సీ. వలరాచ రాచవాఁడలికొత్తు కనువెచ్చఁ
గరఁగిన యలక నికరపు చోటు ...
మనుచ. ౨. ౯.

వలరాచేలచ్చి. (వలపు + రాచే + లచ్చి) వి. మన్మథ లక్ష్మి.

సీ. ... బిలువ కన్నియలతోఁ జెలిమిగావిం
పఁగా వచ్చిన వలరాచ లచ్చి యనఁగ ...
యయా. 3. ౪౧

వలరాచేవాఁడు. వి. (వలపు + రాచవాఁడు) మన్మథుఁడు.

సీ. సింగార మమరంగఁ జికిలి చేయించిన వల
రాచవాని పూములుకు లనఁగ ...
యయా. ౧. ౭౧.

వలరాజే. మి. వి. (వలపు + రాజు) మన్మథుఁడు

గీ. రాజశుద్ధాంత భామినీ రత్నరాజి, దీమ
గావించి వలరాజ ధీకు సేసె ...
నైష. 3. ౯౨.

క. వలరాజు మూలబలమగు, వలికుక పికము
లకుఁ జైత్రుఁ డభిమత భోజ్యంబులఁ
గూర్చె ... విక్ర. ౫. ౪.

**వలరాజుడాగులు** = మన్మథాంకములు.
విక్ర. ౮. ౪.

**వలరాటెక్కెము.** (వలపు¹ + రాచే + టెక్కెము) వి. మన్మథుని ధ్వజము.

మ. వలరా టెక్కెపు మీనమో సురలఁ బ్రోవ న్నెంచు మీనంబవో ... దశా. ౧. ౧౫౬.

**వలరాయఁడు¹**(లు.) వి. (వలపు¹ + రాయఁడు) మన్మథుఁడు.

క. ... ఱేఁడు రెండవ, వలరాయనిపగిది వచ్చి వాకిట దిగియెన్ ...
యయా. ౪. ౧౦౨.

క. వలదాళుగ శిఖికీలల, వలదాళుగ తిన్నిగుడ్డు వలరాయఁడ ... వసు. ౪. ౩౮.

ఉ. అంగన యంగరాజ్యమున హస్తయుగా వరణాంతరంబునం,దుం గొమరొందు చారు కుచదుర్గములన్, వలరాయ లాక్రమిం,చం గదియించు కాంతిజిగి సంచపు నిచ్చెన మెట్లలీలఁ జూ,డం గనుపట్టె నమ్మరి మిటారి వళీతతి మోహనాకృతిన్ ...
ఉ. హరిశ్చ. ౩. ౬౪.

**వలరాయఁడు².** వి. (వల¹ + రాయఁడు) జాలరి, బెస్త.

చ. ... క్రమ్మఱఁ గూడఁబాఱు మోహాన గుణ శక్తి నివ్వటిలు నవ్వలరాయని సేర్పు పెంపునన్ ... వసు. ౩. ౫౧.
(మన్మథుఁడని రెండవ యర్థము.)

**వలఱెక్క.** వి. (వలను + ఱెక్క) కుడిఱెక్క.

సీ. గవనిపెల్పట బెరికయుఁబోతు వలగొని వల ఱెక్క నూపెఁ జేవలఁతిఁ జెమరు ...
పి. శకుం. ౧. ౧౩౨.

**వలఱేఁడు.** వి. (వలపు¹ + ఱేఁడు) మన్మథుఁడు.

గీ. కినిసి వలఱేఁడు దండెత్తఁ గేతువగుట, మీన మిలఁ దోఁచు టుచితంబ ...
ఆను. ౫. ౯౮.

గీ. మేలిపెలిదమ్మిఱేకుల సేలఁ జాలు, కన్నుఁ గవవాని వలఱేనిఁ గన్నవాని, వన్నియల కెల్ల మిన్నయై యున్నవానిఁ, గాంచి యిట్లని యగ్గింపఁగడఁగె రఘుడు ...
అ. రా. బాల. ౬౨.

**వలవంక.** వి. (వల³ + వంక) కుడిదిక్కు, కుడి వైపు.

గీ. ఆర్చి యెడవంక సాత్యకి యడ్డగింప, వాసుదేవుండు వలవంక వచ్చియురము, వ్రేయ నప్పురఁ డచ్చోట వ్రేసెఁ దత్తఱించి పౌండ్రుఁడు ధర మోఁకఁతిల్లఁ బడియె.
ఉ. హరి. ౩. ౬౫.

**వలవంత.** వి. (వలపు¹ + వంత.) ౧. మన్మథ వ్యథ.

గీ. ... అంత, కంత కగ్గలమగు వలవంతఁ దూల, షోయెఁ బావకుఁ డేమి సెప్పుదు నరేంద్ర ... భార. అను. ౧. ౪౮.

సీ. ఎలమి ముఖాంభోజ మలరు నొక్కొక మాటు వలవంత నప్పుడ వందికందు ...
కు. సం. ౫. ౫౮౯.

శా. ... కోమలి యోర్వలేక వలవంతం బద్మి నీ జాతికిం, గీడౌనుగ్రశిఖామణిం బలికె నతీక్ష్ణానులాపంబులన్ ...
వసు. ౪. ౨౬.

౨. చింత, వ్యథ.

ఉ. ... ఆవలవైరిఁ బల్కున చలాగ్రణి మామ కశోక వార్ధికిన్, నావ లతాంగి నర్థిరశనా వలయేశ్వరు కేలఁ గూర్చెదే, నావల వంతఁ దీర్చెద ... వసు. ౫. ౨౬.

సీ. కదలి యహంకారగతివశంబునఁ జాల
వివశుఁడై బోధకు విపరియైన, వానికి నీరీతి
వలవంత కర్మ ప్రచారంబులను మీఁదఁ
జక్కనైన. భాగ. ౬. ౨౩౨.

ఉ. ... ధరణీతల మంతయు ధారఁబోసిన,
ల్వంతలఁ జెందు వేళ ... 3. 3౨. బ్రా. ని.

సీ. చిలువ పోగులను వ్రేల్చెవులఁ గీలనచేసి
వలరాచ నీలు పైఁ గలయ నలఁది ...
హర. ౫. ౫౫.

3. మాయ, మోసము.

మ. ... ఈ, వలవంతల్ పచరింప నేల కుహ
నావైసారిణ గ్రామణీ ...
దశా. ౧. ౧౫౬.

**వలవంతతనము.** వి. (వలవంత + తనము. స్వార్థమున) మన్మథవ్యథ.

తరు. ... ఇంత వలవంత తన మోఁడువారికిఁ
దగునె ... కు. సం. ౬. ౬౭౮.

**వలవల.** వి. ౧. ఏడ్చుటయం దగు ననుకరణము.

క. కలకంఠకంఠి మదిలో, పలిదుఃఖం బాప
లేక బాష్పజలంబుల్, జలజలజల ప్రవ
హింపఁగ, వలవల నత్తరుస నమ్ర వక్త్రాం
బుజయై.

వ. ... ఏడ్చుచున్న నవ్వధూరత్నంబుఁ
గాంచి ... నిరం. ౨. ౬౧. ౬౨.

౨. కన్నీరు పెం. కారుట యందగు ననుకర
ణము.

చ. వలవలఁ గన్నులం దొఱఁగు బాష్పకణం
బులతో రఘూత్తముం, బలువుఱుఁ జూచు
చున్ నిలిచి పంచితివే రఘురామచంద్ర
మా, స్థలముల కంచు మూర్ఖుల విధంబున
నేడ్చుచుఁ బోయి కెంతయున్.
ఉ. రా. ౫. ౩౦౮.

సీ. తళుకునిద్దంపుటద్దపుమోము కళ దప్పి
వలవల కన్నీరు వడువకమ్మ ...
అని. ౨. ౭౬.

3. వళావళి యందగు ననుకరణము.

చ. ... చలిగాలి వ్రాలితో, య్యాలి వలయించెఁ
జిల్కల గయాలివిగాక వనాళి నీవునున్,
వలవల మన్వళాంకలి నవాళి గువాళిగ మేళ
వింతురే. లక్ష్మీవి. ౪. ౭౮.

౪. వ్రాలుట యందగు ననుకరణము.

చ. ... నేలపై, వలవల వ్రాలెఁ గీలెడలి
వ్రాలిన పుత్తడి బొమ్మ కైవడిన్ ...
భాగ. ౧౦. ఉ. ౨౩౮. (శ. ర, పా.)

("వలనతి" అని ముద్రి. పా.)

**వలవలన.** విణ. వదలినది, విశ్లథము.

సీ. జలధరప్రకరంబు వలవలనై తోఁచె వెల
రారి దిక్కులు విశదమయ్యె ...
పద్మ. ౯. ౨౭౬.

చ. పలుకని మోముఁ దొట్రుపడు పాదము
లున్ వగరంపు టూర్పులున్, వలవలనైన
దంతములు వంగినమేను వణంకుమస్తమున్,
నిలుపఁగరానియుక్కిసము నెమ్మోయి
నెక్కొను దప్పి పెంపుఁ జే, వెలుఁగునఁ
జూచుచూపుఁగల వృద్ధమహీసురుఁ డమ్మ
హీశ్వరున్.

వ. కాంచి ... విక్ర. ౨. ౧౫౫.

**వలవాఁడు.** విణ. (√వల[1]) వాగురికుఁడు, ఉచ్చులొగ్గువాఁడు.

గీ. వాగురిక సంజ్ఞయువు వలవాఁడనంగ ...
ఆం. భా. ౨. ౨౭౬.

**వలస.** వి. (సం. పరదేశః.)

౧. రాజోపద్రవాదులచే స్వదేశము విడిచి పరదేశమునందు నివసించుట.

చ. ... అవార్యతమిస్రము నేఁడు తత్పురిన్, విలసితభర్మహర్మ్యరుచి వేమఱు నల్గడ పారి వెల్లఁగా, వలసలు సేయఁగాఁ దొడఁగె వారక తద్ఘనగహ్వరంబులన్.
తపతీ. ౧. ౪౭.

గీ. అష్టమహిషులపై పదియాఱువేల, సతు లతో నీకు వలస కెచ్చోటి కరిగెదు ...
సిం. నార. ౧౧.

సీ. ఉదయగిరి మీఁదఁ గోపురం బుండి నిగుడు, నహితరవి రశ్మిచే బద్ధుఁడగుచుఁ దోఁడి, బలగమై నట్టి చుక్కలవలస త్రోవఁ జూపనే తెంచెనన వేఁగుఁజుక్క పొడిచె.
మనుచ. 3. ౫౪.

గీ. వలసయనఁ బ్రవాసాఖ్యగా వఱలు ...
ఆం. భా. ౨. ౨౨3.

౨. రాజోపద్రవాదులచే దేశము విడిచి పర దేశమునకుఁ బోయిన ప్రజ.

ఆ. వలస బెదర నృపతి కలఁగక ప్రజ వగ, లార్పఁ బనిచి ... ఆము. 3. ౨౭.

వలసవచ్చు = శత్రుభయమున స్వదేశము విడిచివచ్చు.

సీ. ఏను లతాంగులవృత్తాంత మెఱుఁగుదు విను మందరాచలంబునకు నికట, మున నున్న పాటలంబను పురంబున వేలుపులకు నా తంకించి వలస వచ్చి, గీ. నిలిచి యెప్పుడు నీదురాకలకు నెదురు, చూచు హేతి ప్రహేతుల సుతలు ...
వరాహ. 3. ౧3౧.

జః వలసపాటు, వలసపోవు, వలసలుచేయు, వలసలుతీయు, వలసల్పాగు, వలసరి.

వలసపాటు. వి. (√ వలస) వలసపోవుట.

గీ. ఓడి గంధర్వులూడనిఁ బాడి రచ్చ,రలకుఁ జెఱలుప్ప తిలె మహారాజసులకుఁ, గలిగెఁ దలగంప దింపని వలసపాటు, రాక్షసులు సేయురాయిడి రఘువరేణ్య ...
ఉ. రా. ౧. ౨౦౫.

వలస(లు)పోవు. అ. క్రి. రాజోపద్రవాదులచే దేశము విడిచి పరదేశమునకుఁ బోవు.

వ. ... ఉభయసైన్యందనతురగఖురక్షతరథనేమి ఘట్టనసముద్ధూతంబగు రేణుపటలంబు రాయిడి కోర్వక పుడమి మింటికి వలస పోవు చందంబున నెగసి ...
భా. రా. యు. ౨. ౨౫.

చ. అలఘుబలప్రతాపయుతుఁడై యతఁడమ్మెయి వచ్చు దండు వార్తలు వినుచుం దదగ్రదిశరాజులు గొందఱు ముక్తమార్గులై, వలసలుపోవు వారుఁ దగు వస్తువు లప్పన పంపు వారుఁ గేవల వినయంబుతోఁ గొలుచు వారును నైరి యథోచితస్థితిన్.
కళా. ౫. ౪౬.

గీ. జలవజని నుండి తుమ్మెద వలసఁ బోయెఁ గువలయవనీదళాంతరగుహలఁ జేర ...
ఘటికా. ౨. ౧౪౦.

వలసలుచేయు. అ. క్రి. (వలసలు + చేయు) సంచరించు, పోవు, గమించు.

వ. ... ఉపరిలోకంబుల వలసలుచేసి మరలి తమ తమ యాగారంబులం జేరు వారి నాలోకించుచు ... దశా. ౧. ౨౬౧.

వలసలుతీయు. అ. క్రి (వలసలు + తీయు) రాజోపద్రవాదులచే దేశము విడిచి పరదేశమునకుఁ బోవు, వలసపోవు.

చ. ఎలనగు వంకురింప ముని యిట్లను రావణ యింక నేమి విం,తలు వివరింతు నీవిజయ ధాటికి భీతిలి యూర్ధ్వలోకముల్, వలసలు దీయసాగ బలవంతుఁడ వన్నను నీవెకా

క నీ,కిల నొకరుండు సాటిగలఁడే యన
బెట్టుగఁ గేరి నవ్వుచున్.

ఉ. రా. ౫. ౧౯౯.

**వలసల్ సాగు.** అ. క్రి. (వలసలు + సాగు) రాజోపద్రవాదులచే దేశము విడిచి పాఱి పోవు.

మ. అనుచుం గాలకరాళ కాలహర ఫాలాభీల
కీలాకరాళ, శనిలీలాపరిలోల శూలను భుజా
స్థానిం జెలంగ న్మహా, జనలోకంబుల
వారు సూచి వలసల్ సాగం దపోవాసు
లుగ్రాయత్ననఁ గేలోడ్పఁగ ...

దశా. ౮. ౯౯.

**వలసరి.** విణ. (వలస + అరి[3]) వలసపోవువాఁడు, వలసపోవునది.

క. చెలువా పిలువక ముందట, వలసరి మా
యింటికేల వచ్చితి చెపుమా, పిలువని పేరం
టము పని, గలవారునుబోలె సిగ్గు
గాదే రాఁగన్ ... వీర. ౧. ౧౩౯.

**వలాసకము.** సం. వి. అ. పుం. ౧. కోకిల. ౨. కప్ప, భేకము.

**వలాహకము = బలాహకము.** సం. వి. అ. పుం.

**వలి.** వి. ౧. శైత్యము, చల్లందనము.

వ. ...వలిమించు క్రొమ్మంచుటొదులీఁదియీఁది.

మనుచ. ౩. ౨౭.

చ. చేలివఁల మున్నుమేరుతనుజాతయనం దగు
మేని టెక్కు చన్నుల వలినిక్కునుం గల
మనోరమఁ జేకొని కాంచె ...

చంపూరా. ౩. ౩.

సీ. వలిజేరు పన్నీరు వంకల వంకల గాలితేజీల
నిల్కడల కడల ... సారంగ. ౩. ౨౩౨.

౨. చలి.

చ. వలికయి విల్లువంకఁగని వ్రాసెడి యొక్కటి
లెక్క యక్కనం, దలయిడి రెంటి లెక్క
యిడినాఁడు ముడించిన కాళ్లసొంపుచే,
నిలిపెడు మూటిలెక్క బళి నిద్దురపోవుచు
లెక్క మానఁ డీ, బలకరపుందవు ల్లలిగి
బక్క నియోగియటంద్రు తద్భటుల్.

రా. వి. ౨. ౪౧.

చ. వలియును మంచు నెండయును వానయు
గాలియుఁ జేరనీని బ్రెల్కలుగటు చేయఁ
బంచి యదిగన్పడ కుండఁగఁ బుట్టలుం
బొదల్, బలువుగ సంఘటింపుఁడని పల్కి
నిజాకృతి డించి చొచ్చియం, దలయుచు
నున్న వాఁడిపుడు నాన్యగుఁ డూసరవెల్లి
యూపునన్. ఉ. రా. ౬. ౩౬౬.

౩. కంపము, వణఁకుట.

క. చలిగాడ్పుల ముసురుల మెయి, వలిగొని
ధాత్రీపురంధ్రి వలిఁ బచ్చని కం,బలిఁ
గవిసి కొన్న విధమునఁ, బొలుపునఁ జిప్ప
రలు గలిసె భూతలమెల్లన్ ...

కు. సం. ౬. ౪౫౪.

క. కని వలిగని దొరలదొరల, ననుపమగతి నను
ప మదనుఁ డాలో నాలోఁ, జననున్న వారిఁ
గనుఁగొని, మినుకెనయన్ బొగరు మేన
మేనక వలికెన్ ... చంద్రాంగ. ౩. ౭౦.

౪. చేలిగాలి.

క. బిసబిస నెప్పుడు నుడుగక, విసరెడి వలిచేత
వడఁకు విడువక ... భాగ. ౧౦. ఉ. ౧౧.

సీ. సౌధవీథికలలోఁ జరియించు పువ్వుబోడుల
లేడమల లేడఁ జలిరు బోఁడి, చీనిచీనాంబర
శ్రీఁజెందు బాలికావలు లేడ వలు లేడ
వామనయన ... సరస. ౫. ౧౪౫.

౫. గాలి, వాయువు.

గీ. మొనయువలిపిల్లలా పుల్లనుసకుగాని, బొల్లి
నెమ్మోము దనరారు పుల్గుటేని ...
ప్రబంధ. ౭౦౨. ౧౦౪.

**వలి** = శైత్యము, (ప్రసిద్ధము.)

కాని యీ ప్రయోగమునఁ గాలి, యనునర్థమున నుపయోగింపఁబడినది.

ద్వి. వలివేగమున వచ్చి వచ్చి యెంతేని ...
బస. పు. ౫. ౨౦౫. పం.

ద్వి. వలివేగమున ననివారితవృత్తి ...
బస. పు. ౮. ౧౨౧. పం.

౬. వడి, వేగము.

ద్వి. వలిన భక్తాలోకనాచ్చెవ యనఁగ, వలిఁ
బదార్థానిహవర్జయేత్తనఁగ ...
పండితా. పర్వ. ౩౩౪.

విశే. ౧. శీతము, చల్లనిది.

గీ. అల్లవలిగాలి యుల్లంబు దల్లడిల్ల, బహు
వనప్రసవామోదితపరిమళంబు, లలమి తెచ్చి
పైఁ బొలసి ... భా. రా. అర. ౨. ౪౨౬.

చ. పొలుపుగ నందుఁ బెండ్లినడుపుల్ నడుపున్
వలినాలితెమ్మెరల్ ... విజ. ౧. ౪౭.

సీ. పుడుకు మ్రాన్వలితావి పువ్వు తేనియ ...
లాను ... నీలా. ౨. ౪౬.

సీ. పెంపార వలిజిలిబిలిపాటఁ బాడుచు
నింపుగా వీణ వాయింపవేమి ...
రసి. ౮. ౨౧.

(ఇట "మనోహరమైన" యని యర్థము.)

౨. గుండ్రనిది, వర్తులము.

సీ. వలిపకంచెలలోని వలిచనుంగవ మించి
జక్కవకవభంగి సంభ్రమింప ...
విక్ర. ౨. ౭౯.

సీ. వలిజక్కవలపెక్కువలు దక్కవగ నిక్క
చనుదోయి కొంకవింత చాయదోఁచె.
పారి. ౧. ౫౯.

సీ. గురు గోత్ర తటములు గోరాడనును మొక్క
వోయిన వలిగొమ్ము దోయిమెఱయ, ఘన
మేఘ తటములు గాల్ ద్రవ్వక్రొమ్మెఱుఁ
గులపస నూనిన గొరిజలొప్ప ...
హరి. ఉ. ౪. ౪౯.

౩. గొప్పది. (గ్రా. ని.) (చూ. వలితనము.)

జః వలిగట్టు, వలిగుబ్బలి, వలిగొను, వలిచంద్రు,
వలిచుట్టు, వలితనము, వలిపని, వలిపిరి, వలి
పిరిగొట్టు, వలిమల, వలిమిన్న, వలిమిరి, వలి
మెట్టు, వలిమొలక, వలివెలుఁగు,

**వలి**, సం. వి. ఇ. ఈ. స్త్రీ. ౧. ముదిమిచేఁ
జర్మముపై నేర్పడు ముడుత. ౨. స్త్రీల
కడుపుమీఁది ముడుత. ౩. ఇంటికప్పు యొక్క
వెనుబద్ద. ౪. సుగంధితైలముతో శరీరముపై
గీసినగీఁత.

**వలికి**, వి. గోనర్దము, ఒకానొక పక్షి,

గీ. ... గోనర్ద మలరు, వలికి యనఁగను ...
ఆం. భా. ౨. ౬౪.

**వలిగట్టు**. వి. (వలి + గట్టు) హిమాద్రి.

క. అనఁ దనయు రామచంద్రుని, ముని పరమే
శ్వరున కిచ్చె మోహముతో నజ్జనసాథుఁడు
జాబిల్లిన్, వననిధి వలిగట్టునల్లువారికిఁ
బోలెన్. రామా. ౪. ౧౪.

సీ. ఏ సామి సామేన నేత్రొద్దు వలిగట్టుదొర
పట్టి నర్మిలి తోడఁ బూనె ...
నీలా. ౧. ౧౨.

**వలిగుబ్బలి**. వి. (వలి + గుబ్బలి) హిమవత్పర్వతము.

చ. ... అవ్విరిం, దననెటి గొప్పునం జెరివిన
న్వలిగుబ్బలిముద్దుపట్టి లేఁతనెల ధరించిన
ట్లమరెఁ దద్దయు మోహనకాంతి సంప
దన్ ... పారి. ౧. ౫౫.

సీ. అలక్రౌంచగిరికి రంధ్రాన్వేష మొనరించి
వలిగుబ్బలికి వింతవడఁకుఁ గూర్చి ...
నరస. ౫. ౧౯౧.

**వలిగొను.** అ. క్రి. (వలి + కొను) చలిగొను, గడగడలాడు.

క. ... పలుకులు వేయును నేటికి, చలిగొని
వడఁకొడుచుండు వైశ్వానరుఁడున్ ...
పి. శకుం. 3 ४౫.

క. చలిగాడ్పుల ముసురుల మెయి, వలిగొని
ధాత్రీపురంధ్రి వలఁ బచ్చని కం,బలఁ గవిసి
కొన్న విధమునఁ, బొలఁపుగఁ జిప్పరలు
గవిసె భూతలమెల్లన్ ...
కు. సం. ౬. ३౫२.

**వలిచంద్ర.** వి. (వలి + చంద్ర) ఒకానొక చెట్టు.

ద్వి. బలుసుముల్ మోదుగు పచ్చారె యారె,
వలిచంద్రములు చంద్ర వాడగన్నేరు ...
ద్వి. పారంగ. ౨. ౧౦. పొ. ४. పం.

**వలిచుట్టు.** స. క్రి. (వలి + చుట్టు) వలయాకారముగ చుట్టు.

సీ. వలిచుట్టి పూదండ వెలిచుట్టుగన నొప్పుకప్పు
చిప్పిలు సాముకొప్పు దనర ...
వాల్మీకి. 3. ౧3.

**వలితనము.** వి. (వలి + తనము) గొప్పతనము.

గీ. తేరఁ దవఁ దెచ్చి తత్సూతుఁ దూరు సేర్చె,
నక్క బంధంబు లెదురెక్క నొక్కవడిన,
వ్రేటు నాటును నాయును వ్రేటు చూప,
కవనిఁ గలయక వలితనం బివుర దనుచు.
కకు. ౫. ४౯.

**వలితము,** సం. విణ. (అ. ఆ. అ.) ౧. చలించినది, కదలినది. ౨. చుట్టుతిరిగినది. 3. గుండ్రముగా వంపఁబడినది. ४. చుట్టుకొనఁ బడినది. పరివేష్టింపఁ బడినది. ౫. ముడుతలు పడునట్లు చేయఁ బడినది. ౬. త్రోసివేయఁ బడినది.

**వలినము,** సం. విణ. (అ. ఆ. అ.) ముడుతలు పడినది, వళులుగలది, వదులయినది, బిగిలేనిది.

**వలిపని.** వి. (వలి + పని) శైత్యోపచారము (శ. ర.)

**వలిప(ల్ప)ము.** విణ. ౧. తెల్లనిది. (వృత్తియందు "ము" వర్ణలోపము వైకల్పికము) (కొన్ని ప్రతులందు "వలిపెము" అనురూపము కన్పట్టుచున్నది. నిర్ధారకము కానరాదు.)

గీ. తారకాధీశుకిరణకదంబకంబు, చిలికెఁ బలుచని వలిపంపు జిలుగుమంచు ...
పారి. ౨. ४२.

సీ. కలువ పుప్పొళ్ల చేఁ గసమైన వెన్నెల వలిప
వెన్నెలలోన వడిచి తేర్చి ...
పారి. ౨. ४౭.

సీ. పలుచగా వండిన వలిపంపుఁ జాఁపట్లు
పెసరపప్పులతోడఁ బెనఁచి పెనఁచి ...
నైష. ౬. ౧౨౦.

౨. పరిశుద్ధమైనది.

చ. మలయజవారిసేకముల మౌక్తికనూతనహార
లీలలన్, వలిపపుసన్నకొవులను వారి
రుహోత్పలపేఁగుఁజన్నులన్, గలిగిన చల్మి
రిన్ బ్రదికెఁగాక జనావళి యిట్టి
వేసవిన్, గలఁడె శరణ్య మన్య మనఁగాఁ
గడుఁ బేర్చె నిదాఘదాహముల్.
నృసిం. 3. ౬౭.

3. సన్నమైనది, సూక్ష్మము.

వ. ... మక్కుచకక్కశతకీవలిపమడుంగట్లు
సహించు నన్నట్లు వల్కలాంబరంబులు
ధరియించి ... మ్ర. వి. ౨. 3౯.

మ. ... సుభటోద్యత్ఖడ్గకాంతిచ్ఛటల్, వలి
పంపుందెలిచల్వపావడలు వైవన్ దుందు
భుల్ మ్రోయఁగన్ ... దశా. ౨. ౬२.

చ. తడిసినవల్పపయ్యెదలు దాకొని పైపయి
 నంటి యుండఁగా, నుడువనగోచరం బగు
 వినూత్నవిలాసత నొప్పె నప్పుడు ...
 కవిరా. ౪. ౧౦౨.

వి. ౧. ధౌతవస్త్రము, చలువబట్ట.

చ. పలుచనిసన్న కావివలిపంబులు గట్టఁగ
 నిచ్చి నెచ్చెలుల్ ... విక్ర. ౧. ౧౩౬.

క. తడిసియుత్తి సన్నవలిపం,బిడి మణిపీఠస్థ
 యైన యింతి ... అను. ౬. ౧౨౭.

౨. సన్నవస్త్రము.

మ. వలిపంపుందెరమాటునం దిరుగు జాళ్వా
 మేలికీల్బొమ్మలన్, దెలనాథుల్ విరి
 చందువా మొకరి లేఁడెంట్లార్భటుల్ వేత్ర
 హస్తులు సామంతులు కొల్వుదెల్పు ...
 చంపూరా. ౨. ౫౬.

చ. ... వల్పముల నెచ్చెలి యొక్కతె తెచ్చి
 యిచ్చినన్ ... సుద. ౫. ౪౫.

౩. తెల్లబట్ట.

చ. వలిపము గట్టి హారములువైచి పటీరము
 మై నలంది జాగులు నెఱికొప్పునం దుఱిమి
 త్రోవనె పోయితిమేని దాఁకియుం,దలఁ
 చెడు వారులేరని మనంబుకలంకలు దేర్చి
 జారకాం,తల సమయస్థలంబులకుఁ దార్చిరి
 దూతిక లట్టి వెన్నెలన్. పారి. ౨. ౫౧.

**వలిపి(ల్పి)రి.** వి. (√ వలి) ౧. జల్లు, వాన
 కురియునపుడు చిందిపడునీటితుంపర.

గీ. పల్లమామూల వలిపిరి చల్లునిచట, నురియు
 నీచాయ నిద్రమై నుందు నచట, మహిత
 రామానుజోదీర్యమాణభాష్య, ముఖ బహు
 గ్రంథసామీప్యమునకుఁ జనకు ...
 విప్ర. ౩. ౭౭.

శా. సంపెంగల్పరు వంది త్రొవ్విరులచే శంపా
 లతాలక్ష్మినాం, దింపం బాదపము ల్ఘనంబు
 అయి పూఁదేనె ల్దువాళించి వర్షింప న్వల్పిరి
 చల్లి పాంథ జనరాజున్గమ్మగాడ్పు ల్చలిం,
 పింపన్మాధవుఁడంబుదాగతి విడంబించెన్
 విజృంభించుచున్. పి. శకుం. ౨. ౧౨౭.

౨. శైత్యము, చల్లఁదనము, చలి.

సీ. గుడిసె నెన్నఁడు చక్కఁగుడువ వల్పిరిఁ
 గొన్న గడలు గుత్రిల వడవడ వడంక ...
 రాజవాహన. ౨. ౭౦.

౩. వణఁకు, కంపము. (శ. ర.)

విశే. శీతము, చల్లనిది.

ద్వి. వలిపిరి గాలితో వడి మీఱిమీఱి, బలువిడి
 వానయుంపాచారమైన ...
 ద్వి. పరమ. ౪. (చి. ని.)

**వలిపిరిగొట్టు.** విశే. (వలిపిరి + గొట్టు) వణఁకు
 వాఁడు. (శ. ర.)

**వలిభము = వలినము.** సం. విశే. (అ. ఆ. అ.)

**వలిమల.** వి. (వలి + మల) హిమాద్రి, శీత
 నగము.

క. ... వలిమల, కానందపమూనునదితి
 గనియె శుభంబుల్ ... దాశా. ౫. ౪౪.

మణిగణనికరము. కలువలదొర కొఱగల
 తలవిరిగా, వలిమలలలి, నిలువఁ గడఁగు
 బసగాఁ గలుముల చెలువమగఁడు గడుఁ
 జెలిగా, మలయుచు జగముల మనుచు
 నొడయఁడా. అ. రా. అయో. ౧౧౯.

**వలిమలయల్లువాఁడు.** శివుఁడు.

చ. చెలినుదురున్ గడున్ దొరయ సేమముతో
 నెలకుండఁ గల్గెన, వ్వలిమలయల్లువానితల
 వాడని పువ్వయి ... యయా. ౪. ౪౩.

చ. వలిమలయల్లువాఁడు తలవాఁక ధరించిన
 పూవుగుత్తి ... పారి. పీఠి. ౬.

**వలిమిడి.** వి. పశువులకు కాలిమడమలయందుఁ
 గల్గు రోగవిశేషము. (శ. ర.)

**వలిమిన్న.** వి. (వలి + మిన్న) చంద్రుఁడు.

సీ. కననింపుఁ గూర్చు చక్రనిమోము వలి
మిన్న మనసార మున్ద్దు గైకొనఁగఁ దివురు.
చంద్రికా. ౪. ౨౦.

**వలిమిరి.** విణ. శీతము.

గీ. కర్షకుఁడు మెచ్చె వలిమిరి గాడ్పు హెచ్చె.
ఉ. రా. ౧. ౧౦౩.

**వలి(లీ)ముఖము.** సం. వి. అ. పుం. వానరము, క్రోఁతి. ఇట్లే వలి(లీ) వదనము.

**వలిమెట్టు.** వి. (వలి + మెట్టు) హిమాచలము.

సీ. వలిమెట్టు నాఁడు గావలిపట్టు దేవరసామి
గట్టుపై నేను సామినొడయ ...
చంద్రాంగ. ౨. ౪౫.

**వలిమొలక.** వి. (వలి + మొలక) ౧. వడముడి, భీముఁడు.

సీ. ... అనిలజుఁ డలగును వడముడి వలి
మొలకన ... ఆం. భా. ౨. ౧౭౨.

౨. ఆంజనేయుఁడు, హనుమ.

**వలియు.** అ. క్రి. ౧. డయ్యు, శ్రమనొందు.

క. సకలక్షత్రభయంకరు,నకు బార్హద్రథికి
ననిమొనన్ మార్కొనఁగ నో,పక వలియం
బాఱఁడె యీ,మురుకుందుఁడు భయాతిరేక
మునఁ బదిమాఱుల్.
భార. సభా. ౨. ౪౬.

సీ. ఎదిరినపోతుల నెవ్వానినైన నవారణ
నోడించి వలియుఁదోలు ...
హరి. పూ. ౬. ౧౨౪.

ద్వి. వలియఁ దాఁకెడు శిలావర్షంబుచేతఁ, బలు
దెసఁ జెడిపాఱు పతులలో యనఁగ ...
రం. రా. యు. ౪౪౫. పా. ౭. పం.

సీ. ... హరిరథంబు, గడపెడు నటె పరికర
మిట్టిదియుండ నెట్టు కర్ణునకోడి యిట్టు
వలియఁ, బాఱు తెంచితినీవు ...
భార. కర్ణ. ౩. ౬౧.

౨. సన్నగిల్లు.

సీ. వాఁకలఁ బడి నీరువలియఁ బాఱఁగ మిట్టు
లొండొండ వెలసి తృణోత్కరముల,
తుదలుపచ్చఁ దనంబుతోఁ దలసూపఁగ ...
హరి. పూ. ౮. ౧౭౬.

**వలిరుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఓర చూపు చూచువాఁడు. ౨. మెల్లకన్నువాఁడు.

**వలివెలుఁగు(ల్గు).** వి. (వలి + వెలుఁగు) శీతకిరణుఁడు, చంద్రుఁడు.

వ. ... మందయానల చెక్కుల వెలుంగు వలి
వెలుంగుం జూపి మీ మొగముల మిలమిలలు
గిలుబాడవచ్చెఁజూమీ వెన్నెల బచ్చు
ముచ్చు ... వసు. ౪. ౨౩.

సీ. వలివెల్గుతావెల్లువలు వాఱి మదనవహ్ని
జ్వాలికల వేఁడి నిగురఁ బోలు ...
వసు. ౪. ౬౬.

**వలిశము = బడిశము.** సం. వి. అ. న.

**వలీ(లి)కము.** సం. వి. అ. న. కొణిగ, ముంజూరు.

**వలుఁద(ల్ద).** విణ. స్థూలము.

సీ. వక్రాలకంబుల వలుఁదపిఱుందుల దర్ప
గద్గదభాషితములఁ జేసి, జనులచిత్తము
లకు సంక్షోభ మొనరించు కామినీ జన
ములు కలిగి ... భార. ఆది. ౭. ౮౪.

చ. ... బాలపై, వలువెడలన్ బయల్పడిరొ
వల్దకుచంబులుఁ గక్షయుగ్మమున్ ...
భార. ఆది. ౪. ౪౩.

చ. ... తొంటిలా,గునఁ దన కాయకంబు
కొఱకుం జని చాలవలుంద మీలఁ గైకొని
చనిరొక్క వీధి కెలకుం దగనమ్మెచు
నున్న యత్తరిన్ ... చెన్న. ౪. ౩౩౬.

మ. ... తీరైన ఫాలంబు చిత్రతరపుం జాడిక్క
వలుంద గుబ్బకవ వంతల్ గూర్పఁ దన్వం
గికిన్ ... కృ. శకుం. ౨. ౧౮.

చ. జల జల దుల్లు పర్ణముల చప్పుడు లక్కడఁ
జూడఁ జూడఁ బై,నెనమెడు వల్దమోసు
లును నేర్పడు కెందలిరాకుజొంపమున్ ...
కు. సం. ౬. ౮౭౮.

సీ. వలుఁద నీకట్లలో వ్రాలు చుక్కలు వోలె
వేణీభరమ్ములో విరులు వ్రేల ...
ఉ. హరి. ౫. ౨౮౬.

**వలుకు** = **వళుకు.** వి. తగువు.

క. దగ్గఱఁ బోరా దగ్గికి, వెగ్గలమై యున్న
దార వీరలతేజం, బగ్గలిక పలుకు వలుకుల,
నీగ్గులచేటయ్యె నేమిసేయుదమింకన్.
ఘటికా. ౨. ౧౧౨.

**వలుము.** వి. మోసము.

సీ. దుగుణంబు సేసిన తోడనే మూఁడని
వారించి వేదని వలుముసేసి ...
ఉ. హరి. ౩. ౧౨౨.

**వలువ(ల్వ)** = **వలువు.** వి. వస్త్రము, సన్న
వస్త్రము.

సీ. కల్పవృక్షంబులు గలుగఁగ నేఁటికి వలు
వలకై తంతువాయ సమితి ...
కాశీ. ౩. ౨౦౧.

గీ. వస్త్రనామంబు చెలఁగును వలువవలువు ...
ఆం. భా. ౨. ౧౫౧.

రగడ. వలిచలువలు చనువలువలు చొచ్చెన్,
జలి పచ్చడములు చలి పొరలెచ్చెన్,మూల
కొదిగెఁ దుది ముదుగుంగోకల్ ...
బహు. ౨. ౧౩.

చ. అనిమద నాతురుండగు నిజాధిపు చెప్పిన
మాటయేర్పడన్, విని వినయమ్మ భక్తియు
వివేకముఁ బ్రీతియు నగ్గలింప న,వ్వనిత
కడుం బ్రయత్నమున వల్వ దృఢంబుగ
గట్టి లంకెకున్, ధనమొనువంగఁ బుచ్చి
కొని నాథుని మూఁపునఁ తాల్చిచెచ్చెరన్.
మార్క. ౨. ౧౬౪.

గీ. తొడల బెడఁగారు నునువల్వతోడనడుపు,
రతికళాసించి వచ్చిన రమణ మెఱయఁ,
గొలను వెలువడివచ్చి రా జలజముఖులు ...
విక్ర. ౫. ౬౧.

సీ. ఎడపక గీమునకేతెంచు విందుల కెలమి
వల్వలును సొమ్ములు నొసంగు ...
నీలా. ౧. ౪౯.

**వలువు** = **వలువ.** వి. బట్ట, వస్త్రము.

సీ. బంగారు వలువున రంగారు కటిమీఁదఁ
జిక్కఁగా నొక్కహస్తంబుసాచి ...
కళా. ౨. ౧౫౭.

మధురగతిరగడ. పదియార్వన్నియ బంగరు
వలువును మెదలెడి తళుకుల మేఖల చెలు
వును ... కళా. ౭. ౨౩౨.

గీ. వస్త్రనామంబు చెలఁగును వలువవలువు ...
ఆం. భా. ౨. ౧౫౧.

**వలూకము.** సం. వి. అ. పుం. పక్షివిశేషము,
ఒకజాతి పిట్ట.
వ. తామర దుంప.

**వలె.** అ. క్రి. ("వలయు" నకాదేశముగా
వచ్చురూపము) ఆవశ్యకమగు.

(ఇయ్యది తఱచు అన్నంత క్రియలతో నను
ప్రయుక్తమగుచుండును)

ఉ. ... భా,పావరు పాలికిం జని నిశాట వరే
ణ్యుల బాధచెప్పి దే,వావలె మాకునొక్క

ప్రకంప గుణసూచన లేమియు వల్ల
కావు ... పారి. ౧. ౪౩.

ఆ. వల్ల నైపు లేక వాగ్దత్తమటు చేసి, యదిగో
యిదిగో యనుచు నాసబెట్టి, గడువుబెట్టి
రేపు గడియగా నిమ్మని, గడియలోనఁ
బడియొఁ గదరవేమ ... వేమ. ౩. ౨౭.

వి. నైపుణ్యము, నేర్పు.

ద్వి. అనవుడు తరుణి కిట్లనియె నర్జునుఁడు,
వనిత సారథ్యంబు వల్లనే నెఱుఁగ, నీవు
వచ్చితిగాన నీవేడ్కనాకుఁ గావింప
నుండుటగా దెన్ని విధుల ...
విరాటపర్వము. ౨. ౩౧. పా.

జ: వల్లగట్టు.

**వల్ల²** = వలన. ప్ర. ద్రు. పంచమీ విభక్తి
ప్రత్యయము.

గీ. ఆ రమణివల్ల సంశయం బేరుపడక, పడక
యిలు వెళ్లి వచ్చి భూపాలుఁ డపుడు ...
సారంగ. ౩. ౧౫౮.

సీ. తన వల్లఁ బుట్టిన దనక మహామాయనాదిని
జేపట్టి పోయిసెంద ...
పార్వ. ౮. ౧౦౨.

సీ. పల్లవాధర యల్ల మొల్లతీవల వల్లనెల్ల
తావులఁ దావు లుల్లసిల్లె ... దశా. ౩. ౭.

గీ. అదియునా వల్లఁ దెలిసి యయ్యధిపవర్య,
కటకమని తెల్వసరిగితి గాద మున్న ...
కుపల ౮. ౧౬౮.

**వల్లకాడు.** వి. దే. (వల్లడి + కాడు) దశా.
౩. ౭. శ్మశానము.

(వల్లడి = అకారణమైన యాపద)

గీ. అఖిల తీర్థప్రదేశంబు లడవులిండ్లు, యజ్ఞ
వాటికవల్లకా డను విభేద, మించుకయు
లేదు భీమనాథేశుభూమి, జంతువులు శంభు
లగుదురు చచ్చినపుడు ...
భీమ. ౮. ౩౮.

గీ. అబ్బనే నేఁడు మీకు మధ్యాహ్నభిక్ష,
బ్రహ్మపురివాడఁ గాశికా పట్టణమున,
నబ్బదోనాక పోలె మహర్షులార, వాడ
వాడల నీ పెద్ద వల్లకాట ...
కాశి. ౪. ౧౩౭.

చ. ... దుష్కరమగు వల్లకాటి కధికారము
వచ్చిన దుష్టబుద్ధికిం, గరుణదలంప నెక్క
డిది గంధ గజేంద్ర సమానగామినీ ...
హరిశ్చ. ౫. ౯౨.

**వల్లకి.** సం. వి. ఈ. స్త్రీ. వీణ, వీణియ.

**వల్లగట్టు.** స. క్రి. (వల్ల¹ + కట్టు) శుచిగాఁ
జేయు, పరిశుద్ధ పఱుచు.

ద్వి. చల్లగాఁ బూవు వాసన కట్టితెచ్చి, వల్ల
గట్టిన రసావళ్లు సంబళ్లు ...
అ. వ. క. ౫. ౨౮౭. పా. ౨౮. పం.

**వల్లడ.** వి. పక్షి విశేషము.

సీ. జిట్టువముసగ పూజిట్టువ గిజిగాఁడు వల్లడ
పాడిపిట్ట వంగపండు ... హంస. ౩. ౧౨.

**వల్లడి.** వి. ౧. అకారణమైన యాపద.

౨. కొల్ల. (శ. ర.)

(చూ. వల్లడికాఁడు)

జ: వల్లకాడు, వల్లకాఁడు.

**వల్లడికాఁడు.** విశే. (వల్లడి + కాఁడు.)

౧. అకారణమైన యాపద చేయువాఁడు.
(చి. ని. శ. ర.)

౨. కొల్లపెట్టువాఁడు.

సీ. దొంగ తెక్కలికాఁడు దొరకోలు సన్నాసి
ముచ్చుత్రొబరికాఁడు ముడియ విడుపు, తెరు
వాటు కాఁడు కత్తెరదొంగ చేవాఁడి
కాఁడు వల్లడికాఁడు కన్నగాఁడు, ముని
ముచ్చు గడి దొంగ యనఁ దస్కరాఖ్యలౌ.
ఆం. సం. మాన. ౧౧.

**వల్లభ.** సం. వి. ఆ. స్త్రీ. ప్రియురాలు, భార్య, ఇల్లాలు.

**వల్లభపాలుఁడు.** సం. వి. అ. పుం. గుఱ్ఱపువాఁడు, అశ్వరక్షకుఁడు.

**వల్లభము.** సం. వి. అ. పుం. మేలిజాతిగుఱ్ఱము.
విణ. (అ. ఆ. అ.) ప్రియమైనది.

**వల్లభాయితము.** సం. వి. అ. న. పురుషాయితము, ఉపరతి.

**వల్లభుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రియుఁడు, ఇష్టుఁడైనవాఁడు. ౨. ఉత్తముఁడు, గొప్పవాఁడు.

వి. అ. పుం. ౧. ప్రియుఁడు, భర్త, రమణుఁడు. ౨. పై విచారణ చేయువాఁడు. ౩. పెద్ద గొల్ల, గొల్లలలో ముఖ్యుఁడు.

**వల్లము = వల్లువము.** వి. వరహాల జాలె.

ఉ. ఉల్లము జల్లనం గలఁగి యొక్కెడఁ
దక్కెడ కోలవైచి పేఁ,డొల్లడొ కాని విద్య
లని యుంటిఁగదా యని కొంత చింతతో,
వల్లము పాఱవైచి కొని వైశ్యుని జాడ
నిజంబు గానవం, జిల్లరచేరము ల్విడిచి
చేరి కుమారునిఁ దండ్రి యిట్లనున్.
బహు. ౫. ౧౫౫.

ఉ. అల్లనమంద భాగ్యుఁడగు నాతఁడు పేవి
ధులం గృశించియున్, వల్లము పచ్చగాక
పసివాడిన మోమునఁ దా నివృత్తుఁడై,
తెల్లముగా సుహృత్తతులఁ దెమ్మని వేడిన
వంచనామతిన్, గల్లలఁ బల్కె నాతఁ
డెలుకర్దిసెఁ ద్రాసని యాసపెంపునన్.
వేం. పంచ. ౧. ౮౮౪.

సీ. వల్లంబు పోనాడు వైశ్యుని శేవను ...

గీ. చికిలి సెలవన్నె కాండ్రకు శివములెత్త,
నెనసి బరియించు వీఁట నా హేమరేఖ.
హంస. ౧. ౨౨౦.

**వల్లము.** సం. వి. అ. పుం. ౧. ఆచ్ఛాదనము, కప్పు. ౨. మూఁడు గురివెంద గింజల యెత్తు. ౩. (వైద్య) ఒకటియునర గురివెంద గింజల యెత్తు, రెండు గురివెంద గింజల యెత్తు (రా. ని.) ౪. మాషమెత్తు వెండి. ౫. నిషేధము.

**వల్లరము.** సం. వి. అ. న. ౧. అగురుచెక్క. ౨. కుంజము, పొదరిల్లు, ౩. గహనము, సాంద్రారణ్యము. ౪. పూలగుత్తి, మంజరి.

**వల్లరసి.** వి. ఒకానొక చెట్టు. (శ. ర.)

**వల్లరి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. ౧. తీఁగ, లత. ౨. మంజరి, పూలగుత్తి. ౩. చిత్రమూలము †. ౪. మెంతి †. (రా. ని.)

**వల్లవి.** సం. వి. ఈ. స్త్రీ. గొల్లత, గోపాంగన.

**వల్లవుఁడు.** సం. వి. అ. పుం. ౧. గొల్ల, గోపుఁడు. ౨. భీముఁడు. ౩. వంటవాఁడు.

**వల్లి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. ౧. లత, తీఁగ. ౨. పుడమి, భూమి. ౩. ఓమము †.

**వల్లించె.** స. క్రి. ౧. ఆమ్నాయము చేయు.

ద్వి. పలుమరు మునిప్రేళ్ల పసలెన్నుచును, వల
నొప్ప సాగరకు వల్లించుకొనుచు ...
ద్వి. పరమ. ౨. ౧౨౬. పొ.

౨. అభ్యసింపఁ జేయు, నేర్పు, కఱపు.

మ. ... వల్లించు శ్రీరామ నామసుధా
మాధురి సాధురీతి ... బింబోష్ఠిరా చిల్క
కున్ ... పాండు. ౪. ౨౨౮.

జ: వల్లింత.

వల్లింత. వి. (√ వల్లించు) తిట్టు (బోతు) ఒకానొక తిట్టు.

సీ. తన్పనగొండి పోతరకత్తె కల్లరి వల్లింత మాయల బెల్లి కట్టికి ... చెన్న బ. ౨. ౨౪.

వల్లికి. వి. మత్స్యభేదము; ఒకజాతి చేప.

సీ. వాలువమును దొమ్మ వల్లికి గండెకల్లరజు బేడిస... వేం. పంచ. ౧. ౫౯౪. (బి. ని. పా.)

వల్లిగము. వి. బొక్కెనమోఁది యినుపవలయము. (శ. ర. భ్రా.)

వల్లియ = వల్లె. వి. వల్లెత్రాడు, పశుబంధన రజ్జువు.

గీ. వల్లియలు వైచి యీడముల్పల్లు ద్రవ్వి తార్చియే సరియూరు లూర్చి తటిని దయ్యఁ, దోలి రోటాటలె పోనీక దొడ్డిసాఁగి, పొడువ నడువను నలుదెసఁ బొంచియోడి ... హరి. పూ. ౬. ౧౫౫.

క. వల్లియలు ద్రెంచుకొని బల, మెల్లను బెల్లగిలఁజొచ్చి యెంతయు నలుకన్, గెల్లువడి సురభిహుంకృతి, మల్లడిగొను ప్రజల మారి మసఁగఁ దొడంగన్. పద్మ. ౭. ౨౬౫.

౨. ఆకర్షకము, వశీకరణము.

సీ. అరవిరి విరులఁ గ్రొత్తలి యితర సౌరభలోలు భద్ర భోగులబులకు వల్లియలగుబ్బొండు మల్లి తీగలను ... విప్ర. ౨. ౨౫.

జ : వల్లియత్రాడు, వల్లియత్రాడు దాల్పు.

వల్లియత్రాడు = వల్లెత్రాడు. వి. (వల్లియ + త్రాడు)

౧. పశుబంధన రజ్జువు.

ద్వి. త్రిద్రిత్రాళ్ళు వల్లియ త్రాళ్ళు జల్లెడల్లు నురిత్రాళ్లు పగ్గంబు లుగ్గంబులురులు ... అ. మ. క. ౧. ౪౫. పా. ౨౦. పం.

౨. వరుణు పాశము.

(చూ. వల్లియత్రాడు దాల్పు.)

వల్లియత్రాడుదాల్పు. వి. (వల్లియత్రాడు + తాల్పు) వరుణుఁడు.

క. కలఁచి వేల్పుఱేని నుడిగంబులఁ బూన్చితి నగ్గిసజ్జమున్, గెలిచితి సోఁకు పెద్దనశెఁ గించితి వల్లియత్రాడు దాల్పుఁ జక్కఁ బెరయించితిన్ ... అ. రా. యు. ౪౯౬.

ఆ. మేటినీరుమూలి మెయితాలుపులసామి, వల్లెత్రాడుదాల్పుల నీళ్లరాయఁడేటి బోటి మగల యొకిమీఁదు పడమటి, దొర యనంగ నొప్పు వరుణుఁ డీశ. ఆం. నం. దేవ. ౨౧.

వల్లిసూరణము. సం. వి. అ. పుం. పుల్లబచ్చలి ?. (శ. ర.)

వల్లీజము. సం. వి. అ. న. మరిచము, మిరియము.

వల్లీబదరి. సం. వి. ఈ. స్త్రీ. నేలరేను ?.

వల్లీదూర్వ. సం. వి. ఆ. స్త్రీ. తృణవిశేషము, ఒకజాతిగడ్డి.

వల్లీముద్గము. సం. వి. అ. పుం. వనముద్గము, అడవి పెసరు ?.

వల్లీవృక్షము. సం. వి. అ. పుం. సాలవృక్షము, మద్దిచెట్టు.

వల్లురము. సం. వి. అ. న. ౧. పొదరిల్లు. ౨. గహనము, దట్టని యడవి. ౩. మంజరి, పూలగుత్తి. ౪. సేద్యము చేయని పొలము. ౫. నిర్జలప్రదేశము. ౬. పచ్చిక బయలు.

గాఁగవాఁ డాలమందలఁ గాచు బాళి,
నడవి మానిసిరైు తిరుగాడు నెపుడు.
శుక. ౨. ౫౪౫.

వల్లెత్రాడులాఁడు = వరుణుఁడు.
ఆం. భా. ౧. ౫౧.

వల్లెలు. వి. బ. వస్త్రవిశేషము.
సీ. వల్లెలు విడ్డంచు వలిపాలు బరులును పట్టు
జిబ్బులు మంచి పరకతాలు ...
ధనా. ౩. ౩౮.

వల్లెవాటు = వలెవాటు. వి. (వల్లె + పాటు.)
౧. ఉత్తరీయమును రజ్జువువలె మెలిపెట్టి వైచి కొనుట.
చ. వల్లెవాటుగ భుజాగ్రము నందగు మేలి
జాళువా, జినుఁగు మెఱుంగు బంగరపుచేల
చెఱంగు ... దశా. ౨. ౩౪.
౨. రజ్జువువలె మెలిపెట్టి వైచికొన్న యుత్తరీయము.
సీ. బంగారు జిలుగు దుప్పటి హొయల్ జిగి
బిగి నీటు మీఱఁగ వల్లెవాటువేసి ...
రామ. ౧౦.
గీ. జిలుగు చెంగావి దట్టిపైఁ జెక్కుకొన్న,
వంకి దులకించఁ బసిఁడి దువ్వలువ వల్లె
వాటు నెఱనీటు గులుకఁ బావాలుమెట్టి,
రాజ దేవేంద్రుఁ డంతఃపురంబు వెడలె.
ఉ. రా. ౭. ౩౯౫.
సీ. చెలువ గట్టినచీర మొలఁగొంతఁ గట్టి
యా సగముపై వల్లెవాటుగ నమర్చి ...
వైజ. ౨. ౪౫.

వల్లెవేయు. స. క్రి. (√ వల్లె[1]) మరలమరల పఠించు.
ఉ. మెల్లన వానిడగ్గఱి సమేలపు మాటలు
వల్లెవేసి నీ, యుల్లసితాంఘ్రిపద్మముల
కొప్పన చేసెదనేల చింతిలన్ ...
తపతీ. ౩. ౬౨.

వల్లే = వల్లెః. అవ్య. అంగీకారార్థకము.
క. అని యానతియ్య వల్లే, యనుచు ను శీసరథ
రావరాగ్రణి ప్రమదంబును జెంది ...
కవిజ. ౩. ౨౪.

వల్వము = వలువ. వి. వస్త్రము.
గీ. పసుపుఁబొడి తోలువల్వంబు నొసఁగ
మెసఁగ, ... అను. ౬. ౬.
(శ. ర. వేదం. పా; "తోలు పల్లంబు" వావిళ్ల పా; "తోలు వల్వయు," వ్రాత ప్రతి. పా.)

వళంద. వి. ఒకానొక పట్టణము.
గీ. ఈడము వళంద బందర యింగిలీషు, కలము
కొండలైన పేఁటల గారలెల్ల సౌరభద్రవ్య
ములు బేర సారమాడఁ, బిలువనంపిరి తమ
తమ పేఁటలకును. హంస. ౧. ౧౧౨.

వళాగ్రము. వి. ఒకజాతి వక్క, క్రముకభేదము. (శ. ర.)

వళావళి. వి. కుతూహలము, వేడుక.
ఉ. అంబురుహాక్షి నాసిక నిజాన్వయ శత్రువుఁ
జంపక ప్రసూనంబుఁ గరంబు గెల్చుట
మనంబునఁ బెట్టి తదీయపార్శ్వయుగ్మం
బున నిత్యసేవకతఁ గ్రాలెడు నీక్షణతార
కాఖ్యరో, లంబకదంపతుల్ పెను వళా
వళి నెంతయు సంభ్రమించుచున్.
ప్రభా. ౨. ౭౦.
౨. విజృంభణము.
చ. అళులకు డాఁగుటో హాల హలాహల భీకర
మత్తకోకిలా, వళులకు డాఁగుటో విపుల
వైరి మదాళుల నేయుని వ్వళా, వళులకు
డాఁగుటో ... భానుమ. ౩. ౨౬.

సీ. కినిసి మాటలు నేరవనుచు శిక్షించితే
చిలుక కేటికి వళావళి యొనర్ప ...
వేం. పంచ. ౪. ౧౭౩.

౩. చప్పుడు, ధ్వని.

సీ. అంచనేతెంచు రాయంచజాడ నదల్చి
కళుకుటందెల వళావళులతోడ ...
ఇంద్ర. ౩. ౨౭.

**వళుకు.** వి. ౧. తగవు, వివాదము.

చ. చిలుకకు మావికిం బగలుసేయకురే లత
కూనలార వే, వళుకులువచ్చు నీఁద బలవం
తుఁడు కంతుఁడు ... కళ. ౧. ౧౩౦.

ద్వి. మన వారి వళుకు సమ్మతిని తీర్చెదను ...
ద్వి. పరమ. ౬. ౪౭౭.

౨. అపవాదము.

గీ. చుట్టముల కెల్ల వళుకులు గట్టి యురక,
ప్రజకు బందెలు గొల్పఁగఁ బ్రౌఢుఁడీవు,
పాములకుఁ బాలు పోసినపగిది నీకు,
మేలు చేసినఁ బొమ్మింకఁ జాలు భద్ర ...
శేష. ౩. ౧౯౨.

వ. ఎగురువారలు బలిమి వళుకులు వైచి పంత
ముల కొలారిక లంపెడి జిత్తులును ...
ప్రబంధ. ౧. ౭౮.

౩. మోసము.

ద్వి. ... అమ్మాని వల్లభుఁడు, దిచ్చరి యగు
నట్టి దీని మాటలకు, వచ్చెనా నిలువెల్ల
వళుకుల పుట్ట ...
ద్వి. పరమ. ౪. ౩౩౭. పూ.

సీ. అనుమానమైన వాఁడర్థంబు లిచ్చిన
వళుకుగా నెంచు విశ్వాసపడఁడు ...
నీతి. ౭౬.

విశే. వదులైనది.

సీ. పెట్టి చేతంగొని చేతడియారదే ముక్కార
పదిలమే ముకురవదన, రౌరవుల సొమ్ము
వాకిడినది వళుకింత యిటుల చేసీచకే
చటులనయన, నీమీఁది చూపె మన్నె
కొమాళ్ల కొకవింత గుట్టుతో నుండవే
కుందరదన. రావి. ౫. ౬౬.

**వశ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. స్త్రీ. ఆఁడుది.
౨. భార్య. ౩. కూఁతురు. ౪. భర్తతోఁ బుట్టి
నది. ఆఁడుబడుచు. ననంద. ౫. ఆవు.
౬. గొడ్రాలు, వంధ్య. ౭. గొడ్డావు. ౮. ఆఁడే
నుఁగు, కరిణి.

**వశంవదుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) విధే
యుఁడు, లోఁబడినవాఁడు.

**వశక్రియ.** సం. వి. ఆ. స్త్రీ. జయించుట,
లోఁబఱుచుకొనుట.

**వశగ.** సం. వి. ఆ. స్త్రీ. విధేయురాలగు భార్య,
చెప్పినట్లు చేయు పెండ్లము.

**వశగుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) విధేయుఁడు,
లోబడినవాఁడు.

వి. అ. పుం. భృత్యుఁడు, సేవకుఁడు.

**వశమగు.** మి. అ. క్రి. సమర్థమగు.

వశముగావు = సమర్థములుగావు.

క. విను మలుక వోడమి మిక్కిలి, కనుదెఱచిన
త్రిపురవైరికైవడి యీ యర్జుననందుఁ
దోఁచు చున్నది, మన మొనలున్ వశము
గావు మరలుపు మింకన్ ...
భార. భీష్మ. ౨. ౯౩.

**వశము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. లోఁబడి
నది, స్వాధీనమైనది. (సమాసాంతమునందు.)
౨. విధేయమైనది, చెప్పినట్లు చేయునది.
౩. మచ్చిక చేయఁబడినది. పెంచఁబడినది.
౪. మంత్రతంత్రాదులచేత వశము చేసికొనఁ
బడినది. ౫. శక్యము.

క. శ్రుతివిహితకర్మజాత, స్థితియోగ్యుఁడవైన నీకుఁ జేయఁగ వశమే, యతిలోకజ్ఞాన సమన్విత యతిజన కృత్య మటు వివేకింపు మెదన్ ... భార. శాం. ౧. ౬౧.

వి. అ. పుం. న. ౧. ఇచ్ఛ, కోరిక. ౨. ప్రాబల్యము, ప్రాభవము, స్వాధీనత, లోకువ, లోఁబడుట.

౩. మచ్చికయగుట. ౪. పుట్టుక.

పుం. వేశ్యాగృహము.

**వశవర్తి.** సం. విణ. (న్. నీ. న్.) విధేయుఁడు, లోఁబడినవాఁడు.

విన్. పుం. భృత్యుఁడు, సేవకుఁడు.

**వశానుగుఁడు = వశవర్తి.** సం. విణ. (అ. ఆ. అ.)

అ. పుం. భృత్యుఁడు, సేవకుఁడు.

**వశి.** సం. విణ. (న్. నీ. న్.) ౧. ప్రాబల్యము గలవాఁడు. ౨. ప్రాభవము గలవాఁడు, లోఁబడినవాఁడు, విధేయుఁడు. ౩. ఇంద్రియనిగ్రహముగలవాఁడు, ఇంద్రియములు జయించిన వాఁడు.

వి. ఇ. పుం. ౧. లోఁబఱుచుకొనుట, వశపఱుచుకొనుట. ౨. మంత్రించుట. న. పరతంత్రత.

**వశికము.** సం. విణ. (అ. ఆ. అ.) ఉత్తిది, శూన్యమైనది.

**వశిత.** సం. వి. ఆ. స్త్రీ. ౧. లోఁబఱుచుకొనుట, స్వాధీన పఱచుకొనుట, మంత్రముచే వశపఱుచుకొనుట.

**వశిత్వము = వశిత.** సం. వి. అ. న.

**వశిని.** సం. వి. ఈ. స్త్రీ. శమీవృక్షము, జమ్మిచెట్టు.

**వశిరము.** సం. వి. అ. పుం. ఒక దినుసు మిరియము.

న. సముద్రపు టుప్పు.

**వశీకరణము.** సం. వి. అ. న. ౧. లోఁబఱుచుకొనుట; మంత్రాదులచే వశము చేసికొనుట. ౨. ఆకర్షించు సాధనము లేక మరులు కొలుపు సాధనము.

**వశీకరించు.** సం. స. క్రి. లోఁబఱుచు, స్వాధీనము చేయు.

ద్వి. అరయ సజాతీయులగు వారిచేత, చిరజీవతనుల వశీకరించెదను ...

ద్వి. పరమ. ౧. ౨౫. పా.

క. ఇట్లు వశీకరించి యందఱం గళిందకన్యాతీరకాంతారంబుల కెలయించిన ...

హరి. పూ. ౮. ౧౩.

**వశ్య(క.)** సం. వి. ఆ. స్త్రీ. విధేయురాలగు భార్య.

**వశ్యము.** సం. వి. అ. న. లవంగము.

**వశ్యుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. వశము చేసికొనఁ దగినవాఁడు, లోఁబఱుచుకొనఁ దగినవాఁడు. ౨. లోఁబడిన వాఁడు; విధేయుఁడు.

వి. అ. పుం. సేవకుఁడు, భృత్యుఁడు.

**వశ్యౌషధము.** సం. వి. అ. న. పెట్టుమందు. (శ. ర.)

**వషట్కారము.** సం. వి. అ. పుం. వషట్ అని యుచ్చరించుచు హవిస్సును హోమము చేయుట.

**వష్క-(ష్క)యము.** సం. వి. అ. పుం. ఏఁడాది యీడుగల దూడ, తఱపిదూడ.

**వష్క-(స్క-)యి(య)ణి** = బష్కయిణి.

సం. వి. ఈ. స్త్రీ. చిరకాలముక్రిందట నీనిన యావు, తఱచి దూడగలయావు.

**వస**[1]. వి. (సం. వచా) ఓషధీ విశేషము, ఉగ్రగంధ తీ.

చ. ... లేజవరాలు చెక్కు గీటిన వస వల్చు బాలకుఁడు డెందమునం గలఁగంగ నేర్చునే ... నైష. ౧. ౧౭.

క. ... చెక్కడిచిన వసరాలెడు, నిక్కము నా కోలుతలకు నిలువఁగఁ గలవే ... విక్ర. ౬. ౮౩.

గీ. బిట్టు మొరసెదు వస త్రాగినట్టు ... నీలా. ౩. ౨౯.

(వ్యవ.) వసత్రాగిన పిట్ట.

**వస**[2] = **వసము.** విశే. శక్యము, వశము. (సం. వశః.)

క. ... అలగంగ నిసుక చెప్పటి, వలె ఘటముం జేయఁబోయి వసగాకున్నన్ ... దశా. ౬. ౭౭.

క. తన కాప్తియైన తానము, లనియని వస కాక కాఁక నతివిహ్వలుఁడై, ముని యున్న ... సమీర. ౬. ౨౧౮.

ద్వి. రసికుండ వేనియు వసదక్కె యాత్మ, నుసిలిన మటిమీఁద నోరత్తఁ గలవె ... పండితా. పురా. ౧౧౪. పా.

**వస.** సం. వి. ఆ. స్త్రీ. ౧. మజ్జ, క్రొవ్వు, కరఁగిన క్రొవ్వు. ౨. మెదడు, మేదస్సు.

**వసంత.** వి. రాగవిశేషము.

సీ. గౌళనారాయణగౌళవసంతవరాళి పున్నాగవరాళి శంక, రాభరణము ... రామక్రియయు మేళ రామక్రియ వసంత సామంత శుద్ధ వసంతమధ్య, మాదులు. ప్రబంధ. ౧. ౯౭.

**వసంత కుసుమాకరము.** సం. వి. అ. పుం. ప్రమేహములను బోఁగొట్టెడి యౌషధవిశేషము.

**వసంతగంధము.** సం. వి. అ. పుం. తుంగ వృక్షము. (బ్రౌ. ని.)

**వసంతఘోషి.** సం. వి. న్. పుం. కోకిలము, కోయిల. (బ్రౌ. ని.)

**వసంతజ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. వాసంతి, మాధవీలత. బండి గురివెంద తీ. ౨. వసంతోత్సవము.

**వసంతతిలక.** సం. వి. ఆ. స్త్రీ. (ఛంద) ఒకానొక వృత్తము.

**వసంతతిలకము.** సం. వి. అ. న. (ఛంద) వృత్తభేదము. ప్రతిపాదమునను వరుసగా త, భ, జ, జగణములు రెండు గురువులును పదునాలు గక్షరములునుగల యొకానొక వృత్తము.

**వసంతదూత.** సం. వి. అ. పుం. ౧. కోకిలము. ౨. చైత్రమాసము. ౩. హిందోల రాగము. (దీనిని శిశిర వసంత ఋతువుల సంధిని పాడుదురు.) ౪. చూతము, మామిడి చెట్టు.

**వసంతదూతి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. పాటలీ వృక్షము. ౨. ఆఁడు కోకిల. ౩. మాధవీలత, బండి గురివెంద తీఁగ.

**వసంతద్రుమము.** సం. వి. అ. పుం. ఆమ్ర వృక్షము. మామిడిచెట్టు.

**వసంతపంచమి.** సం. వి. ఈ. స్త్రీ. మాఘశుక్ల పంచమి.

**వసంతబంధువు.** సం. వి. ఉ. పుం. మన్మథుఁడు.

**వసంతము.** వి. పసుపు సున్నము కలిపిన యెఱ్ఱని జలము.

రగడ. ... సతతమును గంధపు వసంతములుఁ బంతములు, వ్రతులకును సయ్యో రసవంతములు కాంతిములు ... రాఘ. ౨. ౬.

క. అంతట నాగసరంబుల, నింతులు తానముల మిగుల హెచ్చింపుచు సామంతము పరవన్ బువులువ, సంతములోను గనుఁగొనుచుఁ జనుదే మతిచూన్. యయా. ౪. ౧౫౮.

సీ. మొదమున కొగయు చన్గవపైని నునుమోవి తళుకు గుంకుమవసంతములు చల్ల ... దశా. ౨. ౨౭౩.

జ : వసంతములాడు.

**వసంతము.** సం. వి. అ. పుం. ౧. చైత్రవైశాఖ మాసాత్మకమైన యొకానొక ఋతువు. ౨. (సంగీ) రాగవిశేషము. ౩. అతిసారము, రోగవిశేషము.

**వసంత(మా)ములాడు.** అ. క్రి. (వసంతము + ఆడు) వసంతము చల్లుకొను.

చ. ... ఇందఱము ధనుష్యులమైతి మటంచుఁ బుట్టముల్, చపలతఁ ద్రిప్పి పువ్వుల వసంతములాడుచుఁ బాడుచున్ గతిత్రపులయి యాడుచుం బ్రజలు దద్దయుఁ బండుగ సేసి రల్లెడన్ ... భాగ. ౯. ౩౧౮.

స. క్రి. చల్లుకొను.

గీ. తగవుదప్పని జగడమీ తరుణులందు, నూటి వడి మేలుమేలని జోకఁ జెలులు, సరస మాడంగ విరుల వసంతమాడి,రా లతాంగులు పంకేరుహాకరమున. కవిరా. ౪. ౯౮.

(వసంతము, పారాణి కలిపిననీరు వివాహాది శుభములందుఁ బరిహాసార్థము వసంతము చల్లుకొనుట యాచారము.)

మ. ... కటిస్థలిపై వేనలి మొగ్గ వ్రాల నడుగుల్ చండింప నేత్రాంబుజంబులు గన్నీట వసంతమాడ నరిగెం బూఁబోఁడి ఖేదంబునన్ ... సారంగ. ౩. ౪౪.

(ఇట స్నానముచేయుట అనిభావము.)

**వసంతయోధుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు.

**వసంతవిలాసములు.** సం. అ. పుం. వి. బ. వస్త్ర విశేషము.

వ. ... నాగ బంధంబులును బూజాబంధంబులును జలపంజరంబులును కామవరంబులును ...... ద్రౌపదీ స్వయంవరంబులును ...... వసంతవిలాసంబులును రత్నకీలితంబులును ...... ధరియించి ...... ద్వా. ౩. ౨౦౬.

**వసంతసఖుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు.

**వసంతావతారము.** సం. వి. అ. పుం. వసంత ఋతువురాక, వసంతప్రారంభము.

**వసంతుఁడు.** సం. వి. అ. పుం. ౧. మన్మథునికి సహచరుఁడుగా నెంచఁబడెడు నొకదేవుఁడు. ౨. నాటకములందు విదూషకుని మాఱుపేరు.

**వసతి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. ౧. వసించుట, ఉనికి. ౨. వాసస్థానము, ఇల్లు. ౩. ఆస్పదము, స్థానము. ౪. శిబిరము, మార్గమధ్యమున నాఁగెడి బస. ౫. రాత్రి. ౬. జైనమఠము.

**వసథము.** సం. వి. అ. న. ౧. బస, మార్గమధ్యమున అఁగెడు చోటు.

౨. పిట్టగూడు.

**వసది.** వి. (సం. వసతిః) బుద్ధాలయము.

ద్వి. అరయ నేకాంత రామయ్య శాపమున, సరిబబ్బులారి వసది గూలినట్లు ...
పండితా. మహిమా. ౨౫౪.

ద్వి. వసదులన్నియు బ్రచ్ఛిన్నైసెంచెఁగాదె ...
బస. పు. ౧౪౪. పా. ౧౫. పం.

**వసనము.** సం. వి. అ. న. ౧. వసించుట, బస చేయుట. ౨. ఇల్లు, గృహము. ౩. బట్టలుధరించుట. ౪. వస్త్రము, బట్ట. ౫. స్త్రీకటిభూషణము, మొలనూలు. మొ.

**వసనాభి.** వి. విష విశేషము. వత్సనాభి. (బ్రౌ. ని.)

**వసపడు.** అ. క్రి. (వసము + పడు) శక్యమగు.

క. వసుధం బుత్త్రాదిక గుర్వ్యసనము సైత మును దండ్రి వారించుటకున్, వసపడదఁట మతిరాజ్య, వ్యసనము వారింప నెంత వాఁడెవ్వాఁడున్. ఆము. ౪. ౧౯౨.

**వసపోవు.** అ. క్రి. (వసము + పోవు) శక్యమగు, వశమగు.

సీ. పవిచేత వసపోనిదివిజేంద్రపురిపై పోవితతికి నిదిగదా నెలవిత్తు ...
చం. రా. ౩. ౪౫.

మ. ... ఎదిరింపన్ వసపోక భీతిలిరి దేవేంద్రాదు లుర్వీశ్వరా ... ఉ. రా. ౪. ౩౨౬.

సీ. వడిగాలి వడినిల్వ వసపోక చలితంపుసరి పెణల్ దునియ వేసరక నిగుడు ...
శుక. ౧. ౧౩౦.

(దీనికిఁ బ్రాయికముగా వ్యతిరేకార్థమునందే ప్రయోగము కానవచ్చుచున్నది.)

**వసము = వసొ.** (సం. వశ.) ౧. వి. ఆధీనము.

ద్వి. కనిమసంగిన శత్రుగణముల జముని, వసముచేయుచు బరవసము చూపుచును ...
ద్వి. పరమ. ౬. ౪౬౫. పా.

వ. వల్లియలువైచి కోడెలం బట్టి పెనచి కాఱూర్ల జట్టి కొలులకు వసంబుచేయు బరవసం బెసంగ ...
హరి. పూ. ౫. ౧౪౨.

సీ. వెసరాహుకులతోన వసపడతిహయములు గెడని యెయ్యెడలను బుడమిఁ గప్పె ...
భార. అర. ౬. ౨౨౫.

(వసమలు = స్వాధీనత తప్పు.)

క. అసురజనని కడునార్తిని, వసమఱి యిట సేయఁదగునె వాసవ యనఁగా ...
హరి. పూ. ౧. ౭౬.

చ. తరుణియొకర్తు కంఠమునఁ దాల్పఁగఁ దావ సమేదిహారముల్, కరములయందుఁ బూని పతిఁ గన్గొనవచ్చె రయంబుమై ...
కవిక. ౩. ౧౫౨.

౨. శక్యము.

క. అసమాలంబమశబ్దము, రసగంధస్పర్శరూప రహితంబగుటం, బసరించు నింద్రియము లకు, వసంబుగాదొందఁ బరమవస్తువు పుత్రా. భార. శాం. ౪. ౧౩౪.

మ. ... కుమతధ్వాంతార్క- బింబంబు దుష్ప్రసహం బెవ్వని చక్ర మట్టి హరికిం బ్రత్యర్థిపై నిల్వఁగా, వసమే యెంతటివానికిన్ వెలుఁగు నవైరస్యముం బూనఁగన్.
హరి. పూ. ౩. ౨౧౫.

గీ. ... మునికిలఁగఁ గాదె సహరింప వసము గాక, పుష్పబాణుని చెలికవి బ్బడమిఁ బడియె ... ఆము. ౨. ౬౫.

జ: వసపడు, వసపోవు.

**వసల(లా.)** వి. కొయ్యకు అడుకు వేసెడికొయ్య. (శ. ర. వా.)

**వసార(రా.)** వి. పంచోది. (శ. ర. వా.)

**వసాచ్ఛట.** సం. వి. ఆ. స్త్రీ. మెదడుముద్ద.

**వసాఢ్యము.** సం. వి. అ. పుం. శిశుకము, ఒక జాతిచేప.

**వసావాయి.** సం. వి. న్. పుం. కుక్క.

**వసి**[1]**.** వి. ౧. కొనచెక్కినకోయ్య; కోయ్య.

ఆ. ఊరులు జిగురుగండె దెరలును బోనులు, వారువారెనలును వసులుగసులు, మిళ్లువలలు పేట్లు గోళ్లు దీమంబులు, నాదిగాఁగఁ దెచ్చిరాటవికులు. పి. శకుం. ౧. ౧౧౬.

సీ. వసులుగసులుపోగు వాఱువెంద్రుకత్రాళ్ళు బలువిండ్లునమ్ములు బల్లెములును ...
హరిశ్చ. ౨. ౬.

సీ. వెస అంపమున నిడ్డ వసిగఁ గొన్నిటిని సుమంతలుగా నుఱుమాడియాడి ...
భార. విరా. ౫. ౩౫.

౨. మొనమీఁదుగా నాఁటిన మేకు.

చ. లసికిరి జోదులగ్గలికలగ్గల కెక్కినఁ గుంత పంక్తులన్, వసుమతిఁ గూల్చియున్ గదల వైచియుఁ గత్తుల వ్రక్కలించియున్, వసుల వధించియున్ ముసలవర్గములం బడ మోది వాలుకల్, మసలక వేసి వంచియును మందులతిత్తులు గాల్చి వైచియున్.
రావి. ౫. ౩౧.

సీ. ... వసిగని మేనక వసుధశంకు ...
గీ. భేద నామంబులగుచు శోభిల్లుచుండు ...
ఆం. భా. ౨. ౨౧౭.

౩. ముల్లు.

సీ. ములు వసి యనఁగను జెలఁగుఁ గంటక సంజ్ఞ ... ఆం. భా. ౨. ౩౭.

ఆ. విగహీణీజనంబు వీఁడెపో నొప్పించు వసుల మూట యిట్టి వానిఁ బట్టి, పగలు తీర్తమంచుఁ దొగకేనిఁ బొంతురు, నగరి సౌధశృంగనలినముఖులు ...
రామా. ౧. ౧౪౩.

౪. ప్రాపు, ఆశ్రయము, అవలంబము.

క. చెందిన తత్పుణ్యము వసిగం దరుణీయుండు మింకఁ గల్పతుయమా, నందాక బ్రహ్మ లోకము, నం దవ్యయదివ్యసుఖసమన్విత వగుచున్ ... శై. శ్రీరంగ. ౪. ౭౯౩.

జ: వసికోయ్య.

**వసి**[2]**,** విశే. మిక్కిలి. (వాడు, వాలు, తాఁకు మున్నగు వానికి ముందుఁ గానవచ్చుచున్నది.)

క. బెడిదమగునెండసోఁకునఁ, దొడిమలు వసి వాడి ననలు దొరఁగె లతల నెల్లెడ ...
పారి. ౪. ౧౯.

క. ఒడలు వసివాళ్లు వాడన్, వెడయూర్పు నిగిడ్చి ... సారంగ. ౨. ౨౧౬.

జ: వసియాడు, వసియార్పు, వసివాడు, వసివాళ్లు, వసివాళ్లువాడు.

**వసి**[3]**,** వి. (సం. వశము) ఉత్సాహము, పూనిక.

వ. ... ఇవ్విధంబున నయ్యూర్వసియు వసి మాలఁ బెనంగి ... హర. ౭. ౧౩౪.

ద్వి. వసిగూర్చు కృతులు నా వద్దను బెరుగు, బిసుగు చందపు బిలిబిలికృతుల్ కృశులె...
పండితా. దీక్షా. ౬. పా.

జ: వసిగొను.

**వసి.** సం. వి. ఇ. పుం. ౧. వస్త్రము, బట్ట. ౨. వాసస్థానము, ఇల్లు. ౩. ఉనికి.

**వసి(యి)ంచు.** సం. అ. క్రి. ఉండు, పడు.

క. వినుచిల్లయిడిన యాయుధమును విపలిప్త మగు శస్త్రమును నెట్టి యమిత్రునిపై నైనఁ బ్రయోగించిన నరపతి నరకమున వసించు నృపాలా.
భార. శాం. ౨. ౪౨౦.

ద్వి. ...ఆపురి నెలకొనినచిరాబ్దములు, వసియించి యటవిమీఁద వసుధపైఁ గలుగు, నసమాస్త్ర గురుని గేహములుఁ తీర్థములుఁ, గనుఁ గొంచు ... ద్వి. పరమ. 3. ౧౭౧.

ద్వి. బసవేశ్వరుండు నబ్బాలుని యంద, వసియించి సత్యంబు వరగుఁడై యునికి ...
పండితా. పురా. ౧౬౮. పా.

**వసికొ(గొ)య్య.** (వసి + కొయ్య) వి. కొన చెక్కిన కొయ్య.

సీ. పందిళ్ళు వెట్టించి పైఁగొమ్మ లెగయించి గుండు దూలము వసి కొయ్యఁ గూర్చి ...
ఉ. హరి. ౨. ౯౨.

సీ. మసక తిత్తులు తుంగకసవు చాపలు వసి గొయ్యలు జనప మోకులును వలలు ...
చెన్న. ౨. ౨౦౪.

**వసిగొను.** అ. క్రి. (వసి³ + కొను) పూను, ఉత్సహించు.

ద్వి. వసిగొని హరియు గేహతలు నెత్తంగ, వసనోపిరేయుకు వినిహిత తృణము ...
బస. పు. ౬. ౯౯౯. పం.

ద్వి. కసవుమో పుత్తమాంగమున నుండియును, వసిగొని పైనుర్లఁ గసవు క్రిందటను, వరద వారగ మీఁద వానయుఁ గురియ ...
పండితా. దీక్షా. ౫౦. పా.

ద్వి. బసవతీర్థం బేఁగు పరస యనంగ, వసిగొని యిలఁ గ్రిక్కిఱిసి వచ్చువారు ...
బస. పు. ౨. ౧౮౫.

**వసితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ధరింపఁ బడినది. ౨. నివసించుచున్నది. 3. నిలువ చేయఁ బడినది. (ధాన్యాది.)

వి. అ. న. నివాసము, ఇల్లు.

**వసియాడు.** (వసి² + ఆడు) అ. క్రి. మిక్కిలి తిరుగు.

సీ. ... వచ్చి వందఅలాడు వాహరిపులఁ ...
గీ. జంపి వసియాడు శశములగుంపుకుతికి, చించి చెండాడు కణుజుల ... గుప్యంత భూప ... పి. శకుం. ౨. ౧౨.

వ. ... వసియాడు చిన్ని యడుగులతో ...
ఉరా. ౪. ౨౭౧.

**వసియార్పు.** వి. (√ వసియాడు) మిక్కిలి యాడించుట.

మ. జిగురంబళ్ల పెసంబులున్ దిలర సస్నిగ్ధోష్ణ కుంభంబులున్, పొగ బాణంబులుఁ జిచ్చుబుడ్లు వసి యార్పుందారు ఖండంబులున్ ... రంగా. 3. 33.

**వసిరము.** సం. వి. అ. న. సముద్రపుటుప్పు.

**వసివాడు.** అ. క్రి. (వసి² + వాడు) మిక్కిలి వాడు.

క. ఏవంవిధఘనసాత్త్విక, భావావృతి నా లతాంగి భావోదిత లజ్జావనతానన నీరజ, యై వసివాడంగఁ జెలులు హసనోన్ముఖులై.
చంద్రా. ౫. ౨౭.

చ. చెదరిన ముంగురుల్ తరుచు చెమ్మటఁ దోగినతళ్కుఁ జెక్కులున్, వదలిన కప్పుఁ గొప్పు వసివాడిన మే నొకయింతజాఱు పయ్యెద యసియాడు లేఁగవును నిట్టటుఁ దొట్రిలు పద్ద్వయంబుఁ బెల్లొదవెడి యూర్పులుంగల తలోదరిఁ గన్గొని రాముఁ డిట్లనున్. ఉ. రా. ౬. ౬౫.

ఉ. తేలెడు కన్నుదోయి వడదేరెడు ముద్దు మొగంబు సారెఁ గ్రొవ్రాలెడు గొప్ప కొప్పు వసివాడెడు నన్నువకాను కాఁక లంట్రూలెడు లేతమేను నయి తొట్రిలు నమ్మగనాలి ... పాండు. ౩. ౬౫.

**వసివాళ్లు.** వి. బ. (√ వసివాడు) మిక్కిలివాడుటలు.

గీ. కందకుండంగ వసివాళ్లు కెందకుండ, నొక్కులు
కుండఁగ శిఖరులు దగలకుండ, ననుచు రతి
రాజపూజనాయత్తచిత్త, కలనఁ బుష్పప
చయసముత్కంఠ లగుచు.
చంద్రా. ౪. ౨౩౩.

సీ. లివహత్తి బిగికాఁగిలింతల వసివాళ్లఁ గను
పట్టు నెమ్మేను గప్పి కప్పి ...
ఉ. హరిశ్చ. ౪. ౪౯.

**వసివాళ్లు(ళులు)వాడు.** (వసివాళ్లు + వాడు)
అ. క్రి. మిక్కిలివాడు.

క. వసివాళ్ళువాడి యప్పుడు, వసంతసమయంపు
టెండవలనన్నె టివోఁ, గసు గందులుగందిన
నవ, కుసుమలతికవోలె మిగులఁ గోమలి
యొప్పెన్. కళా. ౪. ౧౦౬.

మ. ... అప్పుడు మెవ్వాఁడో యొకండు రాత్రి
సురతప్రౌఢిం దనుం దేల్చినన్, వసివాళ్వా
డుచు వచ్చుచున్నయది కర్ణాటాగనం
జూచితే ... క్రీడా. ౧. ౭౬.

సీ. క్రొవ్విరులెసఁగి ..., వీఁగారుచనుఁగవ
ప్రేఁగునఁ గాఁదీఁగవడువసివాళులు వాడు
చుండు ... కు. సం. ౭. ౯.

**వసి(శి)ష్ఠుఁడు.** సం. వి. అ. పుం. బ్రహ్మ మానస పుత్త్రులలో నొకఁడును, సూర్యవంశపు రాజులకులగురువునగు ఋషీశ్వరుఁడు. (సప్తర్షులలో నొకఁడు.)

**వసుంధర.** సం. వి. ఆ. స్త్రీ. భూమి.

**వసు(సూ)కము.** సం. వి. అ. పుం. ౧. అర్కవృక్షము, జిల్లేడుచెట్టు. ౨. అగిసె చెట్టు.
న. ౧. సముద్రపు టుప్పు. ౨. భూమినుండి త్రవ్వి తీయఁబడిన యుప్పు.

**వసుకీటము.** సం. వి. అ. పుం. బిచ్చగాఁడు, యాచకుఁడు.

**వసుద.** సం. వి. ఆ. స్త్రీ. భూమి.

**వసుదేవత.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ధనిష్ఠానక్షత్రము. ౨. నవమీతిథి, పక్షములలోఁ దొమ్మిదవ దినము. ఇట్లే వసుదేవ్య.

**వసుదేవుఁడు.** సం. వి. అ. పుం. యదువంశస్థుఁడైన శూరుఁడను నతని పుత్రుఁడును, శ్రీకృష్ణుని తండ్రియునగు క్షత్రియుఁడు. (కుంతీదేవి సోదరుఁడు.)

**వసుధ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. భూమి. ౨. నేల. ప్రదేశము.

**వసుధాధరము.** సం. వి. అ. పుం. పర్వతము, కొండ.

**వసుధాధిపుఁడు.** సం. వి. అ. పుం. రాజు, పుడమిఱేఁడు.

**వసుధానగరము.** సం. వి. అ. న. వరుణుని పట్టణము.

**వసుప్రభ.** సం వి. ఆ. స్త్రీ. అగ్నిహోత్రుని సప్తజిహ్వలలో నొకటి.

**వసుప్రాణుఁడు.** సం. వి. అ. పుం. అగ్ని.

**వసుమతి.** సం. వి. ఈ. స్త్రీ. భూమి.

**వసులు.** అ. క్రి. తొలఁగు, అపసరిల్లు. (శ. ర.)
జ: వసులపాతర.

**వసులపాతర.** వి. (వసులు + పాతర) ఒక జాతి పందెపుకోడిపుంజు. (ఆ పుంజులవంటి వారు.)

గీ. వసులపాతరలై వీరనుసలనీయ్యరు ...
సారంగ. ౨. ౧౨౩.

(ఇట "వసులపాతర" వంటివారు. అని భావము.).

**వసువు.** సం. విణ. (ఉ.) ౧. మధురమైనది. ౨. ఎండినది.

వి. ఉ. న. ౧. ధనము. ౨. రత్నము. ౩. బంగారము. ౪. నీరు. ౫. పదార్థము, ద్రవ్యము. ౬. సైంధవలవణము. ౭. వృద్ధి యొసెడి మందుదినుసు. ౮. ఒకజాతి సీమ చిక్కుడుగింజ.

పుం. ౧. ఎనిమిది సంఖ్య. ౨. కుబేరుడు. ౩. శివుడు. ౪. అగ్ని. ౫. వృక్షవిశేషము, అగిసెచెట్టు. ౬. మడుగు, జలాశయము. ౭. కల్లము. ౮. పలుపు. ౯. ఉరిత్రాడు. ౧౦. కిరణము. ౧౧. సూర్యుడు. ౧౨. అష్టవసువులు: ఆపుడు, ధ్రువుడు, సోముడు, ధరుడు, అనిలుడు, అనలుడు, ప్రత్యూషుడు, ప్రభాసుడు అనువారు.

స్త్రీ. ౧. కిరణము. ౨. ప్రకాశము, కాంతి. ౩. వృద్ధి యొసెడి మందు దినుసు.

**వసుశ్రేష్ఠము.** సం. వి. అ. న. ౧. మేలిమి బంగారము. ౨. వెండి, రజతము.

**వసుషేణుడు.** సం. వి. అ. పుం. ౧. విష్ణువు. ౨. కర్ణుడు.

**వసూర.** సం. వి. అ. స్త్రీ. లంజె. బంకులాడి.

**వసూలు.** వి. (త. హిం. వసూల్, క. వసూలు) జమ, సొగుచేయుట. (శ. ర., వా.)

**వస్కరాటిక.** సం. వి. ఆ. స్త్రీ. వృశ్చికము, తేలు.

**వస్తము.** సం. వి. అ. న. వసతి, నివాసము. పుం. భాగము, మేక.

**వస్తాదు.** వి. ౧. జెట్టి.

సీ. బిరుదు వస్తాదులఁ జేర్పర వాడాడ మస్తాదుగా నిల్వఁ గుస్తరించి ...

రంగా. ౨. ౧౫౮.

౨. ఉపాధ్యాయుడు, యజమానుడు. (శ. ర.)

జ: వస్తాదుతనము.

**వస్తాదుతనము.** వి. (వస్తాదు + తనము) బంటుతనము.

గీ. రవివికసనంబు లేవట్టి దివస మేల, ధైర్య మొందవని వస్తాదుతన మదేల ...

వేణు. ౪౨.

**వస్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. వసతి, నివాసము. ౨. పొత్తి కడుపు. ౩. పొత్తి కడుపు చుట్టు నుండెడి యస్థి పంజరము, వస్తికము. ౪. మూత్రాశయము, ఉచ్చబుత్తి. ౫. చిమ్మన గొట్టము.

**వస్తిమలము.** సం. వి. అ. న. మూత్రము.

**వస్తిశోధనము.** సం. వి. అ. న. మూత్రాశయమును శుద్ధిచేసెడి మందు, మూత్ర వర్ధకమైన మందు.

**వస్తుకవిత.** సం. వి. ఆ. స్త్రీ. వర్ణింపబడు వస్తువు కన్నుల కగపడునట్లు చేయు రచనా విశేషము.

క. భారవియు వస్తుకవితను, భారవియును బరఁగి రుదయపర్వతశిఖరా, గ్రారోహణేంద్ర కీలన, గారోహణ వర్ణనల జనారాధితులై. కు. సం. ౧. ౨౦.

**వస్తురచన.** సం. వి. ఆ. స్త్రీ. శైలి, అంశము యొక్క కూర్పు, ఫక్కి.

**వస్తువు.** సం. వి. ఉ. న. ౧. సత్యపదార్థము, నిజమైన పదార్థము. ౨. పదార్థము. ౩. సొత్తు,

ధనము. ౪. తత్త్వము, స్వభావము. ౫. వస్తుసాధనము, కారణము. ౬. నాటకము నందలి యితివృత్తము, కథాంశము. ౭. వస్తుసారము. ౮. కల్పన, పన్నుగడ.

వస్తూపమ. సం. వి. ఆ. స్త్రీ. ఉపమాలంకార భేదము, ధర్మలుప్త.

వస్త్యము. సం. వి. అ. న. ఇల్లు, గృహము.

వస్త్రకుట్టిమము. సం. వి. అ. న. ౧. పటగృహము, డేరా. ౨. గొడుగు.

వస్త్రగృహము. సం. వి. అ. న. పటగృహము, డేరా.

వస్త్రగ్రంధి. సం. వి. ఇ. పుం. నీవి, పోఁకముడి.

వస్త్రనిర్ణేజకుఁడు. సం. వి. అ. పుం. బట్టలుతుకు వాఁడు, చాకలి.

వస్త్రపుత్త్రిక. సం. వి. ఆ. స్త్రీ. ఆటబొమ్మ.

వస్త్రపూతము. సం. విశ. (అ. ఆ. అ.) గుడ్డతో వడియఁగట్టఁబడినది, వస్త్రగాలితమైనది.

వస్త్రభేదకుఁడు. సం. వి. అ. పుం. బట్టలు కుట్టువాఁడు, కుట్టుపనివాఁడు.

వస్త్రభేది = వస్త్రభేదకుఁడు. సం. వి. న్. పుం.

వస్త్రము. సం. వి. అ. న. ౧. బట్ట, వలువ. ౨. గుస్తు, ఉడుపు.

వస్త్రయోని. సం. వి. ఇ. పుం. వస్త్రములకు సాధనమైన దూది, ఉన్ని, పట్టు మొ.

వస్త్రరంజనము. సం. వి. అ. న. కుసుంభము, రంగు. (వాచ.)

వస్త్రాంచలము. సం. వి. అ. పుం. చీరచెఱఁగు, బట్ట యంచు. ఇట్లే వస్త్రాంశము.

వస్త్రాగారము. సం. వి. అ. పుం. న. ౧. పటగృహము, డేరా. ౨. బట్టలయంగడి. (విల్సన్.)

వస్త్వభావము. సం. వి. అ. పుం. ౧. సత్యము లేమి, యాథార్థ్యము లేకుండుట.

వస్నసము. సం. వి. అ. న. కటిభూషణము, మొలనూలు, ఒడ్డాణము. మొ.

వస్నము. సం. వి. అ. న. ౧. కూలి. ౨. జీతము. ౩. బత్తెము. ౪. ధనము. ౫. వస్త్రము. ౬. చర్మము. ౭. మృత్యువు, చావు. పుం. న. మూల్యము, వెల.

వస్నస. సం. వి. ఆ. స్త్రీ. స్నాయువు, నరము.

వస్నికుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) కూలికిఁ బనిచేయు వాఁడు.

వస్వౌకసార. సం. వి. ఆ. స్త్రీ. ౧. ఇంద్రుని పురము, అమరావతి. ౨. కుబేరపురము, అలకాపట్టణము. ౩. అమరావతికి లేక అలకాపురము నకు సమీపమునఁ బ్రవహించెడినది.

వహా. సం. వి. ఆ. స్త్రీ. నది.

వహంతము. సం. వి. అ. పుం. ౧. వాయువు, గాలి. ౨. శిశువు.

వహతము. సం. వి. అ. పుం. వృషభము, ఎద్దు.

వహతి. సం. వి. ఇ. పుం. ౧. ఎద్దు. ౨. గాలి. ౩. మిత్రుఁడు, సలహా చెప్పువాఁడు. ఈ. స్త్రీ. ౧. నది.

వహతుఁడు. సం. వి. అ. పుం. ౧. బాటసారి, పాంథుఁడు.

వహనము. సం. వి. అ. న. ౧. తీసికొనిపోవుట, మోయుట. ౨. పోషించుట, ప్రోచుట. ౩.

ప్రవహించుట. ౪. బండి మొదలగు యానము. ౫. ఓడ, పడవ.

**వహము.** సం. వి. అ. పుం. ౧. మోయుట. తీసికొనిపోవుట. ౨. పోషించుట. ౩. ఎద్దుమూఁపురము, వృషభస్కంధము. ౪. బండి మొదలగు యానము. ౫. అశ్వము. ౬. వాయువు. ౭. బాట, మార్గము. ౮. నదము. ౯. నాలుగు ద్రోణముల పరిమాణము. ౧౦. ప్రవాహము.

**వహి**[1]. వి. ౧. విధము.

ఉ. పంటవలంతినోముగుమి పంటవహిన్ రహిమించువాని వ్రాల్గంటివడిన్ హరించి తెలుగంటి వజీరుల త్రుళ్లడంచెదన్ ...
చం. రా. ౫. ౫౬.

చ. గెలిచినగెల్పు లర్థితతికిన్ దిన మిచ్చిన యీవులన్ వహుల్, తలఁచిన విక్రమార్కులోకలక్షణముఁ గర్ణులు కోటియుంగదా, కలిగిన నీడ వత్తురు. విజ. వి. పీఠిక. ౧౪.

సీ. మకరవైఖరి వైరినికరంబు చెలరేఁగ వనజనాభుఁడు వార్ధి వహి వహించె ...
ఉ. రా. ౨. ౫౦.

౨. ప్రసిద్ధి.

ఉ. అన్వహమున్ ప్రవృద్ధమగు నంబుజనాభపదారవిందభక్తి న్వహికెక్కుచున్ వసుమతీసురవంశవతంస మెల్ల వారు న్వినుతింపఁ బెంపెసఁగుఁ బ్రోది యొనర్చుచుఁ దల్లి తండ్రి నెందు న్విధానురూపతను దోహదభోజనపూజనాదులన్.
పాండు. ౨. ౧౨.

ఉ. లక్షణలక్ష్యకోటి పదిలంబుగ మేటికవుల్ నుతింప శ్రీదక్షమసంస్కృతాంధ్ర కవితాపదవిన్ వహికెక్కి శబ్దవైచక్షణిమించు నన్నని విశారదుఁడై తగు తిక్కయజ్వ ...
వాల్మీకి. ౧. ౧౧.

రగడ. ... మంచు ముంచుకొన మావులు ప్రుక్కన్, మంచినీళ్లరుచి మహి వహికెక్కన్ ... బహు. ౨. ౧౩.

**వహి**[2]. వి. (క. వహి.) లెక్క పుస్తకము. ౨. పుస్తకము. (శ. ర.)

**వహి(యి)ంచు.** సం. స. క్రి. ౧. మోయు.

క. మహనీయ భవత్పదవీ, మహితుండై నహుషుఁ డేచి మదమున ధర్మస్పృహ దక్కి తన్ను నిప్పుడు, వహియింపఁగ సన్మునీంద్రవర్గముఁ బనిచెన్.
భార. ఉద్యో. ౧. ౧౯౫.

౨. పొందు, ప్రాపించు.

క. విహతాత్ముండై లజ్జా, మహితంబగు నాశ దొఱఁగు మదితో సకలస్పృహయును నెవ్వని యందును, వహింపనని యతుల మైనవ్రతముం బూనెన్.
భార. శాం. ౩. ౧౭౫.

క. చైతన్య శక్తిఁ బురుష సమేతత్వవిశేషమున వహించుఁ బ్రకృతి త్వజ్ఞాత యగును బుద్ధి తదుద్భూత మహంకార మదియుఁ బొరయుం జిత్తున్. భార. శాం. ౪. ౨౭౦.

౩. అవలంబించు.

ఉ. ఏమెయినైన వంచన వహించి తొలంగుట మత్సమీహితంబు ...
భార. విరా. ౧. ౧౭౭.

**వహించుకొను.** (వహించు + కొను) సం. అ. క్రి. పక్ష మవలంబించు.

ఉ. ఏ నటు వేటఁ బోవఁ గని యిందులకున్ వెలుకావగింజ యంతైనను సేవ చేయనగు నా తగు నాయన కెంత చేసె, వానికిఁగా వహించుకొని వచ్చితివా ...
సారంగ. ౩. ౬౯.

**వహిత్ర(క)ము.** సం. వి. అ. న. ఓడ; పడవ.

**వహే(హై)డకము.** సం. వి. అ. పుం. విభీత కము, తాండ్రచెట్టు.

**వహ్ని.** సం. వి. ఇ. పుం. ౧. అగ్ని; అగ్ని దేవుఁడు. ౨. జాఠరాగ్ని. ౩. నల్లజీడిచెట్టు. ౪. చిత్ర మూలము. ౫. రేఫము. ౬. యాజ కుఁడు.

**వహ్నికరము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. నిప్పంటించునది. రగులుకొనఁ జేయునది. ౨. జాఠరాగ్నిని వృద్ధి పొందించునది.

**వహ్నికాష్ఠము.** సం. వి. అ. న. దాహా గురువు, ఒక విధమగు అగురు చెక్క.

**వహ్నిగంధము.** సం. వి. అ. పుం. ౧. ధూపము. ౨. గుగ్గిలము. యక్షరసము.

**వహ్నిగర్భము.** సం. వి. అ. పుం. ౧. శమీ వృక్షము, జమ్మిచెట్టు. ౨. వెదురు. †.

**వహ్నిదీపకము.** సం. వి. అ. పుం. కుంకుమ పువ్వు.

**వహ్నినామము.** సం. వి. న్. పుం. ౧. నల్ల జీడిచెట్టు. చిత్రమూలము. †.

**వహ్నిబీజము.** సం. వి. అ. న. ౧. బంగారము. ౨. నిమ్మచెట్టు. ౩. జీరకము, జీలకఱ్ఱ. ౪. రేఫాక్షరము.

**వహ్నిభోగ్యము.** సం. వి. అ. న. ఘృతము, నెయ్యి.

**వహ్నిమిత్ర(త్రుఁడు)ము.** సం. వి. అ. పుం. వాయువు.

**వహ్నియిచ్చు.** మి. అ. క్రి. అగ్ని సంస్కారము చేయు.

క. పలుమాఱును రామికి ను, త్తలపడిరొను దాన నిట్టిదళ నతఁ డొందెం, తెలియఁగుట నితని డొక్కకు, నలఘువిధిన్ వహ్నియిచ్చి తది మేలకదా ... భార. శాం. ౩. ౫౧౫.

**వహ్నిరేతస్సు(ము).** సం. వి. స్. పుం. బంగా రము.

**వహ్నిరేతుఁ(తసుఁ)డు.** సం. వి. అ. పుం. శివుఁడు.

**వహ్నిలోహ(క)ము.** సం. వి. అ. న. ౧. తామ్రము, రాగి. ౨. కంచు, కాంస్యము. (వాచ.)

**వహ్నివర్ణము.** సం. వి. అ. న. ఎఱ్ఱకలువ, రక్తోత్పలము.

**వహ్నివల్లభము.** సం. వి. అ. పుం. గుగ్గిలము.

**వహ్నిశిఖము.** సం. వి. అ. న. ౧. కుంకుమ పువ్వు. ౨. కుసుంభము, ఒక విధమగు రంగు.

**వహ్నిసంజ్ఞకము.** సం. వి. అ. పుం. చిత్ర మూలము.

**వహ్నిసఖుఁడు.** సం. వి. అ. పుం. వాయువు.

**వహ్యము.** సం. వి. అ. న. ౧. రథము, తేరు. ౨. పాలకి, బండి మొదలగు యానము.

విణ. (అ. ఆ. అ.) ౧. వహింపఁదగినది, మోవఁదగినది. ౨. కొనిపోఁదగినది.

**వహ్వా.** అవ్య. ప్రశంసను దెలుపును. అరరే, బళీ, అహహా.

మ. అరరే శౌరి బళీ ధ్రువుం డహహ భద్రా శ్వుండు వహ్వా తలో, దరి ప్రహ్లాదుఁడు మేలు ... వరాహ. ౭. ౯౩.

# వా

**వా = వాయి.** వి. (సం. వాక్) ౧. మాట.

సీ. ఎదిరివా ఖండించు టిది దప్పరము సుమ్మి జలగజంపులు జోగి జంగకోలము ...
హర. ౨. ౫౧.

౨. నోరు.

గీ. ... వాకల దటంచు సెన్నేని వదరు చుండ, శిక్షఁజేయక యుంట యుపేక్ష గాద ...
వాల్మీకి. ౩. ౨౩.

క. నా పేరు శంఘమిత్రుఁడు, వాపాఠము విద్య లెల్ల వనజాసనుఁడున్, నా పాటిగాఁడు...
సుద. ౨. ౨౭.

చ. ... ఇప్పుడు నరుఁ గాంచి మీ రతని పోటునుతించుచు భీతి నిట్లు వా, విడిచి యనేక భంగిఁ బ్రధిపీపతి పీఁటఁడిఁ జేయు టొప్పునే ...
భార. విరా. ౪. ౨౦౦.

౩. ఆహారము.

ఉ. అప్పుడు దేవదారువిపినాంతర సీమవసించు సంయముల్, విప్పగు భూమినన్నము ఫలింపక చెట్టులు సెండిపోయె వ్రాతప్పినఁ బోవుఁ బ్రాణములు తప్పదురం డని మున్ను గౌతమును, జెప్పఁగ విన్నవారగుటఁ జేరి తచ్ఛృతశృంగశైలమున్.
వరాహ. ౧౦. ౩౧.

౪. నూయి గోయి మున్నగువాని ముఖము, అగ్ర భాగము.

సీ. ... సగము దుమ్ముగ్నఁ బూడి చిగిరింత వా మూయఁ బెరిఁగిన నూతిపాఁతరబాఁతియల ..
ఆము. ౬. ౧౩.

౫. ఖడ్గధార, కత్తివాదర.

ద్వి. ఈ రీతి గాశిరునింద్రజాలంబొ, వాతప్పి వడొ చేతివడి దప్పి చనెనొ, చూత మీ తోయ మీ చోద్య మీలీల, నసివోత తప్పు వాయని వోకయనుచు ...
ద్వి. హరిశ్చ. ఉ. ౨౧౫౪. పం.

ఉ. ... వ్రాతప్పక వ్రేసె నొక్కట్రెంగిఁ దార్క్ష్యని భీమశిరంబు వక్షమున్ ...
జై. భా. ౨. ౭౯.

జ: వాకట్టు, వాకలికి, వాకర్వాకాయ, వాకాటు, వాకిలి, వాకొను, వాకొలుపు, వాత్రుచ్చు, వాగంటిపులుఁగు, వాగళ్ళ, వాచఱచు, వాచవి, వాచూరు, వాతప్పు, వాదోడు, వాపుచ్చు, వాబిఱుగు, వాయి డువు, వాయోడు, వావాఁడి, వావాడము, వావాదు, వావిడుచు.

**వాఃకిటి.** సం. వి. ఇ. పుం. శిశుకము, ఒకజాతి చేఁప, ఉలూపి.

**వాఃపసభ.** వి. సం. అ. స్త్రీ. వరుణసభ.

చ. అజుసభఁ జెప్ప మింద్రుసభ నాడుము వాఃపసభ స్గణింపుము ...
హరి. ఉ. ౬. ౧౦౬.

**వాఃపుష్పము.** సం. వి. అ. న. లవంగము.

**వాంచు = వంచు.** స. క్రి. (√ వంగు) వంగఁ జేయు.

ఆ. పతులపిఱుఁద మందగతి ముక్తకేశియై, పోవుదాని ద్రుపదపుత్రిఁ జూచి, యెంతఁ గౌరవేంద్రు సంతిపురంబున, వారలెల్లఁ దలలు వాంచి రడలి.
భార. సభా. ౨. ౨౯౩.

మ. అనినన్ మోమరవాంచితిన్ వినయలజ్జా యత్తచిత్తుండనై ... ఉ. హరి. ౨. ౨౧.

క. తల వాంచి మగుడ మసుఁగిడె ...
పాం. ౧. ౧౧౧.

**వాంఛ.** సం. వి. అ. స్త్రీ. ఇచ్ఛ, కోరిక, మనోరథము.

వాంఛచేయు. మి. అ. క్రి. (వాంఛ + చేయు) కోరు.

సీ. ద్వీప మేలెడువాఁడు తేజస్వియై మహీ వలయమెల్లను నేల వాంఛచేయు ... ప్రబోధ. ౨. ౬౪.

వాంఛనము. సం. వి. అ. న. కోరుట, ఇచ్ఛగించుట, అభిలషించుట.

వాంఛి. సం. విశే. (న్. నీ. న్.) ౧. కోరువాఁడు. ౨. కాముకుఁడు.

వాంఛించు. సం. స. క్రి. కోరు.

గీ. ... అనుడు నా జిష్ణుఁ డిమ్మహాత్ముని తెఱంగు, సెప్పుఁ జిట్టలు వినఁగ వాంఛించితేని, వినుము చెప్పెద నని యిట్టు లనియెఁ బ్రీతి ... భార. శాం. ౨. ౪౫.

వాంఛితము. సం. విశే. (అ. ఆ. అ.) కోరఁబడినది. అభిలషింపఁబడినది.

వి. అ. న. కోరిక. ఇచ్ఛ.

వాంఛిని. సం. వి. ఈ. స్త్రీ. కామాతురత గలస్త్రీ.

వాంతము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. క్రక్కఁబడినది; ఉమియఁబడినది. ౨. పైకిఁ ద్రోయఁబడినది. వెడలఁగొట్టఁబడినది.

వాంతాదము. సం. వి. అ. పుం. శునకము, కుక్క.

వాంతాశి. సం. న విశే. (న్. నీ. న్.) క్రక్కుదానిని దినువాఁడు, మలభక్షకుఁడు.

వాంతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. వమనము. క్రక్కు. ౨. వెడలఁగొట్టుట.

వాంతికృత్తు. సం. విశే. (త్) వమనకరమైనది. వాంతి చేయించునది.

వాంతిదము. సం. విశే. (అ. ఆ. అ.) వమనకరమైనది, వాంతి చేయించునది.

వాంశము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. వెదురునకు సంబంధించినది. ౨. వెదురుతోఁ జేసినది, వెదురునకు సంబంధించినది.

వాంశి. సం. వి. ఈ. స్త్రీ. వంశరోచన. తవక్షీరము, వెదురుపాలు.

వాంశికుఁడు. సం. వి. అ. పుం. ౧. వెదురుకఱ్ఱల నరుకువాఁడు. ౨. పిల్లం గ్రోవియూఁదువాఁడు.

వాఁక[1]. (సం. ఆపగా.) ౧. ఏఱు.

క. నడకట్ట లిసుకతిప్పలు, మడుఁగులు దరులు వాఁకలును గ్రమంబున నొకఁడున్, గడవఁ బడకుండఁ గృష్ణుఁడు, పడకులకును యమున యాటపట్టుగఁ జేసెన్. హరి. పూ. ౮. ౩౪.

సీ. వడిఁ జాఱు విరితేనె వాఁకల దరుల వెంబడి ఘుమ్ముమను మృగమదము తావి ... ఉ. రా. ౩. ౬౬.

క. ... ఏఱన వాఁక యన నదికి నెసఁగును పేళ్ళు ... ఆం. శే. ౪౫.

౨. సెలయేఱు.

గీ. ... వాఁకయనఁగ, వాగనఁగ సెలయేఱు నా స్రవంత యనఁగ,నచలనది యొప్పు ... ఆం. భా. ౨. ౩౦.

జ: వాఁక దాలుపు.

వాఁక[2]. విశే. (సం. వక్రః.) వంకర.

గీ. అంతఁ బరకాలుఁ జేలచూచు ... తాఁకె వారిఁ, గలునడవిఁ బేర్చు నొక వాఁక కనుము లోన ... పరమ. ౪. ౨౦౫.

వాఁక[3]. వి. ౧. ప్రదేశము.

చ. వలిమలయల్లువాఁడు తలవాఁక ధరించిన
పూవుగుత్తి ... పారి. పీఠి. ౬.

౨. పార్శ్వము, ప్రక్క.

ద్వి. మూఁకచింతలఁ బడుమేక మామిళ్ల, వాఁక
నొప్పెడు సరోవరము వీక్షించి ...
బస. పు. ౧౦౫. పా. ౩౦. పం.

**వాఁకదాలుపు.** వి. (వాంక[1] + తాలుపు.) గంగాధరుఁడు, శివుఁడు.

ఉ. ... వే(గుచ్చి కవుంగలించి వలిగుబ్బలి
పట్టియు వాఁకదాలుపున్ ...
పాండు. ౧. ౧౯౯.

**వాఁకుడు.** వి. కంటకారిక, ఓషధి విశేషము.

గీ. వెలగ వాఁకుడు పల్లేరు ములక వేఁప, నగిరె
నీర్గొబ్బి మొదలుగా జగతిఁ గల్గు, కంప
లన్నియు వేవేఁగ గడచి కడచి ...
హంస. ౪. ౯.

సీ. ... బృహతియా వాఁకుడునా ...
ఆం. భా. ౨. ౫౯.

**వాఁగడ.** వి. (వాయి + కడ) ముఖప్రదేశము.

గీ. దంష్ట్రికలు పాదమునఁ గొని తన్నిసంధి,
నున్నరొమ్ముకను సంచున నాదిపట్టి, పాపి
కదిలిచి వెతికి యూపతీ యధిక, వేగమునఁ
బులివాఁగడ వెడలిపోయి.
కేయూర. ౩. ౧౨౦.

**వాఁగడుపు.** వి. (వాపు + కడుపు.) వాఁపు గల కడుపు.

సీ. బీదనరాలతోఁ బెరుఁగువాఁగడుపులో బల్ల
నల్లడలందుఁ ద్రుళ్లిపడఁగ ...
శుక. ౩. ౩౦.

**వాగరత(ర్త).** వి. సముద్రతీరము. (శ. ర. బ్రౌ.)

**వాఁగించు.** స. క్రి. (√ వాఁగు) మ్రోగించు, ధ్వనింపఁజేయు.

వ. ... ప్రచండదండంబగు వానిపిచండంబు వాఁ
గించి కొలంగాలు గిలించి ...
భాగ. ౧౦. పూ. ౧౩౪౫.

**వాఁగు.** అ. క్రి. (సం. గవచ్.) ౧. వదరు, ప్రేలు.

సీ. వేదాంతయుక్తులు వినికొండు సేర్చుక
వాఁగినాతఁడు రాజయోగి గాఁడు ...
వేణు. గో. శ. ౭.

౨. మ్రోఁగు, ధ్వనించు.

ఉ. చెంగున దాఁటుఁ జూపు లిరు చిక్కని బెడిస
లేమొ మీఁటినన్, గ్రంగన వాఁగు గుబ్బలం
చౌకారపుఁదాళము లేమొ ...
విజ. వి. ౧. ౧౧౭.

వి. ౧. సెలయేఱు.

చ. కదిసిన భీతి వానరులు కన్గొనిఁ బాఱియు
గహ్వరంబులం, దొదిఁగియు వాఁగుప్రంతఁ
బడియుండియు ...
భా. రా. యుద్ధ. ౯౧౨.

గీ. నెత్తురులఁ బోఁగి బవరంపు నేలఁ ద్రెళ్లి,
సోఁకుదొర యొప్పె గట్టులనూఁడుతాలి,
వాలుచేఁబడ్డ జేగురు వాఁగుగములతో
నెనయు మేటిగుబ్బలతో దొరయుచు.
అచ్చ. రా. యు. ౫౫౭. ఆము. ౬౭౩.

౨. నది.

ఆ. మేఘమార్గ మెక్కి మేరుశైలము దాఁటి,
మింటివాఁగు నొరసి మిగుల మెఱసి ...
తపతీ. ౩. ౨౦.

మ. దినవాథప్రతిరూపుఁ డాతఁ డెలమిన్
దేశాంతరాసక్తిమైఁ, జని యాశ్చర్యకరంబు
లౌ పురములున్ శైలంబులున్ వాగులున్,
వనమధ్యంబులుఁ జూచుచుం దిరిగి ...
ద్వా. ౯. ౯౧.

౩. సైన్యము.

క. తెలుఁగుగని కడఁగి యిరువాఁ గులుఁ బోరికిఁ
జొచ్చె ... భార. విరా. 3. ౧౯౫.
చ. తావకా, ప్రతిహతబాహురతు యిరు
వాఁగును జూడఁడ పాండవోత్తమా ...
భార. కర్ణ. 3. ౧౨౦.
చ. నడచెఁ గుమారువాఁగు భువనంబు సమ
స్తము నొక్కపాయగాన్ ...
క. సం. ౧౧. ౫౯౫.
౪. పక్షము, వైపు.
వ. వైరాగ్యానుబంధంబు లుడిగి యయ్యిరు
వాఁగువారును ... హర. ౬. ౧౧౦.
౫. బ. అలలు.
చ. గిరిరథ మెక్కి తమ్ము లిరు గ్రేవ గిరిద్వయ
మట్లు దవ్వులన్, దురమునఁ దేరులై
యొదవఁ దోఁచబడి వాఁగులు వచ్చులీల రాల్,
గురియఁగ దేరిమీఁది పురికోటల శేఁగసదండ
కోటులన్, దిరిగిననింగిమేన వడిసెం బయి
పై నన రక్తపూరముల్. కవి. ౫. ౧౧౪.
జః వాఁగించు, వాఁగుడు.

వాఁగుడు. వి. (√ వాఁగు.) ౧. ప్రేలుట, వద
రుట.
(వ్యవ.) నీవాఁగు డింక చాలించు.
౨. మ్రోఁగుడు, మ్రోఁత. (శ. ర.)

వాఁచు. అ. క్రి. ౧. మిక్కిలి అపేక్షించు;
ఏఁకరు.
శా. ప్రారంభించినవేదపాఠమునకున్ బ్రత్యూ
హాము సంచునో, యేరా తమ్ముఁడ
నన్నుఁ జూడఁజనుదే వెన్నాళ్లనోయుండి
చ, తుర్వారాశివయుగంబు వాఁచె నిమఁ
గన్గోనన్కి ... పాండు. 3. 33.
ఉ. ... కన్నులు వాఁచు నీమొగము గానక
యొప్పుడుఁ జూడకున్న నాయన్న యిఁకేటి
కిన్ దమకమారసి చూచిన వింత వాఁడవే.
యయా. 3. ౧౪౫. వి. పు. ౬. ౧౦౨.
౨. వాయించు.
ఉ. ... సాంపునిం, ప న్నటియించియుం దివిని
మద్దెల వాఁచియుఁ బ్రొద్దువోక యా,
కన్నులు కేళికావని నొకానొకవాఁడు
మెలంగి రయ్యెడన్. చం. రా. ౨. ౯౫.
సీ. సరసిజాక్షి యొకర్తు స్వరమండలము వాఁచ
బోటి యొక్కతె దండ మీటి పాడ.
వాల్మీకి. 3. ౧౨౫.
3. రోగముచే సుబ్బు.
(వ్యవ.) వానికి జబ్బుచేసి కాళ్ళు వాఁచినవి.
ఒడలు వాఁచు = పొగరెక్కు, ఉద్ధతుఁడగు.
(వ్యవ.) ఈ మధ్యన వాఁడు బొత్తిగా ఒడలు
వాఁచి పెద్దవారి నెదిరించుచున్నాఁడు.
జః వాఁగడువు, మాఁపి, వాఁపిరి, వాఁపిరి
గొట్టు, మాఁపు.

వాఁడి. వి. ౧. తీక్ష్ణత, పదను, వైశిత్యము.
ఆ. వాఁడిఁ బొదలు జఠర వైశ్వానరుఁడు...
ఆము. ౪. ౨౩౦.
ద్వి. వాఁడును గోపించి వసుధేశుమేన, వాఁడి
తూఁపులు నాటె వడి నైదుపదులు ...
ద్వి. భార. ౧. ౨౨.
క. ... అహి యేమి కోఁబల్ వాఁడి సెడిన ...
ఆము. ౪. ౨౩౫.
౨. క్రూరత్వము.
క. నారీజనముల కొజ్జా, కారియగుభటుండు
మరుఁడు గాఁబోలుఁజుమీ, వారి కటా
క్షము సోఁకిన, వారియెడల వాఁడిఁ జూపి
వర్తించుఁ గదా ... భర్తృ. ౨. ౧౧.
సీ. ఈ వాఁడి చాలించి మావాడ నలికేటి
చేదోడుగా నుండు చిలుక నీకు ...
ఇందు. ౪. [illegible].
3. కాఠిన్యము.
లోవాఁడి = లోపలవాఁడి.

మ. ... కోశంబులో వాలుమె, ల్పుస రాజి
ల్లుచు మాటమొత్తఁ దనమున్ లో వాఁడియు
న్నేర్పడన్ ... భాగ. ౧౦. ౨౨౩.

౪. పరాక్రమము, శౌర్యము.

ద్వి. నేఁడు మీ ధర్మాన నెఱవేఱఁ గలిగె,
వాఁడిచేఁ బెండ్లాడి వచ్చెద ననుచుఁ,
గడఁగి దుశ్శకునముల్ గనిపింప నిటకు
నడచితి. ద్వి. నల. ౨. ౬౦౯.

మ. ... రణంబునఁ బోడిన్ రిపుగెల్చు
వాఁడితోఁ బ్రజాపోషంబు ధర్మంబు
రాజునకౌ ... ఆము. ౩. ౬౧.

చ. కొడవలి వ్రేలినట్టు దొర కూఁకటికిన్ వెస
నిడ్డ నాభిచం, దడరఁగఁ గాంచి పంచవి
శిఖాఖ్య తురుష్కులంబు వాఁడికె,క్కుడు
సమయం బటంచదరు గ్రోవులు గాల్పఁగఁ
బిట్టు మండ్పచిం,దెడు పోగనా సజాండ
మున నిండెనఖండ తమః ప్రకాండముల్.
రా. ౨. ౪. ౪౧.

విణ. ౧. పదనైనది, నిశితము ...
రాఘవ. ౨. ౨౧.

క. ... దేవ,వ్రతు మీఁదను సాళ్వుఁడేసె
వాఁడిశరంబులో ... భార. ఆది. ౪. ౨౦౪.

వ. వాఁడులగు కత్తులన్ దిత్తు లాలిచి ...
మనుచ. ౪. ౬౦.

గీ. ...వాఁడి పండ్లు బిగించి చేవలఁతియొగిరి...
హర. ౧. ౨౦.

౨. తీక్ష్ణము.

క. వాఁడి యగు నలుకలోకము, పోఁడిమి
చెడఁగయ్యమల్లు పొడిచి వసటమై ...
భార. శాం. ౧. ౬౩.

ఉ. కొంపలు మంతనంబులను గొందఱు జంకెన
వాఁడి చూపులం, గొందఱుఁ జేతి సన్నలఁ
దగుల్పడఁ జేయుచు ...
పారి. ౧. ౧౦౭. శశాం. ౫. ౭౪.

౩. క్రూరము.

క. నాఁడగ్ని లోనఁ ద్రోచిన,వాఁడ వకట
యంతఁబోక వల్లభనిమ్మె, నేఁడడవిఁ
ద్రోచి తెచఁగడు, వాఁడిగదె నీకు రాఘవ
కులప్రవరా ... నిర్వ. ౧౦. ౧౨౯.

౪. వేడిమైనది.

ఉ. వాఁడిమయూఖముల్ గలుగువాఁ డపరాం
బుధిఁ గ్రుంకె ... భార. ఆది. ౩. ౧౧౨.

జ: వాఁడి చెఱచు, వాఁడితనము, వాఁడి
మగఁడు, వాఁడిమి, వాఁడివెట్టు, వాదర.

**వాఁడిచెఱుచు.** స. క్రి. (వాఁడి + చెఱుచు)
పరాక్రమ హీనునిచేయు.

సీ. బ్రహ్మత్వమును బొంది పరఁగు విధాతను
వాణికై యెవ్వఁడు వాఁడి చెఱిచె ...
భాగ. ౧౦. ఉ. ౧౦.

**వాఁడితనము.** వి. (వాఁడి + తనము) తైక్ష్ణ్యము,
పరుషత్వము.

ఆ. అతివఁ జంపఁ బాపమని యూరకుండిన,
నోరి కొలఁగులాడె దొర నన్ను, వనితకింత
వాతి వాఁడితనం బేలఁ బ్రఘల నోట లేక
పలుకు లేల ... భా. రా. సుం. ౨౦౨.

౨. పరాక్రమము.

చ. ... భయంబునఁ బాఱితి పెక్కు మార్లు
వం, చన మధురాపురి న్విడిచి సాగర
మధ్యము నందు డాఁగవే, వనరుహనాభ
బిరుదు వాఁడి తనంబును నాకు నింతయే.
భాగ. ౧౦. ఉ. ౭౨౯.

**వాఁడిమగఁడు.** విణ. (వాఁడి + మగఁడు.) ౧.
శూరుఁడు.

క. నీఁడొకఁడు కురుబలంబున, వాఁడి మగం
డనఁగఁ జాలువాఁడు ...
భార. విరా. ౫. ౧౧౧.

క. తగువారిఁ బిలిచి యిదిగో, లగనము దాకొ
నియొసెల్లిలలిఁ బుడమికి నేఁనిఁగఁ జేయ
వలయురక్కసి, మగువంబోరి గొన్న వాఁడి
మగనిఁగడంకన్. అచ్చ. రా. అయో. ౮.

క. ధరలో శూరాహ్వయనులు, పరఁగును
మొనకొఁ డనంగ బంటనఁగాఁ బోటరి
యన వడిగల వాఁడన, బిరుదన వాఁడిమగఁ
డనఁగ భీమకపర్ది. ఆ. సం. మాన. ౫౧.

**వాఁడిమి.** వి. (వాఁడి + ఇమి.) ౧. తేజము, ప్రతాపము.

ఉ. నేఁడు ప్రసూతికాలమున నీవు గదాధర
నుద్గ్రహంబునన్, వాఁడిమి తోడ నుండి
జము వాకిలివట్టి మదీయసంతతిం, బోఁడిమి
తోడఁ గాంచి ... ఉ. హరి. ౨. ౧౭.

ఉ. వింటిరె యొక్క వార్త మన వెజ్జులు
చెప్పిరి తాము కన్నులం, గంటి మటంచు
నీతబిసిగాంప్రడు మదీయమహాగ్రమాయక్కై,
దంట తనంబునం జని బుసుధ్వజు సైన్య
సమేతుఁ జేర నా, బంటు తనంబుఁ బాపు
టకుఁ బన్నిన వాఁడట వాఁడు వాఁడిమిన్.
కువల. ౨. ౧౦౧.

క. వేఁడికొని కృపణులైనను, పోఁడిమి యది
యేల రాజు పుత్రులడమ్మై, వాఁడిమి
దప్పిన నిప్పులు, వేఁడిమి సెడినట్లు జనులు
విని యులుకుదురే.
భార. ఉద్యో. ౩. ౧౯౭.

౨. పరాక్రమము.

ఉ. ... పోరిలో, వాఁడిమిఁ గొంతకాల మిల
వ్రాలుట లావరియేట ... ఆము. ౬. ౨౧.

౩. తీవ్రత.

ఉ. ... వాఁడిమి గల్గు శాపమున వచ్చెఁ బురా
కృత కర్మ భావ్యమె, వ్వాఁడును నేర్చునే
తొలఁగవైవఁగ నోర్వక పోవవచ్చునే ...
భార. విరా. ౧. ౨౩౮.

క. పోఁడిమి చెడియునుఁ దనమది, వాఁడిమి
సెడనీక లబ్ధవైరాగ్యం డై, వాఁడతి
నియమంబునఁ బడు, మూఁడేఁడు దాఁక
ధాన్యమున నుండంగన్.
ద్వా. ౧౦. ౧౧౪.

౪. శౌర్యము.

క. మూఁడవవి ల్లెత్త నదియుఁ, బోఁడిమి చెడి
పోవ నసుర పొలుపరి యలుకన్, వాఁడిమి
యొసఁగఁగ నొకగద, వేఁడిమితో వైచె
వృష్ణివిభుసతిమీఁదన్.
హరి. ఉ. ౪. ౧౫౭.

ద్వి. వాఁడిమి మెరసి దుర్వారుఁడై కడఁగి
వాఁడె గురోర్వధన వచ్చినవాఁడు ...
ద్వి. భార. ౨. ౨౮. పొ.

౫. వాఁడి, పదను, నైశిత్యము.

సీ. వజ్రాయుధంబుక్రొవ్వాఁడిమి మెచ్చని ఖర
ఖంబుల నొప్పు చరణయుగము ...
భా. రా. అర. ౧౦౨.

**వాఁడివెట్టు.** స. క్రి. (వాఁడి + పెట్టు) వాఁడి కలిగించు.

ఉ. నాకులభీకదానవగణంబులతో సరిపోలు
వారె వీఁ, డేకుల వాఁడివెట్టెఁ దన యొద్దును
దాను నిటుండి వీని ము, న్నేకతమంత మజ్జ
ముని యింటికి నంచుఁ గస్తుఁ దాఁకి రా,
లోకము లగ్గి సల్ల నెటులో యట నెవ్వరో
యింటి వేనియున్ ... కళా. ౫. ౪౫.

**వాఁడు.** ౘ. (క. అవను, త. అవణ్.) తచ్ఛబ్దార్థకమగు (అ) అను సర్వనామశబ్దముయొక్క మహత్పుంలిఙ్గైకవచనరూపము. ప్ర. బ. వారు, వారలు, వాండ్రు. ద్వి. ఏ. వానిన్, ద్వి. బ. వారిన్, వారలన్, వాండ్రన్. మొ.

వ. హర్షించి వారు సవిస్మయ స్వాంతులయి...
ఆము. ౧. ౧౮.

గీ. మెఱసి యుపకార మొసరింప మేలువచ్చుఁ,
గీడు వచ్చు మనంబులో నోడ వలదు,
వాఁడు చేసిన ధర్మంబు వానిఁ గాచుఁ,
గీర్తి యొక్కటి చాలదే కేవలంబ.
కాశీ. ౨. ౧౦౪.

ద్వి. వాఁడును చనుదెంచి వరుసఁ బాండవులఁ,
బోఁడిగాఁ బురమున నును దోడితెచ్చి ...
ద్వి. భార. ౧. ౧౬.

ఉ. నావుడు వార లమ్మనుజనాథున కిట్లనిరి...
ఆము. 3. ౫౬.

౨. సంబంధార్థమున పదములకను ప్రయుక్తము.

మ. వడుగా యెవ్వరివాఁడ వెవ్వఁడవు ...
భాగ. ౮. ౫౪౯.

(ఇట స్వస్వామి భావసంబంధము.)

ఉ. ఎక్కడివాఁడొ యక్షతనయేందుజయంత వసంతకంతులకు, జిక్కఁదనంబున న్గెలువఁ జాలెడువాఁడు ... మనుచ. ౨. 3౫.

(ఇట ఆధారాధేయభావసంబంధము.)

ఉ. నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు ...
భాగ. ౧౦. పూ. ౧౦౧౦.

(ఇట ధర్మధర్మిభావసంబంధము.)

ఉ. ... నవ్వురా, జిల్లెఁడు మోనువాఁడు ...
భాగ. ౧౦. పూ. ౧౦౧౦.

(ఇట అవయవావయవిభావసంబంధము.)

**వాఁత.** వి. తెగులు గొంట్లైన పశ్వాదులకు వేయు చూఁడు. (శ. ర., వా.)

**వాఁపి.** విశే. (వాఁపు + ఇ.) శోఫి, వాఁపు గలవాఁడు.

గీ. వాఁపి యన నులిపి యన నుల్పడన శోఫి,
శోఫిలు ... ఆం. భా. ౨. ౧౨౨.

**వాఁపిరి.** (వాఁపు + ఇరి) మిక్కిలి కాంక్షించుట, ఏకరుట. (శ. ర., వా.)

**వాఁపిరిగొట్టు.** విశే. (వాఁపిరి + కొట్టు) వాఁపిరి వాఁడు, ఏఁకరువాఁడు. (శ. ర., వా.)

**వాఁపు.** వి. (√ వ్యాపే) రోగాదులచే శరీరము ఒక విధముగా లావగుట, పొంగుట. (ఇది సానుస్వారమని. శ. ర. నిర్ధారకము.)

క. ఊపిరి వెడలక కడుపున, వాఁపొదవినఁ బాముప్రాణవాతంబులు సం, తాపించి ...
భాగ. ౧౦. పూ. ౪౭౦.

**వాకట్టు.** స. క్రి. (వా + కట్టు) వాగ్బంధము చేయు.

ద్వి. దాదివాకట్టి భూతలనాథు పట్టి, నాదట నీ రీతి నట్టొత్తి చంప ...
హరిశ్చ. ఉ. ౨. ౪౧౧.

సీ. వాకట్టులిని వాసవప్రముఖాదితేయుల ...
ప్రభులిం. ౭. ౪౨. (ప్రా.)

దం. ... హోమమంత్రంబులన్ మారు తంత్రంబులన్ జిక్కఁడే సొక్కఁడే దిక్కులం జిక్కులంబెట్టు వేధన్ మహా వేగ నైనన్ విరోధించి వాకట్టు నీతిన్, బలారాతి మంత్రిన్ బ్రమోహించు ...
భోగినీ దండకము.

గీ. అనుచుఁ దమ వేలుపులనెల్ల నమరఁ దలఁచి వేఁడుకొని మ్రొక్కి వాకట్టు వేళ్లు గొనుచు, వలను లెస్సైన మిక్కిలి నలరు గొనుచు, వచ్చి యెఱుకులు వేఁటాడఁ జొచ్చిరపుడు ... యయా. ౨. 3.

వి. ౧. వాగ్బంధము చేయు మందు మొ.

గీ. మూలికల్ మణుల్ వాకట్టు మొదలు గాఁగఁ, జోరసంగ్రహణీయ వస్తువులు గొనుచు ... దశా. ౧. ౨౬౦.

ద్వి. కుక్కల వాకట్టుఁ గొంకి నారసము ...
బస. పు. ౫. 33౭. పం.

౨. వాగ్బంధము.

క. ... (కొ) కలియుర్వరుద్రమహాశేషరాజుల చప్పరము వాకిటి అంగరక్షు బొల్లి నాయం కులు ... ద. శా ౨౦౫.

**వాకు = వాక్కు.** సం. వి. చ్. స్త్రీ. ౧. పలుకు, మాట.

క. ... సౌమ్యాకృతులుగానివారల, వకులు శిక్షలు నుపద్రవంబులు గావే ...
భార. ఆది. ౨. ౪౧.

క. వాకును మనసును గాయము, నేకాయన వృత్తి శౌచమోపలని తపనుం, జేకొనునది గాని బోధ, శ్రీకి ఘృతంబునకు వహ్నిక్రియ జనకమగున్. భార. శాం. ౪. ౩౩౩.

సీ. వడుగు వాకుగ బలిసడుగువాకునఁ జేరి యడుగు వాలఁగఁ ద్రొక్కు నడుగు వాఁడె ... ప్రబంధ (అచ్చ తెనుఁగు) ౩.

౨. భాష.

గీ. వాకునా భాషయనా నలవంబు తెనుఁగు, కన్నడంబు నమటి యిట్లు కొన్నిదేశ, భాషలై యొప్పు ... ఆం. భా. ౧. ౧౧౦.

౩. సరస్వతి.

**వాకులము.** సం. వి. అ. న. పొగడ పువ్వు.

**వాకొను.** స. క్రి. (వా + కొను) చెప్పు, వచించు.

క. నీ కిప్పుడు గానంబడె, నాకులకును సురగ పతి పినాకుల కైనన్, వాకొనఁగం దల పోయను, రాకుండు మదీయరూపరమ్య త్వంబుల్. భాగ. ౩. ౩౨౩.

క. వాకొను తెరవుఁ జలంబునఁ, బోక తెరవు విసక వాగుపుట్టినచోఁ దా, నాకును సాక్షియు నేలా, యేకం బనుభవము చాలు నేర్పడఁ దెలుపన్. విజ్ఞా. ౩. ౩౬.

ఉ. వారివిహారముల్ సలుప వాంఛ జనిం చెను శేరరాఁగదే, వారిజమిత్రపుత్రి యని వాకొని పిల్చిన ద. శా. ౨. ౧౨౪.

౨. అఱచు, పేర్కొను, వ్రాకుచ్చు.

క. కనుఁగొని పలుఁదెఱఁగులవా, కొనిలేచఁగ. అచ్చ. రా. సు. ౨౬.

**వాకొలుపు.** స. క్రి. (√ వాకొను) వాకొనఁ జేయు.

సీ. ... గీ. సరుపులిడు నారసంగుల ముఱికి గవులు, చేఁప తిట్టల గనుగుతోఁ జెనసి మట్టుఁ, గూఁత వెట్టు జనుల వాకొలుపఁ జేయు, భయము గొల్పెడు నొక బోయపల్లె గాంచి. వాల్మీకి. ౨. ౨౫.

క. నాకముఁ గూల్చుటకో భూలోకముఁ గాల్చుటకొ ...... వాకొల్పెడు కోఁతి పోరు వ్రాకుక్వకుని ...
రామా. ౨. ౧౪౦.

గీ. పసులఁ జూపులు వాకొల్పఁ బ్రబల నీల ... నైష. ౨. ౬౧.

**వాకోవాక్యము.** సం. వి. అ. న. ఉక్తి ప్రత్యుక్తి రూపమయిన సంభాషణము.

క. మీకును మీపతిదూపలి, మాకును మా భర్తయాజ్ఞ మన్నింపఁదగున్, వాకోవాక్య ముల్మల వెడ, వాకొట్లం బల్బజంబు వలపడు సేయన్. శివరా. ౪. ౨౦.

**వాక్కలహము.** సం. వి. అ. పుం. మాటలతోఁ బోరాటము.

**వాక్కీరుఁడు.** సం. వి. అ. పుం. వేడుక మాటతోఁ గీరమువలె సంతోషపెట్టు వాఁడు, భార్యతోడఁ బుట్టినవాఁడు, శ్యాలకుఁడు.

**వాక్కు-(కు).** సం. వి. చ్. స్త్రీ. ౧. పదము, శబ్దము. ౨. మాట, పలుకు. ౩. భాష. ౪. ధ్వని. ౫. చెప్పుట. ౬. వాగ్దానము. మాట యిచ్చుట. ౭. సామెత. లోకోక్తి. ౮. సరస్వతీదేవి.

**వాక్చపలుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) పనికి మాలిన మాటలు పలుకువాఁడు; మంచిచెడ్డ లాలోచింపక మాటలాడెడి వాఁడు.

**వాక్చాపల్యము.** సం. వి. అ. న. వదరుట; వదరుఁబోతుతనము.

**వాక్ఛలము.** సం. వి. అ. న. మాటలయం దమర్యాద, తప్పించుకొనుజవాబు, నిజముచెప్ప కుండఁ దప్పించుకొనుట.

**వాక్పటువు.** సం. విశ. (ఉ.) మాటాడు నేర్పు గలవాఁడు. మాటలయందు నేర్పరితనము.

**వాక్పతి.** సం. విశ. ఇ. గొప్ప వక్త.

వి. ఇ. పుం. ౧. బృహస్పతి. ౨. పుష్య నక్షత్రము.

**వాక్పారుష్యము.** సం. వి. అ. న. ౧. భాషా కాఠిన్యము, మాటలయందలి కఱకుఁదనము. ౨. నిందించుట.

**వాక్ప్రచోదనము.** సం. వి. అ. న. వాఙ్మూల మైన యాజ్ఞ, మాటలతోఁ దెలుపఁ బడిన యానతి.

**వాక్ప్రతోదము.** సం. వి. అ. పుం. మాటయ నెడి యంకుశము. అంకుశము వలె బాధించు మాట.

**వాక్యఖండనము.** సం. వి. అ. న. వాదము ఖండించుట.

**వాక్యపదీయము.** సం. వి. అ. న. గ్రంథవిశే షము, భర్తృహరి విరచితమగు నొకగ్రంథము.

**వాక్యభేదము.** సం. వి. అ. పుం. వేఱుగాఁ జెప్పుట; విరుద్ధముగాఁ జెప్పుట.

**వాక్యము.** సం. వి. అ. న. ౧. మాట, పదము. ౨. పరస్పరసంబంధముతోఁ గూడి యేకా ర్థత్వము గలిగి క్రియతోఁగాని తదితరముతోఁడఁ గాని సమన్వయించు పదసమూహము; యోగ్యత, ఆకాంక్ష, ఆసత్తి, గలపదసమూ హము. ౩. (తర్క-) వాదము. ౪. సూత్రము, నీతివాక్యము; విధివాక్యము.

**వాక్యరచన.** సం. వి. అ. స్త్రీ. వాక్యముసఁ బదములకూర్పు.

**వాక్యవిన్యాసము.** సం. వి. అ. పుం. = వాక్య రచన.

**వాక్యవిశారదుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) మాటలయందు నేర్పుగలవాఁడు. మాటలా డుటయందు చాతుర్యముగలవాఁడు.

**వాక్యశేషము.** సం. వి. అ. పుం. ౧. వాక్యము తర్వాయి; సమాప్తి కానివాక్యము. ౨. ఒక భాగమున లుప్తమగు వాక్యము.

**వాక్యోపమ.** సం. వి. అ. స్త్రీ. ఉపమాలం కారభేదము.

**వాక్యాలాపము.** సం. వి. అ. పుం. సంభా షణము.

**వాక్రుచ్చు.** స. క్రి. (వా + కూర్చు.) (త. వాయ్కొడుత్తల్) సంధిని వర్ణవికారము.) ౧. పేరుకొను, పేరుచెప్పు, పలుకు.

ఉ. మెచ్చి యొకింతగౌరవము మెచ్చుకయుండి లఘుత్వలేశమున్, తెచ్చుటకున్ సమర్థత కృతిక్రియకున్ గుకవిత్వ గర్వితుల్, తచ్చ రితం బుపేక్ష కుచితంబగుఁగాక నగంగ నైన వాక్రుచ్చి యజాగళస్తనసగోత్రుల వారల నెన్న నేఁటికిన్. కళా. ౧. ౬. ౭.

క. ... తగునయ్య వనితకు, వనితలకు శ్చేష్టిత
ములు వాక్రువ్వంగన్ ...
భార. అను. ౨. ౧౬౯.

౨. వచించు, చెప్పు.

సీ. కలిగా లేకుండె నిట్ల లఘు గుణంబులు
వాక్రుచ్చి మాయంతవార లిట్లు, గాని
యూడ ... భార. శాం. ౧. ౩౭౬.

సీ. నృపుల చేఁజట్టి కానికలు దెచ్చిన సొమ్ము
కొలఁది యెవ్వరికి వాక్రువ్వరాదు ...
విక్ర. ౫. ౧౨౦.

సీ. ... వాక్రుచ్చె నుడివెను బలికె నాడె, నని
ననఁగ వచించె నంచును విలసిల్లు ...
ఆం. భా. ౩. ౧౧౯.

ద్వి. ...వారక తలపోయ వాక్రువ్వఁజాల ...
హరిశ్చ. పూ. ౧౨౫౪.

క. ... అంబికేయు చరితము దుర్యోధను కొఱ
గామియు నెవ్వారును వాక్రువ్వంగ వెఱ
తురు కురుప్రవరా ...
భార. ఆశ్ర. ౧. ౧౫.

ద్వి. వరమిచ్చు నప్పుడు వాక్రువ్వఁ డయ్యె,
నరులఁ గావునవాఁడు నరులచేఁ జచ్చు ...
రం. రా. బాల. ౧౪. పా. ౪. పం.

మ. ... ఈవు మానవులతో నేవేళఁ బోరా
డఁగాఁ, కృశతంబొందె మదీయకాతుక
మగే మాయన్న వాక్రుచ్చెదన్ ...
ఉ. రా. ౩. ౩౦౧.

మ. ...సరసగోష్ఠిన్ బోటియుం దాను నవ్వన
జాతాయతనేత్ర శౌరిగుణముల్ వాక్రుచ్చి
వర్ణించుచున్ ... పారి. ౧. ౪౧.

గీ. ... వానిచెలువంబు నుడువుల కేని కైనఁ,
బూని దిటముగ వాక్రువ్వఁ బోల దెందు...
నీలా. ౧. ౭౨.

మ. అని సంకల్పభవైకసాత్తులగు శయ్యానేక
సంభోగ చిహ్నసలన్ భూపతి ప్రత్యభిజ్ఞ
కొఱకై యందంద వాక్రువ్వ న, వ్వనితా
రత్నము వాలుఁగన్నులఁ బతిన్ వారిం
చుచున్ ... సైమ. ౮. ౭౪.

దండకము. ...నీవుగావించు చెయ్యాల్ సెంచిం
బూని వాక్రువ్వ నెవ్వారికిం దీరు ...
నీలా. ౨. ౮౧.

సీ. వాక్రుత్తు తిక్కయాజ్వప్రకారము రసా
భ్యుచితబంధముగ నొక్కొక్కమాటు ...
కాశి. ౧. ౧౩.

శా. భద్రాశ్వక్షితిపాల చెప్పితి భవత్ప్రశ్నాను
రూపంబుగా, రుద్రాంభోరుహగర్భ ముఖ్యు
లకు వాక్రువ్వంగరా కద్భుతో,న్నిద్రం
బైనమహాతిహాసమిదియే ...
వరాహ. ౯. ౨౦.

వాక్సంయమము. సం. వి. అ. పుం. వాక్కును నిరోధించుట, మౌన మవలంబించుట.

వాగ. సం. వి. పాదుక.

ద్వి. యోగవాగలు మెట్టి యొకపాద మూది,
బాగుగా నొసపరి బాగునటించు ...
హరిశ్చ. ఉ. ౧౩౫.

వాగ. సం. వి. ఆ. స్త్రీ. కళ్లెము.

వాగంటిపులుఁగు. వి. (వా + గంటి + పులుఁగు)
చిలుక, కీరము.

ఉ. తుంటఁట కార్ముకంబు కరదొట్టిన తేంట్లఁట
వింటినారిచే, యంటినవాఁడు తూపులఁట
యప్పులపాలఁట కేతనంబు వాఁగంటి
పులుంగు గుఱ్ఱమఁట కాయము లేదఁట నీకు
లోకముల్, కొంటెతనంబునన్ గెలిచితో
లిది యచ్చెరియంబు మన్మథా.
కృ. శకుం. ౨. ౧౪౯.

వాగపహారకుఁడు. సం. విణ. (అ. ఓ. కా. అ.)
౧. మాటలు దొంగిలించెడివాఁడు. ౨. నిషే
ధింపఁ బడిన గ్రంథములు చదువువాఁడు.

**వాగము.** వి. వాగె.

క. మొగలిరేకుల పలుకయుఁ గలువకాఁడి యుఁ గురువేలు వాగంబులును సంతరించి వసంతసారథి తిన్ననై యున్న క్రొన్నన మునికోలఁ గదల్చి యదల్చినం గెరలి చెరలికొట్టుచు మిన్నులపై బారు చిలుక వాహవంబులు. శృం. ౨. ౨౯౪.

**వాగరము.** సం. వి. అ. పుం. ౧. గీటుఱాయి; బంగారు మొదలగువాని వన్నెచూచెడి యొరగల్లు. ౨. విఘ్నము; అంతరాయము. ౩. నిశ్చయము. ౪. బడబాగ్ని. ౫. తోడేలు.

**వాగరుఁడు.** సం. వి. అ. పుం. ౧. ఋషి. ౨. పండితుఁడు. ౩. శూరుఁడు. ౪. ధీరుఁడు.

**వాగఱ.** వి. (వాయు + కఱ్ఱ) ముచ్చినాఁడు చిత్తరువు వ్రాయుతూలిక. (శ. ర., బ్రౌ.)

**వాగళ(ళ్ల)ము.** వి. (వా + కళ్లము) కళ్లమునకు ముందుభాగము; ఖలముఖము. (శ. ర., బ్రౌ.)

**వాగాడంబరము.** సం. వి. అ. పుం. ఎక్కువ మాటలు మాటలాడుట, పదాడంబరము.

**వాగాయిత్తము.** వి. (సం. వాగ్వివాదః) వాగ్వివాదము, మాటలపోరాటము. (శ. ర.)

**వాగారువు.** సం. విశే. (ఊ.) ఆడితప్పిన వాఁడు; కృతఘ్నుఁడు; కృతఘ్నురాలు.

**వాగియ = వాగె.** వి. గుఱ్ఱము నోటికళ్లెమునకుఁ దగిలించెడు పగ్గము.

ద్వి. రాగెలు బిగియించి రథసంబుతోడ, వాగియ సడలి చువ్వన రెండుగడల.

ద్వి. పరమ. ౩. ౨౩౦. పా.

**వాగీశుఁడు.** సం. వి. అ. పుం. ౧. బ్రహ్మ. ౨. బృహస్పతి. ౩. గొప్పవక్త.

**వాగీశ్వరి.** సం. వి. ఈ. స్త్రీ. సరస్వతి; పలుకుఁజెలి.

**వాగీశ్వరుఁడు.** సం. వి. అ. పుం. ౧. గొప్పవక్త, వాగ్ధాటిగల మనుష్యుఁడు. ౨. బ్రహ్మ.

**వాగుజి.** సం. వి. ఈ. స్త్రీ. కారుగచ్చె. (శ. స.)

**వాగుర.** సం. వి. ఆ. స్త్రీ. వల; పాశము, ఉరిత్రాడు.

**వాగురావృత్తి.** సం. వి. ఇ. స్త్రీ. వేఁటవలన జీవించుట. పుం. వాగురికుఁడు, వేఁటకాఁడు.

**వాగురికుఁడు.** సం. వి. అ. పుం. వలలు, ఉచ్చులు ఒగ్గి జంతువులను వేఁటాడు జాతి వాఁడు; వేఁటకాఁడు.

**వాగురువు.** వి. (సం. వాగురా.) ఉచ్చు, ఉరిత్రాడు.

గీ. దురితమృగశాబకములవా గురువుగురువు ...

వరాహ. ౪. ౧౧౦.

**వాగృషభుఁడు.** సం. వి. అ. పుం. భాషయందు సమర్థుఁడు, గొప్పవక్త.

**వాగె(గియ).** వి. (సం. వాగా) గుఱ్ఱపునోటి కళ్లెమునకుఁ దగిలించెడి పగ్గము.

చ. అరయఁగ రాజధర్మము సమాశ్రయమై నడపుం ద్రివర్గమున్, గురుతర మోక్షధర్మము నకుం దలఁపం దనప్రాపయూఁత భూ, వర వినుఘోటకంబునకు వాగెయుదంతికి నంకుశంబు నే, కరణి నివారకంబులు జగంబుల కట్టుల తాను నెమ్మెయిన్.

భార. శాం. ౨. ౧౫౮.

సీ. వాగెలు గుదియించి రాగసన్నలు సేయు హరణ పుటంబులనొఘళించు ...

చిత్రభా. ౪. ౩౬.

సీ. ... వళ్యాపథపుఁ దీగె వాగె తోడ ...
కళా. ౩౬-౨.

జ: వాగె వదల్చు.

**వాగెవదల్చు.** అ. క్రి. (వాగె + వదలుచు) స్వేచ్ఛగాఁ బోనిచ్చు.

చ. మనమున నీవు గోరు నృపమన్మథుతో నినుఁ బెండ్లిసేయ నీ, జనకుఁడు సంభ్రమించె నదె సమ్మద మొందుదు గాక జేలపై, వనరుహపత్రనేత్ర! యిటుఁ వాగె వదల్చిన కోర్కులన్ మనోజున కెర యిచ్చి డిల్లపడఁ జూచినఁ జూచినవారు మెత్తురే. కవి. క. ౩. ౩౯౯.

**వాగ్గుదము.** సం. వి. అ. పుం. అజినపత్త్రి; ఒకజాతిపిట్ట. (తలక్రిందుపక్షి) అనివాడుక.

**వాగ్గులి.** సం. వి. ఇ. పుం. (రాజులు మొ. వారికి) తాంబూల మిచ్చెడివాఁడు, తాంబూల కరండవాహి.

**వాగ్గులికుఁడు.** సం. వి. అ. పుం. = వాగ్గులి.

**వాగ్డంబరము.** సం. వి. అ. పుం. ౧. నిరర్థక పదపుష్టి. ౨. శబ్దచాతుర్యము గలభాష.

**వాగ్దండము.** సం. వి. అ. పుం. ౧. చీవాట్లు, తిట్టు, నిందా వాక్యము. ౨. వాక్సంయమము, వాఙ్నిర్బంధము.

**వాగ్దత్త.** సం. వి. ఆ. స్త్రీ. వాగ్దానము చేయఁ బడిన కన్యక, పెండ్లి చేసికొనుట కిచ్చెదనని యొకనికి మాట యీయఁబడిన కన్యక.

**వాగ్దత్తము.** సం. విశే. (అ. ఆ. అ.) మాటచే నీయఁబడినది.

**వాగ్దరిద్రుఁడు.** సం. వి. అ. పుం. మాటల పేద, మితముగా మాటలాడెడివాఁడు.

**వాగ్దలము.** సం. వి. అ. న. పెదవి, మోవి.

**వాగ్దానము.** సం. వి. అ. న. (ఒక పని) చేసెద నని మాట యిచ్చుట.

**వాగ్దుష్టుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. దూషించెడి వాఁడు, తిట్టెడి వాఁడు. ౨. వ్యాకరణ దుష్టమగు భాష నుపయోగించు వాఁడు.

వి. అ. పుం. ౧. పేరు చెలుచు మానవుఁడు. ౨. యుక్తకాలమున నుపనయనము కాని బ్రాహ్మణుఁడు.

**వాగ్దేవి.** సం. వి. ఈ. స్త్రీ. సరస్వతి.

**వాగ్దోషము.** సం. వి. అ. పుం. ౧. నోటితప్పు, మాట తప్పు. ౨. నిందించుట. ౩. వ్యాకరణ విరుద్ధమగు పదము.

**వాగ్మి.** సం. విశే. (న్. నీ. న్.) ౧. వాగ్ధాటి కల వాఁడు, ఉపన్యాసకుఁడైన వాఁడు. ౨. వదరుఁ బోతు, వాచాటుఁడు. ౩. మంచి మాటలు గలది, ప్రశస్తపదములు గలది.

వి. న్. పుం. ౧. గొప్ప వక్త, యుక్తియుక్త ముగా మాటలాడెడివాఁడు. ౨. బృహస్పతి.

**వాగ్యతుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) వాక్కు నరికట్టినవాఁడు, మౌనము గలవాఁడు.

**వాగ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. మిత ముగా మాటలాడునది; జాగ్రత్తతో మాట లాడునది. ౨. సత్యము మాటలాడునది.

వి. అ. పుం. అణఁకువ, వినయము.

**వాగ్యాముఁడు.** సం. వి. అ. పుం. నోరులేని వాఁడు, మూఁగవాఁడు.

**వాగ్యుద్ధము.** సం. వి. అ. న. వాక్కలహము, తీవ్ర వాదము.

**వాగ్రోధము.** సం. వి. అ. పుం. వాక్ని రోధము, మౌనము.

**వాగ్వజ్రము.** సం. వి. అ. పుం. పిడుగు వంటి మాట ; కఠినవాక్కు, కఠిన భాషణ.

**వాగ్విదగ్ధ.** సం. వి. ఆ. స్త్రీ. తియ్యని మాట లాడెడి స్త్రీ. మాటలచే మోహింపఁ జేసెడి యాఁడుది.

**వాగ్విభవము.** సం. వి. అ. పుం. ౧. మాటల సంపద. ౨. భాషాసంపత్తి, వర్ణనాశక్తి.

**వాఙ్నిబంధనము.** సం. విశే. (అ. ఆ. అ.) వాక్కులపై నాధారపడునది.

**వాఙ్నిష్ఠ.** సం. వి. ఆ. స్త్రీ. మాటపట్టుదల ఆడినమాట తప్పకుండుట.

**వాఙ్మనఃకాయములు.** సం. వి. అ. పుం. త్రికరణములు, వాక్కు, మనస్సు, శరీరము.

గీ. ... నరుఁడు గంగ, నాడి సుచిరకీర్తి జూచిన యంతమాత్రఁ, బాయు వాఙ్మనః కాయ పాపతతుల ...

భార. అను. ౨. ౧౧౦.

**వాఙ్మనసములు.** సం. వి. అ. న.

ద్వి. మాటయు, మనస్సును ...

శ్లో. అథైనం సంస్తుష్టువు స్తుత్యం మవాఙ్మనస గోచ రమ్ ... రఘు. ౧౦. ౧౫.

చ. పరిత వినోద యిట్టిదని దాని తెఱంగు నెఱుఁగంగ బ్రహ్మకుం, గొలదియె తాన వాఙ్మనస గోచరము ... భార. సభా. ౧. ౭౯.

**వాఙ్మయము.** సం. విశే. (అ. ఈ. అ.) ౧. వాక్ప్రచురమైనది. మాటలు మెండయినది. ౨. భాషా స్వరూపమైనది. ౩. భాషా సంపన్నము. వాగ్ధాటిగలది.

అ. న. ౧. సారస్వతము, భాషాప్రపంచము.

వ. అంతఁ దొలుత యోగసాంఖ్యంబులకు దదాచార్యులను సృజియించి మహావ్యాహృతిత్రయంబున లోకత్రయంబున నుత్పాదించి నిజశరీరార్థంబున నఖిల వాఙ్మయ మూర్తియగు సుందరిఁ గలిగించి ...

హరి. ఉ. ౯. ౧౫౩.

౨. సాహిత్యము, కావ్యనాటకాలంకారాది.

క. మును మునిముఖ్యులు భక్తిం, గొని యాడఁగ నిఖిలనిగమగోప్యంబై యొప్పిన వాఙ్మయమును నిట్లని, వినుతించె ననంతమహిము నీశ్వాత్మున్ హరిన్. హరి. ఉ. ౧౦. ౨౧౦.

౩. వక్తృత్వము.

**వాఙ్మాత్రము.** సం. వి. అ. న. మాట మాత్రము. (క్రియాశూన్యము.)

**వాఙ్ముఖము.** సం. వి. అ. న. ౧. మాటల ప్రారంభము ; ఉపన్యాస ప్రారంభము. ౨. ఉపోద్ఘాతము, గ్రంథము యొక్క భూమిక.

**వాచ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. వాక్కు. ౨. భాష. ౩. శ్రుతి, సూత్రము. ౪. శపథము.

**వాచఃపరుషత.** సం. వి. ఆ. స్త్రీ. వాక్పారుష్యము, పలుకుఁ బ్రల్లదము.

క. ... వాచఃపరుషత క్రోధం, బాచార విధజ్ఞు లఘువు లండ్రు కుమారా ...

భార. అను. ౪. ౧౧౪.

**వాచంయముఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) మాటల నరికట్టినవాఁడు : మౌనవ్రతము నవలంబించువాఁడు.

వి. అ. పుం. ౧. మౌనవ్రత మవలంబించిన సన్యాసి. ౨. మౌని.

**వాచకము.** సం. విశే. (అ. చికా. అ.) ౧. చెప్పునది, తెలుపునది, వివరించునది. ౨. వాచ్యార్థమును తెలుపునది, (పదము) ౩.

నోటఁజెప్పినది; వ్రాఁతమూలము కానిది. ౪. భావగర్భితమైనది (పదము.)

**వాచకుఁడు.** సం. వి. అ. పుం. ౧. వక్త. ౨. పాఠకుఁడు, చదువరి.

ఉ. మునికోని పోవకాంతయును ముట్టక నిల్పక భావమున్ రసంబును వెలయం దగుల్పడక పొందుగ వాక్యవిభాగ మొప్పఁగా, నెని మీఁది తానకంబులను నేర్పడి వర్ణము లుల్ల సిల్ల నింపెసయఁగ వాచకుండు కడునింపగు నీతిఁ జదివింపఁగాఁ దగున్ ...

(హరి. ఉ. ౧౦. ౨౯౩.

౩. రాయబారి, దూత.

**వాచనకము.** సం. వి. అ. న. కట్టుకథ, విడికథ, కఠినప్రశ్న.

**వాచనము.** సం. వి. అ. న. ౧. చేయుట, పఠించుట, చదివించుట. ౨. కథనము, చెప్పుట.

ఉదా: స్వస్తి వాచనము.

**వాచనికము.** సం. విశే. (అ. కీ. అ.) నోటితోఁ జెప్పినది. ౨. మాటలతో నయినది.

**వాచము.** సం. వి. అ. పుం. ౧. ఒకజాతిచేప. ౨. మదన వృక్షము.

**వాచేరము.** వి. (√ వాచారు) పరిదేవనము; విలపించుట.

సీ. వాచారపం బన వాచరం బనఁగను దేవు రిం పనఁగను దేవు రనఁగ, బరఁగుఁ బరి దేవనము ... ఆం. భా. ౧౦. ౧౧౯.

**వాచేఱుచు.** అ. క్రి. (వా + చఱచు) నోరు కొట్టుకొను, మొఱ పెట్టుకొను.

చ. విఱిగెడు రూపులున్ విఱిగి వ్రేలెడు రూపులుఁ దల్లడిల్లి వా, చఱచెడు రూపులుం గలయఁ జాల్పడు రూపులు నొచ్చి నేలపై, నొఱఁగెడు రూపులుం జెలఁగ నూర్చెడు రూపులు నస్త్రఘట్టన, న్నులుపగు రూపులుం బృథురణంబున నగ్గల మయ్యె నయ్యెడన్.

కు. సం. ౧౧. ౭౦౦.

క. పాపలుఁ జెప్పలుఁ దొడుకొని, దేవ శివాల యములోనఁ ద్రిమ్మరు పాపుల్, వావిడిచి నిగళబంధము, తో వాచఱచుచును గాలు దురు నరకాగ్నిన్. శివ. పా. ౨౯౧.

ద్వి. తెట్టిపై మూకలువెట్టి యన్నగరి, చుట్టును వాచఱ్చి శోకంబు లడర ...

బస. పు. ౨౦౦. పా. ౧౦. పం.

చ. వెఱచినవాని దైన్యమున వేఁడరు నొందిన వాని నిద్రమై, పఱచిన వాని సౌఖ్యమున నుద్యముఁ ద్రావిన వాని ... కావు మంచు వాచఱచిన వానిఁ గామినులఁ జంపుట ధర్మముగాదు ఫల్గునా. భాగ. ౧. ౧౫౪.

**వాచేవి.** విశే. (వా + చవి) జిహ్వాప్రీతికరము.

క. కీచకుని యింట నెప్పుడు, వాచవి యగు బహువిధంపు వారుణి గలుగన్, వేచని యిచటికిఁ గొని రమ్మా చూతముగాని నీ గమనవేగంబున్. భార. విరా. ౨. ౮౯.

ఉ. వాచవియైన గడ్డిఁ దిని వాహనులందు జలంబు ద్రావఁగా ... భాగ. ౧. ౪౨౦.

సీ. దర్వీకరస్త్రీలు దన్నువాచవి చూడ గందంబుఁ గొండ చెంగట సుఖించి ...

పి. శకుం. ౨. ౧౩౨.

ద్వి. వాచేరఁ బట్టి భూవరకుమారునకు, వాచ విగా సిద్ధవరుఁడు ద్రాగించి ...

సారంగ. ౧. ౯౭. పా. ౧౮. పం.

చ. ఇలు గలదైన నెల్వడని యీలువుటాండ్రకుఁ దాఁపికత్తెపై, యులు కడలించి కోరి తను రోగపు వాచవిఁ జూపి మీఁదఁ బెల్లలము విరోగవహ్ని భవదంతరసైకత పంక్తి

పొంత కంౘలఁ బొరలించి తాఁగు శమన స్వసృ వుగ్రమయూఖనందినీ.
ఆము. ౫. ౨౦.

**వాచస్పతి.** సం. వి. ఇ. పుం. ౧. బృహస్పతి; దేవగురువు. ౨. పుష్యనక్షత్రము.

**వాచస్పత్యము.** సం. వి. అ. న. వక్తృత్వము, వాక్పటిమ.

**వాచాటుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) వదరుఁబోతు, పనికిమాలిన పెక్కుమాటలు మాటాడెడు వాఁడు.

**వాచోరపము.** వి. (√ వాచోరు). పరిదేవనము, విలాపము.

సీ. వాచారపం బన వాచరం బనఁగను దేవురిం పనఁగను దేవు రనఁగ, బరఁగుఁ బరిదేవనము ... ఆం. భా. ౧. ౧౧౬.

**వాచోరు.** అ. క్రి. పరిదేవనముచేయు.

ద్వి. చనుదెమాటలఁ ద్రొబ్బ జరుపుచు నిల్వ, ముని తనూజుఁడు జలమ్ములకు వాచార ....
ద్వి. హరిశ్చ. పూ. ౧౯. ౪౫. పం.

క. ఈ చిల్లరసేఁతలకే, వాచాగెద రోర్వలేక వల దుడుగుడు ... సానందో. ౪. ౨౫.

దండకము. ... కండలన్ దొబ్బలున్, మాంసముల్ గ్రొవ్వు ... అందండ వాచారునా నా మహాశాకినీ ఢాకినీ భూతభేతాళరింఛోళికల్ ద్రేఁపుచున్. దశా. ౪. ౧౩౨.

జః వాచరము, వాచారపము.

**వాచాలుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. అఱచువాఁడు. ౨. వాచాటుఁడు, వదరుఁబోతు. ౩. డంబములు పలుకువాఁడు.

**వాచి.** సం. విణ. (న్. నీ. న్.) (సమాసాంతమున) చెప్పునది, తెలుపునది.

**వాచించు.** సం. స. క్రి. ౧. పఠించు, చెప్పు.

క. ఆ చెలువంబున నది గని, యా చెలువ ప్రియంబునం దద గని వనితా, నేచనినవార్త వినుమిదె, వాచించెద ననుచుఁ గీరవర మిట్లనియెన్. ముకుంద. వి. ౩. ౧౪.

సీ. ఇల్లు పంచములేక వెల్లిపైఁ ... లాడు, శ్రీ నానుఁడౌట వాచింపనేల ...
చంద్రా. ౧. ౧౩.

౨. చదువు.

సా. ... శివతత్త్వమారి పదివేల్ వర్షాలు జీవించు గెం, టన పగ్గాల్లవయేటుఁ జెందుఁ బలిగండం బంచు వాచించినన్ ...
చంద్రా. ౩. ౧౪.

(ఈ ప్రయోగము ఇతర గ్రంథముల యందును మృగ్యము.)

**వాచికపత్రము.** సం. వి. అ. న. ౧. జాబు, ఉత్తరము. ౨. వార్తా పత్రిక.

**వాచికము.** సం. విణ. (అ. ఆ. ఈ. అ.). వాక్సంబంధి, మాటలకు సంబంధించినది. ౨. నోటఁ జెప్పఁ బడినది.

వి. అ. న. ౧. వర్తమానము; చెప్పి పంపిన సమాచారము. ౨. వార్త : వింతలు.

**వాచికహారకుఁడు.** సం. వి. అ. పుం. రాయబారి, జాబులు తీసికొని పోవువాఁడు.

**వాచోరు.** (వా + చోరు) వి. ఇంటి ముంజూరు.

ద్వి. పసిడింపు వాచూరుఁ బద్మరాగముల, మొగడలు ...
ద్వి. హరిశ్చం. పూ. ౧౭౬. పం.

ద్వి. ముత్తెంపు వాచూరు మొగడల మించు, గుత్తంపుఁ జవికెల క్రొత్త బాగొదవ ...
నవనాథ. ౧. ౨౫. పు. ౧౨. పం.

**వాచోయుక్తి.** సం. విణ. (ఇ.) మాటనేర్పు గలవాఁడు.

వి. ఇ. స్త్రీ. మాటలకూర్పు; మాట నేర్పరితనము. ౨. ఉపన్యాసము; మంచి యుపన్యాసము.

**వాచ్యచిత్రము.** సం. వి. అ. న. అధమకావ్యభేదము.

**వాచ్యత.** సం. వి. ఆ. స్త్రీ. ౧. నింద; దూఱు. ౨. అపకీర్తి; చెడ్డపేరు.

**వాచ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. పలుకఁ దగినది. చెప్పఁ దగినది. ౨. వ్యక్తము సేయఁ దగినది. ౩. అభిధాశక్తిచేఁ దెలుపఁ దగ్గది; (వాచ్యార్థము) లక్ష్యవ్యంగ్య భిన్నమైనది. ౪. నింద్యమైనది; నిందింపఁ దగినది.

వి. అ. న. ౧. నింద; దూఱు. ౨. ఆఖ్యాతము; క్రియ. ౩. అఖ్యాతముచేఁ జెప్పఁబడు భావ, కర్మ, కర్తలలో నొకటి.

**వాచ్యార్థము.** సం. వి. అ. పుం. అభిధాశక్తిచేఁ దెలుపఁబడ్డయర్థము. లక్ష్యార్థవ్యంగ్యార్థములు కానిది.

**వాజె.** వి. రోఁత, ఏవ.

సీ. కేవురించుచు వాజెదేఁగెడు మొగమును బడబారుచుండెడు బడుగు టొడలు ...

హరిశ్చ. ౪. ౧౦౩.

విణ. ౧. రోఁత పుట్టించునది; ఏవ కలించునది.

ద్వి. ఓజమాలిన వాజె యౌరా పాత్రాత్మ్య,నీజన్న మంతయు నేఁడు ఫలించె ...

ద్వి. పరమ. ౨. ౧౩౨. పా. ౧౯. పం.

౨. మంచిది, యుక్తము.

క. ఈ జాడ లే మెఱుంగమె, వాఁజా మాపట్ల నావాకంబు లహొ, లాఖ్యజాఁడ్ఁ దైన యింగ్రునన, కేజీవన మిట్టి పనుల కిచ్చుట తగునే. బలరామ. ౧. ౨౬౪. (బ్రౌ.)

**వాజనము.** సం. వి. అ. న. ౧. ఘృతము. ౨. కవ్యము; పితృదేవతల కిచ్చెడి యన్నము. ౩. అన్నము. ౪. నీరు. ౫. యజ్ఞమును ముగించు మంత్రము. ౬. యజ్ఞము. ౭. బలము. ౮. ధనము. ౯. వేగము. ౧౦. నెల, మాసము.

**వాజపేయము.** సం. వి. అ. పుం. న. ఒకానొక యజ్ఞము; యాగ విశేషము.

**వాజము.** సం. వి. అ. పుం. ౧. ఇల్లు మొదలగు వాని పార్శ్వభాగము. ౨. పక్షి టెక్క; పక్షియీఁక. ౩. బాణమునకుఁ గట్టెడియీఁక. ౪. ఘుష్టము; పోరు. ౫. ధ్వని.

న. ౧. నేయి. ౨. హవిస్సు. ౩. అన్నము. ౪. నీరు. ౫. యజ్ఞము. ౬. యజ్ఞాంతమునఁ జదించు మంత్రము. ౭. బలము. ౮. ధనము. ౯. వేగము. ౧౦. నెల.

**వాజసని.** సం. వి. ఇ. పుం. సూర్యుఁడు.

**వాజసనుఁడు.** సం. వి. అ. పుం. ౧. విష్ణువు. ౨. శివుఁడు.

**వాజసనేయి.** సం. వి. న్. పుం. ౧. యాజ్ఞవల్క్యుఁడు. ౨. వాజసనేయి (శుక్ల యజుర్వేద) శాఖానుసారి.

**వాజసనేయుఁడు.** సం. వి. అ. పుం. = వాజసనేయి.

**వాజి.** సం. విణ. (న్. నీ. న్.) ౧. వేగము గలది, వడిగలది. ౨. బలముగలది.

వి. న్. పుం. ౧. గుఱ్ఱము. ౨. బాణము. ౩. శుక్లయజుర్వేదశాఖానుసారి. ౪. ఇంద్రుఁడు. ౫. బృహస్పతి.

**వాజిదంతకము.** సం. వి. అ. పుం. అడ్డసరము. శ్రీ. (శ. ర.)

**వాజినము.** సం. వి. అ. న. ౧. బలము, వీర్యము. ౨. యుద్ధము. ౩. ఆమిక్షానిస్స్రుతజలము ; పాలవిఱుగుడు పైనీరు.

**వాజిని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. గొడిగ ; ఆఁడు గుఱ్ఱము. ౨. ఉషఃకాలము ; ప్రభాతము.

**వాజిభక్షము.** సం. వి. అ. పుం. చణకము ; సెనగగింజ.

**వాజీకరణము.** సం. వి. అ. న. కామోద్దీపనము ; వీర్యవృద్ధికరమయిన ఔషధ విశేషము.

**వాజీకరము.** సం. వి. (అ. ఆ. అ.) కామమును వృద్ధిచేయునది.

**వాటధానుఁడు.** సం. వి. అ. పుం. భ్రష్టుఁడైన బ్రాహ్మణునకు బ్రాహ్మణ స్త్రీ యందుఁ బుట్టిన సంతతివాఁడు. (మనుస్మృతి.)

**వాటపడు.** (వాటము + పడు.) అ. క్రి. అనుకూలపడు.

తే. వారువము నెక్కి మితపరివారుఁ డగుచుఁ, బోటికాంద్రును వడిగల యోటకాండ్రు, వాటపడి వెంట నరుదేర వేఁటగదలె, మందరమున కవనిపుఁ డమందగతిని.

ద్వా. ౮. ౨౨.

**వాటమగు.** అ. క్రి. వాటము + అగు) వీలుపడు, కలనుపడు.

ఉ. మాటల జోగుసేయకుము మన్మథవేదనఁ దాళఁ జాలనో, పాటలగంధి నీదు కుచ పాలికఁ జేర్పుము తెల్లవాఱినఁ, వాటము గాదు. దశా. ౬. ౧౨౫.

**వాటము.** విశ. ౧. ఏటవాలైనది, జాఱుపుగా నుండునది.

క. కొలఁదికి మీఱిన లక్ష్మికి, నలరెడుభోగంబె రక్షయారసి చూడన్, జలపూర్ణతటాకము నకు, నలవడఁగా వాటమైన యలుఁగుం బోలెన్ ... విక్ర. ౨. ౧౮౦.

చ. వనితకుచాద్రులం బొడమి వాటపుఁ బొక్కిలి నిండి యుబ్బి జాల్గొని కటిచక్రమాని మెఱుఁగుం దొడలై విరవాని వచ్చునా, తనకిరణామృతౌఘములదండహలాంకపదోక్షితంబులై, మను నడివోనిగర్భకలమంబులు గావె లతాంగి జంఘికల్ ...

వసు. ౨. ౭౪.

౨. అనుకూలమైనది.

ఉ. ... దోచుకో, నిక్కడ వాటమంచు మది నెంచఁగ వారికి నక్కడక్కడన్ ...

కాశ. ౪. ౬౬.

ఉ. ...సుందరి యేరతి నాసచేయునో, వాటముగాఁగ నారకుల వారక తేల్చెద నంచుఁ బల్కఁగన్ ... వీర. ౨. ౨౮౨.

మ. వడియం బప్పడ మొప్పు నింపువరుగుల్ వాటంపుమారీచ పుం, బొడి ...

రా. వి. ౨. ౧౦౦. యయా. ౧ ౪౯.

౩. పొందికయయినది.

సీ. బెడదవాఁడెఱచి యేర్పడ దవానలు మ్రింగు వెడఁదవాటంపుఁ బేరెడఁదవాని ...

చంద్రా. ౧. ౮౪.

చ. వదలినద్రిండు తొంటిగతి వాటముగా బిగియించి మోమునన్, బెదరిన ఘర్మవారిఁ గొనచేలమునన్ దొలఁగించి ...

జై. భా. ౨. ౮౬.

సీ. వాటమే దవసంపుఁ దోఁటకంప వెలుంగుఁ దొలఁగిపో నెవ్వరో త్రోసివారు ...

శుక. ౧. ౨౮౩.

౪. సక్రమైనది.

గీ. మఱియు నెవ్వరిచిత్త మెత్తెఱుఁగునంచు,
వాటమై యుండునది యెల్లవలయునట్లు,
చేసి విహరింపుడు ...
భార. ఉద్యో. ౨. ౧౨౭.

గీ. చెలులు చుట్టలు దను విడిచినను దాను, వారి
విడువంగఁ జాలక వగచుచున్న, వాఁడు
నెయ్యంబు మనమున వాటమైన, దివ్యధం
బింతయును నిజ మేమి యొక్కొ.
మార్కం. ౬. ౨౨.

౫. ప్రసిద్ధము.

శ్లో. ... ... ... ... ... ...

గీ. ... ఇవియె చిహ్నంబులగుఁగాన సినుల
పేళ్ళు, వాటమైయుండు ధర వాని వాని
వలన ... కాశీ. ౬. ౨౭.

సీ. మేటిజాఁజరియున వాటమై లిపుటపై నాడు
చుండుగు నే నహర్నిశములు ...
ద్వా. ౧౦. ౯౫.

౬. ౧. ఆనుకూల్యము.

ఉ. బోటి ప్రియంబుగో నిపుడు వోఁబనిలేదు
భుజంగభీతిచే, వాటము దప్పెనో ...
గంధ. ౧. ౧౨౨.

౨. ప్రదేశము.

మ. ... పెద్దలకును బెద్దయై తనరు తండ్రికిఁ
దక్కవశాలి వెచ్చిలిన్, గుల మెరియించి
తిన్ జననిఁ గూల్చితి శోకములోఁగు వాట
మున్. హరి. ఉ. ౭. ౧౦౫.

౩. ఏటవాలుతనము, ప్రవీణత, ఆభిముఖ్యము.

చ. సహముగ మిట్టపల్లములు చక్కఁగఁజేయుచు
జొట్టినీరు వ్రాటముఁ గని నాల్గువంకల గుడా
రము లెత్తిరి చీనిపట్టుపగ్గములు బిగించి ...
వాల్మీకి. ౩. ౯౬.

ఉ. ... అతఁ డేటికి రాజసతామసంబులన్,
వాటముఁ బొంచె భూధరము వారితమూ టని
యేవిధంబు ... భాగ. ౯. ౪౨౯.

౪. సూటి, నిబ్బరము.

ద్వి. వాటమై యీమాట పడినమ్మవోలె, నాటి
యున్నది నేఁడు నామనంబునను ...
హరిశ్చ. ఉ. ౧౪౭౫.

౫. రీతి, విధము.

సీ. గుడుగువాల్ సొబ్బకాపిడుగు వానకుఱ్ఱ
గొడుగువాటము దాల్చు వడుగువాఁడ ...
ప్రబంధ. ౧. ౩.

మాలిని. విధిశివసనకాగల్ వేదము ల్గాడి
నిన్నే, మధుమథన యితం డిమ్మాడ్కి
వాఁ డంచు నెన్నన్, వినురు లయిన చోటన్
గాఢమోహాం, బుధవడి పడుచున్నాఁ బోఁటి
నీవాట మెన్నన్. పాండు. ౪. ౮౧.

చూ: వాటకాఁడు, వాటగాఁడు, వాటముచేయు.

**వాటము.** సం. వి. అ. పుం. స. ౧. ఆవరణము; ఆవరణము చేయఁబడిన కొంతభూభాగము. ౨. ఉద్యానము; చిన్నతోఁట. ౩. బాట; మార్గము. ౪. గజ్జె: వంకిణము. ౫. ఒక దినుసు ధాన్యము.

**వాటముచేయు.** స. క్రి. (వాటము + చేయు.)
౧. అనుకూలపఱుచు.

వ. తారకారాజు సఖుపు చీటంబు వాటంబు
సేయుఁ, లితకటాక్షవీక్షావిక్షేపమ్ములను ...
హర. ౫. ౩౯.

౨. ఓరవాకిలిగా వేయు.

వ. నిజకుటీరద్వారంబులకు వాటంబులు, వాటం
బులు చేసి చనిన ... వి. పు. ౭. ౧౨...

**వాటా.** వి. భాగము, పాలు. (వా.)

శా. నాళీకారికి నొక్కజింక నొకయేణం
బంజనాకామికిం, గాళీకాంతున కొక్క
లేడి యిడి యింకంగూడునే మూఁడువా,
టాలుం బెట్టినచెంగనాలు మము నుట్టి

ప్రాణుఁడవన్ రీతి మీ, రేలా పోరెద రేణు
లార నిలుపుఁడీ మానుతుం జూపుఁడీ.
సారం౧. ౨౩౬.

(వాటము. సం. వి. అ. పుం. అని. శ. ర.)

**వాటి,** సం. వి. ఈ. స్త్రీ. ౧. ఇంటి స్థలము, వాస్తువు. ౨. ఇల్లు; గృహము. ౩. దొడ్డి; ఆవరణ గలస్థలము. ౪. ఉద్యానము. ౫. దారి. ౬. గజ్జె. ౭. ధాన్య విశేషము.

**వాటిక,** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఇంటిస్థలము; వాస్తువు. ౨. ఉద్యానము.

**వాటి.** వి. (√ వైచే.) ౧. వైచుట. (బ. వాటులు, వాట్లు.)

సీ. ఒకదాయమాడిన నున్న దాయం బాడు
మనక వాటులు రెండు గొని చెలంగి ...
ఉ. హరి. ౩. ౧౨౮.

వ. జేంౘెపువాటుగా నీటు గానఁబడ మెడల
వెండిగొలుసుల సజ్జగు సజ్జలు ...
ప్రబం. ౧. ౭౮.

౨. దెబ్బ, హతి.

సీ. ... సుత్తెహాటుల వారు లెత్తని సొమ్ము
సొంపలరించె నెవ్వాఁడు సొంబునకును ...
రా. వి. ౧. ౯.

(శౌరి యొక్క పాషాణముతో విచక్రుని వైచెను.)

క. వాటునన మూర్ఛ వోయెం, బోటరి
దైత్యుండు ... ఉ. హరి. ౪. ౨౩౫.

ఉ. చక్కెర మోవికోటు, దమసానులచీరల
వల్లెవాటు, లేఁ, జెక్కులగోటునీటు,
మెయిఁ జెల్వగు కీల్జడవాటు నార్ద్రవుం,
డెక్కు ఘటింపఁ గుంకమపటీరకురంగ
మదాదివాసనల్, సొక్కు లిడ న్నడ
న్విటులు సోలుదు రచ్చటి వేశ్యవాటులన్.
చంపూ. రా. ౩. ౬౭.

సీ. ... ప్రుక్కిటి విడెవిూయఁబోయి తిలోత్త
మావనజ లోచన ముచ్చెవాట్లు పడిరి ...
కువల. ౧. ౩౯.

౩. విధము.

సీ. బడవ వాటునఁ బాటుబడ్డఁ జన్నజనిమ్ము
కాయ గాచినచెయి కాయ గాచె, (బడవ=
భృత్యుఁడు) ... ప్రబం. ౭౫౫.

**వాటుఁగాలు.** వి. దే. (వాటు + కాలు) నడచునపుడు ప్రక్కవాటుగాఁ బోయెడు కాలు.

సీ. సరవెంౘ్రదు కనరాదు నాఁడెల్ల జగడించు
వాటుఁగా లనరాదు చేటుఁదెచ్చు ...
శుక. ౩. ౨౧.

ద్వి. రోటుపోయినచేయి రొమ్ము కంపరవా,
వాటుఁగాలును జోటివలెనున్న నడుము ...
ద్వి. హరిశ్చ ఉ. ౧౦౭౭.

**వాటుబల్లెము.** వి. (వాటు + బల్లెము.) పొడుచు నట్టి యొకానొక ఆయుధము; కుంతము.

వ. ... అందంద లతాకుంద బృందంబులకు
దూరంబారు నిందిందిరావళి యిందిరా
సందనుం డిందీవరగంధులపై వైచువాటు
బల్లెం బని చాటుచు ... రా. వి. ౩. ౧౧౪.

**వాటురా(ఱా)యి.** వి. (వాటు + రాయి.) దొంగలు విసరుట కేతి తీసికొనిపోవురాయి.

ద్వి. ... ఒలుకుం బూడిదయును వాటురాలు.
బస. పు. ౫. ౩౩౭. పం.

ఉ. కత్తియు నీలిచీరయును కంకటిరజ్జువు
నారసంబుముల్, గొత్తియు వాటు రాశి
సుము గొంకియు నక్షత లొల్కి బూది
యున్ ... చెన్న. ౩. ౨౯౪.

**వాటులాడు.** అ. క్రి. (వాటులు + ఆడు.) కొట్లాడు.

సీ. కరముష్ప ...

ఆ. వె. ... ప్రణయ, మొదవ సంకులముగ నొండొరులతో వాటు, లాడువారుఁ దన్ను లాడువారు ... కుమా. సం. ౯. ౨౪౯.

చ. ఇరువురు నీలనీరజనిభేక్షణ లించిన వేడ్కతోఁ బరస్పర మొదిరించి కొంచ నపు బంతులఁ దచ్చనవాటులాడఁగా, ధరణిపుఁ డడ్డమై చేనుడుఁ దద్భుజ దండముఁ దాఁకి మిట్టి బిట్టురవడిఁ జెండు గ్రమ్మఱిన నుబ్బర పోయిరి భామినీ జనుల్. శృం. నై. ౩. ౯౫.

ఉ. కొంచెపు మంచు పట్టగలి గుబ్బల మేనలఁ జెక్కులంగదం, బించును ఘర్మ బిందువులు పిచ్చిల బంతులవాటు లాడఁ గన్. వరాహ. ౩. ౯౩.

**వాట్యపుష్పము.** సం. వి. అ. న. ౧. చంద నము ; మంచి గంధము. ౨. కుంకుమ పువ్వు.

**వాట్యము.** సం. విశే. (అ. ఆ. అ.) ఉద్యాన వన సంబంధమైనది.

**వాట్యాలకము.** సం. వి. అ. పుం. ముత్తవ పుంగము. (శ. ర.)

**వాట్లీఁడు.** విశే. (వాట్లు + ఈఁడు.) దెబ్బ లాడువాఁడు, కొట్లాడు వాఁడు.

గీ. వాగులాని తోడ వాట్లీనితోడను, బూతు తోడఁ దిండి పోతుతోడ, నటమటీని తోడ నడియరితోడను, వెలకు నెత్తమాడ వెరవుగాదు. ఉ. హరి. ౩. ౧౧౨.

**వాడ**[1]. వి. (సం. వాటః. క. వాడె.) ౧. వీధి.

శా. ...ఆవ్వాడం బౌర జనంబులెల్ల నితఁ డెవ్వాఁ డొక్కొ? నేత్రోత్సవం,బై డాయం జనుదెంచె నంతటను మాయం బయ్యె ... శృం. నై. ౩. ౭౨.

శా. ఏడా ద్వీపములేడు వాడలుగ సర్వేలా తలం బెల్లఁ బెన్నీడై పోఁడిగ నేలు చున్ ... భాగ. ౯. ౫౬౦.

తే. గీ. వాడఁజను చాకికి ధరించు వలువలై చి, తెట్టు తాఁగట్టు పుట్టంబుఁ గట్టి తనుచుఁ, బొరుగు సతిదాల్చు చీరపైఁ బోర నొకతె, యధిక మధుమత్తతా వృత్తి నట్టి రాత్రి. రా. వి. ౩. ౧౫.

౨. ఇండ్ల వరుస.

ద్వి. భూజనంబులు మెచ్చి పొగడు వాడలును, వేడుక మదికొదవించు వీధులును ... హరిశ్చ. పూ. ౧౧౦.

ద్వి. గరుడోరగామర గంధర్వసిద్ధ, వర సతుల్ చెలులున్న వాడలు చూచి ... రం. రా. సుం. కాం. ౨౪౫. ప్ర. ౩. పం.

తే. గీ. కోడలా యింక బంగరు గోడలేల, మేడలేటికి రతనంపు వాడలేల, మాడ లేటికి బలురాచ జాడలేల, వాడలో నీవు ద్రిమ్మరనోడి చనిన. అ. రా. అయో. ౯. ౪.

౩. వరుస, పంక్తి.

వ. సహకార మహీరుహంబుల వాడల నీడలఁ గ్రీడలు సలుపుచు ... వరాహ. ౩. ౬౪.

చ. హయము నదల్చి తోలుచు నాజికిఁ దోలుట యొందు దోఁచెన, వ్యయరయ శక్తినంతి మఱి వచ్చిన త్రోవయుఁ బోయి నట్టి త్రోవయు నొకటంగనం బడడ వాడలు వాడలుగా నతిం డసి, క్రియలను జక్కచేసిన హరిద్విరదాదుల చేతఁ దక్కఁగన్. కళాపూ. ౭. ౬౪.

జ : వాడకట్టు, వాడవదినె.

**వాడ**[2]. వి. (త. వాడై) తావి, పరిమళము.

పీ. పరిమళ వీధులు వాడయంచన విూఱు ... అం. భా. ౩. ౫౯.

జ: వాడగన్నేరు, వాడగాలి, వాడపసుపు.

**వాడఁబాఱు.** అ. క్రి. (వాడన్ + పాఱు) మ్లాన మగుట కున్ముఖమగు, బడలి పోవుట కున్ముఖమగు.

సీ. ... ... ... ...
గీ. ... చేత నా ప్రాప్తి నొందె, సరసిజాతా
యతాక్షి తచ్ఛబ్దమాత్ర, వాడఁ బాఱిన
సస్యంబు వానఁ బోలె ...
కాశీ. ౫. ౧౭౪.

సీ. ... ... ... ...
గీ. ... కమలవైరి, తన కళాస్ఫూర్తి యంత
కంతకుఁ దొలంగ, వరుణ దిగ్వధి కడఁ
జేరి వాడఁ బాఱె ...
రాజ. చ. ౨. ౬౭.

ఉ. ... పద్మంబులు వాడఁ బాఱెఁ గు
ముదంబులు సొంపుగ కెక్కెనిక్కుచున్ ...
గ్వా. ౪. ౯౨౨.

**వాడకట్టు.** వి. (వాడ + కట్టు. స్వార్థమున) వీథి, వాడ.

సీ. ... తే. మేనమామలు బావలుగాని వానిఁ,
గాఁగఁ జూతురు మా వాడ కట్టువారు,
కంటగింతురు నన్నంతటఁ గనుల జూచు,
వ్రాఁత ఫలమేమియో కాని వనజగంధి.
హంస. ౩. ౧౫౦.

**వాడికము.** వి. (√ వాడు) చిల్లరసామానులు అరవు తీసికొనుట.

సీ. ... అప్పులిచ్చిన చోట నటమటించిరి
డాఁచి కొనిన పత్రంబులు చినిఁగిపోయె,
వాడకంబులు గొన్న వార లేగిరి తోఁట
లెల్లను బరులచేఁ గొల్లవోయె.
శుక. ౨. ౩౬౦.

**వాడగన్నేరు.** వి. (వాడ² + గన్నేరు) ఒకానొక చెట్టు, పచ్చపువ్వుల గన్నేరు.

ద్వి. బలుసుముల్ మోదుగు పచ్చారె యారె,
వలిచంద్రములు చంద్రవాడ గన్నేరు ...
ద్వి. శ. సా. ౨. ౭౦. పొ. ౪. పం.

**వాడగాలి.** వి. (వాడ² + గాలి) మలయ మారుతము. (శ. ర.)

**వాడపసుపు.** వి. (వాడ² + పసుపు) పరిమళము గల పసుపు.

గీ. గునియు జార్సిగ చెక్కుటగోరు మోవి,
కెంపులస్తుక నుదురగంధపు చీరులు, వాడ
పసుపుపంటలువలువతో వచ్చినట్టి, పుత్త్ర యిగి
కాని నడతకు పులుకు గాదె.
ప్రబంధ. ౬. ౬౩.

**వాడబము** = బాడబము. సం. వి. అ. పుం. బడబాగ్ని, సముద్రములోపలి నిప్పు.

న. అఁడు గుఱ్ఱముల సమూహము, తర్కించుచే యు
గుఱ్ఱములుంచఁ బడుచోటు.

**వాడవదినె.** వి. (వాడ¹ + వదినె) జారిణి.

సీ. అత్తమామల కెగురాడు గుణ్చారిణి వావి
వర్తన లేనివాడవదినె, కొండెల గంపలు
గూర్చు పాతకురాలు బలిభిక్షు వీడని
నిర్భాగ్యురాలు ...
శ్రీ. ౭౦. మా. ౫. ౩౪.

సీ. ... గీ. నీకుఁ జరణదాసతుఁడనైతి నేత్ర
జితచు, కోర సన్నిచ్చులో నేలకోరనైతి,
వంగురాత్మ ప్రవంచకులైన జారు, లెగుగు
పాకైన నవ్వాడవదినెఁ గూర్చి.
వేం. పంచ. ౩. ౨౫౭.

**వాడించే.** స. క్రి. (√ వాడు) మ్లానత నొందించు, వాడఁజేయు.

సీ. ఉస్సని నిగిడించు నూర్పుల బలుపేఁడి నించి
కెమ్మోవి వాడించు వాని ...
ఉ. రా. ౬. ౨౦౫.

**వాడిక**[1], వి. చెప్పకయు చూపకయు ఉంచిన యిల్లడ, ఉపనిధి. (శ. ర.)

**వాడిక**[2] = **వాడుక**. వి. (√ వాడు) పోషణము.

సీ. ... గీ. ... ఈడ విడిచిన పైఁడిఁగా యింత నయము, గలిగియున్నది వాడిక గలిగెనేని, నెంత నవకమై యుండునో ...
కు. సం. ౪. ౧౩౧.

**వాడు**. (తె. వాడు.) అ. క్రి. ౧. వడలు, మ్లానమగు.

క. పరిమళము సెడఁగ వాడఁగ ... ఈ కుసుమ రాజ ముంబుజవదనా ... పారి. ౧. ౫౯.

సీ. వానలేని కతాన వాడినస్యల వలె సకల సస్యంబులు సమసిపోయె ...
వరాహ. ౪. ౫౨.

సీ. ... ఎండచే వాడిన యొల దీఁగెయును బోలె నిద్దంపుఁ దనువల్లి నిగ్గు సడల...
విక్ర. ౪. ౧౦౨.

౨. అలయు, బడలు.

సీ. నిస్వనంబులు రేచి నిగుడు కాతరనేత్ర శంబరంబులు వాడు శరభగండకములు దుంలెడు చిత్రకాయ లీలలు ...
వసు. ౩. ౧౧౧.

రగడ. ... వనిత వనితరులతల యలరుల వాడి వాడిలి కొప్పు వ్రేఁగుఁ ...
వసు. ౩. ౧౪౯.

౩. ఖేదపడు.

క. ఆడినఁ గూడిన కినుకను, వీడిన జడ ముడిఁయుఁ బాగలు వెడలెడి చూపుల్, పోఁడిమిగొను నిట్టూర్పులు, వాడినడెంద మును మేనవడియుఁ జెమరునై.
పాండు. ౫. ౨౦౪.

చ.... వరుణుఁడు విప్రయోగమున వాడడె ...
నైష. ౪. ౬౫.

సీ. ... గీ. ... ఇతరసుమనస్సులార మీ రేటులవాడి, యుండనేటికి నామోదముడిగి యనిన ...
దశా. ౨. ౩౫.

(ఇది ౧. ౩. అర్థములకుదాహరణము.)

౪. ఎండ, శుష్కించు.

ద్వి. వెలయ వసంత మవ్వేళ నెల్లెడలఁ, గల యంగఁ బదనింకి కడపళ్ళువాడి, జిగిదప్పి చెఱఁగులు చిరు బీటలెత్తి, పగులచు బిరుసనై పలఁకిన నాట.
నవ(నాథ) ౧. ఆ. ౧౧. పు, ౫. పం.

స. క్రి. ౧. ఉపయోగించు.

ఉ. ... పాల్పెరుగు నెయ్యిని వాడెడు కోడె కాంద్రమై, వెన్నెల సోగసీన(న్) ...
రా. వి. ౨. ౬౧.

రగడ. ... నాము కుముద నాయకంబు వాడ వాడనైతి నాన ... కళాపూ. ౩. ౯౨.

సీ. కన్నంబుఁ ద్రవ్వ తక్కుఁ డింటి వారికి వాడలేదని ముంత వైచి చనునె ...
రామ. ౭౦. ౩౦.

౨. చెప్పు ; వచించు.

ఉ. అప్పుడు యాదవనాథ్య సుతుఁడైన సువేగుఁడు కీచకాంతకున్, దప్పక చూచి తానును గదాఘనదండము కేలఁ గ్రాలఁగాఁ, ద్రిప్పచుఁ గొండగ్గి పఱతెంచి వచించిదన పేరువాడినా, తప్పక వ్రేసె నొక్కమొగిఁ దారొక్కని భీముశిరంబు వక్షమున్.
జై. భా. ౨. ౭౯.

సీ. ... ఆర్చుచుఁ బేర్వాడి యదలింపుచుఁ గడంక నెఱపుచు బుజ్జములు సఱచు కొనుచు ...
అ. రా. యు. ౧౯౫.

సీ. గంధర్వ పతులు చొక్కపు పాట వాడిరి వాడిరి తద్భవవ్యవార్త మయులు ...
చంద్రి. ౩. ౧౪౧.

౩. గౌరవించు, సన్మానించు.

ఉ. ఆదికలైన నేమి మగఁడారడిఁ బెట్టిన నేమి చుట్టముల్వాడక యున్న నేమి సరివారలు నవ్విన నేమి ... శశాం. ౪. ౩౭.

౪. చేకట్టుఁ బఱుచే, చేకట్టుఁ బెట్టు.

క. లలన యిలువాడి సాధుఁడు, తలఁచినచవి వంటకములు వండి యిడి ...
భార. అను. ౫. ౨౯౦.

చ. ధన రహితుండు పుత్త్రి సముదాయ సమేతుఁ డుపాయశూన్యవర్తనుఁ డరయంగ నాద్విజుఁడు తత్ప్రియ భామయు బుద్ధిహీన జీవన మొనరింప నేర దిలువాడ నెఱుఁగదు ... భోజరా. ౨. ౪.

౫. అలుక.

క. ఇలువాడి ప్రముగ్గలిడి కూరలు గూర్లమరించి యేల రాదాయెనో కో, వెలలెం బ్రొద్దని యాటనీ, చెలికలు నేఁడేమరు సూచు సేవించుటకున్. వేం. పంచ. ౪. ౫౬.

వి. ౧. వాడుట, వడలుట.

సీ. ... చిత్తంబు తలపోఁతచే వాడు పొదివినఁ జెలువ నీ నెమ్మోము చిన్నఁబోయె ...
భార. విరా. ౨. ౧౫౬.

సీ. వక్షస్థలంబున వైచిన నవకంబుఁ దులసి దండకు వాడు దోఁపకుండ ...
హర. ౬. ౪౫.

౨. కఱవు.

సీ. ... తే. మక్కలో నుండి మనరాచ చిక్కఁ జేసి, మక్కఁబఱుకఁ బట్టినట్టి యాయమునఁగఁ బట్టి, బెండ్లి యాడంగ నేతెంచు పిన్న యతఁడు, చూడఁగద రమ్మ కన్నులవాడు దీఱ.
బహు. ౪. ౮౨. చంద్ర. ౪. ౯౪.

నలివాడులు వాడు = ఇంచుక వాడు.

శ. కలహమున సురలు దొరకొను, ప్రళయాసల రూపము దిరిపడి యొక్కొకమా, ర్దలచిన నీసలు గడ్డము, నలివాడులు వాడుచుండు నొందిన భీతిన్. కు. సం. ౧౦. ౪౬౬.

జ: వాడఁబాఱు, వాడకము, వాడించు, వాడికి, వాడుక, వాడుకపడు, వాడుకొను, వాడుచు, వాడుదల, వాడుదెంచు, వాడుజేఱు, వాడుపడు, వాడుపఱచు, వాడువాఱు.

**వాడుక.** వి. (√ వాడు) ౧. ఉపయోగము. ౨. వ్యవహారము.
(ఉదా. నన్నె చోడుని కాలములో ఈ పదములు వాడుకలోఁ గలవు.)
౩. అభ్యాసము; అలవాటు.

ద్వి. కేవల సాధనకృతి బాహ్యపూజ, వాడుకయై యుండు వసుధ నందఱకు, గూడ సంకేతపూజ గురుకృప లేక ...
ప్రభు(లిం). ౪. ఆ. ౧౧౭. పొ. ౧౯. పం.

సీ. ... పుట్టు జున్నంగళ్లఁ బెట్టించు వాడుక కోమట్లు మాకెల్ల గొల్ల సుమ్ము ...
సారంగ. ౧. ౭౩.

**వాడుకపడు.** అ. క్రి. (వాడుక + పడు) అలవడు, పనుపడు. (శ. ర., వా.)

**వాడుకొను.** స. క్రి. (వాడు + కొను) ౧. (జనులు ప్రచారముగా) చెప్పుకొను. ౨. ఉపయోగపఱచుకొను. (శ. ర.)

**వాడుచు.** స. క్రి. (√ వాడు) వాడఁజేయు, వాడించు. (శ. ర.)

**వాడుదల.** వి. (√ వాడు) వాడుక, అభ్యాసము. (శ. ర.)

**వాడుదెంచు.** అ. క్రి. (వాడు + తెంచు స్వార్థము) మ్లానమగు.

సీ. ... పగలింటి సెగలచే సొగటొందు పూఁ
దీఁగె వడువున నెమ్మేను వాడుదేంచె ...
అని. ౩. ౧౨౧.

**వాడుదేలు.** అ. క్రి. (వాడు + తేలు స్వార్థమున తేలు) వాడు.

ఉ. నీటను నేమరయెక్కి సనినిల్చి యొకించుక
వాడు దేలియు, ప్పాటున వేరువాలి ధృతి
పాటవ మొప్ప నతండొనర్చు న ప్పాటునఁ
జెన్ను మీఱి పరిపాటిగఁ గెంజిగు రక్క
డక్కడన్, మోటిక లెత్తి క్రొవ్విరులు
మొగ్గలు నెగ్గల మయ్యె నయ్యెడన్.
విప్ర. ౨. ౨౩.

వ. ... వాడు దేలెడి నమ్మోములును ...
కళా. ౬. ౨౨౪.

**వాడుపడు.** అ. క్రి. (వాడు + పడు) వాడు, మ్లానమగు. (చూ. వాడు పఱుచు.)

**వాడుపఱుచు.** స. క్రి. (√ వాడుపడు) వాడఁ జేయు.

సీ. ... వెలలేని కళలతో వెలయు నీ
నెమ్మోము ననితయే వికలుండు వాడు పఱిచె...
ఉ. రా. ౪. ౨౨౭.

**వాడువాఱు.** అ. క్రి. (వాడు + పాఱు) వాడు, వాడుపడు.

సీ. కడుపుతోఁ బాసిన కోడమ జింకయుఁ
బోలె వాడు వాఱిన నవవల్లిఁ బోలె ...
భా. రా. యు. ౨. ౨౧౭.

సీ. తొలుకారు మెఱుఁగుఁ దీఁగెల నేలు
కన్నులు వడఁదాఁకి యొక్కింత వాడు
వాఱ ... కాశీ. ౧. ౯౦.

సీ. ... లవలీదళము లట్ల సవర్ణైన చెక్కులు
వాడు వాఱఁగ ముద్దులాడియాడి ...
ఉ. రా. ౪. ౨౧౭.

**వాడె.** వి. ఇక్ష్వగ్రము, దర్భ.

సీ. ... కోరివిన పూవులు చేసంట నిచ్చిన
వాడెలు గూర్చిన భద్రకాళిఁ బంపిన ...
ప్రబంధ. ౧. ౭౩౮.

సీ. వాడె దవ్వాఁను నిక్ష్వగ్ర మొప్పు ...
ఆం. భా. ౨. ౭౫.

ఆ. ... తవరు దవ యనంగఁ దల వాడె
నాఁగఁ దవ, దగ్రమున కభిఖ్యలగు గిరీశ ...
ఆం. సం. స్థా. ౯.

గీ. వఱలు నిక్ష్వగ్రమిల దవవాడె యనఁగ ...
ఆంధ్రపదాకరము. అచర. ౬౬.

**వాణి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. వాక్కు, పలుకు, విద్య. ౨. భాషాశక్తి, వాక్పటుత్వము. ౩. ధ్వని. ౪. కృతి, గ్రంథము. ౫. స్తుతి, పొగడ్త. ౬. సరస్వతీ దేవి.

ఇ. స్త్రీ. ౧. నేఁత నేయుట. ౨. సాలిని మగ్గము నందలి తాకుడు పలక, వాయు దండను. ౩. వాక్కు, పలుకు, విద్య. ౪. సరస్వతి.

**వాణిజకుఁడు.** సం. వి. అ. పుం. ౧. వ్యాపారి, బేహారి. ౨. శఠుఁడు, ధుష్టుఁడు. (ఆ. ని.)

**వాణిజుఁడు.** సం. వి. అ. పుం. వ్యాపారి, బేహారి.

**వాణిజ్యము.** సం. వి. అ. న. వ్యాపారము, బేహారము, వర్తకము ... ఆము. ౪. ౨౪౫.

**వాణిని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. నేర్పరి యైన యాఁడుది. ౨. నర్తకి, ఆటకత్తె. ౩. మత్తిల్లిన స్త్రీ; కామాతుర యగు స్త్రీ.

**వాత్య.** సం. వి. ఋ. పుం. వీచునది, గాలి; వాయువు.

**వాతకము.** సం. వి. అ. పుం. వృక్ష విశేషము; సోమిదపు చెట్టు.

**వాతకర్మము.** సం. న్. న. అపాన వాయువును విడుచుట ; పిత్తు.

**వాతకానివాఁడు.** వి. బట్టలకు రంగు వేయు వాఁడు. (శ. ర.)

**వాతకి.** సం. విణ. (న్. నీ. న్.) వాత రోగము గలవాఁడు.

**వాతకుండలిక.** సం. వి. ఆ. స్త్రీ. మూత్ర రోగ విశేషము, మూత్రము తక్కువగాను బాధ తోను గాఁటుట.

**వాతకుంభము.** సం. వి. అ. పుం. ఏనుఁగు నొసటిపై బుడిపి.

**వాతకుఁడు.** సం. వి. అ. పుం. జారుఁడు ; ఉప పతి.

**వాతకేతువు.** సం. వి. ఉ. పుం. ధూళి ; దుమ్ము.

**వాతకేళి.** సం. వి. ఇ. పుం. ౧. శృంగార సల్లాపము ; కాముకుల గుసగుసలు. ౨. నాయికా నాయకుల శరీరము మీఁది నఖక్షతము.

**వాతగుల్మము.** సం. వి. అ. పుం. ౧. పెను గాలి ; ప్రచండ వాయువు. ౨. వాత రోగ విశేషము ; వాత నిమిత్తకమైన గుల్మరోగము.

**వాతఘ్ని.** సం. వి. ఈ. స్త్రీ. పులుగొండు. ?. (శ. ర.) (పును.)

**వాతచక్రము.** సం. వి. అ. న. గాలిగుడి, ఇది శుభాశుభములను దెలుపును.

**వాతజ్వరము.** సం. వి. అ. పుం. చెడిన వాత ధాతువు వలనఁ గలిగిన జ్వరము.

**వాతదొమ్మ.** మి. వి. (వాతము + దొమ్మ) ఒక విధమైన పశురోగ విశేషము.

క. చానవి సోలెండడ్డదు, తానకముగ గోవు పరచితంబును గూడన్, మానుగఁ గడువు న నడిచినను, ధేనువులకు వాత దొమ్మ తెప్పున నడఁగున్. సహదేవశిక్ష. ౧. ౧౨.
(చి. ని.)

**వాతధూడ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పెనుగాలి, ప్రచండవాయువు. ౨. తీవ్రమైన వాతరోగము. 3. ఒక విధమైన స్ఫోటకము. మసూచిరికా రోగభేదము. ౪. మనోజ్ఞురాలగు స్త్రీ.

**వాతధ్వజము.** సం. వి. అ. పుం. ౧. మేఘము ; మబ్బు. ౨. ధూళి ; దుమ్ము.

**వాతపిత్తము.** సం. వి. అ. న. ఒక విధమగు వాత రోగము.

**వాతపుత్రుఁడు.** సం. వి. అ. పుం. ౧. శఠుఁడు ; దుష్టుఁడు. ౨. భీముఁడు. 3. హనుమంతుఁడు.

**వాతపోథ(క)ము.** సం. వి. అ. పుం. పలాశము ; మోదుగు చెట్టు.

**వాతప్పు.** అ. క్రి. (వా + తప్పు.) ౧. మాట పొరపాటు నొందు, మాట పొరఁబడు.

ఉ. ... గురాకల మాయలాఁడ వా, తప్పక యింకఁ దత్తఱుచితంపుఁ గుయుక్తుల మాట లెన్నియే, నొప్పుగ నాడుకో నెఱుఁగ కుండవె యిట్టిది చెప్ప నేటికిన్ ...
కళా. 3. ౧౯౨.

క. అప్పుర సౌధములం గల, యొప్పును బొడవును దనర్పు నూహించుచు వా, తప్పఁడె కల రూపెల్లను, జెప్పెడుచో రెండువేల జిహ్వల వాఁడున్ ... విక్ర. ౧. ౭౨.

క. ఇప్పుడు నను నీ వడిగిన, చొప్పున నే తద్ర హస్య మాత్రంబులు వాతప్పక ప్రశ్న

మొనర్చినఁ, జెప్పితి వినుతత్కథా విశే
షము లనఘా ... వి. పు. ౪. ౧౦౭.

౨. పొరపడు, ప్రమాదము నొందు.

ఉ. అప్పుడు యౌవనాశ్వసుతుఁడైన సువేగుఁడు
కీచకాంతకున్, దప్పక చూచి తానును
గదాఘనదండము కేలఁ గ్రాలఁగాఁ,
ద్రిప్పుచుఁ జేరు డిగ్గి పటుశౌంచి వడిం దన
పేరు వాడివా, తప్పక వ్రేసె నొక్క
మొగిఁ దార్కొని భీము శిరంబు వక్షమున్.
జై. భా. ౨. ౭౯.

౩. మాట పొరపాటు.

ఉ. తప్పుగణించి కా దొరలు దండన సేయుదు
రొద్ది వారి వ్రాతప్పున కల్గి మంది కలదాన
నటంచును మారు తూపులన్, గుప్పితి
నీవు ... ఉ. రా. ౬. ౧౦౫.

సీ. గీ. ... తన వచోదోషము క్షమింపు
మనెడు వాఁడె, యేమనిన లేదె వాతప్పు
లెంగ సాగ ... కువల. ౨. ౬౪.

**వాతప్రమి.** సం. వి. ఈ. పుం. స్త్రీ. వడిగల జింక.

**వాతమండలి.** సం. వి. ఈ. స్త్రీ. సుడిగాలి.

**వాతమజము.** సం. వి. అ. పుం. వడిగల జింక.

**వాతము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. ఊఁదఁబడినది. ౨. కోరఁబడినది.

వి. అ. పుం. ౧. గాలి. ౨. వాయుదేవుఁడు. ౩. వాతపిత్తశ్లేష్మములలో నొకధాతువు. ౪. వాతరోగము. ౫. కీళ్ల నొప్పి, సంధుల వాపు.

**వాతమృగము.** సం. వి. అ. పుం. వడిగల జింక.

**వాతరంగము.** సం. వి. అ. పుం. రావిచెట్టు

**వాతరక్తము.** సం. వి. అ. న. రోగ విశేషము.

**వాతరట్టు.** వి. (√ వాయి) వదరుపోతు.

సీ. ఎంచఁగా మీ జాతి కొంచెపు వడిఁగ
వసుధ నెన్నఁగ మీరు వాత రట్లు, కేలి
యంగ మీ కూటములు వేళ కొలఁదులు
చూడ మీరలుగండి చోరపకాంద్రా ...
(ఇది రాయంచల విషయము) ...
చంద్రాంగ. ౪. ౬౧.

ద్వి. పెలుచఁ గోవెలయున్నఁ బెంపుడుఁ జేయు,
కెలయు కీరంబు మిక్కిలి వాత రట్టు, తల
పోయ నట తుమ్మెదలు గూడ గొంట్లు ...
ద్వి. పరమ. ౩. ౨౪౭. పా.

**వాతరము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. పెను గాలి గలది, తుపాను గలది. ౨. వేగముగలది, వడిగలది.

**వాతరాయణము.** సం. వి. అ. పుం. ౧. బాణము. ౨. వింటిదెబ్బ. ౩. పర్వత శిఖరము, కొండ కొన. ౪. రంపము, క్రకచము. ౫. సరల వృక్షము, దేవదారువు. ౬.

**వాతరాయణుఁడు.** సం. వి. అ. పుం. ౧. ఉన్మత్తుఁడు, పిచ్చివాఁడు. ౨. సోమరి, అలసుఁడు.

**వాతరూపము.** సం. వి. అ. పుం. ౧. పెనుగాలి. ౨. ఇంద్రధనుస్సు. ౩. లంచము. (వే. ని.)

**వాతరోగము.** సం. వి. అ. పుం. వాతధాత్వాధిక్యమువలనఁ గలుగు రోగము.

**వాతర్ధి.** సం. వి. ఇ. స్త్రీ. (వాత + బుద్ధి.) ౧. వాతాతిశయము; ఎక్కువగాలి. ౨. గుద్దు కత్తి; ఇనుపగుద్దు.

**వాతలము.** సం. విశే. (అ. ఈ. అ.) ౧. పెను గాలిగలది; తుపానుగలది. ౨. ఉబ్బినది.

వి. అ. పుం. ౧. గాలి ; వాయువు. చణకము ; సెనగ.

**వాతవస్తి.** సం. వి. ఇ. స్త్రీ. మూత్రనిరోధము.

**వాతవృద్ధి.** సం. వి. ఇ. స్త్రీ. వాచినయండము ; అండవృద్ధి.

**వాతవైరి.** సం. వి. న్. పుం. ఆముదపుఁ జెట్టు.

**వాతశీర్షము.** సం. వి. అ. న. పొత్తికడుపు.

**వాతశూలము.** సం. వి. అ. న. రోగభేదము ; ఉబ్బుతోఁగూడిన కడుపునొప్పి.

**వాతసహుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) వాతరోగముగలవాఁడు.

**వాతసారథి.** సం. వి. ఇ. పుం. అగ్ని.

**వాతాండము.** సం. వి. అ. పుం. వృషణరోగము, వృషణములు పెద్దవగుట.

**వాతాటము.** సం. వి. అ. పుం. ౧. వాతమృగము ; జింక. ౨. సూర్యాశ్వము.

**వాతాతిసారము.** సం. వి. అ. పుం. వాతధాతువు చెడుటవలనఁ గలిగెడి గ్రహణి ; రోగవిశేషము.

**వాతాదము.** సం. వి. అ. పుం. బాదాముచెట్టు.

**వాతాపి.** సం. వి. ఇ. పుం. అగస్త్యునిచేమ్రింగఁబడి జీర్ణింపఁజేసికొనఁబడిన యొకరాక్షసుఁడు ; (ఇల్వలుని సోదరుఁడు.)

**వాతాపిసూదనుఁడు.** సం. వి. అ. పుం. అగస్త్యుఁడు.

**వాతాప్యము.** సం. వి. అ. న. ౧. పులియుట. ౨. సోమము. ౩. నీరు.

**వాతామోద.** సం. వి. ఆ. స్త్రీ. కస్తూరి.

**వాతాయనము.** సం. వి. అ. పుం. గుఱ్ఱము. న. ౧. గవాక్షము ; కిటికి. ౨. తలవాకిటి వసారా. ౩. మండపము.

**వాతాయనము.** సం. వి. అ. న. పర్ణము ; ఆకు.

**వాతాయువు.** సం. వి. ఉ. పుం. వడిగల జింక ; వాతమృగము ; జింక.

**వాతారి.** సం. వి. ఇ. పుం. ౧. ఆముదపుఁ జెట్టు. ౨. శతమూలి = పిల్లితేగలు. †. శేఫాలిక = శాలిచెట్టు. †. యవాని = ఓమము. (వాము.) †. భార్గి = గంటు బారంగి. †. స్నుహి = జెముడు. †. విడంగ = వాయువిడంగములు. శూరణ = కూరకంద. †. జతుక = పద్మావతి. †.

**వాతాలి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. సుడిగాలి.

**వాతాశ్వము.** సం. వి. అ. పుం. వడిగల గుఱ్ఱము.

**వాతాహతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. గాలిదెబ్బ. ౨. త్రిబల వాయువు.

**వాతి.** సం. వి. ఇ. పుం. ౧. సూర్యుఁడు. ౨. గాలి. ౩. చంద్రుఁడు. (విల్యమ్సు.)

**వాతికము.** సం. విశే. (అ. ఈ. అ.) ౧. పెనుగాలి గలది ; తుపాను గలది. ౨. వాతరోగము గలది. ౩. వెఱ్ఱిది ; ఉన్మత్తము.

వి. అ. పుం. వాతదోషము వలనఁ గలిగిన జ్వరము.

**వాతికాసు.** వి. (వాయి + కాసు) ౧. వాతిపాతిక. (గ్రా) ౨. లంచము. (శ. ర.)

**వాతిగణము.** సం. వి. అ. పుం. వంగ చెట్టు ; వంగకాయ.

**వాతిగమము.** సం. వి. అ. పుం. వంగ చెట్టు, ఇట్లే వాతిగము.

**వాతిగముఁడు.** సం. వి. అ. పుం. ఖనిజశాస్త్రజ్ఞుఁడు ; ఇట్లే వాతిగుఁడు.

**వాతిపాతిక.** వి. (వాయి + పాతిక) చితియందుంచిన శవమునోట వేయుబంగారము.

ద్వి. వసుధామరునిఁ గాంచి వడలక వేఁడి,
వలయు మాడయు మఱి వాతి పాతికయు,
వల నొప్పఁగొని రమ్ము వడి నట కనిన ...
హరిశ్చ. ౨౩౬౧. పం.

**వాతిబియ్యము.** వి. (√ వాయి దహనము చేయునపుడు పీనుఁగు నోట వేసెడి బియ్యము. (శ. ర. ప్రౌ.)

**వాతివాడి.** వి. (√ వాయి) వాక్పారుష్యము గల స్త్రీ.

మ. సుర సేవించిన వాతి వాడియయినన్
సొమ్మొల్లఁ బోనాడినం, బురుషద్వేషిణి
యైన గొడ్డయిన నెప్డుం గూఁతులం గన్న
మైఁ, బర పాపరోగము లున్న దుర్వర్తయయి
నన్ భార్యం బెడంబాసి యుప్పురు
షుం డొం డొకపెండ్లి యాడినను నొప్పుం
దప్పు లే దేమియున్. విష్ణు. ౧. ౧౧౩.
(వాతవాడి. శ. ర. పా.)

**వాతీయము.** సం. విణ. (అ. ఆ. అ.) పెను గాలి గలది.

వి. అ. న. కాంజకము, గంజి.

**వాతుఁడు.** సం. వి. అ. పుం. ౧. ధృష్ట నాయకుఁడు. ౨. వాయుదేవుఁడు.

**వాతులము.** సం. వి. అ. పుం. సుడిగాలి.

**వాతులి.** సం. వి. ఇ. పుం. పెద్ద గబ్బిలము.

**వాతూలము** = వాతూలము ; వాతులుఁడు.

**వాతూ(తు)లుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. వాతరోగముగలవాఁడు. ౨. వెఱ్ఱివాఁడు ; ఉన్మత్తుఁడు.

వి. అ. పుం. సుడిగాలి.

మ. ఘుర్వారాద్భుతసారముల్, వడగండ్లం
బెరయంగఁ దీవ్రవిసరద్వాతూలుతోఁగూడి
దం,డడిఁ దోడ్తోడఁ బ్రవృద్ధిఁబొంది ...
హరి. పూ. ౮. ౧౬౪.

**వాతెర(అ).** వి. (వాయి + తెర) రదనచ్ఛదనము ; పెదవి.

క. గురివెంద జైత్రముఁ డొందఁగఁ, గరములు
కన్మ్రాలి యపుడుకఱచినను వాతెర
మీఁదఁ గానగు పలు, వరుసయన న్నసలు
పల్లవముపై మొనసెన్. పారి. ౩. ౪౫.

సీ. తెలిదమ్మివిరియింటి తెలిగంటి కెంపు వాతెర
సొంపె పవడంపుఁ దీఁగె గుంపు ...
దశా. ౧. ౧౬౪.

చ. నెఱ గురులున పలుఁలసితి నేత్రయుగం
బును నొప్పు తెప్పవా, తెఱయును ...
భార. ఆది. ౮. ౮౩.

క. పలుచేని నాతెఱ మెఱుఁగునఁ, బలు
మెఱుఁగులు గండడింప ...
వ.మచ. ౪. ౮౦.

**వాత్యా.** సం. వి. ఆ. స్త్రీ. వాత సమూహము ; సుడిగాలి. పెనుగాలి ; తుపాను.

**వాత్సకము.** సం. వి. అ. న. వత్ససమూహము ; దూడల గుంపు.

**వాత్సల్యము.** సం. వి. అ. న. ౧. (పుత్రాది విషయక) ప్రేమము. ౨. ప్రేమము ; స్నేహము ; చెలిమి. ౩. అత్యంత ప్రేమము ; దయ.

**వాశ్రి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. బ్రాహ్మణునకు శూద్రస్త్రీయందుఁ బుట్టిన కూఁతురు.

**వాత్స్యాయనుఁడు.** సం. వి. అ. పుం. ౧. కామసూత్రములు రచించినయొకానొక ఋషి. ౨. గౌతమన్యాయసూత్రములకు భాష్యము రచించిన యొకముని.

**వాద.** వి. (క. వాద.) జలాశయము, నీటిపట్టు.

తే. మంచుకొను వాదనీరుల మునిఁగి మునిఁగి,
గుళ్లగుళ్లను వేల్పులఁ గొలిచి కొలిచి, ధాత
మాటలుబట్టి ఛాందసనుబట్టి, యలయుటే
కాని పాపంబు తొలఁగదయ్యె.
శ్రీరం. మా. ౫. ౧౧౭.

**వాదకుఁడు.** సం. వి. అ. పుం. ౧. గాయకుఁడు; సంగీతము పాడువాఁడు. ౨. వక్త; ఉపన్యాసకుఁడు.

**వాదడుచు.** అ. క్రి. (వాగు + అడుచు) వివాదపడు.

క. ఒక్కరొకరుం దమలో నొక, బొక్కకు వాదడిచి శకశకముకపింజలముం, గ్రక్కునఁ బఱతెంచి పులికి, మ్రొక్కుచు నిజవాద మిరువురుం జెప్పఁటయున్.
కేయూర. ౨. ౯౧.

క. ఊరక పుడకలు విఱుచుట, వైరంబున నోరులతోడ వాదడచుట దుర్వారగతిఁ బరువు వాఱుట, గోరన్ గోరొలుచుటెల్లఁ గొఱగాదుసుమీ.
వి. పు. ౪. ౨౩౩.

**వాదనము.** సం. వి. అ. న. ౧. వాయించుట. ౨. వీణ మొదలగుసాధనములమీఁద పాడెడి పాట.

**వాదము.** సం. వి. అ. పుం. ౧. పలుకుట; చెప్పుట. ౨. మాట; పలుకు. ౩. రూఢిగాఁ జెప్పఁబడినసంగతి. ౪. కథ; చరిత్రము. ౫. వాదించుట; పరస్పర వ్యతిరేకభావములు తెలుపుట, ౬. సమాధానము; ప్రత్యుత్తరము. ౭. వివరణము స్పష్టపఱచుట. ౮. సిద్ధాంతము; వాదానంతరము నిర్ణయించిన విషయము. ౯. ధ్వని; చప్పుడు. ౧౦. కింవదంతి; జనప్రతీతి. ౧౧. ఫిర్యాదు; అభియోగము, తగవు.

**వాదయుద్ధము.** సం. వి. అ. న. పట్టుదలతో వాదముచేయుట.

**వాదర.** వి. (వాడి + ధార.) (ఖడ్గాదుల) తీక్ష్ణధార.

వ. ... అంతకంతకు నెక్కుడగుకోపంబున నాటోపంబు దీపింప వాదరఁ జిక్కిన యొకుకనుకలుగోఱ కొడలకై పడి నలిగి.
భార. సౌ. ౧. ౧౪౬.

**వాదర.** సం. వి. అ. స్త్రీ. ప్రత్తిచెట్టు.

**వాదరంగము.** సం. వి. అ. పుం. అశ్వత్థవృక్షము; రావిచెట్టు.

**వాదరతుఁడు.** సం. వి౦. (అ. ఆ. అ.) వాదమునందాసక్తిగలవాఁడు.

**వాదరము.** సం. విణ. (అ. ఈ. అ.) దూదిగలది; లేక దూదితోఁ జేయఁబడినది.

వి. అ. న. దూదిబట్ట.

**వాదరి.** విణ. వాదు + అరి?) జల్పకుఁడు; వదరుబోతు.

మ. క్షమతో నుండ భయస్థుఁ డండ్రు కినియన్ గయ్యాళివాఁడండ్రు మౌనమిడన్ మూఁగయటండ్రు వాక్పటిమఁజెందిన్ వాదరం డండ్రు పార్శ్వమున న్నిల్వ మదాంధుఁ డండ్రు ... వల్లభరా. నీతిశ. ౪౭.

**వాదవాది.** సం. వి. న్. పుం. జైనుఁడు.

**వాదసాధనము.** సం. వి. అ. న. వాదమును సాధించుట; చెప్పినదానిని నిలఁబెట్టుకొనుట.

**వాదాడు.** అ. క్రి. (వాదు + ఆడు) వాదించు.

మ. మన కీసాటులువచ్చెఁ జూచితిరె నామాటల్ వృథాహంకృతిన్, వినఁగానొల్లక యల్లరాత్రి యిచట స్త్రీలెల్ల వాదాడ యుంచిన యాకోకసుగెట్టలో మెలిచె హెచ్చెంజూనె యీమట్టి ...
కేయూర. ౩. ౪౮.

**వాదానువాదములు.** సం. వి. అ. పుం. బహు. ౧. ఒకవిషయమును జెప్పుటయు దానిని ఖండించుటయు; వాద ప్రతివాదములు. ౨. పరస్పరవ్యతిరేకాభిప్రాయములు దెలుపుట.

**వాది.** సం. విణ. (న్. నీ. న్.) ౧. పలుకువాఁడు, సంభాషించువాఁడు. ౨. స్థిరముగాఁ జెప్పువాఁడు. ౩. వాదించువాఁడు.

వి. న్. పుం. ౧. వక్త, ఉపన్యాసకుఁడు. ౨. ప్రతివాది, ప్రతిపక్షుఁడు. ౩. అభియోగము తెచ్చినవాఁడు, నేరము మోపినవాఁడు. ౪. బోధించువాఁడు, ఉపాధ్యాయుఁడు. ౫. (వీణ) మెట్టు.

**వాదించు.** సం. అ. క్రి. (√ వాద) ౧. వాదాడు. ౨. తగవాడు. (శ. ర.)

తే. ఒండొకఁడవైన నిపుడ నీపిండి యిడమె, బ్రాహ్మణుఁడవౌట మాచేత బ్రదుకుఁ గంటి, తడవఁబనిలేదు నిన్ను గౌతమునిగోవనుచు వాదించి విడిచిన నాగ్రహించి.
మనుచ. ౪. ౯౦.

**వాదితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. పలికింపఁబడినది. ౨. వాయింపఁబడినది; మ్రోగింపఁ బడినది.

**వాదిత్రగణము.** సం. వి. అ. పుం. సంగీతపుమేళము; మృదంగాది వాయిద్యములు వాయించువారి మేళము.

**వాదిత్రము.** సం. వి. అ. న. ౧. తతము. అనద్ధము, సుషిరము, ఘనము, అను వాద్యచతుష్టయము. వీణాగానము మొదలగునది.

**వాదు.** వి. (సం. వాదః) ౧. వాదము; వాక్కలహము.

గీ. ఒలసి నీపుత్రులెల్ల నొండొరులతోడ, నెట్లొడంబడి యుండుదు రట్లు చేయు, వలయుఁదములోన జూదంబు వాదు నగుటఁ, గలహమూలంబ యెట్టి శాంతులకునైన.
భార. సభా. ౨. ౧౩౧.

ఉ. వాదున గెల్వలేక పురవైరి లలాటము కన్నుఁ జూపఁ దాఁ, బాదమునందుఁ గన్ను బ్రతిపక్షుఁ జూపెను ... ప్రభా. ౧. ౧౨.

సీ. ... వాదనఁగ వాదంబు చెలఁగు ...
ఆ. భా. ౧. ౧౧౩.

౨. కలహము.

వ. ... విష్ణుఁడు సర్వలోకగురుఁడు, తత్పత్నీహరణంబు కొఱగాదు, వాదులు ప్రోదులు చేయుము మునిముచ్చు బోధనంబులు వినం జనిలే దని చెప్ప ... వరాహ. ౧౧. ౫౪.

౩. మాట.

క. కాదని చేతిరోకట, వాదులువారించి లెస్స వడ్డించినచో, నీ దిక్కున నీ కెవ్వరు, రా దిక్కని పల్కనవ్వి యతఁడిట్లనియెన్.
విప్ర. ౪. ౭౦.

౪. నింద.

దండకము. ... మముం జేరనీఁజే నిసుం జేరరాఁజే ప్రవేశింపరాదే ప్రవాహింపవాదే ... భోగినీదండకము.

విణ. అసత్యము, కల్ల.

క. ఏ దెసఁ జూచిన నాదెస, నాదృష్టికిఁ దాన యగుచు నామది నెపుడున్, వైదేహి పాయ దొంటెడ, వైదేహిం గంటి మనుట వాదో నిజమో. భా. రా. సుంద. ౫౬౪.

జ: వాడడుచు, వాదరి, వాదాడు, వాదించు, వాదుకుఁబోవు, వాదుగొను, వాదుపెండేరము, వాదులాఁడు, వాదులాడు, వాదువెట్టు.

**వాదు(ల)కుఁబోవు.** అ. క్రి. (వాదులకు + పోవు) వాక్కలహముచేయు.

ఉ. కారణ మేమి లేకయె వికావిక నవ్వును నిర్ణిమిత్తమె, వ్వారల నైనను బిలిచి వాదుకుఁ బోవును ... సీధుగన విభ్రమస్థయినమ్మ గాత్రీ యత్తతిన్ ... కవిరా. ౫. ౧౫౬.

సీ. ... అతని నెవ్వరు దూఱినాడిన వారితోఁ జెలపట్టి వట్టివాదులకుఁ బోదు ... కువల. ౪. ౧౯౦.

**వాదుగొను.** స. క్రి. (వాదు + కొను) నింద పడు.

క. ప్రోదిఁ గొనఁదగినపుష్పఫలాదుల గొడ్డంట వచ్చి యువనిజము నెడన్, వాదుగొనునట్లు భూప్రజ, బాధించిన నేల కలుగు పతికిని గోరుల్. కవిక. ౨. ౧౭.

**వాదుపెండేరము.** వి. (వాదు + పెండేరము) వివాదమున గెలుపును సూచించుబిరుదు చిహ్నము.

ద్వి. అలస యానముల నాయంచలం గెలిచి, పిలుచఁ బెట్టిన వాదుపెండేర మనఁగఁ, గమలాప్తబింబంబుగతి నొప్పు మణుల, రమణీయమగు నూపురము బొందుపఱచి. ద్వి. పరమ. ౫. ౪౩౦. పా.

**వాదులాఁడు.** విణ. (వాదులు + వాఁడు.) వాదమాడువాఁడు, వాదించువాఁడు.

ఆ. వాదులానితోడ వాల్లైనితోడను, బూతుతోడ తిండిబోతుతోడ, నటమటీనితోడ నడియరితోడను, వెలకు నెత్తమాడ వెరవు గాదు. ఉ. హరి. ౩. ౧౧౨.

**వాదులాడు.** అ. క్రి. (వాదులు + ఆడు) వివాదముచేయు.

ఉత్సాహ. ... ఈయన నను బరాకుపఱచి యాటగెలుపు తనదిగా, వెనుక వాదులాడ నేను వినఁగఁ జాలనని తగన్ ... కళా. ౬. ౧౧౫.

**వాదువెట్టు.** (వాదు + పెట్టు.) అ. క్రి. నింద మోపు.

రగడ. ... కలికి కలిచ యీసు నెమ్మదిఁ గ్రమ్మఁ గ్రమ్మఱ వాదువెట్టకు .. వాల్మీకి. ౩. ౧౧౪.

**వాదోడు.** విణ. (వా + తోడు.) మాటాడుటకు సహాయపడువాఁడు; సహాయపడునది.

శా. ... బంగారందియ సౌఖ్యనం గమిచి పైపై సంచే యల్గింపఁగా, సింగారంబగు ముద్దు తనకుం జేదోడు వాదోడుగాన్ ... విజ. ౨. ౧౫౪.

గీ. దాస్యవృత్తికి నిటువంటి దానిఁ జేర్చుకొనఁ గొదువలేదు వలదుపొమ్మనఁగ నేల, యిది యదృచ్ఛాప్త లాభమై యొదవెఁ దోఁట, పనికిఁ జేదోడు వాదోడు పాటుపడును. వైజ. ౨. ౧౦౬.

వి. పసులకు నాలిక చేయులలోనుగాఁగల తెవుళ్ళను బరిశీలింప నోటఁ జొప్పించి నోరు తెఱపించుటకై యేర్పఱచిన దార్వాయస రూప యంత్ర విశేషము.

సీ. దామెనలును వల్లె త్రాళ్లును బలుగులు
గవ్వముల్ గొడశలి కత్తినూఁడు ...
తే. గొడుపు వాదోళు మొదలుగాఁ జెడక
యుండ, వలయు ముల్లెల్లఁ దెమ్ము ...
హరి. పూ. ౬. ౨౧.

వ. ... చూఁడు గొడుపులును వాదోళ్లుముకు బంతులు మొదలుగాఁ గలసాధనంబులు గొని వచ్చి తెవులు గొంటులఁ జికిత్సించు వారు. హరి. పూ. ౫. ౧౪౨.

**వాద్యకరుఁడు.** సం. వి. అ. పుం. వీణాదికమును వాయించు పురుషుఁడు.

**వాద్యభాండము.** సం. వి. అ. న. ౧. వీణాది వాద్యముల సమూహము. ౨. తతము, ఆనద్ధము మున్నగు సంగీతపరికరము.

**వాద్యము.** సం. వి. అ. న. ౧. వీణ మున్నగు సంగీత సాధనముల ధ్వని. (విల్యమ్సు.)

**వాధు(ధూ)క్యము.** సం. వి. అ. న. ౧. వివాహము ; పెండ్లి.

**వార్ధ్రీణసము.** సం. వి. అ. పుం. ఒక జాతి యడవిమృగము ; ఖడ్గమృగము.

**వాన.** వి. ౧. వర్షము.

చ. తరుణులు చంచలాలతలు తత్కర భాండని
కాయ మంబుదో, త్కరములు పాలు
తేనెలు ఘృతంబులు నలు ... వాఘుక్తి
వేళ దొలకరి సమయంబు పేరెలమిఁ
గైకొనకుండునె భోక్తృసస్యముల్ ...
నైష. ౬. ౧౨౧.

**వానయగు.** అ. క్రి. వానవచ్చు, వాన కురియు.

ఆ. వానగైన నెండ వచ్చిన గొడు గవశ్యంబు
వలయు రాత్రి యడవిలోనఁ, దిరుగు
నపుడు గుదియ ధరియింప వలయును, గాలఁ
జెప్పు లిడక కదలరాదు. వి. పు. ౪. ౨౪౫.

౨. వర్షకాలము.

సీ. వానయు వీతను వర్జించి మండు వేసవి
గాకనున్న సస్యముల పంట, లాదకొడు
తలి నెత్తునది శత్రుపయి ...
భార. శాం. 3. 3.

ఉ. వానకరంబు దీఱుటయు వానరనాథుఁ
డనేకసేనతో, మానవనాథుఁ గాంచి
బహుమానవచోగతి కుబ్జి జానకీ, మాన
వతిం గనంగ నసమానవనాటులఁ బంప ...
ఉ. రా. ౧. ౧౦౪.

ఎనుపోతుపై వాన = ఎన్ని చెప్పినను లక్ష్యపెట్టని వాఁడు.

ద్వి. ఒక విచారము మాకు నొడవె నీరాజు,
కుకవాని పనిపంద చూపుగుజ్జంబు, మామిడి
క్రింది సోమరి మేధకుండు, బూమెకుంటరి
యెనుపోతుపై వాన.
ద్వి. హరిశ్చ. ఉ. ౧౪౯ ౫. పం.

జ: వానకట్టె, వానకాళులు, వానకోయిల, వానగొట్టు, వానజాతి పులుఁగు, వానతఱి, వాన నెచ్చెలి, వానపడె, వానపాము, వానపేగు, వానరాయి.

**వాన.** సం. వి. అ. స్త్రీ. మాలవల్లంకిపిట్ట.

**వానకట్టె.** (వాన + కట్టె) వి. అలగర్దము, నీరుకట్టె.

సీ. ... వాహినీనాథుతో పరిమళ్లి కొలువ
వ్యాళి నాయకునితో వానకట్టె ...
చెన్న. ౫. ౩౧.

**వానకాళులు(ళ్లు).** వి. బ. (వాన + కాళులు) దూరమునుండి చూచువారికి మేఘములంగు కాళ్లవలె కన్పడు వర్షధారలు.

గీ. ధర నిదాఘజాతాహతి నెరయకుండ,
విధి దమాలమంటపము గావించె ననఁగ,

నొప్పు నీలాభ్రపటల మచ్చుప్పరమున,
రాళు లన నెల్లడను వానకాళు లమరె.
కు. సం. ౬. ౨౫౪.

గీ. పుట్ట వెడలిన భోగి త్తిఁ బట్టఁ శక్ర, కార్ము
కపుఁ బెద్ద పలువన్నె కట్ల జెట్టి, దైన
నడచెడు కొళ్లి గుంపనఁగ గాలి, కార్కొని
దిగంతముల వానకాళ్ళు నడచె.
ఆము. ౪. ౭౯.

క. కలిలంపువృద్ధజలధర,ములు పూనిన యూఁత
కోలముత్తములక్రియన్, దోలు వాన
కాలు లెసఁగెన్, గలహంసకులంబు
లెల్లఁ గలఁగంబడఁగన్.
పాండు. ౪. ౨౫.

**వానకోయిల.** (వాన + కోయిల) (వాన చినుకులఁ ద్రావు పక్షి.)

వి. ౧. చాతక పక్షి.

గీ. అటుల దోరెపుఁ ద్రాడుచే నత్తె పమరఁ,
దళుకుచేఁ దొల్త వానకోయిలలఁ దునిమి,
ఖైరిచే వెన్క కొంగలబాలుఁ గొట్టి,
సాళువము చేతఁ గుండెల్లఁ జీరె నంత.
ప్రబం. ౧. ౨౩౨.

సీ. ... తొలు మొగుల్నిడు చిన్కు లెలమిఁ
గ్రోల్వాన కోయిల బలుకుంచు సోనలకుఁ
జనునె ... నీలా. ౨. ౭౬.

౨. సర్ప విశేషము. (శ. ర.)

**వానగొట్టు.** వి. (వాన + కొట్టు) వానదెబ్బ, వానతాఁకు.

ఉ. అక్కడ నుండ నేల ధవళాయతలోచన
వానగొట్టునం, జిక్కితి గా యిఁకం దడవు
సేయక నా చిగురాకు శయ్య యీ, దిక్కున
నున్న డీ విటు మదీయపదంబులదండ
నుండు ... వి. ప్ర. ౩. ౭౬.

**వానజోలిపులుఁగు.** (వాన + జోలి + పులుఁగు)

వి. హంస.

చ. సఖుం గమతాగ్రణి నవ్విధంబునన్, గొని
యల వానజోలిపులుఁగు ల్గగనంబునఁ బోవఁ
ద్రోవ లో,చనముహ మాచరింతె విదిశా
నగరంబు ...
కేం. పంచ. ౧. ౫౬౭.

చ. అని యల వానజోలిపులుఁ గావనజాక్షినిఁ
జీరి వేడినన్, విని తలపోసి చూచి యిది
వింతసుమీ తెలియంగ లేను నేఁ,ర్పన నది
భర్త కింపు మదిఁ బుట్టఁగ నెట్టులు బొంకఁ
జెప్పవే, యనఁ గలహంసవంశకలశాం
బుధిచంద్రుఁడు కొంత కిట్లనున్.
హంస. ౪. ౫౧.

**వానతఱి.** (వాన + తఱి) వి. వర్షాకాలము, వర్షఋతువు.

గీ. కోఁతిరాయఁడ మాపయిఁ గూర్మి నిలిపి,
వానతఱియెల్ల నగములలోన నుండఁ,
దపసి రూపులఁ బ్రోల్లకుఁ దఱిలిరాఁగ,
మాకుఁ బాసఁగదు పొమ్ము మతాశ
రమ్ము. అ. రా. కిష్కి. ౫౪.

**వాననెచ్చెలి.** వి. (వాన + నెచ్చెలి.) ౧. వానకోయిల. (శ. ర.)

౨. వరుణుఁడు.

గీ. వాననెచ్చెలి పడమటి వంకఱేఁడు, వల్లె
త్రాడు గెలాఁ డన వరుణుఁ డొప్పు ...
ఆం. భా. ౧. ౫౧.

**వానపడె.** వి. (వాన + పడె) వాననీరు నిలిచెడి చిన్నగుంట.

సీ. ఆమాను సామానసీమానటదనూనమానసౌక
ము బోనె వాన పడెకు ...
ముకుందవి. ౨. ౧౪౫.

**వానపాము.** వి. (వాన + పాము) ఎఱ్ఱి, మహీలత. (శ. ర., బ్రౌ. వా.)

**వానపేగు.** వి. (వాన + పేగు) ఎఱ్ఱి, మహీలత. (శ. ర.)

**వానప్రస్థము.** సం. వి. అ. పుం. ౧. మధూకము, ఇప్ప చెట్టు. ౨. పలాశము; మోదుగు చెట్టు.

**వానప్రస్థుఁడు.** సం. వి. అ. పుం. ౧. వనవాసవ్రతమును (వానప్రస్థాశ్రమమును) అవలంబించినపురుషుఁడు; తృతీయాశ్రమమునం దున్నయతఁడు. ౨. పరివ్రాజకుఁడు, సన్యాసి; యతి.

**వానము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. ఊఁదఁబడినది. ౨. ఎండినది. (కాయ లోనగునది.) ౩. అరణ్య సంబంధమైనది; అడవి సంబంధమైనది.

వి. అ. న. ౧. ఎండినఫలము. ౨. ఊఁదుట. ౩. జీవించుట. ౪. గాలిసుడి. ౫. పరిమళము; సువాసన. ౬. ద్రాక్ష తీఁగల తోఁపు. ౭. సేయుట. ౮. గడ్డిచాప. ౯. ఇంటి గోడలోని కన్నము. ౧౦. గతి, నడక. (మే. ని.)

**వానరప్రియము.** సం. వి. అ. పుం. పాల చెట్టు.

**వానరము.** సం. వి. అ. పుం. క్రోఁతి.

**వానరాక్షము.** సం. వి. అ. పుం. అడవి మేఁక.

**వానరాఘాతము.** సం. వి. అ. పుం. లోధ్రము; లొద్దుగ చెట్టు.

**వానరాయి.** వి. (వాన + రాయి) వడగల్లు, కరకము. (శ. ర., చి. ని.)

**వానరి.** సం. వి. ఈ. స్త్రీ. ఆఁడు క్రోఁతి.

**వానలము.** సం. వి. అ. పుం. కృష్ణ తులసి. ?.

**వానస్పత్యము.** సం. వి. అ. పుం. పూచి కాచెడి చెట్టు; పూవునుండి పుట్టిన ఫలముగల మామిడి మున్నగు చెట్టు, పూవులు పూవక కాచెడి చెట్టు, వనస్పతి.

**వానాయుజము.** సం. వి. అ. పుం. వనాయుదేశమునఁ బుట్టిన గుఱ్ఱము. (అరబ్బీ గుఱ్ఱము.)

**వానాయువు = వనాయువు.** సం. వి. అ. పుం. భరత ఖండమున వాయవ్య దిక్కున నుండెడి దేశ విశేషము; వనాయ దేశము. (అరేబియా.)

**వాని = వాఁడి.** విణ. నిశితము, తీక్ష్ణమైనది.

క. అనిన విని వాని మది దోఁప నిరంకుశ విజయభేరిభాంకృతు లెసఁగన్, మొన లేర్పరించి తోడసె, జననాథుఁడు గడలె సమరసంరంభమునన్. జై. భా. ౪. ౫౨.

**వానియము.** వి. (సం. వాణిజ్యమ్) వర్తకము.

ఉ. చీనపుదీవి నిన్ను బనిసెందియుఁ దుల్వ మటన్న నచ్చుటన్, వానియ మాడఁ బోద మని నావల వేలకొఁ డాయితంబుగాఁ, బూని ఘటింప నందినుము పూర్ణముగాఁ గొని పెట్టు లిద్దఱున్, ఫేన తరంగ భంగుర గభీర పయోనిధిలోన నావపై.

కేయూర. ౩. ౧౬౭.

**వానీఁడు.** వి. (వాసె + ఈఁడు.) ౧. వాసె కులమువాఁడు. ౨. కుబేరుఁడు.

సీ. వానీఁడు రారాజు వడచక్కి యొకిమీఁడు తత్తడినెక్కుడు దంటయనఁగఁ ... ధనదు పేళ్ళగు ... సాం. ని. దేవ. ౧౪.

**వానీరకము.** సం. వి. అ. పుం. ముంజగడ్డి, ఒక జాతి కసవు.

**వానీరము.** సం. వి. అ. పుం. వేతసము, నీటి ప్రబ్బ చెట్టు.

**వాను.** స. క్రి. కుండలుచేయు.

ఉ. ... అజాండ భాండముల్, వానను ...
ఆము. ౧. ౪.

సీ. గానమూయంగ మూకుఁడు వానుగాకను
కలఁడె వానను దటాకంబు మూయ ...
రామ. ౪. ౯౨.

**వానె.** వి. ఒకజాతికోమటి.

క. ఆనందవనమునం దొక, వానెవణిజు నింట
నుండి వైశ్యుండు పదార్థానయనార్థము
పోయెన్ ... కాశీ. ౫. ౬౩.

వ. ... అవ్వీటిమేటి సాలెయగసాలె పటుసాలె
వానెవైజాతి సాఁతులేతుల కోమిరెలు ...
ఆను. ౪. ౩౫.

జ: వానీఁడు, వానెత.

**వానెత.** వి. (√ వానె) వానెజాతి స్త్రీ. (శ. ర.)

**వానేయము.** సం. వి. అ. న. తుంగముస్త, పరి
వశముగల యొకజాతి తృణమూలము.

**వాపదండము.** సం. వి. అ. పుం. సాలెవాని
నేఁతపలక, వేమము.

**వాపనము.** సం. వి. అ. న. ౧. విత్తులు చల్లిం
చుట. ౨. క్షౌరము, గొఱుగుట ; గొఱిగించుట.

**వాపము.** సం. వి. అ. పుం. ౧. విత్తులుచల్లుట.
౨. నేయుట. ౩. క్షౌరము ; గొఱుగుట.

**వాపాఠము.** మి. వి. (వాయి + పాఠము) కంఠ
పాఠము, ముఖస్థముగానుండుట, నోటిపాఠము.

ద్వి. భరత శాస్త్రంబు వా పాఠంబు వీణె, పరి
పరి విధములఁ బలికింప నేర్చు ...
ప్రభు. ౧. ౪. ౨౭. టీ.

**వాపి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. బావి, దీర్ఘిక,
ఒకవిధమయిన జలాశయము.

సీ. ... బహువిధాగారముల్ ప్రమదవనంబుల
వాపుల దీర్ఘికావలుల వెలసి ...
భార. సభా. ౧. ౨౭౨.

**వాపితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. విత్తులు
చల్లఁబడినది. (క్షేత్రాది ;) చల్లఁబడినవి.
(బీజాది) ౨. క్షౌరము చేయఁబడినది, గొఱుగఁ
బడినది.

**వాపి(పీ)హము.** సం. వి. అ. పుం. చాతకపక్షి.

**వాపు.** వి. వాయింపు.

సీ. వాయింపువాపన వాదనమగు ...
ఆం. భా. ౧. ౧౨౬.
(ప్రాఁత ప్రతి. పా. శ. ప్రా.)

**వాపుచ్చు.** సం. క్రి. (వా + పుచ్చు.) ౧. నోరు
తెఱచు.

ఉ. చచ్చినపుత్రు నెత్తుకొని జానపదుం డొక
విప్రుఁ డార్తుఁడై, వచ్చి నరేంద్రుమంది
రమువాకిట నాలుగు దాను నిల్చి, వాపుచ్చి
మహోష్ణబాష్పములు బోరనఁ గ్రమ్మఁగ
నేడ్చి యేడ్చి క్రన్నిచ్చుచు మోడ్చుచున్.
నిర్వ. ౧౦. ౫౩.

క. చూపుల శ్రీపతిరూపము, నాపోవక త్రావి
త్రావి హర్షోద్ధతయై, వాపుచ్చి మంద
మనురా, లాపంబులఁ బొగడె నదితి లక్ష్మీ
నాథున్ ... భాగ. ౭. ౪౭౨.

ఉ. చచ్చిన నత్తపస్విసతి సన్నులు మోమును
మోదుకొంచుఁ బై, వెచ్చనికన్నునీ రడర
నీడినవేఁదలితోడఁ బెల్చ వాపుచ్చి తనూజా
లం బనవఁ బొంచి కనుంగొని పోయె
విప్రుఁడై, యచ్చటికిన్ సురాధిపతి యాతనిఁ
జూచి లతాంగి వెక్కుచున్.
భార. అను. ౧. ౨౯౯.

ఉ. వచ్చె ఘనాఘనంబు లివె వల్లభు లేలొకో
రా రటంచు విద్యుచ్ఛలనోద్యతద్యుతుల
కులుకుచుం గ్రోవలు నిక్కిచూచి వాపు
చ్చుక నెవ్వగ న్వగపు పుట్టఁగఁ బాంధ
సతుల్ నిగుడ్చు పెన్వెచ్చనియూర్పుల
న్విరిసె విన్నుపయిం బ్రథమాంబువాహ
ముల్. కవిక. ౬. ౧౩.

**వాపోక.** వి. (√ వాపోవు.) ౧. అఱచుట. ౨. ఏడ్చుట. (శ. ర.)

**వాపోవు.** ద్వి. అ. క్రి. (వాయి + పోవు.) ౧. అఱచు. (వాయి - ప్రకృతి - వాక్.)

క. ఏ యెడఁ బతిఁ బొడగానక ... వాయుడు
పక చీరు నేడ్చు వడి వాపోవున్ ...
హ. సం. ౫. ౫౪౭.

సీ. ... ఆ. గీ. వాయు వెదురు వీచె వాపోయె
వఱదులు ... భారా. అర. ౧. ౧౮౨.

క. ఉఱుమక పిడుగులు పడియెడి, వఱపులు
వాపోవఁజొచ్చె వాహినికడుగై, యొఱ
లందు నాయుధంబులు, విఱిగిపడఁదొడంగెఁ
బుట్టె విపరీతంబుల్.
జై. భా. అశ్వ. ౬. ౧౩౮.

సీ. ... కులపర్వతావళి కులిశభయంబున
బెదరి వాపోవు నట్లెదురు సెలఁగె ...
భార. ఉద్యో. ౪. ౧౧౬.

౨. ఏడ్చు.

ఉ. రావణుబారిఁ జిక్కి సధరాసుతచాడ్పున
భీతినొంది వాపోవుచుఁ బోవుచో నృపతి
పుత్రునకుం దనపోక చెప్ప భూదేవికి లంచ
మిచ్చినగతిఁ సురవైరి యొఱుంగకుండ
రాజీవదళాక్షి యప్డు వయిచెం దనమైతొడ
వుల్ గ్రమంబునన్. భోజరా. ౫. ౫౨.

క. ఈ పగిది నీవు వగలన్, వాపోవఁగఁ జూచి
యకట వారింపంగా, నోపినవిలుకాఁ

డొకండుఁడీపురి లేఁడయ్యె నయ్యె యిది
పాపముగన్.
భాగ. ౧౦. స్కం. ఉ. ౨౮౪.

శా. వాపోవున్ క్షుధఁ గుంది చాల సుతు లవ్వా
బువ్వ బువ్వంచు న్నిల్లాపెన్ ...
మల్లభూ. వైరాగ్య. శ. ౭౧.

**వాప్యము.** సం. వి. అ. న. చెంగల్వకోష్టు. కీ. (శ. ర.)

**వాబిఱుసు.** వి. (వా + బిఱుసు) నోటికాఠి
న్యము, వాక్పారుష్యము.

సీ. ... ప్రతిపక్షియని తిరస్కృతిఁ జేసితే
సాధుపికమున కేల వాబిఱుసుఁ జూప ...
వేం. పంచ. ౪. ౧౮౭.

**వామ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. స్త్రీ. ఆఁడుది. ౨. సౌందర్యవతియగు స్త్రీ. ౩. గౌరి. ౪. లక్ష్మి. ౫. సరస్వతి.

**వామకము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. ఎడమది. ౨. వ్యతిరేకమైనది; ప్రతికూలమైనది.

**వామదేవుఁడు.** సం. వి. అ. పుం. ౧. ఒకానొక ఋషి. ౨. శివుఁడు.

**వామనగాయ.** మి. వి. (వామన + కాయ.) ౧. లేత చింతకాయ.

క. మునుజిగురునఁ బువ్వున వామనగాయల
దోరపండ్ల మఱి దోరఁగఁ బండినపండ్ల
నెల్లకాలము, దనియఁగఁ జవులొసఁగ
నొండు తరువులు గలవే.
ద్వా. ప్రథమ. ౧. ౧౫౮.

౨. ఊరఁగాయ కుపయుక్తమైన కాయ. (చూ. వామనములు.)

**వామనగొమ్ము.** మి. వి. (వామనము + కొమ్ము) ఊరవేసిన వామనగాయఖండము. (శ. ర.)

**వామనపాతు** = వామనపాతుకాఁడు. వి. ఒకానొక పిట్ట.

సీ. ... వెలిచె కాటుకపిట్ట బెళవ వామన పాతు పసిరిక లకుముకి పావురాయి ...

పార్వ. ౬. ౩౨.

**వామనపాతుకాఁడు** = వామనపాతు. వి. (వామనపాత + కాఁడు. స్వార్థమున) ఒక జాతి పక్షి.

సీ. ... వంగపండు పికిలి వామనపాతుకాఁ డుల్లంకి ... ఆం. భా. ౨. ౯౫.

**వామనపురాణము.** సం. వి. అ. న. పదు నెనిమిది పురాణములలో నొకటి.

**వామనము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. (అ) పొట్టిది, హ్రస్వము, కుఱుచయైనది. (ఆ) చిన్నది, అల్పము. ౨. నమ్రము, వంగినది. ౩. అధమము, నీచమైనది.

వి. అ. పుం. ౧. దక్షిణదిగ్గజము. ౨. మాన మున రెండు మూరలు తక్కువైన యేనుఁగు. ౩. అంకోలము, ఊడుగు చెట్టు.

**వామనములు.** వి. బ. వామనగాయలు.

రగడ. వామనములు నవామలకములు వామగ తి డిగ వామయులుకను ...

చంద్రా. ౪. ౨౩౪.

**వామని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. పొట్టియాఁడుది. ౨. గోడిగ, ఆఁడు గుఱ్ఱము. ౩. ఒక జాతి స్త్రీ. ౪. భగరంధ్రమందలి రోగవిశేషము.

**వామనుఁడు.** సం. వి. అ. పుం. ౧. పొట్టి వాఁడు. ౨. విష్ణువు. ౩. విష్ణుని పంచమావ తారము. ౪. పాణిని సూత్రములకు వ్యాఖ్యాన మగు కాశికావృత్తి రచించిన పండితుని పేరు.

**వామపార్శ్వభృంగి.** సం. ఈ. స్త్రీ. వి. మల్ల విద్యా విశేషము.

క. ... గజదండ, భృంగిదండ, వామపార్శ్వ భృంగి, దక్షిణ పార్శ్వ భృంగి ...

మల్లుపు, ౩. ౬౯.

**వామభ్రువు.** సం. వి. ఊ. స్త్రీ. అందమైన కను బొమలు గల స్త్రీ.

**వామమార్గము.** సం. వి. అ. పు. = వామా చారము.

**వామము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఎడ మది, దక్షిణేతరమైనది. కుడిదికానిది. ౨. ఎడమవైపున నున్నది. ౩. (అ) వక్రమై నది, విపరీతమైనది, ప్రతికూలమైనది, అను కూలము కానిది. (ఆ) వ్యతిరేకముగాఁ జేయు నది, వ్యతిరేకస్వభావము గలది. (ఇ) వక్ర బుద్ధి గలది, కుటిల స్వభావము గలది. (ఈ) లొంగనిది, మొండి కెత్తినది. ౪. నీచమైనది, చెడ్డది. ౫. అందమైనది, ఇంపైనది. ౬. పొట్టిది.

వి. అ. పుం. ౧. జంతువు, ప్రాణి. ౨. పాము. ౩. పశువుల పొదుగు, చనుకట్టు. ౪. నిషిద్ధ కార్యము, చేయఁగూడని పని. (ప్రాగుడు ము) న. ధనము, సొత్తు.

**వామలూరము.** సం. వి. అ. పుం. పుట్ట.

**వామలోచన.** సం. వి. ఆ. స్త్రీ. అందమైన కన్నులు గల స్త్రీ.

**వామశీలుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) కుటిల స్వభావము గలవాఁడు. లేక వ్యతిరేకస్వభా వము గలవాఁడు.

వి. అ. పుం. కామదేవుఁడు, మన్మథుఁడు.

**వామాచారము.** సం. వి. అ. పుం. వేద విరుద్ధమైనయాచారము, తంత్రోక్తమైనమద్య మాంసాది సేవన రూపమైన దురాచారము.

**వామాపీడనము.** సం. వి. అ. పుం. పీలు వృక్షము, గోగుచెట్టు.

**వామావర్తము.** సం. వి. అ. పుం. కుడినుండి యెడమ వైపునకుఁ దిరిగిన సుడిగలశంఖము.
విణ. (అ. ఆ. అ.) కుడివైపునుండి యెడమ వైపునకుఁ దిరుగునది.

**వామి.** వి. తృణతతి, గడ్డిమేటి.
సీ. .... వామి యటంచన వఱలును తృణతతి...
ఆం. భా. ౨. ౭౭.
ద్వి. హేమంత మనుమేఘ మెల్లెడ నిండి, వామిగా వడగండ్లు వర్షించె ననఁగ, గురిసిన పెనుమంచు కుంభినియెల్ల, నెరసి యొప్పారె ఘనీభవించుచును ...
రం. రా. అర. ౧౫౩. పా. ౧౧. పం.
సీ. ... వాములుగా వారువంబులు వ్రాలెఁ గంధవాల మధ్య పాదములు ద్రెవ్వి, ప్రోవులుగా రథంబులు ద్రళ్లె ...
వరాహ. ౫. ౨౩. కేయూర. ౩. ౧౪

**వామి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. గొడిగ ; ఆఁడు గుఱ్ఱము. ౨. ఆఁడుగాడిద, గర్దభి. ౩. ఆఁడేనుఁగు, కరిణి. ౪. సృగాలి, ఆఁడునక్క.

**వామిలుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. అంద గాఁడు, సుందరుఁడు. ౨. గర్వించినవాఁడు. (మే. ని.) ౩. వంచకుఁడు, మోసగాఁడు.

**వాము** = ప్రాము, పాము. స. క్రి. పౌర. (శ. ర.)

**వాముఁడు.** సం. వి. అ. పుం. ౧. శివుఁడు. ౨. మన్మథుఁడు.

**వామోరువు.** సం. వి. ఊ. ఈ. స్త్రీ. అంద మైన తొడలు గల స్త్రీ.

**వాయ.** వి. (సం. భాగః) దంచుట రుబ్బుట మున్నగు వానికై యొకతూరి వోసెడు ధాన్యాది కము. (శ. ర., వా.)

**వాయకుఁడు.** సం. వి. అ. పుం. నేఁతగాఁడు, సాలీఁడు, తంతువాయుఁడు.

**వాయదండము.** సం. వి. అ. పుం. వేమము, నేఁత పలక, సాలీని.

**వాయన(క)ము.** సం. వి. అ. న. వ్రతకాల ములయందు వ్రతము, విశేషించి బ్రాహ్మణు నకు నిచ్చెడి భక్ష్యరూపమైనయుపహారము.

**వాయము.** విణ. వ్యర్థము.
ఉ. వాయపు రజ్జువేల మునివల్లభ! వృద్ధుఁడ వౌండెఁ గావు లేఁ, బ్రాయపువాఁడ వద్రివన రమ్యములైనయనేకదేశముల్, ధీయుత! యల్పకాలమునఁ ద్రిమ్మర శక్యమె? నీకు నెమ్మెయిన్, వేయును నేల నమ్మె నెద నీ పలు కన్న మునీంద్రుఁ డిట్లనున్.
మార్కం. ౪. ౨౧౭.
ఉ. మాయలు నింద్ర జాలములు మాధవుఁ డింగును గొన్ని పన్నినన్, వాయపు రజ్జు లెప్పుడు నవారణ నీ వెటులాడి తేనియున్, వేయును నేల.... భార.ఉద్యో. ౪. ౨౦౧.

**వాయము.** సం. వి. అ. పుం. నేఁత ; నేయుట.

**వాయవము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. వాయుదేవునికి సంబంధించినది, వాయుదేవు నిచే నియ్యఁబడినది. ౨. గాలి సంబంధమైనది.

**వాయవి.** సం. వి. ఈ. స్త్రీ. వాయవ్య దిక్కు, పశ్చిమోత్తరదిక్కుల మధ్యభాగము.

**వాయవీయము.** సం. విణ. (అ. ఆ. అ.) వాయుసంబంధమైనది.

**వాయవ్యము = వాయవీయము.** సం. విణ. (అ. ఆ. అ.)

**వాయసము.** సం. వి. అ. పుం. ౧. కాకి. ౨. మంచి పరిమళముగల అగురువు, అగురువృక్షము. (వాచ.)

**వాయసారాతి.** సం. వి. ఇ. పుం. గుడ్లగూబ.

**వాయసాహ్వా.** సం. వి. ఆ. స్త్రీ. ఒక జాతి కూరాకు మొక్క, కాకశాస.

**వాయసేక్షువు.** సం. వి. ఉ. పుం. కాశతృణము, ఒకజాతిరెల్లు.

**వాయసోలి.** సం. వి. ఈ. స్త్రీ. కారుకోళ్లి, కాకోలి. †. (శ. ర.)

**వాయి = వా.** వి. దే. (సం. వాక్. త. వాయ్.) ౧. నోరు, వదనము.

ఉ. ఆతనిఁ బట్టి యెత్తి నిహతాహితవీరుఁడువాని ముక్కునన్, వాతను గర్ణరంధ్రముల వారక శోణితధార లొల్కఁగా, వాతసుతుండు వ్రీచె ... భార. సభా. ౧. ౨౦౯.

చ. ...మహోగ్రహుంకృతుల్, వడిగొనఁ గొమ్ము లొడ్డుకొని వాతులు విచ్చి ఖురాగ్రపాతనం, బుడమిఁ బగల్చుచున్ ... హర. పూ. ౬. ౭౪.

క. జ్యోతుల మంటం బొడిచిన, వాతుల నెత్తురులు గురిసె వసుదేశభట, వ్రాతముల కెల్ల నచ్చుట ... భాగ. ౯. స్కం. ౫౨.

గీ. ఒక్కవ్రేటున నూర్లు వే లోలిఁ గూల, వ్రేయుచును గాళ్లఁ జిమురుచు వాయిదెఱచి, మ్రింగుచును గాఁగిటను బిగియంగ నొత్తి, నలియఁజేయుచునున్న బిట్టలుకతోడ. ఆ. రా. యు. ౭౩౭.

౨. (కలశాదుల) ముఖము.

గీ. కాలసర్పంబు నొక్కటిఁ గడవఁబెట్టి, వాయిఁగట్టి ముద్రించి యవ్వాసుదేవుఁ, డొక్కదూతచే నిచ్చి యయ్యుగ్రరిపుని, పాలి కెంతయునరుదుగాఁ బనుపుటయును. హరి. ఉ. ౨. ౧౨౪.

సీ. తొడిమలనడుమవాత లోకింత గనవచ్చె రావన వన లంకురంబునొండె ... పి. శకుం. ౨. ౧౨౬.

౩. అగ్రము, కొన.

చ. నిలువక వచ్చివచ్చి ధరణింజిలుపెంచికలు న్వసుంధరం, గలసిన గోడలుం జిలికి గంపలఁ గాచిన వెట్టిసొట్టితీ,వలు చిగిరెంతగంట గమివాతులు గప్పిన పూదుసాతరల్, గల యొకయూరిపాడు గనుపట్టిన ... వేం. పంచ. ౧. ౪౬౩.

౪. నోరు.

చ. ... ఇంచుక వాయివిడ్డ తామరమొగ్గ వెట్టిపెట్టి పలుమాఱును వాకిలి దాఁటి యాఁగుచున్, మొరయ విపంచి మీటుగతి బ్రోవి యళుల్ వెడలెంగొలంకులన్. మను. ౩. ౬౦.

౫. ఖడ్గాదిధార, వాదర.

ఆ. అన్ని వెడఁదవాలియమ్ము లచ్చుతముగ, నొక్కముష్టిఁ దొడిగి గ్రక్కనంగ, నతఁడు లీలఁ దునిమె సందలితలలును ... భార. విరా. ౫. ౧౪౯.

ఆ. వాఁడియైనకత్తి వాతియమ్మునఁ గొని, పగతుశిరసుచెక్క లెగయ గొట్టి, నరుల కెల్లఁ జూడ నవ్వగునట్లుగాఁ, గలయనైదుకూఁ కటుల నొనర్చె ... భార. అర. ౬. ౨౫౦.

ఉ. నీతనయుండు సింహకమనీయతరం బగు భీమునల్లస, త్కేతన మర్ధచంద్రశరతీవ్ర

హాతిన్ మణికింకిణీనినా, దాతిశయంబు
మోడ్చ బడునట్లుగ జేసి శరాసనంబు బల్,
వాతిశరంబుసం గునిమె వారివరూధిని
యేసడంగఁగన్. భార. శల్య. ౧. ౨౪౦.

౬. వాయువు, వాతరోగము. (చూ. కోర
వాయి, వాయివిళంగము.)

గీ. ... వాయినాఁగను వాయువువఱలు ...
ఆం. భా. ౨. ౧౨౫.

జ: వాఁగడ, వాతరట్టు, వాతికోను, వాతి
పాతిక, వాతిబియ్యము, వాతివాఁడి,
వాతెర, వాపాతము, వాపోక, వాపోవు,
వాయిగట్టు వాయిదార, వాయివిళంగము.

**వాయించే.** స. క్రి. (సం. వాద్.) మ్రోగించే.

ఉ. సంచితభూరిబాహుబలసంపద పెంపున నార
జంబు వ్రాయించి యనేకభంగుల నుమేశుఁ
ద్రిలోకశరణ్యు నాత్మ మెప్పించి.
భాగ. ౧౦. స్క౦. ఉ. ౩౧౪.

సీ. ... ఆ. వాద్యభంగిజలము వాయించి
వాయించి, పాడిపాడి కెరలి యాడియాడి.
హరి. పూ. ౬. ౧౦౧.

సీ. గీ. ... మదికి, నించుకేడుక వీణవాయిం
చుచెలువ, నలువరాణి మదాత్మలో వెల
యుఁగాత ... మనుచ. ౧. ౫.

జ: వాయింపు.

**వాయింట.** వి. బర్బర, ఒకజాతి కూరాకు. ¶.

సీ. ... వాయింటయనఁగ బర్బర చెలంగు ...
ఆం. భా. ౨. ౬౭.

**వాయింపు.** వి. (వాయించే) వాయించుట.

సీ. ... వాయింపు వాదన వాదనముగు ...
ఆం. భా. ౧. ౧౨౬.

**వాయిగట్టు.** స. క్రి. (వాయి + కట్టు) సంచి
మొదలగువానిని కట్టు.

క. అకరువుమచ్చులగుదిక, ర్ణి కౌసువర్ణంబు మధు
పనికషముగలత, మ్మికవిలసంచి దివస
శై, శ్యకులాగ్రణి వాయిగట్టె సంధ్యా
వేళన్. వరాహ. ౪. ౧౩౮.

**వాయిదకాఁడు.** విశే. (వాయిదము + కాఁడు)
వాద్యము వాయించువాఁడు.

ద్వి. కరమర్థి వాయిదకాండ్రు ముంగలిని, బిరు
దుకాళియలచే బెల్లు నాదింప ...
ద్వి. పరమ. ౭. ౫౫౧. పా.

**వాయిదకారి.** విశే. (వాయిదము + కారి)
వాద్య మొనర్చువాఁడు, వాయించువాఁడు.

చ. అరుదుగ వాద్యవిద్య బిసదందినవాయిద
కారు లత్తఱిన్, కరములురెండు నొక్క
సరిగా మురజంబులు ముట్టి దిమ్మనన్, మొర
యఁగఁజేసి ... వైజ. ౧. ౧౨౩.

**వాయిదము.** వి. (సం. వాద్యమ్) వాద్యము.

క. ... నీరుహాలరులాతనికి మేలివాయిదంబుల
నగు సంతసం బలవడ(ంజేయ) ...
అచ్చ. తె. భారవి. ౨. ౩౧. పు.

సీ. ... పలుదెఱుంగుల బోరుకలుగు వాయిద
ములు గడితంపుఱుము చేప్పడులుగాఁగ...
అ. రా. బాల. ౧౬౪. నీలా. ౩. ౪౮.

జ: వాయిదకాఁడు, వాయిదకారి.

**వాయిదార.** వి. (√ వాయి.) (త. వాద్దూరై)
వంకలుగల కత్తి.

సీ. వాయిదా రనఁబడు వంకలుగలకత్తి ...
ఆం. భా. ౨. ౨౧౮.

**వాయివిళంగము.** వి. (√ వాయి) క్రిమి
ఘ్నము, విడంగము. ¶. (చి. ని. శ. ర., వా.)

**వాయుకేతువు.** సం. వి. ఉ. పుం. ధూళి,
దుమ్ము.

**వాయుగండము.** సం. వి. అ. పుం. (అజీర్ణిచే)
కడు పుబ్బుట.

**వాయుగుల్మము.** సం. వి. అ. పుం. ౧. తుపాను పెనుగాలి. ౨. జాలావర్తము, నీటి సుడి.

**వాయుగోచరము.** సం. వి. అ. పుం. వాయువు సంచరించెడి ప్రదేశము.

**వాయుజాతుఁడు.** సం. వి. అ. పుం. ౧. హనుమంతుఁడు. ౨. భీముఁడు.

(ఇట్లే వాయుతనయుఁడు, వాయుతనుజుఁడు. మొ.)

**వాయుడుపు.** అ. క్రి. (వా + ఉడుపు) నోరు గిట్టు.

క. ఏ యెడఁ బలిఁ బొడగానక ... పలుమఱు, వాయుడుపక చీరు సేడ్చుచుఁబడివాపోవన్ ... కు. సం. ౫. ౫౪౭.

**వాయుదారువు.** సం. వి. ఉ. పుం. గాలిచేఁ జీల్పఁబడినది. మేఘము, మబ్బు. (వాచ.)

**వాయునిఘ్నుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. వాయువుచేఁ బాధింపఁబడినవాఁడు. ౨. స్థిర బుద్ధిలేనివాఁడు, వెఱ్ఱివాఁడు.

**వాయునివృత్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. శాంతి; నిశ్చలత. ౨. వాతరోగము మానుట.

**వాయుపురాణము.** సం. వి. అ. న. పదునెని మిది యుపపురాణములలో నొకటి. (చూ. ఉపపురాణము. సూ. ని.)

**వాయుఫలము.** సం. వి. అ. న. ౧. వడగల్లు; వర్షోపలము. ౨. ఇంద్రధనుస్సు.

**వాయుభక్షణము.** సం. వి. అ. పుం. సర్పము; గాలిమేపరి, (ఇట్లే; వాయుభక్షము.)

**వాయుభక్షణుఁడు.** సం. వి. అ. పుం. గాలి యాహారముగాఁ జేసికొని బ్రతుకుచు తపస్సు చేయు ఋషి. (ఇట్లే; వాయుభక్షకుఁడు.

**వాయుభుక్కు.** సం. వి. జ్. పుం. ౧. వాయుభక్షణుఁడు. ౨. వాయుభక్షణము.

**వాయువర్త్మము.** సం. వి. న్. పుం. న. వాయుపథము, ఆకాశము.

**వాయువాహము.** సం. వి. అ. పుం. పొగ; ధూమము.

**వాయువాహిని.** సం. వి. ఈ. స్త్రీ. శుద్ధరక్తనాళము; శరీరమందలి వాయుసంచారము గల నాడి.

**వాయువు.** సం. వి. ఉ. పుం. ౧. గాలి. ౨. వాయుదేవుఁడు, (పశ్చిమోత్తర దిక్కుల మధ్య దిక్కున కధిపతి.) ౩. ప్రాణవాయువు(ప్రాణాపానవ్యానోదాన సమాన భేదములఁ బంచవిధమగు వాయువు.) ౪. రోగసంబంధమైన వాయువు; వాతధాతువు చెడుట.

**వాయుసఖుఁడు.** సం. వి. అ. పుం. అగ్నిదేవుఁడు.

**వాయుసమము.** సం. విణ. (అ. ఆ. అ.) వాయుసమానమైనది; వాయువేగము గలది.

**వాయోడు.** అ. క్రి. (వా + ఓడు. ౧. పలుకవెఱచు, మాటాడవెఱచు.

క. ... మాయయ్య పెద్దకొలువునఁ, వాయోడక యిట్టనంగవలయుంజుమ్మీ ... భార. ఉద్యో. ౧. ౩౬౯.

సీ. ... పదిరి యేఁగోపింప భయము నొందు, భర్జించినను మాఱు పలుకక వాయోడు బుద్ధిహీనుఁడనైన బుద్ధిసెప్పు ... భాగ. ౮ స్కం. ౭౧౫.

౨. సంకోచించు, వెనుదీయు.

తే. గీ. విరహిజనములపాలింటి వేఱువిత్తు, గరితముల కేల వాయోదుఁ గుహీన కరుఁడు ... పి. శకుం. ౩. ౧౭౨.

**వాయ్వాస్పదము.** సం. వి. అ. న. గాలి సంచరించు తావు; ఆకాశము.

**వార.** ౧. ఎనిమిదిపుంజములనూలు. ౨. (శ. ర., బ్రౌ.)

(పన్నులోని) కొఱఁత. (చి. ని.)

సీ. ... న్యాయంబు కేలు తప్పని కోరువారి తీర్వాలవల్ల వచ్చు ధాన్యములు సువర్ణాదాయములును ... ఉ. హరిశ్చ. ౧. ౬౭.

౩. తారతమ్యము, హెచ్చు తగ్గులు. (శ. ర., బ్రౌ.)

**వారంగము.** సం. వి. అ. పుం. ౧. కత్తి పిడి; ఖడ్గ ముష్టి. ౨. పిడి యమర్చుట కేర్పఱిచిన సన్నని కొన.

**వారక.** అవ్య. (√ వారు). ౧. మిన్నక, ఊరక.

క. ఈరాజకుమారుఁడు దను, గారవమునఁ బెనుపఁ బెరిఁగి కడుఁ గ్రొవ్వికడే, వారక వాఁ డిటు చేసెను, మీ రీమొద లెఱుఁగ రివిరో మీదువిమర్శల్. భోజరా. ౫. ౩౦౨.

౨. తప్పక, అవశ్యము.

క. బృందారక యువతీలోచన, వారులు వెస నింకఁగాక వారక యింకన్ ... హరి. ఉ. ౪. ౧౦౧.

౩. అడ్డు లేకుండఁగా.

ఉ. వారలబాణవర్షములు వారక నిల్పుచుఁ దాను వారిదుర్వారశరప్రతానపరివారితదేహులఁగా నొనర్చున్, వారిజనాభుఁడు ... హరి. ఉ. ౩. ౧౪౩.

౪. ఉడుగక, విరమింపక.

చ. ఉదితమనోనురాగదహనోష్ణభరంబున వాలకాంగికిన్, హృదయమునందు జొబ్బిల వహించినచందనకర్దమంబు బుగ్బుగనుల నీరెఁ గల్పితవిభూషణజాలమృణాలవల్లరీ, వదనములం దమందగతి వారక పిచ్చిలఁ జొచ్చె ఫేనముల్. నైష. ౨. ౧౧౪.

ఉ. ... విశ్వాసము భక్తియు స్థిరతను శాంతియు దాంతియు నొప్ప సంతతాధ్యాసితశంభులింగసముదాయము వారక సంభజించుచున్. కాశీ. ౪. ౩౦౧.

**వారకము.** ౧. దే. వి. లేని కాలమందు ఇతరులకు వాడుకొనుటకు ఇచ్చి కలిగిన కాలమందు మరలఁ బుచ్చుకొనెడు ధనాదికము.

క. వారణఘోటకభాండాగారంబులు మొదలుగాఁగఁగలధనములతో, నూరినుత యిందఱము నీ, వారకములు గాఁగ మమ్ము వగవుము బుద్ధిన్. భార. ఆది. ౩. ౧౫౨.

ద్వి. పలసీన జీతంబు వారకంబులును, కొలఁది మీఱఁగ నిచ్చి కూడిక నుండు ... ప్రభులిం. ౧. ౪. ౨౬.

(బ్రౌ. పా. వాడకంబులు. ముద్రిపా.)

౨. తాకట్టు.

సీ. ... పలుకుల చెలువంబుఁ గలికి కీరములకు వారకం బిచ్చితే వనజగంధి ... విక్ర. ౪. ౬౨.

సీ. తాకట్టు కుదువ యుద్దర వారకం బీడనంగను నాధి చెలంగుచుండు ... ఆం. భా. ౨. ౨౯.

**వారకము.** సం. విణ. (అ. రికా. అ.) అడ్డుపెట్టునది; ఆటంక పఱుచునది.

వి. అ. పుం. ౧. ఒకజాతి గుఱ్ఱము. ౨. గుఱ్ఱము. ౩. అశ్వగతి విశేషము ; ఒక విధ మగు గుఱ్ఱపు నడక.

న. ౧. నొప్పి పెట్టుచోటు, కష్టస్థానము. ౨. హ్రీబేరము, కురువేరు, ఒక దినుసు పరిమళద్రవ్యము.

**వారకి.** సం. వి. న్. పుం. ౧. ఎదిరివాఁడు ; శత్రువు. ౨. సముద్రము. ౩. మంచి లక్షణములుగల యొకజాతిగుఱ్ఱము. ౩. పర్ణాశనుఁడు ; ఆకులు తిని జీవించుచు తపస్సుచేయు ఋషి.

**వారకీరము.** సం. వి. అ. పుం. ౧. బడబాగ్ని. ౨. దువ్వెన. ౩. పేను. ౪. పందెపుగుఱ్ఱము.

**వారకీరుఁడు.** సం. వి. అ. పుం. కీరమువలెఁ జమత్కారముగాఁ బలుకువాఁడు. ౧. శ్యాలకుఁడు. ౨. భారవాహకుఁడు ; బరువుమోయు కూలివాఁడు.

**వారట.** సం. వి. ఆ. స్త్రీ. = వరట.

**వారటము.** సం. వి. అ. న. ౧. క్షేత్రము ; పొలము. ౨. క్షేత్రసమూహము. కొన్ని పొలములగుంపు.

**వారడ.** వి. (√ వారు) తాటాకు వారిన చివ్వ. (గ. ర.)

**వారడి.** వి. నష్టి, లోపము.

ప్రయో. ఆ వారడి యిందు కలసివచ్చినది. (శ. ర.)

**వారడు.** స. క్రి. చాలించు. (శ. ర.)

**వారణ.** సం. వి. ఆ. స్త్రీ. చెలియలి కట్ట. (శ. ర.)

**వారణబు(ష)స.** సం. వి. ఆ. స్త్రీ. కదళి ; అరఁటి చెట్టు.

**వారణము.** సం. విణ. (అ. ఈ. అ.) నివారించునది ; అడ్డగించునది.

వి. అ. న. ౧. నివారించుట. అడ్డగించుట ; అడ్డము. ౨. విఘ్నము ; ఆటంకము. ౩. ప్రతిఘటనము, ఎదిరించుట. ౪. పాలనము, రక్షించుట.

పుం. ఏనుఁగు. పుం. న. కవచము.

**వారణవల్లభ.** సం. వి. ఆ. స్త్రీ. కదళి, అరఁటిచెట్టు.

**వారణసి.** సం. వి. ఈ. స్త్రీ. = వారాణసి.

**వారణావతము.** సం. వి. అ. పుం. న. పాండవులు నివసించిన యొకానొక పట్టణము.

**వారత్రము.** సం. వి. అ. న. తోలువాఱు ; తోలుపట్టి.

**వారది.** వి. (సం. వారధిః) వంతెన. (చి. ని.) వారధి. అని. శ. ర., (బ్రౌ.)

**వారధి.** సం. వి. ఇ. పుం. వంతెన.

**వార(లు)పట్టు.** స. క్రి. ఆచమించు, త్రాగు.

సీ. ... గీ. అమరనుతముగ జారణ్య మది వదీయ, వసతి యిహసౌఖ్యమంతయు వారపట్టుఁ, బరము నీసొమ్ము నిజమని పలికి చనిరి ... శేష. ౪. ౧౯౩.

ద్వి. రథచక్రనేమినిర్గళభూరజోరాజివార్ధు లొక్కుమ్మడి వారపట్ట ... జై. భా. ౫. ౩.

(ఇట నించుక, అనిభావము.)

ఉ. వార లసంఖ్యకోటు లనివారితవిక్రమశాలి పాథోరుహగర్భసర్గము వధూమయమయ్యె ననంగ నిండి దే, వారిచమూసమూహముల నాజిఁ బడల్పడఁ గొట్టి నెత్తురుల్, వారలు పట్టిరప్పుడు బలక్షయమైన సురుండు తెంపునన్. వరాహ. ౧౧. ౧౨౪.

**వారపోయు.** స. క్రి. త్రాగుటకు పోయు.

వ్యవ. గ్రామ దేవతకు కల్లుఁ వారఁ బోయుట కొందఱ యాచారము.

**వారబు(బూ)ష.** సం. వి. ఆ. స్త్రీ. కదళి, అరఁటి చెట్టు.

**వారము.** సం. వి. అ. పుం. ౧. మూఁత; కప్పు, ఆచ్ఛాదనము. ౨. సంఘము, సమూహము. ౩. రాశి; ప్రోవు. ౪. మంద; పశువుల గుంపు. ౫. భానువాది వారము. (భానువారము, సోమవారము. మొ.) ౬. వంతు. ౭. తడవ, పర్యాయము. ౮. తఱి, తరుణము. అదను. ౯. ద్వారము. ౧౦. నది యొక్క యావలి యొడ్డు.

న. ౧. మద్య భాండము; కల్లు కుండ. ౨. జల సంఘము; నీటి మొత్తము.

**వారముఖ్య.** సం. వి. ఆ. స్త్రీ. వేశ్యలలో ముఖ్యురాలు; పలువురు గారవించెడి వేశ్య.

**వారయాత్రికుఁడు.** సం. వి. అ. పుం. పెండ్లి కుమారునితో వచ్చిన చుట్టము.

గీ. వార యాత్రికు లనుమోద వంతులగుచు, వలచి భుజియించి రొగిఁ బిండివంట కములు ... నైష. ౬. ౧౨౦.

**వారల.** సం. వి. ఆ. స్త్రీ. ౧. కందురీగ. ౨. వరట; హంసి.

**వారవాణము.** సం. వి. అ. పుం. న. కవచము; యోధుల మైమఱువు.

**వారవాణి.** సం వి. ఇ. పుం. ౧. వాంశికుఁడు. పిల్లనగ్రోవి యూఁదు వాఁడు. ౨. గాయకుఁడు; పాటగాఁడు. ౩. న్యాయాధికారి, తీర్పరి. ౪. సంవత్సరము.

స్త్రీ. ఇ. ఈ. వేశ్య.

**వారవిలాసిని.** సం. వి. ఈ. స్త్రీ. = వారాంగన.

**వారవృష.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ధాన్యము. ౨. అరఁటి చెట్టు.

**వారవేల.** సం. వి. ఆ. స్త్రీ. భానువాది వారములందు వర్జ్యకాలము; దుర్ముహూర్తము. శుభకార్యారంభము చేయఁ గూడని కాలవిశేషము.

**వారసు.** వి. (హిం. వారిస్.) జ్ఞాతి, దాయాదుఁడు.

సీ. ... చెవిటి రాయసమైన సేవకుఁ డట్టిన వారసుగాఁడు దివాను నయిన ...

వేఱు. ౪. ౪౬.

**వారసేవ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. వేశ్యా వృత్తి, లంజెఱికము.

**వారాంగన.** సం. వి. ఆ. స్త్రీ. సర్వ జనమునకు సామాన్యాధికారముగల స్త్రీ, గణిక, వేశ్య.

**వారాంనిధి.** సం. వి. ఇ. పుం. సముద్రము.

**వారాణసి.** సం. వి. ఈ. స్త్రీ. - వరణ - అసి. అను నదుల నడుమనుండు పురము. కాశీపురము.

**వారాశి.** సం. వి. ఇ. పుం. నీటి ప్రోవు - సముద్రము.

**వారాహకందము.** సం. వి. అ. పుం. పంది గడ్డలు. ‡.

**వారాహకల్పము.** సం. వి. అ. పుం. బ్రహ్మమానమున నొక మాసమునందు వచ్చు ముప్పది కల్పములలో నొకటి, శ్వేత వరాహ కల్పము. (కల్పములు - ౧. శ్వేత వరాహ కల్పము. ౨. నీలలోహితకల్పము. ౩. వామదేవ కల్పము. ౪. గాథాంతర కల్పము. ౫.

కౌరవ కల్పము. ౬. ప్రాణ కల్పము. ౭. బృహత్కల్పము. ౮. కందర్ప కల్పము. ౯. సత్య కల్పము. ౧౦. ఈశాన కల్పము. ౧౧. ధ్యాన కల్పము. ౧౨. సారస్వత కల్పము. ౧౩. ఉదాన కల్పము. ౧౪. గరుడ కల్పము. ౧౫. కౌర్మ కల్పము. ౧౬. నారసింహ కల్పము. ౧౭. సమాధి కల్పము. ౧౮. ఆగ్నేయ కల్పము. ౧౯. విష్ణుజ కల్పము. ౨౦. సౌర కల్పము. ౨౧. సోమ కల్పము. ౨౨. భావన కల్పము. ౨౩. సుప్తమాలి కల్పము. ౨౪. వైకుంఠ కల్పము. ౨౫. ఆర్చిష కల్పము. ౨౬. వల్మీ కల్పము. ౨౭. వైరాజ కల్పము. ౨౮. గౌరీ కల్పము. ౨౯. మహేశ్వర కల్పము. ౩౦. పితృ కల్పము. అనుసవి మున్నగి. ఒక్కొక్క కల్పము బ్రహ్మదేవున కొక దినము.

**వారాహపురాణము.** సం. వి. అ. న. పదు నెనిమిది పురాణములలో నొకటి వరాహ పురాణము.

**వారాహము.** సం. విణ. (అ. ఈ. అ.) వరాహ సంబంధి, అడవి పందికి సంబంధించినది.
వి. అ. పుం. ౧. పంది, అడవి పంది. ౨. మహాపిండీతకము, నల్లరంగుగల పెద్దమ్రాంగి చెట్టు.

**వారాహి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ఆడు పంది. ౨. భూమి. ౩. వరాహావతారమెత్తిన విష్ణుని శక్తి, సప్త మాతృకలలో నొకతె. ౪. పరిమాణము, కొలత.

**వారి.** సం. వి. ఇ. న. ౧. నీరు, జలము. ద్రవ ద్రవ్యము. ౨. కురువేరు, హ్రీబేరము.
ఇ. పుం. ౧. వైరి, వెలుబడ్డ వాడు.

(విల్యమ్సు.)

ఇ. ఈ. స్త్రీ. ౧. ఏనుగును కట్టెడి చోటు. ౨. గజ శృంఖలము, ఏనుగును కట్టెడి గొలుసు లేక త్రాడు. ౩. ఏనుగును బట్టు కొనఁ ద్రవ్విన గొయ్యి, ఏనుగును బట్టు కొనెడు బోను. ౪. నీటికుండ. ౫. సర స్వతి. ౬. మాట; వాక్కు.

**వారించు.** సం. స. క్రి. నివారించు, అడ్డగించు.
ఆ. ద్వారపాలు రచట వారింప శాంతిమై, నూరకున్నఁ జూచి వారు వెఱచి, లోని కేలు చేసి ... భార. శాం. ౬. ౨౬౩.
క. మదిలోపలఁ దలయుచు సంభూయవయం ప్రైసత్తి లగ్నమున గిద్దయుపైఁ, బదమిడు నెడ వారించుచుఁ, ... భోజపతి కిట్లనియెన్. హ్వా. ౭. ౨.

**వారికర్పూరము.** సం. వి. అ. పుం. మత్స్య విశేషము; ఒకజాతి చేప.

**వారికుబ్జము.** సం. వి. అ. పుం. శృంగాటక వృక్షము.

**వారిక్రిమి.** సం. వి. ఇ. పుం. జలగ.

**వారిచరము.** సం. విణ. (అ. ఈ. అ.) నీటిలోఁ దిరుగునది.
వి. అ. పుం. ౧. చేప. ౨. నీటి జంతువు, జలచర జంతువు.

**వారిచామరము.** సం. వి. అ. న. నాఁచు, శైవాలము.

**వారిజేము = వారిదము.** వి. పారిభద్రకము. ¶.
సీ. ... వారిజా మంచన వారిజా మంచనఁ బారి భద్రాఖ్యమై ... నెమ్మి ...
ఆం. భా. ౨. ౪౩.

**వారిజము.** సం. విణ. (అ. ఆ. అ.) నీటిలోఁ బుట్టినది.

౨. అ. పుం. ౧. శంఖము. ౨. ఆలిచిప్ప, కప్పచిప్ప, శంబూక.

౩. ౧. పద్మము. ౨. ఒక దినుసు లవణము. (ద్రోణి లవణము.) ౩. గౌరీ సువర్ణమను నొకానొక మొక్క. ౪. లవంగము.

**వారిణము.** వి. మత్స్య బంధన విశేషము, చిన్న చేపలను బట్టెడు సాధన విశేషము. (శ. ర.)

**వారిణ(ర్ణ)ము.** వి. ఒకజాతి దేశ.

వ. మణీయు సాలుకంబుల శని శరంబులు వారిణంబులు పేరడంబులు జలకట్టెలు తళుకుమించు మొదలగు దేశలం గరంబులం గల దెత్తంబుల పట్టించి ...

ఇంద. ౨. ౯౦.

గీ. వారిణంబును జలకట్టె పైరిగ్గ, చంచ డము సాలువము శనిశరము మించు, వేస్ట్రి గును తళుకాదిగ వేటవేఱు, నొప్పదేగల బట గూర్చు కుండుటయును.

ప్రబం. ౧. ౧౭౧.

సీ. వార్ణము భైరిజావళము సాళ్వము డేగ గూడ బాతుల్లంగి కుండ తేల ... యాది యైన పతులలతఁడు దీర్చు ...

హంస. ౩. ౧౩.

**వారితస్కరము.** సం. వి. అ. పుం. ౧. మేఘము. ౨. ముస్త. ‡.

**వారితస్కరుఁడు.** సం. వి. అ. పుం. ౧. సూర్యుఁడు. ౨. మేఘుఁడు.

**వారిత్ర.** సం. వి. ఆ. స్త్రీ. ఛత్త్రము, గొడుగు.

**వారిదము = వారిజేము.** వి. కొండబూరుగు, పారిభద్రము.

క. వారిగొఱ శొఱని గుడిగ నప్పది మొగ ముల శోడుజేని పై నూఱ్ఱులుకల్, చేస లగ్రుస నేసి శరివారిదము కెఱుం గొందఁజేసి వెళ్ళిడి నొంచెన్.

అ. రా. యుద్ధ. ౫౦౪.

**వారిదము.** సం. వి. అ. పుం. మేఘము, మబ్బు. న. ముస్త. ‡.

**వారిధరము.** సం. వి. అ. పుం. మేఘము, మబ్బు.

**వారిధి.** సం. వి. ఇ. పుం. ౧. సముద్రము. ౨. కలశాది - కుండ మొదలగునది.

**వారినాథము.** సం. వి. అ. పుం. ౧. సముద్రము. ౨. మేఘము. ౩. పాతాళలోకము.

**వారినిధి.** సం. వి. ఇ. పుం. సముద్రము.

**వారిపర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. నాచు. ‡. (శ. ర.)

**వారిప్రవాహము.** సం. వి. అ. పుం. సెల యేఱు, నిర్ఝరము, కొండ కాలువ.

**వారిబాలకము.** సం. వి. అ. న. హ్రీబేరము, కురువేరు. ‡.

**వారిభవము.** సం. వి. అ. న. సౌవీరాంజనము.

**వారిము(కు)చము.** సం. వి. చ్. పుం. జలదము, మేఘము, మబ్బు.

**వారిరథము.** సం. వి. అ. పుం. ఓడ, పడవ.

**వారిరాశి.** సం. వి. ఇ. పుం. ౧. నీటిప్రోవు, సముద్రము. ౨. జలాశయము, మడుగు.

**వారిరుహము.** సం. వి. అ. న. పద్మము, తామర.

**వారివాహ(న)ము.** సం. వి. అ. పుం. ౧. మేఘము. ౨. ముస్త. ‡.

**వారిశయుఁడు.** సం. వి. అ. పుం. నీటిపైఁ బరుండు వాఁడు, విష్ణువు.

**వారిసంభవము.** సం. వి. అ. పుం. ౧. లవంగము. ౨. సౌవీరాంజనము. ౩. ఉశీరము, వట్టివేరు.

**వారీశుఁడు.** సం. వి. అ. పుం. ౧. సముద్రుఁడు. ౨. వరుణుఁడు.

**వారు.** అ. క్రి. ౧. ఉడుగు. (దీనికి ౧. ౨. అర్థములలో వ్యతిరేకక్త్వార్థక వ్యతిరేకార్థక విశేషణ రూపములే కాన వచ్చుచున్నవి.

ఉ. వారక వడ్డికిచ్చి కడువస్వైర వారిన దాన
శీలు ... భార. శా. ౫. ౨౪౯.

ఉ. వారని మంచుపైఁ బొదివి వచ్చిన సోయిన
చొప్పు మాసినన్, భూరినఖాగ్రముక్తమయి
పొల్పగు ముత్తెపుఁ జాలు వెంటఁడ, చ్చా
రణు లేఁగి కాంతురు హత ద్విపకేసరి వాద
వేళలం, దారొక వాసికొంద్రు వశెఁ
దక్కఁగ నూల్కొనఁ జేయుతాసముల్.
పి. శకుం. ౨. ౧౦౫.

ఉ. శ్రీ రఘువీర శేఖరుఁడు చిత్తము రంజిలఁ
బల్కు చిల్క ముంజే రహియింప సీతఁగని
చెల్వరో నీయధరంబు బింబికా, శ్రీరస
మొల్కరా చిలుక చేరెడు సంచునొ జిల్గు
నవ్వులన్, వారకమాటుసే సెదవు పంపిన
సేసుగొ యాశ్రయించినన్.
ఉ. రా. ౬. ౫౦.

౨. తక్కువయగు.

చ. ... మహాధనరాశి వేల్మి వ్వారని విభవంబు
తోడ ధృతరాష్ట్రుఁడు సేసె శతాశ్వమేధ
ముల్ ... భార. ఆది. ౫. ౪౨.

చ. ... వ్వారని కృప నట్టు లిచ్చితి వరంబని
యాయమ పల్కె నత్తఱిన్ ...
కళా. ౪. ౧౬౬.

చ. ... మన్మథభూవరుండు జగంగరాఁబనిచి
వారని మన్నన నాదరించుచున్ ...
నిర్వ. ౧. ౨.

౩. పడియు. వ్యవ. గంజి వారెను.

(స. క్రి. ౧. తెర. ము.) పట్టు.

మ. కలధౌతద్రవచిత్రము ల్మెఱయు ముక్తా
నూత్నతఱా మేచకాంచలపుం దెందెలు
వారి లగ్నము సమాసన్నంబుగా వేల్పుఁ
బెద్దలు వంపన్ ... ఆము. ౭. ౬౭.

(౬. ౧౩౧. ప్రాఁత ప్రతి.)

క. మెఱయంగా మధుపర్కము, కఱకంఁ ని
డిచ్చి వెనుక కమనీయముగా, మఱిఁగట్ట
నిచ్చి కన్యకు, మఱువుగఁ దెరవారఁ బంచె
మహితాత్మకుఁడై. సీర. ౩. ౧. ౬౭.

౨. రెండు చేతులతో తాటాకు ఓర చివ్వు.
(శ. ర.)

వి. పొట్ట, నొక్కు.

సీ. ... సుత్తెవాటుల వాయి లెత్తని సొమ్ము
సొం పలరించె నెవ్వాఁడు సాంబునకును...
రా. వి. ౧. ౭.

జః వారక, వారడ, వారుకొను, వారుచు.

**వారుండము.** సం. వి. అ. పుం. సర్పశ్రేష్ఠము, మేలుజాతి పాము.

పుం. న. ౧. కంటిపుసి, నేత్రమలము. ౨. చెవిలోని గులిమి, శ్రోత్రమలము. ౩. ఓడలోని నీరు తోడెడి తొట్టి.

**వారుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు.

**వారుకొను.** స. క్రి. (వారు + కొను) రెండు చేతులతో ఆకర్షించు.

వ. ... అరవిందబాంధవోపలబృందంబులఁ దిలకించి మందానిలస్పందితగళితలలితమందార కోరకంబు లని వారుకొనం బోవు బృందారక

సుందరుల సాంద్రతరసంభ్రమంబుల కచ్చెరు
వడి. ఇందు. ౧. ౧౫౭.

**వారుచే(ర్చు).** అ. క్రి. ఆచమించు.

క. చనదు మిసినవార్చకునికి సత్పుత్రుఁడైనన్ ... భార. అను. ౪. ౧౧౫.

గీ. ప్రీతి మంచంబుపై నుండి పీఁట నుండి, చెప్పు పావలు దొడితల చీరచుట్టి, నవ్వుచును మాట లాడుచు నడిచి నడిచి, వంగి శయనించి నిలుచుండి వార్చఁజనదు. విజ్ఞా. ౧. ౫౩.

ఉ. ... నవ్య వస్త్రంబు ధరించి నప్డు దుశితంబులు చూచిన యప్డు పుణ్యకార్యంబుల యప్డు హోమముల నంటిన యప్పుడు వారు వందగున్. కాశీ. ౫. ౨౦౪.

గీ. చంద్ర పుష్కరిణీ తటస్థలిని దేవ, విభుని నిలఁబెట్టి శంకొని వృత్తిఁ దీర్చి, వచ్చి వారిచి మరలంగఁ బుచ్చుకొనఁగ, నొడిగి యింతైనఁ గదలింప నోప లేక. శేష. ౪. ౨౩౩.

స. క్రి. ౧. (సంధ్యను) ఉపాసించు.

గీ. స్నానమాడెనె వార్చెనే సంధ్య యగ్ని, హోత్ర మొనరించెనే యింతి పుత్రుఁ డనిన ... కాశీ. ౪. ౧౬.

చ. ... జాహ్నవీతటమున సంధ్య వార్చి జపతత్పరుఁడై తనువాని యామినీ, విటకుల శేఖరుం గొనుచు ... విజ. ౧. ౭౩.

క. వేదము చదివిన ఫలమున్, వాదించిన ఫలము సంధ్య వార్చిన ఫలమున్, బైదలి నీకు నొసంగెద ... శుక. ౧. ౪౦౭.

౨. ప్రక్షాళించు, కడిగికొను.

మ. కలశం జేసులువార్చి యున్నయెడ బాగాలిచ్చి ... దశా. ౭. ౨౮౦.

క. ఎంగిలి వార్చగ నీళ్లిడె, బంగరు గెంగిండి తోడఁ బరువడి నొక సారంగ విలోచనయా నృప, పుంగవులకు మదిని గూర్మి. పొం... రంగన్ ... రసి. ౧. ౭౭.

క. నవ్వినఁ గనుఁగొని పొడ్డవిన, నివ్వెర చేతులను వార్చి నృపవరుఁడంతన్, నివ్వటిలు సందియంబున, జవ్వాదియు మనంబుతో హాజారము చేరెన్. శుక. ౩. ౨౩౧.

౩. ప్రతీక్షించు.

గీ. అనఘ నారాక వార్చి నీవధిక నిష్ఠ, నిట్టు లునికికిఁ గారణమేమి ... భార. శాం. ౬. ౫౭౩.

మ. కలపం బెవ్వరు గూర్చి తెచ్చినను నిక్కం బొల్లఁ డెల్లప్పుడున్, జలకంబాడి మదాగమంబ మదిలో నన్వార్చుఁ గంకుండు రా, జెలమి న్మెచ్చిన గట్టు వాలిది యనన్. హరి. పూ. ౯. ౨౨.

౪. అపేక్షించు.

ఉ. ఆతఁడు ముఖ్యజాతిఁగని నంతన పొందుచు నెండగాలి నెంతో తడవుం బ్రసాద పినియోగము వార్చి వసించుచున్ ... ఆము. ౬. ౭.

౫. అభిలషించు, కోరు.

ఉ. ... మాపుర నన్నియు వచ్చె నేనినే, నక్కలి తేటి తక్కుశలమారయ నుండుగు రేయి వేగినన్, బెక్కువగ న్మదిం బొడమి బిడ్డల సేమము వార్తు భూవరా. మార్కం. ౮. ౬౬.

౬. కెడయు, విడు, ఎడయు.

సీ. ... వార్చె నాఁగడిగె నుపాసించెఁ గెడసె నుద్దేశించె నాఁగను దేజరిల్లు ... ఆం. భా. ౩. ౧౩౬.

**వారుచే²(ర్చు).** స. క్రి. (√వారు.) వడియఁ జేయు.

వ్యవ. వంటలక్క-గంజి వార్చెను.
జ: వాప్ప.

**వారుణము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. వరుణ సంబంధి. ౨. వరుణునికి మీఁదు కట్టఁబడినది. ౩. వరుణున కియ్యఁబడినది.

వి. అ. పుం. భరతవర్షము నందలి తొమ్మిది భాగములలో నొకటి.

న. ౧. జలము; నీరు. ౨. శతభిష నక్షత్రము.

**వారుణి.** సం. వి. ఇ. పుం. ౧. అగస్త్యుఁడు. ౨. భృగు మహర్షి.

ఈ. స్త్రీ. ౧. పశ్చిమదిక్కు. ౨. మద్యము. ౩. శతభిష నక్షత్రము. ౪. దూర్వా, గరిక. ౫. వరుణుని భార్య.

**వారువపుజేన్నము.** వి. (వారువము + జేన్నము) అశ్వమేధయాగము.

గీ. అనుచు నిట్లాజ్ఞ చెప్పినయట్టు లతనిఁ, దోడుకొని వచ్చి వేల్పులఁ దొఱఁగు దనియ, బాఱులుగఁ బాఱులనుగూర్చి వారువంపు, జన్నమొనరించి యారాచ మిన్నముఱియు.
అచ్చ. రా. బాల. ౫౮.

**వారువము** = హాప్రరము. వి. ౧. గుఱ్ఱము.

ఆ. ... వారువంబు నొక్క వసుమతీ రుహ మునఁ, గట్టి నీడనొరగి కన్నుమొగిచె ...
వరాహ. ౮. ౬౬.

క. తోఁగపు లత్తుక చాయల, వారువములు గట్టి మహిపవర కేతువు పెల్లార సమకట్టి తేరా, సారధిగాని తేరనెక్కి సంరంభమునన్.
ఉ. రా. ౩. ౩౪౩.

సీ. గీ. ... వాయుజవములు రవితేరి వారువ ములు ... కాశీ. ౩. ౧౦.

౨. వాహనము.

ఉ. తెల్లని సోము పానుపును తెల్లని వార్వము నెక్క బిడ్డడున్, తెల్లని దీవిపై విడిది తెల్లని తమ్ముల మీరు కన్నులున్, తెల్లని మోము గుఱ్ఱమును తెల్లని మామయు తెల్ల కైదువున్, తెల్లని కోడలుం గలుగు తెల్లని తోఁతురిలింద్రుఁ గొల్వెదన్.
రుక్మాం. ౧. ౬౦.

చ. బలు తెలిపుల్గు వారువము బంగరు సిగౌయు ... నీలా. ౧. ౬.

జ: వారువపు జన్నము.

**వారువు.** సం. వి. ఉ. పుం. విజయ కుంజరము; యుద్ధపు ఏనుఁగు.

**వార్క్షము.** సం. విణ. (అ. ఈ. అ). ౧. వృక్షములు గలది, వృక్షసంపన్నమైనది. ౨. వృక్షములచే నేర్పడినది, వృక్షసంబంధి. ౩. చెట్టు పట్టతోఁ జేయఁబడినది, నారది.

వి. అ. న. వృక్షసమూహము, అడవి.

**వార్తికుఁడు.** సం. వి. అ. పుం. వ్రాయసగాఁడు, లేఖకుఁడు.

**వార్త.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఉనికి. ౨. వృత్తాంతము, సమాచారము. ౩. జీవిక, వృత్తి. ౪. వైశ్యవృత్తి, వాణిజ్యము, సేద్యము, కృషి. ౫. ఆన్వీక్షిక్యాది విద్యలలో నొకటి, దీనియందు లాభాలాభములు తెలియవచ్చును. ౬. వంగ చెట్టు. ౭. దుర్గ. ౮. (అలం) వర్ణనావైభవము.

వ. ... వార్తలేని కవిత్వంబు వోలెఁ జన్ను దఱిగి ... ఉ. రా. ౬. ౩౪౩.

(ఈ క్రింది యర్థము లాంధ్ర గ్రంథములయందు మాత్రమే కానవచ్చుచున్నవి.)

౧. ప్రసిద్ధి, వార్తకెక్కు = పేరుపడు.

సీ. తే. తుంగభద్ర ప్రసంగ ముత్తుంగభద్ర, రాజిరాజిల్లు గౌతమి యోజ మఱియు, వార్తకెక్కిన తీర్థప్రవర్తనముల, స్వామి వినిపించె వింధ్య సంస్తంభయితకు.
పాండురం. ౧. ౧౪౮.

చ. తెగిన మనోభవుం దిరుగఁ దెచ్చి భుజంబుల
కెల్లఁ బ్రాయముల్, మగుడఁగనిచ్చి యనన్య
భృత మండలి మూఁగతనంబుపుచ్చి ముజ్జగ
ముల వార్తకెక్కిన వసంత భిషగ్వరుఁ
డాప్తుఁ డమ్మునుం, దగుగతి మాన్పలేఁ
డమతి దక్షిణవాయువునంగు జాడ్యముల్.
కవిక. ౪. ౪.

౨. లోకోక్తి.

ఆ. మోక్షమునకుఁ బోవ మొనసెత్తుకొనిపోయె,
ననెడు వార్తనిక్కమగు నటంచుఁ, గ్రుంకి
వెలసె గవ్వరను ... విజ. వి. ౨. ౪౩.

ఆ. ఒక్కనొక్క పల గడుక్కనఁ గొడికి తాన
నలఁ జనఁగ వెంటఁ దవిలె బలము, వసుధ
నక్కఁ గన్నవాఁడెల్ల వేఁటకాఁ, డనెడు
వార్తనిక్కమయ్యె ననఁగ.
శుక. ౧. ౧౬౬.

౩. నీతి.

సీ. నిగమసుభాషితాథ్యాసనిష్ఠలఁ గన్గన పండి
తోత్తముల్, మగువల పొందు నింద్యమని
మాటికి వార్తలు చెప్ప నేర్పరుల్ ...
భర్తృ. ౨. ౭౧.

నీలివార్త = అసత్యపు ప్రతీతి.

**వార్త**... సం. విశే. (అ. ఆ. అ.) ౧. ఆరోగ్య
వంతము, నెమ్మదిగానున్నది. ౨. అసారముఁ
గుర్బలమైనది. ౩. వృత్తి (జీవిక) ననుసరించి
నది.

వి. అ. న. ౧. క్షేమము, ఆరోగ్యము. ౨.
ప్రావీణ్యము, నేర్పు. ౩. పొట్ట, ఉముక.

**వార్తాకము**. సం. వి. అ. పుం. వంగచెట్టు.

**వార్తాకి**. సం. వి. ఇ. ఈ. స్త్రీ. న్. పుం.
వంగచెట్టు.

**వార్తాకువు**. సం. వి. ఉ. పుం. స్త్రీ. వంగచెట్టు.

**వార్తామాత్రము**. సం. వి. అ. న. ౧. కేవ
లము, వదంతి చెప్పుకొనుటయే. ౨. రేమివిషయ
ములోనైనను పైపై తెలివి, అల్పజ్ఞానము.

**వార్తాయనుఁడు**. సం. వి. అ. పుం. వార్తాహ
రుఁడు, దూత.

**వార్తారంభము**. సం. వి. అ. పుం. వ్యాపా
రము, వాణిజ్యము.

**వార్తావహుఁడు**. సం. వి. అ. పుం. దూత,
రాయబారి.

**వార్తావృత్తి**. సం. వి. ఇ. పుం. కృషీ వాణిజ్య
ములవలన జీవించువాఁడు, వైశ్యుఁడు.

**వార్తావ్యతికరము**. సం. వి. అ. పుం. సామా
న్యవదంతి, అందఱు చెప్పుకొనుట.

**వార్తాహరుఁడు**. సం. వి. అ. పుం. = వార్తా
వహుఁడు.

**వార్తిక**. సం. వి. ఆ. స్త్రీ. పక్షి విశేషము,
మూలవల్లంకి పిట్ట.

**వార్తికకారుఁడు**. సం. వి. అ. పుం. కాత్యా
యనుఁడు, పాణిని సూత్రములకు వార్తికము
రచించిన ముని.

**వార్తికము**. సం. విశే. (అ. ఆ. అ.) ౧.
వార్తకు సంబంధించినది, వృత్తాంత సంబంధ
మైనది. ౨. వార్తను దీసికొని వచ్చునది.
౩. వివరించునది, టిప్పణరూపమైనది.

న. ఉక్తానుక్తదురుక్తార్థవ్యక్తికారి.

సూత్రముల యందుఁ జెప్పఁబడిన యర్థమును
వివరించునదియు ననుక్తమగు దానిని చెప్పు
నదియు, దురుక్తము (భిన్నముగాఁ జెప్పఁ
బడిన దానిని) సరిగాఁ జెప్పునదియునగు
సూత్రప్రాయమైన గ్రంథము.

**వా_ర్తికుఁడు.** సం. వి. అ. పుం. ౧. సందేశ హరుఁడు, దూత. ౨. కృషివలన వాణిజ్యము వలన జీవించువాఁడు, వైశ్యుఁడు.

**వా_ర్త్రఘ్నుఁడు.** సం. వి. అ. పుం. ఇంద్ర పుత్రుఁడు, అర్జునుఁడు.

**వార్ధము.** సం. వి. అ. పుం. మేఘము, జలదము.

**వార్ధరము.** సం. వి. అ. న. ౧. నీరు. ౨. పట్టు. ౩. వాక్కు, మాట. ౪. గురివెంద గింజ. ౫. గుఱ్ఱము మెడమీఁది సుడి. ౬. దక్షిణావర్త శంఖము. (మే. ని.)

**వార్ధకము.** సం. వి. అ. న. ౧. ముదిమి వృద్ధత. ౨. ముదిమి వలనఁ గలిగిన యశక్తి. ౩. వృద్ధ సమూహము. ౪. వృద్ధునిపని.

**వార్ధక్యము.** సం. వి. అ. న. ౧. ముదిమి. ౨. ముదిమి వలనఁ గలిగిన యశక్తి.

**వార్ధి.** సం. వి. ఇ. పుం. సముద్రము.

**వార్ధిభవము.** సం. వి. అ. న. సాముద్రము, సముద్రపు టుప్పు.

**వార్ధుషి.** సం. వి. ఇ. న్. పుం. వడ్డి వలన జీవించువాఁడు, అన్యాయమైన వడ్డి కప్పిచ్చు వాఁడు.

**వార్ధుషికుఁడు.** సం. వి. అ. పుం. = వార్ధుషి.

**వార్ధుష్యము.** సం. వి. అ. న. వృద్ధికై (వడ్డికై) అప్పిచ్చుట, అన్యాయమైన వడ్డి.

**వార్ధ్రి.** సం. వి. ఆ. స్త్రీ. వాఱు, తోలు పట్టె.

**వార్ధ్రిము.** సం. వి. అ. న. = వార్ధ్రి.

**వార్ధ్రీణసము.** సం. వి. అ. పుం. ౧. ఖడ్గ మృగము. ౨. పొడువైన చెవులుగల యడవి మేక.

**వార్పు(రుపు).** వి. (√ వారుచేు.) ౧. అన్న రసము, గంజి.

సీ. ... వఱలు సన్నరసంబు వార్పు గంజి, యనఁగాను ... ఆం. భా. ౨. ౨౫

౨. ఆచమనము.

సీ. ... ఆచమనీ యాఖ్య యలరు వార్పనఁ గను ... ఆం. భా. ౨. ౧౭౫.

౩. (గంజి) వడియఁ జేయుట.

సీ. పని వంటవార్పుల బాధలించుక లేక తీరిన మంచి సంసార మొదవె ...
హంస. ౪. ౧౪౬.

సీ. నిలనీని వంట వార్పులు న త్తమామల పోరును లేని కాపురము గలిగె ...
శుక. ౩. ౬౦౦.

**వార్భటము.** సం. వి. అ. పుం. మొసలి.

**వార్మణము.** సం. వి. అ. న. కవచధారుల సమూహము, మైమఱువులు తొడిగిన యోధుల గుంపు.

**వార్ముక్కు(చము).** సం. వి. చ్. పుం. మేఘము, మబ్బు.

**వార్యము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. నివారింపఁదగినది, అడ్డగింపఁదగినది. ౨. వరింపఁ దగినది, కోరఁదగినది.

**వార్యోకము.** సం. వి. అ. పుం. జలగ.

**వార్వాణ.** సం. వి. ఆ. స్త్రీ. మక్షికావిశేషము, ఒకజాతి యీఁగ.

**వార్వాపుటగ్గి.** వి. (వార్వము + అగ్గి) బడబాగ్ని.

క. అగడితలోఁగెందామర, మొగడలు గను పట్టెఁ జాల మూఁకై చూడన్, దగి మున్నీటం దేలుచు, బెగడని వార్ద్వంపుటగ్గిపిల్లలు వోలెన్. యయా. ౧. ౮౦.

గీ. అరయఁ దీవంచవార్ద్వంపు టగ్గి పట్ల, నడుమ నడరొందు నాఁడెంపుఁ బుడమి యేఁడు, లెల్లఁ గదలింపలేని యివ్విల్లు దునిమె, నిప్పు డితని మగతనం బెన్నఁదరమె.

అ. రా. బాల. ౧౭౪.

(వార్ద్వపుటగ్గిపట్టులు = సముద్రములు.)

**వార్ద్వము.** వి. వారువము.

గీ. వఱలు నేనికలిండి వార్ద్వమును చొలుత, గాఁగఁ దానెక్కి ... కళా. 3. ౬౨.

జః వార్ద్వపుటగ్గి.

**వార్షము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. వర్ష సంబంధి, వర్షాకాల సంబంధమైనది. ౨. సంవత్సరమంద్రైనది, ప్రతిసంవత్సరము వచ్చునది.

**వార్షికము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. వర్షముల సంబంధమైనది, వర్షాకాలసంబంధి. ౨. ప్రతిసంవత్సరము వచ్చునది. 3. సంవత్సరమునకు వచ్చునది, ఏడాదికి సరిపోవునది.

వి. అ. న. ఒకానొక మందుదినుసు చెట్టు.

**వార్షిల.** సం. వి. ఆ. స్త్రీ. వర్షోపలము, వడగల్లు.

**వార్షుకము.** సం. విణ. (అ. ఈ. అ.) వర్షించునది, వర్షించు మేఘము.

మ. ... లవణాబ్ధి నీరము గ్రోలివార్షుకము లిద్ధియ్యనినీరముల్ గురియునే చోద్యంబుగా కొయ్యేడన్ ... దశా. ౧. ౭౭.

**వార్ష్ణేయుఁడు.** సం. వి. అ. పుం. ౧. వృష్ణి సంతతివాఁడు. ౨. కృష్ణుఁడు. 3. నలుని సారథి.

**వాఅంటువిల్లు.** వి. (వాఱు + అంటు + విల్లు) రాళ్లపనివాండ్ర వాఱుకట్టిన పెద్దవింటికోల. (శ. ర.)

**వాఱు.** వి. (త. వార్) సన్నగాఁ గోసినతోలు.

సీ. ... హారంబు బరు వని యలగుల తాతన్వి వాఱులనెట్టి కై వడిధరించు ...

చిత్రభా. 3. ౧౧౧.

వ. ... కురువేరువాఱులును తమ్మితూండ్ల ప్రక్కల పల్లంబులును గల పచ్చి తెక్కల హుమాయినెక్కి ...

సానందో. ౫. ౧3౬.

జః వాఅంటువిల్లు, వాఱుకోల.

చంద్రా. ౨. 3౭.

**వాఱుకోల.** వి. (వాయి + కోల) కళ, కొరడా.

వ. ...గిలుకలు గదల్చి తగు వాఱుకోలలువైచిన వీధి వీధుల జగన్మోహనంబుగా నటించు నాహనంబుల మోహరంబులు చూచుచు.

కుచేల. ౨. ౧౦.

**వాతెన.** వి. ౧. వేఁట కుపయోగించు సాధనము.

ఆ. ఉరులుజిగురు గండె దెరలును బోనులుఁ, వాఱువాతెనలును వగులు గసులు, మిళ్లు వలలు పేట్లు గోళ్లు దీమంబులు, నాదిగాఁగఁ దెచ్చి రాటవికులు. పి. శకుం. ౧. ౧౧౬.

౨. ఒకవిధమైన పగ్గము, బలమైనత్రాడు.

ద్వి. ఘోరనత్రోకులు గోరెవాతెనలు, గోర యనుచు వింత గూడబెట్టుచును ...

పండితా. దీక్షా. ౪౦. పా.

సీ. ... జలజనాభుండు కోదండ చతురుఁ డగుచు, గుఱ్ఱములతోఁక సారథిఁ గూల సేసి, వాతెనయుఁ జక్రరక్షకద్వయముఁ ద్రుంచి, కల్లుబిల్లలుచేసి వెగ్గలముసవ్వె. ఉ. హరి. 3. 55.

ఉ. పగ్గపుం, ద్రాడును మోకువాతెనయుఁ దాలిచి ముందఱ వెన్కఁ జుంగు ద్రేలాడఁగ. శేష. 4. 8.

**వాతెనపీట.** వి. (√ వాతెన) ఏఁడికోలకును కాఁడికిని నడుమ చేరికగానుండు కొయ్య. (శ. ర.)

**వాల.** సం. వి. ఆ. స్త్రీ. 1. కొబ్బరచెట్టు. 2. పసుపు. (?). 3. మల్లెతీఁగ. 4. త్రుటి కాలము.

**వాలంపఱ.** వి. (వాలు + అమ్ము + పఱ) బాణ సమూహము.

క. కాళింగుని కరిఘటలం, గాలి కలను దూల నడచు ఘనపవనమున, ట్లాలంబున వాలం పఱఁ, దూలించిరి దోర్విలాసదుర్దము లగుచున్. హరి. ఉ. 3. 123.

**వాలకతనము.** వి. (వాలకము + తనము) మోసము.

గీ. వాలకతనంబుమాని నిర్వ్యాకులగతి, కోకిలా యేకడల నీదుకాకలేవి, రావమలరంగ నీభోజరాజసహజ, వినయ మెనయంగఁ గొల్వుమీ పేదు కలర. ఇందు. 4. 75.

**వాలకము.** వి. 1. వేషము.

సీ. ... ఒకవేళ మాటువాలకముతోనని సహాయంబుగాఁ బురశోధనం బొనర్చు ... కువల. 1. 50.

గీ. ... వేషమగు వాలకమ్మనాఁగ, వేసమన. ఆం. భా. 2. 148.

ఉ. ప్రాజ్ఞుఁడు తజ్ఞుఁ డుత్తముఁడు పావనమూర్తి మరుత్సుతుండు సర్వజ్ఞుఁడుగానిచోఁ దపసి వాలకముల్ విలునమ్ము లున్న వం, చజ్ఞత నమ్మకున్న పవనాత్మజు నమ్మఁగఁ బల్కు మమ్ము మా, ప్రజ్ఞ లెఱింగి సత్యమ్ముగు భాషల సంధి ఘటింప నేర్చునే. సమీర. 3. 6.

వ. ... ఇబ్బాలకులు మనవాలకపు సొమ్ములందు నేమేనియును నపహరించుటకు నచ్చాడుచున్నవారు ... ప్రభా. 1. 104.

2. మోసము.

చ. శుకుఁడను మాతపం క్తి ముఖచోదితుఁ డై చనుదెంచి కీశసైనికనికరంబు పెంపు ధర నీవరు తెంపును జూడవాని వాలక మొకకీర వానరలలాముఁడు కన్గొని పట్టితెచ్చి కొనుకయిడ రాఘవుండు కృపనాల్కఁ గా విడిపించి పంచినన్. రామా. 4. 192.

జ : వాలకితనము.

**వాలఖిల్యుఁడు.** సం. వి. అ. పుం. = బాలఖిల్యుఁడు, ఒకానొక ఋషి.

**వాలధి.** సం. వి. ఇ. పుం. ఏనుఁగు, గుఱ్ఱము మొదలగువాని తోఁక. (శ. ర.)

**వాలపాశ్య.** సం. వి. ఆ. స్త్రీ. జడబిళ్ల, పాఠితథ్య. (శ. ర.)

**వాలము.** వి. (సం. వ్యాలః) బెబ్బులి, వ్యాఘ్రము.

క. వాలమ్ముల దంష్ట్రాకర, వాలమ్ముల నెత్తి సెలసి వాలమ్ముల పెం, జాలమ్ములఁ దగిలిన కిటి, జాలమ్ముల దూఁటె నింద్రజాలమ్మునఁ గన్. సారంగ. 1. 102.

**వాలము.** సం. అ. పుం. 1. ఆచ్ఛాదనము. 2. జుట్టు. 3. గుఱ్ఱము, ఏనుఁగు మున్నగువాని తోఁకవెండ్రుకలు. 4. తోఁక. 5. అయి

కేండ్లఁ యీడుగల ఏనుఁగుగున్న. ౬. గజ్జపు పిల్ల. ౭. మత్స్యవిశేషము.

**వాలయించే = వాలాయించే.** స. క్రి. నిర్బంధించు.

క. ... ఏవారికి నిన్ను వాలయింపఁగ నేలా ...
భోజ. ౫. ౩౫౨.

**వాలఱుగుడు.** వి. (వాలు + అఱుగుడు) వాలిఁడి క్రోఁతి, లోఁకలేనిక్రోఁతి. (శ. ర.)

**వాలహస్తము.** సం. వి. అ. పుం. ౧. వెండ్రుకలు గలతోఁక. ౨. వెండ్రుకల సమూహము. (శ. ర.)

**వాలాయము.** వి. ౧. నిర్బంధము, నిరోధము.

శా. త్రైలోక్యంబు భుజాప్రతాపమున నిర్వక్రంబుగా నేలుచున్, హేలాహుంకృతిఁ గామగత్రి నగరీవ్యూహప్రచారంబులన్, వాలాయమ్మున మమ్ము బెట్టిగొనుచున్ వర్తింపుచున్నారు మీ, రాలస్యం బొనరించినన్ బ్రదుకశక్యం బెట్లు మాబోంట్లకున్.
భీమ. ౪. ౧౧౯.

శా. రా వైరాగ్యముఁ బూని నీవు కడునిర్దాక్షిణ్య చిత్తంబునన్, రావై తే జీవిగాని యిందులకు హాహాహారిగాఁ బోరి యే, లా వాలాయము నేఁడుగా బ్రతుకు నీవాచార మంతుం డవై ...
మను. ౩. ౯౪.

౨. ఎల్లప్పుడు.

శా. ... కేళిం గేలఁగ నేను దుంబురుఁడు సంగీతప్రసంగంబులన్, వాలాయంబుఁ గరంగఁ జేయుదుము దేవద్వేషి నుర్వీశ్వరా.
భాగ. ౭. ౧౦౨.

విశే. ౧. అనివార్యము.

శా. పౌలస్త్యాన్వయ చంద్రశూరులకు సౌభ్రాత్రంబు బాంధవ్యమున్, వాలాయం బన వచ్చునే ...
ఉ. రా. ౨. ౨౨౭.

సీ. ... సుతులు పుట్టిరయేని సుతులకు మృత్యువు వాలాయమై వెంట వచ్చునేని, బ్రహ్మచేతను వీఁడు పాలేమియును లేక యుండునే సదుపాయ మొకటి లేదె ...
భాగ. ౧౦. పూ. ౩౮.

౨. అనుకూలము.

క. అలు పతిసౌఖ్యముల కిల, వాలాయం బైన దాని యాలన వచ్చున్, ఆలాగునఁ గాకుండినఁ, గాలుని పెనుదూత కదర కదియఁగ వేమా.
వేమ. ౨. భా. ౨౦౯.

౨. నిరంతరము.

సీ. ... ఆ వెలుపు లేలికఁ జుట్టి రానేను చేతుల వెడల్పు నేల వాలాయంబుగాఁ గస వూడ్చియల్కి భజించుచున్న జనుల, చేతఁ బూజలుగొను బూతనా బూతనారీ భర్త ...
పాండు. ౫. ౬౭.

౪. యథావిధి, విధివిహితము.

సీ. వత్సరార్థమునందు వాలాయముగఁ జేసి రన్నసంప్రాశనం బర్భకునకు ...
కాశీ. ౪. ౧౩.

౫. అవశ్యము, తప్పక.

క. నేలం బాతిన నన్నుల, పాలవు ధనమొండె ముచ్చుపాలవు ధరణీ, పాలునిపాలవుఁ గావున, వాలాయముఁ గుడువ విడువ వలయు ధనమున్.
విక్ర. ౨. ౧౭౮.

క. ఏ యెడ ననడల మొఱ వ్రాలాయము విన వలయు దుర్బలస్వబలం రాజా యన వినవె ధరణీ, నాయకులకు నార్తరక్షణంబులె క్రతువుల్.
మనుచ. ౪. ౭౪.

క. దూలాలు లెంకినుండిన, వాలాయము చేటు వచ్చు వసుమతిలోనన్, లోలాక్షి విడిచి పెట్టిన, మేలిమిగా బ్రతుక వచ్చు మేదిని వేమా.
వేమన. ౩. భా. ౨౪౭.

జ : వాలాయించు.

**వాలాయించే.** అ. క్రి. అభినివేశమూను, పట్టుపట్టు.

శా. ... వాలాయించి యొనర్తురా జనులు దేవబ్రాహ్మణారాధనల్ ...
విక్ర. ౨. ౧౪౫.

క. వాలాయించి వనమ్ముల, నేలమ్మ తపంబు సేయ నిభకుంభకుచా ... వీర. ౨. ౨౨౩.

స. క్రి. = వాలయించే. (√ వాలాయము.) నిర్బంధపఱచు.

క. వాలుంగంటి నిలువుమని, వాలాయింపంగ నేఁగ వలయు ననుచు న,వ్వాలు మగఁడు మెఱుఁగారెడు, వాలుసహాయముగ మగిడి వచ్చెం బురికిన్. ద్వా. ౪. ౨౭౪.

వ. ... నీవు ప్రియంబుగూర్చి రమ్మని వాలాయించెదు మదీయప్రకారంబు వినుము ...
ధనాభి. ౨. ౮౨.

వ. ... వాలాయించి యడిగినప్పు డియ్యకొని యిప్పు డిటుచేత నా భాగ్యంబు కాక మీ రేమి చేయుదురు ...
భోజరా. ౮. ౯౪.

**వాలారు.** (వాలు + ఆరు.) విశే. ౧. దీర్ఘమైయినది.

సీ. తావిఁ గైవ్రాలినతమ్మిరేకులభంగి వాలారుఁ జూపులు వ్రాలుచేర ... విక్ర. ౮. ౧౦౨.

శా. ... వాలారుం గన్నుల మీఁదు చూచు తఱి ... ఆము. ౫. ౧౧.

మ. ... అంభోజాక్షి వాలారు జూపులఁ దేలించుచుఁ బల్కు ... దశా. ౨. ౩౬౪.

౨. మనోహరము, ఇంపైనది.

వ. బెరసె స్నేన నిగిడ్చినట్లు వళు లుబ్బె స్తర్భ లాంగంబు లంకురములూనె రదంబు లంఘ్రుల వడంకు ల్దీఱె వాలారులై, కరజంబు ల్సగిలించె ... పారి. ౫. ౪౬.

సీ. జలజసంహృతికిఁగాఁ జనుదెంచు రయమునఁ దొరఁగిన చెమట బిందువు లనంగ, గహ్వరస్థలి విత్తఁగాఁ దెచ్చి నెఱపిన వాలారుఁజలివిత్తనా లనంగ, లలి మించు శారదలక్ష్మిఁ బాఱఁగఁ ద్రోలి లిఖియించు పరజయలిపు లనంగ ...
చంద్రా. ౪. ౫౫.

౩. వాఁడియైనది.

సీ. వలరాజు పాటించు వాలారుటమ్ములు గామినీరూపంబుఁ గాంచె నొక్కొ ...
భా. రా. అర. ౨. ౭౬.

మ. మరువాలారుశరంబులం దొరఁగు కమ్మం దేనెతోఁ గూడి ... నైష. ౨. ౯౯.

శా. వాలారుంగొనగోళ్ల నీ వలసత న్వాయించుచో నాటకు, స్మేరంబైనవిపంచి నిన్న మొదలు న్నీ వంటమిం జేసి యా, యాలాపంబె యవేళఁ బల్కెడు ...
మనుచ. ౩. ౫౮.

అ. క్రి. ౧. ఒప్పు.

అసంబాధ - వాలాయంబున్ సత్కవిజనములు వాక్రువ్వన్, వాలారున్ గోవిందవరదధ్రువ వాత్సల్యా, కాళిందీప్రాణేశమతనుగగ ప్రాప్తిన్, జాలా భాస్వద్విభ్రమము కను ససంబాధల్.
అప్పక. ౪. ౨౨౧.

౨. ఉపశమిల్లు, క్షీణించు.

గీ. డప్పి దీఱంగ మధురకాండంబుఁ గ్రోలి, కడుపు నిండంగఁ దూఁడుఁ దీఁగలు భుజించి, యొంటి వాలారు సందాకఁ నిండు కొలని, తీరమున మఱ్ఱినీడ నిద్రించె నతఁడు.
శివరా. ౩. ౨౮.

క. ఏలిక నింగన యచ్చో, సోలుచు విరహా
నలార్తి స్రుక్కి వగచుచున్, జాలిం
బొందుచు నేడ్చుచు, వాలారుచు నింక
నేటి వల పనుకొనుచున్ ...
చంద్ర. ౨. ౭౫.

**వాలార్చు.** స. క్రి. (√ వాలారు.) ౧. కత్తులు జళిపించు.

సీ. హరిరాజసమమధ్య లంకించి వాలార్చుఁ గరి
కుంభకుచలు పరాకుఁ దెల్ప ...
వీర. ౧. ౧౨౭.

౨. పరీక్షించు.

ద్వి. వడిగొని దగ్గరి వాలార్చి చూచి ...
బస. పు. ౫. ౫౫౯. పం.

**వాలి.** సం. వి. ఇ. పుం. న్. పుం. సుగ్రీవుని యన్న, అంగదుని తండ్రి.

**వాలించు.** స. క్రి. (√ వాలు). ౧. వాలఁజేయు, నేలఁ గూల్చు, ఖండించు.

మ. అరుదారం బరగండభైరవుఁడు వీరా
కారుఁడై వైరి భూవరుఁ దుండించి ఘృతా
చికిం బ్రియునిగా వాలించు ...
కావ్యా. ౨. ౧౧౩.

సీ. కరము వాదిడు మామయురము వాలించు
మొక్కరము వారని మేలికరము వాఁడ...
ప్రబంధ. ౧. ౨౧౪.

౨. తర్జించు.

క. వ్రాలిన చెల్లాచెదరై, నేలం దిల లొలికె
నంత నిర్వ్యాఁకగున నన్నీలాలక చూచు
నెడన్, వాలింపక సతికిఁ బ్రాణవల్లభుఁ
డనియెన్. వెం. పంచ. ౨. ౧౦౪.

౩. నేలఁ గూల్చుట.

సీ. తలతలతల మంచుఁ దలమించు వలిమించు
వాలించు వలిప పావడలు గట్టి ...
రా. వి. ౩. ౧౧౪.

(ఇట సౌమ్యద్యోతకము.)

**వాలిఁడి.** వి. (వాలు + ఇఁడి) తోఁక లేని కోఁతి
విణ. తోఁకలేనిది. (శ. ర.)

**వాలిక.** విణ. (√ వాలు). ౧. దీర్ఘము, పొడుగు.

మ. ప్రకటస్నేహ మెలర్ప నాతనిపయిం బద్మా
వతీకాంత వ్రాలిక క్రొవ్వాఁడిమెఱుంగుఁ
జూపులనివాళిం జెంగు వాలించుచున్.
విక్ర. ౪. ౨౪.

క. పనివూని కౌశికిం జని, వనరుహలోచనుఁడు
వెడఁద వాలికకన్నుల్, తనకుఁగల ఫలము
గనియెం, బనివడి తద్విభవలక్ష్మిఁ బరికించు
నెడన్ ... కాశీ. ౬. ౩౦.

క. వాలికలై విరిదమ్ములు, యేలికలై భావభవుని
యెలదూపులకుం, బోలికలై యుత్కలికల,
మాలికలై యబలఁ దాఁకె మఱి నృపు
చూపుల్. పి. శకుం. ౨. ౭౪.

౨. వాఁడియైనది.

సీ. వెడఁద యమ్మున నేసి వెండియు మూఁడు
వాలిక యమ్ము లాఁడలఁ గీలించి ...
భార. భీష్మ ౧. ౨౩౨.

ఉ. వాలిక దొడ్డనారసము వజ్రము శైలము
దాఁకు నాకృతిన్, ఫాలము మీఁదఁ
దాఁకిన(న్) ...భార. ద్రోణ. ౧. ౩౫౭.

సీ. ప్రణతుల కాయువుల్ వ్రాయు తూలిక
నాఁగ వాలికతూపు పొక్కళింపు నమర ...
వాల్మీకి. ౩. ౧౫౦.

**వాలికనడ.** వి. (వాలిక + నడ) అశ్వగతి విశేషము.

వ. ఇట్లిచ్చి యనిపి పోడియము జంగనడయును
వాలికనడయునుం గలుగు వారువంబు నద
లించి వాగె వదలి జిరాగనగనం గదలించి
తోలిన ... ద్వా. ౪. ౩౧.

**వాలు.** అ. క్రి. ౧. విజృంభించు.

ఉ. వాలి యతండు బాహువిభవం బలరించినఁ
జేర్చి రౌద్రతం, గూలు గజంబులుం గడఁగు
గుఱ్ఱపు తండము ...

భార. శల్య. ౧. ౧౫౫.

చ. ... దేవ నీవలన వరంబు లిట్లుగొని
వాలిన దైత్యుఁడు మమ్ము నింక నే, కొలఁ
దుల సైఁచునే ... హరి. పూ. ౪. ౨౨.

సీ. ... తిమిరారి దోఁచిన దీనత పెంపునఁ
దెమలిన చీకటిగము లనంగ.

గీ. వాలి చరియించుఁ బురి మదవారణములు,
దారుణాహవాంభోనిధితారణములు ...

విక్ర. ౧. ౭౫.

౨. అతిశయించు.

ఉ. ... వారిఁ జెప్పఁగా వలసె వాలిన
దుఃఖము దాల్మిఁ గ్రాఁచినన్ ...

భార. శాం. ౧. ౧౧౭.

చ. ... మల్లిదేవఁ డచ్చెరు వగుచున్న పాత్ర
పియ చెన్నగు పీడుగ వాలి పాకనాఁ,
టిరువదియొక్క వేయిఁ జన నేలుచు ...

ఆ. పా. ప. ప. ౮.

ద్వి. వాలిన తేజమ్ము వమ్ముగాఁ జేసి, యేల
యో దీనోక్తు లి ట్లాడ నీకు ...

రం. రా. అయో. ౯౯. పా. ౩౧. పం.

క. ఈలీల దుర మొనర్పఁగ, వాలినదర్పమున
బభ్రువాహనధరణీపాలుఁడు తేరు గది
యం, దోలించి సురేంద్రతనయుతో
నిట్లనియెన్. జై. భా. ౫. ౧౭౮.

౩. (పక్షి) కాలూను, క్రిందికి దిగు.

గీ. ఈగ వాలిన నందంద యెలుఁగు లాసఁగు,
నట్టిసకినెల మంచములు ...

మనుచ. ౬. ౩.

సీ. ఇది మింటఁ బఱచు పక్షీంద్రుఁ జూపిన
నీడఁబడి వాలునందాకఁ బఱవఁజాలు ...

మనుచ. ౪. ౩౧.

౪. ఒఱఁగు, కూలు.

వ్యవ. మామిడికొమ్మ యింటిమీఁదికి వాలినది.

సీ. సురపథం బొక వేళ సోలి వాలినఁ గాని క్షితి
రాఁగదైె యఱచేతనొద్దు ...

ఘటికాచల. ౧. ౫౦.

౫. ప్రసిద్ధికెక్కు.

చ. అరుదగు చున్న జన్మసమయగ్రహయోగ
బలంబు పెంపునన్, వరరుచియై దిగంతముల
వాలుఁ జతుర్దశసంఖ్య విద్యలన్ ...

విక్ర. ౧. ౧౭౨.

క. ఫాలాక్షుని చాపము బా, హాలఘుసత్త్వ
మున విఱిచితని జను లెన్నం, బోలమహేం
ద్రాద్రిని విని, వాలిన నీలావు చూడవచ్చితి
నిటకున్. భా. రా. బాల. ౭౨౬.

సీ. హరిహరాబ్జజుల ముప్వురఁ దనూజులఁ జేసి
వాలిన యది పతివ్రతయ కాదె ...

భోజరా. ౬. ౧౯౭.

ద్వి. నీలావు లావుగా నిఖిలలోకముల, వాలుదు
వెంగు దుర్వారుఁడ నీవు ...

రం. రా. యు. ౫౩౯. పా. ౨. పం.

౬. ఆసక్తమగు.

క. భాగ్యమునై యిహపర పరిభోగార్థమునై
యగణ్యపుణ్యమునై వైరాగ్యజ్ఞానోన్నతు
లగు, యోగ్యతలములపాల వాలియుండుదుఁ
జుమ్మా. పాండు. ౪. ౧౦౮.

౭. ప్రకాశించు.

చ. ... బాహుబలార్జితశత్రుమండలో, జ్జ్వల
ధనవంతులై మహిమ వాలుదు రప్పురిరాజ
సత్తముల్ ... భా. రా. బాల. ౩౧.

చ. తల గడుగంగ మర్దనము ధౌతపటావర
ణంబు సంస్కృతో, జ్వలకలమాన్నభోజ
నము చందనచర్చ ప్రసూనదామకం, బునా
కపురంపువీడ్యమును భూషణపంక్తులు కల్గి

నిచ్చలుఁ, బులుఁగడుఁగంగఁబడ్డ నును
ముత్యము బోలుచు వాలుచుం బురిఁ.
పాండు. ౩. ౯.

సీ. ... గీ. కాక భూపాలుచే వాలు కఱకు
వాలు, కఠిన శితకోటి శతకోటిగాఁ దలంచె,
నేమొ ... దశా. ౧. ౧౧౫.

౮. ప్రేలు.

సీ. ప్రాయమింకిన వాలుపాలిండ్ల వెలయాండ్రు
పడుపు పుట్టక మూలఁ బడి కృశింప ...
వేం. పంచ. ౪. ౨౨౦.

క. లోలయగులోలలోచన, వాలుంజనుదోయిఁ
గేల వడిఁ బట్టాక న్యయ్యాలో జంపాలో
యని, ప్రేలుం గృష్ణుండు సఖులు వికవిక
నవ్వఁ. దశా. ౮. ౧౯౫.

౯. ప్రవేశించు.

క. ... ఇప్పుడు, వానలు వెలిసెను శరత్తు
వాలఁగఁ జొచ్చెఁ ...
భా. రా. కిష్కిం. ౪౮౫.

("శరర్తు" అని ముద్రిపా.)

౧౦. పడు.

ద్వి. రాక్షసుండవు గాక రాజవానీవు, వాలు
వైరుల మీఁద వాలునీవాలు, వాఁగంటులం
ద్రుంప వాలె యీవాలు ...
ద్వి. హరిశ్చ. ఉ. ౨౪౮౪. పం.

౧౧. క్రి. వహించు.

ద్వి. వాలియు సేనను వడి నొక్కవంక, వాలితి
మొకవంక వాలినవారు, సురగరుడోరగా
సురసిద్ధసాధ్యు, వరు లందఱును క్షీర
వారిధిఁ దరువ.
రం. రా. కిష్కిం. ౨౦౩. పా. ౨౩. పం.

వి. (సం. వాలః.) ౧. కత్తి.

క. వాలుపయి నడచునట్లు, బ్బాలిక ...
భార. ఆది. ౨. ౧౫౫.

క. పలకయు వాలును గొని తెక్కలు గల
పెనుఁ బాముపగిదిఁ గవిసిన ...
భార. భీష్మ. ౨. ౧౯౧.

సీ. ... శశికాంతి చెంగావి దశమలంచినకేల
స్వర్ణత్సరువు వాఁడివాలు మెరయ ...
ఆము. ౨. ౪౫.

౨. తీక్ష్ణత.

సీ. మార్పెట్ట నోపని ప్రాఁకు లేర్చుట యొంత
వా లగునని వనవహ్ని నవ్వ ...
కం. సం. ౧౦. ౫౨౬.

గీ. ఏది వినుజాలు కనువాలు నిత్తికేలు, నేది తో
ల్చిర మెడచార యొనుకకోర, యేది సెల
కూన సామేన నిడిన చాన,యితఁడు జేజేల
దొరయని యొటుల నందు. చెన్న. ౩. ౫౩.

౩. ఏటవాలుచోటు.

క. కైవాలు పండుపంటల, కైవాలుమెకమ్ము
లామికైవాలుటచో, నీవాలున నీవాలున,
నీవాలున నీప్రశస్తి వెలుపఁగవలయుఁ.
ప్రబంధ. ౧౬౯.

౪. ప్రవాహము.

వ. పూఁదేనియ కాలువ వాళ్లసుళ్లంబడి వడి
వడిం దిరుగు మరునికెంపు బొంగరంబులుం
బోని మెటఁదామర మొగడలును ...
యయా. ౪. ౧౩.

౫. తడవ, తూరి, పర్యాయము.

చ. ... బలాఢ్యులు రాత్రిచారు లెయ్యెడఁ
దగ దీరసంబు బలహీనులకుఁ మనబోటి
వారికిఁ ...

క. ఈ వాలువచ్చి శేవం, జావంగానున్న వారిఁ
జంపెద రహితుల్, దేవా సంధియనూన
శుభావహ మొనరింపు మస్మదాదేశమునన్.
వేం. పంచ. ౩. ౧౮.

క. ఆలమ్ముల వాలమ్ములు, గీలమ్ములఁ గప్పి
వసులఁ గినిసి యొకఁడు క్రొవ్వాలున నొక

వాలునఁ గర,ఖేలనమునఁ గేలుఁ గాలుఁ గీ
లెడలించెన్. లక్ష్మీ. ౨. ౨. ౮౧.

౬. దైర్ఘ్యము, పొడుగు. (శ. ర.)

విశే. ౧. దీర్ఘము.

సీ. వాలుగాఁ గై(వాలు కేలువు పూబంతిచాలు
మేలైనవాసనలు గుప్ప ...
రామా. ౧. ౧౨౨.

సీ. సొగసువాలు మెఱుంగుచూపు లాశావీధి
కలఁగల్వ విరిమేలుక ట్లమర్ప ...
ఉ. రా. ౨. ౧౨౪.

సీ. ... ఎడఁదకొఁపురపుఁ బుత్తడి బొమ్మనిడు
వాలుకన్నులా యీవాలుగన్ను లరయ ...
దశా. ౧. ౧౬౪.

౨. అధికము.

ఉ. వాలుమగంటిమిన్ దనుజవల్లభుఁ డల్క
వహించి యొవ్వఁడో, శైలమునన్ గుణస్వ
నము సల్పెను బాపురె వంటయింటఁ గుం,దే
లిది చొచ్చె రక్తములు తీవ్రతఁ గ్రోలఁగఁ
గల్గెనంచు నుత్తాలశరాసనాంచితగదాత్తురి
కాసిముఖాయుధాఢ్యుఁడై.
రుక్మాం. ౫. ౨౦.

౩. క్రూరము.

ఆ. ... వాల్మృగములఘోరవన మని వగ
వక, మఱచి యుండి కేని మాడ్కి
యొక్కొ ... భార. ఆది. ౬. ౧౭౮.

ద్వి. ముదమొప్ప రాజ్యాంగములు పరీక్షింతె,
వదలక నిర్జింతె వాలుశాత్రవుల ...
రం. రా. బాల. ౫౩. పా. ౨౨. పం.

సీ. ... గీ. ... వాలువైరులఁ జెండాడు
వాలువాని ... పద్మనాభుని వీక్షించెఁ
బద్మ యపుడు ... దశా. ౨. ౨౫౩.

ఉ. ద్వైతవనంబునట్టి సుఖవాసము గోవుల
కెందు లేదు ధాత్రీతలనాథ యిప్పుడు
ప్రదీప్తములై సతతంబుఁ జేర్చి గో,వ్రాత
భయంకరంబులగు వాలు మృగంబులు సంచ
రించు మీ,కాటేఁ గల్గఁ జెప్పుటకునై
యిటవచ్చితి నేను జెచ్చెరన్.
భార. అర. ౫. ౩౬౦.

౪. మనోజ్ఞము.

గీ. గొప్పకన్నులు నిడువాలుఁ గురులఁ జెలఁగు,
కాను ... నీలా. ౧. ౭౭.

గీ. చూడ వేటికి నిడువాలు సోఁగమీల, సూడఁ
పట్టంగఁ జాలెడు చూపుఁ గొనల ...
నైష. ౭. ౫౦.

వ. సోమ సూర్యాత్మకంబులగు వెడందనిడువాలు
టెట్టెసెరలకన్నులం గెందమ్మి కేఁకలఁ
వెదచల్లువాని ... ఆము. ౬. ౯౭.

క. వారిద్దఱువాలమ్ముల, బారిం బడి యర్జును
నకు బ్రదుకవశమె ...
భార. ఉద్యో. ౪. ౧౯౧.

ఆ. అట్టియెడ శిఖండి యాపగాసుతుమీఁద,
వాలుటమ్ము లేయ వాని నేయ ...
భార. భీష్మ. ౩. ౩౪౯.

చ. కులిశసముజ్జ్వలద్విశిఖకోటుల మాలిశరాళిఁ
గ్రుంచి తీ,జ్జ్వలదనిభాంగమున్ గదియ శార్ఙ్గి
మెఱుంగులఁ బోలువాలుఁ దూ,పులు నిగు
డంపఁగా నవియుఁ బోయి తదీయశరీర
రక్తమున్, బలువిడిఁ గ్రోలె ము న్నమృత
పానము సేయు సురౌఘముం బలెన్.
ఉ. రా. ౨. ౪౩.

౬. మృదువు.

(తారాదికామినులు.)

ద్వి. వాలిగూలినమాట వజ్రమైతమదు, వాలు
గుండెలునాఁట వసుధపైఁ గూలి ...
రం. రా. కిష్కిం. ౨౧౪. పా. ౧౨. పం.

జాబిలినవ్వువాలు = చంద్రహాసము.
అచ్చ. రా. యుం. ౩౪.

జ: వాలంపఱ, వాలఱుగుడు, వాలారు, వాలార్చు, వాలించు, వాలిండి, వాలిక, వాలికనడ, వాలుఁగంటి, వాలుఁగన్ను, వాలుకొంగ, వాలుగడుపు, వాలుచు, వాలుచుక్క, వాలుచూపు, వాలుపు, వాలుప్రొద్దు, వాలుమగఁడు, వాలుమీను, వాలుమెకము, వాలురమ్ము.

**వాలుఁగ(ల్గ)ంటి.** వి. (వాలు + కన్ను.) ౧. దీర్ఘములైన కన్నులుగల యాఁడుది.

సీ. ... నాటితప్పునకు నీసనబోండ్లతో నాకు పరవుడై యున్న దీ వాలుఁగంటి ... యయా. ౪. ౫౭.

శా. వాలుంగంటికి నింటియాతఁడు మనోవాంఛాప్రదానక్రియా, హేలాలోలుఁడు ... హరిశ్చ. ౩. ౧౬౪.

ద్వి. రాక్షసుండవుగాక రాజవానీవు, వాలు వైరులమీఁద వాలునీవాలు,వాలుఁగంటులఁ ద్రుంప వాలెయీవాలు ... ద్వి. హరిశ్చ. ఉత్త. ౨౪౭౪.

ఉ. వింటిగుణంబుఁగూర్చి రఘువీరుఁడు పంట వలంతినన్నవాల్గంటిఁ బరిగ్రహించు క్రియ. చంద్రరా. ౩. ౧౧౯.

మ. ... ఆ, వలఁపుంగప్రపుదీవి యామగువ యా వాల్గంటి నీకే తగుఁ ... నీలా. ౨.౨౭.

౨. భార్య.

ఉ. ఇంటికిఁదెచ్చి యోగి పరమేశునకున్ వణిజుండు తాను వాల్గంటియు భక్తియుక్త యము గౌరవమున్వినయంబు నాత్మలో, నంటికొనన్ ... హర. ౨. ౯౯.

**వాలుఁగ(ల్గ)న్ను.** వి. (వాలు + కన్ను) సోగ కన్ను.

సీ. ... దీర్ఘలోచనములు వాలుఁగన్నులనంగ వ్రణిలుచుండు ... ఆం. భా. ౩. ౬౦.

సీ. ... అసమాన నీలోత్పల సమానరుచు లొంది కలికిసోయగపు వాల్గన్నులలర ... ఉ. రా. ౧. ౨౫౪.

**వాలుక.** సం. వి. అ. స్త్రీ. ౧. ఇసుక. ౨. చూర్ణము, పొడి. ౩. కర్పూరము. ౪. ఒక జాతిదోస, నూఁగుదోస. †. ౫. (వైద్య) యంత్రభేదము. ౬. కాలజ్ఞానమున కుపయోగించు యంత్రవిశేషము, వాలుకాయంత్రము.

**వాలుకాత్మిక.** సం. వి. అ. స్త్రీ. శర్కర, చక్కెర.

**వాలుకాస్పర్శ.** వి. రత్నదోషము.

ఆ. ఏటియిసుకవంటి నెరసులఁగలిగియు, మహి నివెలుఁగునీల మణియునైన, వాలుకాస్పర్శనా వరలుచునున్నట్టి, దానిఁబూన మేలు దొలఁగిపోవు.

(ఈపద్యమున యతిగణభంగములు గలవు.) రత్నపరీక్ష. ౭౬.

**వాలుకి.** సం. వి. ఒకజాతిదోస, నూఁగుదోస. †.

**వాలుకొంగ.** వి. (వాలు + కొంగ) వక్కు కొంగ, బకము. (శ. ర.)

**వాలుగ(గు) = వాలువ(వు).** వి. చేఁప, మత్స్యము.

క. గాలపుటెరయిచ్చికదా, వాలుగలం దిగిచి కొనుట వక్రరిపుఁడుదా, నేలోఁబడునంతకు బల,శాలియుదానంబుఁ జూపఁ జనునొక్క యెడన్. కవి. ౨. ౪౨.

గీ. అనుచుఁ బలికిన జనపతి మనుచువేడ్కఁ, బెనుచువాలుగ మేలుగాఁ గనుచుననియె... దశా. ౧. ౧౩౬.

ఉ. వాలుగమీలనేలు నిడువాలు కనుంగవ మేలి జాలువా,డాలుగ అంచుమేను ... రసిక. ౩. ౫౫.

సీ. దరహాసరుచి గాంగఝరిగేలుకొనవాలుగల
లీల బెళుకు వాల్గన్నులలర ...
ఉ. రా. ౬. ౧౩౧.

సీ. కేలిమైనొక్కట లీలఁ గ్రేగ్లుతికెడు వాలు
గుసోగల నేలుదెంచి ...
భార. విరా. ౨. ౭౩.

గీ. వాలనిప మీను వాలుగు వాలుగ యన ...
ఆం. భా. ౧. ౧౫౯.

జ: వాలుగకంటి, వాలుగబెంకి, వాలుగ
డాలు, వాలుగగన్ను, వాలుగపాము.

**వాలుగకంటి.** వి. (వాలుగ + కన్ను) మీనాక్షి, స్త్రీ.

సీ. బలిమివాసవుచెట్టు నులిమి వాకిటఁబెట్టు
కలిమివాలుగకంటి చెలిమివాని ...
చంద్రా. ౧. ౭౪.

**వాలుగబెంకి.** వి. (వాలుగ + బెంకి) మత్స్య విశేషము. (శ. ర.)

**వాలుగడాలు.** వి. (వాలుగ + డాలు) మన్మథుఁడు, మీనకేతనుఁడు. (శ. ర.)

**వాలుగ(ల్గ)డుపు.** వి. (వాలు + కడుపు) బొజ్జ. (శ. ర., బ్రౌ.)

**వాలుగన్ను.** వి. (వాలుగ + అన్ను.) ౧. ఆఁడు చేఁప.

గీ. చంద్రుసైదోడు పూఁబోడి జకుకులకుకు,
వాలుగన్నుల బెళుకుల వైపునూపు, వాలు
గన్నుల వలపింపవలయు ననియొ, దేవ
మాయపుమీనమైతివి పయోధి.
వశా. ౧. ౨౧౨.

౨. ఆఁడు వాలుగచేఁప.

సీ. ... స్త్రీ మత్స్య భేదముల్ దీర్ఘలోచన
ములు వాలుగన్నులనఁగ వఱలుచుండు ...
ఆం. భా. ౩. ౬౦.

**వాలుగపాము.** వి. (√ వాలుగ) మత్స్య విశేషము. (శ. ర.)

**వాలుచే(ల్చు).** స. క్రి. (√ వాలు) ౧. వాలఁజేయు, వంచు.

ఉ. బాలిక మోము మత్తవనబర్హికిశోర
కలాస్య లీలఁబై, వాలిచి పచ్చ కప్పురపు
వాసనతోడి ముఖారవింద తాంబూలము
మోవి మోవిపయి మోపుచు రాధకు నిచ్చు
మూర్త గోపాలుఁడు ప్రోచుఁగావుత ము
పారకృపామతి మంత్రి నన్ననిన్.
భీమ. ౧. ౩.

ద్వి. వాలిన కిన్కమై వాలునీవాడి, వాలున
జిహ్వలు వాలుతు ననిన ...
హరిశ్చ. పూ. ౧౦౪౨.

వ. ...తలవాల్చి యేడ్చుచున్నం గనుంగొని ...
శృ. నైష. ౪. ౭౭.

ఉ. తెప్పలు వాల్చ కప్పుడమితేని మనోహర
మూర్తి నిచ్చలుం, దప్పక చూచిచూచి ...
శృ. నైష. ౧. ౬౪.

౨. ప్రవణము చేయు.

సీ. కొంత పుష్పాది భోగంబులిం పెసఁగిన
వైరాగ్య విధికిఁ దావాల్చుఁ జిత్త(ము) ...
శివరాత్రి. ౨. ౧౭.

౩. అతిశయింపఁ జేయు.

సీ. ... గీ. కదియఁ గూర్చితి బ్రహ్మాండ కర్ప
రంబు, పరిధిగా వాల్చితిని మహావరణ
జలము ... శివరాత్రి. ౧. ౩౫.

**వాలుచే(ల్చు)కత్తి.** వి. (వాలు + చేకత్తి) శస్త్రుఁడు.

ద్వి. అంత నిశాచరు లతిశోధ మొంద, వింటిగ
వాల్చుకత్తి వెడలియు వేళఁ, దెలతెలగాఁ
దూర్పుదెస విస్తరిల్లె ...
ద్వి. శ. సా. ౩. ౯౯. పా. ౨. సం.

**వాలుచూ(ల్చూ)పు.** వి. (వాలు + చూపు) ఓరచూపు.

సీ. ... ఏ చాయఁ జూచిన నిందీవర శ్రేణి
వెలయించు వాలుచూపుల విలాస,(ము)...
దశా. ౨. ౨౩౯.

సీ. వాలు చూపనఁ బొల్చు వక్ర దృష్టి ...
ఆం. భా. ౨. ౧౪౪.

క. చాలా మెఱుఁగులు గ్రొంబొగ, చాలా
నెత్తావి మోవిడంబుఁ గోడం, చాలా కను
బొమ లతలని, చాలా వాల్చూపు లన
మిటారి రహించున్. హంస. ౨. ౨౩౭.

సీ. ... కలువ రేకుల యేపు ఖంజనంబుల
రూపు నిరసించు వాల్చూపు నీటుదాని ...
ఉ. రా. ౨. ౨౬౬.

**వాలుడు.** వి. వాతారి. కీ.

సీ. ... ఛీ సిగ్గు గాదొకో చేర మాకాటది
యన్నఁ జెల్లెలు వావి యనెడు వారు ...

గీ. కోరి వాలుడు తైలంబుఁ గ్రోలువారు,
కుములు కుంపటి శాకముల్ గోరువారు,
సైరి యొక కొంద అచ్చలి ...
వేం. పంచ. ౧. ౬౭౭.

**వాలు(ల్పు)పు.** వి. (√ వాలుచే) వాలుచుట, మోడ్పు.

చ. పులకల జగ్గునెమ్మి నెఱపున్ జిగి నెమ్మొయి
నిగ్గుఁ జెయ్యూలన్, వలగొను సిగ్గు వింతయర
వాలుపుఁ జూపుల కగ్గు ...
బిల్హ. ౨. ౧౬౦.

**వాలుప్రొద్దు.** వి. (వాలు + ప్రొద్దు) అపరాహ్ణము. (శ. ర.)

**వాలుమగఁడు.** విశే. (వాలు + మగఁడు) శూరుఁడు.

ఉ. ... అవ్వాలు మగండు వాక్పరి
భవంబుఁ దలంచుచుఁ గార్య ధుర్యుఁడై.
భార. సౌప్తి. ౧. ౧౫౪.

సీ. రాయఁడ వినుమతి కాయుండు మొదలగు
వాలు మగల్పెక్కు వేలు రక్కసుల జేని
కొడుకులు ... అచ్చ. రా. యు. ౪౧.

ఉ. వాలుమగం డితం డనఁగ వానికి నెక్కు
దశాస్య శక్తిచే, నేలకు వ్రాలి మేల్కనని
నిద్దుర నొందితివయ్య తమ్ముఁడా ...
భా. రా. యు. ౧౫౭౪.

**వాలుమీకేశుఁడు.** మి. వి. (సం. వాల్మీకేశః) వాల్మీకి ప్రతిష్ఠితుఁడగు నొక దేవుఁడు.

ద్వి. అవాలు మీకేశుఁ డాత్మఁ గలంగ ...
బస. పు. ౪. ౪౬౩. పం.

(ఇచ్చో, "వాల్మీక దేవ దేవుఁడు," మొ.)

ద్వి. దేవ మున్నెఱుఁగవే యీ వాలు మీక,
దేవ దేవుఁడల సత్ప్రీతి దొల్కాడ ...
బస. పు. ౪. ౪౩౬. పం.

**వాలుమీను.** వి. (వాలు + మీను) వాలుగ, ఒకజాతి చేప.

ఆ. వాలు మీలఁబోలు వామాక్షి చూపులు,
సోను సానుగోము భామమోము ...
హంస. ౩. ౬౯.

**వాలుమృ(ల్మృ)గము.** మి. వి. (వాలు + మృగము.) ౧. పులి, వ్యాఘ్రము.

ఉత్సాహ. వాఁడి మగఁడు నిద్రపోవు వాలు
మృగముఁ బోలెనై, వీఁడె బాహ్లికుండు...
భార. స్త్రీ. ౨. ౯౩.

శ్లో. ప్రాతిపేయం మహేష్వాసం, హతం
భీమేన బాహ్లికం, ప్రసుప్తమివ శార్దూలం,
పశ్య కృష్ణ మనస్వినమ్ ...
సం. భార. స్త్రీ. ౨౨. ౫.

౨. క్రూర జంతువు.

ఉ. పూచిన తీఁగెలన్ మధురభూరిఫలంబుల
వ్రేఁగునన్ మహిన్, వ్రాచిన కొమ్మలుం
గలిగి మ్రాఁకులు గట్టిన పోఁకమోకలన్,
రాచిన వాల్మృగంబులు దినంబడి పర్ణన
సేయ నొప్పు వింధ్యాచల పార్శ్వకానన
మనస్యవనీవిభవోపమానమై.
కేయూర. ౩. ౧౦.

**వాలుమె(మ్మె)కము.** వి. (వాలు + మెకము) వరాహము, అడవిపంది, క్రూరజంతువు.

సీ. ... వాలుమెకము ...
గీ. పంది సలు గేకలమ్మనఁ బరగు ఘృష్టి ...
ఆం. భా. ౨. ౭౨.

క. అల్లదె కంటే పానపాన, తెల్లని గట్ట
ఉత మబ్బు దేఱెడు పొలమం, దెల్లెడఁ
జూచిన ధరణీ, వల్లభ సీరాముసేన వాలు
మెకంబుల్. మనుచ. ౪. ౧౯.

క. కై వాలు పండుపంటల, కై వాలుమెకమ్ము
లామికై వాలుటచో, నీవాలున నీవాలున,
నీవాలున నీప్రశస్తి నెఱపఁగవలయున్ ...
ప్రబం. ౧. ౧౬౯.

ఉ. ... వేఁటలాడుకొఁ, జయ్యనఁ బోయి
యా యడవి చాయలఁ గంటిమి వాల్మె
కంబులన్ ... సారంగ. ౧. ౬౬.

ద్వి. పన్నెల పులుఁగులు వాల్మెకంబులును,
వీక్షింప వెఱపును వెఱఁగును గాఁగ ...
ద్వి. హరిశ్చ. పూ. ౫౧౬. పం.

**వాలురమ్ము.** (వాలు + అమ్ము) వి. వాఁడిగల బాణము.

తే. వంక యొత్తిన మన్మథువాలురమ్ముఁ, బోలె
నెమ్మేను చక్కనై పొలుపు మిగిలె ...
హరి. పూ. ౯. ౩౫.

**వాలువ(వు) = వాలుగ.** వి. మత్స్యవిశేషము.

సీ. వాలువముకుదమ్ము వల్లె గండెర నత్తె
గుజ్జుజేడిస తాతి కొఱుకు మడిస ...
వేం. పంచ. ౧. ౨౯౪.

చ. పడిఁ బుటమెత్తి వ్రాలు నిడు వాలువ
చాలుపు లింత సంతమై, నిడువెలిగుంచెలం
దెలుప ... వేం. పంచ. ౪. ౧౩౩.

క. కోలగతి నడిచి యొత్తినఁ, గేలాగిఁ దెగి
యొలుఁగుతోన కేళ్లిగని వడిన్, దూలె జల
వాయ సంబా, వాలువుఁ గఱచుకొని దివికి
వడి నెగయు క్రియన్ ...
కు. సం. ౧౧. ౭౨౫.

సీ. కొఱ్ఱమీనులఁ దండ్రి కొలువు లెంకల కిచ్చె
వాలువులను సంగడీల కిచ్చె ...
ద్వా. ౧. ౨౨౧.

**వాలువగ్గము.** విణ. మిక్కిలి వశమైనది.

ద్వి. ... ధైర్యంబు, దూలి వెక్కసుముంపుఁ
దోఁచక మూలఁ, గూలి నీ చెలులతోఁ
గూడుక మసని, వాలమ్ములకు వాలువగ్గమై
పొట్లఁ, బడిపడి బెండైతిఁ బాలకి యని
నృనుడురాజ వదన ని న్నుడికించినట్టి,
ఘనుఁడల్లమ విఘుండె కాని కాఁడొరుఁడు.
ప్రభులింగ. ౨. ౪౯. పా. ౨౩. పం.

**వాలూరు.** అ. క్రి. ఆలస్యమగు.

ద్వి. ఏలిన పతికార్య మెడరైన యొడను, వాలూర
నటు చేయువాఁడు మధ్యముఁడు...
రం. రా. యు. కాం. ౨౭౯. పా. ౧౧. పం.

**వాలెము = వాలాయము.** క్రి. విణ. ౧. నిరంతరము, ఎల్లప్పుడు.

క. నీవార మనుచు నమ్మికన్ వాలెము
గొలుచు వారి దాసఁగుల పాలింపో విడిచి
నిరాబారులఁ, గావించు చెనంటి నీవె కద
పరికింపన్ ... అచ్చేరా. యు. ౨౫౯.

౨. అత్యంతము.

ద్వి. దానికై నగరిలో ధరణీశ్వరుండు, లేనిచో
నైన వాలెము జంకు లేక ...
వి. సారంగ. ౧. ౧౩. పు. ౩. పం.
క. ఏలినవాఁడను సింగఁడ, వాలెంబును దానిఁ
జూచి వలచినవాఁడన్ ...
చంద్రరేఖా విలా. ౨. ౧౦౪.
౩. అవశ్యముగా.
చ. ... నేలతాల్పు యిప్పుడె దలఁచూని రక్క-
సుని బాలెము వాలెము జొచ్చి చేడియం,
గనుఁగొని యుంగరం బొసఁగి క్రన్ననన్ఁ
దలమానికంబుఁ గ్రొ,కొని పఱతెంగు ...
అ. రా. కిష్కి౦. ౮౨.

**వాల్కలము.** సం. విణ. (అ. ఈ. అ.) చెట్టు
పట్టతోఁ జేయఁబడినది.

**వాల్కలము.** సం. విణ. (అ. ఈ. అ.) చెట్టు
పట్టతోఁ జేయఁబడినది.
వి. అ. న. నారబట్ట.

**వాల్మి(ల్మ్మి)కి.** సం. విణ. పుం. శ్రీమద్రామా
యణము రచించిన ఋషి.

**వాల్మీకుఁడు.** సం. వి. అ. పుం = వాల్మీకి.

**వాల్లభ్యము.** సం. వి. అ. న. వల్లభుని ధర్మము,
ప్రేమ, అనురాగము, వలపు.

**వాళి.** వి. ౧. పసులు పోవుదారి. (శ. ర.)
౨. వాడుక.
వ్యవ. ఈ పని మనకు వాళిలేదు.

**వాళించు.** స. క్రి. వాడఁజేయు, ప్లానత
నొందించు.
క. లాలించి స్వామి బిరుదులు, పాలించితి
రనుచు నపుడె వదరక యుంటిన్ వాళించి
విడుతు గర్వము, చాలించి సనంగ దాని
సరి వారు నగన్. వాల్మీకి. ౩. ౨౬.

**వాళ్లుపఱచేలు.** విణ. (వాళ్లు + పఱచుట)
ప్రుక్కఁజేయువారు, ప్లానత గల్గించువారు.
ద్వి. కుపితము లాలముల్ క్రూరముల్ వాళ్లు,
పఱచులు వికృతముల్ భ్రమితలు
ముచ్చు,లు ...
పండితా. పురా. ౧౧౬. సా. ౨౧. పం.

**వావదూకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) బహు
భాషీ, వదరుఁబోతు.
వి. అ. పుం. వాగ్మి, వక్త, ఉపన్యాసకుఁడు.

**వావాఁడి.** వి. (వా + వాఁడి) వాక్ప్రౌరుష్యము.
క. లోవాఁడియు వావాఁడియుఁ, జేవాఁడియుఁ
గలిగి మిగుల సీమారామా, గ్రామాగ్రహార
జనపద, దేవస్థానాటవులను ద్రిమ్మరు
కతనన్. ప్రబంధ. ౭౬౭.

**వావాదము.** మి. వి. (వా + వాదము) వాగ్వా
దము.
క. నా విని ధర్మాధికృతుల్, వావాదం బేల
యేను వారము లెడ మీ,రే వివరము నాఱ
వనా,డావిష్కృత బుద్ధిఁ దెలుపుఁ డరు
గుఁడు మగుడన్ ...
వెం. పంచ. ౧. ౭౨౫.

**వావాదు.** వి. (వా + వాదు) ఉపన్యాసము.
సీ. ... వావాదనంగను బరగునుపన్యాసము...
ఆం. భా. ౧. ౧౧౩.

**వావి.** దే. వి. శాస్త్రీయమైన సంబంధయోగ్యత.
అనుకూలమైన సంబంధ యోగ్యత.
ఆ. వావిగానియట్టివనితఁ బొందిన పాప,
మాఱుసెలలఁ బాయు నార్ద్రవస్త్రు, ధరణ
భస్మశయనపరతఁ బాటించుచు, నియతి
నుండెనేని నృపవరేణ్య.
భార. శాం. ౧. ౩౧౩.

గీ. నీకు నేనాటి తల్లిని నిజము సెపుము, యమర
లోకంబు వేశ్యలమైనమాకు, నిట్టిలగవులు
నడవ వహీనబాహు, వీర్య యిచ్చట
వావియు వెదకఁ జనునె.
భార. అర. ౧. ౩౬౨.

ద్వి. బావిఁ దమ్ముఁడఁగాని వాలి నీ కేను, నీవ
కొండ కుఱుఁడఁ జెప్ప నేమిటికి ...
రం. రా. కిష్కిం. ౨౦౫. పు. ౧౦. పం.

చ. మఱది యటంచు బావయని మామ యటం
చును నల్లుఁడంచు సందఱకును నన్ని వావు
లిడి తచ్చనలన్ మఱుమాయసుద్దులన్ ...
దశా. ౨. ౩౬౬.

**వావింట = వాయింట.** వి. బర్బగ, ఒకగినుసు కూరాకు మొక్క. (శ. ర.)

**వావిక.** వి. కుత్తుక మొదటఁగల గుంట. (శ. ర., ప్రా.)

**వావిడుచు.** అ. క్రి. (వా + విడుచు.) ౧. నోరెత్తు.

క. అడిగితినే నిను నా కవ్వడి భుజబల మెట్టి
దని యవారణ నీవిప్పుడు నృపులెల్లను విన
వావిడిచి పొగడెదిట్లు వంది విధమున
నతనిన్ ... భార. కర్ణ. ౨. ౯౯.

(వావిడిచి = బిగ్గరగా, అని భావము.)

క. ... దానవ, వల్లభుఁడట్లఱచుచుండె వా
విడిచివడిన్ ... నిర్వ. ౪. ౯౪.

౨. దుఃఖించు.

క. దైవికములైన పనులకు, వా విడువఁడ
వార్య ధైర్యవంతుఁడు ...
కేం. పంచ. ౨. ౨౫.

**వావిరి¹.** వి. ౧. క్రమము.

క. అకల నా చేతంగల, యావిధమును నున్న
యదియ తాని నునుముట్టన్, వావిరి చెప్పఁ
గ నేలా, నావుడు నవ్విభుఁడు భీమణ స్ఫుర
ణమునన్. హరి. ఉ. ౧. ౧౭౩.

క. కావున మనుజుఁడు సేయుక, దేవుండీయంగ
లేడు తెగి యేమియు నానావిధధాన్య
ము లుండిన, వావిరి పండకయ రిత్త పంటక
మగునే. కుచేల. ౧. ౯౧.

క. ఈ వరుసఁ ద్రయస్త్రింశద్భావములకు
లక్షణము లుదాహరణంబుల్, వావిరి
నొసర్తు నీయెడఁ, గేవలశృంగారసూత్రకీలిత
ఫణితిన్. నరస. ౩. ౪౯.

౨. అనుగతి.

క. పోవఁగ న య్యగసాలెయు, వావిరిఁ దో డ
రఁగ నొక్కవన మధ్యమునన్, గేవల పక్వ
ఫలంబుల, ద్రోవై యొక వెలగ యుండఁ
జూడగని వేడ్కన్. భోజరా. ౫. ౨౪౦.

ఉ. కావున సిద్ధసిద్ధుల వికారముఁ బొందక
ద్రోహ మెఱ్యొడన్, వావిరిఁ జేయకేల
భువనంబు భవత్కుల ధర్మరక్షకై ...
భార. శాం. ౧. ౧౫౦.

౩. అధిక్యము.

ఉ. ... మనోరథభోగసౌఖ్యముల్, వావిరిఁ
బొందుచున్ నృపతివంద్యపదాబ్జము లొప్ప
సర్వధాత్రీ వలయంబు నేలెడు ...
భా. రా. సుం. ౫౧౪.

ఉ. ... వావిరిఁ గప్పు నీరు మృగనాభిర
సంబున మేళవించి ... నైష. ౩. ౧౦౨.

విణ. ౧. ఉత్కృష్టము, గొప్పది.

చ. వగవఁగ నేమియుం దగని వారికినై హృద
యంబు గుందఁగా, వగచెదు బుద్ధి మాటలును
వావిరి నాడెదు నీవు ...
భార. భీష్మ. ౧. ౧౯౫.

చ. పడిఁ ద్రిదశాలి నోర్చు డొక వావిరి బీరము
గాఁగ ... కు. సం. ౧౦. ౫౬౧.

ఉ. మారుతసూతి నేను హనుమంతుఁడ రాముఁడు పంపఁగాఁ బయో, వారిధి కేగుచో నొడవె వావిరియై జలతృష్ణనాకు ...
భా. రా. యు. ౧౬౭౪.

ద్వి. రావణుండంతయు రఘురామునిమీఁద, వావిరి యమ్ముల వానలు గురిసె ...
రం. రా. యు. ౫౨౫.
పా. ౨౭. పం. (బ్రౌ.)

౨. పూర్తుఁడు.

చ. వలదని యెంత చెప్పినను వావిరిపై కడువేగ పాటుపైఁ, బలుమఱు నెల్లెడం దొడరఁ బాఱెదు ... భార. విరా. ౨. ౨౬౦.

(ఇట "అనుగతుఁడు" అని (శ. ర.)

క. ఆ వనిత చూచుచుండఁగ, వావిరియై పొఱి వాతి వాఁడిశరమునఁ, బావా మేలము సూయని, జీవులు గానతని తలగొట్టిగి పో విడిచెన్. వి. పు. ౮. ౬౨.

౩. అత్యంతము.

ఉ. ... వావిరిఁ జెప్పఁగా వలసె వాలిన గుఃఖము దాల్మిఁ బ్రాఁచినన్ ...
భార. శాం. ౧. ౧౧౫.

చ. ... వర్మబంధముల్, మురియఁగఁ జాపముల్ దునియ ముద్గర తోమర శక్తులా దిగా, వరుస నతేకము ల్మడియ వావిరిఁ బోరిచెలంబు పెంపునన్ ...
హరి. ఉ. ౨. ౫౭.

ఉ. నావిని సంతసిల్లి వటుసాధుఁడు దానవనాథుఁ జూచి నీ, పావనశీల సంపదకు భక్తికి సత్యవచోనిరూఢికిన్, వావిరి మెచ్చితిన్ సుకృతవర్ధన వేడు వరం బొసంగెదన్, నావు డతండు పల్కె సుజన ప్రియ నిన్ను వరింప నెద్దియున్. జాహ్నవీ. ౨. ౩౪.

వావిరి². వి. = వావిలి. శేఫాలిక. ‡.

సీ. ... వావిరి నిట్టూర్పు వావిరి నిడి యొడికం బుగ నడితిలకంబుఁ జూచి ...
ఇందు. ౩. ౫౧.

ద్వి. దేవదారువు కర్వె దేవ కాంచనము, వావిరి లేలమువ్వంచు పంచాది ...
ద్వి. సారంగ. ౨. ౪౯. పా. ౨౧. పం.

వావిలి వి. శేఫాలిక. ‡.

దీని భేదములు - తెల్లవావిలి, నల్లవావిలి.)

చ. ... వినఁగనరాని పల్లవిక వృత్తి మెయింగెడఁ గూడి యాక్కటా, కనుఁగొన నయ్యె వావిలి తగన్ మఱి దీనికి వావిలేదొకో...
చంద్రాంగ. ౪. ౨౭౩.

క. వలనుగ నమ్ముద్దుం బై, దలి వలి నిట్టూర్పు కమ్మ తావులచే వా, విలి ననిచె ననఁగ నిది వేల్పుల ము న్నెవ్వారి నెట్లు పూజించె నొకో. రసిక. ౩. ౧౬౭.

సీ. ... వావిలి యన సిందు వార మనఁగ ...
ఆం. భా. ౨. ౫౧.

వావురము = వారువము. వి. అశ్వము, గుఱ్ఱము.

సీ. పరఁగు నశ్వంబు బాబా వావురము వారువము జక్కి తత్తడి మావు గుఱ్ఱము ...
ఆం. భా. ౨. ౧౯౬.

సీ. గీ. మురువు గలిగిన తోడుకు వావురము నెక్కి .... వరాహ. ౯. ౮౮.

స్రగ్ధర. ... నయ్యంకు మాలికా, వనమాలికా గీలిఁగలికా వడిఁగడఁగి నగుణా వావురంబుల్ దినంబుల్ ... భోజసుతా ౧. ౭౪.

వావృత్తము. సం. విణ. (అ. ఆ. అ.) వరింపఁబడినది, ఎన్నుకొనఁబడినది.

వాశకము. సం. విణ. (అ. శికా. అ.) అఱచునది, ధ్వనిచేయునది.

వి. అ. పుం. అడ్డసరము. ‡.

**వాశనము.** సం. వి. అ. న. ౧. అఱుపు, బొబ్బరింత, బొబ్బ. ౨. పక్షి కూఁత. ౩. తుమ్మెదల రొద, ఝుంకారము.

**వాశి.** సం. వి. ఇ. పుం. అగ్ని, అగ్నిదేవుఁడు.
ఈ. స్త్రీ. బాడిస, వడ్రంగి పనిముట్టు.

**వాశిత.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఆఁడేనుఁగు, కరిణి. ౨. ఆఁడుది, స్త్రీ.
విణ. కెదపోయినది. (ఆవు, ఏనుఁగు మొ.) పొర్లుటకు సిద్ధమైనది.

**వాశితము.** సం. వి. అ. న. ౧. పక్షికూఁత. ౨. పిలుచుట, ఆహ్వానము.

**వాశ్రము.** సం. వి. అ. పుం. ౧. దినము. ౨. ఎద్దు.
న. ౧. ఇల్లు. ౨. చతుష్పథము. నాలుగు వీథుల మొగ. ౩. పేఁడ.

**వాస = వాసము.** వి. ఇంటి మీఁదఁ బఱచెడు పట్టె. (శ. ర.)
జ: వాసపోయు.

**వాసఃకుటి.** సం. వి. ఈ. స్త్రీ. పటకుటీరము, డేరా.

**వాసంతకుఁడు.** సం. వి. అ. పుం. ౧. (నాటకమున) విదూషకుఁడు, హాస్యగాఁడు. ౨. నటుఁడు.

**వాసంతము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. వసంతఋతుసంబంధి, వసంత ఋతువునఁ బుట్టినది. ౨. నడిమి వయస్సున నున్నది, నవయౌవనము గలది.
వి. అ. పుం. ౧. ఉష్ట్రము, ఒంటె. ౨. పిల్ల యేనుఁగు, ఏనుఁగు గున్న. ౩. కోకిల. ౪. చిన్న పిల్ల జంతువు. ౫. మలయమారుతము, తెమ్మెర. ౬. ఒక దినుసు చిక్కుడు. ౭. ముద్గము, కృష్ణ ముద్గము. (వాచ) ౮. మంగ చెట్టు.

**వాసంతి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. మాధవి, పూవుల గుందిపెండ. ‡. ౨. అడవిమొల్ల. ౩. పిప్పలి. ౪. కలిగొట్టు చెట్టు. ౫. వసంతోత్సవము.

**వాసంతికము.** సం. విణ. (అ. ఈ. అ.) వసంత ఋతు సంబంధి, వసంత ఋతువునందుఁ బుట్టినది.

**వాసంతుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. నవయౌవనము గలవాఁడు, నడిమి వయస్సున నున్నవాఁడు. ౨. (తన పని నేర్పుట యందు) శ్రద్ధ గలవాఁడు. ౩. భోగలంపటుఁడు. ౪. విటుఁడు (వి. ని.)

**వాసకము.** సం. విణ. (అ. నకా. సికా. అ.) ౧. సువాసన గలిగించునది. ౨. నివసింపఁ జేయునది.
వి. అ. న. వస్త్రము.

**వాసకర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. యజ్ఞశాల. ౨. నాట్యము మున్నగు వినోదములు జరుపుశాల. (విల్యమ్సు.)

**వాసకసజ్జ.** సం. వి. ఆ. స్త్రీ. = వాసకసజ్జిక.

**వాసకసజ్జిక.** సం. వి. ఆ. స్త్రీ. ఒక శృంగార నాయిక, తన దేహమును గేహమును నలంకరించుకొని ప్రియుని రాక కెదురు చూచు నాయిక.

**వాసగృహము.** సం. వి. అ. న. గర్భాగారము, పడక టిల్లు.

**వాసతాంబూలము.** సం. వి. అ. న. సుగంధి ద్రవ్యములతోఁ గూడిన తాంబూలము.

**వాసతేయము.** సం. విణ. (అ. ఈ. అ.) నివాస యోగ్యమైనది.

**వాసతేయి.** సం. వి. ఈ. స్త్రీ. రాత్రి.

**వాసన.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఆశ, అపేక్ష. ౨. జ్ఞానము. ౩. స్మృతికి హేతువగు సంస్కారము, భావన. ౪. పురాకృత సుకృత దుష్కృతముల వలనఁ దనంతటనే మనస్సునంటిన సుఖదుఃఖ కారణమైన సంసారము. ౪. ఊహ, ఆశయము. ౫. మిథ్యాజ్ఞానజన్యమైన సంస్కార విశేషము. ౬. గౌరవము. ౭. సుగంధీకరణము, పరిమళము గలిగించుట.

**వాసనకెక్కు.** (వాసనకు + ఎక్కు) మి. అ. క్రి. వాసన కలుగు, పరిమళించు.

ఉ. మలయసమీరణాభిహతి మ్రోఁకులనాకులు దుల్లిదుల్లి ... కుసుమంబులు వాసనకెక్కి యెక్కి ... కు. సం. ౪. ౪౪౩.

**వాసనకొడుపు.** మి. వి. ఊఁదువత్తి పుడక, సాంబ్రాణి వత్తి.

క. ... జిల్ల తైలంబును వాసన కొడుపులం బూసిన మణుంగు చంద్రిక చేలలె రవణంబులుగా ... ఆము. ౪. ౩౫.

**వాసనము.** సం. వి. అ. న. ౧. ధూపనము, సుగంధీకరణము, పరిమళము కల్గించుట. ౨. నానఁబెట్టుట. ౩. నివసించుట. ౪. ఇల్లు, నివాసము. ౫. ఒక వస్తువు నుంచుట కాధారమైన పాత్రము, పెట్టె, కుండ, మొ. ౬. జ్ఞానము. ౭. వస్త్రము. ౮. (సంచి) ఆచ్ఛాదనము, కప్పు. ౯. సగుణధ్యాన సమయమున మునులు అభ్యసించు నొక విధమైనస్థితి, ధ్యానావస్థా భేదము.

**వాసనరాజనాలు.** మి. వి. బ. ధాన్య విశేషము.

సీ. ... వజ్రపుఁ దళుకులు వాసన రాజనా[illegible] బ్వాజి వంకెలు గవ్వసరులు ... [illegible]
హంస. ౪. ౧౨౮.

**వాసపోయు.** అ. క్రి. (√ వాస) వాసములు పఱచు.

సీ. ... వాస పోసెడిచోట వాసనగల వాసమేపె వాసము నొకఁడింతె మహిప ...
రా. వి. ౩. ౪౦.

సీ. ... తళుకు టేనుంగు దంతముల దూలములెత్తి వారాహి దంష్ట్రల వాసపోస్తి ...
దశా. ౮. ౩౯.

మ. జవ నాశ్వంబు నితండఖండ సమరక్ష్మామండలి న్నూకి ... వేమినక్కల వాసపోయి నిలువారంబై పయి న్నిల్వఁగన్ ...
చంద్రాం. ౫. ౧౪౨.

**వాసభవనము.** సం. వి. అ. న. నివాస గృహము, కాపురముండెడి యిల్లు. (ఇట్లె వాసమందిరము. మొ.)

**వాసము.** వి. ఇంటిమీఁదఁ బఱచెడి పట్టె.

సీ. ... వాసపోసెడు చోట వాసనగల వాసమేపె వాసము నొకఁడింత మహిప ...
రా. వి. ౩. ౪.

సీ. ఇల్లిల్లు దిరుగ నొక్కింతబ్బు శిఖయబ్బెనే నింటిలోఁ బూరియిడి విసరక, రాఁజదు రాఁజిన రవులుకోల్వాసాలఁ గాని కల్గగు మఱి దానఁగలిగె, నేని కూడగుట ...
ఆము. ౪. ౧౨౭.

**వాసము.** సం. వి. అ. పుం. ౧. పరిమళము, సువాసన. ౨. నివాసము, ఉనికి.

ఈ యర్థమున కాలవాచకము కాని, హలంత అదంత శబ్దముల సప్తమికి శబ్దము పరముగా నున్నప్పుడు సమాసమున సప్తమికి అలుక్కు వికల్పముగా వచ్చును.

ఉదా. గ్రామేవాసము, గ్రామవాసము.

౩. గృహము, ఇల్లు. ౪. ఇంటి స్థలము, నివేశన స్థలము. (ఆని.) ౫. వస్త్రము.

**వాసయష్టి.** సం. వి. ఇ. స్త్రీ. పక్షులు రాత్రులు వసించెడి దండెము.

**వాసయోగము.** సం. వి. అ. పుం. పరిమళము గల యొక విధమగు చూర్ణము, గంధపొడి.

**వాసరము.** సం. వి. అ. పుం. న. దినము, దివసము.

పుం. నాగభేదము, ఒకానొక సర్పము.

**వాసవదత్త.** సం. వి. ఆ. స్త్రీ. ౧. సుబంధు కవిచే రచింపఁబడిన వాసవదత్తా చరితమును దెలుపు గ్రంథము. ౨. బహు కథల యందలి కథానాయిక.

**వాసవము.** సం. విణ. (అ. ఈ. అ.) ఇంద్ర సంబంధమైనది.

వి. అ. న. ధనిష్ఠా నక్షత్రము.

**వాసవి.** సం. వి. ఈ. స్త్రీ. వసువు కూతురు, వ్యాసుని తల్లి, సత్యవతి.

**వాసవుఁడు.** సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

**వాససజ్జ.** సం. వి. ఆ. స్త్రీ. = వాసక సజ్జిక.

**వాసస్సు.** సం. వి. స్. న. ౧. వస్త్రము. ౨. శవముమీఁది గుడ్డ. ౩. తెర, యవనిక.

**వాసాగారము.** సం. వి. అ. పుం. న. గర్భగృహము, పడకటిల్లు.

**వాసి.** వి. (క. త. వాసి.) ౧. తారతమ్యము.

క. ఆసేసకు నీసేసకు వాసియడిగె దీవునన్ను...
భారత. ఉద్యో. ౨. ౩౦౮.

క. రామునకు సీత హస్తికి, దోమకుఁగల వాసి ... భా. రా. ఆర. ౨. ౧౦౦.

క. ... బొనొక్కట నింగ వాసు లరయఁగ వలయున్ ... ఆము. ౩. ౪౮.

గీ. జలధి సుధ్యస్థుఁ డాతఁడు జలధి తీర, వాసి యిలఁడును నొకమాటె వాసిగాక, పద్మ నాభుఁడు మగడల పద్మనాభుఁ, డఖిల లోకా ననమున సన్యోన్యసములు.
దశా. ౧. ౪౬.

ద్వి. వారికి వారికి వలసి నంతైనఁ, గోరినఁ గొన్ని తనుకుం దామె రాజులై యెల్లులధికులు నను వాసిలేక, రాయిడింపుచుఁ బ్రతిగ్రహం దాన ముఖ్య, ధర్మంబు లన్నియుఁ దప్పి.
నవ. ౫. ౨౧౪. పా. ౧౪. పం.

౩. ఆధిక్యము.

ద్వి. వాసవునన్నాక వాసుల తోడ, వాసిఁ దప్పింపవా వానికి నెక్కి ...
రం. రా. యు. ౨౮౪. పా. ౧౫. పం.

చ. సలినజ రాణి వాసి కెక్కనాఁడున నుందన చేతి ప్రోదిరా, చిలుకను వాదుకుంగ వితె చెప్పఁగఁదా నిరు మించి యందునా, పలుకులఁ గొంతి వాసిఁగని భావము నంగడు మెచ్చుచున్ సఖాంౘలమున నాదుటెక్కునలి చక్కఁ నవ్వుచు గారవించుచున్.
ప్రభా. ౨. ౯౨.

చ. కుఃబును రూపమున్నగని కూరిమియుం గల దాన నంచునీ, వలన రుక్మిణీ రమణి వాసిఁ దెసంగఁగ ... పారి. ౧. ౪౨.

౪. లాభము.

సీ. వత్తిల్లుగాను వాసి వట్టమేమియు లేక ...
హర. ౨. ౧౩౯.

౫. ప్రసిద్ధి, కీర్తి.

మ. రతికిన్ భాగలికిన్ వినోద కథలన్ బ్రాగల్భ్యమునుం జూపి తెత్పతులం గూరిచి

మాట వాసిఁగను పెద్దల్ గారె మీ వారలా,
చతురత్వం బిటగొంత గానఁబడ నీచం
ద్రానసన్ గూర్చి నన్, బ్రతికింపం గదె
ముద్దుఁగీరమ సుధాబంధురా బవద్గీరమా.
విజ. ౨. ౧౮౪.

ప. ... వాసిగ నీకృతి రత్నమే పహా, మహు
నకు సంతసంబున సమర్పు సేయుదు ...
ఉ. రా. ౧. ౧౮. హం. ౧. ౧౨౫.

౬. గొప్పతనము.

ఉ. ... సం, గ్రామములోన నొక్క నగానికి
వాసి దొలంగ డీశ్వర, త్ముమహిశ మనో
హరుని సాటియై యీశ్వరుఁ డెన్ని
ఫంగులన్. పారి. ౕఠ. ౯.

గీ. కపటములు పన్ని యిపుడు నన్ గన్ను
మొఱఁగి, సుసుగఁ జూచెద వేమఱఁ
జుమ్ము నిన్నుఁ, గనికరము మాన
సంబుసఁ గదియనీక దానిగాఁజేసి యేలుదు
వాసి యుడిపి. హరిశ్చ. ౪. ౧౫౧.

గీ. ... ఇట్టి కొరడవిలోన, గాసిఁజెందంగ
నింటేమి గలిగె వాసి ...
పశా. ౫. ౩౮.

౭. అందము, చక్కఁదనము.

క. ఎడమ కరంబున నే యప్రయ్యేడ మకరముఁ
బట్టి బైటికీడిచివైవన్, పడిభూమికిఁ జూపిన
దై, పడిఁ దొల్లిటి రూపువాసి వాసియొసం
గన్. విజ. ౨. ౪౫.

౮. పరాక్రమము.

గీ. బంటు నెఱుఁగవు గాస మిమ్మంటెఁ గసరె,
దవసరము వచ్చె మముఁ జూడు మనెడు
వారు, నైరి మగధేంద్రు పాలెంబునందు రి
పులు, డాసిచేవాసి యెలజాలు చేసినపుడు.
రా. వి. ౫. ౫.

౯. విధము, పోలిక.

గీ. చచ్చిపోయిన వారికై చాల వగల, దుఃఖ
పడుదురు మఱువాఁడు దొడరిచనరొ, తాము
బ్రదుకుటకేది తథ్యంబు తడవ, వనిత
క్రిందాకు మీఁదాకు వాసి గాదె.
కుచేల. ౧. ౮౦.

౧౦. ఔన్నత్యము.

సీ. ... వాసినాఁ బొడవునా వఱలు నున్న,
తుండు ధర్మంబుగానిది దోఁచు నొకటి ...
ఆం. భా. ౨. ౧౨౩.

౧౧. పరిమితి. (శ. ర.)

వ్యవ. ఈ గ్రంథము నందు ముక్కాలు
వాసి అచ్చుపడినది. (శ. ర.)

విశే. ౧. దీర్ఘము, నిడుపు.

క. నిడుదయనన్ వాసి యనఁగ నెగడును
దీర్ఘంబు ... ఆం. భా. ౩. ౧౮.

౨. ఉత్కృష్టము.

వ్యవ. ఇనికంటె నిదివాసి. (శ. ర.)

౩. స్వస్థము.

వ్యవ. ఇప్పుడు నాకు నొసలు వాసిగా నున్నది.
(శ. ర.)

౪. బాగు.

క. కాశీమహిమము మీచే, వాసిగవిని సంశయ
ములు వాసితిమి ... కూర్మ. ౪. ౯. ౭.

జ: వాసికెక్కు, వాసితనము, వాసిమీఱు.

వాసి. సం. విశే. (న్. నీ. న్.) ఇది కాలవాచక
భిన్నమగు హలదంత సప్తమికి పరముగానున్న
పుడు సమాసమున సప్తమికి అలుక్కు వికల్ప
ముగా వచ్చును.

ఉదా: గ్రామేవాసి, గ్రామవాసి, మొ. నివ
సించువాఁడు, కాపురముండువాఁడు.

వి. ఇ. పుం. స్త్రీ. ౧. బాడిస, వడ్రంగి పని
ముట్టు. ౨. నివాసము, ఉనికి.

**వాసించే.** సం. స. క్రి. ౧. వాసనకట్టు, భావన చేయు.

క. విను కుసుమంబుల వాసించిన నొప్పుని కంపువిడిచి చెంగును సౌరభ్యనిరూఢిందిలలు ... భార. శాం. ౫. ౪౧౮.

౨. పరిమళింపఁజేయు.

సీ. హిమధామధామ మిశ్రములగు శశికాంతి జలములు వాసించి జలకమార్చి ... కు. సం. ౫. ౬౨౪.

౩. నిలుపుకొను, జరపుకొను.

క. భూసుర వేషముఁదాల్చిన, వాసవునీక్షించి యొగురు వచ్చినతులతోఁ, జేసి పదాబ్జము లంటుచు, వాసించెసుశర్మ, తనదు వ్రత ధర్మంబున్. శేష. ౧. ౧౨౭.

అ. క్రి. ౧. భావనయగు.

క. వాసించి పరిమళించునడవి పసుపు నునుఁ బూఁతయు ... కాశీ. ౩. ౩౬.

౨. పరిమళించు.

ద్వి. వాసించుబాగాలు వడినాకుమడుపు,లాసతీ జనమణి కందిచ్చెనొకతె ...
రం. రా. బాల. ౬౪. పా. ౧౭. పం.

**వాసికాఁడు.** వి. ఉన్నతుఁడు.

ఉ. వారనిమంచుపైఁ బొదివి వచ్చినపోయిన చొప్పుమాసినన్, భూరినఖాగ్ర ముక్తములు పోల్పగుము త్తెపుఁ జాలువెంటఁద, న్వారణు లేఁగి కాంతురుహతద్విపకేసరి వాదవేళలన్, దారొక వాసికాంద్రవలెఁ దక్కఁగనూ ల్కొన జేయుతానముల్.
పి. శకుం. ౨. ౧౦౫.

**వాసికె(కిని)క్కు.** అ. క్రి. (వాసికిన్ + ఎక్కు) ఖ్యాతినొందు, ప్రసిద్ధివడయు.

సీ. వేదశాస్త్రపురాణ విద్యానిరూఢులై వాసి కెక్కినతోడివారిఁ దలఁచి ...
కాశీ. ౪. ౯౧.

౨. పెంపుమీఱు, అతిశయించు.

ఉ. వాసికెక్కుకూర్మి జనవల్లభుఁ డిచ్చెను వైరసేనికి ... నైష. ౬. ౯౨.

ఉ. వెన్నెల కుప్పసంబిడిన వింతవిలాసము వాసి కెక్కఁగా ... నైష. ౬. ౫౦.

**వాసిత.** సం. వి. ఆ. స్త్రీ. = వాశిత.

**వాసితనము.** వి. (వాసి + తనము) గొప్పతనము, ఘనత.

గీ. పలుకులేటికి దావీర పత్నియేని, మీఁశక్తిఁ దవి తనకు ప్రాణేశుఁడైన, మఘవు సటఁబంపి సత్యభామా విశేషము, వలన సురలంగఁ గొనుటెపో వాసితనము. పారి. ౪. ౫౮.

**వాసితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. సుష్ఠు సన గలదిగాఁ జేయఁబడినది. ౨. నానఁబెట్టఁ బడినది. ౩. తాలింపు పెట్టఁబడినది. ౪. గుస్తులు ధరించినది. ౫. కాపుర ముండునట్లు చేయఁ బడినది. ౬. సంపన్నమైనది, కలిగినది. ౭. ప్రఖ్యాతమైనది, ప్రసిద్ధికెక్కినది.

వి. అ. న. ౧. పక్షులధ్వని, పక్షికూఁత. ౨. జ్ఞానము.

(పురాకృత సుకృత దుష్కృతములవలనఁ దనం తనే మనస్సునంటిన సుఖదుఃఖ కారణ మయిన సంస్కార విశేషము.)

**వాసిమీఱు.** అ. క్రి. (వాసి + మీఱు) ప్రసిద్ధి వడయు.

క. తాతకు మనుమఁడవై పోల, మేతరి తెగ లంకువాని మీఱితనరునీ, కేతెఱఁగునఁ గొదు గకసెలి, నాతిం దమి నిగుడదాకొనం దగ వగునే. అ. రా. ఆర. ౭౦.

**వాసిల్లు.** సం. అ. క్రి. పరిమళించే.

ద్వి. చెలువార వాసిల్లు శీతలోదకము ...
పండితా. దీక్షా. ౪౨. పా.

**వా(శి)సిష్ఠము.** సం. విణ. (అ. ఈ. అ.) వసిష్ఠుని సంబంధమైనది, వసిష్ఠునిచే రచింపఁబడినది.

**వా(శి)సిష్ఠి.** సం. వి. ఈ. స్త్రీ. గోమతీనది, గంగానది, యనునదులలో నొకటి.

**వా(శి)సిష్ఠుఁడు.** సం. వి. అ. పుం. వసిష్ఠుని సంతతివాఁడు, వసిష్ఠగోత్రుఁడు.

**వాసుకి.** సం. వి. ఇ. పుం. సర్పముల రాజు, శేషాహి సోదరుఁడు.

**వాసుకేయుఁడు.** సం. వి. అ. పుం. = వాసుకి. (విల్యమ్సు.)

**వాసుదేవుఁడు.** సం. వి. అ. పుం. ౧. వసుదేవుని సంతతివాఁడు. ౨. కృష్ణుఁడు.

**వాసుర.** సం. వి. ఆ. స్త్రీ. ౧. భూమి. ౨. రాత్రి. ౩. స్త్రీ, ఆఁడుది. ౪. ఆఁడేనుఁగు.

**వాసువు.** సం. వి. ఉ. పుం. ౧. జీవుఁడు. ౨. విశ్వాంతర్యామి, పరమాత్మ. ౩. విష్ణువు. ౪. పునర్వసు నక్షత్రము.

ఊ. స్త్రీ. (నాటక) కన్యక, చిన్నది.

**వా(సియ)సె.** వి. (సం. వంశః) పిల్లనగ్రోవి.

మ. ఎలమిన్ దుమ్మెద మ్రోతవాసె రవలై యింపొంగ మత్తిల్లు కోఁ, వెల సీకారులు కూఁక పాట లమరన్ వేవేడ్కతో నాలి గ్రాడ్పుల పేరంగల నట్టువల్ గఱప, గోవుల్ చూపులేఁదీవ పాత్రల కయ్యామిని పూవుముత్తెపుసరుల్ దాల్పంగ నిచ్చెం గడున్. యయా. ౪. ౧౨.

జ: వాసెకాఁడు, వాసెగ్రోలు.

**వాసెకాఁడు.** వి. (వాసె + కాఁడు) ఒకానొక విధమైన వాద్యమును వాయించువాఁడు.

మద్దెల కానికి ౫౨ వాసెకానికి ౫౨ పాడేవారికి ఒకొ్కకడ్లకు ౫౨. ౖ. శా. శ. ౧౧౩౫.

E. P. Ind. Vol. 5. No. 17.

**వాసెగ్రోలు.** వి. (వాసె + గ్రోలు) పిల్లనగ్రోవి. మురళి.

వ. ... మృదంగం బుపాంగంబు ... ఉరుము కిన్నెర సన్నగాళె వీణాముఖ వీణె వాసె గ్రోలు ... లోనగు నసంఖ్యాత వాదిత్ర త్రితయ పరంపరలు ... ఆము. ౪. ౩౫.

**వాసెన.** వి. కుండమూతి మూయఁ గట్టిన గుడ్డ.

సీ. ఆజ్యతైల ఘటంబు లన్నియు వాసెనల్ గట్టియందనిచోట నట్టినుంచు ...,
శుక. ౩. ౩౪౫.

ద్వి. వలిపంపుఁ బావడ వాసెనగట్టి, పాలుపారఁగా శిరమ్మునఁ బొందుపఱచి ...
ద్వి. పరమ. ౩. ౨౫౫.
పా. ౨. పం. చి. ని.

ఉ. ... వాసెనకట్టుగట్టి నిడువారిక గస్తురి బొట్టు పెట్టి ... పారి. ౧. ౯౯.

జ: వాసెనకట్టు, వాసెన కుడుము.

**వాసెనకట్టు.** వి. (వాసెన + కట్టు) వాసెన గుడ్డ కట్టువలె తలకు కట్టెడు కట్టు.

ఉ. మాసిన చీరగట్టికొని మానముతోడ నిరస్త భూషయై, వాసెన కట్టు గట్టి ...
పారి. ౧. ౯౯.

సీ. బెడగుఁ జూపెడు నూనె ముడిలోను గానంటఁగట్టిన వాసెనకట్టుతోడ ...
శుక. ౪. ౩౮.

సీ. తలచూపఁ బాసెనందఱిలోన దనకన్నకై వడి వాసెన కట్టుకట్టి ...
సారంగ. ౨. ౧౫౦.

**వాసెనకుడుము.** వి. (వాసెన + కుడుము) ఇడ్డెన, ఒకవిధమగు పిండివంట. (శ. ర., బ్రౌ. వా.)

**వాస్తవము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. యథార్థము, నిజమైనది. ౨. స్థిరపరుపఁబడినది, నిశ్చితమైనది.

వి. అ. న. నిశ్చితమైన పదార్థము, సత్య పదార్థము.

**వాస్తవికము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. యథార్థమైనది, నిజమైనది.

౨. సిద్ధాంతీకరింపఁబడినది, నిజము.

**వాస్తవ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. నివసించునది. ౨. నివాసయోగ్యము, నివసింపఁ దగినది.

వి. అ. న. ౧. నివసింపఁ దగిన చోటు. ౨. వసతి, నివాసము.

**వాస్తవ్యుఁడు.** సం. వి. అ. పుం. నివాసి, కాపురముండు మనుష్యుఁడు.

విణ. (అ. ఆ. అ.) నివసించువాఁడు.

**వాస్తుసూక్తము.** సం. వి. అ. న. ఒకజాతి కూరాకు, చక్రవర్తము. కీ. (శ. ర.)

**వాస్తుయాగము.** సం. వి. అ. పుం. ఇంటికిఁ బునాది (మూలబంధము) కట్టు సమయమునఁ జేయఁదగిన హోమాదికము.

**వాస్తువు.** సం. వి. ఉ. పుం. న. ౧. ఇల్లు మొదలగునవి కట్టఁ దగినచోటు, నివేశన స్థలము. ౨. ఇల్లు, వాసస్థానము.

**వాస్తుసంశమనము.** సం. వి. అ. న. ఇంటికిఁ బునాది వేయునపుడు, విశేషించి గృహ ప్రవేశము చేయునపుడును చేయఁబడెడి శాంతి కర్మము.

**వాస్తేయము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. నివసింపఁ దగినది, వాసయోగ్యమైనది. ౨. వస్తిసంబంధి, పొత్తి కడుపునకు సంబంధించినది.

**వాస్తోష్పతి.** సం. వి. ఇ. పుం. ౧. వేదమందు నివేశన స్థలమున కధిష్ఠాన దేవతగా నెంచఁబడిన దేవత. ౨. ఇంద్రుఁడు.

**వాస్త్రము.** సం. విణ. (అ. ఆ. అ.) వస్త్ర నిర్మితము, వస్త్రముతోఁ జేయఁబడినది.

వి. అ. పుం. గుడ్డ కప్పు వేయఁబడిన బండి.

**వాస్ప(బాష్ప)యము.** సం. వి. అ. పుం. నాగకేశర వృక్షము.

**వాహకుఁడు.** సం. వి. అ. పుం. ౧. బరువు మోయువాఁడు, భారవాహకుఁడు. ౨. రథము. గుఱ్ఱపుబండి తోలువాఁడు, సారథి. ౩. గుఱ్ఱపు వాఁడు.

**వాహద్విషత్తు.** సం. వి. త్. పుం. మహిషము, దున్నపోతు.

**వాహద్విషము.** సం. వి. ష్. పుం. వాహద్విషత్తు, దున్నపోతు.

**వాహనము.** సం. వి. అ. న. ౧. మోయుట, తీసికొని పోవుట. ౨. గుఱ్ఱము మొదలగు వానిని తోలుట, నడపుట. ౩. ఎక్కఁ దగిన యేనుఁగు మున్నగునది. ౪. యానము, బండి మొ.

**వాహము.** సం. విణ. (అ. ఆ. అ.) (సమాసాంతమున) మోయునది.

ఉదా. అంబు వాహము.

వి. అ. పుం. ౧. మోయుట, తీసికొనిపోవుట. ౨. బండి మొ. లాగెడి జంతువు, బరువు మోయు జంతువు. ౩. గుఱ్ఱము. ౪. ఎద్దు. ౫. దున్నపోతు. ౬. యానము, బండి మున్నగు

నది. ౩. బాహువు. ౪. వాయువు. ౫. నాలుగు భారములకు సరియగు పరిమాణము.

**వాహశ్రేష్ఠము.** సం. వి. అ. పుం. అశ్వము, గుఱ్ఱము.

**లోహాసము.** సం. వి. అ. పుం. ౧. ఏఱుమున్నగు జలప్రవాహముల యుత్పత్తి స్థానము. ౨. అజగరము, కొండచిలువ.

**వాహి.** వి. ప్రసిద్ధి.

గీ. గంగకన్నను గడు వృద్ధగంగ యనెడు,
వాహిని వహించు నా పుణ్యవాహినిం గని,
పిసాసులం జెలంగి తత్తీర్థమున మునింగి,
మునివరేణ్యులు సమ్మోదమునకు బొంగి ...
ఘటికా. ౨. ౧౬౪.

**వాహి.** సం. విణ. (న్. నీ. న్.) (సమాసాంతమున) మోయువాఁడు, తీసికొని పోవువాఁడు.

వి. న్. పుం. రథము, తేరు.

**వాహీకము.** సం. వి. అ. పుం. ౧. ఢక్క. (ఢంకా.) ౨. ఎడ్లబండి.

**వాహీకుఁడు.** సం. వి. అ. పుం. బరువుమోయు వాఁడు, భారవాహకుఁడు.

**వాహిత్యము.** సం. వి. అ. న. పెద్దబరువు, మహా భారము.

**వాహిత్థము.** సం. వి. అ. న. ఏనుగు కుంభ స్థలము యొక్క క్రిందిభాగము.

**వాహిని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. సేన. ౨. సేనా విశేషము, ఎనుబది యొక్క రథము, ఎనుబది యొక్క ఏనుఁగులును, ఇన్నూటనలుబది మూఁడు గుఱ్ఱములును, నన్నూటయేఁబది కాల్బలమును గలసేన. ౩. నది, ఏఱు.

**వాహినీనివేశము.** సం. వి. అ. పుం. సేనదిగిన చోటు, శిబిరము.

**వాహినీపతి.** సం. వి. ఇ. పుం. ౧. సేనానాయకుఁడు. ౨. సముద్రుఁడు.

**వాహుఁడు.** సం. వి. అ. పుం. బరువు మోయు వాఁడు.

**వాహ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) వహింపఁదగినది, మోయఁదగినది.

వి. అ. పుం. బరువుమోసెడి జంతువు. గుఱ్ఱము, ఎద్దు. మొ. న. బండి

**వాహ్యాళి.** సం. స్త్రీ. ఈ యర్థమున సం. లోప్రయోగ మున్నట్లు తోఁచదు.

గీ. సముచితానల్ప పరివార సహితుఁ డగుచు,
నకని నాథసుతుండు వాహ్యాళి వెడలె ...
నైష. ౧. ౫౬.

ఉ. పాలును నీరు వేఱు పరుపంగల మావుల వేదవీధి వాహ్యాళి యొనర్చునే యలికు లాలక ... రామా. ౧. ౫.

# వి

**వి.** స. "అవి" శబ్దముయొక్క ఆద్యక్షరము లోపింపఁగా మిగిలిన రూపము, సంబంధమును దెలుపునపుడు అనుప్రయుక్తమగు.

సీ. వారివ ధమ్మిల్ల భారావకలిత దివ్యామోద నవపుష్పదామములయు ...
భార. ఆది. ౩. ౧౫౬.

అవ. ౧. భూతార్థక మధ్యమ పురుషైకవచన ప్రత్యయము.

సీ. ఎంచిరంటివి గాని యీసారి గట్టిగాఁ దెగుఁ గార్యమను వార్త దెలుపవైతి ...
విజ. వి. పీఠి. ౧. ౪౧.

౨. ప్రథమాంతమగు యుష్మదర్థ విశేషణము లకు ఏకవచనమునఁ బ్రాయికముగా వచ్చు నాగమము.

మ. ... నిన్నిట్లుఁగా, స్తవముల్ సేయుద్రుతుల్ సమస్త జగదంతర్యామివి నీవ ...
మనుచ. ౨. ౭౫.

౩. అనుహాదర్థమునందు వర్తమానమున ఉన్నానుబంధమునీఁది ప్రథమపురుష బహువచన రువర్ణకమునకు ఆదేశముగా వచ్చు ప్రత్యయము.

ఉదా: చిలుకలు పలుకుచున్నవి.

**వి.** సం. వి. ఇ. పుం. ౧. పక్షి. ౨. గుఱ్ఱము. ౩. యాత్రికుఁడు, బాటసారి. ౪. కశ్యము.

అవ్య. ౧. విశ్లేషము. ౨. అతిశయము. ౩. అత్యంతము. ౪. ఇంచుక. ౫. వ్యతిరేకము, మున్నగు నర్థములనిచ్చును.

ఉదా: ౧. వియోగము. ౨. వికీర్ణము. ౩. విస్పష్టము. ౪. విలోకనము. ౫. విస్మృతి, విక్రయము. మొ.

**వింఖము.** సం. వి. అ. పుం. గుఱ్ఱపుడెక్క.

**వింగడము.** విశే. (సం. విశంకట) (క. వింగడవు.) ౧. విశాలము, విస్తృతము.

ఉ. వింగడమైన యొక్క వనవీథిఁ గనుంగొనె నీడ నున్నపున్, రంగుటరంగుపచ్చలయ రంగయి పో వెలిదమ్మిబావికిన్, జెంగట నుల్లసిల్లు తులసీ వన సీమ శుభాంగి నొక్క బాలం ...
ఆము. ౫. ౪.

౨. సుందరము.

సీ. వింగడంబైనట్టి ముంగిట నెలకొన్న బృందావనికి ముగ్గు పెట్టుదాన ...ఆము. ౪. ౫౦.

౩. విపరీతము.

క. అంగజహరుని ప్రసాదము, నం గలుగుచు వచ్చె సుతుఁడు నాఁడాదిగ మా, వంగడమున నదియిప్పుడు, వింగడమై కూఁతురుద్భవించె న్నాకున్.
విజ. వి. ౨. ౬.

క. చెంగటికిఁజేరి యని గో, యంగన నీవున్న వితము నరసిన మాకున్, నింగడమైనది యున్న తెఱం గెఱిఁగించెదవో మమ్ము తాపిడిరొదవో.
భోజసుతా. ౩. ౬౪.

౪. వేఱు, భిన్నము.

(చూ. వింగడించు.)

జ: వింగడించు, వింగళింపు.

**వింగడి(ళి)ంచు.** స. క్రి. (√ వింగడము.) (క. వింగడిసు.) వేఱుపఱచు.

చ. అమరవరక్షమామరవరాంచిత వృత్తులు వింగడించి స్వేర్వమరఁగ నాసురూప వినుతాఖిల సద్గుణపాత్రతానిధిన్, విమల సుగంధమాల్యవినివేశవిభూషితుఁజేసి ...
హ. న. ౨. ౧౧౩.

అ. క్రి. దుముకు.

చ. విడిచిన యంత మల్లులటు వెన్కకుఁ జెంగున వింగడింపుచున్, బడిబడి మీస లంటి మెలిఁ బట్టుచు దండలనిల్చి కమ్ముచున్, బిడికిళులూది పట్టుకొని బిట్టుగఁ గేకలు వేయుచున్ బొమల్, ముడిగొనఁ బండ్లు గీటుచు సముద్ధతిచేఁ జెయిసోఁకి మీటుచున్.
ప్రబంధ. ౧. ౬౪.

ఆ. వింగళించి యాటవెలఁదిచందంబున, కోపులందు మీఱి యేపుతోన, మిత్త్రిగణము లతివిచిత్రితంబై కొన, దైవగణము లెదురఁ దారసించె.
ప్రబంధ. ౭౯౧.

**వింగళింపు.** వి. (√ వింగడించు) మల్లబంధ విశేషము.

వ. ... దండ నిల్కడ కదలుగుటుకలయు మెలకువ వింగళింపు ... ప్రబంధ. ౭౬.

వ. ... వింగళింపు దశావదిశపాదవీక్షణము నయనవీక్షణము ... మల్లుపు. ౩. ౬౯.

**వించే.** అ. క్రి. (√విను¹) వినవచ్చు, వసఁ బడు.

క. ఖలుఁడీ దుర్యోధనుఁ డొగ్గులతోడఁ యుద్ధ విల్లె గోమాయురుతంబులు వించె దుర్ని మిత్తంబులు పెక్కులువుట్టె నీని పుట్టిన వేళన్. భార. సభా. ౨. ౧౭౮.

క. చెలువుగఁ బుష్పవృష్టి గురిసెన్ సహదేవు పయిన్ దివంబునన్, వెలయఁగ సాధు వాదములు వించె సభాసదులెల్ల విస్మయా, కులిత మనస్కులైరి ... భార. సభా. ౨. ౩౧.

**వింజేకోన.** వి. (వింజేము + కోన) వింధ్య పర్వతము యొక్క లోయ.

సీ. గానిసారము రాజ కలశంబు బిడ్డఁడు క్రొవ్వడంచిన వింజకోన లెల్ల ... ఇందు. ౨. ౫౦.

**వింజేము.** వి. (సం. వింధ్యః) వింధ్య పర్వతము.

క. ఆ కొలువువారు గరమ చ్చలాకృతి నొక పలుకులేక యుండఱు వింజం, బాఁకిడిన కరణి నవళము, దాకొరిత చిత్త వృత్తులై యుండంగన్. భార. ఉద్యో. ౩. ౨౫౫.

వ. ... అది ... తన పలుకులా స్థానంబెల్ల సావధానంబగుచు వింజేమోఁకిడి నట్లు వినుచుండ న న్నరేంద్ర చంద్రునకు నిట్లని చెప్పం దొడంగె. కళా. ౫. ౯.

క. అర్థశముఖుఁ డట్లొంగు విపద్దశ పరికించి తిచ్చపడి మంత్రులు ద్వారెద్దియును బల్కకుండిరి, పెద్ద తడవు వింజ్రె మోఁకవెట్టిన భంగిన్ ... భా. రా. యు. ౭. ౨౮.

వ. ... వింజ్రె మోఁకిడిన భంగి నూరకుండిన ... నైష. ౪. ౧౬.

మత్తకోకిల. ఉగ్రశంకర భక్తవత్సల సోమ యూామథు సేమలో, న గ్రపూజ లొనర్తు నెవ్వని కొన తిమ్మని పల్కుచో, నుగ్ర హంబునినా సుమేరుధనుర్ధరుండు సమస్త దేవాగ్రగణ్యులు వింజ్రె మోఁకిడి నట్లు నిల్వననుఁగనుఁ. శరా. ౧౦. ౧౦.

**వింజామర(ము).** వి. వి. (వెల్ల + చామర. త. వెణ్సామరై.) తెల్లని చామరము.

సీ. గీ. ... భార్యవింజామరిడ నొప్పపాండ్యుఁ గనితొ ... ఆము. ౪. ౫౮.

వ. ... గంగా యమునలు వింజామరలిడ ... హర. ౪. ౮౯.

సీ. వింజామరలు వైచు వేల్పుఁబూఁబోడుల కంకణ క్రేంకార కలనకంబె ... ఉ. రా. ౭. ౨౯౧.

సీ. చామరం బొప్ప వింజామర యనఁగను ... ఆం. భా. ౨. ౧౯౩.

క. గొడుగులు వింజామరములుఁ, బడగలునుం దాలవృంత పట వాసములున్, మృదుని కొసంగిన ధనుద్యుఁడు, పుడమిని వైకాత పత్రముగఁ బావించున్. కాశీ. ౭. ౧౨౪.

సీ. కంకణంబులు మ్రోయఁగా నీళయును ధరారమణియు వాజామరములు వైవ ... దశా. ౩. ౧౪౪.

**వింజామరక్రోవి.** వి. (వింజామర + క్రోవి) ఒక విధమగు బాణసంచు.

మ. ... ద్యుమణింబోలిన పంజాలుం బగలు వత్తుల్ మంచి యాకాశ బాణము వింజామర క్రోవులుం బరుసులున్ బ్రహ్మాండము న్నిండఁగన్. బహు. ౪. ౭౬.

క. పంజాలును పగలువత్తుల, పుంజము లాకాశ బాణములుచే బిరుసుల్, వింజామరక్రోవుల చ్చాలుం కెలువు వహించె లోక లోచనము లకున్ ... రా. వి. ౫. ౬౧.

**వింజామరము.** సం. వి. అ. న. కంటి తెలుపు.

**వింజలి.** వి. మత్స్యవిశేషము. (శ. ర., బ్రౌ.)

**వింజోవి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. పంక్తి, వరుస.

**వింట.** వి. (√ విను¹) వినుట.

గీ. ... ఇట్టి యన్యాయమే జాతి నెన్నఁడైనఁ
దొంటికవులంగూఁ జెప్పఁగా వింటగలదె ...
సారంగ. ౨. ౨౩౮.

**వింటాలము.** వి. నల్లజంధ విశేషము, ముప్పది రెండు విన్యాసములలో నొకటి.

సీ. వింటాలము పటమ్ము పెట్లాగు పాటమ్ము
డొక్కర ముత్తర డొక్కరము ...
ఆం. భా. ౨. ౨౦౯.

వ. ... కక్కర్ కొక్కర్ డొక్కరముత్తెర ...
కొకొ నిల్కడయు నృసింహంబును నను
ముప్పదిరెండు విన్యాసంబుల నామంబు
పరీక్షించి ... హంస. ౧. ౨౦౬.

వ. ... గళకత్తెర నృసింహంబును కొంకె
నిల్కడయు వింటాలంబును విశద
పటచి ... మల్లపు. ౩. ౬౯.

**వింటికోల.** వి. (విల్లు + కోల) రాళ్లుపని వాని ధను రాకారమగు సాధన విశేషము. (శ. ర.)

**వింటిజోదు.** వి. (విల్లు + జోదు) ధానుష్కుఁడు, విలుకాఁడు.

క. వలినంప కయ్యమప్పుడు, సాలఁజూక బల
మేచి వింటిజోదులు పెలుచన్, నలుపఁగ
నెచ్చెలువమునకు, వెలయఁగ బెల్లార్చిర
పుడు వేలుపు లెల్లన్ ... వీర. ౪. ౧౫౨.

**వింటితెర్వరి.** వి. (√ విను) దేవత, గగన చరుఁడు, వేలుపు.

సీ. వింటితెర్వరి మేటి వెల్ల గ్రాలను నిక్కు
చెవుల నీలని నెక్కి చెలఁగు లెల్ల ...
ఉ. రా. ౫. ౨౦౮.

**వింటిపట్టు = వింటిపెట్టు.** వి. (విల్లు + పట్టు) ధన్వంతరము. నాలుగు మూరలు కొలఁది గల నేల. (శ. ర.)

**వింటిపెట్టు = వింటిపట్టు.** అమ్ము వేటు నేల.

ద్వి. పిఱిఁదికి నొకవింటి పెట్టోసరించి, అఱ
చేతఁ జఱచె బిట్ట సురారి శిరము ...
రం. రా. ఉ. ౧౪. పా. ౪. సం.

**వింటిబ(బ్ర)ద్ద.** వి. (√ విల్లు.) ౧. ధనస్సు.

ఆ. వెత్తిచెఱకుఁ గోల వింటిబద్దకు మల్లె, తీవ
నారిఁ జేసి భావభవుఁడు, పఱచు పువ్వుఁ
బోండ్ల పెఱ చోటులన్ మెత్తి, విరుల
తూఁపులేని మగులు కొలిపె. వైజ. ౨. ౩౫.

౨. వింటిరూపమగు వెదురు శలిక.

సీ. తనవింటిబ్రద్దఁ గట్టె నటంచు నగ్రజు
మూలించినట్టి సాధుని గాంచి ...
పరా. ౧. ౫౪

**వింటిరాసి.** వి. (విల్లు + రాసి) ధనూరాశి.

**వింటివాఁడు.** విం. (విల్లు + వాఁడు. త. విల్లాఁ) ధానుష్కుఁడు, విలుకాఁడు.

క. మనవీటన కొద యయ్యస్త్రమునకు నరిదింటి
వానిఁ జూడఁగ లోకంబున నెందులేమి
చెల్లంబు ... భార. ఉద్యో. ౨. ౧౬౪.

గీ. ఇంత ప్రొద్దు కిరీటి కట్టెదుర నిలువ, వెఱక
నున్న ప్లు ద్రోణుండ వింటివాఁడు ...
భారా. విరా. ౫. ౧౩౬.

**విండ్లమ్ములాట.** వి. (విల్లు + అమ్ము + ఆట) బాలక్రీడా విశేషము.

సీ. ... ఒడ్డు, పసుపునెట్టాడుగాయ విండ్లమ్ము
లాటలు పులిజూదములు కట్టె పుట్ట
చెండ్లు ... హంస. ౩. ౧౪౬.

**విండ్లవారు.** వి. (√ విల్లు) ధనుర్ధారులు.

వ. ... అరదంబులకుం దురంగంబులకుఁ దురం
గంబులకు వింద్లవారు వింద్లవారికి నర్థాయు
ధులు నడ్డంబగు తెఱంగున నిలువ ...
భార. భీష్మ. ౧. ౧౦౩.

**వింత.** వి. ౧. సొగసు, అందము.

మ. ... కలపం బెంతయు వింతగా నలఁది
చెంగల్వ ల్నెత్తిన్ముడువవే, సరిఁ గీల్కొల్పి.
పారి. ౨. ౧౪.

౨. అద్భుతకార్యము.

గీ. ... దొంతరగ నన్ను నెత్తివేల్పు వింత
లెల్ల ... నీలా. ౧. ౧౦౧.

౩. అపూర్వ విషయము.

ఉ. వింటిగె తమ్ములార యొక్క వింత వినం
బడె ... ఉ. రా. ౨. ౪.

ఉ. ఒక్కతె గెడ్డప్రక్క వినయోక్తుల
వింతలఁ గౌఁగిలింతలన్, జిక్కిలి గింతల
ల్మెరసి జంత తనంబునఁ బ్రొద్దుఁ
బుచ్చుచో ... శుక. ౨. ౩౩౬.

౪. చమత్కారము.

సీ. ఘన భర్తృహరి శతక త్రితయంబునఁ బ్రతి
శ్లోకంబునను వింతఁ జూపుసొబగు ...
దశా. ౧. ౪౩.

గీ. విలసదుపమాద్యలంక్రియల్ వింతఁ దెలుప...
దశా. ౧. ౧౧.

౫. ఆశ్చర్యము.

శా. అంతం గాంచిరి వారి చూడ్కికిన వద్య
ప్రోద్యదుద్యానముల్, వింతల్ సేయుచు
నుండఁగా ... వాల్మీకి. ౨. ౨౨.

౬. వినోదము.

క. ఇవ్విధమున నవ్వేలుపు, జవ్వనియును నవ్వి
భుండు సరివలపులతో, నివ్వటిలం బువ్విలు
కుని, యవ్వింతలఁ గొంతకాల మట్లు
మెలఁగఁగాన్. కవిరా. ౫. ౨౩౭.

వి. ౧. అపూర్వము, క్రొత్తది.

సీ. వెడవెడ నూఁగారి వింతయై యేర్పడం గేరని
వళులలో నారు నిగుడ ...
భార. విరా. ౧. ౨౪౫.

ఉ. వింతయె మాగధుండు మును నీఁడును వాని
సుతుండ కాఁడె ... దశకు. ౧౨. ౫౧.

ఉ. వింత మాంసమున్, గావలెనంచు వచ్చి
తిని ... దశా. ౧. ౨౭౦.

చ. ... భయంబునఁ బాఱితి పెక్కుమార్లు
పంచిన మధురాపురిన్ విడిచి సాగర
మధ్యమునందు డాఁగవే, వనరుహనాభ
నీ బిరుసువాఁడి తనంబును నాకు వింతయే.
భాగ. ౧౦. ఉ. ౪౨౯.

౨. అన్యుఁడు.

సీ. విని కోసలేంద్రుండు కనుకని వీరలఁ
గలయ నొప్పింపఁగ వలవ గుడుగు ...

గీ. వింత లెవ్వరు మనకింక సిరి నీవు, భీమ
వేత్రహస్తుల నడ్డపెట్ట నేల ...
భా. రా. యు. ౨౩౨౭.

సీ. ... దాఁచ, నేటికిఁ జెప్పుమా యే నంత
దాననె దయలేదొ నామీఁద ...
దశా. ౨. ౩౬౫.

౩. ఆశ్చర్యకరము.

చ. వెలవెలఁ బాఱు దీవియలు వింతరుచిం గలి
గించు తమ్ములు ... విక్ర. ౨. ౧౦౬.

ఉ. వెన్నెలకుప్పనం బడిన వింత విలాసము
వాని కెక్కఁగా ... నైష. ౬. ౫౦.

మ. నరలోకంబుఁట సిద్ధసాధ్యఫణిగంధర్వాం
గనాసేవనా, పరిపాకం బఁట యొంత వింత
యనుచుం బల్మాఱు వీక్షించి ...
వసు. ౪. ౬౯.

౪. అరుదు.

ఉ. గీణియు మట్టుటల్ మిగుల వింతలు
పెంపుడు చిల్కబోధతో, రాణ దలిర్పఁ
బల్కుట గరం బపు రూపము ...
కళా. ౬. ౨౧౪.

ఉ. ఏ నొక వింతయే రఘుకులేశ్వర యాదిమ
విష్ణుమూర్తివై, యీ నిఖిలావనీతలము
నేలెడునిన్ గనుఁగొంటి ...
సుద. ౧. ౯౯.

జ: వింతకజ్జేము, వింతకాఁడు, వింతతనము,
వింతరాలు, వింతవాఁడు.

**వింతకజ్జేము.** వి. (వింత + కజ్జేము) పరిహాసము నకుఁగాను అభ్యక్షువస్తువులతోఁ దయారు చేయు అపూపము.

గీ. సఖులు వడ్డించు వింతకజ్జముల మర్మ,
మెఱిఁగి త్రోయుచు ... దశా. ౪. ౨౪౭.

**వింతకాఁడు.** వి. (వింత + కాఁడు) ఆశ్చర్యకరుఁడు.

క. నాపుడు న వ్వేళ్యాంబిక, యా పటానిం
జూచి పిలువ నంపఁగ లేమ, యొయ్యా వింత
కాఁడు తా నెటఁ, బోవునో తా వెలుఁగ
మెటకుఁ బోదుమటన్నన్. వైజ. ౪. ౧౪.

**వింతతనము.** వి. (వింత + తనము) భేదము, అన్యత్వము.

గీ. పుట్లి నింటికేను బోయి యొక్కించుక,
యూఁతడిల్లి. వత్తు ముదనీవు వింత తనము
లేక నీపనకుఁ బ్రియము న్యాయముగా
నొనర్చి మనుము నెమ్మి.
హరి. పూ. ౧. ౧౪౦.

**వింతరాలు.** విశే. (వింత + ఆలు) అన్యురాలు.

సీ. ముంగొంగుఁ బసిఁడిపైఁ వూల్గు పుణ్యాం
బుల నిల్లఁగుడు గట్టి వింత రాండ్రు ...
భాగ. ౬. ౨౫౫.

**వింతవాఁడు.** స. (వింత + వాఁడు) ౧. క్రొత్త వాఁడు.

వ. కీ యుత్తమవిలాసిని నిన్నితర వారవని
తలయట్ల నత్యవాదిఁగాఁ దలంప నంత
వింతవాఁడనే ... కళా. ౪. ౨౫.

౨. అన్యుఁడు, పరుఁడు.

గీ. ఇవ్విధంబునఁ జనుదెంచి యిగురుబోఁడి,
విభునిఁ దన వెన్కనుంచుక వింతవారు,
లేరుగా యంచు సదనంబుఁ బాఱఁ జూచి,
యలబలము లేని నిజమందిరాంగణమున.
కళాం. ౩. ౧౦౦.

గీ. ... వింతవారలు లేరుగా యింతనంత,
సువిద మన వారలే కదా యున్నవారు ...
నైష. ౪. ౧౪.

**విందు.** వి. ౧. చుట్టము, బంధువు.

వ. ఆ సైనికోత్తములు సాత్యకిం గడచి
యాచార్యుం గనిన.

క. విందులఁగనిఁ నట్లాతఁడు, మందస్మితుఁడై
యొదిర్చి మార్గణజాల, స్పందితులఁ జేసి
వారల ... భార. ద్రో. ౪. ౨౪౫.

క. విందులకును బ్రహ్మముఖా, నందంబై భక్త
గణమునకు దైవతమై, మందులకు బాలుఁ
డగు హరి ... భాగ. ౧౦. పూ. ౪౬౨.

గీ. అన్నఁగంటిఁ దండ్రినిఁగంటి నయ్యఁగంటి,
నిందురావయ్య విందులు విందు అనుచు ...
హరి. పూ. ౫. ౧౯౦.

సీ. విందులు విందులు విందు లంచును బిలి
తెంచి ... దశకు. ౭. ౧౫౪.

క. ఎందుండి యేమి పనికై, యొందుల కరిగ
దవు భూసురేశ్వర క్రియం, బొంతితో నినుఁ
గని తగిరెదరు; విందవయితే నాకు నీవు
విధముం జెప్పుమా. భార. శాం. ౩. ౪౪౯.

౨. అతిథి.

క. భూసురశైత్యవతుసుముఖ,శాసన మాయింటి
విందవైతివి ... మనుచ. ౨. ౪౮.

సీ. ఎడపక గీముస కేతెంచు విందుల కలిమి
పల్లవులును సొమ్ములు నొసంగు ...
నీలా. ౧. ౪౯.

గీ. ... విందన నతిథి నామమై వెలయు
చుండు ... ఆం. భా. ౨. ౧౬౨.

3. బంధు భోజనము.

చ. ... నేడు సడంకుల గొబ్బునంగడుఁ,
నెగడెడు విందు గల్గెనని నెమ్మదిమెచ్చుచు
వచ్చెఁ జెచ్చెరన్ ... కళా. ౩. ౧౯౬.

క. విందారగింపఁ దగు గో,విందాంఘ్రిమిళింద
మనవి విని చనుదెమ్మా, విందాక రాచ
కలువల, విందా ముఖునిందితారవిందా
నందా. రా. వి. ౨. ౯౩.

ఆ. ప్రియము లేని విందు పిండి వంటకు చేటు,
భక్తిలేని పూజ పత్రిచేటు, పాత్ర మెఱుఁగ
నీవి బంగారు చేటురా, విశ్వదాభిరామ
వినర వేమ. వేమ. ౨. ౪౮.

వ్యవ. ఒకనాఁడు విందు, ఒకనాఁడు మందు.
విందైన మందైన మూఁడు పూటలకు గుణము
తెలియును.

౪. ఆతిథ్యము.

ద్వి. అందుకు కాశికుం డనుమతించుటయును,
విందు సేయుటకు నై వేగంబ యతఁడు ...
రం. రా. బాల. ౫౩. పా. ౧౬. పం.

శా. విల్లుందానును భిల్లుఁ డొక్కఁడరుగన్
విందింట దుగ్ధాన్నముల్, భిల్లుం డన్యుఁడు
పెట్ట ... ఆము. ౪. ౨౨౩.

సీ. శబరి యిచ్చిన పండ్ల చవి భరద్వాజుల
విందొక్కటి కీలి భావింప లేదు ...
ఉ. రా. ౭. ౧౫.

సీ. ... విందు నాఁగ మనుష్య యజ్ఞము
పొల్చు ... ఆం. భా. ౨. ౧౭౧.

విణ. సంతోషము, ప్రియము.

ఉ. ... క్రొం, బట్టుఁ బనిండిసిబ్బెలపుఁ
జయ్యెద కొంగొక యింత జాతి చ, న్నట్టు
లలాటలోచనుని కన్నులు మూఁటికి విందు
సేయఁగన్. హర. ౫. ౪౭.

శా. ... అందైన నిందైన విం,దైనాదం బొసఁ
గూర్చునే మదికి నిట్లానంద సందోహ
ముల్ ... వసు. ౨. ౧౬.

జ: విందుపురుగు, విందువచ్చు.

**విందుపురుగు(వు).** వి. (√ విందు) ఒక జాతి
సాలెపురుగు.

సీ. పాదొట్టనిఁ గలూత పరగుఁ దద్భేదంబు
నొచ్చు నీగపులి విందుపురు వనఁగ ...
ఆం. భా. ౨. ౮౭.

**విందువచ్చు.** అ. క్రి. (విందు + వచ్చు) అతిథి
యయి వచ్చు.

వ. ఇందు ధరుండు మన మందిరమునకు విందు
వచ్చినాఁడు ... హర. ౧. ౧౯.

**విందువు.** సం. విణ. ఉ. ౧. బుద్ధిమంతుఁడు.
౨. దాత, ఈగి గలవాఁడు.

వి. ఉ. పుం. బిందువు.

**విన్ధ్య.** సం. వి. ఆ. స్త్రీ. ౧. లవలీలత. ౨.
చిన్న యేలకి తీఁగ.

**వింధ్యకూట(క)నుఁడు.** సం. వి. అ. పుం.
అగస్త్యుఁడు.

**వింధ్యకూటుఁడు.** సం. వి. అ. పుం: = వింధ్య
కూటనుఁడు.

**వింధ్యము.** సం. వి. అ. పుం. ౧. పర్వత విశే
షము, సప్తకులపర్వతములలో నొకటి.

**వింధ్యవాసిని.** సం. వి. ఈ. స్త్రీ. వింధ్యపర్వత
మందు నివసించు నొకానొక దేవత.

సీ. వింధ్య వాసిని శేక వీరకు మున్నుగా నెల్ల
వేల్పులకు బింకించి మ్రొక్కి ...
ద్వా. ౪. ౨౫౯.

**వింధ్యాటవి.** సం. వి. ఈ. స్త్రీ. వింధ్య పర్వతము మీఁది పెద్ద యడవి.

**వింశకము.** సం. వి. అ. పుం. ఇరువది. (సంఖ్య.)

**వింశతి.** సం. వి. ఇ. స్త్రీ. ఇరువది.

**వింశతికము.** సం. విశే. (అ. ఆ. అ.) ఇరువదికిఁ దగినది, వింశతి సంఖ్యకు యోగ్యము.

**వింశతితమము.** సం. విశే. (అ. ఈ. అ.) ఇరువదియవది.

**వింశతీశి.** సం. వి. న్. పుం. ఇరువది గ్రామముల యధికారి.

**వింశతీశుఁడు.** సం. వి. అ. పుం. = వింశతీశి.

**వింశము.** సం. విశే. (అ. ఈ. అ.) ఇరువదియవది.

వి. అ. పుం. ఇరువదియవ భాగము.

**వింశి.** సం. వి. న్. పుం. ౧. ఇరువది. ౨. ఇరువది గ్రామముల కధికారి.

**వికంక(ట)తము.** సం. వి. అ. పుం. వృక్షవిశేషము. ములు వెలగ. ?.
(దీనికఱ్ఱతో తెడ్లుచేయుదురు.) "పుల్లవెలఁగ" అని కొందఱు.)

**వికంపము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. ఉబుకునది, పైకి లేచునది. ౨. చంచలము, స్థైర్యము లేనిది.

**వికంపితము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. వడఁకింపఁబడినది, వణఁకునది. ౨. అదరునట్టిది. ౩. చంచలమైనది.-

**వికచము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. వికసించినది. ౨. వ్యాపించినది, ప్రసరించినది. ౩. కేశములేనిది, వెంట్రుకలు లేనిది. ౪. మూర్తిమంతమైనది, స్పష్టముగాఁ గాన్పించునది.

వి. అ. పుం. ధ్వజము, టెక్కెము.

**వికట.** సం. వి. ఆ. స్త్రీ. వజ్ర వారాహి యను దేవత.

**వికటకవి.** సం. వి. ఇ. పుం. వికటముగా మాటలాడువాఁడు, హాస్యకరుఁడు. (శ. ర.)

**వికటపీఠము.** సం. వి అ. పుం. స. మూర్తిదోషము.

సీ. వికట పీఠంబులు విలసిల్లు బుడుపులుజాగుడై
జిగిజెడ్డ జాఠరంబు ...
రత్నపరీక్ష. ౫౦. ప.

**వికటము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. వికృతమైనది, చూడ నసహ్యమైనది. ౨. అంగవికారమైనది. ౩. భయంకరమైనది. ౪. విశాలము, పెద్దది, విరివియైనది. ౫. గర్వముగలది. ౬. సుందరమైనది, చక్కనిది. ౭. ముఖముచిట్లించుకొనునది, కనుబొమలు ముడివేయునది. ౮. గూఢమైనది, తెలియనిది. ౯. మాఱిన యాకారము గలది. ౧౦. పెద్ద పండ్లుగలది, మిట్టపల్లములుగలది.

స. కుఱుపు.

**వికటించు.** సం. అ. క్రి. ప్రతికూలించు.

సీ. కాంత నీ వేక వాక్యముగ వర్తించుచు వికటింపనేల యో శుక వతంస ...
భాను. ౩. ౫౬.

**వికత్థ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. డంబములు చెప్పుకొనుట, ఆత్మస్తుతి. ౨. స్తుతి, పొగడ్త. ౩. నిందాస్తుతి. ౪. ఉద్ఘోషించుట, బిగ్గరగాఁ జెప్పుట.

**వికత్థనము.** సం. వి. అ. వి. ౧. ఆత్మస్తుతి, డంబము చెప్పుకొనుట. ౨. వ్యాజస్తుతి. ౩. స్తుతి, పొగడ్త.

**వికత్థనుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. ఆత్మస్తుతి చేసికొను వాఁడు, డంబము చెప్పుకొను వాఁడు. ౨. వ్యాజస్తుతి చేయువాఁడు.

**వికము.** సం. వి. అ. న. ముజ్జుఁబాలు, అప్పుడే యీనిన యావుపాలు.

**వికరము.** సం. వి. అ. పుం. రోగము, జబ్బు.

**వికరాలము.** సం. విశే. (అ. ఆ. అ.) మిగుల కరాళమైనది, మిక్కిలి భయంకరమైనది.

**వికర్ణుఁడు.** సం. వి. అ. పుం. ౧. ధృతరాష్ట్ర పుత్రులలో నొకఁడు, ఒకానొక భారతవీరుఁడు. ౨. కర్ణపుత్రుఁడు.

**వికర్తనము.** సం. వి. అ. పుం. అర్క వృక్షము. జిల్లేడు చెట్టు.

**వికర్తనుఁడు.** సం. వి. అ. పుం. ౧. సూర్యుఁడు. ౨. తండ్రిరాజ్యమును బలాత్కారముగా లాగుకొనిన కొడుకు.

**వికర్మము.** సం. వి. న్. న. ౧. అన్యాయ కార్యము, నిషిద్ధ కృత్యము, అప్రకృతికార్యము. ౨. విభిన్నకార్యము.

**వికర్మస్థుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) నిషిద్ధమైన పనులు చేయువాఁడు, కుత్సితాచారముల కలపడినవాఁడు.

**వికర్మకుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. చెడు పని చేయువాఁడు, దుష్టుఁడు. ౨. వేఱు వేఱు పనులలో నినియోగింపఁ బడినవాఁడు, వివిధ కర్మలుగలవాఁడు.

వి. అ. పుం. అంగడి పారుపత్తెకాఁడు, దుకాణములనిూఁది పన్ను వసూలు చేసెడి యధికారి.

**వికర్మ్మఁడు.** సం. విశే. న్. ౧. చెడ్డపని చేయు వాఁడు. ౨. పనిమానిన వాఁడు.

**వికర్షణము.** సం. వి. అ. పుం. మన్మథుని బాణపంచకములో నొకటి.

వి. దూరముగా లాగుట. ౨. (మల్లయుద్ధమున) అడ్డముగాఁ ద్రోయుట.

**వికర్షము.** సం. వి. అ. పుం. ౧. దూరముగా లాగుట, ప్రక్కగా నీడ్చుట. ౨. బాణము, అమ్ము.

**వికల.** సం. వి. ఆ. స్త్రీ. (జ్యోతి) కలలో నఱువదవ పంతు. (చూ. కల.)

**వికలము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. ఒక భాగము, లేక యవయవము లేనిది, లోపము గలది, అసంపూర్ణమైనది. ౨. బెదరినది, భయపెట్టఁబడినది. ౩. శూన్యమైనది, వట్టిది. ౪. క్షుబ్ధమైనది, కలఁతనొందినది, అధైర్యపడినది. ౫. నిరుపయోగము, నిష్ఫలమైనది. ౬. తప్పినది. ౭. క్షీణించినది, కృశించినది.

**వికలాంగుఁడు.** సం. విశే. (అ. ఆ. ఈ. అ.) వికలమైన యవయవములు గలవాఁడు.

**వికలీకరణము.** సం. వి. అ. న. ౧. వికలముగాఁ జేయుట, వికలాంగునిఁగాఁ జేయుట. ౨. కలవరపెట్టుట, క్షోభపెట్టుట.

**వికల్పజాలము.** సం. వి. అ. న. వలవలె నుండెడి సంశయము, ఎట్లును తోఁచని స్థితి.

**వికల్పనము.** సం. వి. అ. న. ౧. సంశయము నొందుట, విచికిత్సపడుట. ౨. అనిశ్చయము, నిశ్చయములేమి.

**వికల్పము.** సం. వి. అ. పుం. ౧. సంశయము, కోటిద్వయాత్మక జ్ఞానము, విచికిత్స. ౨. ఊహ, భావన. ౩. కల్పనము. ౪. విధము. ౫. అజ్ఞానము.౬. తారతమ్యము. ౭. (వ్యాక) పక్షప్రాప్తి. (కలుగుట, కలుగకుండుట.)

**వికల్పోపహారము.** సం. వి. అ. పుం. ఐచ్ఛికమైన దానము.

**వికల్మషుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. మాలిన్యము లేనివాఁడు, కలంకము లేనివాఁడు. ౨. పాపములేనివాఁడు, తప్పు (అపరాధము) లేని వాఁడు.

**వికవిక.** వి. ౧. నవ్వుటయందలి ధ్వని కనుకరణము.

క. అనుచు సురగురుఁడు పలికిన, విని బ్రహ్మ సురేంద్రుఁడాది వికవికనగి ...
పార్వ. ౨. ౧౭౩.

చ. వికవిక నవ్వియక్కపట విప్రకుమారుఁడు మేలు తెస్సవా,నికినయి తాగబంధమును నిల్పె మదింపశకౌఘ తాటి మ్యాసకి ...
హరి. ౪. ౨౭.

౨. తెగడుటయం దగుధ్వని కనుకరణము.

ద్వి. దీకొల్పి వికవికఁ దగడువల్లియలు, చేకొని వాఱింపఁ జేరుగోపికల ...
అ. మ. క. ౨. ౧౨౪. పు. ౧౧. పం.

**వికష(స).** సం. వి. ఆ. స్త్రీ. మంజిష్ఠ, మంజిడి. ౯.

**వికసనము.** సం. వి. అ. న. వికాసము.

**వికసించు.** సం. అ. క్రి. వికాసముపొందు.

క. జనపతియును నా సుకేశీవనితావదనంబు తెప్పవాల్పక వీక్షిం,చెను రాకాచంద్రో దయ,మునఁ గలువల పగిది నయనములు వికసింపన్ ... వరా. ౩. ౧౧౨.

**వికసింపించు.** సం. స. క్రి. (√ వికసించు) వికసింపఁజేయు.

సీ. ... నవ్వగీగులఁ బేంకణము వికసింపించి వనితయొక్కతె ప్రసవములుగ్రోవు ...
వి. శకుం. ౨. ౧౩౮.

**వికసితము.** సం. విశే. (అ. ఆ. అ.) వికసించినది, విరిసినది. (పుష్పము. ౯.)

**వికసిల్లు.** సం. అ. క్రి. ౧. వికాసముపొందు.

చ. అనవుడు నట్లకాకయని యా పరనాయకుఁ డాత్మ సమ్మతిం,చిననెడ విశ్వవేది వికసిల్లుచు ... మార్క. ౮. ౨౬.

(ఇట " ఆనందించు " అని భావము.)

గీ. అనిన విని వికసిల్లి యిట్లనియె నింతి ...
దశకు. ౫. ౨౭.

౨. ఒప్పు, ప్రకాశించు.

క. సుకవి నిరూపణములచేఁ, బ్రకటిల్లుచు రూపకములు బహులాకృతులై, వికసిల్లు వాని తెఱఁగులు, వికటంబులు దెలియ వలయు వివిధస్మృతులన్.
కావ్యా. ౫. ఉల్లా. ౨౨.

**వికస్వ(శ్వ)రము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. వికసించునది, విరియునది. ౨. బిగ్గరయైనది, స్పష్టముగా వినఁబడునది.

**వికారము.** సం. వి. అ. పుం. ౧. ఆకారమున మార్పు, స్వభావమున మార్పు, స్వాభావికస్థితి నుండి మాఱుట. ౨. రూపాంతర ప్రాప్తి, మాఱుపాటు. ౩. రోగము, వ్యాధి. ౪. చిత్తవృత్తి, మనోవ్యాపారము. ౫. బొమలు ముడుచుట, చిట్లించుట. ౯. ముఖచిహ్నము. ౬. (సాంఖ్య) మూల ప్రకృతినుండి పుట్టినది. (మహదాది) ౭. గాయము.

**వికారహేతువు.** సం. వి. ఉ. పుం. ఆకర్షణము, ఆందోళనము గలిగించు కారణము.

**వికారి.** సం. విణ. (న్. ఈ. న్.) ౧. వికారము గలది, మార్పునొందినది. ౨. మాఱునది. ౩. చెఱుచునది.

**వికారితము.** సం. విణ. (అ. ఆ. అ.) వికారము గలదిగాఁ జేయఁబడినది, మార్పఁబడినది.

**వికాల(క)ము.** సం. వి. అ. పుం. అసురసంధ్యా కాలము.

(ఇది దేవపిత్రాది కర్మల కనర్హ కాలము.)

**వికావిక.** సం. వి. ఆ. స్త్రీ. కాలమును దెలుపు ఘటీయంత్ర విశేషము.

(నీటిమీఁద నుంపఁగాఁ గ్రమముగా నిండుటచేఁ గాలపరిమితిని దెలిపెడి బెజ్జముగల రాగి పాత్ర.)

**వికావిక.** విణ. చెల్లాచెదరైనది.

క. ... సగ్గులయి యావురుసవురయి, గగ్గులు కాడై వికావికలయి యవర్తుకల్ ...
కాశీ. ౭. ౮౭.

క. ... తత్పరిజనము వికావికలయ్యెన్ ...
దశకు. ౨. ౬౪.

**వికావిక.** వి. నవ్వుటయందగుధ్వని కనుకరణము.

క. ... కులశీలంబులు వఱదం, గలపితివిఁక నేమియని వికావిక నగుచున్ ...
వేం. పంచ. ౩. ౧౪౬.

ఉ. కారణమేమిలేకయె వికావిక నవ్వను ...
కవిరాజ. ౫. ౧౮౬.

**వికాస(శ)నము.** సం. వి. అ. న. ౧. స్పష్టపఱుచుట, స్పష్టముగాఁ జూపుట. ౨. (పువ్వు మొ.) వికసించుట, విరియుట.



**వికాస(శ)ము.** సం. వి. అ. పుం. ౧. స్పష్టపఱుచుట, స్ఫుటముగాఁ జూపుట. ౨. (పువ్వు మొ.) వికసించుట, విరియుట. ౩. ఋజుపద్ధతి, సరళమార్గము. ౪. వక్రపద్ధతి, కుటిలమార్గము. ౫. సంతోషము. ౬. ఆకాశము. ౭. ఆసురత, తీవ్రవాంఛ. ౮. ఏకాంతము. ౯. వృద్ధి, పెరుఁగుదల.

**వికాసి(శి).** సం. విణ. (న్. నీ. న్.) ౧. ప్రకాశమగునది, స్పష్టముగాఁ గనఁబడునది. ౨. వికసించునది, విరియునది. ౩. ప్రకాశించునది.

**వికాసించు = వికసించు.** సం. అ. క్రి. వికాసము నొందు.

శా. ... అంతస్స్నానము మాన్పఁగా వలయు నస్మత్సంప్రియం బాలఁ జేయింపుచున్ నీనికి గట్టి సొమ్ములు వసం బెంతే వికాసింపఁ గన్.
రుక్మాం. ౪. ౧౧౩.

క. ... భూమీసురుఁ గనుఁగొని నగుమోమున నిట్లనియె డెందము వికాసింపన్ ...
శ్రీరం. ౨. ౯౮.

**వికిరణము.** సం. వి. అ. న. ౧. చెదరఁ గొట్టుట, ఇటునటుఁ జల్లుట. ౨. అంతటను వ్యాపింపఁ జేయుట. ౩. చీల్చుట. ౪. హింసనము, చంపుట. ౫. జ్ఞానము.

పుం. అర్కవృక్షము, జిల్లేడు చెట్టు.

**వికిరము.** సం. వి. అ. పుం. ౧. చెదరిన భాగము. ౨. విఘ్నశాంతికై చల్లబడిన దూర్వాంకురాదికము.

శ్లో. లాజచందన సిద్ధార్థ భస్మ దూర్వాంకురాక్షతాః, వికారా ఇతి సందిష్టాస్సర్వ విఘ్నవినాశనాః. (తంత్రసా. వాచ.)

౩. అసంస్కృతులై, మృతులయిన పితరుల నుద్దేశించి శ్రాద్ధములందు దర్భలపై నుంచఁబడు నన్నము.

శ్లో. అసంస్కృత ప్రమీతానాం యోగినాం కులయోషితాం, ఉచ్ఛిష్టం భాగధేయం స్యాత్, దర్భేషు వికిరశ్చయః. (అ. త. వాచ.)

౪. పక్షి. ౫. నూయి. ౬. వృక్షము.

**వికీర్ణజ్ఞము.** సం. వి. అ. న. పరిమళ ద్రవ్య విశేషము.

**వికీర్ణము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. చెదరినది. విడిపోయినది. ౨. చెల్లఁబడినది. ౩. ప్రసిద్ధమైనది.

**వికుంఠము.** సం. వి. అ. న. విష్ణు లోకము.

**వికుంఠితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. మొద్దైనది, మొఱపోయినది, మొద్దుగాఁ జేయఁబడినది. ౨. మూఢము, మూర్ఖము.

**వికుర్వాణుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. మార్పు పొందినవాఁడు. ౨. సంతోషించినవాఁడు.

**వికు(క్ర)స్రుఁడు.** సం. వి. అ. పుం. చంద్రుఁడు.

**వికూజనము.** సం. వి. అ. న. ౧. పావురము కూఁత; పక్షికూఁత. ౨. పేగులార్చుట.

**వికూణనము.** సం. వి. అ. న. ఓరచూపు.

**వికూణిక.** సం. వి. ఆ. స్త్రీ. నాసిక, ముక్కు.

**వికృతము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. మార్పు చెందినది. మాఱినది. ౨. తెవులు గలది. ౩. అంగవికారము గలది, విరూపమైనది. ౪. అసంపూర్ణమైనది. ౫. మనోవికారము గలది, భావోద్రేకము గలది. ౬. ఇష్టము లేనిది, విసిగినది. ౭. అసహ్యమైనది, చీఁదరైనది. ౮. అసాధారణమైనది. ౯. స్వాభావికముగానిది, స్వభావ విరుద్ధమైనది. ౧౦. పాడుచేయఁబడినది, చెఱుపఁబడినది. ౧౧. రోగయుక్తము, వ్యాధిగ్రస్తము.

వి. అ. న. ౧. మార్పు. ౨. హీనస్థితికి మాఱుట. ౩. తెవులు, రోగము. ౪. ఇష్టములేమి, నసుగు.

**వికృతి.** సం. న. ఇ. స్త్రీ. ౧. ఉద్దేశము, మనస్సు, రూపము మొదలగువాని మార్పు. ౨. స్వభావ విరుద్ధస్థితి. ౩. రోగము. ౪. మానసికోద్రేకము, కోపము, రాగము, మొ. ౫. భావము, చిత్తవృత్తి. ౬. బలాత్కారముగఁ బట్టుకొనుట. ౭. పులిసిన కల్లు. ౮. భూతము, దయ్యము. (విల్యమ్స్.) ౯. ప్రభవాది సంవత్సరములలో నొకటి.

**వికృష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. దూరముగా లాగఁబడినది, ఈడ్వఁబడినది, ఆకర్షింపఁబడినది. ౨. పొడవుగాఁ జేయఁబడినది. ౩. ఉద్ఘోషింపఁబడినది, చాటఁబడినది, మొఱపెట్టఁబడినది. ౪. కఠినమైనది, నిర్దయము, క్రూరము. ౫. చక్కఁగా దున్నఁబడినది.

వి. అ. న. ౧. మొఱ్ఱ. ౨. నింద.

**వికేశి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. విరియఁబోసికొనిన జుట్టుగల స్త్రీ, వీడిన కొప్పుగల స్త్రీ. ౨. వెంట్రుకలులేని యాఁడుది. ౩. వేణి, జడ. ౪. అష్టమూర్తియైన శివునికి మహీరూపమున నున్నపుడుండు భార్య.

శ్లో. సూర్యోజలం మహీవాయుర్వహ్నిరాకాశమేవచ, దీక్షితో బ్రాహ్మణ స్సోమ ఇత్యేతాస్తన వక్రమాత్॥ సువర్చలాతథై వోషా వికేశీ చాపరాశివా, స్వాహాది శ స్తథా దీక్షా రోహిణీ చ యథాక్రయమ్.

(మార్క. వాచ.)

**వికేశుఁడు.** సం. విశే. (అ. ఆ. ఈ. అ.) ౧. పీడిన వెండ్రుకలు గలవాఁడు. ౨. వెండ్రుకలు లేనివాఁడు.

**వికోశ(ష)ము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. పొట్టులేనిది. ౨. కోశము లేనిది, ఒఱలేనిది.

**విక్కను.** అ. క్రి. (విక్కు + అను) విక్కుమనుధ్వని కలుగు.

ద్వి. వ్రక్కలై కూడఁ బౌరాణికు మేను, విక్కన విరియుడు విరివిరి యనుచు ... బస. పురా. ౧౭౫. పా. ౨౦. పం.

**విక్కము.** సం. వి. అ. పుం. పిల్లయేనుఁగు, గజశాబకము.

**విక్కవిరియు.** అ. క్రి. (విరియు + విరియు) మిక్కిలి విరియు, మిగుల సంతోషించు.

వ. ... సమ్మోదంబున విక్కవిరిసి రక్కసుని యురంబున ... భాగ. దశ. పూ. ౨౭౬.

**విక్కు.** అ. క్రి. ౧. విశ్లథమగు, వదులగు.

ఉ. క్రిక్కిఱి చేన్నుఁ దోయి యిరుగ్రేవల కాంతియుఁ బంచబాణుఁగ్రొవ్వెక్కఁగఁ జేయ హస్త యుగమెత్తి విహారభరంపుఁ బేర్మికిన్, విక్కిప్రసూనము ల్గురియువేనలి పీడిచి కొప్పు వెట్టుచోఁ, జొక్కులఁ బెట్టె భూవరుని చూపులఁ గోమలి బాహుమూలముల్. శైవ. ౭. ౧౯౪.

౨. గర్వించు.

ఉ. చేక్కెర విల్తు పక్కెరల జెక్కినటంచును విక్కివిక్కినే, డెక్కుడు మాటలం బదరి దింతియకాని యవారియాన వాల్చెక్కరఁ బెట్టి రాము కతఁ జెక్కగ సేర్పుచుఁ బెంచి నట్టి యా, యక్కను జూడవై తివి గదా ప్రమదాళినిగూఢకేరమా. రా. వి. ౪. ౬౬.

ద్వి. విక్కుచుఁ జొక్కుచు విఱ్ఱవీఁగుచును, మిక్కిలి తమకంబుమే కొనఁగ్రొత్త, సింగారమూని ... తి. సారంగ. ౧. ౫. పా. ౪. పం.

౩. విజృంభించు.

క. అక్కమ్మ మెకపుజోదులు, విక్కుచు నక్కొండ యెక్కివిరిదేనియలన్, జొక్కటపుఁ దియ్యపండుల, జెక్కర తెలినీళ్ల నలువు సడలించి తగన్. అచ్చ రా. కిష్కిం. ౮౯.

౪. నిందించు, అధిక్షేపించు.

క. తక్కిన పాండు కుమారుల, విక్కుచు శస్త్రంబు చేత విడిచిన గురునిం, ద్రొక్కి తలఁద్రుంచు వానిన్, ప్రుక్కక రణ భీతిఁ బొడుతుఁ జోద్యముగాఁగన్. సేతుఖం. ౩. ౯౩. పా.

(ఇది యశ్వత్థామ యనుమాట.)

వి. ౧. గర్వము.

ద్వి. దాని చెక్కుల టెక్కు దాని బల్విక్కు, దాని మోము మెఱుంగు దాని తెఱంగు ... తి. సారంగ. ౧. ౭. పా. ౯. పం.

౨. విరియుట యందగు ననుకరణము.

ద్వి. విషయ వాసన మదినీడ్కొన్న యపుడె, విషయషడ్వర్గంబు విక్కనవిరియు ... ప్రభులింగ. ౫. ౧౫౭. పా. ౧౬. పం.

౩. విఱుగు నప్పుడగు ధ్వని కనుకరణము.

ద్వి. విపులేంద్రముని వీఁపు విక్కన విఱిగె ... బస. పు. ౧౫౭ పా. ౧౩. పం.

**విక్రమ.** సం. వి. అ. పుం. ప్రభవాది సంవత్సరములలో నొకటి.

**విక్రమణము.** సం. వి. అ. న. విష్ణుదేవుని యంగ.

**విక్రమము.** సం. వి. అ. పుం. ౧. అడుగు, అంగ. ౨. అడుగులు వేయుట, నడచుట. ౩. గెలుచుట, జయించుట. ౪. వీర్యము, పరాక్రమము. ౫. బలము, శక్తి.

**విక్రమాదిత్యుఁడు.** సం. వి. అ. పుం. సుప్రసిద్ధుఁడైన యొకరాజు.

(ఇట్లే, "విక్రమార్కుఁడు.)

**విక్రమి.** సం. విణ. (న్. ఈ. న్.) ౧. పరాక్రమము గలవాఁడు, శౌర్యవంతుఁడు. ౨. బలవంతుఁడు, శక్తిగలవాఁడు.

వి. న్. పుం. ౧. సింహము. ౨. శూరుఁడు. ౩. విష్ణువు.

**విక్రమించు.** సం. అ. క్రి. ౧. పరాక్రమము చూపు.

ఉ. ... రాజుల, యార్యడవు ముందటఁ జయజయధ్వను లిచ్చిరిగాని వాని శౌర్యోదయవృత్తికిఁ బ్రెదురనోపర రెవ్వరు విక్రమింపఁగన్. భార. సభా. ౨. ౯౭.

వ. అనవరతానోన్యసంగతంబు లగు చక్రంబుల నతిక్రమించెడు క్రమంబులఁ గుచంబులు విక్రమింప నిజకరాఘాతంబుల ... శుక.చరి. ౨. ౨౦.

(ఇట 'నతిశయింప' నని భావము.)

చ. అపుడు సుమాలి ... విపులశతాంగమున్ మెఱయవేచని మార్గాఁని విక్రమించినన్. ఉ. రా. ౨. ౯౫.

**విక్రముఁడు.** సం. వి. అ. పుం. ౧. ప్రఖ్యాతుఁడైన యుజ్జయినీ పట్టణపు రాజు, విక్రమాదిత్యుఁడు, విక్రమార్కుఁడు. ౨. విష్ణువు.

**విక్రయము.** సం. వి. అ. పుం. అమ్మకము.

**విక్రయానుశయము.** సం. వి. అ. పుం. ౧. అమ్మకము గడుపేయుట. (అ. వి.) ౨. అమ్మకము రద్దు చేసికొనుటకైన వివాదము. (వాచ.)

**విక్రయి.** సం. విణ. (న్. ఈ. న్.) వ్యాపారి, అమ్మువాఁడు.

**విక్రయించు.** సం. స. క్రి. అమ్ము.

మ. ... కలత్రముల వరకుమారుం గాశిలో విక్రయించి నిరూఢంబగు సత్యమున్వ్వరఁ బ్రతిష్ఠించెన్ ... జై. భా. ౪. ౧౨౮.

**విక్రయుకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) వ్యాపారి, అమ్మువాఁడు.

**విక్రాంత.** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) పరాక్రమము గలవాఁడు.

వి. ఋ. పుం. ౧. వీరుఁడు. ౨. సింహము.

**విక్రాంతము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. అంగ వేయఁబడినది, దాటఁబడినది. ౨. బలము గలది, పరాక్రమముగలది. ౩. జయించినది. గెలిచినది.

వి. అ. పుం. ౧. సింహము.

న. ౧. అంగ. ౨. వీర్యము, పరాక్రమము. ౩. వైక్రాంతమణి.

**విక్రాంతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. అడుగువేయుట, అంగవేయుట. ౨. గుఱ్ఱపు నడక. ౩. పరాక్రమము, వీర్యము.

**విక్రాంతుఁడు.** సం. వి. అ. పుం. వీరుఁడు, యోధుఁడు.

**విక్రియ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. మాఱుపు. ౨. మనోవికారము, కోపము, రాగము, అసంతుష్టి మొ. ౩. వైకల్యము. ౪. కనుబొమలు ముడుచుట మొ. ముఖచిహ్నము. ౫. ఆకస్మికముగు గలుగు ... మొ.

**విక్రేత.** సం. వి. ఋ. పుం. విక్రయించువాఁడు.

**విక్రేయము.** సం. విశే. (అ. ఆ. అ.) అమ్మఁదగినది.

**విక్రోశనము.** సం. వి. అ. న. ౧. మొ, పెట్టుట, ఉద్ఘోషించుట. ౨. నిందించుట.

**విక్లబము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. భయము నకు లోనైనది. భయపడినది. ౨. పిఱికి, ధైర్యము లేనిది. ౩. పరవశమైనది, (ఒక దానికి) లొంగినది. ౪. కలవరపడినది, క్షోభ పడినది. ౫. బాధింపఁబడినది, దుఃఖము కలుగఁ జేయఁ బడినది. ౬. విసిగినది, విసుగుచెందినది. ౭. శ్రొట్రుపడినది.

**విక్లిన్నము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. మిగులఁ దడిసినది, తేమగలది. ౨. క్షీణించినది, వాడినది. ౩. ముదిసినది.

**విక్లిష్టము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. మిక్కిలి బాధింపఁ బడినది, మిగుల క్లేశపెట్టఁ బడినది. ౨. హాని గలుగఁ జేయఁ బడినది.

వి. అ. న. ఉచ్చారణము సందలి లోపము.

**విక్లేతము.** సం. వి. అ. పుం. ౧. పూర్తిగాఁదడియుట. ౨. కరఁగిపోవుట.

**విక్షతము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. గాయ పఱుపఁ బడినది, కొట్టఁబడినది. ౨. ముక్కలుగాఁ జేయఁ బడినది.

వి. అ. న. ౧. గాయము చేయుట. ౨. గాయము.

**విక్షావము.** సం. వి. అ. పుం. ౧. కాసరోగము, దగ్గు. ౨. తుమ్ము. ౩. ధ్వని, చప్పుడు.

**విక్షిప్తము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. చెదరినది. చెదరఁ గొట్టఁ బడినది. ౨. (ఉద్యోగము మొ. దానినుండి) తొలఁగింపఁ బడినది. ౩. పంపఁబడినది. ౪. కలవరపడినది. ౫. (వాదము) ఖండింపఁ బడినది. ౬. (యోగ) చిత్తము యొక్క స్థితి విశేషము. "క్షిప్తం, మూఢం, విక్షిప్తం, మేకాగ్రం, నిరుద్ధ మితి చిత్తభూమయః."

**విక్షీరము.** సం. వి. అ. పుం. అర్కవృక్షము, జిల్లేడుచెట్టు.

**విక్షేపణము.** సం. వి. అ. న. ౧. త్రోసివేయుట, (బాణము) ప్రయోగించుట. ౨. చెదరుట,ఇటునటుఁ బోవుట. ౩.కలవరపడుట. ౪. దూరీకరణము, ఉద్యోగాదులనుండి తొలఁగించుట.

**విక్షేపము.** సం. వి. అ. పుం. ౧. దూరముగాఁ ద్రోయుట, చెదరఁ గొట్టుట. ౨. ప్రయోగించుట, (బాణము మొ.) విడుచుట. ౩. అలలవలెఁగదలుట, కంపమొందుట. ౪. ఇటునటుఁ గదుపుట, ఆడించుట. ౫. కలవరపాటు. ౬. భయము. ౭. వాదఖండనము వా. ధ్రువరేఖ. ౯. స్త్రీల సత్త్వజమైన యలంకార విశేషము. ౧౦. కార్యాంతరమిషచే వాదమునునిలుపుట, నిగ్రహస్థాన విశేషము.

**విక్షేపశక్తి.** సం. వి. ఇ. స్త్రీ. (వేదాంత) అవిద్యాశక్తి విశేషము, లేనిదానినున్నట్టు కనఁబడఁ జేయు మాయాశక్తి.

**విక్షేపించు.** సం. స. క్రి. త్రోయు, చిమ్ము.

శా. శ్రేణీభూతములై దిగంతముల విక్షేపించు
సౌమిత్రి దో, స్స్వానాగ్రోజ్ఝిత ... బాణ
ములు వర్షింపంగ ...

భా. రా. సుం. ౪౪౩.

**విక్షోభము.** సం. వి. అ. పుం. ౧. కదలుట, చలించుట. ౨. మానసిక క్షోభము, కలవర పాటు, భయము. ౩. బాధ, నొప్పి.

**విక్షోభించు.** సం. అ. క్రి. బాధపడు.

శా. హాలాపానము మాంసభక్షణము నత్యాసక్తిఁ గావింప వ్యాఘ్రచ్ఛాలాదిప్రరుజావ్యథల్ గలిగి విక్షోభించుచున్ ధాత్రిఁ జం, డాలత్వంబు భజించె సువ్రతము లిష్టాపూర్తము ల్లేమి ...
బ్రహ్మోత్తర. ౨. ౯౭.

**విఖండితము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. ఖండింపఁబడినది, పగులఁగొట్టఁ బడినది, విభజింపఁబడినది. ౨. రెండుముక్కలుగాఁ జేయఁ బడినది. ౩. వికలాంగముగాఁ జేయఁబడినది. ౪. (వాదము) ఖండింపఁబడినది.

**విఖండించు.** సం. స. క్రి. నఱకు.

గీ. రాక్షసుఁడు వైచినట్టి యాప్రబల శక్తి, శక్తివైచి విఖండించె శంభుశక్తి ...
కాశీ. ౬. ౨౪౪.

**విఖా(ఖు)నసుఁడు.** సం. వి. అ. పుం. ౧. వానప్రస్థుఁడయిన ఋషి. ౨. ఒకానొకముని.

**విఖాగు.** సం. వి. ఆ. స్త్రీ. జిహ్వ, నాలుక.
(విల్సన్సు.)

**విఖురుఁడు.** సం. వి. అ. పుం. ౧. రాక్షసుఁడు. ౨. చోరుఁడు, దొంగ.

**విఖు(వు).** సం. విశే. (ఉ.) ముక్కిఁడి, ముక్కు లేనివాఁడు.

**విఖ్యాతము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. ప్రసిద్ధమైనది, పేరుపొందినది. ౨. పిలువఁ బడినది, పేర్కొనఁబడినది. ౩. ఒప్పుకొనఁ బడినది, అంగీకరింపఁబడినది.

**విఖ్యాతి.** సం. వి. ఇ. స్త్రీ. ప్రసిద్ధి, కీర్తి.

**విఖ్యాపనము.** సం. వి. అ. న. ౧. ప్రకటించుట. ఉద్ఘోషించుట. ౨. వివరించుట, స్పష్టపఱచుట. ౩. ఒప్పుకొనుట, అంగీకరించుట.

**విఖ్యు(ఖు)ఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ముక్కిడి, ముక్కులేనివాఁడు.

**విగంధకము.** సం. వి. అ. పుం. ఇంగుదీవృక్షము, గార చెట్టు.

**విగడము.** విశే. (సం. వికటః) వికటము.

వ. ...దిట్టమాటలం బుట్టిన విగడంబులై యుద్ధపతదంతంబులగు పంతంబులం గుంతంబులం గొని ... పి. శకుం. ౧. ౭౬.

**విగడియ.** వి. (సం. విఘటికా) గడియలో అఱువదవ భాగము.

క. ... ఒక్క విగడియలోనన్ ...
రామా. ౭. ౬౪. (శ. ర.)

**విగణనము.** సం. వి. అ. న. ౧. లెక్కించుట. ౨. ఆలోచించుట. ౩. ఋణముతీర్చుట.

**విగతచక్షువు.** సం. విశే. (స్.) కన్నులు లేనివాఁడు, గ్రుడ్డివాఁడు, అంధుఁడు.

క. మఱునాఁడు విగతచక్షుని, తెలుఁగున నొకపంచఁజేరి దీనతదోఁపన్, గొఱమాలిన యొకపెంచిక, యఱచేతం బట్టికొని నశానసుఁడగుచున్. భోజరా. ౨. ౧౭౪.

**విగతము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. పోయినది, నష్టమైనది. ౨. విడిచిపోయినది. ౩. చని పోయినది. ౪. శూన్యము, లేనిది. ౫. చీఁకటియైనది, మబ్బుపడినది.

వి. అ. న. పక్షిగతి, పిట్టలెగురుట.

**విగతలక్షణుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) శుభలక్షణములు లేనివాఁడు, అదృష్టహీనుఁడు.

**విగతస్పృహుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) అపేక్ష లేనివాఁడు.

**విగతార్తవ.** సం. వి. అ. స్త్రీ. రజస్సుపోయిన స్త్రీ, ముట్టుడిగిన యాఁడుది.

**విగమము.** సం. వి. అ. పుం. ౧. విశ్లేషము, పీడిపోవుట. ౨. సమాప్తి, ముగింపు. ౩ త్యాగము, విడుచుట. ౪. నాశము, కనఁబడక పోవుట. ౫. చావు, మరణము. ౬. విడిపోవుట, విభక్తమఁగుట.

**విగరుఁడు.** సం. వి. అ. పుం. ౧. దిగంబర సన్న్యాసి. ౨. మితభోజి, మితముగా భుజించువాఁడు.

**విగర్హణ.** సం. వి. ఆ. స్త్రీ. నింద, దూఱు.

**విగర్హణము.** సం. వి. అ. న. = విగర్హణ.

**విగర్హించు.** సం. స. క్రి. నిందించు.

శా. ... ఇస్లేవేళం బురిఁ ద్రిమ్మరఁగ సుజను
లెంతేఁడగ విగర్హింపఁగ ...
ధర్మ. ౮. ౧౩౨.

**విగర్హితము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. నిందింపఁబడినది. ౨. నిర్లక్ష్యము చేయఁబడినది. ౩. నిషేధింపఁబడినది, నిషిద్ధము. ౪. అధమము, హీనమైనది. ౫. చెడ్డది, దుష్టము. వి. అ. న. నింద.

**విగల(శ)నము.** సం. వి. అ. న. మిక్కిలి జాఱుట, విస్ఖలనము.

**విగలితము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. కాఱినది, స్రవించినది. ౨. జాఱినది. ౩. పోయినది. ౪. కరఁగినది. ౫. చెదరినది. ౬. వదులైనది. ౭. (తల) విరియఁబోసికొన్నది.

**విగాఢము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. స్నానముచేసినది, మునిఁగినది. ౨. లోఁతైనది.

**విగానము.** సం. వి. అ. న. ౧. నింద, దూఱు, అపవాదము. ౨. పూర్వోత్తర విరుద్ధముగాఁ జెప్పుట.

**విగాహము.** సం. వి. అ. పుం. ౧. స్నానము చేయుట, మునుఁగుట. ౨. లోఁతునకుఁ బోవుట.

**విగాహించు.** సం. అ. క్రి. మునుఁగు, క్రుంకు. (శ. ర.)

**విగాహితము.** సం. విశే. (అ. ఆ. అ.) మునిఁగినది.

**విగీతము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. నిందింపఁబడినది, విగర్హితము. ౨. పూర్వోత్తర విరుద్ధమైనది.

**విగీతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. నింద, దూఱు. ౨. పూర్వోత్తర విరుద్ధముగాఁ జెప్పుట.

**విగుణము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. సుగుణములు లేనిది, చెడ్డది. ౨. నిర్గుణము. ఏగుణమును లేనిది, గుణరహితము. ౩. దారము లేనిది.

**విగుర్వించు.** అ. క్రి. (√ విగుర్వ. క. విగుర్విసు.) ౧. గర్వించు.

వ. అనేక బ్రహ్మాండ విఖండఖండన వ్యాపారమునకు నేమేమ చాలుదు మనుచున్న గణంబులందు గణముఖ్యులు దలతలమని వెడలి విగుర్వించి ... కు. సం. ౨. ౧౭౫.

౨. యత్నించు.

క. గర్వించి పలికి తగునే, గర్వము భుజవీర్యమును బ్రకాశంబుగ నీపర్వత వివరము వెర్చిచి, గుర్వింపుము చూత మనిని గోత్రభిదుండుఁ. భార. ఆది. ౭. ౨౭౩.

**విగుర్వ.** వి. ప్రయత్నము.

ఉ. హారసుధారశంఖవిమలాభ్రమహోజ్వలకీర్తిఁ
జాలం బ్రొల్పారిన బుద్ధమండలికి నగ్ర
సుతుండగు మన్మమండ(ం) డాచారవరుం
డునాఁడెండ్లం జారుతరంబగు వెండికొండ
నాం, గౌరిశశాంకచూళికి విగుర్వనతో
గుడినిల్పె ... ౧౦౬౧. ద. శా. ౪. ౬౭౨.

జ: విగుర్వించే.

**విగూఢము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. రహస్యమైనది, దాఁచఁబడినది. ౨. నిందింపఁ బడినది, విగర్హితము.

**విగృహీతము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. పట్టుకొనఁ బడినది. ౨. ఎదిరింపఁ బడినది. ౩. ఆటంక పఱుపఁ బడినది. నిర్బంధింపఁ బడినది. ౪. (వ్యాక) విగ్రహము చెప్పఁబడినది, (సమాసము.)

(వాక్యమున అర్థము వివరింపఁ బడినది.)

**విగ్గోరు.** వి. ఒకజాతి లత. ‡.

సీ. క్రొవ్విరు లెసఁగి ... విలసిల్లు నిండారు
వెన్నెలలోఁ గాగు విగ్గోరుఁ దీఁగెలు
వెలుఁగు వట్లు ... కు. సం. ౮. ౯.

**విగ్రహము,** సం. వి. అ. పుం. ౧. చాఁచుట, వ్యాపింపఁ జేయుట. ౨. ఆకారము, రూపు. ౩. శరీరము. ౪. కలహము, ప్రణయ కలహము. ౫. యుద్ధము, పోరాటము. (సంధికి వ్యతిరేకము.) ౬. రాజ్య తంత్రము సంధాఱు గుణములలో నొకటి. ౭. నిర్దయత, దయలేమి. ౮. భాగము. ౯. (వ్యాక.) సమాసార్థమును వివరించు వాక్యము.

**విగ్రహవంతుఁడు.** సం. విశే. (త్. వతీ. త్.) శరీరము గలవాఁడు, మూర్తిమంతుఁడు, అవతరించిన వాఁడు.

**విగ్రహించే.** సం. అ. క్రి. కలహించు, విరోధపడు.

గీ. ... వేయికన్నుల వేల్పుతో విగ్రహించి,
వనిత యింకేమి కానున్నవాఁ డొమరుఁడు.
నైష. ౪. ౨౩.

ఆ. అనుచు జనులు నాశ్చర్యభరితులై, చూచు
చుండ నిందు సుందరాస్య, యాత్మ యోగ
వహ్నికాహుతిఁ గావించె, విగ్రహించి
తనదు విగ్రహంబు. మూర్తిత్ర. ౫. ౭౫.

సీ. గీ. ... నీర, జాతములను నీరజాతనులను,
విగ్రహింపనీని విరహంబె తోడుగా,
వెలఁది వెడలెవిపిన వీధులకును ...
వసు. ౩. ౧౩౨.

**విగ్రీవుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) పోయిన మెడగలవాఁడు—శిరశ్ఛేదము చేయఁబడిన వాఁడు, తలగొట్టఁ బడినవాఁడు.

**విగ్రుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ముక్కుఁడి, ముక్కు పోయినవాఁడు.

**విఘటనము.** సం. వి. అ. న. ౧. విడఁగొట్టుట. ౨. నశింపఁ జేయుట, చెఱుచుట.

**విఘటించే.** సం. అ. క్రి. తప్పిపోవు, చెడు.

సీ. ... గీ. మొదల సంఘటి యించినఁ బొంది
కార్య, మవల విఘటించెనేని గౌరవము
దప్పి ... నైష. ౨. ౬౬.

వ. దీని విఘటింపం జేయుదు నని భూసురా
కారుండై వచ్చి పూర్వులంగాంచి ...
భార. అను. ౧. ౨౯౫.

**విఘటిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. గడియలో నఱువదవ భాగము, విగడియ. ౨. విడఁగొట్టునట్టి (వియోగము నొందించు) స్త్రీ.

**విఘటితము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. విడఁదీయఁబడినది, వేఱుచేయఁబడినది. ౨. విభజింపఁ బడినది, పంచిపెట్టఁబడినది. ౩. పగులఁగొట్టఁబడినది. ౪. విశేషముగాఁ గూర్పఁబడినది. (వాచ.)

**విఘట్టన.** సం. వి. అ. స్త్రీ. ౧. ఎడఁబాపుట, వీడఁజేయుట. ౨. ఒరయిక, రాపిడి ౩. విడఁదీయుట, వదులుచేయుట. ౪. అపాయము గలిగించుట.

**విఘట్టనము.** సం. వి. అ. న = విఘట్టన.

**విఘట్టించు.** సం. స. క్రి. (సొకోళ్లు మొ. వానిచే) పొడుచు.

స్రగ్ధర. చించెం జెండాడె మట్టిం జెరిమె విఱిచెఁ గ్రొచ్చెఁ విఘట్టించెనంచెఁ, ... కాశీ. ౬. ౧౭౬.

**విఘట్టితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. వియోజితము, ఎడఁబాపఁబడినది, విడఁజేయఁబడినది, ౨. విడఁదీయఁబడినది. తెఱవఁబడినది, వదులు చేయఁబడినది. ౩. రాచఁబడినది, ఒరసికొనఁబడినది. ౪. చలింపఁజేయఁబడినది, కదల్పఁబడినది. ౫. హానిగలిగింపఁబడినది.

**విఘనము.** సం. వి. అ. పుం. కొయ్యసుమ్మెట, సమ్మెట.

**విఘసము.** సం. వి. అ. పుం. ౧. సగము నమలిన కబళము. ౨. దేవతలను, పితృదేవతలను ఉద్దేశించియిడిన యన్నమున మిగిలిన భాగము. ౩. భుక్తశేషము, తినఁగా మిగిలిన యన్నము. ౪. ఆహారము, అన్నము.

న. మైనము.

**విఘసాశి.** సం. విణ. (న + నీ. న.) దేవతలను, పితృదేవతలను ఉద్దేశించి యిడిన యన్నమున మిగిలిన భాగమును భుజించువాఁడు.

**విఘసాశుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) = విఘసాశి.

**విఘాతము.** సం. వి. అ. పుం. ౧. నాశము. ౨. చంపుట, హింసించుట. ౩. అడ్డంకి విఘ్నము, వ్యాఘాతము. ౪. పెద్దదెబ్బ. ౫. త్యాగము, విడుచుట.

**విఘాతసిద్ధి.** సం. వి. ఇ. స్త్రీ. విఘ్నములఁ దొలఁగించుట, అడ్డంకులఁ ద్రోసివేయుట.

**విఘాతి.** సం. విణ. (న. నీ. న.) ౧. తొలఁగించువాఁడు, నివారకుఁడు. ౨. నశింప జేయువాఁడు, నాశకుఁడు.

**విఘాతించు.** సం. స. క్రి. ౧. చంపు, సంహరించు.

మ. ... మేదినికిఁ భారమడంప దైత్యుల విఘాతింపంగఁ గ్రీడార్థమై జనియించెఁ భగవదీయసూనుఁడు ... హరి. పూ. ౬. ౧౫.

౨. చెఱుచు. (శ. ర.)

**విఘూర్ణితము.** సం. విణ. (అ. ఆ. అ.) విశేషముగాఁ ద్రిప్పఁబడినది. (కన్న.)

**విఘృష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. మిక్కిలి యొరయఁబడినది. ౨. మిగుల నూఱఁబడినది. మిక్కిలి మర్దింపఁ బడినది. ౩. ఎక్కువగా రుద్దఁబడినది.

**విఘ్నకరుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) అడ్డు పెట్టువాఁడు, విఘ్నము గలిగించువాఁడు.

**విఘ్నకర్త.** సం. విణ. (ఋ. స్త్రీ. ఋ.) = విఘ్నకరుఁడు.

**విఘ్నకారి.** సం. విణ. (న. నీ. న.) = విఘ్నకరుఁడు.

**విఘ్నధ్వంసము.** సం. వి. అ. పుం. విఘ్నములు తొలఁగించుట.

**విఘ్ననాయకుఁడు.** సం. వి. అ. పుం. విఘ్నేశ్వరుఁడు.

**విఘ్ననాశనుఁడు.** సం. వి. అ. పుం. విఘ్నేశ్వరుఁడు, గణపతి.

(ఇట్లే: విఘ్ననాశకుఁడు.)

**విఘ్నపడు.** మి. అ. క్రి. (విఘ్నము + పడు) అడ్డిపోవు, విఘ్నితమగు.

క. ఆ జాలిచేల నిర్మల, బీజహవిస్తంత్ర మేను శ్రీలి నొనర్పంగా జగతి వఱపునం జెడు, నే పెన్నను విఘ్నపడునె నేఁటికివగవక ... భార. అశ్వ. ౪. ౨౬౨.

**విఘ్నము.** సం. వి. అ. పుం. ౧. అంతరాయము, అడ్డంకి, చెఱుపు. ౨. శ్రమము, కష్టము. ౩. కరమర్దము, కలివె చెట్టు. (వాచ.)

**విఘ్నరాజు.** సం. వి. అ. పుం. విఘ్నేశ్వరుఁడు, గణపతి.

**విఘ్నవినాయకుఁడు.** సం. వి. అ. పుం. విఘ్నేశ్వరుఁడు, గణపతి.

**విఘ్నహారి.** సం. వి. న్. పుం. - విఘ్నములు పోఁగొట్టువాఁడు - విఘ్నేశ్వరుఁడు.

**విఘ్నితము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. విఘ్నములు కలిగినది, ఆటంకపఱుపఁబడినది. ౨. అడ్డు కొట్టఁబడినది.

**విఘ్నేశ్వరవాహనము.** సం. వి. అ. న. ఎలుక.

(ఇట్లే: విఘ్నేశవాహనము మొ.)

**విఘ్నేశ్వరుఁడు.** సం. వి. అ. పుం. గణపతి, ఈశ్వరుని పుత్త్రుఁడు, విఘ్నముల కధిపతి.

(ఇట్లే: విఘ్నేశానుఁడు, విఘ్నేశుఁడు. మొ.)

**విచ(-చి)కిలము.** సం. వి. అ. పుం. ౧. ఒక జాతి మల్లె. †. ౨. మదనవృక్షము, మ్రంగ చెట్టు.

**విచక్షణుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. సూక్ష్మదృష్టిగలవాఁడు, దూర దృష్టిగల వాఁడు, వివేకశాలి. ౨. బుద్ధిమంతుఁడు. ౩. నిపుణుఁడు, నేర్పరి. ౪. చదువు కొనినవాఁడు, చదువరి.

వి. అ. పుం. పండితుఁడు, విద్వాంసుఁడు.

**విచక్షించు.** సం. స. క్రి. విమర్శించు.

దండకము. ... ఇంతింబరీక్షించి బుద్ధిన్ విచక్షించి తన్మాలమాయా పరాభూత జామాత... భోగినీ దండకము.

**విచక్షుఁడు.** సం. విశే. (స్) - విచక్షుష్కుఁడు. ౧. కన్నులు లేనివాఁడు, గ్రుడ్డివాఁడు. ౨. కలఁత పడినవాఁడు, విమనస్కుఁడు, దుఃఖితుఁడు.

**విచయనము.** సం. వి. అ. న. ౧. వెదకుట. ౨. పువ్వులు మొ. కోయుట. (వాచ.)

**విచయము.** సం. వి. అ. పుం. ౧. అన్వేషణము, వెదకుట. ౨. పరిశోధనము.

**విచరించు.** సం. అ. క్రి. విచారించు, సంతాపపడు.

ఉ. హైదరు జంగు సంపున మహాహవకేళిఁ గోట చుట్టి బాహాదృఢ విక్రమోద్ధతిర యమ్మున సైన్యముచ్చి నిల్చె నిమ్మోఁది విచారమెట్లు నియమేయ పరాక్రమ రంగ రాయ ధాత్రీదయితుఁ గ్గుతించి విచరించిరి యచ్చటి పెద్ద మానిసుల్. రంగా. ౩. ౨౪.

**విచరితము.** సం. వి. అ. న. తిరుగుట, సంచారము.

**విచర్చిక.** సం. వి. ఆ. స్త్రీ. పామ, చర్మరోగభేదము, గజ్జి.

**విచర్చితము.** సం. విణ. (అ. ఆ. అ.) పూయఁబడినది, రాచఁబడినది, రుద్దఁబడినది.

**విచలనము.** సం. వి. అ. న. ౧. మిక్కిలి కదులుట, మిగులఁజలించుట. ౨. మార్గము నుండి తప్పుట, తొలఁగుట. ౩. చాంచల్యము, స్థైర్యములేమి. ౪. గర్వము, గురహంకారము.

**విచలము.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి కదలునది.

**విచలుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) గురహంకారము గలవాఁడు, గర్వి.

**విచారకుఁడు.** సం. వి. అ. పుం. - విచారించువాఁడు - ౧. పరిశోధకుఁడు, పరీక్షకుఁడు. ౨. న్యాయాధికారి.

**విచారజ్ఞుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) నిర్ణయింప సమర్థుఁడు, తీర్పరి.

**విచారణ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పరీక్ష, పరిశోధనము, సందిగ్ధమైన విషయమును తత్త్వనిర్ణయమునకై ప్రమాణములతోఁ బరిశీలించుట. ౨. ఆలోచన. ౩. సంశయము, ఎటులును దోఁచనిస్థితి. ౪. మీమాంసశాస్త్రము.

**విచారణము.** సం. వి. అ. న. ౧. విచారణ, పరిశోధనము, పరిశీలనము. ౨. ఆలోచన. ౩. సంశయము, ఎటులును దోఁచని స్థితి.

**విచారణీయము.** సం. విణ. (అ. ఆ. అ.) విచారణ చేయఁదగినది.

**విచారపడు.** మి. అ. క్రి. (విచారము + పడు) సంతాపించు, చింతిల్లు. (శ. ర.)

**విచారభువి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. న్యాయస్థానము, న్యాయసభ. ౨. యమసభ, యముని కొలువు.

**విచారము.** సం. వి. అ. పుం. ౧. పరీక్ష, పరిశోధనము, సందిగ్ధ విషయమును తత్త్వ నిర్ణయమునకై ప్రమాణములచేఁ బరిశీలించుట. ౨. (అభియోగము) విచారించుట, సత్యము తెలుసికొనుటకై సాక్ష్యము మొ. ది వినుట. ౩. ఆలోచన. ౪. వివేకము, యుక్తాయుక్తపరిజ్ఞానము. ౫. నిశ్చయము, నిర్ణయము. ౬. ఎన్నిక, ఏర్పుకొనుట. ౭. సందేహము, ఎటులును తోఁచనిస్థితి. ౮. దూరదృష్టి.

**విచారముచేయు.** మి. స. క్రి. ఆలోచించు, విచారించు.

ఉ. మజ్జన భోజనాదులకు మాపుసయించుటకు
స్వఘనామణుల్, సజ్జనగేహ మొక్కటి
విచారముచేసి యొసర్చి వాలిపెన్, సజ్జఁ
దొఱఁగి యచ్చటఁ బ్రసన్నత నిల్చిన లింగ
ముకా భవా, పజ్జలరాశికుంభజాని భక్తి భజిం
పఁగఁబోవసంతటన్. కాశీ. ౪. ౧౬౬.

**విచారశీలుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఆలోచన గలవాఁడు, వివేకి. ౨. దూరదృష్టి గల వాఁడు.

**విచారస్థలము.** సం. వి. అ. న. ౧. న్యాయస్థానము. ౨. యుక్తివాదము, యుక్తి యుక్తముగు వాదము.

**విచారి.** సం. విణ. (న్. ఈ. న్.) ౧. తిరుగువాఁడు, త్రిమ్మరి. ౨. తిరుగుఁబోతు, భోగలంపటుఁడు. ౩. ఆలోచన కలవాఁడు, వివేకి.

**విచారించు.** సం. స. క్రి. ౧. పరిశీలించు.

వ. ... పంచబాణ శరంబులని ప్రమాణంబు
విచారించు విరహ పరితాప పరిహారణనిపుణ
పురంధ్రీ గణంబుల ...
ఉ. హరి. ౫. ౧౩౬.

వ. మత్ప్రసాదంబున నతీతానాగతవర్తమాన దర్శియగుటంజేసి విచారించి పనుపుమనిన. మార్కం. ౫. ౧౫౪.

౨. పరామర్శించు.

మ. ... అగ్నిహోత్రమును నిత్యంబున్ విచారింతువే ... శశాం. ౪. ౮.

౩. ఆలోచించు.

గీ. ఇవ్విధంబునఁ దమతమ యెఱుఁగు తెఱఁగు, లందఱును జెప్పవిని కురునందనుండు, దగ విచారించి కార్యంబు తెగువ గాంచి, యెలమివారలఁ గనుఁగొని యిట్టులనియె. భార. విరా. ౩. ౧౧౨.

గీ. అనుపలట్లోడి వాలఖిల్యాది మునులుఁ, దార గురునిపాలికిఁ జని దైత్య వరుల, నోర్చు తెఱఁగు విచారించు చుండ వారి, కెలమి మిగుల బృహస్పతి యిట్టులనియె. మార్కం. ౭. ౨౨౧.

౪. అ. క్రి. సంతాపించు.

వ. ... పుత్త్రహత్యాది దోషంబును పుత్త్రవిహీనత్వంబును బ్రాప్తంబయ్యెనే యని విచారించి ... కాశీ. ౨. ౬౨.

**విచారితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఆలోచింపఁ బడినది. ౨. పరిశోధింపఁ బడినది, పరిశీలింపఁబడినది, పరీక్షింపఁబడినది. ౩. నిశ్చయింపఁబడినది, నిర్ణయింపఁబడినది.

వి. అ. న. ఆలోచన.

**విచార్యము.** సం. విణ. (అ. ఆ. అ.) విచారింపఁదగినది.

**విచి = వీచి.** సం. వి. ఈ. స్త్రీ. తరంగము, అల. (వాచ.)

**విచికిత్స.** సం. వి. ఆ. స్త్రీ. ౧. సంశయము, నిశ్చయములేమి. ౨. తప్పు.

**విచితము.** సం. విణ. (అ. ఆ. అ.) వెదకఁ బడినది, పరిశోధితము, పరిశీలింపఁ బడినది.

**విచితి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. అన్వేషణము, వెదకుట. ౨. పరిశోధనము, పరిశీలనము.

**విచిత్ర.** సం. వి. ఆ. స్త్రీ. తెల్లసుప్పి.

**విచిత్రకము.** సం. వి. అ. పుం. వృక్షవిశేషము, కొండరావిచెట్టువంటి యొక చెట్టు.

న. ఆశ్చర్యము, వింత.

**విచిత్రదేహము.** సం. విణ. (అ. ఆ. అ.) మనోజ్ఞమైన (ఇంపైన) దేహముగలది.

వి. అ. పుం. మేఘము, మబ్బు.

**విచిత్రము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఆశ్చర్యకరమైనది, వింతయైనది. ౨. కర్బురము, నానా వర్ణములు కలది. ౩. వివిధము, పలువిధములైనది. ౪. మనోహరము, ఇంపైనది. ౫. చిత్తరువుగా వ్రాయఁబడినది, ఆలేఖ్యము.

వి. అ. న. ౧. శబలవర్ణము, చిత్రవర్ణము ౨. ఆశ్చర్యము, వింత. ౩. ఒకానొక యర్థాలంకారము.

**విచిత్రవీర్యుఁడు.** సం. వి. అ. పుం. చంద్రవంశపు రాజు. (శంతనునికి సత్యవతి యందుఁ బుట్టినవాఁడు. భీష్ముని తమ్ముఁడు. ధృతరాష్ట్ర పాండురాజులతని పుత్త్రులు.)

**విచిత్రాంగము.** సం. విణ. (అ. ఆ. ఈ. అ.) చిత్రవర్ణమైన శరీరముగలది.

వి. అ. పుం. ౧. నెమిలి. ౨. పెద్దపులి.

**విచిన్వకము.** సం. వి. అ. పుం. ౧. వెదకుట, అన్వేషణము. ౨. పరిశోధించుట.

**విచిన్వకుఁడు.** సం. వి. అ. పుం. వీరుఁడు,

**విచీర్ణము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఆక్రమింపఁబడినది. ౨. ప్రవేశింపఁబడినది.

**విచేతనము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. చైతన్యము లేనిది, ప్రాణము లేనిది, చచ్చినది. ౨. జడము, మొద్దుబాఱినది.

**విచేతసుఁడు.** సం. విణ. (స్.) ౧. చెడ్డమనస్సు గలవాఁడు, ఒరులకుఁ జెడుగు కోరువాఁడు. ౨. విరుద్ధమయిన చిత్తముగలవాఁడు, అవివేకి, మూర్ఖుఁడు. ౩. దుర్మనస్కుఁడు, దిగులొందిన మనస్సు గలవాఁడు.

**విచేష్ట.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ప్రయత్నము, పూనిక, ఉద్యమము. ౨. ప్రవర్తనము, నడవడి. ౩. నడక, గమనము.

**విచేష్టించు.** సం. స. క్రి. మిక్కిలి చేష్టించు, మిక్కిలి చేష్టలుగలదానిఁగాఁ జేయు.

సీ. పురుషోత్తముం డెల్ల భువనంబులును దాన
యఖిల భూతాత్మకుండై విహారలీల విచే
ష్టించు ... భార. ఉద్యో. ౨. ౧౩౭.

**విచేష్టితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. చేష్టాశూన్యము, చేష్ట లుడిగినది. ౨. యత్నింపఁబడినది. ౩. పరీక్షింపఁబడినది, పరిశోధింపఁ బడినది. ౪. తప్పుగాఁ జేయఁబడినది.

వి. అ. న. ౧. కృత్యము, పని. ౨. పూనిక, యత్నము. ౩. కుట్రతంత్రము. ౪. అభినయము. ౫. వ్యాపారము, పని, చేష్ట. ౬. తంత్రము, కుట్ర.

**విచ్చె.** వి. నాలుగువ్రేళ్లకుఁ జుట్టితీసిన నూలిచుట్ట. (శ. ర., బ్రౌ.)

**విచ్చేఁబాఱు.** అ. క్రి. (విచ్చు + పాఱు, స్వార్థమున.) పాఱు, విచ్చు.

సీ. జంతమయూరమా యింత గర్వంబుఁ జే
విఱిసిమై పాఱలెత్తి విచ్చఁబాఱి ...
కలువాయి. ౮. ౧౪.

**విచ్చలవిడి.** వి. ౧. స్వాతంత్ర్యము, స్వేచ్ఛాప్రవృత్తి.

క. ఎచ్చోటనైన నధనుఁడు, విచ్చలవిడి నుండు
లేదు వెలిపించుకయున్ ...
భార. శాం. ౪. ౩౬.

చ. ... విచ్చలవిడి నీకు నాతనికి సంగతి
చేకులు ... దశకు. ౮. ౮౬.

క. అచ్చుగఁ బ్రయాగలోపల, విచ్చలవిడిఁ
దనువు మేను విడిచినఁ గనుఁ జుండ్రో చెల్ల యేమి
చెప్పను, జెచ్చెరఁ గను నిష్ట కామ్య సిద్ధి
ధరిత్రిన్. భోజరా. ౧. ౧౭౨.

౨. స్వేచ్ఛ.

వ. ... చిందమంతు కంపగప్ప దిగ్విజయయా
త్రయుం బోని యచ్చవెన్నెల విచ్చలవిడిం
గాయుచుండంగ ... కాశీ. ౩. [illegible]౩.

వ. ... విచ్చలవిడిం దిరుగుబోఁడుగులును ...
నీలా. ౩. ౧౦.

క్రి. విణ. నిరాటంకముగా.

వ. ... ఆకృతాంగి మరల కన్నుదామరలు
విచ్చి విచ్చలవిడి వెడలెడి యశ్రుజలధారా
ప్రవాహంబులు చెక్కుటద్దంబులపై జాలు
వాఱ ... ఉ. రా. ౬. ౨౮౬.

**విచ్చేలు.** వి. విచ్చేలవిడి.

ఉ. అచ్చర మచ్చికంటులకునై కడుహెచ్చిన
మచ్చరంబుతో, విచ్చలుగాను మెచ్చుగ
వివేకము లెల్లను వెచ్చఁబెట్టి వీరిచ్చటఁదొమ్మి
గూడి కలహించిన తేరుగ నేలఁబట్టు నీరచ్చల
నొంపఁగావల యు రాయని యింద్రుఁడుచే
యమర్చుచున్. అహల్యా. సం. ౧. ౧౦౯.

**విచ్చేవిచ్చేలు.** అవ్య. యథాయథలు. (శ. ర., బ్రా.)

**విచ్ఛాయము.** వి. (సం. విచ్ఛాయా) రత్నదోష విశేషము. (శ. ర.)

**విచ్చికము.** విణ. దుష్టము.

తే. కక్కసపు వంకగోరులఁ ద్రొక్కి-త్రొక్కి,
కఱకుముక్కున సందండ కఱచికఱచి,
పూసరొక్కటియుఁ బోఁగునఁ బొందనీక,
చెరిపె ముత్యాలపేరు విచ్చికపుఁబులుఁగు.
పాండురంగ. ౪. ౨౩౯.

**విచ్చిలు(ల్లు) = విచ్చు.** అ. క్రి. (√ విచ్చు) విడివడిపోవు.

శా. ... విచ్చిరెం, గోలంబుల్ బెదరెంజ
మూరుగణమాక్రోశించెఁ బంచాస్యముల్,
తాలంకావరజుండు మందరమహాధాత్రీ
ధరం బెత్తినన్. హర. ౬. ౪౭.

**విచ్చు.** అ. క్రి. ౧. (పుష్పాదులు) వికసించు, విడుచు.

క. అచ్చెన్ననాసతోడను, తిచ్చపడక మొనసి
తునిని తేకత్తివడిన్, విచ్చెంజంపక ముకు
ళము, చెచ్చెరమతి నవ్వుఁబువ్వ స్నేహం
బూనెన్. రసి. ౭. ౮౫.

చ. వరుఁడిఁక నేమిసొమ్ముడుగ వచ్చెనటంచును
నల్గుదాస నా, సరసకటాక్షబాణములఁ
జల్లగ నుల్లము విచ్చఁబొడ నా, చరణ
సమీపభూములకుఁ జయ్యనఁజేరఁడె యేమి
సేతు సుం, దరులకు నాథుఁడింతదయ దప్పిన
నేమగు వామలోచనా. గంధ. ౧. ౮౧.

వ. ... కైశికముతోడఁ బ్రభాతశశాంకు వోస
వి, చ్చిననవహల్లకాళిఁగయి సేసి ...
ఆము. ౨. ౧౬.

ఉ. క్రచ్చఱఁబారిజాత లతికావనదేవత జంభ
వైరిపైఁ, మచ్చికఁ గూర్పఁగా నవకుసు
ప్రకరంబుల వెల్లువేటిలో, విచ్చిన వైడి
తామరల వెంబడివచ్చిన కమ్మగాడ్పులన్,
మెచ్చులరీతిఁ గోకిలసమీరణ దీవనలిచ్చె
నొప్పుగన్. హర. ౬. ౧౦.

౨. చీలు, భేదిల్లు.

క. చొచ్చి చతురంగవితతులు, విచ్చునటులు
సేయుటయును విష్వచ్చుఁడు తేవచ్చితల
పడినఁ బురికొని, యచ్చట నిరువాఁగునట్ట
లాడంబోరెన్. భార. భీష్మ. ౨. ౩౯౪.

క. తరువోకటి పెఱికిలాంగల, ధరుఁడుద్ధతిఁ
బూంచిహయరథ ద్విపసుభటో, త్కరముల
ద్రుగ్గింపఁగన, న్నెరవులు విచ్చుటయు
మేదినీధరుఁ డలరెన్. హరి. ఉ. ౩. ౯౩.

౩. విరియు, విడిపోవు.

సీ. సంసారజీమూత సంఘంబు విచ్చుచే చక్రి
దాస్యప్రభంజనము లేక ...
భాగ. ౭. స్కం. ౧౪౨.

చ. ఖురముల నేలఁద్రవ్వుచు నకుంఠితవాల
సమీరణంబులన్, విరవిరఁబోయి మేఘ
ములు విచ్చ విషాణము లొడ్డికొంచు దు, స్త
రతరమూర్తియై వృషభదైత్యుఁడు ...
భాగ. ౧౦. స్కం. పూ. ౧౧౪౨.

చ. వెలవెలఁబాఱెఁ దూర్పునలుదిక్కులవిచ్చెఁ
దమంబుపక్షులుం, గలకలఁ బల్కె ...
బిల్హ. ౩. ౧౮౩.

వ. ... జవ్వనంపుఁ గ్రొవ్వునవిచ్చటిల్లి మవ్వం
పువాతెఱలు విచ్చనవ్వ ... పరిచారికా
సహస్రంబును గూఁతునకు వరణంబుగా
నిచ్చి మఱియును ... మనుచ. ౫. ౧౦౧.

౪. నశించు.

శా. ... తీవ్రతరాంగసంభవ శరశ్రేణీవిదాహ
వ్యథల్, విచ్చం దీరని భక్తిలోహృదయ
మావిర్భూత మోదంబునన్, నవ్వందీఁగ

యుఁ బోలెఁ జూడ్కి గ్రాదవట్ సత్కృతుఁ
డుత్కంఠతన్. కాశీ. ౩. ౧౮౦.

౫. బ్రద్దలగు, వ్రీలు.

మ. ధరఖుల్యాటుఁ దోకండు సూర్యకర సంత
ప్తప్రధానాంగుఁడై, త్వరతోడం బలువెత్తి
చేరినిలిచెం దాళద్రుమచ్ఛాయఁ దచ్చిరముం
దత్ఫలపాతవేగమున విచ్చెన్ శబ్దయోగం
బు గాన్. భద్రా. ౧. ౮౫.

౬. వికలమగు.

క. జనులెట్టిది శత్రువిధం బని చెప్పుదు రట్టి
చందమారయఁగా దుర్యోధనుఁడ శకునికిని నా
యొడ్డ, వినుము కలిగె దీనమనసు విచ్చెం
గుటిలా. భార. కర్ణ. ౨. ౧౦౪.

౭. తెఱచియుండు.

ఉ. ఏనుఁగుపాటఁ జూచినను నేటితటంబున
దానకాంతుఁ జే, రాముదసాకుచందమున
హస్తము విచ్చియ యుండువానికిన్ ...
కాశీ. ౭. ౨౩౪.

స. క్రి. ౧. విప్పు, విడఁదీయు.

వ. విన్నపంబు చేసి తమ తెచ్చిన విధ్వస్తోపకర
ణంబులు విచ్చిచూపి ...
ఉ. హరి. ౧. ౧౧౧.

వ. ... తదలంకార చామరంబులు గెండును
విచ్చి పుచ్చుకొని ... కళా. ౧. ౧౭౦.

౨. విరియఁజేయు, వ్యాపింపఁజేయు.

చ. పతిఁగని ... ప్రీతి జ్యాయతసితదీధితుల్
గలయ నద్రిజ విచ్చె మహేశుమీఁద ...
కు. సం. ౭. ౯౦౧.

౩. ఎఱుకలు విచ్చిచేయుండను, తెఱచే ...
భార. ఉద్యో. ౩. ౩౦౧.

౪. అచ్చట నచ్చట నిడుపుగ, విచ్చిన గురు
మొత్రస్త్ర శాస్త్ర వేదుల మనముల్, మెచ్చిం
చుఁ డెరలమంజిడి, పచ్చడనులు చతురశీతి
బంధంబులతోన్. నైష. ౭. ౧౫౫.

౩. తెఱచు.

చ. వెడవెడఁ గన్నుమూయుఁ గనువిచ్చు నగుం
దలయూఁచు ... పారి. ౧. ౧౦౧.

ఉ. ... ఇంకన్నాహారము గమ్మునాకని గుహా
సదృశంబగు నోరువిచ్చినన్ ...
భా. రా. సుం. ౪౩.

౪. వికసింపఁజేయు.

చ. అనవిని మోము విచ్చుచు మురాంతకు
నిట్లనుఁ గుంతి పాండునందనులకుఁ
దండ్రియు గురువు దైవము నారయ నీవ
కావె ... భార. ఉద్యో. ౩. ౨౦౭.

గీ ... నవ్వినట్లల్ల విచ్చెఁ గలయ మూఁగులు
కేతకీ గహనతతులు ...
ఆము. ౪. ౯౪.

౫. చీలుచు, ఛేదించు.

క. విత్తము సంసృతి పటలము, వ్రత్తము
కామాదివైరి వర్గంబులనేఁ, జిత్తము
చిత్తము హరికిని, జొత్తము నిర్వాణపదము
శుభమగు మనకున్. భాగ. ౭. ౨౪౯.

వ. ... ఎడయిచ్చిన వజ్రంబును జను మఱి
గ్రుచ్చి వెనువిచ్చి చనలేక యచ్చట నే
యున్నన్ ... దశా. ౨. ౪౩౩.

౬. విడిచిపెట్టు, త్యజించు.

ఉ. సోరణగండ్ల రాఁగొదమ చుక్కలు పట్ట
నతు లక్కవాటముల్, చేమప ... ప్రొద్దు
వోఁగా రతి దస్సిగాడ్పులకుఁ గాఁచెఱ
సం జను విచ్చి మేడలన్. ఆము. ౨. ౧౩.

౭. విడఁగొట్టు, తొలఁగించు.

సీ. పాలిండ్లు గదలంగఁ బసపు బయ్యెద
విచ్చు నచలాధిపతి కూర్మియాఁడుబిడ్డ ...
కాశీ. ౨. ౫౩.

విశ. చీలినది, విడిపోయినది, విదారితము.

సీ. ... శ్రోత్రఘచ్ఛటలు విచ్చుగ రచించితి
సూక్తినైపుణి జ్ఞాన చింతామణి కృతి ...
ఆము. ౧. ౧౩.

౨. వికాసము.

సీ. ... సకల సత్త్వపురాణ సారాంశముల
హెచ్చు కైవల్యరమచేలికల్వ విచ్చు ...
ఘటికా. ౧. ౧౪౦.

జ: విచ్చుఁబోఁటులు, విచ్చులు, విచ్చుకత్తి, విచ్చుకొను, విచ్చుటాకు, విచ్చునొగ్గ.

**విచ్చుకత్తి.** వి. (విచ్చు + కత్తి) ఒఱ దూసిన కత్తి.

చ. వెలుఁగడి యెప్పుడెప్పు డరి వీరులఁ గాఁకు దమంచు విచ్చుకత్తుల బెడఁగుం దళత్తళ లతోఁ దనముందట వచ్చుచేవ వీరులకును జేయి వీచుటయు రోసముతోఁ జని దైత్య వీరులం, దలపడి రా సురాసురులు దార్కొని రుగ్రతరాగ్రహంబునన్.
ఉ. రా. ౪. ౨౯౦.

మ. మొనకు న్వచ్చిన విచ్చుకత్తులనికే ముస్తీదు మేల్ రౌతులం, దునమాడంగను గల్గిపార్శ్వమున యందుం గ్రమ్మ నశ్వంబులం, దన బల్లెమ్ముఁ గ్రుమ్మ క్రమ్మలుచు వెన్కన్ దారసిల్ జోదులన్, గని దూరంబు దొలంగఁ జేయుఁ బటు దోర్గర్వం బఖర్వం బుగన్. కృష్ణ. ౩. ౩౪.

సీ. ... విచ్చుకత్తుల వారు వెంటరా నందలంబును నిబ్బరంబుగాఁ బోవ నిచ్చు ...
కువల. ౫. ౯.

**విచ్చుకొను.** స. క్రి. (విచ్చు + కొను) విప్పుకొను.

క. వచ్చినఁ బోడఁగాంచి పెనల్ విచ్చుకొని కడుం దలంకి విసదారిగముల్, విచ్చునొగ్గయి కడలకు, విచ్చలవిడిఁ బఱచెఁ గట్లు వీడెం బజ్జెకున్. అ. రా. యు. ౧౬౩.

**విచ్చుటాకు.** వి. (విచ్చు + ఆకు.) ౧. కర్ణపత్రము, చెవ్వాకు.

సీ. గీ. విచ్చుటాకు చెవ్వాకన వెలయుఁ గర్ణ
పత్రనామంబు ... ఆం. భా. ౨. ౧౪౭.

౨. విరిసిన యాకు.

సీ. జలితంపు విచ్చుటాకుల దుద్దుఁ గమ్మలు
నిద్దంపుఁ జెక్కుల నీడఁ జూడ ...
క్రీడా. ౧౦౧.

**విచ్చునొ(మొ)గ్గ.** విశ. (విచ్చు + మొగ్గ). ౧. చెల్లాచెదరైనది.

క. వచ్చినఁ బోడఁ గాంచి పెనల్, విచ్చుకొని కడుం దలంకి విసదాలిగముల్, విచ్చునొగ్గయి కడలకు, విచ్చలవిడిఁ బఱచెఁ గట్లు వీడెం బజ్జెకున్. అ. రా. యు. ౧౬౩.

శా. ... విచ్చునొగ్గ విరాలి మొగ్గయగుచున్ విచ్చేసిరయ్యంగనల్ ... తపతీ. ౪. ౬౯.

చ. ... ప్రమథ్యేక యింతయు విప్ప విచ్చుమొగ్గయి మఱిపానిపోదురు సమస్త దిశాగతులైన యక్షగుల్ ... ఆము. ౪. ౧౩౧.

మ. కరుణం బ్రోచిన మిత్రుఁడేఁగెను గళంకంబూను చెల్లప్పుడున్, గురుకద్వేషి నిశాచరుఁడనుచులోకుల్ నిందగావించు నిష్ఠురభావుండరుదేఱఁ గీడ్వఱచునంచున్ విచ్చుమొగ్గచనెన్, జరితార్థాత్మకళత్ర వృత్తమగుచున్ జక్రద్విజవ్రాతముల్.
భోజసుతా. ౫. ౧౦.

సీ. ... ముచ్చు చేరువులకు విచ్చుమొగ్గ ...
కవిజ. ౩. ౭౧.

వి. ౧. విరియుమొగ్గ. ౨. చెల్లాచెదరగుట.

సీ. ... ఎలమిఁ బొల్పగు యూథికలకు సంతలకూటములకును మఱి విచ్చుమొగ్గలొదవె...
ఆము. ౪. ౧౨౩.

(పై రెండర్థములకు నిదియే యుదాహరణము.)

**విచ్చేయు** - విజయముచేయు. అ. క్రి. ౧. (పూజ్యులు) వచ్చు.

శా. ... నిర్వాణదాన క్రియాశీలుండైన పరాశరాత్మజుఁడు విచ్చేసెం గృపాలోలుఁడై.
భార. అశ్వ. ౩. ౧౬౪.

శా. ... వేదవ్యాసమునీశ్వరుండు కరుణన్ విచ్చేసె నచ్చోటికిన్ ...
హరి. ఉ. ౯. ౧౪.

క. ...విచ్చేయుము తల్లికడుపు వెడలిముకుందా.
భాగ. ౧౦. ౧౦౧.

౨. (పూజ్యులు) వెళ్లు, పోవు.

క. ఆసమయంబున రైభ్య మహాసంయమి యేఁగుదేర నర్ఘ్యాదివిధుల్, చేసి వసునృపతి యొటు విచ్చేసెదవు మునీంద్ర నాకుఁ జెప్పుమటన్నన్. వరాహ. ౨. ౫.

మ. అడుగ న్నిన్ను వరంబు వేగమ యహల్యాజార విచ్చేయ నా, కడురాజార్ధవిభూషణుండు వరమీను న్నాఁడు యుష్మద్భృశుల్, బడుఁగు ల్వాంఛిత మీ సమర్థులె ...
కాశీ. ౪. ౫౦.

సీ. ... పరమేశుఁ డతనిసద్భక్తికి మెచ్చి కలలోన నొకనాఁడు గదిసి వరము, తే. వేఁడికొను మన్న నిరువుర వేఁడె సుతుల, శివుఁడు నిచ్చితి నంచు విచ్చేసె నంత.
ఉ. హరి. ౪. ౭.

౩. ప్రవేశించు, చొచ్చు.

తే. రమణి హృదయంబునను మహారాజ నీవు, గరిమ విచ్చేసియుండినకారణమున, దీని వక్షోరుహంబు లాలోన నుండ, నెడము లేకున్న మరికదా వెడలె వెలికి.
నైష. ౮. ౭౭.

౪. కూర్చుండు.

క. నిచ్చలు లోపలికాంతలు, మచ్చికఁ దన తోడ నాడుమాటలు నాతున్, ముచ్చటలు చెప్పమెల్లన, విచ్చలవిడిఁ దొడల మీఁద విచ్చేసినృపా.
భాగ. ౧. ౩౭౧.

ద్వి. ఇంతకంటెను భాగ్య మెయ్యది యనుచు, సంతసం బొదవ హజారంబు మీఁద, విచ్చేసియుండిరి ...
ద్వి. పరమ. ౨. (చి. ని.)

**విచ్ఛంద(క)ము.** సం. వి. అ. పుం. ఈశ్వర గృహభేదము, అనేక భూమికలుగు మేడ.

**విచ్ఛర్దకము.** సం. వి. అ. పుం. = విచ్ఛందము.

**విచ్ఛర్దనము.** సం. వి. అ. న. క్రక్కుట.

**విచ్ఛర్దితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. క్రక్కఁబడినది, బహిష్కరింపఁ బడినది. ౨. అశ్రద్ధ చేయఁ బడినది, నిర్లక్ష్యము చేయఁబడినది. ౩. విడువఁ బడినది, త్యజింపఁబడినది. ౪. చెఱుపఁబడినది. ౫. క్షీణింపఁజేయంబడినది.

**విచ్ఛాయ.** వి. రత్నదోష విశేషము.

క. తనజాడ మెరుగు వెలుగును, దనరక మలినంబు వెలఁయు దనకాంతవేలు, వ్మణి విచ్ఛాయయను మేదిని, నొనరఁగ విడుచుదురు దీని ధీయుతులెనఁగా.
రత్నపరీక్ష. ౬౩. ప.

(ఈ పద్యమందు గణభంగమును విశ్రమభంగమును గలవు.)

**విచ్ఛాతము.** సం. విణ. (అ. ఆ. అ.) పాలిపోయినది, వివర్ణమైనది, కాంతిలేనిది.
వి. అ. పుం. ప్రశస్తమైనకాంతిగలరత్నము.
న. పక్షులగుంపునీడ.

**విచ్ఛిత్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. నఱుకుట, తునియఁజేయుట, తగులఁగొట్టుట, చీల్చుట. ౨. విభజించుట, వేఱుచేయుట. ౩. కనఁబడకపోవుట, లేకపోవుట. ౪. ముగియుట,

సమాప్తి. ౫. రంగులతోఁగాని సుగంధి తైలములతోఁ గాని శరీరము పూయుట, మైపూఁత లలఁదుట. ౬. (ఇల్లు మొ. వాని) హద్దు. ౭. పద్యపాదమునందలి నిలుపుచోటు, విరతి. ౮. వస్త్రములు పగలు సమృద్ధిగా లేకున్నను శరీరసౌందర్యము చేరిసే మిక్కిలి యొప్పిదమును దోఁపఁజేసెడి స్త్రీల శృంగార చేష్టా విశేషము.

**విచ్ఛిన్నము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. నఱకఁబడినది, ముక్కలు చేయఁబడినది. ౨. చీల్పఁబడినది, పగులఁగొట్టఁబడినది, విభజింపఁ బడినది. ౩. నిషేధింపఁబడినది, ఆటంకపఱుపఁ బడినది. ౪. అంతమొందినది, ముగిసినది. ౫. చిత్రచిత్రముగాఁ జేయఁబడినది. ౬. దాఁచఁ బడినది. ౭. సుగంధి తైలాదికములతో పూయఁ బడినది. ౮. కంపఁబడినది. ౯. కుటిలమైనది.

**విచ్ఛురితము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. కప్పఁబడినది, ఆచ్ఛాదితము. ౨. తాఁకఁ బడినది, స్థగితమైనది. ౩. పూయఁబడినది, రాచఁబడినది, రుద్దఁబడినది.

**విచ్ఛేదనము.** సం. వి. అ. న. = విచ్ఛేదము.

**విచ్ఛేదము.** సం. వి. అ. పుం. ౧. ముక్కలుగాఁ జేయుట, నఱుకుట. ౨. విభజించుట, వేఱు పఱుచుట. ౩. పగులఁగొట్టుట. ౪. విఘాతము, ఆటంకము. ౫. ఆఁగిపోవుట, అంతమగుట. ౬. తొలఁగించుట, నివారణము. ౭. విరోధము, పగ. ౮. గ్రంథభాగ విశేషము. ౯. అవకాశము, తెఱపి, విరామము. ౧౦. వంశ పరంపరయొక్క నాశము, వంశము అంత మగుట.

**విచ్ఛేదించు.** సం. స. క్రి. ఖండించు.

శా. ... సేనానిం బదహస్తమస్తములు విచ్ఛేదించి మోదించినన్ ... జై. ౬. ౧౪౧.

**విచ్యుతము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. భ్రష్టము, జాఱిపోయినది. ౨. భ్రష్టముగాఁ జేయఁబడినది, తొలఁగింపఁబడినది. ౩. (మంచి మార్గము మొ. వాని నుండి) తప్పినది, తొలఁగినది. ౪. పక్కకట్టి రాలిపోయినది.

**విచ్యుతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. భ్రష్టమగుట, పడిపోవుట, జాఱుట, విడిపోవుట. ౨. క్షయము, క్షీణించుట, నాశము. ౩. (మంచి మార్గము నుండి) తొలఁగిపోవుట. ౪. చెడిపోవుట. (గర్భ విచ్యుతి మొ.)

**విజననము.** సం. వి. అ. న. ౧. ప్రసవము. ౨. ఉత్పత్తి, పుట్టుక.

**విజనము.** సం. విశే. (అ. ఆ. అ.) జనులు లేనిది, ఏకాంతమైనది, నిర్జనమైనది.

వి. అ. న. నిర్జనప్రదేశము, రహస్యస్థలము.

**విజన్ముఁడు.** సం. విశే. (న్) వి. న్. పుం. జారజుఁడు, పరపురుషునివలన జన్మించిన వాఁడు.

**విజపిలము.** సం. వి. అ. న. బురద, పంకము. (వా. న.)

**వి(క్క)జము.** సం. వి. జ్. పుం. ౧. పక్షి. ౨. పాచిక.

**విజయ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. దుర్గ. ౨. దుర్గ యొక్క పరిచారకురాండ్రలో నొకతె. ౩. విశ్వామిత్రుఁడు రామునికుపదేశించిన విద్య. ౪. ఆశ్వయుజశుక్ల దశమి. ౫. గంజాయి చెట్టు. ౬. ఉసిరిక చెట్టు. ౭. వావిలి చెట్టు. ౮. మంజిష్ఠ. ౯. ఒకజాతి జమ్మి. ౧౦. వెల్లి చెట్టు. ౧౧. విజయద్వాదశి, శ్రవణ నక్షత్రముతోఁ గూడిన శుక్లపక్ష ద్వాదశి.

శ్లో. యదాతు శుక్లద్వాదశ్యాం, నక్షత్రం శ్రవణం భవేత్, తదాసాతు మహాపుణ్యా, ద్వాదశీ విజయాస్మృతా.

**విజయం(యము)చేయు.** మి. అ. క్రి. (విజయము + చేయు.) ౧. వచ్చు, విచ్చేయు.

శ్లో. భవేద్విజయ తశ్చేయుర్గతా కర్త్రు ప్రపూజనే, మారఖండో భవేద్బింగుర్వాత దంతస్యవేం విచా. (చి. ని.)

క. పాయక పెక్కుతపంబులు, సేయు ప్రసూనినులకైనఁ జేర నశక్యం, బీయరద మెక్కి విజయం, బేయుము జగతీశ తపవు సేయక యనినన్. విక్ర. ౨. ౭౯.

మ. అజరుద్రుల్గని పోరు చూచుటకొ యీ యాదాయ మాశించియో, విజయం చేసితి రయ్య మారిచటికిన్ వేవేగ విద్వన్మణీ ... కళా. ౫. ౧౨౫.

ఉ. వినుఁ డీఁడగు సంబంధపు, బెనయికఁ గని మోచి తెచ్చి యిచ్చె ననరె చుక్కని నరులుగాన మాపురమునకు న్విజయంబు సేయఁ బుత్రిక నిత్తున్. ఆము. ౬. ౫౦.

౨. పోవు, అరుగు.

క. వసలితిరి విచిత్రకథా, ససమృత్తిం వప వెలుంగ రాక యనుష్ఠానసమయమయ్యె నభోమధ్యసవిపంబునకుఁ దరణియరదము వచ్చెన్.

సా. విజ్ఞానం శ్రేయుఁడు నావుదు న్మునులు ... నిర్వ. ౪. ౧౩౫.

వ. అని వినుతించి గరుత్మంతుండు దేవా యేను నీ తలంపులోనివాఁడ ... ఇదె యా యితల శైతిసెక్కి మెక్కడ విజయం చేసెద నక్కడ నడిచెద ననిన ... హరి. ఉ. ౭. ౭౪.

సీ. లోకమ్ము పట్టణమున కలిపఁ దోడ్కొని విజయంబు చేసెను మహోహర్ష మొప్ప ... ఆము. ౩. ౪౧.

**విజయంతుఁడు.** సం. వి. అ. పుం. ఇంద్రుఁడు. (చూ. వైజయంతము.)

**విజయకుంజరము.** సం. వి. అ. పుం. పట్టపు టేనుఁగు, రాజు లధిష్ఠించెడి యేనుఁగు, యుద్ధమున నుపయోగపడెడి యేనుఁగు.

**విజయచ్ఛందము.** సం. వి. అ. పుం. ఏనూఱు పేటలు గల హారము.

**విజయడిండిమము.** సం. వి. అ. పుం. ఢక్క, ఒకవిధమగు చర్మవాద్యము. (ఇట్లే విజయమర్దలము మొ.)

**విజయదశమి.** సం. వి. ఈ. స్త్రీ. ఆశ్వయుజ మాసశుక్లపక్షదశమి.

**విజయము.** సం. వి. అ. పుం. ౧. జయించుట, గెలుచుట. ౨. జయము, గెలుపు. 3. దేవతావిమానము, దివ్యరథము. ౪. ప్రభవాది సంవత్సరములలో నొకానొకటి.

**విజయసప్తమి.** సం. వి. ఈ. స్త్రీ. ఆదిత్యవారమున వచ్చిన శుక్లపక్ష సప్తమి.

**విజయసిద్ధి.** సం. వి. ఇ. స్త్రీ. గెలుపునొందుట.

**విజయి.** సం. వి. న్. పుం. జయశీలుఁడు, గెలుపు నొందినవాఁడు.

**విజయించు.** సం. స. క్రి. గెలుచు.

ద్వి. వెసఁ గౌరవుల సేన విజయింపలేమి, వసుధేశుఁ జేల యొవ్వరు సెయింగుదురు ... ద్వి. భార. విరా. ౪. ౭౨. పా.

**విజయుఁడు.** సం. వి. అ. పుం. ౧. అర్జునుఁడు. ౨. యముఁడు. ౩. విష్ణుని ద్వారపాలకులలో నొకఁడు.

**విజయేశుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు.

**విజయోత్సవము.** సం. వి. అ. పుం. విజయ దశమినాఁడు దుర్గాప్రీతికై చేసెడి యుత్స వము.

**విజరము,** సం. విశే. (అ. ఆ. అ.) - ముదిమి లేనిది. ౧. ప్రాయమున నున్నది. ౨. నూత నము, అభినవము.

వి. అ. న. (ఆకు మొ. వాని) కాఁడ.

**విజల్పము.** సం. వి. అ. పుం. ౧. ప్రేలుట, వదరు, వ్యర్థసంభాషణము. ౨. మాట, సంభా షణము. ౩. కోపవాక్యము.

**విజల్పితము.** సం. విశే. (అ. ఆ. అ. ౧. పలుకఁ బడినది, చెప్పఁబడినది. ౨. ప్రేలఁబడినది, వదరఁబడినది.

**విజాత.** సం. వి. ఆ. స్త్రీ. పిల్లలఁ గన్న స్త్రీ.

**విజాతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. భిన్నజాతి, వేఱు జాతి. ౨. మాఱురకము, వేఱువిధము.

**విజాతీయము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. భిన్నజాతులకు సంబంధించినది, వేర్వేఱు విధ ములు గలది. ౨. భిన్నజాతికి (వర్ణమునకు) సంబంధించినది. ౩. సంకరజాతికి సంబంధించి నది.

**విజాతీయుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) వేఱు జాతికిఁ (వర్ణమునకు) జెందినవాఁడు, అన్యజాతి వాఁడు, భిన్నధర్మావలంబి.

**విజాతుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. నీచ ముగాఁ బుట్టినవాఁడు, పరపురుషునివలనఁ బుట్టినవాఁడు. జారజుఁడు. (వాచ.) ౨. పుట్టిన వాఁడు. ౩. రూపాంతరము నొందిన వాఁడు.

**విజానత్.** సం. విశే. (త్) = విజ్ఞుఁడు. (దీనికి తెలుఁగున వ్యస్త ప్రయోగము లేదు. సమాన పూర్వ పదముగానే ప్రయుక్తము.

**విజిగీష.** సం. వి. ఆ. స్త్రీ. ౧. జయింపవలె ననెడి యిచ్ఛ. ౨. స్పర్థ, పోటీ, ఒకనిని మించవలెననెడియిచ్ఛ. ౩. పొట్ట పోసికొను టకై నింద్యమైన కృత్యమునఁ బ్రవర్తించుట. (వాచ.)

**విజిగీషువు.** సం. విశే. (ఉ.) ౧. జయించవలె నని కోరువాఁడు, జయాభిలాషి. ౨. ఒకనిని మించవలెననెడి కోరిక కలవాఁడు. ౩. పొట్ట పోసికొనుటకై నింద్యమైన కృత్యమునఁ బ్రవ ర్తించువాఁడు.

వి. ఉ. పుం. ౧. వీరుఁడు, యోధుఁడు. ౨. ప్రతిస్పర్థి, ఎదిరివాఁడు, శత్రువు.

**విజిత.** సం. వి. ఋ. పుం. ౧. నిర్ణయించువాఁడు. ౨. భాగస్వామి, వాటాదారు.

**విజితాత్ముఁడు.** సం. విశే. (న.) తన్నుఁ దాను లోఁ బఱుచుకొనినవాఁడు, తనయాత్మను స్వాధీన పఱుచుకొన్నవాఁడు.

**విజితి.** సం. వి. ఇ. స్త్రీ. విజయము, గెలుపు.

**విజితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) జయింపఁ బడినవాఁడు, లోఁబఱుచుకొనఁబడినవాఁడు.

**విజిన(ల)ము.** సం. వి. అ. పుం. న. సరసమ్యం జనము, పలుచని పులుసు.

**విజిహ్మము.** సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి కుటిలమైనది, మిగుల వంకర యైనది.

**విజిహ్మ్రుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) మిక్కిలి కుటిలుఁడు, మర్యాద లేనివాఁడు, ఆర్జవ హీనుఁడు.

**విజులము.** సం. వి. అ. పుం. బూరుగుచెట్టు. ("శాల్మలీ కందము." అని రా. ని.)

**విజృంభణము.** సం. వి. అ. న. ౧. ఆవులించుట, ఆవులింత, జృంభ. ౨. (పుష్పము) వికసించుట, వికసించుట. ౩. ప్రదర్శించుట, కనఁబఱుచుట. ౪. వ్యాపించుట, వ్యాపనము. ౫. వినోదము, శృంగారక్రీడ.

**విజృంభించు.** సం. అ. క్రి. ౧. చెలరేఁగు.

వ. ఇవ్విధంబున సమ్మహాదేవిచేత నిజసైన్యంబు నిరవశేషంబైన విజృంభించి యమ్మహిషాసురేంద్రుండు ... తదీయగణంబుమీఁదఁ గవిసి. మార్కం. ౬. ౧౦౪.

౨. వికసించు. (శ. ర.)

**విజృంభితము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. ఆవులించినది. ౨. వికసించినది, విరిసినది. ౩. ప్రదర్శింపఁబడినది, కనఁబఱుపఁబడినది. ౪. గోచరమైనది, కనఁబడినది. ౫. విహరించినది.

వి. అ. న. ౧. ఆట, వినోదము. ౨. ఇచ్ఛ, కోరిక. ౩. ప్రదర్శనము, కనఁబఱుచుట. ౪. కృత్యము, పని. ౫. ఫలితము.

**విజ్జన(ల)ము = విజినము.** సం. వి. అ. న. ౧. వ్యంజన విశేషము, పలుచని పులుసు కూర లయినవి. ౨. బాణము.

**విఙ్జు.** వి. తన్నుకొనుటయం దగుధ్వని కనుకరణము.

సీ. ... చంపకప్రసవవాసన సోఁకి రొలఁకెటి కూలి విఙ్జనఁ దన్నికొనియొనేని ...
పి. శకుం. ౩. ౧౯౦.

సీ. ... పల్యాణములఁ గ్రిందఁ బడినరాహుత్తులఁ గూలి విఙ్జనఁ దన్నుకొనెడి హరులు.
జై. భా. ౫. ౧౯౨.

సీ. తే. విఙ్జువిఙ్జనఁ దన్నంగ విడువ రెలమిఁ, గఱకుటంఘ్రుల నిఱికించి గజ్జె గదల, గఱికెనెఱికెకో లెమ్మ్రకయును విఱుగ, విఱిచె వడిఁ గైజా నొకపెద్దపేఁడంబు.
మనుచ. ౪. ౭౫.

అ. క్రి. వ్యాపించు, అలముకొను.

సీ. కిసలయంబులతోడఁ గెంగేలు దడఁబెట్టి యిరులపై నఖకాంతి విఙ్జరాల్చి ...
ఉ. హరి. ౫. ౫౦.

**విజ్జులము.** సం. వి. అ. న. దాల్చినచెక్క, లవంగపట్ట.

**విజ్జులిక.** సం. వి. ఆ. స్త్రీ. చీకురువాయి, ఒక జాతి గబ్బిలము. (రా. ని.)

**విఙ్జోడు.** విశ. (వీడు + జోడు.) ౧. జోడు కానిది, సరిరానిది.

సీ. క్రతువులు విఙ్జోడైనచోఁ దంత్రి బిగువుగాఁ బీడించు గిటగిట బిగుడఁద్రిప్పి ...
వైజ. ౧. ౧౧౭.

సీ. మారేడుబుఱ్ఱలో మంత్రాక్షతంబులు సదనులవిఙ్జోడు పాదరక్షలు ...
శుక. ౨. ౪౪౨.

౨. ఎడఁబాటు నొందినది.

శా. చూడంజాలక మిత్రబాంధవుల విఙ్జోడై చనంజేయువో ... కవిరా. ౩. ౧౩౧.
(చంద్రోపాలంభనము.)

**విఙ్జోడు(ప)వడు.** అ. క్రి. (విఙ్జోడు + పడు) భేదిల్లు, భేదపడు.

సీ. ....శారదావదన ప్రతిబింబాది నామకర్మ, కల్పనాకేళిప్రకార మాత్రములైన యస్మ దాఖ్యానక్రియాదికముల

గీ. తోడ నెందు నొకింత విజ్ఞోడుపడక, సమ మగుట రొట్టొ యను విచారము గలి గియు. కళా. ౫. ౧౭.

సీ. విజ్ఞోడుపడ నిడ్డ చెంద్రుకజందెంబు వలి గుబ్బపాలిండ్ల కెలఁకు లారయ ... క్రీడా. ౧. ౧౦౧.

**విజ్ఞప్తము.** సం. విణ. అ. ఆ. అ. ౧. గౌరవ ముతోఁ దెలుపుకొనఁబడినది, మనవిచేసికొనఁ బడినది. ౨. తెలుపఁబడినది.

**విజ్ఞప్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. విన్నపము, మనవి, గౌరవముతోఁ దెలుపుకొనుట, ప్రార్థన. ౨. ప్రకటన, ప్రచురణము. (ఆ. ని.)

**విజ్ఞాతము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. తెలి యఁబడినది, గ్రహింపఁబడినది. ౨. ప్రఖ్యాత మైనది, ప్రసిద్ధికెక్కినది.

**విజ్ఞానము.** సం. వి. అ. న. ౧. జ్ఞానము, తెలివి, గ్రహణశక్తి. ౨. ప్రజ్ఞ, సూక్ష్మభేదములను తెలిసికొనుబుద్ధి. ౩. నైపుణ్యము, నేర్పు. ౪. లౌకికజ్ఞానము, లోకానుభవమువలనఁ గలి గిన తెలివి. (జ్ఞానము = బ్రహ్మజ్ఞానము. విజ్ఞా నము = తద్వ్యతిరేకజ్ఞానము.) ౫. ఉద్యో గము, పని, వ్యాపారము. (మే. ని.) ౬. సంగీ తము. ౭. చతుర్దశ విద్యలజ్ఞానము. ౮. (బౌద్ధ మతమున) ఆత్మరూపజ్ఞానము.

**విజ్ఞానస్కంధము.** సం. వి. అ. పుం. బౌద్ధ మతమునందలి పంచస్కంధములలో నొకటి.

(స్కంధములు: రూపస్కంధము, విజ్ఞాన స్కంధము, వేదనాస్కంధము, సంజ్ఞా స్కంధము, సంస్కారస్కంధము. అని యైదు.)

**విజ్ఞానికుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) = విజ్ఞుఁడు.

**విజ్ఞానేశ్వరుఁడు.** సం. వి. అ. పుం. యాజ్ఞ వల్క్యస్మృతికి మితాక్షరి యనువ్యాఖ్య రచిం చిన యతి.

**విజ్ఞాపకుఁడు.** సం. వి. అ. పుం. ౧. విజ్ఞాపన, చేయువాఁడు, తెలుపుకొనువాఁడు. ౨. బోధ కుఁడు, ఉపాధ్యాయుఁడు.

**విజ్ఞాపన.** సం. వి. ఆ. స్త్రీ. ౧. మనవి, విన్న పము, ప్రార్థన. ౨. తెలుపుట, తెలియఁ జేయుట. ౩. బోధించుట.

**విజ్ఞాపనము.** సం. వి. అ. న. = విజ్ఞాపన.

**విజ్ఞాపించు.** సం. స. క్రి. విన్నవించు.

క. కంసాపరాధంబుల ననఁబోధింపక తగు స్తర క్రియలకు ననుమతింపవలయునని విజ్ఞాపింపు మనియె ... హరి. పూ. ౯. ౧౭౯.

మ. ...కల్యాణి నాహార్మ్యసం, దన నీ నాత్మఁ దలంచి కేవరకు విజ్ఞాపింప నేఁ గాంచితిన్. వరా. ౬. ౩౪.

**విజ్ఞాపితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. మనవి చేయఁబడినది, గౌరవముతోఁ దెలుపఁబడినది. ౨. ప్రార్థింపఁబడినది. ౩. తెలుపఁబడినది. ౪. బోధింపఁబడినది. ఎఱుక చేయఁబడినది.

**విజ్ఞాప్యము.** సం. విణ. (అ. ఆ. అ.) మనవి చేయఁదగినది, విన్నవింపఁదగినది.

వి. అ. న. మనవి, విన్నపము, ప్రార్థన.

**విజ్ఞుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. తెలిసిన వాఁడు, చదువరి. ౨. నేర్పరి, పనివాఁడు.

వి. అ. పుం. విద్వాంసుఁడు, పండితుఁడు.

**విజ్వరుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. జ్వరము లేనివాఁడు. ౨. సంతాపము లేనివాఁడు.

**విటంక(క)ము.** సం. వి. అ. పుం. న. ౧. పావురపు గూఁడు, కపోతపాలిక. ౨. పర్వత శిఖరము, కొండకొన.

**విటంకితము.** సం. విణ. (అ. ఆ. అ.) గుర్తు పెట్టఁబడినది, ముద్రవేయఁబడినది.

**విటకత్తె.** దే. వి. వ్యభిచారిణి, వలపుకత్తె.

గీ. విటుని వలె హరి సొగసుగ వేస మొసఁగఁ,
దాల్చి విటకత్తె వలె సుందరాంగిఁగూడి,
పాదుకల మెట్టికొంచు నా ప్రథితయజ్ఞ,
వాటిఁ జేరంగ జూచుచు వచ్చుచుండె.
వేం. మా. ౧. ౧౩౮.

**విటకాఁడు.** దే. వి. విటుఁడు.

గీ. తనదు ప్రాయంబు నెఱి చక్రవసముఁ
దానె, కాంచి విటకానిపొంగు కేకారి
పొరలుఁ, బట్టఁ జాలని తమిదొట్టి గుట్టు
నిడక, హాళికుని కోడ లారార బాళిఁగోడ.
ఉ. హరిశ్చ. ౪. ౧౭.

క. విటకాని మానినీయ్యం, బటుకుసఁ
గూర్పుండఁ బెట్టి గరుణీమణి సెం,గట
నుండె హారమూర్తిక, ఘటితాంగు కుండ
నంపు గద్దియ నీవల. సురా. ౧౦౪.

సీ. విట సామర్థ్యమున విటకాఁడు వేడుక
కాఁడు బాజాఁగు నన్నుకాఁడు లంజెకాఁ
డనఁగ ... ఆం. భా. ౨. ౧౧౬.

**విటతటమార్చు.** స. క్రి. (విటతటము + ఆర్చు)
౧. తాఱుమాఱుచేయు.

ద్వి. విద్వేషవాదుల విటతట మార్చి ...
బస. పు. ౬. ౧౯౩. పా. ౨౧. పం.

౨. తుత్తుమురుచేయు.

ద్వి. వెస జైనప్రతిమల విటతట మార్చి,
వసదులన్నియు ద్రచ్చి వైపించెఁగాదె ...
బస. పు. ౬. ౧౦౧. పం.

**విటతాటనము = వీటతాటనము.** విణ. తాఱు మాఱు, వ్యత్యాసము.

సీ. మండితధ్వజదండమండలంబులఁ గిట్టి విట
తాటనంబుగా విఱిచి విఱిచి ...
భార. విరా. ౫. ౫౬.

వ. విటతాటనంబులగు హేమకుంభంబులును...
ఉ. హరి. ౧. ౫౩.

సీ. ఒక్కొక్కరథముతో నొక్కొక్కరథ
మును విటతాటనంబుగా నుఱుఁగఁగొట్టి ...
మై. . సుం. ౧౪౧.

**విటతా(త)టమాడు.** స. క్రి. (విటతటము + ఆడు.) ౧. తాఱుమాఱుచేయు.

ద్వి. విశ్వధాన్యసమయుల విటతాటమాడు ...
పండితా. వాద. ౨౦౫. పా. ౧౦. పం.

౨. తుత్తుమురు చేయు.

ద్వి. వెస జినప్రతిమల విటతాటమాడి, యెసఁగు
నాఁడే జైను లెక్కుడఁ జనిరి ...
పండితా. వాద. ౨౦౦. పా.

**విటతా(తటము).** విణ. తాఱుమాఱు, వ్యత్యస్తము.

ద్వి. అమగారులను నీరసావనీజములఁ, దమ
కించి తా విటతాటంబుసేయు, నని దరికొను
నిలయానిలుపగిదిఁ, దసరు నిట్టూర్పులఁ
దఱుచైనదాని.
రం. రా. యు. ౩౩౩. పా. ౨౯. పం.

క. ఫుటమెగసి తాళవృక్షము, చటిలోద్ధతిఁ
బూని పెఱికి సారథి నవనిన్, విటతట
ముగఁ బడవైచెను, బటుభుజసత్వంబు
మెఱయఁ బవనజుఁ డల్కన్.
మై. ౩. ౭౨.

ద్వి. కర్మేంద్రియంబులు కనుకని పాతె, వికృ
తులాటును లోన విటతాటమయ్యె, నికృతి

హృత్కృతి నుతి నిందాసమత్వ, మంతఃకరణ
ముల కనుమతంబయ్యె.

ప్రభులిం. ౪. ౧౩౭. పా. ౯. పం.

వి. కుర్రుమురు.

వ. చక్రకుంతపట్టసప్రాసకోదండ గదాదండ
శూలాది సాధనంబులు విటతాటంబులు
చేసియు ... వి. పు. ౭. ౫౯.

గీ. కీలు కీలుకు విఱుచుట గేరును విట, తాట
మనఁగాను ... ఆం. భా. ౩. ౩౯.

జ : విటతటమార్చు, విటతాటమాడు.

**విటపము.** సం. వి. అ. పుం. ౧. కొమ్మ, శాఖ.
౨. ఆకులు, చివుళ్లు మున్నగు వానిగుంపు,
జొంపము. ౩. నూతనాంకురము, క్రొత్త
మొలక. ౪. గుంపు, తోఁపు. ౫. వ్యాప్తి,
వ్యాపనము, విస్తరించుట. ౬. స్తంబము,
కాడ. ౭. పల్లవము, చివురు. (వాచ.) ౮.
ముష్కవంక్షణాంతరస్థానము, అండములకు
గజ్జెకు మధ్యప్రదేశము. (వాచ.)

**విటపి.** సం. వి. న్. పుం. ౧. వృక్షము, చెట్టు.
౨. మఱ్ఱిచెట్టు, వటవృక్షము.

**విటపిమృగము.** సం. వి. అ. పుం. శాఖా
మృగము, క్రోఁతి.

**విటమాక్షికము.** సం. వి. అ. న. ధాతుభేదము,
ఒక విధమగు ఖనిజము.

**విటము.** సం. వి. అ. పుం. ౧. ఎలుక. ౨. ఖది
రము, చంద్రచెట్టు. ౩. నారింజచెట్టు. ౪.
చిగురుఁగొమ్మ. ౫. ఖనిజ లవణము, జాతి
యుప్పు.

**విటరాయఁడు.** వి. విటశ్రేష్ఠుఁడు.

క. పటుతరమగు మద్వాణా స్ఫుట మధురరవంబు
చెవుల సోఁకిన మాత్రన్, విటరాయఁడైన
గానీ, ఘటదాసుఁడు గాఁడె యొక్క ఘడి
యటి లోనన్.

రుక్మాం. ౨. ౧౨౩. (శ. ర.)

**విటలవణము.** సం. వి. అ. న. ఖనిజలవణము,
జాతియుప్పు.

(ఇది మందుల కుపయోగపడును.)

**విటి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. పీతచందనము, పచ్చ
గంధము.

**విటుఁడు.** సం. వి. అ. పుం. ౧. పల్లవుఁడు,
మిండఁడు, జారుఁడు. ౨. విషయాసక్తుఁడగు
మనుష్యుఁడు. ౩. శృంగారనాయకుని యను
చరుఁడు.

(సంగీతసాహిత్యకళావిద్యాశిల్పాదులయందు నేర్పరి
యైన యీతఁడు నాటకముల యందువిదూష
కుని వలె నుపయోగించును.)

౪. శఠుఁడు, దుర్మార్గుఁడు.

**విటుకు.** వి. విలాసము. (చి. ని.)

చూ. విటుకులాఁడి.

**విటుకులాఁడి.** వి. (విటుకులు + ఆఁడి) విలా
సాలు, కులుకులాఁడి.

క. అని చిలుక తేనియలు బోరని యొదు జడి
వాన వెలిసినటువలెఁ బలుకన్, తనయం
తనె తా నిల్చిన, విని కోపటి విటుకులాఁడి
వెసనిట్లనియెన్. శుక. ౨. ౫౯.

(" చిటుకులాండి " అని ముద్రి. పా.)

**విట్కారిక.** సం. వి. అ. స్త్రీ. పక్షివిశేషము,
ఒకజాతిపక్షి.

**విట్ఖదిరము.** సం. వి. అ. పుం. వృక్షవిశేషము,
వెలితుమ్మ. ?.

**విట్చరము.** సం. వి. అ. పుం. సులభతుకము,
ఊరఁబంది.

**విట్ఠ(ట్ఠ)లుఁడు.** సం. వి. అ. పుం. పంఢరపురమున వెలసిన విష్ణుదేవుని యర్చామూర్తి.

**విట్టు.** సం. వి. ష. స్త్రీ. ౧. మలము, పురీషము. ౨. వ్యాప్తి, విస్తృతి. ౩. కన్యక.

**విట్పణ్యము.** సం. వి. అ. న. సరకు, వాణిజ్యసామగ్రి, సామాను.

**విట్పతి.** సం. వి. ఇ. పుం. ౧. ప్రజానాయకుఁడు. రాజు. ౨. అల్లుఁడు. ౩. పెద్దవర్తకుఁడు, పెద్దబేహారి.

**విట్సంగము.** సం. వి. అ. పుం. (విష్ + సంగము) మలబంధము, విరేచనబంధము.

**విట్సారిక.** సం. వి. ఆ. స్త్రీ. పక్షివిశేషము, పీతిగోరువంక.

**విడంగము.** స. విశే. (అ. ఆ. అ.) నిపుణము, నేర్పుగలది.

వి. అ. న. కడుపులోని క్రిములను బోఁగొట్టుట కుపయోగించెడి యొకయోషధి, వాయువిడంగము.

**విడంబన.** సం. వి. ఆ. స్త్రీ. ౧. అనుకరణము. ౨. మాఱువేషము, కపటవేషము. ౩. వంచన, మోసము. ౪. వ్యసనపెట్టుట, గాసిపెట్టుట. ౫. బాధించుట. ౬. ఆశాభంగము గలిగించుట. ౭. పరిహసించుట, పరిహాసము, వెక్కిరింత. ౮. తిరస్కరించుట, తిరస్కారము. (వా. స.)

**విడంబనము.** సం. వి. అ. న. = విడంబన.

**విడంబము.** సం. వి. అ. పుం. ౧. అనుకరణము. ౨. బాధించుట, ఉపద్రవముచేయుట.

**విడంబించు.** సం. స. క్రి. ౧. పోలు, అనుకరించు.

వ. ... వికచారవిందదీర్ఘికల విడంబించు కావులును ... భార. విరా. ౩. ౨౩౬.

సీ. బాలార్కబింబప్రభాడంబరంబు విడంబించు పీతాంబరంబుతోడ ...
వరాహ. ౧. ౫౭. (౧. ౫౭.)

౨. మోసపుచ్చు. (శ. ర.)

౩. వచించు.

మ. తరుణీచిత్తము భూసురోత్తమునిమీఁదం జేర్చి లజ్జాతిగస్ఫురణీ సుప్తముగా నొనర్చి యిటు లేకాంతంబు దుర్దాంతదుర్భరచింతం బడఁ బంతమమ్మ మును వాక్ప్రౌఢిన్ విడంబింతుగా ... విక్ర. ౧. ౧౩౧.

అ. క్రి. అతిశయించు.

క. ... గోవర్ధనాద్రిఁ బొల్చుటి, తావసనిడి మహిమతో విడంబించుటయున్.
వి. పు. ౭. ౨౫౪.

**విడంబితము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. అనుకరింపఁబడినది. ౨. పరిహసింపఁబడినది, ఎగతాళి చేయఁబడినది. ౩. మోసపుచ్చఁబడినది, వంచింపఁబడినది. ౪. విసిగింపఁబడినది. ౫. భంగపఱుపఁబడినది, విఫలముగాఁ జేయఁబడినది. ౬. అధమము, నీచమైనది.

వి. అ. న. పరిహాసపాత్రము.

**విడఁగొట్టు.** స. క్రి. (విడన్ + కొట్టు) విడిచిపెట్టు, పరిత్యజించు.

క. చిలుకలు కిమ్మఁ దిమ్మెరలు శీతమయూఖుఁడుఁ జేటులాదిగాఁ, గలసనవిల్తుసాధనని కాయము లేలము పట్టులంగనా, కుల మటుగాన దాని విడఁగొట్టక తృప్తికదొట్ట శీత ర్యాగుల మని విజృంభిఁ గదటు కొందఱు బోడలు గానగండలై. పాండు. ౧. ౧౭౨.

**విడఁజిమ్ము.** స. క్రి. (విడన్ + చిమ్ము) విడుచు.

నగడ. దొరయు నొక్క పరిపాటి దొరలకు దొర
కవి విడికెంపు మిన్నలు ...
శుక. ౧. ౨౨౨. ౧౦. పం.

౩. (క. తె. విడి.) విసర్జనము, విడుచుట.

సీ. ఉజ్జైనమనఁగను నుజ్జగింపనఁగను విడియన
విడుపన విడుదలయన ... అలరు విసర్జ
నాహ్వయము ... ఆం. భా. ౨. ౧౪౩.

౪. తడవ.

గీ. శిఖలు వీడఁగ ముఖములు జేగురింపఁ, గటము
లదరంగ నొక్క విడిఁగాటులాడి, రొం
డొకల మీఁద శాపంబు లుగ్గడించి, హస్త
ములయందు సలిలంబు లందుకొనిరి.
భీమ. ౪. ౧౫౪.

౫. రీతి, విధము. (రకము.)

సీ. గీ. ... చెవుల నెలరాల కొమ్మాట్లు లవట
సీమ, సన్నవిడి గాడరుద్రాక్షసరము
లమర ... సారంగ. ౩. ౧౫౦.

గీ. జిలజిలను సన్నవిడిగఁ బట్టెలను దీర్చి,
దుడుము మగటాల మెలకువ తోలపు
బొబ్బ, మెకము నెమ్మోము దనువున
మించు గద్దె, నరిగఁ గూర్చుండుమని పౌరి
నురపనుండు. పార్వ. ౨. ౧౧౬.

౬. ప్రత్తి కాయలోని జేడ.

గీ. నింగి యనిరాడి ప్రత్తి చేనికిని రక్త, బలి
యిడి రనంగ నెఱ సంజె తోలంత సమరఁ,
దఱుచుగా దాన విఱిసిన మెఱుఁగుఁ బ్రత్తి,
విల్లువాఁ జొక్కు లెంతయు నుల్లసిల్లె.
కళా. ౮. ౧౨.

క్రి. విశే. ఒంటరిగా, విడిగా.

క. ఆసమయంబున భిక్షుని, వేసమున దళాన
నుండు విడిచనుదేరఁగా, భూసుర పూజ
లొనర్చి సుఖాసన మిడి మధుర ఫలము
లర్పించి కడఁకన్. అధ్యా. ౪౮. ౯౦. పా.

జ: విడిగోలు, విడికేలు, విడినీరు, విడి
యాకులు.

**విడిగోలు.** వి. (విడి + కోలు) మాఱుపు.
శ. ర., బ్రౌ.

విణ. పనిలేనిది. (శ. ర.)

**విడిచిపెట్టు.** స. క్రి. (విడుచు[1] + పెట్టు) వదలు,
విడు.

వ. ... పట్టువడిన నన్ను విడిచిపెట్టి ప్రాణంబు
రక్షించిన యుపకారికిం బ్రియంబు సేయుదు
నన కీర్తనే ... నైష. ౨. ౮.

గీ. విజితుఁ గావించి దయ వాని విడిచిపెట్టి ...
అను. ౩. ౬.

**విడిచివాటుగుదియ.** వి. (√ విడుచు[1]) భిండి
వాలము, ఆయుధవిశేషము. (శ. ర.)

**విడిదల.** వి. (విడిది + తల.) ౧. విడియుచోటు.

ఆ. వేఁట దోఁట యనుచు విడిదలఁ బడిపోక,
కలుగు నరులఁ బనిచి హైరితెలఁగు, లరసి
గెలుచు వైరవులన్నియుఁ దలపోసి, విక్ర
మంబు గారవించు నోపక.
హరి. ఉ. ౫. ౧౨౪.

సీ. ఇరుగా మావిడిదల కేసె వచ్చెద నంచుఁ
దమకించు యజ్వలఁ దాకఁ బలికి ...
ఉ. రా. ౪. ౧౪౫.

౨. సేనానివేశనము, దండు దిగిన చోటు.

వ. ... అతండు సైన్యంబుల నివర్తింప
నియమించి సమస్తజనపరివృతుండై.

గీ. విడిదలకుఁ బోయె నప్పుడు ...
భార. భీష్మ. ౩౬౬.

క. పలుమాటల కేమి మఱియు మాటలు వలుకని
కృష్ణుతో నడలు మది పొలవం, బలుకుచు
ధర్మసుతుని విడిదల కరిగెను మోము వెల్ల
దనమున గదురఁగ.
భార. ద్రోణ. ౨. ౨౩౧.

సీ. శూద్రులకును మెట్టు శూరుల విడిపట్టు
మంత్రివర్గములకు మనికి పట్టు ...
శివధర్మోత్త. ౧. ౧౬.

౨. పల్లె, పేట.

ద్వి. బిసినికాయమున గంభీర తోయమున, నస
మానమైన యయ్యమున మార్గంబు, విడిచినఁ
గడ తెంచి వేవేగ గొల్ల, విడిపట్టు నడు
నంగు విడిపట్టు సొచ్చి.
అ. మ. క. ౧. ౨౨. పా. ౧౪. పం.

3. వి. (విడియు + పట్టు) నసచేయుట, నివ
సించుట.

ఉ. అమర విభుండు నేరి వినయాసకుఁడై విడి
పట్టు వైజయంతమునను జిత్తగింపు మాన
నవ్వుచుఁ దద్బల దైత్య వైరి హస్తముఁ
గయిదండ గొంచు ... పారి. 3. ౪౦

**విడిపట్టు².** వి. (విడు + పట్టు) విడునట్టిస్థానము.

క. పడఁతీ తావులకుఁగా, బైపడ నేటికి బాగడ
లివియ పంచాస్త్రునకున్, విడిపట్టు నగుల
సిగ్గుల, విడిపట్టు నగా యటంచు వెలుగుఁ
జేరన్. చిత్రభా. ౨. ౧౨౬.

**విడిపించు.** స. క్రి. (√ విడుచు) విడుచునట్లు
చేయు.

సీ. ..., మెంగి జరాసంధుచే నిగ్రహింపఁబడి
యుండు పృథివీశులను విడిపించి చెలఁ ...
భార. సభా. ౧. ౨౧౪.

సీ. జడలు కంపలు గట్టి జడుగనీకున్న చో
విడిపింప శిష్యుల వెదకువాని ...
ఉ. హరి. ౧. ౧౦౭.

మ. అని పౌలోమి మొగంబు చూచి ఓను మోడు
జ్జాస్య నీకింతమాత్రన విన్నంబడ నేల?
పోరు నీకు నశ్యాగర్వభారంబు దివ్య
వగంబు నివ్వడిపించి నత్తునని సాహంకా
రుఁడై లేచి చ్యవనుని శుద్ధాంతగృహంబు
వెల్వడి సుగర్మాగ్నిస్థానమధ్యస్థుఁడై.
పారి. ౪. ౬౧.

ఉ. ... లీలావతి యున్న పెట్టె యసలంఘ్య
తరంబగు తజ్జలంబునం, బో విడిపించి ...
శుక. ౧. ౪౬౬.

**విడిమట్టు.** వి. (√ విడియు.) ౧. వాసస్థానము.

సీ. గీ. ఎపుడుఁ బాయక యున్న మిస్నేహము
దనరఁ, జెర్మిఁ గొండలకేఁడను పేరు
మెఱయ, వేల్పులకు వింటి కేవర పొల్పుఁ
దాల్చి, జన్నపుఁదిండి విడిమట్టు చలువ
గట్టు. యయా. ౨. ౩౬.

సీ. ... చిత్తనైర్మల్య సంస్థితికిని విడిమట్టు
ప్రహ్లాదనమునకుఁ బట్టుఁ గొమ్మ ...
విప్ర. ౧. ౭౪.

౨. కాఁపురము.

సీ. విప్రాలయములందు విడిమట్టుగా నుండు
వాని నుంటలలోఁ వైవలేదు ...
సుగ్రాం. ౧. ౪.

3. విడిది.

వ. ... గుహిణాచలేంద్రుండు వసతి నియా
మించిన విడిమట్టు ప్రవేశించియుండె ...
హీర. 3. ౧౬౦.

**విడిముడి.** వి. ధనము.

క. వడిగలతివాన నీగిని, విడిముడి పసఁ బ్రాభ
వమున విజయనగరిలోఁ, గడు నెన్న నేర్పుఁ
గల మేల్మనకలఁ జెడ వేంకటాద్రి నర
వరుఁ డొప్పున్. రాఘవ. పీఠి. ౩౭.

గీ. పాడకయి నిక్కి తమినోర్తు పూలు గోయఁ,
బోక ముడిపీడఁ గని నెపంబున నొకటి,
యుడుగు విడిముడిగలదాన వసుచు విరులు,
తెలిసి తానీక గల దొట తెలిసె నదియు.
రామా. ౧. ౧౯౪.

ఉ. కోశవులు మానికములు విడి, ముడియు
న్నా డెందుఁ బుట్టములు ప్రోవులుగా, నుడు
గరలుదెచ్చి యిడి యు, మ్మొయ్యడియనియడుగుల
కెఱంగి యొప్పగాఁ బలికెన్.
అ. రా. కిష్కిం. ౪౮.

చ. విడిముడియన రొక్కమనఁగ విత్తంబు
నకున్, బుడమిని నామములగు ...
ఆం. సం. స్థా. ౩౦.

౨. వీడిన ముడి.

గీ. పొందికయి నిక్కి తమిగోర్తు పూలుగోయఁ,
బోకముడిఁ వీడఁ గని నెపంబునను బోటి,
యడుగువిడిముడిగలదాన యనుచు విరులు,
తెలిసి తానివి గల దోట తెలిసె నదియు.
రామా. ౧. ౧౯౪.

౩: విడిముడి పట్టు.

**విడిముడిపట్టు.** వి. (విడిముడి + పట్టు) స్థిర
గృహము.

సీ. విడిముడిపట్టులు వేలిమి గావించి మల్లెసాలలు
కట్టనుండఁ జేసి ... అ. రా. సుం. ౧౭౨.

**విడియ.** వి. ధనము నుంచుసంచి, (రొక్కపు)
జాలె.

ద్వి. విడియలతో రెండుబేలమాడలును ...
బసవు. ౫. ౨౭౫. పం.

(సం. వీటి) తాంబూలము.

ద్వి. అడికిసమాడల విడియలుగాంచి ...
బ. స. పు. ౫. ౨౯౧. పం.
(౨౯౭, ౨౯౯, ౩౧౧. పం. చూ.)

**విడియము** = విడ్యము, విడెము, వీడియము,
వీడెము.

వి. (సం. వీటికా) (క. వీడి. త. విడైయాం)
తాంబూలము.

గీ. ... కనకకలహంస శాబకాకారమైన, విడి
యపుం బెట్టెఁ జూచి యుక్త్యాధిపుండు ...
నైష. ౩. ౧౦౫.

గీ. ... గీ. ... అర్ఘ్యగుఱు లాఁచి యిడువిడియ
ములపేర ... ఆము. ౨. ౫౮.

సీ. వెన్నుఁడు కర్పూరంపువిడియం బొసంగిన
నాఁగి కైకొనక యుండెదవు సుమ్ము ...
నీలా. ౩. ౯౪.

గీ. సొగసు తెలివాలు నునుసోగసాంపులిసులు,
బెళుకు చికిలి యొయారంపుఁ జేరెముగులు,
సొలపు విడియంపు కేలింపు చులుకుటోర,
చలికి జెదగచ్చు చూపుల కలికిఁ జూచి.
ప్రబంధ. ౧. ౧౦౭.

**విడియాకులు.** వి. బ. (విడి + ఆకులు) భార్యా
భర్తలు విడిపోయినట్లు వ్రాసికొనిన పత్ర
ములు. (వా.)

**విడియించు.** స. క్రి. (√ విడియు) విడియఁ
జేయు, బసచేయించు.

చ. సడియించు రేయు రావణుని బాహుబలం
బున నింద్రుకీటిపై, నడచుచునుండి యిన్నగ
మునన్ విడియించితి సేన నిప్పుడి, య్యెడ కల
పోకవచ్చి సాగయించు విధంబునఁ బోవు
చున్ననిన్, బోడగని కాము బల్మతికనుల్
నను కెమ్మోయి వెత్తఁజేసినన్.
నిర్వ. ౬. ౬౫.

గీ. యమున నడుపెల్ల విడిపల్లయై తలిర్ప,
...లము విడియించి మగధభూపాలకుండు,
మనుజనాథులఁ బిలిపించి మంతనమునఁ,
గార్యమంతయు నూహించి కడఁకఁ మిగుల.
హరి. ఉ. ౨. ౧౩.

క. ధరణీశు లెల్లవచ్చిరి, వెరవున మన్నించి
వారి విడియించితి ...
భా. రా. బాల. ౧౦౭.

**విడియు.** అ. క్రి. ౧. సేన్నలు బసచేయు, బస
చేయు.

సీ. మడుఁగుల పొందుల ప్రమాఁకుల నీడల వెలుఁ వులఁ గనికని విడియువారు ...

కు. సం. ౧౧. ౬౦౦.

క. సభఖణల నొప్పి యనిఁ బాండవబలముల మార్గోగ్రనం గడంగుచు నత్యుత్సమునఁ జేర్చిన సేనల, కవకాశములేదు విడియ హస్తిపురమునకా.

భార. ఉద్యో. ౧. ౨౨౬.

ద్వి. కడు నొప్ప సేతువుగడచి యుబ్బంగి, విడిసె రాఘవుఁడు సువేలాద్రియందు ...

రం. రా. యు. ౩౧౪. పా. ౨౫. పం.

వ. బ్రాహ్మణుల బకాసురుండు బాధించుటయుఁ దమవిడిసినయింటి బ్రాహ్మణునకైన యాపదయు ... భార. ఆది. ౬. ౨౪౪.

ఆ. యజ్ఞవాటమును జనాధిపులకు ముని, వ్రాతములకు విడియ వలయునట్టి, మందిరములు.

భార. అశ్వ. ౪. ౧౩౩.

గీ. అనుచుఁ దద్విశేషంబు లత్యాదరమున, నర్హకోటికిఁ జెప్పుచు నంబుజాక్షుఁ, డంత వట్టివారలఁ దగినట్లు విడియఁ, బనిచెఁ దగు ముహూర్తంబున మన మెలర్ప.

హరి. ఉ. ౭. ౧౦౬.

౨. ఉండెత్తు.

ఆ. భక్తిఁ గొలిచి రాఁగఁ బ్రాగ్జ్యోతిషంబుపై, విడిసెఁ దత్పురమున విఘఁ డనంత, బలముతోడఁ బన్ని భగదత్తుఁ డేతెంచి, విజయుఁ దాఁకె సమరవిజయకాంక్ష.

భార. సభా. ౧. ౨౨౭.

౬. ... భూపాల జయ మవశ్యము నీ, వాలిద నిక్కంబు లంకపై విడియు మికఁకా ...

భా. రా. యు. ౧౨.

చ. ... రసాతలంబుపై, విడియఁగ దండు డిగ్గిన ... ఆము. ౪. ౧౨౭.

౩. (నీతి) షడ్గుణములలో నాలుగవదగు నాసనము నాశ్రయించు, సమయము ప్రతీక్షించు.

క. నడపునఁ గోల్పుచ్చఁగనగు, నెడయు విడిసియుండి చెఱచు నిక్కముగ నీ కేర్పడఁగను ... భార. ఆశ్ర. ౧. ౬౯.

౪. ప్రవహించు.

గీ. నడచి భగవంతు క్షేత్రంబు నడుమఁ జొచ్చి, విరజయను సింధు వెచ్చోట విడిసియుండు, నృహరి ప్రత్యక్షమైయుండు నెట్టిచోట, నట్టిచోటను వైష్ణవి యనఁగఁ బరగు ...

పాండు. ౨. ౨౨౪.

౫. విడిపోవు.

వ. అనుటయు నమ్మునీంద్రులు విడియనాడం దలంచి యతనితోడ ...

ఉ. హరి. ౧. ౯౭.

సీ. ... ధర్మ, విముఖుఁగాకింపుము విడియఁగ నాకు ధర్మమార్గైకతత్పరుని నితని ...

కాశీ. ౫. ౩౧౯.

౬. జాఱు.

గీ. ఆర్ద్ర సన్నంబు గుడుచుచో నంటఁ గలిపి, విషముపెట్టిరి పెట్టిన విడిసిపడక, గరముతోఁగూడ సగరుండు ఘనుఁడు పుట్టె. నర యశస్స్ఫూర్తితోఁ జక్రవర్తి యయ్యె.

భాగ. ౯. ౨౦౨.

(శ. ర. పా. "కరిసిపడక" ముద్రిపా.)

జూ. విడిదల, విడుదలపట్టు, విడిది, విడిదిపట్టు, విడిపట్టు, విడిమట్టు, విడయించు.

విడివడు. అ. క్రి. (విడి + పడు). ౧. (నిర్బంధమునుండి) తొలఁగు.

క. మెడ బిగియఁబట్టుకొని దగఁ, బడిరొడి బాలకునిచేతఁ బర్వత నిభుచే, విడివడఁ

జాలక వాఁడురిఁ, బడిబెగడెడు ఖగము
భంగి భయముం బొందెన్.
భాగ. ౧౦. స్కం. ౨౭౪.

క. పడుచున్ లేచుచుఁ బులిచే, విడివడిన
కురంగిఁబోలి విహ్వలు రాలై ...
ప్రబోధచం. ౩. ౭౪.

సీ. ... గీ. కుచముల మబ్బున విడివడు మెఱుపు
లటుల, కమ్మపొత్తుల తళతళల్ గ్రమ్మ
కొనఁగ, సభకుఁ జనుదెంచె వెయ్యాఱు
సఖులు గొలువ, శ్రీలలితధామ చంద్ర
మతీలలామ. ఉ. హరిశ్చ. ౨. ౧౪.

౨. (తెగనుండి) విడిపోవు; వీడు, విడిపోవు.

వ. ... సాలంకారధేను సహస్రంబులు విడి
వడు నిజవత్సంబులం బిలుచు సంభారవం
బుల వలనన్ ... పారి. ౫. ౭౫.

చ. కలఁగిన కొప్పుతోఁ జెటులు గందముతో
విడివడ్డ పైఁటతో ... కళాం. ౪. ౭౪.

(శ. ర. పా. "విడఁబడ్డ పైఁటతో" ముద్రి. పా.)

వ. ఇట్లు దుర్వాసుం డాశీర్వాదపూర్వకం
బుగా నొసంగిన కుమార పారిజాతమాల్యం
బహల్యాజారుండగు సునాసీరుండు ...
ఐరావణ కరటికుంభ పీఠంబుపై ...
వైచిన ... ప్రమత్తుని కైవసమగు రాజ్య
లక్ష్మి విధంబున విడివడియు, డస్సియు,
గ్రుస్సియు, నాగిలియు, బగిలియు దీన
దశకు వచ్చునం గనుంగొని.
హర. ౬. ౧౬.

౩. నిరాతంకముగాఁ బ్రవర్తిల్లు.

చ. మదవశ భీమసేనుఁడును మాగధరాజుఁ
గడంగి బెబ్బులుల్, విడివడులీల నొండొ
రుల వీఁపులు మూఁపులునుం బ్రకోష్ఠ
ముల్ ... భాగ. ౧౦. ఉ. ౭౩౬.

చ. ... ఏర్పడ నమరేంద్రు బాహుదల పట్టిన
రావణిరోష దీప్తుఁడై, విడివడి మించు
మంచిపటు విక్రమసంపద సొంపు
లర్వఁగా ... భా. రా. యు. ౪౪౪.

క. కప్పురఁపుఁబలుక కలలవడ, విప్పుగ బిగిసే
నెవాన విడివడి కురియం, జొప్పడర హంస
సురపతి, సెప్పెను హేమావతికి శశియ
ముఖికిన్. హంస. ౨. ౭౩.

౪. తెలియఁబడు.

సీ. ... గీ. బయిని పాలించుఁ దన చిన్న
వయసునాఁటి, పడపుసుద్దులు దల పెట్టి
పాఁతబోలి, నోరు విడివడ్డఁ బచ్చిబూతె
రచించు, వివిధ మాయామయోపేత వేశ్య
మాత. వైజ. ౨. ౯౪.

౫. జాఱు.

క. పిడికిట నడఁగెడు నడుమున్, గడుఁ
దియ్యని మేనుభృంగ కలిత సుమంబున్,
విడివడని కొప్పు సేర్పడి, పడఁతుక గతి
యరుర్చ్యి మించి పౌరుషవృత్తిన్.
చిత్రభా. ౨. ౯౫.

౬. ప్రసరించు.

సీ. ..., అడుగు దమ్ముల కాంతి విడివడి పగ
డంపుఁ జిగురుటాకుల మేలు చిందు
సేయ ... జాహ్నవీ. ౪. ౨౧.

౭. బయలుపడు.

సీ. కరము సాఁచి నవాంబుకలశ మీ విడివడ్డ
కుంకుమాంకపు ముద్దుఁ జంక మెఱుపు ...
విజ. వి. ౨. ౧౪౧.

విడివాటు. వి. (√ విడివడు.) ౧. ఏకాకిత్వము,
ఒంటితనము.

ఉ. పట్టిన కార్యము ల్విడువఁ బాడియె పాడి
రొయుంగవోటు సేఁబుట్టిన సుక్కుచచ్చు

విడివాటున నొక్కటి. గాలిఁబోవు నేఁ, గొట్టిన పిండి వాఁడతఁడు ...

చంద్రాం. ౩. ౭౦.

౨. విడిపడుట.

మ. ... పెక్కుల్ రూకలున్ రెండుమూఁడు విడేలాకులు పోకలూని విడివాటున్ గోడలై తక్కటి, భవనప్రాంగణ సీమఁ ద్రిమ్మరుదు రంభః కుంభచేటీ విటుల్.

వైజ. ౨. ౪౧.

**విడివాటుబడియు.** వి. విడిచివాటు గుడియు.

సీ. ... గీ. భావభవుచేతి విడివాటుబడియు దుడ్లు ... కవిక. ౪. ౯౪.

**విడివేఁట.** వి. (విడి + వేఁట) డేగవేఁట.

గీ. అపుడు విడివేఁట యిడుమని యానతిచ్చు, రాజుముంగిలి కడకుఁ జేరంగవచ్చి, లగడు సాళ్వంబుడేగలోనుగను గల్గు, వేఁట పుల్గుల విడిచిన వింటికెగసి.

యయా. ౨. ౨౩.

సీ. ... తెగిన మెకంబులఁ దేలేదు విడివేఁట పిట్టలకును మేఁత పెట్టలేదు ...

కాశీ. ౩. ౮౭.

**విడిపోవు.** అ. క్రి. (విడి + పోవు) వదలు, విడివడు. (శ. ర.)

**విడీనము.** సం. వి. అ. న. పక్షుల గతిభేదము.

**విడు.** స. క్రి. త్యజించు, విడిచిపెట్టు.

మ. ... విడుకోపంబిడ శాంతిఁ గైకొనుము వాగ్వివాద మింతేటికిన్ ...

హర. ౮. ౫౯.

మ. లలనా రత్నముగాన మాధురికి శైలంబుల్ గరంగన్ మృగంబులు మేపుల్ విడి చూచుచుండె ... వాల్మీకి. ౩. ౧౩౩.

క. సమరము నిష్కారణ వైరమునం జాటిన్ల నెల్ల రాజులు భరతోత్తములును మడిసిరి విడు కోపగు దీర్ఘ క్రోధుఁడైన పతి కీ డొందున్. భార. శల్య. ౧. ౫౫.

క. ... నీ వింతయేల పెనఁగెదు, నే విడ నా కన్నులాన నినుఁ గూడ కిఁకన్ ...

సారంగ. ౨. ౧౦౭.

అ. క్రి. ౧. పోవు, అంతమగు.

క. నా చెప్పినట్లు చేసిన, నీ చెఱ విడునట్లుఁ గాక నిలుపోపక నీ, వేచంపి నన్ను నోఱను, వైచుకొనిన మాను నే భవత్ తుత్తెల్లన్ ...

కేయూర. ౪. ౧౦౫.

౨. వీడు, విశ్లిష్టమగు.

సీ. ఓహో సరోజంబు లూడి విడిపడిరెు నేరు కొనంగ వలెనని సకులఁ బిలిచి, ...

వరాహ. ౧. ౫.

చ. ... ఇంచుక వాయి విడ్డ తామర పెఱ వెట్టిపెట్టి పలుమాఱును వాకిలి దాఁటి యాఁగుమున్, మొరయువి పంచి మీఁటుగతి మోసి యళుల్ వెడలెం గొలంకులన్ ...

మనుచ. ౩. ౭౦.

మ. ... దంష్ట్ర సంతోషహృదంతులై దిగధి కాంతుల్ చెంత చింతల్ విడన్ ...

కువల. ౩. ౧౩.

౩. వికసించు.

సీ. ... అధ్వన్యచేతో హుతాశన వ్యజనంబు బుడుత తెమ్మెరకును విడినదంట, రత్యంత తాంత హృద్రసపుష్ట స్థితికర్త చిగుమంగఁ దలకెక్కఁ జేయుదంట. (కర్త-క్రొవ్విరి.)

రా. వి. ౩. ౮౭.

విడఁబల్కు = స్పష్టముగాఁ జెప్పు.

ద్వి. ఏ విడఁబల్కిన భావంబుఁ జూచి, భావ జ్ఞుఁడవయేని పోవంగ వలెద ...

పండితా. పురా. ౧౧౪. పు.

జః విడఁగొట్టు, విడఁజిమ్ము, విడఁదన్ను, విడఁద్రొక్కు, విడఁద్రోచు, విడఁబడు, విడఁబాఱు, విడఁబుచ్చు, విడనాడు, విడిపట్టు, విడివడు, విడివాటు, విడిపోవు, విడుగడ, విడుగర, విడుచు, విడుదల, విడుమర, విడ్వరుచు, విప్పారు, విప్పు, విప్పుగంటి, విప్పువాఱు, విప్పుసేయు.

**విడుగడ.** వి. (√ విడు) విడుదల, విముక్తి.

చ. ... జనుకొను మతంబున నా బలారికిన్, విడుగడసేసె ... నిర్వ. ౪. ౧౨.

క. రాగాదిదోష దూషితమై గర్హితమైన చిత్తమది సంసారం, బాగతిఁ బరిభ్రమించమి, వేగమె భవబంధములకు విడుగడ గాంచున్. వాసిష్ఠ. ౨. ౧౪౮.

**విడుగర.** వి. (√ విడు) విడుదల, విమోచనము.

క. ఊరిద్రెవ్వఁ గొతికి యిప్పుడ, వేవారఁగ నీకు నేను విడుగరసేయం, దొరకొనుట నీకు భాగ్యం, బరిత్వము దొఱంగి మైత్రియఁ లఱపుమదిన్. భార. శాం. ౩. ౨౦౫.

ఆ. అనిన నట్లయగుట నాత్మ నెఱింగియు, కాదె సంధియైన నాగుబ్రదుకు, నీకు విడుగరయును నిజముగు టూహించి, నిన్నుఁ జెందె బుద్ధి నిశ్చయంబు. భా. శాం. ౩. ౨౦౮.

**విడుగు.** అ. క్రి. వికసించు.

క. ముడిఁగొఁ దొగలడఁగె తెక్కులు, విరిగెఁ బయోజమ్ము లుడిగె వెన్నెలలటు ... శుక. ౧. ౨౩౫.

**విడుచు¹.** స. క్రి. ౧. త్యజించు, వదలు.

సీ. గుణవంతు లగుచున్న కొడుకులు గల వాఁడు పాంచాలుఁడేల యప్పాండుసుతుల, వినయ సంపన్నుల విడుచువాఁడగు ... భార. ఆది. ౮. ౨౫.

ఆ. బాల్య కేళిమీఁది భరము గ్రమంబున, విడువఁ గళలయందు వేడ్కసొనిపి, నయముతోడ నర్తనంబుల శిక్షింపు, నెలఁత కేడుగడయు నీవకాదె. భార. విరా. ౧. ౨౫౧.

గీ. ... సలునిదక్కంగ నొరుని నేఁ దలఁతు నెట్లు, విడువు సందేహ మోహంబు విహగ రాజ ... నైష. ౨. ౪౦.

౨. (బాణాదులను) ప్రయోగించు.

మ. ... శాత్రవుంగుఱిచి యీగాయత్రి వర్ణావళిం, బ్రతిలోమంబుగ నుచ్చరించి విడువన్ బ్రహ్మాస్త్రమై తాఁకి యా, ప్రతిపక్షుం దెగటార్చునంగుళి శిఖాప్రస్ఫోట మాత్రంబునన్. కాశీ. ౩. ౧౯౦.

సీ. కరినాథుఁబట్టు నక్రంబుపై విడిచిన సరసిజాక్షునిచేతి చక్రమనఁగ ... బిల్హ. ౨. ౧౯.

మహాస్రగ్ధర. ... కోపమ్మైన రోపమ్మయిన విడువు మెట్లైనమేలింక నన్నున్ ... ఆము. ౩. ౩౦.

క. తుదినసురశక్తి వైచినఁ, గదనధురంధరుఁడు ఱేఁడు గైకొని పైపై, ప్రదరసహస్రము విడిచెం, బొదినడిచెఁ గటారిఁ బొడిచె బొమముడి ముడిచెన్. కళా. ౨. ౧౪౩.

౩. పంపు.

సీ. ... గీ. పికిలి పిట్టలఁ గొట్లాటఁ బెట్టు చూచు, దిట్టతనమునఁ జెఱకు పందెంబులాడు, డీకొనఁగఁజేసి యనికిఁ బొట్టేళ్ల విడుచు, రంభచుట్టంబు వైభవ ప్రాభవమున. కువల. ౫. ౯

తే. కాయము చిత్రవర్ణములు గల్గి మనోజవమైన యశ్వమే, ధీయుహాయంబు నాగమ విధిన్ విడువం దగు ... వై. భా. ౧. ౪౭.

౪. దానముచేయు.

క. కేలం బాఁతిన వసువ్యల, పాలవు ధన కొండె మ్రుచ్చు పాలవుధరణీ, పాలుని పాలవుఁ గావున, వాలాయముఁ గుడుత విడువవలయుఁజూ ధనముఁజూ.

విక్ర. ౨. ౧౪౭.

౫. విడువఁజేయు, విడిపించు, త్యజింపించు.

సీ. ... ఆ. నూతనాజినంబు నును పిదిమేలని, గోఁచి విడిచి మృదుదుకూల మిచ్చి ...

భాగ. ౯. ౭౯౪.

౬. (ఇదికొన్ని పట్లవిశేషార్థములేకయే క్త్వాంతమునకను ప్రయుక్తమగు.)

సీ. కోపించెనా మేరుకుధరచాపునినైనఁ దృణముగాఁ జూచి మర్దించి విడుచు ...

జాహ్నవి. ౧. ౧౧౬.

(మర్దించి విడుచు = మర్దించి తీయును ; మర్దన క్రియ పూర్తిగఁజేయును.)

అ. క్రి. ౧. (ఊడలు, కొమ్మలు మొ.) పుట్టు.

సీ. ... గీ. ... విసపుఁజెట్టున ఊడలు విడిచినట్లు, జడలు జనియించి చెలిచె మస్తమున నీకు. చంద్ర. ౩. ౨౪.

౨. ఎడతెగు.

క. విడువక మీఁగానము సాగ, నిడుటయు మఱి పాడుఁ డనుట యొగ్గె ... ఆను. ౫. ౫౭.

విడిచిపుచ్చు = విడుచు.

ఆ. ... అనుచు మల్లసంబులాడి గ్రుపను, విడిచి పుచ్చెగురుఁడు ...

భార. ఆది. ౬. ౯౦.

వ. ... ఆభూపాలుండు హస్త పల్లవంబులు వదలి రాజహంసంబ పొమ్ము సుఖంబుండుమని విడిచి పుచ్చె ... నైష. ౧. ౧౦౭.

జ: విడిచిపెట్టు, విడిచివాటు గుదియ, విడిపించు, విడుపరి, విడుపరితనము, విడుపు, విడువడు, విడ్పించు, విడ్పు, విడ్వఁబడు.

విడుచే. స. క్రి. (√ విడు) ౧. విడునట్లుచేయు, విప్పు.

క. నీముడిచిన ముడివిడువఁగ, నే మెవ్వరు నేత మింక నీ సౌభాగ్య, శ్రీ మహితునిఁ బతిఁ గూర్పం, గామిని నీ కంటెఁ జెలులు కలరే చెపుమా. ఉ. హరి. ౫. ౧౦౪.

ద్వి. పాడిచె నొక్కఁడు తూఁటు వోవఁగ నత్తి, విడిచె దోవతికట్టు వేసనొక్కరుండు ...

ద్వి. హరిశ్చ. ఉ. ౯౫౪.

గీ. కొదమగుబ్బలఁదావి కుంకుమపుఁబూఁత, విభుఁడు చెంగావిఱయికంచు విడువఁబోవ ... దశా. ౯. ౧౨౪.

క. అని పంచాంగము పుస్తకమును విడిచి కడం బ్రయత్నమునఁ దిథివారా, దినిరీతు చేసి ప్రశ్నెన్ని నిరూపించెఁ గ్రహాది నిఖిల బలంబుల్. కళా. ౪. ౪౭.

౨. విడిపించు, పోవునట్లుచేయు.

సీ. ... నీకాయ యొరువున జిడ్డువిడిచి ...

హర. ౨. ౧౦౪.

విడుజట్లుగొను. అ. క్రి. (విడు + జట్టులు + కొను) ప్రత్యేకమైన అమ్మకపు సరకుగాఁ గొను.

వ. హరగిరిజ లాండ్రొయు చిత్తంబులు విడుజట్లుగొని తారనీహారాచలంబుల కరిగిరి ...

కు. సం. ౪. ౯౦౯.

(ఒకరి మనసు నొకరాకర్షించి యనిభావము.)

విడుత. వి. తడవ, పర్యాయము.

ఉ. మాలినచేతనైన వినుమానిని దానములోలిఁ గొందు దుశ్శీలతచే దురన్నము భుజింతువ బద్ధములాడుచుందు నే, వేళల నేటిగట్టుకడ ప్రేలుచుఁ జేతులు చోతుఁగాసుకై, తాలిమి రెండుమూఁడువిడుతల్ గుడుతుం బురిఁ బైత్య కొన్నముల్. జాహ్నవి. ౪. ౧౧౭.

**విడుదల.** వి. (√ విడు) విమోచనము, విడుపు.

సీ. ... గీ. ... దొంగలకుఁ జిక్కి తింకనే భంగి నాకు, విడుదల లేనని చింతించు టేల యెదుట ... వరాహ. ౯. ౧౦.

వ. వేఁటకాని లాగునఁ బరచుచూరు శరభచమరక దళి పుండరీక షండంబులఁ బడఁగెడపుచుఁ జెలికాని చేడ్పునఁ జూచుచుఁ దూణంబు రాణ వెనుదవిలిపోవుచుఁ బథికజనం డన వల్మీక వాసులం జూచి మఱలుచు. చంద్రా. ౬. ౯౩.

**విడుపరి.** విశే. (విడుపు + అరి[3]) త్యాగశీలుఁడు. (చూ. విడుపరితనము.)

**విడుపరితనము.** వి. (విడుపరి + తనము) త్యాగము, ఈవి.

మణిగణనికరము—కలువల చెలి సెగకను గలిగిన యబ్బలియుని బలుకుల పడఁతుకఁ దెలి ద్రొ, త్తలకుల వలమురి నగమున నగునుగ్గా, బలువునఁదగు విడుపరితనపు బలీ. యయా. ౫. ౧౫౯.

**విడుపు.** వి. (√ విడుచు[1]) ౧. విడుచుట, త్యజించుట.

ఆ. కార్తవీర్య దశముఖ ప్రముఖులు జమదగ్ని తనయ రాఘవాగ్రులైన, పురుష వరుల చేతఁ బోలియరే సక్రోధ, వృత్తిఁగాన నలుక విడుపు మేలు. భార. శాం. ౬. ౫౯౦.

సీ. అనవుడు ధర్మనందనుఁ డమ్మహాత్మ్మతో వినుభక్తి యుక్తుని విడుపు బ్రహ్మ, హత్యఁ బోలిన పాపమని చెప్పుదురు పెద్దలు ... భార. మహా. ౫౫.

క. ... అతఁడు శుభమశుభంబను భేదముఁ బొరయఁడు విడుపున సమతామ యత్వముం గనుచుండున్ ... భార. శాం. ౫. ౩౨౪.

సీ. ... ఫణి విషవహ్నిఁ జెడ్పడియున్న శశిరేఖ నెఱవిడుపునఁగాంతి వఱలునట్లు ... కు. సం. ౨. ౭౯౨.

౨. త్యాగము, దానము.

క. లోకము చందము గనికొని, యాకొనఁగ నగు ధనాదులెల్లను గాల, వ్యాకులతఁ బొందఁ గలయవి, గాకుండమి రయిఁగి విడుపుగడుఁ జిదురెంగున్. భార. శాం. ౪. ౩౨.

గీ. ఆ యయాతి గడఁగి నెయ్యమునఁ బుడమి, వేల్పులకుఁ బ్రైఁడి నొసఁగెడు విడుపునీట, నిండి కొదవేమియును లేక యుండెఁ గడలి, యతనిచాగంబు లేక నెన్నఁగలవి యగునె. యయా. ౧. ౯౫.

౩. దిగుమతి.

గీ. తురగమునకుఁ బణము పురుషున కరపణ, మోఁడు దానికైన సందసగము, ప్రేఁగు ముట్టునందు ప్రేగు విడుపునకు, నోడకూలి గొనుట యుచిత మంద్రు. విజ్ఞా. ప్రా. ౭౬.

విశే. త్యక్తము, విడువఁబడినది.

ద్వి. ... భూవరులు, సబలులై జన్నముల్ సన్నముల్ సేయ, విబుధుల కుడుపులు విడుపులై పోయె ... ఆ. మ. క. ౧. ౧౪. పా. ౨౨. పం.

**విడుమర.** వి. (√ విడు.) ౧. విడుదల, విముక్తి.

క. ఒకనాఁడేమును నాపదలకు విడుమరఁ గాంచి విప్రులం బుట్టలఁ బెట్టుకొని సుఖముండఁ బడయుదు, మొకో యిప్పాటెందుఁ గలద యెరు రెవ్వరికిన్. భార. విరా. ౧. ౪౯.

క. గడగడ వడఁకుచు నద్రులు, వడియఁగఁ జేఁదోయి మొగిచి స్వామీ కోపం,బుడుగుము

శాపంబునకును, విడుమర యొన్నఁడగుఁ
జెప్పవే కృపతోడఁ దగ. భోజరా. ౬. ౩౪౯.

గీ. అపుడు మాళవుచేతఁ బ్రహారవర్మ, పట్టు
వాని కరుణయ బ్రాపుగాఁగ, దనకు
విడుమరగాంచి ... దశకు. ౩. ౧౦.

౨. ఎడఁబాటు, వియోగము.

గీ. గిరిజ నొడఁగూర్చి వరదుచే వరము వడియ,
నోపుఁ బొమ్మని నమ్మి నే నున్నచోట,
నెట్టివిడుమరవచ్చె నీ కట్టిచావు, సంభవిం
చెనె మనసిజ చక్రవర్తి.

కు. సం. ౫. ౫౫౨.

**విడులము.** సం. వి. అ. పుం. వేతసము, ప్రబ్బలి ౘె. (వాచ.)

**విడువడు.** అ. క్రి. (విడుపు + పడు) విడివడు, బయలుపడు.

గీ. మేటి ధాటి జనిత కాలకూటవిషము, చిచ్చు
విడువడి యంతంతఁ బెచ్చు పెరుఁగ ...

భీమ. ౪. ౬౧.

క. కావున నీమహానీయ, గ్రావంబున నంటు
వడ్డ క్రతు సైంధవ మిం,కేవిధమున విడువడి
చను, నావిధ మెఱిఁగింపవే దయానిధి
యనినన్. జై. భా. ౪. ౭౪.

**విదూరజము.** సం. వి. అ. న. వైడూర్యము, రత్నభేదము.

**విడెము = విడియము, వీడ్యము.** వి. (సం. వీటికా) తములము.

మ. ... రెండుమూఁడు విడేలాకులు పోకతాళి
విడివాటు న్గొడలై తళుక్కుటీ, భవన
ప్రాంగణసీమఁ ద్రిమ్మరుదు రంభః కుంభ
చేటీవిటుల్ ... వైజ. ౨. ౪౧.

గీ. పొసఁగ విడెమాయ శతపత్ర పూగహారి ...

దశా. ౨. ౧౭౭.

సీ. ... మిత్ర విందకుఁ బుక్కిటి విడె
మొసంగి ... ఉ. రా. ౧. ౪౪.

**విద్ఫు = విడుచు.** స. క్రి. (√ విడు) విడఁ జేయు.

సీ. ... దుశ్శాసనుండు, పెట్టిన ద్రౌపది గట్టిన
పుట్టంబు సభలోనవిడ్చునాశంకలేక ...

భార. సభా. ౨. ౨౩౧.

చ. జనులు నుతింపఁగా సుకృత సంపదఁ జేసి
యపూర్వ్యభావముం, గనియును జెంద కిట్లు
నికి కార్యమె ద్రౌపది భీమసేను నర్జునుఁ
గవలం దృజించుటకు సువ్రత చాకితి
చాలవయ్యె దీ,కునకము విడ్వ నిత్తెఱఁగు
సూరినుతుం డగు నీకు నర్హమే.

భార. మహా. ౫౬.

ఉ. ద్రోవది బంధురంబయిన క్రొమ్ముడి
గ్రమ్మగ విడ్చి వెండ్రుకల్, దా వల చేతఁ
బూని ... భార. ఉద్యో. ౩. ౧౧౪.

**విడ్డూరము.** వి. (సం. విడ్వరః.) ౧. ఆశ్చర్యము. (శ. ర.)

౨. ఉపద్రవము.

ద్వి. విడ్డూరములువచ్చె వేగ ప్రాణమున,కు ...
పల్నాటి వీరచరిత్రము. ౩౩౭. పం. బ్రా.

విణ. మూర్ఖము. (శ. ర.)

**విడ్గ్రహము.** సం. వి. అ. పుం. మలబంధము, ఒకవిధమగు రోగము.

**విడ్పి(డిపి)ంచు.** స. క్రి. (√ విడుచు) విడువఁ జేయు, వదలించు.

శా. ... గంధర్వున్ దర్పితుఁ జిత్రసేను ఖరు
నిన్ దండించి విడ్పించె ...

రాఘ. ౩. ౧౧౩.

**విద్ఫు = విడుపు.** (√ విడుచు) విమోచనము.

భార. అను. ౧. (శ.ర.)

**విద్యము - విడియము, విడెము, వీడ్యము.** వి. తములము, తాంబూలము.

క. తెలనాకులు బాగాలును, నలమిన పెనిమి
టులఁ గూర్చి యొదువ రొలనా,గల కెల్ల
నిడిరి విడ్య,మ్ములు దగ నప్పుడమితోఁడు
ముదితయుఁ గడఁకన్. యయా. ౪. ౧౧౯.

సీ. వలపుఁ గప్రపు విడ్యముల వెన్నెల బయళ్ల
సైకతములఁ జల్వచప్పరముల ...
కవిరా. ౪. ౧౫.

క. కావున మీరు దలంచిన, శ్రీవారాహాంబు
మంచి కృతిమాపేరం, గావింపుఁడనుచు
సుముఖుం,డై విడ్యముఁ గప్పూరంబు నర్పిం
చుటయున్. వరాహ. ౧. ౧౪.

**విప్లవణము.** సం. వి. అ. న. వైద్యమున కుప
యోగించెడి యుప్పు.

**విడ్వఁబడు.** (√ విడ్చు) అ. క్రి. విడువఁబడు.

గీ. రమణీయవశముచే నైన రామనామ, మమర
వర్తింపఁ బడుచుండ నఖిలపాత,కములచే
విడ్వఁబడుఁజుమ్ము సుమతి యపుడె, సింహ
మతి భీత మృగములచేతఁ బోలె.
సీతారా. ౧. ౫౩.

**విడ్వరము.** సం. వి. అ. పుం. ఉపద్రవము.

**విడ్వరాహము - విట్చరము.** సం. వి. అ. పుం.

**విడ్వఱచు.** (విడు + పఱచు) స. క్రి. తారు
మారు చేయు, మార్చు.

క. ఆ రసికుఁ జెంతఁగి వచ్చిన, నీ రీతుల నడుమఁ
గలిసి రొఱుకపడఁగమా, చీరలు విడ్వఱచి
తిమి వి,చారింపఁగ నేల నాదు జయమగుఁ
గాదో. ద్వా. ౧౧. ౫౬.

**విత - వితా.** విణ. (సం. వృథా) వ్యర్థము (దీని
యామ్రేడితరూపము "వితవిత")

క. అతివల హృదయములారసి, రతికల నన్ దేల్ప
లేని రట్టడిరూపున్,జతురతియు జవ్వనం
బును,వితయ చుమీ యఁడవిఁగాయువెన్నెల
రీతిన్. శశా. 3. 83.

క. కొడుకులు పుట్టని మానిని, తొడుకులు
జల్మియును నిండ్లుఁ దొడవులు మావుల్,
పుడమియు నెక్కుడు మేకములు, విడిముడి
యుం జుట్టములును వితగద తలఁపన్.
అ. రా. బాల. ౫౦.

గీ. వారితోనదిి యోయన్నలార కంటి,రా విత
వితగ నన్నింత అట్టునేసి, తానె తొత్తుల
కొంత్యుదంబుకతన, నిల్లుపట్టక తిరిగెడు
నివ్విధమున. శుక. ౨. ౧౩౭.

**వితండ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. నిరాధారమైన
వాదము, శుష్కవాదము. ౨. (తర్క) ప్రతి
పక్ష స్థాపనములేని జల్పము. స్వపక్ష స్థాప
నములేని పరపక్ష నిరాకరణ రూపవాదము. 3.
కోపమును బుట్టించెడి విమర్శనము. ౪. గతిటె.
౫. సాంబ్రాణి. ౬. గన్నేరు. ౯.

**వితండము.** సం. వి. అ. పుం. ౧. ఏనుగు. ౨.
తలుపు గడియ.

**వితండావాదము.** సం. వి. అ. పుం. స్వపక్ష
స్థాపనములేక పరపక్షమును ఖండించు వాదము;
అడ్డదిడ్డపు వాదము.

(ఈ యర్థమునఁ దెనుఁగుననే ప్రయోగము
గన్పడుచున్నది.)

క. ఉండుడు మీరిచ్చోట వి,తండా వాదములు
మాని తాలిమితో ని,ట్లుండంగ నోపరేనియుఁ,
బొండిప్పుడు నిజనివాస భువనంబులకున్.
వరాహ. ౧. ౧౪.

**వితంతువు.** సం. వి. ఉ. పుం. మంచి గుఱ్ఱము,
స్త్రీ, ముండమోపి, విధవ.

**వితంత్రి.** సం. వి. ఈ. స్త్రీ. తంత్రులు (తీఁగలు) సరిగాఁ బోసఁగని వీణ.

**వితంసము.** సం. వి. అ. పుం. ౧. పిట్టగూడు. ౨. పక్షులను మృగములను బంధించుట కుప యోగపడు త్రాడు మున్నగు సాధనము.

**విततధన్వుఁడు.** సం. విశే. (న్) ఎక్కుపెట్టఁ బడిన విల్లుగల వాఁడు.

**విततము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. వ్యాపించినది, విస్తరించినది. ౨. పొడిగింపఁ బడినది, సాగఁదీయఁ బడినది, విశాలమైనది. ౩. ఆచరింపఁ బడినది. ౪. కప్పఁబడినది. ౫. చెదరినది, వీణ,తంబురా మున్నగు తీఁగలు గల వాద్యము, తతము.

**వితతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. వ్యాప్తి, వ్యాపనము. ౨. సమూహము, గుంపు. ౩. పంక్తి, వరుస.

**వితథము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. అసత్యము, నిజముకానిది. ౨. వ్యర్థమైనది, నిష్ప్రయోజన మైనది.

**వితథ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) అసత్యము, నిజము కానిది.

**వితనువు.** సం. విశే. (ఉ.) ౧. సుకుమారుఁడు. ౨. సుందరుఁడు. (అ. ని.) ౩. శరీరము లేని వాఁడు.

**వితమరి.** విశే. (వితము + అరి) కార్యదక్షుఁడు, కార్యపద్ధతి నెఱిఁగిన వాఁడు, పాలమరి.

కళిక. ... నతిమి తతిమి చతిమి నుఱుము నక్రు గెల్చిన వితమరికిఁ గఱచి చఱచి యఱచి పఱచుకపిని జంపి నచ్యుతునకు ...
అప్ప. ౪. ౩౨౬.

**వితము.** వి. (సం. విధా.) ౧. విధము.

గీ. శెల్ల గొడుగులు వట్టించు వితము మించు, నంచగమి నిల్చియాడెఁ జా లగుచు దివిని.
ఘటికాచల. ౨. ౧౨౪.

ద్వి. ప్రతిమీఱు సంకల్ప ధవళకల్పలతిక, వితమున నతులిత విభ్రమోన్నతియు ...
విష్ణు. ఉ. ౪. (శ. ర.)

క. పిచ్చుకపై బ్రహ్మాస్త్రము, నచ్చుగఁ దొడఁగిన వితాన నబలపయి నీ్మ్రుకెచ్చుగఁ గోపంబిటురా,వచ్చెనెతపైఁనసైఁపవలయు నటంచున్.
శశా. ౪. ౨౧.

సీ. తెఱఁగు చందము పగిది విత మనంగను మీఱుచు నుండుఁ బ్రకారసంజ్ఞ ...
ఆం. భా. ౨. ౩౦౩.

౨. ఉపాయము.

చ. ... ఉరువ్యథాభరా, నత మొక వృద్ధవిప్రమిథునంబు మృతుండగు పిన్నపాపనిన్, విత మఱి క్రొంచు వచ్చి రఘువీరుని వాకిట వైచి దీనతన్.
ఉ. రా. ౬. ౧౮౧.

జ : వితమరి.

**వితరణము.** సం. వి. అ. న. దానము, ఈవి.

**వితరణి.** సం. వి. ఇ. పుం. దాత, ఈవికాఁడు.
విక్ర. ౨. (శ. ర.)

**వితర్కము.** సం. వి. అ. పుం. ౧. యుక్తులతో నాలోచించుట. ౨. ఊహ, ఆశయము, అనుమానము చేయుట. ౩. తలంపు, అభిప్రాయము. ౪. సంశయము, విచికిత్స. ౫. సమీక్షణము, పర్యాలోచనము.

**వితర్కించు.** సం. స. క్రి. ౧. సంశయించు.

క. పలుమాఱుఁ బాండు తనూజాల, కొలఁది వితర్కించెదవు నిగూఢం బదియుం, దెలియం బలికెద వారికి, బలమును సత్త్వంబు హరియ పార్థివముఖ్యా.
భార. ఉద్యో. ౨. ౩౧౩.

**వితర్కుఁడు.** సం. వి. అ. పుం. జ్ఞానోప దేశకుఁడైన గురువు.

**వితర్ది.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. ౧. వేదిక, అరుఁగు, తిన్నె. ౨. మేడ ముందరి వసారా.

**వితర్దిక = వితర్ది.** సం. వి. ఆ. స్త్రీ.

**వితలము.** సం. వి. అ. న. సప్త పాతాళలోకములలో రెండవది.

**వితస్తి.** సం. వి. ఇ. పుం. జేన, పన్నెండం గుళముల పరిమాణము.

**వితా = విత.** (సం. వృథా) విణ. వ్యర్థము.

చ. తపసుల పాలి మృత్యువులు దైత్యులు సీరిల నున్న నాళ్లకుం, దపమని చేయఁగూడునొ వ్రతంబని పట్టఁగ శక్యమౌ వితా, యిపుడిది యేటి యత్నము వహించె వివేక విహీనుఁడైన యీ, నృపముని యంచుఁ గౌశిక పయిం గడు నేరము లెంచు వారలున్. చంపూరా. ౨. ౭౪.

**వితాకు.** వి. ౧. సంతాపము.

చ. ... కృతి సంతతి కన్యక, కెన్న యోగ్యుఁడో, ధవుఁ డొకరుండు లేమికి నితా మదిలోన వితాకుఁ జెందుచున్ ... ఘటికాచల. ౧. ౧౪.

౨. పరాకు.

చ. కదనము సేయవచ్చి భయకంపిత గాత్రుఁ డవై వితాకుఁ జే, సెద విదియేమి రాత్రిచర శేఖర ... ఉ. రా. ౪. ౧౨.

సీ. ఈ వితాకున మేఁత యిడనైతిఁగా బ్రోది గొరవంక కనుచుఁ దానరిగె నొకతె ... (శ. ర.) యయా. ౫. ౨౨.

౩. పారవశ్యము.

చ. గడె తడ వాతఁ డొక్కపనిగాఁ జని యింటికి రాకయుండినన్, దడఁబడు మీఁ దెఱుంగదు వితాకున నుండును జిన్న వోవు ... శశాం. ౨. ౮౭.

౪. నిశ్చేష్టత. (శ. ర.)

విణ. ౧. పరవశుఁడు.

క. అనియిటు లుర్విశ్వూరెడు, మనమునఁ గొనియాడి యంతమాపటివేళం, గనుఁ బ్రామి చొక్కుఁ జల్లిన, యనువున నందఱు వితాకులై యుండఁగన్ ... విజ. ౧. ౧౩౭.

౨. నిశ్చేష్టితుఁడు, నిశ్చేష్టితురాలు.

వ. సొరుగును సొమ్మసిల్లు మదిఁజొక్కు వితాకగు ... ఇలా. ౩. (శ. ర.)

జ: వితాకుఁడు, వితాకుఁడు, వితాకురాలు, వితాకులవిత్తు.

**వితాకుఁడు.** విణ. (√ వితాకు) నిశ్చేష్టితుఁడు.

శా. మాహాత్మ్యంబులు తేజముల్ విభవసంపత్తుల్ విమర్శింపఁగా, నోహో భేదము లేదు నిండుసభలో నొక్కింత మాత్రంబు హో,మాహోమీలు ఘటాఘటీ లతిరఘుల్ మాంధాత శీసాము లే, లా హీనాధికభావముల్ తడవరాదంచున్ వితాకుండనై. వరాహ. ౧౦. ౭.

క. అనిబాష్ప వారిధారల్, గనుదోయిం జెమ్మగింపఁగా నలుదిక్కుల్, గనుఁగొనుచు వితాకుఁడనై, చన నేరక యుంటినన్ని శాసమయమునన్. వేం. పంచ. ౪. ౧౦౩.

వ. ఇట్లు మూర్ఛావివశుఁడై నేలఁ బ్రాలియున్న యన్నరనాథ కుమారుఁగొని పోవువాఁడై వాసవారి నేరుడిగి యెత్తంబోయి తద్రథుకంబై విష్ణుతేజంబున్న కతంబునఁ గదలింత లేక వితాకుండై తనలోన ... రాఘ. ౭. ౧౨౧.

**వితాకుపడు.** అ. క్రి (వితాకు + పడు) నిశ్చేష్టితుఁడగు. (శ. ర.)

ఉ. అక్కట కేటలాడుచు హయంబు రయంబునఁ దోలుకొంచుఁ దాఁ, గ్రక్కున నొక్కపంది వెనుకం జని మార్గముదప్పి క్రంపలం, జిక్కి మదిన్ వితాకుపడి చింత మునుంగుచుఁ బండ్లు గోయఁగా, నొక్కఁడ దేవదత్తుఁ గని యూరికి నేఁగడు త్రోవవేడినన్. ద్వా. ౩. ౨౧.

**వితాకురాలు.** వి. (వితాకు + ఆలు) నిశ్చేష్టితురాలు.

చ. ... అలసత దీఱ నిద్రఁగననంచుఁ దలంచి వితాకురాలగున్ ... కువల. ౩. ౪౯.

చ. భయపడి లేచి వే యదురు పాటునఁ గట్టియుఁ గట్టకున్న నీ,వియు నెలవంక చన్మొనల వేసియు వేయని పైట కొంగుదోఁ,పియు నటదోఁపకున్న యల పెన్నెఱి కొప్పును న్సై వితాకురా,లయి యవిచూచి యల్లలన యల్లలనాడు మనంబు తోడుతన్. సారంగ. ౩. ౧౫౩.

**వితాకులవిత్తు.** వి. సంతాపబీజము, పరితాపకారణము.

ఉ. ఇప్పుడు నా మనోరథములెల్ల వితాకులవిత్తు చేసి యీ,తప్పులు వెట్టెదేమిటికిఁ దక్కఁ దలంచెద వెన్ని చెప్పినన్ ... వి. పు. ౨. ౨౯.

**వితానకము.** సం. వి. అ. పుం. న. ౧. వైశాల్యము, విరివి. ౨. సమూహము, గుంపు. ౩. మేలుకట్టు, చాందిని. ౪. మాడవృక్షము.

**వితానము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. వట్టిది, శూన్యము. ౨. నిస్సారము, సారము లేనిది. ౩. భంగము గలుగఁ జేయఁ బడినది, దిగులు చెందినది. ౪. తెలివిలేనిది. ౫. దుష్టము, మూఢము, దుర్మార్గమైనది.

వి. అ. పుం. న. ౧. వ్యాప్తి, వ్యాపించుట. ౨. మేలుకట్టు, చాందిని. ౩. తలగడ, మెత్త, దిండు. ౪. సమూహము, గుంపు. ౫. యజ్ఞము. ౬. అగ్నిహోత్రకుండము, అగ్నిహోత్రవేదిక. ౭. అవసరము, అదను. తెలి. న. ౧. తెఱపి, అవకాశము.

**వితావిత.** విశే. మిక్కిలి వ్యర్థము. ("వితా" యొక్క ఆమ్రేడిత రూపము.)

ఉ. ఏరొకటబ్బె రామునకు నెద్దు పొసంగవు, చంద్రమః కళా,ధారికి నొక్కయెద్దది వితావిత సీరములేమి ... శశాం. ౨. ౨౦.

చ. ... సంతస మందిన వారుచూడనీ, ధనువును సీరి ముచ్చట వితావిత సేయకుమన్న ... దశా. ౭. ౧౯౯.

ఉ. ... భూ,పాలక యింటివారిడిన బాముల రచ్చలకెక్కనంతయే, చాలదె యింకమీఁదను నిజంబుగ రట్టున కోర్చు నంతకుం, దాళునె యీ శరీరము వితావిత యొక్కఁడి జోలి యక్కటా. శుక. ౪. ౬౩.

క్రి. విశే. మిక్కిలి వ్యర్థముగా.

చ. తడఁబడు మాటగద్దదిక దార్కొను నిల్చిన చోట నల్వురా,దడుగులఁ దొట్రుపాటు గదియంబడుఁ గంపము చెందు నిద్దరా,నెడపని కోర్కె హెచ్చు మది నేమొ వితావిత జాలి జాలియా, నడిగినఁ జెప్పఁగూడ దకటా. మరు లెత్తిన యాఁటదానికిన్. కువల. ౩. ౧౦౦.

గీ. ఏలకన్నులఁ గెంపుంచ నేల మఱియు, మొరయ నేల వితావిత ముదితలార ... చంద్రా. ౪. ౧౯౬.

చ. ముసుఁగిడి పండియుండుమని మోహము తోడ వితర్దిఁ జూపితా, నుసురసు రంచు ఖిన్నయయి యొయ్యన నేగి కవాట మన్వలఁగా, బెసబెసఁ ద్రోచి మూఁటఁ దలఁ

బెట్టుక వచ్చినభర్తకింత సాధ్వస మెద
వంగఁ జెప్పవిని వాఁడు వితావిత యేమి
యం చనన్. హంస. ౪. ౧౧౩.

**వితీర్ణము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. దాటఁ బడినది, అతిక్రమింపఁబడినది. ౨. ఇయ్యఁ బడినది, దానముచేయఁబడినది. ౩. దిగినది, అవరోహించినది. ౪. కొనిపోఁ బడినది, తీసికొనిపోఁ బడినది. ౫. లోఁబఱుచుకొనఁబడినది.

**వితీర్ణి.** సం. వి. ఇ. స్త్రీ. ఈవి, వితరణము. (శ. ర.)

**వితున్నకము.** సం. వి. అ. న. ౧. కొత్తిమిరి. ౨. మైలుతుత్తము, తుత్థము.
పుం. నేలయుసిరిక.

**వితున్నము.** సం. వి. అ. న. ౧. కూరాకు. ?. చెంచలి కూరవంటి యొక మొక్క. ౨. శైవాల లత, నాఁచుతీఁగ.

**వితుష్టము.** సం. విశ. (అ. ఆ. అ) అసంతుష్టి నొందినది, సంతోషింపనిది.

**వితృష్ణము.** సం. విశ. (అ. ఆ. అ) తృష్ణలేనిది, ఆసలేనిది, తృప్తినొందినది.

**విత్త[1].** వి. చిహ్నము.

ద్వి. అజనుత రామానుజార్యసిద్ధాంత, విజయ
ధ్వజంబుల విత్తరై మిగులఁ, దగుకొత్తు
చుండు త్రిదండముల్ దాల్చి ...
ద్వి. పరమ. ౧. ౬౪౨. పా.

**విత్త[2].** వి. మిక్కిలి చిన్న గోఁను.

సీ. ... అత్యల్పగోణిరై యలరు విత్తయనంగ.
ఆం. భా. ౨. ౨౬౬.

క. చిత్తజుచేఁ దలిరాకుల, విత్తైతన ధైర్యమెల్ల
వెడలనడిచియా, మత్తేభగమన మిగులం,
దత్తరపడి సమ్మదమునఁ దమకించుట
యున్ ... వి. పు. ౬. ౨౪.

**విత్తదుఁడు.** సం. వి. అ. పుం. ౧. ధనదాత. ౨. ఆస్తినిచ్చినవాఁడు, ఉపకారి.

**విత్తనము.** వి. విత్తు, బీజము.

గీ. విప్రవరునకుఁ దూమెడు విత్తనముల, నేల
యొసఁగిన ఫలము వర్ణింతు వినుము ...
దశా. ౫. ౧౦౦.

గీ. ... ... బీజాఖ్య పరఁగువిత్తు, విత్తినము
గింజ గిజ రన వెలయు నీళ ...
ఆం. భా. ౨. ౩౯.

**విత్తము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. కని పట్టఁబడినది, కనుగొనఁబడినది. ౨. లబ్ధము, పొందఁబడినది. ౩. పరీక్షితము, పరిశీలింపఁబడినది. ౪. ప్రఖ్యాతము, ప్రసిద్ధికెక్కినది.
వి. అ. న. ౧. సొత్తు, ఆస్తి, ధనము. ౨. శక్తి, బలము.

**విత్తవంతుఁడు.** సం. విశ. (త్. వతీ. త్.) ధనవంతుఁడు, ఆస్తిగలవాఁడు.

**విత్తవర్ధనము.** సం. విశ. (అ. ఆ. అ.) ధనమును వృద్ధిచేయునది, లాభకరమైనది, ఆదాయము కలిగించునది.

**విత్తాగమము.** సం. వి. అ. పుం. ధనలాభము, ధనప్రాప్తి.

**విత్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. జ్ఞానము, తెలివి. ౨. విచారము, ఆలోచనము. ౩. సంపాదన, గడించుట, పొందుట.

**విత్తించె.** స. క్రి. (√ విత్తు) విత్తనము నాటించు.

గీ. విరివిగాఁ బైరు విత్తుంతు వేల్లఁగొలుచు,
గాఁగ మామకసస్యముల్ గడుఫలించు ...
వెం. పంచ. ౫. ౧౩.

**వి త్తిడు.** అ. క్రి. (విత్తు + ఇడు) విత్తులుచల్లు.

క. క్షేత్రమెఱిఁగి విత్తిడుటయుఁ, బాత్ర మెఱిఁగి దాన మిచ్చి పనుమటయు విశే, కత్రాణ పరాయణులకు, ధాత్రీశ్వర యిందు నందుఁ దగ మే లొసఁగున్.

వి. పు. ౫. ౧౩౦.

**విత్తు.** స. క్రి. (వి త్తనములు) చల్లు.

సీ. పెంచంగఁ బెరిఁగె నాపృథ్విపైఁ గొండలు వి త్తిరాయడవుల వివిధగతుల ...

నీతిసీ. ళ. ౬౦.

ద్వి. త్రొక్కినచోటెల్ల గున్నకపండ, దిక్కు లఁబసిఁడి వి త్తిన పైరుగాఁగ ...

ద్వి. హ. ము. ౩. ౧౮౨. పొ.

ఆ. పూర్వజన్మమందుఁ బుణ్యంబు సేయని, పాపిధనముకొఱకు పడుటరెల్ల, వి త్తమఱచి కోయ వెదకినచందంబు, విశ్వ ...

వేమ. ౧. ౪౪.

ద్వి. మామిడివిత్తుదా మహిమీఁద వి త్తి, వేమ గుసే పెక్కువిధు లేలచెప్ప ...

బస. పు. (ప్రాంత ప్రతి.) ౧. ౨౬౧. ౫౦.

వి. వి త్తనము.

గీ. విత్తుసహకారి గాకున్న రి త్తనేల, వంధ్య మగుఁగాక తా ఫలవంతమగునె ...

భార. అను. ౧. ౧౩౬.

గీ. తనరి హేమంత మగుడుఁ బద్మంబు లడఁగి, పోయెఁబోయినఁ గొలనొక్క పువ్వుతనకు, విత్తుగా దాఁచికొనియున్న విధముపోలె, శైలసుత ముఖముదక వాసమునఁ బొల్చె.

కు. సం. ౬. ౪౮౩.

వి త్తఁడగు = సమూల నాశనమగు.

ఉ. ... ... నీ, వేఁడిమి సూపియుగ్రపుల వి త్తఁడఁ గందును మాడిపైపు ...

భా. రా. యు. ౪౩౩.

జ: వి త్తించు, వి త్తిడు, విత్తుపట్టు, విత్తు మాల్చు.

**విత్తు.** సం. వి. త్. స్త్రీ. దీనికిఁ బ్రత్యేకప్రయోగము లేదు.

౧. జ్ఞానము. ౨. గ్రహణశక్తి, తెలివి.

**విత్తుపట్టు.** వి. (విత్తు + పట్టు) సస్యములు ఫలించు పొలము.

వ. ... చెఱువు దక్షిణమున ముప్పదివుట్లు విత్తుపట్టు సర్వాకర పరిహారముగా శ్రీచోడగంగదేవరిచ్చి ... దా. శా. ౧౦౧౫.

**విత్తుమాల్చు.** స. క్రి. (√ విత్తు) చంపు, కడతేర్చు.

గీ. చటులగతిఁ గొన్ని కిటులను సంహరించె, వెంటఁబడి కొన్నిశశముల విత్తుమాల్చెఁ, గొన్ని జింకల ప్రేవులు గ్రుచ్చివైచెఁ, గుక్కలాఖేటకంబున నుక్కుమిగిలి.

పి. శకుం. ౨. ౧౫.

**వి త్తేశుఁడు.** సం. వి. అ. పుం. కుబేరుఁడు.

**విత్రాసము.** సం. వి. అ. పుం. భయము, వెఱపు.

**విత్సనము.** సం. వి. అ. పుం. వృషభము, ఎద్దు.

**విధుర.** సం. వి. అ. స్త్రీ. విధవ, ముండమోపి. (వాచ.)

**విధురుఁడు.** సం. వి. అ. పుం. ౧. రాక్షసుఁడు. ౨. చోరుఁడు.

**విద.** సం. వి. ఆ. స్త్రీ. ౧. జ్ఞానము. ౨. గ్రహణశక్తి.

**విదంశము.** సం. వి. అ. పుం. దప్పి గలిగించెడి కారముగల యాహారము.

**విదగ్ధ.** సం. వి. ఆ. స్త్రీ. చాతుర్యమును, చుఱుకుఁదనమును గలస్త్రీ, చమత్కారిణి.

**విదగ్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఎక్కువగా దహింపఁబడినది, తగులఁబెట్టఁబడినది. ౨. వండఁబడినది. ౩. అఱిఁగినది, జీర్ణమైనది. ౪. నశింపఁ జేయఁబడినది, ధ్వంసము చేయఁబడినది. ౫. వాఁడియైనది, చుఱుకుఁదనము గలది, నేర్పుగలది. ౬. జిత్తులుగలది, కపటముగలది. ౭. తగులఁబడినది. ౮. జీర్ణము కానిది, అఱుఁగనిది. ౯. మనోహరము, ఇంపైనది. ౧౦. గర్వాన్వితమైనది. (వేషము.)

**విదగ్ధుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. నేర్పరి, చతురుఁడు, నిపుణుఁడు. ౨. కపటియైనవాఁడు, జిత్తులుగలవాఁడు.

వి. అ. పుం. ౧. పండితుఁడు, విద్వాంసుఁడు, ౨. దుర్ణయము గలవాఁడు, పోఁగరుఁబోతు.

**విదఘుఁడు.** సం. వి. అ. పుం. ౧. కృతి, ధన్వజీవి. (మే. ని.) ౨. యోగి, విద్వాంసుఁడు. (ఆ. ని.)

**విదరము.** సం. వి. అ. పుం. ౧. చీల్చుట, భేదనము. ౨. వృక్షము, చెట్టు.

విణ. (అ. ఆ. అ.) భయరహితము, భయము లేనిది. (వాచ.)

**విదర్భ.** సం. వి. ఆ. స్త్రీ. ఒక పట్టణము.

**విదళితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. మిక్కిలి ఖండింపఁ బడినది. ౨. మిక్కిలి భేదింపఁ బడినది.

**విదర్భజ.** సం. వి. ఆ. స్త్రీ. విదర్భ దేశపురాజు కూఁతురు. ౧. దమయంతి. ౨. లోపాముద్ర, అగస్త్యుని భార్య. ౩. రుక్మిణి, కృష్ణుని భార్య.

(ఇట్లే విదర్భతనయ మొ.)

**విదర్భము.** సం. వి. అ. పుం. ఇప్పుడు బేరా రని వ్యవహరింపఁబడు దేశ విశేషము. ౨. నిర్జన ప్రదేశము, జనులు విడిచిపోయిన దేశము.

**విదర్భసు(భు)వు = విదర్భజ.** సం. వి. ఊ. స్త్రీ.

**విదర్భుఁడు.** సం. వి. అ. పుం. విదర్భ దేశపు రాజు.

బ. విదర్భదేశ నివాసులు.

**విదలనము.** సం. వి. అ. న. చీల్చుట, బద్దలు చేయుట.

**విదలము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. చీల్పఁబడినది, బద్దలు చేయఁబడినది. ౨. (పువ్వు) విరిసినది, వికసించినది.

వి. అ. పుం. ౧. విడఁదీయుట, ఎడఁబాపుట. ౨. చీల్చుట. ౩. భక్ష్యము, పిండి వంటకము. ౪. అడవికోవిదారము.

. న. ౧. బద్దలతో నల్లిన పాత్ర, వెదురుబుట్ట. ౨. దానిమ్మచెట్టు పట్ట. ౩. రెమ్మ, ఉపశాఖ. ౪. ముక్క, చెక్క. ౫. కంది గింజ మొదలగువాని బద్ద.

**విదళించు.** సం. స. క్రి. ౧. చీల్చు, భేదించు, పగులఁగొట్టు.

క. విదళింప నుఱుకు సింగపుఁ, గొదమయు మదమలిన గండ కుంజరములపై, నిది బల శాలికి నైజము, గద తేజోనిధికి వయసు కారణ మగునే. భర్త్ర. ౧. ౩౧.

సీ. విటుల గుండెలలోన విదళించు చిగురాకు గంపెట ప్రేకెందు సమసె నేఁడు ...

వీర. ౨-౧౧౬.

౨. నఱుకు, ఖండించు.

సీ. కలుషంబు విదళింపఁగల ధర్మశాస్త్ర ప్రపంచంబు లెవ్వాని పలుకుఁ బల్ల ...

వరాహ. ౧. ౯.

చ. కడఁగిన వీరుఁ డారసిలి ఖడ్గముచే విద
ళించి హెచ్చుటో ...
కృష్ణాభ్యుదయము. (బ్రౌ.)

**విదారకము.** సం. విణ. (అ. శి కా. అ.)
వి. అ. పుం. ౧. చీల్చునది; విభాజకము, విభ జించునది. ప్రవాహ మధ్యముననున్న వృక్షము లేక పెద్దఱాయి. ౨. చెలమ, ఎండిపోయిన యేటిలోఁ ద్రవ్విన గుంట.
న. ౧. జలబంధనము, ఆనకట్ట. ౨. చవుటినేల.

**విదారణము.** సం. వి. అ. పుం. ౧. ప్రవాహ మధ్యముననున్న చెట్టు, పెద్దఱాయి, బండ. ౨. కర్ణికార, కొండగోఁగుచెట్టు. ౩. యుద్ధము.
న. ౧. చీల్చుట, పగులఁగొట్టుట. ౨. బాధిం చుట, హింసపెట్టుట. ౩. చంపుట.

**విదారము.** సం. వి. అ. పుం. ౧. చీల్చుట, పగులఁగొట్టుట, ముక్కలు చేయుట. ౨. యుద్ధము. ౩. నది, చెఱువు మొదలగువానియం దెక్కువగా నుండుజలము పొర్లిపాఱుట, జలో చ్ఛ్వాసము.

**విదారి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. గజ్జలోనివాపు (అ. ని.) ౨. శాలపర్ణి, ముయ్యాకుపొన్న. ౩. భూమికూష్మాండి, నేలగుమ్మడి. శ. ౪. కంఠ రోగవిశేషము, గొంతులోఁ బుట్టెడి యొకా నొక రోగము. (వాచ.)

**విదారించు.** సం. స. క్రి. చీల్చు, బ్రద్దలుచేయు.
మ. ... ... అశ్వ నికాయోదర పార్శ్వముల్
కరటి హస్తంబుల్ విదారించి యంయ్యనర
ణ్యాధిపు సేనగాడుపుల రణ్యానిన్ బలెన్
గూల్చినన్ ... ఉ. రా. ౩. ౧౬౧.

**విదారిగంధ.** సం. వి. ఆ. స్త్రీ. ముయ్యాకు పొన్న. శ.

**విదారువు.** సం. వి. ఉ. పుం. ఊసరవిల్లి, తొండ.

**విదాహము.** సం. వి. అ. పుం. ౧. కాలుట, తగులఁబడుట. ౨. జ్వాల, పెద్దమంట. ౩. తైక్ష్ణ్యము, వాఁడిమి.

**విదాహి.** సం. వి. న్. పుం. దాహమును (అత్యు ష్ణమును) బుట్టించెడి పదార్థము.

**విదాహించు.** సం. అ. క్రి తాపమునొందు.
వ. ఇట్లు మోహానలంబున దేహంబు విదాహింప నయ్యుర్వీ గీర్వాణుఁడు చలిత వియోగి ప్రాణుండగు పంచ బాణుండలంచి ...
వేం. పంచ. ౪. ౨౫౦.

**విదిక్కు.** సం. వి. శ్. స్త్రీ. మూల, రెండు దిక్కుల నడిమిభాగము.

**విదిక్కుపడు.** మి. అ. క్రి. దిగ్భ్రమ చెందు.
సీ. నామాట కులికి మిన్నక కాలభైరవుండే
లోను నిద్దఱ నిట్లు గ్రుంచె, నింక నెందఱఁ
బంప నెంచినాఁడో యని విడిచి కన్కని
గుడివెడలి పాఱి.
గీ. రేను నామాట పద్యంబుగా నొనర్చి వాసి
నిలిపితి నంత నెవ్వారలైన, మ్రొక్కఁ
జనుదెంచి కాంచి విదిక్కు పడుచు, వెడలి
మఱి చూడరట వెరవేకి పట్టి.
ద్వా. ౪. ౭౦.

**విదితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. తెలిసి నది, బోధపడినది. ౨. తెలుపఁ బడినది. ౩. ప్రసిద్ధి కెక్కినది, ప్రఖ్యాతము. ౪. కోరఁబడి నది, ప్రార్థితము. ౫. అంగీకరింపఁబడినది. ౬. వాగ్దానము చేయఁబడినది. ౭. యుక్తము. (ఈ యర్థము సంస్కృత గ్రంథములందుఁ గాన రాదు.)

క. అది గావునఁ గార్యార్థము, మదన గురుని
కడకు నిపుడు మన మరుగక పో, విదితము
గాదే తెరవన, ముదితయుఁ దనవిభుని
వాక్యములకు నలరుచున్.
కుచే. ౧. ౧౧౨.

వి. అ. న. ౧. ఎఱుక, జ్ఞానము. ౨. ప్రసిద్ధి, ప్రఖ్యాతి. ౩. లాభము, ప్రాప్తి. ౪. అంగీకారము. ఒప్పుదల.

**విదితుఁడు.** సం. వి. అ. పుం. పండితుఁడు, చదువరి.

**విదియ.** వి. (సం. ద్వితీయా) పక్షమందు రెండవ తిథి.

గీ. విదియ నాఁడేరు పడకున్నఁ దదియనాఁడు,
కానఁ బడియెడు పనికింత కనల నేల ...
యయా. ౫. ౬.

సీ. వర్ష గర్భము నడవక పోయె విదియలఁ
గుముదాప్త దారుణ కొమ్ము దతిగ ...
కాశీ. ౩. ౧౪౯.

**విదిలించు.** స. క్రి. (√ విదులు.) ౧. జాడించు, చలింపఁజేయు.

సీ. అలవోక వోలె వాలాగ్ర మొకించుక విద
లించు నంత నవ్విహగ విభుఁడు ...
సమీ. ౬. ౧౬౯.

క. ఆ నీరు సోఁకి మాయా, ధేనువు తా నిద్ర
పోయి తెలిసిన పగిదిన్, మేను విదిలించి
కొంచును, మానులు వెఱగంది చూడ మగువ
యగు తతిన్. వరాహ. ౧౦. ౬౦.

౨. జాడించు, కడుగు, శుభ్రము చేయు.

ద్వి. పీఁకతో నలికిన విత్తులు నీళ్ల, విదిలించు
కొని వచ్చి వేఁపి దంపించి ...
బస. పు. ౪. ౯౪౦. పం.

౩. విదుర్చు, వదలుచుకొను.

చ. విడువిడు పట్టరాకు మలిపేణి యటంచును
జాతి కెంపురా, కడియపుఁ గేలు ఘల్లు
రనఁగా విదిలింప ... దశా. ౫. ౨౪.

౪. విదుఁలుచు, దులుపు.

చ. ... కంథ గ్రక్కున విదిలించి యందుఁ
బదికోట్టుల మాడలు రాలఁ బోవుగా ...
విక్ర. ౨. ౧౭.

సీ. సంచెళ విదిలించి తాంబూల దళపూగ నివ
హంబుఁ జాలఁగ నించు నుబ్బ ...
ఆము. ౭. ౭.

౫. విదుర్చు, పోఁగొట్టు.

వ. ... అఁకటఁ గటకటంబడి గ్రాసంబు
వేఁడినఁ జెడు పురుషునుం బోలె విదిలించు
వాకలే కాని యాయాసం బెఱింగి రమ్మను
వారు లేరు.

(కసరికొట్టు అని భావము.) శుక. ౩. ౧౭౭.

**విదిలించుకొను.** స. క్రి. (విదిలించు + కొను) దులుపుకొను, కదలించుకొను.

క. అని శ్రీపతి యానతి యిచ్చిన మండల
విడిచె నతని సిద్ధ విభుఁడు వాఁడును గుల
గులయై లావగ్గలినమై విదిలించుకొనుచు
లేచెఁ గిరుకుచున్. పాండు. ౪. ౨౯౭.

**విదిల్చు.** స. క్రి. (√ విదులు) విదులఁ జేయు. దులుపు.

క. తెకకలు విదిల్చి లావులు, ముక్కుకొనం
దువ్వి ... శుక. ౧. ౨౩౪.

**విదిశ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. దశార్ణ దేశము నకు రాజధాని. ౨. మాల్వదేశము నందలి నది విశేషము. ౩. విదిక్కు, మూల, రెండు దిక్కుల నడిమి భాగము.

**విదీర్ణము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. చీల్పఁ బడినది. బ్రద్దలు చేయఁబడినది, ముక్కలు

చేయఁ బడినది. ౨. తెలుపఁ బడినది. విస్త రించినది.

**విదుఁడు.** సం. విణ. (ద్) (సమాసాంతమున) తెలిసినవాఁడు, (వేద విదుఁడు మొ.)

వి. ద్. పుం. ౧. బుధ గ్రహము. ౨. పండితుఁడు, చదువరి.

**విదురు = విదులు.** అ. క్రి. (శ. ర.)

(చూ. విదురుచు.)

జ : విదురుచు, విదుర్చు, విదుర్పు.

**విదురుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) బుద్ధిమంతుఁడు, తెలివి గలవాఁడు.

వి. అ. పుం. ౧. పండితుఁడు, చదువరి. ౨. యుక్తులు గలవాఁడు, కుట్రలు పన్ను మనుష్యుఁడు.

౩. పాండురాజు తమ్ముఁడు, కౌరవులకు మంత్రి.

**విదురుచే = విదుర్చు.** స. క్రి. (√ విదురు) విదురఁజేయు, విదిలించు.

క. కప్పంగొప్పులఁ జన్నుంగప్పుల మొగముల నొడళ్లఁగప్పిన మెఱుఁగుం, బుప్పొడి విదిరిచికొని మఱి, యప్పడఁతుక లరిగి కప్ర పనఁటులచెంతన్ ... యయా. ४. ౨౮.

**విదుర్చు = విదురుచే.** విదులుచే, విదుఁచు, (√ విదురు.)

స. క్రి. ౧. దులుపు.

గీ. రాలియున్న పుప్ప ప్రకరము విదిర్చి, చెన్నుగా నున్న చేసిన సెజ్జయనఁగ, వేగు టయుఁ జుక్కలన్నియు విరిసి విశది, భాతిఁ జెలువొందెఁ జూడ నంబర తలంబు.

భార. విరా. ౨. ౨౩౯.

ఉ. ... పెన్నెఱుల్, వేమరుచేతులం బిడిచి విప్పి విదిర్చి నఖాంతరరంబులన్, గోమల లీల దువ్వి ... పారి. ౨. ౧౦.

౨. చలింపఁజేయు.

క. తలిరాకు మెఱుఁగు వాతెఱ, కలకంఠ విటుండు గమియఁగాఁ జూతలతాలలన విదిర్చెను గంటివె, యలికంకణ ముఖర విటప హస్తముల సతీ. పారి. ౩. ४౯.

చ. ... గసా, తలమునునుండి పెల్వడు నుదారత మేను విదర్ప ... భాగ. ౩. ४౩౫.

ఉ. ... గ్రక్కున వారుపొతీ మనుగంబడ నెక్కిన బిట్టుదూలి నల్దిక్కులఁ గూల గాత్రము విదిర్చి నతండు మదద్విపాకృతిన్ ... భా. రా. యు. ౯४౧.

౩. ప్రసరింపఁజేయు.

లగడ. ... గొడిసె తింత్రిణీకులము విదిర్చెన్, వడపిందె జనావళి వడఁ దీర్చెన్ ...

బహు. ౨. ౧౩.

చ. ... విస్ఫుట పటుదీర్ఘ నిశ్వాసనముల్ బలితంపుశిఖల్ విదర్పఁగా ...

దశా. ౨. ౨౬.

४. ఒసఁగు, ఇచ్చు.

వ. అహోణ్యవంశంబు (శూద్రవంశంబు) ... విశ్వ విశ్వంభరా క్రీడనంబు దనకు విదిర్చిన పరమ శాంతి యంతరంగంబున సంతరించి నిఖిల ప్రపంచంబునకు నాధారంబై ప్రవర్తిల్లె ... భీమ. ౧. ౩౧.

౫. తొలగించు, ప్రోసిచేయు.

సీ. తన ప్రమొక్కు కినుకఁ దైకొనక లచ్చి విదుర్పఁ బవనఖంబంటిన ఫాలతలము ... దశా. ౩. ౧४౫.

౬. జాడించు.

సీ. స్నాతుఁడై మెయినీరు చేతఁ దొడయఁ
జీరనార్వ చెంద్రుకలు విదుర్వఁ గూడ,దు...
మార్క. 3. ౨౩౬.

౨. విదలించు.

సీ. అనూధవి పరాగ మతిరాగము మించఁ
బఱతెంచు కలకంఠి పై విదిర్చి ...
వసు. ౧. ౧౨౭.

**విదుర్పు(రుపు).** వి. (√ విదుర్చు) కదల్చుట.

వ. ఇ ట్లేరయు నా నూతనందను విల్లు విదుర్పు
దోఁపక గుడుసు పడుటఁ జక్రాకృతిం
బొలుపు నవశిఖల చెలువుదాల్చి ...
భార. ద్రోణ. ౪. ౨౩౨.

చ. ... జెక్క విదుర్పు మున్నుగా, పడఁకుకెు
కాక చేష్టడిగాఁ బత్తులు వక్షము జానువుల్
చొరన్ ... ఆము. ౪. ౧౧౭.

**విదులము.** సం. వి. అ. పుం. ౧. ప్రబ్బలిచెట్టు.
౨. నీటిప్రబ్బలి. ‡. (మే. ౨.) 3. గోప
రసము, బాలెంతబోలు.

(ఒకదినుసు పరిమళముగల బంక.)

**విదులు.** స. క్రి. ౧. విడుమే, త్యజించు.

క. పదియాఱువేల నార్వురు, సుదతులు సెన
మంద్రునీకు సొంపుగ భార్యల్, విదితంబుగ
బహురూపుల, విదులక భోగింపు వేగ
వేడుకఁ గృష్ణా. కృష్ణ. ౪. ౨౩.

౧. రాలు. (చూ. విదురిచు.)

జః విదిలించు, విదిలించుకొను, విదుల్చు, విదు
లుచు, విదుల్చుకొను, విదుల్పు.

**విదులుచే(ల్చు).** స. క్రి. ౧. దులుపు.

చ. ... పదములు జంఘలూరువులు బాహు
వులోలి నమర్చి త్రొక్కియున్, విదిలిచి



యున్ నొగిల్చియును వ్రేసియు నొంచి
నతండు వ్రేల్మిడిన్ ...
హరి. ఉ. ౧౦. ౨౫౫.

౨. ప్రసరింపఁజేయు.

సీ. విషము విదుల్చుచు వెస ఘన విముఖతఁ
జనుబాల పదము లీ సారసములు ...
రసి. ౪. ౫౨.

3. రాల్చు.

ద్వి. ... ఆ తటినొక్క యెడుత ... అచ్చపు
భక్తితోనట వార్ధి మునిఁగి, వచ్చిగా నిసు
కలో పడి బొరలాడి, తడయక చనుదెంచి
తన మేని యిసుక, వడిఁ గట్టపై ...
విదుల్చె ...
రం. రా. యు. 3౧౫. పా. ౨3. పం.

౪. దులుపు.

ద్వి. జడలు పీడఁగఁగ లాసములు విదిల్చి,
... చంకలనిడి మరలి చూచుచును ...
ద్వి. హరిశ్చ. పూ. ౪౨౦. పం.

వ. ... పరాగంబులు రాల్చుచుం బరెయ్యెదలు
విదుల్చుచు ... కళా. ౬. ౨౫౪.

**విదుల్చుకొను.** స. క్రి. (విదుల్చు + కొను
సార్థమున) దులుపు.

క. కొంగెనెల సుధారసంబునఁ గఱవోవఁగ
నొరసి కడిగి కాముదితోఁ గ్రొమ్మెఱుఁ
గుల విదిల్చికొనిపై, మెఱుఁగిడు నట్లొప్పున
గజమ్ముదు నిటలరుచుల్.
శు. సం. 3. ౩౧౨.

**విదుల్పు(లుపు).** వి. (√ విదుల్చు) విదిలించుట.
విక్షేపణము.

వ. ... జవంబులు రవంబులు నదుల్పులు విదు
ల్పులు పీకులు తాఁకులు ...
భీమ. ౪. ౬౦.

ఉ. పైటకు లాగులాడి కటిపై ఘటియించిన చేవిరుల్వులన్, బాటిలి నీవి క్రై పెనఁగి పైఁ బడి చేతులు తట్టి వేఁతల, న్మ్రోటుగ నాటఁ బట్టుబలిమిం గనమిం దగ దొట్టు వెట్టిపో, రాటము లారయునాయన కోయారి యొడాట ములన్ హుటాహుటిన్.

పాంచాలీ. ౫. ౨౦.

**విదుపు.** సం. వి. ఉ. పుం. ౧. ఏనుఁగు కుంభ స్థలము నడిమి భాగము. ౨. నీటి గుజ్జము.

**విదుషి.** సం. వి. ఈ. స్త్రీ. విద్వాంసురాలు.

**విదూనము.** సం. విశే. (అ. ఆ. అ.) మిగుల భాధింపఁ బడినది. హింస పెట్టఁ బడినది.

**విదూరగము.** సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి దూరముగా వ్యాపించునది, మిక్కిలి దూర ముగాఁ బోవునది.

**విదూరజము.** సం. వి. అ. న. వైడూర్యము, నవరత్నములలో నొకటి.

**విదూరము.** సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి దూరమున నున్నది. దవ్వున నున్నది.

వి. అ. పుం. వైదూర్యములు పుట్టెడి పర్వ తము.

న. మిగుల దూరము, కడుదవ్వు.

**విదూషకుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) ౧. మలినముగాఁ జేయువాఁడు, పాడుచేయు వాఁడు, చెఱచువాఁడు. ౨. దూషించువాఁడు, నిందించు వాఁడు. 3. చమత్కారి, హాస్య ముగా మాటాడువాఁడు.

వి. అ. పుం. ౧. హాస్యగాఁడు. ౨. శృంగార నాయకుని సహాయులలో నొకఁడు.

(ఇతఁడు తన రూపము పని వేషము భాష మొదలగు వానిచేత నెల్లరకు నవ్వుఁ బుట్టించుచుఁ తన పని నెఱవేర్చుకొనెడి స్వభావము గలవాఁడు.)

3. భోగలాలసుఁడు.

**విదూషణము.** సం. వి. అ. న. ౧. చెఱుచుట, పాడుచేయుట. ౨. నిందించుట, దూఱుట.

**విదేశజము.** సం. విశే. (అ. ఆ. అ.) దేశాం తరమునఁ బుట్టినది. పరదేశమున నుద్భవించి నది.

**విదేశము.** సం. వి. అ. పుం. పరదేశము, దేశాం తరము.

**విదేశి.** సం. విశే. (న్. నీ. న్.) దేశాంతర సంబంధి, పరదేశస్థుఁడు.

వి. న్. పుం. దేశాంతరము నుండి వచ్చిన మను ష్యుఁడు అన్యదేశస్థుఁడు.

**విదేశీయుఁడు = విదేశి.** సం. విశే. (అ. ఆ. అ.)

**విదేహా.** సం. వి. ఆ. స్త్రీ. మిథిలా పట్టణము, విదేహానగరి.

**విదేహము.** సం. వి. అ. పుం. ౧. విదేహ దేశము, దేశ విశేషము. ౨. విదేహమను నొకానొక మండలము, భూభాగము.

**విదేహుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. దేహము లేనివాఁడు, దేహసంబంధము లేని వాఁడు. ౨. కంఠము క్రింది భాగము లేని వాఁడు.

వి. అ. పుం. ౧. విదేహ దేశనివాసి. ౨. జనక మహారాజు.

**విద్దె(ద్దియ).** వి. (సం. విద్యా.) ౧. చదువు.

సీ. తెలిపి చూపక ప్రోలగిలికొని విద్దెలఁ గొలల వారల రిత్త మొఱఁగుటయును ...

అ. రా. బాల. ౪౫.

ద్వి. విద్దెలు సెలఁపుచు విభుని ముందఱను,
ముద్దులు గులుకుచు మోహనా కృతుల ...
రం. రా. బాల. ౨౧. పా. ౪. పం.

౨. మాయ.

ఉ. ... ఇంద్రియంబులన్, బెద్దవునీ వెఱుంగని
ప్రవీణపు బుద్ధులు లేవు గానన్, విద్దెలు
మానుమాను మవివేకము డెందమ నిన్ను
వేఁడెదన్. చంద్ర. వి. ౨. ౧౨౫.

౩. దంభవాక్యము, బడాయి.

ద్వి. విద్దెలాడెడుఁగాక విందుమే తొల్లి ...
బస. పు. ౫. ౧౦౫. పం.

**విద్దె(ద్దియ)ము.** వి. (సం. విద్యా) తొలుసారి బాలకులు లేచి నిలువఁబడుట.

క. విద్దెములు సేయరాదా, ముద్దులపట్టియటంచు
నుచ్చుట దీరన్, దద్దయుఁ దలిదండ్రులు
తను, ముద్దిడుకొన నజుఁడు వెలసె మోహన
లీలన్. ఇందు. ౨. ౧౭.

మ. జనకుండయ్యలు విద్దె మేదియన ...
దశా. ౪. ౧౪౨.

ఉ. ముద్దులమాటలుఁ జిఱుతమోమున నున్నని
లేత చెక్కులుఁ, గొద్దిగ నున్న సెన్నడు
ముకూఁకటి కందక ఫాలపట్టికఁ, విద్దెము
సేయు ముంగురులు విప్పగుఱెప్పల గొప్ప
కన్నులుఁ, బ్రొద్దొకవింతయై యమరెఁ
బుప్ప సుగంధికి బాల్యవేళలఁ.
అని. ౨. ౨౧.

(ఇట "విద్దెముసేయు = చిందులాడు" అని భావము.)

**విద్య.** సం. వి. ఆ. స్త్రీ. ౧. జ్ఞానము, తెలివి. ౨. తత్త్వజ్ఞానము ఆత్మసాక్షాత్కారము. ౩. చదువు, జ్ఞానహేతువగుశాస్త్రాదికము. (చతుర్విద్యలు. ఆన్వీక్షకీ, త్రయి, వార్త, దండనీతి. మనువు ఆత్మవిద్య యైదవదిగాఁ జేర్చి యున్నాఁడు.) (చతుర్దశ విద్యలు. నాలుగు వేదములు ఆఱువేదాంగములు, ధర్మశాస్త్రము, మీమాంస, న్యాయశాస్త్రము, పురాణము.) ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వము, అర్థశాస్త్రము. అను వానితోఁ బదునెనిమిది.) ౪. దుర్గాదేవి. ౫. దేవీమంత్రము. ౬. ఇంద్రజాల నైపుణ్యము, గారడీ యందలి నేర్పు.

**విద్యమానము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. ఉన్నది, స్థితము. ౨. సమక్షమున నున్నది, ఎదుటనున్నది. ౩. సత్యమైనది, యథార్థము.

**విద్యలవాఁడు.** మి. వి. (విద్యలు + వాఁడు) ఇంద్రజాలికుఁడు, గారడివాఁడు.

గీ. వదలి శౌర్యంబు విద్యలవాని కరణి, నింద్ర
జాలంబు పన్నెదవే బలీంద్ర ...
దశా. ౨. ౪౦౫.

**విద్యాకరుఁడు.** సం. వి. అ. పుం. విద్వాంసుఁడు, చదువరి.

**విద్యాచంచువు = విద్యాచణుఁడు.** సం. విశే. (ఉ.)

**విద్యాచణుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) విద్యచేఁ బ్రసిద్ధికెక్కినవాఁడు.

**విద్యాదలము.** సం. వి. అ. పుం. భూర్జపత్రవృక్షము.

**విద్యాదాత.** సం. వి. ఋ. పుం. చదువు చెప్పువాఁడు, విద్యనిచ్చువాఁడు, గురువు.

**విద్యాదానము.** సం. వి. అ. న. ౧. విద్య నేర్పుట, చదువుచెప్పుట. ౨. పుస్తకాదికము నొసఁగుట. (వాచ.)

**విద్యాదేవి.** సం. వి. ఈ. స్త్రీ. సరస్వతీదేవి.

**విద్యాధరి.** సం. వి. ఈ. స్త్రీ. విద్యాధర స్త్రీ

**విద్యాధరుఁడు.** సం. వి. అ. పుం. దేవతలలో నొక తెగ పురుషుఁడు.

**విద్యానులాపి.** సం. విణ. (న్. నీ. న్.) విద్యను వల్లించువాఁడు, వల్లె వేయువాఁడు.

**విద్యాభ్యాసము.** సం. వి. అ. పుం. విద్య నేర్చుకొనుట, చదువుకొనుట, జ్ఞానము సంపాదించుట.

**విద్యారంభము.** సం. వి. అ. పుం. (విద్యయొక్క యారంభము) చదువు ప్రారంభించుట, పిల్లవానినిఁ జదువులోఁ బ్రవేశపెట్టుట.

**విద్యార్జనము.** సం. వి. అ. న. విద్యను సంపాదించుట, చదువుకొనుట, జ్ఞానసంపాదనము.

**విద్యార్థి.** సం. వి. న్. పుం. ౧. చదువు కోరువాఁడు. ౨. చదువుకొను చున్నవాఁడు.

**విద్యార్థుఁడు.** సం. వి. అ. పుం. విద్యయే ప్రయోజనముగాఁ గలవాఁడు.

**విద్యాలయము.** సం. వి. అ. పుం. బడి, పాఠశాల, విద్యాస్థానము.

**విద్యాలాభము.** సం. వి. అ. పుం. ౧. విద్యాప్రాప్తి, చదువువచ్చుట. ౨. విద్యవలన సంపాదించిన ధనము.

**విద్యావంతుఁడు.** సం. విణ. (త్. తీ. త్.) విద్యగలవాఁడు, చదువరి.

**విద్యావృద్ధుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) విద్యచే నధికుఁడు, విద్యచేఁ బెద్దవాఁడు.

**విద్యావ్యసనము.** సం. వి. అ. న. విద్యయందలి యాసక్తి.

**విద్యా(వ్రత)స్నాతకుఁడు.** సం. వి. అ. పుం. బ్రహ్మచారివ్రతము పూర్తిచేసిన బ్రాహ్మణుఁడు, విద్య పూర్తిచేసి గురుకులమునుండి మఱలిన బ్రాహ్మణుఁడు.

**విద్యుజ్జిహ్వుఁడు.** సం. వి. అ. పుం. మెఱుపు వంటి నాలుక గలవాఁడు, ఒకానొక రాక్షసుఁడు.

**విద్యుజ్జ్వాల.** సం. వి. ఆ. స్త్రీ. మెఱుపుయొక్క ప్రకాశము, మెఱుపుమంట.

**విద్యుత్తు.** సం. వి. త్. స్త్రీ. ౧. మెఱుపు. ౨. సంధ్యాకాలము. (వాచ.)
విణ. త్. ప్రకాశములేనిది, కాంతిలేనిది (మే. ని.)

**విద్యుత్ప్రియము.** సం. వి. అ. న. కాంస్యము, కంచు.

**విద్యుత్వంతము.** సం. విణ. (త్. వతీ. త్.) మెఱుపుగలది.
వి. త్. పుం. మేఘము.

**విద్యుదున్మేషము.** సం. వి. అ. పుం. మెఱుపు ప్రకాశము, మెఱుపు వెలుఁగు.
ఇట్లే : విద్యుద్ద్యోతము.

**విద్యుద్దామము.** సం. వి. న్. న. త్రాడువలె నుండెడి మెఱుపు, తీఁగ మెఱుపు.

**విద్యుల్లత.** సం. వి. ఆ. స్త్రీ. మెఱుపుతీఁగ, తీఁగ మెఱుపు.

**విద్యుల్లేఖ = విద్యుల్లత.** సం. వి. ఆ. స్త్రీ.

**విద్యోతనము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. ప్రకాశింపఁజేయునది. ౨. స్పష్టపఱచునది.

**విద్యోతించు.** సం. అ. క్రి. ప్రకాశించు.
వ. ... ... ఇంతటికి నధిష్ఠానంబై తదీయరాజధానియగు ప్రాగ్జ్యోతిషంబు విద్యోతించె...
హరి. ఉ. ౪. ౪౫.

వ. ... కంఠకోణంబునఁ గంఠికోపరి నీలంబునుంబోని కాలకూటంబున సంఘటిల్లు భ్రాంతిసంతమసంబునకు ఖద్యోతంబులునుం బోలె విద్యోతించు కంకణాశీవిషానల విస్ఫులింగంబులవలన గుర్విరీక్ష్యుం డగుచు ... భీమ. ౫. ౭.

**విద్యోపార్జనము.** సం. వి. అ. న. చదువును గడించుట, విద్య నేర్చుకొనుట.

**విద్రధి.** సం. వి. ఇ. పుం. కడుపులోఁ బుట్టు పుండు.

**విద్రధినాశనము.** సం. వి. అ. పుం. మునగ చెట్టు, శోభాంజనము. ꠰. (త్రి. ని.)

**విద్రమము.** సం. వి. అ. పుం. గంధ్రము, కన్నము. (వా. చ.)

**విద్ర(ద్రా)వము.** సం. వి. అ. పుం. ౧. పాఱి పోవుట. ౨. దిగులు, భయము. ౩. పారలి పోవుట, గట్టులు మునుఁగఁ ద్రవహించుట. ౪. కరఁగుట, ద్రవమగుట. ౫. నింద, మాట. ౬. జ్ఞానము, తెలివి.

**విద్రావుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) మలఁకువ చెందినవాఁడు, నిద్రనుండి లేచినవాఁడు.

**విద్రావణము.** సం. వి. అ. న. ౧. తఱిమి వేయుట, పరుగెత్తించుట, ఓడించుట. ౨. కరఁగించుట, ద్రవముగా జేయుట.

**విద్రావితము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. దరుమఁబడినది, పరుగెత్తింపఁబడినది. ౨. చెదరినది, చీల్పఁబడినది. ౩. కరఁగింపఁబడినది, ద్రవముగాఁ జేయఁబడినది.

**విద్రుచు - విదురుచు.** స. క్రి. ౧. దులిపిపడ వైచు, పఱచు.

వ. ... తామనుగుడిచి దర్భపూరులు విద్రిచి యందఱకు వేఱువేఱ శయనమ్ము లిమ్ముగా రచియించి ... భార. ఆది. ౭. ౨౨౩.

౨. విదిలించు, దులుపు.

వ. ... హిడింబుండను నొక్క రక్కసుండు వారి దవ్వులంజూచి మైవెంచి యూర్ధ్వకేశంబులు విద్రిచి ... భార. ఆది. ౬. ౧౭౫.

ద్వి. అటు పట్టుపడి యతఁడాకాశవీథి, బటుశక్తి నెగసి యుద్భటవృత్తిమెఱసి, విద్రిచినఁ బదివేల వీరులు ధాత్రిపద్రువంగ నుగ్గునూచై త్రెళ్లిరంత ... రం. రా. యు. ౩౪౭. పా. ౭. పం.

శా. ... ఈ కంథచే, వేలకుల్ కనకంబురాలు విద్రుచున్ విశ్వంభరాధీశ్వరా ... వి. క్ర. ౨. ౭.

౩. చిమ్ము, విసరు.

మ. అది చూతాక్కారముఁ జేసికేల్ విద్రుచు కొంచం భోజపండంబును, స్మదఫంగిన్ బలు మ్రోఁతతో వెడలి పల్మాఱున్ మహాఘీంకృతుల్, సెదకన్ వెంచియుఁ దొండమున్ విద్రుచుచున్ కృంఘంబపెన్ మ్రాకులం బొదలుంగూల్చుచుఁ బాఱిజైన నిలయంబుల్ సొచ్చెనుగ్రాకృతిన్. కేయూర. ౨. ౧౦౨.

౪. రాల్చు.

చ. ఎద్రిచిన కాలపాకమున నీగతినీమదిఁ గ్రోధవల్లికం, బద్రిచినవారు మన్నిశిత బాణపఱంపరపై మిణుంగురుల్, విద్రుపఁగఁ దత్ఫలంబుల చవింజరితార్థులుగా శరీరపుం,జిద్రుపలుచేరుఁ దత్సకుల చేతులఁగాక కులంబువాతులన్. ఉ. హరి. ౪. ౧౦౯.

౫. విఱుచు.

గీ. గోవజవ్వాదిఁ గస్తూరిఁ గొఱతపఱచు, తన్ను పడిచెంబు జొబ్బిల విద్రిచివిద్రిచి ...
నైష. ౬. ౧౨౦.

**విద్రుతము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. (భయము వలన) పాఱి పోయినది. ౨. క్షుబ్ధ మైనది, కలఁత నొందినది. ౩. కరఁగినది, ద్రవమైనది.

**విద్రుమము.** సం. వి. అ. పుం. ౧. పగడపుఁ జెట్టు. ౨. పగడము, ప్రవాళము. ౩. నవాంకురము, క్రొత్త మొలక, చివురు.

**విద్రుమల(తిక)త.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పగడపుఁ దీఁగ. ౧. (నలిక యనెడి) గంధ ద్రవ్య విశేషము.

**విద్వత్కల్పుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) కొంచెము తక్కువగాఁ బండితుఁడు, ఇంచుమించుగ విద్వాంసుఁడు.

(ఇట్లే విద్వద్దేశీయుఁడు, విద్వద్దేశ్యుఁడు.)

**విద్వాంసుఁడు.** సం. విశే. (స్. దుషీ. స్.) ౧. తెలిసిన వాఁడు, బుద్ధి మంతుఁడు. ౨. చేదువరి.

వి. స్. పుం. పండితుఁడు, చేదువరి.

**విద్వి(ట్టు)షుఁడు.** సం. వి. ష్. పుం. శత్రువు, పగవాఁడు.

**విద్విష్టము.** సం. విశే. (అ. ఆ. అ.) ద్వేషింపఁబడినది, పగగొనఁ బడినది.

**విద్వేషణము.** సం. వి. అ. న. ౧. విరోధ కారణము. ౨. విరోధము, పగ.

**విద్వేషణి.** సం. వి. ఈ. స్త్రీ. కోప స్వభావము గల స్త్రీ. రోషము గల స్త్రీ.

**విద్వేషణుఁడు.** సం. వి. అ. పుం. శత్రువు, పగవాఁడు.

**విద్వేషము.** సం. వి. అ. పుం. ౧. విరోధము, పగ, శత్రుత్వము. ౨. (ఇతరులను) తక్కువగాఁ జూచు గర్వము, తిరస్కారము, తృణీకారము.

**విద్వేషి.** సం. విశే. (న్. ణీ. న్.) పగ గలవాఁడు, విరోధము గలవాఁడు.

వి. న్. పుం. శత్రువు, పగ వాఁడు.

**విద్వేషించు.** సం. అ. క్రి. విరోధించు, పగఁగొను.

శా. ... నా, సీరస్ఫార బలంబు లొండొరులతిధిక్షేపంబులే పోరఁగా, సీరాజేశ భరంబునం బెనఁగ విద్వేషించి ...
జై. భా. ౫. ౧౩౬.

**విధ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పద్ధతి, ప్రకారము. ౨. మచ్చు, రకము, రీతి. ౩. సమృద్ధి, ఐశ్వర్యము. ౪. గుఱ్ఱము, ఏనుఁగు మొదలగు వానికిఁ బెట్టెడి యాహారము, దాణా. ౫. చొచ్చు, ప్రవేశము. ౬. జీతము, కూలి. ౭. పని, కృత్యము.

**విధము.** సం. వి. అ. పుం. ౧. రకము, జాతి, మచ్చు, (బహువిధము.) ౨. రీతి, ప్రకారము, పద్ధతి. ౩. త్రివిధము, అష్ట విధము మొ. ౪. గజ కబళము, ఏనుఁగులకుఁ బెట్టెడి దాణా. ౫. కలిమి, సంపద. (విల్యమ్సు.) ౬. చొచ్చుట, ప్రవేశము. (విల్యమ్సు.)

**విధవ.** సం. వి. ఆ. స్త్రీ. పెనిమిటిలేని స్త్రీ. విగత భర్తృక, ముండమోపి.

విధవకుఁదలనుఖ్లు పెదుకుట = నిష్ఫలమనుట.

సీ. జిహ్వాది యంతఁదినఁ జంకలెత్తఁగ నేల విధ
వకుఁ దలసుళ్లు వెదుక నేల ...
రామ. ౪. ౫౫.

**విధవనము.** సం. వి. అ. న. ౧. క్షోభము, కలఁత, కదలిక. ౨. వణఁకు, కంపము.

**విధవాగామి.** సం. వి. న్. పుం. విధవను (రతియందు) పొందినవాఁడు.

**విధవావేదనము.** సం. వి. అ. న. విధవను (వితంతువును) పెండ్లాడుట.

**విధాత.** సం. విశే. (ఋ. తీ. ఋ.) చేయువాఁడు, కల్పించువాఁడు.

ఋ. పుం. ౧. సృష్టికర్త, బ్రహ్మ. ౨. దాత, ఇచ్చువాఁడు. ౩. విధి, దైవము. ౪. విశ్వకర్మ. ౫. మన్మథుఁడు. ౬. మద్యము. ౭. అధర్మము. (వాచ.)

**విధాతృఁడు.** సం. వి. ఋ. పుం. బ్రహ్మదేవుఁడు.

సీ. ... ఇంద్రనందనునకు, నెలఁగాఁ బ్రీతితో దీనినీఁ గాంచితినని యున్నచో విధాతృనకు నిట్లు, పాడియె ... భార. ఆది. ౭. ౨౩.

ఉ. ... మారుతికిఁ జయంబొసఁగె మాల విధాతృఁడు వాని గెల్పు కో, వేరికి సమ్మతంబగునె యిట్టిది దీనను పెంపుగల్గునే ... భార. సౌప్తి. ౧. ౨౧౮.

**విధాత్రాయుస్సు.** సం. వి. స్. పుం. బ్రహ్మదేవుని యాయువు. ౨. సూర్యుని వెలుఁగు, ఎండ. ౩. ప్రొద్దు తిరుగుడుపువ్వు చెట్టు.

**విధాత్రి.** సం. వి. ఈ. స్త్రీ. పిప్పలి. ‡.

**విధానకము.** సం. వి. అ. న. ౧. శాసనము, నిబంధనము. ౨. బాధ, నొప్పి.

**విధానజ్ఞుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) విధి నెఱింగినవాఁడు, చేయవలసిన పద్ధతి తెలిసినవాఁడు.

పుం. విద్వాంసుఁడు, పండితుండు. ఇట్లే విధానగుఁడు.

**విధానము.** సం. వి. అ. న. ౧. ఏర్పాటు, ఏర్పఱుచుట. ౨. చేయుట, ఆచరించుట. ౩. సృష్టి, సృజనము. ౪. ఉపయోగము, ప్రయోజనము. ౫. ఆజ్ఞ, శాసనము. ౬. శాస్త్రవిధి, ధర్మవిధి. ౭. శాస్త్రవిహిత కర్మానుష్ఠానము, శాస్త్రమున చెప్పఁబడినట్లు కర్మమును నాచరించుట. ౮. పద్ధతి, ప్రకారము. ౯. సాధనము, ఉపాయము. ౧౦. సంస్కారము (ఉపనయనాది.) ౧౧. లాభము, ప్రాప్తి. ౧౨. గజకబళము, ఏనుఁగులకుఁ బెట్టు దాణా. ౧౩. ధనము. ౧౪. బాధ, నొప్పి. ౧౫. (వ్యాక) ప్రత్యయాదులను ప్రకృతికిఁ బూర్వపరములుగాఁ జేర్చుట. ౧౬. (నాట్య) భావసంధి. ౧౭. విరోధకార్యము.

**విధాయకము.** సం. విశే. (అ. యి. కా. అ.) ౧. ఏర్పాటు చేయునది. ౨. చేయునది, ఆచరించునది. ౩. సృజించునది. ౪. విధించునది, ఆజ్ఞాపించునది. ౫. ఒప్పగించునది, అధీనము చేయునది.

వి. అ. న. ఆజ్ఞ.

**విధాయి.** సం. విశే. (న్. నీ. న్.) విధించువాఁడు.

**విధి.** సం. వి. ఇ. పుం. ౧. చేయుట, ఆచరించుట. ౨. పని. ౩. పద్ధతి, రీతి, ప్రకారము. ౪. అప్రాప్తప్రాపకమైన వేదవాక్యము, ఒక పనిచేయవలయునని నిర్దేశించు వాక్యము, క్రియాప్రవృత్తి నిమిత్తమయిన వేదవాక్యము,

(ఇది అపూర్వవిధి, నియమవిధి, పరిసంఖ్యావిధి అని త్రివిధము.) ౫. సంస్కారము. వేదోక్త కర్మము. ౬. ప్రవర్తన, నడవడి. ౭. స్థితి, అవస్థ. ౮. సృష్టి, సృజనము. ౯. బ్రహ్మదేవుఁడు. ౧౦. అదృష్టము, దైవము. ౧౧. గజకబళము, ఏనుఁగులకుఁ బెట్టు దాణా. ౧౨. సమయము. ౧౩. వైద్యుఁడు. ౧౪. విష్ణుదేవుఁడు. ౧౫. నిరోగము, ఆజ్ఞ ౧౬. ఆజ్ఞా వాక్యము. (వాచ.)

**విధి(యి)ంచే.** సం. స. క్రి. ౧. చేయు.

ఉ. ఇమ్మగ నాత్మరక్ష విధియింపు విధమ్మున మంత్రరక్ష యొప్పన్నమ్మనఁ జేయఁగా వలయు ... భార. ఆది. ౬. ౧౧౦.

క. శివతీర్థములో నొండెను, శివాజ్ఞలో నొండెఁ దాను జీవత్యాగంబు విధించిన మానవుఁడును, భవత్ప్రసాదమున ముక్తిఁ బడయు మహేశా. శివ. సా. ౨౮౧.

౨. ఏర్పఱుచు, నియమించు, ఏర్పాటుచేయు.

సీ. దివిజ మర్త్యాది జంతువు లమ్మహాత్మ విధించిన తెరువులఁ దిరిగి బ్రదుకు, చుండ ... భాగ. శాం. ౩. ౪౪౨.

గీ. స్మృతుల యందు బలాత్కార కృతము లెల్ల, నకృతలనుగా విధించి నాఁడు ట్టె మనువు ... నైష. ౭. ౭౨.

**విధిఘ్నుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) శాస్త్ర విహితము లయిన కర్మములను ఆచరింపని వాఁడు, ఉల్లంఘించువాఁడు.

**విధిజ్ఞుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) శాస్త్ర విహితము లయిన కర్మముల నెఱింగినవాఁడు.

౨. అ. పుం. శాస్త్ర విహితము లయిన కర్మముల నెఱింగిన బ్రాహ్మణుఁడు.

**విధిత్స.** సం. వి. ఆ. స్త్రీ. ౧. చేయవలయు ననెడి కోరిక, ఆచరింప నిచ్ఛ.

౨. ఉద్దేశము, కోరిక, ఇచ్ఛ.

**విధిత్సితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. చేయ నిచ్ఛగింపఁ బడినది, చేయ నుద్దేశింపఁ బడినది.

౨. అ. న. ఉద్దేశము.

**విధిదర్శకుఁడు.** సం. వి. అ. పుం. ఉపద్రష్ట యనెడి ఋత్విక్కు, యజ్ఞమున నంతయు సరిగా జరిగినదియు లేనిదియుఁ జూచుచుఁ దప్పిన దానిని దిద్దుచుండెడి ఋత్విజుఁడు. ఇట్లే విధి దేశకుఁడు.

**విధిదృష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) శాస్త్రమునఁ జూడఁ బడినది. శాస్త్రముచే విధింపఁ బడినది.

**విధిద్వైధము.** సం. వి. అ. న. విధి వాక్యములు, శాస్త్రములు వేర్వేఱర్థములను దెల్పుట, శాస్త్రములయొక్క భిన్నత్వము.

**విధియోగము.** సం. వి. అ. పుం. దైవ సంఘటనము, దైవయోగము, దైవవశము.

**విధివంతము.** సం. విణ. అవ్య. శాస్త్రోక్తము, శాస్త్రవత్తు ("విధివత్తు" అనుట యుక్తము.)

వ. ... వసిష్ఠుండు విధి వంతమ్ముగా సంవరణున కుందపతి వివాహమ్ము సేయించె ... భార. ఆది. ౭. ౮౭.

**విధివిహితము.** సం. విణ. (అ. ఆ. అ.) శాస్త్రమున విధింపఁ బడినది.

**విధిహీనము.** సం. విణ. (అ. ఆ. అ.) శాస్త్రీయము కానిది, అశాస్త్రీయము.

**విధుంతుదుఁడు.** సం. వి. అ. పుం. చంద్రుని వ్యథపెట్టువాఁడు, రాహువు.

**విధుఁడు.** సం. వి. ఉ. పుం. ౧. చంద్రుఁడు, ౨. విష్ణుదేవుఁడు. ౩. బ్రహ్మదేవుఁడు. ౪. శివుఁడు.

**విధుక్షయము.** సం. వి. అ. పుం. చంద్రుని క్షీణత, కృష్ణపక్షము.

**విధుతము.=విధూతము.** సం. విశే. (అ.ఆ.అ.)

**విధుతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. కదలుట, కంపము. ౨. ఇటు నటువిసరుట.

**విధుననము.** సం. వి. అ. న. ౧. కదలుట, కంపించుట, కలతనొందుట. క్షుబ్ధమగుట. ౨. వణఁకుట.

**విధుప(పి)ంజరము.** సం. వి. అ. పుం. వెనుకకు వంగిన కొనగల పట్టాకత్తి.

**విధుప్రియ.** సం. వి. ఆ. స్త్రీ. తార, నక్షత్రము.

**విధుర.** సం. వి. ఆ. స్త్రీ. రసాల. పంచదారయుఁ బరిమళ ద్రవ్యములు గలసిన పెరుగు.

**విధురదర్శనము.** సం. వి. అ. న. ౧. అపాయ మగపడుట, భయము తటస్థమగుట. ౨. క్షోభ మనుభవించుట, మనోవికారము నొందుట.

**విధురము.** సం. వి. అ. న. ౧. భయము, విచారము, అపాయము, హాని. ౨. విరహము, ఎడఁబాటు.

**విధురుఁడు.** సం. విశే.(అ. ఆ.అ) ౧.దుఃఖపెట్టఁ బడినవాఁడు, బాధింపఁబడినవాఁడు, దుఃఖము గలవాఁడు, విచారమునకు లోనైనవాఁడు. ౨. విరహతాపముగలవాఁడు. ౩. శూన్యుఁడు, లేని వాఁడు. ౪. ద్వేషముగలవాఁడు, పగగలవాఁడు.

వి. అ. పుం. ౧. భార్యపోయినవాఁడు. మృత పత్నీకుఁడు.

**విధువనము.** సం. వి. అ. న. కదలుట, వణఁకుట. కంపము.

**విధువు.** సం. వి. ఉ. పుం. ౧. చంద్రుఁడు. ౨. కర్పూరము. ౩. పిశాచము, రాక్షసుఁడు. ౪. ప్రాయశ్చిత్తార్థమైన యాహుతి, ౫. విష్ణు దేవుఁడు. ౬. బ్రహ్మదేవుఁడు. ౭. శివుఁడు. ౮. వాయువు. ౯. యుద్ధము.

**విధూతకల్మషుడు.** సం. విశే. (అ. ఆ. అ.) పోగొట్టఁబడిన పాపముగలవాఁడు, పాపము లేనివాఁడు.

**విధూతకేశుఁడు.** సం. విశే. (అ. ఆ. ఈ. అ) విరియంబోసికొనిన జుట్టుగలవాఁడు.

**విధూతనిద్రుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) పోయిన నిద్రగలవాఁడు. మెలఁకువ చెందిన వాఁడు.

**విధూతము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. కదలుపఁబడినది. ౨. విదిలించఁజేయఁబడినది, అలలవలెఁ గదలినది. ౩. వణఁకినది, కంపము నొందినది. ౪. తీసివేయఁబడినది, పోగొట్టఁబడి నది. ౫. చంచలమైనది. ౬. త్యజింపఁబడినది. విడుపఁబడినది.

వి. అ. న. ప్రతికూలత, విరోధము.

**విధూతి=విధుతి.** సం.

**విధూననము.** సం. వి. విధుననము.

**విధూనితము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. వెడ లింపఁబడినది, భయపెట్టఁబడినది, కలత నొం దింపఁబడినది. ౨. దుఃఖపెట్టఁబడినది.

**విధృతము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. బలాత్కారముగాఁ బట్టుకొనఁబడినది; పట్టుకొనఁబడినది. ౨. విడఁదీయఁబడినది. దూరముగా నుంచఁబడినది. ౩. పొందఁబడినది. ౪. అడ్డగింపఁబడినది, ఆటంకపఱుపఁబడినది. ౫. రక్షింపఁబడినది, పోషింపఁబడినది.

వి. అ. న. ౧. ఆజ్ఞనుల్లంఘించుట, ఆజ్ఞోల్లంఘనము. ౨.అసంతృప్తి, సంతుష్టిలేమి.

**విధృతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. ఏర్పాటు. ౨. శాసనము.

**విధేయజ్ఞుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) విహిత కృత్యము (తాను చేయవలసినపని) నెఱిఁగినవాఁడు.

**విధేయపదము.** సం. వి. అ. న. ౧. చేయందగిన కార్యము. ౨. (వ్యాక) క్రియాపదము, కర్తృకర్మముల గుణక్రియాదులం దెలుపుపదము. వ్యతి: ఉద్దేశ్యము.

**విధేయము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. చేయఁదగినది, జరుపఁదగినది. ౨. విధింపఁదగినది. శాసింపఁదగినది. ౩. (వ్యాక) కర్తృకర్మముల గుణక్రియాదులందెల్పుటకుపయోగింపఁబడునది.

వి. అ. న. ౧. కృత్యము, విహితకార్యము. ౨. కర్తృకర్మముల గుణ క్రియాదులం దెల్పు పదము,

**విధేయావిమర్శము.** సం. వి. అ. పుం. అవిమృష్ట విధేయాంశ మనెడి కావ్యదోషము. (విధేయాంశము ప్రధానముగా నిర్దేశింపఁబడకుండుట)

**విధేయుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) ౧. ఒకరి యధీనముననున్నవాఁడు, ఆజ్ఞాధీనుఁడు. ౨. పరులకు లోఁబడినవాఁడు, లోఁగినవాఁడు. ౩. వినయముగలవాఁడు, చెప్పినట్లువినువాఁడు.

వి. అ. పుం. భృత్యుఁడు, సేవకుఁడు

**విద్ధకర్ణుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) కుట్టఁబడిన చెవులుగలవాఁడు.

**విద్ధము.** సం. విణ (అ. ఆ. అ) ౧. గ్రుచ్చఁబడినది, ప్రవేశపెట్టఁబడినది. ౨. గాయము చేయఁబడినది, ఆయుధాదికములోఁ బొడువఁబడినది. (చెవి) కుట్టఁబడినది, ౩, కొట్టఁబడినది; కొరడామున్నగు వానితోఁగొట్టఁబడినది, ౪, త్రోయఁబడినది. ౫. నిర్దేశింపఁబడినది. ౬. ఎదిరింపఁబడినది. ౭. సమానమైనది, సాటియైనది.

వి. అ. న. గాయము.

**విధ్వంసము.** సం. వి. అ. పుం. ౧. నాశము ౨. పగ. విరోధము; అప్రీతి, ౩. అవమానము, ఇష్టములేకుండుట, అసహ్యము.

**విధ్వంసి.** సం. విణ (న్. నీ. న్.) ౧. మిక్కిలి ధ్వస్తమైనది, తునియలైనది. ౨. పగగలవాఁడు; విరోధి. పగగలది.

**విధ్వస్తము.** సం. విణ (అ. ఆ. అ.) ౧. బొత్తిగా నశించినది. ౨. ఎగురఁగొట్టఁబడినది. చెదరఁగొట్టఁబడినది. ౩. మఱుఁగుపఱుపఁబడినది, కప్పివేయఁబడినది. ౪. కాంతిహీనముగాఁజేయఁబడినది. (రాహుకేతువులచే) గ్రసింపఁబడిన. (సూర్యబింబము మొ॥)

**వినఁబాటు**=విన్నఁబాటు (√ విన్న) వి. విన్నఁబడుట, వైవర్ణ్యము.

చ. అమృతముఁగోలుపోయి విబుధారులు గంధగజాసురాంధక, ప్రముఖులు పోములందు విన్నఁబాటు దలిర్పఁగఁగూడియున్నచో, నమరఁగనప్పుడేను... భీమ. ౪. ౯౯.

**వినత.** సం. వి. ఆ. స్త్రీ. ౧. కశ్యపునిభార్య, అరుణ గరుడులకుఁదల్లి. ౨. ఒక విధమైన గంప: బుట్ట.

**వినతము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. వంగినది, వ్రాలినది, ముందుకు వ్రాలినది. ౨. నమస్కరించునది; అడఁకువగలది. ౩. మునిఁగినది, క్రుంగినది. ౪. వంకరయైనది. ౫. (వ్యాక) సకారస్థానమున వచ్చినషకారము. నకారస్థానమున వచ్చిన ణకారము.

**వినతాననుఁడు.** సం. వి. (అ. ఆ. అ.) వంపఁబడిన ముఖము గలవాఁడు. చిన్నవోయిన ముఖముగలవాఁడు.

**వినతానందనుఁడు.** సం. వి. అ. పుం. (వినత కొడుకు) ౧. అరుణుఁడు. ౨. గరుత్మంతుఁడు. ఇట్లే: వినతాసుతుఁడు. మొ.

**వినతాసూను (వు) ఁడు.** సం. వి. ఉ. పుం. = వినతానందనుఁడు.

**వినతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. వంగుట, వ్రాలుట. ౨. నమ్రత, విధేయత, అడఁకువ. ౩. ప్రార్థన, వేడికోలు.

**వినదము.** సం. వి. అ. పుం. ౧. ధ్వని, చప్పుడు, ౨. ఒకానొకచెట్టు వృక్షవిశేషము (వాచ)

**విననివాఁడు.** విణ. (√ విను) చెవిటివాఁడు, బధిరుఁడు. (చి. ని. శ. ర)

**వినపము**=విన్నపము. వి. మనవి.

క. వేయేలజియ్య వినవయ్యోయిఁక మా వినప
మొకటి యేటు కనుఁగొనఁగా, నేరెుడఁ
జూచిన నడవిలు, లాయంబులు వెలయు
జమూని లాయములనఁగన్.

ప్రబంధ. ౧౬౫.

దీనికి ప్రయోగాంతరము కనఁబడలేదు.

**వినమి.** వి. (√ విను) వినకుండుట

ఆ. వేడుకొనుటెట్లు పాండుపుత్రులతోఁగయ్య,
మేను నీవు దీనికియ్యకొనుము, పలుకువినమి
గాఁగఁదలఁపకు ముచితంబు, తెలుఁగు ధీర
జనుల కెఱుఁగ రాదె.

భార. శల్య. ౧.౬౯.

**వినమితము.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి వంగినది.

**వినమ్రము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧ మిక్కిలి వంగినది, మిగుల వ్రాలినది. ౨. క్రుంగినది. మునిఁగినది. అణఁగినది. ౩. విధేయమైనది. అణఁకువగలది.

**వినయగ్రాహి.** సం. విణ. (న్. ఈ. న్.) వినయము గలవాఁడు. విధేయుఁడు, చెప్పినట్లు వినువాఁడు.

**వినయనము.** సం. వి. అ. న. ౧. నివారించుట, తొలగించుట. ౨. చదువు నేర్పుట, మంచి పద్ధతులు నేర్పుట.

**వినయభా(కు)జుఁడు.** సం. విణ. (జ్) ౧. నమ్రతగలవాఁడు. ౨. మంచినడవడిగలవాఁడు.

**వినయము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. క్షిప్తము చిమ్మఁబడినది. ౨. రహస్యమైనది. ౩. చెడు నడవడిగలది.

వి. అ. పుం. ౧. క్రమశిక్ష, మంచి పద్ధతులు నేర్పుట, ౨. యుక్తత, ఔచిత్యము. ౩. మంచి నడవడి. మంచిపద్ధతి ౪. నమ్రత, అణఁకువ. ౫. మర్యాద, గౌరవము. వందనము (ఆ. ని) ౬. నడవడి, ప్రవర్తన. ౭. నివారించుట, తొలఁగించుట.

**వినయస్థుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) వినయము గలవాఁడు నమ్రుఁడు.

**వినయుఁడు.** సం. వి. అ. పుం. ౧. జితేం ద్రియుఁడు. ఇంద్రియములు వశపరచుకొనిన జనుఁడు. ౨. వ్యాపారి, వణిజుఁడు, బేహారి.

**వినవచ్చు.** అ. క్రి (వినన్ + వచ్చు) వినఁబడు, శ్రవణగోచరమగు.

వ......మిక్కుటం బగున కోలాహలంబున నీపాటి కూఁ బాట వినరాక...

ఆము. ౪. ౩౫.

**వినశనము.** సం. వి. అ. న. మిక్కిలి నాశము, అగోచరమగుట పుం. సరస్వతీనది పైకిఁగనఁబడక యిసుకలో నంతరించిన చోటు, కురు క్షేత్రము నందలియొక తీర్థము (వాచ)

**వినష్టము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. బొత్తిగా నశించినది. ౨. కనఁబడనిది, అదృశ్యమైనది. ౩. పాడైనది, చెడిపోయినది. ౪. పతితము, జాతి భ్రష్టమైనది. (వాచ)

**వినష్టి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. మిక్కిలి నాశము. ౨. అగోచరమగుట, కనఁబడకపోవుట.

**వినసుఁడు.** సం. విశే (అ. ఆ. ఈ. అ.) ముక్కిడి, ముక్కు పోయినవాఁడు.

**వినాడి.** సం. వి. ఇ. స్త్రీ. విగడియ. గడియలో నఱువదవభాగము.

**వినాడిక.** =వినాడి. సం. వి. అ. స్త్రీ.

**వినాయకము.** సం. వి. అ. పుం. ౧. విఘ్నము. ౨. పక్షిశ్రేష్ఠము, గరుడపక్షి.

**వినాయకుఁడు.** సం. వి. అ. పుం. ౧. (విఘ్నములు) పోఁగొట్టువాఁడు, గణపతి. ౨. బుద్ధదేవుఁడు. ౩. గరుత్మంతుఁడు. ౪. గురువు, మతబోధకుఁడు.

**వినాశధర్ముఁడు.** సం. విశే. (న్) నశించుటయే ధర్మముగాఁగలవాఁడు, నశించు స్వభావము గలవాఁడు.

**వినాశకుఁడు.** సం. వి. అ. పుం. లయకారుఁడు. నశింపఁజేయువాఁడు,

**వినాశము.** సం. వి. అ. పుం. ౧. బొత్తిగా నశించుట, క్షయము. ౨. తొలఁగించుట, పోఁగొట్టుట, తీసివేయుట.

**వినాశోన్ముఖుఁడు.** సం. విశే. (అ. ఈ. అ) నాశనమునకు సిద్ధముగా నున్నవాఁడు. నశింప నున్నవాఁడు.

**వినాస(సి)కుఁడు.** సం. విశే. (అ. సికా. అ) ముక్కిడి, ముక్కుపోయినవాఁడు.

**వినాహము.** సం. వి. అ. పుం. కూపముఖపిధానము నూతిమీఁది కప్పు.

**వినిందించు.** సం. స. క్రి. మిక్కిలి దూఱు. విశేషముగ నిందించు.

మ......మందార సుధాంశు బింబముల గారందంబుల్ వినిందించుచున్.

వైజ. ౧. ౨౧.

**వినికి.** వి. (√విను) వినుట; శాస్త్రాది శ్రవణము.

మ. ముని గోవింద ముకుందు దానును బ్రియంబుల్ మీఱ నన్యోన్యశోభనరూపాదిగుణావళుల్ వినికిఁ దాఁబద్ధానురాగాత్ముఁడై, మునికిం గన్నియ యత్తతిందగిలి వరోర్వీశులుం జూడ నాతనిఁ బ్రీతి న్వరియించె... హరి. ఉ ౩. ౨౧౪.

సీ. వసుమతీకార్య నిర్వహణంబు పెద్దకొల్వైనయుండి నీవనుదినము నడప, కుని కి కర్తవ్యమే వినుకులు భీష్మాది మహిపులచేత సమగ్రభావ, మొందినయవి...

భార. ఆశ్ర. ౨. ౧౩౩

క. మునికులములోన మిక్కిలి వినుతులు గల
వాఁడ నీవు విభు గీర్తులనీ, వినుతించుటఁ
బొగడుము... భాగ. ౧. ౧౧౨.

**వినికిడి.** వి. (√ విను) వినికి (శ.ర. గ్రా.)

**వినికిసేయు.** స. క్రి. (√ వినికి) వినిపించు
సీ...సురవార వారిజాక్షులు చెంగుపొం
గంబుఁ ముఖవీణ సురజంబు మొదలుగాఁగఁ,
గొనుచు గంధర్వ మేళంబు వినికిసేయ...
...దశా. ౨. ౨౬౦.

**వినికీర్ణము.** సం. విణ. (అ. ఆ. అ.) చిమ్మఁబడి
నది, చెదరఁగొట్టఁబడినది.

**వినిక్షేపము.** స. వి. అ. పుం. ౧. క్రిందికిఁ
ద్రోయుట. ౨. సుందునకుఁ బంపుట.

**వినిగడము.** సం. విణ. (అ. ఆ. అ.) విశృంఖ
లము, అడ్డులేనిది.

**వినిగ్రహము.** సం. వి. అ. పుం. ౧. అడ్డు
పెట్టుట, లోఁబఱుచుకొనుట. ౨. ఒకరి నొక
రెదిరించుట.

**వినిద్రము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. నిద్ర
లేనిది, జాగరూకము. ౨. వికసించినది, విరిసినది.

**వినిపాతము.** సం. వి. అ. పుం. ౧. పడిపోవుట,
పాటు. ౨. కష్టము, దుఃఖము, నాశము. ౩.
క్షయము, చావు. ౪. నరకము, అధోగతి. ౫.
సంభవము, తటస్థపడుట, ౬. బాధ, నొప్పి.
౭. అమర్యాద, అగౌరవము.

**వినిపాతశంసి.** సం. విణ. (న్. నీ. న్) రాఁబో
వుకీడును సూచించునది.

**వినిపించు** (√ విను) అ. క్రి. వినవచ్చు, శ్రుతి
గోచరమగు, వినఁబడు, వినుచు.

మ. వినిపించెన్ హరి పాంచజన్యరవముగ్రోల
ప్రభాచక్రమున్, గనిపించెన్ సురదానవా
వళికి.. దశా. ౨. ౪౦౦.

క. వినిపించె ననెడు మాటకు, వినిచెవనంతెల్లు
చుండు... ఆం. భా. ౩. ౧౧౦.

స. క్రి. వినఁజేయు, చెప్పు, తెలియఁజేయు.

క. వినుమాచార్యులు నార్వురు, జనక నృపాలు
నకు వారు సతతంబున, జ్ఞనపతివినిపింతురు
త, త్త్వనిరూపక శాస్త్రములు పృథగ్విధములు
గన్. భార. శాం. ౪. ౩౪౦.

క. అని చెప్పిన మాధవుఁడిట్లనియె నీవంటి
వారి కొరకక్కను మ్రొక్కొని నిల్వవలె మె
సురమున, వినిపించెద హానిగలుచు వీరుని
మాకున్. జాహ్నవి. ౧. ౨౦.

వ. ... సత్యవతీసుగుండు చెప్పిన యదియేను
నీకు వినిపించెదఁబూజ్యతమంబు వంశ
వర్ధనము సమస్తపుణ్యఫలదంబిది శ్రోతకు
వక్తకున్ నృపా. హరి. పూ. ౧. ౫౦.

**వినిమయము.** సం. వి. అ. పుం. ౧. తుల్య
మైన ఒక వస్తువునిచ్చి మఱియొక వస్తువును
పుచ్చుకొనుట. ౨. తాకట్టు, జామీనుగా
యిచ్చినసొత్తు. ౩. అక్షరముల పరివర్తనము,
మార్పు.

**వినిమయించు.** సం. స. క్రి. వినిమయముచేయు,
మార్చు.

గీ. కలధౌత కుట్టిమం బలఁదు కస్తురియును ఘన
వాసనాద్యుగుల్ వినిమయింప.
చంద్రా. ౬. ౧౧౭.

**వినియతము.** సం. విణ. (అ, ఆ. అ.) స్వాధీన
పఱుచుకొనఁబడినది. అణఁపఁబడినది, నిగ్రహిం
పఁబడినది.

**వినియతుక్రమము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧.

ఉపయోగింపఁబడినది. ౨. పంచఁబడినది, విభ జింపఁబడినది. ౩. విడఁదీయఁబడినది, వేఱు చేయఁబడినది. ౪. చేర్పఁబడినది. ౫. ఆజ్ఞాపిం పఁబడినది, శాసింపఁబడినది.

**వినియోగము.** సం. వి. అ. పుం. ౧. విడఁ దీయుట, వేఱుచేయుట. ౨. విడుచుట, త్యజిం చుట. ౩. ఉపయోగము, ప్రయోజనము. ౪. ఉద్యోగము, నమ్మి చేయుమని ఒప్పగించినపని. ౫. విఘ్నము. ౬. ఆశ్రితుఁడు, పరివారము. (ఈయర్థము తెనుఁగున మాత్రము కనవచ్చు చున్నది)

వ...వెంచేయు నవసరంబున గురుమహా ప్రధాన మాండలిక సామంత సేనాపతి...జాలిక మృగయార్థి పక్షి పోషకులును. ఫణిహారులు రాయబారులును ప్రాణపు తెగలు కవని బంటులు వేశ్యాజనంబులనియెడు డెబ్బది రెండు వినియోగంబులు.

ప్రబంధ. ౪౭

**వినియోగించు.** సం. స. క్రి. ఉపయోగపఱచు.

క. తనయంశమైన కనకము, వినుకుంతీదేవికిచ్చి వేదవ్యాసుం, డనఘాయది యంతయు నన్వినుత చరిత ధర్మకృతుల వినియో గించెన్. భాగ. అశ్వ. ౪. ౨౦౩.

**వినిర్గతము.** సం. విశే. (అ. ఆ. అ) బయలు వెడలినది.

**వినిర్గమము.** సం. వి. అ. పుం. ౧. కనఁ బడకపోవుట, అదృశ్యమగుట. ౨. విడిచి పోవుట.

**వినిర్గమించు.** సం. స. క్రి. అతిక్రమించు

వ......తద్వారిపురంబు వినిర్గమించి......

పాండు. ౧. ౧౪౨.

**వినిర్జయము.** సం. వి. అ. పుం. సంపూర్ణ జయము.

**వినిర్ణయము.** సం. వి. అ. పుం. ౧. సంపూర్ణ మైన నిశ్చయము. ౨. నిశ్చయింపఁబడిన శాస నము, స్థిరమైన శాసనము.

**వినిర్భేదించు.** సం. స. క్రి. బ్రద్దలుచేయు.

సీ. ఏడురసాతల క్రోడంబులును వినిర్భేదించి వెడలిన పెద్దవేల్పు. భీమ. ౩. ౩౭.

**వినిర్మించు.** ధిం. క్రి. నిర్మించు.

వ...చంద్రుండు వంశకర్తగా సకలకలికలు పారుహర్త వంశిదేవ మహీభర్తకీర్తి కార్తికా చంద్రికా ప్రవాహంబులు వినిర్మించి దశ దిశాంచలంబులు ముంచె......

వరాహ. ౧. ౨౦.

సీ. ఇనవంశ శేఖర యీకావ్యమణి వినిర్మించిన సుకవివాల్మీకి మౌని. ఉ. రా. వ. ౬౭.

**వినిర్మింపించు.** సం. స. క్రి. నిర్మింపఁజేయు.

సీ. గవనులు పరిపాటిగా వినిర్మింపించి......

పి. శకుం. ౪. ౧౩౭.

**వినిర్మితము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. చేయఁ బడినది. నిర్మింపబడినది. ౨. సృజింపబడినది. ౩. (విందుము.) జరుపఁబడినది. ౪. స్థిరపఱు పఁబడినది, నిశ్చయింపఁబడినది.

**వినివర్తన.** సం. వి. ఆ. స్త్రీ. వెనుకకుఁదిరుగుట, వెనుకకు మరలుట.

రాఘవ. ౩. ౧౫౩.

(రామాయణార్థమున)

**వినివినమి.** వి. (√విను) అలక్ష్యము.

సీ. నీ బంట నన్ను మన్నించ వేయన వినివినమి చేయుచుఁ దుంట విల్లువంచి.

కువల. ౪. ౫౧.

క. అనుచు విటీ విట సంఘము, కనఁబడ గోపాలుఁ జూచి కడు నేర్పుగ న్వాడిన నరసవాక్యములవిని, వినములఁ జేసికొనఁ దెలియవినుమని పలికెన్.

సారంగ. ౨. ౪౭.

**వినివృత్తము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. మరలినది. ౨. అఁగినది, ముగిసినది, ౩. ఉద్యోగము, వ్యాపారము మొదలగు వానినుండి విరమించినది.

**వినివృత్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. అఁపుట, నివారించుట. ౨. సమాప్తి, ముగింపు. అంతము.

**వినివేశము.** సం. వి. అ. పుం. ౧. ఒకచోట స్థిరపడుట, ౨. ముద్ర, చిహ్నము.

**వినిష్పేషము.** సం., వి. అ. పుం. పూర్తిగా నలఁగఁగొట్టుట, పిండిచేయుట.

**వినిహతము.** సం. విణ (అ. ఆ. అ) ౧. మిక్కిలి కొట్టఁబడినది. ౨. చంపఁబడినది. ౩. పూర్తిగా నాశనముంపఁబడినది.

వి. అ. పుం. ౧. దైవవశమునఁ దటస్థమైన గొప్పకష్టము. ఆపత్తు. ౨. ఉత్పాతము, శుభాశుభ సూచకమగు మహా ఘాతముల వికారము

చూ. ఉత్పాతము.

**వినీతకము.** సం. వి. అ. న. ౧. వాహనము, యానము (పాలకీమొ.) ౨. మోసికొని పోవు జంతువు.

**వినీతము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. తీసికొని పోఁబడినది. ౨. నివారింపఁబడినది, తొలఁగింపఁబడినది. ౩. సుశిక్షితమైనది, చక్కఁగాఁ జదివింపఁబడినది. ౪. నాగరికతను బొందినది, మంచినడవడి గలదిగాఁ జేయఁబడినది. ౫. నమ్రమైనది, అడఁకువగలది. ౬. మర్యాదగలది బుద్ధిమంతుఁనది. ౭. పంపివేయఁబడినది, (ఉద్యోగాదులనుండి) తొలఁగింపఁబడినది, ౮. మచ్చిక చేయఁబడినది, పెంచఁబడినది. ౯. అలంకారములు లేనిది, సాదాయైనది (వేషము) ౧౦. జితేంద్రియము, కామాది వికారములను వశపఱుచుకొనినది. ౧౧. శిక్షింపఁబడినది. ౧౨. అధికారములో నున్నది. ౧౩, అందమైనది, ఇంపైనది. వి. అ. పుం. సుశిక్షితాశ్వము, మంచినడకలు నేర్పఁబడిన గుఱ్ఱము.

**వినీతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. అడఁకువ. ౨. మంచినడవడి నలవరుచుట; మంచినడవడి. ౩. గౌరవము, మర్యాద.

**వినీతుఁడు.** సం. వి. అ. పుం. వణిజుఁడు, బేహారి. విణ. క్రమశిక్ష నందినవాఁడు, ఉద్ధతుఁడు.

మ. ...... వినీతుఁడైన పతిచేష్టల్ చేటుదే కుందునే. కేయూర. ౩. ౩౦౧.

**వినీయము.** సం. వి. అ. పుం. ౧. ముఱికి, మాలిన్యము. ౨. పాపము, తప్పు, అపరాధము

**విను**[1]. స. క్రి. (త. విన్) ఆకర్ణించు.

సా. అనఘా మున్ను శమంత పంచకము నయ్యక్షౌహిణీ సంఖ్యగాయున్, వినఁగా నాకతెఁగించి భారత కథా విఖ్యాతికింగారణంబును ...చెప్పుము దయన్మతిన్,

భార. ఆది. ౧. ౩౪.

ద్వి. రావణాంతక నిను రణశూరుఁడైన, రావణు సుతుపింటి రావణువినుము,

రం. రా. ఉత్తర. పా. ౧ ౭౦

శా. పాండిత్యం బమరం బురాణముల మున్ పౌరాణికు ల్సెప్పఁగా, వింటున్ వింతలుగావు

నూతనకథా విస్తారమై సౌభాగ్యమై......
మార్క. పూ. ౧౪.

జ; వింట, వింట, విననివాఁడు, వినమి, విన వచ్చు వినికి, వినికిడి, వినికిసేయు, వినిపించు వినివినమి, వినుకలికంటి, వినుకొను, వినుచు, వినుపించు. విన్చు. విన్పించు.

**విను-విన్ను** వి. దే. ప. ఆకాశము.

(దీనికి హల్లుపరమగునపు దుత్వలోపము)

చ. ... కంథయును సన్మణి పాత్రము యోగ దండమును, గోని సెసఁబాదుకల్ దొడిగి కొంచు వియచ్చర వాహినీకన, త్కనక సరోజ గంధవహ కౌతుకుఁడై వినువీథి కేగుచున్. విక్ర. ౨. ౧౨.

క. వనవహ్ని తవులుకొన్నన్, వినువీథికి సెగురుపక్షి వితతులవలె...దశా. ౪. ౩౫.

జ: వినుకెంపు, వినుచూలి, వినుజాలు, వినుటెంకి, వినుత్రోవ, వినుద్రిమ్మరి, వినుప్రోలు, విను మనుషుఁడు, వినుమానికము, వినుమ్రాను, వినురతనము, వినువలను, వినువాఁక, విను విడు, వినుసికదేవర, విన్నది.

**వినుక(న్క)లి.** వి. (√ విను) ౧. వినికి.

చ. వినుకలి మున్నుగీల్కొనిన వేడుక చూపుల కర్థఁజేయఁగా, గనుఁగొని యన్నరేంద్రకగ కన్యక నిద్రితఁనైన భూసతిన్.
కేయూర. ౪. ౪.

చ ... చేష్టితం, బులఁచడఁ బెట్ట భావముల పూఁపు బయల్పడ వారి నిద్దఱన్, బలసి మరుండు తుల్యరసపాకము తీపులు గ్రోల్చె విన్కలిన్. హరి. ఉ. ౩. ౭.

చ. వినుకలిఁ గూర్మిఁ జిక్కి పృథివీ భవనంబు నకున్ డి గంగనే, యనుపునలేక రంభ యనుమానచ్చరలేమ్మనలున్ వరింపఁబూనిన తన కోర్కె ... సైమ. ౨. ౫. ౭.

చ. విను నికవిచేతనే విరహవేదన నా మది నింత వర్ధిల్లెన్, గనుకలి నిట్లు చిత్రఫల కంబునఁ గాంచిన యింతి సెమ్మనం, బునఁ గడు నింతకెంత పరిపూర్తి వహించునో యెంత నొచ్చునో, ... ప్రభా. ౩. ౨౫.

౨. శ్రోత్రేంద్రియము, చెవి.

౩. కీర్తి.

సీ. తేజు విన్కలి గల్గి తెంపొందు మీవంటి వారిట్లు పగరచేఁ బడియు నూర, కున్న ...
అచ్చ. భా. ౧. ౬.

**వినుకలికంటు.** వి. (వినుకలి + కన్ను) చక్షుశ్శ్రవము, పాము (శ. ర)

**వినుకెంపు.** వి. (విను + కెంపు) సూర్యుఁడు నభోమణి.

వ ... విను కెంపు నుడి కింపు విడి కెంపు రవ చెక్కడం పుకడ వన్నె పసిఁడి గద్దియ సభ వసించి ... దశా. ౧. ౧౪.

సీ. పొడుపుఁ గెంపు వహించు బెడిదంపు విను కెంపు హసింపు, కంఠహారంబు వాఁడు.
ఉ. రా. ౧. ౧౬.

**వినుకొను.** స. క్రి. (విను + కొను స్వార్థమున) విను.

వ ... మృడుండు: ముని సన్నిధానంబునఁ గుమారుండు విను కొనఁగిరిపుమారిం గటాక్షించి ద్రాక్షారస పక్షంబులగు నక్షర విశేషంబు లాలయ నిట్లనియె.
పాండు. ౨. ౪.

**వినుచే.** అ. క్రి (√ విను) వినవచ్చు, వినఁబడు.

చ ... దివ్యవాణి దా, వినిచె ధరాధినాథునకు

విస్మయ మందఁగఁ దత్సభాసదుల్.
భార. ఆది. ४. ౧౦४.

చ. ... మొత్తములై పెనుగ్రద్ద లాడె బెట్టుగ వినిచెన్ శివారుతము దుల్లెఁ గడు న్వడి నుల్క లెల్లెడన్. భార. ద్రో. ౧. ౧౩౨.

మ. విపిదామోద ... దేవాంగనాగాన నృత్య లీలన్ వినిచెన్ ... ఉర్విన్ గౌరి జన్మించినన్. కు. సం. ౩. ౨౩౩.

ఉ. కరుణకుఁ బాత్రమై వినిచెఁ గాఁడవిన్ సతి కూఁత... పరశు. ౩. ౫౦.

క ... గోఁచినచోఁ, బద ... నుదెంచియు విని, చెద మన వారలకు నృపతి సెల విచ్చుటయున్. శుక. ౩. ౨౩౩.

స. క్రి. వినఁజేయు, వినిపించు.

ఆ. అట్లు వాండ్రు మువ్వ రడఁగిన నడలుచు, సుప్రనాతి మిగుల క్రుక్కి లంక, కరిగి యోడఁ బుట్టువగు రావణుఁ గాంచి, తన తెఱంగు దెలియ వినుచుటయును.
అ. రా. అర. ౧౫.

క. సంతసముఁ జెంది భూసురు, డంలి ద్విజ యోస్పదమున కరిగి ధరిత్రీ, కాంతునిఁ బొడగాంచి శుభో, దంతము వినుచుటయు నతఁడు హర్షముఁ జెందెన్. కవిజ. ౩. ౩.

**వినుచూలి.** వి. (విను + [2]చూలి) గాలి, వాయువు.

గీ. గాడ్పు కరువలి వినుచూలి గాలివలపు, మోపరి చిలువమేఁ తనఁ బొలుచుఁ బవనుఁడు.... ఆం. భా. ౧. ౫౬.

**వినుజాలు.** వి. (విను[2] + జాలు) ఆకాశగంగ, మందాకిని.

గీ. ఏది వినుజాలు కనువాలు నిత్తికేలు, నేది నోల్చిర మెడచార యొసఁగు కోర, యేది నెలకూన సామేన నిడిన చాన, యితఁడు జేజేల దొరయని యెటులనందు.
చెన్న బ. ౩. ౫౨.

**వినుటెంకి.** (విను[2] + టెంకి) వి. స్వర్గము.

సీ. అచ్చరవిరిబోఁడు లాలవట్టము లూన వినుటెంకిచెలులు వీవనలు వైవ.
అచ్చ. రా. సుం. ౩. ౫౨.

**వినుతించు.** సం. స. క్రి. స్తుతించు, పొగడు.

ఆ. విష్ణు బహు విధముల వినుతింప నజ్జల, శాయిహయ శిరంబు సకలవర్ణ, భాసురంబు నైన పరమాద్భుతంపు రూపంబుదాల్చి...
భార. శాం. ౬. ४౨४.

మ... ఆ తన్వంగి వేమారుసుం, బ్రజ లెల్లన్ వినుతింప వింసు మొదలం బక్షీంద్ర...
నైష. ౨. ౨౬.

**వినుత్రోవ.** వి. (విను[2] + త్రోవ) ఆకాశ మార్గము.

మ.... ఎన్నం డిచ్చునో నీవికిన్, వళముజ్జా సనుఁడంచు నెంచు వినుత్రోవం బోవు దేవాగముల్. ఉ. రా ౨. ౧౭౦.

**వినుద్రిమ్మరి.** (విను[2] + త్రిమ్మరి) వి. దేవత, ఖేచరుఁడు.

సీ. వినుద్రిమ్మరులు కరివేల్పు హజ్జను బూజ సలిపిన క్రొత్త చెంగలువ లనఁగ.
అచ్చ. రా. అయో. ౧౩.

**వినుపించు.** = వినిపించు, విన్పించు. స. క్రి. (√ విను) వినంజేయు,

సీ. వినుపించి, నాఁడవు వేమభూపాలుని కఖిల పురాణ విద్యాగమములు.
భీమ. ౧. ౨౩.

క.... నీ కన్నియతమున్, మగనిఁ దగునతని గుణగతిమగని న్వివిపింతు వినుము మంత్రాణ సఖున్. వసు. ౫. ౭౩.

అ. క్రి. వినకమ్ము, వినఁబడు.

క. వినిపించె ననెడి మాటకు, వినిచె నసం జెల్లుచుండు.... అం. భా. ౩. ౧౧౦.

**వినుప్రోలు.** వి. జ. (విను² + ప్రోలు) స్వర్గము.

ఉ. కాయజబారి కోడి మును గౌతమిక్రైతమి కోడిజాలి వాఁ, డాగెను సురేంద్రుఁ డట్టి చోరనాఁగి జయింప దళాస్యుఁ డీ యెడం, బోమెదు నిత్తెఱంగు వినుప్రోలికిఁ జెల్వద మంచు బెట్టుగాఁ గూయిడుచున్నవో యనఁగఁ గుక్కుటముల్ రొదసేసె దిక్కులన్. ఉ. రా. ౪. ౨౪౫.

**వినుమనుముఁడు.** వి. (విను + మనుముఁడు) ఆకాశపాత్రుఁడు. హనుమంతుడు.

క. వినుమనుమఁడే మానుడువులు, విను మును పు దలిర్ప నీవు వేల్గొండు తలంపున నుండిన నీరతనపు, గని యిం దిఁక నొరుఁడు జాఁటఁ గలఁడే చెపుమా. అచ్చ. రా. కిష్కిం. ౬౨.

**వినుమానికము.** వి. (విను² + మానికము) సూర్యుఁడు, నభోమణి.

ఉ. ... వినుమానికంబు జోస్నై యిల గాధి సూనుఁడు తపోధికతం దన వేఁడి సూపె డున్. గాథేయో. ౫. ౭౩.

**వినుమ్రాను.** వి. జ. (విను² + మ్రాను) కల్పవృక్షము.

సీ. వినుమ్రాను పరువంపు విరిపంజ జెఱనించి కలయ సొమ్మెయిఁ గమ్మ కలప మలఁది. అచ్చ. రా. కిం. ౩౪.

**వినురతనము.** వి. (విను² + రతనము) నభోమణి, సూర్యుఁడు.

చ. ... వినురతనంపు వంగడపు జెన్నెల రాయని మర్వ సేరినన్. అచ్చ. రా. కు. ౨౩౩.

**వినువ(న్వ)లను.** వి. (విను² + వలను) స్వర్గము.

ఉ ... విన్వలనులో నమృతంబు సురక్షిత స్థితిన్. ని. ఉండునన ... భార. అను. ౧. ౨౧౬. (శ. ౭)

"ఇన్వవలో" ముద్రి. పా. తాళపత్రపు ప్రతి పా.

శ్లో. తతో జాలేన మహతా అవనద్ధం సమం తతః అయస్మయేన జైత్రాణ వృత్రే హంగు స్వర్గాన్నాత్రి.
(సం. భార. అను. ౨౫. ౧౦.)

**వినువాఁక.** వి. (విను² + వాఁక) ఆకాశగంగ.

సీ. వినువాఁక యిదిగదా యనుచు నాకాశ గంగావారి నంగముల్ గడిగి కడిగి. రా. వి. ౧. ౩౨.

**వినువీడు.** వి. జ. (విను² + వీడు) స్వర్గము.

గీ. హరి యనఁడు తేరు వెదకఁడు కరినిగోర, జే నిమిత్తంబు వినువీటి పైన మితను, కనఁగ సరిగె సభంగురాహవవిహార, విశ కలిత ప్రత్య స్తఁడగు దశకంఠుఁడు. సం. రా. ౪. ౭౩.

వ. ఏ క్రైతున్ జూపు వినువీటి పోటుబంట్లును. ఉ. రా. ౪. ౨౬౧.

**విసుసిక దేవర.** (విసు² + సిక + దేవర) వి. వోఁకమకోఁకుఁడు, శివుఁడు.

చ. విసుసికదేవరన్ నలువ వేల్పుల ముప్పది మూఁడు కోటులన్, బనిఁగొని ముజ్జగంబు మనుపంగల వీరుఁడు.... రామా. ౧. ౭.

**వినేత.** సం. వి. ఋ. పుం. ౧. సాహాయ్యకర్త, ముందునకుఁ గొనిపోవు మనుష్యుఁడు. ౨. ఉపాధ్యాయుఁడు. ౩. పాలకుఁడు, రాజు. ౪. శిక్షవిధించు నధికారి, సంఘనాధిపతి.

**వినోదనము.** సం. వి. అ. న. ౧. నివారించుట, తొలగించుట. ౨. వేడుక, క్రీడ.

**వినోదము.** సం. వి. అ. పుం. ౧. పోఁగొట్టుట, నివారించుట. ఉదా (శ్రమ వినోదము) ౨. వేడుక, కాలక్షేపమునకైన పని, కాలక్షేపోపాయము. ౩. క్రీడ, ఆట. ౪. ఆతురత, తీవ్రేచ్ఛ. ౫. ఆనందము, సంతోషము. ౬. సురతవిశేషము, సురతములలో నొక విధము. ౭. ఒకవిధమైన యిల్లు.

**వినోదించు.** సం. స. క్రి. విరియించు, పోఁగొట్టు.

ఆ. తీవ్ర బాణజాల దీప్తులు పరగించి, పాండుతనయ సైన్య బహుళతమము, లీలఁబడి గినంబులోలి వినోదించి యాధిప భీష్మభానుఁ డస్తమించె. భా. భీష్మ ౧. ౪౭.

అ. క్రి. ౧. క్రీడించు.

సీ. హరినీలమణిమనోహరగమందిర స్తంభముల వినోదించు కీల్బొమ్మవోలె.

ఉ. హరి. ౨. ౩౩.

క. ఇవ్విధంబున వినోదించుచున్న నొక్కనాఁడు... మార్క. ౨. ౨౩౪.

౨. క్రీడాదులచేఁ బ్రొద్దుపుచ్చు.

వ. పగలు వినోదించి రాత్రి రసాతలంబున కరుగుచు... మార్క. ౨. ౨౬౪.

**విన్కి** = వినికి. వి. వినుట.

ఉ. పీనులఁదియ్య మెక్కుమనువిన్కిఁ బరస్పరరాగవృత్తిలో, నూనినఁజూచు వేడుకల నుబ్బులు లూరెడు నెమ్మనంబులు...

భార. విరా. ౫. ౩౬౩.

**విన్చు** = వినుచే. అ. క్రి. (√ విను¹) వినవచ్చు, వినఁబడు. లయగ్రాహి...వాచా, లమ్మలకు కోకిల కులమ్ముల రవమ్ము మగుర మ్మగుచు విన్చె ... భార. ఆది. ౫. ౧౩౮.

**విన్న.** విణ. (సం. వి. వర్ణః) వివర్ణమైనది, కాంతిహీనము.

(వృత్తియందు వికల్పముగా నిగాగమము)

చ. ... నీరజ షండము వోల్చె విన్నగాఁ, గ్రొమ్మవళులాటమైఁజెలఁగు క్రందున నొందిన క్రొత్తసంపదన్. సర్వ. ౭. ౪౦.

క. కన్నీరొలుకఁగ వగచిన, నన్నరపతులెల్ల నేడ్చి రార్తరవంబుల్ మిన్నందు నశ్రుజలములు, విన్నని వదనంబులందు వెల్లిగొనంగన్. భార. ద్రో. ౧. ౨౬.

ఉ ... వెన్గ్గదు పాదముల్ మసులమంచిన వడము లెండ తాక్రకుడున్, వెగ్గలమైన యూర్పులను విన్నని మోములు గావిపింపఁగన్. విప్ర. ౨. ౫౩.

జః విన్నఁదనము, విన్నఁబడు, విన్నఁబాటు, విన్నఁబాఱు, విన్నఁబుచ్చు, విన్నఁబోవు, విన్నన.

**విన్నందు.** అ. క్రి. (విన్ను + అందు) విజృంభించు.

శా. వీరుం డవ్విలుకొనిఁగాంచి రొందయా. శే.

శోకభ్రాంతుఁడు న్నాఁడెని, శ్వేతరూపంబున నైపఁ బోలు దొర నీ వేరాజవున్ రాతవున్, సిరింగా నితి విమ్ములన్నగుచురా విన్నంది పోరా డఁగా, వారిం బాచితి వింక నొక్కఁడుర మే వాక్రుత్తుమా కిత్తువా. కకు. ౪. ౧౧౧.

**విన్నఁదనము.** వి. (విన్న + తనము) ౧. వైవర్ణ్యము.

ఉ. కన్నుల నీరునించుఁ బులకంబులు దాల్చు వహించుఁ గంపమున్, విన్నఁదనంబు నొందుఁ గడు విస్వరతం బలవించు ఘర్మ చిం, దూన్న తిఁ జెంగు తిచ్చవడి యుండును మూర్ఛిలు సంత నింతిపై, కొన్నలునైన వేచు వగఁగుందుచు భూపతి సాత్త్వికాప్తి చేన్. కవిరా. ౫. ౨౬౬.

ఆ. తివిచి చూడలేద గనిసెన యెన్నండు, నాళవు దుమ్ముగప్పి యొప్పడాఁగి, తంత్రు లూడి విన్నఁదన మొందె నిదియేమి, మహతి యున్న యునికి మానిచంద్ర. కకు. ౨. ౪౫

మ ... మునిలోకస్వామి లేమయ్య మీ, రిట విన్నంబన మొందినా రనుడు వాగీశాత్మజుం డిట్లనున్. కకు. ౫. ౫.

౨. దైన్యము.

ఉ ... ఏమొ నేఁడు నా, చిత్తములోన నాన దొక సిగ్గును విన్నఁదనంబుఁ దాపమున్. కళా. ౭. ౨౩౬.

చ ... వెలవెలవాఱు మోముపయి విన్నఁదనంబు దొలంకుచుండగన్. యయా. ౪.౧౩౯.

**విన్నఁబడు.** అ. క్రి. (విన్న + పడు) దైన్యపడు, ఖేదపడు.

మ. అని పౌలోమి మొగంబుసూచి విను మో యాజ్ఞాస్య నీకింతమాత్రన విన్నంబడ నేలపోదు నిడ సత్యాగర్వభారంబు దీ, వ్యనగంబు న్విడిపించివత్తునని సాహంకారుఁడై లేచి... పారి. ౪.౬౧.

**విన్నఁబాటు.** వి. (√ విన్నఁబడు) ౧. విన్నఁబడుట, వైవర్ణ్యము.

ఉ. నావుడు విన్నఁబాటు వదనంబున నించుక దోఁపఁబల్కె... మనుచ. ౨. ౫౪.

క. మురరిపుఁడుఁగినుక వారుణశరము ప్రయోగింపఁదడవ శాంతంబయ్యెన్, హరుబాణము బాణాసురు, పరివారంబునకు విన్నఁబాటు జలిర్పన్. హరి. ఉ. ౮. ౧౪౪.

౨. విషాదము, దుఃఖము.

చ. బిసరుహపత్రలోచనకుఁ బెల్లగు మోహము సంఘటిల్లె వెక్కసపుగు నెవ్వగల్ పొడమెఁ గంపము పుట్టెఁ జెమర్చె మేను మానసమున విన్నఁబాటొదవె... పారి. ౧. ౧౦౦.

ఉ. పౌరులు మేలుకాంచి నరపాలకుఁ గానక విన్నఁబాటుతో, నా రథమార్గమారసి... భా. రా. అర. ౧౩౫.

శా. నిన్ను న్నమ్మించితి సైన్యముల్ సొరుగువో నీదీన నాకేమియున్, విన్నంబాటు ఘటింప నేరదు ... పి. శకుం. ౩. ౧౩౨.

**విన్నఁబోవు.** అ. క్రి. (విన్న + పోవు) వెలవెలపోవు, వికాసము చెడు.

గీ. పుడికివైచిన మవ్వంపుఁ బొఱయపోలె, వాడి సొమరుచు మేఁ దీఁగవందికంది, వెలఁది నీవింత వగఁగూరి విన్నఁబోతి, యూనికి దుఃఖాబ్ధి ము మ్మిడి యునికిగాదె. కు. సం. ౬. ౬౬౦.

**విన్నఁబుచ్చు.** స. క్రి. (√ విన్నఁబోవు) వివర్ణ

ముగఁజేయు, అవమానపఱచు, చిన్నఁబుచ్చు.

వ... యామళంబులం గలంచియు, జన్నంబుల
విన్నఁబుచ్చియు...    నైష. ౮. ౭౭.

**విన్నఁబోవు.** అ. క్రి. (విన్న + పోవు)
౧. వివర్ణమగు.

ఉ. వాడిన మోముఁ దమ్మిఁదెలివాలిక
కన్నులు విన్నఁబోవఁ దో, నాడక నెన్నొ
సల్ కరమునం దిడి తీరనివ్వణ్ణరయి జలం,
బాడఁగఁ బిల్చువారి నొక హస్తపు
ముకుళ్ళన నాడుఁ డంచుఁ దాఁ, జూడక
చూచుచూడ్కినల జోటిదెసల్ పరికింప
నొక్కచోన్.    మనుచ. ౩. ౭౬.

శా. విన్నంబోయిన మోముతో హృదయనిర్వే
దంబుతో...    ఎల్లన. ౧. ౨౩౭. (బ్రౌ)

౨. క్షీణించు.

గీ. వర్ణములు నాశ్రమంబులు పరుసఁదప్పె,
వేదములు నాగమంబులు విన్నఁబోయె,
సౌరభంబులు కృష్ణపచ్యములఁ జెడిరి,
వృద్ధిఁబొందె నధర్మంబు విశ్వమునను.
కాశీ. ౬. ౭౬.

౩. హ్యానమగు, తక్కువగు.

గీ. విన్నఁబోకుండఁ గ్రియలెల్ల విస్తరిల్లఁ,
దగనొనర్చిరి పురిటాలి తగవులెల్ల.
పి. శకుం. ౪. ౬౨.

౪. దైన్యమునొందు.

గీ. తనయ సంతానలబ్ధి దొదవ్వగాఁగ, విభవ
సంపత్తిగల్గియు విన్నఁబోయి, వనితనిష్ఫల
పుష్పదర్శనముఁదాల్చె, శరలతాకాననము
వోలెజివ్వనంబు.    శివరా. ౨. ౧౮.

**విన్నది.** వి. (విను² + నది) చేదలేఱు, ఆకాశనది.

చ... పారిజాత మం, జులలపలీనికుంజముల
సోలుచు విన్నదిఁ దేలుచున్ సురల్.
సారంగ. ౨. ౧౭౧, ౨. ౧౮౮.

**విన్నన.** వి. (√ విన్న) ౧. వైవర్ణ్యము, కాంతి
హీనత.

సీ. ఉన్నత గతిసెడి యూర్వ్విపైఁగడు విన్ననై
పడియున్న సుధాంశుభంగి ...
భాగ. ద్రో. ౨. ౧౨౬.

గీ. రాజునకు విన్నవించిరి రమణిదెలఁగు,
విన్నవించిన నారాజు విన్ననగుచు, నిన్నుఁ
దోడ్కొని రమ్మని నన్నుఁబనిచె.
విక్ర. ౮.౬౪.

గీ. జలరుహంబులు పాండవ సైనికులమొ,
గంబులట్టుల విన్ననై కాంతి దఱఁగె.
భార. భీష్మ. ౧. ౩౦౦.

శా. పట్టంగైదువులేక విన్ననగు నాబాహార్గ
ళుల్ చూడుఁడా...    భీష. ౬. ౯౧.

విన్ననగు = చిన్నఁబోవు)

గీ. తొంబనూటను తొంబది తొమ్మిదియును,
జలజములఁ బూజసేసెను శార్ఙ్గపాణి, వేయి
టికి నొక్కపద్మంబు విన్ననైన, నహహ
నియమంబులకు భంగమయ్యెననుచు.
భీమ. ౬.౬౪. (శ. ర.పా)

(వెలితియైన ముద్రి. పా.)    భీమ. ౬. ౬౧.

**విన్నను‌వు.** వి. (సం. విజ్ఞానం) ౧. నేర్పు.

చ. అనలముదోఁచునే తరువునందుఁ గుతార
ముఖంబులైన సాధనములఁ బ్రయాసజ్జన
హీస్తా తగఁ దర్చినఁగాక యట్లయు, తనువు
నలంగఁజేసి పరతత్త్వముఁగాంచు మనంగ
రాదు విన్ననువున నాగమోక్తసాధనం
బొనరించినఁగాని యారయన్.
భార. శాం. ౪. ౧౮౯.

సీ. వారు(డు... విన్ననువులు చూపు వేడుకనట
కొండ అణిమాదిగుణముల నలవరించి.
కు. సం. ౧౧. ౬౬౪.

వ ... అద్దంబుల మీ(దవలె నుండనున్న చేసి విన్ననువున మెఱుంగు పెట్టినం ద్రొక్కన(జిక్కంబేరువాఱుచు. పి. శకుం. ౧. ౨౯.

క. ఎన్న(దగు హీనులు బుద్ధులు, విన్నను వున(జెప్ప నత(డు వినకున్న(జెడున్ ...
నా. పంచ. ౧. ౪౨౮.

౨. విధము, రీతి.

వ ... మహాజ్వరంబులు జ్వలన జ్వాలా కలాపంబులు రూపంబులు గైకొన్న విన్నను వున(గన్ననువు చూపజగ్గింప ...
ఉ. హరి. ౬. ౧౦౮.

**విన్నపత్త్రిక.** మి. వి. (విన్నపము + పత్త్రిక) విజ్ఞాపనపత్త్రిక.

వ ...సింధుకటకాధీశ్వరుండగు సింధురాజా నకుండ త్త్ర్యామంబంతయు(...టతెల్లంబుగా విన్నపత్త్రిక వ్రాసిపుత్తెంచిన...
భిల్లాణ. ౪. (శ. ర.)

**విన్నపము.** వి. (సం. విజ్ఞాపనం) మనవి.

చ. వెఱపక మీకొనర్తు నొకవిన్నపము...
మనుచ. ౧. ౭౩.

క. అయ్యమ్మ యాగ్రహిం చెడ(బాయక నా మీ(ద విన్నపముచేసిన భూనాయకు(డిది యా(గాదన, కీడుమీ(ద నాగ్రహిం పం దగునే. సారంగ. ౨. ౨౭.౧.

జః విన్నవించు.

**విన్నము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. తెలియ(బడినది. ౨. పొంద(బడినది, సంపాదింప(బడినది. ౩. విమర్శింప(బడినది, పరిశోధింప(బడినది. ౪. ఉంచ(బడినది. ౫. స్థిరపఱుప(బడినది ౬. పెండ్లియాడ(బడినది.

**విన్నవించు.** అ. క్రి. (√ విన్నపము) మనవి చేయు, విజ్ఞాపించు.

క ... పవనపుత్త్రు(డు మనుజేంద్రునకు జయ శబ్దయుతముగ, వినయంబున మ్రొక్కివిన్నవించె నిభృతు(డై. భార. విరా. ౧. ౨౧౭.

గీ. అంత నొకనా(డు తరుణి యేకాంతవేళ, విభుని పాదంబులకు మ్రొక్కి విన్నవించు.
కాశీ. ౩. ౨౧౪.

**విన్నాణము.** వి. (సం. విజ్ఞానం) ౧. మల్లబంధము.

ఉ. ప్రాణములం గదల్ప(గ(జలంబున ధైర్యము నిక్కి పెక్కు విన్నాణము లొప్ప(గా సరి(బెనంగ...భా. రా. యు. ౭౧౭.

క. బలభద్రు(డు ముష్టికు(డును, బలములు మెఱయంగ(జేసి బాహాబాహిం, బ్రౌఢయాగ్నుల క్రియ(బోరిరి, పెలయు(గ బహువిధములైన విన్నాణములన్.
భాగ. ౧౦. పూ. ౧౩౪౬.

వ... గళకత్తెరయు నృసింహంబును కొసె ...లుకడగును నను ముప్పదిరెండు విన్నాణంబులును... ప్రబంధ. ౧౭౮.

౨. సామర్థ్యము, శక్తి.

శా. నానా లోకములన్ జయింప(గల విన్నాణంబు చెందన్ జనస్థానాధీశు(డు దేవతాద్రి(దపమున్ సల్పె న్నిరాహారు(డై.
ఉ. హరిశ్చ. ౪. ౭౬.

౩. నేర్పు.

వ...మధుర కిన్నర నిక్వాణంబుల రాణన్ ద్రోణం జెలఁగు విన్నాణంపుఁ గొల్పు లెలుంగులును... మనుచ. ౫. ౩౧.

శా... రాసంబు మాతోడ సంగీకారం బొనరించి బంధనియతిం గ్రీడించు విన్నాణముల్. భాగ. ౧౦. పూ. ౧౪౩౭.

సీ. తెగువరా సభ రూపు ధేనుకాసురుఁ బట్టి విన్నాణమున మేను విఱిచినాఁడె. ఉ. హరి. ౧. ౭.

౪. ఒప్పిదము, రమ్యత.

ఉ. వేణి చలింపఁ గంఠిత నవీనమృణాల భుజాగ్రకంకణ, శ్రేణినటింప నోలఘరినిబిరీసకటాక్షకాంతి విన్నాణముచూప హంసకక్వణనంబును మీఱ... వసు. ౨. ౧౩౭.

ద్వి. వెన్ను విన్నాణంబు వెడఁద యూరంబు, నున్నత భుజములు నొరపైన మెడయు. ప్రభులిం. ౧. ౪ గతి. ౨౭ పా.

విణ. ౧. సమర్థమైనది; శక్తము.

క. శ్రీనాయక నీ నామము, నానా భవలోక కర్మ నాశమునకు విన్నాణంబగు నౌషధమిది, కానరు దుష్టాత్ము లకట కంజదళాక్షా. భాగ. ౧౧. ౧౩.

౨. అందమైనది, సుందరము.

శా. శ్రీ విన్నాణపు గుబ్బచన్నుల నయారేఖంబు రాఁ గుప్పి ముక్తావల్లుల్ ఘటియించెదేమి శశికిం దారా ప్రయుక్తంబనే, భావం బోయను.... శకుం. ౧. ౧.

జః విన్నాణి, విన్నాణించు.

**విన్నాణి.** (సం. విజ్ఞానీ) (విన్నాణము + ఇ) వి. సన్యాసి, సన్నాసి.

అ. వేదవిదునిచేత విన్నాణిచేతను, దాసిచేతఁ బిన్నదానిచేత, రాయబారిచేత రాజపురుషు చేతఁ, గూలి పుచ్చుకొనుట చాలఁ దప్పు. విజ్ఞా. ప్రా. కాం. ౭౩.

విణ. ౧. సమర్థుఁడు.

మ. బహువర్ణంబులు బ్రహ్మ దొల్లి జగముత్పాదింప విన్నాణి గాక నారిప్రార్థనధారణావశమునం గాదే ఘనమోఘోల్లస, న్మహనీయోజ్జ్వలబుద్ధియై భువన నిర్మాణ ప్రభావంబుతో, విహరించె న్నరనాథ జంతునివహాకీర్ణోద్భవ ... భాగ. ౨. ౧౬.

౨. నేర్పరి.

దండకము... లోపక్త్రపద్మస్థవేదంబులం గొన్న విన్నాణి యున్నట్టి యంబోధిలోఁ బొచ్చి దాఁగున్న యా సోమకుంజోర మీనాకృతిం బట్టి కట్టల్కఁ జోఁ జంపి... చిత్రభా. ౭. ౧౨౪.

దండకము ... గోలోకముం గాచి గోవర్ధన క్షోణి గృత్యకుందర క్షోణిఁ గ్రీడించు విన్నాణి.. పాండు. ౪. ౩౩.

**విన్నాణించు.** అ. క్రి. (√విన్నాణము) సుందరమగు, ఒప్పిదమగు.

ద్వి. నగవు వెన్నెలల విన్నాణించు మించు, మెఱుఁగుమెత్తిచూడవే మోహనవాణి. అ. ము. న. ౪. ౧౭౩ పా. ౩ సం.

**విన్నావ.** (విన్ను + ఆవ) వి. గంగానది.

గీ. ఏనుఁగులు గుఱ్ఱములు మున్నగునవి నీళ్లు, దాటి నడమేడ గోడలదాఁక నాడు, మున్న విన్నావ యొడ్డునమోసి వొలుకు, దొట్టినట్టి తెలుంగుల తోడివయ్యొ. అచ్చ. భాగ. వి. ౩. ౩౩. పా.

**విన్ను-విను**[2]. వి. దే. ఆకాశము.

గీ. విన్నుమన్నును నొకటిగా వృష్టిబలసె.
ఆము. ౪. ౯౧.

గీ. తెచ్చి కంసున కొసఁగ నుద్వృత్తిసెగుర, వేసి యసిపూన నడ్డవి వింటనిలిచి, వేఱె యున్నాఁడు నీశత్రు వెత్తియనుచుఁ,జనియె.
దశా. ౯. ౧౭౭.

సీ. విన్నులపైఁ బాఱువెల్లి ముత్యపు జల్లి చలువ బన్ను చెంగలువ కచ్చు.
వరాహ. ౯. ౭౮.

జ. వింటితెర్వరి, విన్నంగు, విన్నావ, విన్నుకేళాకూళి, విన్నుచూలి, విన్నుద్రిమ్మరి, విన్నుమనమఁడు, విన్నుమూలదేవర, విన్నువాఁక, విన్నువెలుఁగు, విన్నేఁకికాలువ, విన్నేటితాల్పు, విన్నేఱు.

**విన్నుకేళాకూళి.** వి. ఆకాశగంగ, సురదీర్ఘిక.

సీ. విన్నుకేళాకూళి పొందిన నీర్నిచిన పసిఁడి జారిచెంబు పసపొసఁగ.
అ. రా. యు. ౧౫౪.

సీ. విన్నుకేళాకూళి వేల్పుల బోనము తడవుల నిడుపడుపుడుకు దొడుకు.
అ. రా. యు. ౫౯౨.

**విన్నుచూలి=వినుచూలి** (విన్ను + చూలి) వి. వాయువు.

గీ. అనుచుఁ జేదోయిమోడ్చి యో యంటరాని, వేల్ప నీ సంగడీఁడగు విన్నుచూలి, కనుఁగుఁగొడుకగు కోఁతి కన్నాఁడనందు, నుడుకు చూపక చల్లనై యుండుమయ్య.
అచ్చ. రా. సుం. ౧౬౯.

**విన్నుద్రిమ్మరి=వినుద్రిమ్మరి.** (విను + త్రిమ్మరి) వి. ?వత. ఆకాశమునందు సంచరించువాఁడు.

సీ. విన్నుద్రిమ్మరి [illegible] రాచకన్నియల్ వరవుస్తె

పులుఁగుల మేల్బంతి వలఁతిమావు.
అచ్చ. రా. బాల. ౬.

**విన్నుమనుమఁడు-వినుమనుమఁడు.** వి. (విన్ను + మనుమఁడు) హనుమంతుఁడు.

క. అన్నను మున్నుగ బలితపు, మున్నఱకన్ లత్మ్మణుండు మొగిఁదొలి జేజే, మిన్నుపయిన దరుచో గని, విన్నుమనుమఁడతనిఁ ద్రోచి వేసఁదా నెదిరెన్.
అచ్చ. రా. యు. ౨౧౧.

**విన్నుమూలదేవర.** వి. (విన్ను + మూల + దేవర) మినుసికదయ్యము, శివుఁడు.

గీ. నలువ మెఱయంగఁ బెద్దలనాఁటనుండి, మున్నుదమయింట డా కొనియున్న విన్ను, మూలదేవర విల్లెత్తఁ జాలుమేటి, కిత్తుఁదన కన్నెనంచు నొట్టిడుక యతఁడు.
అచ్చ. రా. బాల. ౧౭౯.

**విన్నువాఁక.** వి. (విన్ను + వాఁక) మిన్నేఱు, ఆకాశనది.

ఆ. పిన్నకౌరి యశము పెన్నుకేళాకూళి, విన్నువాఁకఁబలుకువెలఁదిఁ బుడుకు, దొడుకు రిక్కఱేని నొడలి చూం పొడయని, మేటి తేజిఁబోలు దీటులేమి.
రామ. ౧౯౭.

**విన్నువెలుఁగు.** వి. (విన్ను + వెలుఁగు) సూర్యుఁడు.

తరల. కడఁగి విన్నువెలుఁగు డా గురిగాఁగ నబ్బలు గానలో, నడలుచున్న ననుంగనుంగొని యప్పుడర్మిలి నూతిలో, వడలఁ దీయుచుఁ గేలుపట్టితివేకదా యిఁకఁ బెండ్లికిం, గడమవెల్లను సొంపులింతియకొక సూరలెలుంగ రే.
యయా. ౪. ౬౧.

**విన్నేటికాలువ.** వి. (విన్ను + ఏఱు + కాలువ) ఆకాశగంగ.

ద్వి. విన్నేటికాలువ వింతగాఁజుట్టి, కొన్న హేమాచల కూటమో యనఁగ.

ద్వి. పరమ. ౩. ౧౯౧. పా.

**విన్నేటితాల్పు.** వి. (విన్నేఱు + తాల్పు) శివుఁడు, గంగాధరుఁడు.

శా ... విన్నేటి తాల్పున్న యా, గట్టుంబిట్టు పెకల్చి రావణుఁడనంగా మీఱిరాకాని పెన్‌,బట్టం బేలెనతండు తమ్మునగవ రొప్ప ట్లుందనుం గొల్వఁగన్‌. యయా. ౨. ౭౩.

**విన్నేఱు.** వి. (విన్ను + ఏఱు) ఆకాశగంగ.

సీ. విన్నేఱు తలఁగల్గువేల్పు నాదలపువ్వు తలఁపనెవ్వని తాత తాతతండ్రి.

యయా. ౧. ౯౧.

**విన్పించు=** వినిపించు, వినుపించు. స. క్రి. (√ విను) వినఁజేయు.

మ ... విను నానీయొడఁబాటు నెల్లె జనులన్ విన్పించితిం డల్లఁగా, వినతం దోడ్కొని పోయెదన్ ... భార. అను. ౧. ౨౬౧.

సీ. పాము నాశించు దేర్పాటునఁ దలయూఁచి కొంచును జెంగు విన్పించుకొనుచు.

కుచల. ౨. ౧౧౪.

**విన్యసించు.** సం. స. క్రి. ఉంచు.

వ ... దక్షిణజానూరు మధ్యంబున వామపాదం బును వామజానూరు మధ్యంబున దక్షిణ పాదతలంబును విన్యసించి.

కాశీ. ౩. ౨౩౯.

**విన్యస్తము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. ఉంచఁ బడినది. ౨. తాఁపఁబడినది. ౩. స్థిరపఱుపఁ బడినది. ౪. ఏర్పఱుపఁబడినది. ౫. ఒప్పగింపఁ బడినది. ౬. కానుకగా నీయఁబడినది. ౭. ఒకని యధీనముగా నుంచఁబడినది.

**విన్యాసము.** సం. వి. అ. పుం. ౧. ఒప్పగిం చుట, ఉంచుట. ౨. (భయములేదను నమ్మక ముతో సొమ్ము మొ.) ఒకచోట నిక్షేపించుట. ౩. ఏర్పాటు, కూర్పు, రచన. ౪. సమూహము. ౫. నివాసస్థలము; నివేశనస్థలము.

**విపంచి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. వీణ. ౨. క్రీడ, వినోదము, ఆట.

**విపంచిక.** =విపంచి. సం. వి. ఆ. స్త్రీ.

**విపక్త్రిమము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. పూర్తిగాఁ బండినది, బాగుగాఁ బక్వమైనది. ౨. అనుభవింప సిద్ధమైనది.

**విపక్వము.** సం.విశ. (అ. ఆ. అ.)౧. పూర్తిగాఁ బండినది, బాగుగాఁ బక్వమైనది. ౨.అనుభవింప సిద్ధమైనది. ౩. వండఁబడినది, పక్వముచేయఁ బడినది.

**విపక్షభావము.** సం. వి. అ. పుం. ౧. విరో ధము, శత్రుత్వము, పగ. ౨. తర్కములో లేక పోవుట.

**విపక్షము.** సం. వి. అ. పుం. ౧. ప్రతికూలమైన కళత్రము. ౨. వ్యతిరేక దృష్టాంతము (నిశ్చిత మైన సాధ్యాభావముగలది) ౩. (వ్యాక.) అప వాద సూత్రము.

**విపక్షుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) ప్రతికూ లుఁడు, శత్రుత్వముగలవాఁడు.

వి. అ. పుం. ౧. శత్రువు, పగవాఁడు. ౨. వివాది, ప్రతివాదము చేయువాఁడు.

**విపణనము.= విపణము.** సం. వి. అ. న.

**విపణము.** సం. వి. అ. పుం. ౧. అమ్మకము. ౨. చిన్నవ్యాపారము (చిన్నవర్తకము.)

**విపణి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. ౧. అంగడి. ౨. అమ్మకము నిమిత్తమైన వస్తువు. ౩. వర్తకము, వ్యాపారము.
వి. న్. పుం. వర్తకుఁడు, వణిజుఁడు.

**విపత్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. ఆపత్తు, కష్టము. ౨. చావు, నాశము. ౩. యాతన, తీవ్రమైన బాధ.

వి. ఇ. పుం. శ్రేష్ఠుఁడైన కాలిబంటు.

**విపత్తు.** సం. వి. ద్. స్త్రీ. ౧. ఆపద, ఇడుము, కష్టము. ౨. చావు.

**విపథము.** సం. వి. అ. పుం. తప్పుత్రోవ, చెడ్డ త్రోవ.

**విపద=విపత్తు.** సం. వి. ఆ. స్త్రీ.

**విపద్గ్రస్తుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ఆపదచే గ్రసింపఁబడినవాఁడు, ఆపదకు లోనైన వాఁడు, కష్టదశలో నున్నవాఁడు.

**విపన్నము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఆపద నొందినది, కష్టములోఁబడినది. ౨. క్షీణించినది, తగ్గినది. ౩. నశించినది, పోయినది. ౪. మృతమైనది, చచ్చినది. ౫. అసమర్థమైనది, శక్తిలేనిది.

అ. పుం. సర్పము, పాము.

**విపరిణమనము.** సం. వి. అ. న. ౧. మాఱుపాటు, మాఱుట. ౨. రూపాంతరము పొందుట. మాఱురూపు నొందుట.

**విపరిణామము=విపరిణమనము.** సం. వి. అ. పుం.

**విపరివర్తనము.** సం. వి. అ. న. చుట్టఁబెట్టుట.

**విపరీత.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పతివ్రతకాని స్త్రీ, కులట. ౨. కుటిల స్వభావముగల స్త్రీ, విపరీతబుద్ధిగల స్త్రీ.

**విపరీతకరుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) విరుద్ధముగాఁ బనిచేయువాఁడు. ఇ. శ్లో: విపరీతకాకరుఁడు.

**విపరీతకారి=విపరీతకరుఁడు.** సం. విణ. (న్. ణీ. న్.)

**విపరీతకృత్తు=విపరీతకరుఁడు.** సం. విణ. (త్.)

**విపరీతచేతను (స్కు)ఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) విరుద్ధబుద్ధికలవాఁడు.

**విపరీతమతి.** సం. విణ. (ఇ) వ్యతిరేక బుద్ధికల వాఁడు, విరుద్ధబుద్ధికలవాఁడు.

**విపరీతము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. వ్యత్యస్తము, తలక్రిందైనది. ౨. విలోమమైనది, వ్యతిరేకమైనది. ౩. తప్పైనది, నిబంధనమునకు విరుద్ధమైనది. ౪. అసత్యమైనది, నిజము కానిది. ౫. అనుకూలముకానిది, ప్రతికూలమైనది. ౬. అడ్డుదగులునది, విరుద్ధముగాఁ బని చేయునది. ౭. అనిష్టమైనది, అశుభమైనది.

౮. అ. పుం. న. పురుషాయితము, రతిబంధ విశేషము. (వాచ.)

**విపరీతరతము.** సం. వి. అ. న. పురుషాయితము.

**విపరీతలక్షణ.** సం. వి. ఆ. స్త్రీ. ఒక వస్తువు యొక్క వ్యతిరేక గుణములను వివరించుచుఁ బరిహాసముగా వర్ణించుట, వ్యతిరేక గుణావిష్కరణమునఁ బరిహాసకర వర్ణన.

**విపర్య(ర్యా)యము.** సం. వి. అ. పుం. ౧. వ్యత్యయము, తాఱుమాఱు, వ్యతిరేకము. ౨. ఉద్రేకము, వేషము మున్నగువాని మార్పు. ౩. వినిమయము, వస్తువులను మార్చుట. ౪. సమయమున లేకపోవుట, లేకపోవుట, అభావము. ౫. పోవుట, నష్టి. ౬. సమూల వినాశము, పూర్తిగ నశించుట. ౭. తప్పు, అపరాధము, దోషము. ౮. ఆపద, ఇడుము, దుఃఖము. ౯. పగ, శత్రుత్వము, విరోధము. ౧౦. వక్రబుద్ధి, దుశ్శీలము, చెడ్డస్వభావము.

**విపర్యస్తపుత్ర.** సం. వి. అ. స్త్రీ. పుత్రసంతతి లేని స్త్రీ. (విల్యమ్సు)

**విపర్యస్తము.** సం. విశే. (అ. అ. అ.) ౧. మాఱినది, తాఱుమాఱైనది. ౨. వ్యతిరేకమైనది, విరుద్ధము. ౩. యథార్థమని తప్పుగా గ్రహింపఁబడినది. ౪. వెనుకకు మరలినది. ౫. వ్యతిక్రాంతము, అతిక్రమింపఁ బడినది.

**విపర్యాసము.** సం. వి. అ. పుం. ౧. మార్పు, వ్యతిరేకము. ౨. ప్రాతికూల్యము. ౩. వినిమయము, వస్తువుల మార్పు. ౪. దోషము, తప్పు.

**విపలము.** సం. వి. అ. పుం. పలములో నఱువదియవ వంతు కాలము, అత్యల్పకాలము.

**విపశ్చి(త్తు)తుఁడు.** సం. విశే. (త్) చదువరి, పండితుఁడైనవాఁడు.

వి. త్. పుం. విద్వాంసుఁడు.

**విపాండురము**=విపాండువు. సం. విశే. (అ. అ. అ.)

**విపాండువు.** సం. విశే. (ఉ) మిక్కిలి తెల్లనిది, మిగులఁ దెల్లపడినది.

**విపాకము.** సం. వి. అ. పుం. ౧. పండుట, పంట. ౨. జీర్ణమగుట. ౩. పరిణామము, పండుట. ౪. కర్మఫలము, ఫలితము, పర్యవసానము. ౫. స్థితియొక్క తాఱుమాఱు. ౬. దైవవశమున సంభవించిన ఆపద. ౭. కష్టము, ఇబ్బంది. ౮. రుచి.

**విపాటనము.** సం. వి. అ. న. ౧. చీల్చుట. ౨. పెల్లగించుట, నిర్మూలించుట; సమూలనాశముచేయుట. ౩. చెఱుచుట, చెడఁగొట్టుట.

**విపాదము.** సం. వి. అ. పుం. ఒకవిధమైన పెద్ద బాణము.

**విపాదనము.** సం. వి. అ. న. నశింపఁజేయుట, చంపుట.

**విపాదిక.** సం. వి. అ. స్త్రీ. ౧. కాళ్ళ పగులు రోగము. ౨. విడికథ, గూఢప్రశ్న.

**విపాశ.** సం. వి. అ. స్త్రీ. నదివిశేషము, పంజాబు దేశము నందలి బీసు అను నది.

**విపినము.** సం. వి. అ. న. అరణ్యము, అడవి.

**విపుల.** సం. వి. అ. స్త్రీ. భూమి.

**విపులము.** సం. విశే. (అ. అ. అ.) ౧. విశాలము, విరివియైనది. ౨. అధికము, మిక్కుటము, సమృద్ధమైనది. ౩. గభీరము, లోతైనది. ౪. పులకితము, గగుర్పొడిచినది.

వి. అ. పుం. ౧. మేరుపర్వతము. ౨. హిమాలయ పర్వతము. ౩. మేరుపర్వతమునకుఁ బడమరగనున్న యొకానొక పర్వతము.

**విపులరసము.** సం. వి. అ. పుం. చెఱకు.

**విపులుఁడు.** సం. వి. అ. పుం. గౌరవముగల మనుష్యుఁడు.

౩. విడఁజేయు.

ఉ. తెవిన మేడపై వలభి తేనికఁ జంట
వహించి విప్పఁగా ... ఆము. ౧. ౬౨.

౪. విడఁగొట్టు.

సీ. కలికి జక్కవ పిట్టకవఁగూర్పు విప్పంగఁ
దరమైన కనుదోయి దయఁ దలిర్చ.

వరా. ౫. ౪౬.

ఉ. తమ్మినయమ్మ దప్పఁగు ముదమ్మ ముద
మ్మున నొప్పఁ జక్రవాకమ్ములు జోడు
విప్పె... భాస్కరుం డమ్మాయి నస్తమించె.

కవిరా. ౫. ౧౪౩.

౫. ప్రకటించు.

చ ... పెంచినట్టి రాచిలుకనైనఁ బెద్ద
ములు చెప్పదు విప్పదు మర్మమేరికిం,
బొలఁతి... సుదంతా. ౨. ౧౫౬.

ఉ. త్రిప్పకు ... నేఁడు మన దైత్యవరేణ్యుని
ప్రోల నేమమున్, చెప్పిన నీతిగాని మతి
చెప్పకుమన్న విరోధి నీతులన్, విప్పకు
మన్న దుష్టమగు విష్ణుచరిత్ర కథార్థ
జాలముల్. భాగ. ౭. ౧౧౮.

౬. వ్యాఖ్యానముచేయు, వివరించు.

మ. కలలో వార్తలు విప్పిచెప్పెడు క్రియన్
గాథా పురాణార్థముల్, దెలుపన్నేర్తురు.

పాండు. ౫. ౧౧౪.

క. హాలధరుఁడు ధర్మజుండును, బలమున కడ్డం
బువచ్చి బ్రతికిన చందంబుల విప్పి చెప్పఁ
దొరగెన్, నలినాక్షుని మహిమఁ దమ మన
ములఁ బొగడుచున్. చిత్రభా. ౮. ౧౧౮.

పంచచామరము. అభీష్టసిద్ధి నీకగున్ మహాత్మ
వోయివత్తు మా, ప్రభుండు వజ్రపాణి మమ్మఁ
బంచె నివ్వేళమముల్, లభించెనంచుఁ బల్కి
యుబ్బులంబు వెంటరాఁ గుభృ, ద్విభేది పాలికేగి
చెప్పె విప్పి విప్పి యంతయున్.

కళా. ౧. ౧౯౭.

విణ. ౧. విశాలము.

ఉ. చెన్నగు ... వెన్నెలరేలఁ గప్పురపు
విప్పుట వంటుల నీడ నీఁగు రాకన్నెల
కోయుం నన్నులకు గన్నులమూయఁ దటీయ
వాసనల్, మన్ననఁగాంచి కప్రపు సువా
రము రేఁచు సమీర డింభముల్.

వసు. ౧. ౧౧౧.

మ ... చూడఁ జూడఁ బుడమిన్ బాటిల్లి
పైవిప్పులై, యవసం బంచుల నాడఁగా
నెగసె వాత్యాలిన్ రజశ్చక్రముల్.

ఆము. ౨. ౪౮.

౨. అధికము.

క. అప్పెనువేసవి విభవము, విప్పుగఁ దన్నగర
నికట వృసగిరి హరికిం, దప్ప తిరునాళ్లురా...

ఆము. ౨. ౭౧.

క. అప్పుడు వివేకనరపతి, సుప్పిరిగొను వేద్క
గత్నముల చెక్కులన్, విప్పుగను
గోఁగుప్పలు, గప్పెడు గథరాజమెక్కె
కడలెడు వేళన్. ప్రబోధ. ౪. ౩౮.

క. కప్పుఁవు సుమ లలవడ, విప్పుగ విడిచేసె
వాన విడివడి గురియం, జొప్పడర హంస
నృపతి, చెప్పెను హేమావతీ వధూటయ
ముఖికిన్. హంస. ౨. ౭౨.

౩. గొప్పది, పెద్దది.

సీ. తళుకులకోరి కోలలపాదల్ విప్పైనకళుకుఁ
గ్రొంజికిలి సింగాణివిండ్లు.

ఇందు. ౨. ౫౪.

నగరంబు ధరక్షీరసాగరంబు.

ఘటికా. ౧. ౭౩

(పర్ణంపుఁగర్ణంపువిప్పుగంటిసామి-వరుణుఁడు.)

**విప్పువాఱు.** (విప్పు + పాఱు) అ. క్రి. వికసించు.

సీ. తెనుతెంట ముకుళముల్ విప్పువాఱఁ దనర్చి విరులకండములతో విజ్జిపీఁగ.

కృ. శతం. ౧. ౪౧.

**విప్పుసేయు.** స. క్రి. (విప్పు + చేయు) బహుళముగాఁజేయు, అధికముగాఁజేయు.

వ. మేఖలాకలాప కింకిణీ కలకలంబునఁ గులుకు టెలుంగులం గల్గని సకినల కీలుఁబలుపుల చప్పుళ్ళ విప్పుసేయు... సైమ. ౪. ౧౭౪.

**విప్రకర్షము.** సం. వి. అ. పుం. దూరము, దవ్వు.

**విప్రకారము.** సం. వి. అ. పుం. ౧. అవమానము, తిరస్కారము, అగౌరవపఱచుట. ౨. అపాయము, హాని. ౩. దుష్టత, చెడ్డతనము. ౪. వ్యతిరేకముగాఁ జేయుట, వ్యతిరేకము. ౫. ప్రతిక్రియ, మాఱుసేఁత.

**విప్రకాష్ఠము.** సం. వి. అ. న. ప్రత్తిచెట్టు. (వాచ.)

**విప్రకీర్ణము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. చిమ్ముఁబడినది, చల్లఁబడినది, చెదరఁగొట్టఁబడినది. ౨. వ్యాపించినది. ౩. వీడినది, ముడి విడిపోయినది (జుట్టు.). ౪. విస్తరింపఁజేయఁబడినది. ౫. విశాలమైనది, విరివియైనది.

**విప్రకృతము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. హాని కలిగింపఁబడినది, అపకారము చేయఁబడినది. ౨. అవమానపఱుపఁబడినది, నిందింపఁబడినది, అగౌరవపఱుపఁబడినది. ౩. ఎదిరింపఁబడినది. ౪. ప్రతిక్రియ చేయఁబడినది, ప్రతీకారము చేయఁబడినది. ౫. శ్రమపెట్టఁబడినది, ఒత్తిడి కలిగింపఁబడినది. ౬. రేపఁబడినది, కోపము రప్పింపఁబడినది.

**విప్రకృతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. అపాయము, హాని. ౨. అవమానము, తిరస్కారము. ౩. ప్రతీకారము, ప్రతిక్రియ, మాఱుసేఁత.

**విప్రకృష్ట(క)ము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. నివారింపఁబడినది, తొలగింపఁబడినది. ౨. దూరమైనది. ౩. పొడవుగాఁ జేయఁబడినది, దవ్వున నున్నది.

**విప్రతికారము.** సం. వి. అ. పుం. ౧. ఎదురుగాఁ బనిచేయుట, వ్యతిరేకముగాఁ బనిచేయుట. ౨. ప్రతీకారము, మాఱుసేఁత. (ఉపకారాపకారములకు) మాఱుచేయుట.

**విప్రతిపత్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. పరస్పర విరోధము, వివాదము; అభిప్రాయము కొండలగు వానియందలి విరుద్ధభావము. ౨. అసంగీకారము, అడ్డు. ౩. కలవరము, కలఁత. ౪. పరస్పర సంబంధము. ౫. పరిచయము, చనవు. ౬. సంశయ జనకమైన వాక్యము. ౭. (తర్క.) విరుద్ధ కోటిద్వయమును దెలుపు శబ్దము. (వాచ.)

**విప్రతిపన్నము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. పరస్పర విరుద్ధమైనది, ఒకదాని కొకటి వ్యతిరేకమైనది. ౨. కలఁతపడినది, కలవర పడినది. ౩. వివదింపఁబడినది, వివాదముచేయఁబడినది. ౪. పరస్పర సంబంధముగలది. ౫. సంబద్ధము, సందేహముతోఁ గూడినది. (వాచ.)

**విప్రతిషేధము.** సం. వి. అ. పుం. ౧. స్వాధీనముగా నుంచుట, తన యధికారములో

సంచుట. ౨. తుల్యబల విరోధము, సమానమైన ప్రాధాన్యముగల రెండు పనులకు బరస్పర విరోధస్థితి. ౩. (వ్యాకరణము) సమబలముగల రెండు భిన్న సూత్రములకు నేక స్థలమునఁ బ్రవృత్తి గలుగుట తుల్యబల విరోధము. ౪. నిషేధము.

**విప్రతి(తీ)సారము.** సం. వి. అ. పుం. ౧. పశ్చాత్తాపము. ౨. కోపము, కినుక. ౩. చెడ్డతనము, దుష్టత్వము.

**విప్రనష్టము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. నష్టమైనది, అదృశ్యమైనది. ౨. వ్యర్థమైనది, పనికిమాలినది.

**విప్రప్రియము.** సం. వి. అ. పుం. పాలాశ వృక్షము, మోదుగుచెట్టు.*

**విప్రము.** సం. వి. అ. పుం. అశ్వత్థ వృక్షము, రావిచెట్టు.*

**విప్రముక్తము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. స్వేచ్ఛగా విడువఁబడినది, వదిలివేయఁబడినది. ౨. ప్రయోగింపఁబడినది, విడువఁబడినది (బాణాదులు.), (సమాసాంతమున) శూన్యము, రహితమైనది.

**విప్రయాణము.** సం. వి. అ. న. యుద్ధమునఁ బారిపోవుట, పలాయనము.

**విప్రయుక్తము.** సం. విశే. (అ.ఆ.అ.) ౧.వియోగమును బొందినది, ఎడబాసినది. ౨. విడదీయఁబడినది, వేఱుచేయఁబడినది. ౩. ఎడఁబాపఁబడినది, వియోగము నొందింపఁబడినది. ౪. విడుదల చేయఁబడినది, విడువఁ బడినది. ౫. (సమాసాంతమున) రహితమైనది, శూన్యము, లేనిది.

**విప్రయోగము.** సం. వి. అ. పుం. ౧. ఎడఁబాటు, విరహము. ౨. ఐకమత్యములేమి; కూడికలేమి, విడిపోవుట. ౩. కలహము, విరోధము. ౪. తగనియుండుట.

**విప్రలంభనము.** సం. వి. అ. న. వంచన, మోసము.

**విప్రలంభము.** సం. వి. అ. పుం. ౧. వంచించుట, మోసపుచ్చుట. ౨. భ్రాంతిచెందుట, మాయలోఁబడుట. ౩. ముందొప్పుకొని వెనుక లేదని వాదించుట. ౪. కలహము. ౫. ఐకమత్యములేమి, విభిన్నభావము, కూడికలేమి. ౬. స్త్రీపురుషుల యెడఁబాటు, వియోగము, విరహము. ౭. (అలం) శృంగారరసభేదము, స్త్రీ పురుషుల విరహకాలమునందలి శృంగార రసము. (వ్యతి) సంభోగశృంగారము.

**విప్రలప్తము.** సం. వి. అ. న. ౧. వివాదము. ౨. కలహము. ౩. విలాపము.

**విప్రలబ్ధ.** సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక శృంగార నాయిక, సంకేతము నేర్పఱచి వచ్చెదనని మాటయిచ్చి యట్లురాని ప్రియునిచే వంచింపఁబడిన నాయిక.

**విప్రలబ్ధము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. మోసపుచ్చఁబడినది, వంచింపఁబడినది. ౨. ఆశాభంగము నొందింపఁబడినది. ౩. హానిగలుగఁ జేయఁబడినది, అపాయము నొందింపఁబడినది.

**విప్రలాపము.** సం. వి. అ. పుం. ౧. జొత్తిగాఁ బనికిమాలిన సంభాషణము, వదరు, ప్రేలుడు. ౨. విరుద్ధోక్తి, పరస్పర విరుద్ధముగాఁ జెప్పుట. ౩. వివాదము. ౪. ఆడినమాట తప్పుట.

**విప్రవాసనము.** సం. వి. అ. న. ౧. దేశభ్రష్టత, దేశమునుండి వెడలఁగొట్టబడుట. ౨. దేశాంతరమున నుండుట, దేశాంతరవాసము.

**విప్రవాసము.** సం. వి. అ. పుం. పరదేశమున నుండుట, దేశాంతరవాసము.

**విప్రశ్నిక.** సం. వి. ఆ. స్త్రీ. దైవజ్ఞురాలు, సోదెచెప్పెడి స్త్రీ, వేల్పుసాని.

**విప్రియము.** సం. విశే. (అ. ఆ. అ.) ఇష్టము కానిది, రుచిలేనిది.

వి. అ.న. అనిష్టమైనపని, అపకారము, చెడ్డపని.

**విప్రీతి.** సం. వి. ఇ. స్త్రీ. వైమనస్యము, విరోధము.

సీ. ...మీ రేవురకిపుడు ద్రుపదసుత యొక్క - తియు ధర్మమతి ధర్మపత్నియైనది యీ క్రమంబు లోకాగమంబులందు విరుద్ధ మీ సుందరికారణంబున మీకు విప్రీతి పుట్ట కుండ... భార. ఆది. ౮. ౯౩.

**విప్రుఁడు.** సం. వి. అ. పుం. ౧. బ్రాహ్మణుఁడు. ౨. ఋషి, విద్వాంసుఁడు. ౩. సూక్త (మంత్ర) పాఠకుఁడు.

**విప్రు (ప్లు) షము.** సం. వి. ష. స్త్రీ. ౧. బిందువు, చుక్క, బొట్టు. ౨. చిహ్నము, మచ్చ.

**విప్రోషితభర్తృక=ప్రోషితభర్తృక.** ప్రవాసమునకుఁబోయినభర్తగల స్త్రీ, దేశాంతరగతుఁడైనభర్తగల స్త్రీ.

**విప్రోషితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) దేశాంతరమున నున్నవాఁడు. ౨. దేశభ్రష్టుఁడు, దేశమునుండి వెడలఁగొట్టఁబడినవాఁడు.

**విప్లవము.** సం.వి.అ.పుం. ౧. కొట్టుకొనిపోవుట, నీటిలోఁ గొట్టుకొనిపోవుట, నలుమొగములఁ గొట్టుకొనిపోవుట. ౨. వ్యతిరేకము, పరస్పర విరోధము. ౩. కలఁత, క్షోభము. ౪. బొమ్మి యుద్ధము. ౫. శత్రురాజులవలని యుపద్రవము, రాష్ట్రోపద్రవము, దోపిడితోఁగూడినయుద్ధము. ౬. బలాత్కారముగాఁ బుచ్చుకొనుట. ౭. నాశనము. ౮. ప్రాతికూల్యము. ౯. అద్దముపై మాలిన్యము. ౧౦. ఉల్లంఘించుట, శాసనాదికమును నిర్లక్ష్యము చేయుట. ౧౧. ఇడుమ, కష్టము, ఉపద్రవము. ౧౨. పాపము, దుష్టత్వము. ౧౩. అఱుపులతోను (కేకలతోను) చేష్టలచేతను (అభినయములచేతను) శత్రువును భయపెట్టుట. ౧౪. (రహస్యము) బైటఁబెట్టుట.

**విప్లావము.** సం. వి. అ.

యము, వఱదలో మునుఁగుట. ౨. బొమ్మి యుద్ధము జరిపించుట. ౩. అశ్వగతివిశేషము. గుఱ్ఱపునడకలలో నొకవిధము. (దౌడు.)

**విప్లుతము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. నీటిలోఁ గొట్టుకొని పోవునది. ౨. నీటిలోమునిఁగినది. ౩. కలఁత నొందినది, కలవరపెట్టఁబడినది. ౪. ఉపద్రవము నొందినది. ౫. పోయినది, కనఁబడనిది, అగోచరమైనది. ౬. అగౌరవపఱుపఁబడినది, అవమానింపఁబడినది. ౭ నశింపఁజేయఁబడినది. ౮. మఱుఁగుపఱుపఁబడినది, కప్పఁబడినది. ౯. అతిదుర్మార్గము, కామాతురము. ౧౦. వ్యతిరేకమైనది, పరస్పర విరుద్ధము. ౧౧. అసత్యము.

**విఫల.** సం. వి. ఆ. స్త్రీ. కేతకి, మొగలి.

**విఫలము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. ఫలము లేనిది, పండ్లులేనిది, నిరుపయోగము, వ్యర్థము, ప్రయోజనము లేనిది, లాభములేనిది. ౨. అర్థము లేనిది (అ. ని.)

**విఫలీకృతము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. ఫలములులేనిదిగాఁ జేయఁబడినది. ౨. వ్యర్థపరుపఁబడినది, నిరుపయోగముగాఁ జేయఁబడినది.

**విఫలీభూతము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. నిష్ఫలమైనది. ౨. వ్యర్థమైనది, నిష్ప్రయోజనమైనది, పనికిమాలినదైనది.

**విఘా(భా)లు(ళు)ఁడు.** సం. విణ. (అ. ఆ. అ.)
౧. నశింపఁజేయువాఁడు.

గీ. పురరిపు విఘాల మునిజనహృదయలోల. వేణు. ౪. ౧.

ఉ... చమూపాలసమేతుఁడై రిపువిఘాలుఁడు నందురికొమమంత్రి వ్యాహ్యాళివిహారముల్ సలుపు నర్థిజనుల్ జయవెట్టుచుండఁగన్. జాహ్నవీ. ౧. ౮౪.

౨. జయించువాఁడు.

సీ. ముందట బలభేది ముఖ్యదిక్పతి విభాళా యని బహుకాహాళములు మొరయ. వరాహ. ౫. ౨౭.

**విబంధము.** సం. వి. అ. పుం. ౧. మలబంధము, విరేచనబంధము. ౨. ఆటంకము, నిరోధము.

**విబద్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. విశేషముగాఁ గట్టఁబడినది, గట్టిగా బంధింపఁబడినది. ౨. నిరోధింపఁ బడినది, అడ్డగింపఁ బడినది.

**విబుద్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. మేల్కాంచినది, మెలఁకువగొనినది. ౨. వికసించినది, విరిసినది. ౩. నేర్పుగలది, నైపుణ్యముగలది. ౪. బోధములేనిది, మనస్సునకు స్ఫురణ లేనిది.

**విబుధాధిపతి.** సం. వి. ఇ. పుం. ఇంద్రుఁడు, వేల్పులఱేఁడు.

**విబుధానుఁడు.** సం. వి. అ. పుం. ౧. విద్వాంసుఁడు పండితుఁడు. ౨. ఉపాధ్యాయుఁడు, ఒజ్జ.

**విబుధుఁడు.** సం. వి.అ.పుం. ౧. విద్వాంసుఁడు, పండితుఁడు. ౨. వేల్పు, దేవత. ౩. చంద్రుఁడు.

**విబుధేంద్రుఁడు.** సం. వి. అ. పుం. ఇంద్రుఁడు, వేల్పుఱేఁడు.
ఇట్లే: విబుధేశ్వరుఁడు.

**విబూది.** వి. (సం. విభూతిః) భూతి, బూది.

గీ. ... బూది విబూదియనఁగ, భూతి దనరారు శ్రీమాతృభూతలింగ. ఆం. భా. ౧.౪౫.

**విబోధము.** సం. వి. అ. పుం. ౧. మెలఁకువ, జాగరూకత. ౨. కనిపట్టుట, కనుఁగొనుట. ౩. తెలివి, వివేకము. ౪. (అలం) ముప్పది మూఁడు వ్యభిచారభావములలో నొకటి. ౫. పరధ్యానము.

**విభ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ప్రకాశము, వెలుఁగు. ౨. కిరణము. ౩. సౌందర్యము, చక్కఁదనము, శోభ.

**విభంగము.** సం. వి. అ. పుం. ౧. పగులు, బీఁట, విఱుగుట. ౨. ఆటంకపఱుచుట, నిరోధము, అడ్డగింత. ౩. (కనుబొమలు) ముడుచుట. ౪. ముడుత. ౫. మెట్టు, సోపానము. ౬. వెలిబుచ్చుట, స్పష్టపఱుచుట. ౭. పంపకము, విభజనము, వేఱుపఱుచుట.

**విభక్తజుఁడు.** సం. వి. అ.పుం. తన తండ్రియుఁ దనసోదరులును కుటుంబపు సొత్తు పంచుకొనిన తర్వాతఁ బుట్టిన కుమారుఁడు.

**విభక్తము.** సం. విణ. (అ. ఆ. అ.) (ఆస్తి) పంచఁబడినది, భాగములుగా నేర్పఱుపఁబడినది. ౨. కృతవిభాగము, పంచుకొనినది. ౩. వేఱుగా నుంచఁబడినది, విడదీయఁబడినది. ౪. భిన్నభిన్నమైనది, వివిధము, నానాప్రకారమైనది. ౫. (ఉద్యోగాదులనుండి) నివృత్తమైనది, మరలినది, ఏకాంతముగా నున్నది. ౬. సక్రమము, అనురూపముగా నున్నది. ౭. అలంకరింపఁబడినది. ౮. కొలువఁబడినది.

వి. అ. న. ౧. ఏకాంతస్థితి, ఒంటరిగా నుండుట, (వ్యాపారాదులనుండి) విరమించుట. ౨. భాగము, వాటా. ౩. పంచుకొనిన సొత్తు. ౪. ఎడఁబాటు.

**విభక్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. విడఁదీయుట, పంచుకొనుట, వేఱుచేయుట. ౨. భిన్నభిన్నమగుట, వేఱువేఱగుట. ౩. దాయభాగము, భాగము. ౪. ప్రాతిపదికాదులకుఁ జేర్చబడి ప్రత్యయము.

**విభక్తుఁడు.** సం. వి. అ. పుం. కుమారస్వామి—
విణ. వేఱుగానున్నవాఁడు, పంచుకొనిన వాఁడు. (విభక్తులు=సోదరులు.)

**విభజనము.** సం. వి. అ. న. విభజించుట, విభాగము.

**విభజించు.** సం. స. క్రి. విభాగించు, వేఱుపఱుచు.

క. నిలిచినఁ గనుఁగొని యిమ్మెయిఁ, గలసిన యయ్యొడలు రెండుగా విభజింప, న్వలయును నని యజుఁడు పలికిన...(మార్క. ౪.౫౪.)

**విభవము.** సం. వి. అ. పుం. ౧. ధనము, సొత్తు, ఆస్తి. ౨. బలము, శక్తి,మహత్త్వము. ౩. ఉన్నతస్థితి, హోదా, గొప్పతనము. ౪. ఔదార్యము, ౫. మోక్షము. ౬. సర్వమూర్తద్రవ్యసంయోగిత్వము, మహాభూతాదుల లక్షణము. ౭. ప్రభవాదులయిన యఱువది సంవత్సరములలో నొకటి, రెండవది.

**విభాకరము.** సం. వి. అ. పుం. ౧. అర్కవృక్షము, జిల్లేడుచెట్టు. ౨. అగ్ని నిప్పు.

**విభాకరుఁడు.** సం. వి. అ. పుం. ౧.సూర్యుఁడు. ౨. చంద్రుఁడు. ౩. అగ్ని.

**విభాగధర్మము.** సం. వి. అ. పుం. దాయమును గురించిన ధర్మశాస్త్రము.

**విభాగము.** సం. వి. అ. పుం. ౧. పంపకము, పంచుకొనుట,దాయముపంచుకొనుట. ౨. దాయభాగము. ౩. భాగము, వాటా. పాలు. ౪. విడిపోవుట, వేఱగుట. (తర్క.) ఇరువదినాలుగు గుణములలో నిదియొకటి, ౫. అంశము, లవము. ౬. ఖండము, కొంతభాగము. ౭. [illegible], ఏర్పాటు.

**విభాగించు.** సం. స. క్రి. ౧.విభజించు, పంచు.

గీ. వసుమతీచక్ర మేకోష్ణవారణముగ, నేలి భరతాదిసుతులకు నేడు దీవులును విభాగించి యిచ్చి తాఁజనియె...
వరాహ. ౧. ౮౭.

వ...మనుష్యులకు జననమరణాదులయొక్క వేన నావేశంబునుంగా విభాగించె...
భార. శాం. ౫. ౪౪౩.

౨. వేఱుపఱుచు.

క...అ, య్యుఱువదినాల్గింటిని పరంతరము విభాగించి చెప్పెదం దెలియంగన్.
భార. శాం. ౬. ౬.

**విభాజకము.** సం. విణ. (అ. ఈ. అ.) విభజించునది. (భాగహారమునందు విభజించుసంఖ్య.)

**విభాజనము.** సం. వి. అ. న. పంచుట, విభజించుట.

**విభాజితము.** సం. విణ. (అ. ఆ. అ.) విభజింపఁబడినది.

**విభాజ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. పంపకముచేయఁదగినది, పంచుకొనఁదగినది. (ఆస్తి మొ.) ౨. విభజనీయము, వేఱుచేయఁదగినది.

**విభాతము.** సం. వి. అ. న. ప్రభాతము, వేకువ.

**విభా(ఫా)ళించు.** సం. స. క్రి. ౧. కొట్టు.

శా. పాళిం బాఱఁగఁదోలి యంతకు దిశా
పట్టంబు గారించి పూర్వాశాధీశ్వరు
వెన్నడిం జని ధనాధ్యక్షున్ విభాళించి కే,
లీశస్త్రాస్త్రవిహారసార మెఱటన్ లేకుండ
నిర్మించితిన్, మీ శాస్త్రంబుల నింక
నెవ్వరికగున్ మేలైన యజ్ఞాంశముల్.

ఉ హరి. ౧. ౯౧.

సీ... ఇంద్ర బర్హిః ప్రచేతఃపాప్రవ ప్రచేత
సుల విభాళించిన సహాయ దాసిరి...

వరాహ. ౬. ౧౩౦.

౨. ఖండించు, నఱకు.

సీ. కులగిరాధరపక్షములు విభాళించిన దం
భోళి తనకటి తాపగాఁగ, గీ. వాలి
ముల్లోకముల నేలు వాసవుండు...

వరాహ. ౩. ౬౫.

ద్వి. పొట్టలు చించి పేఁగులు విభాళించి,
యట్టలు నేలతో నడిచి కొందఱును...

విరా. ౪. ౭౦ పా.

౩. వశపఱుచుకొను.

సీ. ఆఁకలి గొన్నాఁడ నశనంబు వెట్టింపు మది
నన్ను బ్రాహ్మణమాత్రుఁగా విచారింప
కుము విను శ్రౌతకర్మమును దక్షత వహిం
చిన ప్రతిస్పర్థి విఱుగ, దట్టించి నాల్గువేద
ములు విభాళించి బ్రహ్మరథం బెక్కి
బహువిధాధ్వరాగ్రపూజనము పరిగ్రహిం
చిన జగజెట్టి రౌహిణ్యుఁడ...

వరాహ. ౬. ౨౦.

**విభావకము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. ప్రక
టించునది, స్పష్టపఱుచునది, చూపునది.
౨. చక్కఁగాఁ బరిశీలించునది, బాగుగాఁ
జర్చించునది.

**విభావన.** సం. వి. ఆ. స్త్రీ. ౧. స్పష్టముగాఁ
దెలిసికొనుట, నిజము గ్రహించుట. ౨. పరిశీల
నము, పరిశోధనము, విమర్శనము. ౩. భావన,
తలఁపు. ౪. అర్థాలంకార భేదము. (కారణము
లేకయే కార్యము పుట్టినట్లు వర్ణించుట.)

**విభావనము.** సం. వి. అ. న. ౧. స్పష్టముగాఁ
దెలిసికొనుట, నిజముగ్రహించుట. ౨. పరిశీల
నము, పరిశోధనము, విమర్శనము. ౩. భావన,
తలంపు.

**విభావము.** సం. వి. అ. పుం. ౧. (అలం.) రసో
ద్దీపకములగు భావములలో నొకటి. (ఇది ఆలం
బనవిభావము, ఉద్దీపనవిభావము అని ద్వి
విధము.) ౨. పరిచయము. ౩. ఉద్రేకమును
బుట్టించు సంగతి. (వేషము, భాష. మొ.)

**విభావరి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. రాత్రి. ౨.
పసుపు. ౩. కుంటెనకత్తె. ౪. లంజె. ౫.కుటిల
స్వభావముగల స్త్రీ. ౬. వదరుబోతైన యా
డుది,వాచాటురాలు.

**విభావసు(ఁడు)వు.** సం. వి. ఉ. పుం. ౧. సూ
ర్యుఁడు. ౨. అగ్ని. ౩. చంద్రుఁడు.

**విభావసువు.** ౧. జిల్లేడుచెట్టు. ౨. చిత్రమూ
లము. ? ౩. ఒకవిధమైన హారము.

**విభావితము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧.
ప్రత్యక్షము చేయఁబడినది, చూపఁబడినది.
౨. గ్రహింపఁబడినది, తెలిసికొనఁబడినది. ౩.
ఆలోచింపఁబడినది. ౪. నిశ్చయింపఁబడినది.
౫. అనుమతి చేయఁబడినది, ఊహింపఁబడినది,
సూచింపఁబడినది. ౬. సకారణముగా రుజువు
చేయఁబడినది, స్థాపింపఁబడినది.

**విభాష.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పక్షాంతరము,
వికల్పము. ౨. (వ్యాక) ఒక సూత్రము వికల్ప
ముగాఁ బ్రవర్తించుట.

**విభాసిల్లు(లు).** సం. అ. క్రి. ప్రకాశించు.

మ... హేమపటకచ్ఛా సుందరాందోళనంబు
విభాసిల్లు పీఠింగదిక్కునకు నొప్పవెల్వంప...
హరి. పూ. ౮. ౧౧౨.

చ. పలుకఁదలంప దవ్వులగు భారత రామ
కథార్థముల్ విభాసిలఁగ నరంటిపండ్లొ
లిచ్చి చేతికిచ్చినరీతి... కళా. ౧. ౬.

**విభిన్నము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. చీల్పఁబడినది. ౨. గ్రుచ్చఁబడినది, గాయపఱుపఁబడినది, ౩. త్రోసిపుచ్చఁబడినది, చెదరఁగొట్టఁబడినది. ౪. కలఁతనొందినది, కలవరపడినది. ౫. ఇటునటు కదల్పఁబడినది. ౬. ఆశాభంగము కలుగఁజేయఁబడినది, వేఱువేఱయినది. ౭. నానారూపమైనది. ౮. మిశ్రము చేయఁబడినది, కలుపఁబడినది. ౯. స్పష్టపఱుపఁబడినది. ౧౦. కృతఘ్నము, విశ్వాసరహితము.

**విభిన్నుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు.

**విభీత.** సం. వి. ఆ. స్త్రీ. తాండ్రచెట్టు, తాఁడి ‡.

**విభీతకి.** సం. వి. ఈ. స్త్రీ. తాండ్రచెట్టు, తాఁడి. ‡.

**విభీషకము.** సం. విణ. (అ. ఆ. అ.) భయపెట్టునది, బెదరించునది.

**విభీషణము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. మిగుల భయపెట్టునది, దిగులుగొల్పునది. ౨. గద్దించునది; అదరించునది. (మాట.)—వి. అ. న. ౧. మిక్కిలి భయపెట్టుట, వెఱపించుట, ౨. వెఱపు, భయము. —పుం. నలము, కిక్కస. ‡.

**విభీషణుఁడు.** సం. వి. అ. పుం. రావణుని రెండవ తమ్ముఁడు, శ్రీరామభక్తుఁడు.

**విభీషిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. భయము, వెఱపు. ౨. వెఱబొమ్మ, భయపెట్టుట కుపయోగించు సాధనవిశేషము.

**విభువు(ఁడు.)** సం. విణ. (ఉ. భ్వీ. ఉ.) ౧. బలవంతుఁడు ౨. ఘనుఁడు, శ్రేష్ఠుఁడు, ఉత్తముఁడు. ౩. సమర్థుఁడు. ౪. స్థిరుఁడు, జితేంద్రియుఁడు. ౫. సర్వవ్యాపకుఁడు, ఆద్యంతరహితుఁడు. శాశ్వతుఁడు. ౬. (తర్క) సర్వమూర్తద్రవ్యసంయోగి. ౭. దృఢమైనవాఁడు, గట్టివాఁడు.—వి. ఉ. పుం. ౧. ఆకాశము. ౨. స్థలము, అవకాశము. ౩. సమయము, కాలము. ౪. జీవుఁడు. ౫. ప్రభువు, పాలకుఁడు, యజమానుఁడు. ౬. చక్రవర్తి, రాజాధిరాజు. ౭. భృత్యుఁడు, సేవకుఁడు.

**విభూతము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. బయలుదేఱినది. ఉద్భవించినది. ౨. కనఁబడినది, గోచరమైనది. ౩. గొప్పది, బలవత్తరమైనది.

**విభూతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. బలము, శక్తి. ౨. అభ్యుదయము, క్షేమము. ౩. మహత్త్వము, గొప్పతనము. ౪. ఐశ్వర్యము, సంపద, వైభవము. ౫. ధనము, ఆస్తి. ౬. అణిమాద్యష్టసిద్ధులుగల యమానుషశక్తి. (అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము ఇవి యష్టసిద్ధులు.) ౭. గోమయభస్మము.

**విభూష.** సం. వి. ఆ. స్త్రీ. ౧. అలంకారము, నగ. ౨. ప్రకాశము, కాంతి. ౩. చక్కఁదనము, శోభ.

**విభూషణము.** సం. వి. అ. న. అలంకారము. నగ.

**విభూషించు.** సం. స. క్రి. అలంకరించు.

సీ. శోణాచలపతి నూహించి వరరత్న
సంచయంబున విభూషించినట్లు...
శు. సం. ౧. ౪౯.

**విభూషితము.** సం. విశే. (అ. ఆ. అ.) అలంకరింపఁబడినది.

**విభృతము.** సం. విశే. (అ. ఆ. అ.) పోషింపఁబడినది.

**విభేదము.** సం. వి. అ. పుం. ౧. భేదము, విశేషము. పగులఁగొట్టుట. ౨. విడఁదీయుట, విభాగము. ౩. గాయపఱుచుట, ౪. కలఁత, క్షోభము. ౫. వ్యతిరేకము, ప్రాతికూల్యము. ౬. శత్రుత్వము, విరోధము.

**విభేదించు.** సం. స. క్రి. భేదిల్లఁజేయు, పగులుచు.

మ...అశ్వసంతతుల గాత్రంబుల్ విభేదించియున్,... జై. భా. ౨. ౫౬.

**విభేదిల్లు.** సం. అ. క్రి. బ్రద్దలగు, పగులు.

మ...ధూర్తరారాతిబలంబులంబోధివి మూర్ఛిల్లన్ విభేదిల్లఁ గంపితచేష్టన్ దురపిల్ల విహ్వలదశన్ భీతిల్లఁజేసెన్ వెసన్.
హరి. పూ. ౪. ౧౨౬.

**విభ్రంశము.** సం. వి. అ. పుం. ౧. పడిపోవుట, రాలిపోవుట. ౨. క్షయము, నాశము. ౩. ఏటవాలుగానుండు స్థలము.

**విభ్రంశితము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. పడవేయఁబడినది, రాల్పఁబడినది. ౨. పాడుచేయఁబడినది, చెఱుపఁబడినది. ౩. లేకుండఁజేయఁబడినది. ౪. నశింపఁజేయఁబడినది, ధ్వంసముచేయఁబడినది.

**విభ్రమ.** సం. వి. అ. స్త్రీ. వార్ధకము, ముదిమి.

**విభ్రమము.** సం. వి. అ. పుం. ౧. తిరుగుట, ఇటునటు సంచరించుట. ౨. చుట్టుగాఁజుట్టుట. ౩. భ్రమ, పొరపాటు, ప్రమాదము, తప్పు. ౪. అతిత్వర, తొందర, కామవికారముచే మనస్సునఁబుట్టిన తొట్రుపాటు.

శ్లో. చిత్తవృత్త్యనవస్థానం శృంగారాద్వి
భ్రమో భవేత్.

౫. అతిత్వరచే (తొందరచే) నలంకారములను దబ్బిబ్బుగా ధరించుట. ౬. స్త్రీల శృంగారచేష్టావిశేషము. ౭. సౌందర్యము, చక్కఁదనము. ౮. సందేహము, ముందు హానికలుగునని తెలియుటచేఁ గలిగిన భయము. ౯. చాపల్యము, మనసునకుఁ గుదురులేమి. ౧౦. విలాసము, రీతి, విధము.

వ...సింధునాథావరోధంబునఁ బొల్చు క్రీడాశైలంబుల విభ్రమంబుల నభ్రంకషంబులై వెలయు పులినతలంబులు...విప్ర. ౨. ౧౪.

**విభ్రమించు.** సం. అ. క్రి. తిరుగుడుపడు.

సీ...అపగతవ్యాసంగమగుటఁ జీత్కారంబు వెలిగాఁగఁ జక్రంబు విభ్రమింప...
కాశీ. ౧. ౧౨౬.

**విభ్రష్టము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. పడిపోయినది, జాఱినది, రాలినది. ౨. క్షీణించినది, నశించినది, చెడిపోయినది. ౩. అదృశ్యమైనది, అంతర్ధానమైనది. ౪. శూన్యము, విహీనమైనది, లేనిది.

**విభ్రాంతము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. భ్రాంతినొందినది, పొరపడినది, తప్పినది. ౨. మడతపడినది, చుట్టచుట్టుకొన్నది. ౩. త్వరపడినది, తొట్రుపడినది. ౪. కలవరపడినది, క్షోభపడినది. ౫. వ్యాపించినది.

**విభ్రాంతశీలము.** సం. వి. అ. పుం. ౧. వానరము, క్రోఁతి. ౨. సూర్యచంద్రుల బింబము.

**విభ్రాంతశీలుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. తొట్రుపడినబుద్ధిగలవాఁడు. ౨. మత్తెక్కినవాఁడు.

**విభ్రాంతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. పొరపాటు, ప్రమాదము. ౨. మడతపడుట, చుట్టచుట్టుకొనుట. 3. తొట్రుపాటు, కలవరపాటు. ౪. తొందర, అతిత్వర.

**విభ్రాజిల్లు.** సం. అ. క్రి. ప్రకాశించు.

మ...విశ్వాత్ముమాంశకునిం జూచె విలోచన ప్రభలు విభ్రాజిల్ల నిద్దంబులై.
కావ్యా. ౨. ౪౩.

**విభ్రాట్టు.** సం. విణ. (ద్.) భూషణాదులచే.— ప్రకాశించువాఁడు.

**విమతము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. అభిప్రాయభేదముగలది. ౨. పరస్పర విరుద్ధము, భిన్నమైనది. 3. తేలికగాఁ జూడఁబడినది, నిర్లక్ష్యముచేయఁబడినది. ౪. సందేహాస్పదమైనది, సందిగ్ధము.

**విమతి.** సం. విణ. ఇ. బుద్ధిహీనుఁడు, మూర్ఖుఁడు. వి. ఇ. స్త్రీ. ౧. అసమ్మతి, ఒప్పవలలేకుండుట. ౨. అనిష్టము, ఇష్టములేకపోవుట. 3. బుద్ధిహీనత, మూర్ఖత్వము.

**విమతుఁడు.** సం. వి. అ. పుం. శత్రువు, ప్రతిపక్షి.

**విమత్తుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) త్రాగుడు మొదలగువానిచే మిక్కిలి మత్తెక్కినవాఁడు. ౨. క్రొవ్వినవాఁడు, మదించినవాఁడు.

**విమత్సరుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) అసహనములేనివాఁడు, మాత్సర్యములేనివాఁడు.

**విమదుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. మత్తత (మత్తు) లేనివాఁడు. ౨. సంతోషము లేనివాఁడు, దుఃఖి.

**విమనస్కుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. దుఃఖముగలవాఁడు, దుఃఖి, ధైర్యములేనివాఁడు. ౨. పరధ్యానమున నున్నవాఁడు. 3. వ్యాకులపడినవాఁడు, కలఁతనొందినవాఁడు. ౪. అసంతుష్టుఁడు, మనస్సువిఱిగినవాఁడు. మనస్సుమాఱినవాఁడు.

**విమన(స్స)సుఁడు.** సం. విణ. (స్.) = విమనస్కుఁడు.

**విమనీకృతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. అసంతుష్టుఁడు, మనస్సువిఱిగినవాఁడు. ౨. మనస్సుమాఱినవాఁడు. 3. దుఃఖితుఁడు, దుఃఖముగలవాఁడు.

**విమను(నస)ఁడు.** సం. విణ. స్. దుఃఖితమనస్కుఁడు.

తరలము. (ధృతరాష్ట్రుఁడు) ... ప్రజాక్షయకారణంబని తద్భయమున్ భయమందుచున్, విమనుఁడై పడియుండె హా యని వెచ్చనూర్చుచు విన్నఁడై.
భార. సభా. ౨. 3౧౦.

**విమన్యువు(ఁడు).** సం. విణ. ఉ. ౧. కోపము లేనివాఁడు. ౨. దుఃఖములేనివాఁడు.

**విమర్దకము.** సం. వి. అ. పుం. ౧. విసరుట, గుండచేయుట. ౨. సువాసనవస్తువులను నలుపుట, చూర్ణముచేయుట. 3. గ్రహణము. ౪. సూర్యచంద్రుల కలయిక. ౫. నాశము, ధ్వంసము.

**విమర్దన.** సం. వి. అ. స్త్రీ. ౧. గుండచేయుట, పొడిచేయుట, ౨. నలుపుట, రాపిడి, సంఘర్ష

ణము, ఒరయిక, 3. సహింపఁజేయుట, సంహరించుట. ౪. గ్రహణము.

**విమర్దనము.** సం. వి. అ. న.=విమర్దన.

**విమర్దము.** సం. వి. అ. పుం. ౧. నలఁగఁగొట్టుట, చూర్ణముచేయుట. ౨. నలుపుట, రాపిడి, సంఘర్షణము, ఒరయిక 3. (ఆలింగనమున) దగ్గఱఁగ నదుముట. ౪. పాడుచేయుట, చెఱుచుట. ౫. స్పర్శము, సంపర్కము, అనుబంధము. ౬. తైలము మొదలగునవి దేహమున మర్దించుట, మర్దనచేయుట, ౭. యుద్ధము, పోరు. ౮. నాశము, ధ్వంసము. ౯. సూర్యచంద్రుల కలయిక. ౧౦. గ్రహణము. ౧౧ విసుగు.

**విమర్దితము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. నూఱఁబడినది, గుండచేయఁబడినది. ౨. రాపిడి పెట్టఁబడినది, సంఘర్షింపఁబడినది. 3. పూయఁబడినది, మర్దింపఁబడినది, రాచఁబడినది.

**విమర్శనము.** సం. వి. అ. న. =విమర్శము.

**విమర్శము.** సం. వి. అ. పుం. ౧. పర్యాలోచనము, సమీక్షణము, పరిశీలనము. ౨. హేతువాదము, యుక్తియుక్తముగ వాదించుట. 3. పరస్పర విరుద్ధమయిన తీర్పు. ౪. సందేహము, ఎటును దోఁచనిస్థితి. ౫. పూర్వసుకృతదుష్కృతములచేఁగలిగిన సంస్కారము, వాసన. ౬. నాటకాంగములగు పంచసంధులలో నొకటి. (నాల్గవది.)

**విమర్శించు.** సం. స. క్రి. పరిశీలించు.

శా. మహాత్మ్యంబులు తేజముల్ విభవసంపత్తుల్
విమర్శింపఁగా, నోహో భేదములేదు...
వరా. ౧౦. ౮.

**విమర్షము.** సం. వి. అ. పుం. పర్యాలోచనము, సమీక్ష. ౨. ఓర్పులేమి. 3. అసంతుష్టి. ౪. నాటకాంగములగు పంచసంధులలో నొకటి.

**విమలదానము.** సం. వి. అ. న. దేవతకిచ్చెడి యుపహారము, దేవతాబలి.

**విమలమణి.** సం. వి. ఇ. పుం. స్ఫటికము.

**విమలము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. మచ్చలేనిది, కలంకములేనిది. ౨. స్వచ్ఛమైనది, పరిశుద్ధమైనది, మురికిలేనిది. 3. తెల్లనిది.— న. ౧. వెండిపూఁత, ౨. అభ్రకము.

**విమాంసము.** సం. వి. అ. పుం., న. అపరిశుద్ధమాంసము, కుక్కమాంసము. మొ.

**విమాత.** సం. వి. ఋ. స్త్రీ. సవతితల్లి.

**విమాతృజుఁడు.** సం. వి. అ. పుం. సవతితల్లి కొడుకు.

**విమాథము.** సం. వి. అ. పుం. ధ్వంసము, సంపూర్ణనాశనము.

**విమానన.** సం. వి. ఆ. స్త్రీ. అగౌరవము, అవమానము.

**విమానము.** సం. వి. అ. పుం., న. ౧. అగౌరవము, అవమానము. ౨. పరిమాణము, కొలఁత. 3. దేవతలాకాశమున్దఁదిరిగెడిరథము. ౪. వాహనము, యానము. ౫. ఏడంతస్తుల మేడ. ౬. గుఱ్ఱము.

**విమానరాజు.** సం. వి. అ. పుం. విమానము నడుపువాఁడు.

**విమానితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) అవమానింపఁబడినవాఁడు.

**విమార్గిగ.** సం. వి. ఆ. స్త్రీ. చెడునడవడిగల స్త్రీ, కులట.

**విమార్గగామి.** సం. విణ. (న్. నీ. న్.) దుర్మార్గమున సంచరించువాఁడు, చెడ్డపనులు చేయువాఁడు.

**విమార్గణము.** సం. వి. అ. న. వెదకుట.

**విమార్గము.** సం. వి. అ. పుం. ౧. చెడ్డదారి, పాడుత్రోవ. ౨. దుర్నీతి, దుర్మార్గము. ౩. చీఁపురు.

**విమిశ్ర (శ్రిత)ము.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలికలసినది.

**విముక్తకంఠుఁడు.** సం. విణ. (అ. ఈ. ఆ. అ.) ఎలుఁగెత్తి యేడ్చువాఁడు, బిగ్గఱగా నేడ్చువాఁడు.

**విముక్తము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. విడువఁబడినది, స్వేచ్ఛగా వదలివేయఁబడినది. ౨. పరిత్యజింపఁబడినది. ౩. (చెఱ మొదలగువానినుండి) విడుదల చేయఁబడినది. ౪. ప్రయోగింపఁబడినది, విసరఁబడినది. (బాణము.) ౫. అవకాశ మొసగఁబడినది.

**విముక్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. విడుదల, విమోచనము, ౨. ఎడఁబాటు, విడివడుట. ౩. మోక్షము, కైవల్యము.

**విముక్తుఁడు.** సం. విణ.* (అ. ఆ. అ.) ఎడఁబాసినవాఁడు.

ఆ. సతి విముక్తయయినఁ బతికిఁ బునర్దార,
సంగ్రహంబు సేఁత శాస్త్రమతము,...
భార. ఆది. ౬. ౨౫౫.

**విముఖుఁడు.** సం. విణ. (అ. ఈ. ఆ. అ.) ౧. త్రిప్పఁబడిన ముఖముగలవాఁడు. పెడముఖముపెట్టినవాఁడు. ౨. వెనుకముఖమయినవాఁడు, మరలినవాఁడు. ౩. ప్రతికూలుఁడు, వ్యతిరేకమైనవాఁడు. ౪. ప్రతిఘటించినవాఁడు, ఎదుర్కొన్నవాఁడు. ౫. (సమాసాంతమున) శూన్యుఁడు, లేనివాఁడు.

**విముగ్ధుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. బొత్తిగఁ దెలివిలేనివాఁడు. ౨. తొట్రుపడినవాఁడు, వ్యాకులపడినవాఁడు.

**విముద్రము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ముద్దరలేనిది, ముద్రవేయఁబడినది. ౨. విరిసినది, వికసించినది. (పువ్వు.)

**విమూఢుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. తెలివిమాలినవాఁడు, కలవరపడినవాఁడు, వ్యాకులుఁడైనవాఁడు. ౨. చెఱుపఁబడినవాఁడు, చెడుత్రోవకుఁ ద్రిప్పఁబడినవాఁడు. ౩. బుద్ధిమంతుఁడు.
వి. అ. పుం. దేవయోనివిశేషము.

**విమృదితము.** సం. విణ. (అ. ఆ. అ.) వినుర్దితము.

**విమృష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) చక్కఁగ నాలోచింపఁబడినది, పరిశీలింపఁబడినది.

**విమోక్షణ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. విడుదల సేయుట, స్వేచ్ఛగా విడుచుట. ౨. ప్రయోగించుట, (బాణములను) విడుచుట. ౩ పరిత్యజించుట, వదలిపెట్టుట. ౪ గ్రుడ్లుపెట్టుట.

**విమోక్షణము.** సం. వి. అ. న. విమోక్షణ.

**విమోక్షము.** సం. వి. అ. పుం. ౧. విడుదల, విముక్తి. ౨. (బాణాదులను) ప్రయోగించుట, విడుచుట. ౩. మోక్షము, ముక్తి.

**విమోచనము.** సం. వి. అ. న. ౧. వదులుచేయుట, విప్పుట. ౨. విడుదల, స్వేచ్ఛగా విడుచుట. ౩. ముక్తి, మోక్షము.

**విమోహనము.** సం. విశే. (అ. ఆ. ఈ. అ.) ౧. మోహింపఁజేయునది, మరులుకొలుపునది.- వి. అ. పుం., న. ఒక నరకభాగము.-

న. ౧. పాడుచేయుట, మంచిత్రోవనుండి తప్పించుట. ౨. మరులుకొలుపుట, మోహింపఁజేయుట.

**విమోహము.** సం. వి. అ. పుం. మిక్కిలి మోహము.

**విమోహించు.** సం. అ. క్రి. అజ్ఞానముపొందు.

వ...ఎంతేని హీనబుద్ధులు విమోహింతురట్టి ధర్మాధర్మంబు లెఱుంగు విద్వాంసుల నుపాసించి... భార. అర. ౩. ౩౪౮.

వ... రూపయౌవనధనవిభవప్రియసంవాసంబు లనిత్యంబులగుట నందు బుద్ధిమంతులు విమోహింప రనిన... భార. అర. ౧. ౨౯.

**విమోహితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి మోహించినవాఁడు.

**విమ్లాపనము.** సం. వి. అ. న. ౧. అలసట తీర్చుట, సేదతీర్చుట. ౨. పరిశుద్ధిచేయుట. ౩. వాడించుట, కాంతిహీనముగాఁ జేయుట.

**వియచ్చరుఁడు.** సం. వి. అ. పుం. ఖచరుఁడు, మింటితెరువరి.

**వియతి.** సం. వి. ఇ. పుం. పక్షి.

**వియత్తు.** సం. వి. త్. న. ఆకాశము, మిన్ను.

**వియద్గంగ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఆకాశగంగ, మిన్నేఱు. ౨. నక్షత్రవీథి.

**వియద్భూతి.** సం. వి. ఇ. స్త్రీ. చీఁకటి, అంధకారము.

**వియన్మణి.** సం. వి. ఇ. పుం. సూర్యుఁడు.

**వి(యా)యమము.** సం. వి. అ. పుం. అడ్డగింత, నిరోధము, ౨. బాధ, నొప్పి, దుఃఖము, హింస. ౩. సమాప్తి, ముగింపు.

**వియాతుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. ధృష్టుఁడు, ధైర్యముగలవాఁడు. ౨. సిగ్గుమాలినవాఁడు, నిర్లజ్జుఁడు. ౩. దుష్టుఁడు, దుర్మార్గుఁడు.

**వియుక్తము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. వేఱుచేయఁబడినది, ఎడఁబాపఁబడినది. ౨. త్యజింపఁబడినది, విడిచిపెట్టఁబడినది. ౩. రహితము, శూన్యమైనది. ౪. తక్కువపడినది, లోపము గలది.

**వియుతము.** సం. విశే. (అ. ఆ. అ.) విడిపోయినది, ఎడఁబాటు నొందినది. ౨. శూన్యమైనది.

**వియోగము.** సం. వి. అ. పుం. ౧. ఎడఁబాటు, విడిపోవుట. ౨. లేకపోవుట, సమత్వమున లేకపోవుట. ౩. వ్యవకలనము, తీసివేఁత.

**వియోగి.** సం. విశే. (న్. నీ. న్.) ౧. విరహము నొందినవాఁడు, ఎడఁబాసినవాఁడు. ౨. సమత్వమునలేనివాఁడు.— వి. న్. పుం. రాజహంసము.

**వియోగించు.** సం. స. క్రి. విడఁదీయు.

వ...అట్టి విజ్ఞానాత్మను దృశ్యాంశంబువలన వియోగించి క్షేత్రజ్ఞునియందుఁ బొందించి... భాగ. ౧. ౩౨౮.

**వియోగిని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ప్రియునితో విరహమునొందిన స్త్రీ, ప్రియునెడఁబాసిన స్త్రీ, విరహిణి. ౨. (ఛంద) వృత్తభేదము.

(బేసిపాదములందు స, స, జ గణములు నొక గురువును, సరిపాదములందు స, భ, ర

గణములు నొక లఘువు నొక గురువునుగల వృత్తము.)

**వియోజితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. విడఁదీయఁబడినది. ౨. విడిచిపెట్టఁబడినది, రహితమైనది, శూన్యమైనది.

**వియోని.** సం. వి. ఇ., ఈ. స్త్రీ. ౧. బహువిధ జన్మము. ౨. జంతుగర్భము. ౩. నీచజన్మము.

**వియ్యంకుఁడు.** వి. (√ వియ్యము.) వియ్యమందినవాఁడు. (పెండ్లికొమార్తెతండ్రియుఁ బెండ్లికొమారునితండ్రియు నొకరికొకరు వియ్యంకులు.)

సీ...వియ్యంకుఁడనఁగను వియ్యమనఁగఁ,

గీ. దత్పితృమిథోభిధానమై తనరుచుండు...

ఆం. భా. ౨. ౧౧౪.

**వియ్యంకురాలు.** వి. (√ వియ్యము.) వియ్యపురాలు. (పెండ్లికుమార్తెతల్లియుఁ బెండ్లికుమారునితల్లియుఁ బరస్పరము వియ్యంకురాండ్రగుదురు. (శ. ర., బ్రౌ.)

**వియ్యఁపురాలు.** వి. (√ వియ్యము.) వియ్యంకురాలు, వియ్యమందినది.

గీ...అమరు వియ్యంపురాలు వియ్యంపుసాని, నాఁగను బరస్పరము తజ్జననులపేళ్లు.

ఆం. భా. ౨. ౧౧౪.

**వియ్యఁపుసాని.** వి. (√ వియ్యము.) వియ్యఁపురాలు.

గీ...అమరు వియ్యంపురాలు వియ్యంపుసాని, నాఁగను బరస్పరము తజ్జననుల పేళ్లు.

ఆం. భా. ౨. ౧౧౪.

**వియ్యమం(య్యాలం)దు.** అ. క్రి. (వియ్యము + అందు.) ౧. వైవాహికసంబంధము చేయు.

క. నీతోడ వియ్యమందం, జేతోగతి నాసఁ జేసి చెచ్చెర నిట్లై, నేతెంచితి మత్ప్రార్థన, బ్రాఁతిగఁ జేకొనకయునికి పాడియె నీకున్.

భార. అర. ౭. ౧౯౪.

తే...కావున నతనితోడ, వియ్యమందఁగఁ దగు... నీలా. ౨. ౯.

౨. సంబంధము కలిగియుండు.

సీ. పాటలీవకుళచంపకసౌరభముతోడ విచికిలామోదంబు వియ్యమంద,...

కాశీ. ౧. ౯౧.

తే.గీ...,వీరశృంగారరసములు వియ్యమంద..

దశా. ౪. ౪౭.

గీ. మేనుఁదీవెయు నలఁతయు మేళవింప, వెలఁది కరమును జెక్కును వియ్యమంద...

విక్ర. ౭. ౬౦.

౩. సామ్యమునొందు.

సీ. చటులదంష్ట్రికోటిజటిలాంశుమండలి విపులార్కదీప్తితో వియ్యమంద...

భా. రా. యుద్ధ. ౧౯౯౫.

తే. జలకణంబులుఁ జెమటలుఁ జెలిమిసేయ, నళిరవంబులుఁ బలుకులు నసఁగిపెనఁగ, వెన్నెలలుఁ జిన్నినగవులు వియ్యమందఁ, జల్లగాడ్పులు నూర్పులు సరసమాడ.

వరాహ. ౪. ౬౫.

క. అయ్యిరువురు గద లడరఁగ, బ్రయ్యంగ్రుయ్యంగ వేయురవమున జలధుల్, వియ్యాలందఁగ మదమున, డయ్యక పోరిరి విశంకట బలోద్భటులై.

ఉ. హరి. ౩. ౭౨.

**వియ్యము.** వి. వియ్యంకుఁడు.

తే. అర్జునుని వియ్య మనిరొయుసంతకంటెఁ, గడవఁ బెంపు నాకెయ్యది...

భార. విరా. ౫. ౩౬౫.

సీ. పంచమహాయజ్ఞపరు మేనమామను వియ్యము
నురుతపోవిభవు శిష్యు... గీ. మాతృపితృ
భర్తృఁ గారుణ్యమయు గుణాఢ్యు, నిర్మలా
చారసంపన్ను నియమహృదయుఁ, బైతృక
శ్రాద్ధమునకును బ్రాహ్మణార్థ, మర్థిఁ
గావింపవలయును బార్థివేంద్ర.
వి. పు. ౪. ౨౫౫.

తే. కొడుకుఁ గోడలి రావించి కోటవెలికి,
వియ్యమని శిష్యుఁడని కాచి విడిచె నతని,
సీరపాణితో రాజులు చెనయువారె...
ఉ. హరి. ౧. ౯.

౨. వియ్యఁపురాలు.

గీ. నాకు నీవు వియ్యమవు మంజువాదిని...
దశకు. ౧౨. ౨౫.

౩. చుట్టము.

తే. అనుజతనుజులు జెలులు వియ్యములు నడుగు,
మాలిషోదురు నీకుఁగా మనుజనాథ...
భార. ఉద్యో. ౩. ౩౪౧.

తే. ...నను నీవు గూడియున్న, నతఁడు నినుఁ
గాచు వేడ్క వియ్యంబ వనుచు,...
భా. రా. అర. ౧౩౯.

తే. అనుచు నెయ్యంపు వియ్యంబు లల్లనల్ల,
సరసనర్మోక్తిచాతుర్యసౌష్ఠవముగ, గోష్ఠి
సలిపిరి తమలోనఁ గొంతపొద్దు, భోజనా
గారపర్యంతభూములందు.
నైష. ౬. ౧౧౦.

చ. చెలువముఁదాల్చి త న్నవయఁజేరిన శాగిణి
-రావణస్వసన్, నలువురు నవ్వ నత్తెఱఁ
గొనర్పక యేలిన వియ్యమై యతం, డలు
గఁడు సీత కిట్టి తలఁ పొత్మఁదలంపక యా
యమ నవ్విథా, కలహమునం దనుందొలఁగు
కాఁకకు నాఁకకు లోనుసేయఁడే.
ఆము. ౫. ౪౯.

౪. చుట్టరికము.

క. దయ్యమెఱుంగున్ వారల, నెయ్యంబులు
మక్కువలును విజమరితనముల్, వియ్యము
లును నెడసందిని, బయ్యెద కొం గడ్డమైనఁ
బ్రాణము వెడలున్. భార. ౯. ౪౦౧.

తే. తోడికోడలు పగచాటి వీడనాడు, నాఁగడ
మొనర్తు రెపుడు వియ్యములవారు.
(వియ్యములవారు=బంధుగులు.)
శుక. ౩. ౨౯౪.

౫. వైవాహిక సంబంధము.

క. దేవతలఁగొలిచి ధాత్రీ,దేవతలకు నిష్టధనము
ధీరతభక్తిన్, నీ వియ్యం బూర్వంబున,
నీవియ్యం బమరెఁగాక యిది యల్పంబే.
సీమం. ౩. ౪౯.

౬. వినయము.

వ. వెండియు న మ్మహీమండలాఖండలుండు
రాజ్యంబు పాలించుచు గురుజనంబుల యెడ
వియ్యంబును సామంతులయెడ నెయ్యం
బును... కృ. శకుం. ౧. ౧౪.

జ: వియ్యంకుఁడు, వియ్యంకురాలు, వియ్యఁపు
రాలు, వియ్యఁపుసాని, వియ్యమందు.

విరఁబడు. అ. క్రి. (విరియన్ + పడు.) విరియఁ
బడు. (స్వార్థమందు) ౧. విరియు, వికసించు.
౨. విజృంభించు.

సీ..., ఊరక విరఁబడు మారనారీచంబు గుండ
గంబునఁ దన్ను ధూళిఁగలయు,...
వరాహ. ౪. ౨౧.

(పై రెండర్థముల కిదియే యుదాహరణము.)

విరక్త. సం. వి. ఆ. స్త్రీ. దురదృష్టవంతురాలగు
స్త్రీ.

విరక్తము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. మిక్కిలి
యెఱ్ఱనిది. ౨. రంగుపోయినది, వివర్ణమైనది.
౩. మనస్సువిఱిగినది, అసంతుష్టమైనది.
౪. విషయసుఖము లపేక్షింపనిది, ప్రపంచ

సంబంధమును విడిచినది. ౫. ఉద్రేకముతోఁ గూడినది.

**విరక్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. మనస్సువిఱుగుట, అసంతుష్టి, ౨. విరోధము,అనిష్టము. ౩. విషయ సుఖములయం దపేక్షలేమి, ప్రపంచసంబంధ మును విడుచుట.

**విరచన.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఏర్పాటు. ౨. కూర్చుట, కల్పన. ౩. నిర్మించుట, సృజిం చుట. ౪. గ్రంథరచన.

**విరచనము.** సం. వి. అ. న. = విరచన.

**విరచించు.** సం. స. క్రి. కూర్చు, రచించు.

క. ఇ మ్మార్కండేయపురాణ మ్మఖిలహితమ్ము
గాఁగ నా నేర్చుగతిన్, నెమ్మి విరచిం
చెదను... మార్కం. ౧. ౨౩.

**విరచితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఏర్ప ఱుపఁబడినది, చేయఁబడినది. ౨. కూర్పఁబడి నది, కల్పింపఁబడినది. ౩. గ్రంథముగాఁ జేయఁబడినది. ౪. అలంకరింపఁబడినది. ౫. ధరిం పఁబడినది. ౬. తాఁపఁబడినది, ఖచితము చేయఁ బడినది.

**విరజ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. దూర్వాతృణము, గఱిక. ✝. ౨. నహుషుని భార్య.

**విరజము.** సం. విణ. (అ. ఆ. అ.) దుమ్ములేనిది, రజోగుణరహితము, కామక్రోధాది వికారము లేనిది.

**విరజస్క.** సం. వి. ఆ. స్త్రీ. ఋతుస్రావము లేని స్త్రీ, ముట్లుడిగిన స్త్రీ.

**విరజస్కము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ధూళిలేనిది. ౨. కామక్రోధాది గుణములు లేనిది. ౩. ఆర్తవములేనిది.

**విరజాజి=విరజాది.** వి. నవమాలిక, ఒకజాతి జాజి. ✝.

సీ. విరజాజివిరులపై విహరించు విహరించి
సొబగు నెత్తావులు చూఱలాడు...
విక్ర. ౧. ౯౫.

సీ. ఒరపుగా విరజాజిసరులతో సిగవైచి లాగి
యా బురుసాకుశాయిఁ బెట్టి...
దశా. ౮, ౨౫౦.

సీ. విరజాజివిరుల రోవరులముంగిటచాయ
నల్లిబిల్లిగ ద్రాక్ష లల్లుకొనిరొ,...
భాను. ౨. ౬౮.

**విరజాది=విరజాజి.** వి. నవమాలిక. ✝. (శ. ర.)

**విరజుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) కామ క్రోధాదిగుణవికారములులేనివాఁడు.
వి. అ. పుం. విష్ణువు.

**విరటుఁడు.** వి. (సం. విరాటః) విరాటరాజు.

చ. విరటుఁడు నిన్ను నెప్డుఁ బదివేవురముందట
జెప్పు బాహువిస్ఫురితుఁడు శౌర్యశాలి
కులభూతి విశేషవిధాయకుండు భూభరణ
విశారదుండు జనభవ్యతపఃఫలసంభవుండు
గాత్రర పరిరక్షకుం డనుచు దానికి నీడుగఁ
జేయు మిత్తరిన్. భార. విరా. ౪. ౮.

ఆ. వె. ఇమ్ము దప్పువేళ నెమ్మొలన్నియుఁ దప్పి,
కాలమొక్కకీతిఁ గడువవలయు, విజ
యుఁ డనువుదప్పి విరటునిఁ గొలువఁడా,
విశ్వదాభిరామ వినుర వేమ.
వేమ. ౩ భా. ౧౫౫.

**విరణము.** సం. వి. అ. న. వీరణము, అవురుగడ్డి.

**విరతము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. విర మించినది, మానినది. ౨. ఆఁగినది, నిలిచినది. ౩. సమాప్తమైనది, ముగిసినది.

**విరతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. విరామము, చాలించుట. ౨. (మధ్యమమున) నిలుపుట, తెఱపి, అవకాశము. ౩. విషయసుఖములందు దాపేక్షలేమి. ౪. (ఛంద) పద్యపాదమున గ్రుక్కత్రిప్పుకొనుటకై నిలుపు తావు.

**విరమము.** సం. వి. అ. పుం. ౧. విరామము, ఆఁపుదల. ౨. సూర్యాస్తమయము.

**విరమించు.** సం. అ. క్రి. విశ్రాంతినిబొందు, ఊడుగు, చాలించు. (శ.ర.)

**విరమోపకము.** వి. ఉత్సాహము.

వ...వీరభటోత్తము లాత్మీయాంతరంగాపూరితాపారవీరరసంబు వెల్లిగొలుపునట్లు విరమోపకంబునఁ దమతమ నిశ్చయించిన వీరవృత్తి ప్రకటించుచు...

కు. సం. ౧౧. ౬౧౧.

**విరల(ళ)జానుకుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) దొడ్డికాళ్ళవాఁడు.

**విరలద్రవ.** సం. వి. ఆ. స్త్రీ. పలుచనిజావ.

**విరలము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. సందులు గలది, దట్టముకానిది, పలుచనిది. ౨. సుకుమారమైనది, నాజూకైనది. ౩. వదులైనది, దృఢముకానిది, ౪. తఱచుగాలేనిది, క్వాచిత్కము, అరుదైనది. ౫. అల్పము, కొంచమైనది. ౬. దేశకాలములచే దూరమైనది, దూరస్థము.—వి. అ. న. దధి, పెరుఁగు. (వాచ.)

**విరలి-విరాళి.** వి. వలపు. (చూ. విరలిగొను.)

జ: విరలిగొను.

**విరలిగొను-విరాలిగొను.** అ. క్రి. (విరలి + కొను.) మోహపడు, వలచు.

పీ. కలయిచ్చె నరమేని కలికికి...

ఆ. వె...మధుపీడంబనమున మగలును మగువలు, విరలిగొనిరి మదనశరవశమున.

కు. సం. ౪. ౪౬౯.

సీ...గీ. తన మహత్త్వంబు దలఁపక తరుణి పొందు,వడయఁ గీడ్పడి తేఁకువ వాపఁ దలఁచు, భావజాస్త్రాభిహతి మహాదేవుఁ డొక్క, వ్రేలిమిడిఁ బెంపుసెడి కడు విరలిగొనియె. కు. సం. ౫. ౫౨౪.

**విరళి.** విశ. విశాలము. (శ. ర.)

**విరవాజి-విరవాది.** వి. నవమాలిక. ‡. (శ.ర.)

**విరవాది-విరవాజి.** వి. నవమాలిక. ‡.

రగడ...మితిలేని తేనె నామెతఁజేసె విరవాది, యితరలతికల మరగి యేగునది పరవాది...

మను చ. ౩. ౧౪.

వ్య. రగడ...వాఁడులేటికి రారె యేరా నెఱవాదు లౌదురు చాలు నీచల,పొదితనములు మాని యీ విరవాజియలరులు గోయఁ డిచ్చుట,... కిరా. ౩. ౫౨.

సీ...గీ...విరవాదియన నవమల్లికాఖ్య వఱలు...

ఆం. భా. ౨. ౫౨.

**విరవాయు.** అ. క్రి. (క. విర్=రెండు.) రెండుగా చీలు.

చ. వనితకుచాగ్రులం బొడమి వాటపుఁ బొక్కిలినిండి యుబ్బి జాఁ,గ్గొని కటిచక్రమాని మెఱుఁగుందొడలై విరవాసివచ్చు నూ,తనకిరణామృతౌఘముల దండహలాంకపదోత్థితంబులై, మను నుడివోనిగర్భకలమంబులుగావె లతాంగిజంఘికల్.

వసు. ౨. ౭౩.

(విరివాని — శ. ర. పా.)

**విరవిర[1].** వి. ౧. త్రెళ్లుటయందగుధ్వని కనుకరణము.

చ..., విరవిరఁ ద్రెళ్ళి నొవ్వఁ దరివిహ్వలుఁడై దశకంధరుండు ఘోరరవము లోకసంభ్రమకరం బగునట్లుగఁ బెల్చఁగూసె...
నిర్వ. ౪. ౯౩.

౨. కరఁగుటయందగు ననుకరణము.

సీ...విమలబంధుస్వాంతవిధుకాంతములఁ గటాక్షజ్యోత్స్నఁ విరవిరఁ గరఁగుచుండ...
వేం. పంచ. ౪. ౩౪౫.

౩. (ఎండ) కాయుటయందగు ననుకరణము.

ద్వి. వెలిసె వానలు గాడ్పు విడిదప్పె నెండ, విరవిరయై కాసె వెలుపయ్యె దెసలు.
ద్వి. భాగ. ౨. ౩౨. పా.

విరవిర²=విలవిల. వి. (సం. విహ్వలః) విహ్వలత. (చూ. విరవిరవాటు, విరవిరవోవు.)

విరవిర³=బిరబిర. క్రి. విశే. మిక్కిలిత్వరితముగా.

ద్వి. ధరణీశు నాజ్ఞచేఁ దలవరు లిట్లు, విరవిర గొని రాజవీథి నేతేర, నింతింత చేటువ యుండ్లిండ్లవారు, అంతంత వెఱఁగంది యరు దెంచి రంత...
ద్వి. శ. సా. ౨. ౫౩ పా. ౯. పం.

విరవిరవాటు. అ. క్రి. (విరవిర² + పాటు.) విరవిరపోవు, భయాదులచే అవయవములు స్వాధీనత తప్పు.

చ. వరుణుని పాశముం ద్రిదశవల్లభు వజ్రముఁ గాలు దండమున్, సురల సమస్తశస్త్రములుఁ జూచినవాఁడనికాదె యీరఘూత్తరు విశిఖంబు లంత బెడిదంబులు గావవి నాకు నంచు మై, విరవిరవాటుఁ జే సడలి విల్లువడం గని రాముఁ డిట్లనున్.
భా. రా. యుద్ధ. ౭౫౦.

విరవిరవోవు=విలవిలవోవు. అ. క్రి. (విరవిర² + పోవు.) ౧. విహ్వలతనొందు.

చ. చరణములుం గరంబులును సంచలభావము నొందఁజొచ్చె మేన్, విరవిరవోవుచున్న యది విహ్వలమయ్యె మనంబు...
భార. కర్ణ. ౧. ౧౫౮.

చ...అ, సరసిజనాభనందను విశాలభుజాంతరముం బగిల్చినన్, విరవిరవోయి మేను నిడువెంద్రుకవెట్టఁగ...
భాగ. ౧౦. స్కం. ఉత్త. ౭౩౨.

చ...సూతునిఁ ద ద్రథఘోటకంబులన్, విర విరవోవ నేయుటయు నీరజనేత్రుఁడు చిన్ననవ్వుతో... భోజసుతా. ౪. ౧౩౪.

౨. విరిసిపోవు.

చ. ఖురముల నేలఁ ద్రవ్వుచు నకుంఠితవాల సమీరణమ్ములన్, విరవిరవోయి మేఘములు వివ్వ విషాణము లొడ్డికొంచు దు, స్తరతరమూర్తియై వృషభదైత్యుఁడు గన్నుల నిప్పులొల్కఁగా, దురదురవచ్చి...
భాగ. ౧౦. స్కం. పూ. ౧౧౪౨.

చ. ఉరుకుచ డెంద మెంతవ్రుదువో మఱితియ్యనితుంటవింట నే, విరవిరవోవునాఁటఁ గొని పెన్నెఱి గొజ్జఁగతూపుచేత నచ్చెరువుగఁ బొంచి కంటికి దిసింపనివాఁ డపుడేసి... సారంగ. ౨. ౩౮.

విరసము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. రుచిలేనిది. ౨. అనిష్టమైనది, ఇష్టముకానిది. ౩. క్రూరము, నిర్దయమైనది.—వి. అ. పుం. ౧. బాధ, నొప్పి. ౨. ద్వేషము.

సీ. రోహణాచలమను రూఢిగాక...వింధ్యాద్రితో సురల్ విరసమొత్తిరిగాక గ్రహచక్రమది యింతగడచియున్నైనఁ ...
కు. సం. ౩. ౨౪౬.

క. సరసము విరసముకొఱకే, పరిపూర్ణసుఖంబు లధికబాధలకొఱకే,... సు. శ. ౧౦౩.

**విరసించు.** సం. అ. క్రి. ౧. ద్వేషించు, విరోధపడు.

సీ. కలనైన నెదిరింపఁ దలఁకు ముల్లోకంబు విరసించి యేతూరుఁ డొరయు నతని,...
జై. భా. ౬. ౯౯౧.

క. విరసించినచో రాజులు, తురమున నెవ్వారినైనఁ దునుముదు రలుకన్, గురు నగ్రజు ననుజున్మోహారమున వధియింపఁ డోటు హరిసుతుఁ డలుకన్. (వేం. పంచ. ౧. ౪౯౫.)

౨. వైరస్యముచూపు, విరోధించు.

సీ. సతి నీవు నేకవిచారంబువారలై విరసింపనేల రౌహిరమరాళ. భాను. ౨. ౫౬.

**విరహము.** సం. వి. అ. పుం. ౧. విడిపోవుట, ఎడఁబాటు. ౨. నాయికానాయకుల యెడఁబాటు, వియోగము. ౩. తనపటాలము విడిచిపోవుట. ౪. సమతుమున లేమి, అభావము. ౫. విప్రలంభశృంగారము. ౬. ఏకాంతత, ఒంటరితనము.

**విరహి.** సం. విణ. (న్. ఈ. న్.) ౧. విరహముగలవాఁడు, ప్రియురాలి నెడఁబాసినవాఁడు. ౨. ఒంటరిగా నున్నవాఁడు, ఏకాంతముగా నున్నవాఁడు, ఏకాకి.

**విరహిణి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ప్రియునెడఁబాసిన స్త్రీ. ౨. భృతి, జీతము, కూలి.

**విరహితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. విడువఁబడినది, విడిచిపెట్టఁబడినది. ౨. ఎడఁబాపఁబడినది. ౩. (సమాసమున) ఒంటరిగానున్నది. ౪. శూన్యము, లేనిది.

**విరహోత్కంఠిత.** సం. వి. ఆ. స్త్రీ. శృంగారనాయికలలో నొకతె; వేళకు నాయకుఁడు రాకుండుటచే విరహముచేతఁ దహతాపపడు నాయిక.

**విరాకులవిత్తు.** విణ. (విరియు + ఆకులు + విత్తు.) చెడినది.

చ. అలవడ వేదమార్గము విరాకులవిత్తుగ సజ్జనాళి వి,చ్చలవిడిఁ జెంతలందిరుగుజాడకుఁ దెచ్చితి మెల్లచోట్ల నక్కలియును నేను...
ప్రబోధచం. ౨. ౪౫.

**విరాగము.** సం. వి. అ. పుం. ౧. రంగుమాలుట, వివర్ణత. ౨. మనస్సువిఱుగుట. ౩. అసంతుష్టి, అనిష్టము, అనురాగములేమి. ౪. విషయసుఖములం దపేక్షలేమి, విరక్తి.

**విరాగుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) విషయేచ్ఛారహితుఁడు.

**విరాజమానము.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి ప్రకాశించునది.

**విరాజము.** సం. వి. అ. పుం.=విరాట్టు.

**విరాజితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రకాశించినది, ప్రకాశింపఁజేయఁబడ్డది. ౨. స్పష్టపఱుపఁబడినది.

**విరాజిల్లు.** సం. అ. క్రి. ప్రకాశించు.

క. పుడమికి వితస్తిమాత్రపుఁ, బాడువున నాక్షేత్రరాజము విరాజిల్లున్...
పాండు. ౨. ౨౨౨.

**విరాటక(జ)ము.** సం. వి. అ. పుం. ఒక విధమైన నిక్కృష్టజాతివజ్రము.

**విరాటపర్వము.** సం. వి. న్. న. మహాభారతమున నాల్గవపర్వము.

**విరాటము.** సం. వి. అ. పుం. ౧. భరతఖండమునందలి యొకదేశము, మత్స్యదేశము.

**విరాటుఁడు.** సం. వి. అ. పుం. విరాటదేశాధిపతి, మత్స్యదేశపురాజు. (పాండవులు వీని

కొలువులోనుండి యజ్ఞాతవాసము గడపిరి. ఇతని కూఁతురగు నుత్తరను అభిమన్యుఁడు పెండ్లాడెను. ఉత్తర కుమారుఁడగు పరీక్షిత్తు ధర్మరాజు ననంతరమున కురుదేశమును బాలించెను.)

విరాట్టు. సం. వి. జ్. పుం. ౧. సౌందర్యము, చక్కఁదనము. ౨. క్షత్రియుఁడు. ౩. ఆది పురుషుని ప్రథమసంతతి. ౪. శరీరము. ౫. (వేదాంతశాస్త్రమున) బ్రహ్మాండాత్మక స్థూలదేహాభిమానియైన యాదిపురుషుఁడు. స్త్రీ. వేదమునందలి యొకానొకఛందస్సు.

విరాడము. వి. ఒకవిధమైనపన్ను, నజరానా.
ద్వి...మన్నీలు చెల్లింప,వలసిన నిల్వసల్వలు విరాడములు,సరవిగొనుక దేవసంబు ధాన్యంబు.
ద్వి. పరమ. ౩. ౧౯౭ పా. ౧౪ పం.

విరాణి. సం. వి. న్. పుం. ఏనుఁగు. (విల్యమ్సు.)

విరాధనము. సం. వి. అ. న. ౧ ఎదిరించుట, ప్రతిఘటించుట. ౨. హానిచేయుట, ఉపద్రవము గలిగించుట. ౩. బాధ, దుఃఖము.

విరాధము. సం. వి. అ. పుం.-౧. ఎదిరించుట, ప్రతిఘటనము. ౨. ఉపద్రవము, హాని.

విరాధుఁడు. సం. వి. అ. పుం. కుబేరుని శాపముచే రాక్షసత్వమునొంది రామునిచేఁ జంపఁబడిన యొకానొక రాక్షసుఁడు.

విరాద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఎదిరించినది, ప్రతిఘటింపఁబడినది. ౨. హానికలిగింపఁబడినది.

విరామము. సం. వి. అ. పుం. ౧. విచ్ఛిత్తి, మానుట, విరమించుట. ౨. తెలుపి, అవకాశము ౩. సమాప్తి, ముగింపు. ౪. ఆఁపుట, నిలుపుట ౫. పద్యాదులను జదువునపుడు గుక్కత్రిప్పుకొనుటకై కొంచెము నిలుపుట. (వ్యాక) తర్వాతవర్ణములులేకుండుట, అవసానము.

విరాలము. సం. విణ. (అ. ఆ. అ.) వలపు పుట్టించునది.
ఉ. అంత వసంతకాలము ... పాంథకామినీ, కాంతామనోవిరాలము జగత్త్రియమోహన
నీలఁ దోఁచినన్. భాను. ౨. ౩౫.

విరాళము[1]. వి. ౧. వలపు, మోహము.
ఉ...దాని మొగంబుఁ గన్న ఘడదారులకైన విరాళ మెత్తదే. నీలా. ౨. ౨౬.
౨. విరహము.
సీ. గుడుసుఁగ్రాదువుజోగు సుడివాన గురియక కడువిరాళపు టగ్గి యడఁగఁగలదె,
నీలా. ౧. ౧౦౩.

విరాళము[2]=విరాడము. వి. ఒకవిధమైన పన్ను.
(శ. ర.)

విరాళి=విరలి. వి. (సం. విరహః) ౧. మోహము, వలపు.
తే. ఇచ్ఛసేయఁడు మనములో నిధ్మములకుఁ, బావకుండు నేఁడెల్లి నీపై విరాళి.
నైష. ౪: ౩౨.
తే...బాళిఁ, గూలి సోలుచుఁ జాలవిరాళిఁ దేలి,... నీలా. ౨. ౮౩.
౨. భక్తి.
చ. అనవుడు నాగురుండు దివిజాంతక నాయొడఁ దప్పులేగు నీ, తనయునిచేత లీ దనుజదారక
కోటి యొటుంగు వీఁడు నా, పనుపున గద్య పద్యములు పాఠముసేయఁడు చేసెనేని
యున్, మనసున విష్ణుచింతనము మానఁడు వీని విరాళియెట్టిదో. (వి. పు. ౨. ౨౭౬.)
విణ. ౧. మోహముకలది.
ఉ. పెంపుడుగాక హీనకులఁ బిల్చు మనస్సుది గాక మిక్కిలిన్, చెంపరిగాక వట్టితరితీ
పరిగాక విరాళిగాక యొ్యరం పెలగొట్టుగాక బలు రాయడికత్తియగాక యొప్పమున్,

సొంపారయింతలేనియెడ జూదరికత్తియ
గాక యెంతయున్. ధనాభి. ౨. ౬౦.

౨. విరాగముకలది.

చ. చలువలరచ్చపట్టు జలజంబులతుట్ట విరాళి
కల్కి ప్రోగులకునుకట్టు జక్కవల
గొట్టుచకోరులమేలి యట్టి...సరోజసౌధ
ముల్గ,గలవాలితోడఁబుట్టు...
రా. వి. ౩. ౮.

జః విరాళిగొను, విరాళిగొల్పు.

**విరాళిగొను.** అ. క్రి. (విరాళి + కొను.) వలపు చెందు, మోహపడు.

చ. అనుచుఁ దదీయ నైపుణగుణాళి విరాళి
గొనంగఁ జెప్పు... విక్ర ౮. ౪౮.

గీ...,మున్ను ముచ్చిచ్చును విరాళిగొన్న
చోటు,... మనుచ. ౨. ౯.

వ. అని యెట్టకేలకుం గదలి విరాళింగొన్న
చందంబున... కాశీ. ౨. ౧౩౮.

**విరాళిగొల్పు.** స. క్రి. (√ విరాళిగొను.) మోహింపఁజేయు, వలపుగొలుపు.

గీ...సతుల ముత్తైదువుల నిర్విశంకవృత్తి,
రజనికరఖండమౌళి విరాళిఁ గొలిపె.
హర. ౫. ౫౩.

గీ. మేచకభుజంగనిభవేణిమీఁదగడచి, వ్రేలని
చ్చాలపిఱుఁదు విరాళిగొలిపె, నన్ను
యమునానదీవేణిఁదుమఁ బాఱ, గానఁబడి
యెడి పులినయుగ్మంబు కరణి.
వరాహ. ౩. ౧౧౪.

**విరాళిమొగ్గ.** విశ. చెదరిపోయినది.

వ. చట్టంబులనెగయు నాకాశబాణంబుల
దురుసున నిచ్చవిచ్చులవిచ్చుమొగ్గ విరాళి
మొగ్గగాఁ గంచుమించై చిందరవందరై.
ప్రబంధ. ౪౭౮.

**విరావము.** సం. వి. అ. పుం. పెద్దధ్వని, అఱపు.

**విరావి.** సం. విశ. (న్. ఈ. న్.) ౧. అఱచునది, బిగ్గఱగా ధ్వనిచేయునది. ౨. ఏడ్చునది, విలపించునది.

**విరావిణి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. విలపించుట, ఏడ్చుట, బిగ్గఱగా ధ్వనిచేయుట. ౨. చీఁపురుకట్ట.

**విరి.** వి. (√ విరియు.) పుష్పము, పువ్వు.

గీ. తమ్మిపూమాలి...దర్పకుండు, విరులు నీ
కాయుధములుఁ గావించినాఁడు.
నైష. ౨. ౧౩౮.

చ. కనుఁగవఁ బిన్ననవ్వు దొలఁక న్మని
నాథునికన్నుసన్న నిచ్చినఁ దగ భోజ
నందనయుఁ జేకొని మానికి మ్రొక్కి యవ్వి
రిం,దన నెఱిగొప్పునం జెరివినన్...
పారి. ౧. ౫౫.

విశ. ౧. వికసించినది.

క. శరదాగమమున...కైవ్రాలఁ బండి కలమ
వనంబుల్, గరుసున నెలమిగఁ దామర,
విరిపువ్వులతావి కరఁగు విధమునఁబొలిచెన్.
కు. సం. ౬. ౪౪౬.

చ. దనుజవిరోధిమీఁద నొకతన్వి కరంబున
లాజలెత్తి చల్లిన నెఱివేణి యూసునఁ
బలె న్విరిపూవులఁజల్లెఁ జల్లె లోచనములు
సమ్మదాశ్రువులఁ జల్లె లలాటము ఘర్మ
బిందులన్, జేనుఁగవ సల్లె సంభ్రమవశత్రుటి
తామలహారకాలులన్. (పారి. ౩. ౧౯.)

సీ...గీ..., విప్పుఁగన్నులు విరిగల్వవిరులు
గాఁగ,... దశా. ౩. ౨౮.

౨. వీడినది. (శ. ర.)

క...శిరస్స్థానము కౌలుకడగాఁగఁ దా విరి తలలోన.

క. నిద్దురవోవఁగఁ గనుఁగొని, యద్దిర కడు నళుచిగ్గైన యది దిటి...

భా. రా. బాల. ౪౮౨.

క...విరితేనలితోఁ, బురఁబురఁబడి యేడ్చుచుండె భూభాగమునన్. దశకు. ౪. ౬౯.

క. మదిఁ గొఱకొఱ నిగుడఁగ న ప్పుడి మొగ మురజోదు తేనిపై నా ఖ్మౌలుకుల్, చదల ద్రువ నేసి విరి వ్రాఁకిదము తెఱం గొందఁజేసి ప్రేల్మిడి నొంచెన్. (ఆ. రా. యు. ౫౦౪.)

౩. విడిచినది, వదలినది.

ఉ...కాసెమొగుల్ విరియొండ ల త్తఱిన్.

ఆము. ౪. ౧౬౦.

గీ. శీల నీప్రావృడాగమవేళయందు, నిండు జాబిల్లి పండువెన్నెలలు మింట, నెడనెడలఁ గాయ నది కంటివే కరంబు, మొగులు విరి యొండవలెఁ దాపమునఁ బెరల్చు.

రామా. ౬. ౨౧.

౪. విడిగానున్నది, ప్రత్యేకమైనది, చిల్లర యైనది.

చ. పయిఁబయిఁ బండుకొల్చు విరిపైఁడియు గట్టి దినుస్సు రాయి ఱప్పుయు మణి బంటు చానిసలుఁ బైరముఁ బెయ్యలు చేలు చెట్లు లోనయిన సమస్తసంపదలు నన్న వితీర్ణకి వచ్చుపెట్టఁగా...

కళా. ౬. ౨౫.

**విరిం(రం)చనుఁడు.** సం. వి. అ. పుం. = విరించుఁడు.

**విరించము.** సం. వి. అ. పుం. దినముయొక్క పదియవభాగము.

**విరిం(రం)చి.** సం. వి. అ. పుం. ౧. బ్రహ్మ. ౨. శివుఁడు. ౩. విష్ణువు.

**విరిం(రం)చుఁడు.** సం. వి. అ. పుం. ౧. బ్రహ్మ. ౨. శివుఁడు. ౩. విష్ణువు.

**విరిఁబోఁడి.** వి. (విరి + పోఁడి.) పుష్పమువలె నొప్పిదమైన స్త్రీ.

సీ. విరిఁబోఁడి చీనిచక్కెరమోవి రుచులాన వలవదే నాలుకగలుగుఫలము.

దశా. ౨. ౩౦౪.

క...ఈ విరిఁబోఁడి జగంబులెల్ల విరివిగఁ బొగడన్. నీలా. ౧. ౭౪.

**విరికటారపుజోదు.** వి. (విరి + కటారము + జోదు.) మన్మథుఁడు.

సీ. విరికటారపుజోదు వెలిపించె వెలఁది నీకుచ దుర్గముల వాత్తుకొనఁగనిమ్ము...

కృ. శకుం. ౨. ౧౩౩.

**విరికిలించు.** స. క్రి. (√విరి.) విరియఁజేయు, చాఁచు.

ద్వి. చంక లడచికొంచు శంకరుఁ బొగడు, చును నుఱ్ఱుకును గెర్లి చూచుచు జన్ని, గొనుచు గంతులువేయుచును మనికట్లు, వెడమరించుచు వ్రేళ్లు విరికిలించుచును...
పండితా. పర్వ. ౩౪౧.పా.

**విరికొంతవేల్పు.** వి. (విరి + కొంతము + వేల్పు.) పుష్పాయుధుఁడు, మన్మథుఁడు.

క. అంతట నొకనాఁ డింతులు, సంతసమునఁ గొల్వఁ బైఁడి జంగిడిపైఁ జేమంతుల మాడు వుఁగో విరికొంతపువేల్పువనఁగ రాజు కొలువున్నయెడన్. యయా. ౫. ౪౫.

**విరిగి.** వి. శ్లేష్మాతకము, శేలువు, ఒకజాతిచెట్టు.

రగడ. విరిగి పయింగడు విరిగిరి చానలు...

యయా. ౪. ౨౫.

సీ. మత్తి విరిగి తొండ్లి మత్తి తూకిచ్చెడ పెద్ద
విరిగి చక్కి గద్దసెల్లి,...
హంస. ౪. ౧౧.

వ. కేలల జాలల నొద్దుల మద్దుల విరుగుల నిరు
గుల సెమ్మల జమ్మసేకేళ్ళ మాకేళ్ళ...
పి. శకుం. ౨. ౧౪.

**విరిగొమ్మ.** వి. (విరి + కొమ్మ.) పూఁగొమ్మ.
సీ...కొమ్మ యీ విరిగొమ్మఁ గమ్మతేనియ
గ్రమ్మ సెమ్మెమీఱఁగదమ్మ తుమ్మెద
లకు... దశా. ౩. ౭.

**విరిచెండు.** వి. (విరి + చెండు.) పూలబంతి.
సీ. తళుకుబంగరుగిండ్లు తులకించు విరిచెండ్లు
నడఁగించు పాలిండ్ల నమరుదాని.
ఉ. రా. ౨. ౨౬౬.

**విరితీవఁబోఁడి.** వి.(విరి + తీవ + పోఁడి.)లతాం
గి, పూవుఁదీఁగవలె మనోజ్ఞురాలగు స్త్రీ.
ఉ. ఆ విరితీవఁబోఁడి కృప కద్భుతమంది భవ
న్నియోగమే,లా వృథయగా ఫలింపక బలాయ
బలాయని... వేం. పంచ. ౪.౩౦౦.

**విరితేనియ(నె).** వి. (విరి + తేనియ.) పూఁదేనె.
చ. హాళహాళి నప్పులిచ్చిన క్రియన్ విరితేనియ
లాను తేఁటులున్, మలయుచు దాఁచఁ
బెట్టిన క్రమంబునఁ బండ్లుగ్రహించు చిల్క
లున్... ఉ. రా. ౬. ౧౭.
సీ. సరసమాధవిసేర విరితేనెనెపముతోఁ జెమ
రించె సురపొన్న చెలియ చూడు.
ఉ. రా. ౧. ౧౮౧.

**విరితేనెమేపరి.** వి. (విరితేనె + మేపరి.) మధు
పము, తుమ్మెద.
క. విరితేనెమేపరులకున్, హరినీలఁపుసరుల
కిరుల కజ్జాతిరులల్, గురులై...
చం. రా. ౩. ౮౪.

**విరిదట్టు.** విశే. (√ విరియు.) ఎడఁబాటునొంది
నది, వియుక్తము.
క. విరసంబునఁ దమ నిరవుర, విరిదట్టుగఁ జేసి
నట్టి విశ్వావసుఁడు...(వి. పు. ౬. ౧౦౬.)

**విరిదలవాఁడు.** విశే. (విరి + తల + వాఁడు.)
విడిపోయిన జుట్టుకలవాఁడు.
సీ. విరిదలవానిని విరథుని నాయుధంబిడిన
వానిని కూరు లేయ రెండు.
భార. కర్ణ. ౩. ౩౫౧.

**విరినీరు.**[1] వి. జై. (విరివి + నీరు.) సమృద్ధమైన
జలము.
సీ. ఏటేట విరినీట నిరుగారునం బంటఁ
బ్రాసంగువరిచేలఁ బసిఁడిచాయ.
భీమ. ౨. ౫౪.

**విరినీరు,**[2] (విరి + నీరు.) పన్నీరు.

**విరిపిడియము.** వి. (విరివి + పిడి + అమ్మ.)
పెద్దబాకు.
క. కట్టినదట్టి కటీతటిఁ, బెట్టిన విరిపిడియ
మెక్కువెట్టిన విల్లున్, మెట్టిన యొగనాళ్లుం
గను,పట్టిన పస మారుఁడపుడు పాంథుల
వెదకన్. రా. వి. ౩. ౧౬.

**విరిపోటు.** వి. (విరి + పోటు.) భేదము.
క. పేఁటెత్తి రిపులతో విరి,పోటగు సదుపాయ
మొకటి పుట్టింపఁ దగున్...(కవిక.౨.౪౪.)
సీ ఏబోఁడి గావించెనే యింత విరిపోటు తల్లి
నీకు నుపనిషత్తరణితోడ...
ప్రబోధ. ౩. ౩.

**విరిపోటుసేయు.** అ. క్రి. (విరిపోటు + చేయు.)
౧. భేదముకల్గించు.
ద్వి. విడిపోవఁగఁ బల్కి విరిపోటుసేసి, జోడుఁ
బాపును దాన సురసమై జరగు...
ద్వి. హరిశ్చ. పూ. ౨౪౪౮ పం.
౨. పాడుచేయు, చెఱుచు.

సీ. పీటికమ్మల విరిపోటు సేయకయున్న దోషాభి
ఘాతుఁడై తోఁగకున్న...
సరస. ౫. ౧౬౦.

విరిబ్ధము. సం. వి. అ. పుం. ౧. స్వరము, (షడ్జాది.) ౨. ధ్వని. (విల్సన్.)

విరియఁబడు. అ. క్రి. (విరియన్ + పడు, స్వార్థమున) విరియు, విడిపోవు.

చ. కనుఁగవ మ్రాన్పడంగ నెఱకవ్విరియంబడ బోరమోవ, నెండిన వదనంబులం దెఱచి నిక్కిన యట్టులు దల్లడించుటల్, గనఁబడ నూరుపుల్దళముగా నిగుడన్వడఁ గుండి యీ రెలుంగునఁ దమవానిఁ బిల్చుచు శకుంత ల ఱ్ఱ్యాడ నిల్చె మ్రాకులన్. (పారి. ౪. ౨౧.)

౨. వ్యాపించు, క్రమ్ము.

సీ. కట్టిన చీనాంశుకంబుల పింజెలు మొరఁయు మట్టెమీఁద విరియఁబడఁగ...
వరాహ. ౪. ౧౩౩.

విరియఁబాఱు. అ. క్రి. (విరియన్ + పాఱు, స్వార్థమున) ౧. వికసించు.

మ...విరియంబాఱిన గొజ్జెఁగల్గురియ మున్నీరైన యకల్ముమ్మనీరు... అను. ౫. ౧౨౧.

౨. విచ్చు, విడిపోవు.

సీ. రాతిసీ కబరీభరంబుల చాడ్పున విపులాంధకారంబు విరియఁబాఱె.
భా. రా. యు. ౧౪౩౧.

సీ. తిరముగా ముడువమి విరియఁబాఱెడు కొప్పుఁ దోడ్తోడ నొకకేలఁ దుఱుము కొనుచు. కళా. ౩. ౧౫౬.

౩. వ్యాపించు, క్రమ్ము.

గీ. కాంత కబరీభరంబను కారుమొగులు, వితతముగ నంతకంతకు విరియఁబాఱె.
కళా. ౭. ౧౭౭.

౪. పగులు, ఛేదిల్లు.

చ. అలరు సురంటిగూండ్ల మును పంతటఁ బెట్టిన బొండుమల్లెమొగ్గలగమి గాలిగ్రుడ్లు తతిగావున నే విరియంగఁబాఱఁగా...
చంద్రా. ౨. ౩౨.

విరియఁబోయు. స. క్రి. (విరియన్ + పోయు.) (తలవెంట్రుకలు ముడివిప్పి) వ్రేలఁజేయు.

సీ. విరియఁబోసిన జటావిసరంబు కెంజాయ సాంధ్యరాగంబుపైఁ జాకళింప.
దశా. ౩. ౫౨.

విరియాట. వి. (విరి + ఆట.) స్వేచ్ఛావిహారము.

ఉ...పల్లొమ్మలఁ జెందు వారలు తగు ల్విరి యాటలు నేరకుందురే. (వసు. ౩. ౧౩౯.)
(పువ్వులందలి యాట యని యర్థాంతరము.)

విరియించు. స. క్రి. (√ విరియు.) ౧. వికసింపఁజేయు.

క. విరియించి తామరలలో, నరుణాంశులు సొచ్చి సుభగమగు సౌందర్యస్ఫురణము నొందఁ గఁదోఁచెం, దరణి యుదయశిఖరిమీఁద ధరణీనాథా. (భార. ద్రో. ౫. ౧౫౫.)

సీ. సమదరాగస్థితి సంపెంగ విరియించి చంద్రాస్య యోర్తు పుష్పములుగోసె.
పి. శకుం. ౨. ౧౩౯.

౨. విప్పు, తెఱచు.

గీ. ఇందుబింబాస్య నారాక కెదురుచూచు, నయనములు వేయు విరియించి నాకభర్త...
నైష. ౪. ౭౪.

౩. చెదరఁగొట్టు, తొలఁగఁజేయు.

సీ. మూఁకల విరియించి వీఁక నాచార్యాది యోధులనెల్లను నొక్కడుసరకు, వెలచి...
భార. ద్రో. ౨. ౧౩౬.

లయవిభాతి. హరుల హరియించుచును గరుల విరియించుచును గిరుల ముఱియించుచును రురులఁ బొరిగొంచున్. ఉ. రా. ౭. ౭౭.

౪. నశింపఁజేయు.

ద్వి. చీఁకటి విరియించు చిఱునవ్వు బసిఁడి,
రేకులతో నెదురించు చెక్కిళ్లు.
ద్వి. హరిశ్చ. ఉ. ౩౪౯.

ద్వి. పారి భూతకోట్లను బుట్టింపఁ బెంప, విరి
యింప నొక్కఁడె వేరవైనవాఁడు.
రం. రా. ఉ. ౧౦౩. పా. ౧౦. పం.

క. చరియింతువు త్రిభువనముల, మెఱయిం
తువు మహతియందు మురరిపుచరితల్, విరి
యింతువు భవతిమిరము, వరియింతువు ము క్తి
కాంత వనజభవసుతా.
రుక్మాం. ౧. ౧౫౯.

**విరియు.** అ. క్రి. (క. బిరియు. త. విరి.) ౧. విక
సించు.

సీ. సిందూర విరిసిన పుండరీకశ్రేణి యామినీ
రమణిరేఖాళి గాఁగ. (నైష. ౧. ౯౫.)

క. ...చలికరువలిను, న్పొలపమున విరియు
పరువపుఁ, దొలుమొగడల వలపు దెలుపు
తోటలలోనన్. పారి. ౫. ౧౦౩.

క. రావణు నుద్యోగమునకు, దైవము ప్రతి
కూలమైనఁ దత్త్వనిదిధ్యాసావేశ విరా
మంబై, యూపనచరవిభుఁడు గన్నులరవిరి
యంగన్. నిర్వ. ౬. ౬౯.

౨. పుష్పించు, పూచు.

మ. ...అతఁడున్ దోఁచిన నవ్వుడున్ విరిసెఁ
బ్రాంతాంచన్న మేరుద్రువున్.
ఆము. ౫. ౧౨౯.

౩. విడిపోవు.

క... పారిఁబోరిగ నయంబున ముడి,విరియ వలువ
చెఱఁగు వట్టి ప్రేతల నీడ్చెన్.
హరి. పూ. ౫. ౧౯౬.

చ. ఉరవడి నేగుచోట నొక యుగ్మలియొల్లె
చెఱంగు మేదినీశ్వరుని భుజావిభూషణము
వజ్రములన్ దవులఁగఁబాతినన్, విరిసెను
నీవిబంధము... నైష. ౩. ౯౪.

ద్వి. సొరసిన యల కలనెఱులుఁ జిక్కుఁడవి
విరిసిన జడలును విన్నవై మురువు,వాడిన
మోములు...(ద్వి. హరిశ్చ. పూ. ౧౧౨౯.)

౪. ఇచ్చిపోవు, విశ్లథమగు.

వ. అంతట ధరణీచక్రం బమ్మహాసలిలమధ్యం
బున మహోదకంబుల స్వల్పలోష్టపిండంబు
విధంబున విరిసి చెడు. (సీతారా. ౨. ౧౫౯.)

సీ. వీని చెల్వమువార్త విన్న భయంబున వ్రీహి
గర్భంబులు విరియకున్న.
కవిక. ౬. ౧౫౪.

గీ. విరహకాలంబు మరుబాణవితతిఁ గొన్నఁ,
గంటులన్నియుఁ బ్రియుఁగూడి కైపుమిగిలి,
పెనఁగు నెడనెట్టవిరిసె నావనిత మేనఁ,
గలయ నవనఖదంతవిక్షతము లడరె.
కు. సం. ౮. ౧౬౯.

ద్వి. వెస వార్ధిలో నోడ విరియు చందమున.
ద్వి. భార. విరా. ౪. ౬౦.

౫. చెదరు.

చ. మురదనుజుండు పౌరవసమూహమునుం
గని రాజరాజుపై, శరనికరంబు వుచ్చి
తనచక్కిన యొక్కిన యాతుగుహ్యకుల్,
విరియఁగ ఖడ్గపాశముల వ్రేసిన వచ్చిన
త్రోవ వట్టిరి... ఉ. హరి. ౧. ౪౦.

క. పురికొనుచుం బెరలుచునో, హరి సాహరి
నొక్కచోట నలవడునొకచో, విరియు
నొకచోటఁ దిరుగుం, దిరుగక యొకచోట
రెండు దెఱఁగులు సొచ్చున్.
భార. భీష్మ. ౨. ౧౬౩.

౬. తొలఁగు.

వ. అవిద్యావరణంబు విరిసినం దోఁచు పరమా
త్మని ప్రకారంబున... నైష. ౪. ౨.

పీ. వీడెంపు బలుకెంపు విరిసి వెన్నెల గాయ
వరిగింజ నొకటఁ బల్వరుసఁ దోమ.
ఆము. ౧. ౮౦.

సీ. పైపైంగుల్ విరిసిన బాలేందుకళరీతిఁ బలు
కడిగిన రత్నకళికలీల,     పరమ. ౨. ౨౮.

చ. సరవరవాసవుం డడిగినన్ గురుఁ డిట్లనిచెప్పె
బుద్ధిలోఁ, బొరయని పాతకంబులు నబుద్ధిక
పుణ్యముల న్నశించు నం,బరమునఁ బట్టినట్టి
మలపంకము గారములోన నద్దఁగా, విరిసిన
యట్లు నమ్మమిది వేదము సెప్పిన నేనుఁ
జెప్పితిన్.     భార. శాం. ౩. ౩౬౪.

క. అజితాత్ముఁడైన యాతని, విజయంబును
సిరియు విరియు వేగంబ శర,త్ప్రజనితజల
ధరములు గడు, నిజములగునె యంబరమున
నిమసంబైనన్.     నృసిం. ౨. ౧౪౦.

మ. కురిసె న్వానలు సస్యవృద్ధి గలిగెం
గో ల్బెక్కుడై యమ్మె నెవ్వరు రోగంబుల
చేత జావరు మృగవ్యాళాది దుర్దోషముల్,
విరిసెన్ సాధుమతంబులెల్ల నడచె న్విఖ్యాత
సౌఖ్యంబుతో, ధర శోభిల్లె శమంతకాఖ్య
మణిరత్నస్థైర్యసంపత్తిచేన్.

వి. పు. ౬. ౩౨౫.

౯. రాలిపోవు.

గీ. మధువుఁ గాంతల పుక్కిటిమధువుఁ బేర్ల,
యీర్ష్యఁ బసనూపఁ బొగడపై నెలయ
దాన,విరిసెఁ దొల్లిటిదళములు...
ఆము. ౫. ౧౩౦.

౧౦. వివశమగు.

క... బం,గారముఁబోలెడు కొడుకున, కేరూ
పునసైనఁ బాపు మీ సంకటమున్.

మ. అనినం దల్లడమంది మేను విరియన్
హా యంచు గోపాలభా,మిని...
హరి. పూ. ౫. ౨౪౬.

౧౧. అదృశ్యమగు, అడఁగు.

క. కుముదములుఁ దారు నొక్కటఁ, బ్రమదం
బుననుండి వానిపదవి దొలఁగినన్, దమకు
న్నిలువఁగఁడగదను, క్రమమునఁ జనునట్లు
తారకంబులు విరిసెన్.
భార. ఉద్యో. ౨. ౧౦౮.

గీ. ప్రకటదోహృదకుంభసంభవవిభూతి, యౌ
వనారంభఘనవిలాసార్ణవంబు, నింకఁ జేసి
నచోఁ దిరోహితములైన, తత్తరంగంబులన
నింతి తఱులువిరిసె.     విప్ర. ౧. ౪౨.

చ... చిట్టుముల్, గరమొదవెన్ వళుల్ విరిసెఁ
గన్నుల నోలముదోఁచె...
పరమ. ౨. ౧౪౦.

౧౨. భగ్నమగు, విరుగు.

గీ. నేమి విరిసిన కతన న న్నేల సెలవు, నేమి
శంబరయ్యె నదియ తా నైమిశంబు...
కాశీ. ౧. ౪౪.

౧౩. వ్యాపించు.

ఆ. అంత నుదయశైలమను నశోకద్రుమ,
సమితియందుఁ గాంతి చారుభంగి, నెఱయ
విరిసి తొలుత నెగసిన యుజ్జ్వల,స్తబక
మనఁగఁ బద్మసఖుఁడు పొడిచె.
భార. ఉద్యో. ౨. ౧౧౩.

ద్వి. కండక్రొవ్వునఁగాలకౌశికుమీఁద, మండు
కోపము చంద్రమతిమీఁద విరిసి, పాడిఁ
జెప్పఁగ నిన్నుఁ బనివడ్డి యిచటి, కేడ
ముక్కుఁడి తెచ్చె...
ద్వి. హరిశ్చ. ఉ. ౧౧౮౫.
వెల్లివిరియు—వెల్లి=ప్రవాహముగా, విరి
యు=చెదరు—ప్రవహించు.

క. రెంటను... మదీయ మూర్ధము, వెంటంగా
నభ్రగంగ వెల్లివిరియుటన్.
హర. ౪. ౫౪.

౧౪. పొంగు.

క. మినుమినుకు మినుకుమనియెన్, ధెనుమిను
కుల బరణి ధరణి బిట్టూటాడెన్, వన
నిధులు విరిసెఁ గురిసెన్, గనగనగనమనుచు
నిప్పుకలు గుప్పలుగన్. (పాండు. ౫. ౧౧౮౫.)

స. క్రి. విడుచు.

గీ. కార్య మెుక్కఁడు గనిన మాత్సర్యమున
నొకండుగాదని ఖండింపుఁ గన్నుఁ జెంగి,
యిరువురను గాదనక కొల్వువిరిసె మీఁదఁ
నల్లవాఁ డెన్నినది సేయనగు శుభంబు.
ఆము. ४. ౨౨౩.

వ. సర్వసన్నాహంబులు సమకట్టుమని పనిచి
కొలువు విరిసి చనియె.
భార. ఉద్యో. ४. ౨౧౦.

క. జనపతి మునిపతిఁ బూజావినుతి నతిక్రియ
లఁ బల్లవిలఁజేసి ప్రియంబున వీడుకొలిపి
తానుం, జనియెఁ గొలువు విరిసి రత్నసద
నంబునకున్. వేం. పంచ. ४. ౧౦౭.

జ. విక్కు-విరియు, విరఁబడు, విరవాయు,
విరాకులవిత్తు, విరి, విరిఁబోఁడి, విరికటా
రపుజోదు, విరికిలించు, విరికొంతవేల్పు, విరి
గొమ్మ, విరిచెండు, విరితీవఁబోఁడి, విరి
తేనియ, విరితేనెమేపరి, విరిదట్టు, విరిదల
వాఁడు, విరినీరు, విరిపిడియము, విరి
పోటు, విరిపోటుసేయు, విరియఁబడు,
విరియఁబాఱు, విరియఁబోవు, విరియాట,
విరియించు, విరివి, విరివింటదంట, విరి
వింటదొర, విరివింటివాఁడు, విరివిడి, విరివిలు
కాఁడు, విరివిల్తుఁడు, విరివోఁడి, విరిసరి,
విరులెత్తు. —

**విరివి-విఱివి.** వి. (√ విరియు.) ౧. ఆధి
క్యము.
రగడ. వెలయు కురువింద పూవిరులును మురు
వుచు. రాఘ. ౨. ౬.

౨. విస్తృతి.
ఉ. కావిరి యంతటం గలయఁగా విరివిన్ గను
పెట్టె సర్వశైలావళి ఘూర్ణిలెన్ ...
పరమ. ౩౩.

క. ఒక్కని విరివికిని దొరల్, పెక్కండ్రే
నొక్కనొకని వెంబడి... (ఆము.४.౨౧४.)

సీ. విలసిల్లు త్రివళుల విరివిలోఁగూడంగ విరివి
నెమ్ముగములు విస్తరిల్ల. (విక్ర.౧.౧౬౬.)

౩. వెడలుపు.
గీ. నాగ...యిన్నూరు రోజనములనిడుపున
శతయోజనముల విరివి, ఫలితఖర్జూర
గోస్తనీ లలితమగుచు.
వరాహ. ౧౦. ౧౩౬.

విశే. ౧. విస్తృతము, విశాలము.
గీ...ఇంక నొండొక విరివియౌనెడ వసింపఁ
జేయుమెుందైన... దశా. ౧. ౧४౧.

౨. అధికము.
మ. తరుణా...శరధిం గప్పులి జోగులన్ విరివిగా
సామాన్లఁ జెప్పించు నేర్పరి...
హర. ౧. ౨౩.

క. అరచేతి...ఈవిరిఁబోఁడి జగంబులెల్ల విరి
విగఁ బొగడన్. నీలా. ౧. ౭౩.

**విరివింటిదంట.** వి. (విరి + విల్లు + దంట.) మన్మ
థుఁడు, పుష్పధన్వ.
చ. అల విరివింటిదంట తదిలాధిపమోహము
నెమ్మనంబునన్, గలవలమానభేదిమణికై
శికఁ గెందలిరాకుముల్కులన్, గలవల
మాన నూన్చె నలుకన్నవసంగరముప్రనిల్చి
మంగలవలమానమీనతిలకధ్వజశోభి మరు
ప్రథంబునన్. చంద్రికా. ४. ౧౫.

**విరివింటిదొర.** వి. (విరి + విల్లు + దొర.) మన్మ
థుఁడు, పుష్పధన్వ.
క. పోల్పఁ దొలి మినుకు వెలుఁగున, వేల్పించిన
పిదప రాచవిరివింటిదొరన్, వేల్పులకున్
మ్రెుక్కించిరి... యయా. ४. ౧౧౩.

**విరివింటివాఁడు.** విశే. (విరి + విల్లు + వాఁడు.)
పుష్పధన్వ, మన్మథుడు.
క. విరివింటివాఁడవుగదా, శరణాగతులైన
పాంథజనులను రక్షింతురు గా కిటుల
నుపేక్షింతురె పైకముగూడఁ బెట్టఁ దొడఁ
గుచు మదనా. విజ. వి. ౩. ४౩.
(గొప్పయింటివాఁడు అని అర్థాంతరము.)

**విరివిడి.** వి. (విరివి + ఇడి, స్వార్థమున) విస్తృతి. విణ. విస్తృతము. (శ. ర., బ్రౌ.)

**విరివిలుకాఁడు.** వి. (విరి + విలు + కాఁడు.) మన్మథుఁడు.

చ. తిరుగుచుఁ జాల్పులైన మగతేఁటులు మీఁదెడు తోఁడ చూచితే, విరివిలుకాఁ డొనర్చు నల వేలిమి మంటల పైఁబొగ ల్వ లెన్. యయా. ౫. ౫౪.

**విరివిల్తుఁడు.** వి. (విరి + విల్లు.) పుష్పధన్వ, మన్మథుఁడు.

సీ. విరివిల్తు నతనిదేవేరిఁ గస్తురిఁ దమ్మిరేకుపై వ్రాసి గుతించి నిలిపి. (యయా. ౪. ౨౭.)

ఉ... నన్ విరివిల్తుఁ డమ్ములన్, గ్రుచ్చి జయించె... సవిూర. ౩. ౨౪౩.

**విరివాడి.** వి. (విరి + వాడి.) పుష్పాడి, పరాగము.

ద్వి. అరుదెంచి పూఁదేనియలకాల్వఁదాటి, విరివాడి నెత్తంబు కెడచాయ వెడలి. ద్వి. పరమ. ౪. ౨౯౯.

**విరిసరి.** (విరి + సరి.) పుష్పమాలిక.

చ. విరిసరి వేనలిన్ గళభువిన్ మణివల్లరి యంఘ్రి వజ్రపున్, సరిపణి నాఁ ద్రిలోకి యను చానకుఁ దానొక నీటుపెట్టు నం, బరతటినీ వతంస మిది పావకమూర్తి గతిం ద్రిధా పరి, స్ఫురణముఁ బూనుకొన్న విధమున్ వివరించెద నీకు రాఘవా. (చం. రా. ౩. ౭.)

**విరుగ్ణము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. మిగుల విఱుగఁగొట్టఁబడినది, పగులఁగొట్టఁబడినది. ౨. నశింపఁజేయఁబడినది. ౩. వంగినది. ౪. కొయ్యవాఱినది, కుంఠితము.

**విరుతము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. అఱచునది, బిగ్గఱగా ధ్వనిచేయునది. ౨. మాఱుమ్రోయునది, ప్రతిధ్వని చేయుచున్నది.—వి. అ. న. ౧. అఱపు, కేక, బొబ్బరింత. ౨. ధ్వని, పెద్దధ్వని. ౩. పక్షికూజితము, తుమ్మెదల ఝుంకారము.

**విరుదితము.** సం. వి. అ. న. ౧. పెద్దయఱపు. ౨. ఏడ్పు.

**విరుద్ధధీ.** సం. విణ. (ఈ.) దుష్టబుద్ధిగలవాఁడు, దుష్టుఁడు. —వి. ఈ. స్త్రీ. చెడుబుద్ధి, విపరీతబుద్ధి.

**విరుద్ధపడు.** మి. అ. క్రి. (విరుద్ధము + పడు.) విరోధపడు, కలహించు.

వ. బద్ధాంజలియై శుద్ధబుద్ధస్వరూపిణివగు నీతో విరుద్ధపడు దురాత్ములకుఁ దగినయట్లయ్యె. ప్రబోధ. ౪. ౫౭.

**విరుద్ధపఱచు.** మి. స. క్రి. (√ విరుద్ధపడు.) విరోధింపఁజేయు.

వ. వేదమార్గోపనిషత్తులతోడ శ్రద్ధను విరుద్ధపఱచి... ప్రబోధ. ౩. ౨.

**విరుద్ధమతికృత్తు.** సం. వి. త్. పుం. విపరీతార్థము స్ఫురింపఁజేయుట యనెడి ఒకానొక కవితాదోషము.

**విరుద్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఆటంకపఱుపఁబడినది, అడ్డుపెట్టఁబడినది. ౨. మూయఁబడినది. ౩. ముట్టడింపఁబడినది. ౪. భిన్నమైనది, పరస్పరము విరోధముగలది. ౫. వ్యతిరేకమైనది, వ్యతిరేక గుణముగలది. ౬. (తర్క.) విరుద్ధభావమును రుజువుచేయు హేతువు. (తర్క.) ఒకానొక హేత్వాభావము. ౭. పగగలది. ౮. ప్రతికూలమైనది. ౯. (ఆహారము) నిషే

ధింపఁబడినది. ౧౦. అనర్హము, కూడనిది. ౧౧. పైకిఁద్రోయఁబడినది. ౧౨. సందేహాస్పద మైనది, సందిగ్ధమైనది.— వి. అ. న. ౧. వ్యతిరేకము, విరోధము. ౨. అనిష్టము, అసమ్మతి, పొసఁగమి.

విరులెత్తు. అ. క్రి. (విరులు + ఎత్తు.) పుష్పించు.
చ. తరుణుల కౌఁగిటన్ననుచు తమ్ము వృథా విరులెత్తఁజేసి పోవఁబరులుగఁ జైత్రుఁ డంచు... ఆము. ౫. ౧౨౬.

విరూక్షణము. సం. వి. అ. న. ౧. మోటగాఁ జేయుట, మొద్దుగాఁజేయుట. ౨. విరేచనములు కట్టించుట. ౩. నింద, దూఱు. ౪. శాపము, తిట్టు.

విరూఢము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. అంకురించినది, మొలకలెత్తినది. ౨. బయలుదేఱినది, పుట్టినది. ౩. మొగ్గతొడిగినది, వికసించినది. ౪. ఎక్కినది, ఆరోహించినది.

విరూపకము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. విరుద్ధమగు రూపము గలది. ౨. భయంకరమైనది.— వి. అ. పుం. మాఱుపేరు.

విరూపకరణము. సం. వి. అ. న. ౧. కురూపినిఁజేయుట, ౨. హాని కలిగించుట, అపాయము చేయుట.

విరూపము. సం. విణ. (అ. ఆ., ఈ. అ.) ౧. అంగవికారముగలది, వికృతమైన రూపము గలది. ౨. స్వభావవిరుద్ధమైనది. ౩. బహురూపము, పలురూపములు గలది.—వి. అ. న. ౧. కురూపము, అంగవికారము. ౨. బహువిధరూపము, విభిన్నస్వభావము.

విరూపాక్షుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) వికారముగలకన్నులుగలవాఁడు, సరిగాలేని కన్నులుగలవాఁడు—వి. అ. పుం. శివుఁడు, విషమనేత్రుఁడు.

విరూపి. సం. విణ. (న్. ఈ. న్.) కురూపము గలవాఁడు, అంగవికారముగలవాఁడు.— వి. న్. పుం. అడవిపిల్లి.

విరేకము. సం. వి. అ. పుం. ౧. బేది, మలము పోవుట, పాసనము, ౨. బేదిమందు, విరేచనములుకలిగించుమందు.

విరేచనము. సం. వి. అ. న.=విరేకము.

విరేచితము. సం. విణ. (అ. ఆ. అ.) విరేచనమైనది, మలముపోయినది.

విరేఫము. సం. వి. అ. పుం. ౧. ప్రవాహము, నది. ౨. మదము (వాచ.)
విణ. (అ. ఆ. అ.) రేఫమను వర్ణములేనిది.

విరోకము. సం. వి. అ. పుం., న. రంధ్రము, కన్నము. —పుం. కిరణము.

విరోచనసుతుఁడు. సం. వి. అ. పుం. బలిచక్రవర్తి.

విరోచనుఁడు. సం. వి. అ. పుం. ౧. సూర్యుఁడు. ౨. చంద్రుఁడు. ౩. అగ్ని. ౪. ఒకానొక రాక్షసుఁడు, బలిచక్రవర్తితండ్రి, ప్రహ్లాదుని కొడుకు.

విరోధకారి. సం. విణ. (న్. ఈ. న్.) కలహములు కల్పించువాఁడు, పగకల్గించువాఁడు; కల్గించునది.

విరోధకృత్తు. సం. విణ. (త్.) = విరోధకారి. వి. త్. పుం. ౧. శత్రువు. ౨. ప్రభవాది సంవత్సరములలో నొకటి.

**విరోధనము.** సం. వి. అ. న. ౧. వైరము, విరోధము. ౨. ఆటంకము, అడ్డగింత, నిరోధము ౩. ముట్టడి. ౪. ప్రతిరోధము, ఎదిరించుట. ౫. పొసఁగమి, పరస్పర విరోధము.

**విరోధము.** సం. వి. అ. పుం. ౧. శత్రుత్వము, వైరము, పగ. ౨. ఆటంకము, అడ్డు, నిరోధము. ౩. ముట్టడి. ౪. ఆఁపుట, నిలుపుట. ౫. పొసఁగమి, పూర్వోత్తరములు సరిపడకుండుట. ౬. వ్యత్యాసము, భేదము. ౭. కలహము. ౮. దుఃఖము, కష్టము. ౯. (అలం) ఒకయలంకారము, విరోధాభాసాలంకారము. (పూర్వోత్తరములకు వైరమున్నట్లు భాసించుట.)

**విరోధి.** సం. విణ. (న్. నీ. న్.) ౧. ఎదిరించువాఁడు, ప్రతిఘటించువాఁడు. ౨. ముట్టడించువాఁడు. ౩. వ్యతిరేకభావముగలవాఁడు, విరుద్ధుఁడు. ౪. పగగలవాఁడు, శత్రుత్వముగలవాఁడు. ౫. కలహశీలుఁడు, పోట్లాడువాఁడు. —వి. న్. పుం. ౧. శత్రువు, పగవాఁడు. ౨. ప్రభవాదిసంవత్సరములలో నొకటి.

**విరోధించు.** సం. స. క్రి. ద్వేషించు, పగఁగొను.

మ. హరి...మును మాయయొక్కన్ విరోధించి యొక్కరుఁడు గ్రాసి వధింప...
భా. రా. ౩. ౧౧౭.

**విరోధోక్తి.** సం. వి. ఇ. స్త్రీ. విరుద్ధముగాఁ జెప్పెడిమాట, విరుద్ధవాక్యము, విప్రలాపము.

**విరోప(హ)ణము.** సం. వి. అ. న. ౧. (వ్రణము.) పుండుమాన్పుట. ౨. మొక్కలునాఁటుట, (పాతిపెట్టుట.)

**విరోహము.** సం. వి. అ. పుం. పెరుఁగుట, మొలకరొత్తుట.

**విర్గు=విఱుగు.** అ. క్రి. తునియు, భగ్నమగు.

ద్వి. ఏను వినోదమై యెక్కిడి తివియఁబూనినఁ జాపమప్పుడు విర్గెఁగాక.
రం. రా. బాల. ౭౮. పొ. (శ. ర. పొ.)

**విర్చు=విఱుచు.** స. క్రి. విఱుగఁజేయు, ముక్కలు చేయు.

శా. అట్టే...మంచి నల్లచెఱకుల్ భారంబుగా విర్చి వేకట్టె నొక్కొపు... హర. ౨. ౮.

చ... పెళ్ళనఁ దరుశాఖవిర్చి కపి యచ్చటి చేరువఁ బల్వలోదకంబునఁ బడకై చెనంత వెలుపుట్ట ఖగాంగన గూయుచుండఁగన్. కేయూర. ౩. ౧౫౦.

**విఱవిఱకపోవు.** అ. క్రి. తాపమునొందు.

క. ఆపాతాళగభీరజలాపూర్ణమహాప్రవాహమైనను గూపారాపరిమితసరమైనం, జూపుము విఱవిఱకపోవఁ జొచ్చెం దనువుల్.
వేం. పంచ. ౩. ౬౫.

**విఱవీఁగు=విఱ్ఱవీఁగు.** అ. క్రి. గర్వపడు.

క. వింటికి సరిబాము కానల, వింటికి సరిదొరక వెంత విఱవీఁగిన నెప్పంటికి నలపంటికి నల, పంటికి నల సాక్షి గుబ్బపాలిండ్లసిరుల్.
అచలా. ౨. ౪౦.

**విఱిగి.** వి. స్ఫోటభూమి.

ఆ. విఱిగి నాఁగ స్ఫోటపృథివికి సంజ్ఞయా...
ఆం. భా. ౨. ౪.

**విఱిచికట్టు.** స. క్రి. (విఱిచి + కట్టు.) (చేతులు) వెనుకకుఁ ద్రిప్పికట్టు.

ఉ. పట్టుఁడు పొఱుఁడంచు నరపాలుని భృత్యులు సందడించుచున్, గట్టిగ నాతనిన్ విఱిచి కట్టిరి తన్నిలయంబు ముట్టుకో, ల్పట్టిరి...
పారం. ౩. ౧౬౮.

సీ. తలకొన్నియనరాదు ధరలోన నెవ్వారు
విఱిచికట్టించు నశ్వసుల నొకట...
దశా. ౪. ౧౧౮.

సీ. పెనిమిటిగలదాన నని కొటుక ధరింప నేడు
కలాయని విఱిచికట్టు. శుక. ౨. ౧౧౫.

సీ. బహుభూషణధురీణబాహువల్లరులకొ కఱకు
ముప్పిరిత్రాళ్ళ విఱిచికట్లు...
సారంగ. ౩. ౭౮.

ద్వి. కటకటా గోలవుగదర నాయన్న, మటు
మాయచిత్రాంగిమాటలే నీకు, విఱిచి
కట్లారయెఁ బృథ్వీపతి నిన్ను, నఱుకంగ నెల
వీయ నాలుకట్లాడె...
ద్వి. శ. సా. ౨. ౫౭. షా. ౧౮. పం.

**విఱివి-విరివి.** వి. విస్తృతి.

చ. తరుచయి నీలనీరదవితానముపై పయి
గప్పి యొంతయున్, విఱివిగ నేలయున్
దిశలు నింగియు నిండఁగ బర్వి...
మార్క. ౨. ౧౬౫.

విణ. విస్తృతము.

ద్వి. తెఱనోరు కరిమేను దీర్ఘజిహ్వయును, విఱి
వైనరూపును విషమదృష్టియును...
రం. రా. అర. ౧౫౮. షా. ౨౭. పం.

సీ. బలుతల్పునగు నురస్థలముపై విఱివియా
తమిరిల్పి యేమేమొ తలఁచి తలఁచి...
ఉ. రా. ౬. ౧౫౪.

**విఱుగఁబడు.** అ. క్రి. (√ విరుగు.) ౧. పాఱి
పోవు, పలాయనమగు.

వ. ఇట్లు చెట్లువెడలి విండ్లువంచుకొని ముంచు
కొను నన్నల్లప్రజం జూచి హల్లకల్లోలంబై
విఱుగంబడునెడ... ఆము. ౬. ౮౬.

౨. గర్వించు (శ. ర.)

**విఱుగఁబాటు.** వి. (√ విరుగఁబడు.) ౧. గర్వించుట. (శ. ర.) ౨. ఓడుట.

గీ. విఱుగఁబాటుల వీఁపున వెడలఁగొఱక్కలు...
కవిక. ౨. (శ. ర.)

**విఱుగడ.** వి. (√ విఱుగు.) ౧. విరామము.

వ. సాంసారికబంధంబులం దగులువడి మాన
వులు విఱుగడలేకున్నవారు.
భా. రా. యు. ౨౩౭౫.

౨. విమోచనము.

వ. హనుమంతు ప్రసాదంబున భవత్కర్మపాశం
బులు విఱుగడయ్యె రమ్మని...
మై. ౩. ౧౩౧

**విఱుగు.** అ. క్రి. రూ. విర్గు. తునియు, ముక్క
లగు.

క. నెఱిగలుగు నాఁడునాఁటికి,...చిఱుఁదొడలు
నడుము నట్టును, విఱుగకతక్కదని గిరిజ
వెఱచుచు నడచున్. కు. సం. ౭. ౮.

క. అఱువుడు గావిముసుంగును, విఱిగిన
దండంబుఁ దునిసి వ్రేలెడుగోఁచిన్, బఱి
యయిన కమండలమును, చుఱచుఱయై
వేఁడితెఱఁగు చూపులతోడన్.
ఉ. హరి. ౪. ౮౭.

సీ. సవ్యాపసవ్యముల్ శరములేయుటమాని
నెఱఁకులు విఱుగంగ నిలుగువారు.
వరాహ. ౧౧. ౧౨౬.

౨. విరక్తమగు, ఆసక్తిలేకుండు.

రగడ. మందగమన చౌరకు చౌరకు మావి
మావిమొకలెల్ల, నిందువదన మనసువిఱిగె
నీడ నీడ నిలువనొల్ల. వరాహ. ౩. ౭౨.

క. అని యిటు లతఁడాకామిని,యను వాక్య
ములెల్ల వేఱెయర్థముగా నేర్పున విఱిచి
మాటలాడిన, మనసేమియు విఱుగకపుడు
మదవతి కణఁకన్. సారంగ. ౨. ౭౧.

౩. భయపడు.

గీ. పాండుసుతులం శిఖండియుఁ జండశక్తి,
మొఱయ నొక్కటఁ బైఁబడ్డ వెఱచి తాత,

విడిచినా పుత్రులందఱు విఱిగి యడరిఁ
గలిసిరో కో యూతనికిఁ బడవలసె నకట.
భార. భీష్మ. ౧. ౫౮.

ఆ. ఇట్లు... క్రీడిసెలఁగి దేవదత్తమొత్తుట
యును దత్సైన్యములు నెడఁ విఱిగి పాఱె
భీష్ము మఱువుసొచ్చె. (భార. విరా. ౫. ౭౭.)

౪. ఓడు, పరాజితుఁడగు.

క. విఱిగి భవత్సుతనివహం, బఱిమురిఁ గను
కనిఁ జనంగ... భార. భీష్మ. ౨. ౩౮౦.

క. విఱిగి నిశాటులు రావణు, మఱువున కేతేరఁ
జూచి మనమున కోపం, బెఱుకపడ...
భా. రా. యుద్ధ. ౧. ౫౦౮.

క. అనిఁ జతుర్వదనుం డి, ట్లను రమ్మా పంచ
వదన యన్నతంబులు పల్కెను బ్రహ్మ
నన్నెఱుంగవె, వినుమిది బొంకైన నీకు
విఱిగినవాఁడన్. భోజరా. ౫. ౩౩౨.

౫. పలాయితుఁడగు, పాఱు.

క. మొగమోడఁడితఁడు కౌరవ, జగతీశుఁడు
విఱిగినపుడు జవమున వెనుకం, దగిలి యిది
జూడమోడఁగ, నగు నెడగా దఱుమవలయు
ననియె నతనితోన్.
భార. విరా. ౫. ౩౩౮.

సీ. లోకభీకరులమై నాకంబునకు దాడివెడలి
యింద్రాదుల విఱుగఁదోలి...
వరాహ. ౪. ౫౨.

౬. అడఁగు, నశించు.

సీ. ముంచి చీకటులు కల్పించు నీడలుపోవ,
పద్మాకరంబుల పాఁచివిఱుఁగ...
శుకస. ౩. ౧౦.

నిర్మలమగు—ఇండుపకాయచేత నీళ్ళు విఱుగును.
మనసువిఱుగు—వికృతినొందు, నిర్వేదమునొందు.

క. శూరిమి విఱిగిన సతిపై, నేరమి దోఁచుగతి
విషయనిస్పృహమతియై, కోరికలుడిగినవానికి
నూరక విశ్వంబుమీఁద నొల్లమిపుట్టున్.
కవి. ౫. ౧౫౧.

క. అని యూళ విఱుగనాడిన, విని యంపఱుఁ
జనిరి... వాల్మీకి. ౨. ౧౩౮.

౭. పడు.

ఆ. ఒడలుపెంచు లంజె యుబ్బుకంబునకైన
వేగ విటునిమీఁద విఱిగనేని, పందికొక్కు
మీఁద బండికల్ పడునట్లు, విశ్వ...
వేమ. ౨. ౧౦౧.

౮. (ఋణము) తీఱు.

ఉ. అత్తఱిఁ బోతునెద్దుఁ గనకాంచితదివ్య
విమానమిక్కి పూఁగుత్తులు దేవతల్ గురిసి
కొంచు నుతింప వియత్తలంబునన్, హత్తి
విచార మేమిటికి నత్తువు మాకది శూద్ర
నీవు నే, మత్తుము వానికిన్ విఱిగ నప్పు
దివంబున కేగుదెమ్మనన్.
శేష. ౩. ౨౩౧.

వాడుకలోని ప్రయోగవిశేషములు:
ఉదా: పాలువిఱిగెను, నెత్తురువిఱిగెను, మందు
వలన విషము విరిగెను.

వి. ౧. ఓటమి, పరాజయము.

గీ. నను జయించితివేలయ్య మనుకుమార,
విఱుగెఱుంగ జగంబెల్ల నెఱుఁగు నన్ను,
నెవ్వ రేమేమిగారు నా యేటుదాఁకి, యమ్మ
నీ బుద్ధి కొదుకెక్కదయ్యెఁగాక.
కళా. ౧. ౧౮౨.

౨. ముక్కలగుట, భగ్నమగుట.

సీ. కలశైన విఱుగెఱుఁగని పోటుపరిక
రాచూరుకత్తులమాటు జొచ్చెఁ గొన్ని...
వే. పంచ. ౪. ౨౩౮.

జ: విఱిచికట్టు, విఱుగఁబడు, విఱుగఁబాటు,
విఱుగడ, విఱుగుడు, విఱుచు, విఱువు.

విఱుగుడు. వి. (విఱుగు.) పాకము చెడినవస్తువు.
ఉదా: పాలవిఱుగుడు. మొ. (శ. ర., వా.)
విశ. విఱుపైనది, విఱుచునది.
ఉదా: పాషాణములకెల్లఁ బైఁడిప్రత్తి విఱు
గుడు.

**విఱుచే.** స. క్రి. (√ విఱుగు.) ౧. విఱుగఁ జేయు, త్రుంచు, భగ్నముచేయు.

ఆ. లావు...కోలెమ్మ బ్రల్లన, విఱిచి నడుము ద్రుంచి పీచివైచె. (భార. ఆది. ౬. ౨౧౫.)

క. విఱుతునొ ద్రుంగుదునో తల, దఱుగుదునో యేను జ్వరుఁడ...(ఉ. హరి. ౭. ౧౦౭.)

సీ. విఱుపుకంఠాస్థుల నుఱికి చివ్వంగుల మొత్తి మోదరలాడు మత్తకరుల...
పి. శకుం. ౨. ౧౨.

౨. (గాత్ర) వినామముచేయు.

సీ. కడువికారంబుగా నొడలెల్ల విఱుచుచు మలఁగి రిత్తకరిత్త సెలఁగి నవ్వు...
భార.. విరా. ౨. ౨౫౦.

౩. (నిరసించునపుడు పెదవి) మఱుచు.

పీ. వెల యొప్ప కవలఁబోవిఱుచుమోవియుఁ గోప మొదవెడు చూపు మోమోటఁద్రిప్పు...
ఆము. ౨. ౨౨.

తే...అధరబింబంబు విఱిచి సంధ్యాగమ మని...
నైష. ౬. ౧౩౪.

౪. చంపు.

క. అని గంగడోలు బిగియఁగ, దనమెడరొత్తుకొని కపిలదగ్గఱఁ జనుదెంచినఁ జూచి పుండరీకము, వెనువెనుక కపోవుఁగాని విఱువదు దానిన్. భోజరా. ౬. ౪౦.

పీ. నడవి రాశ్వయుజంబునను వ్రతంబులు ... బ్రహ్మచారుల విఱిచి భక్షణముచేసి...
జై. భా. ౫. ౧౩౦.

౫. ఓడించు.

గీ. జెట్టితండంబుతోడఁ జేపట్టి హొంత్రకారి విఱిచినయట్టు లగ్గలిక విఱుతు,లాఁగు వేగంబు మెఱసి బలంబుసెఱపి,మల్లుతనమున మెప్పింతు మనుజవిభుని. భార. విరా. ౧. ౭౧.

౬. (చేతులు వెనుకకు) త్రిప్పు.

గీ. అనిన...ఆ బహుశ్రుతుండు, వెఱచి వేగను గురుఁబట్టి విఱిచికట్టి... (విక్ర. ౩. ౬౪.)

౭. పదచ్ఛేదముచేయు.

క. అని యిటు లతఁడా కామినియను వాక్యము లెల్ల వేఱెయర్థముగా చేర్పున విఱిచి మాటలాడిన, మనసేమియు విఱుగక పుడు మదవతి కణఁకన్. సారంగ. ౨. ౭౧.

౮. వివరించు, స్పష్టపఱుచు.

ద్వి. అదివిని చెలికత్తె లామాయ కనిరి, యెది రించి పైకొన్న యీ కల మంచి,విధమంచు న క్కల విఱిచిరి చెలులు, విధుముఖి యీ మాట వినమి నచ్చెలులు, వినవమ్మ కల నీకు విఱిచి చెప్పెదము.
ప్రభులింగ. ౨. ౩౪. పా. ౧౫. పం.

౯. ఒకవస్తువునుండి వేరొకవస్తువునువిభాగించు.

క...పాల్, హంస విఱువ నీ ర్విఱిచెను.
ఆము. ౪. ౧౭౭.

**విఱుపు.** వి. (√ విఱుచే.) విఱుచుట, భంగము.

సీ. కలికి మాటలు కిలకిలనవ్వు లోరచూపులు మోవివిఱుపులు గులుకునడలు...
శుక. ౨. ౪౩౩.

విణ. విఱుగుడు.

ఉదా: దానికిది విఱుపు.

**విఱ్ఱనవీఁగు=విఱ్ఱవీఁగు.** అ. క్రి. మిక్కిలి అతిశయించు.

చ. ఘనుఁ డొకయోగితుల్యుఁ డనఁగా ధరణీస్థలియందు సేరికిన్, వినఁ గనరాని రూపమున విఱ్ఱనవీఁగి తపంబుసేయఁగా, వనరుహమిత్రచంద్రనగవర్గసముద్రనదీనదక్షమాజనతతియున్ జలించెనని చారులు చెప్పిన మాట వింటిరే. చిత్రభా. ౨. ౫౨.

**విఱ్ఱవీఁగు=విఱ్ఱనవీఁగు.** (వీఁగు + వీఁగు.) అ. క్రి. ౧. మిక్కిలినిక్కు, మిక్కిలిగర్వించు.

చ. గురుని యుపేక్షఁజేసి తనకున్ సమరోద్ధతి
సెల్లె దాని నీవారవఁడి గానలేఁడు తన
పీరము కాఁగొని విఱ్ఱవీఁగెడున్.
భార. ద్రోణ. ౨. ౪౬.

సీ. వేల్పుటింతులలోన విఱ్ఱవీఁగుచు మేన నవ
రత్నరచనలరవణ మెఱఁగ...
మనుచ. ౨. ౧౧.

సీ. శ్రుతిదూరభోగసక్తత విఱ్ఱవీఁగి తాఁ జరణ
మ్రగజాదపఁ జూపఁజేని. (వసు. ౧, 3౪.)

౨. మిక్కిలియొప్పు, మిక్కిలిఅతిశయించు.

క. వినుమ నీ వదితిసుతుఁడవు, వినతకొడుక నేను
విఱ్ఱవీఁగెడు మనకున్, జనకుఁడు కశ్యపుఁ
డొక్కఁడ దనుజాల సామించి (శోధించి)
చంపుదమ యిరువురమున్.
భార. ఉద్యో. ౨. ౨౧౫.

సీ. వానలు సరవితో వర్షించె సస్యముల్
వేళ్ళఁ గొల్చుగ విఱ్ఱవీఁగి పండె.
మను. ౬. ౧౨౧.

గీ. ఇరుగు పొరుగున వారల యిండ్లసెల్ల, వివిధ
మార్గంబులను సిరుల్ విఱ్ఱవీఁగఁ గుడిచి
కట్టెడు శిశువుల గోము లరసి, తల్లి యెట్లో
ర్చుఁ దనపేదతనమునకును.
కుచేల. ౧. 3౬.

3. సమృద్ధమగు.

ద్వి. పూచె మోదుఁగువృక్షములు విఱ్ఱవీఁగ,
గాచెఁ జూతంబులు...
హరిశ్చ. పూ. ౪33.

చ. విపులధరాధరాగ్రమున వేలుపుమ్రాకల
రచ్చరావి దివ్యపరిమళంబులోఁ గడవ
లంతలు పండుల విఱ్ఱవీఁగు...
వరాహ. ౧౦. ౧౨౦.

**విలంఘనము.** సం. వి. అ. న. ౧. అతిక్రమించుట, దాఁటుట, మీఱుట. ౨. అపరాధము, శాసనోల్లంఘనము.

**విలంఘించు.** సం. స. క్రి. ౧. అతిక్రమించు, దాఁటు.

మ. ఒకపాదంబున భూమిగప్పి దివి నేకో
టన్ నిరోధించి యొం, డొకటన్ మీఁది
జగంబులెల్లఁదాడి యొండొంటన్ విలం
ఘించి ... హరి విభుం డొప్పారె విశ్వా
కృతిన్. భాగ. ౮. ౬౨౫.

౨. లంఘించు, దుముకు.

మ. తలయూచెం గలకంఠి యచ్చెరువునన్
దాటంకరత్నప్రభల్, పలుకంబాఱిన చెక్కు
టద్దములపైఁ బైపై విలంఘింపఁగాన్...
కాశీ. ౫. ౧౬౭.

(ఇట ప్రసరించు అని భావము.)

**విలంఘితము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. దాఁటఁబడినది, అతిక్రమింపఁబడినది. ౨. మీఱఁబడినది, ఉల్లంఘింపఁబడినది. 3. అతిశయింపఁబడినది, మించఁబడినది. ౪. ఓడింపఁబడినది, జయింపఁబడినది.

**విలంబనము.** సం. వి. అ. న. ౧. ప్రేలాడుట, జాగు, ఆలస్యము.

**విలంబము.** సం. వి. అ. పుం. ౧. ప్రేలాడుట. ౨. ఆలస్యము, జాగు. 3. ప్రభవాది సంవత్సరములలో నొకటి. "విలంబి" అని వాడుక.

**విలంబి.** సం. విశే. (న్. నీ. న్.) ౧ ప్రేలాడునది. ౨. జాగుచేయునది, ఆలస్యముచేయునది, మందమైనది.

**విలంబించు.** సం. అ. క్రి. ఆలస్యముచేయు, జాగుచేయు.

శా. ఎండన్ క్రమ్మ్గతి రాకటన్ బడిలి రింకేలా
విలంబింపఁగా, రండో బాలకులార చల్దిఁ
గుడువన్... భాగ. ౧౦. పూ. ౪౯3.

**విలంబిక.** సం. వి. ఆ. స్త్రీ. మలబంధము, రోగభేదము.

**విలంబితము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. అనుకొని యుండునది, అనుకొనియుండునట్లు చేయఁబడినది. ౨. వ్రేలాడునది, వ్రేలాడఁదీయఁబడినది. ౩. చేరియుండునది, అంటియుండునది. ౪. జాగైనది, ఆలస్యమైనది. ౫. మందమైనది. (సంగీ) ద్రుతము మధ్యము గానిది.— వి. అ. న. ౧. జాగు, విలంబము, ఆలస్యము. ౨. నృత్యవిశేషము.

**విలంభము.** సం. వి. అ. పుం. ౧. ఔదార్యము. ౨. అధికదానము, మిక్కిలి యీవి.

**విలక్షణము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. విశేషగుణములులేనిది. ౨. భిన్నమైనది, వేఱైనది. ౩. విశేషలక్షణములుకలది. అసాధారణమైనది. ౪. అశుభచిహ్నములు గలది. శుభచిహ్నములు లేనిది.— వి. అ. న. ౧. వైయర్థ్యము, నిష్ప్రయోజనస్థితి. ౨. పాఱఁజూచుట కనుపెట్టుట.

**విలక్షము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. విశేషగుణములులేనిది. ౨. విశిష్టమయిన (అసాధారణమయిన) చిహ్నములు గలది. ౩. కలవరపడినది, క్షోభపడినది. ౪. ఆశ్చర్యపడినది, విస్మయమునొందినది. ౫. సిగ్గుపడినది, భంగపడినది. ౬. తెచ్చిపెట్టుకొన్నది, స్వాభావికము కానిది. (చిఱునవ్వు మొ.)

**విలక్షించు.** సం. అ. క్రి ఆశ్చర్యపడు.

మ... రామరావణు లసామ్యంబైన యుద్ధంబుఁ
జే, సిరి నక్తందివయేడునాళ్ల దివిజశ్రేణుల్
విలక్షింపగన్. భా. ౯. ౨. ౧౫౫.

**విలక్షితము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. ప్రత్యేకపఱుపఁబడినది. ౨. పరిశీలింపఁబడినది, కనిపట్టఁబడినది. ౩. క్షోభపెట్టఁబడినది. కలఁతనొందింపఁబడ్డది. ౪. విసిగింపఁబడినది. ౫. భేదపఱుపఁబడినది.

**విలగ్నము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. మిక్కిలి యంటియుండునది, అనుబంధించియుండునది. ౨. గుచ్చిపెట్టఁబడినది. ౩. గతించినది, కడచినది. (కాలము.) ౪. సన్ననిది, సుకుమారమైనది.— వి. అ. న. ౧. నడుము, మధ్యము. ౨. కటిప్రదేశము. ౩. మేషాదిరాసుల యుదయము.

**విలపనము.** సం. వి. అ. న. ౧. సంభాషించుట, పలుకుట. ౨. వదరుట, వ్యర్థసంభాషణము. ౩. ఏడ్చుట, విలపించుట. ౪. జిడ్డుగలవస్తువుల మడ్డి.

**విలపించు.** సం. అ. క్రి. పరిదేవనముచేయు, ఏడ్చు.

గీ. హా హరిశ్చంద్ర, కనకపర్యంకతలమునందుఁ
బొందు నీయంగమే యకట చెనఁటి, నేలఁ
గూలినయది నేఁడు నీచదైవ, మిట్టి దశ
దెచ్చెనే దివిజేంద్రభోగ.

వ. అని విలపించుచు నమ్మహాదేవి భర్తృదుఃఖ
భారపీడితయై...

మార్కం. ౧. ౭౨౦౨.

**విలపితము.** సం. వి. అ. న. ఏడ్పు, విలాపము.

**విలయనము.** సం. వి. అ. న. ౧. ద్రవము చేయుట, నీరుగాఁజేయుట. ౨. హరింపఁజేయుట. ౩. తీసివేయుట, తొలఁగించుట. ౪. సన్నముగాఁగొట్టుట, చూర్ణముచేయుట, పొడిగొట్టుట. ౬. పొడి, చూర్ణము.

**విలయము.** సం. వి. అ. పుం. ౧. ద్రవమగుట, ద్రవీభావము. ౨. నాశము, అణఁగిపోవుట. ౩. ప్రపంచనాశము, ప్రలయము.

**విలవిల.** వి. ౧. ప్రాణము విడుచుటయందగు ననుకరణము.

ద్వి. సిరివరు జయలక్ష్మి సేసప్రాలనఁగ, వర కుంభముక్తికప్రాతంబు రాల, విలవిలఁ బ్రాణముల్విడువంగ ధరము, నల వజ్రగతి ముష్టిహతి నుగ్గుఁజేసి, దాని దంతంబు పంతం బున మాడ్చి, పూని తా నావా స్త్రిపుని ముక్తి కనిచె. (అ. మ. క. 3. ౧౪౫.పా.౮.పం.)

౨. తన్నుకొనుటయందగు ధ్వని కనుకరణము.

ద్వి. విలవిలఁదన్నుక విడిచెఁ బ్రాణములు...
ద్వి. నల. ౪. (శ.ర.)

3. విహ్వలత.

(చూ. విలవిలపోవు.)

జః విలవిలఁబడు, విలవిలపోవు.

**విలవిలఁబడు.** అ. క్రి. (విలవిలన్ + పడు.) మ్లానమగు, వాడిపోవు.

క. తెలతెలవాఱఁగవచ్చెను, వెలవెలఁ బాఱె నెలదొవలు విలవిలఁబడియెన్, బలపల నయ్యెం జుక్కలు...(సారంగ. 3.౧౯౪.)

**విలవిలపోవు.** అ. క్రి. (విలవిల + పోవు.) విహ్వలతఁజెందు, అవశమగు.

ఉదా: చేతులు కాళ్లు విలవిలపోవుచున్నవి.

**విలసత్.** సం. శత్రు. (సమాసపూర్వావయవము గానే ప్రయోగము.) ౧. ప్రకాశించుచున్న. ౨. తళుక్కుమనుచున్న. 3. తరంగములవలె చలించుచున్న. ౪. విలాసముగల, క్రీడాశీల మైన, ఆటలం దిష్టముగల.

**విలసనము.** సం. వి. అ. న. ౧. తళుక్కుమనుట, తళుక్కున మెఱయుట. ౨. ఆట లాడుట.

**విలసించు.** సం. అ. క్రి. ప్రకాశించు.

సీ. నందనవనవాసనలసొంపు విలసింప నల సంపుఁజలిగాడ్పు లనుసరింప.
కళా. 3. 3౮.

**విలసితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రకాశించునది, తళుక్కుమని మెఱయునది. ౨. కనఁబడునది, స్పష్టమైనది. 3. ఆటలాడునది, క్రీడాశీలమైనది.—వి. అ. న. ౧. తళుక్కుమని ప్రకాశించుట, తళుక్కుమనుట. ౨. తళుక్కుమనెడిమెఱుపు, ప్రకాశము. 3. స్పష్టముగాఁ గనఁబడుట, స్పష్టపడుట. ౪. ఆట, క్రీడ, శృంగారచేష్ట. ౫. చేష్ట, అభినయము. ౬. ఫలితము, పర్యవసానము.

**విలసిల్లు(లు).** అ. క్రి. ౧. ప్రకాశించు.

ఉ. శ్రీతరుణీముఖోజ్జ్వలశశిద్యుతియున్ బృథుకౌస్తుభార్కబాలాతపదీప్తియు న్నిజ భుజాంతరరమ్యనభస్స్థలిన్ బరిస్ఫీతవిచిత్ర భాతి విలసిల్లఁగ నొప్పు రమావరుండు...
మార్కం. ౧. ౧.

మ. వసుధాచక్ర మవక్రమై విలసిలెన్ వార్థుల్ చెలంగెన్... కృ. శకుం. 3. ౭౬.

౨. సంతోషము.

ద్వి. వేఁటాడఁ జయ్యన విచ్చేయుమనిన,మాటకు విలసిల్లి మనుజవల్లభుఁడు, వానికిఁ దన కట్టువర్గంబు నిచ్చి...
నవనాథ. ౧. ౪౭. పా. ౨౮. పం.

**విలాతి.** వి. దేశము.

చ...వెలలేని సొమ్ములన్, వెసఁ గడుఁగూర్మి తోడఁ జదివించిన పిమ్మట గారవంబుతోఁ, బసుపున కిచ్చె నంత వృషపర్వుఁడు కొన్ని విలాతు లింతికిన్. యయా. ౪. ౧౨౨.

చ...వసుమంతుఁడు నాఁ బ్రసిద్ధిగాంచిన యొకసెట్టియుండు నలసెట్టిన మాఱువిలాతి కేఁగుచున్, తన ధనరాసిపైనిడిన దాల్చి...
వేం. పంచ. ౧. ౪౩౯.

సీ. సౌవర్ణకలశముల్ సవరించిన విలాతి సక
 లాతిపరదాల సొమజములు.

రంగా. ౧. ౧౫౬.

**విలాపము.** సం. వి. అ. పుం. పరిదేవనము, ఏడ్పు.

**విలాపించు.** సం. అ. క్రి. దుఃఖించు.

సీ. అని విలాపింప నూరార్చి యోటికిఁ గ్రేపుఁ
 బాసి గొడ్డాలిలేదు పగిది నడలె,దు...

జై. భా. ౬. ౨౬౫.

**విలాసకాననము.** సం. వి. అ. పుం. శృంగార వనము, లీలోద్యానము.

**విలాసనము.** సం. వి. అ. న. ౧. ఆట, క్రీడ, వినోదము. ౨. శృంగారచేష్ట, సయ్యాట, సరసము.

**విలాసమందిరము.** సం. వి. అ. న. లీలాగృహము, ఆనందమందిరము, విలాసముల కేర్పడిన యిల్లు.

**విలాసము.** సం. వి. అ. పుం. ౧. క్రీడ, ఆట, వినోదము. ౨. స్త్రీల శృంగారచేష్టావిశేషము, స్త్రీల యంగవిక్షేపాదులందలి తాత్కాలికవిశేషము. 3. వగలాడితనము, వలపించుట. ౪. స్త్రీలసాత్వికభావవిశేషము. ౫. చక్కఁదనము, సౌందర్యము. ౬. తళుక్కుమని మెఱయుట.

**విలాసి.** సం. విణ. (న్. నీ. న్.) ౧. క్రీడాశీలుఁడు, ఆటలాడెడివాఁడు, శృంగారచేష్టలు గలవాఁడు, వలపించువాఁడు.—వి. న్. పుం. ౧. విషయసుఖమునుగోరుమనుష్యుఁడు. ౨. అగ్ని. 3. చంద్రుఁడు. ౪. పాము. ౫. కృష్ణుఁడు. ౬. శివుఁడు. ౭. కామదేవుఁడు, మన్మథుఁడు.

**విలాసించు.** సం. అ. క్రి. క్రీడించు.

సీ. తునకు రింగులువార మణితళ్వాణంబునఁ జెంత
 నల్లన విలాసించె కౌరి.

పి. శకుం. 3. ౨౧౭.

**విలాసిక.** సం. వి. అ. స్త్రీ. శృంగారరస బహుళమై యేకాంకమయిన నాటికాభేదము.

**విలాసిని.** సం. వి. ఈ. స్త్రీ. శృంగారచేష్ట లెక్కువగల స్త్రీ; స్త్రీ. ౨. వేశ్య.

**విలిఖనము.** సం. వి. అ. న. ౧. గోఁకుట, గీఱుట. ౨. వ్రాయుట.

**విలిఖించు.** సం. స. క్రి. వ్రాయు.

మ. కళలం దేఱు మెఱుంగుఁజెక్కులపయిన్
 గస్తూరికాపత్రముల్, విలిఖింపన్ ...

చంద్రా. ౬. ౧౨౪.

**విలిప్తము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. పూయఁబడినది, రుద్దఁబడినది. ౨. మలినముగాఁ జేయబడినది, కలంకితము, అపవిత్రితము.

**విలియవేయు.** స. క్రి. ౧. సరిచూచు. (శ.ర.) ౨. పూఁటకాపుగా సేర్పఱచు. (వాచ.)

**విలీనము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. అణఁగియున్నది, అంతర్ధానమైనది. ౨. అంటియున్నది, ఆశ్రయించియున్నది. 3. కరఁగినది, ద్రవరూపమునొందినది. ౪. నశించినది, చచ్చినది.

**విలు-విల్లు.** వి. దే. ధనుస్సు.

క... విలు విఱుగఁజేసి యతనిం, దొలఁగంగాఁ
 జేసె నరుఁడు దోర్బలలీలన్.

భార. విరా. ౫. ౬౪.

క. విలునమ్ముసంకుఁజక్రము, బలకయుఁ గాషే
 యకంబుఁ బాళముగదయున్, గల యొని
 మిదిచేతుల దాఁపల వలపలఁ దాల్చె కౌరి
 బాణుని యనికై. హ. హరి. ౭. ౨౫.

శా...ఏ, శౌర్య సీతయు లక్ష్మణుండుఁ దను సేవింపంగ విల్గాని చెల్వొప్పలీలన్ దగు రామ మూర్తి రఘునాథాధీశ్వరుం బ్రోవుతన్.

విజ. వి. ౧. ౧.

జః విలుకాఁడు, విలుదాలుపు, విలుమంది, విలు విద్దె, విలువిద్య.

**విలుంచనము.** సం. వి. అ. న. ౧. చీల్చుట, ఛేదించుట, పెరుకుట. ౨. (తోలు) ఒలుచుట.

**విలుంఠనము.** సం. వి. అ. న. ౧. దోఁచుట' కొల్లపెట్టుట. ౨. భూమిపై దొర్లుట, పొర లుట.

**విలుంపకుఁడు.** సం. వి. అ. పుం. దొంగ, తస్కరుఁడు, దోఁచుకొనెడివాఁడు.

**విలుకా(ల్కా)ఁడు.** వి. (విలు + కాఁడు.) ధానుష్కుఁడు, విల్లుపూనినవాఁడు.

సీ. అతిరథోత్తముఁడు ద్రోణాచార్యుఁ డందలి యిందలి విలుకాండ్రకెల్ల గురుఁడు.

భార. ఉద్యో. ౪. ౨౯.

క. అసమశరుఁ డించు విల్లును, కుసుమశరమ్ము లను విడిచి కొమ్మలభ్రూనేత్రసమృద్ధిచేతఁ దత్పురిఁ, బసగలవిలుకాఁ డవంగ బరగుచు నుండున్.

విక్ర. ౧. ౭౧.

గీ. అలరు విల్కానితల్లికిఁ బ్రార్థితార్థ, కల్ప వల్లికి మ్రొక్కుఁగఁ గంటి మంటి.

కాశీ. ౩. ౪౧.

ద్వి. విలుకాండ్రురిద్దరు వివిధశస్త్రాస్త్ర, కలితులై యట పంపకడ నున్నవారు.

రం. రా. కిష్కిం. ౧౬౭. పా. ౨౭ పం.

(చి. ని. పా. విలుపూని యిద్దరు, ముద్రి. పా.)

**విలుచే(ల్చు).** స. క్రి. ౧. కొను.

గీ. జీవహింస యొన్నండును జేయ ననఘు, లొరులు సంపి తెచ్చిన మాంస మొనర విలిచి, తగినవెల కమ్మి బ్రదుకుదుఁ దద్ధనమున...

భార. అర. ౫. ౩౩.

సీ...ఎక్కుడు సొమ్ము కలవాఁడ నెంత యర్థం బైన నిచ్చి నిన్ను, విలిచెదఁ జెప్పుమా వెల యన్న...

మార్కం. ౧. ౨౨౬.

చ...ధూర్జటిన్, విలిచినవాఁడు భక్తిమయ విత్తమునన్ ధరణీశ వీరుఁడై నిలిచినవాఁడు శౌర్యమున నీజనకుండు...

ఉ. హరి. ౫. ౭౯.

చ...క్రొవ్విరిమల్లెపూవుబొత్తులు దళనాధర ద్యుతులఁదోఁచినఁ బైకొసరీమిగా విటుల్, విలువగ వారి చిత్తములు విల్తురు తత్పురిఁ బుష్పలావికల్.

వి. శకుం. ౧. ౭౩.

౨. అమ్ము, విక్రయించు.

క. కొలిచితిమో పెలువేల్పుల, నిలిచితిమో శూలధరుని నిందించునెడన్, దలఁచితిమో దుర్వృత్తులు, విలిచితిమో వేదమంత్ర విద్యావితతుల్.

చెన్న. ౫. ౪౦౬.

గీ. విరులు విలుతురు పుష్పలావికలు వీఁట.

వసు. ౧. ౧౦౯.

గీ. పొందుగానిపొందు పొసఁగ దెక్కువయేల, యేకతమున నెవ్వఁడేని యొరుల, ధనము కానిదాని దాను విల్చుటయది, మెచ్చు గాదు వాఁడు ముచ్చుగాని.

విజ్ఞా. ప్రా. ౨౪.

గీ. అలరు బొంకులఁ జెలఁగించి యఖిలకమన, పాళి తమదండకై యాసపడఁగఁజేసి, విరులు విల్తురు కుసుమలావికలు వీఁట....

చంద్రి. ౧. ౧౦౫.

౩. పిలుచు, ఆహ్వానించు.

గీ. వెలయు విలిచె ననంగఁ బిలిచె ననుట.

ఆం. భా. ౩. ౧౩౪.

జః విలువ, విలువకత్తె, విలువకాఁడు, విలువ జవరాలు, విల్చికోలు.

**విలుదాలుపు(ల్పు).** వి. (విలు + తాలుపు.) ధనుర్ధరుఁడు.

క. విలుదాలుపుఁ బ్రోడలు తోడ, చెలిజంట
కొలంపురాచసింగపుఁగొడుకుల్, నిలిచిరటఁ
బుడమిపుట్టగు, నెలఁతుకయుం దాముఁదపసి
నెలవున నంతన్. రామా. ౫. ౫౩.
(శ. ర. పా. విలుదాల్పు, ముద్రి. పా.)

గీ. తరలివచ్చిన నవ్విలుదాల్పుగడిమి, నెదురు
కొని పెక్కునెఱదూపు లేసి యెల్ల, నల్ల
ద్రావుడుమూఁకలఁ ద్రెళ్లఁజేసి, యగ్గ
రాసుల పైని బిట్టార్చుకొనుచు.
అచ్చ. రా. అర. ౧౨.

**విలుప్తము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. లోపించి నది, తక్కువపడినది. ౨. విఱుఁగఁబడినది, చీల్పఁ బడినది. ౩. బలాత్కారముగాఁ బట్టుకొనఁబడి నది. ౪. కొల్లగొట్టఁబడినది, దోచుకొనఁబడి నది. ౫. నశింపఁజేయఁబడినది, ధ్వంసము చేయఁబడినది. ౬. అంగవిహీనము గావింపఁ బడినది, వికలాంగము గావింపఁబడినది.

**విలుమంది.** వి. (విలు + మంది.) విల్లులు ధరిం చిన జనసమూహము, విలుకాండ్రు.

ఆ. వలసచెదర నృపతి కలఁగక ప్రజ వగ,
లార్పఁ బనిచి కనుమలందునిలువ, వేఱువేఱ
యేర్చి విలుమందిఁ బనిచి తా, దుడుకుపెండె
ములుకవోడమ వెడలి. అను. ౩. ౨౭.

**విలులితము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. నలపి వేయఁబడినది. ౨. చలింపఁజేయఁబడినది. ౩. తబ్బిబ్బుచేయఁబడినది, తాఱుమాఱుచేయఁ బడినది. ౪. చంచలమైనది, స్థిరతలేనిది, నిలుకడ లేనిది.

**విలువ(ల్వ).** వి. (√ విలుఘే.) ౧. వెల, క్రయము, ఖరీదు, మూల్యము.

ఆ. కర్షకునకు నేలకాల మెఱుంగుట, జట్టి
వాని కేది సంభవించె, నందు విలువ మొదల
నగు లాభమును నెడ, నక్రయముగల్గుటయు
శివప్రదములు. భార. అను. ౫. ౩౫.

కం. దేవార్చనానిమిత్తము, దావేఱొకతోఁట
వేయఁదలఁచి యతిం డ్రా, తావు గృహస్థుల
చేరన్, వేవిలి సుక్షేత్రభూమి విలువకుఁ
గొనియెన్. వైజ. ౧. ౭౩.

వ. ...మలయంబునంగల చలువకు విలువ యెయ్యది... మను. ౧. ౭౨.

సీ. ఈ చంద్రబింబాస్య నీ భూసురేంద్రున కీవు
మొదల విక్రయించువేళ, నీవిల్వలోని
వాఁ డీనందనుఁడు గాఁడు వేఱె పుత్రునికిని
విలువ వలయు. (హరిశ్చ. ౪. ౧౩౬.)
(విల్వసేయు—కొను.

మత్తకోకిల. ఆజగత్పతిచిత్తగేహమునందుఁగాఁ
పురముండఁగా, బూజసేయకయుండు వేల్పు
లఁ బూనికొల్వఁగఁబోవుటల్, రాజసంబునఁ
జేతి కౌస్తుభరత్న మొల్లక చేలపై గాఁజుఁ
బూసలు విల్వసేయఁగఁ గాంతుసేసదకే
మనన్. వాసిష్ఠ. ౪. ౧౯.

౨. ప్రాముఖ్యము.

గీ... గౌరి తనచారుసౌభాగ్యగౌరవంబు, విలువ
పోయిన చెలువున విన్ననయ్యె.
హర. ౩. ౭౩.

**విలువకత్తె.** వి. (విలువ + కత్తె.) ౧. వెలయాలు, వెలవెలఁది, పణ్యస్త్రీ.

చ... మాణ్మగల పగ్గెలు తగ్గులుజేసి ప్రోలునన్,
గలసి చరింతు రవ్విలువకత్తెలు మారుని
కత్తులో యనన్. ప్రబంధ. ౧౭.

౨. వెలయిచ్చి వస్తువుఁగొను స్త్రీ.
(చూ. విలువకాఁడు.)

**విలువ(ల్వ)కాఁడు.** విశ. (విలువ + కాఁడు.) వెలయిచ్చి వస్తువును కొనువాఁడు, క్రేత.

ఉ. ఎత్తుల యొప్పుకంటె సరమెత్తుట యొప్పుగఁ
జొక్కివిల్వకా, డొత్తడిఁబుష్పముల్
కొసర కూరకయునిక్కి నల్ల నవ్వుచున్.
విక్ర. ౧. ౭౩.

**విలువజవరాలు.** వి. బో. (విలువ + జవరాలు.) వెలయాలిది, వేశ్య.

గీ. తొలుత రతిదేల్చె నాగదత్తుండు తనదు, విలువజవరాలికూటమి గలఁచి తలఁచి...

ప్రబంధ. ౪ ౨౦.

**విలువిద్దె.** వి. (విలు + విద్దె.) ధనుర్విద్య.

చ... కరితురగాదిరోహముల గద్దఱులై విలువిద్దెలందు నేర్పరులయి చాతురంగరణరంగ సమర్థులునైరి ధారుణిన్.

చంపూ. రా. ౨. ౫౩.

**విలువిద్య.** మి. వి. (విలు + విద్య.) ధనుర్విద్య.

క. విలువిద్యఁ గఱచుచుండిరి, బలయుతులు కుమారకులు... (భార. ఆది. ౫. ౧౪౧.)

సీ. జమదగ్నిసుతకృపాశ్రయమునఁ బడసిన విలువిద్య కలరూపు వెలయఁజేయ.

భార. విరా. ౪. ౨౦౫.

**విలూనము.** సం. విశ. (అ. ఆ. అ.) ఖండింపఁబడినది, నఱకఁబడినది.

**విలేఖనము.** సం. వి. అ. న. ౧. గోఁకుట, గీఱుట, వ్రాయుట. ౨. త్రవ్వుట. ౩. నిర్మూలముచేయుట, వేళ్లతోఁగూడఁ బీకివైచుట. ౪. వడఁదీయుట.

**విలేపనము.** సం. వి. అ. న. ౧. పూయుట, అలఁదుట. ౨. సువాసనపరిమళద్రవ్యము (చందనాది.)

**విలేపని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. పరిమళద్రవ్యములసువాసనగల స్త్రీ. ౨. సువేష, మంచిదుస్తులు ధరించిన స్త్రీ. ౩. యవాగువు, గంజి, జావ.

**విలేపము.** సం. వి. అ. పుం. ౧. పైనిబూసికొనెడి పదార్థము. (చందనాదికము.) ౨. సున్నపుగచ్చు. ౩. సున్నము. ౪. పూయుట, సున్నముచేయుట, గచ్చుచేయుట.

**విలేపి.** సం. వి. ఈ. స్త్రీ. యవాగువు. గంజి, జావ.

**విలేపిక.** సం. వి. ఆ. స్త్రీ.=విలేపి.

**విలేప్యము.** సం. వి. అ. పుం.=విలేపి.

విశ. (అ. ఆ. అ.) పైనిబూసికొనఁదగినది. (చందనాదికము.)

**విలోకనము.** సం. వి. అ. న. ౧. చూచుట, కనుఁగొనుట. ౨. చూపు.

**విలోకించు.** సం. స. క్రి. వీక్షించు.

వ...నూత్రంబున మణిగణంబులంబోలె నున్న కూన్యలోకంబులు విలోకించి...

వరాహ. ౨. ౧౪౯.

ద్వి. భానుకోటిప్రభఁ బ్రత్యక్షమయ్యె, నైన విలోకించి...

ద్వి. పరమ. ౩. ౧౬౩. పా.

**విలోకితము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. చూడఁబడినది. ౨. పరీక్షింపఁబడినది, పరిశీలింపఁబడినది.—వి. అ. న. చూపు, దృష్టి.

**విలోచనము.** సం. వి. అ. న. నేత్రము, కన్ను.

**విలోడనము.** సం. వి. అ. న. ౧. మథించుట, త్రచ్చుట, ఇటునటుఁ గదుపుట.

**విలోడితము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. మథింపఁబడినది. ౨. ఇటునటు కదల్పఁబడినది. ౩. నేలపై దొర్లింపఁబడినది. —వి. అ. న. చేల్ల, తక్రము.

**విలోపనము.** సం. వి. అ. న. ౧. లోపింపఁజేయుట, తక్కువపఱచుట. ౨. భేదించుట, నఱకుట. ౩. తీసికొనిపోవుట. ౪. నశింపఁజేయుట, నాశము.

విలోపము. సం. వి. అ. పుం. ౧. తీసికొని పోవుట. ౨. బలాత్కారముగాఁ బట్టుకొనుట. ౩. దోఁచుకొనుట, కొల్లగొట్టుట. ౪. అదర్శనము, కనఁబడకుండుట, అంతర్ధానమగుట, నాశము.

విలోభనము. సం. వి. అ. న. ౧. ఆశచూపి యాకర్షించుట, ఆశకొలుపుట. ౨. దుర్మార్గమునఁ బ్రవేశపెట్టుట, మంచిత్రోవనుండి తప్పించుట. ౩. ముఖస్తుతి, ఇచ్చకము.

విలోభము. సం. వి. అ. పుం. ౧. ఆశగొలిపి యాకర్షించుట, మోసగించుట. ౨. మరులు గొలుపుట, దుర్మార్గమునఁ బ్రవేశపెట్టుట.

విలోమజాతుఁడు. సం. విశ. (అ. ఆ. అ.)= విలోమజుఁడు.

విలోమజిహ్వము. సం. వి. అ. పుం. ఏనుఁగు.

విలోమజుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) (విపరీత క్రమమునఁ బుట్టినవాఁడు.) తండ్రికంటె నుత్తమజాతిగల తల్లికిఁ బుట్టినవాఁడు. (వ్యతి. అనులోమజుఁడు.)
ఇత్లే: విమలోమవర్ణుఁడు, విలోమోత్పన్నుఁడు.

విలోమము. సం. విశ. (అ. ఈ. అ.) ౧. విరుద్ధము, విపరీతము, తలక్రిందైనది. ౨. విరుద్ధక్రమమునఁ బుట్టినది. ౩. వెనుకఁబడినది, హీనస్థితిలోనున్నది.- వి. అ. పుం. ౧. విరుద్ధక్రమము. ౨. కుక్క. ౩. పాము.- న. నీరు తోడెడి యంత్రము.

విలోమి. సం. వి. ఈ. స్త్రీ. ఉసిరిచెట్టు.

విలోముఁడు. సం. వి. అ. పుం. వరుణుఁడు.

విలోలనము. సం. వి. అ. న. ౧. కదుపుట, ఆడించుట. ౨. త్రుద్ధముగాఁ జేయుట, ఉలియఁ కొట్టుట.

విలోలము. సం. విశ. (అ. ఆ. అ.) చంచలము, కదలునది. ౨. విడిపోయినది, విరియఁబోసికొనఁబడినది. (జుట్టు.) ౩. మిక్కిలి తృష్ణగలది.

విలోహిత. సం. వి. ఆ. స్త్రీ. అగ్నిహోత్రుని సప్తజిహ్వలలో నొకటి.

విలోహితము. సం. విశ. (అ. ఆ. అ.) ధూమ్రవర్ణముగలది, ఎఱుపును నలుపును గలసినది. ౨. ఎఱ్ఱనిది, రక్తవర్ణముగలది.

విలోహితుఁడు. సం. వి. అ. పుం. రుద్రుఁడు.

విల్చికోలు. వి. (√ విలుఁచే.) వెలయిచ్చికొనుట.
ఉ...ఇది పథ్యము సుమ్ముక నక్కనిచ్చి, సింహమ్ముల విల్చికోలుఁఅదె? యన్యులె వారలు కారవేశ్వరా.
భార. సభా. ౨. ౧౮౧.

విల్లు-విలు. వి. డె. ధనువు, ధనుస్సు.
బ. విండులు, విల్లులు, విండ్లు.
ఉ. వేరొకవిల్లు పుచ్చుకొని విండులు రెండును ద్రుంచి మేనులం దూఱఁగ నేసె...
భార. ద్రోణ. ౩. ౮౩.
గీ...అర్జునుఁ దొంటిభార్గవుఁడు వింట,నిట్టిఁడే యని పొగడంగ నెల్లజనులు.
భార. ఆది. ౫. ౨౩౦.
సీ. జగములాక్కమ్మడి సాధింపనెత్తిన రతిమన్మథులవిండ్లు రమణి బొమలు.
నైష. ౨. ౧౫.
దీని భేదములు : తడవిల్లు, వెదురువిల్లు, సెలకువిల్లు. మొ.
గీ. విల్లుపట్టిన నెలపదినాళ్ళలోన, వీఁకగలిగిన తడవిల్లు వెదురువిల్లు, సెలకువిల్లును మొందలైన చేగవిండ్లు, చులుకుగాఁదీసి శబరేంద్రసూనుఁ డేయు. కాళ. ౩. ౩౫.

జ: వింటికోల, వింటిజోదు, వింటిపట్టు, వింటి పెట్టు, వింటిబద్ద, వింటిరాని, వింటివాఁడు, విండ్లమ్మలాట, విండ్లవారు.

**విళగు.** వి. ఒక స్వరస్థాయి.

ద్వి. తిక్షాయి హళాయలును రక్షిలవిళగు, చొక్షాయి యాదిగా సొగయుశాయములు. బస. పు. 3. 80 పా. ౧౫. పం.

**వివంచిషు(ఁడు)వు.** సం. విణ. (ఉ.) వంచన చేయ నిచ్ఛగలవాఁడు, మోసపుచ్చఁ దలఁచిన వాఁడు, మోసగాఁడు.

**వివక్ష.** సం. వి. ఆ. స్త్రీ. ౧. చెప్పనిచ్ఛ, చెప్పవలయునని తలంపు. ౨. ఇచ్ఛ, కోరిక, ౩. అర్థము, అభిధేయము. ౪. ఉద్దేశము, తలంపు.

**వివక్షించు.** సం. స. క్రి. చెప్ప నిచ్ఛించు.

మ. చలితాఘంబగు వేదభూజమునకున్ శాఖోపశాఖాచయంబులు పెక్కుల్ గల వన్నియుం బ్రకటితంబుల్గా వివక్షింప నా, జలజాతాసనుఁడైన నోపఁడు... వి. పు. ౪. ౬౩.

**వివక్షితము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. చెప్ప నుద్దేశింపఁబడినది, తలఁపఁబడినది. ౩. ఇచ్ఛ గింపఁబడినది, కోరఁబడినది. ౪. ఇష్టమైనది, ప్రియమైనది.—వి. అ. న. ౧. ఉద్దేశము. అర్థము. అభిధేయము.

**వివక్షు(ఁడు)వు.** సం. విణ. (ఉ.) పలుకనిచ్ఛ గలవాఁడు, పలుకసిద్ధముగా నున్నవాఁడు.

**వివత్స.** సం. వి. ఆ. స్త్రీ. దూడలేని యావు.

**వివదించు.** సం. అ. క్రి. వాదముచేయు.

సీ... వేదాంతమది వార్థి వినఁదగుఁ దెల్పెద పూర్వపక్షగ్రాహ పుంజయుతము, సిద్ధాంత ఝషములచే సంకులంబగు నజ్ఞానభీరువు లందు మునిఁగి, చిత్తశుద్ధియు లేక చెడి పక్షి యింపుచు వివదింతురెపుడు వివేక మెడలి,... సేతు. 3. 83. పా.

**వివధము.** సం. వి. అ. పుం. ౧. కావడి. ౨. మార్గము, దారి. ౩. బరువు, భారము. ౪. ప్రాఁతధాన్యము, నిలవధాన్యము. ౫. పాత్రము. (శబ్ద. ము.)

**వివధికుఁడు.** సం. వి. అ. పుం. ౧. బరువు మోయువాఁడు, కావడివాఁడు. ౨. కావడితో సరుకులు తీసికొనిపోయి యమ్మకొనువాఁడు.

**వివరకట్టు.** అ. క్రి. (√ వివరము.) స్పష్టపడు.

గీ. గజ్జియలమ్రోఁత గలగలగలయటంచు, వివర కట్టుక రయమున వినికిఁజేయు, విరులతేరు వితానముం దరికి నరిగి, స్థాయిగావించి యంతట హాయిమించి. మల్లుపు. ౪. ౬౫.

**వివరణము.** సం. వి. అ. న. ప్రకటించుట, బైలు పఱచుట, తెలుచుట. ౨. కప్పులేకుండఁ జేయుట. ౩. వివరించుట, స్పష్టముగాఁ జెలు పుట, వ్యాఖ్యానము. ౪. వ్యాఖ్యానమునకు వ్యాఖ్యయగు గ్రంథము. ౫. వర్ణించుట, వర్ణన. ౬. వాక్యము.

**వివరనాళిక.** సం. వి. ఆ. స్త్రీ. మురళి, పిల్లన గ్రోవి.

**వివరపుట్టు.** అ. క్రి. (వివరము + పుట్టు.) విశద మగు, స్పష్టమగు.

క. నావిని రక్తాక్షుఁడు చిరజీవిం బరికించి చెచ్చి చేసెడు పని యే, మీ వివరపుట్టఁ జెపుమా, నీ వనుటయు నాతఁ డాతనికి నిట్లనియెన్. కేం. పంచ. ౩. ౨౫.

గీ. వివరపుట్టంగ నాను పూర్వియునుగాఁగఁ, దన్నెఱింగింపు మన... (విప్ర. ౫. ౪౬.)

**వివరము.** విశే. (సం. వివరణమ్.) విస్పష్టత.

ద్వి. రవళిసేయక పదరక యొక్కరొకరొ,
వివరమ్ముగా మాకు వివరింపుఁ డనిన.
ద్వి. పరమ. ౪. ౩౩౫. పా.

జః వివరకట్టు, వివరపుట్టు, వివరి, వివరించు.

**వినరము.** సం. వి. అ. న. ౧. రంధ్రము. ౨. సందు, మధ్యనుండెడి యవకాశము, బీట. ౩. నిర్జనప్రదేశము. ౪. దోషము, లోపము, ౫. గాయము. ౬. (గణిత) తొమ్మిదిసంఖ్య.- పుం. విస్తృతి. వివివి.

**వివరి.** విశే. (√ వివరము.) విచారణశక్తి కలవాఁడు, వివేకి.

క. వివరికి వివరించిన కృతి, చవిపాలన్ బంచదార చవిగూర్చును నా, యవివేకికి వినుపించిన,కవిత వరద చింతపండు గలుపుట సుమ్మీ.
ద్వా. ౧. ౧౭.

**వివరించు.** స. క్రి. (√ వివరము.) ౧. వక్కాణించు, స్పష్టపఱుచు.

వ. వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న నారాయణాభిధానంబులు గలిగి విలసిల్లు నా మూర్తుల విధంబు వివరించెద.
మార్కం. ౧. ౧౧౧.

౨. విచారణచేయు, ఆలోచించు.

అ. తల్లివంక నైదుతరములు వివరించి, తండ్రివంక నేడుతరము లరసి, వారివారి గోత్రవంశసంకరము గానియక యతివఁ బెండ్లియయిన మేలు. వి. పు. ౪. ౧౭౪.

శా. ఆబాధల్ పడలేక ధూరమణి శోకాక్రాంతమూర్ధవీథీబద్ధారుణపాణిపద్మములతో దేవాజఖం బెల్ల తత్తాబుద్ధిన్ వివరింపు నీ మతులచేఁ గాలెంజుమీ యంచు భాషాబద్ధుండగు బ్రహ్మదేవుఁ గని విజ్ఞాపించె ఘోషించుచున్. కాశ. ౨. ౩౧.

క. వివరింప కొడము లేదిఁక, సుభిదను శోబనపు జలక మొనరింపంగా, ఐవరాంధ్రఁ బనుపు మనువుడుఁ, బువుబోఁడియు నలరి తగిన పొలఁతులఁ బనిచెన్. యయా. ౪. ౭౫.
(ఇట నాలస్యముచేయు, అని శ. ర.)

౩. చెప్పు, వక్కాణించు.

ద్వి. వివరమ్ముగా మాకు వివరింపుఁ డనిన...
ద్వి. పరమ. ౪. ౩౩౫. పా.

**వివర్జనము.** సం. వి. అ. న. విడిచిపెట్టుట, త్యజించుట, బహిష్కరించుట.

**వివర్జించు.** సం. స. క్రి. విడుచు.

క. మమకారంబు నహంకారము సంసారానుబంధరజ్జువులని చిత్తముల వివర్జింతురు సంయము లీవు నడుపుమా తదాచారంబున్.
భోజరా. ౬. ౩౦.

**వివర్జితము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. విడువఁబడినది, త్యజింపఁబడినది. ౨. తప్పింపఁబడినది. ౩. (తఱచు సమాసాంతమున) శూన్యమైనది, విరహితమైనది. ౪. ఈయఁబడినది.

**వివర్ణము.** సం. విశే. ౧. కాంతిలేనిది, పాలిపోయినది, తెల్లఁబడినది. ౨. రంగుమాసినది. ౩. నీచము, అధమము. ౪. బుద్ధిహీనము, మూఢము, తెలివిలేనిది. ౫. అక్షరముల నెఱుంగనిది, చదువురానిది.

**వివర్ణుఁడు.** సం. వి. అ. పుం. ౧. వర్ణబాహ్యుఁడు, వెలివేయఁబడినవాఁడు. ౨. నీచజాతివాఁడు. ౩. నిందితవృత్తి నవలంబించిన మనుష్యుఁడు.

**వివర్తనము.** సం. వి. అ. న. ౧. గుండ్రముగాఁ దిరుగుట. ౨. ఇటునటుదొర్లుట. ౩. వెనుకకుఁ దిరుగుట. ౪. క్రిందికిదొర్లుట, దిగుట. ౫. ఉండుట, నివసించుట. ౬. భక్తిపూర్వకమైన నమస్కారము. ౭. వివిధ స్థితులను గడుపుట,

నానావస్థలు చెందుట. ౯. మాఱినస్థితి, అవస్థాంతరము.

**వివర్తము.** సం. వి. అ. పుం. ౧. గుండ్రముగాఁ దిరుగుట, చుట్టివచ్చుట. ౨. ఇటునటుదొర్లుట, పొరలుట. ౩. వెనుకకుఁదిరుగుట, మరలుట, ౪. నృత్యము. ౫. మార్పు, రూపాంతరప్రాప్తి. మాఱినస్థితి. ౬. (వేదాంత) కనఁబడురూపము, అయథార్థరూపము, అవిద్యవలనఁ గలిగిన యసత్యరూపము. ౭. రాశి, సమూహము, సంఘము, గుంపు.

**వివర్తవాదము.** సం. వి. అ. పుం. జగత్తు (దృశ్యప్రపంచము) మిథ్యయనియు బ్రహ్మము మాత్రమే సత్యమనియు దెలుపు వేదాంత సిద్ధాంతము.

**వివర్తితము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. గుండ్రముగాఁ ద్రిప్పఁబడినది. ౨. ఇటునటు త్రిప్పఁబడినది. ౩. ఖండింపఁబడినది, తునియలుగాఁ జేయఁబడినది. ౪. విప్పఁబడినది. ౫. వంకరగాఁ జేయఁబడినది, వంపఁబడినది.

**వివర్ధనము.** సం. వి. అ. న. ౧. పెరుఁగుదల, వృద్ధినొందుట. ౨. పెంపు, ఆధిక్యము, అభివృద్ధి, గొప్పతనము. ౩. అధికమగుట. ౪. ఖండించుట, నఱకుట, విభజించుట.

**వివర్ధించు.** సం. స. క్రి. విశేషముగా వర్ధిల్లఁజేయు.

క. ఈ కులము వివర్ధింపఁగ, నా కభిమతము...
భార. ఆది. ౫. ౯.

**వివర్ధితము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. పెంపఁబడినది. ౨. అభివృద్ధి నొందింపఁబడినది. ౩. సంతోషపడినది. సంతోషపఱుపఁబడినది. ౪. ఖండింపఁబడినది, నఱకఁబడినది, విభజింపఁబడినది.



**వివశుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. (ఇతరుల) వశమునలేనివాఁడు, స్వతంత్రుఁడు. ౨. వశము తప్పినవాఁడు, పరాధీనుఁడు, అస్వతంత్రుఁడు. ౩. ఒడలెఱుంగనివాఁడు, స్మృతి తప్పినవాఁడు. ౪. చనిపోయినవాఁడు, మృతుఁడు.

**వివసనుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) దిగంబరుఁడు, దిసమొలవాఁడు.- వి. అ. పుం. జైనసన్యాసి.

**వివస్వంతము.** సం. వి. త్. పుం. అర్కవృక్షము, జిల్లేడుచెట్టు.

**వివస్వంతుఁడు.** సం.వి.త్.పుం.౧. సూర్యుఁడు. ౨. అనూరుఁడు, సూర్యసారథి. ౩. దేవత, వేల్పు.

**వివహము.** సం. వి. అ. పుం. ౧. అగ్నిదేవుని సప్తజిహ్వలలో నొకటి. ౨. వివాహము.

క. అనాగసచివధీమణి...పోతమాంబ వివహం బయ్యెన్.
పి. శకుం. ౧. ౪౦.

**వివాకుఁడు.** సం. వి. అ. పుం. విచారణచేయువాఁడు, ప్రాడ్వివాకుఁడు, న్యాయాధికారి.

**వివాదము.** సం. వి. అ. పుం. ౧. కలహము, జగడము. ౨. వాదము, సయుక్తికముగ నొకయంశమునుగూర్చి చర్చించుట. ౩. ఋణము, దాయము మున్నగువానిఁగూర్చి సంభవించిన తగవు, అభియోగము, వ్యాజ్యము. ౪. వైరుధ్యము, విరుద్ధమగుట.—౫. ఆజ్ఞ, శాసనము. ౬. అఱచుట, బిగ్గఱగా ధ్వనిచేయుట.

**వివాదార్థి.** సం. వి. న్. పుం. వ్యాజ్యమునకు సంబంధించినవాఁడు, వివాదము కోరువాఁడు. ౨. వాది, వ్యాజ్యము తెచ్చినవాఁడు.

**వివాది.** సం. విశే. (స్, సీ. స్.) ౧. వాదించువాఁడు, కలహించుచున్నవాఁడు. ౨. వాక్యము తెచ్చినవాఁడు. —వి. స్. పుం. వాక్యమునకు సంబంధించిన పురుషుఁడు, వివాదమున నొక పక్షమువాఁడు.

**వివారము.** సం. వి. అ. పుం. ౧. తెఱచుట, విప్పుట. ౨. అచ్చులను, ఊష్మములను స్పష్టముగా నుచ్చరించునపుడు నోరు తెఱచుట. (అభ్యంతర ప్రయత్నములలో నొకటి.)

**వివాసనము.** సం. వి. అ. న. ౧. దేశాంతరవాసము. ౨. దేశాంతరమునకుఁబంపుట, దేశభ్రష్టత నొందించుట.

**వివాసము.** సం. వి. అ. పుం. దేశభ్రష్టత, దేశాంతరవాసము.

**వివాసితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) దేశాంతరము పంపఁబడినవాఁడు, దేశభ్రష్టుఁడుగా జేయఁబడినవాఁడు.

**వివాహమగు.** మి. స. క్రి. (వివాహము + అగు.) పెండ్లాడు.

వ. క్రథకైశికాధీశ్వరతనూభవ వివాహంబై మిమ్ము దర్శింపగలవాఁడను.

నైష. ౭. ౭౫.

**వివాహము.** సం. వి. అ. పుం. పెండ్లి, పరిణయము. (వివాహము ఎనిమిది విధములు. బ్రాహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, ఆసురము, గాంధర్వము, రాక్షసము, పైశాచము.)

**వివాహితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) పెండ్లాడినవాఁడు.

**వివాహ్యుఁడు.** సం. వి. అ. పుం. ౧. అల్లుఁడు, జామాత. ౨. వరుఁడు, పెండ్లికొడుకు. —విశే. (అ. ఆ. అ.) పెండ్లిచేయఁదగినవాఁడు, పెండ్లి చేయవలసినవాఁడు.

**వివి(వృ)క్త.** సం. వి. ఆ. స్త్రీ. దుర్భగురాలు, దురదృష్టవంతురాలు, భర్త కిష్టములేని స్త్రీ.

**వివిక్తము.** సం. విశే. (అ. ఆ. అ.) విడఁదీయబడినది, వేఱుచేయఁబడినది. ౨. నిర్జనము. జనశూన్యము. ౩. ఒంటి, ఏకాకి. ౪. వివేచింపఁబడినది, ప్రత్యక్షముగాఁ దెలిసికొనఁబడినది. ౫. వివేకము (తెలివి) గలది. ౬. పవిత్రమైనది, దోషరహితము. ౭. గంభీరమైనది, లోఁతైనది. (ఆలోచన, మొ.) ౮. ఒక్క విషయముపై మనస్సు నిలుపునది, ఏకాగ్రచిత్తము.- వి. అ. న. ౧. నిర్జనప్రదేశము. ౨. ఏకాంతవాసము, ఒంటరిగానుండుట.

**వివిగ్నము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. మిక్కిలి వ్యాకులపడినది, భయపడినది. ౨. మిక్కిలి కోపముగలది.

**వివిధము.** సం. విశే. (అ. ఆ. అ.) నానాప్రకారము, అనేక విధములుగలది.- వి. అ. న. అభినయ విశేషము, ఒకవిధమైన యభినయము.

**వివీతము.** సం. వి. అ. పుం. ఆవరణము వేసిన ప్రదేశము, పచ్చికపట్టు.

**వివృక్తము.** సం. విశే. (అ. ఆ. అ.) విడువఁబడినది, త్యజింపఁబడినది.

**వివృతము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. ప్రకటింపఁబడినది, బైటఁ బెట్టఁబడినది. ౨. స్పష్టమైనది, దాఁపరికములేనిది. ౩. కప్పులేనిది. ౪. తెఱవఁబడినది, మూఁతలేనిది. ౫. చాటింపఁబడినది. ౬. వ్యాఖ్యానము చేయఁబడినది, వివరింపఁబడినది. ౭. వ్యాపించినది. ౮. విరివియైనది, విశాలమైనది. ౯. ఫలింపనిది, పండనిది. (నేల.) - వి. అ. న. ౧. స్పష్టముగా నుచ్చరించుట, స్ఫుటోచ్చారణము. ౨. వివారప్రయత్నము. అభ్యంతర ప్రయత్నములలో నొకటి.

**వివృతాక్షము.** సం. విణ. (అ. ఈ. అ.) పెద్ద కన్నులుగలది.—వి. అ. పుం. కోడిపుంజు.

**వివృతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. తెఱచిచూపుట, స్పష్టపఱచుట. ౨. వ్యాప్తి; విస్తరించుట, ౩. బైటపెట్టుట, తెలుపఱచుట. ౪. వివరణము, వ్యాఖ్యానము, టిప్పణము.

**వివృత్తము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. గుండ్రముగాఁ ద్రిప్పఁబడినది. ౨. అడ్డముగాఁ దిరుగుచున్నది. ౩. ప్రకటింపఁబడినది.

**వివృత్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. గుండ్రముగాఁ దిరుగుట, చుట్టుతిరుగుట.

**వివృద్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. పెరిఁగినది. ౨. హెచ్చయినది, అధికమైనది. ౩. విశాలమైనది, విరివియైనది.

**వివృద్ధి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. పెంపు, ఆధిక్యము, హెచ్చు. ౨. అభివృద్ధి, పెరుఁగుదల.

**వివేకజ్ఞానము.** సం. వి. అ. న. విచారణ చేసెడి శక్తి.

**వివేకజ్ఞుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) విచారణ చేయు నేర్పుగలవాఁడు, సూక్ష్మబుద్ధిగలవాఁడు.

**వివేకపదవి.** సం. వి. అ. పుం. ౧. తెలివి, జ్ఞానము, ౨. విచారణము, పరిశీలనము. ౩. రెండువస్తువులను సూక్ష్మభేదము నెఱింగి వేఱుపరచుట. ౪. (వేదాంత) ఆత్మానాత్మభేదమును దెలిసికొనుట, మిథ్యాప్రపంచము నుండి బ్రహ్మమును భిన్నముగాఁ దెలిసికొనుట. ౫. యథార్థజ్ఞానము, నిజమైన తెలివి. ౬. నీటితొట్టి.

**వివేకి.** సం. విణ. (న్. నీ. న్.) విచారణచేయువాఁడు.—వి. న్. పుం. ౧. వివేకముగలవాఁడు. న్యాయాధికారి. ౨. జ్ఞాని, ఆత్మజ్ఞాని.

**వివేకించు.** సం. స. క్రి. విచారణసేయు.

క. యతిలోకజ్ఞానసమన్విత యతిజనకృత్య
మటు వివేకింపు మెదన్.
భార. శాం. ౧.౬౧.

ద్వి. అనఘ నీతత్త్వ మే నాత్మలోఁజూచి, నిను
వివేకించితి నీవు విష్ణుఁడవు.
రం. రా. బాల. ౭౦. పా. ౨౫. పం.

శా... ఈ విశ్వంబునఁగల్గు మే లిదియపో
యొందున్ వివేకించినన్. (కళా. ౨. ౧౨.)

**వివేక్త.** సం. వి. ఋ. పుం. ౧. విచారణకర్త, న్యాయాధికారి. ౨. జ్ఞాని, వేదాంతి.

**వివేచన.** సం. వి. ఆ. స్త్రీ. ౧. విచారణ, వివేకము. ౨. ఆలోచనము, పరిశీలనము. ౩. నిశ్చయము.

**వివేచించు.** సం. అ. క్రి. వివేచనసేయు, వివేకించు. (శ. ర.)

**వివోఢ.** సం. వి. ఋ. పుం. వరుఁడు, పెండ్లికొడుకు. ౨. అల్లుఁడు.

**వివ్వచ్చము.** వి. (సం. బీభత్సః) బీభత్సరసము, నవరసములలో నొకటి. (చి. ని., శ. ర.)

**వివ్వచ్చుఁడు.** వి. (బీభత్సః) అర్జునుఁడు.

సీ. వివ్వచ్చు నెప్పుడు వినియెదునని తనవిని
యట్ల యతిఁ జూచి వీఁడు విజయుఁ డొక్కొ
యనుచు... భార. ఆది. ౮. ౧౭౫.

గీ. శంకరుండు గిరాతవేషంబు దాల్చి, యగజ
చెంచెతయై తోడనరుగుదేఱఁ, బాణి నొంకా
రదివ్యచాపము ధరించి, వచ్చె వివ్వచ్చు
వరతపోవనముకడకు. హర. ౩. ౪౧.

ఉ... నీవచ్చుటఁజేసి ప్రాణములువచ్చెఁజూమీ
యిట నేఁడు మాకు వివ్వచ్చుఁడు పోరు
లన్ సవతువచ్చునె నీకసమానమానుషా.
రాజశే. ౩. ౨౨౨.

**విశంక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. భయము. ౨. సందేహము.

**విశంకటము.** సం. విణ. (అ. ఆ. ఈ. అ.) ౧. విశాలము, విరివియైనది, పెద్దది. ౨. బలవంతము, బలముగలది, ఘోరము, భయంకరమైనది.

**విశంకుఁడు.** సం. విణ. (అ.ఆ.అ.) ౧. భయములేనివాఁడు; నిర్భయుఁడు. ౨. సందేహములేనివాఁడు.

**విశదము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. శుద్ధమైనది, కలంకములేనిది. ౨. స్వచ్ఛమైనది, తెల్లనిది, తెల్లరంగుగలది. ౩. ప్రకాశించునది, మనోహరమైనది. ౪. స్పష్టమైనది, స్ఫుటముగాఁ గనఁబడునది. ౫. శాంతము, నిర్విచారమైనది, సంతోషించునది.
వి. అ. పుం. తెలుపు, తెల్లరంగు.

**విశదీకరించు.** సం. అ. క్రి. విశదముగాఁజేయు.
వ...చిత్తశుద్ధివలన వేదాంతజ్ఞానంబు విశదీకరించి... కాశీ. ౩. ౨౩౭.

**విశయము.** సం. వి. అ. పుం. ౧. సందేహము, సంశయము. (మీమాంస) అధికరణమునందలి యైదంశములలో రెండవది. ౨. ఆశ్రయము, అభయస్థానము.

**విశరఘాతము.** సం. వి. అ. పుం. చంపుట, వధము. (శ. ర.)

**విశరము.** సం. వి. అ. పుం. ౧. పగులుట, బ్రద్దలగుట. ౨. చంపుట, సంహరించుట.
విణ. (అ. ఆ. అ.) బాణములులేనిది.

**విశల్య.** సం. వి. ఆ. స్త్రీ. దంతి, నేపాళము ‡. గుడూచి, తిప్పతీఁగ. ‡. అజమోద, ఓమము. ‡.

**విశల్యము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. కష్టములేనిది, విచారములేనిది, భద్రముగానున్నది. ౨. ముండ్లులేనిది, ములుకులులేనిది.

**విశల్యకరణి.** సం. వి. ఈ. స్త్రీ. శరీరమున నాఁటిన ములుకుల నూడఁజేయు ఒక విధమైన యోషధి.

**విశసనము.** సం. వి. అ. న. ౧. చంపుట, సంహారము, నశింపఁజేయుట. ౨. నాశము, చేటు. ౩. యుద్ధము.—వి. అ. పుం. ౧. వంకరకత్తి. ౨. ఖడ్గము, పెద్దకత్తి. -పుం; న. నరకభేదము, ఒకవిధమగు నరకము.

**విశసించు.** సం. స. క్రి. చంపు, విశసనముచేయు.
గీ...పాపపశువుల విశసించి భక్తిచరువు,
పాండురంగాగ్నిలో వేల్చు పాండవునకు.
పాండు. ౫. ౫౬.

**విశస్త.** సం. వి. ఋ. పుం. ౧. బలియిచ్చువాఁడు, ౨. చండాలుఁడు.

**విశస్తము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. నఱుకఁబడినది, తునియలు చేయఁబడినది. ౨. మర్యాదనెఱుఁగనిది, మోటైనది. ౩. స్తుతింపఁబడినది, కొనియాడఁబడినది.

**విశాఖ.** సం. వి. ఆ. స్త్రీ. ఒకానొకనక్షత్రము, అశ్విని మొదలగు నక్షత్రములలోఁ బదియారవది. ౨. గలిజేరు ‡. ౩. కాఁకర ‡.

**విశాఖజము.** సం. వి. అ. పుం. నారింజచెట్టు.

**విశాఖము.** సం. వి. అ. పుం. వేటలో నొకవిధమైనస్థితి. (ఒడుపు.) (ఈ యొడుపులో విలుకాఁడు జానెఁడెడములో నడుగులిడి నిలఁబడవలయును.) ౨. నూలువడికెడి కదురు.

**విశాఖుఁడు.** సం. వి. అ. పుం. కార్తికేయుఁడు, కుమారస్వామి. ౨. యాచకుఁడు, అడుగుకొను వాఁడు. ౩. శివుఁడు. ౪. ఒకానొక వేలుపు, దేవతాభేదము.

**విశాతనము.** సం. వి. అ. న. ౧. చీల్చుట, భేదించుట. ౨. విమోచనము, విడుదల. ౩. పానఁబట్టుట, మిక్కిలి వాఁడిచేయుట.

**విశాయము.** సం. వి. అ. పుం. కావలివాండ్రు వంతుల ప్రకారము నిద్రించుట.

**విశారణము.** సం. వి. అ. న. ౧. చీల్చుట, భేదించుట. ౨. చంపుట. సంహరించుట.

**విశారదము.** సం. వి. అ. పుం. వకులవృక్షము, పొగడచెట్టు.

**విశారదుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. (తఱచుగా సమాసాంతమున) నిపుణుఁడు, నేర్పరి. ౨. బుద్ధిమంతుఁడు, తెలివికలవాఁడు. ౩. ప్రఖ్యాతుఁడు, ప్రసిద్ధిఁ జెందినవాఁడు. ౪. ధీరుఁడు, ధైర్యశాలి.

**విశాల.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఉజ్జయినీనగరము. ౨. ఒకానొక నది.

**విశాలత.** సం. వి. ఆ. స్త్రీ. ౧. విరివి, విస్తృతి, పెద్దదియగుట. ౨. ఘనత, గొప్పతనము, శ్రేష్ఠత్వము.

**విశాలత్వక్కు.** సం. వి. చ్. పుం. ఏడాకులరఁటి. ₹. (శ. ర.)

**విశాలము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. పెద్దది, విరివియైనది, వెడల్పుగలది. ౨. సమృద్ధము, నిండియున్నది. ౩. శ్రేష్ఠమైనది, ఘనమైనది, ప్రసిద్ధమైనది. - వి. అ. పుం. ౧. ఒకవిధమైన లేడి. ౨. పక్షివిశేషము.

**విశాలాక్షి.** సం. వి. ఈ. స్త్రీ. కాశీక్షేత్రమున నెలకొనియున్న పార్వతీదేవి యర్చావతారము. ౨. వేశ్య. ౩. తేలుకొండి. ₹.

**విశాలాక్షుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) విరివియైన కన్నులుగలవాఁడు. - వి. అ. పుం. ౧. విష్ణువు. ౨. గరుత్మంతుఁడు. ౩. శివుఁడు.

**విశాలాస్యప్రదరము.** సం. వి. అ. పుం. వెడఁద వాతియమ్ము.

క. కదిసి శరాసనగురుఁ డిరు,వదియేను శరంబులేయ బార్థుఁడు వానిం, గుదియించి విశాలాస్యప్రదరము లడరింపఁ గుంభభవుఁ డెడఁద్రుంచెన్. (భార. ద్రోణ. ౩. ౭౫.)

**విశిఖ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పాఱ. ౨. నూలు వడికెడి కదురు. ౩. సూది. ౪. చిన్నబాణము. ౫. బాట, త్రోవ, రథ్య. ౬. మంగలది.

**విశిఖము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. శిఖలేనిది, జుట్టులేనిది, అగ్రములేనిది. ౨. ఈఁకలులేనిది. (బాణము.) —వి. అ. పుం. ౧. బాణము. ౨. ఒకవిధమైనరెల్లు.

**విశిష్టత.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ప్రత్యేకగుణము, విశేషగుణము. ౨. శ్రేష్ఠత్వము, ప్రశస్తత.

**విశిష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. విశేషగుణములుగలది. ౨. విలక్షణమైనది, ప్రత్యేకమైనది, అసాధారణమైనది. ౩. కూడినది, ఉపలక్షితమైనది, సంపన్నమైనది. ౪. ఉత్తమమైనది, శ్రేష్ఠము.

**విశిష్టాద్వైతము.** సం. వి. అ. పుం. బ్రహ్మమునకుఁ బ్రకృతికి నభేదమును, సత్యమును బోధించెడి మతము; ప్రకృతి విశిష్టబ్రహ్మమునకు నద్వైతమునుదెలుపు మతము.

**విశీర్ణపర్ణము.** సం. వి. అ. పుం. నింబవృక్షము, వేపచెట్టు.

**విశీర్ణము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. పగులఁగొట్టఁబడినది, ముక్కలయినది. ౨. వడలినది, వాడినది, ఎండినది, శుష్కము. ౩. జాఱినది, రాలినది. ౪. ముడుతలుపడినది. ౫. చెడినది, పాడైనది. ౬. ముదిమిచెందినది. (వాచ.)

**విశీలుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) విరుద్ధప్రవర్తనము గలవాఁడు, మంచి నడవడిలేనివాఁడు, నీతిలేనివాఁడు, దుష్టుఁడు.

**విశుఁడు.** సం. వి. శ్. పుం. (తెనుఁగున వ్యస్తప్రయోగము కానరాదు.) ౧. వైశ్యుఁడు, కోమటి. ౨. మనుష్యుఁడు. ౩. ప్రజ, జనము.- స్త్రీ. దేశప్రజ.

**విశుద్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. శుభ్రము చేయఁబడినది. ౨. పరిశుభ్రమైనది, పవిత్రమైనది, పాపములేనిది, లోపములేనిది. ౩. కళంకములేనిది. ౪. సరియైనది, హెచ్చుతక్కువలు లేనిది. ౫. గుణవంతము, సుగుణములుగలది. కౌటిల్యమెఱుఁగనిది, ఋజువర్తనముగలది. ౩. అడఁకువగలది.- వి. అ. న. శరీరమునందలి విశుద్ధచక్రము.

**విశుద్ధి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. పరిశుద్ధత, నిర్మలత్వము. ౨. నిర్దోషత్వము, దోషములేమి. ౩. సరిగానుండుట, హెచ్చుతక్కువలులేమి. ౪. తప్పు దిద్దుకొనుట. ౫. సామ్యము, పోలిక. ౬. (బీజగణిత) తీసివేయుమొత్తము, తీసివేసెడి రాశి.

**విశృంఖలుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. శృంఖలములు (గొలుసు) లేనివాఁడు. ౨. బంధనములేనివాఁడు, అడ్డులేనివాఁడు. ౩. నీతిలేనివాఁడు, కట్టుపాటులేనివాఁడు.

**విశేషకము.** సం. విణ. (అ. ఆ. అ.) భేదపరచునది, వేఱుపఱచునది.-వి. అ. పుం., న. ౧. భేదపఱచు లక్షణము, గుణము. ౨. భేదము దెలుపు గుణము. ౩. నొసటిబొట్టు, తిలకము. ౪. రంగులతోఁగాని పరిమళద్రవ్యములతోఁగాని ముఖముమీఁదను శరీరముమీఁదను చిత్తరువు వ్రాయుట, పత్త్రిరచన. ౫. ఏకవాక్యముగానుండిన శ్లోకత్రయము. ౬. నువ్వుమొక్క.

**విశేషగుణము.** సం. వి. అ. పుం. ౧. ప్రత్యేకగుణము, ఇతరమునుండి వేఱుపఱుచు గుణము. ౨. (తర్క) సంయోగపృథక్త్వముల వంటిది కాక స్వాభావికమైన గుణము.

శ్లో. బుద్ధ్యాదిషట్కం రూపాదిచతుష్కం స్నేహభావనే, స్వాభావిక ద్రవత్వంచ అదృష్టం శబ్దఏవచ...విశేషగుణఇత్యతే.

కారికావళి.

**విశేషజ్ఞుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. గుణాగుణము లెఱిఁగినవాఁడు, విమర్శకుఁడు. ౨. విద్వాంసుఁడు, పండితుఁడు.

**విశేషణము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. గుణమును దెలుపునది. ౨. భేదపఱుచునది, ఇతరవ్యావర్తకము.-వి. అ. న. ౧. వ్యావర్తనము, భేదపఱుచుట, ౨. భేదము, వ్యత్యాసము. ౩. మఱొకదానినుండి ప్రత్యేకపఱుచునట్టి పదము, గుణమును తెలుపునట్టి పదము. (వ్యతి. విశేష్యము: ఇది మూఁడు విధములు గలది. ౧. వ్యావర్తకము. ౨. విధేయము. ౩. హేతుగర్భము.) ౪. భేదపఱచులక్షణము, గుర్తు. ౫. విధము, రకము. ౬. మించుట, అతిశయించుట.

**విశేషము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. విలక్షణమైనది, అసాధారణమైనది. ౨. సమృద్ధమైనది, విరివియైనది.-వి. అం. పుం. ౧. వేఱు

పఱుచుట. ౨. భేదము, వ్యత్యాసము. ౩. గుణ సంబంధభేదము. ౪. మంచికిగాని చెడ్డకుఁగాని గలుగు మార్పు. ౫. అవయవము. ౬. రకము, విధము. ౭. నానావిధమైనవస్తువులు. ౮. (సమాసాంతమున) శ్రేష్ఠత, ఘనత, ఆధిక్యము. ౯. (తర్క-) అనన్యనిష్ఠగుణము, ప్రత్యేకగుణము, అనన్యసాధారణమై ఒకదానియందేయుండి ఇతరపదార్థములనుండి భేదము తెలుపు గుణము, పృథివ్యాది నవద్రవ్యముల పరమాణువులందుండు గుణము. ౧౦. వ్యక్తి, ప్రత్యేకత. ౧౧. వర్గము, శబ్దసముదాయము. ౧౨. తిలకము, నొసటిబొట్టు. ౧౩. విశేషగుణము. ౧౪. ఒకానొక యర్థాలంకారము.

శ్లో: విశేషః ఖ్యాతి మాధారం, వినాప్యాధేయ వర్ణనమ్.ఆధారములేకయే ఆధేయమున్నట్లు వర్ణించుట.

**విశేషవచనము.** సం. వి. అ. న. ప్రత్యేకవిధి వాక్యము.

**విశేషవిదుఁడు.** సం. విణ. (ద్.)=విశేషజ్ఞుఁడు.

**విశేషవిధి.** సం. వి. ఇ. పుం. ప్రత్యేకవిధి.

**విశేషశాస్త్రము.** సం. వి. అ. న. = విశేషవిధి.

**విశేషించు.** సం. స. క్రి. ౧. స్తుతించు, అగ్గించు.

వ. అని యనేక ప్రకారంబులం బరమేశ్వరు నిరాకరించుచు నితర సురవరుల విశేషించుచున్న కృతకవిప్రు నగజ కటాక్షించుచు... కు. సం. ౭. ౮౫౩.

౨. విశదీకరించు.

మ...వచ్చినకార్యం బఖిలంబు నాతఁడు విశేషింపంగ మాల్యానులేపనతాంబూలవిభూషణావళుల సంభావించి యత్యున్నతిన్. జై. భా. ౩. ౫౪.

అ. క్రి. అతిశయించు.

వ...విశేషించి యీ ధరోత్పత్తి శ్రాద్ధ కాలంబున పఠించినఁ బితరులకు పునరావృత్తిరహిత శాశ్వతబ్రహ్మలోకంబు గలుగు. వరాహ. ౭. ౩౫.

వ. విశేషించియుం గారవనికేతనంబులఁ గేతనంబులఁ బొగలెగయుటయు నాయుధంబులు మండుటయు నివి మొదలుగా దుర్నిమిత్తంబులు పుట్టుచున్నయవి. భార. భీష్మ. ౧. ౧౨.

**విశేషితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. భేదపఱుపఁబడినది. ౨. నిర్వచింపఁబడినది, ప్రత్యేకలక్షణము చెప్పఁబడినది. ౩. విశేషణముచే వేఱుపఱుపఁబడినది. ౪. శ్రేష్ఠమైనది, ప్రశస్తము.

**విశేషుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) విశిష్టుఁడు, గొప్పవాఁడు.

క. దనుజారికంటె వీరుఁడు,...త్రినయను కంటె విశేషుఁ డురుతరైశ్వర్యమునన్. కు. సం. ౧౦. ౪౨౩.

**విశేషోక్తి.** సం. వి. ఇ. స్త్రీ. ఒకానొక యర్థాలంకారము.

శ్లో. కార్యాజనిర్విశేషోక్తి స్సతి పుష్కలకారణే. (ప్రసిద్ధకారణసామగ్రియున్నను గార్యము కలుగనట్లు వర్ణించుట.)

**విశేష్యము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. భేదపఱుపఁబడినది. ౨. శ్రేష్ఠము, ముఖ్యమైనది. వి. అ. న. విశేషణముచే గుణము తెలుపఁబడిన పదము; మఱొకపదముచేతఁ బ్రత్యేకపఱుపఁబడిన పదము; నామవాచకము.

**విశోక.** సం. వి. ఆ. స్త్రీ. శోకములేకుండు స్థితి, యోగశాస్త్రమందుఁ జెప్పఁబడిన చిత్తవృత్తివిశేషము.

విశోకము. సం. విణ. (అ. ఆ. అ.) దుఃఖము లేనిది, సుఖితము.—వి. అ. పుం. అశోక వృక్షము.

విశోకించు. సం. అ. క్రి. మిక్కిలి దుఃఖించు.

శా ... అక్షిద్వయాశ్రాంతాశ్రుప్రకరప్రవాహములు హారాళంబుగాఁ బర్వఁగా, నెంతే గుంపులుగూడి యేడ్చిరి జగంబెల్లన్ విశోకింపగా. సేతు. ౧. ౩౭. పా.

విశోధనము. సం. వి. అ. న. ౧. శుభ్రము చేయుట, శుద్ధిచేయుట, తీసివేయుట. (రాజ్య కంటకవిశోధనోద్యతుఁడు.) ౨. పవిత్రము చేయుట, పాపము మొదలగువాని తప్పించుట. ౩. ప్రాయశ్చిత్తము, పాపపరిహారార్థమైన సంస్కారము.

విశోధ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. పవిత్రముచేయఁదగినది. ౨. శుభ్రముచేయఁదగినది, సరిచేయఁదగినది.—వి. అ. న. ఋణము.

విశోషణము. సం. వి. అ. న. మిక్కిలియెండుట, శుష్కించుట.

విశ్నము. సం. వి. అ. పుం. దీప్తి, కాంతి.

విశ్రం(స్రం)భణము. సం. వి. అ. న. విశ్వాసముకలిగించు, నమ్మకము పుట్టించుట.

విశ్రం(స్రం)భపాత్రము. సం. వి. అ. న. నమ్మఁదగినవాఁడు. విశ్వాసస్థానము.

విశ్రం(స్రం)భభాషణము. సం. వి. అ. న. =విశ్రంభాలాపము.

విశ్రం(స్రం)భభూమి. సం. వి. ఇ. స్త్రీ. విశ్రంభపాత్రము.

విశ్రం(స్రం)భము. సం. వి. అ. పుం. ౧. నమ్మకము, విశ్వాసము, చేనవు. ౨. రహస్యము, రహస్య విషయము. ౩. విరామము, విశ్రాంతి. ౪. ప్రేమతోఁ బ్రశ్నించుట. ౫. ప్రణయ కలహము, పొలయలుక, ౬. చంపుట, హింసించుట.

విశ్రం(స్రం)భస్థానము. సం. వి. అ. న. = విశ్రంభపాత్రము.

విశ్రం(స్రం)భాలాపము. సం. వి. అ. పుం. ౧. నమ్మకముతో మాటలాడుట. ౨. రహస్య సంభాషణము.

విశ్రంభి. సం. విణ. (న్. నీ. న్.) ౧. విశ్వాసముగలవాఁడు, నమ్మినవాఁడు. ౨. నమ్మఁదగినవాఁడు, విశ్వాసనీయుఁడు.

విశ్ర(స్ర)బ్ధము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నమ్మి యొప్పగింపఁబడినది, వశముచేయఁబడినది. ౨. విశ్వసింపఁబడినది, నమ్మఁబడినది. భయములేనిది, నిర్భయము. ౩. విశ్వాసనీయము, నమ్మఁదగినది. ౪. శాంతము, క్షోభము, నిర్విచారము. ౫. స్థిరమైనది, నిశ్చలము, ౬. మెల్లనైనది, మందమైనది. ౭. అధికమైనది, అతిశయించినది.

విశ్రమము. సం. వి. అ. పుం. ౧. పద్య విరామము. ౨. ఊఱట. (శ. ర.)

విశ్రమించు. సం. అ. క్రి. ౧. శ్రమతీర్చికొను.

క. బహుయోజనముల పొడవగు మిహిమలతుదఁ జేరి విశ్రమించిన యంతన్ ...
ఉ. రా. ౪. ౪౯.

క. మునిభామల వ్యధూమణి, ననవరత ప్రసవ ఫలసమాకీర్ణనివాతనివేశవివృతకృష్ణా, జిన మువయిన్ విశ్రమింపఁజేసి యడలుతోన్.
జై. భా. ౬. ౨౮౪.

౨. ఊరడిల్లు (శ. ర.)

**విశ్రయము.** సం. వి. అ. పుం. ౧. నివాసము, ఆశ్రయము, రక్షకస్థానము, నీడపట్టు.

**విశ్రవసుఁడు.** సం. వి. స్. పుం. పులస్త్యుని కొడుకు, రావణుని తండ్రి.

**విశ్రాంతము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఆఁగినది, నిలిచినది. ౨. విశ్రాంతినొందినది, అలయిక తీర్చుకొన్నది, అవకాశమునొందినది, తెఱపిగానున్నది. ౩. శాంతమైనది, కలఁతనొందనిది.

**విశ్రాంతి.** సం. వి. ఆ., ఇ. స్త్రీ. ౧. విరామము, ఊరట, తెఱపి. ౨. నిలుపుదల, సమాప్తి.

**విశ్రా(శ్ర)ణనము.** సం. వి. అ. న. ఈవి, దానము, దాతృత్వము.

**విశ్రామము.** సం. వి. అ. పుం. ౧. చేయుపనిని నిలుపుట, విరామము. ౨. విశ్రాంతి, ఊరట, అలయిక తీర్చుకొనుట. ౩. శాంతి, నెమ్మది.

**విశ్రావము.** సం.వి.అ. పుం. ప్రఖ్యాతి, ప్రసిద్ధి.

**విశ్రుతము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రసిద్ధమైనది, ప్రఖ్యాతినొందినది. ౨. సంతోషించునది, సుఖించునది.

**విశ్రుతి.** సం. వి. ఇ. స్త్రీ. ప్రఖ్యాతి, ప్రసిద్ధి.

**విశ్లథము.** సం. విణ. (అ. ఆ. అ.) వదులైనది, బిగువులేనిది, శిథిలము. ౨. దుర్బలము, బలములేనిది.

**విశ్లిష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) విడఁదీయఁబడినది, వేఱుచేయఁబడినది.

**విశ్లేషము.** సం. వి. అ. పుం. ౧. విడిపోవుట. ౨. నాయికానాయకుల యెడఁబాటు. ౩. వియోగము, ఎడఁబాటు. ౪. లేకపోవుట, అభావము. ౫. బీఁట, సందు. ౬. (గణిత) వ్యత్యస్తసంకలనము, తలక్రిందుగాఁ గూడుట.

**విశ్లేషితము.** సం. విణ. (అ. ఆ. అ.) విడఁదీయఁబడినది, ఎడఁబాపఁబడినది.

**విశ్వంకరము.** సం. వి. అ. పుం. నేత్రము, కన్ను. (ఆ. ని.)

**విశ్వంభర.** సం. వి. ఆ. స్త్రీ. భూమి.

**విశ్వంభరుఁడు.** సం. విణ. (అ.ఆ.అ.) సర్వము భరించువాఁడు. (వహించువాఁడు.) —వి. అ. పుం. ౧. సర్వవ్యాపకుఁడు, పరబ్రహ్మము. ౨. విష్ణువు. ౩. ఇంద్రుఁడు.

**విశ్వకద్రువు.** సం. విణ. (ఉ.) అధముఁడు, నీచుఁడు, దుర్మార్గప్రవర్తనముగలవాఁడు. వి. ఉ. పుం. ౧. వేఁటకుక్క. ౨. ధ్వని.

**విశ్వకర్మ(ర్ముఁడు).** సం. వి. న్. పుం. ౧. దేవతాశిల్పి, త్వష్ట. ౨. సూర్యుఁడు. ౩. సూర్యుని ప్రధానకిరణముల యేడింటిలో నొకటి. ౪. జ్ఞాని. ౫. ఒకానొక ముని. ౬. పరమేశ్వరుఁడు.

**విశ్వకార్యము.** సం. వి. అ. పుం. సూర్యుని ప్రధానకిరణము లేడింటిలో నొకటి.

**విశ్వకృత్తు.** సం. వి. త్. పుం. ౧. ప్రపంచసృష్టికర్త. ౨. విశ్వకర్మ, దేవశిల్పి.

**విశ్వకేతువు.** సం. వి. ఉ. పుం. అనిరుద్ధుఁడు.

**విశ్వగంధ.** సం. వి. ఆ. స్త్రీ. భూమి.

**విశ్వగంధము.** సం. వి. అ. పుం. ౧. నీరుల్లి. ౨. గంధద్రవ్యవిశేషము, బాలెంతబోలము.

**విశ్వగోప్త.** సం. వి. ఋ. పుం. ౧. ప్రపంచరక్షకుఁడు, విష్ణువు. ౨. ఇంద్రుఁడు.

**విశ్వగ్రంథి.** సం. వి. ఇ. స్త్రీ. హంసపదీలత, ఎఱ్ఱఅత్తిప్రత్తితీఁగె.

**విశ్వచక్రము.** సం. వి. అ. న. సువర్ణమహాదానము, స్వచ్ఛమైన బంగారము దానము చేయుట.

**విశ్వజనము.** సం. వి. అ. న. మనుష్యజాతి.

**విశ్వజనీనము.** సం. విణ. (అ. ఆ. అ.) సకలజనులకు హితమైనది, సర్వజనహితమైనది.

**విశ్వజనీయము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. సర్వజనులకు హితమైనది, ప్రపంచజనులకు మేలుచేయునది, సర్వజనార్హము. (విల్యమ్సు.)

**విశ్వజిత్తు.** సం. వి. త్. పుం. ౧. యాగవిశేషము. (ఇది ప్రపంచమునంతను జయించిన రాజు చేయవలసినది. ఇందు సర్వస్వమును దక్షిణగా నియ్యవలయును.) ౨. వరుణపాశము. ౩. విష్ణువు.

**విశ్వతోముఖుఁడు.** సం. విణ. (అ. ఈ. ఆ. అ.) అన్నివైపులముఖములుగలవాఁడు.

**విశ్వదేవుఁడు.** సం. వి. అ. పుం. దేవతలలో నొకగణము.

**విశ్వధారిణి.** సం. వి. ఈ. స్త్రీ. భూమి.

**విశ్వనాథుఁడు.** సం. వి. అ. పుం. విశ్వేశ్వరుఁడు, కాశీక్షేత్రమునందలి శివుని యర్చావతారము.

**విశ్వపావని.** సం. వి. ఈ. స్త్రీ. తులసి.

**విశ్వపుఁడు.** సం. వి. అ. పుం. ౧. సర్వరక్షకుఁడు. ౨. సూర్యుఁడు. ౩. చంద్రుఁడు. ౪. అగ్ని.

**విశ్వపూజిత.** సం. వి. ఆ. స్త్రీ. = విశ్వపావని.

**విశ్వప్సుఁడు.** సం. వి. స్. పుం. ౧. దేవుఁడు. ౨. సూర్యుఁడు. ౩. చంద్రుఁడు. ౪. అగ్ని. ౫. విశ్వకర్మ. ౬. గాలి. ౭. యముఁడు.

**విశ్వభుజుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) సర్వమును భుజించువాఁడు, సర్వభక్షకుఁడు.— వి. అ. పుం. ౧. ఇంద్రుఁడు. ౨. అగ్ని.

**విశ్వభేషజము.** సం. వి. అ. న. సొంటి. పుం. సర్వరోగహరమైన యౌషధము.

**విశ్వము.** సం. (సర్వ.) విణ. (అ. ఆ. అ.) ౧. సర్వము, సకలము, అంతయు.-వి. అ. న. ౧. ప్రపంచము ౨. సొంటి.

**విశ్వమూర్తి.** సం. విణ. (ఇ.) సర్వవ్యాపకమైనది. అంతను నిండియున్నది.

వి. ఇ. పుం. ౧. పరబ్రహ్మము, పరమాత్మ. ౨. శివుఁడు. ౩. విష్ణువు.

**విశ్వాయువు.** సం. వి. ఉ. పుం. వాయువు.

**విశ్వయోని.** సం. వి. ఇ. పుం. ౧. బ్రహ్మ. ౨. విష్ణువు.

**విశ్వరా(ట్టు)జుఁడు.** సం. వి. అ. పుం. సమ్రాట్టు, చక్రవర్తి.

**విశ్వరుచి.** సం. వి. ఈ. స్త్రీ. అగ్నిహోత్రుని సప్తజిహ్వలలో నొకటి.

**విశ్వవాప(క)ము.** సం. వి. అ. న. కృష్ణాగరువు,

**విశ్వరే(తసు)తుఁడు.** సం. వి. స్. పుం. ౧. బ్రహ్మ. ౨. విష్ణువు.

**విశ్వవా(ట్టు)హుఁడు.** సం. విణ. (హ్. శ్వా. హీ. హ్.) సమస్తమును వహించువాఁడు, సర్వమును ధరించువాఁడు.

**విశ్వవేదు(దసు)ఁడు.** సం. విణ. స్. ౧. సమస్తమును దెలిసినవాఁడు, సర్వజ్ఞుఁడైనవాఁడు. ౨. జ్ఞానముకలవాఁడు.

వి. పుం. ౧. జ్ఞాని. ౨. ఇంద్రుఁడు యున్నగు వేల్పు. (వాచ.)

**విశ్వసనీయుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. నమ్మఁదగినవాఁడు, విశ్వసింపఁదగినవాఁడు. ౨. నమ్మకముపుట్టించువాఁడు.

**విశ్వసహా.** సం.వి. ఆ. స్త్రీ. ౧. భూమి. ౨. అగ్నిహోత్రుని సప్తజిహ్వలలో నొకటి.

**విశ్వసించే=విశ్వాసించే.** సం. స. క్రి. నమ్ము.

సీ. ...రుద్రుండును శాత్రవదుహితృ గాఁగ, భావించి విశ్వసింపకమానునో నాకుఁ గడ వంగరాని దుందుడుకు పుట్టె...

వరాహ. ౬. 3.

గీ. వీర లిందరు నామీఁద విశ్వసింప,కున్న వారపకీర్తి నాకొదవకుండఁ, జూపుమా సర్వబంధులుఁ జూడవలయు, నింక నీ కపరాధ మొక్కింతలేదు. (వి. పు. ౬. 330.)

**విశ్వసృ(ట్టు)జుఁడు.** సం. వి. జ్. పుం. బ్రహ్మ, సృష్టికర్త.

**విశ్వస్త.** సం. వి. ఆ. స్త్రీ. విధవ, వితంతువు.

**విశ్వస్తుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. విశ్వసింపఁబడినవాఁడు, నమ్మఁబడినవాఁడు. ౨. నమ్మినవాఁడు, విశ్వసించినవాఁడు. 3. నమ్మఁదగినవాఁడు, విశ్వసనీయుఁడు.

**విశ్వాచి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ఒకానొక యప్సరస్త్రీ. ౨. బాహురోగవిశేషము. (వాచ.) చేయి కదలకుండఁజేయు పక్షవాతవిశేషము.

**విశ్వాత్ముఁడు.** సం. వి. న్. పుం. ౧. పరమాత్మ, కూటస్థుఁడు. ౨. బ్రహ్మ. 3. శివుఁడు. ౪. విష్ణువు.

**విశ్వామిత్రుఁడు.** సం. వి. అ. పుం. గాధిపుత్త్రుఁడు, ఒకానొక ఋషి. (తొలుత రాజయియుండి తపోమహిమచే బ్రహ్మర్షిత్వమును బడసిన మహాముని. శ్రీరామునికి శస్త్రాస్త్రము నుపదేశించిన ఋషి.)

**విశ్వావసు(స్సు).** సం. వి. ఉ. పుం. ఒకానొక గంధర్వుఁడు.- స్త్రీ. రాత్రి. (వై. వి.)

**విశ్వాసఘాతకుఁడు.** సం. విణ. (అ. ఇకా. అ.) ద్రోహి, నమ్మించిమోసపుచ్చుట.

(ఇప్లో: విశ్వాసభంగము.)

**విశ్వాసఘాతి.** సం. విణ. (న్. నీ. న్.) = విశ్వాసఘాతకుఁడు.

**విశ్వాసనము.** సం. వి. అ. న. నమ్మకము పుట్టించుట, నమ్మించుట.

**విశ్వాసపాత్రము.** సం. వి. అ. న. నమ్మకము నకు స్థానము. నమ్మఁదగినవాఁడు.

(ఇప్లో: విశ్వాసస్థానము.)

**విశ్వాసభూమి.** సం. వి. ఇ. స్త్రీ. = విశ్వాసపాత్రము.

**విశ్వాసము.** సం. వి. అ. పుం. ౧. నమ్మికము. ౨. రహస్యము.

**విశ్వాసి.** సం. విణ. (న్. నీ. న్.) విశ్వాసము గలవాఁడు.

**విశ్వా(శ్వ)సించే.** సం. స. క్రి. విశ్వసించు, నమ్ము.

క. జనక వ్యాపార సతీ గురు, జననీ బుధ భాషణములు, నమ్మని మోసపున్, విని విశ్వాసింపుము గాని, ననయము నిష్కపటబు వచమని నమ్మదగున్. (ప్రబోధ. ౪. ౯౩.)

ద్వి. అతఁడు వారలకెల్ల నభయహస్తంబు, చతురత నిచ్చి విశ్వాసించి పలికె.

విరాట. ప. ౪. ౬౨. పా.

**విశ్వుఁడు.** ౧. విష్ణువు. ౨. స్థూలశరీరాభిమాని యగు జీవుఁడు. ౩. నాగరకుఁడు, నగరవాసి.

**విశ్వేదేవులు.** సం. వి. అ. పుం. బ. గణదేవతా విశేషము, విశ్వదేవగణము. (వీరు క్రతువు, దక్షుఁడు, వసువు, సత్యుఁడు, కాముఁడు, కాలుఁడు, ధురి, రోచనుఁడు, పురూరవసుఁడు, మార్ద్రివసుఁడు అని పదుగురు.)

**విశ్వేశుఁడు.** సం. వి. అ. పుం. ౧. పరమాత్ముఁడు, జగదీశ్వరుఁడు. ౨. శివుఁడు, కాశీక్షేత్రమున వెలసిన శివుని యర్చావతార విశేషము. (ఇల్లే: విశ్వేశ్వరుఁడు.)

**విష.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పురీషము, మలము. ౨. తెలివి, జ్ఞానము. ౩. అతివిష, అతివస. ‡.

**విషండము.** సం. వి. అ. న. తామరతూఁడు, మృణాళము.

**విషకంఠుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు.

**విషక్తము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. దృఢముగాఁ గూర్పఁబడినది, దగ్గఱఁగాఁ జేర్పఁబడినది. ౨. అంటియున్నది, వ్రేలాడఁగట్టఁబడినది. ౪. సంప్రాప్తమైనది, ప్రసక్తమయినది.

**విషఘ్నము.** సం. విశే. (అ. ఈ. అ) విషమును పోఁగొట్టునది.-వి. అ. పుం. ౧. విషమునకు విరుగుడుమందు, ౨. శిరీషము, దిరిసెనము. ‡. ౩. చంపకము, సంపంగి. ‡. ౪. చిన్నరేవడి. దూలగొండి. ‡. యవాసము. ౫. విభీతకము, తాఁడిచెట్టు.

**విషఘ్ని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. పసుపు ‡. ౨. వెఱ్ఱిపుచ్చ. ‡. ౩. పెద్దపాపర ‡. ౪. కారు తులసి ‡. ౫. నేలయూసరిక ‡. ౬. ఎఱ్ఱగలిజేరు ‡.

**విషజుష్టము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. విషము గలది. ౨. విషముకలసినది.

**విషజ్వరము.** సం. వి. అ. పుం. మహిషము, దున్నపోతు. (మహిషమునకు జ్వరము విషమువలెఁ బ్రాణాంతకమైనది.)

**విషణ్ణుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) విషాదము నొందినవాఁడు, దుఃఖితుఁడు, క్రుంగినవాఁడు.

**విషదంత(క)ము.** సం. వి. అ. పుం. సర్పము, పాము.

**విషదము.** సం. వి. అ. పుం. ౧. నీరదము, మేఘము, మబ్బు. ౨. శుక్లవర్ణము, తెలుపు. ౩. అన్నభేది.

**విషదర్శనమృత్యుకము.** సం. వి. అ. పుం. చకోరము, పక్షివిశేషము.

**విషదిగ్ధము.** సం. విశే. (అ. ఆ. అ.) విషముతోఁ బూయఁబడినది.

**విషద్రుమము.** సం. వి. అ. పుం. ౧. విషవృక్షము, విషపుఁజెట్టు. ౨. ముసిఁడిచెట్టు.

**విషధరనిలయము.** సం. వి. అ. పుం. నాగలోకము, పాతాళము.

**విషధరము.** సం. వి. అ. పుం. ౧. సర్పము, పాము. ౨. మేఘము, మబ్బు.

**విషపుచ్ఛము.** సం. వి. అ. పుం. తేలు, వృశ్చికము.

**విషపుష్పకము.** సం. వి. అ. పుం. రోగవిశేషము, విషపుష్పములఁ దినుటవలనఁ గలిగిన రోగము

**విషపుష్పము.** సం. వి. అ. న. నీలోత్పలము, నల్లకలువ.

**విషప్రయోగము.** సం. వి. అ. పుం. విషము పెట్టుట.

**విషమకర్ణము.** సం. వి. అ. పుం. ౧. (గణిత) సమానముగాలేని కర్ణములు (ఎదురుగానుండు రెండుమూలలు కలుపు గీఁతలు) గల చతుష్కోణము. ౨. సమకోణముగాఁ జేయఁబడిన త్రిభుజముయొక్క కర్ణము, ఎదురుగా నుండెడి రెండుమూలలు కలుపు గీఁత.

**విషమకర్మము.** సం. వి. అ. న. (గణిత) రెండు సంఖ్యల వర్గముల భేదమును, ఆ సంఖ్యల మొత్తమైనను భేదమైనను దెలిసినచో, ఆ సంఖ్యలను కనిపట్టు పద్ధతి.

**విషమచతురస్రము.** సం. వి. అ. పుం. సమము కాని నలుప్రక్కలుగల న్యాసము.
(ఇశ్లే : విషమచతుర్భుజము.)

**విషమచ్ఛదము.** సం. వి. అ. పుం.. సప్తపర్ణము, ఏడాకులయరఁటి. †.

**విషమజ్వరము.** సం. వి. అ. పుం. నడుమనడుమ తిగ్గుచు హెచ్చుచుండెడి జ్వరము.

**విషమత్రిభుజము.** సం. వి. అ. పుం. (గణిత) సమానముకాని మూఁడుభుజములుగల న్యాసము.

**విషమదారి.** మి. వి. వృక్షవిశేషము.
సీ. వెలఁగ విషమదారి వెత్తికుంకెన మంచి
కుంకెన కలబంద గువ్వగుత్తి.
హంస. ౪. ౧౦.

**విషమనయనుఁడు.** సం. వి. అ. పుం. విషమాక్షుఁడు.
(ఇశ్లే : విషమనేత్రుఁడు, విషమలోచనుఁడు, విషమాక్షుఁడు. మొ.)

**విషమము.** సం. విశే. (అ. అ. అ.) ౧. సమము కానిది, మిట్టపల్లములు గలది, ౨. సమానము కానిది, హెచ్చుతగ్గులు కలది. 3. బేసియైనది, అయుగ్మము. ౪. కఠినమైనది, దుర్బోధము, సులభముగా బోధపడనిది. ౫. దుర్గమము, పోవుటకుఁ గష్టమైనది. ౬. ముసుకైనది, ౭. వంకరయైనది. ౮. బాధాకరమైనది, శ్రమము గలిగించునది. ౯. తీవ్రమైనది. ౧౦. అపాయకరమైనది, భయంకరమైనది. ౧౧. ప్రతికూలమైనది. ౧౨. అసాధారణమైనది, సాటిలేనిది. ౧3. కుటిలమైనది, కుత్సితమైనది. ౧౪. దుష్టము, చెడ్డది. ౧౫. భిన్నము, వేరైనది.

వి. అ. న. ౧. మిట్టపల్లము లుండుట. ౨. బేసియగుట. 3. దుర్గమప్రదేశము, కొండకొన, మొ. ౪. కష్టస్థితి. ౫. విషమప్రదేశము, నిమ్నోన్నతమైన నేల. ౬. విషమాలంకారము, అర్థాలంకారము. ౭. వృత్తభేదము.

**విషమవిభాగము.** సం. వి. అ. పుం. హెచ్చుతక్కువలుగఁ బంచిపెట్టుట.

**విషమశరుఁడు.** సం. వి. అ. పుం. బేసి బాణములు గలవాఁడు, మన్మథుఁడు.
(ఇశ్లే : విషమబాణుఁడు, విషమాయుధుఁడు, మొ.)

**విషమశిష్టము.** సం. వి. అ. న. అనుచితమైన శాసనము, పనికిమాలిన యాజ్ఞ.

**విషమశీలుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ప్రతికూలస్వభావముగలవాఁడు, వికటమయిన స్వభావముకలవాఁడు, చిఱచిఱలాడెడువాఁడు.

**విషమస్థుఁడు.** సం. విశే. (అ. అ. అ.) ౧. మిట్టపల్లములుగలచోట నున్నవాఁడు. ౨. కష్ట

సులో నున్నవాఁడు, అపాయస్థితిలో నున్న వాఁడు.

**విషమించు.** సం. అ. క్రి. అపాయము తెచ్చు.

సీ. ఏలికతో మేల మెప్పుడు విషమించుఁ బాముతో నవ్విన భంగపఱుచు.

నీతిసీ. శ. ౫౨.

సీ. రాకేందుసుముఖి నీవు నేకరూపము దాల్చి విషమింప నేల రోగావిషమశరుఁడ.

భాను. ౫. ౫౬.

**విషమితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. విషమముగాఁ జేయఁబడినది, మిట్టపల్లములు గలదిగాఁ జేయఁబడినది, వంకరగాఁ జేయఁబడినది. ౨. ముడిచికొనునట్లు చేయఁబడినది, సంకుచితముగా చేయఁబడినది. ౩. కష్టమగునట్లు చేయఁబడినది.

**విషము.** సం. వి. అ. పుం., న. గరళము, వత్సనాభి.

న. ౧. నీరు, జలము. ౨. తామరతూఁడు. ౩. గోపరసము, బాలెంతబోళము.

**విషమృత్యువు.** సం. వి. ఉ. పుం. ఒకానొక పక్షి, చకోరము.

**విషమేషువు.** సం. వి. ఉ. పుం.=విషమశరుఁడు.

**విషయకము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఒక వస్తువునకు సంబంధించినది. ౨. (సమాసాంతమున) ఒకదానినిగూర్చి చెప్పునది, ఒకయంశము విషయముగాఁ గలది.

(ఉదా: దానవిషయకగ్రంథము.)

**విషయగ్రామము.** సం. వి. అ. పుం. ఇంద్రియార్థముల సమూహము, శబ్దాది విషయముల సమూహము.

**విషయాభిరతి.** సం. వి. ఇ. స్త్రీ. ఇంద్రియార్థములయం దాసక్తి, ఐహికానందముల యందలి కోరిక.

(ఇట్లే: విషయనిరతి, విషయాసక్తి, మొ.)

**విషయప్రసంగము.** సం. వి. అ. పుం. విషయాభిరతి.

**విషయము.** సం. వి. అ. పుం. ౧. ఇంద్రియార్థము, ఇంద్రియగోచరమగు శబ్దాదికము, భోగసాధనము. ౨. లౌకికార్థము, వ్యాపారము. ౩. ఇంద్రియానందము. ౪. పదార్థము, వస్తువు. ౫. లక్ష్యవస్తువు, లక్ష్యము. ౬. తిరుగఁగడిచోటు, సంచరింపవీలగు ప్రదేశము. ౭. పని, కృత్యము, ప్రధానకార్యము. ౮. ప్రస్తావము, ప్రకరణము, సంగతి. ౯. వివరింపఁదగిన యంశము, (మీమాంస.) అధికరణమందలి ఐదంశములలో మొదటిది, (శ్లో. విషయో విశయశ్చైవ పూర్వపక్షస్తథోత్తరం, నిర్ణయశ్చేతి సిద్ధాంతశ్శాస్త్రేఽధికరణం స్మృతమ్.) ౧౦. స్థానము, ప్రదేశము. ౧౧. దేశము, గ్రామ సమూహము, మండలము. ౧౨. శరణము, రక్షకస్థానము, నీడపట్టు. ౧౩. వీర్యము, శుక్రము. ౧౪. మతసంస్కారము, కర్మము. ౧౫. అయిదుసంఖ్య. ౧౬. (అలం) ఆరోపాశ్రయము.

ఉదా: అజ్ఞానతిమిరము. ఇట తిమిరత్వారోపమున కాశ్రయ మజ్ఞానము.

**విషయసుఖము.** సం. వి. అ. పుం. భోగ్యవస్తువులవలనఁ గలిగెడి యానందము, ఇంద్రియానందము.

**విషయాత్మకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) భోగ్యవస్తువులయందే మనస్సు గలవాఁడు, భోగపరుఁడు, ఇంద్రియసుఖము గోరువాఁడు.

**విషయాభిలాషము.** సం. వి. అ. పుం. విషయాభిరతి.

**విషయాసక్తుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ఇంద్రియసుఖములందు ఆసక్తి గలవాఁడు; ఐహికసుఖములను గోరువాఁడు.

(ఇట్లే: విషయనిరతుఁడు.)

**విషయి.** సం. విశే. (న్. ఈ. న్.) విషయాసక్తుఁడు, భోగలాలసుఁడు.—వి. న్. పుం. ౧. లోకజ్ఞుఁడు, లోకజ్ఞానముగలవాఁడు. ౨. రాజు. ౩. మన్మథుఁడు. ౪. ఇంద్రియసుఖాసక్తుఁడైన మనుష్యుఁడు, భోగి.—న. ౧. జ్ఞానేంద్రియము, త్వగాది. ౨. జ్ఞానము, ఎఱుక.

**విషయించు.** సం. స. క్రి. ౧. ఉద్దేశించు.

సీ. విద్వజ్జనులు నిన్ను విషయించి వత్తురు...
వైష. ౬. ౧౧౦.

౨. యభించు, మైథునముచేయు.

క. ... వినుము చంద్రరేఖా, భవకమువలె నిన్నుఁ జేతఁబట్టి యెవరినిన్, విషయింప నీయ గట్టిగ వృషగాదని పలికె...
చంద్ర. వి. ౩. ౧౫౩.

ఉ. బండమువారి పాపికిని బైటి పసారమె కాని యందులో, పుండట యొల్లపంకఁ జెడి పోదుఁగదా విషయింపఁ బోయినన్.
క్రీడా. పీఠి. ౫౩ పా.

**విషయీకరించు.** సం. స. క్రి. విషయముగాఁ జేయు, తెలిసికొను.

వ. స్వస్వరూప పరమాత్మస్వరూపంబుల విషయీకరింప నెఱుఁగని సహజానంద ముఖుఁడయి... (కవిక. ౫. ౧౦౦.)

**విషయైషి.** సం. విశే. (న్. ఈ. న్.) భోగములు గోరువాఁడు, ఇంద్రియసుఖము గోరువాఁడు.

**విషయోపసేవ.** సం. వి. ఆ. స్త్రీ. విషయాభిరతి.

**విషవిద్య.** సం. వి. ఆ. స్త్రీ. విషముపోఁగొట్టు విద్య, విషప్రతిక్రియ.

**విషవృక్షన్యాయము.** సం. వి. అ. పుం. చూ. న్యాయము.

**విషవృక్షము.** సం. వి. అ. పుం. విషముగల చెట్టు, ముసిఁడిచెట్టు.

**విషవేగము.** సం. వి. అ. పుం. విషముయొక్క తీవ్ర ప్రసారము.

**విషశూకము.** సం. వి. అ. పుం. కందురీఁగ.

**విషశృంగి.** సం. వి. న్. పుం. విషశూకము.

**విషసూచకము.** సం. వి. అ. పుం. చకోరము.

**విషసృ (క్క) క్వము.** సం. వి. న్. పుం. కందురీఁగ.

**విషహంత్రి.** సం. వి. ఈ. స్త్రీ. తెల్లదింటెన.

**విషహృదయుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) విషముగలమనస్సువాఁడు, ద్వేషబుద్ధిగలవాఁడు.

**విషహ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. సహింపఁదగినది, ఓర్వఁదగినది, ౨. నిశ్చయింప సాధ్యమైనది, ౩. సాధ్యమైనది.

**విషాంకురము.** సం. వి. అ. పుం. ౧. ఈఁటె. ౨. కొనను విషముపూసినబాణము.

**విషాంతకము.** సం. విశే. (అ. ఆ. అ.) విషమును బోఁగొట్టునది, విషమునకు విరుద్ధమైనది.

**విషాంతకుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు.

**విషాక్తము.** సం. విశే. (అ. ఆ. అ.) విషముతోఁ బూయఁబడినది.

**విషాణము.** సం. వి. అ. పుం., న. ౧. ఎద్దు మొదలగువాని కొమ్ము. ౨. ఏనుఁగుదంతము. ౩. పంది (అడవిపంది) కోఱ, వరాహదంష్ట్ర. ౪. చెంగల్వకోష్టు ‡.

**విషాణి.** సం. విశే. (న్. నీ. న్.) విషాణములు కలది.—వి. న్. పుం. ౧. కొమ్ములుగల జంతువు, దంతములుగల జంతువు. ౨. ఏనుఁగు. ౩. ఎద్దు. ౪. వరాహము.

**విషాదము.** సం. వి. అ. పుం. ౧. దుఃఖము, చింత. ౨. ఆశాభంగము, ఆశలుడుగుట, నిరాశ. ౩. దౌర్బల్యము, కృశత్వము, ౪. తెలివిలేమి, స్మృతిలేమి.

**విషాది.** సం. విశే. (న్. నీ. న్.) దుఃఖము గలవాఁడు, దుఃఖితుఁడు.

**విషాదించు.** సం. అ. క్రి. ఖేదపడు.

క. శిరమున రక్తము వెడలఁగ, బొరలెడు తన విభునిఁ జూచి పొడమిన వగతోఁ, బరుష ధ్వని వాపోవుచు, గరము విషాదించు క్రౌంచిఁ గనుగొని కరుణన్.

భా. రా బాల. ౨.

**విషాపహము.** సం. విశే. (అ. ఆ. అ.) విషమును బోఁగొట్టునది, విషమునకు విఱుగుడైనది.

**విషారము.** సం. వి. అ. పుం. పాము, సర్పము.

**విషాలువు.** సం. విశే. (ఉ.) విషముగలది.

**విషాస్య.** సం. వి. ఆ. స్త్రీ. నల్లజీడి.‡.

**విషాస్యము.** సం. వి. అ. పుం. పాము, సర్పము. (ఇట్లే: విషాననము.)

**విషువత్తు.** సం. వి. త్., న్. ౧. విషువము, సమరాత్రిందినకాలము, ౨. యజ్ఞమున నడిమి దినము. (నిఘంటువు.)

**విషువచ్ఛాయ.** సం. వి. ఆ. స్త్రీ. నీడగడి[illegible]పుముల్లుయొక్క మధ్యాహ్నపునీడ, వేళ తెలిసికొనుటకై యుపయోగపడు మధ్యాహ్నపు నీడ.

**విషువ (ద్ది) దినము.** సం. వి. అ. న. రేయుంబవలును సమప్రమాణముగా నుండెడి దినము, సమమయిన రాత్రిందినప్రమాణముగల దినము.

**విషువ (ద్రే) రేఖ.** సం. వి. ఆ. స్త్రీ. భూగోళమువిూఁద సరిగా మధ్యను తూర్పు పడమరల కుండెడు రేఖ.

**విషువము.** సం. వి. అ. పుం. మేషతులారాసుల ప్రథమాంశము, రాత్రిం దివాభాగములు సమప్రమాణములుగా నుండెడి యంశము, సమరాత్రిందినకాలము.

**విషువ (త్సం) సంక్రాంతి.** సం. వి. ఇ. స్త్రీ. తులామేషరాసులలో నొకదానియందు సూర్యుఁడు ప్రవేశించుట.

**విషూచిక.** సం. వి. ఆ. స్త్రీ. విరేచనముల జబ్బు, బేదిరోగము, కలరా.

**విష్కందము.** సం. వి. అ. పుం. ౧. చెదరుట. ౨. వెడలిపోవుట.

**విష్కంభ(క)ము.** సం. వి. అ. పుం. ౧. విఘ్నము, అడ్డంకి. ౨. తలుపుగడియ, అడ్డఁగఱ్ఱ. ౩. ఇంటికి మూలాధారమైన దూలము. ౪. స్తంభము, గాడు. ౫. వృక్షము. ౬. రూపకాంగభేదము, (నాటకములయందు రెండంకములకు నడుమ నొకటిలేక రెండుపాత్రములు ప్రవేశించి నాటకకథావస్తువును - జరిగినదానిని రాఁబోవుదానిని - సంగ్రహముగా సభ్యులకుఁ దెలియఁజేయు భాగము.) ౭. ఒక వలయముయొక్క మధ్యరేఖ, వ్యాసరేఖ.

౮. రోగు లభ్యసింపఁదగు బంధవిశేషము. ౯. విస్తారము, వెడల్పు. ౧౦. జ్యోతిశ్శాస్త్ర సంబంధమైన యిరువదియేడు యోగములలో మొదటిది.

**విష్కంభి.** సం. వి. న్. పుం. తలుపుగడియ.

**విష్కంభితము.** సం. విణ. (అ. ఆ. అ.) అడ్డు పెట్టఁబడినది, విఘ్నము గలిగింపఁబడినది.

**విష్కిరము.** సం. వి. అ. పుం. ౧. చిమ్ముట, వెదజల్లుట. ౨. చీల్చుట. ౩. పక్షి. ౪. కోడి పుంజు, కోడిజాతిలోఁ జేరినపక్షి.

**విష్టంభము.** సం. వి. అ. పుం. ౧. దృఢముగా ఆనుకొనుట. ౨. విఘ్నము, అడ్డంకి, నిరోధము. ౩. మూత్రనిరోధము, మలనిరోధము. ౪. పక్షవాతము. ౫. నిలుచుట, ఆగుట. ౬. పాదన్యాసము, అడుగుపెట్టుట.

**విష్టంభి.** సం. విణ. (న్. నీ. న్.) ౧. అడ్డగించునది, నిరోధించునది. ౨. స్తంభింపఁజేయునది, మొద్దుబాఱఁజేయునది.

**విష్టపము.** సం. వి. అ. పుం., న. జగత్తు, భువనము.

**విష్టపహారి.** సం. విణ. (న్. ణీ. న్.) లోకరంజకుఁడు, ప్రపంచమును రంజింపఁజేయువాఁడు.

**విష్టబ్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. గట్టిగా అదుమఁబడినది. ౨. ఆశ్రయమీయఁబడినది, బలపఱుపఁబడినది. ౩. విఘ్నితము, అడ్డగింపఁబడినది. ౪. స్తంభింపఁజేయఁబడినది.

**విష్టరము.** సం. వి. అ. పుం. ౧. (పీఁట, బల్ల మొదలైన) ఆసనము. ౨. యజ్ఞమునందు 'బహ్మ' కిచ్చెడి పీఠము. ౩. దర్భలతో నల్లిన చాఁప, కుశాసనము. ౪. కుశముష్టి, పిడికెడు కుశము. ౫. చెట్టు.

**విష్టరశ్రవుఁడు.** సం. వి. స్. పుం. విష్ణుదేవుఁడు.

**విష్టి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. వ్యాప్తి, వ్యాపించుట. ౨. ఉద్యోగము, పని. ౩. జీతము, కూలి. ౪. వెట్టి, జీతములేనిపని. ౫. పంపుట. ౬. నరకనివాసము. ౭. (జ్యోతి) పంచాంగములోని కరణములలో నొకటి. (భద్రకరణము.)

**విష్ఠ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. మలము, పురీషము. ౨. ఉదరము, కడుపు.

**విష్ఠలము.** సం. వి. అ. న. దూరప్రదేశము.

**విష్ఠించు.** సం. అ. క్రి. విష్ఠచేయు, ఏఱుగు, మలవిసర్జనముచేయు. (శ. ర., బ్రౌ.)

**విష్ణుక్రాంత.** సం. వి. ఆ. స్త్రీ. నల్లదింటెన.

**విష్ణుగుప్తుఁడు.** సం. వి. అ. పుం. చాణక్యుని మఱియొక పేరు.

**విష్ణుచక్రము.** మల్లబంధవిశేషము.

వ. సరనామధేయంబులగు గతులును, విష్ణుచక్రంబును, రామబాణంబును, నాగబంధంబును... మల్లుపు. ౩. ౬౮.

**విష్ణుదైవత్యము.** సం. విణ. (అ. ఆ. అ.) విష్ణువు అధిష్ఠానదేవతగ లది.—వి. అ. న. శ్రవణ నక్షత్రము.

**విష్ణుపదము.** సం. వి. అ. న. ౧. ఆకాశము, మిన్ను. ౨. క్షీరసాగరము. ౩. గయాక్షేత్రమునఁ బూజింపఁబడెడి విష్ణుదేవునిపాదము. ౪. పద్మము, తామరపువ్వు.

**విష్ణుపది.** సం. వి. ఈ. స్త్రీ. ౧. గంగానది. ౨. వృషభ, సింహ, వృశ్చిక, కుంభరాసులలో సూర్యుని ప్రవేశము.

**విష్ణుపురాణము.** సం. వి. అ. న. పదునెనిమిది మహాపురాణములలో నొకటి.

**విష్ణుమాయ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. అనాది యైన యవిద్య. ౨. దుర్గాదేవి.

**విష్ణురథము.** సం. వి. అ. పుం. గరుత్మంతుఁడు. (ఇశ్లే : విష్ణువాహ్యము.)

**విష్ణురాతుఁడు.** సం. వి. అ. పుం. పరీక్షిత్తు. (ఒకానొక రాజు.)

**విష్ణువల్లభ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. లక్ష్మి. ౨. తులసి.

**విష్ణువు.** సం.వి.ఉ.పుం. ౧. అంతటనువ్యాపించువాఁడు, వెన్నుఁడు, త్రిమూర్తులలో రెండవవాఁడు. (ఇతఁడు సత్త్వగుణప్రధానుఁడై లోకస్థితికర్తయై తనపని నిర్వహింప ననేకావతారము లెత్తినవాఁడు.) ౨. అగ్ని. ౩. పుణ్యపురుషుఁడు. ౪. విష్ణుస్మృతి రచించిన యొకానొక ముని. ౫. అష్టవసువులలో నొకఁడు. ౬. శ్రవణ నక్షత్రము.

**విష్పందము.** సం. వి. అ. పుం. అదరుట, ధాతువులు కొట్టుకొనుట, గుండెలు కొట్టుకొనుట.

**విష్ఫారము.** సం. వి. అ. పుం. ౧. టంకారము, వింటినారిధ్వని. ౨. కంపము, వణఁకు.

**విష్యందము.** సం. వి. అ. పుం. కారుట, బొట్లు బొట్లుగాఁబడుట.

**విష్యము.** సం. విణ. (అ. ఆ. అ.) విషముచేఁ జంపఁదగినది.

**విష్వక్సేనప్రియ.** సం. వి. ఆ. స్త్రీ. విష్ణుప్రియ, లక్ష్మి.

**విష్వక్సేనుఁడు.** సం. వి. అ. పుం. ౧. విష్ణువు. ౨. విష్ణుదేవుని ప్రధానపరిచారకులలో నొకఁడు.

**విష్వాణము.** సం. వి. అ. న. భోజనము, తినుట.

**విష్వద్ర్యం(ద్ర్య)చము.** సం. విణ. (చ్. ద్రీచీ. చ్.) అంతటను వ్యాపించినది, సర్వవ్యాపకమైనది.

**విష్వాణము.** సం. వి. అ. పుం. = విష్వణము.

**విసంకటము.** సం. విణ. (అ. ఆ. అ.) భయంకరము, ఘోరమైనది.-వి. అ. పుం. ౧. సింహము. ౨. ఇంగుదీవృక్షము, గారచెట్టు.

**విసంగతము.** సం. విణ. (అ. ఆ. అ.) సంగతము కానిది, పొసఁగనిది, ఇంపుగాలేనిది.

**విసంచుచేయు.** స. క్రి. చెఱుచు, ధ్వస్తము చేయు. (క. విసంచిసు. = ౧. ముక్కలగు. ౨. బలహీనమగు.)

గీ. అలసవలితంబులైన కటాక్షవీక్షణాంచలంబులు యువధైర్యకంచుకంబులు, చించి చీకాకుపఱచి విసంచుజేసె, రామనర్తనకేళీ విరామవేళ. వైజ. ౧. ౧౩౧.

**విసంధి.** సం వి. ఇ. పుం. పద్యమునందలి పదములకొండొంటితో సంధి (కూడిక) లేకుండుట. (కావ్యదోషములలో నొకటి.)

**విసంయుక్తము.** సం. విణ. (అ. ఆ. అ.) విడిపోయినది.

**విసంయోగము.** సం. వి. అ. పుం. విడిపోవుట.

**విసంవాదము.** సం. వి. అ. పుం. ౧. విరోధము. ౨. మోసము. ౩. మాటతప్పుట. ౪. పరస్పర విరుద్ధముగా నుండుట. ౫. వ్యతిరేకము.

**విసంవాది.** సం. విణ. (న్. నీ. న్.) ౧. అసంగతము,పరస్పర విరుద్ధమైనది. ౨.భిన్నము, వ్యతిరేకమైనది. ౩. వివాదపడునది, కలహించునది. ౪. అసత్యము, నిజముకానిది.

౫. వంచకము, మోసపుచ్చునది. ౬. ఆశాభంగముచేయునది.

**విసంస్థులము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. చంచలము, కలఁతనొందినది. ౨. సమము కానిది, విషమమైనది.

**విసదారి.** వి. (సం. విషధారి.) సర్పము, పాము.

గీ. లలి నిరాచారులేయుండు నలువప్రోలు,
బలసి విసదారులుండు పెంజిలువప్రోలు,
కూడు నిదురయు నెపుడుఁ జేకూఱకుండు,
వేలుపులప్రోలు న మ్మేటి వీటి కెనయ.
అచ్చ. రా. బాల. ౩౧.

**విసనకఱ్ఱ.** వి. (విసన + కఱ్ఱ.) వీవన, తాళవృంతము.

ఆ. కప్ర... వలపు, గ్రమ్ము పూల విసనకఱ్ఱచే
వీచుచు... నీలా. ౩. ౩౨.

సీ. విప్పైనగొడుగులు విసనకఱ్ఱలు...
ప్రబం. ౧. ౫౪.

**విసపరి.** విణ. దుష్టుఁడు, దుష్టురాలు.

ద్వి. పాపజాతులు విసపరులు పెద్దరులు,
పాటలమంచులు మందులమాస్ల ...
పండితా. పురా. ౧౧౬. పా.

**విసపాల.** వి. (విసము + పాల.) ఓషధీవిశేషము, ఒకానొక మందుచెట్టు. (శ. ర.)

**విసపాలవిత్తు.** విణ. (విసపాల + విత్తు.) నాశకుఁడు. (ఇది యొకతిట్టు.)

ద్వి. పదవిహీనుఁడు జగత్ప్రాణిభక్షకుఁడు,
వెదకి యీ విసపాలవిత్తు నేమందు.
హరిశ్చ. ఉ. ౨౦౩౭.

సీ. దరిచేసి చెడుగొట్టు బెరికి దగాకోరు విస
పాలవిత్తు చల్విసము దగులు...
హంస. ౫. ౧౧౩.

**విసపుమేఁతరి.** వి. (విసము + మేఁత + అరి.) శివుఁడు.

వ. విసపుమేఁతరియై తిరిగి యిచ్చట నియున్నట్లు
యుండును. మృ. వి. ౧. ౨౨.

**విసపుమ్రాను(కు.)** వి. (విసము + మ్రాను.) విషవృక్షము.

ఆ... అందు విసపుమ్రాఁకులై యున్న చెడుగు
రేఁద్రిమ్మరుల నడంచి తమ్మికంటి...
నీలా. ౧. ౮౦.

**విసబొద్ది.** వి. (విసము + బొద్ది.) పాఠ, ఒకానొక చెట్టు.

సీ... విసబొద్ది యనఁగను వెలయుఁ బాఠ.
ఆం. భా. ౨. ౫౪.

సీ. సహదేవి జుట్టుపు చలిపిండి చిటిముటి
పెన్నెరు విసబొద్ది పిండిదొండ.
హంస. ౪. ౧౦.

**విసమాలుచే(ల్చు.)** స. క్రి. రూపుమాపు.

ద్వి. వసఁగులన్నియు వచ్చి వందరలాడి, వెస
జిన ప్రతిమల విసమాల్తు నిదియ.
బస. పు. ౬. ౫౩౪.

**విసము.** వి. (సం. విషం.) ౧. గరళము.

చం... పయోజగర్భుఁడు సుధారసధారలు
రెంటిలో విసంబులు చిలికించి చేసెనో కో
పాల్పెసలారఁగ దీని నేత్రముల్.
నైష. ౩. ౧౧౬.

సీ... ముఖరాగమును గళంబున విసంబు.
వసు. ౩. ౧౨౩.

(వ బ ల క భేదమున బిసమని యర్థాంతరము.)

సీ. ఎడనెడ విసముగ్రక్కెడు పాములను మెడఁ
గూర్పఁ జెల్లునె మీకుఁ గొమ్మలార.
నీలా. ౩. ౩౪.

౨. నీరు.

సీ. మించు చూపుచునె నమ్మించి నిల్కడ
రేది విస మొసంగెడు మబ్బుఁ గొసర నేల.
యయా. ౧. ౨౮.

(ఇది రెండర్థములకు నుదాహరణము.)

జః విసపాలు, విసపాలవిత్తు, విసపుమేఁతరి, విసపుమ్రాను, విసబొద్ది.

**విసరణము.** సం. వి. అ. న. ప్రసరణము.

**విసరము.** సం. వి. అ. పుం. ౧. వెడలుట. ౨. ప్రసరించుట, వ్యాపించుట. ౩. సమూహము, మంద, గుంపు. ౪. రాశి, ప్రోవు.

**విసరియాడు.** = విసరు. స. క్రి. (విసరి + ఆడు.) ఆడించు.

ద్వి. వినువీథిఁ దోఁకలు విసరియాడుచును, గుది
వులు వాఱుచు గునిసియాడుచును.
రం. రా. యు. (శ. ర.)

**విసరు.** స. క్రి. (సం. విసృ.) ౧. ఆడించు.

క. తల విసరి వెల దగఁగ బో,యలకీవలదయ్య...
భార. అను. ౨. ౨౭౦.

౨. త్రిప్పు.

గీ...పట్టి కోదండదండంబు పరిఘు గాఁగ,
విసరుచును వచ్చె వేలొండు వేల్పుఁబోఁగ.
పారి. ౪. ౭౦.

క. గద విసరివైచె నరకుఁడు...
ఉ. హరి. ౧. ౧౬౬.

వ. పుడమిపతి పెడవిసరు విసరి...
మనుచ. ౪. ౧౧౫.

౩. రువ్వు.

గీ. తప్పులేకుండ నేల నెత్తమ్మి మొగడ, విసరి
వక్షఃప్రదేశంబు ప్రేటుగొంటి.
పారి. ౧. ౨౭.

గీ. విరహితతిమీఁది కోపాన మరుఁడు దివియు,
వేగమై పైఁడియొఱలోన విసరఁ గుట్లు,
దునిసి చైటికి నసిధార దోఁచె ననఁగ...
ఆము. ౫. ౭౪.

వ. అప్పూవ్వుదండఁ గ్రమ్మునఁ గ్రమ్మఱించి
విసరి... హర. ౬. ౧౬.

౪. భుజించు.

సీ. తల్లియిచ్చిన చల్ది తగ బ్రహ్మ వచ్చిన
వెనుకఁజూడక వేగ విసరగలవు.
సిం. నార. ౩౮.

౫. వీజనముచేయు, విసనకఱ్ఱ నాడించి గాలి ప్రసరించునట్లు చేయు.

సీ. ఇల్లిల్లుదిరుగ నొక్కింత బెబ్బు శిఖి యబ్బె నే
నింటిలోఁ బూరి యిడి విసరక,రాఁజను...
ఆము. ౪. ౧౨౭.

గీ. అనుమ వెతనొందు జనకుని యాననంబుఁ,
జూచి యడలూన భాషించె సుందరాంగి,
బాఁతిమై రాఁజఁబెట్టిన పావకంబు, వీవనం
బునఁ బైపయి విసరినట్లు.
కృ. శకుం. ౩. ౧౦౩.

గీ...బహుళనిజదేహలేపనపరిమళములు, సోఁడు
ముట్టంగ నొక్కతె సురటి విసరె.
వరాహ. ౯. ౧౩౯.

౬. చూర్ణముచేయు.

ఉదా: కందులువిసరు, పిండివిసరు, మొ.

౭. క్రి. ౧. వీచు.

క ...వజడు లఱచె నుల్కాలువడె, నెఱిచెడి
సురగాలి విసరె నిలువక పెలుచన్.
ఉ. హరి. ౨. ౭౪.

క. ...సుమ్యగ్గంధవహము తనువుల, మొగ్గ
చెమటలాఱ విసర ముదితాత్మకులై.
వరాహ. ౭. ౫౬.

౨. కురియు.

సీ. విసరునో శృంగారరసవృష్టి కొప్పునఁ దొలఁకునో యమృతంబు పలుకులందు.

నిరం. ౪. ౭౧.

వి. ౧. వీచుట.

వ ... పెల్లడరు నిట్టూర్పుగాడ్పు విసరులన్ గసరెత్తి... మనుచ. ౩. ౮.

౨. ఆడించుట.

సీ. తోరంపుటూర్పులఁ దొడరి పొంతాళము దాఁకంగ సాగరౌఘములు గలఁగ,వికటంపు బెబుకల విసరున నుప్పొంగు తుప్పర డెండంబు దూ పడంగ.

హరి. ఉ. ౫. ౧౬౧.

౩. దెబ్బ, పోటు.

క. ఆ సురుసురని సొలయున్ రాజసురేంద్రుఁడు మలయపవను చలికి సునవకున్, బిసరుహాళరు శరవిసరపు, ముసురునకుం దడిసి కిసలముల విసరునకున్. కవిరా. ౫. ౨౬౫.

౪. రువ్వుట.

వ. ...ఘడమిపతి పెదవిసరు విసరి...

మనుచ. ౪. ౧౧౫.

౫. మల్లవిద్యావిశేషము.

వ....బిగుపట్టు మొదలగు పదునాలుగువిసరులు.

ప్రబంధ. ౭౮.

జః విసరిపోడు, విసరుఁబాయి.

**విసరుఁబాయి.** వి. (విసరు + బాయి.) తిరుగలి.

(బ్రౌ., వా.)

**విసర్గము.** సం. వి. అ. పుం. ౧. త్రోసిపుచ్చుట, నిరాసము. ౨. ఉద్యోగాదులనుండి తొలఁగించుట. ౩. పరిత్యాగము, విడిచిపెట్టుట. ౪. ఈవి, దానము. ౫. కాఱుట, స్రవించుట. ౬. సృష్టి, సృజనము. ౭. (మఱి) విసర్జనము. ౮. ఎడఁబాసిపోవుట. ౯. మోక్షము. ౧౦. దీప్తి, కాంతి. ౧౧. విసర్జనీయము, రెండుసున్నలు గుర్తుగాఁగలవర్ణము. ౧౨. సూర్యుని దక్షిణదిగ్గమనము, దక్షిణాయనము. ౧౩. మేఢ్రము, పురుషాంగము. ౧౪. ప్రళయము.

**విసర్జనము.** సం. వి. అ. న. ౧. స్రవింపఁజేయుట, కార్చుట. ౨. దానము, ఈవి. ౩. వట్టిదిగాఁజేయుట. ౪. పరిత్యజించుట, వదలివేయుట. ౫. ఉద్యోగమునుండి తొలఁగించుట. ౬. దేవత నుద్వాసనముచేయుట, పూజాంతమున యథాస్థానమునకుఁ బంపుట. ౭. వృషోత్సర్జనము, కొన్ని సమయములయందు వృషభమును యథేచ్ఛముగా విడుచుట.

**విసర్జనీయము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. విడువఁదగినది. ౨. ఈయఁదగినది. ౩. పరిత్యజింపఁదగినది. ౪. స్రవింపఁజేయఁదగినది. వి. అ. పుం. విసర్గము, రెండుసున్నలుగుర్తుగాఁగల వర్ణము.

**విసర్జించు.** సం. స. క్రి. విడుచు.

వ. ... పద్యపూరణంబులకు నాదికారణంబులైన సంస్కృతాంధ్రభాషలం గల జిల్లులు విసర్జించి ... (వరాహ. ౧.౮.)

**విసర్జితము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. ఇయ్యఁబడినది, దత్తమైనది. ౨. విడిచిపెట్టఁబడినది, పరిత్యక్తము. ౩. పంపఁబడినది, ప్రేషితము. ౪. ఉద్యోగాదులనుండి తొలఁగింపఁబడినది. ౫. స్రవింపఁజేయఁబడినది.

**విసర్పఘ్నము.** సం. వి. అ. న. మైనము.

**విసర్పణము.** సం. వి. అ. న. ౧ ప్రాఁకుట, జరుగుట. ౨. వ్యాపించుట, ప్రసరించుట.

**విసర్పము.** సం. వి. అ. పుం. ౧. ప్రాఁకుట, జరుగుట. ౨. వ్యాపించుట, ప్రసరించుట.

౩. ఆకస్మికమైన కర్మఫలము. ౪. చర్మరోగ విశేషము.

**విసర్పి.** సం. వి. ఇ. స్త్రీ. చర్మరోగవిశేషము.

**విసర్పిక.** సం. వి. అ. స్త్రీ.=విసర్పి.

**విసవిస.** వి. గాలివీచుట, కత్తి మొ. త్రిప్పుట, నవ్వుట, నడచుట, ఊఁదుట, కోయుట మున్నగువానియందలి ధ్వని కనుకరణము.
(క) గాలివీచుటయందు.

గీ. ఉసురు లూడాడ విసవిస విసరి మసరి, దోసఁగు లెసగించు సురుగాడ్పు తుటుము దాడి కడలి తద్దయు గడగడ వడకుదాని, వేల్పురాకన్నెఁ గాంచి రావెలఁదు లపుడు.
రసిక. ౪. ౪౭.

సీ. ప్రళయ వాతూల మంబర మావరించుచు విసవిస నమితమై విసరసాగె.
వేం. మా. ౧.౪౬.

(చ) కత్తి, మొ. త్రిప్పుటయందు.

వ. అసదృశంబులగు ముసలంబులు కర విసరు హంబుల విసవిసం ద్రిప్పి...(ఆని. ౪. ౭౬.)
(ట) నవ్వుటయందు.

వ. విసవిస నగుమొగము మెఱుంగులు దశదిశలం బసలు కొలుప... (భాగ. ౮. ౩౮౬.)

వ. వింతవింత వలపుగొలుపు పొలుపుగల కళావతీ విమలవదనకమలంబులఁ జేరంజని తదీయ నాసాచంపకప్రసూనవాసనా నిలంబు లాయ్యనం బొరయ వెఱచి యసమ కుసుమరస విసరంబులు వెసమెసవి విస విస నగుచు. రామా. ౧. ౧. ౫౩.

(త) నడచుటయందు.

క. అని పలికి కలికి తొయ్యలి, తనుసంతాపంబు వాపఁదలఁచి విసవిసన్, జని విస విసరముఁ జిగురులు, నవలుం బువ్వుల్గొఁ దెచ్చి నైపుణి మెఱయన్.
రాజ. ౩. ౧౦౭.

(ప) ఊఁదుటయందు.

ద్వి. వెసఁ బుటంబులఁ బెట్టి విసవిస నూఁద...
నవనాథ. ౫. ౨౧౧. పొ. ౨౧. పం.

(గ) కోయుటయందు.

గీ. ...చంపకానోకహం బెక్కి సొంపు మీఱు, కుసుమ విసరంబు విసవిసఁ గోయు చుండ... ధర్మ. ౩. ౧౬౪.

విశే. (సం. విసరః) ప్రసరించునది, సాఁగునది.

చ. వసుమతి వేయిపాదములవానికిఁ బుట్టిన చాయపట్టికిన్,విసవిస గాసు కాలాకటి...
నైష. ౩. ౭౨.

**విసారము.** సం. వి. అ. పుం. ౧. వ్యాపించుట, ప్రసరించుట. ౨. ప్రాఁకుట, జరుగుట. ౩. చేప.—న. ౧. కొయ్య. ౨. కలప.

**విసారి.** సం. విశే. (న్. ఈ. న్.) ౧. వ్యాపించు నది. ౨. ప్రాఁకునది, జరుగునది.—వి. న్.పుం. చేప. — ఈ. స్త్రీ. వాతావరణము, వాయు మండలము.

**విసికించు.** స. క్రి. (√ విసుకు.) విసిగించు.

క. పసగా జీతము పెట్టక, పసచేత నుపాయము నను బని గొను బంటున్, విసికింపక తగు లబ్ధము, పొసఁగఁగ దశమాంశ మిచ్చి పుచ్చుఁగవలయున్. విజ్ఞా. ౨. ౩౭.

**విసిపలక.** వి. పరుండెడు పెద్దబల్ల.

సీ. పలక యనంగను ఫలకమా శయ్యార్థఫలక మొప్పును విసిపలక యనఁగ...
ఆం. భా. ౨. ౧౬౬.

**విసిమాలు.** అ. క్రి. (√ విసుకు.) మిక్కిలి విసుగు.

క. విప్రవాటంబులఁ బ్రతిగేహంబును బరి
భ్రమించి విసివి విసిమాలి వేసరి యూరటఁ
బొందిసాలని జూఁకించి తూలి దూఁపటిలి...
భీమ. ౨. ౧౦౧.

ఉ. మానక వేఁడివేఁడి విసిమాలుచు...
పా. ౪.(౫. ౭.)

**విసుకు.** వి. విసుగు, విసువు.

ఆ. అట్టు లేసియేసి యలపును విసుకును, వెఱఁగుఁ
బొడమి రాచవేల్పు వేఁడు, సేయఁ దెలియ
లేక చిన్నఁబోవుచు బిగి, యుడిగి మోము
వంచి యూరకుండె.
అచ్చ. రా. యు. ౫. ౫౨.

జు. విసికించు, విసిమాలు.

**విసుగు.** వి. విసువు, నిర్వేదము, వేసరుట.

గీ. వింటఁ గొని ప్రేయఁ బ్రేయఁగ విసుగుఁ
పుట్టె... హర. ౭. ౭౧.

విసుఁగు. అ. క్రి. వేసరు, విసువునొందు,
నిర్వేదమునొందు.

పంచచామరము. ఇసీ యిసీ మొగంబు
చూడ కిల్లు వెల్వరించినన్, వెస న్విసింగి
పోవు సిగ్గు వీసమంతలేదు నీ, దెసం బసల్
ఘటించె దేర త్రిమ్మరీ మఱిట్లు వచ్చి సారె
సారె నన్నుఁ గెర్లఁజేయరాక పొమ్మికన్.
విప్ర. ౪. ౫౭.

(ఇచ్చటమాత్రము సబిందుకముగనున్నది.)

**విసుమానము.** వి. (సం. విస్మయః) ఆశ్చర్యము.

క. అసమానదీప్తిలో న, వ్వసుధాధర మపుడు
జాళువాకుందనపుం, బసిఁడి మెసురాశి
యగుచున్, విసుమానమొనర్చె సిద్ధవిభునకు
మిగులన్. పరమ. ౧. ౧౭౨.

ద్వి. విసుమాన మందియాశ్వేశ దేవేంద్రుఁ, డస
మాన భీతిచే నందంద వడఁకి.
ద్వి. పరమ. ౨. ౫౧. పా.

విశ. ఆశ్చర్యకరము, వింతయైనది.

ఉ. మానవకోటి నిట్టి విసుమానపుఁ బీనుఁగులైన
వారి నెంత్రైనను గంటిమే....
భార. విరా. ౩. ౭.

క. విసుమాన మతని తేజో,రసపూరము నెగసె
బ్రహ్మరంధ్రము మోవన్.
కాశీ. ౪. ౧౩౭.

ఎగుడుదిగుడైనది.

సీ. విసుమానములుగాఁగ, పసతోడఁ బెనవెట్టి
వెట్టెంబుగాఁ బ్రేవుఁ జుట్టినాఁడు.
మనుచ. ౪. ౭౩

**విసురూపము.** సం. వి. అ. న. వికృతరూపము,
వికృతాకారము.

ద్వి. వసుధ నానాసస్యవతియై ఫలించు, విసు
రూపముగువాఁడు వెదకిన లేఁడు.
రం. రా. ఉ. ౧౩౩ పా. ౨౩. పం.

**విసువాసము.** వి. (సం. విశ్వాసః) నమ్మకము.
(చూ. విసువాసి.)

**విసువాసి.** విశ.(విశ్వాసీ.) నమ్మకముకలవాఁడు.

సీ. విసువాసి యనఁగను వెలయు విశ్వాసి....
అం. భా. ౩. ౧౦.

**విసువు** = విసుగు. అ. క్రి. నిర్వేదమొందు, వేసరు.

సీ. మసలిరో కౌరవుల్ విసువక వైరంబు,
గావించు పాపస్వభావు లెఱిఁగి, క్రందుసఁ
జంపిరో.... (భార. ఆది. ౭. ౨౦౭.)

మ. ... కుసుమంబుల్ కబరీభరంబు చెవి
యాకుల్ మంగళాలంకృతుల్, విసు
వొక్కింతయు లేక దాల్పవలయునీవనిన్...
కాశీ. ౨౭౨.

వి. నిర్వేదము.

మ. విసు వొచున్నది కాలయాపనకు నుర్విస్థ్లా
రెడుష్ భావముల్... (నైష. ౭. ౫౨.)

జు: విసువుకొను.

**విసువుకొను.** అ. క్రి. (విసువు + కొను.) నిర్వే దము నొందు.

గీ. సఖులు గావించు నుచితోపచారములకుఁ, జెలులు ధైర్యంబు దెలిపెడు పలుకులకును, మనసు గొలుపక హా దైవమా యటంచు, విసువుకొనుచున్న న వ్వేలకోలఁదిఁ జూచి. కవిరా. 3. ౧౬౦.

**విసూచిక.** సం. వి. ఆ. స్త్రీ. విషూచి.

**విసూరణ.** సం. వి. ఆ. స్త్రీ. దుఃఖము.

**విసూరణము.** సం. వి. అ. న. = విసూరణ.

**విసూరిత.** సం. వి. ఆ. స్త్రీ. జ్వరము.

**విసూరితము.** సం. వి. అ. న. పశ్చాత్తాపము, దుఃఖము.

**విసృజనము.** సం. వి. అ. న. విడుచుట. (ఇది క్లేశసాధ్యము.)

క. భూవర సస్యములను విస్తావిసృజన మొప్ప దంద్రడు చారిత్రవిదుల్.... భార. అను. ౪. ౭౭.

**విసృతము.** సం. విశ. (అ. ఆ. ఆ.) ౧. వ్యాపించినది, విస్తీర్ణము. ౨. చాఁపఁబడినది, చాఁగినది. ౩. పలుకఁబడినది, ఉచ్చరింపఁబడినది. (విల్సన్.)

**విసృత్వరము.** సం. విశ. (అ. ఈ. అ.) ౧. వ్యాపించునది. ౨. ప్రాఁకునది, ఇఁకునటు జరుగునది.

**విసృమరము.** సం. విశ. (అ. ఆ. అ.) ప్రాఁకునది, మెల్లనిగా జరుగునది.

**విసృష్టము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. ప్రేరితము, ప్రసరింపఁజేయఁబడినది. ౨. విసర్జబడినది, ప్రయోగింపఁబడినది. (బాణాది.) ౩. సృజింపఁబడినది, నిర్మితము. ౪. ప్రసవింపఁజేయఁబడినది, కార్పఁబడినది. ౫. ప్రేషితము, పంపఁబడినది. ౬. తొలగింపఁబడినది, ఉద్యోగాదులనుండి త్రోసిపుచ్చఁబడినది. ౭. దత్తము, ఈయఁబడినది. ౮. పరిత్యక్తము, విడిచిపెట్టఁబడినది.

**విసృష్టి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. చాఁచుట, ప్రసరింపఁజేయుట. ౨. పరిత్యజించుట, విడిచివైచుట. ౩. ఈవి. దానము.

**విస్తర.** వి. భోజనముచేసెడియాకు.

సీ. నికట కాననభూములకు నేఁగి మఱ్ఱి యాకులు దెచ్చి విస్తరల్ గూర్చి కూర్చి. శుక. ౪. ౧౦౭.

**విస్తరము.** సం. వి. అ. పుం. ౧. విస్తరించుట, వ్యాపించుట, వ్యాప్తి. ౨. వివరము, అతిసూక్ష్మ విషయములను దెలుపుట. ౩. బాహుళ్యము, ఆధిక్యము, శబ్దవైపుల్యము. ౪. సమూహము, మొత్తము. ౫. పాన్పు, పడుక. ౬. ఆసనము, పీట. ౭. ప్రేమతో ప్రతిపాలుట.

**విస్తరి = విస్తర.** వి. భోజనముచేసెడియాకు.

క. అనుమాటలు చెవి నిడ కా,యన యిట్లని పలుకుఁ దన్మహాకీమణితోఁ,జనుమనుచుఁ ద్రోయ విస్తరి, చినిఁగెడు నన్నట్లు వలపు చెడ్డది సుమ్మీ. శుక. ౨. ౪౩౫.

సీ. విస్తళ్లు గుట్టి కోవెలసంబి వాకిటఁ గట్ట పూడ్చి లంజెలకాళ్లు పిసికి.(వేమ. ౪. ౪౧.)

**విస్తరించే.** సం. వి. క్రి. ౧. సవిశేషముగ చెప్పు.

గీ. ... విస్తరింతు నైమిత్తికవిధులు మఱియు, నాదు వాక్యములెల్ల మనస్కరింపు. మార్కం. ౩. ౧౩౦.

ఆ. ...నిష్ఠ దానియందు నిరతిశయస,మాదరంబు గలదు నాదు చిత్తంబును వినుము తద్విధంబు విస్తరింతు. భార. శాం. ౫. ౨౧.

౨. విస్తరిల్లఁజేయు.

ఆ. ... ఎంతకతీఁదిరమైన నిది యేను దీర్చి యీ, విప్రునకుఁ బ్రియంబు విస్తరింతు.

భార. ఆది. ౬. ౨౪౩.

**విస్తరిల్లు(లు).** సం. అ. క్రి. ౧. అతిశయించు, మిక్కుటమగు.

సీ. అప్సరోవనితల యాటలు విలసిల్లె వెసఁ బుష్పవర్షంబు విస్తరిల్లె ...

మార్క. ౮. ౧౮౮.

ఆ.... వివిధతూర్య వేణు వీణారవంబును, విస్తరిల్లె విపుల విభవయుక్తి.

భార. ఆది. ౭. ౨౮౨.

౨. వ్యాపించు.

గీ. ... ఆత్మబుద్ధి యనంగ నల్పాంతరంపు, వస్తువులు బుద్ధి యున్నంట విస్తరిలుట.

భార. శాం. ౫. ౧౬౮.

౩. ప్రసిద్ధినొందు.

ఆ. ఘనత నశ్వదానగజదానదీక్షాగురుండు నాఁగ నవని రూఢికెక్కినట్టి మేటితాత యల్లారి యనమారవిభుఁడు సాకనాఁట విస్తరిల్లె. వి. ౧. ౫౨.

**విస్తారము.** సం. వి. అ. పుం. ౧. వ్యాపించుట, విస్తరించుట, విరివియగుట. ౨. వైశాల్యము, వెడల్పు. ౩. ఆధిక్యము, వైపుల్యము. ౪. వివరము, సూక్ష్మవిషయము. ౫. వలయాకారవస్తువు మధ్యవ్యాసము. ౬. చిన్నచెట్టు, పొద. ౭. లేఁతచిగుళ్లతోనున్న కొమ్మ. ౮. శబ్దవిస్తృతి.

సీ. తగువారిఁ గాంచి యత్యద్భుతంబగు భక్తజ్ఞనకు తెలుంగు విస్తారమొప్పఁ జెప్పిన వాక్యలు ...

భార. అశ్వ. ౩. ౨౦౬.

(విస్తరమగుట న్యాయ్యము.)

౪ 50

**విస్తారించు.** సం. అ. క్రి. విరివిచెందించు, విస్తరిల్లఁజేయు.

శా. నీరేజాంచితలోచనాయ హరయే నీలాంబుదాంగాయ మాయారాత్రించరఖండనాయ విధవే హార్యక్షువక్త్రాయ తాక్ష్యారూఢాయ యటంచుఁ గూర్తురు నిరీహావిశ్వవిక్రాంతి విస్తారింపన్ మసజస్తతంబులు గమున్ శార్దూలవిక్రీడితన్. (అప్పక. ౪. ౨౪౩. పా.)

**విస్తీర్ణపర్ణము.** సం. వి. అ. న. మానకము, ఒకవిధమగు దుంపజాతి. శ.

**విస్తీర్ణము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. వ్యాపించినది. ౨. వెడల్పైనది. ౩. విశాలము, విరివియైనది, పెద్దది.

**విస్తు.** వి. ౧. ఆశ్చర్యము. ౨. దుర్గంధము. (బ్రౌ., వా.)

ద్వి. సాముసేయుచు మల్ల చఱచుచుఁ గోల, వేమారుచూచుచు విస్తు కంపెసఁగ, బనసలు చెప్పుచు బ్రమసి పాడుచును. (శ. ర. పా.)

నవనాథ ౩. ౨౦౮. పా. ౧౮. పం.

**విస్తృతము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. వ్యాపించినది, విస్తరిల్లినది. ౨. వెడలుపయినది. ౩. పెద్దది, విశాలము, విరివియైనది. ౪. బహుళమైనది, సమృద్ధిగానున్నది, పెంపైనది.

**విస్తృతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. విస్తారము, విస్తరము, వ్యాప్తి. ౨. వైశాల్యము, విరివి, ఆధిక్యము. ౩. గుండ్రని వస్తువుయొక్క చుట్టుకొలత.

**విస్పష్టము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. మిక్కిలి స్పష్టమైనది, విశదమైనది, బాగుగాఁ దెలిసినది. ౨. ప్రత్యక్షమైనది, అందరకుఁ దెలియవచ్చునది.

**విస్ఫారము.** సం. వి. అ. పుం. ౧. కంపము, వణఁకు, అదరుట. ౨. టంకారము, వింటినారి చప్పుడు, ధనుష్టంకారము.

**విస్ఫారితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. చలింపఁజేయఁబడినది, కదల్పఁబడినది. ౨. వణఁకినది, కంపమొందినది. ౩. టంకారము గలదిగాఁజేయఁబడినది. ౪. వ్యాపింపఁజేయఁబడినది, పెద్దదిగాఁజేయఁబడినది. ౫. స్పష్టపఱుపఁబడినది, ప్రత్యక్షపఱుపఁబడినది. ౬. స్పష్టమైనది, ప్రత్యక్షమైనది, విశదీకృతము.

**విస్ఫురించు.** సం. అ. క్రి. ప్రకాశించు.

మాలిని. ... తేజోవిసరపిహితమూర్తుల్ విస్ఫురింప న్మునీంద్రా. (మార్కం. ౧. ౧౨౫.)

**విస్ఫురితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. అదరినది, వణఁకినది, కంపించినది. ౨. ఉబ్బినది, పెద్దదైనది.

**విస్ఫులింగము.** సం. వి. అ. పుం. ౧. అగ్నికణము, మిడుగుఱు. ౨. ఒకవిధమైన విషము.

**విస్ఫూర్జథువు.** సం. వి. అ. పుం. ౧. అఱపు, గర్జనము, బొబ్బరింత. ౨. పిడుగుచప్పుడు, వజ్రనిర్ఘోషము. ౩. పిడుగువలె హఠాత్తుగాఁ దటస్థమైన విషయము. ౪. తరంగముల మ్రోఁత, తరంగములపొంగు.

**విస్ఫూర్జితము.** సం. వి. అ. న. ౧. అఱపు, బొబ్బరింత. ౨. దొర్లుట. ౩. ఫలితము, పర్యవసానము.

**విస్ఫోట.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పొక్కు, పొంటిమ, కురుపు. ౨. మసూరిక, అమ్మవారి జబ్బు. (మసూచికము.)

**విస్ఫోటము.** సం. వి. అ. పుం. = విస్ఫోట.

**విస్మయంగదము.** సం. విణ. (అ. ఆ. అ.) ఆశ్చర్యము గలిగించునది, అద్భుతపఱుచునది.

**విస్మయపడు.** మి. అ. క్రి. ఆశ్చర్యపడు.

గీ. మిన్న మిడుగుఱులై రెండు మెఱచుచున్న, మెఱుఁగు లొక పుట్టలోనున్న నెఱుఁగ కేను, బుట్ట గ్రొప్పించి యా రెంటిపాడవుఁగాన, కుడిగి వచ్చితి విస్మయపడి మనమున. భార. అర. ౩. ౧౭౮.

**విస్మయము.** సం. వి. అ. పుం. ౧. ఆశ్చర్యము, వింత. ౨. అద్భుతరసము. (నవరసములలో నొకటి.) ౩. గర్వము. ౪. సంశయము.

**విస్మయముపడు.** = విస్మయపడు. అ. క్రి. ఆశ్చర్యపడు.

చ... ఏ, మనయము విస్మయంబుపడు నంతటిలోఁ దిగిచె న్నరేంద్ర ఫల్గున విఱుగంగ... హరి. పూ. ౮. ౪౬.

**విస్మయాకులుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ఆశ్చర్యము నొందినవాఁడు.

ఇక్లే: విస్మయావిష్టుఁడు, విస్మయాన్వితుఁడు.

**విస్మరణము.** సం. వి. అ. న. మఱచుట, మఱపు, విస్మృతి.

**విస్మాపనము.** సం. విణ. (అ. న. ఆ.) అద్భుతపఱచునది.—వి. అ. పుం. ౧. మాయ, మోసము, వంచన. – న. ౧. ఆశ్చర్యము గలిగించుట. ౨. అద్భుతవస్తువు.

**విస్మాపనుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు.

**విస్మితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఆశ్చర్యపడినది, అద్భుతపడినది. ౨. తత్తరపడినది. ౩. గర్వించినది, గర్వపడినది.

**విస్మితి.** సం. వి. ఇ. స్త్రీ. ఆశ్చర్యము, అద్భుతము.

**విస్మృతము.** సం. విణ. (అ. ఆ. అ.) మఱవఁబడినది.

**విస్మృతి.** సం. వి. ఇ. స్త్రీ. మఱపు, విస్మరణము.

**విస్మేరము.** సం. విణ. (అ. ఆ. అ.) ఆశ్చర్యపడినది, అద్భుతపడినది.

**విస్రంభము.** సం. వి. అ. పుం. ౧. విశ్వాసము, నమ్మిక. ౨. పరిచయము, చనవు.

**విస్రంస.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పడిపోవుట, పతనము. ౨. స్రవించుట, కాఱుట. ౩. దుర్బలత, అశక్తి, బలములేమి.

**విస్రంసనము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. పడఁగొట్టునది, రాల్చునది. ౨. వదులుచేయునది, సడలించునది.—వి. అ. న. ౧. పతనము, పడుట. ౨. స్రవించుట, కాఱుట. ౩. వదులుచేయుట, సడలించుట. ౪. విరేచనకారియగు మందు, బేదిమందు.

**విస్రంసము.** సం. వి. అ. పుం. = విస్రంస.

**విస్రగ్రంథి.** సం. వి. ఇ. పుం. హారిదలను.

**విస్రబ్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. నమ్మినది, విశ్వసించినది. ౨. పరిచయముగలది, చనవుగలది.

**విస్రము.** సం. వి. అ. న. ౧. పచ్చిమాంసపువాసన. ౨. పచ్చివాసన. ౩. కమరుకంపు. (వాచ.)

**విస్రవము.** సం. వి. అ. పుం. స్రవించుట, కాఱుట.

**విస్రస.** సం. వి. ఆ. స్త్రీ. ౧. దౌర్బల్యము, అశక్తి, ఓపికలేమి. ౨. ముదిమి, ముసలితనము.

**విస్రస్తము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. సడలినది, వదులయినది. ౨. దుర్బలము, దార్ఢ్యము లేనిది.

**విస్రావణము.** సం. వి. అ. న. ౧. రక్తము కాఱుట. ౨. కాఱుట, బొట్టులుబొట్టులుగాఁబడుట. ౩. బట్టీనుండి దింపఁబడిన యొకవిధమగు మద్యము.

**విస్రావము.** సం. వి. అ. పుం. = విస్రవము.

**విస్రుతి.** సం. వి. ఇ. స్త్రీ. కాఱుట, స్రవించుట, బొట్లుబొట్లుగాఁబడుట.

**విస్వరము.** సం. విణ. (అ. ఆ. అ.) పొసఁగనిది, సరిపడనిది.

**విస్సందు.** వి. మల్లబంధవిశేషము.

వ. విష్ణుచక్రంబును రామబాణంబును నాగబంధంబును దోలకరిమెఱుపును నల్లిమత్తును విస్సందు హస్తాభరణంబును బదఖండనంబును నురిత్రాఁడును లోబిత్తరియు వెలిబిత్తరియు సర్వాంగశంబును మొదలుగాఁగల పదిరెండు గాయమానంబులును.

ప్రబంధ. ౧. ౭౪.

వ. నాగబంధంబును దోలకరిమెఱుపును విస్సందు నురిత్రాఁడును ...

మల్లుపు. ౩. ౬౪.

**విహంగమ.** సం. వి. ఆ. స్త్రీ. కావడిబ్రద్ద.

**విహంగ(మ)ము.** సం. వి. అ. పుం. పక్షి, పిట్ట.

**విహంగము.** సం. వి. అ. పుం. ౧. పక్షి, పిట్ట. ౨. మేఘము, మబ్బు. ౩. బాణము, అమ్ము. ౪. (సూర్యాది) గ్రహము.

**విహంగముఁడు.** సం. వి. అ. పుం. సూర్యుఁడు.

**విహంగిక.** సం. వి. ఆ. స్త్రీ. కావడిబ్రద్ద.

**విహంగము.** సం. వి. అ. పుం. ౧. పక్షి. ౨. మేఘము, మబ్బు. ౩. బాణము. ౪. (సూర్యాది) గ్రహము.

**విహంగరాజ్.** సం. వి. జ. పుం. గరుత్మంతుఁడు, గరుడి.

**విహంగుఁడు.** సం. వి. అ. పుం. ౧. సూర్యుఁడు. ౨. చంద్రుఁడు.

**విహంగేంద్రుఁడు.** సం. వి. అ. పుం. గరుత్మంతుఁడు, పక్షిరాజు.

ఇట్లే: విహంగేశ్వరుఁడు.

**విహతము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. చంపఁబడినది, కొట్టఁబడినది. ౨. గాయపఱుపఁబడినది. ౩. ఎదిరింపఁబడినది, అడ్డుపెట్టఁబడినది. వి. అ. పుం. జైనదేవాలయము.

**విహతి.** సం. వి. ఇ. పుం. మిత్రము, సహచరుఁడు. (విల్సన్సు.) — స్త్రీ. ౧. చంపుట, కొట్టుట. ౨. దెబ్బ, క్షతి. ౩. భంగము, తప్పుట. ౪. ఓడుట, అపజయము.

**విహననము.** సం. వి. అ. న. ౧. చంపుట, కొట్టుట. ౨. హానిచేయుట, అపాయము చేయుట. ౩. అడ్డంకి, విఘాతము. ౪. ఏంటి వంటి దూదేకునట్టి పనిముట్టు.

**విహరణము.** సం. వి. అ. న. ౧. నివారించుట, తొలఁగించుట. ౨. చల్లగాలిలోఁ దిరుగుట, షికారుచేయుట, వినోదసంచారము. ౩. వినోదము, వేడుక.

**విహరము.** సం. వి. అ. పుం. ౧. తీసివేయుట, తొలఁగించుట. ౨. విడిపోవుట, కూడిక లేమి. ౩. మార్పు.

**విహరించు.** సం. అ. క్రి. స్వేచ్ఛగా సంచరించు.

క. ...విప్రవరుఁడు మునిజనములు ప్రాజనము లొనరింప ఖేచరు లనుమోదింప విహరించె నప్రతిహతుఁడై.
భార. శాం. ౫. ౩౬౧.

వ. ... అపూర్వకావ్యరచనాకుతూహలమధువిహంబు విహరించుచున్న సమయంబున...
మార్కం. ౧. ౧౧.

స. క్రి. ప్రణయించు, ప్రజ్వలింపఁజేయు.

క. విను గార్హపత్యమను నగ్న్యనలము విహరింపఁబడి ... (భార. ఆది. ౪. ౧౬.)

సీ. అగ్నిహోత్రమునకు నగ్నులు విహరింపుమని పంచి యభిషేచనార్థ మరుగ....
భార. ఆది. ౧. ౧౨౫.

**విహర్త.** సం. విశే. (ఋ. స్త్రీ. ఋ.) ౧. విహరించువాఁడు, వినోదసంచారము చేయువాఁడు. ౨. అపహరించువాఁడు, దొంగిలించువాఁడు. — వి. ఋ. పుం. దొంగ, తస్కరుఁడు.

**విహసనము.** సం. వి. అ. న. చిఱునవ్వు, మందహాసము.

**విహసించు.** సం. స. క్రి. నవ్వు, ఎగతాళిచేయు.

సీ. హరినైన గంగాళహరినైన విహసించు...
కృ. శతకం. ౧.౫.

**విహసితము.** సం. వి. అ. న. = విహసనము.

**విహస్తుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. చేతులు లేనివాఁడు. ౨. చేయూఁత (సహాయము) లేనివాఁడు. ౩. వ్యాకులుఁడు, కలఁత నొందినవాఁడు. ౪. అశక్తుఁడు, అసమర్థుఁడు. ౫. చదువరి, విద్యావంతుఁడు.

**విహాపితము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. విడిపింపఁబడినది. ౨. బలాత్కారమున విడిచిపెట్టింపఁబడినది.—వి. అ. న. ఈవి, దానము.

**విహాయసము.** సం. వి. స్. పుం., న., అ. పుం. ఆకాశము. — పుం. పక్షి.

**విహాయితము.** సం. వి. అ. న. ఈవి, దానము. (శ. ర.)

**విహారగృహము.** సం. వి. అ. న. క్రీడా మందిరము, లీలాగృహము.

**విహారదాసి.** సం. వి. ఈ. స్త్రీ. బ్రహ్మచారిణి, సన్న్యాసిని.

**విహారము.** సం. వి. అ. పుం. ౧. తీసివేయుట, తొలఁగించుట, నివారించుట. ౨. వేడుకగాఁ దిరుగుట, వినోదసంచారము. ౩. ఆట, క్రీడ, వినోదము. ౪. చేయికాలు మొదలగువాని కదలిక. ౫. ఉద్యానవనము. ౬. స్కంధము, మూపు. ౭. బౌద్ధదేవాలయము, మఠము. ౮. దేవళము, గుడి. ౯. వర్ణముల యుచ్చారణస్థానములను బాగుగా విప్పుట, పలుకుటకై చక్కఁగాఁ దెఱచుట. ౧౦. విస్తరింపఁజేయుట, విప్పుట. ౧౧. ఇంద్రుని ప్రాసాదము, వైజయంతము. ౧౨. ప్రాసాదము, రాజగృహము. ౧౩. ఒకజాతి పక్షి.

**విహారి.** సం. విణ. (న్. ణీ. న్.) ౧. విహరించునది, వినోదించునది. ౨. వ్యాపించునది. ౩. మిక్కిలి చక్కనిది.

**విహారిక.** సం. వి. ఆ. స్త్రీ. సన్న్యాసుల మఠము.

**విహాసము.** సం. వి. అ. పుం. = విహాసనము.

**విహితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. చేయఁబడినది, ఆచరింపఁబడినది. ౨. ఏర్పఱుపఁబడినది, స్థిరపఱుపఁబడినది. ౩. విధింపఁబడినది, శాసింపఁబడినది, ఆజ్ఞాపింపఁబడినది. ౪. కూర్పఁబడినది, నిర్మింపఁబడినది. ౫. ఉంచఁబడినది. ౬. సంపన్నము, సహితము, కూడినది. ౭. చేయ నర్హమైనది. ౮. పంచిపెట్టఁబడినది.— వి. అ. న. ఆజ్ఞ, శాసనము.

**విహితి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. చేయుట, ఆచరించుట. ౨. ఏర్పాటు.

**విహితుఁడు.** వి. స్నేహితుఁడు.

గీ. ఎట్టకేలకు విహితుల యిండ్లకేఁగి, పెరిమెఁ
దా నూరకుండుట పెద్దతనము, గలదె యడు
గుటకంటె బల్చుకదనము, యాచనాంతం హి
గౌరవమ్మన వధూటి. (కుచేల. ౧. ౧౦౭.)

**విహీనము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. విడువఁబడినది, త్యజింపఁబడినది, త్యక్తము. ౨. శూన్యమైనది. ౩. అధమము, తక్కువది.

**విహృతము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. క్రీడించినది, విహరించినది, ఆడినది. ౨. వ్యాపించినది. — వి. అ. న. ౧. స్త్రీల శృంగారచేష్టావిశేషము. ౨. ఆట, క్రీడ.

**విహృతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. నివారణము, తీసివైచుట. ౨. ఆట, వినోదము. ౩. వ్యాప్తి, వ్యాపనము.

**విహేఠకుఁడు.** సం. వి. అ. పుం. ౧. హాని చేయు మనుష్యుఁడు, అపాయము కలిగించువాఁడు, తిట్టెడు పురుషుఁడు.

**విహేఠనము.** సం. వి. అ. న. ౧. హానిచేయుట, అపాయముకలిగించుట. ౨. నూఱుట, పొడిచేయుట. ౩. బాధపెట్టుట. ౪. నొప్పి, బాధ, దుఃఖము.

**విహేఠము.** సం. వి. అ. పుం. ౧. గాయము, హాని. ౨. బాధపెట్టుట, హింసించుట.

**విహ్వాలపడు.** మి. అ. క్రి. భయాదులచేత అవయవముల స్వాధీనత తప్పు.

చ. ... భూపతి సీలబ్రాల విహ్వలపడఁ
బోక కైక గురు నానతిఁ జేకొనుమయ్య
రాఘవా.

క. అన దండమిడి తదాజ్ఞన్, ననదండగతిన్
శిరంబునన్ దాల్చి ధరావనమునకై రఘు
వీరుఁడు... చంపూరా. ౪. ౩౫.

**విహ్వలము.** సం. విణ. (అ. ఆ. అ.) ద్రవ
రూపమైనది, కరఁగినది.

**విహ్వలించు.** సం. అ. క్రి. ౧. క్షోభించు,
వ్యాకులపడు.

వ. దాన న వ్వేధ విహ్వలించి ...

గీ. అధికవిస్వరంబైన యయ్యార్తనాదమునకు
మందలోపలఁగల జనములెల్ల, మేలుకని రట
మున్న యబ్బాలు నేడ్పు, విని యశోదయు
మేల్కని విహ్వలించి.
హరి. పూ. ౫. ౧౫౨.

౨. అలయు, అవయవములు స్వాధీనముతప్పు.

గీ. ... మఱియు నాభాను భాను, వేడిమికి
నోర్వకెంతయు విహ్వలించి.
మార్క. ౫. ౩౩౦.

**విహ్వలుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. క్షోభ
పడినవాఁడు, వ్యాకులపడినవాఁడు. ౨. భయ
పడినవాఁడు. ౩. స్మృతితప్పినవాఁడు. ౪.
బాధనొందినవాఁడు, దుఃఖపడినవాఁడు. ౫.
ఆర్ద్రైవ్యపడినవాఁడు.

## వీ

**వీంఖ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. గతి. ౨. ఒక
అశ్వగతి విశేషము. ౩. నృత్యము. ౪. కూడిక;
కూడలి.

**వీంగు** = వీఁగు. అ. క్రి. ౧. విజృంభించు.

ఉ. వీంగు నపార సత్త్వగుణ విస్ఫురణం బర
మేశ్వరోరువామాంగమునందు ము న్నుద
యమై ... కు. సం. ౧. ౪.

౨. ఉత్సహించు.

ద్వి. చాంగుభళా యను శబ్దముల్ మ్రోయ,
వీంగుచుఁ బురజనుల్ విభ్రాంతులుగను.
పండితా. మహిమ. ౨. ౯౫. పా.

**వీఁక.** వి. (√ వీఁగు.) ౧. ఉత్సాహము, పూనిక.

ఉ. ఆఁకలి నీరువట్టు శ్రమ మంగవిపాటన మార్తి
జార్తి నిన్, సోఁకకయుండ విద్య లొగి
సొంపుగ నీ కుపదేశమిచ్చెదన్, దేఁటువ
వారిపూరమున దిగ్గన శుద్ధియొనర్చి రమ్మనన్,
వీఁక రఘూద్వహుండును బవిత్రజలంబుల
వార్చి వచ్చినన్. (భా. రా. బాల. ౨౧౨.)

శా. ...భోజనోత్తరమునం దాస్థానమైయుండి
యత్యాఁకంబెట్టక చెప్పెద న్సకలవృత్తాం
తంబునుం దేటగా, వీఁకన్...
కాశీ. ౭. ౧౭౩.

౨. పరాక్రమము.

సీ. వీఁకతోఁ గడుఁబూచు మ్రాఁకుల విఱుపును
వల్మీకమాత్ర పర్వతము నెత్తి...
భార. సభా. ౨. ౪౧.

క. తాఁకినఁ బోగడం దగియెక్కు, వీఁకం బతి
ద్రోణు బాణవృతుఁ జేయ ...
భార. ద్రోణ ౧. ౨౦౧.

సీ. వీఁకతోడ విరాటవీరఖేటనమున ధీరుఁ
బ్రబలంబ దైతేయుఁ జంపె ...
ఉ. హ. ౧. ౮.

౩. బలము.

సీ. కోరి ఫలార్థులై వారల యెక్కిన మ్రాఁకుల
మొదళుల వీఁకఁ బట్టి వడిఁ గదల్చి ...
భార. ఆది. ౫. ౧౭౭.

౪. గర్వము.

ఉ. ఊవ్వను బ్రాఁతతో నెగురెఱుంగని వీఁకఁ
బరాక్రమించుచో, న వ్విహగంబు తద్ఘనత
రారుణ దారుణనేత్రరోచులన్, నివ్వెఱ
గంది కొల్కొనఁగ నేరక మేదినిఁ గూలె...
భోజరా. ౩. ౨౦౦.

ఉ. పూఁపమిటారి చన్నుఁగవ పోఁకల వీఁకలఁ
జౌకసేయు ... దశా. ౭. ౨౧౩.

౫. సాహసము.

క. ... జ్యాకలితశరాసనుఁడై, వీఁకను సైని
కులఁ దిట్టి విభుతో ననియెన్.
మనుచ. ౪. ౬౨.

౬. విజృంభణము, వ్యాప్తి.

మ. ... పద్మాకరం బంచుఁ దత్కమలామోద
సుగంధిమారుతము వీఁకన్ మొన్నెటింగించి
నన్. భార. ఆది. ౬. ౧౭౨.

తే. మతకరి మెకంబు చేకొని మరులువట్టి, ధరణిఁ
బోనోమిన త్రిశంకుతనయుకులము, వాఁ
డగుట వీఁక నాచేత నేఁడు రాముఁ, డింతిఁ
గోల్పోవ మారీచు మృగ మొనర్తు.
చంపూరా. ౫. ౫౭.

చ. మొకరిపిసాళి తుమ్మెదలమూఁకకు గందపు
గాలి రాకకున్, మకరపతాకు డాకకును
మామిడి మోఁకకు చంద్రు కాకకున్, బిక
ముల వీఁకకున్ సిరులఁ బేర్చిన యామిని
యూఁచు నూఁకకున్ ...
రుక్మా. ౩. ౧౫౪.

౭. ఔదార్యము.

ఆ. రాకురాకు మనెడి రట్టడితనములు, పోకుపోకు
మనెడి పొగరువగలు, పొడువుపొడువు
మనెడి బెడిదంపుభీరముల్, విడువువిడువు
మనెడి వీఁక లెనఁగ. (విజ. వి. ౩. ౧౫౦.)

౮. ఔన్నత్యము.

శా. గర్వోద్రిక్తతరంగసంఘముల వీఁకన్
బుష్కరిణ్యాపగా, వార్వేణుల్ దనయుత్త
రంపుఁదెసఁ బర్వంగా ...
పాండు. ౫. ౩౧.

సీ. తిలకించు భామల బలుచింతయును బోలె
విస్తీర్ణమై యొప్పు వీఁకఁదనర ...
శశాం ౨. ౬౧.

౯. వంగుట.

వ. భారంబువలన వీఁకలుగల కోరకావళ్లు
మోచుకొని యొండొరులతోడం బంతంబు
లాడుచు... వి. పు. ౭. ౧౪౭.

౧౦. విహారము.

రగడ. లేమ లేమరువనులు నీ కవలీల లీలల
వీఁకలో జన ... వసు. ౩. ౧౪౯.

౧౧. దైన్యము.

శా. అనయంబున్ శమవంతుఁడై వినుతశిష్టా
చారమార్గంబులన్, గను పుణ్యాత్ముఁడు
దుర్గతు ల్గడచి ప్రజ్ఞాహర్మ్యసంరూఢుఁడై,
కనుచుండుం బటుమోహపంకజలమగ్నం
బైన లోకంబు వీఁక నధోభాగమునందు
డింది కడుదుఃఖం బొందఁగా నవ్వుచున్.
భార. అర. ౫. ౫౦.

౧౨. యుద్ధమునుండి పాఱుట.

క. కలనైన వీఁ కెఱుంగక, కలనైన న్నెఱయు
పెంపుగల ముక్కంటీ ...
యయా ౧. ౧౨౩.

(శ. ర. పా. వీఁగెఱుంగక, ముద్రి. పా.)

౧౩. సామ్యము.

చ. ... పరుల వీఁకను నుండియు మిత్రభావ
మున్, చొరయుటయున్ సుహృజ్జనుల
పోలిక గల్గియు శత్రుతాగుణ, స్ఫురణ
మొకప్డు చంపుటయుఁ జాతుము గాద
ధరిత్రి నెల్లెడన్. (భార. శాం. ౩. ౨౨౭.)

(శ. ర. పా. అరులు వీరన, ముద్రి. పా.)

౧౪. ప్రభావము.

శా. సోఁకన్ వచ్చు శిలీముఖంబుల నడంచున్ రాజహంసాళి న, ట్లాఁకం బెట్టు ననంత రత్నరుచి వోనాడుం దపశ్శ్రీలకున్, బ్రేకంబై వెలయున్ ఘనోదయము విప్పారుని ప్పద్మముల్, వీఁకం జిత్రచరిత్రపాత్రములుగాఁ ధాత్రి నూహింపఁగాన్.

వసు. ౫. ౧౦౦.

౧౫. విధము.

గీ. అల్లు బూఁచిన యేపున మల్లివిరుల, వీఁక విరిదమ్మి తేకులజోఁక నిండఁ, బండువెన్నె లలెల్ల యఖండరుచులఁగంజజాతాండ ఖండంబుఁ గలయఁ బర్వె.

ఘటికా. ౨. ౧౪౫.

గీ. తోఁక ద్రొక్కినభుజగేంద్రు వీఁక సటలు, గుదిచి వెలికిన సింగంబుకొదమమాడ్కిఁ, దండతాడనకుపితోగ్రపుండరీక, భంగిఁ గృష్ణుండు రోషించి పలికె నిట్లు.

చిత్రభా. ౬. ౧౬౫.

విణ. పొడుగయినది.

ద్వి. ... వీఁకకాళ్లను నడ్డి వీఁపును దనర ...

బస. పు. ౩. ౧౧౧౭.

వీఁకఁదనంబు. వి. (వీఁక + తనము.) ఉత్సాహము.

శా. ... వీఁకఁదనంబులోన పదశబ్దం బల్ల బుట్టించినన్.

దశకు. ౭. ౧౦౬.

వీఁకవిల్లు. వి. ఒకవిధమైన విల్లు.

గీ. గసగసలు వీఁకవిండ్లు సోఁగచిలుకలును, సింగములు పులిపిల్లలు జింక లేదుఁగములు మానిసికోఁతులు కొఱుపోఁతు, లేడికదుపులు పులిజున్ను పాడిపసులు.

ప్రబంధ. ౩౫.

వీఁగఁబాఱు. అ. క్రి. (వీఁగన్ + పాఱు, స్వార్థమున) యుద్ధమునుండి పాఱు.

క. నిజబలము వీఁగఁబాఱిన, భుజబల మలరఁగ విదర్భభూవరుఁడు మహోగ్రగజమెక్కినిఁజొచ్చిన గతి, విజిగీష విదేహసైన్యవితతిఁ గలంచెన్.

విక్ర. ౪. ౧౦౦.

చ. విను పలుమాటలేల యల వేలుపుమూఁకల లోన నేనియున్, వెనుకకు వీఁగఁబాఱి కోకపీరుఁడు సైఁపఁగలాఁడె యల్కచూ, పినకులుఁ డించుకంత సముపేక్షిత సంగరకేళియై నిగుడ్చిన బటుఘోరసాయక విజృంభణ మన్యుల కోర్వ నెట్లగున్.

రాఘవ. ౪. ౭౯.

వీఁగారు. అ. క్రి. (వీఁగు + ఆరు, స్వార్థమున) నిక్కు.

సీ. వీఁగారు చనుఁగవ వ్రేఁగునఁ గౌఁ దీఁగ వడు వసివాళులు వాడుచుండు ...

కు. సం. ౮. ౯.

వీఁగు. అ. క్రి. (క. బీగు. త. వీంగు.) ౧. ఉత్సహించు.

సీ. ఎల్ల విభాగించి యిచ్చినం దమతమవృత్తుల నుండక వీఁగి పాండు, ధృతరాష్ట్ర నందనుల్ ...

భార. ఆది. ౩. ౫.

శా. ఏ కాంతామణియందు వీఁగి కనెనో యేకాంతుఁ డీకాంతునిన్ ...

భాగ. ౧౦. ఉ. ౩౦.

౨. నిక్కు.

గీ. ఒక్కసతి వెలకిలి యీఁద నొప్పెఁ గురులు, వీఁగు చన్నులు వలరాచవేటకాఁడు, కోకములఁ బట్ట నొడ్డు వాగురలు వాని డాకొనఁగ బెట్టు బీము పిట్టలు ననంగ.

వేంకా. ౩. ౧౦౩

గీ. హస్తముల వీఁగు చనుదోయి యడఁచి
కొనుచు... హర. 3. ౯౨.

ఉ. ... దీని లతాంతము ల్సరు,ల్గా రచియించి
నించుఁ గుతుకంబున వీఁగు మెఱుంగు క్రొవ్వె
డన్. పారి. ౪. ౮.

3. యుద్ధమునుండి పాఱు.

ఉ. ...సమరభీతి జనించి యతండు దాఁకఁగాఁ,
జాలక వీఁగిపోయిన నిశాచరులార్చిరి సంభ్ర
మంబునన్. ఉ. రా. 3. ౨౧.

మ. తమి మందేహులతోడఁ బోరి యనుఁడంతన్
వీఁగి తన్ జేర న,స్తమహీధ్రున్మణి వెన్కవేసి
కొని మిత్త్రిప్రేమ రక్తప్రవా,హముగా,
బోరె ననంగ... (పారం౯. ౨. ౧౫౯.)

సీ. ముఱిచెడి దురమున విఱుగుటయును వీఁగి
పిఱువఁజేరినవారిఁ జెఱుచుటయును.
అచ్చ. రా. బాల. ౪౫.

౪. భయపడిపాఱు.

(వేఁగుఁజూక్కు.)సీ. సకుటుంబముగ వీఁగి చరమ
శైలముఁజేరు తుహినాంశు సముదాయకార
యనఁగ... మనుచ. 3. ౫౪.

గీ. వచ్చి గిబ్బలఁ గూల్చునో వానివలన, వీఁగి
యేఁగున్ ... నీలా. ౨. ౭౪.

సీ. వెన్నాడి రత్నేన వీఁగఁదోలుటకును బృహ
రక్తమున నుబ్బు పెన్న సాక్షి...
రామ. ౨౫౯.

౫. చలించు.

మ....హరిద్గజంబు లదిరెన్ సర్పాన్వయేశుండు
ని,ట్టలమై యోర్వక వీఁగెఁ గూర్మపతి
ప్రీడంబొందె...(భా .రా. యు. ౨౧౮౨.)

మ... ఖరరక్షోహర్త బ్రహ్మాస్త్రముస్, ఘటి
యించెన్ దనవింట మింటఁగల మూఁక
ల్వీఁగె నూఁగెన్ సము,త్కటశైలంబులు...
దశా. ౮. ౧౧౦.

ఆ. ఘోరశిలలవృష్టి గురియించె నొడలు
వీఁగించి యతఁడు.... (కళా. ౬. ౬౮.)

౬. తొలఁగు, అపసరిల్లు.

సీ. లేచి నీల్గుచు బారసాఁచె నేనియుఁ జక్ర
వాళాచలేంద్ర మవ్వలికి వీఁగు.
ఉ. రా. ౨. ౧౯౬.

౭. వెనుదీయు.

మ. పని గానేర దటంచుఁ బూనక వెఱం
బ్రాపింతు రెంతే జడుల్, పనికిన్ మేకొని
విఘ్నశేశము జనింపన్ మధ్యముల్
వీఁగి యం,తనె చాలింతు రనేక విఘ్న
తతు లుత్పన్నంబులైనన్ ఘనుల్, పని
సాధింతురు ... మల్ల. నీతిశ. ౭౨.

౮. ఒదిగియుండు.

ఉ. ఓ.హరిసాహసిం బ్రశమ మొల్కెడుధారల
గాడ్పు లేటవా,ల్గా హతి నీడ్చి వీఁగు
ప్రజలం గలఁపన్... ఆము. ౪. ౯3.

౯. శిథిలమగు.

సీ. దంట గుడారుక్రిందటి వెల్లువల నీరు ప్రాయి
వీఁగఁగొట్టిన పూట నిద్ర.
రా. వి. ౨. ౬౯.

౧౦. ప్రసిద్ధికెక్కు.

ద్వి. బసవగీతలతా ప్రభాసవల్లి సౌరసమునః
కల్పారాజితుం డనఁగ, వీఁగుచుఁ జేటల
వేమయ్య భువిని, బాఁ గాక మతియు మేద
రులు గొండలకు...
పండితా. పురా. ౧౬౨.

౧౧. విసరు, వీచు.

సీ. లలితంపుమెట్లఁ గేళాకూళి కవ్వల, జల
యంత్రముల వీఁగు చలువగాడ్పు.
కువల. ౪. ౧౪౪.

స. క్రి. విడుచు.

గొడ్డువీఁగు = గొడ్డాలితనమువిడుచు.

ఆ. వె. గొడ్డువీఁగి కనియెఁ గొడుకు నెంతయు
మూర్తిమంతు నెలఁతలందు మహితభాగ్య,
యొక్కృతియు యశోద యుర్వి పై ననుచు...
హరి. పూ. ౫. ౧౬౫.

గీ.... ఎవ్వనై దేండ్లనైన నాలేండ్లనైన, బిడ్డ
లను గంద్రు కన్నియల్ గొడ్డువీఁగి.
దశ. ౧౦. ౧౦౪.

సీ. కని ప్రాచి గొడ్డువీఁగంగ రత్నమువంటి
పుత్త్రిసంతానంబు పుట్టె ననఁగ.
రామా. ౨. ౧౦౬.

వీఁడు. సం. (క. ఇవను. త. ఇదన్. ఈ అను శబ్దమునకు మహదర్థక ప్రథమైకవచనము.) ఈ పురుషుఁడు. బ. వీరు, వీరలు, వీండ్రు.

గీ. వీఁడె కృతహస్తుఁ డఖిలాస్త్రవిద్యలందు....
భార. ఆది. ౬. ౧౭.

శా. తండ్రీ సారెకు నువ్వు నాగ్రహముమీఁదం
గన్నదే గాలిగా, గుండ్రాలంగొని దాయ
గాక యిది నాకుం దల్లియే యెన్నడున్,
వీండ్రం జూచిన జాడ నన్ను యమునన్
వీక్షింపదు... వరాహ. ౫. ౯౩.

చ...అ మ్మహా, పురుషునిపాలికిం బతులువోవఁగ
వీరలతోన యేను జొచ్చెరఁ జని...
భార. ఉద్యో. ౩. ౧౧౨.

వీరువారనక = వీరును వారును అనకుండగా.

ద్వి. ధారుణీప్రజలకు దయ యొప్పఁజేసి, వీరు
వారన కతి విశ్రుతకీర్తి, సమచిత్తుఁడై ధర్మ
చరితంబుఁ బూని...
రం. రా. బాల. ౭౩ పా. ౪ పం.

వీఁడుగో. అవ్య. (వీఁడు + గో.) ౧. ఎదుట నున్న పురుషుని నిర్దేశించుటయం దుపయోగింపఁబడును.

ఉ ... ఉపేంద్రుని ముందటఁ బెట్టి వీఁడుగో
గుజ్జుపుదొంగ చిక్కె సమకొన్న ప్రతిజ్ఞ
ఫలించె నావుడున్....
జై. భా. ౩. ౧౧౪.

("వీఁడిగో" శ. ర. పా.)
చూ. ఇగో = ఇదిగో. (శ. ర.)
౨. నిశ్చయముగ నితఁడే యను నర్థమిచ్చును.

చ. విరులశరంబునుం జెఱకువిల్లును బూనఁడు
గాని వీఁడుగో, మరుఁడు మరాళయానలకు
మానవతీ వచనంబులకు పల్లవాధరలకు
జెల్ల దింక... పి. శకుం. ౨. ౯౨.

వీకము. సం. వి. అ. పుం. ౧. గాలి. ౨. పక్షి. ౩. మనస్సు.

వీకాశము. సం. వి. అ. పుం. ౧. ఏకాంత స్థలము, విజనప్రదేశము. ౨. ప్రకాశము, దీప్తి.

వీకు. ౧. పరాక్రమము.

ఉ...ఆతత మత్స్యయంత్రమున్, వీకున నట్టు
లేసిన సువిక్రము నాతఁడు గోరఁ జూడఁ
గన్. భార. ఆది. ౪. ౨౨౭.

ఉ...వీకునఁ దాఁకియుఁ బోరి రాజి దే, వాసుర
వీరు లూర్వ సమస్త విషమాత్ముఁడు గుంజ
రాత్ముఁడున్. కు. సం. ౧౨. ౪౯౬.

౨ ఉత్సాహము, పూనిక.

ఉ. వీకున నశ్వమేధములు వేయొనరించిన ధర్మ
శీలుఁ డిక్ష్వాకుకులోద్భవుండు బలవంతుఁ
డనంతయశుం డవార్యవీర్యాకరుఁ డుత్త
ముండు యువనాశ్వుఁడు...
భార. అర. ౩. ౨౦౦.

క. ఆ కపి రాల్ప ఫలంబులు, వీకునఁ గొనివచ్చి
యిచ్చి విమలాబ్జముఖి, యీకాననలో
మృగము లనేకంబులు గలవు మనకు నేఁగా
తడయన్. భోజరా. ౫. ౨౪౨.

౩. ఔద్ధత్యము, గర్వము.

సీ. అంతఃకరణతతి కొటప ట్టనఁజాలు విషయ సమూహంబు వీకు దఱిచి.

కు. సం. ౧౨. ౯౯౯.

సీ...ఉగ్ర, అ. రౌధవరులు గురిసి రురువడి శస్త్రాస్త్రవృష్టి నమరవరులు వీకు దఱఁక.... కు. సం. ౧౨. ౭౦౭.

వ. నాఁడునాఁటికిన్ బాటించి వేఁటకాండ్ర దనెఱెంగి మేపు మేపుల చమత్కారంబుల నిరాకరించి వీకునన్ దిరిగితిరిగి యీఁక దీర్చుకొను నవియును...(మనుచ. ౪. ౨౭.)

**వీక్ష.** సం. వి. ఆ. స్త్రీ. చూచుట, నిదానించి చూచుట.

**వీక్షణ.** సం. వి. ఆ. స్త్రీ. చూపుట, చూపు, దృష్టి.

**వీక్షణము.** సం. వి. అ. న. ౧. చూపుట, చూపు, దృష్టి. ౨. కన్ను, నేత్రము.

**వీక్షము.** సం. వి. అ. న. ౧. దృశ్యపదార్థము, చూడఁబడువస్తువు. ౨. ఆశ్చర్యము, అద్భుతము.—పుం. చూచుట, నిదానించి చూచుట.

**వీక్షించు.** సం. స. క్రి. చూచు, కనుఁగొను.

గీ. పక్షిపక్షంబు వీక్షించి రాక్షసుండు గిట్ట ఖడ్గంబు వైచిన బిట్టు నెగసి...

మార్కం. ౧. ౩౭.

ద్వి. అఖిలశాస్త్రంబుల నయోగిచంద్రు,ముఖమున ద్రావిడామోదవాక్యముల, రాజిల్ల వీక్షింప రమణులై...తమదామె చెలఁగి నర్తన మాడఁదొడఁగె.

ద్వి. పరమ. ౩. ౧౬౪. పా.

**వీక్షితము.** సం. వి. అ. న. చూపు, దృష్టి.

**వీక్ష్యము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. చూడఁదగినది. ౨. ప్రత్యక్షము, కనఁబడునది.

వి. అ. పుం. గుఱ్ఱము.—న. ౧. దృశ్యపదార్థము. ౨. ఆశ్చర్యము, వింత.

**వీక్ష్యుఁడు.** సం. వి. అ. పుం. నటుఁడు, నర్తకుఁడు.

**వీచి.** సం. వి. ఇ. పుం; ఇ., ఈ. స్త్రీ. ౧. తరంగము. ౨. అనాలోచనము.(ఆ. ని.) ౩. సుఖము. ౪. అవకాశము, విశ్రాంతి, తెఱపి. ౫. కిరణము. ౬. కొంచము, కొద్ది.

**వీచీమాలి.** సం. వి. న్. పుం. సముద్రము.

**వీచు.** అ. క్రి. ౧. (గాలి) విసరు, ప్రసరించు.

మ. వివిధామోదవిమిశ్రితానిల మొగిన్ వీచెన్ ...ఉర్విం గౌరి జన్మించినన్.

కు. సం. ౩. ౨౭౩.

ఉ...వీచెం గలశాబ్ధి మీఁగడల జిడ్డఱిఁగించెడు కమ్మగాడ్పు... ఆము. ౪. ౧౦.

సీ. ప్రథమ హాలాసలప్రథమానకీలలై వీచెఁ గ్రూరకటాక్షవీక్షణములు...

కవిక. ౩. ౧౭.

౨. విసరు, గాలిని ప్రసరింపఁజేయు, గాలి వచ్చునట్లుచేయు.

గీ...చారుహాటకమయుగమచ్చామరముల, వీచు నతనికి వైశాఖవేళలందు.

నైష. ౨. ౫౧.

ఆ. వె...వలపు, గ్రమ్ము పూల విసనకఱ్ఱచే వీచుచు... నీలా. ౩. ౩౨.

స. క్రి. ౧. (పురికొల్పుటకై చేయి) విసరు, ఆడించు.

గీ. ఏచి దుర్యోధనుండు చే వీచి యెలుఁగు, నూపి పురికొల్ప నెంతయు నేపు మిగిలి...

భార. భీష్మ. ౨. ౨౭.

శా...పౌండ్రకవిభుం డాత్మీయులం జూచి చే,
వీచెం ద్రోయుఁడు కోటమేడలు పడన్ర్వే
యుండు... ఉ. హరి. ౩. ౩౨.

చ...గోత్రభీకరముగ బాహులెత్తి తమకంబున
సేనకుఁ జేయివీచినన్. పారి. ౫. ౧౪.

౨. గిరగిర త్రిప్పు, త్రిప్పు.

ఉ. వాతసుతుండు వీచె శతవారము లుద్ధతచండ
నాల సంఘాతనివర్తమానతృణఖండసముం
డగుచుండ మాగధున్.
భార. సభా. ౧. ౨౦౭.

క. దొనపై గొనయముపై నోలిన పడిసెడ
తెగక యంగుళీయక ఖచితో, ర్వానుపమవర
రతోజ్జ్వల, వినుతిద్యుతు లెసఁగెఁ గోరవి
వీచినభంగిన్. (కు. సం. ౧౨. ౯౩౯.)

సీ. కడకాళ్లఁ బట్టి ఘీంకారంబు సేయంగ
వీచి నల్గడఁ బాఱవైచి వైచి...
చిత్రభా. ౭. ౩౭.

క. ఆదండ జడలదండను, వేదండఁ జెలంగఁ
జెరివి వేదండగతిన్, వేదండనుచే వీసుచు,
నాదండధరారిపోలె నాడుచు వచ్చెన్.
వి. పు. ౧. ౧౩౬.

చ. జగడపుఁగూటిసత్తరువు సాకెరుఁ గోసుచు
వీరిఁగాఱిరిన్, దగిలెడు తందనాలజడదారి
పారింబారిఁ గుంచె వీచుచున్.
కళా. ౩. ౧౯౪.

౩. చలింపఁజేయు, ఆడించు.

వ...దుర్గాధిపతులేమేమనని త్రోపుత్రోపా
డుచు వీచు వీచోపులచ్ఛమ్ములగు కాముదీ
గుచ్ఛమ్ముల నంతరింప...
మనుచ. ౫. ౭౧.

సీ. వీచోపు గుమివీచువిధమున నునువెల్లజల్లుల
మెకములు సలులఁ దిరుగ.
ఉ. రా. ౪. ౩౨.

సీ. సురటివీచులపుట్టుదొరమెక్కురానే స్త్రీ జంగి
లిమెలుకు మా సంగడీఁడు.
ప్రబంధ. ౧౬౦.

ద్వి. తావుల కొండసెత్తావి వీవలలు, వీవ వీవన
లొయ్య వీవ నాచెంత.
ద్వి. పరమ. ౩. ౧౯౩ పా.

**వీచోపు** వి. (వీచు + చోపు.) వింజామరము.
(ఇది ప్రయోగములంగుఁ దఱుచు బహువచ
నాంతముగఁ గానవచ్చుచున్నది.)

సీ. కలఁగి గాడుపుకోఁడు కొను కంపిన తెల్ల
వీచోపు లిద్దఱువెలఁదు లిడఁగ...
యయా. ౧. ౨౬.

క. పూఁచిన రసాలభూజము, సూచిలిఁ
జంద్రాతపంబు సొచ్చితి నిన్నన్, నీచేతి
కదళిదళములు, వీచోపులగాలి నుంటి వీరుఁడఁ
గానే. ద్వా. ౫. ౧౪౫.

సీ. వెలయు నిట్టూర్పులు వీచోపుగములుగా
వినుతులు కాహళధ్వనులుఁ గాఁగ.
ప్రబంధ. ౩.

**వీచోపులిడు.** అ. క్రి. (వీచోపులు + ఇడు.)
వింజామరలతో విసరు.

సీ. వెనుకదిక్కునసుండి కనకభూషలు ప్రోయ
సూర్యుండు శశియు వీచోపు లిడిరి...
కాశీ. ౪. ౭౯౬.

సీ. క్రమకంకణఝణత్కార సంకులముగా
సుందరీజనము వీచోపు లిడఁగ...
కవిక. ౫. ౩.

**వీజనము.** సం. వి. అ. న.=బీజము.

**వీజనము.** సం. వి. అ. పుం. ౧. ఎట్టిని పెద్ద
బాతు. ౨. నెమిలివంటి యొకవిధమైనపక్షి.—
న. ౧. విసనకఱ్ఱతో విసరుట. ౨. విసనకఱ్ఱ.
౩. వస్తువు, పదార్థము.

**పీట.** సం. వి. ఆ. స్త్రీ. ౧. బంతియాటకు సాధన. ౨. బంతి, కందుకము, చూదండము.

చ. ... దుష్కరముగ నూతిలోఁ బడిన
కాంచనపీటఁ గానంగనేరక...

భాగ. ఆది. ౫. ౨౧౦.

౨. బాలుర క్రీడాసాధనవిశేషము, గూటిఁబిళ్ల. (విల్యమ్సు.)

**పీటతటము.** విశ.=పీటతాటము. (శ. ర., చి. ని.)

**పీటతాటము.** విశ. = పిటతటము, భిన్నము, భగ్నము. (తాఱుమాఱు. అని శ. ర.)

క. కొమ్ములఁ గ్రుమ్మియుఁ బాదపు,లమ్ములఁ
జమరియును గరములం బఱిపఱియై, యి
మ్మెడలఁగఁ దిగిచియు సర్పదమ్ముల
నేనుఁగులు పీటతాటము సేసెన్.

భార. ద్రోణ. ౧. ౨౪౫.

సీ. కోటలు వెస పీటతాటముల్ గావించి పరి
ఖలు పూడ్చి వప్రములు ద్రొబ్బి ...

భాగ. ౧౦. ఉ. ౮౩౮.

ఉ. కొమ్ములనూఁది తుద్యములఁ గూలఁగఁద్రో
చియుఁ గేల పీటతాటమ్ముగ నీపలావలఁ
బడన్ సదనంబులు వైచియున్ మహా,
గ్రమ్మగ డానియున్న కరిఁ గన్గొని గుండెలు
జల్లసంగ వస్త్రమ్ములఁ గుంచియల్ విడిచి
తల్లడ మెక్కుడుగా పడంకుచున్.

కేయూర. ౨. ౧౦౩.

**పీటతాటనము.** విశ. = పిటతాటనము. (శ. ర.)

**పీటి.** సం. వి. ఇ., ఈ. స్త్రీ. ౧. తములపాకుల తీఁగ, తాంబూలవల్లి. ౨. సజ్జితతాంబూలము; వక్కలు సున్నము మున్నగు పరికరములతో గూర్చిన తాంబూలము. ౩. ముడి, గ్రంథి, పోక ముడి, నది. ౪. అవికెముడి.

**పీటి.** వి. (త. పీడల్.) కొల్ల, దోఁపుడు.

(శ. ర., బ్రౌ.)

(చూ. పీటిఁబోవు.)

**పీటిఁగలుపు.** (పీటి + కలుపు.) (సంధిని వర్ణాగమము.) నష్టముకావించు, విడిచిపైచు.

సీ. అశ్రాంతజంగమార్చాశ్రద్ధ పర్తిలు వేవ
విద్ది వ్రజపూజ పీటఁగలుపు ...

ఆము. ౪. ౪౩.

**పీటిక.** సం. వి. ఆ. స్త్రీ. = పీటి.

**పీటిది.** వి. (పీడు + అది.) వెనుకుగడపూఁప ఆఁడునది, దొమ్మరిది.

ఆ. వె. పీటిదాని పొంగు నిడువఁజాలక...

వేమన. ౩౫౪.

**పీటిపట్టు.** వి. (పీడు + పట్టు.) నగరము, పట్టణ స్థానము.

గీ....కూరగాయ కట్టియ విల్చికొనఁగవలసె,
యునికి ప్రేపల్లెపీటిపట్టునకు దొరసె.

హరి. పూ. ౬. ౫.

౨. వాసస్థానము.

గీ. అన్నపూర్ణావిశాలాక్షి కనుఁగుఁజెలిమి, విశ్వ
నాథుని కందంపు పీటిపట్టు, లింగముల
కెల్ల గని ముక్తిలేమ నెళవు, కాశికాక్షేత్ర
మాశ్రితకల్పతరువు. (సురాభాం. ౨౨.)

**పీటిప్రోగు.** విశ. (పీటి + ప్రోగు.) మిక్కిలి దుర్వ్యయము చేయువాఁడు.

గీ. నిగమశర్మాభిదానంబు నేతిబీఱ,కాయ
యును బోలె నయథార్థ గాథఁదాల్చె, వైది
కాచారదూరప్రవర్తనముల, పీట విహరించు
చుండు న వ్వీటిప్రోగు. (పాండు. ౩. ౧౩.)

**పీటిఁబాఱు.** అ. క్రి. (పీటి + పాఱు.) నష్టముగాఁ బరువెత్తు.

చ. గజపతి వచ్చెనంచు నొక గంధగజంబు గుఱించి యొక్కఁ డక్కజపడి పల్కిన న్వెఱచి కానన భూమికి వీటిఁబాతి దారి జడతనిద్రలోఁ గలవరింప నిజోక్తియ నేర్చి కీరము, ల్గజపతి వచ్చె నా విని కలంగుదు రీతని శత్రులందునున్. (వైష. ౫. ౧౩౩.)

వీటిఁబుచ్చు. స. క్రి. (వీటిఁబోవు.) ౧. చెఱుచు, నశింపఁజేయు.

ఉ. కయ్యము సేయ నే నని యకల్మషబుద్ధిఁ బ్రతిజ్ఞ సేసి నీ, వియ్యెడఁ దప్పితేని జగ మే మను నించుక సేపు పోరులన్, డయ్యుట దప్పె నాపయిఁ గడంగిన భీష్మునిపాటు నూతు రా, వయ్య గథంబుగాఁ డి కీర్తు లాశ్రితమానను వీటిఁబుత్తురే.

భార. భీష్మ. ౩. ౨౬౯.

ఉ.... సం, గ్రామములోన దానవని కాయము నెల్లను వీటిఁబుచ్చినన్, దీమసమెల్లఁ దక్కి తన డెందములోపల నుమ్మలించుచున్.

మైరా. ౧. ౧౩౯.

గీ. విబుధనాథుండు మానంబు వీటిఁబుచ్చి, కొలువవచ్చెద నన్ను నిలువరాదె.

దశా. ౨. ౧౧౪.

౨. నష్టపఱుచు, త్యజించు.

ఉ....చారుకులాభిమానమును సన్నుతధర్మము వీటిఁబుత్తురే....

భా. రా. అర. ౨. ౨౪౭.

సీ. ఇహపరసామగ్రి నీయఁజాలెడునట్టి విధి దేవతార్చన వీటిఁబుచ్చె.

శివరా. ౨. ౧౦౨.

చ. క్రతువులు పరిత్యజించి విధిచోదితకర్మము లుజ్జగించి సువ్రతములు గట్టిపెట్టి గరు వంపుఁ దపంబులు వీటిఁబుచ్చి స్వతక్కతువు లయానమాని నతతంబును దన్ను నె కొల్వఁ డంచు నా, క్షితిపతి చాటఁగాఁబనిచె సింధు పరీతమహీతలంబునన్. (వి. పు. ౨. ౧౦౩.)

౩. వ్యర్థముచేయు.

వ. ... కులవృద్ధు లుపదేశించు బుద్ధులు వినక వీటింబుచ్చి విచ్చలవిడి నిచ్చట వెచ్చంబులఁ సేయం ... విక్ర. ౨. ౧౫౫.

సీ. విజ్ఞుఁడిగి ధనంబు వీటిఁబుచ్చితి ననుజన్ములు నామీఁదఁ జలమువూని, ధరణీసుతోఁ జెప్పి దండుగ తొంబదివేలరూపాయలు వేగఁ గొనిరి. చంద్ర. వి. ౧. ౧౭.

ఉ. రోగి విలాసరేఖ నలుపొందెడు నీయన యందు నంగనాభోగవశాత్ముఁడై నిజ తపోమహిమంబులు వీటిఁబుచ్చి లజ్జాగిరి మల్ దొలంగుటలు చాలక యాతఁడు దొంగకూటి కేలాగునఁ జొచ్చెఁ దాఁ దల పొలంబుల నిల్చునె పాడుఁ రేఁగినన్.

విప్ర. ౫. ౪౧.

వీటిఁబోవు, అ. క్రి. (వీటి + పోవు.) ౧. చెడు, నశించు.

క. ... ధైర్యము మానంబును వీటిఁబోవఁ బాలెను, జననాయక నీమఱంది సరివారు నగన్. భార. ద్రోణ. ౧. ౩౬౩.

గీ. వీరె ఖచరాది ధైర్యముల్ వీటిఁబోవఁ, జను చునున్నారు నముచినూదనుని సభకు, నిపుడు నీపాలి కందరు నేఁగుఁదేరఁ, బొడఁగనఁగ రాక నిలిచెఁ గర్పూరతిలక.

కళా. ౨. ౭౪.

౨. దూషితమగు.

చ. కల యనరాదు రామలకుఁ గాములకూటము లెన్నిచందముల్, గలవవి యన్నియున్ వెలసెఁ గన్నెతికం బిటు వీటిఁబోయెఁ బెద్దలకును పెద్దయై తనదు తండ్రికిఁ దక్కవపాటు దెచ్చితిన్ ...

హరి. ఉ. ౭. ౯౧.

ఉ. ... సాహసముం బరాక్రమము సత్కుల జన్మము వీటిఁబోవదే. (దశా. ౨. ౧౯౧.)

౩. వ్యర్థమగు.

గీ. ఏటికిపని తనచెల్మి వీటిఁబోవ, నిన్నగద వమ్మువింతవన్నియలవంచు, సురటులంతలఁ బల్లటీఁబోడు లనిపె, నింతలోనన యీగర్వ మేలవచ్చె. కువల. ౫. ౪౩.

చ. అతఁడును నేఁగి దాది యొడ లాడటఁ జొచ్చు యథోచితంబుగా, నతివకు నప్పటప్పటికి నా నృపపుత్త్రిని రూపవైభవో, న్నతి వినిపించుచుండ మదినాటుచు నుండఁగ దానిచిత్తమ్మ, య్యతనునిచేత నోటుపడి యాటలు పాటలు వీటిపోవఁగన్. భోజరా. ౫. ౨౯.

వీడఁబడు. అ. క్రి. విడువఁబడు. (వీడన్ + పడు.) వేఱుగానుండు.

క. వీడఁబడిన సుల్పంబులఁ, గూడఁగ సంధించి పట్టి గుదమలవడఁగాఁ, బీడించినఁ గూర్మా సన, మీాడితమతి నెఱుఁగుదురు యమీాంద్రులు దీనిన్. సీతారా. ౧. ౧౦౨.

వీడనాడు. స. క్రి. (వీడన్ + ఆడు.) విడనాడు, విడుచు.

గీ. పుట్టినిలు డించి యత్తయిల్ మెట్టినట్టి, కోడలి తెఱంగు చెఱకుచేన్ వీడనాడి, బంటుదొడ్డికిఁ జను కోడె చంద మొంద, నుప వనము బాసి తనయింటి కువిద చనియె. రా. వి. ౩. ౧౪౨.

సీ. తపసుఁడు మార్గభేదము వీడనాడఁడే లీల నిందు వసింపలేఁడుగాక. (విప్ర. ౨. ౬౫.)

క. ముచ్చుపై నాథుండు మోవిబల్మోన నొక్క వెలయాలినా యంచు వీడనాడు. శరాం. ౪. ౩౧.

వీడలి. వి. తృణవిశేషము.

చ... వెనుతరు ప్రోల్ల బూదియును వీడలి పిచ్చుక బియ్య మెంద్రయున్. (ప్రబంధ. ౨౦౦.)

వీడాకు. వి. (వీడు + ఆకు.) విడియాకు, వేర్పాటు సూచించు పత్రము.

సీ. వీడాకు నవచక్రవిహగదంపతులకు, పాయసాన్నము దేవపటలమునకు. హ. వరాహ. ౨. ౨౯. పు.

వీడియము. వి. (సం. వీటికా.) = విడెము, తాంబూలము, తములము.

సీ. విశ్వేశ్వరుఁడు విభూతి వీడియం బంగుళ్ళో జంగమస్వామి నా సదనమునకు. కాశీ. ౧. ౩౫.

సీ. వీడియం బెడలించి విధురత్నకనకాలు కొంచితాంబువు పుక్కిలించి యుమిసి. పాండు. ౧. ౧౯౮.

మ. పలుకుం దొయ్యలి మాశికాంతి కెనయౌ బాగాలు నయ్యింతి చెక్కులఁబోలుం దెల నాకు లయ్యువిద పల్కుల్వంటి కర్పూరంపుఁ బలుకులతోఁ గూడిన వీడియం బొసఁగె నాకుం బద్మనాభార్చనాకలనాపావనహస్తకంకణ ఝుణత్కారంబు తోరంబుగన్. పాండు. ౧. ౭౯.

ఆ. కంటె తాళిబొట్టు కమ్మలు కడియంబు, లొక్కవన్నె చీర యొకటి రెండు, వీడియములె కాని విభవముల్ గలిగియు, వల్లకుండు చైత్యవరపురంధ్రి. (దశా. ౪. ౫౯.)

వీడు. అ. క్రి. (తె. వీడు.) ౧. వీడిపోవు.

సీ. వీడిన పెన్నెఱికేశి సుచిత్రనవీనాభ్రమై కమ్మవిరులు గురియ. (హరి. పూ. ౩. ౧౭౨.)

గీ. చెలువయొక్కర్తు గట్టినచీర వీడి, పడఁగఁ జనుదెంచె ... (కు. సం. ౭. ౬౫.)

చ. అన విని మానినీతిలక మప్పుడు మే యుఱ దోఁప నిక్కి వీడినకచపంక్తిఁ బల్మరు ముడి న్వాడదోఁపుచే... (పారి. ౧. ౧౨౪.)

౨. విచ్చిపోవు, ఊడు.

మ. బలమెల్లన్ వెనుచిక్కె నొక్కరుఁడు శుంభద్బాహుదర్పంబునన్, దలుపుల్వీడఁగఁ దన్ని ... దశా. ౪. ౧౦౦.

వ. ... మగటాల బోరుతలుపులు వీడన్ దన్ని... ఉ. రా. ౩. ౨౨.

౩. జారిపోవు.

గీ. కళవసంబుండ జలకమండలువు వీడ, జడలు మహిఁ జీరఁ జేజపసరము జాఱ, దర్భముడి వ్రేల ధ్యానతత్వంబు సోలఁ, గడిగి నిలుచుండి యాగ్రహాగ్రహముఁ జెంది.

శివల. ౨. ౩౫.

౪. పొదలు, వర్ధిల్లు.

క. వాడక వ్రాలక తెవుళులఁ, గూడక తగ నెల్ల గెలలుకొని నవకములై, చూడఁగ భద్రములగుచును, వీడెన్ సస్యంబు లిడుమ వీడెం బ్రజకున్.

భాగ. ౧౦. పూ. ౭౫౭.

(ఇది నాలుగైదర్థముల కుదాహరణము.)

ఉ. చేడియ నామధేయము శుచిస్మితి యా చిగురాకుఁబోఁడికిన్, వ్రీడయుఁ గేశభారమును వృత్తపయోధరము ల్నితంబమున్, బాడబు నెమ్మనంబు రతిభావము వోడన నాఁడు నాటికిన్, వీడఁగఁజొచ్చె బాల్యమును వీడఁగఁ జొచ్చెఁ దదీయచింతలో.

కాశీ. ౩. ౧౧.

(నాలుగైదర్థంబులకిది యుదాహరణము.)

౫. శిథిలమగు, తగ్గు, నశించు.

క. వీడు చనిరించె నయ్యెడ, వీడని వేడుక బలారి.... వసు. ౬. ౩౫.

దండకము. ఈశాను ఘోర స్మరాసేన నా గాసన వ్యూహసన్నాహము ల్వీడ వెన్నాడి బాణాసురస్ఫార బాహాసహస్రచ్ఛిదాకేళిమై వాలి లోకంబుఁ బాలింపవే. (పారి. ౩. ౩౮.)

౬. విశదమగు, స్పష్టమగు.

క. అని వీడఁగఁ బల్కిన న, య్యనుజాధముఁ డంతఁ బోక మదనోన్మాదంబునఁ దన్ను నెదిరి నెఱుఁగక, వనితకు నిట్లనియెఁ గార వంపుఁ బలుకులన్.

భార. విరా. ౨. ౫౧.

స. క్రి. ౧. విడిచిపెట్టు.

చ. కపటపు మాయజోగియగు ఖండశశాంకధరుండు వృద్ధవేషపుఁ దనరూపు వీడి వెలిచక్కిన యుండఁగ... (హర. ౨. ౭౦.)

మ. జనరాడ్దివ్యవివాహవైభవము మించన్ జేయ రేరాజు నించిన జ్యోత్స్నాంశు వితానతారకసుమశ్రేణుల్ నెఱుల్ వీడఁగా.... వసు. ౬. ౪౧.

సీ. ...జోడన వీడి యచ్చో నిబ్బరపుఁ బర్వ నని బాటఁదొడఁగె గంధర్వకులము.

దశా. ౨. ౬౦.

౨. విడిచిపోవు.

గీ. అవయవంబులు నైసేత లభిలషించెఁ, జెవులు సంభోగవార్తల చవులుమరఁగెఁ, జనవరాత్మజ కంతను శైశవంబు, వీడి క్రొత్తగఁ బ్రాయంబు గూడునపుడు.

కళా. ౩. ౧౪.

గీ. ... ఱుత, ద్రాడుగట్టక సొగసెల్లఁ దఱిమి యొడల, వ్రేలు వలరాచబలుబూచి పీడఁగలదె. నీలా. ౧. ౧౦౩

వి. దే. (క. బీడు. త. వీడు. బ. వీడులు. వీళులు, పీళ్లు.)

౧. పట్టణము.

శా. వేమాఱు న్మలయానిలుం డదరి యావీటం బ్రసూనాన్వితారామంబుల్ వెసముట్టి యందలి యలివ్రాతంబు బోఁజోపి.

విక్ర. ౧. ౯౬.

ఉ. ...బలసూదను వీటికిఁ గొండవీటికిన్.

ఆము. ౧. ౩౭.

చ. ఇలఁ గల వీళ్లు గూడ మన మేటికిఁ బోవలెఁ
బోయినన్ వని, న్నిలువఁ బసేమి ...
విజ. ౨. ౫౯.

౨. ఇల్లు, గృహము.

క్షి. వీడుఁ డని వీడు వెల్వడివచ్చి ఖాండిక్యుఁ డా
రాజుఁ గనుఁగొని యాదరమున ...
ఆము. ౩. ౬౦.

గీ. ఎదురుగా వచ్చి జనకనరేంద్రుఁ డంత, నేనుఁ
గులనీంద సంధించి మానవేంద్రుఁ, బుడికిఁ
దోడ్తెచ్చి తన సహోదరుని వీడు, విడిని
గాంచించి యులుప లెక్కడుగ నొసఁగి.
దశా. ౭. ౨౨౮.

౩. సాలెము, స్కంధావారము, దండు విడియు
చోటు.

ఆ. వీడు సొడుగాన విశ్రాంతి కిరొయ్యెడ, మనను
మసలవలను మంగళార్థముగ శుచిప్రదేశ
మునకేఁగి యచ్చోట, సుచితవ స్త్రనముల నుండ
వలయు. భార. శల్య. ౨. ౩౭౦.

సీ. వాహనంబులు డిగ్గువారును బన్నలు వీడు
వారును దమవీడు లెఱుఁగఁ, దమ సెమ
చిహ్నముల్ దనరఁగఁ నిల్పించువారు...
కు. సం. ౧౧. ౬౦౦.

ఆ. నిలిచువారు మఱియు నిడెత్తువారునై,
నేల యీనినట్లు నిండెఁబడిరి.
భా. ౧. యు. ౨౭౪.

౪. సేన, దండు.

ఉ. ...పాండవకోటి కిపుడుం, జేటు దలంచియే
బలువుసేసితి వైరము నాకు నింక నీ, వీటికి
వారి వీటికిని వెక్కసమయ్యెడు కయ్య
మొప్పగున్. భార. భీష్మ. ౩. ౫౯.

సీ. ఈ రెండువీళుల తారతమ్యంబులు నెఱుఁ
గుదు, పోరైన నెక్కరోర్తు, కు....
భార. ఉద్యో. ౨. ౩౦౪.

గీ. రెండు వీళ జనంబులు రేలు వివిధ, హృద్య
సంగీతములను సాహిత్యమధుర, లలితగోష్ఠి
వినోదంబులను ప్రమోద, భరితులై ప్రొద్దు
పుత్తురు భరతముఖ్య.
భార. భీష్మ. ౨. ౩౪౩

సీ. వీటికి సమగ్ర మాటోప మొదవ నాభీల
శంఖము దన ప్రమోల ప్రమోద.
భార. కర్ణ. ౧. ౬౦.

౫. పక్షిజనసమూహము, సమూహము, గుంపు.

క. నడపించి పంచవటమున, విడియించెను వీడు
చోరకీరాలు గని యొక్కడు ధనములు గల
కిముక్కడి ప్రజలో లేరు దీనిఁ గానఁగ
రెూధుల్. భాగ. షష్ఠ. ౧౨౦.

క. బృందారకపక్షమునఁ దిగి, యిందీవరపత్ర
నేత్ర యిరువంకలవారును దమకతమక
యిటురా, యిందనఁగా రెండువీళ్ల యెడ
మున విడిసెన్. సార. ౬. ౧౦౧.

చ. గురుసతిఁగూడు రట్టునకుఁ గొంకనిపోడు
... చిత్రగతి మిన్నలఁ జాఱెడు పాయ
లాడు పెన్నిరులను పోడు కొలుకొని సేర్చు
వెలుంగుల వీను వీడువో.
వసు. ౪. ౨౪.

౬. దొమ్మరులగుంపు.

గీ. నేఁటి ప్రొద్దున దొమ్మరకటిలోడ, కాశికా
పురి కినసంగఁ గాంచినాఁడు ...
చెన్న. ౨. ౩౧౭.

గీ. ... తండ్రిఁ బిలిపించి వార్తయంతయును
జెల్పి, వీడు దరలింపు మిప్పుడ వీడననిన.
చెన్న. ౨. ౩౦౪.

౭. కట్నము.

గీ...మంత్రులు లాప్తులు దొరలు సంబంధిజనులు,
వీడు చదివించి రెంతయు వేడ్కమెఱయ.
చంద్రా. ౬. ౫౦.

క. పీడు చదివించె నయ్యెడ, పీడని వేడుక
బలారి ... వసు. ౬. ౩౫.

౭. సామ్యము.

సీ. అతివ వక్షస్స్థితి నంద మొందుటఁజేసి, పీఁకె
కాయలు కొంత పీడువచ్చు.
ముకుందవి. ౨. ౯౯.

విశా. విశదమైనది.

ద్వి. మాడలు బహువిధ మణిభూషణములు,
పీడంచు వస్త్రాల వెలయు పుట్టములు.
నవనాథ. ౨. ౧౦౭. పా. ౨. పం.

పీడుకొను = పీడ్కొను. స. క్రి. (పీడు + కొను.) ౧. పోయివచ్చెదనని విన్నవించి విడుచు.

గీ. వ్రజనివాసుల నెల్లను వరుసతోడ, పీడుకొని
తన్ను నందఱు వేడ్కఁ ననుప మధుర కేతెంచె
వ్రజమునలో మరిగి తాల్చియున్న వేషంబ
యొంతయు నొప్ప నొసఁగ.
హరి. ఉ. ౨. ౯౩.

క. గురునకు శిష్యుఁడు నిచ్చలు, పరిచర్య
యొనర్చి భక్తిపరుఁడై విద్యల్, గఱపఁ
బడుఁ గఱచి చదువుగ, గురుదక్షిణయిచ్చి
పీడుకొనఁగావలయున్. (విజ్ఞా. ౨. ౩౫.)

గీ. పెక్కుభంగులఁ బొగడి సంప్రీతి నెఱపి,
పీడుకొని పార్వతియుఁ దాను వృషవరాధి,
రూఢుఁడై వెండిమలకు హరుండు చనియె...
పరమ. ౧. ౧౨౩.

౨. విడుచు, త్యజించు.

గీ. ...విష్ణుఁ బొడఁగంటి భవములు పీడుకొంటి.
ఉ. హరి. ౨. ౧౪౬.

క. గజభుజగాదులచేఁ గల్గు, గుజిబిజికింగాక
పీడుకొన్నది వోలెన్, భజియించి నిలిచె
వలపటిభుజమున విశ్వేశ్వరునకు భూసతి
ప్రీతిన్. కావ్యా. ౫. ౪౬.

గీ. అఖిలమోహినిరైన యయ్యలరుఁబోఁడి, శైశ
వము పీడుకొన్నది సందుగాఁగ, ననుదినం
బును రాజనందనులమీఁద, వేఁటలాడుచు
నున్నాఁడు విషమశరుఁడు.
వైష. ౩. ౨౬.

పీడుకొలుపు(ల్పు) = పీడ్కొలుపు. స. క్రి. (√ పీడుకొను.) ౧. పోయిరమ్మని సెలవిచ్చి పంపు.

ఆ. అనిన నట్లకాక యని సంజయుని పీడు,
కొలిపి కొంతప్రొద్దు కురువిభుండు, కార్య
చింత మునిఁగి కంచుకి నొక్కనిఁ, బిలిచి
వేగ విదురుఁ బిలువు మనియె.
భార. ఉద్యో. ౨. ౧౬.

క. నారదుని మాధవుఁడు సత్కారంబున పీడు
కొలుపగా నతఁడు హృదంభోరుహమునఁ
గృష్ణునకును, వారక మ్రొక్కుచును వెస
దివంబున కరిగెన్. (భాగ. ౧౦. ౬౨౯.)

గీ. శారదానందగురుఁడు సుజ్ఞానపరుఁడు, పీడు
కొలుపంగఁ జని నందవిభుని గాంచి.
విక్ర. ౩. ౫౨.

క. చనుదెంచె కలహభోజనమునిఁ రుక్మిణి పీడు
కొల్ప ... పారి. ౨. ౧౫.

౨. మీఁదికి నెట్టు, పైకిఁద్రోయు.

గీ. సహజసౌజన్య సౌజన్యశంకరునకుఁ, బోఁగ
వడ్డించెఁ దక్కాలపుణ్యభిక్షు, సారదో
ర్మూలకూలంకషంబులైన, పీఁసుబాలిండ్లు
పయ్యెద పీడుకొలుప. (హర. ౫. ౪౭.)

౩. విడిచిపెట్టించు.

సీ. నారికేళాటవీనవపుష్పకుహరికావితతికెవ్వె
లికంబు పీడుకొలిపి...గీ....పాలసె సత్త్వ
పరిశ్రాంతి పొడవడంగ, మానిధరు పైఁ
గుమారవనానిలములు. (భీమ. ౨. ౬౨.)

౪. వదలు, విడుచు, త్యజించు.

గీ. ఎల్లకాలంబు నుండెద నిచట నేను, మొదలి మామ యోరామపదమునందు, వెండి గుబ్బలిపై నెడక్క వీడుకొల్పి, మేరునగ రాజుపైఁ జాల మెచ్చు వదలి.

భీమ. ౬. ౧౧.

వ. పురందరాది బృందారకుల వీడుకొలిపి శతానందుండు ... (హర. ౩. ౧౯.)

**వీడుకోలు.** వి. (√ వీడుకొను.) (బ. వీడుకోళులు, వీడుకోళ్లు.) ౧. వీడుకొనుట, పోవ ననుమతించుట.

గీ. కట్టనిప్పించుకొని తాను గట్టనిచ్చి, చుట్టములకును లాతిరాజులకుఁ గరము, నెయ్యమును గారవంబును నెఱయఁ బ్రీతి, సాల గలిగించి తగ వీడుకోలొనర్చె.

హరి. ఉ. ౩. ౧౭౨.

సీ. వెలయ వియ్యాలంది వీడుకోళ్లుగుడిచి నరఁబువుల్ ముడిచిన నాపసాని.

కళా. ౭. ౧౫.

గీ. అంత వసుదేవుఁ డాదియౌ యాదవులకు, విందులును వీడుకోలును వింతవింత, ప్రియములును జేసి పనిచెఁ గేశవవిభుండు, ముదిత ప్రశుకకీర్తియును దాను వితతకీర్తి.

ముకుంద. ౩. ౩౦౩.

౨. విడుపు, విసర్జనము.

సీ. శైలేయమదవతీధమ్మిల్లములతోడ వివల నెత్తావికి వీడుకోలు. (ఉ. హరి. ౩. ౧౪౭.)

సీ. అనుపమంబైన నీఘనతరక్రోధంబు వీరుల ధైర్యంబు వీడుకోలు.

భా. రా. యు. ౧౩౯౦.

మ. తలపోఁతల్ దలలెత్తఁ దాల్మి సడలెం దాపంబు దీపించెఁ జేఁతలు డింజెన్, ధృతి వీడుకోలు గొనియెన్......

విక్ర. ౪. ౧౫౪.

౩. చావు, మరణము.

క. వాఁ డల్లవాఁడె పోయెడు, నేఁడతనికి వీడుకోలు నిజముగ నీ వా, పోడిమి చూచెద వేనొక, నాఁడో నిట నిల్చిచూడు సరవర తిలకా.

భోజ. రా. ౪. ౫౪.

**వీడుకోలుచేయు.** స. క్రి. (వీడుకోలు + చేయు.) విడిచిపెట్టు, విసర్జించు.

క. ... వృధా, బద్ధంబు లఱచు జైనుని, సిద్ధాంతము వీడుకోలుచేయు మటన్నన్.

ప్రబోధ. ౩. ౫౦.

**వీడు(లు)చదువు.** అ. క్రి. (పెండ్లి పందిరిలోఁ బురోహితుడు) కట్నములు చదువు.

మ. పరమేశానపయోజసంభవులు దిక్పాలుర్ ప్రియంబొప్పఁగాఁ, బరమాహ్లాదము మీఱ నొండొరులు పైపై నిచ్చు పట్టాంశుకాభరణశ్రేణులు కేలఁ గైకొని సభాభాగంబునన్ నిల్చి సుస్వరుఁడై దేవగురుండు వీడు చదివెన్ సర్వాగమస్ఫూర్తులన్.

దశా. ౫. ౭౭.

**వీడుచే = వీడ్చు.** స. క్రి. (√ వీడు.) వీడఁజేయు, విప్పు.

ఉ. నిక్కి ప్రసూనముల్ గురియు నేవలి వీడిచి కొప్పువెట్టుచోఁ, జొక్కులఁ జెట్టి భూవరుని చూపులఁ గోమలిబాహుమూలముల్.

వైష. ౭. ౧౯౪.

**వీడుజోడాడు.** అ. క్రి. (వీడు + జోడు + ఆడు.) ౧. మాఱు మలయు, ప్రతిఘటించు.

గీ. మానికంబునఁ బుట్టిన మదచకోరనేత్ర పుంభావమునఁ దన నేర్పుచూపు, సౌఖ్యజలరాశిఁ దేలుచుఁ జతురశీతిబంధముల వీడుజోడాడెఁ బార్థివుండు.

వరాహ. ౪. ౧౫౨.

ఉ. కూడిరి యొండొరుల్ దొరసి కుంతల
కాంతు లొసంగి వీడుజో,డాడిరి క్రేళ్లు
దాఁటెడు మదాళులతో ...
రామా ౧. ౨౦౬.

గీ. గగనగంగాతరంగసంగతములైన, శిఖరను
గీ నగేంద్రశిఖరసీమ, దిక్కులతో వీడు
జోడాడుదిక్కు లనెడు, సుదిత యోగిజల్లు
వెలి మొల్ల మొగ్గ లనఁగ. (ఘటికా. ౨.౬౧.)

౨. పెనగొను.

ద్వి. వెలివెలిపోఁడును గహ్వలత్వంబు, వెలి
పును మఱుపును వీడుజోడాడ.
రం. రా. అయో. ౯౬. పం. ౧౭. పం.

ద్వి. సుళువులు పసులకా ల్మడికప్పు చెలఁచెఁ,
దొడుపుఁగొట్టును గడుదూరంబు లయ్యె,
వీడుజోడాడెను కటమిజాలములు, మోడు
లగ్గొంపోయె నోడులఁ జేయ.
అమక. ౧. ౪౪. పా. ౨౪. పం.

౩. సరిపోలు, సామ్యమునొందు.

వ. ... జడనిధిలో నడయాడుచుండిన రౌద్ర
లహరీ వీడుజోడాడు రథంబులును. ...
ఉ. హరి. ౪. ౨౧౩.

సీ. చిగియుచందురుతోడ వీడుజోడాడెడు,
రమణీయ దంష్ట్రాంకురములవాఁడు ...
వి. శకుం. ౧. ౫.

**వీడుజోడు.** విణ. = పిజ్జోడు. (శ. ర.)

**వీడుదోడు.** వి. (వీడు + తోడు.) అంపునట్టి తోడు, సాగనంపు సహాయుఁడు.

సీ. పాథోధి రాధేయ పారిజాతములకు వీడుదోఁ
డెవ్వని వితరణంబు. (కా. పు. ౧. ౪౩.)

(ఇట సాదృశ్యద్యోతకము.)

**వీడు(ఁబ)ట్టు.** వి. (√ వీడు.) ౧. వాసస్థానము, ఉనికిపట్టు.

సీ. ... వెలుఁగొందు కేయెండ దుపపట్టిది యని
రాజితంబగు పద్మరాగరుచులు ...
కు. సం. ౩. ౨౬౧.

గీ. వీఁడఁటే శౌర్యములకెల్ల వీడుపట్టు, వీఁ
డఁటే ధర్మములకెల్లఁ దోడఁబుట్టు, వీఁడె
సాక్షాత్కరించిన కృష్ణమూర్తి, వీనిఁ గను
కంటె శుభములు వేఱు కలవె.
సీతావి. ౧. ౪౨.

వ. ... ఆ నృసింహుఁడు సాదరంబు వడసి
వీడుఁబట్టున కరగిన ...
భార. శాం. ౨. ౩౬౪.

౨. బస, విడిది.

చ. అలయక సంపుసేయుచు మహాశ్రమ
భూములు వీడుపట్టుగా, లలనఁ దగన్
సుమంత్రుఁడును లక్ష్మణుఁడున్ గొని
పోయి రిమ్ములన్. నిర్వ. ౯. ౪.

గీ. వీడుపట్టుగ కుంతీకుమారదీనరక్షి, సవ్య
సాచింబునం బ్రతిష్ఠఁజేసి, గారవించె
యంతకుమారకులంటెఁ, బాండురాజతనూజు
డాఖండలుండు. హర. ౭. ౧౧౭.

క. ఎగురకొని వీడుఁబట్టుకు, సుదమారఁగఁ
దాన చనిచి... (భాగ. అశ్వ. ౪. ౧౩౬.)

౩. శిబిరము, స్కంధావారము, దండు విడియు
చోటు.

ద్వి. పనివారి సందడిఁ బరఁగ నవిలపుఁ, బలు
కుల నోడఁబడఁ బలికి వీడ్కొల్పి, వీడుఁ
బట్టునకుఁ బోయి విశ్రాంతుఁడగుచు.
పల్నాటి. ౪౫. (బ్రౌ.)

**వీడుప(వ)డు.** అ. క్రి. (√ వీడు.) (వీడు + పడు.) ౧. తాఱుమాఱగు, మాఱుపడు.

వ. అని బేలువెట్టి కూఁతురుం దానును జనద్వ
యంబు వీడుపడ నుపయోగించి నిజగృ
హంబులకుం జనిరంత. (వి. పు. ౬. ౧౩౧.)

గీ. ఒక్కవనిత గర్భంబు వేఱొక్కవనిత, గర్భమునయందుఁ బెట్టు నొక్కరుఁడు పూచిపట్టి యాడంగవచ్చినయట్టి పలుకు, పీడువడఁజేయుఁ బరివర్తి విను మునీంద్ర.

సార్వ. ౪. ౯౨.

౨. భేదపడు, వేర్పడు.

క. ఎలనాఁగలు మఱి తమలోఁ, పల వృత్తాగములు పీడుపడ నాడుచుఁ గ్రొ, న్నెలదాలుచు వేలుపు క్రియఁ, గొలిచి వగుడి నేఁగు నపుడు గుడిలో మూలన్.

హ్వా. ౮. ౧౬౮.

౩. తడఁబడు.

సీ. భద్రేభములు పీడుపడఁ దాఁకఁ గోల్కాని గుండెలు వగులంగఁ గ్రుమ్మిగ్రుమ్మి ...

విక్ర. ౪. ౧౧౧.

సీ. బోటికిఁ దోఁచినఁ బొలియుఁ దేకువ యను వెగడునఁ జెయ్యులు పీడువడఁగ.

భార. విరా. ౨. ౬౦.

పీడుపాటు = పీడ్పాటు. వి. (√ పీడుపడు.)

౧. మాఱుపాటు, వ్యత్యయము.

సీ. నృపతి లేమను గెలిచిపుడత నొఱఁగుచో వెడగులౌ చెయ్యిల పీడుపాటు.

నిర్వ. ౮. ౮౦.

మ. తన ము న్నాడినమాటయున్ నిజముగాఁ దన్మానికిం బ్రీతిగా, మనుజుండున్ నెలవో నెలం బురుషుఁడై మాసాంతరంబైనఁ గామినియై యీఁగతి పీడుపాటమగు భూమిం దావ రక్షించుఁ బ్రాహ్మనినన్ వచ్చె వసిష్ఠుఁ డామనుసుతుం డాకీతి రాజ్యస్థుఁడై.

భాగ. ౯. ౩౦.

మనుజుఁడు = సునువుకొడుకు.

(మనుజేంద్రుండు నెలన్ నెలం బురుషుఁడై, శ. ర. పా.)

గీ. కొంత కంటెట సంతతకంతుకేళి, వివిధ సంకల్పవాసన పవలురేలు, తనరు పుల కలు కలవరింతలును పాట, పీడుపాటులు చెలులకు వెఱఁగొనర్ప. (కళా. ౬. ౨౧౫.)

౨. విడుపు, విడుదల, విమోచనము.

సీ. సుతులువుట్టిరయేని సతులకు మృత్యువు వాఁగాయమై వెంటవచ్చెనేని, బ్రహ్మచేతను పీడుపా టేమియును లేకయుండునే సగు పాయ మొకటి లేద ...

భాగ. ౧౦. పూ. ౩౮.

పీడువిడియు. అ. క్రి. దండుదిగు, శిబిరమేర్ప అచుకొను.

వ. ఇట్లు సన్నద్ధులై వెలి పీడువడిసి తమకు ననురక్తులైన రాజులపాలికిం దగుదూతలం బుచ్చిరి ... (భార. ఉద్యో. ౧. ౫౦.)

గీ. అతులితోత్సాహమున వేఁటలాడి యాత్మ, కడఁగి యచ్చోటనే పీడువిడిసెఁగానఁ, గిన్నరయుగమునఁ దత్కన్యకాప్రలాప, కల కలధ్వను లాలించి జలదరించి.

శుక. ౧. ౩౮౬.

పీడె = పీడెము. వి. (సం. పీటీ.) తాంబూలము.

క. సునుపగు నలి గానము విని, వననేవతి గనము మెచ్చి వానికి నొసఁగం, జనఁ బైఁడుల పీడెలుపుచ్చిన నిధనునఁ బొన్న లెలమిఁ జెలువుగఁ బూచెన్. (శు. సం. ౪. ౪౫౨.)

పైఁడులపీడెలు = సువర్ణముతోఁ గూడిన తాంబూలములు.

పీడెత్తు. స. క్రి. (పీడు + ఎత్తు.) దండువెడ లించు.

గీ. రాజు పీడెత్తి చేసినఁ దారకభటాళి, యంబ రాభోగనిజశిబిరాంగణమునఁ, గాలుకొల్పిన

పావకజ్వాల లనఁగఁ, బ్రాచిఁ గనుపట్టె
నవసాంధ్యరాగరుచులు. (పారి. ౨. ౬౫.)

**వీడెము** = వీడియము, వీడ్యము. వి. (సం. వీటీ.) తాంబూలము.

సీ. దైత్యావరోధనదయితాధరములతో సాబగు
వీడెములకుఁ జొక్కరొదురు.
ఉ. హరి. ౩. ౧౪౭.

సీ. వీడెంపు బలుకెంపు విరిసి వెన్నెలగాయ
వలిగింజ నొకటఁ బల్వరుసఁ దోమ ...
ఆము. ౧. ౬౦.

క. వీడెము సేయని నోరును...బూడిద కిరవైన
పాడుబొందర సుమతీ. (సు. శ. ౯౯.)

**వీడ్కొను** = వీడుకొను. స. క్రి. ౧. పోయి వచ్చెదనని విన్నవించి విడుచు.

క. ...మనము ప్రశాంతిం, బనుపడఁగఁ బ్రీతి
వీడ్కొని, చని వర్తిల్లెను విశ్రుష్టసరణిఁ
గుమారా. (భార. శాం. ౫. ౩౭౯.)

ఉ. వేడ్కఁ బ్రణామపూర్వముగ విశ్వజగ
జ్జనకుల్ జనార్దనున్, వీడ్కొని యా
జనార్దనుఁడు వేగమ కూడఁగరా నరాతులీ,
మూడ్కి మహోద్ధతిం జెనయు మా వశమా
యన జోదుఁగైదువుం, జూడ్కికిఁ దోఁప
శౌరియనుజుం డరిగెం దురగాధిరూఢుఁడై.
ఉ. హరి. ౪. ౧౭౧.

మ. వినతుల్ సేసె దశాననుండు మమతన్
వేమారు దీవించు న, జ్జననిన్ వీడ్కొని
కుంభకర్ణుఁడు కనిష్ఠభ్రాతయున్ వెంట
రాఁ, జని ...? (ఉ. రా. ౨. ౧౫౭.)

౨. విడుచు, త్యజించు, విడిచిపెట్టు.

క. ఆ నిసద మల్లసల్లన, వీనులు సోఁకిన
సమాధి వీడ్కొని జలద,ధ్వానమున నలరు
శిఖిగతి, నానందము నొంది సూచె వారి
నరగంటన్. వా. గా. ౪. ౮౪.

చ. అపుడు విలంబమానమయి యంబరకోణ
తటాంతరంబునం, దపనునిమండలంబు పెకా
దంబగు వేఁడిమి నొయ్య వీడ్కొనెన్....
శివరా. ౩. ౭౮.

చ. విపదపహర్తయైన రఘువీరునకుం దురవస్థ
రాదు నీ, విపుడు దలంకి యొండొకటి
యెన్నక మిన్నకయుండు మమ్మ యి, వ్విపి
నమునందు నొంటి నిను వీడ్కొనరాదని
పల్క నల్క దోఁసపువచనంబులాడ నవి
సైఁపక వచ్చితి దేవ నావుడున్.
రామా. ౫. ౨౨౦.

క. అలతిర్యగస్వయాగ్రణి,వలన నశేషంబుఁ
దెలిసి వారక యతిమం,జులగతి వీడ్కొని
రాజిలు, బలవదారిగానువృత్తి భజియించె
వెసన్. హ. వ. ౨. ౫౯.

(ఇవి పై రెండర్థములకు నుదాహరణము.)

౩. తప్పించుకొను.

మ....నిదాఘాంశునా,వలి వీడ్కొన్నతమంబు
గాంచి వనిలోవ వర్తించు నుంచోయనన్.
వసు. ౧. ౧౩౯.

**వీడ్కొలుపు(ల్పు.)** = వీడుకొలుపు. స. క్రి. పోయిరమ్మని సెలవిచ్చి పంపు; పంపు.

క. పూఁబోణులకును విటులకు, వేఁబోకలఁ
దలరు సొంపు వీడ్కొలుపుఁ బుటిన్,
లేఁబోకఁ బోఁకతోఁటల, పూఁబాళల
కమ్మతావిఁ బొడవిన గాడ్పుల్.
భీమ. ౧. ౯౫.

ద్వి. రేపు మాన్పెద నింత వేఁగును మీకు, నని
మహాప్రజలెల్ల నాదరం బెసఁగఁ, జనుఁ
డని వీడ్కొల్పి జననాథుఁడంత ...
హరిశ్చ. పూర్వ. ౫౩౦.

మ. ... మహ్మాపన్నులం బ్రోవ నా, యమ
రుల్ నీకొనురే జయింపఁగ దవయ్యా యన్న
లేనవ్వు డా, యమరుల్వీడ్కొల్పుచు వారి వీడ్కొ
లిపి జగన్నచ్ఛేదనోద్యోగియై.

ఉ. రా. ౧. ౭౭.

క. కుందును జారుల మఱియుం, గొందఱ
వీడ్కొల్పి భానుకులవీరుల పెం, పుం దెంపును
గవివీరుల, చందంబును జలిసి తాల్మిఁ
జని యలకుండై. (రా. మా. ౭. ౨౧౭.)

౨. విడుచు, త్యజించు.

చ. ధరణిధరేంద్రనందన యుదగ్రతపోమహ
నీయవేషన్, భర మఖిలంబు వీడ్కొలిపి
భావమునం బరితోషమందుచున్.

హర. ౪. ౩౯.

౩. త్రోయు.

వ. ... విబుధనిర్ఝరిణీపాథఃపూరంబునఁ బరనో
ధరవీథి చక్రంబు వీడ్కొలుపుచు ...

కాశీ. ౬. ౧౭౫.

**వీడ్కోలు = వీడుకోలు.** వి. ౧. వీడుకొనుట,
పోవ ననుమతి.

మ. ... మునివంశోత్తమునంఘ్రిపద్మము శిరం
బుంజేర్చి వీడ్కో లతం, డొసఁగింపన్
జనియెన్ బురంబునకు నిర్యోత్సాహసిద్ధైశ్వ
ర్యుఁడై. నృసిం. ౨. ౪౩.

క. తల్లియుఁ దండ్రియు వేఁడుగనఁ, బుల్ల
వడన్ వారికడకుఁ బోయి తడయఁ గా, నొల్లక
పయనపు వీడ్కో, లెల్లం దనయిచ్చ నడపి
యేడ్తెర వెడలెన్.

భార. ఉద్యో. ౪. ౧౨౨.

౨. విసర్జనము, విడుపు.

మ. ... చెక్కుల్ ఫాలంబు జెమర్పఁ జైఁట
యెద వీడ్కోల్ జెంద బంగారు గాజులు
టోకియ్యఁగ నార్పులెచ్చఁ దఱి లచ్చో
నిక్కఁ దాళస్థిన్, దలయంటెన్ గనుదోయి
సొక్కన్ నాకకాంతామాలి మంగాంబకున్.

ప్రబంధ. ౫౭౦.

విశే. ఓడిపించువాఁడు.

సీ. జలజగర్భుని చగువులచెలి వీడ్కోలు ...

వరాహ. ౫. ౫౯.

**వీడ్చు = వీడుచే.** స. క్రి. (√ వీడు.) ౧.
విప్పు, వీడఁజేయు.

క. తెలవ యొకతె నిద్రింపఁగ, నెఱిఁగట్టిన
వలువవీడ్చి నేగుట తేలుం, గఱపించి నీ
కుమారుఁడు, వెఱచుచు నది పఱవ నగియె
విహితమె సాధ్వీ. (భాగ. ౧౦. పూ. ౩౨౪.)

మ. కని సత్కారమణీయుతంబుగ సమస్తా
గంబు గావించి భా, మనికాటాహ్యాతకుండల
ద్వయము నాత్మస్వర్ణచేలాగ్రబం, ధనము
న్వీడ్చి యొసంగ నందుకొని మోదంబంది
యా నందనం, దను దీవించుచుఁ జెంగట
న్నిలిపెఁ జంకారత్నపీఠంబునన్.

పారి. ౩. ౨౫.

చ. పెరపున జంటగైకమడి వీడ్చుటకుం గర
కంకణంబులుం, హరువుగ మోవి గాను
టకు ... (శృంగారరసమంజరి. ౨. ౬.)

౨. దొంగిలించు, ఒరులమూటలనువిప్పి వాని
లోని వస్తువులు హరించు.

చ. వెలయఁగ సొమ్ములోడ ముడివీడ్చులఁ
బట్టిన జొట్టక్రేలితోఁ, గలయఁగ బెద్దక్రే
ల్నఱికి క్రమ్మఱ నీడ్చినఁ గాలుఁజేయునుం,
జలమఱఁ దున్మి మాఁడవగుపాలి సహింపక
యూరెఱుంగఁగాఁ, వఁదొక్రాసి చంపు
టుచితంబగు నాయకులైనవారికిన్.

సి. ఖా. ప్రా. కాం. ౯౫.

**వీడ్పాటు = వీడుపాటు.** వి. (√ వీడు.) వ్యాకోచ
యము, అకటవికటము.

క. లింగంబుల వచనంబుల, భంగులు హీనాధిక
తలపాటియు వీడ్పాటుం గదిరి ననుపమ
కుశలింపుం గలుగంజేయు నంద్రు బుధు
లుచితోక్తిన్. కావ్యా. ౫. ౧౦.

సీ. కొనఁడు నానాసేవకుల సేవ లెవ్వియుఁ
గొనిన వీడ్పాటుగాఁ బనులు పనుచు.
ప్రభా. ౨. ౧౦౮.

వ. ... అప్పుడు తమ సుముఖాసక్తి మణి
స్తంభ నామధేయంబులు స్త్రీత్వంబుల
వెంబడిన వీడ్పాటుగా సంకేతింబులు చేసి
కొనిరి ... కాశీ. ౫. ౧౦౪.

వీడ్యము = వీడియము, వీడెము. వి. (క. వీళే
యవు. త. వీడై యం.) తాంబూలము.

ప. వీనుల నరసోఁకు వీడ్యంపుఁదావుల పలుక
రింపుల మేను పులకరింప. (అని. ౩. ౯౫.)

ఉ. దూరమువోయి యెండఁబడి దూపిలివచ్చిన
ప్రాణనాథునిన్, ద్వారకవాటగేహళుల
దాఁక సెమర్చొని తీర్థమార్చి యాహా
రము వెట్టి వీడ్యము సమర్పణచేసి విహార
శయ్యపై, నూరువులొత్తి చిత్తమున కు
బ్బొనరించుట ధర్మమింతికిన్.
కాశీ. ౨. ౮౧.

ద్వి. భూతి వీడ్యంబు లొప్పుగ నివేదించి ...
పంచా. పు. ౧౬౮.

వీడ్వడు = వీడుపడు. అ. క్రి. మాఱుపడు.

క. చెవులు నమ్మనిచెప్పిన, తరువులు వీడ్వ
డియె సుతకుఁ దల్లికి ...
భార. అను. ౧. ౧౧౧.

గీ. పతియు భరియించుఁగావున భర్తయయ్యె,
భామ భరియింపఁబడుఁగాన భార్యయయ్యెఁ,
బరఁగనవి మనయందు వీడ్వడియె నిన్న,
నేన యెల్లకాలము భరియింతుఁగాన.
భార. ఆది. ౨౨౪.

క. ధరణీవరాహలక్ష్మణుఁ, డరి లక్ష్మి వహింప
వచ్చునప్పుడు నగరీతరుణుల తొడవులు
వీడ్వడఁ బారిఁబోడిగడు కౌతుకంబు పొల్చ
గుఁ జూడన్. (కావ్యా. ౧. ౮౦.)

౨. తడఁబడు.

చ. తడఁబడె దివ్యబాణముల తంత్రము
మంత్రముఁ దప్పెడుం గడున్, వడఁకెడుఁ
జాపదండము మనంబును నాకు వశంబు
గాను వీడ్వడియెడుఁ జెయ్వు లంగను
గడంకదొఱంకెడు...
భార. భీష్మ. ౩. ౩౫౧.

ద్వి. పలుకులు వీడ్వడ భావంబు వెడల, తలఁ
పులు గరఁగంగఁ దన్మయత్వమున ...
ద్వి. భాగ. ౨. ౨౯. పా.

౩. భేదపడు.

గీ. పొడయు నీడయుఁబోలె వీడ్వడక మెలఁగి,
యబల కంటికిఱెప్పవై యరయవమ్మ.
విక్ర. ౪. ౧౯౮.

సీ. వికచాబ్జములతోడ వీడ్వడు కన్నుల కడలు
పైవాఱెడు కరుణఁజెలువు.
భాగ. ౬. ౩౩౩.

(ఇట ప్రతిఘటించు అని భావము.)

౪. బంధమునుండి తొలఁగు, విప్పఁబడు.

ఉ. నా సుతుఁ డింద్రజిత్తు కదనంబునఁ బన్నగ
పాశబద్ధులం, జేసిన నిగ్రహంబులకుఁ జెల్లరు
వీడ్వడనట్టి కట్టులుం, బాసి పరాక్రమించె
దరు పంక్తిరథాత్మజులు ...
భా. రా. యు. ౧౦౫౮

౫. విడిపోవు, శిథిలమగు.

సీ. అమరాగ్రణి రాజయక్ష్మధాతువులు
వీడ్వడి తాఁ బెదవులు దడుపుకొనియె.
జై. భా. ౮. ౧౪.

వీణ. సం. వి. ఆ. స్త్రీ. ౧. వీణియ, తంత్రీవాద్య
విశేషము. ౨. విద్యుత్తు, మెఱపు. (మే. ని.)

వీణము = వీణాము. వి. సన్నవస్త్రము, వలిపము, అంశుకము. (శ. ర.)

వీణాదండము. సం. వి. అ. పుం. వీణకు వెనుకగా నుండెడి కఱ్ఱ, ప్రవాళము.

వీణాము = వీణము. వి. వస్త్రము, అంశుకము.

క. పన్నీట జలకమాడెను, సన్నని వీణాము గట్టెను విఱులు దుఱిమెన్ ...
వై. భా. ౩. ౧౧.

వీణాస్యుఁడు. సం. వి. అ. పుం. నారదుఁడు.

వీణి. సం. వి. న్. పుం. వైణికుఁడు, వీణవాయించువాఁడు.

వీణె(ణౌ)య. వి. కస్తూరిమృగము యొక్క కస్తూరి యుండెడు బొడ్డుకాయ.

వ. కస్తూరి వీణెయలును బల్లి గడ్డలును ...
భల్లా. ౩. (శ. ర.)

చ. ... మంచిచొక్కపుఁ గపురంపు గిన్నియలు కస్తూరి వీణెలు రాశిగాఁగఁ గొండపొడవు దెచ్చి వైచి రచటన్.
విజ. వి. ౨. ౯౦.

వీణె(ణౌ)య. వి. (సం. వీణా) విపంచి, వాద్యవిశేషము.

క. ఏణాయత లోచన స, త్ప్రాణాయత చిత్రగాత్ర పాంచాలికలై, వాణియ యీ రూపోయన, వీణియ వాయించె నొగిఁ బ్రవీణత మెఱయన్. వైజ. ౧. ౧౧౮.

ఉ. వీణియ ముట్టుటల్ ఖగుల విరతలు పెంపుడు చిల్కబోదతో, రాణ దళిర్పఁ బల్కుట కరంబు రూపము ... కళా. ౬. ౨౧౪.

ఉ. ... చేవడి వీణ మీటుటలు చిక్కడలించు టులుకా సరింబుచున్. అము. ౧. ౬౨.

వీణెకాయ. వి. (వీణె + కాయ) వీణకుఁ గట్టెడు తుంబీఫలము.

సీ. అతివ వక్షస్స్థితి నందమొందుటఁ జేసి వీణెకాయలు కొంత వీడు వచ్చు ...
ముకుంద. ౨. ౧౦౨.

వీణెపిల్లి. వి. (వీణె + పిల్లి) కస్తూరి మృగము.
(చ. వి.)

వీతంసము. సం. వి. అ. పుం. ౧. మృగములను, పక్షులను బట్టుకొనుట కుపయోగించు త్రాడు, వల మొదలగునది. ౨. పెంపుడు జంతువుల నుంచెడు పంజరము, బోను మొదలగునది. ౩. ఆట కేర్పఱిచినచోటు (ఆ. ని.)

వీతనము. సం. వి. అ. పుం. కంఠముయొక్క పార్శ్వభాగము, కంధరాపార్శ్వము.

వీతము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. పోయినది, గతమైనది. ౨. విడిచిపోయినది, వెడలిపోయినది. ౩. నిర్బంధములేనిది, స్వేచ్ఛగా నున్నది. ౪. తొలఁగింపఁ బడినది, వినాయింపఁ బడినది. ౫. అంగీకరింపఁ బడినది, ఒప్పుకొనఁ బడినది. ౬. మచ్చిక చేయఁబడినది, శాంతమైనది. ౭. శూన్యమైనది, లేనిది. ౮. కోరఁ బడినది, అభిలషింపఁ బడినది. ౯. ధరింపఁ బడినది.

—వి. అ. పుం. యుద్ధానర్హమైన, లేక, యుద్ధమునకు సిద్ధముచేయని గుఱ్ఱము, లేక, యేనుఁగు.

—వి. అ. న. ఏనుఁగు నంకుశముతోఁ బొడుచుట, మడమతోఁ దన్నుట.

వీతశోకము. సం. వి. అ. పుం. అశోకవృక్షము.

వీతసూత్రము. సం. వి. అ. న. పవిత్ర సూత్రము, జన్నిదము.

వీతి. సం. వి. ఇ. పుం. గుఱ్ఱము.

—స్త్రీ. ౧. గమనము, గతి, పరుగెత్తుట. ౨. పుట్టించుట, ఉద్భవింపఁజేయుట.

౩. (సుఖాది) అనుభవము. ౪. తినుట. ౫. దీప్తి, ప్రకాశము. ౬. శుభ్రము చేయుట, శుద్ధి.

వీతిహోత్రుఁడు. సం. వి. అ. పుం. ౧. అగ్ని దేవుఁడు. ౨. సూర్యుఁడు.

వీతెంచు. అ. క్రి. (వీచు + తెంచు) ౧. విసరుచు వచ్చు.

క. అని యాదమఱచి పలుకఁగ, వెనుక దెసం జల్లగాలి వీతెంచిన గ్రక్కున నులికిపడి పదంపడి, హనుమంతుని దిక్కు చూచి యవ్విభుఁడనియెన్. రామా. ౭. ౪౬.

దండకము... ఉద్వేల శైత్యంబుతో గంధవ ద్గంధవాహార్భక శ్రేణి వీతెంచె. దశా. ౪. ౨౩౨.

౨. శ్రవణగోచరమగు, వినవచ్చు.

ఆ. కర్ణకర్ణ వచ్చి కావు మనాథుల, మైత్రి మను తెలుంగు లగ్గలముగ, బలములోన నెల్లఁగల యంగ వీతెంచె, నార్తి దెల్లముగ జనాధినాథ. భార. ద్రోణ. ౧. ౧౫.

శా. వీతెంచెన్ మధుమాస లక్ష్మి తరుణీ హిందోళ రాగధ్వనుల్, వీతెంచెన్ బటు మీనకేతనముతో విల్లంది పూఁదేరిపైఁ, దోతెంచెం దలిరాకుఁ గైదువుల ... పీ. శకుం. ౨. ౧౨౧.

గీ. విపిన వీధుల వీతెంచెఁ గుపితమదన, సమద భుజవతకుసుమ ధనుష్టాంకృతములు ... మను. ౬. ౨౮.

వీథి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. ౧. రథ్య, బాట, త్రోవ. ౨. శ్రేణి, పంక్తి. ౩. అంగడి, దుకాణము. ౪. ఇంటిముందటి వైపు దద్దళము, డాబా. ౫. రూపకవిశేషము, దశవిధ రూపకములలో నొకటి.

వీథిక. సం. వి. అ. స్త్రీ. ౧. వీథి, బాట. ౨. చిత్రకుడ్యము, చిత్తరువు వ్రాసిన దీర్ఘ పటము.

వీధ్రము. సం. విణ. (అ. ఆ. అ.) శుభ్రమైనది. —వి. అ. న. ౧. ఆకాశము. ౨. గాలి. ౩. అగ్ని.

వీది. వి. (సం. వీథీ.) వాడ, వీథి.

క. తదనంతరంబ రాముఁడు, మొదలగు యాదవుల కెల్ల మోదము మెఱుఁగుల్, మది మొలవఁ జక్రధరుపై, వదలక విసువీదిఁ బుష్పవర్షము గురిసెన్. ఉ. హరి. ౧. ౧౨౨.

లయగ్రాహి. వీదులను గన్మఱువు వేదుల మరుత్తరుల పాదుల సరోవర తటాదుల మణిప్రాసాదములఁ గేళిగిరిపాదములఁ దద్గత పరీవాదముల బంధుగృహ భేదములఁ గాంచెన్. రామా. ౬. ౧౧౧.

ద్వి. వేడుక మది కొదవించు వీదులును, నీడలు దోఁచు మాణిక్యవేదులును ... ద్వి. హరిశ్చ. పూ. ౧౧౧.

వీనాహము. సం. వి. అ. పుం. కప్పు.

వీని(నె)యు = వీణియ. వి. వీణ.

వ. కన్నియలన్ను చూపం బూఁదేనియలాని వీనియలయందుం బాడు నేర్పులకు మెచ్చి ... యయా. ౪. ౧౩.

(క. ర. పా. "తీనియల యందుం బాడు" ముద్రి. పా.)

వీను. వి. √విను. కర్ణము, చెవి.

చ. మునిపతి వచ్చి పూవొసఁగి మోదముతోడ భవత్ప్రియాంగనన్, వినుతి యొనర్పఁగా వినిన వీనుల మా చవిగాని మాటలన్, విన వలసెం గదా ... పారి. ౧. ౧౨౫.

క. ఆ తెలఁతియు నప్పలుకులు, వీనుల సోఁకఁ జని వాని విశ్రవు సుతుఁగాఁ, దానెఱిఁగి హీనుఁ డనక యు, హీనత కాతిథ్య మొసఁగి యుల్లని పలికెన్. ఉ. రా. ౩. ౧౦౮.

సీ. నిక్కి వీనులతోడ నెక్కి సక్కిములాడు
కరణి నున్నవి వీని ఘనభుజములు ...
మను. ౨. ౩౭.

**వీనులతేనె.** చెవులకింపు, శ్రోత్రానందము.

ఉ. వీనుల తేనెల్లైన కరియ వింతగఁ గావ్య
రసంబు గ్రోలి య, మ్మానవకోటికిం ...
నృసిం. పీఠి. ౧. ౭.

**వీనుల పండువు.** శ్రోత్రానందము.

గీ. మత్తకోకిల నిస్వన మధుర కీర, భాషణం
బులు వీనుల పండువగుచుఁ, దనరుఁ దత్పురి
నుపవనాంతరములందు ... విక్ర. ౧. ౯౩.

**వీనులు చిల్లులు వోవుట.** శ్రుతి కటువుగాఁ బలుకుట వలన చెవులు తూఁటుఁవడుట, శ్రుతి కటువుగా నుండుట.

వీనులు చిల్లులువోవ నా పొల్లుమాటలు పల్కించిన ఫలమేమి ?

**వీనులవిందు.** శ్రోత్రానందము. కర్ణోత్సవము, చెవులకింపు.

క. కందువ మాటలు సామెత, లందముగాఁ
గూర్చిచెప్ప నది తెలుఁగునకుం, బొందై
రుచియై వీనుల, విందై మఱి కానిపించు విబు
ధుల మదికిన్. మొ. రా. పీఠి. ౧౨.

ఉ. ... చుక్కరా, జోడు మొగంబు వారల
యశోధనులన్ బగదాయ చూడ్కికిన్,
వేడుక గొల్పరే వినిన వీనులవిందులు గాదె
తక్కథల్. రామా. ౭. ౧౨౯.

**వీనులకువిందు.** వి. కర్ణోత్సవము, శ్రోత్రానందము.

సీ. కడిఁది విల్లునియు చప్పుడు వీనులకు విందు
సేయు నెప్పుడటంచు సీత దలఁప ...
ఉ. రా. ౧. ౨౨.

**వీనుమిగులు.** అ. క్రి. (వీను + మిగులు) ప్రసిద్ధికెక్కు.

సీ. అర్థంబు కాశీపురాంగణంబునయందు నానా
ప్రకారమై వీను మిగులు... కాశీ. ౨. ౪౯.

**వీనులకంటి.** వి. (వీను + కన్ను) సర్పము, చక్షుశ్రవము.

ఉ. వీనులకంటి తొయ్యలియు వేల్పుచెలందియు
జక్కిమోరలేఁ, జానయు ...
అచ్చ. రా. బాల. ౧౪౪.

ఉ. ...వీనులకంటి జన్నిదము వ్రేలెడు బొజ్జ
యుఁ గల్గుగుజ్జువాఁ, డేనొనరించు కావ్య
మున కెప్పుడవిఘ్నము సేయుఁగావుతన్.
శుకస. ౧. ౧౪.

**వీనులచూపు.** వి. (వీనులు + చూపు) చక్షుశ్శ్రవము, సర్పము.

ఉ. వీనుల చూపు పెండెముఁ దవిల్చిన మంచము
కోడి కైదువుం, బూనిన ప్రాఁత వేల్పుఁ
గని పోకులఁ బోయిన వెన్నుఁ డిట్లనున్.
ఉ. హరి. ౨. ౧౩౨.

**వీనెగాజులు.** వి. బ. బాలక్రీడావిశేషము.

సీ. వీనెగాజులు పోతుటీనె గుట్టంబులు నాల్గు
కంబాలాట నట్టకోతి... హంస. ౩. ౧౪౭.

**వీపు.** వి. (ఇది సానుస్వారమని శ. ర.; ఈ క్రింది ప్రయోగములు నిరనుస్వార మనుటకు నిదర్శకములు.) పృష్ఠభాగము, వెన్ను.

క. అపన్నగ ముఖ్యులఁ దన, వీపునఁ బెట్టికొని
పఱచి విపినములు మహా, ద్వీపములు గిరులు
నిఖిల ది, క్పాల పురములఁ జూపెఁ జన
వారలకున్. భార. ఆది. ౨. ౪౪.

క. వీపెక్కరమ్ము లంకా, ద్వీపముతోఁ గూడ
నైన దేవీ నిను నే, వేపునఁ గొనిపోవుదు,
నీపతికడ కబ్ధిగడచి నిమిషములోనన్.
భా. రా. సుం. ౩౦౫.

సీ. వృద్ధ కచ్ఛపరాజు వీపంఘ్రి పీఠంబు సుర
తరంగిణి వెల్లి శిరసుపాగ... హర. ౫. ౧౯.

**వీపుగానరాడాఁగుట.** వెన్ను కనఁబడునట్లు డాఁగుకొనుట. (రహస్యముగా డాఁచికొన యత్నించియు దానిని బయలు పఱచుట.)

ఉ. తాఁ గడు వేగిరించెఁ గద తద్గతి నీవు వెఱుంగ నిగ్గునన్, లోఁగుచు వింతనుండి యిఁక లోనుగనొల్లక పట్టఁబట్టఁగా, నేఁగుచుఁ గోరు నీబలిమి నీప్సిత సిద్ధిగ వీపుగానరా, డాఁగుట దీనిపేరు నిబిడం బిది బాలికల్ల నాత్మలోన్. ప్రభా. ౫. ౧౭.

**వీపుగోల.** వి. (వీపు + కోల) వెన్నున మోఁదెడు బెత్తము.

ద్వి. మొగి బౌద్ధసమయుల ముక్కుపైఁ గత్తి, యొగిని నార్హత సమయుల వీపుగోల. పండితా. వాద. ౧౭౩. పొ.

**వీపుప్రేయు** = వెన్నునఁ జఱచు.

క. అనిబెట్టిదంబు లాడుచు, జనపతి చూడంగ సురుచి సవతికొడుకుఁ జయ్యన రెట్ట బట్టి పొమ్మని, వెనుకకుఁ బడఁద్రోసి వీపుప్రేసెన్ బెల్లుచన్. వి. పు. ౨. ౧౫.

**వీప్స.** సం. వి. ఆ. స్త్రీ. ౧. వ్యాప్తి, అంతటను వ్యాపించుట. ౨. ద్విరుక్తి, చెప్పినది మఱలఁ జెప్పుట.

సీ. ... వీప్సయో కాని పూవిలు కాని సఖునకు నాత్రేడితమొ కాని యబ్ధిజునకు ... కాశీ. ౪. ౧౯౧.

(బుధుని వర్ణనము. ఇట వీప్స అనఁగా ప్రతిబింబము అని అర్థము.)

**వీయను.** అ. క్రి. (వీ + అను) అంగీకరించు, ఒప్పుకొను.

గీ. అరిగి తండ్రికిఁ బ్రణమిల్లి యతఁడు కమ్మ, వచ్చుటలు దెల్పితే జీదువాళికోలి నలసి, యుస్నాఁడ నీకేఁగు మనుచు ననుప, నగుమొగంబున వీయని నగరు వెడలి. కువల. ౪. ౨౧౨.

**వీయపురాలు.** వి. (వీయము + ఆలు) వియ్యపురాలు, కోడలి తల్లి, అల్లుని తల్లి, కొడుకు అత్త, కూఁతురి అత్త.

ఉ. వీయపురాల వైతి గద వేయిపు; దత్తవు కొంటి వావినో, తోయజనేత్రుఁ గాంచిన వధూమణి నీ సుతఁ బెండ్లి యాడఁగా, నాయము నా కుమారునకు నర్మిలి హత్తఁగ నత్తవావిచే, నాయువు గల్గువాఁడవు నటం బ్రుడు శుభంబగు దీన వెంతయున్. విజ. వి. ౩. ౧౨౬.

**వీయమందు.** అ. క్రి. (వీయము + అందు) సంబంధము చేయు.

ఉ. ఈ వనజాత బంధుకులుఁడీ నిమివంశ్యుని తోడి బాంధవ, శ్రీవ చలింపఁ జూచుట శచీధవుఁ డీశుఁడు వీయమంది నన్నెల్ల వెలయించు. చం. రా. ౩. ౧౦౮.

**వీయము** = వియ్యము. వి. వైవాహిక సంబంధము.

సీ. ఒండొరువుల తోడ నొప్పిదంబుగ వీయమందు వారుగ నిశ్చయంబు చేసి ... దశకు. ౭. ౬౯.

**వీర.** సం. వి. ఆ. స్త్రీ. ౧. వీరునిభార్య. ౨. మగఁడును, బిడ్డలును గల స్త్రీ. ౩. మురయనెడి సుగంధద్రవ్యము. ౪. మద్యము. ౫. కలబంద. ‡. ౬. అరఁటిచెట్టు. ‡. ౭. ఉసిరికచెట్టు. ‡. ౮. కాకోల్లి. ‡.

**వీరంధరము.** సం. వి. అ. పుం. ౧. నెమలి. ౨. మృగములతోఁ బోరాటము. ౩. చర్మకవచము; తోలుచొక్కాయి.

వీరక త్తి(త్తె)యు. వి. (వీరము + క త్తియ) వియ్యపురాలు జాయాపతుల తల్లులయం దొకతె కొకతె వీరక త్తియ యగును. అల్లుని తల్లియేని, కోడలితల్లి.

గీ. కూరిమిని వీర కానికి వీరక త్తియకును దొలు
వేల్పు గొంగ యన్నకును మఱియు ...
నీలా. 3. ౮౩.

వీరకము. సం. వి. అ. పుం. కరవీరము, గన్నేరు. శ.

వీరకాఁడు. వి. (వీరము + కాఁడు) వియ్యంకుఁడు, భార్యాభర్తల తండ్రులు ఒకనికొకఁడు వీరకాఁడగును. అల్లుని తండ్రియేని, కోడలి తండ్రియేని వీరకాఁడగును.

గీ. అంతఁ గొడుకులఁ గోడండ్ర నందలముల,
నునిచికొని వీరకానిఁ దోడ్కొని చెలఁ
గుచుఁ, బంతివేరుల దారఁ త్రోవ పట్టి యరుగు,
చున్నచో నబ్బురం బొప్ప నొక్కయెడను.
అచ్చ. రా. బాల. ౧. ౧౯౮.
(చూ. నీలా. 3. ౮౩.)

వీరణము. వి. డంగురము, చర్మవాద్య విశేషము.

సీ. క్రొక్కారు మెఱుఁగు లుక్కున క్రుక్కఁ
గాఁ జేయు తెలుఁదుకల్ బంగారు వీరణ
ములు ... యయా. ౪. ౧౫౮.

గీ. సన్న వీరణముల మ్రోఁత శంఖ కాహళార్భటీ
ఢక్కా హుడుక్కారవములు ...
రా. వి. ౨. ౪౯.

వీరణము. సం. వి. అ. న. వట్టివేరు. శ.

వీరణయురుము. వి. (వీరణము + ఉరుము; వృత్తి విషయలోపము) చర్మవాద్య విశేషము.

వ. డోలు గొరు గుమ్మెత తమ్మెట వీరణ
యురుము యుంటికంటె యురుము ...
హంస. 3. ౨౯.

వీరతరము. సం. వి. అ. పుం. బాణము. —న. వట్టివేరు. శ.

వీరతరువు. సం. వి. ఉ. పుం. ౧. ఒకవిధమగు మారేడుచెట్టు, బిల్వభేదము. శ. ౨. అర్జున వృక్షము. శ.

వీరతాంబూలము. సం. వి. అ. న. వీరత్వము చూపుటకుఁ బ్రతిజ్ఞ చేసి పుచ్చుకొన్న తాంబూలము.

ద్వి. పొంగుచు వీరతాంబూలంబు గొనుచు ...
బస. పు. ౩. ౮౯.

వీరతాయెతు. మి. వి. వీరులు బిరుదుగా కట్టుకొను తాయెత్తు.

క. మగజాతి వీరతాయెతు ... చంద్ర. (శ. ర.)

వీరపట్టము. సం. వి. అ. పుం. వీరులు ధరించెడి యొకవిధమైన వేషము.

వీరపానము. సం. వి. అ. న. యుద్ధమునకుఁ బూర్వ ముద్రేకము కలిగించుటకుఁ గాని, యుద్ధానంతరము ఖేదమును బాపుకొనుటకుఁ గాని యుద్ధభటులు త్రాగెడి మద్యము.

వీరప్రసవ. సం. వి. ఆ. స్త్రీ. వీరప్రసువు.

వీరప్రసవిని. సం. వి. ఈ. స్త్రీ. వీరప్రసువు.

వీరప్రసువు. సం. వి. ఊ. స్త్రీ. ౧. వీరునిగన్న తల్లి, వీరమాత. ౨. మగశిశువును గన్నతల్లి.

వీరభద్రపళ్లెరము. మి. వి. (వీరభద్రుఁడు + పళ్లెరము) వీరభద్రునకు నైవేద్య మొసఁగెడు పెద్ద పళ్లెము.

సీ...భామవారపు వీరభద్ర పళ్లెరమిడు గృహ దైవతంబు విజ్జింకు లింక...అము. ౪. ౪౩.

భద్రపళ్లెర మిడుట, ఒకానొక శైవార్చనము.

వీరభద్రము. సం. వి. అ. పుం. ౧. అశ్వమేధ యాగమునకు పనికివచ్చు గుఱ్ఱము. ౨. వట్టి వేరు. శ.

వీరభద్రుఁడు. సం. వి. అ. పుం. ౧. శివునిచేఁ దన భటులనుండి సృజింపఁబడిన యొక మహా వీరుఁడు. ౨. ప్రసిద్ధ వీరుఁడు.

వీరమద్దియలు=వీరమద్దెలు. వి. బ. (సం. వీర మధ్యమ్) స్త్రీలు కాలి పెద్దవ్రేలిని ధరించెడు భూషణ విశేషము.

చ. తరుణుల వీరమద్దియల తాఁకునఁ జిందఱ వందలైన క్రొ, న్నురుగులతోడ శైవలము నూలుకొనంగ నితంబ పంక్తిపైఁ, బొరలుఁ దరంగరాజ విరిపూవులు వీడిన కుంతలంబులం, బరఁగు పదంబులం దెఱఁగి పైఁబడ వేర్చు విటాళి కైవడిన్.

ఉ. హరి. ౫. ౭౪.

గీ. తెలఁది మట్టెలుఁ బిల్లాండ్లు వీరమద్దియలును నందెలు మొలనూళ్లు సంగళీయ, కంకణాంగద హార తాటంక ముఖ సమస్త భూషణములు దాల్చి మార్చిమార్చి.

ప్రభా. ౪. ౧౩౭.

సీ. మట్టెలు పిల్లాండ్లు మఱి వీరమద్దియ లెలమిఁ దొడంగెఁ దొయ్యలి యొకర్తు....

యయా. ౪. ౭౯.

వీరమద్దెల. మి. వి. వాద్యవిశేషము.

గీ. సమర సంగీత వివిధ వాద్యములతోన, కలయ విడిదిలో వీరమద్దెలలు నులిసె...

కు. సం. ౧౧. ౫౧.

వీరమద్దెలు. వీరమద్దియలు.

వీరమలహరి. వి. వాద్యవిశేషము.

సీ. వేలుపుఁ బూఁబోండ్ల గేలిసేయు నొయారి చెలువలు దగ వీర మలహరులును...

యయా. ౪. ౧౫౭.

వీరము. వి. (సం. వీరః) బీరము, శౌర్యము.

చ. గురుని యుపేక్షఁ జేసి తనకుఁ సమరోద్ధతి సెల్ల దాని నీ, వెరవిఁడి గావలేఁడు దన వీరము గాఁ గొని విఱ్ఱవీఁగెడుఁ...

భార. ద్రో. ౨. ౪౯.

క. సైరంధ్రి సెప్పె నీ దగు, వీరమ్మును బెంపు లావు వెరవును మాకుఁ...

భార. విరా. ౪. ౩౪.

వీరము. సం. వి. అ. పుం, ౧. శృంగారాది నవ రసములలో నొకటి (ఇది దానవీరము, ధర్మ వీరము, దయావీరము, యుద్ధవీరము అని చతుర్విధము)

శా. వీరం బాఁడుఁ దనంబు నొందనఁగా...

హరి. ఉ. ౪. ౧౫.

౨. అగ్ని, యాగ సంబంధియైన యగ్ని. ౩. అర్జున వృక్షము. శ. ౪. కరవీరము, గన్నేరు. శ.

-న. ౧. కర్కాటశృంగి. శ. ౨. కొక్కెస. శ.
౩. తామరదుంప. ౪. మిరియము.

వీరముద్దియ=వీరముద్దె. వి. (సం. వీరముద్రికా) స్త్రీలు కాలి పెద్దవ్రేలిని ధరించెడు భూషణ విశేషము.

వ. మట్టియలు వీరముద్దియలు పాయ సట్టంబు లాదిగాఁగ యలంకారముల నలరించిరి.
నైష. ౬. ౪౪.

సీ. తళుకుఁ బిల్లాండ్లు బిబ్బిలికాయలును మట్టి యలు వీరముద్దెలు నందియలును ...
కళా. ౭. ౬౬.

వీరముద్రిక. సం. వి. అ. స్త్రీ. వీరముద్దియ.

వీరముష్టి. సం. వి. ఇ. పుం. కోమట్లను యాచించుకొని జీవించెడు ఒకతెగ భిక్షుకుఁడు.
(శ. ర. వా.)

వీరరజము. వీరరజస్సు, సిందూరము.

వీరరజస్సు. సం. వి. స్. న. సిందూరము.

వీరరాహుత్తుఁడు. వి. (సం. వి. అ. పుం.) శూరుఁడైన రౌతు.

సీ. వీరరాహుత్తుల శూరతఁ బొలియించి తురగ సంఘంబుల ద్రుంచి వైచి ...
పరమ. ౪. ౧౫౯.

వీరరేణువు. సం. వి. ఉ. పుం. భీమసేనుఁడు.
(త్రి. వి.)

వీరపట్టము. మి. వి. వీరులు ధరించు బిరుద చిహ్నము.

ద్వి. భసితంపుఁ దిలకముల్ బాసికంబులును, పసతోడి నడపులు వీరపట్టములు ...
పండితా. పర్వ. ౩౬౨. పా.

వీరవతి. సం. వి. ఈ. స్త్రీ. జీవత్ పతిపుత్త్రీ స్త్రీ, పతియుఁ బుత్త్రులు బ్రతికియుండిన స్త్రీ.

వీరవిప్లావకుఁడు. సం. వి. అ. పుం. తక్కువ జాతివారినుండి సంపాదించిన ద్రవ్యముతో యజ్ఞముచేయు బ్రాహ్మణుఁడు.

వీరవృక్షము. సం. వి. అ. పుం. అర్జునవృక్షము. శ. ౨. నల్లజీడిచెట్టు. శ.

వీరసువు. సం. వి. ఊ. స్త్రీ. ౧. వీరమాత. పుత్త్రినిగన్న తల్లి.

వీరసేనుఁడు. సం. వి. అ. పుం. నలచక్రవర్తి తండ్రి.

వీరసైన్యము. సం. వి. అ. న. వెల్లుల్లి. శ.

వీరస్కంధము. సం. వి. అ. పుం. ఎనుఁబోతు.

వీరహుఁడు. సం. వి. న్. పుం. నిత్యాగ్నిహోత్రమును మానివేసిన బ్రాహ్మణుఁడు.

వీరాణము. వి. వీరణము. (శ. ర.)

వీరామ్లము. సం. వి. అ. పుం. అమ్లవేతసము. ఎఱ్ఱగోఁగు, పుల్లగోఁగు. శ.

వీరాశంసనము. సం. వి. అ. న. ౧. భయంకరమైన యుద్ధభూమి. ౨. కావలి యుండుట. ౩. నిరాధారమైన యాశ. (విశ్వము.)

వీరాసనము. సం. వి. అ. న. ౧. రోగులు మున్నగువారు కూర్చుండెడి తీరులలో నొకటి. ౨. ఒక తొడమీఁద రెండవపాదమునుంచి,

మఱియొక కాలిక్రింద మఱియొకపాదము నుంచి కూర్చుండుట.

**వీరిఁడి.** వి. అవివేకి, మూర్ఖుఁడు. ప్రాచీనరూపము వీఱిఁడి.

క. కూరలు పెరుగును మెసవెడు, వీరిఁడికిఁట మోక్షపదవి వినరా వేమా.

వేమ. 3. ౨౨౨.

—విణ. వివేకరహితము, మూర్ఖము.

ఉ. వీరిఁడి మాటలేల వినవే యలవాఁడె కళింద కన్యకా, తీరమునన్ వసించి ...

రాజ. చ. 3. ౫౨.

**వీరుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. వీరరసప్రధానుఁడగు నాయకుఁడు. (దాన, దయా, ధర్మ యుద్ధవీరులు అని నాల్గు తెఱఁగుల వీరులు), ౨. ధైర్యము గలవాఁడు. 3. శౌర్యము గలవాఁడు. ౪. శ్రేష్ఠుఁడు. ౫. కులాచార సంపన్నుఁడు.

—వి. అ. పుం. ౧. యోధుఁడు. ౨. నటుఁడు. 3. సూర్యుఁడు. ౪. భర్త. ౫. పుత్త్రుఁడు. ౬. జినదేవుఁడు. ౭. విష్ణుమూర్తి.

**వీరుధ.** సం. వి. ఆ. స్త్రీ. వీరుధము.

**వీరుధము.** సం. వి. ధ్. స్త్రీ. ౧. విశేషముగా నల్లుకొనెడి తీఁగె. ౨. పొద, గుల్మము. 3. కొమ్మ, చిగురుఁగొమ్మ. ౪. నఱికిన తర్వాత చిగిర్చిన చెట్టు.

**వీరువారు.** స. బ. (వీరును + వారును) సామాన్యులు.

వ. ... గానలోభంబున వచ్చుటెంతియు కాని మఱి వీరు వారునుంబలెఁ బట్టణంబుల నెట్టుకొని యిట్టునట్టు మహిమలు ప్రచరించు వారము కాము. కళా. 3. ౪౧.

**వీరేశుఁడు.** (వీరేశ్వరుఁడు) సం. వి. అ. పుం. ౧. కాశీపురమునఁగల శివుని యర్చావతార భేదము. ౨. వీరులలో శ్రేష్ఠుఁడు.

**వీర్యము.** సం. వి. అ. న. ౧. వీరధర్మము, శౌర్యము, పరాక్రమము. ౨. బలము. 3. పుంస్త్వము. ౪. ధైర్యము. ౫. శక్తి, సామర్థ్యము (తపోవీర్యము). ౬. మందుయొక్క మంచిగుణము. ౭. శుక్లము, రేతస్సు.

**వీఱిండితనము.** వి. అవివేకత, బుద్ధిహీనత.

ఉ...ఏ, నొండొకరుండనే పలుక కూరక నేరక యుండఁజేయు వీఱిండితనంబుచేత నిసి యింతలువాఱెడిఁ జిత్తమిప్పుడున్.

ఉ. హరి. ౪. ౧౪౯.

**వీఱిఁడి.** విణ. ౧. అవివేకి, బుద్ధిలేనివాఁడు,—లేనిది.

ఉ.... వీఱిఁడియైన మానిసికి నెండి వివేకము గల్గనేర్చునే ... భార. ఉద్యో. 3. ౧౦౩. (వెఱిఁడి. శ. ర. పా.)

ఉ. వీండె ఖలుండు దత్తుఁడను వీఱిఁడి పాఱుఁడు ... కు. సం. ౨. ౭౪.

౨. పెట్టిది.

చ. వినమె యెఱింగియున్ మఱియు వీఱిఁడి మాటలు వేయు నేటికిన్.

భార. కర్ణ. ౨. ౭౪.

ఉ. వీటేఁడిచూపులుఁగా గుబుచవీఘను...
దశకు. ౧౦. ౬౪.

ఉ.... క్రూరుఁడు మారుఁడేనియుం, బీరము నిూఱ నేయఁ డొకపెట్టున నెట్టినఁ బోవ నట్టి యా, వీటేఁడిజీవ మేటి కని వేమరు వేమరు వేచుచుండఁగన్.
కృ. శకుం. ౨. ౨౧౧.

వీలు = వ్రీలు. అ. క్రి. ౧. చీలు, పగులు.

ఉ. కూలఁబడెం దిశల్ కుధరకూటము లుర్వికి రాలె నేల పాతాళముదాఁక వీలె జలద ప్రకరోదరముల్ చిరిఁగె...
రామా. ౭. ౬౧.

౨. తగ్గు, క్షీణించు.

రగడ... వీలకొలఁ పమరె నరవిందములఁ గుంద ముల, లీలఁ దలుకొత్తఁగ మిళిందముల డెందముల... రాఘ. ౨. ౬.

ఉ. నెట్టనరేయినిం బగలు నేరమిపెట్టునటంచు వేలుపుల్, వెట్టియఁ గొట్టముల్ చలున వీలనిచే బలువొప్ప నొక్కఁడుఁగా, బట్టము గట్టుకొన్న వృషపర్వుని కూఁతుఁగ....
యయా. 3. ౪౫.

3. తూలిపోవు.

చ. కనుఁగవ సత్రుపూరములు క్రమ్మఁగ నీడిం కాక పక్షముగా, వెనుకకు నీల వైస్వరస వేదా నిల్వఁగలేక చేడ్చుచున్...
శి. పు. ౨. ౧౭.

౪. ఉపయోగపడు, పనికివచ్చు.

ఉ. నేలకు కొలజిత్ప్రముఖ... లు మున్న కపరాకు గావతిం, గూలిరి రక్తధారలు బుగుల్కొన లక్ష్మణుమోల... (జై. భా. ౬. ౧౯౪.)

౫. అనుకూల్యము.

ద్వి. కాఁపుగేస్తులబోటు గడితలతేజు, ధరాప వాసన మేలుతోడవుల వీలు.
ద్వి. తి. సా. ౧. 3. శా. ౮. పం.

విఠ. అనుకూలము.

వ్యవ. ఆ పని వీలుగా లేదు.

వీలుకొను. అ. క్రి. (వీలు + కొను.) అనుకూల్యము నొందు, అతిశయించు.

సీ. తమ్ముఁ బెడఁబాసి వసుధాసుధాకరాస్య, క్రొత్తవలపంటి ననవింటి కొమరువంటి, నీటుకాఁడైన యల తిప్పనృపలిఁ జేర, విరహగరిమంబు తమయందు వీలుకొనఁగ.
కువల. ౧. ౩౧.

వీలుపడు. అ. క్రి. (వీలు + పడు.) అనుకూల మగు, సరిపడు.

వ్యవ. ఆ కార్యము చక్కఁజేయుటకుఁ బ్రయ త్నించితిని గాని యది వీలుపడదయ్యెను.

వీవధము. సం. వి. అ. పుం. ౧. కావిడి. ౨. భారము, బరువు. 3. పెద్దవరి. ౪. బాట, మార్గము.

వీవధికుఁడు. సం. వి. అ. పుం. ౧. కావటివాఁడు, కావడిమోయువాఁడు. ౨. చిల్లరసరకుల నమ్ము వాఁడు, సామాన్యవర్తకుఁడు.

వీవన. వి. (✓ వీచు.) విసనకఱ్ఱ.

గీ. అనుచు వెతనొంది ఏకసుని సానసంబుఁ, జూచి యడలూన భాషించె సుందరాంగి, భ్రాంతిమై ... ... సారసంబు, ... ... ...
కృ. శకుం. 3. ౧౦3.

సీ. నిద్దంపు నెత్తంపు నద్దియల్ సవరించి పలి గారిగాడ్పు వీవనలు వైచి.
అచ్చ. రా. అయో. ౧౦౪.

సీ. ఘనరతిశ్రమజాత ఘర్మాంబు లార్పంగ నతివకు వీవన వగుదుగాక.
భా. రా. కిష్కి. ౫౯.

వీవని. = వీఁగని. క్షీణింపని, పూర్ణమయిన.

**వీవలి.** వి. (√ వీచు.) గాలి, వాయువు.

చ. విటపసమృద్ధభూజముల వీవలులన్ విరులన్ మరందలి, ట్పటలి వియత్ప్రదేశమునఁ బఱ్ఱులు వారిమరాలమండలం బెటువలె... వేం. పంచ. ౨. ౧౭౪.

చ. అల నగరాదిమాళిసరసాగ్రణులెంచఁ జరించు చల్లవీవలి తను భృంగకోటి గొలువన్ విటనేతయానంగ సొంపుమై, నలరెడి పద్మినీ తతుల యందపుఁదావులు సెంది చుబ్బుచుం, గులుకుఁజిగుర్చుఁ గన్నెలతకూనల మేల్వల పూని చొక్కుచున్. (చంద్రి. ౧. ౧౦౬.)

ద్వి... కువలయేక్షణలు, తావుల కొండసెత్తావి వీవలలు, వీవవీవనలొయ్య వీవ నాచెంత. ద్వి. పరమ. ౩. ౧౯౩. పా.

**వీవలిచెలి.** వి. (వీవలి + చెలి.) అగ్ని, వాయుసఖుఁడు.

క. వీవలిచెలి పనిచిన ముక్తావళితో విభుని వక్షమలరారెన్ హారావిసరప్రతిఫలన, శ్రీవిలసిత కనకధరణిభృత్తటిపోల్కిన్. చంద్రి. ౬. ౪౧.

**వీసబడి.** వి. (వీసము + బడి.) గ్రామమునందు భాగప్రకారము గలిగిన భూస్వాతంత్ర్యము. (శ. ర., వా.)

**వీసమంత.** విశే. (వీసము + అంత.) మిక్కిలి కొంచము.

పంచచామరము. ఇసీయుసీ మొగంబుసూడ కిల్లు వెల్వరించినన్, వెస న్విసింగిపోవు సిగ్గు వీసమంత లేదు ... విప్ర. ౪. ౫౯.

ద్వి. వెదకుచు నొక్కచో వీసమంతయును, వాసక్తిలేక సాయంగేహములగుచు, భావిల్లుచుండిరి ... (పరమ. ద్వి. ౧. ౪౭. పా.).

ఆ. కుకవికీటములకు సుకవి కావ్యములోన, వెమక వీసమంత సెరసులేదు. ప్రబోధ. ౧. ౩౦.

**వీసము.** వి. ౧. రూకలోఁ బదునాఱవభాగము.

గీ. గ్రహణసంక్రమణాదుల రాచెసగరఁ, గాకు వీసంబు వెడలమి గ్రాసమునకు, నాధివెట్టిరి క్షేత్రంబులందుఁ గొన్ని.... మనుచ. ౩. ౧౨౯.

చ. వెలుపలవడ్డి కిచ్చినను వీసము వచ్చును సట్టులాయెనో.... . శుక. ౨. ౫౪౯.

వ....మదాంధుండనై యల్పవిద్యాలబ్ధి విడువ ముడువ వేసరని వీసంబుగల రెడ్డియుం బోలె ... ఆము. ౪. ౪.

౨. ఒకదానిలోఁ బదునాఱవభాగము, మిక్కిలి తక్కువ భాగము.

వ...పోంకమోపున వీసాలు ౨....కొలుమ భండి వీసాలు ౨. ... (ద. శా. ౯౩౫.)

సీ. వానరాజుతోడ ధీమంతు లూహరొయనర్చి చెప్పిన వీసంబు తప్పకగునె. రా. వి. ౨. ౧౧.

గీ. బాలతనుకాంతితో సాటి పోలఁగోరి, పృథ్వి ననలప్రవేశంబు పెక్కుమార్లు, చేసి యొఱపులఁబడెఁగాని వీసమైనఁ, బోలఁగాఁ జాలదయ్యె జాంబూనదంబు. రసి. ౨. ౧౦౫.

గీ....వీసమంతటి మాత్రంబు వెలితి స్రష్ట. కాళ. ౬. ౨౪౪.

**వీసరపడు.** అ. క్రి. (వీసర + పడు.) వెలితిపడు, కొఱఁతపడు, వీసరవోవు. (శ. ర.)

**వీసరపుచ్చు.** స. క్రి. (√ వీసరపోవు.) వెలితి పడఁజేయు.

ఉ. సత్యవతీతనూభవనృశంసత భీష్మునిఁ గుంభజన్ము నాదిత్యకుమారు నారఁక వధించితి రాజ్యరమావిభూతి కాద్యత్యముతోడు తన్ సమరధర్మము వీసరపుచ్చి వంచ, కృత్యజమైన యీనిబిడకిల్బిష మేమిటఁ జక్కనయ్యెడున్. (జై. భా. ౧. ౫౬.)

వ. వదనమదిరామోదంబునం దదీయ దుర్వా
సన వీసరవుచ్చుం గర్ణంబునఁ బిసపిసనసమ
శరమంత్రంబు చెప్పి. (ప్రబోధ. ౩. ౫౧.)

**వీసరపో(వో)వు.** అ. క్రి. వెడలిపడు, తగ్గు.

ఆ. ఈఁగ కాలియంతయేనియు వీసరపోవ
కుండ ధర్మమున నడచి, రయ్య దొంటి
రాజుల క్రోధకామ ప్రయుక్తదండధరణ
మొప్పఁగాక. (భార. శాం. ౨. ౩౩౫.)

మ... పాంచాలీమానంబు నీ, సరపోకుండఁగఁ
గాచినట్టి హరికిన్ సర్వంసహాభర్తకున్,
గరుణావార్ధికిఁ గృష్ణమూర్తికి నమస్కా-
రంబు గావించెదన్. శేష. ౪. ౭౦.

సీ. కోరి లీలాగేహకుడ్యభాగంబుల వ్రాయుడు
రమ్మహీశ్వరునిమూర్తి, వ్రాసి కన్యాత్వ
గారము వీసరవోవ దర్శింతు రనురాగతరళ
దృష్టి. నైష. ౧. ౭౦.

వ... అ పువ్వుదండ గ్రక్కునఁ గ్రమ్మఱించి
విసరి కేసరంబులు వీసరవోవ, మకరందంబు
చిందఁ బోకలు విఱుగం బుచ్చొడి సడలం...
హర. ౬. ౧౯.

ఉ. నీ సుగుణత్వమున్ జెలువు నేర్పును నెచ్చెలు
లెల్లఁ జెప్పఁగా, వీసరవోని మోహమున
వీనులవిందుగ విందు...(సారం. ౨. ౫౮.)

సీ. విధిమార్గ మొక్కింత వీసరవోకుండ, సర్వ
వేదార్థక్రియాకలాప, ... ...
హర. ౪. ౫౫.

**వీసర(ము).** ... (... + ...) వెలిసి, ...

చూ: వీసరపోవు.

**వీసె(సియ).** వి.[1] ఉన్మానవిశేషము, పలువది
పలములు. (శ. ర., వా.)

**వీసెలు.** వి. బ. భక్ష్యవిశేషము.

వ. కుడుములు దోసెలు వీసెలు రొట్టెలు...
ఆదిగాఁగల భక్ష్యంబులు.
హంస. ౧. ౧౦౫.

# వు.

**వు.** అప. ౧. ఉదంతములైన నామపదముల
మీఁదను గోశబ్దముమీఁదను ప్రథమైకవచన
మున వచ్చు ప్రత్యయము.

ఉదా. కృష్ణుడు, ధేనువు, మధువు, గోవు, మొ.
౨. ఉదంతనామపదములమీఁద ప్రథమా
బహువచనాది ప్రత్యయములకు వికల్పముగను,
గోశబ్దమునకు నిత్యముగాను వచ్చు నాగమము.
ఉదా. తరు(వు)లు, గురు(వు)లు, బాహు
(వు)లు, మొ. గోవులు.

౩. ధాతువులపై వచ్చు మధ్యమపురుషైకవచన
ప్రత్యయము. ఇ, ఈ, ఐలమీఁద నున్నప్పుడు
దీని యుత్వ మికారమగును. కొన్నియెడల ఈ
ప్రత్యయము లోపింపను వచ్చును.

క. ఎదురున్నరూపు వలుకఁగఁ, దుదిఁగట్టకటఁ
బడవు నీవు...
భార. ఉద్యో. ౧. ౩౬౩.

సీ. భావధ్వనివ్యంగ్యసేవధిగాఁగఁ జెప్పితివి
సత్యావధూ ప్రీణనంబు. (ఆము. ౧. ౧౩.)

క. మ మ్మెఱుఁగు చెదిరి నెఱుఁగుదు......
భార. ఉద్యో. ౩. ౩౪.

క. ... ... ... బాపి
తీవు... ఆము. ౧. ౩౩.

౪. ప్ర...మయిన యుష్మద్విశేషణము
నకు వికల్పముగవచ్చు సంత్యాగమము.

క. బాలసఖుండవు నాకును...
భార. ఉద్యో. ౧. ౩౭౮.

చ. సుగుణవు పుట్టినింటికిని జొచ్చినయింటికిఁ
దేజమొక్కఁగాఁ, దగుచరితంబునన్ నడచు
ధన్యవు. (భార. ఉద్యో. ౩. ౨౦౩.)

**వువూర్షువు.** సం. విణ. (ఉ.) వరింప నిచ్ఛగించిన
వాఁడు, ఎన్నుకొనఁగోరినవాఁడు.

**వృక్షరుహా.** సం. వి. ఆ. స్త్రీ. ౧. బదనిక. ౨. లతావిశేషము.

**వృక్షవాటి.** సం. వి. ఈ. స్త్రీ. ఉపవనము, చెట్లతోఁపు.

**వృక్షవాటిక.** సం. వి. ఆ. స్త్రీ. = వృక్షవాటి.

**వృక్షశాయిక.** సం. వి. ఆ. స్త్రీ. ఉడుత.

**వృక్షాంఘ్రి.** సం. వి. ఇ. పుం. వృక్షమూలము, చెట్టువేరు.

**వృక్షాదనము.** సం. వి. అ. పుం. ౧. వడ్రంగియులి, విదారణము. ౨. గండ్రగొడ్డలి. ౩. రావిచెట్టు. ౪. ప్రియాలవృక్షము.

**వృక్షాదని.** సం. వి. ఈ. స్త్రీ. బదనిక.

**వృక్షామ్లము.** సం. వి. అ. పుం. ౧. మారేడు చెట్టు.—న. చింతపండు.

**వృక్షాశ్రయి.** సం. వి. న్. పుం. ౧. ఒకజాతి చిన్నగుడ్లగూబ. ౨. పక్షి. . . .

**వృక్షోత్పలము.** సం. వి. అ. పుం. కర్ణికారము, కొండగోఁగుచెట్టు.

**వృజనము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. కుటిలము, వంకరయైనది. ౨. నశ్వరము, నశించు స్వభావముగలది.—వి. అ. పుం. ౧. కెంద్రుక. ౨. ఉంగరములవలెఁ జుట్టుకొనిన జుట్టు, అరాళకేశము.—న. ౧. పాపము. ౨. దుఃఖము. [illegible]
౫. బలము. ౬. యుద్ధము, పోరు.

**వృజినము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. వంకరయైనది, వక్రము. ౨. దుష్టము, చెడ్డది, పాపముగలది.— వి. అ. పుం. ౧. కెంద్రుక, ఉంగరమువలెఁ జుట్టుకొనిన జుట్టు.—పుం., న బాధ.—న. ౧. పాపము. ౨. ఎఱ్ఱనితోలు.

**వృజినుఁడు.** సం. వి. అ. పుం. దుర్మార్గుఁడు, దుష్టుఁడు.

**వృతము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. వరింపఁబడినది, ఎన్నుకొనఁబడినది. ౨. ఆచ్ఛాదింపఁబడినది, కప్పఁబడినది. ౩. దాఁచఁబడినది. ౪. ఆవరింపఁబడినది, ఆవరణచేయఁబడినది. ౫. అంగీకరింపఁబడినది, ఒప్పుకొనఁబడినది. ౬. అద్దెసఁ దీసికొనఁబడినది. ౭. చెఱుపఁబడినది. ౮. సేవింపఁబడినది. ౯. మాన్పుగలుగఁజేయఁబడినది. ౧౦. వలయాకారము గలది, వర్తులము.

**వృతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. వరించుట, ఎన్నుకొనుట. ౨. దాఁచుట, కప్పుట. ౩. అడుగుట, వేఁడికొనుట. ౪. ప్రార్థన. ౫. ఆవరించుట, చుట్టువాఱుట. ౬. ఆవరణము, కంచె, ప్రాకారము.

**వృతింకరము.** సం. విశే. (అ. ఈ. అ.) ఆవరించునది, చుట్టువాఱునది.—వి. అ. పుం. వికంకతము, కానరేను. ‡.

**వృత్తకర్కటి.** సం. వి. ఈ. స్త్రీ. కర్బూజ. ‡.

**వృత్తగంధి.** సం. వి. ఇ. న. (వృత్తముయొక్క లేశముగలది.) ఒకవిధమగు గద్యము.

శ్లో. భవత్యుత్కలికాప్రాయం సమాసాఢ్యం
దృఢాక్షరం,వృత్తైకదేశసంబంధాత్ వృత్త
గంధి పునః స్మృతమ్. (వాచ.)

**వృత్తచూడుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) కేశఖండనసంస్కారము జరిగినవాఁడు.

(ఇశ్లో: వృత్తచౌలుఁడు.)

**వృత్తతండులము.** సం. వి. అ. పుం. యావనాళము, జొన్న. ‡.

**వృత్తపుష్పము.** సం. వి. అ. పుం. ౧. వానీరము, ప్రబ్బలిచెట్టు. ౨. శిరీషవృక్షము, దిరిసెన

చెట్టు. ౩. కదంబచెట్టు, కడిమిచెట్టు. ౪. కుబ్జకము, గులాబిచెట్టు. ౫. ముద్గరము, పుష్పవృక్షవిశేషము.

**వృత్తఫలము.** సం. వి. అ. పుం. ౧. రేగుచెట్టు. ౨. దాడిమవృక్షము.—న. మిరియము.

**వృత్తబీజము.** సం. వి. అ. పుం. ౧. కంకి. ?. ౨. బెండ. ?.

**వృత్తము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. ఉన్నది, స్థితము. ౨. సంభవించినది, తటస్థమైనది. ౩. ముగిసినది, సమాప్తమైనది. ౪. చేయఁబడినది, ఆచరింపఁబడినది. ౫. కడచినది, అతీతము (కాలము). ౬. గుండ్రమైనది. వలయాకారమైనది. ౭. చెడిపోయినది. ౮. దృఢమైనది, ౯. పఠింపఁబడినది, చదువఁబడినది. ౧౦. పుట్టినది, ఉద్భవించినది. ౧౧. ప్రఖ్యాతమైనది, ప్రసిద్ధికెక్కినది. ౧౨. ఆవరింపఁబడినది, కప్పఁబడినది. ౧౩. వెనుకకు మరిగినది, మరలినది.

వి. అ. పుం. తాఁబేలు.—న. ౧. సంగతి, వృత్తాంతము. ౨. చరిత్రము. ౩. వర్తమానము. ౪. జీవనపద్ధతి. ౫. ప్రవర్తనము, నడవడి (సద్వృత్తము, దుర్వృత్తము.) ౬. పూర్వాచారము. ౭. వలయము. ౮. పద్యభేదము.

**వృత్తాంతము.** సం. వి. అ. పుం. ౧. సంగతి, జరిగినపని. ౨. వర్తమానము, ౩. చరిత్రము, కథ. ౪. విషయము, ప్రసంగము. ౫. విధము, రకము. ౬. పద్ధతి, ప్రకారము. ౭. అవసానము, తఱి. ౮. స్థితి, అవస్థ. ౯. మొత్తము, వెరసి, సముదాయము. ౧౦. విశ్రాంతి, తెఱపి. ౧౧. ఏకాంతస్థితి. ౧౨. గుణము, స్వభావము.

**వృత్తానుపూర్వము.** సం. విశ. (అ. ఆ. అ.) ఆఁదోకగాను గుండ్రముగాను యున్నది.

**వృత్తానువర్తి.** సం. విశ. (న్. నీ. న్.) విధేయుఁడు, చెప్పినట్లు చేయువాఁడు.

**వృత్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. ఉనికి, ఉండుట. ౨. నివసించుట. ౩. బ్రదుకు, జీవనము. ౪. అవస్థ, స్థితి. ౫. వ్యాపారము, పని. ౬. పద్ధతి. ౭. స్వభావము, నైజము. ౮. వ్యాపారము, ఉద్యోగము, జీవనపద్ధతి. ౯. జీవిక. ౧౦. వేతనము, కూలి. ౧౧. (వేదాంత) అంతఃకరణపరిణామము. ౧౨. సత్ప్రవర్తనము, మంచినడవడి, ప్రవర్తనము, నడవడి. ౧౩. వ్యాఖ్య, టిప్పణి. ౧౪. చుట్టుతిరుగుట. ౧౫. పరిధి, వస్తువులచుట్టుకొలత. ౧౬. (వ్యాక) సమాసాది. (కృత్తు, తద్ధితము, సమాసము, ఏకశేషము, సనాద్యంతధాతువు అని పంచవిధములు.) ౧౭. శబ్దశక్తి (అభిధ, లక్షణ, వ్యంజన అని త్రివిధము.) ౧౮. కావ్యరచనావిశేషము, కైశిక్యాది. (కైశికి, ఆరభటి, భారతి, సాత్త్వతి అని చతుర్విధము.) ౧౯. సంగీతసాంప్రదాయమున వచ్చు వాద్యము. ౨౦. ఆలోచన, అభిప్రాయము.

**వృత్తికర్శితుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) జీవిక (జీవనాధారము) లేక బాధపడెడివాఁడు.

**వృత్తిచ్ఛేదము.** సం. వి. అ. పుం. జీవికచెడఁగొట్టుట, జీవనాధారము పోఁగొట్టుట.

**వృత్తిస్థము.** సం. వి. అ. పుం. తొండ, ఊసరవిల్లి.

**వృత్తిస్థుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. వృత్తిలోనున్నవాఁడు, మంచిస్థితియందున్నవాఁడు. ౨. మంచి నడవడిగలవాఁడు.

**వృత్తౌజ(స, స్క)ము.** సం. విశ. స్. ౧. బలముగలది. ౨. బీజశక్తి నశింపనిది.

**వృత్త్యనుప్రాసము.** సం. వి. అ. పుం. ఒకవిధమైన శబ్దాలంకారము. (ఒకటిగాని, రెండు

## వ్రూ

**వ్రూర్ణము.** సం. విణ. (అ. ఆ. అ.) వరింపఁబడినది, ఎన్నుకొనఁబడినది.

## వృ

**వృంతము.** సం. వి. అ. న. ౧. ఆకు, పువ్వు మొదలగువాని తొడిమ. ౨. జొన్నకొమ్మ. ౩. చూచుకము, చేనుమొన.

**వృంతాకము.** సం. వి. అ. పుం. వంగచెట్టు. న. వంగకాయ.

**వృంతాకి.** సం. వి. ఈ. స్త్రీ. వంగచెట్టు.

**వృంతిక.** సం. వి. ఆ. స్త్రీ. చిన్నకొండ.

**వృకదంశము.** సం. వి. అ. పుం. కుక్క.

**వృకధూపము.** సం. వి. అ. పుం. ౧. కర్పూరతైలము. ౨. అనేకవస్తువులు కలసిన పరిమళద్రవ్యము.

**వృకధూర్తము.** సం. వి. అ. పుం. సృగాలము, నక్క.

**వృకము.** ౧. తోడేలు. ౨. సింగి. ౩. నక్క, సృగాలము. ౪. కాకి. ౫. గుడ్లగూబ. ౬. కర్పూరతైలము. ౭. అనేకసుగంధద్రవ్యములు కలసిన వస్తువు. ౮. అగిసెచెట్టు. ౯. జఠరాగ్ని. ౧౦. నాఁగలి.

**వృకారాతి.** సం. వి. ఇ. పుం. కుక్క.

ఇట్లే: వృకారి.

**వృకుఁడు.** సం. వి. అ. పుం. ౧. దోఁచుకొను వాఁడు, దొంగ. ౨. క్షత్రియుఁడు. ౩. వృకాసురుఁడు.

**వృకోదరుఁడు.** సం. వి. అ. పుం. ౧. బ్రహ్మ. ౨. భీముఁడు, కుంతీసుతమధ్యముఁడు.

**వృక్క.** సం. వి. ఆ. స్త్రీ. ౧. హృదయము, గుండె. ౨. మూత్రపిండము, మూత్రముచేరెడు కడుపులోనుండు మాంసగ్రంథి.

**వృక్కము.** సం. వి. అ. పుం. = వృక్క.

**వృక్ణము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఖండింపఁబడినది, నఱకఁబడినది. ౨. చీల్పఁబడినది. ౩. పగులఁగొట్టఁబడినది.

**వృక్తము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. శుద్ధము చేయఁబడినది. ౨. పఱవఁబడినది, వ్యాపింపఁజేయఁబడినది.

**వృక్షకము.** సం. వి. అ. పుం. ౧. చిన్నచెట్టు, మొక్క. ౨. చెట్టు, వృక్షము. ౩. కుటజము, కొడిసెచెట్టు.

**వృక్షకుక్కుటము.** సం. వి. అ. పుం. అడవికోడి.

**వృక్షచరము.** సం. వి. అ. పుం. శాఖామృగము, కోఁతి.

**వృక్షచ్ఛాయ.** సం. వి. ఆ. స్త్రీ. చెట్టునీడ.

**వృక్షచ్ఛాయము.** సం. వి. అ. న. పెక్కుచెట్ల నీడ, దట్టమైన నీడ.

**వృక్షధూపము.** సం. వి. అ. పుం. ౧. కర్పూరతైలము. ౨. దేవదారువృక్షము.

**వృక్షనాథము.** సం. వి. అ. పుం. రావిచెట్టు.

**వృక్షభిదము.** సం. వి. ద్. స్త్రీ. గొడ్డలి.

**వృక్షభేది.** సం. వి. న్. పుం. ౧. గండ్రగొడ్డలి. ౨. ఉలి.

**వృక్షమర్కటిక.** సం. వి. ఆ. స్త్రీ. ఉడుత.

**వృక్షము.** సం. వి. అ. పుం. చెట్టు.

గాని మూఁడుగాని వర్ణములు ఉద్యమమున మరల మరల వచ్చినచో వృత్త్యనుప్రాసము.)

ఉ. చొక్కపుటుక్కు క్రిక్కిఱిసి క్రుక్కక పెక్కువ నక్కజంపుట, స్నెక్కక...

కావ్యా. ౬. ౧౬.

**వృత్త్యుపాయము.** సం. వి. అ. పుం. జీవనోపాయము, జీవనాధారము.

**వృత్రము.** సం. వి. అ. పుం. ౧. మేఘము. ౨. చీకటి. ౩. ధ్వని. ౪. చక్రము. ౫. పర్వతవిశేషము. (మే. ని.)

**వృత్రశత్రువు.** సం. వి. ఉ. పుం. ఇంద్రుఁడు.

**వృత్రద్వి(ట్టు)షుఁడు.** సం. వి. ష. పుం. ఇంద్రుఁడు, వృత్రశత్రువు.

**వృత్రహుఁడు.** సం. వి. న్. పుం. ౧. వృత్రాసురునిఁ జంపినవాఁడు, ఇంద్రుఁడు.

**వృత్రుఁడు.** సం. వి. అ. పుం. ౧. ఇంద్రునిచేఁ జంపఁబడిన యొక రాక్షసుఁడు. ౨. శత్రువు.

**వృథపుచ్చు.** స. క్రి. (√ వృథపోవు.) వ్యర్థపఱుచు, నిరాశ చెందించు.

క. ఇచ్చునది ధనము పాత్రున, కచ్చుగ నొరు వేఁడకుండునది యభిముఖులై, వచ్చిన యాశార్థుల వృథపుచ్చక చేయునది సర్వభూతప్రీతిన్. (భార. ఆది. ౩. ౩౦౪.)

సీ. అంగదనర్థించినట్టి యభ్యాగతు వృథపుచ్చ కొకజాడఁ బ్రీతిఁదనిపి.

విజ్ఞా. ప్రా. కాం. ౧౪౦.

**వృథపోవు.** అ. క్రి. (వృథ + పోవు.) వ్యర్థమగు.

ఆ. వినుఁడు పడుచులార వృథపోదు నామాట...

వరాహ. ౧౧. ౮౦.

**వృథా.** సం. అవ్య. (దీనికి తెనుఁగున హ్రస్వాంతరూపము గానవచ్చుచున్నది. చూ: వృథపుచ్చు, వృథపోవు.) ౧. వ్యర్థముగా, నిష్ప్రయోజనముగా, నిష్ప్రయోగముగా. ౨. అనావశ్యకముగా. ౩. తప్పుగా, అనర్హముగా. (ఇది విశేషణార్థమందును బ్రయుక్తమగును.)

ద్వి. బలిగులై తమదృష్టిఁబడువారినెల్ల, జలజసంభవ వృథా చంపుచున్నారు.

రం. రా. బాల. ౪౦. పా. ౧. పం.

చ. తరుణుల కౌఁగిట న్ననుచు తమ్ము వృథా విరులెత్తిచేసె మోహపరులుగఁ జైత్రుఁడంచు.

ఆము. ౫. ౧౨౬.

శా. ఏలా చేసితి దుష్ప్రతిజ్ఞ యిఁకఁ జండీశానహోద్దండ మీ, బాలుం డెక్కుడఁజాలకుండిన వృథా పంపింపఁగా నేర్తునే,...

వసు. ౭. ౧౯౫.

**వృథాకథ.** సం. వి. ఆ. స్త్రీ. వ్యర్థసంభాషణము.

**వృథాట్య.** సం. వి. ఆ. స్త్రీ. వ్యర్థముగాఁ దిరుగుట.

**వృథామతి.** సం. విణ. (ఇ.) వ్యాకులబుద్ధి గలవాఁడు.

**వృథామాంసము.** సం. వి. అ. న. దేవతోద్దేశముగాని పితృదేవతోద్దేశముగాని లేకయే చంపఁబడిన జంతువుయొక్క మాంసము.

**వృద్ధ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ముసలిది, వృద్ధురాలు. ౨. వంశగురాలు, వంశములోనిది.

**వృద్ధకాకము.** సం. వి. అ. పుం. మాలకాకి, కాకోలము.

**వృద్ధదారువు.** సం. వి. ఉ. న. సముద్రపాల. ‡.

**వృద్ధనాభి.** సం. విణ. (ఇ). తుందిలుఁడు. పెద్దబొజ్జవాఁడు.

**వృద్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. పెరిఁగినది, వృద్ధిపొందినది, పూర్తిగాఁ బెరిఁగినది. ౨. గొప్పది, విరివియైనది. ౩. రాశిగ్గొనది, ప్రోగయినది.—వి. అ. న. ౧. సాంబ్రాణి. ౨.

(వ్యాక) మొదటియచ్చు వృద్ధిసంజ్ఞగల పదము. (ఆ, ఐ, ఔ. ఇవి వృద్ధిసంజ్ఞగలవి.)

**వృద్ధరాజము.** సం. వి. అ. పుం. ఒకజాతి గోఁగు. ‡.

**వృద్ధవాహనము.** సం. వి. అ. పుం. మామిడి చెట్టు.

**వృద్ధశ్రవు(వసు)ఁడు.** సం. వి. స. పుం. ఇంద్రుఁడు.

**వృద్ధసూత్రకము.** సం. వి. అ. న. ఇంద్రతూలకము, గాలిలోనెగిరెడి దూదితోఁగూడిన ఒక జాతి విత్తు.

**వృద్ధాంగులి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. బొటనవ్రేలు. ౨. పెద్దవ్రేలు.

**వృద్ధాచారము.** సం. వి. అ. పుం. పూర్వాచారము, చిరకాలమునుండి నిలిచియున్న యాచారము.

**వృద్ధి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. పెరుఁగుట, అధికమగుట (తపోవృద్ధి, జ్ఞానవృద్ధి మొ.) ౨. హెచ్చుగుట (చంద్రకళలయొక్క వృద్ధి.) ౩. ఐశ్వర్యము (అభివృద్ధి, సమృద్ధి.) ౪. జయము, ఉంఛస్థితి. ౫. ధనము, సొత్తు.

**వృద్ధి.వికం.** సం. వి. అ. స్త్రీ. వృద్ధికలు జీవించుట.

**వృద్ధిపత్త్రము.** సం. వి. అ. న. శస్త్రచికిత్సకుపయోగించు రెండంచుల పులను వాఁడిగల యొక కత్తి.

**వృద్ధిమంతము.** సం. విశే. (పు. మతీ. న.) ౧. వృద్ధిగలది, పెరిఁగినది. ౨. ధనవంతము, ఐశ్వర్యముగలది. ౩. అభివృద్ధిలోనున్నది.

**వృద్ధిశ్రాద్ధము.** సం. వి. అ. న. పుత్రజననము మొదలగు శుభసమయములయందుఁ బితృదేవతలనుద్దేశించి చేయఁబడు శ్రాద్ధము, నాందీశ్రాద్ధము.

**వృధా = వృధుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) వృద్ధుడు, ముసలివాఁడు, జ్ఞానవృద్ధుఁడు వయోవృద్ధుఁడు.

క. వృద్ధని జాత్యంధుండని, బుద్ధివిహీనుఁడని
నిన్నుఁ బుత్రుఁడు బలద,ర్పోద్ధతుఁడై
మెచ్చుఁ డసం,బద్ధంబులె కాని వినఁడు
పలికిన పలుకుల్. (భార. ఆర. ౧. ౩౭౭.)

సీ. ఈతని వృద్ధని రోతిఁగి పూజించితే వసు
దేవుఁ డుండంగ వసుమతీశ.
భార. సభా. ౨. ౧౧.

ఆ. వృద్ధు వచ్చునపుడు వినుబాలు ప్రాణంబు
లెగయఁజూచు...(భార. అను. ౪. ౧౦౧.)

**వృద్ధు(ఁడు).** సం. విశే. (అ. ఆ. అ.) ౧. పూర్తిగాఁ బెరిఁగినవాఁడు. ౨. వయసుచేఁ బెద్దవాఁడు, జ్యేష్ఠుఁడు. ౩. (సమాసాంతమున) పెద్దయైనవాఁడు, (వయోవృద్ధుఁడు, జ్ఞానవృద్ధుఁడు, ఆగమవృద్ధుఁడు, ధర్మవృద్ధుఁడు మొ.) ౪. బుద్ధిమంతుఁడు, చదువరి, విద్యావంతుఁడు.—వి. అ. పుం. ముసలివాఁడు. ౨. గౌరవముగలవాఁడు. ౩. జ్ఞాని, సంజ్ఞాని. ౪. [illegible]

**వృద్ధోక్షము.** సం. వి. అ. పుం. ముసలియెద్దు.

**వృద్ధ్యాజీవి.** సం. వి. న. పుం. వృద్ధ్యాజీవుఁడు.

**వృద్ధ్యాజీవుఁడు.** సం. వి. అ. పుం. వడ్డీవలన బ్రదుకు మనుష్యుఁడు, వార్ధుషికుఁడు.

**వృధసానుఁడు.** సం. వి. అ. పుం. మనుష్యుఁడు. (సి. కౌ.)

**వృధసానువు.** సం. వి. ఉ. పుం. ౧. మనుష్యుఁడు. ౨. ఆకు, పత్త్రము. ౩. పని, కార్యము.

**వృశము.** సం. వి. అ. పుం. ౧. ఎలుక. ౨. వాసకము, అడ్డసరము. ‡. —స. అల్లము.

**వృశ్చికము.** సం. వి. అ. పుం. ౧. తేలు. ౨. (జ్యోతి) రాశిచక్రమున వృశ్చికరాశి, వృశ్చిక లగ్నము. ౩. ఎండ్రకాయ, పీత. ౪. శతపది, జెఱ్ఱి. ౫. ఒకజాతి పేడపురుగు. ౬. గొంగళి పురుగు. ౭. వృశ్చికమాసము. (సూర్యుఁడు వృశ్చికరాశియందుండెడి మాసము.)
౮. గలిజేరు. ‡. ౯. మ్రంగచెట్టు.

**వృషణకచ్ఛువు.** సం. వి. ఊ. స్త్రీ. అండకోశముమీఁదఁ బుట్టిన వ్రణము.

**వృషణము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. నీరు చిలుకరించునది, నీరు చల్లునది, బలము గలిగించునది. ౨. బలాఢ్యమైనది, దృఢమైనది. ౩. వీర్యాన్వితము, పరాక్రమవంతము.—వి. అ. పుం. అండకోశము.

**వృషణశ్వము.** సం. విశే. (అ. ఆ. అ.) సామర్థ్యముకలది, శక్తిమంతము.—వి. అ. పుం. ఇంద్రుని యశ్వము.

**వృషదంశ(క)ము.** సం. వి. అ. పుం. పిల్లి, మార్జాలము.

**వృషధ్వజుఁడు.** సం. వి. అ. పుం. ౧. శివుఁడు. ౨. గణపతి. ౩. ధార్మికుఁడు, పుణ్యపురుషుఁడు.

**వృషనాశనుఁడు.** సం. వి. అ. పుం. శ్రీకృష్ణుఁడు. (వృషభరూపమును ధరించిన 'అరిష్టుఁ'డను రాక్షసుని నశింపఁజేసినవాఁడు.)
(ఇట్లే : వృషాంతకుఁడు మొ.)

**వృషపతి.** సం. వి. ఇ. పుం. ౧. శివుఁడు. ౨. ఆఁబోతు, స్వేచ్ఛగాఁదిరుగవిడువఁబడిన యెద్దు.

**వృషపర్వుఁడు.** సం. వి. న్. పుం. ౧. శివుఁడు. ౨. ఒకానొకరాక్షసుఁడు. (ఈతని కూఁతురగు శర్మిష్ఠను యయాతి పెండ్లాడెను.)

**వృషభధ్వజుఁడు.** సం. వి. అ. పుం. = శివుఁడు.

**వృషభము.** సం. వి. అ. పుం. ౧. ఎద్దు. ౨. మగజంతువు. (ఆ. ని.) ౩. (జ్యోతి) వృషభరాశి. (రాశిచక్రములో రెండవది.) ౪. ఋషభమనెడు మూలిక. ౫. కర్ణరంధ్రము. ౬. ఏనుఁగు చెవి. (ఆ. ని.)—విశే. అ. పుం. శ్రేష్ఠము. (ఈ యర్థమున సమాసోత్తరపదముగానే యుండును.)

**వృషభాస.** సం. వి. ఆ. స్త్రీ. అమరావతి, స్వర్గరాజధాని.

**వృషభి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. విధవ, వితంతువు. ౨. దూలగొండి. ‡. కండూర. ‡.

**వృషము.** సం. వి. అ. పుం. ౧. వృషభము. ౨. (జ్యోతి) వృషభరాశి. ౩. ఎలుక. ౪. ధర్మము. ౫. నీతి, న్యాయము. ౬. ఋషభమను మూలిక. ౭. అడ్డసరము‡. ౮. ముఖ్యమైనపాచిక. ౯. సారె. -న. నెమిలిపింఛము- విశే. అ. పుం. (సమాసాంతమున) శ్రేష్ఠము- సం. వి. న్. పుం. ౧. వృషభము. ౨. (జ్యోతి) వృషభరాశి. ౩. బుడ్డకొట్టని గుఱ్ఱము, గుఱ్ఱము. ౪. బాధ, దుఃఖము. -విశే. న్. పుం. (సమాసాంతమున) శ్రేష్ఠము.

**వృషయము.** సం. వి. అ. పుం. ౧. నివాసము, గృహము. ౨. రక్షకస్థానము, శరణ్యము.

**వృషలము.** సం. వి. అ. పుం. ౧. గుఱ్ఱము. ౨. వెల్లుల్లి. ‡.

**వృషలి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. పెండ్లికాకుండఁగనే రజస్వలయైన కన్నె. ౨. ఋతుమతి, ముట్టుది. ౩. గొడ్రాలు, వంధ్య. ౪. ప్రాణము లేకుండఁ బుట్టినశిశువును గన్నతల్లి, మృతప్రసువు. ౫. శూద్రస్త్రీ, శూద్రునిభార్య.

**వృషలీపతి.** సం. వి. ఇ. పుం. శూద్రస్త్రీ యొక్క మగఁడు.

వృషలీసేవనము. సం. వి. అ. న. శూద్రస్త్రీని రతియందుఁ బొందుట.

వృషలుఁడు. సం. వి. అ. పుం. ౧. శూద్రుఁడు. ౨. పాపాత్ముఁడు, అధార్మికుఁడు. ౩. నటుఁడు. ౪. జాతిబహిష్కృతుఁడు, వెలివేయఁబడిన వాఁడు. ౫. చంద్రగుప్తుఁడు అను నొకరాజు. (ఇది చాణక్యునిచే వాడఁబడెడి పేరు.) ౬. తనకు విధింపఁబడిన కర్మము విడుచుటచేత వర్ణభ్రష్టుఁడైన బ్రహ్మక్షత్రియవైశ్యులలో నొకఁడు. (ఆ. వి.)

వృషలోచనము. సం. వి. అ. పుం. ఎలుక, మూషికము.

వృషవాహనుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

వృషస్కంధుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఎద్దుమూఁపురమువంటి మూఁపులు గలవాఁడు, బలసిన మూఁపులు గలవాఁడు.

వృషస్యంతి. సం. వి. ఈ. స్త్రీ. ౧. కాముకి, మైథునేచ్ఛగల స్త్రీ. ౨. ఎదావు, ఆఁబోతును జేర సమయమైన యావు. ౩. కపికచ్ఛువు, దూలగొండి. *.

వృషాంకము. సం. వి. అ. పుం. నల్లజీడిచెట్టు.

వృషాంకుఁడు. సం. వి. అ. పుం. ౧. శివుఁడు. ౨. ధర్మనిష్ఠగల పురుషుఁడు, పుణ్యాత్ముఁడు. ౩. నపుంసకుఁడు.

వృషాకపాయి. సం. వి. ఈ. స్త్రీ. ౧. లక్ష్మి. ౨. గౌరి. ౩. శచి. ౪. అగ్నిభార్యయగు స్వాహాదేవి. ౫. సూర్యునిభార్యయగు ఉష. ౬. ఇంద్రునితల్లి. ౭. శతావరి *., పిల్లి తేగలు *., జీవంతి *., విష్ణుక్రాంత. *.

వృషాకపి. సం. వి. ఇ. పుం. ౧. శివుఁడు. ౨. విష్ణువు. ౩. ఇంద్రుఁడు. ౪. అగ్ని. ౫. సూర్యుఁడు.

వృషాహారము. సం. వి. అ. పుం. వృషదంశకము, పిల్లి.

వృషి. సం. వి. న్. పుం. నెమిలి, మయూరము. -ఈ. స్త్రీ. బృసి, యతులు కూర్చుండెడి కుశాసనము.

వృష్ణుఁడు. సం. వి. అ. పుం. ౧. మన్మథుఁడు. ౨. కామశాస్త్రమందుఁ జెప్పఁబడిన నాలుగు జాతుల పురుషులలో నొకఁడు. ౩. శత్రువు. ౪. కర్ణుఁడు. ౫. విష్ణువు. -విణ. (అ. ఆ. అ.) ౧. బలాఢ్యుఁడు, బలముగలవాఁడు. ౨. క్రీడాశీలుఁడు, ఆటలాడు స్వభావము గలవాఁడు. -వి. న్. పుం. ౧. ఇంద్రుఁడు. ౨. కర్ణుఁడు. ౩. అగ్నిదేవుఁడు.

వృషోత్సర్గము. సం. వి. అ. పుం. ఆఁబోతు నచ్చుపోసి స్వేచ్ఛగాఁ దిరుగ విడుచుట.

వృషోత్సర్జనము. సం. వి. అ. న. = వృషోత్సర్గము.

వృష్టము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వర్షించినది. ౨. వర్షించుచున్నది.

వృష్టి. సం. వి. ఇ. స్త్రీ. వర్షము, వాన.

వృష్టిజీవనము. సం. విణ. (అ. ఆ. అ.) వర్షాధారమైన పంటలుగలది, దేవమాతృకము. (దేశము)—వి. అ. పుం. చాతకపక్షి.

వృష్టిభువు. సం. వి. ఉ. పుం. కప్ప, వర్షాభువు, భేకము.

వృష్టిమంతము. సం. విణ. (త్. మతీ. త్.) వర్షములుగలది. -వి. త్. పుం. మేఘము.

వృష్ణి. సం. విణ. (ఇ) ౧. మతాంతరము నవలంబించినవాఁడు. ౨. కోపముగలవాఁడు, తీక్ష్ణస్వభావముగలవాఁడు. -వి. న్. పుం. ౧. మేఘము. ౨. పొట్టేలు, ౩. కిరణము. ౪.

వృషభము. ౫. కృష్ణునివంశమునఁ బ్రాచీన పురుషుఁడు, ఒకయాదవుఁడు. ౬. కృష్ణుఁడు. ౭. ఇంద్రుఁడు. ౮. అగ్ని. ౯. వాయువు, గాలి. ౧౦. పాషండుఁడు.

**వృష్ణిగర్భుఁడు.** సం. వి. అ. పుం. కృష్ణుఁడు.

**వృష్య.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఉసిరిక. ‡. ౨. శతావరి, పిల్లితేగలు. ‡. ౩. ఋషభమనెడి యోషధి.

**వృష్యము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. కరియఁ దగినది. ౨. వీర్యవృద్ధిని గలిగించునది. (ఔషధము.) - వి. అ. పుం. మాషము, మినుము. -న. వాజీకరణము, కామోద్దీపనము చేయుట.

# వె

**వెంగడము.** విణ. వ్యత్యస్తము, తాఱుమాఱయినది.

క. అంగజహరునిప్రసాదమునం గలుగుచు వచ్చె సుతుఁడు నాఁడాదిగ మా,వంగడమున నదియిప్పుడు, వెంగడమై కూఁతు రుద్భవించెన్నాకున్. (విజ. ౨. ౨. ౮.)

**వెంగలి-వెఱలి.** విణ. (క. బెంగళి.) ౧. మూర్ఖుఁడు, అవివేకి.

క. గంగాతనయుఁడు దెగినను, సంగరమున నుత్సహింపఁజనునే తమకున్, వెంగలు లని యప్పుడు దెలి,యంగా నెఱిఁగితి సుయోధనాదుల గృష్ణా. (భార. శల్య. ౧. ౩౫౧.)

చ... కుంభజుఁడు బాలుని నొక్కరుఁ జంచలాత్ము వెం,గలిఁ గడుఁబెద్దజేయుచుఁ బొగడ్తకుఁ జొచ్చె నితండు నొంపగాఁ,దలఁపఁడు వీనిఁ బార్థునకుఁ దాఁగుడుఁగూర్చుట నెంత ద్రుళ్లినన్. (భార. ద్రో. ౨. ౪౫.)

రగడ. వెంగలిదఱునిఁ గూడినకతమున విజ్ఞానము చెడి పతులమైతిమి. (వరాహ. ౫. ౧౨౨.)

౨. వెట్టివాఁడు, అమాయకుఁడు.

ద్వి. కటకటా యిట్టి వెంగలిరాజు గలఁడె, మటుమాయతపసియే మరులుకొల్పినను ... అమ్మొదఁ గడమకై యాలిఁ గొంపోవడు.

ద్వి. హరిశ్చ. ఉ. ౪౦౯.

గీ. మగువఁ గోల్పోయి కడు నిడుమలఁ గలంగు, నలఁతిదొరఁ గొల్వఁ గడఁగు వెంగలులు గలరె. అచ్చ. రా. సుం. ౧౫౪.

౩. మూఢుఁడు, జడుఁడు.

క... లింగాకృతిశివుఁ గొలువని, వెంగలిమానవులకంటె వెడఁగులు గలరే.

శివసా. ౨౫౪.

క. నింగియు నేలయుఁ దానై, పొంగిన హాలాహలంబుఁ బొరిమార్చి రహిన్, వెంగలుల మమ్ముఁ గావుము, గంగారంగత్తరంగకలితజంటాంగా. వీర. ౩. ౨౩౧.

ద్వి. పొంగి చిచ్చుఱుకంగఁబోవుచుఁ జీర,కొంగోసరించు పెన్వెంగలి యట్లు.

బస. పు. ౩. ౯౭. పా. ౧౧౪౦. పం.

౪. వ్యర్థము, యుక్తిలేనిది.

సీ. ఎవ్వరితోనైన నెలుఁగెత్తి యొక్కింత పని లేని వెంగలి పలుకు వలుకు.

భార. విరా. ౨. ౨౫౦.

**వెంగలితనము.** వి. (వెంగలి + తనము.) ౧. అవివేకము, మూర్ఖత.

క. కొం గేటికి వీడువుము మును ముంగలి వెడలంగ వెఱతు ముగ్ధుఁడ నీ కీ,వెంగలితనమెట్లొదవె న,నంగ వికృతినూప నర్మహానాయొదురన్. (భోజరా. ౪. ౨౭౮.)

౨. వెట్టితనము.

సీ. వెర విట్టి తెలుఁ గిది వెంగలితన మని యెల్ల
వాఁడును దనయెఱిఁగినట్టి, తెలుఁగున నిజ
కార్యదృష్టియ కయికొను...
భార. సౌప్తి. ౧. ౪౫.

**వెంగలివిత్తు.** విణ. మూర్ఖాగ్రేసరుఁడు, వెఱ్ఱి.
క. వెంగలివిత్తయి తిరుగుచుఁ, గంగాద్యైచెడక
ముక్తిఁ గాంక్షించు నతం, డంగనలతోడ
విడువని, సంగడములు వదలవలయు జల
జాతముఁగ. భాగ. ౯. ౫౮౩.
వ. అవ్వెంగలివిత్తు లఱచు వీఱిఁడి యఱవులకు
వంకలొత్తి మాఱుసెప్పటయు నొప్పక.
భార. ఉద్యో. ౩. ౨౩౫.
వెంగలివిత్తులు = వెఱ్ఱికాయలు.

**వెంగలీఁడు.** వి. (వెంగలి + ఈఁడు, స్వార్థమున) వెంగలి, అనాయకుఁడు.
గీ. అబ్ధిసంభవ యితఁడువో హాలహలపు,
విషము పుక్కిటఁ దాల్చిన వెంగలీఁడు.
కాశీ. ౫. ౧౧౬.

**వెంగెమాడు.** స. క్రి. (√ వెంగెము.)= వెంగెములాడు, వ్యంగ్యార్థము వచ్చునట్లు మాటలాడు, పరిహాసముచేయు.
చ. తరుణికి వెంగెమాడవలెఁ దప్పక కాంతునిఁ
గన్నచోటులన్, విరసముగాదు చిత్తభవ
విభ్రమమంత్రము దీనికై నినుం, బరుసము
లాడితిం బదరిపట్టకు మెగ్గులు వేంకటేశ్వరా.
తాళ్లపాకవారి శృంగారవృత్తశతకము. ౧౧౧.

**వెంగెము.** వి. (సం. వ్యంగ్యమ్.) వ్యంజనచేతఁ దెలియఁదగిన యర్థము, ధ్వన్యర్థము.
సీ. మచ్చరించినవాఁడు మంచిమాటాడిన వెంగ
మై తోఁచును వెగటుపోవ,...(నీతి ౭౬.)

**వెంగెములాడు.** స. క్రి. (√ వెంగెము.)= వెంగెమాడు, వ్యంగ్యార్థము వచ్చునట్లు మాటలాడు, ఎగతాళిచేయు.
ద్వి. వెలఁది వెన్నెలసోగ వెంగెంబులాడఁ,
దులకించు బొమ్మంచుదుప్పటి గప్పి.
ద్వి. పరమ. ౪. ౩౧౫. పా.

**వెంచ.** వి. (క. వెంచ = సరస్సు.) మడుగు, హ్రదము.
చ. ఎలమిన పూరిమేసి సెలయేఱులనీరులు
ద్రాగి మేలివెంచల నెలమాఁకజొంపముల
చల్లనినీడల నిల్చి... (కు. సం. ౬. ౭౦౭.)
చ. ...ముం,దటిగిరిపాంత గొంత యొకదవ్వుల
రేగడవెంచలోపలన్.
ఆ. నాల్గుకాళ్లు గొంపి నాఁటిన ... ధేనువుఁ
బొడఁగని... (ద్వా. ౧౦. ౩౮., ౩౯.)

**వెంజామర.** మి. వి. (తె. వెణ్చామర - వెల్ల + చామర.) వెల్లనిచామరము, వింజామరము.
వీరభద్రేశ్వరమహాదేవరకు ఉత్తరాయన సంక్రాంతి నిమిత్తమున నిచ్చిన (౦)నఖదణ్డమున వెంజామర ౧ట్టి... ద. శా. ౪. ౧౨౫౨.
...పహిణ్డినీరు వఱడిన కొ(ము)లవెంజామరలు౨... ద. శా. ౪. ౧౮౯౦.
...పహిండికాయలతోడి వెంజామరలు ౨...
ద. శా. ౪. ౯౭౫.

**వెంట.** వి. ౧. కార్యము, పని.
చ. వరుఁ డొకవెంట నెన్నఁడు ప్రవాసగతుం
డగు నాఁటగోలె న,ప్పూరుషుఁడు వచ్చు
నంతకును... (భార. అను. ౪. ౩౫౯.)
ఉ. ఈతని చందముం దెలుప నిట్టిది యక్కట
వైరు లుగ్రులై, నాతలపై సభస్మచరణం
బిడిపోయిరిగాక యల్పమే, యీ తెఱఁ గేమి
సేయుదును దీర్ఘబలంబున నీనికారమున్,
వే తొలఁగింతుఁ ద్రోవఁ గను వెంటకుఁ
జూడుఁడు మీ రుపాయమున్.
హరి. ఉ. ౮.౧౬.
గీ. నయము కెడ యీక యెల్లవెంటలను జెలుచు,
హాట పరుసదనంబు కుమారచంద్ర.
పి. శకుం. ౪. ౧౬౭.

౨. విషయము.

చ. ఒకరునిచేతి ప్రోపును దదున్నతిప్రాపును గాంచి యెల్లవెంటను గొఱంతలేక పొగడందగు సంపద నొంది....
భార. ఉద్యో. ౨. ౭౭.

ద్వి. నీవు రాజ్యముసేయ నిఖిలభూజనులు, నే వెంటనే భయ మెఱుఁగరు గాన, నిన్ని చెప్పితి మీకు నిశ్లేను వెఱవ, న న్నింక మన్నించి నామాట వినుము.
రం. రా. ఉ. ౧౩౪ పా. ౨౩ పం.

ఉ.... విదిశాపురి మించు నంను నే,వెంటఁ గొఱంతలేని పృథివీసురుఁ డొక్కఁడు సోమశర్మ పేరింట నెసంగు...
శుక. ౨. ౧౪౪.

౩. కారణము, హేతువు.

చ. వినతకు దాస్యమొంచె నొక వెంటఁ దదీయ నిరాశహేతువై, యనఘవిచార నాకు నమృతాహరణంబు విధేయ మయ్యె...
భార. ఆను. ౧. ౨౫౧.

క. వలసినయప్పుడు మరణము, గలిగింపఁడు పాపజాతి కాలుఁడు గరళా,దులవెంట జావు దొరకదు, బలుగావలియై నిశాటభామిను లునికిన్. (భా. రా. సుంద. ౨౪౬.)

ద్వి. ఏవెంటనో మాకు నింత నిగ్రహము, గావించె నిప్పు డాగంధవాహుండు.
రం. రా. ఉ. ౯౪. పా. ౨౩ పం.

౪. దారి, మార్గము.

క. కనుబ్రమసిన తెరువరి తన, కనపాయంబైన మార్గమరసి తగనెఱింగిన వారు సెప్పఁగాఁ గ్రొన్ననికరణిఁ దగినవెంటకుం జొర వకటా. (భార. ఉద్యో. ౨. ౨౮౦.)

క. రెంటను నేఁ బావనుఁడను, వింటిరె మునులార మీ పవిత్రాంఘ్రులు న, న్నంటుట మదీయ మూర్ధము,వెంటంగా నభ్రగంగ వెల్లి విరి యుటన్. హర. ౪. ౫౭.

మ. తమలోఁబుట్టినవిద్య గప్పికొనుడుం దన్మూల సంసారవిభ్రములై కొందలు దేలుచున్ గలఁగుచుం బల్వెంటన్ దైవయోగము నందె పరమేశుఁ గొల్చి ఘనులై కైవల్య సంప్రాప్తులై... (భాగ. ౯. ౭౨౧.)

౫. ద్వారము.

చ. పురిఁబటఘోషగణికరముల్ జలసూత్రము వెంట సౌధమందిరములఁ జొచ్చి యంగఁ దరుణీ తనుగంధము కాలిసంకలై, సెరగఁగసల్చి కేకిరమణీశిఖాతతు ల్మెడవట్టి ద్రొబ్బఁగా, నరిగి తదీయభూతిఁగొనిపోడు నిజాప్తులు గూఁగి యూకొనన్. (శుకల. ౧. ౭౬.)

౬. విధము, రీతి.

ఉ. వీరలు పెద్దద్రవ్యకొక వెంటనాడంబడి తేఱి శాంతులై... (భార. ఉద్యో. ౧. ౩౪౧.)

ఉ. ఏవెంటనయిన విఘ్నము,గావింపుచుఁ బానుఁ డు దయుఁగతుఁ డగునేని, జీవింపఁడు విమతుం డది, గావున నాకొక్క దీర్వఁగాఁ దలకొనుమా. (భా. రా. యు. ౧౬౧౭.)

శా...... నేఁ, డీవత్సార్భకులన్ భుజంగపతి హింసింపంగ నీ బాలకుం, డేవెంటన్ బ్రది కించె మే లనుచు... (భాగ. ౧౦. ౪౫౬.)

ద్వి. శంభుశ్వేతుండు ప్రసన్నుఁగాఁ బడసె,గావున హితులగు కాంతలబుద్ధి, లేవెంట హితమె కా కేల యొందగునె.
పండితా. పురా. ౧౨౦.

౭. వెనుక భాగము.

గీ. బ్రహ్మచారులు వెంటరా బ్రాహ్మణుండు, వచ్చునింటికిఁ బ్రజ దన్ను మెచ్చిచూడ.
మనుచ. ౧. ౫౪.

సీ. వనిత యెవ్వతె హత్తుకొనునొ వీని నటంచు నెంటనే బుడుతల వేగఁబనుతు...
శువల. ౪. ౧౫౦.

౮. వేఁట.

శా. ఘంటాకర్ణుఁడ నేను నాయనుజుఁ డీకాలాంతకుం డేము ము,కంటింగొల్తుము కిన్నరేశు పనికై కైలాసశైలంబునన్, జంటన్వచ్చిన

సారమేయములు నీ సైన్యంబులున్నావె
యే,వెంటంబోయితిమేమి కానడవిలో
వేఁటాడ రే యెవ్వరున్.

ఉ. హరి. ౨. ౧౪౦.

౯. ఉపాయము.

గీ... వృత్రాసురుండు, పుట్టె నతనికిఁ దైజస
స్ఫూర్తిగలుగ, సప్తమునులనుబంపి తత్సంధిఁ
జేసి, వేల్పుఱేఁ డొక్క వెంట నవ్విప్రుఁ
జంపె. (మార్క. ౧. ౧౧. ౯.)

౧౦. స్థలము, చోటు.

క. ఇవ్విధమున ఘోరంబగు, నవ్విపినాంతరము
సొచ్చి యరుగఁగఁ బాముల్, గ్రొవ్వన
గ్రమ్మఁగుచు నాతని, వెన్వెంటన్ దామె
యగుచు నెగురుచుఁ బట్టెన్.

ద్వా. ౮. ౧౦౧.

క. కావున వివేకహీనుల, త్రోవం బోవలదు
వారితోడిచెలిమి దా, నేవెంటనైన నాపద,
గావింపకపోదు సుమతికలితుల కైనన్.

కేయూర. ౩. ౨౮౩.

అవ్య. ద్రు. ౧. అవిలంబముగా.

ఉ. వంచన వేల్పుటెంకి కిటు వచ్చి యుపాంతము
నందు ముందటం, గంచము వెట్టుకొన్నయది
కర్పూరయుగ్మము మాఱువెట్ట నే తెంచుచు
నున్నవాఁడు మనదేవర విష్ణుఁడు వెంట
వీరి నూ,ఁచించుటమే ల్స్వధారసము చెప్పెడు
వోయకమున్న శౌరకిన్.

హర. ౬. ౧౨౫.

క. ఆవేళ రైభ్యవసు వసు,ధావరు లాంగిరసుచే
యథాసముచితపూ,జావిధులు వడసి వంది
తు,లై వెంటం జనిరి దివికి నఘగిరి పలికిన్.

వరాహ. ౨ ౯.

౨. వెంబడి.

ఆ. మానులచట వారి మార్గంబుఁ గానక, వెదకి
వెదకి యల్లవిపినభూమి, పాపటయును
బోలెఁ జూకట్టు నొక తప్పత్రోవ వెంట
నంటిపోవు చవల. (వాల్మీ. ౨. ౮౨.

చ. అరసెదఁగాక యిన్వడుగు నాగడ మంచు
వసించె నంగణాం,తరమున గోడమాటువడి
దక్షుఁ డెఱుంగకయుండె వాని సుం,దరి
పనివెంట నద్దెసకుఁ దాఁ జనుదేర నిజేచ్ఛ
నాత్మమం,దిరముననుండి యావెలఁదిదిక్కు
నకుం జని యంత దక్షుఁడున్.

కేయూర. ౨. ౨౩.

వెంటఁబట్టు. అ. క్రి. (వెంటన్ + పట్టు.) వెను
కకుఁబోవు.

క. త దవసరంబున జోదులు, పదివేవురు
వెంటఁబెట్టి బాగై రాఁగాఁ, బోదివెలువడి
రథ్యంబులఁ, గదలించిరి ఘాసగోమకదలీ
రోముల్. కు. ౫. ౧౫౬.

వెంటఁబడు. స. క్రి. ౧. వెంబడించు.

క. మింటిసికవేల్పుమిక్కిలి,కంటిసెకన్ నొచ్చి
పుట్టుగానక సోఁకున్, వెంటఁబడి మరుఁడు
వాలుంగంటీ రాఁ దగునె యెంతగండము
గడచెన్. యయా. ౫. ౧౩౮.

చ.... ఆ,మనోధరణీరుహప్రసవమాల్యసుగంధ
భరానుయాతబం,భరనికరంబు వెంటఁబడి
బంట్లు తెఱంగున నంటి కొల్వఁగన్.

జాహ్నవీ. ౧. ౧౨౮.

౨. తఱుము, తొందరపెట్టు.

గీ. ఇట్లు వర్తింప నొక్కనాఁ డిరులు గవియు,
వేళఁ గార్యాంతరాపేక్ష వెంటఁబడఁగ,
నింటివారికిఁ జెప్పక యేగెఁ జపల,మగఁడు
పొరుగూరికై బుద్ధిమంతుఁ డగుట.

శుక. ౩. ౪౮౭.

వెంటఁబెట్టుకొను. స. క్రి. కూడనుంచుకొను.

మ. సుగుణాంభోధుల మంత్రిపుంగవుల నచ్చో
నుంచి యం చన్మతిన్, దగువారిం దవ
వెంటఁబెట్టుకొని రత్నస్యందనారూఢుఁడై,
చేర నాఘనుఁడు......వాల్మీకాశ్రమ
స్థానమున్. ఉ. రా. ౭. ౧౫౬.

**వెంటనంటు.** స. క్రి. (వెంటన్ + అంటు.) వెను దగులు, వెంబడించు.

సీ. హరిహయవాహనాహంకారము హరించి వేఁడివేలుపుజాడ వెంటనంటి...

వసు. ౪. ౧౨.

మ. చిఱునవ్వుల్ దళుకొత్తు నెమ్మొగములన్ శ్రీచూర్ణపున్ రేఖడా, లొలుపా తిర్మణి పట్టె లుల్లసిల శిష్యుల్ వెంటనంటంగ శ్రీహరునామస్మరణంబు లుప్పతిల దాసోహమ్మటం చొండొరుల్, సరగన్ వైష్ణవులేగుదెంచి రచటన్ సౌశీల్యసంపన్నులై.

ఇంగు. ౫. ౬౨.

క.... గురుతరమగు సురుచిరతత్పరిమళముల వెంటనంటి పాయక చనుచున్.

శుక. ౫. ౭౭.

**వెంటము.** వి. వేడుక, కుతూహలము. (చి. ని., శ. ర.)

**వెంటాడించు.** స. క్రి. ౧. వెన్నాడు, వెంబడించు.

శా. కంటింగంటి నటంచు నార్చి శతశృంగక్ష్మాధరాగ్రంబునన్, వెంటాడించి కరాళకీల పటలత్క్ష్వేళాశ్రయార్చిశ్ఛటాలుంటాకప్రతిఘాభరారుణదృగాలోకంబు సంధిల్లఁగా, లంటంద్రొక్కె లులాయదానవుని వక్షోగ్రంబు శూలంబునన్.

వరాహ. ౧౧. ౧౧౧.

౨. త్వరపెట్టు, తఱుము.

క. ఒగ్గములు ద్రవ్వి పడు మని, యొగ్గాడు పెనుఁదెరల వలల నురలు మృగములన్, డగ్గఱి చంపెడు వేడుక, వెగ్గలమై చిత్తమందు వెంటాడింపన్. భాగ. ౧. ౪౫౪.

**వెంటాడు.** స. క్రి (వెంట + ఆడు.) వెంబడించు.

సీ. గొరవంకపై డేగఁ గొనివేయ నది దానిఁ దఱుమ వెంటాడి తత్తడిని నూకి,...

చంద్రా. ౪. ౯౯.

మ. హతిమూర్ఛాంతమునన్ రథాధిపతు లాత్మానూననూతాళిసంగతి నిందించిన వర్తితాళ్వలయి సంగ్రామంబునందే రథస్థితపాళిన్ శుతులైరొ ప్రాక్సమయసందృష్టధ్వజంబైన గర్వితతాదృగ్రథనాయకవ్రజమునే వెంటాడి రిష్టాఘ్యతన్. (రఘు. ౪. ౧౦౮.)

**వెంటి.** వి. మెలిపెట్టిన గడ్డి, కసవుపిరి. (చి. ని. శ. ర., బ్రౌ., వా.)

చ... ఋణముంగొని పెట్టక పాయఁద్రోచు దుర్జనుఁ బురివెంట్లుచుట్టి పసమంబునఁ గొల్వఁగ లేదు పీథులన్. (రుక్మాం. ౨. ౯.)

(ముద్రి. పా. వరివెంట్లు. చి. ని. పా.)

**వెంటిగొను.** అ. క్రి. (వెంటి + కొను.)పిరిగొను.

లయగ్రాహి...గంటి వడఁ దాఁచుచు మగంటిమి దలిర్పన్, వెంటిగొనఁగానులిచి మింటి కెగయన్వయిచి... భా. రా. యు. ౧౪౩౦.

**వెంట్రువ.** వి. ఒకజాతి ముంగిస, బభ్రువు.

గీ. వెంట్రు వనఁగను బభ్రువు వెలయు నభవ.

ఆం. భా. ౨. ౭౬.

**వెండి[1].** వి.(క. బెళ్లి. త. వెళ్లి.) రజతము, పంచలోహములలో నొకటి. (నిత్యైకవచనము.)

సీ.... వెండియొడ్డెనలపై వెలచి తెచ్చిన పైఁడిపళ్లెంబు లాయత్తపఱుచువారు...

నైష. ౬. ౧౦౭.

సీ. వెన్నెల జరియుడ్డ వెండితీఁగెలఁబోలు యజ్ఞోపవీతంబు లఱుత నమర....

విక్ర. ౮. ౧౪౩.

గీ....వెండిమీ లెక్కు చెంద్రుకవిల్లువోలె.

ఆము. ౪. ౧౮౮.

(ఇయ్యది విశేషణముగాఁగూడఁ జెప్పనగును. ఉదా : వెండిగిన్నె.)

**వెండి².** అవ్య. ౧. పునరర్థకము, మఱి.
(ఇది "ఉను" వర్ణకాంతము నగును.)

క. మాయయ్యకుఁ బాయక పని, సేయుచు దీవించి ప్రియము సేయుచునుండున్, మీయయ్య వెండి మహిమలు, నాయొద్దన పలుక నీకు నానయు లేదే.
భార. ఆది. ౩. ౧౩౭.

క. మండెడు బలు నారసమున, గుండియ వగులంగ నేసి కూల్చితి దీనిన్, వెండి ప్రయోజన మేదీ రండాసుత! దీనిపై శరము నిగిడింపన్.
హర. ౭. ౫౪.

ఆ. వెండి యొక్కపండు పిఱుఁ డెప్పుడో తెచ్చి, తనకు నీక యమ్ముకొనియె ననుచు.
విక్ర. ౩. ౨౦.

క. పాండవహితుఁడగు విదురుఁడు, వెండియు జనుదెంచి, కార్యవిధులందు సహాయుం డయ్యె నతనితోడ హితుండయి మంతనము సేయఁదొడఁగె న్విభుఁడున్.
భార. ఆర. ౧. ౭౨.

౨. అనంతరార్థకము, పిమ్మట.

గీ. అట్లు కావున న వ్విబుధారిఁ దునిమి, వెండి చనుము తపంబుగావించుపనికి.
హరి. పూ. ౨. ౨౫.

ఉ... విము క్తికన్యకన్, డాసెద నంచు నెమ్మనమునం బ్రమదంబు వహించి వెండియున్.
విక్ర. ౨. ౧౮౯.

చ. ఒకమరి బుడ్డగింప విలయోదకముల్ పయి కుబ్బి చిప్ప వ్రచ్చుకొని మహాభ్రపథిఁ జన నాకరతన్ మెయి వెంచి వెండి క్రిందికిఁ గయివ్రాలు తత్సలిలనిర్మలధార...
ఆము. ౪. ౨౧.

క. పడఁతికిఁ గన్యాధర్మం, బెడలినఁ గొఱ యగునె వెండి యెవ్వరికైనం, గడివోయిన పువ్వులు మఱి, ముడుమనె రసికుఁడగువాఁ డమోఘవివేకా.
భోజరా. ౪. ౨౨౪.

౩. కింత్వర్థకము, ఇఁక నేమన్న.

సీ.... గీ.... సోమయాజుల మెన్నిమార్లాము శ్వపచభుగకులుల మెన్నిమారులుగాము పాము, గాములగు నెన్నిమాఱులుగాము వెండి, కంకరిపుభక్తుల మొకండె కాము గాని.
ఆము. ౬. ౬౧.

**వెండిక.** అవ్య. పునరర్థకము, మఱి.

ఉ. వెక్కుడిరూపులున్ విఱిగి వెండిక వెండిక వ్రాలు రూపులున్...
కు. సం. ౧౧. ౬౯౯.

**వెండికొండ.** వి. (వెండి + కొండ.) కైలాసపర్వతము, రజతశైలము.

సీ... ధవళకేతనరుచులు ఛత్త్రిములరుచులుఁ, జామరంబులరుచు లొక్కసారి నిగిడి, మెండుకొని వెండికొండపై నిండ నా ప్రచండభుజదండుఁ డాతఁడు దండు విడిసె.
ఉ. రా. ౨. ౩౩౧.

ఉ... తురంగవాహుఁడై, సంగతి నేగె విత్తపతి శంకరుకొండకు వెండికొండకున్.
వీర. ౩. ౮౩.

**వెండిగుండు.** వి. (వెండి + గుండు.) ౧. కైలాసపర్వతము, రజతశైలము. (శ. ర.) ౨. వెండి గుండువలె నుండుటచేఁ గుక్క కియ్యఁబడిన పేరు.

చ. పులియఁడు బూచిగాఁ డసురపోతుల రాజనుమంతిగాఁడు చెంగలువసివంగి భైరవుఁడు గన్నెరసంపఁగి వెండిగుండు మల్లెలగుది...
మనుచ. ౪. ౩౨.

సీ... విష్ణుప్రసాదంబు వెండిగుండుల పరి పచ్చిమిరెము వెట్టిపుచ్చకాయ...
పి. శకుం. ౧. ౧౦౮.

౩. బ. ధాన్యవిశేషము.

వ. రాయమెచ్చులు యేరుమల్లెలు మునిమనో హరాలు వెండిగుండ్లు బొంతమడమలు

పూటికుప్పలు కొలు సంపెఁగలు...

ప్రబంధ. ౧౧౨.

**వెండిగుబ్బలి.** వి. (వెండి + గుబ్బలి.) రజతాచలము, కైలాసము.

సీ. వెండిగుబ్బలిపై వేడ్క వీడుకొల్పి, మేరు నగరాజుపైఁ జాల మెచ్చువదలి... .

భీమ. ౬. ౧౧.

సీ...విన్నక్రొమ్ముడివాఁడు వెండిగుబ్బలిగూడె మేలువాఁ డుడివోని మేలువాఁడు....

అచ్చ. రా. బాల. ౧౩.

**వెండీఁడు.** వి. సూత్రధారుఁడు, బొమ్మలాడించువాఁడు.

ద్వి. ప్రకటిత కపటనాటకసూత్రములను, వికృతి ప్రకృతు లార్చు వెండీఁడు నతఁడ.

బస. పు. ౪. ౩౦.

**వెండ్రుక.** వి. ౧. కేశము, శిరోరుహము.

సీ. కలికివెండ్రుకలలోఁ బలచు మందాకిని సుకుమారదేహంబు ప్రుక్కఁబాఱ...

హర. ౩. ౩౯.

సీ...జుంజువెండ్రుక లెత్తి చుట్టినలేదీఁగపన్న గాధీశ్వరు పగిది మెఱయ.

విక్ర. ౨. ౧౨౩.

ఉ.... ఎలదేఁటి దాఁటులన్, బమ్మెరవోవఁ దోలుఁ దెగబారెడువెండ్రుకలు,...

మనుచ. ౩. ౬.

సీ... వెండ్రుక నెఱి నెఱక నాఁగఁ దనరుఁ గేశము... (ఆం. భా. ౨. ౧౪౫.)

౨. రోమము.

ఉ. తండ్రులు మీరు మీకు నయతత్త్వముఁ జెప్పెద మన్న మమ్ము నేమండ్రు జనంబు లూఱడు బృహస్పతి మీయెడ నేను లేనిచో, వెండ్రుకయంతమోసమును వేచి దురంబున కెత్తివచ్చు నా, పాండ్రుఁడు...

ఉ. హరి. ౨. ౧౧౧.

నిడువెండ్రుకవెట్టు - అ. క్రి. జలదరించుట.

క. గడగడవడఁకెడు మేన, న్నిడువెండ్రుకవెట్ట నెదుర నిదుర చలింపన్, మెడమడచు నావు లించుం, దడఁబడుఁ బడఁబోవు నిలుచు ధరఁ గూర్చుండున్.

(ఉ. హరి. ౬. ౯౬.)

**వెండ్రుకవిల్లు.** వి. బొ. గుఱ్ఱపుతోఁక వెండ్రుకలతోఁగట్టిన ధనురాకారమగు వాద్యవిశేషము. (దీనిని దాసరివాండ్రు వాయింతురు. దీనిని 'కామాచి' అందురు.)

గీ. వృష్టితతి నిడ్డ జెనఁద్రావఁ గ్రిందినుండి, తేటనదినీటఁ దనవెంటఁ దేలు మీల, తళుకుతో నాఁచులత దోఁచె వెలికి జమిడి, వెండిమీ తెక్కు వెండ్రుకవిల్లువోలె.

ఆము. ౪. ౧౩౩.

**వెండగు(వు)లు.** స. క్రి. (వెన్ను + తగులు.) అనుగమించు, వెంటనంటు.

ద్వి. అచ్చుగ నిటురాఁగ నతఁడు వెదంగిలి, వచ్చుచు నిందుకు వసుధేశ వినుము.

రం. రా. బాల. ౧౨ పా. ౨ పం.

ద్వి. తలలు వీడఁగ నాయుధంబులు విడచి, వల నేది పాఱెడువారి వెండవిలి, పటుశిలీ ముఖముల పాలు సేయుచును.

రం. రా. ఉ. ౧౬. పా. ౩ పం.

**వెందు.** వి. తమకు వశపడుటకై తుమ్మెదలు మధ్యనుంచి పాడెడు పురుగు.

చ. చెవుడు పడంగ నల్లడలఁ జేరుచు నన్నొక వెందుచేసి మీ, రివియవియంచు బుజ్జవము లిన్నియు నెన్నఁగ నేల...

వ. సం. ౬. ౬౩౬.

**వెంపర.** వి. ౧. పీడనము. ౨. హింస. ౩. భేదనము. (శ. ర.) (చూ. వెంపరలాడు.)

**వెంపరచేయు.** దే. స. క్రి. హింసించు.

సీ. పాదంబు లిసుకలోఁ బాతి వెంపరసేసి పటు పాయకముల పాల్పఱుత మనుచు.

దశకు. ౨. ౭౧.

**వెంపరలాడు.** స. క్రి. (వెంపరలు + ఆడు.)

౧. భేదించు.

వ. తామరల పరంపరల వెంపరలాడి తుండం బుల తండంబులు పొడవు లెత్తి భూత్కారంబులు చేసి.

ప్రబంధ. ౧. ౧౮౬.

సీ... చెవి దార్చి విని చీమ చిటు కన్న నొకసారి సెలవి వెంపరలాడుఁ జిట్టలెల్ల...

మనుచ. ౪. ౧౭.

౨. బాధించు, పీడించు.

చ. మఱి పనిలేదె వేసరవు మాటికి నిక్కడ నుండనోయి చే, టెఱుఁగని కూన దుర్జయ నరేంద్రశిఖామణి వీఁడె వచ్చె నే, వెఱపున లేక వేలుపుల వెంపరలాడుచు నాలకింప మా, మొఱలు తదీయధాటి నిను ముట్టిఁ జూమీ నిమిషంబు నిల్చినన్.

వరాహ. ౩. ౩౪.

చ. అని కొనియాడి చేడియ నొయారపురాశిని జేసి నట్టి యవ్వనజజాచేతికిన్ బిరుదు వైవఁగవచ్చుఁగదయ్య దీని ప్రాపున ముద మొందు కొందలిరుపొందళపుందొర చూచు వారలన్, వెనుకొని పూవుటంపరల వెంపర లాడకు మన్న మానుసే.

కువల. ౪. ౧౫౪.

(వెంపరలాడు - ముద్రి. పా.)

౩. హింసించు.

చ. చలమునఁ దాన్న రోగిజనసంఘము వెంపర లాడఁ బూని పూ, ములుకులు వింటఁ గూర్చి తఱి ముక్కలఁ బీల్చి తదీయసార మ్మగ్గ ముగఁ గ్రోలఁ గా, సుసురుగాలముల న్మరుఁ జేయ వ్రేటుచాయల నలరెన్ బలాళముకు శాంతము లంటుక మూఁగు తుమ్మెదల్.

చంద్రా. ౪. ౭౫.

చ.... సేనలఁ బెక్కు భంగులన్, బొడవడఁగించి మండి బలుమూఁకల వెంపరలాడుచుండె...

జై. భా. ౬. ౧౭౭.

ఉ... పూవింటియతండు న న్గనిని వెంపరలాడక మున్నె యల్ల వాల్గంటిమనోజ్ఞ సంగమ సుఖ స్థితి యేగతిఁ గల్గుఁ జెప్పవే.

రాజ. చ. ౩. ౭౭.

**వెంపరలువెట్టు.** స. క్రి. (వెంపరలు + పెట్టు.) భేదించు.

వ....ఆ శక్రారి సేనానక్రాకరంబుఁ జొచ్చి శోధించి కలంచి స్వకలగండు సేసిమట్టివల్లాడి) పెరఁజి వెంపరలువెట్టి వచ్చిపోయిన తెరు వెఱుంగరాక.... (పి. శకుం. ౩. ౧౨౬.)

**వెంపలి.** వి. బాణపుంఖ, ఒకజాతి. ∗.

(బ. వెంపల్లు, వెంపలులు. దీనిభేదములు: తెల్ల వెంపలి, ములువెంపలి మొ॥)

తే. వీరరసపారసాకారవిహారణంబు, విష్ణునకు నొప్పు నతనితో విగ్రహింప, దొరకొనిన వచ్చు మనకు మద్దులు మునింగి, పాఱ వెంపల్లు తమ కెంత బంటి యనుట.

ఉ. హరి. ౪. ౧౨౪.

**వెంబట్టు.** వి. (వెల్ల + పట్టు.) తెల్లనిపట్టు.

క. బిట్టెగసి మీఁదఁ గెలఁకులఁ, జుట్టి సితచ్ఛద సమూహిసుడియుట గడుఁ గన్పట్టు సరో వరలక్ష్మికిఁ, గట్టినవెంబట్టు మేలుకట్టుం బోలెన్. ( కు. సం. ౧౦. ౩౮౬.)

**వెంబడి.** వి. (వెన్ + పడి.) ౧. వరుస, క్రమము.

వ...అప్పుడు తమ సుముఖాసత్తిమణి స్తంభనామ ధేయంబులు స్త్రీత్వపురుషత్వంబుల వెంబడిన వీడ్పాటుగా సంకేతంబులు చేసికొనిరి....

కళా. ౫. ౧౧౩.

చ. దినములవెంబడిని జడనిధిన్ మునుఁగ్రోలిన
నీరు... ఆము. ౪.౭౬.

౨. ప్రకారము, రీతి.

వ...పిదపఁ బాళ్ల వెంబడిం బంచుకొని ...
మనుచ. ౪. ౬౦.

ఆ. తగదు మిగుల నిచటఁ దడయఁగ సంకేతి,తం
బగుసమయంబు దప్పకుండ, నేఁ దిరిగి యరి
గాద నీవు నావెంబడి, నడువవలయుఁ దాల్మి
సడలనీక.
రాఘవ. ౪. ౧౯. (రామాయణార్థమున.)

అవ్య. ద్రు. ౧. అనుసారముగా, వెంట.

ఉ...దంతపు మెట్లవెంబడిం, జే వడి వీణ
మీటుటలు... ఆము. ౧. ౬౨.

తే. అంతట వినివి యతఁ డాలతాంగి బిల్చి, నా
తలంపువెంబడి నీవు నడచె దనుచుఁ, బలికి
తిదియేమి చెపుమ నీ భంగు లిపుడు.
కళా. ౬. ౬౫.

చ. తనహృదయంబు వెంబడిన తప్పకఘోటక
మంత నంతనే, పనుపడ నిల్చి ముందఱికిఁ
బాటి కెలంకులకుం దొలంగి తా, వెనుకకు
నేఁగుడెంచి కడువేడ్కఁ యొనర్పఁగ బంతి
యాడ నెమ్మిని గనకంపుఁగోల నడిమింటనె
త్రిమ్మరఁ దారి కొట్టుచున్.
ప్రభా. ౨. ౫౯.

తే. విప్రవెంబడిఁ బడి నీవు వేడ్కఁజనిన ...
దశకు. ౩. ౩౫.

ఆ. తగదు మిగుల నిచటఁ దడయఁగ సంకేతి,తం
బగుసమయంబు దప్పకుండ, నేఁ దిరిగి యరి
గాద నీవు నావెంబడి నడువవలయుఁ దాల్మి
సడలనీక.
రాఘవ. ౪. ౧౯. (భారతార్థమున.)

సీ...నిద్రితద్రుచ్ఛాయ నిలువక జరుగ వెంబడి
వర్షగపంక్తి పారలువెట్టె...
ఆము.౨. ౪౬.

సీ...ఒకటికి సెలవియ్య నుఱికి చీకటి దాక
బసులగాపరుల వెంబడిన పోదు.
హంస. ౩. ౧౪౨.

వెంబడించు. స.క్రి.(√ వెంబడి.) అనుగమించు,
వెనుకొను.

మహాస్రగ్ధర ... విదళించున్ వెంబడించున్
వెసు వకసురులన్ విష్ణుఁ డీరీతిఁద్రుంచున్.
ఉ. రా. ౨. ౭౩౭.

వ...వివిధ రాష్ట్రనివాసులు ... (శ్రీరాముని
వెంబడించిరి.... ఉ. రా. ౭. ౨౬౭.

వెంబడు. అ. క్రి. (వెన్ + పడు.)౧. వెంబడించు.

చ. జనవరమౌళి కొంతవడి సాహిణి నిశ్వాఱగంది
చూడకో, డనరవగాలుచూపుచు హుటా
హుటి నేగి పరాకు వీరు వీ, రని తముఁ దెల్ప
నందఱు రయంబున వెంబడవాగ నల్లి
యొ,య్యనఁ గనుమూసికన్దొరచునంతటిలో
మునిపీఠఁ జేరఁగన్. (కువల. ౨. ౫౭.)

౨. కామించు, వలచు.

సీ ...పరకళత్రముల వెంబడఁదలంచిననాఁడ
ప్రజ్ఞావిలాసంబు పదటఁగలసె ...
శివరాత్రి. ౩. ౬౨.

వెంబర. విణ. ౧. దుష్టుఁడు, దుష్టము.

చ. కలిగినవానిఁ బ్రాఁబలుకుఁగమ్మని
యూర్పులవాని యొందు నే,వెలుఁగునుగాని
వెన్వెలుఁగు వెంబడినిం జనువాని నంతటన్,
వెలసినవానిని న్గనని వెంబరపుట్టువు జాతి
పుట్టువుం,బలె గతి గానలేదు యతిమానస
హంసక కంసహింసకా. పాండు. ౨.౭౧.

౨. అవివేకి, మూఢుఁడు.

ద్వి. అమృతంబు గుక్కల కందిచ్చి పులిసి,
నంబలిఁ ద్రావఁగా నాశించునట్టి, వెంబర
గాని వివేకిగా డెందు.
ప్రభులింగ. ౩. ఆ. ౯౨పా. ౧౦. పం

**వెంబరవిత్తు.** విణ. (వెంబర + విత్తు.) మూఢా గ్రేసరుఁడు.

మ. మరుద్రూకాశాస్త్రభయార్తిఁ గుంజము సారన్ మత్తాళిమల్లాలిదు, స్తరహల్లోహాలశబ్ద మం దడర సంతాపించి చూతంబు డాయ రట త్కోకిలపజ్క్తులాడ వెతసేయన్ నిల్వ శంకించి వెం,బరవిత్తై నలువంకల న్మని వరాపస్మారలోలాక్షుఁడై.

సమీర. 3. ౨౩౪.

**వెకలి.** విణ. (సం. వికలః.) ౧. మూఢుఁడు.

ద్వి. సకలోన్నతుండనై సడిగన్న నన్ను, వెక లియై తమతండ్రి వెడలంగఁ ద్రోవ, యతి హీనసత్త్వుఁడై యడవులలోన, బలిమాలి ఫలములం బర్ణాశనముల, వికృతాంగుఁడై తపోవృత్తిమై నున్న, యొక పేదమానవుఁ డోపునే చెనక.

రం. రా. కిం. ౨౧౧. పా. ౧౪. పం.

సీ. వీథిలోఁ బొడగన్న వృద్ధుల సరికట్టి వెక లియై పలుమాఱు వెక్కిరించు...

ఉ. రా. ౪. ౩౨౩.

సీ. పట్టు పాఱు మటంచుఁ బారావతంబును వెకలినై చే నేల విడువఁబోతి ...

పారంగ. ౨. ౧౪౫.

౨. ఉన్మత్తుఁడు.

సీ.... వెకలియై తిరుగ నేవేళను రతికేళి కళలు దేరెడుమోము కళలుదేరె...

ప్రబం. ౧. ౪౫౫.

౩. అసక్తురాలు, ఆసక్తము.

గీ... వనిత చిన్నారి పొన్నారి వయసువాని, విప్రనందనుఁ గన్నంత వెకలియగుచు.

పాండు. ౩. ౬౨.

సీ...లీలఁ గర్పూరతాంబూల మర్పణఁజేసె వెకలిమాటలతోడి యొకపిసాళి.

ప్రబోధ ౫. ౫౯.

వ. ...పుప్పొళ్ల నుప్పతిల్లు సెత్తావులకు వెకలులై యాడు మొకరితుమ్మెదలు...

మనుచ. ౩. ౨౭.

౪. అర్థములేనిది.

సీ... వేడుకకైనను వెకలినవ్వులుమీఱ నటనఁ జూపట్టఁ బల్కుటయు లేక...

వాల్మీకి. ౧. ౩౩.

౫. వెఱ్ఱిది, అర్థముకానిది.

ఉ. వచ్చి పురంబువాకిట రువారఫుఁగోడె తనంబుతోడఁ, గన్నిచ్చకువచ్చుచేడియల నెచ్చరికించుచు ధూర్తకోటితో, మచ్చరి కించుచున్ వెకలిమాటలు మాయపుఁగూచి మారపుం, బచ్చలు చూపుచున్ సెలవి పొంఱఁగ నవ్వుచుఁ గేకరించుచున్.

విక్ర. ౮. ౮.

**వెకలితనము.** వి. (వెకలి + తనము.) అవివేకము, మూఢత్వము.

చ. అకట తదీయసత్కళల నాదటఁ గన్గొని మెచ్చి పాఠితో,సికముగ నిచ్చు నెమ్మనము చేడియరో మరలంగవచ్చునే, వెకలితనంబు చే నిటుల వేదనఁబొందఁగ నంచు నెచ్చె లుల్, పకపకనవ్వి కేరడపుఁ బల్కులు పల్కఁగ నెట్టకేలకున్.

చంద్రా. ౨. ౧౪౫.

**వెకలిపడు.** అ. క్రి. (వెకలి + పడు.) అవివేకము నొందు.

క. ఒకచెలిపై భ్రమపడి యా, సకి పిలువక యున్న మోహసంగతమతియై, వెకలిపడు చుంటి పదియు సుమకురున్ వగవంగవలదు మనుజాధీశా. (సానందో. ౫. ౧౪౮.)

**వెకిరింత.** వి. వెక్కిరించుట.

క. ...దీపములేనిరతుల్ సుఖ,లోపము లవి చీఁకటింటిలో వెకిరింతల్. (వైజ. ౩. ౨౬.

**వెక్క.** వి. వేఁడిమి.

క. అక్కొండి యీారెలుంగై, చెక్కులు సెమరించి సెఱులు చిక్కులువడి కా, ల్వ్రెక్కవసివాడి యూర్పుల, వెక్కం గెమ్మోవి కమలి వికలాంగముతోన్.

సారంగ. ౩. ౨౪౨.

సీ. తరుణరంభాగర్భదళ తాళవృంతంబు పైగాలి వెక్కన పలుకఁబాఱె...

నైష. ౨. ౧౧౯.

ఆ. వేఁడి వెచ్చ వెక్క వెట్ట వెచ్చన యన నుష్ణ సంజ్ఞ దగు... (ఆం. భా. ౧. ౮౩.)

**వెక్కఁబెట్టు.** స. క్రి. (వెక్కన్ + పెట్టు.) పైకి నిగుడించు.

తే. వెత్తి నీ రానుకతమున వడలునట్టిఁ చొక్కుఁ బోఁ దట్టి యొకకన్ను వెక్కఁబెట్టి, దడి గఱవఁబోవు వేఁపిచందమునఁబట్టి, పరుస మెచ్చుఁగ నూరుజప్రముఖుఁ బలికె.

శుక. ౩. ౩౨.

**వెక్కలి.** = వెకలి.

ద్వి...ఆ విప్రుకడఁ గూడి చదువు వెక్కలి బ్రహ్మచారులు ...

నవ. ౩ భా. (శ. ర.)

**వెక్కసపడు.** అ. క్రి. (వెక్కసము + పడు.)

౧. సహింపలేనిస్థితి నొందు.

క. ఎక్కడివెలుఁగిది యివ్విభుఁ, డొక్కఁడ యిటు చొచ్చె నెట్లొకో తెలి గనుచున్, వెక్కసపడియెడు మా కతఁ, డొక్క ముహూర్తమున మగుడ నొయ్యనఁదోఁచెన్.

హరి. ఉ. ౫. ౮౪.

వ. ఇవ్విధంబున విరోధివర్గం బుక్కుదక్కి వెక్కసపడి చూచుచుండ ...

భార. విరా. ౫. ౨.

తే.... ఓ కాంత, యిచటికనాథభుజబ, లాఢ్యుఁ, డొకరాజు వచ్చి నీయాత్మభవునిఁ. దునిమె నెఱుఁగ మతండు వోయినపథంబు

క. ఇక్కరణిఁ జెప్పినన్ విని, వెక్కసపడి వనము నందు విహరింపఁగ ...

భా. రా. అర. ౧. ౧౩౧.

౨. వింతపడు, ఆశ్చర్యపడు.

ఉ.. కయ్యము గల్గినట్లయిన గంధగజప్రకరంబు కుంభముల్, వ్రయ్యఁదురంగ పంక్తులుధరం బడఁ జేరిగముల్ బడల్పడన్, డయ్యమికీవు వెక్కసపడన్ గద పందువు సేయునాకు... (భార. ఉద్యో. ౩. ౬౪.)

ద్వి. మ్రొక్కుచు లోకంబు వెక్కసపడఁగ...

బస. పురా. ౧౩౪. పా. ౧౧ పం.

**వెక్కసపాటు.** వి. (√ వెక్కసపడు.) సహింపలేని స్థితినొందుట.

ఉ. వెక్కసపాటు భీతియును విహ్వలభావము నొంది యిట్లనున్...

భార. విరా. ౫. ౧౧౨.

మ... ఈశ్వరసతో నొంచుఁ బరాభవించుఁ గలఁచున్ రౌద్రంబుతోఁ దాఁకు వెక్కసపాటొందఁగ వ్రచ్చుఁ జెంచుఁ బొడుచున్ గారించుఁ దూలించు...

భా. రా. యు. ౧౯౪౪.

ద్వి. అక్కటా యిది యెంతయన్యాయ మనుచు, వెక్కసపాటున విధిని దిట్టుచును, నరపతి దూషించి నాతి నిందించి, పురమార్గమున వారు పోయి రా ప్రొద్దు.

ద్వి. శ. సా. ౨. ౮౮౫ పం.

**వెక్కసమందు.** అ. క్రి. (వెక్కసము + అందు.)

౧. సహింపలేనిస్థితి నొందు.

చ.... జనుల్ వెఱఁగుపడంగ ఖేచరులు వెక్కసమందఁగ శత్రుకోటికిన్, వెఱ

పొసరించు వార్త...

భార. అశ్వ. ౩. ౧౫౮.

ద్వి. ఎఱిఁగి యాకసమున కెగసి వేగమునఁ,
గఱకు రక్కసులు వెక్కసమంది చూడఁ,
గపులెల్ల మ్రొక్కనుత్కటసంభ్రమమునఁ,
గపిరాజు వచ్చి రాఘవునకు మ్రొక్కె.

రం. రా. యు. ౩౩౯ పా. ౨౯ పం.

ఉ. చెక్కటఁ జేయిచేర్చుకొని చింతిలు నుస్సుర
టంచుఁ జాపులన్, వెక్కసమందు లేమ
యొలవిం బొడఁగట్టినయట్ల నుండఁగా,
నక్కునఁ జేర్పఁబోవు భ్రమమంది వెసం
దలయూఁచునంతలోఁ, బక్కుననవ్వు నింతి
పయి జాలి నృపాలకమౌళి ఖిన్నతన్.

హంస. ౧. ౮౨.

౨. ఆశ్చర్యపడు.

ఉ. ఎక్కడనుండి యెక్కడకు నేఁగడినో
యిది యొక్క కాంతరూ, పెక్కుడు పెంపు
సొంపు మన కేర్పడుచున్నది దా వినీతయై,
మ్రుక్కుచు నీచభామినుల చొప్పునఁ
బల్కెడుఁ జారులుం గడున్, వెక్కస
మంది చూచెదరు వేగమ తోడ్కొని రండు
నెమ్మితోన్. (భార. విరా. ౧. ౩౦౩.)

ద్వి. వెక్కసంబందంగ వేయి మాడలును,
జక్కఁగ నెన్నితిఁ జౌకముల్ ద్రోచి.

బస. పురా. ౧౨౦ పా. ౧౦ పం.

**వెక్కసము.** వి. సహింపరానిస్థితి, దుస్సహత్వము.

క. ఇక్కైవడి రక్కసునకు వెక్కసమునఁ
దోడకు జముని వీరభటులతో, నుక్కున
మార్కొని పోరఁగ, నొక్కరుఁడుం
గలుగఁ డసురయూథులలోనన్.

ఉ. రా. ౩. ౩౩౬.

౨. లోకువ, చులకన.

ఆ. మనసిచ్చినఁ దన కోడరు, చనువిచ్చినఁ
బ్రజలు వెక్కసము సేయుదురాటను పతి,
మనసీయక కడుఁ, జనువీయక మెలప
వలయు సమ్ముఖచరులన్.

కవిక. ౨. ౧౭.

౩. వింత. ఆశ్చర్యము. (చూ. వెక్కసపడు.)

౪. అధికము.

ద్వి. అక్కఱ గండఁడై యప్పటప్పటికి, వెక్క
సంబున నూర్లు వేలు నవ్విచ్చి...

ద్వి. హరిశ్చ. ఉ. ౪౮౭ పం.

౫ బ. దుస్సహవచనములు.

ద్వి.... నేడు నీకల్ల నానిజము, గానక యేల
వెక్కసము లాడెదవు.

ద్వి. సారం. ౧. ౩౨ పా. ౧౮ పం.

విశే. ౧. దుస్సహము.

సీ... రాధేయబాహులే యాదితేయజాలకు
వెక్కసం బెవ్వని విక్రమంబు...

వి. పు. ౧. ౪౬.

సీ. మెచ్చి యాచెలువంబు మిక్కిలి చూడ్కికి
వెక్కసం బయి లోఁప వెఱఁగుపాటు...

కళా. ౮. ౬౭.

౨. దుర్లభము.

ఆ. ధేనుకాదులైన దానవులీతాళ, వనములోన
నున్నవారు దీనిఁ, జొచ్చి వాసవాది
సురగణంబులకైన, వెక్కసంబు బ్రదికి
వెడలి చనుట. (వి. పు. ౮. ౧౯౪.

౩. మిక్కుటము, అధికము.

చ. కొసరి వసంతకాలమునఁ గోయిల గోల్పిన
భంగి నేడ్చె న, బ్బిసరుహనేత్ర కొండచఱిఁ
బెద్దయెలుంగున వెక్కివెక్కి వె, క్కస
మగు మన్యువేగమునఁ గాటుకకన్నుల నీరు
సోనలై, యుసిరికకాయలంతలు పయోధర
ముల్ దిగువాఱునట్లుగన్.

కాశీ. ౫. ౧౬౮.

మ. రసికుండౌ రఘునాథ కీర్తిసతి యారా!
తొల్త వాగ్బంధముల్ రసవాదంబును రాజ

వళ్యవిధి నేరంబోలుఁ గాకున్న వెక్క
సపుంబ్రాధి వహించి శేషఫణిమూఁగంబేయఁ
దారాద్రి నుల్లసముల్వాల్కుఁగ ఛత్ర
చామరమహోలత్మ్ములగ్నన్ శక్యమే.
విజ. పీఠి. ౧౭.

వెక్కసి. విణ. (వెక్కసము + ఇ.) ౧. దుస్సహుఁడు. దుస్సహము, దుస్సహురాలు.

ఉ. మక్కువ నేనుఁ గేగఁ బదమా యను మా
యనువెల్ల రోయు నీ, వెక్కసిచెంచు సింగ
ములవేఁటల వేఁటలలీలఁ ద్రుంచుచున్.
చంద్రా. ౨. ౫౦.

ఉ. అంతట నొక్కనాఁడల ధనాధిపుఁడశ్వము
వాగ వెక్కసిన్, రంతులుమీఱ వెక్కి
పెనురౌతన జోడన చెల్వుఁ జూపుచున్...
కువల. ౪. ౧౯౯.

గీ. ఘనుల మునులను మన్నించి ఖరులగు ఖర,
దూషణుల భీషణాంబకాదులను గూల్చి,
యొక్కరక్కసి వెక్కసై సొక్కుదాని,
ముక్కుచెవులకుఁ గల నిక్కు చక్కుచేసి.
సీతా. ౬. ౧. ౧౦.

౨. హింసకురాలు, హింసకుఁడు.

మ.... తద్ధ్వానంబు ఘోరంబుగా, విని గో
గోపకగోపికానికరముల్ విభ్రాంతిమై
బిట్టుమే, లక్కనిచూడం జనుదెంచి రర్భకుల
కెల్లన్ వెక్కసిన్ రక్కసిన్.
వి. పు. ౪. ౧౨౦.

వెక్కసించు. అ. క్రి. (√ వెక్కసము.) ౧. అధికముగఁగనుపడు. (దుస్సహమగు,అని శ.ర.)

సీ....ఆ. నాకు వెక్కసించు నా యీ మహై
శ్వర్య, మింకఁ బరులకైన నేమిచెప్పు....
కవిక. ౫. ౯.

౨. అతిశయించు.

మయూరసారి వృత్తము. వెక్కసించె శైల
విక్రమంబు ళ్ళొక్కి శేషఫణంబులుద్రగం
బుల్ చక్కఁగా మయూరసారికొప్పున్,
నిక్క మంబుజాతనేత్ర శౌరీ.
అప్పక. ౪. ౧౭౧. ౨౧౧ పా.

వెక్కించు. స. క్రి. (√ వెక్కు.) ఉబ్బించు, స్థూలము కావించు.

ద్వి. తొలుకొడి కనువిచ్చి నిలిచి మై పెంచి...
ముక్కున నీకెలు జక్కొల్పి కడుపు, వెక్కించి
మెడ సాచి నిక్కి మిన్నూచి.
పండితా. పురా. ౨౬. పా.

వెక్కిరించు. స.క్రి. (సం. వికృ.) అపహాస్యము చేయు.

ఉ...నిన్నఁబుట్టి తా, నెన్నఁడు బ్రాఁతియయ్యె
మఱి యెన్నఁడు నేర్చెను వెక్కిరింపఁ
గాన్. (కు. సం. ౧౦. ౫౧౧.(

అ. చేతికొండ యొకనిచే నిచ్చి తలనున్న,కొండ
దొంతి కుదురుకొన నమర్చి, మగుడ నడుగ
వాఁడు నగచరుల్ నగ వానిఁ, గిక్కురించి
పోయి వెక్కిరించు.
భా. రా. యు. ౨౬౪.

గీ. వీథిలోఁ బొడగన్నవృద్ధుల నరికట్టి వెకలి
యై పలుమాఱు వెక్కిరించు.
ఉ. రా. ౪. ౩౨౩.

అ. క్రి. ౧. వికారచేష్టలుచేయు.

సీ. కనుఁగొని తత్పురోగమభూమిరుహశాఖ
లెక్కి యూఁచుచుఁ జాల వెక్కిరించు...
భాగ. ౧౦ స్కం. ఉత్త. ౫౪౪.

సీ... తే. పత్తి యనరాదు పైఁబడి వెక్కిరించు,
గామి డనరాదు మొగమున గంటు వెట్టు.
శుక. ౩. ౨౧.

౨. ఇతరుల వేషభాషాచేష్టల ననుకరించుచు హాస్యము కావించు.

చ.... తెలుఁగో కథచెప్పిన బొమ్మలాడఁగా,
వికటపు హాస్యపుంబ్రతిమ లుండఁగ వెక్కులు
వెక్కిరించు చున్. అని. ౧. ౧౩.

వెక్కిరింత. వి. (√ వెక్కిరించు.) పరిహసించుట, ఎగతాళిచేయుట, వెక్కిరించుట. (శ. ర.)
(చూ. వెక్కిరింతలాడు.)

వెక్కిరింతలాడు. స.క్రి.(వెక్కిరింతలు + ఆడు.) ఎగతాళిచేయు, పరిహసించు.

సీ. అలదుర్గ యొక్కిరింతల వెక్కిరింతలాడెడు
రీతి నాలుకలో వెడలఁ జాచు...
కవిరా. ౨. ౭౩.

వెక్కిలి-ఎక్కిలి. (సం. హిక్కా. త. విక్కల్.)
బ. వెక్కిళ్లు.

సీ...గీ... తనరారు హిక్కకు నామ మగుచు,
వెక్కనంగ వెక్కిలి యన వేదవేద్య.
ఆం. భా. ౧. ౧౪౦.

వెక్కు. అ.క్రి. (సం. హిక్కా. త. వెక్కల్.)
౧. వెక్కిలి విడుచు, ఎక్కిళ్లు విడుచు. ?

వ...మోపెట్ట నశక్యంబయిన నుక్కుసెడి
వెక్కినవారలం జూచి...
భార. ఆది. ౭. ౧౭౭.

సీ చివు రెల్లఁగని నొత్తి లోవరాకు గుత్తుక
డెక్కిని కోయిల వెక్కుచుండు...
కు. సం. ౫. ౬౪౧.

ద్వి. అక్కిలి పరపక యరగన్ను గొనక,
వెక్కక వీఁగక వెడగురు వడక...
పండితా దీక్షా. ౬౧ పా.

౨. ఏడ్చునపుడు వెక్కిలిధ్వనివలె ధ్వనించు.

క. ద్రోవదియు సుభద్రయు శో,కావేశం
బడర మ్రోయు లక్షులఁ దోఁగంగా వెక్కి
వెక్కి యేడ్చిరి...
? భార. ఆశ్ర. ౧. ౧౬౩.

ఆ. మిక్కుటంపు జాలిఁ వెక్కుటెలుంగుల,
వెక్కివెక్కి యేడ్చి క్రుక్కి సొక్కి, పాల
సుదిండితీర్పరులు బుజ్జగింప నృతండు గొంత
దిట మెదం గుదిర్చి.
అ. రా. యు. ౩౬౧.

౩. వగచు, దుఃఖించు,రోదనధ్వనిచేయు.

క. ఒక్కింతకోలమువారిని, నెక్కువయగు
కోలమువారి నెనయుదు కోలిం, దక్కువ
కులజానిఁ గవియన్, వెక్కుదు రిచ్చలను
గొలది వేశ్యలు జగతిన్.
విజ్ఞా. ప్రా. కాం. ౧౧౫.

క. ఒక్కతె భయశోకంబుల వెక్కుచు మెయిఁ
గల విలాసవిభ్రమలక్ష్మిల్, దక్కుటయును
నొకరొయిం పైఁ, నెక్కొన ధరణీశునెదుర
నిలచి వినీతిన్. (మనుచ. ౪. ౬౯.)

ఉ.... ఎక్కడఁ జొచ్చువాఁడ నిఁక నెవ్వరిఁ
జంపిననేమి యంచుఁ దా, వెక్కుచు లక్ష్మ
ణుండు పలవింపఁగ... దశా. భా. ౧౪౦.

వి. వెక్కిలి, ఎక్కిలి. బ. వెక్కిళ్లు.

తే.... ఊర్పు లెడతెగుఁ గన్నుల నొందు వికృతి
వెక్కు పుట్టును నాలుక వెగడు గదురు.
మార్కం. ౨. ౩౪.

సీ...కోకకతతుల పైఁ జేరి యాసక్తిచే నవి పీల్చి
యాపోవ కవలికేఁగి, కుసుమ మొక్కటి
యబ్బ వెస మూఁగి మధువాన నక్కొండు
టనుజేసి వెక్కు పుట్ట, నించుకించుక త్రాక
చంచువు పదనొంద నా తృప్తిఁ గ్రోలఁబో
నందు లేమి,... (భోజసుతా. ౩. ౨౨.)

సీ. వెక్కులు పెక్కులై వెతలఁ బెట్టుచునుండు
శ్వాసంబుఁ బుట్టుచు గాసిఁబెట్టు...
శివధర్మో. ౬. ౪౭.

విణ. సన్నద్ధము. సిద్ధపఱుపఁబడినది.

ఉ. క్రేవలవేఁటకాండ్రు దమకింపగ డింపల
వెక్కుబాకులం, బోవుచుమాంసభేదమువి

భోనము లాయితమైనదాఁక నా,యావిధు
లాచరించి యవి యన్నియు దేవర కెక్కు
నట్టి సం,భావన సేసి తారు మఱి బంతులు
సాగి భుజించుచుండఁగన్. కకు. ౧.౧౧౭.

అ. క్రి. ఎక్కు. రూ. (సం. హిక్కా.)
౧. వెక్కిళ్లు విడుచుట. ౨. ఏడ్చునపుడు
ఎక్కిళ్లవలె ధ్వనిచేయు.

తే. వేఁదియశ్రులు నిగుడంగ వెక్కివెక్కి
యేడ్వఁదొడఁగె లతాంగి ...
శృం. నై. ౪. ౮౭.

వెక్కుమీఱు. అ. క్రి. (వెక్కు + మీఱు)
వెక్కిలివిడుచు, వెక్కు.

చ. వివశత నొంది మేను నిడువెంద్రుక వెట్టఁగ
వెక్కుమీఱి క,న్గవఁ దెఱనంగ రాక పొరిఁ
గంపము నొందుచు నిశ్వసించుచున్ ...
హరి. ఉ. ౮. ౧౧౦.

వెక్కురు. విణ. (√వెక్కు. సం. వికారీ.) వికా
రము గలవాఁడు, వికృతము.

క. ఎక్కడి సుతు లెక్కడి సతు, లెక్కడి
సంపదలు మాయ లిన్నియు ధర్మం,
బొక్కటి నిజమని యెఱుఁగని, వెక్కురు
లకు సుకృతి భోగ విభవముగలదే.
కుచేల. ౧. ౬౨.

ద్వి. కడఁగి పేరడవులఁ గాయపండేరి, కుడిచి
వర్తించు వెక్కురు తాపసులకుఁ, బొడల
కళాసంబొ బూదిబొక్కణమొ, జడలొ
రుద్రాక్షలో సంపద లేల?
హరిశ్చ. పూర్వ. ౧౪౮౪.

క. చొక్కపు రక్కసికులమున, వెక్కురు
జన్మించినాఁడు విష్ణుని యందుఱ, నిక్కపు
మక్కువ విడువం, డెక్కడి సుతుఁ గంటి
రా తను సేశ్వర వెట్టిన్. భాగ. ౭. ౨౫౪.

క. నిక్కము శైవనటి కెందవ, యక్కరమున
కరిష్కృహంబు నందుండిన యా, వెక్కురు
కబ్బం బొడయనిఁ, జిక్కువడఁగఁ జేయుఁ
బగరచే రణభూమిన్. అప్పక. ౧. ౩౪౮.

సీ. వెక్కురు నాఁగను వికృతంబు విలసిల్లు...
ఆం. భా. ౧. ౧౩౨.

వెగచు. అ. క్రి. ఏడ్చునపుడు వెక్కిలివలె
ధ్వనించు.

ఆ. విడువవయ్య తండ్రి తడయక వచ్చెద, వీఁడె
నన్నుఁ జూచి వెగచివెగచి, కొడుకు వద్ద
వెగడుపడి యేడ్చుచున్నాఁడు ...
మార్కం. ౧. ౨౧౫.

ద్వి. వెడలు నిట్టూర్పులు వెగచుకుత్తికయు,
బడలిన మేనును బగిలిన మోము.
ద్వి. హరిశ్చ. ౨౦౮౩. పం.

క. వగచినచిత్తము నలఁదురి,... వెగచిన కంఠ
మునుతుఁగక, నెగసిన నిశ్వాస తతియు నీరజ
ముఖికిన్. కు. సం. ౫. ౫౮౭.

౨. వెక్కు, ఏడ్పు.

సీ. కాటుక నెఱయంగఁ గన్నులు నులుముచు
వెడలు కన్నీటితో వెగచువాని ...
భాగ. ౧౦. ౩౭౨.

వెగటు. వి. రోఁత, వైరస్యము.

సీ. విబుధ ధామముమీఁద వెగటుగల్గినఁగాని
వనజారి మిముఁజేరి చనక వెఱచు.
కువల. ౨. ౧౫.

సీ. భవ్యకల్పకపాదప పరిష్కృతాత్మీయ విపిన
ఖేలనముల వెగటుఁబూని ...
హరిశ్చ. స్థల. ౨. ౧౮.

ఆ. పరుల పంచఁ జేరి బ్రతికి కలా వృత్తి
మ్మెలంగు కోకిలమ్మనకుఁ బొ,సంగుఁ గాక

యింటఁ జిక్కు రక్షింపుమని, వెగటు చిలుక
నీవుఁ దగునె చిలుక. రసిక. ౮. ౧౪౨.

విణ. అనిష్టము.

శా. నీ రమ్యాకృతి నెమ్మదిం దలఁపుచు
న్నిద్రా విహారంబు లాహారంబు న్వెగటై
మనోభవ శర వ్యాకీర్ణ ధారాహతిన్ ...
కన్యారత్నంబు ప్రసూన తల్పమునఁ దాపా
ర్తిన్ వెసన్ దూలెడిన్. ఇందు. ౨.౧౪౪.

క. ఆమె యఁట నన్ను బలిమిన్, గామించు
నఁట యొడఁబడక క్రమ్మతి నేరా,స్వామికి
వెగటుగ ననునఁట, యా మాటకె యాజ్ఞ
వెట్టు నఁట విభుఁ డహహా.
సారంగ. ౨. ౨౧.

౨. విరసము.

క. అని యది యాడిన మాటలు, విని జంగమ
మూర్తి మదికి వెగటుగఁ దోఁపన్...
చెన్న. ౨. ౩౨.

తే. అయ్యలార మీ కల్ల నే మనిన మాట,
వెగటు కాదుగదా ... పరమ. ౩. ౩౪.

౩. వెక్కసము.

సీ. మును మ్రింగి వెగటైన వనతమ స్తతిగ్రక్కు
ఘుతవిరోచన మయూఖము లనఁగ ...
చంద్రి. ౮. ౩౮.

వెగడందు = వెగడొందు. అ. క్రి. (వెగడు +
అందు.) వైరస్యమును పొందు.
వ. వారును దత్క్రౌర్యాదర్శనంబున వెగడం
దినవారు గావున. ఉ. హరి. ౩. ౧౩౫.

వెగడు. వి. ౧. చలనము, తల్లడము.

చ. ఒకరుఁడ తాను భీతి వెగడొందెడు రెండవ
నన్ను నెట్టకే,లకుఁ దగఁ దేర్చునప్పుడు బలం
బులతోఁ గురు రాజు సూడ ...
భార. విరా. ౫. ౩౩౬.

తే. రోదన ధ్వని సెసఁగంగ రుక్మిణియును,
సత్యభామయు నప్పుడా సవ్యసాచి, కడకు
నేతెంచి పుడమిపైఁ బడిరి వనట, వెల్లి మునిఁగి
యుల్లంబులు వెగడునొంద.
భార. మౌస. ౧౦౨.

౨. తడఁబాటు.

చ. ... పుష్కరపత్ర నిభంబు లైన లోచన
ముల మూర్తి దెల్పఁగ ససంభ్రమతం జను
దెంచె నల్లన,ల్లన వెడ భీతిదోఁప జనులకు
వెగడయ్యెడు దృష్టిఁ జూచుచున్.
భార. విరా. ౧. ౨౪౬.

క. భగదత్తు నేనుఁ గడరిన, వెగడునఁ బాండ
వుల మొనలు విఱుగుటయు ...
భార. భీష్మ. ౩. ౩౫.

౩. భయము.

సీ. బోటికిఁ దోఁచినఁ బొలియుఁ దేకువయును
వెగడునఁ జెయ్యులు వీడుపడఁగ...
భార. విరా. ౨. ౪౦.

చ. అనుటయు నాతఁ డాత్మ వెగడంతయుఁ
బాయఁ బ్రబోధ లక్ష్మి గ్రమ్మనఁ దల
యెత్త నాద్యనసమాను సనాతను వాసు
దేవుఁ డాఁగని ... హరి. ఉ. ౯. ౧౦౭.

౪. దుఃఖము.

ఉ. నావుడు మూర్ఛవచ్చిన మనంబునకున్ ధృతి
యూఁత యిచ్చి సంభావన వారిఁ బోఁ
బనిచి పార్థివ ముఖ్యుఁడు దల్లడంబునన్,
దావురొనంగ లేక తనతమ్ముల నప్పుడ పిల్వఁ
బంచి నానావిధ చింత ముట్టికొనినన్ వెగ
డందుచు నార్తమూర్తి యై.
నిర్వ. ౭. ౧౦౯.

వెగడుపడు. అ. క్రి. (వెగడు + పడు.) ౧. తల్లడ
పడు.

ఆ. ...కొడుకు దద్ద వెగడుపడి రోదనము
చున్నాఁడు, బుజ్జగింతుననుచు ...
మార్కం. ౧. ౨౧౫.

సీ. సకలాంగ ఘటిత కంచుకమున విషపుచ్చు
విషధరాదుల భీతి వెగడుపడక ...
కాశీ. ౧. ౭౧.

ఆ. ... సదనులోని విప్రజనుల మీఁద, వెగడు
పడఁగఁ బాఱి వెఱపింతము ...
భార. ఆది. ౨. ౧౩౦.

౨. తొట్రుపడు, తడఁబడు.

వ. అట్టి యవక్ర విక్రమ పరాక్రమంబునకు
వెగడుపడి బాణుండు వేట మొగంబువడి
సేయునది లేక విన్ననై యున్న యెడ ...
భాగ. ౧౦. ఉ. ౪౨౩.

౩. భయపడు.

వ. హిరణ్యాక్ష మందరకులు బహిర్నిర్గమనం
బొనర్చి వెగటు పడి యున్న మృగంబు
నూఱడించి యాతిథ్యం బొనరించి.
వేం. పంచ. ౨. ౧౪౯.

**వెగడుపఱచు.** స. క్రి. (√ వెగడుపడు.)
వెగడు పడఁజేయు, తల్లడపఱచు.

క. అతఁడందఱ విశిఖంబులు, వితథమ్ములు సేసి
వారి వెగడుపఱచి యుద్ధతి సైంధవు పోరెడు
నెడ, కతిరయమునఁ దేరు నడుపు నాసమ
యమునన్. భార. ద్రో. ౨. ౯౩.

తే. ... మగుడఁ జదువుఁ జెప్పఁదలఁచె.

క. తలఁచి యదియవు డొకింతయుఁ, దొలుతటి
తరువాయి మఱియుఁ దోఁచక మఱియు,
వ్వల నరసిన శ్రుతి శబ్దము, పలుకుసకున్ రాక
వెగడు పఱచినఁ గలఁకన్.
పర. ౧. ౧౧౩.

౨. తడఁబడఁ జేయు, విభ్రాంతి నొందించు.

తే. ఇట్లు గృహరాజ కేళి తా నేకరత్న, వివిధ
రుచి వైభవంబులు వెగడు పఱుప ...
వసు. ౪. ౬౩.

**వెగడొందు = వెగడందు.** అ. క్రి. (వెగడు + ఒందు.) ౧. తల్లడపడు, చలించు.

సీ. విబుధారి కినుకకు వెగడొందు తెఱఁగున
వనరాశికరము ఘూర్ణనము నొందె ...
నృసిం. ౨. ౧౦౬.

సీ. వెగడొంది రవితేరి నొగలఁ గట్టినయట్టి
వాహంబు లణకలు వైచుకొనియె ...
విక్ర. ౪. ౫౦.

౨. తడఁబడు.

క. వగముట్టికొనినఁ జిత్తము, వెగడొందఁగ
మేనుగలయ ...
భార. విరా. ౨. ౩౦౮.

౩. భయము.

క. వెగడొంది యిట్లు వలుకఁగ, నగునే ...
భార. విరా. ౪. ౬౬.

గీ. విఱిగి పాఱినఁ బోనీక వెన్నడించు, హల
ధరునిఁ జూచి వెగడొంది యబ్ధిలోన,
నుఱికి ... ఉ. హరి. ౩. ౧౦౬.

**వెగవెగ.** వి. శీఘ్రముగా నడచుటయందగు ధ్వని కనుకరణము; గబగబ.

సీ. వేగుఁ జూచెదమంచు వెగవెగఁ జనుదెంచి
దూరమేఁగుచు బొదల్ దూఱువారు. ...
కృష్ణ. ౩. ౪౬.

**వెగ్గము.** వి. పంతము.

ద్వి. ఒకతోఁటలో నితఁడున్న మాయక్క,
వెకలియై తనుఁజూచి వెగ్గంబులాడి, లలి
తంబులైన విలాసముల్ చూపి, వలపింపఁ
గలవె యీ వటువేషధారి, నని ...
ద్వి. పరమ. ౪. ౬౬. పా.

**వెగ్గలమాడు.** అ. క్రి. (వెగ్గలము + ఆడు) అధికముగా సంచరించు.

ఉ. ... తరుమరంద సరస్సరవింద గోష్ఠికిన్, వెగ్గలమాడు తేంట్లు ...
ఆము. ౫. ౧౨౨.

**వెగ్గలము.** విణ. (క. వెగ్గళ.) అధికము.

ఉ. వెగ్గలమైన మోపుగడు వీఁకన యెత్తఁగఁ బోయి మూఁడటన్, బ్రొగ్గతిలం బడెన్ ...
హర. ౧. ౨౧.

క. ... పెనుఁజెరల వలలనురలు మృగములన్, దగ్గఱి చంపెడువేడుక, వెగ్గలమై చిత్తమందు వెంటాడింపన్.
భాగ. ౧. ౪౫౪.

క. సలసలమను కలశజు వె,గ్గలపుం గినుక యను నెసటఁ గల వడివడి నా, దలయంటి చూచు కొనిరయే, నిలువెడలితి నా తృణంబ యెత్తిన భీతిన్. పాండు. ౫. ౨౦౪.

సీ ... గీ. జలజనాభుండు కోదండ చతురుఁడగుచు, గుఱ్ఱములతోడ సారథిఁ గూలనేసి, వారిచయుఁ జక్రరక్షకద్వయముఁ ద్రుంచి, కల్లు బిల్లులుచేసి వెగ్గలము నవ్వె.
ఉ. హరి. ౩. ౯౯.

గీ. బాల్యమున నుండి యౌవన ప్రాయమైన, యపుడుఁదన భార్యయందు నయం బొకింత గానఁడయ్యెను వేము వెగ్గలము పెరుగఁ, గలదె మాధుర్యగుణము తిక్తంబుగాక.
జై. భా. ౪. ౭౬.

**వెగ్గలించు.** స. క్రి. (√ వెగ్గలము.), త్రోసిపుచ్చు.

ఉ. మన్ననచేసి మీరు బహుమానముతో నను నేలినారు నేఁ, గన్నది చెల్పకుండిన నఘం బగుఁ గాదవి వెగ్గలింపకే, విన్నప మాలకింపుము ... సారంగ. ౨. ౬.

**వెగ్గలీఁడు.** విణ. (వెగ్గలము + ఈఁడు.) అధికుఁడు, గొప్పవాఁడు.

సీ. అబ్ధిసంభవ యితఁడు వో హాలహాలపు విషము బుక్కిటఁ దాల్చిన వెగ్గలీఁడు ...
కాశీ. ౫. ౧౧౬.

(శ. ర. పా. - వెంగలీఁడు ముద్రిపా.)

**వెచ్చ.** వి. ౧. వేఁడిమి, తాపము.

సీ. వలరాచరాచ వాఁడవికాఁకు కనువెచ్చఁ గరఁగిన యలక నికరపుఁ జోటు ...
మనుచ. ౨. ౯.

చ. ... వెచ్చలం, గరికిరి కాసరాంగములఁ గప్పిన రొంపులు నందయాఱఁగన్.
ఆము. ౨. ౪౪.

౨. జ్వరము.

సీ.... వెక్క నా వేఁకి నా వెచ్చయనఁగ జ్వరమొప్పు ... అం. భా. ౨. ౧౨౭.

౩. కాఁక, తాపము.

చ. ... అబ్ధిరా,డ్విరహ భరంబున నొప్పడము వెచ్చకుకాంతి యొనర్పవాహినీ, తరుణులు మేన దట్టముగఁ దాల్చిన ముత్తెపుఁ బేరులో యనన్. ఆము. ౨. ౫౧.

విణ. ౧. ఉష్ణము, వేఁడియైనది. (వృత్తియందు వికల్పముగ నిగాగమము.)

ఉ. వెచ్చని కన్ను నీ రడర వీడిన వేసలితోడఁ బెల్చనా, పుచ్చి తనూజాలం బనవ ...
భార. అను. ౧. ౨౯౯.

సీ....గీ. తేట నులివెచ్చ నీరునఁ దీర్థమాడి...
హర. ౨. ౧౦౪.

చ. తెలి నులి వెచ్చ యోగిరముఁ దియ్యని చేరులుఁ దిమ్మనంబులున్ ... ఆము. ౧. ౭౧.

౨. తీక్ష్ణము, అసహ్యము.

చ. వలచుట జాతిలోనఁ దలవంపగునే కద
యింక దాఁచఁగాఁ, గలిగెడి దేమి నా
ననుపు కాండ్రను దొల్లిఁటివారి వీథిలో,పలఁ
గనినంత వెచ్చ నగుపాటున కోరిచి యన్న
దమ్ములం, బిలిచిన రీతిఁ బిల్వ వలపించెఁ
జామీ యతఁ డంబుజాననా.
కువల. ౪. ౧౫౧.

క్రి. విణ. వేఁడిగా.

తరలము. సమరశూరులు పాండుపుల్ జితశత్రు
లున్నత చిత్తు,లుత్తములు వారలతోడి
వైరము ధర్మయుక్తిఁ గరంబ యు,క్షము
ప్రజాక్షయ కారణం బని తద్దయున్ భయ
మందుచున్, విమనస్కుఁడై పడియుండె
హాయని వెచ్చమార్చుచు విన్నఁడై.
భార. సభా. ౨. ౩౧౦.

వెచ్చఁబడు. అ. క్రి. (వెచ్చన్ + పడు) వేఁడి కలదగు.

(వ్యవ.) స్నానమునకు నీళ్లింకను వెచ్చఁబడలేదు.

వెచ్చఁబెట్టు. స. క్రి. (వెచ్చన్ + పెట్టు) వేఁడిమి కలిగించు.

(వ్యవ.) నేయి వెచ్చఁబెట్టుము.

వెచ్చకాఁడు. వి. (వెచ్చము + కాఁడు.) విటుఁడు. (బ. వ.) వెచ్చకాండ్రు.

వ.... ఈ ధనంబుల నేమి యర్యాడు నయ్యా
రో, ఈ వెచ్చకాఁ డెచ్చటికేఁగిన నేమి? ...
నా చేసిన దురితం బెంతకాలంబు నరకం
బులనుండినను దరుగునే, పడచి కుడుచు
పడఁతికంటెఁ బాపిని యున్నదే యని
విచారించు ... జాహ్నవీ. ౪. ౪౧.

సీ. ... గీ. సురల యాఁకటి కూడు ప్రముచ్చులకుఁ
గీఁడు, దిక్కులకు కోఁడు వెలుఁగుల యిక్క
జోడు, లచ్చి సైదోడు రేఁబోటి వెచ్చ
కాఁడు, చంద్రుఁ డలరారె సత్కళా
సాంద్రుఁడగుచు. కవిజ. ౩. ౭౯.

విణ. మిక్కిలి వ్యయము చేయువాఁడు. (శ. ర.)

వెచ్చన. వి. వేఁడిమి, ఉష్ణము.

ఆ. వేఁడి వెచ్చ వెక్క వెట్ట వెచ్చనయన, నుష్ణ
సంజ్ఞ తగు ... ఆం. భా. ౧. ౪౩.

విణ. ఉష్ణముగలది, వేడియైనది.

సీ. తొలుదొల్త నుదయాద్రి శిలఁదాఁకి
తీండ్రించు నసిలోహమున వెచ్చనై
జనించె ... ఆము. ౧. ౩౬.

క్రి. విణ. ద్రు. వేఁడిగా, వెచ్చగా.

ఉ.... చెలింగని వెచ్చ నూర్చుచున్.
అయ. ౫. ౩౯.

వెచ్చపడు. అ. క్రి. (వెచ్చము + పడు) వ్యయమగు.

క. కడు మేటి రైన దొరచే, బడినది మీసొమ్ము
వెచ్చ పడ నోపిన నీ, కడగొంత దివ్య
వచ్చున్ ... పరమ. ౫. ౫౩.

ద్వి. చేతివిత్తము మున్ను చెనటిరై పోయె, ...
పలుతెఱంగుల వెచ్చపడి ...
నవనాథ. ౫. ౨౧౧. పొ. ౧౯. పం.

వెచ్చపఱుచు. (√ వెచ్చపడు.) స. క్రి. వ్యయముచేయు.

గీ....పచ్చపైకంబు నిందులో వెచ్చపఱుప,
నెన్ని చెప్పినమాట లింకేటి కనిన ...
హరిశ్చ. ౪. ౧౯౯.

వెచ్చపెట్టు. స. క్రి. (వెచ్చ + పెట్టు) ౧. వెచ్చించు, వ్యయముచేయు.

క. కట్టక కుడువక యొసఁగక, బెట్టక తమ
తండ్రికూడఁ బెట్టిన సిరిఁ...దనయిచ్చ వెచ్చ
పెట్ట దలంచెన్. విక్ర. ౨. ౧౬౩.

ద్వి. ఏలాకో కౌసల్య యొదవుబ్బియుబ్బి, వేల సంఖ్యాధనంబు వెచ్చపెట్టెడిని ...
ర. రా. అయో. ౭౭. పా. ౨౭. పం.

తే. మాద్రి మీరు విరూరిపే దాద్రి రాజు, దానధారార్థ మఖిల ప్రధాన నదుల, వెచ్చపెట్టుటఁ దలఁకి యో విబుధ తటిని, తరుణ శశిమౌళి జడలలో దాఁగియుండు.
పాండు. ౧. ౮౨.

౨. విడుచు.

చ. హరిపద పూజకుం దొలఁగి యంత్యజుఁ గొల్చి కులాభిమానముల్, సరగున వెచ్చపెట్టి హరిచందన కీర్తులు వీటఁబుచ్చి ...
హరిశ్చ. ౫. ౯౨.

౩. చెఱుచు, పాడుచేయు.

చ. ... మాయ నింద్రియాధిక మతియైనవాఁడు దన తెంపునఁ జిత్తము వెచ్చపెట్టి పాతకములఁ గూలకున్నె ...
భాగ. ౬. ౫౧౮.

౪. ఉపయోగించు, అనుభవించు.

శా. ఏలా వేయును విన్నవింపఁగఁ ద్రిలోకేశామహేంద్రాది దిక్పాలైశ్వర్యము వెచ్చపెట్టుకొను మింకన్ సృష్టి నష్టంబగున్ ...
వరాహ. ౧౦. ౧౭.

ఆ. వలసినట్లు దివ్యవస్తువులెల్ల నా, యిచ్చవచ్చినట్లు వెచ్చపెట్టి ... ప్రభా. ౧. ౭౫. ("నా యిచ్చ ననుభవించి వెచ్చపెట్టి" అను పాఠాంతరమున "వెచ్చపెట్టు=వ్యయపఱచు, వెచ్చించు" అని యర్థము.)

**వెచ్చపోవు.** అ. క్రి. (వెచ్చము + పోవు.) ౧. వ్యయమగు, తఱుగు.

చ. తన ధన మించుకంతయు వృథా వ్యయమైనది లేదు వైష్ణవార్చనలకు వెచ్చపోయినది సర్వము ... పరమ. ౪. ౧౪౭.

సీ. కళ వెచ్చపోని నిర్మల చంద్రబింబంబు పరభృతంబంటని సరసకిసలము ...
రామా. ౪. ౬౪.

౨. నశించు, చచ్చు.

ఉ. ... అలిని బిడ్డల న్విడిచి యాకటి చిచ్చున వెచ్చపోవు వారేలిక బంటు వాని యొకయించుక లేక కృశించువారునై, తూలె జనంబు మీన శని దోషము దాఁకి నిరస్తసస్యమై ...
కాశీ. ౩. ౧౫౩.

**వెచ్చము.** వి. (సం. విసర్జనమ్.) ౧. వ్యయము.

గీ. వెచ్చమన్న దానంబఁట వేఁడువాఁడ, ధీశ్వరుండఁట తాము పతివ్రతలఁట ...
కళా. ౬. ౯౦.

క. ఈ మెటు వెచ్చము చేసిన, నా మేరు మహాద్రి యంత యర్థంబైనన్, వే మొదలికి మోసంబగు ... విక్ర. ౨. ౧౬౮.

క. ఎచ్చోఁగజ ఘోటక్రియ, తచ్చర్వణ సుభట జీవిత ద్విజసురపూజోచ్చ నిజభోగముల కగు, వెచ్చము వెచ్చంబుగాదు విత్తంబునకున్. ఆము. ౪. ౨౬౨.

౨. ఇంటి వాడకమునకుఁ గావలసిన చిల్లర సరకుల యప్పు.

ఉ. వెచ్చము పెట్టుమన్నఁ బదివేలకు నుద్దరువొల్లరు ... పి. శకుం. ౧. ౮౭.

సీ. బచ్చయి వెచ్చంబు లిచ్చురొక్కపు దొరదళవాయిరై కొల్చు చిలువ తాల్పు ...
అచ్చ. రా. సుం. ౪౧.

౩. ఇంటి వాడకమునకుఁ గావలసిన చిల్లరసరకు.

క. ఎల్లుండి సమారాధన, చిల్లర వెచ్చములు గొనఁగ శీఘ్రమె యిది యీ, పల్లియ సంతకుఁ జని ... శుక. ౨. ౧౭౩.

**వెచ్చించు.** స. క్రి. (√ వెచ్చము.) వ్యయపఱుచు.

సీ. అశ్వగో మహిష రూప్య సువర్ణ వస్త్రంబు లెన్ని వెచ్చించిన నేమిఫలము ...
భీమ. ౪. ౩౨.

క. ఐనను బలికార్యము తనప్రాణము వెచ్చించి యైన భటునకుఁ జేయం,గా నగు ...
ప్రబోధ. ౩. ౬౯.

**వెచ్చు.** అ. క్రి. ౧. క్రాఁగు, తప్తమగు.

ఉ. వెచ్చెస మిన్నభింబు పరివీత శరాల్పుల దైత్యసైన్యముల్, విచ్చె ...
కకు. ౨. ౧౨౫.

గీ. ...అట్లు సిద్ధుఁడరుగ నమ్ముగ్ధ మృతిఁబొంద, విరహవహ్ని చేత వెచ్చివెచ్చి.
భోజరా. ౩. ౪౦.

ద్వి. పాముచే నీవు లోఁబడియుండుటెఱింగి, వేమాఱు శోకాగ్ని వెచ్చుచుండితిమి.
ద్వి. భాగ. ౨. ౨౩. పా.

సీ....గీ. వెచ్చెననఁ గంది నలఁగను వేఁగ నలఁగఁ, గమలె నలఁగను దనరు నేకార్థములుగ.
ఆం. భా. ౩. ౯౯.

౨. సంతాపము నొందు, పరితపించు.

క. అచ్చపు వెన్నెలచేఁ గడు, వెచ్చుటలును మాన మెడలి వెడవిల్తునిచే, నొచ్చుటలును బ్రియుఁడచ్చిని, ముచ్చటలును విప్రలంభమునఁ జెప్పఁదగున్.
కావ్యా. ౩. ౧౨౩. ప.

ఉ. మచ్చిక రెట్టిగాఁగఁ దన మందిరమొంది యభీప్సితవస్తువుల్, నెచ్చెలు లెల్లఁబొంది సుఖలీలఁ జరింపఁగఁ జేయలేమికిన్, వెచ్చని యూర్పు నించుకొని విన్నఁదనంబును బొంది నెవ్వగన్, వెచ్చినయట్లు సజ్జనుఁడు వేటొకదుర్దశచేత నొచ్చునే. కేయూర. ౩. ౨౪౪.

సీ. కుదువ వేడుక పుట్టి కడియు నోటికిఁ బోని వేదన వెడవెడ వెచ్చివెచ్చి ...
వాసిష్ఠ. ౧. ౧౨౪.

౩. కాలు, దగ్ధమగు.

వ...లలాట లోచను లోచనంబు చిచ్చున నతండును వెచ్చి నివ్వఁగూడెనే ...
హర. ౩. ౯౧.

ఉ. చిత్రజవైరి పాల శిఖిచే జగమెల్లను వెచ్చఁజూచెనో, యిత్తెఱఁగంటి పట్టమున కే నిటులుండక యుండ నెవ్వఁడే, నెత్తులు వెట్టెనో ... వాల్మీకి. ౩. ౪.

౪. మండు, జ్వలించు.

ద్వి. వేఁడి వేలుపుడిగి వెచ్చి ద్వీపంబు, లీడేర్చు రీతి ... ద్వి. హరిశ్చ. పూ. ౧౧౫౪.

వి. వేఁడిమి.

కం...ము,చ్చిచ్చునను వెచ్చమర ...
ఆము. ౩. ౨౫.

**వెజ్జటీకము.** వి. (వెజ్జు + టీకము) వైద్యము.

క. నేరని వెజ్జటీకము దా,నేరుతు నని రాజపురుషునికిని తరునికిన్, జూరాదు లిడిన దుర్జను, నారసికొనవలయు నుత్తమాధమ విధులన్. విజ్ఞా. ౨. ౬౪.

**వెజ్జు.** వి. (సం. వైద్యః.) వైద్యుఁడు, భిషక్కు.

ఆ. ఇన్ని సంకటముల నిబ్బంగి నెంతయు, నొగులు చిత్తవృత్తి నొవ్వుదీర్ప, వెజ్జ వీవ కావె ... భార. ఉద్యో. ౩. ౨౬.

శా...వేరం బెత్తిన ధాత చెయ్యి యిదుపన్ వెజ్జెవ్వఁ డూహింపఁగన్.
దశకు. ౨. ౭౯.

ద్వి. వెజ్జులు వచ్చిన వేగ మాన్పెదరు, లజ్జింపనేటికి లతాంగి నీకు ...
రం. రా. అయో. ౯౨. పొ. ౧౦. పం. (౧౦౪. ౫. నవ్య. సం.)

ద్వి. మందు వెట్టఁగ లేము మనఁజేయ లేము,
వెదకనంపఁగ లేము వెజ్జఁ జేలేము ...
ద్వి. హరిశ్చ. ఉ. ౧౯౩౩.

**వెజ్జఁదనము.** వి. (వెజ్జు + తనము) వైద్యత్వము. వైద్యుఁడయి యుండుట.

గీ. ... కడవనాడకు చాలు నీ గొడవయేల, వెజ్జఁ
దనమేల యని మది లజ్జవొడమి.
మనుచ. ౫. ౧౩.

**వెజ్జురాలు.** వి. (వెజ్జు + అలు.) వైద్యము చేయు స్త్రీ.

గీ. అనుచు వారలు పలుకంగ నాక్షణమున,
జయను విజయను దోడ్కొని జవన గతిని,
వెజ్జురాండ్రును మీరు నా బిడ్డచెంతఁ, బది
లముగ నుండుఁడీ యంచు వనముఁజేరి.
పార్వ. ౪. ౧౬౮.

మ. ... ఉగ్రదశ వక్త్రాద్భచ్ఛిరోభారమున్,
శమమొందింపఁగ వెజ్జురాలయిన కాంతన్
భక్తి భావించెదన్. చంద్రా. ౧. ౨.

**వెటాకా(టకా)రము.** వి. ఎత్తిపొడుపు.

శా. కావిమ్మెంత ప్రయోజనం బనుచు వెటాకా
రంబుగాఁ బల్కు, నాఖానోత్తంసముఁ
జూచి ... రంగా. ౨. ౪౫.

**వెట్ట.** వి. ౧. వేడిమి.

గీ. అట్టి వేసవి వెడిదంబు వెట్టకతన, నేల
నందందు విరిసిన నెఱియలందు ...
వాల్మీకి. ౨. ౭౦.

(మార్తాండుఁడు) గీ. త్వష్ట కన్యక సంజ్ఞ నుద్వా
హమయ్యె, న వ్విలాసిని యమ యము
నాహ్వయములు, గలుగ కొడుకును గూఁ
తును గనియెఁ గని ని,జేశ్వరుని మేనివెట్ట
సహింపలేక. వరాహ. ౫. ౮౯.

సీ. ... జిగి దొండ పండంచుఁ జేరవచ్చిన చిల్క
బలువెట్ట దిగులొంది పరువు లిడఁగ ...
ఇందు. ౩. ౨౯.

౨. వేసవికాలము, వెట్టకారు.

చ. సరియగు నిట్టి వెట్టలను సర్వము నంచు ...
ఆము. ౨. ౪౮.

౩. తాపము.

ఆ. ... కాంత నామధేయ మెంతయుఁ గైకొని,
చిలుక నీకు వెట్టసేయఁదగునే ...
కవిజ. ౨. ౫౦.

గీ. ... పేదగీస్తుల కొంపలు బిట్టుగాలెఁ, బజల
వెట్టలు వడినింకఁ బాఱెనపుడు.
అచ్చ. రా. కిష్కిం. ౬౮.

విణ. వేఁడి, ఉష్ణము.

గీ. వెట్టదినముల మడుఁగుల మట్టి గలఁప, బుడ
బుడధ్వని వెడలు బుద్బుదములందుఁ, జిలుప
చిలుపని సేతుల జిడ్డుదేఱు ...
మనుచ. ౪. ౧౮.

సీ. రే రాచ గేదంగి రేకు క్రొవ్వెదతోడ వెట్ట
కన్ జేగురు బొట్టుతోడ.
పాంచాలీ. ౩. ౮౮.

ఉ. వెట్టగ మందమారుతము వీవఁగఁ దోడనె
వ్రాలెఁ బై విరుల్, మిట్టిపడంగ ...
సారంగ. ౨. ౧౬౯.

చ. పరిసర చంపక ప్రసవ పంక్తులఁ బుట్టిన వెట్ట
వాసనల్, గరళముల్లై పయింబొరయగా నిలి
వచ్చు మదాళి నీ పరం. పరలు భవత్పదాబ్జ
ములపై నొలసెన్ ... ఉ. రా. ౬. ౪౩

**వెట్టకాలము.** మి. వి. వేసవికాలము, గ్రీష్మ
ఋతువు.

వ. ఇట్టి వెట్టిదంపు వెట్టకాలంబున గట్టుపట్టి
యిట్టిట్టనరాని తీరంబునఁ బంచాగ్ని మధ్యం
బున నుండి ... మృత్యుం. ౨. ౪౫.

వెట్టచెవులతపసి. (వెట్ట + చెవులు + తపసి.) ఉగ్రశ్రవసుఁడు.

గీ. విను నిరాహారి కేండ్లక వెవ్వెట్ట చెవుల, తపసి రాయఁడు ... నీలా. ౨. ౨.

వెట్టము. వి. శత్రువు.

సీ. కలువలచుట్టంబుఁ గలువల వెట్టంబుఁ దశ రెండు కన్నులై తనరువాని ... ద్వా. ౨. ౧౩౭.

వెట్టి. వి. (సం. విష్టిః.) ప్రతిఫలము లేక చేయు పని.

సీ. ఏరాజు రాజులనెల్ల జయించి మున్ వెట్టికిఁ బట్టె దోర్విక్రమముల ... మార్కం. పీ. ౩౫.

క. అట్టి ఘనపుణ్యవాహిని, నట్టింటనె యున్న యది...వెట్టిగదే భూమిఁ దిరుగు విడువు దురాశల్. భోజరా. ౬. ౩౦౨.

సీ. పలుకఁ గల్గిన జాలుఁ బనులు సేయించును వెట్టిపైఁ బడ లేటి పట్టిసైన ... యయా. ౧. ౧౩.

వెట్టిగొను. స. క్రి. (సం. విష్టి.) (వెట్టి + కొను) ప్రతిఫలమీయకయే పని చేయించు.

శా...వాలాయంబున మమ్ము వెట్టిగొనుచున్ వర్తింపుచున్నారు మీ, రాలస్యం బొనరించినన్ బ్రదుక శక్యంబెట్లు మాబోంట్లకున్. భీమ. ౪. ౧౧౯.

చ. మదమున నింద్రుఁడాదిగ సమస్తనిలింపుల వెట్టిగొన్న నా, యెదుర మృగాక్షి నీవకట హీనపరాక్రము రాముగీముఁ జెప్పెదవు... భా. రా. అర. ౨. ౧౦౫.

వెట్టిజేవరాలు. వి. ప్రతిఫలమును గోరకయే వచ్చి పనిచేయు స్త్రీ.

సీ. ... గీ. పేరుగల యట్టి జన్నంపుఁ బైరుఁ బాఁప, వెట్టి జవరాండ్ర కిరుగోరు వెట్టు కాపు, లట్టి యచ్చరజాలిలో మొట్ట మొదలి, పేరు గలదాన మేనక పేరుదాన. చంద్రా. ౩. ౧౦౧.

వెట్టివాఁడు. వి. గ్రామమునందు దినబత్తెము లేక వెట్టిపని చేయువాఁడు.

సీ. వెట్టివానికి నేల విమల విచారంబు పరదూష కున కేల పరము చింత ... నీతి. ౪. ౩.

వెట్టీఁడు. విణ. (వెట్టి + ఈఁడు) ప్రతిఫలము లేక చేయువాఁడు, వెట్టిచేయువాఁడు. (శ. ర.)

వెడ. విణ. ౧. అల్పము, కొంచెము.

ఆ. వేగజాము గలుగ వెడనిద్రఁ బొందుదు... భార. అర. ౫. ౩౦౭.

చ...ససంభ్రమతం జను రెంచె నల్ల నల్లన వెడ భీతిదోఁప జనులన్ వెగడయ్యెడు దృష్టిఁ జూచుచున్. భార. విరా. ౧. ౨౩౬.

ఉ. ... నెన్నడు మొకించుక గౌరవమందెఁ గోరికల్, నెక్కొన నిక్కనారు వెడనిద్ర కనుంగవఁ జేర నింతికిన్. చంద్రా. ౧. ౧౦౦.

చ. వెడనగ వంకురింపఁ బృథివీ నరసూనుఁడు వల్కు ... సారంగ. ౨. ౬౪.

౨. తుచ్ఛము.

క. జడమతులైన జనంబుల, వెడ మాటలు మాన్ప నిదియ వెరవు ... నిర్వ. ౭. ౧౧౯.

క. ఈ వెడ మాయల నిప్పుడుఁ, బో విడువవు... భార. శాం. ౬. ౧౭౪.

ఉ....అదియొప్పని లాగయి మీకుఁ దోఁచినఁ, బొంకెటకైనఁ దక్కు వెడబుద్ధులఁబోయిన నే నవశ్యమున్, దండన సేయుదున్ ... పరమ. ౨. ౬౪.

క. వెడ దెరువు లిచటఁ జెల్లవు, పుడమినహహా
దొంగలానఁ బొడిచినఁ గోకల్, విడు
తురె ... కళా. ౩. ౨౦౪.

౩. వికృతము.

క. వెడగోఁతల నెత్తురోలుకఁ, బడఁద్రోచినఁ
వచ్చి కుక్క పదువు వెనుకకుఁ, జడిసెఁ
గబళింప నొల్లక ...
భార. శాం. ౩. ౫౦౮.

క. బుడబుడ నెత్తురు గ్రక్కుచు, వెడ రూపము
దాల్చి గ్రుడ్లు వెలికుబుక ...
భాగ. ౩. ౭౦౧.

సీ. తొడగులు సడలికుత్తుక వెండి మిక్కిలి వెడ
రూపులై పడ్డ వీరభటులు ...
జై. భా. ౨. ౭౮.

౪. వ్యర్థము, వట్టిది.

ఉ. అవల వచ్చునాపదల కన్నిటి కోర్చు లతాంగిఁ
గూర్చి కాకీ వెడమాటల న్మరలఁ గొన్ని
విధంబులఁ జూపి చెప్పినన్ ...
భార. విరా. ౨. ౭౮.

క. మీకును మీపతి యానతి, మాకును మా
భర్తయాజ్ఞ మన్నింపదగున్, వాకోవాక్య
మ్ముల వెడ, వాకాట్లం బల్చుజంబు వలవదు
సేయన్. శివరా. ౪, ౭౦.

చ. హృదయము లెప్పుడుం గదియకే తలచా
వెడ కౌఁగిలింతలన్, గదిరెడు మేలు కార్య
ములఁ గల్గకమాటల యందె కల్లు పెన్జ్ఞు
తులు వట్టిశైత్యములు చాలఘనంబయి
మందు వేసవిన్, బొదలఁగ నిర్భిదంపతుల
పొందుల నార్యుల పొందు శైవలిన్.
అము. ౨. ౬౨.

౫. అసత్యము, కల్ల.

సీ. వన్నె లుపచరించి కన్ను సన్నులుసేసి వెడ
మాటలను ప్రేమ గడలు కొలిపి ...
ప్రబోధ. ౧. ౭౨.

సీ. వెడత్రోవ తుము జెప్పి వడినవ్వఁ దిరుగు
నధ్వగుల కొలఁది యపత్రపయు మరల...
అము. ౪. ౧౬౩.

ఉ. అతని పాలి కేఁగి వినయంబునఁ జాగిలి
మ్రొక్కి దీనతా, న్వితయుఁ బోసెఁ
గొంత వెడ యేడ్పుల బాష్పకణంబు
లక్షి కం, జాతముల న్వెడల్చుటయును ...
పరమ. ౩. ౨౦౫.

ఉ. ముంగిట నాడు పుత్రుఁ డతిమోదముతో...
చిఱుగంతులతో వెడ యేడ్పుతోడ,
డాయంగ ... ముద్దుమో, మంగమియార
ముద్దిడుట ముజ్జగ మేలుటగాక యుండునే.
కవిక. ౧. ౪౦.

౬. కృత్రిమము, తెచ్చిపెట్టుకొన్నది.

క. అడలడఁచి నెమ్మనంబున, వెడ తెలివొడఁ
గూర్చి ... సిర్వ. ౮. ౧౩౧.

సీ. వెలవెలనై చాల వెడనవ్వు వహియించి
మురిపెంబు దఱిగిన మోమువాని ...
ఉ. రా. ౬. ౨౦౫.

౭. పిచ్చి.

క. వెడ తలఁపు లుడిగి సంధికి, నొడఁబడు మిది
లెస్స ... భార. కర్ణ. ౩. ౨౭౩.

౮. నిర్హేతుకము. నిష్కారణము.

క. ...కరుణారహిత, త్వమునఁ దోలు మేన
వెడపుగ, నమేయ నరవధము సేసినట్టి దురా
త్ముల్. భార. అను. ౫. ౧౦౯.

౯. వింత, ఆశ్చర్యము.

ఉ. దేవ! సురారినాథ భవదీయ మనోజ్ఞమునందు
వింతగా, నీ విధిఁ జింతిలంగఁ గత మెయ్యది?
నేఁడు తపోనిమిత్త మెం,దె వెడవార్త
గల్గెనొ ... కవిక. ౬. ౪౯.

క్రి. విశే. ౧. అల్పముగా, కొంచముగా.

క. చని వెడ వికసిల్లెడు నా,నన పద్మము
తోడ... భార. విరా. ౨. ౨౬౦.

సీ. వెడవాడు లీలారవిందయుగ్మము వాడ్కి
సుదతి నీ కనుఁగవ సోలమంచె ...
నిర్వ. ౮. ౮౬.

సీ. ... విరళమై పక్ష్మతి ద్వితయంబు వెడజాఱఁ
జంచులాకించు కాకుంచితముగ ...
నైష. ౧. ౯౮.

ఉ.... చ, స్ఫ్రీవల జాఱు కొంగు సవరించుచు
వీడిన కొప్పుఁ బల్మరుం, జేవెడ దోపుచుం
బలికెఁ జెందొవ చూపులు క్రేళ్లు దాఁటఁ
గన్. పారి. ౪. ౫౬.

౨. వదలుగా.

సీ. చిటిక్రేలి పూసతో ఘుటియిల్లు వెడపట్టు
చిమ్ముల సురియ డా ల్మ్ముమ్మరముగ ...
ఆము. ౬. ౧౪.

వి. ౧. ఇంచుక కాలడు.

చ. అదరు నవాంబు ధారలు జటాటవిలోఁబడి
విభ్రమించి తె,ల్వడి చనుదెంచి రాలుగొని
పక్ష్మములన్ వెడనిల్చి మోవిపైఁ,బడి ...
కు. సం. ౬. ౬౬౬.

౨. చెఱకు (ఈయర్థము మన్మథ ధనుస్సందర్భ
మందే కన్పుడుచున్నది. "పుష్పము" అని
(బ్రౌ. ని.)

క. ఏణాక్షి నపుడు వెడసిం, గాణింగొని
యలరుఁ దూపు గమిఁ జక్కెర రే,ఖాణ
ముగాఁ గలిగిన కం, ఖాణపు దొరపింజ
పింజ గాడఁగ నేసెన్.
విజ. వి. ౧. ౬౨. (౧౨౩.)

Phrase-(1) వెడ విలుకాఁడు = ఇక్షు
ధన్వుఁడు, మన్మథుడు.

చ. వెడవిలుకానికిం జెఱకు విల్లును గల్వలకోరి
కోరికల్, గడలు కొనంగ నా మనియుఁ
గల్వలరాయఁడు నిచ్చి మన్ననం, బడ
యుడు వాని కక్కడుగ మార్వలు
తామును గాన్కతెచ్చి నా,బడిబడి గంధ
లుబ్ధ మధుపమ్ములు రాఁజనువెంచెఁ దెమ్మె
రల్. విజ. వి. ౧. ౨౧౧.

చ. వెడ విలుకాఁడు నెమ్మనము వేమ ఱు
గెదఁగి తేకు వంకితిం, బొడువఁగ మేను
పానుపునఁ బొందక నిన్నుధయ ప్రదాన
మే, నడిగెదనంచు రాఁ గలినమై యిటు
వెన్నెలవేఁడి వెక్కసన్, గొడుగుల నీడ
వచ్చితిఁ జకోరవిలోచన యేమి చెప్పుదున్.
రామా. ౬. ౧౪౬.

(2) వెడవిలుతు(ల్తు)ఁడు=ఇక్షు ధన్వుఁడు,మన్మ
థుఁడు.

క. వెడవిలుతు కీర్తిజాలము, వడువునఁ జంద్రా
తపంబు వాలుటయును ...
భా. రా. యు. ౩౮.

క. వెడవిల్తుఁ డలరు వింటను, గడువడి విరి తూపు
లేర్చి కదియింపుచు న,ప్పుడఁటిన్ రాచందు
రునిన్, గుడియొడమల నేసియేసి కో యని
యార్చెన్. యయా. ౫. ౧౧౧.

(3) వెడవింటివాఁడు = ఇక్షుధన్వుఁడు, మన్మ
థుఁడు.

ఉ. ఆ కమలాక్షి యింపున దృగంచల మించుక
మూసి వార్ష భా,ప్పాకుల కోణకోణరుచు
లక్రమునం జనఁజూచు చూపు తీ,రై కను
పట్టెఁ దమ్మరసమంటు కొనన్ వెడవింటి
వాఁడు క్రో,ధైక ధురీణతం గఱచి యేసిన
సింగిణి కోలయో యనన్.
మనుచ. ౩. ౯౦.

(3) వెడవింటిజోదు = మన్మథుఁడు.

క. వడి వేఱవేఱ సిరసులు, గడఁగి బెడం
గయిరి కుంతికాంచిన కొడుకుల్, వెడవింటి
జోదు మెరవడిఁ,గడిగిన నారాచ పంచకం
బో యనఁగన్. పాంచాలీ. ౪. ౧౪,

(5) వెడవింటిదొర = మన్మథుఁడు.

సీ. వెడవింటి దొర దాడివెడల నుత్సాహించుఁ
జిలుకపైకములు విందులకుఁ దిరుగు ...
చంద్రా. ౪. ౧౪౧.

(6) వెడవింటివాఁడు = మన్మథుఁడు.

క. వెడవింటి వాని నేనియుఁ, గడకంటనె
యేలుకొనఁగఁ గలచెల నవలా, పడకింటి
లోన వింతగు, కడకంటఁ జరింతె నన్నుఁ
గాదని యవలన్. ప్రభు. ౧. ౮౩౮.

(7) వెడవింటిబోయ = ఇక్షుధన్వుఁడు, మన్మ
థుఁడు.

తరళము. పగలుమీఱఁగఁ బాంథకోటుల బాధ
పెట్టుచు నుండు నీ, లోగతగుల్ వెడవింటి
బోయకుఁ దోడువచ్చిన వాఁడవో ...
విజ. వి. 3. ౬౪.

(8) వెడవింట బలుదంట = మన్మథుఁడు.

సీ. వెడవింటి బలుదంటఁ బొడసూపఁ గానీక...
నీలా. ౧. ౪౨.

వెడఁగు. విణ. ౧. వివేకము లేనివాఁడు; వివే
కము లేనిది.

ఆ. భ్రమ విమోహ లోభ భయ పరిభూతస్నై,
కొడుకు విడువనంత వెడఁగ నయ్యె.
భార. ఆది. ౬. ౨౭౦.

క. మది ధృతిలేని వెడంగుల, మతిఁగఱపిన
సుమతికిం బ్రమాదము వచ్చున్, మతిఁ గఱ
పిన మతిమంతుఁడు, సితచ్ఛదోత్కరము
చేతఁ జెడ్డవిధమునన్. కేయూర. 3. ౮౫.

క. ఓ పెట్టులార! యేటికి, నీ వెడఁగు విచార
ములు సహింపఁగ రాదా, యేవారికైన
మేలా, చావుల తర్కితములుగ సంగ్రామ
ములన్. భీష. ౪. ౫౨.

ద్వి. గుడికేఁగి మీకింకఁ గొలువసేలనిన, వెడఁగు
ప్రశ్నకు మీరు వినుడుత్తరంబు.
బస. పు. ౬. ౧౭౨. పా. 33౨. పం.

౨. వికృతము.

ద్వి. నీరాడి ముదుక వన్నియ మూరకుఱుచ,
చీరలు వెడఁగు కుచ్చెలు పెట్టి కట్టి ...
అ. మ. క. ౧. ౨3. పా. ౨౬. పం.

వి. ౧. అవివేకము.

క. కార్యము తెలఁగిట్టిది నీ, వార్యచరితమునకుఁ
జొచ్చి యాడెదు నీ కా, దుర్యోధనున
వినయ మని, వార్యం బని యెఱుఁగరామి
వలనో వెడఁగో. భార. ఉద్యో. ౧. 3౧౭.

చ. కడు ననుఁ గన్నతల్లి కన గానల రామునిఁ
గన్నతండ్రిగా, నుడుగని బత్తితోఁ గొలుచు
చుండెదు తన్ను వెడంగుఁ బూని కా,అడ
వుల లోపలం గఱకులాడిన దోసపు పంట
యంతయుం, గుడిచిలి నంచు నా మఱఁది
కుట్టకు నిక్కమెఱుంగఁ బల్కుమా.
అచ్చ. రా. సుం. ౯౦.

౨. వికారము.

క. అని పలుకు పార్థు పలుకులు, విని పలుకక
యున్న మనుజవిభు దెసఁ గోపించిన తన
మది వెడఁగుడుపుచు, ననిలసుతుం డిట్టు
లనియె నాతనితోడన్.
భార. శాం. ౧. ౧౧౪.

వెడఁగుఁదనము. వి. (వెడఁగు + తనము.) అవి
వేకము.

చ. ... విచార విదూరుఁడు భీష్ముఁ డెంత
యున్, వెడఁగుఁదనంబునం బనిచె వృద్ధుల
బుద్ధులు సంచలింపవే.
భార. సభా. ౨. ౯.

సీ. ... ఒడికంపుఁ జేఁతల యొఱపెఱింగిన వింత
పీఠ్పాటు పనిగల వెడఁగుఁదనము ...
కావ్యా. 3. ౪౧.

**వెడఁగుపడు.** (వెడఁగు + పడు.) అ. క్రి. ౧. అవివేకము నొందు.

గీ. ... మేదుర మోహాంధకారమున వెడంగు
పడఁడు సంసార నిస్సంగ సిద్ధిఁ, బొందుఁ
గాలక్రమమున నప్పురుషవరుఁడు.
భార. అశ్వ. ౧. ౧౯౫.

౨. కలఁత నొందు.

సీ-గీ. ..అడరి కోర్కులు చిట్టుముట్టాడ వెడఁగు
పడిన యుల్లంబు పట్టునఁ బఱుపఁ దనకు,
వశముగాకున్న నెంతయు వంతఁ బొందు...
భార. విరా. ౨. ౨౯౨.

3. జడత్వము నొందు, ప్రమాన్పడు.

క. వెడఁగుపడి యచటఁ బెద్దయు, వడి నిలిచి
తలంచుకొని యవశ్యంబును నిప్పు డితనిఁ
దెగఁ జూడక చొప్పడునే యా విప్రశిశువు
ప్రాణంబనుచున్. నిర్వ. ౧౦. ౪౮.

౪. వికారము నొందు.

వ. కొమరారు దోరెపుఁ బ్రాల్లతోడన్ దిరు
గుడుల వెడంగువడి వడి దప్పునట్లు ప్రాల్లం
గట్టుపడి పొట్ట లదురఁగ నిక్కి పరిసెనంబులు
వేయు నవియును ... మనుచ. ౪. ౨౩.

**వెడఁగుపఱుచు.** స. క్రి. వెడఁగు పడఁ జేయు, వికారము నొందించు.

వ. ... ఎండతాఁకును రేయింటి యలజడియు
నప్పటి యాఁకలియు నొడళ్లు డిల్లపడం జేసి
నను మొగంబులు వెడంగు పఱిచినను బోలి
వోని పౌరుషంబుల నయ్యిరువాఁగునుం
గడంగి కలయన్ బెరసి పెనంగి ...
భార. ద్రో. ౫. ౨౮౬.

**వెడఁగుపాటు.** వి. (√ వెడఁగుపడు.) వెడఁగుపడుట, నిశ్చేష్టత నొందుట.

చ. బలిమిఁ దదీయు లప్పుడు సభాముని ముఖ్యుల
రెట్టఁబట్టి యీతలఁ బడఁద్రోచుచుం దమకుఁ
దామె యవారణఁ దత్తదాసనంబులు గొని
కూరుచుండిరి తపోధనులున్ సురలు
స్వేదంగు పాటొలయఁగ గ్రుక్కుమిక్కు
మనకుండి రొదుంగుచు నక్కడక్కడన్.
ప్రభా. ౧. ౮౨.

**వెడఁగురుపడు.** అ. క్రి. (వెడఁగురు + పడు.) మాన్పడు, జడత్వము నొందు.

సీ. ... మాకు నీపూన్కి సమ్మతమేము దీనికి
నీతోడివారము నీవు డస్సి,యున్న వాఁడవు
నిద్రయును లేక యున్నెని వెడఁగురుపడి
యెదీ యడవిలోన. భార. సౌ. ౧. ౬౦.
(వ్రాఁత ప్రతిపా. ‘ఎడగర’ అపముద్రి.)

చ. ఉడుగక కన్ను నీరఁ గడు నొప్పతి
చాయలు చెడ్డ కన్నులున్, వెడఁగురు వడ్డ
మోముఁ బటువేదనఁ గందిన యంతరంగ
మున్ ... హరి. పూ. ౮. ౧౫౫.

ద్వి. అక్కిలి పఱపక యఱగన్నుఁ గొనక,
వెక్కక వీఁగక వెడఁగురు పడక ...
పండితా. దీక్షా. ౬౧. పొ.

**వెడఁద.** విణ. ౧. విశాలము.

క. వెడఁద యురంబును నన్నువ, కడుపును
దృఢకఠిన తనువు గల యాతనికిం, దడర ...
భార. ఆది. ౪. ౨౨౨.

సీ. వేయి గుఱ్ఱములూనిన వెడఁద యరద,
మర్దితో నెక్కి ... హరి. పూ. ౪. ౮౫.

గీ. సిడము నడిమికి వెసఁ ద్రుంచె వెడందఁ, వాతి
దొడ్డతూపునఁ గురుసేన దొంగలింప ...
భార. భీష్మ. ౨. ౪౯.

ఉ. విచ్చిన తమ్మిదమ్ములకు విందులు పెట్టు
వెడంద కన్నులున్. పాండు. ౪. ౪౯.

౨. స్థూలము.

గీ. పిఱుఁదుఁ బిక్కలుఁ జెక్కలు చెడఁగుఁ దొడలు, వెడఁద యొడలును జన్నులు వెండ్రు కిడను, పందు లేకుండ బలియుట ...
హంస. ౩. ౧౩౩.

వెడఁదమోముమెకము. వి. పంచాస్యము, సింహము.

సీ. వెడఁద మోము మెకంబు నడవుల డాఁగించి...
నీలా. ౧. ౪౭.

వెడఁదవాతియమ్ము. వి. (వెడఁద + వాయి + అమ్ము.) బాణవిశేషము, విశాలమైన వాయి గల బాణము.

వ. సురినదీసూనుండు పొరవుగల నవపాలకుండు తాళఫలంబులు దిగఁద్రోచు చందంబున మెఱుంగు లడరు వెడందవాతియమ్ముల నమ్మహీశుల తలలు డొల్లనేయుచు ...
భార. భీష్మ. ౩. ౬౩.

ఆ. అన్ని వెడఁదవాతియమ్ము లద్భుతముగ, నొక్కముష్టిఁ దొడిగి ...
భార. విరా. ౫. ౧౪౬.

వెడఁబడు = వెడలఁబడు. అ. క్రి. (వెడలన్ + పడు. వృత్తినివర్ణవికారము.) బయటఁబడు.

ద్వి. కడుపులోనవె చచ్చి క్రచ్చఱఁగ్రేపు, వెడలకున్నను చూలు వెడఁబడకున్న, మస లక వెడలంగ మందులుపెట్టి, పసరంబు ప్రాణంబు పసనుగాఁ గాతు.
నవనాథ. ౧. ౪౦. పొ. ౧౦. పం.

వెడగఱవడు. అ. క్రి. (వెడగఱ + పడు.) జడత్వమునొందు, (లేక) కాంతిహీనమగు.

చ. ఉడుగ కన్నునీరఁ గడునొప్పుటి చాయలు చెడ్డకన్నులున్, వెడగఱ వడ్డమోముఁ బటు వేదనఁ గంఠిన యంతరంగమున్ ...
హరి. పూ. ౮. ౧౫౫.

వెడచఱుచు = వెఱచఱుచు. అ. క్రి. భయపడు.

క. ఎఱకల గాడ్పున నొగి వెడ, చఱువఁగ వడి వీచియతని శాతనఖములం, జొఱజొఱఁ జీరియు ముక్కునఁ, గఱచియు నొప్పించె వాఁడు గరువలిసుతుఁడున్.
భా. రా. యుద్ధ. ౧౭౦౪.

క. వడి సెగసి వాలములఁగొని, వెడచఱువం జఱచి దొంగ వీఁడు మనకు లోఁబడియె ననుచుఁ బిడికిళ్లం, బడఁబొడిచిరి ...
భా. రా. యు. ౨౦౩.

లయవిభాతి. వెడచఱువ మొత్తియును దడఁబడఁగ నొత్తియును ...
భాగ. ౧౦. ఉత్త. ౭౩౭.

వెడతపసి. వి. (వెడఁగు + తపసి.) అవివేక తపస్వి.

గీ. వెడ తపసినాటె సెద గొడ్డు వీఁగి కన్న, రాము నెడఁబాపు నతినిష్ఠురంపుఁ బలుకు జిలుకు తనవంటి పెనుదంట చేతఁగాని, మఘము నాచిన్ని పాఁపడే మనుచువాఁడు.
చంపూరా. ౨. ౬౩.

వెడతుఱు. వి. ఒకానొక చెట్టు. ‡. (చూ. వెడ తుఱుపల్లి = వెణుతురుమిల్లి.)
పి. శా. ౪. ౧౦౨౪. Ep. Ind. 5.

వెడదప్పు. దే. వి. స్వల్పదోషము.

సీ. బ్రాహ్మణ జనముల రాజులు పూజింతురటు గాన నేను విప్రార్చనంబు, సేయుదు విప్రుని చేతన యిట్లైతి వెడదప్పునన యుండు వెరవు నాకు, దురితంబు వాపంగ దొరకొనదు ...
భార. అశ్వ. ౩. ౯౯.

వెడదారి. వి. (వెడ + దారి) అపమార్గము.

సీ. జడదారి యొయ్యారి వెడదారితీరవో నడుగు
నెత్తమ్మి దుమ్మిడియో నితఁడు ...
బహు. ౪. ౭౨.

వెడనగవు. వి. మందహాసము.

క....మృదులకలభాషలఁ ద,ళ్కొత్తెడు వెడ
నగవులలోఁ, జిత్తభవుం డార్వ ననలు
చిదుము నెపమునన్. మనుచ. ౬. ౩౦.

వెడపాడు. అ. క్రి. బొత్తిగా పాడు.

సీ. వెడలించె నెవ్వాఁడు వెడపాడు బావిలో
నూసరవెల్లియై యున్న నృగుని...
అప్పక. ౪. ౩౪౧.

వెడపేరు. వి. తుచ్ఛపుపేరు.

చ. అని మునినాథచంద్రుఁడు దయారసముప్ప
తిలఁగఁ బల్కిన, న్వని యలివేణి తానిదియె
వేళయఁట న్మఱి వీనిఁ దక్కఁగాఁ, బెనఁ
గకయున్న నన్ను వెడపేరునఁ బిల్తురు లోకు
లంచు ... విప్ర. ౩. ౭౪.

వెడపోక. వి. తుచ్ఛమగు నడువడి.

ఉ. పొట్టలుఁ బ్రొవ్వి కొన్ని వెడపోకల నట్టలు
చేసి యిట్టటుల్, గట్టిదులై నృపుల్ తెరవు
గట్టిరి వారలఁ బొట్టుపొట్టుగాఁ, గొట్టక
తూపులం గదుపు గొట్టక ...
చంద్రాంగ. ౬. ౬౫.

వెడమబ్బు. వి. అల్పమేఘము.

సీ. అలరు వెల్తురులేని వెడమబ్బులు హిమాద్రి
లేని మంచులు వార్ధి లేని సుధలు ...
నరసభూ. ౫. ౧౩౫.

వెడము. వి. ఎడము.

సీ. వెడము వెట్టకరాని ప్రియుఁ గూర్పుమని
రంభ కిచ్చుకమ్మలు పల్కి తెచ్చుచిటుల...
శ్రీరంగ. ౧౦. ౫౭.

వెడయేడ్పు. దే. వి. కృత్రిమ రోదనము.

గీ. ఎదురుగాఁ బోయి వెడయేడ్పు లేడ్చివారి,
తోడనిట్లని పలుకు మీ తోయజాక్షి ...
దశకు. ౫. ౯౨.

వెడలఁగొట్టు. (వెడలన్ + కొట్టు.) స. క్రి. వెడ
లించు, పోనడఁచు.

ఉ. గొట్టుతనానఁ దన్ వెడలఁగొట్టిన దిట్టను
కట్టడంచుఁ దోఁ, బుట్టువనాట నొండనక
పోయితి ... ఉ. రా. ౨. ౩౦౯.

వెడలఁబడు. అ. క్రి. (వెడలన్ + పడు.) (స్వార్థ
మున పడు.) ౧. వెడలు, బయలుదేరు.

క. మించిన పనులకు నేరము, లెంచం బనిలేదు
సీత నెక్కటి నటులన్, గొంచు న్వెడలం
బడి యే,లెంచితిగా చాల సుస్థితిన్నిలు
మింకన్. రామా. ౩. ౬౩.

౨. వెలుపలఁ బడు, ఉద్ధరింపఁబడు.

గీ. హా సరోజాక్ష గోత్ర దుఃఖార్ణవమున,
మునిఁగి యున్నాఁడఁ జేయూర్చి కొనఁగ
లేక, నీకృపాదృష్టి పేరోడగాక యున్న,
వెడలఁ బడుటెట్లు ముఖము గావించుటెట్లు.
జై. భా. ౧. ౧౦౬.

వెడలఁబాటు. వి. (√ వెడలఁ బడు.) వెడలఁ
బడుట.

చ. భువన భయంకరంబులగు పోరులఁ దమ్ముల
తోడఁ గూడ నీవు వెడలఁబాటు లెస్స
యలపుంజలము న్వెలయించు చోట ధ,ర్మ
వున కొకింతయుం దొలఁగఁ ద్రొక్కమి
యెంతయు మేలు ... భార. శాం. ౧. ౪.

వెడలఁబోవు. అ. క్రి. (వెడలన్ + పోవు.)
వెడలు.

సీ. అడ్డకట్టఁగ నీక యల కేకరాతులు వెడల
లజ పొరఁజెంది వెడలఁబోవ ...
చంద్రా. ౫. ౨౪.

**వెడలఁబెట్టు.** స. క్రి. (వెడలన్ + పెట్టు.) వెడలఁ జేయు, వెలిపుచ్చు.

సీ. లోఁక నూరక మేను సోఁకఁగ నులిపెట్టు
వెడవెడ నాలుక వెడలఁబెట్టు ...
భాగ. ౧౦. ఉ. ౫౪౪.

**వెడలఁబోసికొను.** స. క్రి. చెప్పుకొను, ప్రకటించుకొను.

చ. వెత వెడలంగఁ బోసికొన వేఱొక చెచ్చెలిఁ
గానమిన్ దిశాపతులకు నంతయుం దెలియఁ
జాటుటకై గమకించునో సుమీ, యతివ
యనన్ ... రామా. ౬. ౧౩౨.

**వెడలనాడు.** స. క్రి. (వెడలన్ + ఆడు.) ౧. వెల్లడిచేయు, వెలిఁబుచ్చు.

క. నీ యంగన కపటాచారాయత్తము
మాకు వెడలనాడుట తగదే, మీ యున్న
రాత్రులందు తదీయ వ్యాపార మేము
తెలిసితి మెల్లన్. కేయూర. ౩. ౨౩౧.

౨. తూలఁ బలుకు, ప్రేలు.

ద్వి. విను మీఁదెఱుంగక వెడల నాడెదవు ...
బస. పు. ౪. ౫౦. పం.

**వెడలించు.** స. క్రి. (√ వెడలు.) ౧. పోయఁ జేయు, తొలఁగించు.

క. వడవడ వడఁకుచుఁ గ్రమ్మఱ, నడుగుల పై
వ్రాలి యో మహామతి యే నెక్కడఁ గర్మ
శేష మెక్కడ, వెడలింపఁగ దయ్య దురిత
విషనిధి వలనన్. భోజరా. ౩. ౭౪.

గీ. ... గంధవహుఁడు, సతుల పయ్యెద వెడ
లించి చన్నుగవకుఁ దప్పుసేసియు శైత్య
చిత్తంబు వడసి. హర. ౩. ౪.

చ. పొలుపుగ గొల్లక్రొందలిరుఁ బోఁడుల
కులుక మిటారి గబ్బి గుబ్బలు బలుపెన్న
ముద్దలని భావమునందల పోసిదానికిం, చెల
వెడలించి మాటికిని జేతుల నొక్కుచు
హొంతకారియై, యలఁతిగ నవ్వు వెన్నుఁడు
దయామతి మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్.
రసి. ౧. ౩.

౨. వెడలఁ జేయు, పైకి రావించు.

క. డయ్యఁ దిరిగించి దేవుం, డొయ్యన వెడ
లించె నోరి యూర్పున నమ్మో, నయ్యమి
వర్యుఁడు వెలువడి, యియ్యనఁ గనుఁ
గొనియెఁ దొంటి యేకార్ణవమున్.
హరి. ఉ. ౯. ౧౦౯.

గీ. కుంభసంభవుఁ డబ్ధితోఁ గూడఁ గ్రోలి తజ్జ
లములతోడ వెడలింపఁ దలఁపఁడేని ...
శృం. నై. ౨. ౧౨౩.

ద్వి. ఎడనెడ బొక్కలనిడిన బాలకుల, వెడ
లించి భక్షించు బేతాళతతులు ...
హరిశ్చ. ఉత్త. ౧౬౩౦.

౩. విడఁజేయు, విడుచునట్లు చేయు.

గీ. ... ఎల్లతెఱఁగు పనులు నారాత్రిలోఁ దీర్చి
ప్రొద్దు, పొడుపునకు మున్న వెడలించెఁ
బురము సకల, జనములను జీవధనముల
సరకు నతండు. భార. మౌస. ౧౭౪.

౪. వెడలఁ గొట్టు.

మ. ... ధనగుప్తుం డొనరింపఁ బూనిన మహా
ధౌర్త్యంబు సర్వంబుఁ గాంచి నిజేచ్ఛం
జనుమంచుఁ గంచి వెడలించెం గిన్కతో
నల్లునిన్. విక్ర. ౭. ౧౩౦.

౫. ప్రవహింపఁ జేయు.

గీ. వెన్నెలరము బ్బి వెడలించె దీర్ఘికా మంద
సౌగంధిక మధునదంబు... మనుచ. ౬. ౨౯.

**వెడలిచను.** అ. క్రి. (వెడలు + చను.) వెడలిపోవు.

క. పెద్దపులి వెడలిచనె నని ...
దశా. ౪. ౪౦.

**వెడలు.** అ. క్రి. ౧. బయలుదేఱు. (రూ. వెలలు.)

క. వెగుటయు సర్వరంబుగ, నా గాంగే
యుండు మించి యనికి నడచినన్, సాగర
తరంగముల గతి, వేగమ తరతరమ మొనలు
వెడలఁ దొడంగెన్.
భార. భీష్మ. ౨. ౧౬౩.

సీ. ... దైవ సైన్యంబు లీలతోఁ దరతరంబ,
వెడలి మొనలేర్పరించి యుద్వేలవృత్తి.
పారి. ౫. ౨.

తే. వలయు సవరణతోడ భూవల్లభుండు,
వెడలె వేఁటకు మృగయాప్రవీణులైన,
శబరనాయకులు ఉభయపార్శ్వములఁ గొలువ...
విక్ర. ౨. ౧౩౧.

౨. బైటవచ్చు.

ఉ. ...మూఁకలెల్ల జొట్టు ముట్టినపుడు, వెడలు
నట్టి వెరవు వినదానికేమి నా, చొచ్చు నేర్పు
బలువుఁ జూడు మధిప.
భార. ద్రోణ. ౨. ౫.

గీ. దేవదేవ రక్షింపవె దివ్యమూర్తి, యనుచుఁ
బలుకు నవ్విప్రుని యార్తరభంగి, చూచు
నప్పుడు మురవైరి చూడ్కికేల, వెడలె
నాకునుఁ గన్నీరు వేయునేల.
ఉ. హరి. ౨. ౯.

తే. అబ్ధిలోఁ గూడ మునుగ్రోలు సార్వవహ్ని,
యుదరబిలమున నొకచోట నుండియుండి,
జటిల వరునకుఁ గద్రూజ కటకకటక, విరహ
తాప మిషంబున వెడలెనపుడు.
పాండు. ౧. ౧౨౧.

౩. వెళ్లు, కడచు.

తే. తపము గావింప వెడలె వత్సర సహస్రములు
మహాదేవుఁ డంత నా భూమిధర కు, మారి
గౌరి ననుగ్రహింపంగఁ దలచి ...
వరాహ. ౬. ౧౬.

క. చావుఁ దలపోసి మానవుఁ, డేవగ
దుష్కీర్తి వొరయకే దినములు శాంత్రై
వెడలునట్లు నడవఁగ, దైవం బాతిఁడ మేలు
తాన ఘటించున్. మను. ౪. ౧౦౩.

తే. ...పాండు బహుళక్షపా పరంపరలు వెడల,
కిండిలో నేఁదు ముల్లర్యో నిందు ముఖి.
అము. ౫. ౭౪.

౪. సంచరించు, ప్రయాణము చేయు.

చ. ఎడపక మున్ను మింటిపయి నే తగులంబును
లేక మూకతన్, వెడలెడున్ ...
అము. ౪. ౭౫.

౫. వ్యాపించు.

తే. మెడలు దునిమిన మీఁదికి వెడలు రుధిర,
ధారలు మదాంధ పరిపంథి వీరభటులు క,బంధ
ములు నిల్చెఁ బెక్కులు పగలు బిరుసు,బంట్లు
పట్టించుకొను దిక్కు పొఁజు లనఁగ.
వరాహ. ౫. ౨౯.

సీ. ... తే. వెడలు పేరెండకును శరద్వ్రతు
ముడిగి, వార్షికమె యొక్క ...
అము. ౪. ౧౭౧.

చ. అడఁకువ మీకు నేమి యిడ నక్షయమానసుట
న్నిజంబుగాఁ, గొడిదెడు దానలోయ మదు
గుం దిగ దమ్ములు ముజ్జగంబులఁ, వెడలు
కొలందిరై సుగుణ విక్రమ హంస పరాగ
యుక్తిచేఁ, గడలు కొనంగఁజేయు నలకైతవ
వామను నిన్ను నెన్నెదన్.
చంద్రాంగ. ౧. ౪౯.

౬. తొలఁగు.

క. ... మనమున నాటిన మాటలు, విను మెన్ని
యుపాయములను వెడలునె యధిపా.
భార. ఉద్యో. ౨. ౬౨.

సీ. ఏమార్గమునఁ జేసి యీ దుష్టసంసార
దుఃఖంబు వెడలు ... వాసిష్ఠ. ౧. ౧౪౧.

౭. పోవు, నశించు.

గీ. విష్ణుమూర్తులు కడ చన్న వేళలందు, నజుని
మూర్తులు విబుధులు వెడలు నపుడు, కలదె
నీకు నపాయంబు కాలకంఠ ...
శివరా. ౧. ౧౦౫.

స. క్రి. దాటు, లంఘించు, అతిక్రమించు.

ఆ. మడఁకి రకట జలధి వెడలి సన్న పుఁగ్రయ్య,
మునిఁగి రూపడంగు జనులమాడ్కి ...
భార. సౌప్తి. ౨. ౧౪.

సీ. గ్రహరాజు వారెడు ఘంటాపథముదాఁటి
చుక్కలు వొడదెంచు చక్కి వెడలి ...
శృం. నై. ౪. ౩౪.

వి. బయలు.

ద్వి. పడఁతి కాళ్లును జల్లిపగ్గంబు గట్టి, వెడలికి
నీడ్పించెఁ దొడఁగి వాచీరువ, కులసతి యని
యెడు కూరిమి లేక ...
పండితా. పురా. ౯౭, పా.

**వెడలుచే(ల్చు).** స. క్రి. (√ వెడలు) వెడలఁ జేయు.

చ. అడలున నెంతయు న్గలఁగి యగ్గలికం గుడి
చేయిసాఁచి పైఁ, బడఁకెడు కొమ్మకేలు
వెలువంబుగఁ బట్టి యయాతినూతిలో, వెడ
లిచి యప్పుడమ్మగువ వేనలికన్నులు మోము
చెక్కులు౯, మెడ చనుదోయి నెన్నడుము
మేను పిఱుందును గాంచి వేడుకన్.
యయా. ౩. ౪౫౧.

క. వికసించు తమ్మినుండు మధుకరావళి
వెడలె వెలుఁగు దొరగనఁ గాసారకలా
వంతుఁడు మునుగొంచక గ్రమింగి వెడల్చు
నినుప కురిపెణ మనఁగన్. రా. వి. ౩. ౩౧.

సీ. కుబుసంబు విడిచిన కొదమ నాగముతోవ
దొన వెడల్చిన పువ్వుఁ దూపు సరణి ...
పరమ. ౨. ౩౧.

**వెడలుపు(ల్పు).** వి. వైశాల్యము.

చ. వెడలుపు గల్గు నోరులాగ వేయి ధరించి
తియన్నదీ జలం, బడరఁగఁ బుక్కిలించి
రయమారఁగఁ దెచ్చి మహానలంబుపై, నెడ
పడకుండఁ జల్లనది... హరి. ఉ. ౮. ౪౨.

క. అమడ నర వెడలుపు మూఁడామడ నిడివి
యగును గలిగి యతి రమ్యంబై, రామభుట
కర్ణ పటు నిద్రామందిర మలరు మృదుల
తల్ప తతులతోన్. ఉ. రా. ౨. ౨౯౩.

వ. అదియును నూఱుయోజనంబుల వెడల్పును
నూటయేఁబది యోజనంబుల నిడుపును ...
భార. సభా. ౧. ౬౨.

సీ. రేఖ లేర్పడఁగ వర్థిలి వెడల్పయి రెమ్మ పసరు
వాఱుచు నిక్కఁ బసరుకప్పు ...
మనుచ. ౬. ౨౪.

సీ. కంఠహారము దాఁగి గంగడ్లో లుదయించె
వెడలుపు నిడుపునై మెడ పొసంగ ...
కళా. ౪. ౧౫౯.

**వెడవాదము.** మి. వి. వ్యర్థవాదము.

మ. గడు సాక్కెక్కుఁడు నిత్య దూష్యలను
చున్ గంజాతులన్ రోయ నీ, వెడవాదం
బుల కేమి నామదికి భావింపన్ సతిం బోల
నిప్పుడమిం గామిత వస్తువుల్ బరహితంబుం
బోలు పుణ్యంబులే, దడరన్ ...
మల్లభూ. ౨. ౩౫.

**వెడవెడ.** విశ. అతి సూక్ష్మము, అత్యల్పము, మిక్కిలి చిన్నది. (ఇది "వెడ" యొక్క ఆమ్రేడితరూపము.)

సీ. వెడవెడ నూఁగారి వింతయై యేర్పడు చేరని
వళులలో నారు నిగుడ ...
భార. విరా. ౧. ౨౪౫.

చ. వెడవెడ కొండ లీడగునె వేంకట భర్త
వసించు కొండకున్ ... సుద. ౫. ౬౪.

సీ. కుంభి కుంభముఁబోలు కుచకుంభ భరమున
వెడవెడ నడుములు వీఁగి యాడ ...
వీర. ౩. ౧౫౫.

క్రి. విశే. ౧. మిక్కిలి యల్పముగా, కొంచము కొంచముగా. (ఇది ప్రయోగములందు ద్రుత ప్రకృతికముగాను, కళగాను గూడఁ గన్పట్టుచున్నది. నిర్ధారక ప్రయోగము కన్పడలేదు. కాని కళయని. శ. ర.)

సీ. అదట నుపకరణావలి వెడవెడ యాదరిం
చుట రాగ మడరఁ దొడరి ...
భార. విరా. ౨. ౨౩౮.

ద్వి. వెడవెడఁ దన కచ్చ వీడంగఁ బాఱి, వడి
మోము వగులఁగ వాటంబు దాఁక. ...
ద్వి. హరిశ్చ. ఉత్త. ౧౧౦౮.

వ. ...మునివర్యులకు నృపవర్యుండు నమస్కరించి వీడ్కొని విడిదలకు నరిగి మజ్జనాది కృత్యంబులు వెడవెడం దీర్చి శకుంతలావలోకనంబునకు లోకలోచనుం గనుంగొను నప్పుడు. పి. శకుం. ౩. ౧౪౬.

చ. వెడవెడ యేనుఁ దొల్లి యిది వింటి ననుంగని
కుంతి యెంతయుం, జెడ నది వైచిపోయె...
భార. ఉద్యో. ౪. ౩౩.

౨. బిగ్గఱగా.

వ. ... ధనుర్వలయ నిష్ఠ్యూతంబులగు శరవ్రాతంబులు వెడవెడ నార్చుచు పగఱ మొగంబులఁ బ్రవేశించి పెడతల వెడలుచు...
కళా. ౮. ౧౧౦.

గీ. అనుచు నాబోయ శరశరాసన కఠోర, గుణ
విరావప్రతిధ్వని కుధర గుహల, వెడల వెడ
వెడ నార్చుచుఁ బిడుగు తునుక, వంటి నా
రాచమున నదరంట సేయ.
వరాహ. ౭. ౮౦.

చ. వెడవెడ నార్చుచున్ దిశలు బీటలువాఱ
నదల్చి రుద్రుఁడై, నడచిన నమ్మహారథుఁడు
నవ్వుచు భూతపిశాచ కోటిఁ జూచుచుఁ
జని వేయఁ జొచ్చె ...
వరాహ. ౫. ౧౧౨.

౩. మిక్కిలి వికారముగా.

సీ. తోఁక నూరక మేను సోఁకఁగ నులిపెట్టు
వెడవెడ నాలుక వెడలఁబెట్టు ...
భాగ. ౧౦. ఉ. ౫౪౪.

౪. తఱచుగా.

క. వెడవెడఁ బొడమెడి యూర్పు, ల్తుడుములు
తుడుములుగ వెడలఁ దొడవులు సడలన్,
ముడిబొమ జంకెన చూపులఁ, బడఁతుల నద
రించి కోప పరవశయగుచున్.
చంద్రా. ౨. ౧౪౬.

౫. అశ్రద్ధగా.

క. వెడవెడ యప్పలుకులు చెవి,నిడి కొండొక
సేపు చింతయొసకరంబున పొ,ల్పడి యూర
కుండి ... భార. శాం. ౧. ౫౬.

ఆ. మగడు చన్న దెసకు మనసును జనియున్నఁ,
జెయ్యి వెఱఁగు పడినఁ జెవులు సొరని, వృద్ధ
వనిత కథలు వెడవెడ నూఁకొంచు, నుండె
వగల నొగిలి యుత్పలాక్షి.
విక్ర. ౬. ౧౧౩.

౬. మృదువుగా.

గీ. ...వేగ వెడవెడ తడియొత్తి ...
ఆము. ౫. ౮౯.

౭. అధికముగా.

గీ. మస్తకము వాంచియు సురని మౌనముద్ర,
నేల బొటవ్రేల వ్రాయుచు నిలిచి కొంత,
సేపు వెడవెడ చింతించి శిరసాకింత, యెత్తి
సన్నంపు టెలుఁగుతో నిట్టులనియె.
మనుచ. ౩. ౯౭.

౮. మెల్లమెల్లగా.

సీ. బడిబడిఁ గమ్మ పుప్పొడి నిప్పకలు చల్లి వెడ
వెడగా గాలి సుడిసెనేని ...
రాజ. చ. 3. ౮౦.

చ. వెడవెడఁ గన్నుమూయుఁ బలవించుఁ గనుం
గవ విచ్చు ... యయా. ౫. ౧౧౩.

సీ....పచ్చరా కట్నంబు పచ్చికపట్టని వెడవెడ
మనిద్రవేళ్ల నడచిపోవు ...
దశా. ౧. ౨౩౨.

౯. దృఢముగా, గట్టిగా.

క....ప్లవంగుని మెడఁగడు, వెడవెడ బిగియించె
గ్రుడ్లు వెలికుబుకంగన్.
భాగ. ౧౦. ఉ. ౫౫౬.

వెడ్డరి. విశే. (వెడ్డు + అరి³) వంచకురాలు.

ద్వి. పాపజాతులు విసపరులు వెడ్డరులు, మాటల
మ్రుచ్చులు మందులమార్లు ...
పండితా. పురా. ౧౧౬. పా.

వెడ్డు. విశే. కపటముతోఁ గూడినది.

ఆ. పాతిపోయి వచ్చి బడిసొచ్చి యీ వెడ్డు,
నిద్రవోవఁ గృష్ణ నీకుఁ దగునె ...
పద్మ. ౯. ౩౩౨.

('ఆ. పాతిపోయివచ్చి పడనొచ్చి యీగుహా'
అని చి. వి. పా.)

ద్వి. వెడ్డుమాటలెకాని వేల్పులకన్న, దొడ్డ
వాఁడవుర నాదూఁ కలిఁ దీర్చు ...
ద్వి. శ. సా. ౧. ఆ. ౩౦. పా. ౧. పం.

వి. వంచన.

సీ. మును వసుపాలిత ధనము వెడ్డునఁ గొన్న
తరుణికిఁ డెప్పెట్టదు వెరవు గొఱలి...
దశకు. ౫. ౬౮.

వెడ్డుకోలుపు. స. క్రి. పీడించు.

సీ. అతిమాత్ర మాయాస మనుభవించునుగాక
విటజనంబుల నేల వెడ్డుకోలిపె ...
క్రీడా. ౨౮౩.

వెడ్డు(పె)వెట్టు. స. క్రి. (వెడ్డు + పెట్టు.)
వంచించు.

చ. అనవుఁడు మున్న యిట్టులనరై తిరి వోవఁగ
నీను మిమ్ము నెం,దును గడు వెడ్డువెట్టితిరి...
భార. శా. ౬. ౩౦౧.

క. ధనముగలదు పుత్త్రిలు వే,రని యాసంజూపి
యొరుని యాత్మజుఁ దానే,ర్పన వెడ్డువెట్టి
తగఁజే,కొనె నేనియుఁ గృత్రిమంపుఁ గొడు
కాతనికిన్. విజ్ఞా. ఆచా. కాం. ౧౨౨.

తే. ఇట్టిగతిఁ జెల్వ నుమ వెడ్డువెట్టు నొక్కొ,
పెట్టవది దా సృజించిన బిడ్డగాన, బొంక
గుచు నంత కదియ త్రోపు వడు నొక్కొ,
పడదజుఁడు చెప్పెనని వినఁబడియెఁ గాన.
ప్రభా. ౩. ౧౦.

వెణఁద = వెడఁద. విశే. విశాలము.

వ...అనంగ ధ్వజ పట కఠోర పాఠీనచ్ఛాయా
దాయాదంబులైన వెణఁద కన్నులు తల
చుట్టునుం బలిసి పొలయ ...
భీమ. ౨. ౧౧౦.

ఉ. నందసుతుం గనుంగొని వెణుంద కనుం
గవనించె బాష్పముల్ ...
శృంగార రసాలవాలము. ౨. (శ. ర.)

వెణుతురు = వెలుతురు. వి. శరీరము, క్రశ
రము. కీ.

సీ. కొరింద వలతుమ్మ గొటికె కోడారెయు
వెణుతు రూడంగ దంతి కాద్రినిమ్మ ...
హంస. ౪. ౯.

సీ. వెణుతు రసంగన వెలయుఁ గరీరంబు ...
ఆం. భా. ౨. ౫౩.

వెన్నాఁడు. అ. క్రి. (వెన్ను² + ఆడు.) వెంబడించు, వెంటనంటు.

సీ. పదములు దొట్రిలఁ బరువులెత్తెడివారి నను
రక్తవృత్తి వెన్నాడి చనదు ...
వసు. ౧. ౫౬.

సీ. వెన్నాడి తత్సేన వీఁగఁదోలుటకును బ్రధు
రక్తమున నుబ్బు వెన్నసాక్షి ...
రామ. ౨౫౯.

మ... మాయావి యన్వాదు ... పాతాళము
సొచ్చినన్ విడువక శాఖా మృగాధీశుఁ
డా, తని వెన్నాడి ననున్ రసాతల బిల
ద్వారస్థితుం జేయుచున్ ...
చం. రా. ౬. ౨౩.

వెన్నిచ్చు. అ. క్రి. (వెన్ను² + ఇచ్చు.) ౧. వెనుదీయు, వెనుకకు మఱలు.

మ. నరుఁ డాఖిల పరాక్రమం బగుడు సైన్యం
బంది వెన్నిచ్చి విచ్చిరి వారందఱు దివ్య
సంఘము నుతించిం ...
భార. కర్ణ. ౩. ౩౧౩.

౨. (యుద్ధరంగమునుండి) పాఱిపోవు.

సీ. వెన్నీక రణములో విగతాసులగువారు వివి
ధాధ్వరములు గావించువారు ...
వరాహ. ౧౦. ౧౧౩.

సీ. ఇలఁగు భృత్యులకు వెన్నీని కూర్మిపతులు
గోత్రవర్గము బల్మిఁ గూల్పఁ నింద్రులు ...
బిల్హ. ౧. ౩౦.

క. దగగొట్టి కలనఁ బెట్టిన, మగఁటిమి వెన్నిచ్చి
పాఱు మాళవ నృపతిన్, మగధపతి మట్టి
తఱి సా, ళుగతిన్ వెన్నాడి కోటఁ జొరఁ
దోలి వడిన్. రా. వి. ౫. ౧౯.

౩. వెనుక దిరిగి పాఱు.

సీ.... పగఱకు వెన్నిచ్చి పఱవక సంగర క్షోణిఁ
గూలిన మహాశూరులకును ...
దశా. ౪. ౯౫.

వెన్ను¹ = వెను. ఔ. అనా. ౧. వీపు, పృష్ఠభాగము. (రతీదేవి.)

గీ. మెటిసి క్రొవ్వేణి వెంటిపై పెఱసిపోలయు,
నడలు దరికొని వావిరి నఱచుచుండె ...
కు. సం. ౫. ౫౬౫.

వ. మనుజపతి యనుజాలుం దానును వెన్నయ్యె.
విందాను విందులుం గాంభోజుండును, శూర
సేనుండును బుచ్చుంబైరి ...
భార. భీష్మ. ౨. ౯౬.

—వి. పృష్ఠభాగము.

గీ. ఉట్టిపడి మ్రొక్క గతిఁ దెల్ప నురగకాంతి,
వెన్ను వెన్నునఁ గాని విన్నువీథి కేగెనె ...
బహు. ౩. ౪.

సీ. జరఠ కచ్ఛప కులేశ్వరు వెన్నుగాన రాజ
గతికి మిన్నేఱు దిగినచోటు ...
మనుచ. ౨. ౭.

వి. ౨. ఇంటినడి కొప్పు.

వ... పాడిల్లునుం బోలె వెన్నొఱగి ...
కవిక. ౪. ౧౧౩.

వెన్ను² = ఎన్ను. వి. వరి మొదలగువాని యెన్ను, కణిశము.

ఆ. ఉత్తముని కడుపున నోగు జన్మించిన
వాఁడు చెఱుచు వాని వంశమెల్ల, చెఱకు
వెన్ను పుట్టి చెఱుపదా తీపెల్ల ...
వేమ. ౨. భా. ౨.

గీ. కలదు గర్భంబులా మహోత్పల దళాక్షి,
పిక్కలకు నోడి తద్దయుఁ బీఁకపాఱి,
వెన్నుచూపి తృణంబూని యెన్నరాని...
రసిక. ౨. ౧౧౧.

వెన్నుఁడు. వి. (సం. విష్ణువు.) విష్ణుదేవుఁడు, కృష్ణుఁడు.

క. నరనాథ సమర్పిత మగు, విరవాదుల దంప యొప్పె వెన్నుని పొవాం, బురుహంబున నంగుటమున, నవిలిన యాకాశగంగ కుప మానంబై ... నైష. ౭. ౧౧౫.

గీ. వెన్నునకు నమ్మదాదుల మెన్నడైన, నపకృతి యొనర్పము ... ఉ. రా. ౨. ౨౩.

ఉ. వెన్నుఁడు ప్రీతిఁ జెప్పిన సవిస్తర వాక్ప్రచయంబు తోడఁ బోఁ,నన్న కుమార యిట్లయిన నాయువు శ్రీయును నీకుఁ గల్గు ... భార. ఉద్యో. ౩. ౩౪౭.

క. వెనుఁడు నవ్విభు దవ్వుల, గన్గొంతన నిజ సమాధి కవితాసనమున్, గ్రన్నన విడిచి యెదురు సని, సన్నత వాళియయి భక్తి సంభరిత గతిన్. హరి. ఉ. ౬. ౩౨.

క. ఎన్ని తెలుంగుల ముందఱ, విన్నను మురవైరి మహిమ విన నింపగు నా, వెన్నుఁడు గైలాసమునకుఁ, జన్న తెలుఁగు శివునిఁగన్న చందముఁ జెపుమా. ఉ. హరి. ౨. ౬౪.

**వెన్ను కేళా కూళి.** వి. (వెన్నుఁడు + కేళా కూళి) పాల సముద్రము.

ఆ. వె. పిన్నశౌరి యశము వెన్ను కేళాకూళి, విన్నవాఁ కఁ బలుకు వెలఁదిఁ బుడుకు, కొడుకు రిక్కతేని నొడలి చూపొడ యని ... రామ. ౧౯౪.

**వెన్నుఁగాడి.** వి. (వెన్ను + గాడి) వెన్నెల, ఇంటి నడుకొప్పు ద్రామను. (శ. ర. పా.)

**వెన్నుగుదియ.** వి. (వెన్ను + గుదియ) వీపుపై కొట్టుట కుపయోగించు కఱ్ఱ.

తే. గీ. మందులాడి చెడుగు మానిసి భూతంబు, పిసిఁడి బిచ్చగాండ్ల వెన్ను గుదియ ... చెన్న. ౨. ౨౪.

**వెన్ను చూచు.** స. క్రి. (వెన్ను + చూచు.) పాఱఁ దోలు.

వ. నిర్జరులం దర్జించి, కిన్నరుల వెన్ను చూచి." హరి. ౩. ౯.

**వెన్ను చూ(సూ)పు.** అ. క్రి. (వెన్ను + చూపు) వెన్నిచ్చి వెనుక మఱలు.

సీ. మఱియు వైవఁగవచ్చు మెయి దారసించిన కూరత్వమున వెన్నుచూపఁ డనుచు ... పాండు. ౧. ౬౩.

గీ. కలమ గర్భంబు లా మహోత్పల దళాక్షి, పిక్కలకు నోడి తద్దయుఁ బిఁకపాటి, వెన్ను చూపి తృణంబూని యెన్నరాని, నానఁ దల వంచుచుండె ననారతంబు. రసిక. ౧. ౧౦౧.

(ఎనుఁగనఁ బఱచు అని యర్థాంతరము.)

సీ. చనుచె శత్రువుల వెంట మునుదాన తగిలి య వ్వీరులు నెగువంగ వెన్ను నూపి, పఱచుట ... హరి. ఉ. ౨. ౩.

పంచచామరము. అలంతులయ్యె కూర్మ మస్తకాదు లైన జోదు ల, బ్బలారి వెన్నునూపి నార పాచినాఁడ కాని నేఁ, డలంఘ్య బాహుశక్తిఁ దావకాజిలోన నుంచుఁ బి,చ్చులించి తెల్పెఁ దక్కథల్ ఖచః ప్రయోగ చాతురిన్. కకు. ౨. ౧౨౬.

**వెన్నుదన్ను = వెనుదన్ను.** స. క్రి. (వెన్ను + తన్ను.) ౧. వెంబడించు, అనుసరించు.

సీ. చిన్ని వెన్నెల కందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ బొడమిన చెలువ లోఁబుట్టు మాకు ... మనుచ. ౨. ౪౩.

చ. మొనలు గలంగినం గని సముద్ధత శక్తి నదల్చి వెన్నుద,న్ని నిలిచె దానవేశ్వరుఁడు ... నిర్వ. ౩. ౧౩.

మ. గడఘోఁజొ వ్వానుదన్ని నిల్వ విలుమూఁక
ద్వ్యాంబడిన్ గాఁపుగా. నడవన్ ...
చంద్రా. ౬. ౪౩.

ఉ. ఆ హరి వెన్నుదన్ని కుసుమాయుధ
సాత్యకి సాంబ సారణుల్, బాహుబలంబు
మీఱఁగఁ గృపాన శరాసన సాయకాది
సన్నాహములోఁడ నిల్చి ...
చిత్రభా. ౭. ౧౨.

సీ. ధారాధరము వెన్నుదన్ని పుట్టిన చాయ
నున్నదీ బింబాధరోష్ఠి వేణి ...
విజ. వి. ౨. ౧౦౬.

(ఇట ఔపమ్య ద్యోతకము.)

౨. తిరస్కరించు.

వ. నెన్నడుముల విన్ను వెన్నుదన్ని ...
మను. ౫. ౧౦౧.

—అ. క్రి. వెనుక నిలుచు.

ఉ. ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు ద్రోణ
సుతుండును కర్ణుఁడున్ బశు,త్రాణ పరాయ
ణత్వమున దర్ప సముజ్జ్వల భంగి నుల్ల స,
ద్బాణ పరంపరల్ గురియఁ బార్థుఁడున్
వెనుదన్ని చూడ న,క్షీణ జవంబునం
గవియు సేనకు మార్కొన నగ్గలించితే.
భార. విరా. ౫. ౨౩౭.

వ. ...వెన్నుదన్ని చూచు నవసరంబున ...
ఉ. హరి. ౩. ౩౬. (శ. ర. గ్రా.)

వెన్నునడుగు. విష్ణుపదము, ఆకాశము.

గీ. ...జక్కవలు వెన్ను, నడుగు వట్టుక మెఱి
సేయఁ దొడఁగె నపుడు.
అచ్చ. రా. అయో. ౧౫.

వెన్నువిఱుగు. అ. క్రి. ధైర్యము కోల్పోవు.

వ. ఇట్లు జంభాసురుండు ... పడినం దార
కుండు వెన్ను విఱిగి పడి నిశ్చేష్టితుండై
యున్న ... కుమా. సం. ౧౨. ౭౫౪.

వెన్నుసమ్మెట. వెన్నుపైని కొట్టుట కుపయో
గించు సమ్మెట.

చ. మద మెదవంగ మూషక కుమార సమూ
హము వెన్నుసమ్మెటై, యెదవిన వాల
మూర్చుచు ... భోజరా. ౪. ౨౦.

వెన్నుస(చే)ఱచు. స. క్రి. (వెన్ను + చఱచు)
వెంబడించి తఱుము. (అనూరు వర్ణనము.)

సీ. జంకించి పర పృథగ్జన కోటి చందానఁ
గఱకుఁ జీకటి వెన్ను సఱచు వాఁడు ...
కాశీ. ౩. ౨౩౪.

వెన్నుసొచ్చు. స. క్రి. (వెన్ను + చొచ్చు)
వెనుకఁజేరు, శరణొందు.

సీ. విప్రులఁ జుట్టల వెన్నుసొచ్చిన యట్టి వారిని
గొలిచిన వారిఁ బ్రజల, వార్ధంబులోఁ
గాచి యన్యాయ ముడుపుచు ... ద్వా. ౪.

వెన్నెక్కు. అ. క్రి. (వెన్ను + ఎక్కు) గర్వించు.

ద్వి. నిన్ను నీ వెఱుఁగక వెన్నెక్కి త్రావి,
కన్నులఁ గానక కరకంఠ మూర్తి, నొడలు
గల్గఁ జూచి యెరునిగాఁ జూచి ...
పండితా. పురా. ౯౫.

వెన్నెముక. వి. (వెన్ను + ఎముక.) వీపు నడిమి
యెముక. (శ. ర. పా.)

వెన్నెల[1]. వి. (వెల్ల + నెల.) ౧. చంద్రిక.
(చందురుని) తెల్లని కాంతి.

చ. ...చందురు నుసుపోగ వెన్నెలలతోఁ
దులఁ దూఁగడు తద్గుణంబులన్.
నైష. ౧. ౫౦.

చ. వలిమల యల్లుఁవాఁడు తలవాఁక ధరించిన పూవుగుత్తి వే,ల్పుల గమిజీవగఱ్ఱ యుడివోవని చల్వల ఁటెంకి వెన్నెలల్, మొలచిన పాదు ... పారి. పీఠి. ౬.

౨. వెన్నెల వంటి కాంతి

ఉ... నా సఖ, న్నీ కనుదోయి వెన్నెలలు నిండఁగ కోర్కులు నాకు నిండునే.

ఉ. హరి. ౧. ౬౨.

సీ. వీడెంపు బలుకెంపు విరిసి వెన్నెలగాయ వలిగింజ నొకటఁ బల్వరుస ...

ఆము. ౧. ౬౦.

౩. ఒక విధమైన యాట.

ఉ. అల చిమ్మన చీఁకటి చూట మొట్టియా వె,న్నెల లాట మెట్టినటు విన్నల మెన్మును మున్ని లాస్థలిన్ ...

ముకుంద. ౩. ౫౩.

వెన్నెలకందు = శేఁతచందురుఁడు.

సీ. చిన్ని వెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ బొడమిన చెలువ తోఁబుట్టుమాకు ...

మను. ౨. ౪౩.

వ్యవ. ఆడవిగాయు వెన్నెల నిష్ఫలము.

క. అతివల హృదయము లారసి, రతికలనద్దేల్ప లేని రట్టడిమూపున్, జతురతయు జవ్వనంబును, వితయుచు మీ యడవిఁ గాయు వెన్నెల రీతిన్. కళాం. ౩. ౬౩.

ఇట్లే: కానఁగాచిన వెన్నెల.

వెన్నెల[2]. వి. నటివిశేషము; వందనభేదము.

సీ. జోహారు నీకు మంజులకీర రుకాళ చిన్ని వెన్నెల నీకు జిత్తజన్మ... ఇందు. ౩. ౭౮.

వ. శ్వేతగిరి యందలి సింహాలోచనునకు; వెన్నెల ధర్మపురియందలి యోగానందునకుఁ గొల్వు ప్రొక్కి ... ప్రబంధ. ౧. ౭౭౦.

వెన్నెల కుప్పలు. వి. బ. బాల్యక్రీడావిశేషము.

సీ. దాఁగిలి ముచ్చులాటలు గచ్చకాయలు వెన్నెల కుప్పలు తన్ను బిల్ల ... కాశీ. ౩. ౩౩.

తే. గీ. అసపుఁ గప్పురపుం గుప్పలవనినుంతుఁ, గూర్మి నను పేర్మి వెన్నెల కుప్పలాడు ...

రా. వి. ౨. ౨౩.

సీ. రమణీయగతిఁ జకోర కుమారికలు గుంపుగొని యాడు వెన్నెల కుప్పలనఁగ ...

పి. శకుం. ౨. ౧౭౩.

వెన్నెలకూన. వి. బాలికా క్రీడావిశేషాలు.

సీ. చేతుల కణఁగవీ చెలువ చెక్కులటంచు వెన్నెల కూనకు నన్ను బిలరు ...

పార్వ. ౨. ౨౧.

వెన్నెలకోలు. వి. నమస్కారము, వందనము.

రగడ. విష్ణుపురంబున విలసిల్లు మహావిష్ణుస్వామికి వెన్నెలకోలని ...

హంస. ౪. ౨౧౩.

వెన్నెలగీము. వి. (వెన్నెల + గీము.) చంద్రుఁడు

సీ. కటిక చీకటికి నగ్గంబైన శే వన్నెలాఁడి వెన్నెలగీముఁ గూడుటెల్ల ...

ఉ. రా. ౫. ౧౭౦.

వెన్నెలగుత్తి. వి. (వెన్నెల + గుత్తి) చంద్రుఁడు.

వ. తెల్లని దివిరాజ, సుడివాలు కేలునఁ దనరిన యొడయ, కాకరా వెన్నెలగుత్తి కన్దోయి మన్నీడడ ... ప్రబంధ. ౨౧౬.

వెన్నెలపాపఁడు. వి. (వెన్నెల + పాపఁడు.) చంద్రుఁడు.

సీ. వెలఁదిరో యీతడే వెన్నెలపాపని పువ్వుగాఁ దురిమిన పుట్టుభోగి... వీర. ౩. ౧౫౮.

వెన్నెలపులుఁగము. వి. (వెన్నెల[1] + పులుఁగము.) క్రీడావిశేషము.

వ. సరస సల్లాపంబుల వల్లభులంగూడి వెన్నెల పులుఁగంబులాడు క్రీడావతులును ...
వరాహ. ౪. ౧౫౫.

**వెన్నెలపులుఁ(ల్లు)గు.** వి. వెన్నెలను సంతోషించెడి పక్షి విశేషము, చకోరము.

గీ. పొసఁగ రే యింతి వెన్నెల పులుఁగుగములఁ, దెనుచుటకు మేత నించియుంచిన విధంబ...
అచ్చ. రా. అయో. ౧౮.

సీ. వెడఁద గూడులనుండి వెన్నెల పులుఁగులు తెమలె నా నేత్రాంచలములు బెళుక ...
ప్రబంధ. ౨౯౦.

చ. స్ఫురిత నవోత్పల ద్యుతులు చొప్పడ యామినీ కామినీ భవ, స్మరహరమూర్తియై తదుము మూర్ఛిల వెన్నెలపుల్గు వేలుపుం, దొరలకొసంగఁ బూని ...
కృ. శకుం. ౨. ౧౯౪.

**వెన్నెలప్రోవు.** వి. (వెన్నెల[1] + ప్రోవు.) వెన్నెలలో బాలురు కుప్పలుగా నిసుకపోసి యాడు నాట.

సీ. ముద్దిపెంపు నగవులు ముద్దు లేఁజెక్కులఁ జూదబడుచు వెన్నెల ప్రోవు లాడ ...
నీలా. ౧. ౧౫.

**వెన్నెలబచ్చె.** వి. (వెన్నెల + బచ్చె.) చంద్రుఁడు.

వ. మీ మొంగంబుల మిల మిలలు గిలుబాడ వచ్చెఁ జుమీ వెన్నెల బచ్చెముచ్చు ...
వసు. ౪. ౨౩.

**వెన్నెలబొమ్మ.** వి. (వెన్నెల[1] + బొమ్మ.) వెన్నెలతో చేసిన బొమ్మ.

సీ. నడపాడ నేర్చిన నవకంపు లత లనఁ బోలు పొందు వెన్నెల బొమ్మలనఁగ ...
ధనాభి. ౨. ౨౩. పం.

**వెన్నెలరా.** వి. (వెన్నెల[1] + రా.) చంద్రకాంత మణి.

ఉ. ... బలు వెన్నెలరాల సరాల జాలురాఁ జిన్నెలఁ జూడముట్టి ...
ముకుంద. 3. ౫3.

**వెన్నెలరాచఱా.** వి. (వెన్నెల[1] + రాచ + ఱా.) చంద్రకాంతమణి.

ఉ. వెన్నెల రాచఱా చలువ విప్పుట రంగులఁ జేరి జాఱువా, కిన్నరలాని ...
అచ్చ. రా. బాల. ౧౨౦.

**వెన్నెలరాయఁడు.** వి. (వెన్నెల[1] + రాయఁడు) చంద్రుఁడు.

చ. విను రతనంపు వంగడపు వెన్నెలరాయని మర్వునేరినన్... అచ్చ. రా. యు. ౨33. (సూర్యవంశ శ్రేష్ఠుఁడని భావము.)

**వెన్నెలఱేఁడు.** వి. (వెన్నెల[1] + ఱేఁడు.) చంద్రుఁడు.

చ. వికట జటా కుడుంగమున వెన్నెలఱేని ధరించి...పాడసూపె భీమనా,యకుఁడు...
భీమ. ౫. ౫3.

క. వేగుట గనరాకుండిన, వేగ మఱలి వచ్చి తపసి వెన్నెలఱేఁ డు, ట్లాగడముగ మెలఁ గెడు మము, బాగుగఁ బొడఁగాంచి యొదను బాయని కినుకన్.
అచ్చ. రా. బా. ౧౪౩.

**వెన్నెలవంక.** వి. (వెన్నెల[1] + వంక.) వెన్నెల వాఁక, తెల్లని కాంతిగల నది, ఆకాశగంగ.

సీ. నెలవంకతోడి వెన్నెలవంక గలమేటి నెల వంక రహితాంశుని యతిఁ దగడి ...
నరస. ౪. ౬౮.

**వెన్నెలవాటు.** అ. క్రి. స్వచ్ఛకాంతి గలది యగు.

ఉ. ప్రసన్న నిసాదముల్ చిలుక వాలిన గంజడు మేనుదీఁగెయున్, వెన్నెలవాలు సెమ్మొగము నిద్దపు ముద్దు మెఱుంగుఁ జెక్కులున్ ... రాజశే. ౨. ౧౩౬.

**వెన్నెలవిరిదాల్పు.** వి. (వెన్నెల[1] + విరి + దాల్పు.) ఈశ్వరుఁడు, శివుఁడు.

సీ.... వెన్నెలవిరిదాల్పు వేలుపు భువనమోహన సర్వమంగళా వాప్తుఁడగుట ...
దశా. ౪. ౧౫.

**వెన్నెలసోగ.** వి. (వెన్నెల[1] + సోగ.) స్వచ్ఛమైన కాంతిగల దీర్ఘవస్తువు.

ద్వి. విన్నుపైఁ గ్రొమ్మించు వెన్నెలసోగ, యున్న కైవడ సిరి యురమునఁ జెలఁగ ...
ద్వి. పరమ. ౧. ౩౫.

**వెన్నుడు.** అ. క్రి. రూ. వెనుబడు, దుఃఖపడు.

చ. పడితిమి కుక్కలం బడని పాటులు దుర్భరమైన వృత్తి వెన్నడితిమి గర్భ యాచకుల భంగి దరిద్రత నట్టుకొంచు లోఁబడితిమి...
హర. ౩. ౧౫.

ఉ...ఏ క్రియన్, వారిధిఁ ద్రచ్చువారము ధృవంబుగ దానికిఁ గవ్వ మెద్ది యాధారము దాని క్రిద్దియని తద్దయు వెన్నడి యున్నన్ ...
భార. ఆది. ౨. ౯.

**వెన్నాటు = వెనుఁబాటు.** వి. (√ వెన్నడు.) దుఃఖము.

ఎ. గీ. తలఁచు పుట్టఁగొంతు గొలఁదికి మీకు వెన్నాటు దోఁచె పుట్టుపాటు కొడక ...
భార. విరా. ౨. ౧౦౬.

**వెన్వెన్క.** వి. (వెనుక + వెనుక) మిక్కిలి వెనుకభాగము.

దండకము. ... కాద్భుతప్రేమ మున్మూర్ఛగాఁ దీయఁగాఁ ఘోరమాద్రుష్టి వెన్వెన్కకుం ద్రోయు ... దశా. ౪. ౨౩౨.

**వెప్పు.** వి. (√ వెచ్చు.) వేఁడిమి.

వ. ఉప్పు వెప్పునుం గల యప్పితిత ఖండంబులు ... మను-చ. ౪. ౬౦.

**వెమ్ము.** అ. క్రి. (త. వెంబు.) తప్తమగు.

ఉ. ఏవి దినంబులోర జను లెయ్యవి యో విను నిద్రయెట్టిదో, కేవుట యెప్పుడో యకట వెమ్ము మనంబున కద్దిమందో యేత్రోవలఁ బోయెనో తలఁపు తోడన చెయ్వు లెఱుంగ నేను నా, కీ శరవేఁకి మాన్పఁ గమలేక్షణ యచ్చిలి నీవు నొజ్జవై. హరి. ఉ. ౩. ౧౩౦.

సీ. ఉమ్మలికమ్మున వెమ్ము నంగజవహ్ని దురపిల్లు నుల్లంబు మరులుకొనఁగ ... పరముఁ డెన్న డొక్క ప్రత్యక్షమై తనరూపు శైల సుతకుఁ జూపు నెలమి ...
కు. సం. ౫. ౬౩౪.

ఉ...., వెచ్చనియూర్పు నించుచును వేదనఁ బొందుచు గన్ను మోడ్చుచున్, వెచ్చుచు సెజ్జపైఁ దనువు వెమ్ముఁగ వేఁచుచు నీల్గి లేచుచున్. కేయూర. ౩. ౩౪౩.

**వెయి = వెయ్యి, వేయి.** వి. స. సహస్రము, పదినూఱులు, అనేకము.

లయగ్రాహి. తన్ను మదిలోన వెయికన్నుల పురందరుఁడు, సన్నుతగతిం దలఁప వెన్నుని సుతుండున్, వెన్నులు వెసం దలఁకి యున్నఁ గని. వీర. ౨. ౨౧.

ఉ...., నీ చతురత్వ మింతయిన నిర్జర భర్తకు నేదియాయ కే, చూచితి మెందులేదు వెయి చూపుల దొక్కటంచు ...
దశా. ౪. ౧౨౧.

ద్వి. వీఁడె సుషేణుండు వెయికోట్ల కపులు,
వాఁడిమిఁ దన్నుఁ గొల్వఁగ నున్నవాఁడు.
రం. రా. యు. ౩౩౧. పా. ౪. పం.

గీ. కోరికల కంటె సాహస్ర గుణిత ఫలముఁ,
బొరసి యవ్విభు వెయినోళ్ళఁ బొగడు
వారు, గాని మిన్నక యుండెడు మాన
వుండు, మందునకునైన లేఁడు తన్ముఖము
నందు. విక్ర. ౫. ౧౨౪.

వెయ్యార్లు. స. (వెయ్యి + అఱు.) అసంఖ్యము.

శా. ...అయ్యా మీతండ్రి గడింప లేదుగద
వెయ్యార్లన్నఁడుం జాలు ...
శుక. ౩. ౨౮౮.

వెయ్యి. స. వేయి.

క. అయ్యన్న దానశైఖరి, నయ్యన్నకు సాటి
నృపతు లవనిం గలరే, వెయ్యన్న ఘుటో
త్కచు గ, న్నయ్యన్నకు మేటియా మహా
మహుఁ డతఁడే. ఇందు. ౧. ౮౩.

వెయ్యను = వేయి మాటలు చెప్పు.

శా. వెయ్యేలా యటులైన ధాత నిపుడే
వేనోళ్లఁ గీర్తింపనే ...
ఉ. రా. ౪. ౧౭౫.

ఉ. వెయ్యన నేల రంగ పృథివీవర జాగ్రత
నొందియుండుచే, తియ్యము నెయ్యమైన
మదు దీరిత నీతి గ్రహింపు ...
రంగా. ౨. ౧౭౩.

వెర = వెర(గు). వి. ౧. ఆశ్చర్యము.

సీ. వెర బొంత గాచెన వేసి మూసిన యట్టి
యరల వెట్టియ మూసి నట్టె యుండె ...
కువల. ౫. ౩౮.

౨. భయము.

చ. గొరగొర లాడుచున్ బుడమి గ్రుచ్చుచు
బల్వెరతోడ నోరగా, బిరిఁదికిఁ జూచు
చున్ గడుపు వేఁగున వంకరగాఁగఁ
బోవుచున్ ... చెన్న. ౨. ౨౦.

చ. కరులిల వ్రాల వంబడ నికాయము దూలఁ
దరతురు లోకముల్, వెరఁ బరుషంద మత్త
కదళీ చయముల్ బెగడొంద గండకోత్క
రములు గ్రుక్క బుత్తు సముదాయము
నెవ్వగఁ జిక్కఁ గీశముల్ తరుతతి నీనఁగ
సూకర కులంబులు డాఁగ మహాద్భుతంబు
గాన్. చంద్రి. ౨. ౨౬.

వెరఁగు = వెఱఁగు. వి. ౧. ఆశ్చర్యము.

క. వెరఁగయ్యెడు నే నిపుడీ, తరుణి గుణం
బులు నుతింపఁ దాను విరక్తిన్, స్థిరుఁ డట్ల
యుండి తోడనె విరహార్తుఁడ నైతి ననుట
వివరింపఁ జెలీ. ప్రభా. ౪. ౪౮.

౨. నిశ్చేష్టత.

చూ: వెరఁగుపడు.

ఆ. అంతలోఁ బ్రదీప్తమైన యక్షుపిత శక్తిని
గరంబు మూర్ఛ మునిఁగినట్టి, రాకొమ
రుఁడు లేచి రణమత్తుఁడయ్యె గూల్చిన
యతండు వెరఁగునను మునుంగు.
రాఘు. ౪. ౧౭౬.

వెరఁగుపడు. అ. క్రి. (వెరఁగు + పడు.) నిశ్చే
ష్టత నొందు.

క. ఒక్కింత తపవు చేష్టలు, దక్కక నంబడియె
జిత్ర తనువును బోలెన్, మిక్కిలిఁ గమ
నీయత సతి, దక్క కురు స్తంభ సంగతత్వము
కతన.

వ. అప్పుడు ప్రభావతికిఁ బ్రద్యుమ్నుం డిట్ల
నియె.

చ. వెరఁగు పడంగ నేల యలివేణి భవత్పతిఁ
గానే రేను నీ, విరసత మాన్పు లే కపుడు
వేఁగుచు నంతటిలోఁ బ్రయోజనాం, తర
మతి నేఁగి నేఁటికిని దాని ప్రసంగము లేమి

వచ్చితిన్, దిరిగి వసించితి స్వామిక దిక్కున
నీవిధ మెల్లఁ జూచుచున్. ప్రభా. ౫. ౧౭౦.

**వెరఁజాడు.** స. క్రి. (వెరఁజు + ఆడు. స్వార్థమున.) కొల్లగొట్టు.

ఆ. ఉవిద నీకుఁ దెలియదో కాని యేయింట,
నైనఁ జొచ్చి యెప్పుడైన వచ్చి, వెదకి
వెదకి వెన్న వెరఁ జాడుచున్నాఁడు, నీ
సుతుండు మమ్ము నిలువనీక.
వి. పు. ౩. ౧౨౭.

౨. (వెరఁజి + ఆడు.) ప్రోవుచేసి యెత్తు.

గీ. పూని తమతమ కొనివచ్చు భూరుహముల,
కాయగసరెల్ల వెరఁజాడి డాయిఅప్పు,
దెచ్చువారికి నోరూర దించు ...
భా. రా. యు. ౨౬౫.

**వెరఁజు.** స. క్రి. ౧. కొల్లగొట్టు.

సీ. జనని యుగ్గునఁ దృప్తి సనక నిన్నటిదాఁక
వెరఁజితి వ్రేపల్లె వెన్న లెల్ల ...
జై. భా. ౩. ౫౩.

గీ. దూర పరదేశినని పంచఁజేరి రాత్రి, వేళ
యిలు సొచ్చి ధనమెల్ల వెరఁజువారు ...
దశ. ౧౦. ౧౦౫.

ద్వి. ...రేపును మాపు వచ్చి, బాధించి యింటి
లోపలి వెల్ల మరులు, బోధించి వెరఁజి
గొంపోవుచున్నారు ...
ద్వి. పరమ. ౩. ౨౦౬. పా.

౨. కొట్టు.

వ. ...ఆ శర్కరి పేసా నక్రాకరంబుఁ జొచ్చి
శోధించి కలంచి కలగుండుసేసి మట్టి
మల్లాడి వెరఁజి వెంపరలు వెట్టి ...
పి. శకుం. ౩. ౧౨౬.

మ. ...అంత్రక్రేణిఁ గిన్కన్ వెరంజు సిత
క్రూర ధవన్నభావళులు ప్రోచున్ మర్త్య
పంచాననా. ఆము. ౪. ౨౨.

సీ. విలయంబు నొందించు విపినంబు పందుల
వెరఁజి వెంపరలాడు హరిణములను ...
పి. శకుం. ౨. ౧౨.

౩. ప్రోగు జేసి యెత్తు.

రగడ. గురువెంద నడ గిలుబు కొనియొఁ
బయ్యెర దొంగ, విరులఁ గరికుంభ కుచ
వెరఁజు మైయర గ్రుంగ ...
మనుచ. ౩. ౭౪.

వ. ఏమఱించి వచ్చి కాఁగుచున్న కాఁగుల
మీఁది మీఁగడలు మెల్లమెల్లనె పుడుక
వెరఁజి యారగించియును ...
వి. పు. ౮. ౧౨౬.

౪. కను పెట్టు, కాచియుండు.

సీ. వేస మన్నీఁడ నీవి కాన వెరఁజుము గైత
నీవా జాడ గనఁగఁ జూపు ...
ప్రబంధ. ౧౭౩.

౫. గట్టిగా పట్టుకొను.

చ. బరవసమొప్ప గాలి తడఁబాటు మెయిన్
గవిఁదూఱి యొక్క కు,ర్కురము తమం
బులో వెరఁజి కోఱలచేఁ గబలించి పొట్ట
పెం,జేరనుడుమంచుఁ దెచ్చి కని చేవ
దొఱంగక త్రుంచిపైచె ...
మనుచ. ౪. ౫౨.

**వెరవరి.** విశే. (వెరవు + అరి.) ౧. ఉపాయశాలి.

చ. వెరవరిగాక వీఁడు కురువీరులకుం బొడ
సూపువాఁడె యచ్చెరువొక ప్రామనిపేర
నిట సేరఁగ వచ్చుచు నున్నవాఁడు ...
భార. విరా. ౪. ౭౧.

ద్వి. వెరవరులై మేష వృషణముల్ దెచ్చి,
సురలు సంధించిరి సురలోక పతికి ...
రం. రా. బాల. ౫౦. పా. ౨౭. పం.

సీ. సకల విద్యా విచక్షణత మించినయట్టి వెర
వరి సైరంధ్రి వెంటరాఁగ ...
రాజశే. ౩. ౨౦౧.

౨. జీవనోపాయజ్ఞుఁడు.

సీ. ధనమెంత దఱుగునో యనఁ డింత వెచ్చ
మూ వడ్డికాసుల వెరవరికిఁ గలికి ...
రా. వి. ౧. ౩౫.

వెరవిఁడి. విణ. (వెరవు + ఇఁడి.) ౧. ఉపాయ
హీనుఁడు.

క. మఱవక యోఁదులు పూఁదులు, గొఱికిన
నా యొడలు మృదువగునె నీకేలా, వెర
విఁడి చందము పుట్టెన్, దఱి దీనికి వెరవుఁ
జెప్పెదన్ విను మర్థిన్.
వేం. పంచ. ౪. ౫౪౪.

క. తరుణీ విరహాతురుఁ డగు, నరనాథ తనూజు
మంత్రి నందనుఁ గని యీ, నరపతి సుద
తీ ణా యని, వెరవిడియై పలుకఁదొడఁగె
వీడని కాఁకన్. సుద. ౫. ౪.

క. గురుజను లెఱుఁగక యుండును, వెరవిఁ
డియై మినుకు గట్టి పెళ్ళి చనువునన్, వరి
యింపఁ దగిన పురుషుఁడు, పరిణయ మగునేని
నదియ పైశాచ మగున్. విజ్ఞా. ఆచా. ౧౦౧.

౨. తెలివిలేనివాఁడు, మూఢుఁడు.

క. అరులకు సిరి యిచ్చెదనను, వెరవిఁడియుం
గలఁడె దీని విడువుము ...
భార. శల్య. ౨. ౮౬.

క. ఉరు బాహు బలము గల్గియు, వెరవిఁడివై
తేరకాని విధమున నకటా, కరుణ యొద
లోనఁ దలఁపక, దురమున జమువాత నిన్నుఁ
ద్రోచితి పుత్రా. భా. రా. యు. ౧౩౭౫.

వెరవు. వి. ౧. ఉపాయము.

క. వెరవును లావును గలిగిన, పురుషులు లే
రెట్లు లోకమున ... భార. శాం. ౩. ౩౧.

ద్వి. ధరణీశ మీకు సంతాన సంప్రాప్తి, వెర
వైన కథ మున్ను విన్నాఁడ నేను ...
రం. రా. బా. ౧౧. పా. ౮. పం.

ఉ...రా, మాళని సాధు తమ్ములకు నట్టి యపౌ
రుషవృత్తి మేలె మీ, కీ వెరవాదరింపఁ
దగునే యన్నినన్ మునులెల్ల నవ్వుచున్.
నిర్వ. ౧౦. ౧౧.

క...ఎట్టి వెరవునవైనన్, క్షితి పులకరి జయము
ధనోన్నతియుఁ బ్రజానీతి రక్షణము ధర్మం
బుల్. ఆము. ౩. ౩౫.

౨. నేర్పు, చాతుర్యము.

సీ....కీర్తి ధనార్జన క్రీడనంబు.

ఆ. గలిగి జనుల నేలఁగాని యొన్నండును,
నొరులఁగొల్చి తిరుగ వెరవులేని, యట్టి నీవు
విరటు నెట్టి చందంబున, ననుచరించువాఁడ
వధిప చెపుమ. భార. విరా. ౧. ౬౮.

గీ....అఖిల మోహనమూర్తిగా నరుఁబోడిఁ,
బంచ బాణుండు తాన నిర్మించెఁగాక,
వేదజడుఁడైన యజునకు వెరవుగలదె.
విక్ర. ౮. ౪౪.

క. పైవచ్చు క్రూరజంతువుఁ, జే వెరవున నేయు
టెంద సిగ్గె చెపుమా ... హర. ౮. ౫౮.

౩. రీతి, విధము.

గీ. సగరు వెరవునఁ బురుకుత్స సరణి నలుని
రమణ నర్జున క్రియఁ బురూరవుని చంద
మున ... విక్ర. ౨౬౯.

క. సిరిరామో కాలొడ్డిన, కరణినిఁ బైకొనుచు
నేనె కదియఁగ నను నీ, వెరవున విడ
నాడుచు నొక, తిరిపవుఁ జెలిపట్టెఁజేరఁ దివి
రెదవేమీ. యయా. ౨. ౮౩. (శ. ర. పా.)

౪. ధర్మము.

గీ. మేలుగల వాఁడు మురియుచు మెసవనేర్చి,
గొడవ లాద వెడు తఱిఁబోవ విడువఁదగునె,
తలఁపను సురుల యొడయఁడై తవరు మగవి,
వెరవెతింగిన నాడెంపు వెలఁదు కలకు.
అచ్చ. రా. అయో. ౮౧.

౫. అనుకూల్యము.

సీ. మాతలేశ్వరు నొక్క మణికందరంబున విశ్రామముండంగ వెరవుసేసి ...
హర. ౫. ౪౦.

౬. ద్వారము.

వ. పక్వాన్న గంధంబు గాలివెరవున నాఘ్రాణించి ... కాశీ. ౪. ౧౨౦.

గాలి వెరవునన్ = గాలిద్వారా.

విశే. ౧. శక్తము, సమర్థము.

క. పావన గుణానుభావము, భావన భావింప నెట్టి పరమ నదులు నీ, కావేరికి సదృశంబులు, గావేరికినైనఁ బొగడఁగా వెరవగునే. కళా. ౨. ౧౩౪.

ద్వి. పొరి భూతకోట్లను బుట్టింపఁ బెంప, విరియింప నొక్కఁడె వెరవైనవాఁడు ... రం. రా. ఉ. ౧౦౩. పా. ౧౦. పం.

౨. యుక్తము.

అ. వాదులానితోడ వాట్లినితోఁడను, బూతుతోడఁ దిండిపోతుతోడ, నటమటీనితోడ నడయరితోడను, వెలకునెత్తమాడ వెరవు గాదు. ఉ. హరి. ౩. ౧౧౨.

మ. ...వరవైతాళిక వంది బృంద జయ జీవ స్ఫార శబ్దంబులున్, వెరవై పేర్చి చెలంగ వెల్వడియె సంప్రీతిన్ నిజావాసమున్. హరి. ఉ. ౪. ౧౧౪.

క. పరపగు పాహార పేర్పను, వెరవగుచో నెల్లి నేఁడు విడిసెద మధురా, పురమున ... ఉ. హరి. ౪. ౧౬౮.

౩. అధీనము.

క. గరుడునిపై శార్ఙ్గధను, ర్ధరుఁ డగు విష్ణుండు మేరు తటిఁబొల్చు తటిత్పరివృత జలదము బోలుట వెరవ దనుజరాజ హంస వితతి యితనికిన్. నిర్వ. ౩. ౫. (శ. ర.)
(విరియ ముద్రిపా.)

వెరవుపడు[1]. అ. క్రి. (వెరవు + పడు) వశమగు, అధీనమగు.

వ. అప్పాటం బ్రతివచనంబునఁ బొట్లెల్లు చీకటి తప్పు కప్పి పుచ్చి వెరవు పడకుండునట్లుగా బ్రకాశించిన ... హర. ౫. ౫౪.

వెరవుపడు[2]. అ. క్రి. (వెరవు + పడు.) అనుకూలమగు.

గీ. ...అపుడు గాని మా తండ్రి యున్నట్టి చోటు, నరసి సంధించు కొనుటకు వెరవు పడదు. కళా. ౬. ౧౫౪.

వెరసి. వి. అంకెలను గలుపఁగాఁ దేలిన మొత్తపు లెక్క.

ద్వి. ...చదువు లెక్కలు వెరసది దప్పకుండ... బస. పు. ౬. ౪౮౩. పం.

వెరసి(సు)మాట. పర్యవసానము, చివరకుఁ దేలిన సంగతి.

వ. అన్నియుం జెప్పనేల వెరసి మాట యొకటి గలదని యిట్లనియె ... కళా. ౫. ౪౮.

క. తగ వెరసు మాట చెప్పెద, మగువలసంచల కటాక్ష మార్గణ జాలం, బు గెలువఁ దాఁకినఁ దాఁకవె, జగతిం గోవిదుల మతులుఁ జదువులుఁ దెలువుల్. ప్రబోధ. ౧. ౪౪.

వెరసు. వి. అంకెలు లోనగు వాని పంక్తి.

చ. హరిదవధిక్షమా రమణులాతు రగాళి నుదుళ్ల పట్టముల్, తరువుల రాయసంబుల విధంబునఁ గల్గొని శ్వేతమాన వేశ్వరునకుఁ దెచ్చి యిచ్చిన సువస్తు పరంపర లెక్కఁ

గూడు పె,స్వైరసులరీతిఁ దత్సవన వీతి
ఖురాంకము లుండు నుర్వరన్.

వరాహ. ౧-౨. ౬౦.

ద్వి. స్వర్గంబు గరసు మోక్షంబుల వెరసు, శివ
యోగుల కిరవు సిద్ధుల తెరవు ...

పండితా. పర్వ. ౩౧౩.

వెరసుబడి. వి. (√ వెరసు) అంకెలపంక్తి, అంక
మాలిక.

వి. విను మీతని సేనం గల, వనచరభట సంఖ్య
వర్గ వర్గములెల్లం, జెనురాశి సేసి కవిలెం,
జన వ్రాసిన వెరసుబడి నిశాచర నాథా.

భా. రా. యు. ౩౬౪.

వెరళించు. స. క్రి. చెలఁగించు, విజృంభింపఁ
జేయు. (ప్రయోగాంతరము కన్పడ లేదు.
ఇంకను విచార్యము.)

గీ. చికిలి లోపలనే చీమ చిటుకుమన్నఁ, గనక
నన కూయు ఒకదారి కవల కడన, మరుని
వెరళించు మల్లెంటు విరుల కడన, బదుక
యిలు మాని విరహతాపంబుఁ బూని.

కువల. ౫. ౩౭.

వెఱ. వి. (త. వెరు.) ౧. భయము.

క. చెఱువు నడుమ విసినను బెను, వెఱమొక
ములు చెదరినను వివేకనిధీ యు, క్కుటి
బహుళ సైన్య మటె ముటెఁ, బఱచిన నా
గంగరాదు బతియుర తైనన్.

భార. శాం. ౩. ౧౮.

చ. వెఱమెరలేని యట్టి బలు వీరుఁడు కృష్ణ
కుమారుఁ డొక్కచేఁ, జఱచి ...

భాగ. ౧౦. పూ. ౬౬౨.

శా. పుట్టంబుట్టఁగఁ దల్లిదండ్రు లడివిన్ వోఁ
ద్రోచిరీ వైఖరిన్, బొట్టుంగట్టిన ప్రాణ
నాథుఁడు పో పొమ్మంచు నో నాడెడిన్,

గట్టా కోయిల పిల్లచందమున బల్గాసిన్
వెఱంగొంటి న, న్నిట్టట్టుం గికురింపఁ జూచె
దవో కుయ్యాలింపవే శ్రీహరీ.

కృ. శకుం. ౩. ౧౬౪.

౨. ఆశ్చర్యము.

గీ. నేను మొదలుగ నొండొండ నెనఁగు నంప,
వెల్లివఱపియు నస్త్రముల్ వెలయఁజేసి,
కాన మొక్కని నందుఁ దాకదు దగులదు,
తిచ్చవడి నిలిచితిమి వెఱ ముచ్చముడిఁగి.

హరి. ఉ. ౫. ౬౩.

గీ. అనఘ మణికంధరుం డట్లు తనదు తపము,
విఘ్న మొందించుకొనుటకు వెఱ పొడ
మెడుఁ, దిరుగఁ దపమొనరింపంగ దొర
కొనిరొనో, యిపుడు రంభతో నున్నాఁడొ
యెఱుగవలయు.  కళా. ౩. ౪౩.

గీ. దిగధి పాలురనెల్లఁ దోర్దర్పఁబనిచి, వారు
దాను రహస్య విచారపరత, నుండి వెఱ
తోడి భయమునను దిలగొనుచుఁ, బలికె
గీష్పతిఁ జూచి యాబల విభేది.

కవిక. ౬. ౯౩.

౩. నిశ్చేష్టత.

మ. పనిగానేర దటంచుఁ బూనక వెఱం
బ్రాపింతు రెంతే జడుల్, పనికిన్ మేకొని
విఘ్నతేశము జనింపన్ మధ్యముల్ వీఁగి
పోం,తరా చాలింతురు... మల్ల. నీతి. ౩౨.

వెఱఁగందు. అ. క్రి. (వెఱఁగు + అందు.)
ఆశ్చర్యపడు.

క. ఈ జనపదమున కధిపతి, యే జనపతి యా
మునీంద్ర యుదికృతయుగ వ,ద్భాగ్విజిత
మని వెఱఁగందెడు, నాజి తమాథవునితోడ
యతివరుఁ డనియెన్. చం. రా. ౨. ౯౮.

గీ. చిత్రజాతుండు కనుమాయ చేసినాఁడొ,
మన మనంబుల విభ్రాంతి మట్టుకొనెనొ,

కమలలోచన పరితాప గౌరవంబు, యనుచు
వెఱగంది నుదిఁగుంది యబ్జముఖులు.
విక్ర. ౧. ౧౩౭.

**వెఱఁగు = వెరఁగు.** వి. (క. బెఱగు. త. వెరళ్.)
ఆశ్చర్యము, వింత.

క. తదనంతరంబ రాముఁడు, మొదలగు యాద
వులకెల్ల మోదము వెఱఁగున్, మదిమొలవఁ
జక్రధరుపై, వదలక వినువీధిఁ బుష్ప
వర్ష ముగురిసెన్. ఉ. హరి. ౧. ౧౨౨.

ఉ... వాసియు వన్నెయుం దగవు వైభవముం
జలమున్వివేకమున్, బో సవతుల్ భజించు
టకుఁ బో వెఱఁగయ్యెడు నేమిచెప్పుదున్.
పారి. ౧. ౯౨.

క.... నతఁడా, రూపం బెడఁబాసి ఖేచరుల
వెఱఁగందన్. మనుచ. ౪. ౧౧౬.

౨. అద్భుతకృత్యము, వింతపని.

క. శ్రీ విశ్వ విభుఁడు చేసిన, యా వెఱఁగుల
కలుగ వలయు నలిగిన ఁదపన్, భావింప
నతఁడు ధీరుఁడు, వావిరి ననుఁ దేర్పఁ
దతను శక్తి బడవలయున్.
కావ్యా. ౧. ౧౦౪.

ద్వి. వెఱఁగైన యా రంగ విభు మహామహిమ,
మఱి వేల్పులకు నవాఙ్మానస గోచరము ...
ద్వి. పరమ. ౫. ౪౦౨. పా.

**వెఱఁగొందు.** అ. క్రి. (వెఱఁగు + ఒందు.)
ఆశ్చర్యపడు.

సీ. విక్రమార్కుని నైన వెఱఁగొందఁగాఁ
జేయు జండ తరాభీల సాహసములు ...
విక్ర. ౧. ౭౩.

**వెఱఁగుపడు.** అ. క్రి. (వెఱఁగు + పడు.) ౧.
ఆశ్చర్యపడు.

క. వెఱఁగు పడి హర్ష రాగము, దఱిఁగిన నెల
తెల్లనై వదనములు వ్రాలం, దెఱఁగేది తచ్చు
వడి రత్తతిఁ దత్పరిజనము లెల్లఁ దద్దయు
వంతన్. భార. అర. ౩. ౧౫౭.

గీ. నేటితోఁ బాసె రాక్షసానీకమునకు, వీర
హోమంబుచే నీవు వేల్పుఁబెద్ద, వెఱఁగు
పడఁజేసి లోకైక విజయహేతు, వగు
లొందుటఁ బౌలస్త్య వరకుమార.
ఉ. రా. ౨. ౨౧౪.

వ. కౌతుకాంకురంబు కరఁగు వడ వెఱఁగుపడి...
మనుచ. ౬. ౩౯.

౨. నిశ్చేష్టత నొందు.

చూ: వెఱఁగుపాటు.

**వెఱఁగుపఱచు.** అ. క్రి. (√ వెఱఁగు పడు.)
ఆశ్చర్యము నొందఁజేయు.

వ. కంచు మించుగన్ బఱచుట గగన చరుల
వెఱఁగు పఱిచి ... మనుచ. ౪. ౧౧౫.

**వెఱఁగుపాటు.** వి. (√ వెఱఁగు పడు.) ౧. నిశ్చేష్టత.

గీ. దాని కమ్మును లెల్లఁ జిత్తమున భయము,
విస్మయంబును బెనఁగొన వెఱఁగు పాటు,
గదిరి చిత్రరూపంబులఁ గరణి నుండె ...
భార. అను. ౪. ౪౦౦.

ఆ. ... వెఱఁగు పాటు దనిరె నెఱనాడె
నొవ్వ నెవ్వగలు వగల నీసె దిగులు
వొదవె ... భార. విరా. ౨. ౧౦౬.

క. అచ్చోఁ దగులాభ మని మది, నుచ్చైదుబో
నంతరాయ మొనఁ గూడుటయున్, బ్రబ్బి
కొను వెఱఁగు పాటది, నిబ్బరపు విషాద
మనఁగ నొగడుం బాడన్.
కావ్యా. ౧. ౩౩.

౨. అబ్బురపాటు, ఆశ్చర్యము.

ఆ. వెఱఁగు పాటు తోడి వెఱపు నాకస్మిక,
సమ్మదంబు మానసంబు నొలయ ...
హరి. ఉ. 3. ౧౫౫.

చ. ...గురు శిష్యులు కౌరవసేనలోని భూపతి
సుతకోటికిన్ వెఱఁగుపా టొనరించిరి ...
భార. విరా. ౫. ౧౨౬.

**వెఱచేఱచు.** అ. క్రి. (వెఱ + చఱచు.) భయపడు.

క. వెఱచఱవ నింతకంటెం, దఱుచుగ బాణంబు లేసి తడయక పగఱం, జెఱుతుననియుసుము చల్లుచు, నుఱుక ధనంజయుఁడు రణజయోన్నతుఁ డరిగెన్. భార. సభా. ౨. ౩౦౭.

వ. ఇట్లు క్రేడించి గాంగేయుడించి గాండీవి దన యరదంబు రయంబున.

క. పఱపి రథికులను నూతుల, నఱకిన క్రోవడు పడి యుండె నానారథముల్, వెఱచఱచిరి కురువీరులు, పటిపటిరై మనబలంబు భయముం బొందెన్. భార. భీష్మ. ౨. ౩౫.

లయవిభాతి. తటిమి వెసరక్కసుల వెఱచఱువఁ బట్టుకొని, పటిపటిగ వేతలలు నుఱిపె ... భా. రా. యు. ౧౪౩౭.

**వెఱచు.** అ. క్రి. ౧. భయపడు.

క. రవిసుత పార్థుల ఘోరా, హవమునకును వెఱచుచున్న యది కుంతి ...
భార. ఆది. ౬. ౪౧.

చ. పరమున కేను దాసుఁడని పల్కెఁగఁ బ్రాపుఁడఁ గాను మత్సుతన్, హరునకు నిత్తునా వెఱవనయ్యె ... కు. సం. 3. ౯౩౦.

చ. వెఱచితి రాఁగదే యనిన వెండిక దాపగఁ దీర్తు నీవు నా, వెఱపెట్టులున్న నీ రథిక వీరులు వాపెదరు ...
భార. ఉద్యో. ౪. ౧౩౯.

ఆ. పాపఁడనక వెఱక పాపని మొద లింటి, పోక లెల్లఁ దలచి పొగడఁ దొడఁగె ...
భాగ. ౧౦. ౧౧౬.

వెఱక = వెఱవక.

క. ...విహంగంబులు రుతముల, నవని సుతను వెఱకు వెఱకు మన్నట్లుండెన్.
భా. రా. అర. ౨. ౧౫౦.

వెఱకు = వెఱవకు.

గీ. ...అని జయంబిచ్చి తన గదా హతికి వెఱని, మునికి ధనపతి దయచేసె ...
సమీర. ౨. ౧౫౩.

వెఱని = వెఱవని.

ఇది 'వెఱచు' ధా. యొక్క వ్యతిరేకార్థక విశేషణము.

౨. జంకు, సంకోచించు.

గీ. అదియుఁగాక మరుత్తుండు యజ్ఞ వేళ, నుచిత దక్షిణ లర్పించి యున్న ధనము, గొల్లవిడిచిన బ్రాహ్మణు లెల్లఁదనిసి, విడిచి రర్థంబు దీనికై వెఱవవలదు. జై. భా. ౧. ౪౩.

సీ. హీర కుట్టిమ భూము లిరుకనేల లటంచు గట్టిగా నడుగులు పెట్టవెఱచు ...
దశ. ౧. ౨౩౨.

క. ...పన్నిన భయమున బేడిస, లెన్నఁడు జలదుర్గభూము లేమఱ వెఱచున్.
కాశీఖ. ౨. ౯౦.

3. నమ్రతగా నుండు.

క. ...విను కావునఁ బతికిఁ బ్రజలు వెఱచుట యొప్పున్. భార. శాం. ౨. ౨౬౧.

**వెఱచుకొను.** అ. క్రి. (వెఱచు + కొను. స్వార్థమున) భయపడు.

అ. ...వెఱపించఁ, బోయి వెఱచుకొన్న చాయ యయ్యె. కృష్ణ. 3. ౪౩.

**వెఱపరి.** విశే. (వెఱపు + అరి.) భయము కలవాఁడు, భయము కలది.

సీ....భయశీలుఁడా వెఱపరి ...

ఆం. భా. ౩. ౯.

**వెఱపాటు.** వి. (వెఱపు + పాటు.) భయము.

ద్వి. నిరతమైన పతి మీఁది నెయ్యంబు దలఁచు, వెఱగంది చింతించు వెఱపాటునొందు ...

రం. రా. ఉ. ౧౨౨. పా. ౩. పం.

క. ఏ వరము నొల్లదేవా, దేవర కరుణాకటాక్ష దృష్టి యునిచి నా, కావరము చేత వచ్చిన, యీ వెఱపాటుడిపి ప్రోవవే యని పలుకన్.

శ్రీరం. మా. ౪. ౭౨.

**వెఱపించు.** స. క్రి. (√వెఱచు.) భయపెట్టు.

అ....జగడు పడఁగఁ జాతి వెఱపింత మొజ్జలు తత్ప్రయోగ విధులు దప్పిపఱవ.

భార. ఆది. ౨. ౧౩౦.

క. సమరంబు గలుగు ననుచును, మము వెఱపింపంగవలదు మాధవ ...

భార. ఉద్యో. ౩. ౪౩.

ఉ. బేలవుగాక నీవు వెఱపించెదు వీరిని వారిఁ బోలె న,న్ను ... రాఘవ. ౪. ౧౦.

**వెఱపిఁడి.** వి. (వెఱపు + ఇఁడి.) నిర్భయుఁడు, భయములేనివాఁడు, భయములేనిది.

వ....వెఱపిఁడి తఱపిగొన్న విధంబున శిబిరంబు చొచ్చి ... విక్ర. ౪. ౯౭.

**వెఱపు.** వి. (√వెఱచు.) భయము.

క. కలవు పయిఁ గలవు వొరయుచు, వెఱవు పరుసన్ వెఱపు దోఁప విడుపని యుడుముల్, బొఱఁగమిపైన్ ... భార. శాం. ౪. ౪౨.

మ....కరకంఠుం దరుణేందుశేఖరుని షట్కాలంబు బూజించు నెం,దఱు భక్తుల్ దను వేఁడినం బ్రమదమున్ దాత్పర్యమున్ భక్తియున్, వెఱపుం గల్గి తదీప్సితార్థములు గావించు న్నిరాలస్యతన్.

హర. ౧. ౧౧., దశా. ౨. ౬౩౭.

**వెఱపెక్కు.** అ. క్రి. (వెఱపు + ఎక్కు.) భయపడు.

చ....చొప్పడునే నినుబోఁటి కాప్తిఁ జెప్పిన క్రియఁ జెప్పినీవు వెఱపించిన నే వెఱపెక్కువాఁడనే. భార. కర్ణ. ౨. ౩౭.

**వెఱబొమ్మ.** వి. (వెఱపు + బొమ్మ.) పక్షాదులకు భీతి కలుగుటకు భీకరాకారముగఁ గట్టెడు బొమ్మ.

క. నెఱవగు సంపద గలిగిన, నెఱిదానం గుడువఁ గట్ట నేరని మనుజుం, డఱిముఱిఁ జేనికిఁ గట్టిన, వెఱబొమ్మయి కాఁడె యెన్నివిధములఁ జూడన్. విక్ర. ౨. ౧౭౯.

ద్వి. వీఁడొక్క వెఱబొమ్మ విప్రవృశ్చికము, పీడించి వీరి నొప్పించుచున్నాఁడు ...

ద్వి. హరిశ్చ. ఉ. ౯౩౨. పం.

**వెఱవెఱపాటు.** వి. (వెఱ + వెఱ + పాటు.) నిశ్చేష్టత.

ద్వి. వెఱవెఱ పాటును విహ్వలత్వంబు, వెఱపును మఱపును వీడి జోడాడ...

రం. రా. అరణ్య. ౯౬. పా. ౧౪. పం.

**వెఱవేఁకి.** వి. (వెఱ + వేఁకి) ౧. భయజ్వరము.

గీ. ఏను నామాట పద్యంబుగా నొనర్చి, వ్రాసి నిలిపితి నంత నెవ్వారలైన, మ్రొక్కఁ జనుదెంచి కాంచివిదిక్కు పడుచు, వెడలి మఱి జూడ రిట వెఱవేఁకి పట్టి.

ద్వా. ౪. ౩౦.

ద్వి. నన్నెఱింగెదు గాక నాపేరు తెలియ, విన్నమి తిక్కైన వెఱవేఁకి వచ్చు ...

ద్వి. హరిశ్చ. ఉ. ౧౧౯౪. పం.

సీ. మున్నఁ బారాశర్య ముని యొకనాఁ
గూఁత లెగయించి వెఱచేఁకి యొత్తఁజేసె...
కువల. ౨. ౮౦.

౨. సంతాపము, జ్వరము.

ఉ. ఏవి దినంబులో రజను లెయ్యవియో విను
నిద్ర యెట్టిదో, చేవుట యెప్పు యలంత
కమ్మి మనంబున శద్ది మందో యే,
త్రోవలఁ బోయెనో తలఁపు లోఁడన
చెయ్వు లెఱుంగ నేను నా, కీ వెఱవేఁకి
మాన్పఁ గమలేక్షణ యబ్బితి వీవు వెజ్జవై.
హరి. ఉ. ౭. ౧౭౦.

(ఇందలి 'వెఱ' శబ్దము సాధురేఫ ఘటితము విర
హార్థకము ప్రత్యేక ప్రయోగము లేనిది
అని శ. ర.)

వెఱసాచ్చు. అ. క్రి. (వెఱ + చొచ్చు.) భయ
పడు.

సీ. ...పశువుఁ జేయ, విప్రులు పట్టరా వెఱ
సొచ్చి యొదిఁగెడు గవయంబు చాడ్పునఁ
గర్ణభీతి, నుల్లల నుడుకుచు నుండుదు ...
భార. కర్ణ. ౩. ౩౩

క. ఇటులఁ దమిహెచ్చి మారుఁడు, సటలం
బెట్టంగ నొచ్చి పడి నటు నిటుఁ జెంచు
టకు వెఱసొచ్చి రతిసం, ఘటనార్థము
మిగుల వేగు కాలమునందున్.
హంస. ౩. ౧౫౬.

వెఱగాయలాటలు. వి. బ. బాలక్రీడావిశేషము.

గీ. దాయముల నాడు వామనగాయ లాడు,
బాటలను బాడు వెఱిగాయ లాటలాడు,
మున్ను మున్నుగ దాఁగురు మూఁతలాడు,
నా సుశీల జగన్మోహనాంగి యగుచు.
బ్రహ్మో. ౩. ౨౭.

వెఱ్ఱి. వి. (క. త. మ. వెఱి.) ౧. పిచ్చి, ఉన్మా
దము.

ఉ. వైదిక కర్మచారి జనవత్సల నీ మదిఁ బట్టు
కొన్న యున్మాదము హీన మానవు మనం
బునఁ బుట్టిన వెఱ్ఱి వోలె వస్త్యాదులఁ దీర్పు
టొప్పదు ... భార. శాం. ౧. ౧౦౧.

గీ. ...అమెయు వెఱ్ఱి పట్టె నేమొ, యనుచు
నాలాగ కావింప ... శుక. ౨. ౪౫౬.

౨. అవివేకము.

క. జడలు ధరియించి యడవుల, నిడుమలఁబడి
కాయ గసరుకే మెసఁగెడు పెన్, బడుగు
నినుఁ గవయఁదగునా, విడువిడు నీకేల పట్టె
వెఱ్ఱిఁ లతాంగీ. రామా. ౬. ౧౫౨.

చ. తనకిది దక్కునంచుఁ బ్రమదంబునఁ బంక్తి
ముఖుండు మీన కేతుని చిగురాకులాఁకు
మదిఁ దూరినఁ దాలిమి మాలి చేరఁగాఁ,
జని యిది యేమి వెఱ్ఱి యొల జవ్వనమున్
బొలిపోవ విష్ణుఁడం, చును కలకాలమున్
దపసి చొప్పున దాఁటెదు వృద్ధకాంతకై.
ఉ. రా. ౩. ౧౧౫.

—విణ. ౧. వివేకము లేనివాఁడు, వివేకము
లేనిది.

ఉ. ఇమ్మది వెఱ్ఱి వీనిఁ బరమేశ్వరుఁగాఁ గొని
యాడె ... భార. సభా. ౨. ౩౯.

క. నీ పదవి కరుగ నోడఁబడి, నీ శాసనవ వచ్చు
నప్పుడు నిందింతురు మమ్మో వెఱ్ఱు లితని
మాన్పంగా వలఁతులు గాకయవి జగజ్జను
లధిపా. భార. శాం. ౧. ౬౬.

ఆ. విను పతివ్రత లగు వెలఁదుల దిక్కు రా,
వెఱ్ఱిరేయమర్త్య విభుఁడు నీకు, వలవ
దతని మీఁది వైరస్య మనుమోల, వృత్తి
బోలునయ్యవి ప్రియంబు.
హరి. ఉ. ౯. ౭౩.

మ. వలదమ్మా యిటువంటి కానిపని యో
వామాక్షి యా వెఱ్ఱిబుద్ధులు నీకేల ఘటిల్లె

నమ్మ తెగువన్ దుర్భాషలిట్లాడి యీ కాల
నాకేటికిఁ గట్టెదమ్మ ...
సారంగ. ౨. ౧౦౨.

౨. పిచ్చివాఁడు, ఉన్మత్తుఁడు, పిచ్చిది.

సీ. వెఱ్ఱులు దొలుమేన వెడ్డున సాధు జనము
మోసపుచ్చి ధనంబు గొన్న జనులు ...
భార. అను. ౫. ౧౦౫.

ఉ. ...నీ, చందము నందముం గనిన జవ్వని
యెవ్వని వెఱ్ఱిఁ జేయదే ...
మనుచ. ౩. ౬౩.

౩. వికృతము.

గీ. ...త్రోటి నిర్వంకఁ బక్షతులను నివురుచు
వెఱ్ఱి చూపుల నురంబుఁ, గెలఁకుల గనులం
గొనుచుఁ గానఁ గేకులుండె.
ఆము. ౪. ౧౭౧.

వెఱ్ఱికుందెన. వి. (√వెఱ్ఱి.) వృక్షవిశేషము. *.

సీ. వెలగ విషమ దారి వెఱ్ఱి కుందెన మంచి
కుందెన కలబంద గుబ్బ గుత్తి ...
హంస. ౪. ౧౦.

వెఱ్ఱిగొను. అ. క్రి. (వెఱ్ఱి + కొను) అవివేకము
నొందు.

గీ. ఏల వ్రేపల్లె పెద్దవారిట్లు వెఱ్ఱి, గొనిరి
కృష్ణుఁ బోనిచ్చినఁ గ్రూరులైన, రక్క
సులు లోనుగాఁజేయు క్రందు లెల్ల, నుడుపఁ
దమకు దిక్కైన వాఁడొరుఁడు గలఁడె.
హరి. పూ. ౭. ౧౭౧.

వెఱ్ఱిగొలుపు. స. క్రి. (√వెఱ్ఱిగొను.) అవి
వేకము నొందించు. మోహపెట్టు.

క. ప్రకృతి గుణంబులఁ గొని బహు, వికృత
రూపముల నట్లు వెఱ్ఱి గొలిపెనే, సకలం
బుఁజెడ ... భార. శాం. ౬. ౫౧.

వెఱ్ఱిచిక్క. వి. (వెఱ్ఱి + చిక్క) వృక్షవిశే
షము. *. ఒకజాతి యడవి చెట్టు.

సీ. గోగు పొగడములు గోరంటలును బెద్ద వెలమ
సుంకేసరి వెఱ్ఱిచిక్క ... హంస. ౪. ౧౧.

వెఱ్ఱిచెఱుకు. వి. (వెఱ్ఱి + చెఱకు.) ఇక్షు విశే
షము, అడవిచెఱకు. *.

ఆ. వెఱ్ఱిచెఱకుఁ గోలవింటి బద్దకు మల్లె, తీవ
నారిఁజేసి భావభవుఁడు, పఱచుపువ్వు
బోండ్ల చెఱచ్చోటులన్ మొత్త, విరుల
తూఁపులేసి మరులు కొలిపె. శైవ. ౨. ౩౫.

ఆ. వెఱ్ఱిచెఱకు నందు విలసిల్లు ముత్యంబు,
పొరలు ప్రేంఖణంబు పువ్వుచాయ, నది
సమస్త భూతలాధీశ కామినీ, వశ్య కరము
ధరణి వలయమునను. రత్న. ౪౦.

సీ. రసదాళి చెఱకులోఁ బ్రబలివెఱ్ఱి చెఱకైనఁ
జానవాలెఱ ప్రతి చెక్కరగును ...
చంద్రా. ౪. ౧౦౫.

వెఱ్ఱిజిల్లేఁడు. వి. (వెఱ్ఱి + జిల్లేడు.) రాజార్కము,
ఒకజాతి జిల్లేడు. *. (శ. ర.)

వెఱ్ఱితనము. వి. (వెఱ్ఱి + తనము.) అవివేకము,
తెలివి తక్కువ తనము.

సీ. బాహు బలాఢ్యుల బలహీనుల క్రియ వెడ
లంగ నడిచిన వెఱ్ఱితనము ...
భార. ఉద్యో. ౧. ౩౮౬.

మ. మఱ్ఱితవోలె మా పడుచు మార్మసలన్
జలికింపఁ బూని నీ, వెఱ్ఱితనాలు మానవని
వేడ్క నిటాడఁగ నింటనుండి తాఁ, జెఱ్ఱునఁ
గోపగించుకొని చెప్పఁడు చేయఁడు లేచి
పోరొ మీ, వెఱ్ఱయగారు మఱచిగురువే
దొరికెన్ జదువెట్లు చెప్పునో.
శైవ. ౪, ౧౨.

గీ. ...దైవకృతంబులకును, విఱ్ఱవీఁగుట ట్రేఁగుట
వెఱ్ఱితనము. దశా. ౨. ౪౧౫.

వెఱ్ఱినారువ. వి. (వెఱ్ఱి + నారువ.) అరణ్యవృక్ష విశేషము, ఒకజాతి యడవిచెట్టు. *.

సీ. వేరు పనస గుత్తి వెఱ్ఱినారువ రేల పనస కరక
కొమ్మి పలుకరేణి ... హంస. ౪. ౧౧.

వెఱ్ఱినిమ్మ. వి. (వెఱ్ఱి + నిమ్మ.) అరణ్య జంబీరము, అడవినిమ్మ.

సీ. కోరింద నలతుమ్మ గొటికె కోదారయ
వెణుతురూడుంగ దంతి వెఱ్ఱినిమ్మ ...
హంస. ౪. ౯.

వెఱ్ఱినీరు. వి. (వెఱ్ఱి + నీరు.) వెఱ్ఱి యెత్తించు నీరు. మద్యము, కల్లు.

గీ. వెఱ్ఱినీరాను కతమున వెడలునట్టి, చొక్కుఁ
బోదట్టి యొకకన్ను వెక్కఁబెట్టి, దడి
గఱవఁబోవు వేఁపి చందమునఁ బట్టి, పరుస
మెచ్చఁగ నూరుజ ప్రముఖుఁ బలికె.
శుక. ౩. ౩౨.

గీ. మేరమీఱిన గొఱియల మేఁకగముల,గొఱి
యపోతుల నఱికి ప్రోగులుగ నిడ్డ, వెగ్గలపుఁ
బచ్చి నంజుళ్లు వెఱ్ఱినీళ్లు, దోరహత్తుగ నిడఁ
గడుపార మెసఁగి.
అచ్చ. రా. యు. ౨౩౧.

వెఱ్ఱిపాల. వి. (వెఱ్ఱి + పాల.) అరణ్య వృక్ష విశేషము. అడవి పాలచెట్టు.

వెఱ్ఱిపాలాకు అరిక బియ్యము పిట్టున ఎలుక
కాటు మానును. (చి. కి. చి. ని.)

వెఱ్ఱిపుచ్చ. వి. (వెఱ్ఱి + పుచ్చ.) చేఁదుపుచ్చ. *.

గీ. పాపరయు వెఱ్ఱి పుచ్చయు బత్రపుష్ప,
వల్లరీ ఫల మూలంబు లుల్లసిల్ల, గ్రహణమునఁ
దెచ్చి చూర్ణంబుగా నొనర్చి, నీళ్లతో నీయ
విషము లన్నియును దీఱు. (చి. కి. చి. ని.)

వెఱ్ఱిబాగులు. వి. (వెఱ్ఱి + బాగులు.) తెలివిలేని స్త్రీ (గ్రా.) తెలివిలేని వాఁడు, వివేకములేని వాఁడు. (శ. ర. పా.)

వెఱ్ఱిబిల్ల. వి. (వెఱ్ఱి + బిల్ల.) అరణ్య వృక్షవిశేషము, ఒకజాతి యడవిచెట్టు.

సీ. పులిచింత మోదుగు ములుమోదుగును వెల్ల
పుల్ల వెలగ వెఱ్ఱి బిల్ల శిల్ల... హంస. ౪. ౧౧.

వెఱ్ఱిబీఱ. వి. (వెఱ్ఱి + బీఱ.) చేఁదు బీర. *.

గీ. మునిని వెఱ్ఱిబీఱ ముష్టి యుమ్మెత్తల, విత్తన
ములఁ జెముడువేళ్ల భాను, మూలములును దైల
మున దించి చమరిన, సర్వవాతములును శాంతి
నొందు. (చి. కి. చి. ని.)

వెఱ్ఱిమొల్ల. వి. (వెఱ్ఱి + మొల్ల.) అడవిమల్లె.
(చి. ని.)

వెఱ్ఱివాఁడు. విశే. (వెఱ్ఱి + వాఁడు.) ౧. వివేకము లేనివాఁడు.

చ. విడుచక నీవు పట్టనము వీధుల వీధుల వెఱ్ఱి
వాఁడవై, చెడుగులఁ గూడి ధూర్తములు
సేయ మహీరమణుం డెఱింగెనే, విడుచును
సోమయాజి మను వృత్తులు చేకొను నెల్ల
వెంటలన్, జెడుదుము గాదె నీకతనఁ
జీరయుఁ గూడును లేక పుత్రకా.
కాశీ. ౪. ౯౩.

౨. ఉన్మత్తుఁడు, పిచ్చివాఁడు. (శ. ర. పా.)

వెఱ్ఱిసెనగ. వి. (వెఱ్ఱి + సెనగ.) ఒకజాతి చిన్న చెట్టు, చిన్న మొక్క.

సీసమాలిక. ...కాము జిలుగుమెట్ట దామర వెఱ్ఱి
సెనగ జంచిరము కాచి నల్లకాచి ...
హంస. ౪. ౧౦.

వెఱ్ఱిసొఱ్ఱ. వి. (వెఱ్ఱి + సొఱ్ఱ.) తుంబీ భేదము, చేఁదుసొర.

చ. విలువకు వచ్చివచ్చి ధరణిం జెలువొందిన
లుబ్ వసుంధరం, గలసిన గోడలుం జివికి
గంపలఁ గాచిన వెత్తిసొత్తులీ, వలు చిగిరెంత
గంటగమి వాతులుగప్పిన పూడు పొఁత
రల్ ... వేం. పంచ. ౧. ౪౬౪.

వెల. వి. (క. బెలె. త. విలై.) ౧. కొను వస్తువున
కిచ్చెడు విలువ మూల్యము, క్రయధనము.

క. ఇలకు వెలగా హిరణ్యం, బలఘు మతి
మాకు నొసఁగు మనుటయు ...
భార. అశ్వ. ౪. ౧౭౯.

గీ. జీవహింస యొన్నండును జేయ వనఘు,
యొరులు సంపి తెచ్చిన మాంసమొనర విలిచి,
తగిన వెలకమ్మి బ్రతుకుదు ...
భార. అర. ౫. ౩౩.

ద్వి. ఏమేమ దేశంబు లేలుట లేడ, భూమికి
వెలయిమ్ము భూమీశ మాకు ...
రం. రా. బాల. ౧౬. పొ. ౧౪. పం.

వ... తపస్వులకు నూఱువురకుం బ్రోలునాంటి
బబ్బర వాడు పన్నస్రలు దగువెలకు విలిచి
కొని ... ద. శా. ౧౨౭౧. ౯.

సీ. విలువనా జెట్టినా వెలయన రోయన వెల
యుచు నుండును విక్రయంబు ...
ఆం. భా. ౨. ౨౬౪.

౨. పందెము.

ఆ. వాదులానితోడ వాట్లనితోడను, బూతు
తోడఁ దిండిపోతుతోడ, నటమటీనితోడ
నడియరితోడను, వెలకు నెత్తమాడ వెరవు
గాదు. ఉ. హరి. ౩. ౧౧౨.

వెలఁగ. వి. (క. బెళల, త. విళవు.) కపిత్థము,
వృక్షవిశేషము.

చ... త,త్పదములఁ దోకయుఖ్ బిగయఁబట్టి
చెలంగి వెలంగ బ్రమానితోఁ జదియఁగ
నొక్క పెట్టుగొని చంపెఁ గుమారుఁడు
లేఁగ రక్కసుఖ్. భాగ. ౧౦. పూ. ౪౩౫.

సీ. వెలఁగపండులు పుల్లవెలఁగ పండులు మావి
పండ్లు నంకెనపండ్లు బలుసుపండ్లు ...
కాశీ. ౩. ౯౯.

ఆ. పిలికి పూలు బూతపిల్లు లేనికకొమ్ము, అలరుఁ
దేనె పెద్ద వెలఁగపండ్లు, వెమురుఁబ్రాలు
ఈతి పదనికల్ గసగసాల్, జల్లి మొకపుఁ
జాలుఁ జాఅపప్పు. యయా. ౧. ౩౧.

వెలఁగొను. స. క్రి. (వెలన్ + కొను.) వెల
యిచ్చికొను, విలిచికొను.

ఉ. ఆసలఁ బెట్టి యేచు వసువంచు వచింపఁగ
నేల సంతతో, ద్భాసి నిజాభిజాత్యమునఁ
దద్వసువున్ వెలగొన్న మోహసంవాస
పదంబు దారమణి వారకశు క్తి మతిం
జనించె ... వసు. ౪. ౧౧౧.

(ఇట వశము చేసికొన్న అని భావము.)

మధురగతి రగడ. వేలుపుఁ జేడెల వెలఁగొను
వేశ్యలు, శ్రీలఁ గుబేరుని జెవకాడు
వైశ్యులు ... కుచేల. ౧. ౨౩.

(ఇట పోలు అని భావము.)

వెలఁది. విశే. (త. వెళిదు.) ౧. నిర్మలము.

గీ... కుప్పతిలు చుట్టుఁగొండపైఁ గొనలుసాఁగి,
వెలఁది వెన్నెల లెల్లెడ వెల్లివిరిసె.
శ్రీరం. ౨. ౨౫౬.

ద్వి. సలలిత శశికాంత చంద్రశాలలును, వెలఁది
ముత్యంబులు వెలయు వాకిళులు ...
ద్విః హరిశ్చ. పూ. ౧౪౭.

సీ. ఓలి నన్నింటి నదోఘ్యభృతంబులు నించి
వెలఁది పట్టున వస్తులలంకరించి ...

గీ... యందముగ నివాళించి రయ్యవనిపతికిఁ,
జారు కంకణ ఝుణఝుణత్కార మెసఁగ...
భోజరా. ౨. ౯౬.

౨. తెల్లనిది, ధవళము.

గీ. చలువ లందిచ్చె నొక చెల్వ వెలఁది నవ్వు,
లుత్తరీయము లంచుచే నొడియ మాల్య,
భూషణంబులఁ గైసేసె పొలఁతి యొకతె...
దశా. ౬. ౨౪.

ఆ. చెలువ యొకతె చలువ వలువచేఁ దడి
యొత్తు, మగువ యొకతె సొగసు సిగ
యొనర్పు, వెలఁది చందనంబు వెలఁది
యొక్కర్తుమై, నలఁద నొకతె ధూప
మలరఁజేయ. ఇందు ౫. ౨౬.

ద్వి. దళుకొత్తు వెడఁద డెందము మీఁద జినుగు,
వెలఁది జన్నిదములు విలసిల్లుచుండ ...
ద్వి. పరమ. ౩. ౨౪౪. పా. ౧౨. పం.

౩. మేలైనది.

సీ. నవసమాగమమునఁ జవులు వక్కాణించి
మించఁ జాలు వెలంది మిన్నగములు ...
వసు. ౬. ౪౨.

(నారీరత్నముల సముదాయములు అని యర్థాంతరము.)

క. పికఁ జూపై విరులొక్క, సికతామయనితంబ
వెలఁది కస్తురి నొక్క వెలఁది యలఁదె ...
సారంగ. ౨. ౧౯౨.

౪. ప్రసన్నము, సంతోషభరితము.

చ.... పైపయి నద్భుత ప్రగుంభనము మనం
బునం బెనుపఁ బల్క నమంగు వెలంది
పల్కులన్. హ. న. ౨. ౧౦౨.

(నలపక్షమున ప్రియసఖీ వచనములతో అని యర్థము.)

౫. విశదము, స్పష్టము.

ద్వి. వలకొప్పుఁగాఁ బోయి వచ్చిన తెఱఁగు,
వెలఁదిగా నంతయు వినిపింపఁగోరి ...
నవ. ౨. ౬౫. పా. ౬. పు.

-వి. ౧. చక్కని యాఁడుది, ఆఁడుది; భార్య.

గీ. వెలఁది సంకల్ప సోపాన వితతియందు,
నతఁడు నూడంగ సంచరింతహరహంబు...
నైష. ౨. ౯౪.

క.... శైవ శరాసన మెక్కిడి, యా వెలఁదిం
బెండ్లియాడు మా రఘురామా.
రామా. ౪. ౬౧.

సీ. ...ఎలనాగ కోమలి యింతి చెలువ చెలి వెలఁ
దుక మెలఁతుక వెలఁది మెలఁత.
ఆం. భా. ౨. ౧౦౪.

గీ. వెలఁది జూదంబు పానంబు వేఁటపలుకు,
ప్రల్లదంబును దండంబుఁ బరుసఁదనము,
సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ముసేఁత,
యనెడు సప్తవ్యసనములఁ జనదుతగుల.
భార. ఉద్యో. ౨. ౪౪.

సీ. వెలఁదులు పదియాఱువేవురలో నెన్న సరి
లేదు సౌభాగ్యగరిమ నీకు ...
పారి. ౧. ౫౯.

గీ. చిత్రకారుఁడా తెఱఁగెల్లఁజెప్ప విభుఁడు,
వెలఁది తోడమచ్చ యేకాంతవేళఁ
జూచి ... విక్ర. ౩. ౫౪.

ఆ. ... వేయు వత్సరములు వెలఁదితో రమి
యించి ... దశా. ౩. ౬౨.

౨. ధాళధళ్యము, తళతళ కాంతి.

గీ. ఈ వెలంది యొడల్ పైఁడిలో వెలంది,
యీ నెలంత లలాటంబు లే నెలంత,
యీసు పాణి రదశ్రేణి యేసు పాణి, యీ
బిడారు మృగమద శ్రీబిడారు.
విజ. వి. ౧. ౧౩౦.

వెలఁదిమిన్న. వి. స్త్రీరత్నము, శ్రేష్ఠురాలైన యాఁడుది.

వ. ...వేఁడివేల్పు వెలంది మిన్న వేనలి నలవ
రించుకొన్న సన్నజాజి విరుల సరుల సిరులం
గడలుకొని ... ఉ. రా. ౪. ౧౬౩.

వెలఁదుక. వి. (వెలఁది + ఉక. స్వార్థమున.) స్త్రీ, అఁడుది.

క. ...సౌరభమాలా, కలిత మధుమత్త మధుకర, విలసనమున నొప్పు వనము వెలఁదుక సాచ్చెన్. మార్క-౦. ౧. ౨౪.

సీ. ...అనయమ్ముఁ జెలియిమ్ములను బ్రివమ్మరుచునుండు చలి వెలుంగు ననుంగుఁ జెలియ లెనయి ...

గీ. ఇవ్వెలందుక కనితన యీడు చేడె లందరును డెందముల నుబ్బి యాడుకొనఁగ ...
నీలా. ౧. ౫౨.

వెలఁబెట్టు. స. క్రి. వెలయిచ్చికొను.

క. కలిగిరిపో యిది మనకును, వెలఁబెట్టని భృత్యులనుచు వెలఁదియుఁ దానుం, గల కల నవ్వుచు నాట్యము, సలిపిరి కరడమరు తాళసహితము గాఁగన్.
ప్రబోధ. 3. ౫౭.

(వెలఁబెట్టని భృత్యులు = వెట్టి నౌకరులు.)

వెలకుఁజూపు. స. క్రి. (వెలకున్ + చూపు.) అమ్మఁ జూపు, విక్రయింపనెంచు.

సీ. వెలకుఁ జూపవు పొన్న విరియంతగొప్పమా యది యురంటులలోయ నయ్యెఁ జుమ్మ...
కవిరా. ౧. ౭౧.

వెలకెక్కించు. స. క్రి. (వెలకెక్కు.) ప్రసిద్ధి నొందించు.

క. ఆ రాక్షసుఁ దునుమాడక, పోరాదు పురంబునకును బోరాటమహా, ధారాట రథ మద ద్విప, వీరాటన పాటవంబు వెలకెక్కించున్. సుద. ౫. ౩౬.

వెలకెక్కు. అ. క్రి. (వెలకు + ఎక్కు.) ప్రసిద్ధి చెందు.

చూ: వెలకెక్కించు.

వెలగఅవుసేయు. అమూల్యమగు.

గీ. ...వెలఁ గఅవుసేయు కౌశేయములు గలుగఁగ, నూనమైనట్టి మైనమై నూననేల.
సారంగ. ౨. ౧౭౭.

వెలచాన. వి. (వెల + చాన.) రో వెలఁది, వేశ్య.

గీ. అప్పురంబునఁ గామ సేనాభిధాన, యైన వెలచాన మీఱు జగ్గైక తాన ...
శుక. 3౧౧.

వెలచు. స. క్రి. శుభ్రపఱుచు, తోము.

సీ. వెండి యెడ్డెనలపై వెలచి తెచ్చిన పైడి పళ్లెంబు లాను త్త పఱుచువారు ...
నైష. ౬. ౧౧౭

(ఇది సానుస్వారమని చి. ని., బ్రౌ.; నిరను స్వారమని శ. ర. నిర్ధారక ప్రయోగము లభింపలేదు కనుక నిరనుస్వారముగా గ్రహింపఁ బడినది.)

సీ. పుప్పొడికంటెఁ బుప్పొడిలోనఁ బొరలించి వెలచిన చెంగల్వ విరులకంటె ...
పి. శకుం. ౪. ౧౪౬.

సీ. విరహుల మర్మముల్ విదళింపఁ గరసాన వెలచిన మరునస్త్ర గుళికయనఁగ ...
శివలీలా విలాసము. ౧.

వెలచెలువ. వి. (వెల+చెలువ.) వెలచాన, రో వెలంది, వేశ్య.

వ నిలింప పతి కొలువు వెలచెలువల చెలువంబులు మెచ్చువి మెచ్చు లాఁదులు.
ఉ. రా. ౫. ౨౪౭.

వెలడు = వెడలు. అ. క్రి. నిర్గమించు, పైకివచ్చు, బయలుదేఱు.

క. వెలడు సెడఁ దెలివిళ్లోన, గ్నల్లులవలపల సుడియు శిఖలఁ గొమరగు ...
భాస. శాం. 3. ౧౪.

తరువోజ. వెలదు నిట్టూర్పుల వెస నుచ్చలించు
వెలుఫునఁ గలుగు నెవ్వఁగు చందోయి ...
కు. సం. ౫. ౫౮౮.

వెలతలిరుఁబోఁడి. ౧. (వెల+తలిరుఁ బోఁడి.) వేశ్య, రో వెలఁది.

గీ. సంభవించెఁ గచాకచి సంగరంబు, చక్కఁ
గా వేగ దిక్కుల జాట నేఁడు, దండవాతు
లాదవెను వెలత లిరుఁబోండ్ల, తల్లులకుఁ
దూర్పు తెలతెలల్ దాయునపుడు.
రా. వి. ౧. ౪౪.

వెలన= వెల్లన. వి. తెల్లఁదనము.
చూ : వెలనగు.

వెలనగు. అ. క్రి. (వెలన+అగు.) వివర్ణమగు, కాంతిరహితమగు.

సీ. పాత్రావలోకనోపాయంబునకు నైన వెల
నైన దీపంబు వెలుఁగఁ జేసె ...
కాశీ. ౪. ౧౩౩.

వెలనాఁ(ల్నా)డు. వి. దేశవిశేషము.

క. వెలనాఁడు వేఁగినాఁడును, బులుగులనాడ్పా
కనాఁడు పొత్తపి నాఁడున్, గల మురికి
నాఁడు రేనాఁ, డలయుక గనుఁగొంటి నచటి
యబలలఁ గంటిన్. హంస. ౧. ౫౩.

వెలనేస్తకాఁడు. వి. (వెల + నేస్తకాఁడు.) విటుఁడు, బొజుఁగు.

గీ. చాపపైనుండి యుచిత సల్లాపగరిమ, నుబుసుఁ
బోకల నొకకొంత యూరడించి, వెలలఁ
బన్నెడు తనకూళ తలఁపు నేఁడు, గానఁ జే
డ్పని వెలనేస్తకానిఁ జూచి.
ప్రబంధ. ౪-౨౬.

వెలపడంతి. వి. భోగముదాన.

గీ. ముకుర వీక్షావిధానంబు మొదలులేక, వెల
పడంతికిఁ గారాదు విటునిఁ గవయ ...
క్రీడా. ౧. ౧౮౬.

వెలపెట్టు. అ. క్రి. (వెల + పెట్టు.)

వ. ...భీమనథనం దన వనమునకుం జంగకాయ
లకు వెలపెట్టిన గన్ధ (హ) స్తిమాడలు ఇరు
వది -౨౦ ... దశా. ౧-౨౧౧. ౧౫.

వెలపొలఁతి. వి. (వెల + పొలఁతి.) రో వెలఁది, వేశ్య.

ఆ. మమత మూఢవిటులు భ్రమతు రింతియ కాక
వెలపొలంతి కెందు వలపు గలదె.
వైజ. ౨. ౪౮.

వెలపోయు. స. క్రి. వెలగానిచ్చు.

గీ. పడుచు పని చేసితివి రేఁగుఁబండ్ల కొఱకు,
ముత్తియంబులు వెలపోయు మలుచ
గలఁడె ... వై. భా. ౫. ౫౮.

చ. మసగొని రేఁగుఁబండ్లకును మౌక్తికముల్
వెలవోసినట్లు దు,ర్వ్యసనముఁ జెంది
కావ్యము దురాత్ముల కిచ్చుతి మోసపోతి...
దా. శ. ౪.

వెలమ1. వి. బ. శూద్రజాతిలో నొక యవాంతర శాఖ; ఆ శాఖకుఁ జెందినవారు.

వ. ... అందు (శూద్రవంశమునందు)ఁ బద్మ
నాయకులన వెలమలనఁ గమ్మలన సరిసర్లన
నొంటర్లన బహుప్రకార శాఖోపశాఖా
భిన్నంబులైన మార్గంబులన్ ...
భీమ. ౧. ౩౧.

(వీరు మహాశూరులు; మిగుల క్షాత్రవంతులు.)

గీ. వరలుకరు లొక రెండు వేల రసిచూడ,రాజు
లును వెలమలుం గమ్మ ప్రజలు ఘనులు,

గలుగు రాయలతోఁ బోరి గెలువ మనకు,
వశమె దైన ఖుదా యున్న వాఁడటంచు.
కృష్ణ. ౩. ౨౬.

క. హారవరాళి హీర మచ్యుత, చరణాబ్జ మరంద
ధార జాహ్నవి లోకేశ్వరి తమసోదరి
యానట, భూరి వెలమల భాగ్యమహిమ పొగ
డఁగ వశమే. పాండు. ౧. ౧౧౨.

(ఇట శూద్ర సామాన్యపరము.)

**వెలమ².** వి. ధనము, వృత్తవిశేషము.

వ. ఇప్పు కప్పుర మద్ది గద్దగోరు గోరంట వెలమ
యులిమిరి మూఁగ వేఁగిస మొదలుగఁ
బెక్కు తెలంగుల ద్రాఁకులు ...
పి. శకుం. ౨. ౧౪.

**వెలమవాఁడు.** వి. (వెలమ¹ + వాఁడు.) వెలమ
తెగకు సంబంధించినవాఁడు.

ద్వి. పరమేశ్వరుఁడు తనదాసులోఁతరయు, నరు
దెంచి వెలమఁడై యరి యప్పనంబు ...
బస. పు. ౪. ౫౩౩. పం.

క. ధనవంతుఁడైన శతహాలి, యను వెలమని
మీఁదలేని యన్యాయపథం, బొనరించి ...
దశకు. ౩. ౧౪౫.

**వెలమనూర్లు.** వి. బ. తెలిక జాతిలో నొక భేదము.
ఈ జాతిలోని భేదాంతరములు.

పత్తిపాలు, నరియూర్లు, కుముదార్లు, మట్టూర్లు,
పోవంద్లు, శ్రావకులు, ఉంద్రూర్లు, అనుమ
గొండ్లు, అడ్డనూర్లు.
శాశా. శ. A. D. ౧౧౫౬. Ep. ind. ౬.

**వెలమసంది.** వి. కాకజంఘ, సేలవేములోని
భేదము. శ్రీ.

సీ. వెలమసంది చివికి వెలమనఁగాఁ గాక
జంగాభిధానంబు చనును ...
అం. శా. ౨. ౬౬.

**వెలమిటారి.** వి. (వెల + మిటారి.) వేశ్య, పణ్య
స్త్రీ.

గీ. విటుల తబ్బిబ్బులకుఁ గేరు వెలమిటారి,
నగవు నేలినడాలు...కలిగి చూదంతి పాడ
మె నా జలనిధి యందు.
దశా. ౨. ౨౨౫.

**వెలయబ్బురము.** విశ. (వెల + అబ్బురము.)
మిక్కిలి వెల గలది, అమూల్యము.

సీ. వెలయబ్బురపుఁ గ్రొత్త విడి కెంపు రవ
గుల్కు గలశాలి జిగివాటి గలసి వెలయు...
ఇందు. ౫. ౩౪.

**వెలయాట.** వి. (వెల + ఆట.) ౧. సురతక్రీడ, రతి.

గీ. అంగరాగంబు దమ వెలయాటనంత, రంగ
రాగంబు నొసఁగెడు నప్పురంబు, గట్టి
వాలు పడంతులు కంతుచేతి, గట్టివాలున
కొప్పింతు రెట్టివాని. కవిక. ౧. ౨౨.

౨. ద్యూతక్రీడ, జూదము.

గీ....పెద్ద వెలయాటఁ దెగ గెలిపించువారు.
దశకు. ౫. ౩౬.

**వెలయాలు.** వి. స్త్రీ. (వెల + ఆట; బ. వెల
యాండ్రు, వెలయాండ్రురు.) రో వెలఁది, వేశ్య.

క. వెలఁదియు ధరణీ విభుఁడును, వెలయాలును
దాసిఁగూడి విమలాకృతులై, వెలువడిరి
యగ్గిగుండము, జలరుహషండమున నుండి
చనుదెంచు గతిన్. విక్ర. ౬. ౧౩౩.

చ. ... బలారి కొల్వులోఁ, గల వెలయాండ్ర
కెల్లను శిఖామణి వీవె కదా ...
ఉ. రా. ౪. ౨౧౩.

క. ఇల...వెలయాండ్రుర కలుపు మగల విడు
పును సతులన్. కు. సం. ౫. ౧౬౫.

ఉ. ఆ మహితాత్ముఁ డొక్క వెలయాలికి
మిక్కిలి తాను గూర్పువాఁడై, మమత
స్సాలంగుచు ... విప్ర. ౪. ౪౨.

**వెలయించు.** స. క్రి. (√ వెలయు.) ౧. బయలుపఱచు, ప్రకటించు.

క. నా పురుషత్వము గైకొని, వే పోయి దశార్ణపతికి వెలయించిన మీ, యాపదలు దొలఁగిచనఁబోడ, నూపుము పతినాళ్ల యంత నూనృత మొప్పన్.

భార. ఉద్యో. ౪. ౩౮౭.

ఉ. అక్కట యుగ్రసేనుని మహాత్ముని బల్కుట సంగరంబునం, దెక్కుడు పౌరుషంబు వెలయించుటయే పలుకం దలంచినన్, గ్రుక్కక నన్నుఁ బల్కుము విరోధి నొకండన కాన నీకు నీ, యుక్కున యెన్ని చందముల నోర్వక పోవునె వేయు నేటికిన్.

హరి. ఉ. ౩౦.

క. జనని సతీత్వము వంశంబున విమలత్వమును దనదు భుజవీర్యము నా, తనయుం డిటు వెలయించునె యని ప్రార్థనంబు గాఁగఁ బ్రాణచ్యుతుఁడై. మార్కం. ౩. ౨౭.

౨. ప్రసిద్ధి కెక్కఁ జేయు.

గీ. తన మహత్త్వంబు భూషింపఁ దాను వారి, పేరు వెలయింపఁ జాలు గంభీరమహిమ...

హరి. పూ. ౧. ౨౨.

౩. ప్రకాశింపఁజేయు.

మ. మహి మున్వాగను శాసనుండు సృజియింపం గుండలీంద్రుండు దన్మహనీయ స్థితి మూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవన్ మహామహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపు వాటించు నీ, బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమునఁ దత్ప్రాగల్భ్య మూహించెదన్. వసు. ౧. ౧౦.

క. వెలయించు నట్టి రుచిరమణి, వెలుఁగారం గొనుము ... ఆము. ౪. ౨౮౩.

౪. శాసించు.

ఉ. ఈ యిల ధర్మరక్ష వెలయింప జనించిన యట్టి యాది నారాయణ మూర్తి వీవు ...

విక్ర. ౨. ౬౪.

౫. వ్యాపింపఁ జేయు.

క. ఆజ్ఞ వెలయింతె దిక్కుల ...

విక్ర. ౪. ౧౦.

౬. కప్పు, ఆచ్ఛాదించు.

సీ. బ్రాహ్మి సంపాదించె భసితాంగరాగంబు మాహేశి రుద్రాక్షమాలఁ గూర్చె, గౌమారి వెలయించె గజచర్మ చేలంబు వైష్ణవి తోలు దువ్వలువ మడిచె ... హర. ౪. ౮౭.

౭. పావనము చేయు, పవిత్రీకరించు.

క. కావున విను పాత్రము మే, లై విహితాచరణ సౌమ్యమగు దానము ధాత్రీ వర దాత్రా దాతలఁ, దా వెలయించు భువనద్వితయ రంజకతన్.

భార. శాం. ౧. ౩౩౪.

౮. ఉల్లాసము నొందించు, సంతోషపఱచు.

శా. దంతా ఘట్టిత రాజతా చలచల ద్ద్వారీ స్వయంగ్రాహమున్, కంతుద్వేషికిఁ గూర్చి శైలజకుఁ దద్గంగా ఝురాచాంతి నత్యంతామోదము మున్నగా నిడి కుమారాగ్రేసరుండై పిత్రు, స్వాంతంబుల్ వెలయింపఁ జాలు నిభరాడ్వక్త్రుం బ్రశంసించెదన్.

వసు. ౧. ౭.

సీ...గీ. తన సహజ లక్షణములలో నెనవి యుండ, నా సరోలక్ష్మి గర్భ చిహ్నములు దాల్చెఁ, బరిణయము లేక కన్య గర్భమున కిట్లు, గాక వెలయింపవచ్చునె లోకములను.

సర. ౧. ౬౩.

**వెలయింతి.** వి. (వెల + ఇంతి.) వారకాంత, పణ్యస్త్రీ.

చ. సతతము బ్రహ్మ శర్వ సుర సంయమి ముఖ్యుల నాత్మ సామి వెలయింతిని మోహితఁ జేయలేక ప్రాకృత జనునట్లు తాను దనగిన్నె నొసంగెను బంటుకోసమై ...
వైజ. ౪. ౫.

మ....మాకల్ప లాభ స్పృహాన్, సువిలాసం బగు మేనొసంగు వెలయింతుల్ భోగ్యశే జ్ఞాన కల్ప వనీవల్లి కుఠారముల్ సురభి మల్లు ... మల్లభూ. ౨. ౫౭.

(ఇట్లే: వెలయువిద, వెల యొప్పులాఁడి మొ.)

వెలయు. అ. క్రి. (సం. విలస్.) ౧. ప్రసిద్ధి కెక్కు.

క. కడిఁది పగఱ నేఁ దెప్పఁగఁ, గడవంగా నీఁదఁ దలఁచు కౌరవనాథుం, బెడుఁ గాక యంచు నిత్తఱి, విడువ దగునె యతని వలన వెలసినవాఁడన్.

భార. ఉద్యో. ౪. ౬౫.

తే. ఒనరఁ దండ్రిచే లక్ష్మిఁ గైకొను నతఁడు, తండ్రిచేఁ గ్లేశములఁ బాసి తనరు నతఁడు, తండ్రిచేతన వెలయు నతఁడు మదీయ, కులమునందును లేకుండ వలయుఁ దండ్రి...

మార్కం. ౮. ౨౨౦.

౨. ప్రకాశించు.

(లక్ష్మివాక్యము) క. ... మత్పుష్టి కర చరితు లగుటఁ ద్రివిష్టప సదులకడ నిలిచి వెలసెద ననియెన్ ... భార. శాం. ౫. ౧౩.

సీ....గీ. వెలయు నెవ్వాని యభిరామ విమల కీర్తి ... నైష. ౧. ౩౨.

౩. కలుగు,-పుట్టు.

క. నలు గుణములు దమయంతికి, నలునకు దమయంతి గుణగణంబులు జను లిమ్ములఁ బొగడుట నిరువురకును, వెలసె మనోభవ వికార విభ్రమ మెదలన్. భార. అర. ౨. ౧౦.

సీ. క్రొంక్కారు మెఱుఁగులఁ జుక్కల యొఱపును గలసి యిమ్ముగమయి వెలసె నొక్క ... భా. రా. అర. ౨. ౨౫.

ఆ. ఇట్టి తలపు లుడుగి యింటికిఁ జని సుఖం, బుండుమని పురోహితుండు వలుక, విని మనంబులోన వెలసిన వైరాగ్య, మగ్గలింపఁ బల్కె తతని తోడ. జాహ్నవి. ౪. ౫౩.

౪. వ్యాపించు.

తే. అతివ నిను రంభకును గల యట్టి భయము, నాకుఁ గల్గుటఁ దత్కథ నీకుఁ జెప్పఁ, గూడ దట్లయ్యు మిక్కిలి కువలయమున, వెలయఁగల దది వెలయు త్రోవలును గలుగు.
కళా. ౧. ౯౯.

౫. బయలుపడు.

తే. వెలసి భాషింప నిప్పుడు వెరవుగాదు, తపనుఁ డుదయించి క్రుంకునందాఁక వైచి, రాత్రి వచ్చిన కార్యంబు రాము సతికి, విన్నవించెదఁ గాక నే వెరవు తోడ.
భా. రా. సుం. ౧౬౪.

౬. ఆవిర్భవించు, అవతరించు.

క. ...నెట్టుకొనవలసి నిలిచిన, ఘట్టాంబికఁ గొల్వఁ గలుగుఁ గామితఫలముల్.
భీమ. ౧. ౧౦౧.

౭. ఒప్పు.

తే....పుడమి లోపల మిథిల నాఁబ్రోలు వెలయు. లీలా. ౧. ౨౬.

మ. తతయుక్తిన్ ఘన శబ్దముల్ వెలయు ...
దశా. ౧. ౪.

౮. ఉండు.

చ. కలదు గదా సుధారసము కంజదళాక్షుల ముద్దు పల్కులన్, వెలయుఁగదా హాలాహలము వీరల చిత్తమునందు ...

భర్తృ. ౨. ౬౦.

సీ.... గీ. ...నలువ రాణి మదాత్మలో వెలయు గాక. మను. ౧. ౫.

క. వినునది నీ కోరు లెటిఁగిం,చిన మద్వృత్తాంతమేన చెప్పుటకు మనం, బనుమాన మెనయు నైనను, విను చెప్పెద నేన తక్క వెలయ రిటు నొరుల్. పి. శకుం. ౧. ౧౫౬.

౯. సఫలమగు.

గీ. అత్తలోదరి రఘునూను నంతికమున, కనుపమ విలాస గరిమతో నరుగు నపుడు, నల సునంద మహానంద మలర బల్కె, నిలువు మెలనాగ నీకోర్కె వెలసె ననుచు.

ఇందు. ౫. ౧౬౪.

౧౦. పవిత్రమగు, పావనమగు.

గీ. ధర్మ మార్గ ముల్లంఘింపఁ దగదు గాన, వలసె నిష్కృతి కుల మెల్ల వెలసె నీక,తమున సురముని పితృతర్పణములు సేయు, మరిగి బాహుదా పుణ్యతోయముల ననఘ.

భార. శాం. ౧. ౧౬౬.

క. ఎల్ల జగంబులు నేలిన, హల్లకహితజూటుఁ డల్లుఁ డయ్యెడు నట నా,యిల్లు వెలసె లోకంబులఁ, దల్లీ రుద్రాణి యొట్టి ధన్యుఁడ నోక్క. వరాహ. ౬. ౩౨.

౧౧. అతిశయించు.

క. తొలు ప్రాయపు మగ కొదమల, తలఁపుల తమకములు మిగులఁ దను నెదురుకొనన్, జలజాక్షి జవ్వనము గడు, వెలసెఁ బ్రతిక్షణము వింత వింతగ నంతన్.

కళా. ౧. ౨౫. (౧౩౫.)

విణ. ౧. అతిశయించు.

సీ.... గీ.... వెలయు వేడుక వాహ్యాళి వెడలి వచ్చు, నమర నాయకుఁ గాంచి సంయమివరుండు. దశా. ౨. ౧౯.

౨. ప్రసన్నమగు, నిర్మలమగు.

క. కురిసె సుర పుష్పవర్షము, హరిపై నప్సరస లాడి రాతోద్యంబుల్, మొరసె సుఖ స్పర్శంబై, బెరసెన్ బవనంబు దెసలు వెలసెన్ గలయన్ హరి. పూ. ౬. ౯౩.

వెలయెక్కు. అ. క్రి. (వెల + ఎక్కు.) విలువ కెక్కు, అధిక మూల్యమగు.

క. నేరుపరిపోహణించిన, హారము వెలయెక్కు లీల నతిశయముగ ...

ప్రభోద. చం. ౧. ౨౩.

వెల యెసఁగు. అ. క్రి. (వెల + ఎసఁగు.) విలువ కెక్కు, అధికమూల్య మగు.

గీ. చూపఱకు వేడ్కలొనరించు సొబగు వెలయు, వెలయెసఁగు జాళువా ప్రాఁత కలిమి నెన్న, గన్న నైకపు దుప్పటి కలఁటువాఱ, నలరు వలరేని చెలువొసె హావుసుఁ బూని.

ఇందు. ౫. ౨౩.

వెలరారు. అ. క్రి. (వెలరు + అరు.) తెల్లనగు.

సీ. జలధర ప్రకరంబు వలవలనై తోఁచె వెలరారి దిక్కులు విశదమయ్యె ...

పద్మ. ౯. ౨౨౬.

వెలరు[1]. వి. తెల్లన, పాండిమము.

తే. నెఱయు కీర్తి ప్రతాపాఢ్యు నిన్నుఁ దలఁప, యశము కార్శ్యంబు గలిగిన ట్లలరు వెలరు, గాకయును నను నుల్లేఖఁ గాంత నేలు, విరహమున కోర్వ దను వ్యంగ్య విభవ మలరు. నరస. ౨. ౧౪౨.

**వెలరు²** = వెలలు. అ. క్రి. వెడలు, బయలుదేఱు. (ఈ రూపము కుమారసంభవమున నే కాన వచ్చుచున్నది.)

గీ. తమ ముఖంబులు...వెల్లనై పద్మ షండంబు వెలరి చనియె. కు. సం. ౯. ౨౭౬.

మ. తలఁకొత్తెన్ దరహాస మానసము నం దట్టూర్చి పో మేను ము,త్పులకల్ గ్రక్కునఁ బర్వె లోలనయనాంభోజాత పత్త్రంబులన్, వెలరెన్ భోరనసమ్మదాశ్రు జలముద్వేగంబు రాగంబుగా, నెలమిం జిత్తము తత్క్షణంబ రతికాత్మేశావతారంబునన్. కు. సం. ౯. ౨౪౪.

సీ. అలికలభములు ... మలయానిలాహతి వెల రిన పుష్పొడిఁ బొదివి మేనుల వింత పూఁత గాఁగ. కు. సం. 3-౨౫.

**వెలరువాఱు.** అ. క్రి. (వెలరు + పాఱు.) ౧. తెల్లనగు.

సీ. ఉదరస్థుఁ డగు బాలు నుజ్జ్వల కాంతి దా వెలిఁ బేర్చినన మేను వెలరువాఱె ... నృసింహపు. 3. ౧3౧.

౨. వెలవెలఁబోవు, వివర్ణమగు.

సీ. ...అ. వెలరువాఱు దీవియల నల్లనల్లార్చు, సోర్లగండ్లయందుఁ జొచ్చి సుడిసి, తిరిగి వేగుఁ బోక తెమ్మెర వెలదీఁగ, కొనల వంక లొత్తు ననలఁద్రోచు. భార. ఉద్యో. ౨. ౧౧౨.

గీ. ఇనుఁడు తనదీప్తి తనచేత నిచ్చి పోయి,మఱవ కేతెంచి నిజరుచి మగుడఁ గొనినఁ, దెలివి చెడి తెల్లనైరను పలుకు జగతి, నిలుపుగతి దీప కళికలు వెలరువాఱె. కు. సం. ౭. ౧౭౬.

**వెలరుపోవు.** అ. క్రి. (వెలరు¹ + పోవు.) వెల వెలఁబోవు, వివర్ణమగు.

సీ. ఉద్యానములు వాపికోదకంబులు లేక వృక్షవాటంబులు వెలరుపోయె ... కాశీ. ౫. ౨౬౪.

**వెలలు** = వెలరు². అ. క్రి. ౧. వెడలు, బయలు దేఱు.

చ. ...ఇంద్రు వీటవా,కిలి తలుపుల్ ప్రగాఢ పరికీలిత ముష్టిహతిం బిగిల్చి వే,వెలలు ము కయ్య మిమ్మని సవేగ సముద్ధత సింహ నాద సం,కలితము గాఁగఁ బిల్చుటయుఁ గ్రక్కున వెల్వడియెన్ మహేంద్రుఁడున్. హరి. ఉ. ౪. ౧౬.

క. తెలిమొగము నందు లోలా,క్షుల పొలపం బమరు నా చకోరముల తులా,మల శశి బింబములోఁ బడి, వెలలక చెలరారుచుండు విధమున సతికిన్. కు. సం. 3. 3౦౯.

చ. చిలుకలు వల్కునో చెవులు చిల్లులు వోవఁగ నంచు నెప్పుడున్, వెలలఁడు నందనోపవన వీథులకై ... నైష. ౪. ౨౪.

౨. చొచ్చు, ప్రవేశించు.

సీ. నలుగు వెట్ట నురంబుకుఁ బూప చన్నులు బలిసి క్రిక్కిరియఁ జే వెలల దపుడు ... కకుత్. 3. ౭౦.

3. అతిక్రమించు, కడచు.

క. ఇలువాడి మ్రుగ్గులిడి కూ,రలు గూళ్లమరించి యేల రాఁడాయెనొకో, వెలలెం బ్రొద్దని యట నీ, చెలియలు నేఁ డెదురుఁ జూచు సేవించుటకున్. వే. పంచ. ౪. ౫౬.

**వెలలుచు** = వెడలుచు. స. క్రి. (√ వెలలు.) వెడలఁజేయు. (శ. ర.)

**వెలవ.** వి. (సం. విశేషి.) కాఁపుడుగంజి.

సీ. యవలు నగ్గుగ ధేను నివహానఁ ద్రొక్కించి వెలవయత్తెఱఁగు సూకలన కాఁచి ... భార. అను. 3, ౪౭.

**వెల(లు)వడము.** వి. సస్యవిశేషము.

ద్వి. వెలువడం బుడివోయె వెరఁగయ్యె వరగ... విష్ణు. పూ. 3. ౨. (శ.ర.)

బ. ధాన్యవిశేషము.

వ. గంధసరులు మద్దిగంఁడ్రలు రేఖాములు కాంభోదులు మదనసరులు జలమ బుడతలు వెలవడాలు మల్లెశ్రీగంధులు కుసుమపూరాజనాలు ... ప్రబంధ. ౧౧౨.

సీ. మండి గంఁడ్రలు నాగమల్లెలు తీఁగమల్లెలు కృష్ణనీలాలు వెలువడాలు ... హంస. ౪. ౧౨౫.

**వెలవెల.** (సం. వలక్ష.) విణ. వివర్ణము. (వృత్తియందు నిగామము వికల్పముగా నగు.)

క. వెలవెలని మోముతో మఱి, యెలుఁగొందఁగ గురునిఁ జూచి... వేం. పంచ. ౧. ౨౨౧.

వి. నవ్వుటయం దగు ననుకరణము.

క. ననుడింపు మన్న మాటలు, విని యదియును గంప దింపి వెలవెల నగుచున్ ... వాసిష్ఠ. ౨. ౨౨౫.

**వెలవెట్టు.** స. క్రి. (వెల + పెట్టు.) ౧. మూల్య మిచ్చు, విలువ నొసఁగు.

చ. అనవుడు బోయ యిట్లను శుకాంగనతో నడలంగ నేల నీ, తనయులఁ జంప నేను దినితంబులు ప్రాతియె నాకు వీనిఁ గ్రై,కొని వెలవెట్టు వారి కడకుం జని యమ్ముదువిల్చి వారునుం, బెనుతురుగాని వీనికొక పీడ యొనర్పరు నమ్ము నెమ్మదిన్. కేయూర. ౪. ౬౩.

క. వెలవెట్టి వేఱ క్రైకొన, వలదే కద యింటఁ బౌర వనితల చీరల్, గలుఁగనంధులలోపల, వలసిన యటువంటి వింత వస్త్రలు చూపున్. శుక. 3. ౧౦౩.

అ. క్రి. మూల్యవంతమగు, విలువగలదగు.

చ. నలువగ నెన్నునైన రఘునాథ నృపాలుఁడు గల్గఁగా మహీ,స్థలి నిఖిలైక ధర్మములుఁ దామర తంపరలై చెలంగెఁ గొ,ల్లలుగ నశేష సజ్జనకులంబు సుఖంబుగ నెన్ సమస్త వి,ద్యలుఁ గసట్లెల్లఁ బాసి మొఱపై వెలపెట్టె సభాంతరంబులన్. విజ. వి. పీఠి. ౧౯.

వ....భీమనథ నందనవనమునకుం జంగకాయలకు వెలపెట్టిన గన్ధ(హ)స్తి మాడలు ఇరువది ... దా. శా. ౧౨౧౧. ౧౫.

**వెలవెలఁది.** వి. (వెల + వెలఁది.) పణ్యస్త్రీ, వేశ్య.

గీ. విటులతో మాటలాడదు వెలవెలందు, లన్యవేశ్యలకుఁ గొలందులా జయింప ... నిరం. ౧. ౫౦.

గీ. మనసు గొలుపక హా దైవమా యటంచు, విసువుకొనుచున్న యవ్వెల వెలఁదిఁ జూచి. కవిరాజ. 3. ౧౬౦.

(ఇట దేవతల వారకాంత యగు నూర్వశి.)

**వెలవెలఁబోవు.** అ. క్రి. (వెలవెల + పోవు.) తెల్లఁబోవు, వివర్ణమగు.

క. బలుచేవయుఁ బోయిన వెల, వెలఁబాఱుచు నీదు యోధవీరులు పొలిసెం, బొలిసె నదె భీష్ముఁ డనుచును, కలఁగంబడి యట్టులెత్తి కనుఁగొనుచుండన్. భార. భీష్మ. 3. ౨౬౬.

సీ. విమతుల మోములు వెలవెలఁ బాఱంగ విమలాస్య మోము వెల్వెలుకఁ బాఱె ... భాగ. ౧౦. పూ. ౩౧.

చ. వెలవెలఁ బోవు మోముపయి విన్నఁదనంబు దొలంకు చుండఁగన్ ... యయా. ౪. ౧౩౮.

వెలవెలఁబోవు. అ. క్రి. (వెలవెల + పోవు.) వైవర్ణ్యము నొందు, తెల్లఁబోవు.

చ. వెలవెలఁ బోవు మోము నను విప్రకుమారకుఁ డౌర యెవ్వరుం, దలఁపరు తొల్లి యీ తలఁపు ధారుణిలోపల నిట్టి గుఱ్ఱముల్, గలుగునె ... దశా. ౬. ౧౩.

సీ. పగనైనఁ దెల్పిఁ గోల్పడని రాజులు శరంబులు చన్న వెలవెలఁబోని ఘనులు ... వసు. ౧. ౯౪.

వెలవెలన = వెలవెల్లన. వి. (√ వెలవెల.) వెలవెలపాటు, వైవర్ణ్యము.
చూ: వెలవెల నగు.

వెలవెలనగు. అ. క్రి. (వెలవెలన + అగు.) వెలవెలఁబోవు, వివర్ణమగు.

క. కల గంటినొ భ్రమసితినో, జలజేక్షణు మాయయో నిజంబో యని తజ్జల మధ్యంబున మిక్కిలి, వెలవెలనగు మానిఁజూచి వికవిక నగియెన్. వరాహ. ౯. ౧౦౪.

తే. దితి కపోల తలంబులఁ దెలవాఱె, నదితి కెమ్మోము వెలవెల నయ్యెఁ దోడ, పంచికొన నేమొ రుచియు సాపత్న్యమనను, గాక స్థైరింపఁ గలదె యేకడ సపత్ని. దశా. ౩. ౧౦౪.

సీ. వెలవెలనై చాల వెడనవ్వు వహియించి ముపిపెంబు వితిగిన మోమువాని ... ఉ. రా. ౬. ౨౦౫.

వెలవెల్లనగు. అ. క్రి. (వెలవెలన + అగు.) వెలవెలఁబోవు.

క. ఆననములు వెలవెల్లం,గా నడ లాదవినది మీకు ... భార. ద్రోణ. ౨. ౨౩౩.

సీ. నిత్య స్వతంత్రాది నిరతిఁ జెన్నగు మోము వేఁడుకస్తతి వెలవెల్ల నగుట ... హరి. ఉ. ౧౦. ౨౪౩.

వెలవెలపాటు. వి. (√ వెలవెల.) వైవర్ణ్యము, వెలవెల పోవుట.

వ. ...చుంబనంబిడంబోయి కెంగేల నదరంట వాటువడు కాముకుల వెలవెల పాటు కూటువం గోటికిఁ బడగ లెత్తి ... మను. ౩. ౨౫.

వ. ... నీ మనం బెఱింగియే కదా మునుమున్న యతని మాటలు మానలేవంటి మని మూదలించి నంగించి దవనతానన్నయై నెమ్మొగంబు వెలవెలపాటు లేనగవున నడంచి... ఆము. ౫. ౪౧.

వెలహెచ్చు. విశ. (వెల + హెచ్చు.) అధికమూల్యము, మిక్కిలి విలువగలది.

ఉ. ...కంబురా, సన్నపు గందపున్వలపు చక్కని మై వెలహెచ్చు జాళువా, వన్నె మెఱుంగు రంగునునువల్వ చెఱంగు దురంగలింపఁగన్. ఇందు. ౫. ౧౦౩.

వెలారించు = వెలారుచు. స. క్రి. ౧. బయలు పఱుచు.

వ...ఇంతవట్టును వెలారింతు నీ మాటలు మఱవకుండుము ... భార. ద్రోణ. ౪. ౨౯౦.

౨. వెడలించు, పోఁజేయు.

సీ....ఏను, గదిసియుఁ గ్రమ్మఱఁ గరిపురంబునకుఁ బోనిత్తునే ధృతరాష్ట్రుఁ డింక వగలఁ, బొగులువాఁడు గాక పోఁడిమితో నుండు, వాఁడె వీఁడు మనల వాలి పఱుపఁ, దొల్లి పడిన పాటు లెల్ల వెలారింతు నధిప నీ మనమున వార్త మెసఁగ.
భార. శల్య. ౨. ౨౪౨.

అ. క్రి. సంచరించు, తిరుగు.

సీ. పుడమి నంతకనామమునఁ జేర్చు శైలంబు
కేలు వెలారించు బేలతనము ...
కృ. శతకం. ౧. ౫౬.

వెలార్చు(రుచు) = వెలారించు. స. క్రి ౧. వెడలించు.

సీ. జము దూత లట్లు ప్రాణములు వెలార్పంగ
నీ ద్రుపదాత్మజుఁ డెన్నఁ డేసె ...
భార. భీష్మ. ౩. ౪౦౫.

మ. వనితా నీపతి తోడఁ గూడవలతేన్ వారేల
వీరేల నీ, కని నన్నా యనిరుద్ధుఁ డున్న యెడ
కన్లైనస్వేలార్తనిఁ బో, యిన నాతండు
కులాభిమాన ఘనుఁడై యేయూరి కేడ్రోవ
యం చనుమానించినఁ ద్రోవనన్ గొబ్బిఁ
జేయం జూచెదే క్రమ్మఱన్.
ఉ. హరి. ౫. ౧౬౧.

సీ.... తే.... గానసుధ వెలార్చు ...
అము. ౫. ౬౩.

ఉ. దోసము పెద్దలే దవక దూర్జటి నిష్ఠుర కంఠ
హుంక్రియా, భ్యాసము మై నదల్చి యద
యస్థితిఁ గాశి వెలార్చె నింక నే, నాసరి
సంయమీంద్రుల ననాథత నేమెయిఁ జూతు
నక్ష వా, టీ సదనుండు ప్రేమ ఘటియింపక
తాను నుపేక్ష సేసినన్. భీమ. ౩. ౧౧.

౨. బయలు పఱచు.

మ. ...వివిధాస్త్ర ధారలు సమిద్భూమిన్ వెలా
ర్చున్ బ్రభా, వలి తీవ్రద్యుతి ...
ఉ. హరి. ౧. ౧౫.

క. నకనకని నడుము నక్కులు, చకచకల
వెలార్చు తొడలుఁ జక్కని తొగలన్,
వికవిక నగు తెలిగన్నులు, వికచక మల
వదన కొనక్క వేడుక మీఱన్.
ప్రబం. ౧. ౪౯౦.

ఉ. ...నా మనసు పాతగలించి వెలార్చినట్టి
యీ, మాటలు మూఁడు నుంతువగ మానవ
నాయక నీకు దక్కులిన్. విక్ర. ౮. ౧౦౪.

వెలి[1]. వి. (త. వెళి.) ౧. బయలు, వెలుపల.

క. నగరుల లోపలి మాటలు, దగునే వెలి నుగ్గ
డింపఁ దన కేర్పడ నొం, డు గడం బుట్టినఁ
బతి విన, నగు పని చెప్పెడిదిగాక యాతని
తోడన్. భార. విరా. ౧. ౧౩౦.

సీ. పాదఁదూఁఱు నొక మేటి పూరేటి వెలికిఁ
బోఁ దోలి కైకొను నొక్క తోఁచి
గాఁడు ... మనుచ. ౪. ౫౮.

సీ. ఎల తుమ్మెదల దిమ్ము వెలిఁబిమ్ము చెలు
వమ్ము గలవేణి కొక వింత నలువు మీఱె...
పారి. ౧. ౫౬.

౨. శరీర బహిర్భాగము, బహిర్భాగము, వెలు
పలి ప్రదేశము ...

క. వెలి శుచియై మఱి తీర్థం, బులు సొచ్చుట
మేలుఁ నియమములు దీర్చి తగన్ ...
భార. అను. ౫. ౧౮౫.

గీ. ఆ రమాకాంత రూప రేఖాతి శయముఁ,
గాంచు వారి కప్పు డంతరంగంబు నిండి,
వెలికిఁ గ్రమ్మిన యనురాగ జలమనంగ.
స్వేద మానంద బాష్పముల్ చెలువమయ్యె,
దశా. ౨. ౨౬౩.

గీ. వేయు గడవల జలమున వెలి గడిగిన గలు
గునే శుద్ధి వారుణీ కలశమునకు ...
కాశీ. ౩. ౩౪.

౩. బాహ్యప్రదేశము. (బయలుపాటు. శ. ర.)

క. తలలోపల నాలుక పూ, సలలో దారంబు
పోలెఁ జల్లిన నీరం, బలె వెలి యొఱుఁగక
మన, సులు గలసి యభేదమునఁ గాఁపుకడ
నతఁడుండెన్. పాండు. ౩. ౫౮.

వ. వెలిమఱచిన వలరాచ తపసుల పోలికన్...
పారి. ౨. ౫౨.

౪. బహిష్కారము.

క. చదువులు పెక్కులు చదివియు, మదిమది యయినుండి నేఁడు మలహరు వెలిగా,నిది యెల వీడఁ దొణఁగెను, మదిలోపల నణఁచు బెదరు మదిలోఁ గదురన్.
వీర. ౧. ౧౦౩.

—విశ. ౧. బాహ్యము వెలుపలిది.

క. చారు మన స్సమ్మద రస, పూరము వెలి వేర్చునట్లు పొలఁతికి ...
భార. ఆది. ౬-౨౦.

గీ. ...నృపతి వెలి యంతిపురముగా నెన్న మెలఁగ ...వలఁతు లప్పద్మముఖులు.
ఆము. ౧. ౬౦.

చ. ...చనిచని ముందటన్ వెలి హజారము వెల్వడి వచ్చుచున్న ... దశ. ౧. ౧౬౩.

౨. వర్జితము, లేనిది.

క. లలితాంగి శయన మొక్కఁడు, వెలిగా...
భార. ఆది. ౩. ౧౩౬.

క. రవి శశి తారలు వెలిగా, దివియున్న ను నుండుఁగాని తెల్లంబునఁ జౌరవ వంశము లేకుండుట, భువి నెందును లేదు కాలములు దగ మాటన్. హరి. ఉ. ౮. ౧౩.

సీ. సౌరభము లేని యట్టి పుష్పంబు వోలె, గండుఁ గోయిల వెలిగైన కానవోలె ...
నైష. ౨. ౨౪.

ఉ. జీవులు మృత్యువన్న వెఱఁజెందుదు రుగ్ర విరోధి మృత్యువే, కావునఁ దద్భయంబు వెలిగాఁ బ్రదుకన్ వరమీయవే కృపన్...
ఉ. రా. ౨. ౧౮౩.

౩. పరకీయము, ఇతరులది.

క. సురగరుడోరగ విద్యాధర పురవర సతుల తోడ దనుజేశ్వరు కింకరులు రమింతురు దోషా,చరులకు వెలి లోపు గలదె చతురా ననుఁడా. కు. సం. ౪. ౩౨౪.

వెలి[2]. విశ. (సం. వలక్షః.) తెల్లనిది, ధవళము.

సీ. వక్షస్స్థలంబున వనమాల గ్రాలంగ వెలి మావు గెడల వాగెలు ధరించి, నొగలపై హరియొప్ప ... భార. ఉద్యో. ౪. ౧-౨౫.

లయవిభాతి. నగవు నిగుడన్ గురుల పొగరు మగుడన్ నయన యుగళి వెలి దామరల మగలై డా లెగయ... మనుచ. ౪. ౧౧౩.

గీ... వెలితపారంబు మించ దువ్వలువ గప్పి...
ఆము. ౪. ౫౮.

వి. తెలుపు. (శ. ర.)

వెలికడలి. వి. (వెలి[2] + కడలి.) క్షీరసముద్రము.

క. ఆ వెలికడలి నగు పరిఘా వారిధిఁ దత్పు రంబుఁ గని చతురుండై, రావణపురి యా మీఁదటఁ, గావించెనొ కాక విశ్వకర్మకు నగునే. రా. వి. ౧. ౬౩.

వెలికత్తెర నేల. వి. కంకరమన్ను కలిసిన భూమి. (శ. ర. వెలిగత్తెర నేల. బ్రా.)

వెలికి. వి. ఒకానొక చిన్నమొక్క, గాడిద గడపర. శ్రీ.

సీ. పొదలుఁ చిండీతకమ్ము గాడిదగడప చాగ రాడి వెలికి యటంచన ...
ఆం. భా. ౨౬౫.

వెలికిలఁబడు. అ. క్రి. (వెలికిలన్ + పడు.) ఉత్తానపడు, వీపు క్రిందగునట్లు పడు.

చ. లలన జలంబులో వెలికిలం బడి యొక్కటె యీదఁగాఁ ద,దీయలలదురోజ హారము లాయారమ మీఱె సమీరి తార స,చ్చలిత సమస్త చక్రముఖ సక్త బిసాంకురముల్ బలెన్ ... ఇందు. ౩. ౫౮.

క. కొలువాస రొసఁగి సురగవి, వెలికిలఁబడుఁ గల్పతరువు వేఁడిన మతి యాకులపడి పండ్లి గిలించును, నలువుగ నినుబోలఁ గలరె నర సింహ నృపా. నరస. ౨. ౭౪.

వ. ఇట్లు కుక్కుటాసనస్థుండై యుండి రెండు చేతులును మెడను బట్టుకొని కూర్మము వలె వెలికిలఁ బడియున్న నది కూర్మాసనం బగు ... వేం. మా. ౩. ౭౪.

వెలికిలు. అ. క్రి. ౧. వెలికిలఁ బడు.

చ. వలపలి కాల ముక్కునను వాత సుధారస ముప్పతిల్లఁగా, వెలికిల వైచి మట్టె రణవీర శిఖామణి వీరభద్రుఁడు ... కాశీ. ౩. ౭౩.

గీ. ఒక్కసతి వెలికిలి యూఁద నొప్పెఁ గురులు, వీఁగుఁ జన్నులు నలరాచ వేఁట కాఁడు, కోక ములఁ బట్టి నొడ్డు వాగురులు వానిఁ, డా కొనఁగఁ బెట్టు దీము పిట్టలు ననంగ. వరాహ. ౩. ౧౦౩.

౨. వీఁపు క్రిందుగాఁ బరుండు.

చ. వెలికిలి సెజ్జమీఁదఁ గడు విప్పగు కన్నుల చాయ లొప్పఁ జెక్కిలి గిలికించి క్రేతలు నగింపఁగనుండుట యాదిగాఁగ ... హరి. పూ. ౭. ౧౩౪.

వెలికిలు(ల్లు). అ. క్రి. ౧. ఉత్తానమగు, మీఁది ముఖమగు.

క. వెలికిలఁ జరణతలంబులు, దల మీఁదను జేర్చి ధరణితలమున నిలువం, గలిగెడు నట్లుగఁ గరములు, నల పశ్చిమ మెత్తఁ డిట్టి భాసన మయ్యెన్. సీతారా. ౧. ౧౧౫.

౨. వీపు క్రిందగు నట్లు పడు.

సీ. వెలికిల్లఁ బెట్టె నుత్పలగంధి యొక్కర్త కప్పుగర్భ గృహోప కంఠమునను ... శివరా. ౨. ౩౧.

వెలిగట్టు. వి. (వెలి² + గట్టు.) రజతాద్రి, వెండి కొండ.

సీ. చలిగొండ వెలిగట్టు చాయలగిలుబాడి కొండెంపుఁ దపసిఁ గైకొనక చెలఁగి,
గీ. పాపరాయఁడు సెగడె నీప్రాంతమందు ... చిత్రభా. ౫. ౧౦.

వెలిగడ. వి. (వెలి¹ + కడ.) మెట్టనేల. (శ. ర. ప్రా.)

వెలిగారము. వి. (వెలి² + కారము.) టంకణము, బంగారమునకు కాంతిని గలుగఁ జేసెడి యొక దినుసు తెల్లని యుప్పు. (శ. ర.)

వెలిగించు. స. క్రి. (√ వెలుఁగు.) ౧. ప్రకాశింపఁజేయు, వెలుఁగఁ జేయు.

క. అపరిచ్ఛిన్నావ్యయని, త్య పరంజ్యోతి ర్మయుండనై శశిహుత భుక్తపనాదుల వెలిఁగించుచు, నెపుడంతట నొక్కరీతి నేను వెలుఁగుదున్. సీతారా. ౨. ౭౦.

చ. ...రామ భాస్కరుం,...తపస్వి మానసా, బ్జము లలరించి వేల్పుఁగవ జక్కవలన్ వెలిఁగించి లోక ము, క్తమము లడంచి ... ఉ. రా. ౧. ౧౨౭.

మ. ...మించు వెలిఁగింప న్మబ్బులన్ వెల్లిపై. అము. ౪. ౭౩.

౨. చెల్లించు, చెల్లఁజేయు.

సీ. ఉక్కడఁగించుచు దిక్కులఁ దన యాజ్ఞ వెలిగించుచును విప్ర కులము వెల్లఁ ద్రోచుచు ... భార. ఆది. ౧. ౩.

౩. వ్యాపింపఁ జేయు.

ఉ. ...లో, కాతిచితుండై నవాఁడు నిఖిలాగమ పుంజము సేర్పడన్ విభాగించి జగంబు లందు వెలిఁగించి ... భార. ఆది. ౩. ౪౩.

౪. ప్రసిద్ధి కెక్కఁజేయు.

మధ్యా. వీని మీఱెఱుఁగరె భార్గవకులము వెలిఁ
గించువాని ... భార. ఆది. ౩. ౧౩౩.

**వెలిగిడ్డి.** వి. (వెలి² + గిడ్డి.) కామధేనువు.

క. వెలిగిడ్డి వింటి పసి వెలి,కిలఁ బడు లొడు
కనఁగఁ బరగు ఖేచరగవి ...
ఆం. భా. ౧. ౫౩.

**వెలిగుల్ల.** వి. (వెలి² + గుల్ల.) శంఖము.

క. నలువకు నెలవగు తమ్మియు, వలిపెంబగు
పచ్చపట్టు వలయపు టలుగున్, వెలిగుల్లయు
వనమాలయు, గలిమియు మానికము మేనఁ
గలిగిన వేల్పున్.
ద్వా. ౪. ౧౪౭.

**వెలిగొండ¹.** వి. (వెలి¹ + కొండ.) దూరమం
దున్న పర్వతము. (శ. ర.)

**వెలిగొండ².** వి. (వెలి² + కొండ.) వెండికొండ,
రజతాద్రి.

**వెలిగొడుగు.** వి. (వెలి² + గొడుగు.) శ్వేత
చ్ఛత్రము.

వ. అతని వెలిగొడుగుల పడగల చెడంగుల నుడు
గని కలిమిం దొడరి ... ఉ. రా. ౪. ౧౬౩.

**వెలిగారు.** వి. (వెలి² + గారు.) ఐరావతము,
ఇంద్రుని యేనుఁగు.

ఉ. పోటున ప్రేటునం దిరిగి బోరగిలం బడి
యున్న దానవుం, గాటుక కొండ నెత్తు వెలి
గారు తెలింగున నెత్తి ...
ఉ. హరి. ౪. ౨౬౭.

**వెలిగ్రుక్క.** వి. (వెలి¹ + గ్రుక్క.) మణితము,
రతికూజితము.

**వెలిచవి.** వి. (వెలి¹ + చవి.) జారత్వము, అంకు
తనము.

చ. నలుపుల యిక్కు లంజియల నమ్మిన రో వెల
పంట జక్కవల్, తలఁపని కీడు కాని యవ
దాయము క్రొవ్విరి తమ్మిలచ్చికిన్, వెలిచవి
గోరు మండగపు వేడుక కత్తెల నోమునోఁత
గూ,బల మణిహంబు జారులకుఁ బండువ
చీఁకటి పర్వె నుర్వరన్. కవిక. ౪. ౭౬.

గీ....తవులు కోర్కులచే వెలి చవుల కరుగ,
సందు గానక కుందు నయ్యిందువదన.
శుక. ౨. ౫౦౪.

సీ. వెలిచవుల్ మరగిన వెలఁదికిఁ బలిభంగి గలిత
దంతునకు శష్కులిక భంగి ...
రామలిం. ౨౩.

**వెలిచామలు.** వి. బ. (వెలి² + చామలు.) ధాన్య
విశేషము.

సీ. జడకొట్టు కొఱ్ఱలు చామలు వెలిచామ కుట్టారి
కారికె కొండఁ బరిగె... హంస, ౪. ౧౨౩.

**వెలిచూడ్కి.** వి. (వెలి¹ + చూడ్కి.) బాహ్య
దృష్టి, వెలుపలి చూపు. (వ్యతి. లోచూడ్కి.)

సీ. వెలిచూడ్కి లో లక్ష్య మలఁతి బాహిర
ముగా మునుకొన్న శాంభవీ ముద్రవాని...
కృ. శకుం. ౩. ౩౩.

**వెలిచె(ల్చె).** వి. ఒకజాతి పిట్ట, వర్తకపక్షి.

సీ. వెలిచె కాటుకపిట్ట బెళవ వామనపాతు
పసిరిక లకుముకి పాల్పురాయి ...
పార్వ. ౬. ౩౩.

చ. చిలుకలఁ బావురంబులను జెన్నగు హంసలఁ
జక్ర యుగ్మమున్, వెలచెల నాదిగాఁ
గలుగు వింత పులుంగుల బెంచి మిక్కిలిన్,
గలికిగఁ జేసి ... దశా. ౩. ౩౩.

ద్వి. వెలిచె లావుక యాది వేర్వేఱు జాతి,
పులుఁగుల నన్నిఁటిఁ బొరిపుచ్చి తనిపి ...
హరిశ్చ. పూ. ౬౩౧.

చ. ...ప్రల్లదంబు నను వెల్చెలకున్ దగముద్ద
వెట్టి యొక్కఁడ మఱి కాటు లాడనిడు...
భల్లా. ౩. (శ. ర.)

**వెలిచెట్టు.** వి. (వెలి[2] + చెట్టు.) కల్పవృక్షము.

శా. అర్ణోరాశిఁ దృణీకరించి వెలిచె ట్టట్టిట్టు
గావించి దృక్కర్ణ స్వర్ణపదాంగద ప్రియ
సఖున్ గద్దించి యుద్దామ సంపూర్ణోదారత
నీడుజోడు గనఁడీ భూలోక చింతామణిం,
గర్ణుం గంటివె వర్ణనీయుఁ డబలా కర్ణాంత
నేత్రోత్పలా. పాంచా. ౨. ౨౩.

**వెలిచేను.** వి. (వెలి[1] + చేను.) మెట్టచేను.

7...ఆ రామేశ్వరునికి దధ్యంన్న అవసరానకు
కాడారంభం వెలిపొలం కోలపాటి చేను
ఖ ర అక్షరాలాను కోలపాటి నాలుగుపట్లు
వెలిచేనున్ యీ తథా.
ద. శా. ౪. ౭౦౧.

**వెలిచేంద్ర.** వి.( వెలి[2] + చంద్ర.) తెల్లచంద్ర,
కదరము. శ్రీ. (శ. ర.)

**వెలితి.** వి. న్యూనత, కొఱఁత.

గీ. సప్త సంతానములు నాకు సంభవించె, నొక
ప్రబంధంబు వెలితిగా సుకృత గరిమ, నా
వెలితిమాన నాపేర నంకితముగ, శివపురా
ణంబు తెనుఁగుగాఁ జేయు మెంకటి.
భీమ. ౧. ౨౪.

ద్వి. విధవ తనమునకు వెలితి వొమ్మనక, విధి
లేదు సతి పెద్ద విధి యింతె యనక ...
పండితా. దీక్షా. ౪౩. పా.

క. తలఁపులు సమకూరెం గద, వెలితేమియు
లేక యింక వేంచేయఁదగున్ ...
యయా. ౫. ౧౪౭.

౨. విరళత, తఱచుఁదనము లేమి.

ద్వి. వెలితి గానఁగరాని విమల పూరములఁ,
బొలుచు వీచులరాలు పుష్పాళ్ల జడియు...
రం. రా. ఉ. ౧౧౬. పా. ౨౧. పం.

—విశే. ౧. తక్కువైనది, న్యూనము.

గీ. ఒడలు నొలియించి యదువీరుఁ డొడిసిపట్టి,
యమ్మహాశక్తిఁ గ్రమ్మఱ నతని వైచె,
నురము గాడఁగ భూపతుల్ తిరిగి చూడ,
వేగ నదిచేసె నించుక వెలితి చావు.
ఉ. హరి. ౩. ౮౬.

గీ. తొంబనూఱును తొంబది తొమ్మిదియును,
జలజములు పూజచేసెను శార్ఙ్గపాణి, వేయి
టికి నొక్క పద్మంబు వెలితియైన, నహహ
నియమంబునకు భంగ మయ్యెననుచు.
భీమ. ౬. ౬౪.

గీ. ఏమి చెప్పెదుదాన మీరిడక లేవు, సకల
విద్యలు భూసుర సమితి కెల్ల, నజాన కెనవత్తు
రన్నింటి నకట మీర, లల ముకుందుని కన్న
నే వెలితిచెపుడు. రాజ. చ. ౩. ౨౦.

౨. పూర్ణము కానిది, నిండనిది.

గీ. బహుసహస్ర సంఖ్యలు గల పసులకెల్ల,
నిడుపు దగిన యిమ్మెయ్యది యిచట, ననకుఁ
డెనసి త్రైలోక్యమును వచ్చెనేని నిమ్మ,
గలదు వెండియు వెలితియ కాఁగ నుండు.
హరి. పూ. ౮. ౧౭౨.

క. నిండార జలముఁ ద్రావియు, వెండియు
వెండియును గడుపు వెలితిగఁ బైపై, నొం
డొండ క్రోలి జలరుహ, షండంబులతోడఁ
గ్రీడ సల్పుచునుండన్. వాల్మీ. ౧. ౭౬.

3. తలచుఁదనము లేనిది. (శ. ర.)

**వెలితిపడు.** అ. క్రి. (వెలితి+పడు.) తక్కువగు, తగ్గు.

గీ. ప్రతిదినము దక్షవాటీ పురంబునందు, మలయ
వేలావనీ మందమారుతంబు, గంధసారల
తాకుఁ దుంగముల మెలఁగు, చిలువ లేమలు
సేవింప వెలితిపడుము. భీమ. ౧. ౭౭.

**వెలితి(ది)ప్ప.** వి. (వెలి²+తిప్ప.) రజతగిరి, కైలాసము.

సీ. వెలిదిప్ప ముక్కంటి మలవెండి కొండనాఁ
గైలాస పర్వతాఖ్యలు చెలంగు...
ఆం. సం. స్థా. ౧.

**వెలితుమ్మ.** వి. (వెలి²+తుమ్మ.) తెల్లతుమ్మ, విట్ఖదిరము. శ్రీ. (శ. ర.)

**వెలిదమ్మి.** వి. (వెలి²+తమ్మి.) తెల్ల దామర, పుండరీకము.

సీ. ఉత్కంఠ రమసంకు నొఱపు గీటడఁగించి
వెలిదమ్మి తుటుములఁ జాలకఁజూచి ...
పె. శకుం. ౧. ౪౩.

ఉ. ...వెలిదమ్మి భావికిం, జెంగట నుల్లసిల్లు
తులసీవన సీమ శుభాంగి ... ఆము. ౫. ౪.

గీ. ...తెలిదమ్మి వెలిదమ్మి వెల్లదమ్మి, తెల్ల
దమ్మి యనంగను దేజరిల్లుఁ బుండరీకంబు ...
ఆం. భా. ౧. ౧౬౪.

**వెలిదుక్కి.** వి. (వెలి¹+దుక్కి.) నీళ్లుకట్టక వాన తడిచే దున్నుట. (శ. ర.)

**వెలిద్రొబ్బు.** స. క్రి. (వెలి¹+ద్రొబ్బు.) వెలికిఁ ద్రోయు, బయటికి త్రోయు.

సీ. వలుఁద శూలముతోడ నలిమబ్బు నలమబ్బు
వెలిద్రొబ్బు గరళ భృద్గళముతోడ....
ఉ. రా. ౧. ౨౬౦.

**వెలిపట్టు.** వి. (వెలి²+పట్టు.) తెల్లని పట్టు వస్త్రము.

గీ. ఎఱిఁగి యమ్మోటి తాము సుంగిడిన జిలుఁగుఁ,
జలువ వెలిపట్టు దొలగించి సరగ లేచి, సరభ
సంబున నట్టహాసంబు సేయ, వింశతి
భుజుండు భీతిల్లి వివశుఁడయ్యె.
ఉ. రా. ౫. ౫౬.

వ. సన్న వలిపెంబులును వెలిపట్టులును హొం
బట్టులును పులిగోరు పట్టులును ...
ద్వా. ౩. ౨౦౬.

**వెలిపట్టు జీబులు.** వి. బ. (వెలిపట్టు+జీబులు.) వస్త్రవిశేషము.

సీ. సంపంగి కావులు చందురు కావులు లివెపట్టు
జీబులు వేటచాళ్లు ... ప్రబంధ. ౨. ౪౨.

**వెలిపము = వలిపము.** వి. సన్నని తెల్లని వస్త్రము.

సీ. వెన్నెల పోరవంటి వెలిపంబు చెంగావి
జిలుఁగు పావడ మీఁద నలవరించి ...
యయా. ౨. ౭౭.

(-శ. ర. పా. వెలిపట్టు వలిపంబు జిలుఁగుఁ
బావడ మీఁద ... ముద్రి. పా.)

ప్రయోగాంతరము లభింపలేదు.

**వెలిపారము.** వి. అయోధ్యాపుర ప్రాకారాదికము.

మ. తలపై నన్ను ధరించి భూవరుఁ డయోధ్యా
ప్రాగ్దిశా ప్రాంగణస్థలి యందున్ సగయూ
తటంబునఁ బ్రతిష్ఠానంబు శ్రీరంగమున్, వెలి
పారం బనఁగా నయోధ్య భవనావిర్భావ
మున్ గోపురంబులు ప్రాకారము లాయ
తించె సురశిల్పుల్ వచ్చి నిర్మింపఁగన్.
శ్రీరం. మా. ౨. ౧౧౩.

**వెలిపాఱు.** అ. క్రి. (వెలి + పాఱు.) పైకిపోవు.

ద్వి. అటుల పైఁబడు గయాళి ప్రోయాలి, నటు
ద్రోచిగుండె ఝల్లని వెలిపాఱ, హా పర
మేశ మహాదేవ యనుచు, భూప సూనుఁడు
సొమ్మఁ బొందివే తెలిసి ...
ద్వి. తి. సా. ౧. ౧౫. పా. ౨౬. పం.

**వెలిపించు.** స. క్రి. (√ వెలి[1].) వెలివఱచు, బయ
టకు రప్పించు.

సీ. భగదత్త తనయుండు బాహు గర్వంబున
బాల్యసిద్ధంబగు లౌల్యమునను, బురి నిర్గ
మించి యత్తురగంబు వెలిపించి కొనిపోవఁ
గాంచి ... భార. అశ్వ. ౪. ౨౧.

**వెలిపుచ్చ.** వి. (వెలి[2] + పుచ్చ.) తెల్లపుచ్చ.

క. భూకాంత నీరుపట్టుకుఁ, గాకవదన మిలుక
రింపఁ గాన్పించిన పం,క్లో కాకన వెలి
పుచ్చలు, లోకములోఁ గాచె నిట్లు లోఁబడె
జనముల్. వరాహ. ౧౦. ౩౦.

**వెలిపుచ్చు.** స. క్రి. (వెలి[1] + పుచ్చు.) బయటఁ
బెట్టు.

క. జనపతి యెవ్వరి నైనను, మనుపఁ జెఱుపఁ
బూని యునికి మదిఁదెలియ నెఱిం,గన
రేనిఁ దాను వెలిపు,చ్చునె మాను మున్నెట్టి
పాలసుండును దానిన్.
భార. విరా. ౧. ౧౩౪.

వ. తన యంతర్గతంబును సకలంబు నాకు వెలి
పుచ్చ సిగ్గుపడి పద్యత్రయంబుగా రచించి
యొక్క కేతకీపత్త్రంబున లిఖించి ...
కేయూర. ౪. ౧౪౨.

**వెలిపె(వె)ట్టు.** స. క్రి. (వెలి[1] + పెట్టు.) బహి
ష్కరించు, సంఘమునుండి దూరము చేయు.

సీ. వెలిపెట్టిరే బాడబులు పరాశరుఁ బట్టి దాశ
కన్యాకేళిఁ దప్పుసేసి ... మను చ. ౨. ౩౩.

గీ. ఏమి గుడువంగ వచ్చినా రిండ్లు విడిచి, వారుని
వెలిపెట్టినట్టి యీ యాగమునకు ...
కాశీ. ౬. ౬౬.

సీ.... తెలి మెట్టదమ్ముల వెలిపెట్టఁగాఁ జాలు
శ్రవణాంత కాంత నేత్రముల వాని ...
దశ. ౩. ౨౩.

**వెలిపోలము.** వి. (వెలి[1] + పోలము.) మెట్టచేను.

శి....అ రామేశ్వరదేవునికి దధ్యంన్న అవస
రానకు కాడారంభం వెలిపొలం కోలపాటి
చేను ఖ ౪ అత్సరాలాను కోలపాటి
నాలుగుపుట్లు వెలిచేనున్ యీ తథా.
ద. శా. ౪. ౭౦౧.

**వెలిఁబడు.** అ. క్రి. (వెలిన్[1] + పడు.) సంఘము
నుండి బహిష్కృతుఁ డగు.

సీ. ...గీ...తనరు వెలిఁబడ్డవాఁ డనఁగను బహి
ష్కృతుండు ...
ఆం. భా. ౩. ౧౨.

**వెలిఁబర్వు.** అ. క్రి. (వెలిన్ + పర్వు.) బయ
టకు ప్రసరించు.

ఉ....మది నాఁటిన పంచసాయకా, నూన
లతాంత కోరక సముత్కరముల్ వెలిఁ
బర్వెనోయనన్. వసు. ౫. ౭౭.

**వెలిబిత్తరి.** వి. (వెలి[1] + బిత్తరి.) కాయమాన
భేదము, మల్లబంధ విశేషము.

వ. విష్ణు చక్రంబును రామబాణంబును నాగ
బంధంబును లోలకరి మెఱుపును, అల్లిమత్తును
విస్పంద హస్తాభిరణంబును పదఖండ
నంబును నురిత్రాడును లో బిత్తరియు వెలి
బిత్తరియు సర్వాంకుశంబును మొదలుగాఁ
గల పదిరెండు గాయమానంబులును.
ప్రబంధ. ౩౭.

వ. పదఖండనంబును లోబిత్తరి వెలిబిత్తరి సర్వాంకుశంబు అల్లిమత్తును.

మల్లు. పు. ౩౭౮.

వెలిబూది. వి. (వెలి² + బూది.) తెల్లనివిభూతి.

సీ. శ్రీకాళహస్తి గౌరీపతి స్తోత్రముల్ పెట్టిన వెలిబూది పెండెకట్లు... కాళ. ౪. ౧౦౩.

సీ. అలసాత్త్వికము మేన నంతట నిండెనాఁ బొలుపైన వెలిబూది పూఁత దనర ...

ఇందు. ౧. ౧౬౧.

వెలిమల. వి. (వెలి² + మల.) కైలాసపర్వతము, వెండికొండ.

లయవిభాతి. మొలను బులితోలు వెలిమలను బలుఁబ్రోలు వలిఁ జిలుకు తలజాలు మెయిఁ గులుకు జవరాలున్, గిలిగి కడు మేలు పజ కెలిమి నిడిమేలుఁగని చెలఁగి జగమేలుచును వెలుఁగు వెఱవేల్పు ...

అచ్చ. రా. బాల. ౨. ౧౬.

వెలిమాడు. వి. (వెలి¹ + మాడు,) విదేశముల కంపఁబడు ధాన్యాదికము. (శ. ర.)

వెలిమావు. వి. (వెలి² + మావు.) ఇంద్రుని తెల్లగుఱ్ఱము. ఉచ్చైశ్శ్రవము, తెల్లగుఱ్ఱము.

సీ. వరుసలు పెట్టి దువాళింప సుడివడి వెలి మావు మోపదు వెనుక కాలు ...

వరాహ. ౧౦. ౧౫.

సీ. మిగులుఁ గుప్పసము పన్నగలోక భర్తకు వేల్పొక్క- వెలిమావు వెల్ప దొరకు ...

రామా. ౧. ౪౩.

వ. వర్మంబులుసించుచు నొకళ్లొకళ్ల వెలిమా వులం డగలం దాఁక నేయుచుం జేరి పోరు సమయంబున ... భార. భీష్మ. ౨. ౪౨.

వెలిమావుజోదు. వి. (వెలిమావు + జోదు.) ఇంద్రుఁడు.

వ. మేచాయలు వెలిమావు జోదున కటిఁగించు పై మెఱుంగులును ...

అచ్చ. మా. ౨. ౩౧. పొ.

వెలిమిడి = వెల్మిడి. వి. (వెలి² + మిడుఁగు.) ౧. విభూతి, భస్మము.

సీ. వెలిమిడి నలికింబు చెలువంగఁ బోవుచు తెలుపార మైనిండ నలఁదికొనుచు ...

కు. సం. ౫. ౬౬.

౨. బూడిద.

క. ఆ మాటలు విని రోగ, గ్రామణి గోపించి కుడికరంబుల రెంటన్, దామోదరు నురము పైయిన్, వేమఱు మిడుఁగుఱులతోడి వెలి మిడి జల్లెన్. ఉ. హరి. ౬. ౫౬.

ఆ. నీరు నెత్రు గనిన నిడివగు నాయువు, మంట గంట పసిఁడి పంటగంట, తెలుపుతెల్ల మేలు గలలోన వెలిమిడి, యొముక ప్రత్తి లవణము ముకదక్క-. ద్వా. ౫. ౩౩.

వెలిమొట్ట. వి. (వెలి² + మొట్ట.) మత్స్యవిశేషము.

సీ వేడసంబుల నిచ్చె వేడుక కాంద్రకు గండెల బలు దుండగీల,కిచ్చె, వెలిమొట్టలను దండు వల తలార్లకు నిచ్చె కోడిశల పరిహాసకులకు నిచ్చె ... ద్వా. ౧. ౨౪౦.

వెలిమ్రాను. వి. (వెలి²+మ్రాను.),కల్పవృక్షము. దేవతరువు. (శ. ర.)

వెలిమొన. వి. (వెలి¹ + మొన.) మల్లవిద్యావిశేషము, పండ్రెండు మొనలలో నొకటి.

వ. లోమొన వెలిమొన యుసిమొన ముమ్మొన చతురమొన సరితాళంపుమొన యాదిగాఁ గల పదిరెండు మొనల నారితేరి ...

హంస. ౧. ౨౦౬.

వ. లోమైన వెలిమైన యుసిమైన చదురమైన పుణ్యంపుమైన పాపంపుమైన చాటడుగుమైన చాటడుగ్రుమైన కదలుమైన యురమీటుమైన నెరమీటుమైన సరితాళంపుమైన అను పదిరెండు మైనలు. ప్రబంధ. ౪౮.

వెలియగు. అ. క్రి. (వెలి[1] + అగు.) ౧. బహిష్కృతమగు.

క. చలముకొని యిట్లు వడయఁగ, వలయునె రాజ్యంబు దీన వచ్చిన కలిమిం, గలుగునె పెంపును బేరును, వెలియైతిమి లోకమునకు వేయును నేలా. భార. ద్రోణ. ౫. ౩౫౨.

౨. లోఁబడకయుండు.

క. ఇల నెవ్వడు తనయాజ్ఞకు, వెలియై వర్తించు వేద విప్రుని నైనన్, దలఁ ద్రెవ్వ నేసి చంపుఁడు, తొలఁగక మీరనుచుఁ బల్కె దుష్టభటాళిన్. వి. పు. ౨. ౧౦౫.

వెలియాకు. వి. (వెలి[2] + ఆకు.) తెలనాకు, తమలపాకు, నాగవల్లీదళము.

సీ. విమలా లతా తన్వి వెలియాకు మడుపుతో నడుగుఁ బాయక వెంటనంటి నడువ ... దశా. ౩. ౧౮౪.

సీ. కడఁకతో వెలియాకు కుడుపు లెమ్మను జేలి నొసఁగెడు తొయ్యలిఁ గసరెదేమి ... నీలా. ౩. ౮౬.

వెలియార్చు = వెలార్చు. స. క్రి. బయలు పఱచు.

సీ. మగరాల మొగముట్టు నిగనిగల్ వెలియార్చు హురుమంజి ముత్తెంపు సరిపెణీలు ... చంద్రా. ౨. ౬౮.

వెలియావు. వి. (వెలి[2] + ఆవు.) కామధేనువు.

సీ. జోగుల వెలియావ సోయగంబుల ప్రోవ కనికరంబుల తావ కావుకావు ... అచ్చ. రా. యు. ౪౮.

వెలియు = వెలుచు[2]. అ. క్రి. ౧. వాన కురిసి నిలుచు.

ఆ. అచట నిలుచునంత నవ్వాన వెలియఁగ నొకఁడు వచ్చి వాని యొద్ద కేను ... ద్వా. ౩. ౮౪.

గీ. తెలియ నింతయు వర్షంబు వెలియదాయె... విప్ర. ౩. ౬౪

క. పెనువాన యింతట న్వెలిసిన నేగతిఁ బోదు రిత్త చేతుల తోడన్ ... శుక. ౩. ౨౫౪.

౨. రంగుచెడు, చాయతగ్గు.

(వ్యవ.) ఆ చీర వెలిసి పోయినది.

(ఈ యర్థమునఁ దఱుచుగా దీనికి 'పోవు' అనుప్రయుక్తము.)

వెలియునికి. వి. (వెలి[1] + ఉనికి.) ప్రవాసము, పరదేశములో నుండుట. (శ. ర.)

వెలియొనర్చు. స. క్రి. (వెలి[1] + ఒనర్చు.) బహిష్కరించు, వెలివేయు.

సీ. ...కలఁవల చెలికాని వెలియొనర్చి ... నీలా. ౧. ౪౨.

వెలివాడ. వి. (వెలి[1] + వాడ.) చండాలవాటిక, మాలపల్లె.

సీ. వెలివాడఁ బనిక్రొత్త మలకడాల్గాని నూనెయిడి తండెడాకు గట్టెడు తహతహ... అము. ౪. ౪.

వ. అని విస్తృత నిమేషంబు గీలించి ముకుళిత పక్ష్మాంచలంబును జిహ్మ తరతరళతాతో దరంబునై నగు వీక్షణంబున నవ్వెలివాడ క్రీడావళి వీక్షించుచు. శివరాత్రి. ౩. ౩౬.

ద్వి. తవిలి యీ వెలివాడ తరిరాకుఁ బోండ్ల, మన్నించి సకల సామ్రాజ్య భోగములఁ, జెన్నొందు ...
ద్వి. హరిశ్చ. పూ. ౧౩౮౨. పం.

**వెలివాడచేడియ.** వి. (వెలివాడ + చేడియ.) చండాల స్త్రీ.

వ. ఇవ్విధంబునఁ బాడిన నవ్వెలివాడ చేడియల నిరుపమాన గాన విశేషంబులకుఁ బరితోషంబు నొంది హరిశ్చంద్ర ధరిత్రీ వల్లభుం డుల్లంబున సంతసిల్లి... హరిశ్చ. ౨. ౧౧౫.

**వెలివాఁడు.** వి. (వెలి¹ + వాఁడు.) చండాలుఁడు.

చ....మదిం, బసరొకింత లేక పెఱ ప్రాణులనుం బొరిగొంచు నెత్తు దుర్వ్యసనతఁ గూరియున్న వెలివాండ్రుర పల్లియఁ జేరి యయ్యెడన్. భార. శాం. ౩. ౨౫౪.

చ. నిలచినఁ గొంతసేపటికి నీలగళాపరమూర్తియైన య, య్యనఘుఁడు వానవృత్తి విడి యక్షులు విప్పి కనంగ నంత లోపలఁ దిరుగంగ మ్రొక్కి వెలివాఁడ మనుష్యుఁడ పెద్దయాఖ్యుఁడన్, ఖలుఁడను నన్ను శిష్యునిగఁ గైకొని వేగఁ గృతార్థుఁ జేయవే. చెన్న. ౫. ౨౧౭.

**వెలివాడవాఁడు.** వి. (వెలివాడ + వాఁడు.) చండాలుఁడు, మాలవాఁడు.

సీ. ప్రార్థింప నున్నాఁడు పాదాగ్రముల వ్రాలి వెలివాడవాఁడు తద్విప్రకులుని ... కాశీ. ౭. ౨౪౦.

**వెలివాఱు.** వి. (వెలి + పాఱు.) వేటాడెడి తావున బయట చుట్టు పాఱించెడు పోఁగు.

క. వెలివాఱును గాలరులును; వలలుఁ దెరలు దీమములును వడిఁ దీరిన కుక్కలు సారె గోలలును మందులత్రోవులు వేఁటకారడంబుఁ జెనుపఁగన్. ఉ. హరి. ౪. ౨౨.

**వెలివిడుచు.** స. క్రి. (వెలి¹ + విడుచు.) వ్యయపెట్టు, వెచ్చించు...

క. కలిమికిని దగిన కొలఁదిని, నెలవుగ వెలి విడుచకున్న నిలుపెక్కడిదొ, గలయఁ నిండిన చెఱువున, గలుఁగించుక లేక యున్న యాఁగని భంగిన్. ద్వా. ౨. ౧౫౬.

**వెలివిరియు = వెల్లివిరియు.** అ. క్రి. (వెలి¹ + విరియు.) ౧. బయలుపడు.

క. వెలు వెలుకఁ బాఱె దేహము, అలసత నడుపులను జెయ్యులందును దోఁచెన్, వెలివిరిసె నాభి జఠరము, కలకంఠికిఁ బొడవుదోఁచి కానఁగ వచ్చెన్.

వ. ...మూర్తి లజ్జావశం వదయై వెలివిరియంగా నీక ... ఆము. ౫. ౫౫.

ఉ. మానసంబులోపన పూనియుండి యిప్పటి నీ దుండగంబు వలనఁ గలిగి వెలివిరియ నిచ్చితి ... కళా. ౧. ౯౧.

౨. ఉబుకు.

ఉ. ...భీష్ము నందఱున్, బలిసి భవత్తనూజాలు మనంబులు నిండి ముదంబు పొమునన్, వెలివిరియంగ నేఁగిరి నవీన విభూతి నివాస భూమికిన్. భార. భీష్మ. ౩. ౨౭౫.

౩. పొంగు.

క. వెలివిరిసి వచ్చు జలనిధి, పొలుపునదోఁతెంచు ధర్మపుత్రుని బలుగో, ల్తల విలుపరింపనీ వొక, చెలియలికట్టవయి వమ్ముఁ జేకొను మిచటన్. భార. భీష్మ. ౩. ౨౪౪.

౪. వ్యాపించు.

క. ...భూమిలో వెలి, విరిసె నధర్మంబు రోగ
విధ్వంసకమై. దశకు. ౧౧. ౧౧౧.

**వెలివిసరు.** అ. క్రి. (వెలి¹ + విసరు.) ౧. పైకి ప్రసరించు.

క. ...విరిసెత్తా, వి సరంబులు దిగిచి వలపు వెలి
విసరంగన్. సారంగ. ౨. ౮౨.

(మోహము బయలుపడు అని యర్థాంతరము.)

గీ. ...వెలి విసరదయ్యె దైత్యేంద్ర విభుని
యూర్పు. దశా. ౪. ౨౪.

౨. బయలుపడు.

క. విరసము సెఱసాహసమున్, బొరిగొన సెట్లు
భయసైన్యములు పోరన్ ర,క్తరసతరసము
లుగదురఁగ, శరనిధి సత్త్వములు వెలివిసరి
రాఁ దొడఁగెన్. వేం. పంచ. ౪. ౧౪.

క. ఆచిత్ర ఫలక మెవ్వరు, చూచిన వెలివిసరి
యపుడు సుబ్బొదునది నీ, వే చూచుటేను
జూచుట, రో చంచలనయన యింతయు
నెఱుంగుదువే. ప్రభా. ౧. ౧౩౫.

**వెలివెలి.** విశ. పైపై, బాహ్యము.

('వెలి' యొక్క ఆమ్రేడిత రూపము.)

సీ. వెలివెలి వస్తువుల్ విడిచెఁబో నరుఁడు
గర్మిష్ఠతంగాద శరీరయాత్ర, నడపువాఁ
డది మోక్షణంబు గానేరదు శారీర సౌఖ్య
సంసక్తి వదలి,... భార. శాం. ౧. ౮౫.

**వెలివేయు.** స. క్రి. (వెలి¹ + వేయు.) బహిష్కరించు, సంఘమునుండి దూరముగాఁ జేయు.

ద్వి. వెంగలిగా మిమ్ము వెలివేసె నొకఁడు...
భల్లాణ. ౨. భా. (శ. ర.)

**వెలివోవు.** అ. క్రి. (వెలి¹+పోవు.) పైకిఁబోవు.

సీ. విభుమూర్తి యేమియు వెలివోవఁగానీక
తన కన్నుఁగవఁ ద్రావికొనఁగనిచ్చు ...
దశకు. ౪. ౯౪.

క. అనుటయు రెండవ పక్షం, బనిమిష వర
తప్పవెట్టి యర్థమును దగు,ల్కొనఁ దివి
యక వెలివో ని,చ్చునె బుధుఁ డూహించి
చేయు సుకవిత్వంబుల్. ప్రభా. ౨. ౫.

**వెలిసల్పు(లుపు).** స. క్రి. (వెలి¹ + సల్పు.) బయలుపఱుచు.

సీ. వెలిసల్పనీక యిచ్చెలువ మీ మాతా
మహుండు దాపంబున నునిచె ...
దశకు. ౮. ౮౫.

**వెలిసె.** వి. ఇంటి చూరు యొక్క లోపలి భాగము. (వా.)

**వెలు.** వి. వృత్తియందు 'వెలి' శబ్దమునకు వచ్చెడి యాదేశము.

ఉదా: వెలుపల, వెలువడు మొ.

**వెలుఁగారు.** అ. క్రి. (వెలుఁగు + ఆరు.) ప్రజ్వలించు.

క. ...వాసవపౌత్రుం, డా రూఢ తేజుఁడై
వెలుఁగారెను హుతవహ్ని క్రియ రణాంగణ
వేదిన్ ... భార. భీష్మ. ౨. ౧౩౬.

**వెలుఁగు.** అ. క్రి. ౧. ప్రకాశించు.

చ. ...శిఖాచయంబులన్, వెలిఁగెడి దానిఁ
గాంచి రరవింద నిభానన లమ్మహోదధిన్.
భార. ఆది. ౨. ౨౮.

గీ. గగనమున నుండి డిగ్గి సత్కార యుక్తి,
వెలిఁగె హిమపర్వతాంతర స్థలమునందు,
నిర్మలంబైన నిధిలోని నీడఁదోఁచు, నిందు
బింబంబులను బోలి బుషిగణంబు.
హరి. ౪. ౫౨.

గీ. వివిధ మాణిక్య దీపముల్ వెలుఁగుచుండ...
దశా. ౧. ౨౬౨.

౨. జ్వలించు, మండు,

ఆ. ...హవ్యవాహ తొంటియట్ల వెలుఁగఁగ,
వలయు గురుఁడు సూచి యొలమిఁబొంద.
మార్క. ౮. ౫౮.

౩. ఒప్పు, శోభిల్లు.

చ. అసదృశ తారమౌక్తిక సమంచిత నాయక
రత్నమై సమంజస రుచి పుంజమై తనకుచం
బుల మీఁద వెలుంగు హారమున్, బిసరుహ
హస్త పుచ్చుకొని పెట్టెఁ బ్రియంబునఁజేరి తే
నము, ప్రసవ శరాసనాయ యని పల్కుచు
భూపతి కంధరంబునన్.
కేయూర. ౪. ౧౩౭.

గీ. పుడమి తిలతండుల న్యాయమున వెలుంగ ...
మనుచ. ౨. ౮.

క. అని మఱియుఁ బెక్కుకోర్కులు, దనమది
వైకొనఁగ వెలఁది దరళోర్మ్ముల నాఁగిన
యట్ల యోర్చి చెలులం, గననీక వెలుంగు
చుండెఁ గన్నియ యంతన్.
కవిక. ౩. ౭౪.

౪. ప్రసిద్ధి కెక్కు.

ఆ. ...వీని వలనఁ గులము వెలుఁగునంచును పెద్ద,
జాహ్నవీ సుతుండు సంతసిల్లి.
భార. ఆది. ౫. ౧౫.

సీ. రాజరంజన రీతి రసికతా మహిమల సుమతియై
వెలుఁగంగ సుమతిగోరు ...
విక్ర. ౧. ౧౬౮.

౫. ప్రతిఫలించు.

వ. చందమామ గుటికలు గ్రోలు మందయానల
చెక్కుల వెలుంగు వలివెలుంగుం జూపి.
వసు. ౪. ౨౩.

౬. ఉద్రేకించు, విజృంభించు.

వ. హింసా కర్మంబులు వర్జించి కామక్రోధ
లోభమోహ మద మాత్సర్యంబులు వెలుఁగ
నీయక యత్యంత విరక్తుండవై కాంతాకా
రంబునఁ బ్రవర్తింపుము.
కుచేల. ౩. ౧౦౮.

వి. ౧. ప్రకాశము.

సీ. తన వెలుం గొగి నిరంజన దృష్టికి నె
లత్యమై యుండునయ్యు నింతంత కాదు...
ఆము. ౪. ౨౦౦.

౨. కిరణము,

క. అని యొడఁబడ బల్కుచుఁ దోడ్కొని
వచ్చినఁ బాన్పుఁ జేరి గురుకుచ దనపైఁ,
గనకనఁ గనలెడు వెలుఁగులఁ, గనికర మఱి
మండు చంద్రు గనికర మలుకన్.
మనుచ. ౩. ౩౫.

గీ. ... వే వెలుంగుల దొరజోడు రేవెలుంగు.
ఆము. ౧. ౧౭.

మ. తరుతం బ్రొద్దు వెలుంగు క్రొంబసిఁడి
నిద్రాచోపుడుం గట్టియున్ ...
చంద్రా. ౧. ౪౦.

౩. ఎండ.

గీ. నిడుద త్రాళ్లూని బయల నెప్పుడుఁ దిరు
గుచుఁ, బొసఁగ ముప్ప్రొద్దు ముద్వేసములఁ
జెలఁగుచు, వెలుఁగు లెల్లెడఁ గాచుచు నలరు
నిర్ల, వేఁటకాఁ డప్పు డెంతయుఁ దేటమీఱె.
అచ్చ. రా. అయో. ౪౨.

వెలుఁగుచు. స. క్రి. (√ వెలుఁగు. ఇది తగు
లుచు వంటిది.) వెలుఁగఁజేయు, ప్రకాశింపఁ
జేయు.

సీ. విలసితాంతర్జ్యోతి వెలిఁగించి తను వెల్లఁ
గయలోఁగాల్చి చిత్కళ వెలిఁగిచి ...
చెన్న. ౩. ౩౭౩.

వెలుఁగు(ల)దొర. వి. (వెలుఁగు + దొర.)
సూర్యుఁడు.

క. వికసించు తమ్మినుండు మ,ధుకరావళి వెడలె
వెలుఁగు దొరఁగనఁగాసా,ర కలావంతుఁడు
మునుగొం, చక్ర మింగ వెడల్చు నిసుప సరి
పెణ మనఁగన్. రా. వి. ౩. ౩౦.

వ. వేలుపు సామియో వెలుఁగుల దొరయో
జంట పాముల దంటయో యిట్లుంటగాక
మానిసులీ తేజు బూనుదురే యనందగియె.
అచ్చ. భా. ౪. ౬౧.

**వెలుఁగురా.** వి. (వెలుఁగు + రా.) సూర్యుఁడు.

గీ. కాని మతి యెందు నేనియుఁ గల్గనీక, నేల
యేలెను దగ్గయు నేర్పుమీఱ, వెలుఁగురా
వంగడపు పాల వెల్లినిండు, చలి వెలుంగ్గైన
యా రాచజడల మొకము.
అచ్చ. రా. బాల. ౪౭.

**వెలుఁగుల యిక్కు.** వి. (వెలుఁగులు + ఇక్కు.) సూర్యుఁడు.

గీ. సురల యాఁకటికూడు ప్రముచ్చులకుఁ గీడు,
రిక్కలకు ఱేఁడు వెలుఁగుల యిక్కజోడు...
కవిజ. ౩. ౭౫.

(వెలుఁగుల యిక్కజోడు = చంద్రుఁడు.)

**వెలుఁగులఱేఁడు.** వి. (వెలుఁగులు + ఱేఁడు.) సూర్యుఁడు.

మత్తకోకిల. మేరువాయన మానసోత్తర మే
వెలుంగుల ఱేనికిం,దేరుగాను లాట లాడఁగ
దిద్దఁ బెద్ద తనానకున్ ... కకు. ౧. ౧౧౪.

**వెలుఁగొందు.** అ. క్రి. (వెలుఁగు + ఒందు.)

౧. ప్రకాశించు.

చ. గరుడ పతాకతోఁడి రథకల్పన మెప్పుఁగఁ
జక్రమాదిగాఁ, బరగిన కైదువుల్ వితత
బాహువులన్ వెలుఁగొంద దివ్యతా, స్ఫురి
తశరీరుఁడై సకల భూత భయంకర విక్ర
ముండు పం,కరుహ దళేక్షణుం డడరెఁ
గంపముఁ బొందఁగ సర్వసైన్యముల్.
హరి. ఉ. ౨. ౨౧.

క. జలవసుధాంబర పవన, జ్వలనంబుల కంటెఁ
దానజస్రంబు వెలిన్, వెలుఁగొందు సాత్మ్య
యుండఁగ ... ఆము. ౩. ౬౫.

గీ. ...తన యసంబెల్ల కడల, వెలుఁగ వెలుఁ
గొందు నారాచ వేల్పుఱేఁడు.
నీలా. ౧. ౪౨.

౨. ప్రజ్వరిల్లు, మండు.

చ. అనలము గూఢ యత్నమున న య్యుదకుం
గొనివచ్చి దానిఁ జ,య్యన వెలుఁగొందఁ
జేయుటయు ...
భార. విరా. ౨. ౩౫౫.

తరళము. కలుముల న్వెలుఁగొంది యచ్చటి
కాఁపుఁ బెద్దలు తద్దయున్... నీలా. ౧. ౩౫.

**వెలుక.** వి. (వెలి³ + ఉక. స్వార్థమున) తెల్లన. ధవళవర్ణము.

చూ : వెలుకఁ బాఱు.

**వెలుకన.** విశే. (√ వెలుక.) తెల్లనిది, ధవళము.

క. అతని వదాన్యత్వము విన, మతిఁ బ్రియమగు
నేని వినుము మందారము సం,తతమును
సంతానము దా, నతనికి రాక వెలుకనై తల
వాంచెన్. ద్వా. ౧౧. ౧౧౨.

గీ. అష్టమదముల ఝరీ పూరితాద్రు లనఁగ,
మీఱు దంతులఁ దనదు సజ్జారమునకు,
రావుగా యను భీతినై రావతంబు, వెలుకనై
యుండె నప్పురిఁ దరమె పొగడ.
శ్రీరం. మా. ౧౦. ౫౫.

౨. తెలుపు, ధవళవర్ణము.

**వెలుకఁబాఱు.** అ. క్రి. (వెలుక + పాఱు.)

౧. తెల్లఁబడు.

క. మును మాయ మ్రింగి దనుజేంద్రుని యురము
వగిల్చికొనుచు దుర్భరగతి వీఁపున వెడలి
శక్తి యొగసెను, విను వీథికి నుడుగణంబు
వెలుకం బాఱన్. భార. ద్రో. ౫. ౨౩౨.

క. అలపొడుపు గట్టునగరున్, వెలువడు రాజా
నకు మ్రోల వేశ్యాసతి మెచ్చుల కుచ్చుఁబట్టి
వైచిన, వెలిపావడ యనఁగఁ దూర్పు
వెలుకం బాఱెన్. కువల. ౪. ౧౫.

సీ. తనుఁబాసి శశిదవ్వు చనిన నెవ్వగఁ బోలెఁ
దొలిదిక్కు జవరాలు వెలుకఁబాఱె ...
మనుచ. ౫. ౪౦.

౨. వెలవెలఁబోవు

సీ. ఉరుకీర్తి యగు మూర్తి యుదరంబులోఁ
జూలు నిలిచియుండుట మేను వెలుకఁ
బాఱె ... పి. శకుం. ౪. ౫౬.

చ. ఎరవుల సొమ్ము సత్యమగునే యని వెల్వెల
నయ్యె వహ్నినాఁ, బరిగళితద్యుతిన్ వెలుకఁ
బాఱె నిశాంత నిశాంత దీపముల్ ...
వేం. పంచ. ౪. ౨౮౭.

**వెలుగు.** వి. కంచె, పశువులు మున్నగునవి చొర
కుండ చేనిచుట్టును కంపచే నేర్పఱిచిన యావ
రణము.

గీ. వేయిచేతులిచ్చి వెట్టిఁజేసిన శూలి, బాణుఁ
జెఱుపఁ దలఁచి ఖండనంబు, గలుగఁ జేసె
నింక వెలుగుచే న్మేసినఁ గాచువార లెందుఁ
గలరె జగతి. ఉ. హరి. ౫. ౪౨.

సీ. చీమలు ప్రాలీద్వఁ జివికిన వెలుగుపట్టునఁ
బండి యొండి క్రుంగిన గునుకుల ...
ఆము. ౬. ౧౩.

(దీనిని శ. ర. నిర్బిందుకముగను, చి. ని.
సబిందుకముగను గ్రహించినవి. ఈ క్రింది
ప్రయోగములు సబిందుకములు.)

క. నలుదెసలం బొడవుగా నమర్చిన బలితంపు
ములు వెలుంగులం గరంబు జతనంబులై
యొప్పు పెనుదొడ్లన్.
హరి. పూ. ౫. ౧౪౨.

చ. ఘటకుఁడు పంపఁగా నరిగి కంప వెలుంగు
తలంగఁ ద్రోచి యుద్భటగతి బుద్ధిసారుఁ
డటు తారునఁ గర్కరికా ఫలాళిఁ జూఁపు
టయు ... శుక. ౩. ౪౨౩.

**వెలుచే(ల్చ).** వి. సర్పము, పాము.

చ. ...వెల్చల క్రియఁ గానరాని గడు లన్మ
యిమైఁ బెనఁచున్ ...
మనుచ. ౩. ౬౨. (శ. ర. పా.)

(... 'చిల్వల క్రియ'—ముద్రి. పా.)

**వెలుచు¹** = వెల్చు, వెలలుచు. స. క్రి.
(√ వెలి¹) త్రోలు.

క. నలి భగదత్తుఁడు గదుపుల, వెలుచు పసుల
వానియట్ల విలసద్గతి నబ్బలము సొగవ ...
భార. ద్రో. ౧. ౩౩౨.

చ. గెలిచిన వాఁడు నేఁడు రణకేళిఁ బురందరుఁ
దగ్గజేంద్రమున్, వెలిచినవాఁడు దేవతల
వెట్టికిఁ బట్టినవాఁడు దూర్జటిన్, విలిచిన
వాఁడు భక్తిమయ విత్తమునన్ ధరనేక
వీరుఁడై, నిలిచినవాఁడు శౌర్యమున నీ
జనకుండు భయం బిడేటికిన్.
ఉ. హర. ౫. ౭౭.

గీ. మడుఁగులకు నల్లదార్చుచు నడుగుగలుగు,
కొలఁదిఁ బట్టంగ నగునని వెలిచి వెలిచి ...
భా. రా. అర. ౨. ౫౧.

౨. వెడలఁజేయు, స్రవింపఁజేయు.

చ. వెలిచిన కన్నునీరు జడి వెచ్చని చన్నుల
మీఁది వేఁడియుఁ, దొలకరి ఘర్మతోయ
ములలోఁ గలసెన్... ఉ. హరి. ౫. ౧౧౨

3. బుజావుచేయు, స్థిరీకరించు.

క. ఇంత గొనిరొ నీతండని, వంతముగాఁ జెలిపి వాని పై వెలాక్షక తా, గ్రంతలు దూఱెడి పెనపరి, యంతకు నినుమడి ధనంబు నరువఁగ వలయున్. విజ్ఞా. 3. ౪౪.

౪. (నూలు) తోఁడు. (శ. ర.)

వెలుచు³ = వెలియు. అ. క్రి. వానకురిసి నిలుచు. (చి. ని., బ్రౌ.)

మ. ఎడ తెరిపనను లేక పెక్కు దినముల్ హేరాళ మై వర్షముల్, జడిగాఁ బట్టి తటాలనంగ వెలిచెన్ ... హర. ౨. ౨౫.

క. జడిగొన్న వాన నేనుం, దడిసితి నాలో నొకింత దడవున కా నె,వ్వడి సడలె నడఁగె నుఱుముల్, నిడిమించులు మాసె వెలుఁగు నిలిచెన్ వెలిచెన్. వేం. పంచ. 3. ౧౦౬.

సీ. ఆ దినములను వర్షాత్యయోచితముగా దళమైన వానలు వెలుచునంతఁ, బెల్లవాటిన యట్టి తెలుఁగున నావేళ దనమేళనం బెల్ల జనులు పొగడ ... ద్వా. ౩. ౭౩.

వెలుడు. అ. క్రి. వెలువడు, బయలువెడలు.

క. వెలి శుచిరై మఱి తీర్థం,బులు సొచ్చుట మేలు నియమములు దీర్చి తగన్, వెలుడిన యెడ దేవార్చన,ములు విప్రార్చనల వశ్యమును గృత్యంబుల్. భార. అను. ౫. ౧౭౫.

వెలుతురు = వెల్తురు. వి. (√ వెలుఁగు.) ౧. ప్రకాశము, వెలుఁగు.

సీ. వెలుతురీయుక జాలు విరిదేనియల సోన వదలక కురియు పెన్వానగాఁగ ... యయా. ౪. ౪.

గీ. ...వెలయఁ బగలయ్యెఁ జీఁకటి వెలుతురయ్యె, నడవి యిల్లయ్యె సుఖమెంత తోడరు నొక్కు. గంధ. ౧. ౧౪౪.

౨. ఎండ.

క. వెలుతు రసలంటి యెండియు ... ఆము. ౪. ౧౭౨.

వెలుప(ల్ప)ల. వి. జా. (వెలి¹ + పల.) బహిఃప్రదేశము, బయలు.

క. ఈ పగిది మొసలి సలిలము, లోపలికిన్ దిగువఁ దా వెలుపలికిఁ దిగువన్, బాపనిఁ గొంతదడవు మే,నా పుత్రిక తిగిచి తిగిచి నాఁటిన వగలన్. వరాహ. ౬. ౨౭.

గీ. ...ఇమ్మహాతీర్థములు పార్వతీశ్వరునకు, విహరణ స్థానములు వేద విశ్రుతములు, వెలుపలను లోపలను నుండుఁ దలిరుబోఁడి. కాశీ. ౨. ౧౧౭.

సీ. ఆ యింటి గృహిణి నాయకుఁడు భుజించిన పసిఁడి పళ్లెరము వెల్పలికిఁ దెచ్చి, వెలచుచో ... పరమ. ౪. ౧౭౬.

విశ. వెలియైనది, బాహ్యము.

క. ఈతఁడు దా వెలుపలరై, రోతెలుఁగున నైనవారి రోపడఁచిపరా,భూతులఁ జేయుదు నని ప్ర,ఖ్యాత జవహయాధిరూఢుఁడై పురి వెడలెన్. కళా. ౭. ౧౫౪.

వెలుపలనుండు = బహిష్ఠయగు, ఋతుమతి యగు.

(వ్యవ.) ఆమె నిన్ననే వెలుపల నున్నది.

వెలుప(ల్ప)లించు. స. క్రి. (√ వెలుపల.) వెలిపఱుచు. (శ. ర.)

వెలుపించు. స. క్రి. (√ వెలుపు.) వెలుపుచేయు, వెడలుపించు.

ఉ. పెట్టను బట్టి పెక్కు వెలుపించి కనంబడు నట్టుగాఁగ నట్టిట్టొక రెండు మాఱులు పయిన్ సురటింబలెఁ జేతఁ ద్రిప్పుచున్ ...
సారంగ. ౧. ౧౨౬.

వెలుపు[1]. వి. వెడలుపు, విస్తారము.

తరువోజ. వెలఁదు నిట్టూర్పుల వెస నుచ్చలించు, వెలుపునఁ గలుగు సెవ్వేఁగు చందోయి ...
కు. సం. ౫. ౫౭౭.

సీ. చెలరేఁగి వలరాచ వెలుపుల పెనుకతల్ వినిపించినప్పు డూకొనెడి దారి ...
కువల. ౫. ౩౫.

చ. పరిణత గంధశాలి వన పంక్తులు గంధవహాను ధూత బంధురకణి శంఖులై వెలుపు దూకొనఁజాలు నిజాలవాల సుందరవిక చారుణోత్పల వితాన నవ ప్రమదాలి మాలికా, సురుచిర గీత మాధురికిఁ జొక్కి తలల్ గదలించెనో యనన్.
శ్రీరం. ౪. ౧౦౧౪.

విశే. వెడలుపైనది, విస్తృతము.

ద్వి. వెలిసె వానలు గాడ్పు విడిచెప్పె నెండ, విరవిరనై కాసె వెలుపరెస్సె దెసలు ...
ద్వి. భాగ. ౨. ౩౨.

వెలుపు[2]. వి. (√ వెలఁచు[2]) వానకురిసి నిలుచుట, (వాన) వెలియుట.

వ. ఎడవెలుపు లేని పూఁదేనియ జడిం దోఁగియ సమకాల పర్జన్య కాలకంఠ మత్తిల్లి నృత్తంబు సేయు మత్తకేకి కేకల కోడు భుజంగ కుటుంబంబులును. కేయూర. ౪. ౫౦.

వ. ఇవ్విధంబున నిరువదియొక్క వాసరంబులు వెలుపులేక పాము ద్రేలఁ గట్టినభంగి ... ఁగురిసి యిరువది రెండవ దివసంబున.
హరి. ౨. ౨౩.

వెల్లుప్పుట. వి. తూలు తోడుట.

గీ. తంతు ధిస్సరణంబుగఁ దనరుచుండు వెలుపు డన ...
ఆం. భా. ౨. ౨౭౬.

వెలుమనూళ్లు. వి. బ. తెలిక జాతిలో నొక భేదము.

(ఈ జాతిలోని భేదాంతరములు: పత్తిపాలు, నరియూళ్లు, కుముడాళ్లు, వట్టూళ్లు, పోవండ్లు. స్రావకులు, ఉంద్రూళ్లు, అనుమగొండ్లు, అడ్డనూళ్లు.

వెలుములు. వి. బ. భూషణములు.

ఉ. ధీ నిరవద్య హృద్య నిరతిన్ హరితో భరితో త్సవంబులన్, బూను కడాని బొమ్మ కలుముల్ వెలుముల్ గల ముద్దుగుమ్మ సన్మానిమనోవిహారిణి రమారమణీ మణి భూరిసూరి సన్మానముఁ గూర్చుఁగాత గరిమన్ నెఱి మంజుల మైన మత్కృతిన్.
కృ. శంకు. పీఠి. ౧. ౨.

గీ. చెవుల వెలుములు కుబుద్రొంత చెవులనాగు, పడిగె ప్రోగులు మెలిగొన్న పచ్చపడములు, నమర గుమిగూడి జాలరు లరుగుదెంచి, రలరు మొగములతోఁ ద్రాటి వలలుఁ గొనుచు.
వేం. పంచ. ౧. ౬౦౩.

వెలువడము. వి. సస్యవిశేషము.

ద్వి. వెలువడం బుడివోయె వెఱఁగయ్యె వరగ ... విష్ణు. పూ. ౩. అ. (శ. ర.)

బ. ధాన్య విశేషము.

సీ. మంది గంద్రలు నాగ మల్లెలు తీఁగెమల్లెలు కృష్ణనీలాలు వెలువడాలు ...
హంస. ౪. ౧౨౭.

వెలువడు. అ. క్రి. (వెలి[1] + పడు.) (వృత్తి ని వర్ణ వికారము.) ౧. బయలుపడు, బయటికివచ్చు.

క. నలుఁ దొల్లి యాక్రమించిన, కలి కర్కోటక విషంబు గ్రక్కుచు నొడలన్, వెలువడి వలునకు విహితాంజలియై తన్నెఱుఁగఁ జెప్పెఁ జంచలుఁ డగుచున్.

భార. అర. ౨. ౧౪౫.

క. విలసిల్లుచు నుండఁగ మ్రుచ్చిలిపట్టి కుమారు నోరఁ జీర దుతిమి పెంగలులగు క్రూరులు గొందఱు, వెలువడఁ గొని పోయి యొక్క విపినములోనన్. భార. ద్రో. ౨. ౧౫౨.

ఆ. వేల్పుగట్టు గవుల వెలువడి వడదేఱఁ, జదలు వాఁక నీట జలకమాడి... పారి. ౪. ౪౪.

౨. వెడలు, బయలుదేరు.

క. నలుఁడును ధరణీ రాజ్యము, దలఁగఁగ సర్వంబు నపహృతంబైనఁ గడుం, దలరి దమయంతిఁ దోడ్కొని, వెలువడియె నశేష రాజ్య విభవచ్యుతుఁడై.

భార. అర. ౨. ౬౪.

చ. అలఘు వినూత్నరత్న కనకాంచిత భూషణ దీప్తులొప్పఁగా, వెలువడె నున్మదద్విరద బృందము ... విక్ర. ౪. ౫౧.

గీ. తప్పదిది యని వారలు తమనివాస, మొరు లెఱుఁగకుండ వెలువడి యరిగిరంత ...

కళా. ౬. ౧౨౪.

౩. తొలఁగు, అపసరిల్లు.

చ. ...మిత్రు నతుల రోచిర్జ్వల వసుఁజేయ మిత్ర వసు సంపదకైన ఘనావరోధమున్, వెలువడఁ జేయ నేర్తు మణీ విపణీతపనీయ రాశి పేశల రుచి కోటికోటి విలసద్ధ్వజకోటిఁ బురీకిరాటకుల్. వసు. ౧. ౫౫.

**వెలువరించు = వెల్వరించు.** స. క్రి. (√ వెలువడు.) ౧. వెడలఁగొట్టు, వెలువడఁజేయు.

ఆ. వృద్ధు కొడుకు పలుకు విని క్రూరుడై పాప, బుద్ధిఁజేసి మిమ్ము భూతలంబు, వెలువరించి రాజ్య విభవంబుగొని యిప్డు, డలుక పెడి సుచిత్తుఁ డయ్యెనొక్కొ.

భార. అర. ౧. ౨౦౫.

వ. వానిం బట్టి కట్టింపు మొండె నెద్దు పట్టింపుము గాకున్న నరణ్యంబులు సొర వెలువరింపు.

హరి. పూ. ౬. ౧౨౪.

౨. బయలుదేఱఁదీయు.

గీ. ...ప్రొద్దు వొడవక ముందర పురజనప్రయుతముగాఁ బురి వెలువరించితిఁ గడంగి.

భార. మౌ. ౨౦౦.

౩. బయలు పఱచు. వెలువడఁ జేయు.

వ. ఒక్కింతసేపు పలుకు వెలువరింపఁ జాలక యూరకుండి యెట్టకేల. కెలుంగు దెచ్చుకొని. భార. కల్య. ౨. ౧౦.

సీ. కటివార్త వెడలి యంతట దైత్య కాంతల కలవరింతలు వింత వెలువరించె ...

సమీర. ౩. ౪౬.

౪. పోఁగొట్టు, తొలఁగించు.

సీ. ...పరమ దైన్యమున కోర్చి కొలిచి మాత్స్యుని పాలనున్న దుఃఖంబును ద్రోహులఁ గనుపుఁగొట్టి, వెలువరించెదనని తలఁచి కృష్ణుని నిశ్చయం బూఁది ధర్మం బయగుటఁ దెలిసి...

భార. శాం. ౧. ౧౨౦.

**వెలువఱచు.** స. క్రి. (√ వెలువడు.) వెలువరించు. (శ. ర.)

**వెలువెలుక.** వి. (వెలుక + వెలుక.) మిక్కిలి తెల్లన, అధిక ధావళ్యము.

చూ; వెలు వెలుకఁ బాఱు.

**వెలువెలుకఁబాఱు = వెల్వెలుకఁబాఱు.**

అ. క్రి. (వెలువెలుక + పాఱు.) మిక్కిలి తెల్లనగు.

క. వెలువెలుకఁ బాఱె దేహము, అలసత నడు
పులను జెయ్యులందును దోఁచెన్, వెలివిరిసె
నాభి జఠరము, కలకంఠికిఁ బొడవు దోఁచి
కానఁగ వచ్చెన్. రుక్మాం. ౧. ౧౪౧.

వెల్కఁబాఱు = వెలుకఁబాఱు. అ. క్రి. తెల్లబడు.

గీ. అనిమిషుల దృష్టి మిఱుమిట్లు గొనఁగ
భుజగపతియుఁ గూర్మంబు సంకట పడఁగఁ
దరణి, కిరణములు వెల్కఁబాఱ దిక్కరులు
బెదర, నొప్పె న త్త్రాలితాఁకు మహోగ్ర
మగుచు. భార. శల్య. ౨. ౨౫౫.

ద్వి. అమృతాన్న రుచిలోన నడఁగక వెలికి,
గమనించెనన దేహకళ వెల్కఁబాఱె.
రం. రా. బా. ౧౭. పా. ౨౪. పం.
(శ. ర. పా.)

వెల్కిలు = వెలికిలు. అ. క్రి. వీఁపు క్రిందగు.

ద్వి. హా తాత హా మామ యనుచు మోచేతు,
లూఁతగా వెనుకకు నొఱఁగి వెల్కిలను,
బడి పొఱుకొని గుండె బలువిడినడిచి,
పడె... నవ. 3. ౨౧౭. పా. ౨. పం.

వెల్గ = వెలఁగ. వి. కపిత్థము. *.

చ. ఒక శుకియుండు నత్తరువు నొద్దన చిక్కని
వెల్గమాని యం,దు ...కేయూర. ౪. ౬౨.

సీ. పులిచింత మోచుగు ములుమోదుగును వెల్గ
పుల్ల వెలఁగ వెత్తి బిల్లచిల్ల... హంస. ౪. ౧౧.

వెల్గు = వెలుఁగు. అ. క్రి. ప్రకాశించు.

గీ. అతి మహత్త్వంబుచే వెల్గు నట్టిశక్తినలరు...
అము. 3. ౭౨.

దండకము....మీ తెల్విలో లోని వెల్గుం గనుం
గొంచు... నీలా. ౨. ౪౧.

వెల్గొందు = వెలుఁగొందు. అ. క్రి. (వెల్గు + ఒందు.) ప్రకాశించు.

మ... సమున్నిత మై యోగి మనోనురాగ పదమై
వెల్గొందు నీ దేహము ...
భాగ. ౪. ౧౫౧.

వెల్గొడుగు. వి. (వెలి² + గొడుగు.) శ్వేతచ్ఛత్రము.

మ. ధనువుం గేతువుఁ ద్రుంచి సారథి నిరథ్య
వ్రాతముం గూల్చి యేఁపునఁ బాంచాల
తనూజు వెల్గొడుగు సొంపుం జంపి
గావించి... భార. ద్రో. ౫. ౧౩౦.

వెల్చు = వెలుచు. స. క్రి. ౧. తోలు.

చ. విరటుని గోవులన్ మరల వెల్చి ముదంబున
నీదు తమ్మునిన్, బొరిగొనఁ బార్థుఁ డాఁక
కటపోయితి నాఁడు ...
భార. కర్ణ. ౨. ౭౨.

గీ. దక్షునల్లుండ్ర మెడల సూత్రములు గట్టి
యూపములు సూత్రములతోడ నుద్దిచేసి,
దామెనలు గూర్చి నడిపించె దరతరంబ,
వీరభద్రుండు పశువుల వెల్చునట్లు.
కాశీ. 3. ౭౭.

ఉ. అడ్డము వచ్చి వేల్పు పురి యాఁగెడు మమ్మిటు
లావరించి మా, యొడ్డనముల్ దెరల్చి హరి
యుద్ధతి జూపిన గొల్ల వెల్చినన్, దొడ్డికిఁ
బాఱు నా పసులతో సరిరై పురిఁబాసి
యాంధ్రడనున్, బిడ్డల వెంటఁబెట్టుకొని ఖేటిలి
చేరితి ముఱ్ఱిక్రిందటన్.
ఉ. రా. ౨. ౨౨౧.

౨. వెడలించు.

ఉ. తేరటు దోలి యడ్డపడి తీవ్రశరంబుల నబ్జ
లంబు దు,ర్వార రయంబు మాన్చి పశు
వర్గము నిద్దఱ వెల్చెనార్చుచున్ ...
భార. విరా. ౫. ౭౭.

3. (నూలు) తోఁడు.

సీ. నేలయు నింగియుఁ దాలములూయింప ...
నేలఁ దెమ్మండిచే వెల్వ ...
కు. సం. ౨. ౧౩౫.

వె_ల్తి = వెలితి. వి. న్యూనత, కొఱఁత.

ఉ. దేవర సుప్రసాద శుభదృష్టి సుధా విర
సంబు నాపయిన్, వావిరి వెల్లిగొల్పితి మనం
బున కింకొక వె_ల్తిగల్గునే, దేవకులేశ్వరయీనను
మదీయ మనీష నితాంతభ_క్తి నే, త్రోవల
నెమ్మెయిం దొలఁగఁ ద్రొక్క_క నిన్ను
భజింపఁజేయవే. హరి. ఉ. ౫. ౨౫౧.

గీ. అసుర విభుఁజూచి మునినాథుఁ డాట విడిచి,
వెడలెనని వె_ల్తిరాకుండఁ బుడమి కేఁడు,
తెలిసిగద గొన్న రిపుశ_క్తి దిగిచివైచి, మఱి
యొఱఁగి క్రమ్మఱందేటి యురకనిలిచి.
కకు. ౨. ౧౪౭.

విశ. న్యూనము, తక్కు_వైనది.

గీ. కేవలము మంచినడక్కైనఁ గీసవె_ల్తి, రెండు
జాములు నిటనూరకుండ నేల ...
భీమ. 3. ౪౬.

ఉ. తామసవృ_త్తి లేదు సతతంబును నుగ్రుఁడు
గాఁడు పౌరుషం, బేమియు వె_ల్తిగాదు...
పారి. పీఠి. ౨.

వె_ల్తిసేయు. స. క్రి. (వె_ల్తి + చేయు.) తక్కు_వ
పఱచు.

సీ. విక్రమాధికతను వె_ల్తిసేయుటె కాదు వా
క్ప్రౌఢిఁ గేరుఁ బార్వతీకుమారు ...
చెన్న. పీఠి. ౭౫.

వెల్తురు = వెలుతురు. వి. ప్రకాశము.

సీ. చినుకు వెల్తురు మబ్బుచే నడ్డపాటింత
వోకార్చు కేరాచ కేకయనఁగ ...
రా. వి. ౪, ౧౧౭.

వెల్పట్టు. వి. (వెలి[1] + పట్టు.) పై భాగము,
బయలు.

ఉ. చుట్టి బిగించిపట్టి పురసూదన యీ గర
ళాగ్నిఁ గంధరా, ఘట్టమునందు నిల్పు
మదిగాక దిగంబడ నిచ్చితేని లో,బట్టున
నున్న లోకముల భస్మము సేయు వెలార్చి
తేని వె,ల్పట్టున నున్న లోకముల భస్మము
సేయు నిజంబు చెప్పితిన్. భీమ. ౪. ౬౭.

వెల్పు. వి. తెల్లఁదనము.

చ. తమమను నీలవర్ణ పరిధానము వీడఁగఁ
బూర్వ శైల శృంగములను నున్నత స్తన
యుగంబు దనర్ప చకోర బంధు వర్గము
ముదమొందఁగా నిజముఖ ద్యుతి వెల్పుగ
నింపు గర్భ చి,హ్నము లభిరామమయ్యె...
కు. సం. ౨. ౧౦౫.

వెల్పెట్టు. స. క్రి. (వెలి[1] + పెట్టు.) అవమా
నించు.

క. మనరాజు విదూషకుఁ గాని, మన మేఖల
మోసపుచ్చె మనమిపుడా భా,పని మాఱు
సేత యిదిరోయిక, పనియే వెల్పెట్టవలద
పార్థివ తిలకున్. కేయూర. ౪. ౧౬౫.

వెల్మిడి = వెలిమిడి. వి. ౧. విభూతి.

సీ. కాళరాత్రి స్తనాగ్ర కృతావకాశమై
యురము వెల్మిడి పూఁతయొప్ప వెనుప ...
పాండు. ౫. ౧౩౬.

౨. బూడిద, భస్మము.

చ. విలయ కృశానుకీలముల వేఁడిమి బోఁడిమి
మాలి వెల్మిడిన్, గలసిన భూతధాత్రి ...
మనుచ. ౨. ౧౦.

చ....ఓకిలిం,తలు పొడనూపె వెల్మిడిఁ దినన్
మనసయ్యెఁ బయోజ గంధికిన్.
హై. శకుం. 3. ౫౩.

వెల్ల. విశే. (సం. వలక్షః) తెల్లనిది, ధవళము.

మ... అందఱు విహారాపేక్షులై డిగ్గి రయ్యము
నా భూమికి వెండి వెల్లిసుకపెల్లై యున్న
మార్గంబునన్. హరి. పూ. ౬. ౮౫.

(కర్మధారయంబున నిగాగమంబు వైకల్పికము.)

(సముద్ర వర్ణనము.)

సీ. రాజశేఖరుని గారాబంపుఁ బూఁబోఁట
విపులామహాదేవి వెల్లచేల ...
చిత్ర. భా. ౫. ౫.

వి. సున్నము.

ద్వి. మల్లెమొగ్గల వైవ మదనుని వేఁడి, వెల్లఁ
గాఁజేసితి బెల్లంబుగాదె ...
జస. పు. ౬. ౨౪౬.

వెల్లఁకి. వి. గడ్డ, దుంప.

(ఇది వేరు శబ్దపూర్వకముగానే ప్రయోగములఁ గానవచ్చుచున్నది.)

ఉ. పాయక వేరు వెల్లఁకియుఁ బండులు
నొండులు గూరగాయలుం, గోయుచు ...
కు. సం. ౬. ౬౮౨.

సీ. వేరు వెల్లఁకి కాయగూర బండని కోరకుద
రాగ్ని గాడ్పుచే నుజ్జగించు ...
పాండు. ౨. ౨౮.

ద్వి. వినుమాకు నలమును వేరు వెల్లంకి, దిని
యొడి వానినే దేవర యంద్రు ...
రం. రా. యు. ౨౮౬. పా. ౮. పం.

చ. ఒసఁగిన నిక్కుమారు లవి యొల్లక పల్కిరి
మాకుఁ గాయలుం, గసురులు వేళ్లు వెల్లఁ
కులుఁ గాక సముజ్జ్వల భూషణంబులుం,
బసిఁడియు సేల ... నిర్వ. ౧౦. ౧౨౨.

వెల్లఁదనము. ౧. తెల్లదనము, వెలవెలపాటు.

ఉ. యామవతీ కళత్రు నుదయావసరంబున
కంటెఁ బాండిమ, శ్రీ మునుఁ దోఁచెఁ
దూర్పుదెస సిద్ధము కృష్ణుఁడు పారిజాత
మున్, భామినికై హరించునని వాయని
నెవ్వగ నింద్రరాజ్య లక్ష్మి ముఖమండలం
బున నసించిన వెల్లదనంబు వైవడిన్.
పారి. ౨. ౩౪.

సీ. దైన్యంబు తలపోఁతఁ దలకొన్నఁ జెలువ
కాననమున వెల్లఁదనంబు గదిరె ...
భార. విరా. ౨. ౧౦౬.

క. ఉల్లము గలఁగఁగ మొగమున, వెల్లదనం
బొలయఁ దాల్మి వీడంగఁ గడున్, దల్లడ
మందుచు ... భా. రా. అయో. ౬౮.

సీ. తళుకుఁ జెక్కులు వెల్లఁదనము మెల్లనఁ
దాల్చెఁ గనరాని కటమరల్ పెనుపు
నొందె ... .౧౧దా ౧. ౮౮.

౨. స్వచ్ఛత, నిర్మలత్వము.

ఉ. చల్లని సౌమ్యదృష్టియుఁ బ్రసాదము మాధు
రియున్ వివేకమున్, వెల్లఁదనంబు మౌగ్ధ్యశీ
మును నిర్మలినత్వముఁ జూడవచ్చినన్ ...
భీమ. ౨. ౧౩౪.

చ. తిరముగ జైత్రయాత్ర చనుదెంచిన నిన్
గని యాకుభృత్తు ని,ర్ఝరములఁ బాద్య
మిచ్చి రవి సంజ్వలితార్కమణీ విభా పరం,
పరల నివాళిసేసి వనభవ్య శుకాది విహంగ
మోక్తి జై,ఖరి నుతిసల్పెడిన్ రజతకాంతుల
వెల్లఁదనంబుఁ జూపుచున్.
ఉ. రా. ౩. ౬౪.

౩. దైన్యము.

క. తలగొఱిగి విడిచిపెట్టిన, దులుపుకొనుచు
వెల్లఁదనము దుఃఖము సిగ్గున్, గలపఁగ
బీరము లావును, బోలిపోయి విదర్భరాజ
పుత్త్రుఁడు మరలెన్. పద్మ. ౧౦. ౩౪.

**వెల్లఁబాటు.** వి. (వెల్ల + పాటు.) తెల్లనగుట.

ఆ. దళలు తుదకు వచ్చి తలలల్ల నల్లన, వణఁక వణఁక నపుడు వార్ధకంబు, తేటపడు విభాతి దీపంబులకు మేనఁ, బలితమనఁగ వెల్లఁబాటు తోఁచె. కవిక. ౪. ౧౫౬.

**వెల్లఁబాఱు.** అ. క్రి. (వెల్ల + పాఱు.) తెల్లపడు, వెలవెలఁబోవు.

మ. నడుమొయ్యొయ్యనినఁ దోరమయ్యెఁ దనరెన్ నాభీతలం బంగముల్, జడనొందెన్ బలిసెం గుచద్వయము వెల్లంబాఱె మైదీఁగ యుఁగ్గడుజై కోర్కులు మూఁగె వస్తువులపైఁ గన్గోనలం దంద్ర యొక్కుడు దోఁచెం గమనీయ బాహ్యదపరిశోభం బునం బార్తికిన్. హరి. ఉ. ౩. ౧౫౦.

శా. లేవే భోజనమేటికొల్ల విటు లేవే మేన బల్సొమ్ము లీ, వేవిం బూనవు వెల్లఁబాఱె మొగ మేమీ రాజుతో నల్గినా,వో వామాక్షిరో యంచు నర్మరస గర్భోక్తుల్ చెలుల్ పల్కఁగా, వేవిళ్లం బొరలెన్ లతాంగి పతికిన్ వేడ్కల్ కొనల్ సాగఁగన్. సారంగ. ౧. ౩౪.

ఆ. అంత విజయపాలుఁ డతిభీత చిత్తుఁడై, వెల్లఁబాఱు పెటిఁగి భల్లుకంబు ... విక్ర. ౩. ౧౦౦.

**వెల్లగజము.** మి. వి. (వెల్ల + గజము.) ఐరావతము.

సీ. దివిజేంద్ర వజ్రముద్రిక డాలొరసె వెల్లగజము సిందూరంపుఁ గటములందు ... సమీర. ౧. ౬౩.

**వెల్లగిసె.** వి. (వెల్ల + అగిసె.) ఒకవిధమగు పైరు.

సీ. గోధుమ పెదనువ్వు కుఱునువ్వు తెలినువ్వు కుసుమ వెల్లగిసెయు గోగు జనుము ... హంస. ౪. ౧౨౩.

**వెల్లగుముదు.** వి. (వెల్ల + గుముదు.) ఒకవిధమైన ఓకు.

చూ: గుముదు.

**వెల్లగౌరు.** వి. (వెల్ల + గౌరు.) ఐరావతము, తెల్లని యేనుఁగు.

సీ. వింటి తెర్వరి మేటి వెల్లగౌరును నిక్కు చెవుల నీలని నెక్కు చెలఁగు వెల్ల ... ఉ. రా. ౫. ౨౦౫.

గీ. విజయలక్ష్మీ సమేతుఁడై వెల్లగౌరు, నెక్కి అమర విభుఁడు ... దశా. ౨. ౪౪౩.

**వెల్లచేఱపు.** వి. (వెల్ల + చఱపు.) సన్నపుఁ బూఁత. (శ. ర.)

**వెల్లజిగిపుల్గు.** వి. (వెల్ల + జిగి + పుల్గు.) హంస, శ్వేతగరుత్తు.

మ. అని ప్రార్థించు దివాటకోటిఁ గని యావా యెంత కార్యంబు వ,చ్చె నిలింపాగ్రణి కంచు ధాత కరుణాస్నిగ్ధాత్ముఁడై లేచి కొ,ల్వున నున్నందఱుఁ గొల్వ వెల్లజిగి పుల్గుం దేజిపై నెక్కి గ్రక్కున లం కాపురి కేఁగెఁ జారణముఖుల్ గైవారముల్ సేయఁ గన్. ఉ. రా. ౫. ౧౨.

**వెల్లయేనుఁగు.** వి. (వెల్ల + ఏనుఁగు. వృత్తినివర్ణాగమము.) ఐరావతము, తెల్లనియేనుఁగు.

గీ. వెల్లయేనుఁగు నెక్కి శ్రీవెల్ల మెఱయు... వచ్చె, నమరనాయకుఁ గాంచి ... దశా. ౨. ౧౫.

**వెల్లదీవి.** వి. (వెల్ల + దీవి.) శ్వేతదీపము.

గీ. ... వెల్లదీవియుఁ బోని యవ్వీడుసొచ్చి. అము. ౬. ౫౪.

**వెల్లన.** వి. తెలుపు, ధావళ్యము, వెలవెలఁబాటు, వివర్ణత.

చూ: వెల్లనగు.

**వెల్లనగు.** అ. క్రి. (వెల్లన + అగు.) తెల్లనగు, తెల్లపడు, వెలవెలఁ బోవు.

సీ....వేల్పురాయని తేజి వెల్లనయ్యె ...
ఉ. రా. ౧. ౬౭.

క. తల్లడపడి యరదముడిగి, విల్లును నమ్ములును విడిచి వెల్లనగుచు మే,నెల్లఁ జెమర్పఁగ నూర్పులు, పెల్లుగ నమ్మనుజ పశువు పెలుచం బలిచెన్. భార. అర. ౬. ౨౪౪.

గీ. వెల్లనై యున్న నత్తెఱంగెల్ల నెఱిఁగి, రాచ చిన్నెలు సడలించి రఘువుకొలపు, సామి వెలివార చీరలు జడలుఁదాల్చి, తపసి రూపూని యచటికిఁ దరలివచ్చి.
అచ్చ. రా. అయో. ౫౭.

(దీని ఆమ్రేడితరూపము వెల్లవెల్లవ.)

వ....వాహినులు చిక్కువడి చిందఱవందలై మతచెడి మల్లామడియై యేపుదెగి యవురు సవురై యనువు దప్పి యదవదయై యంతంత విచ్చి యరవరలై పోలులేక పలపలనై వెఱఁగుపడి వెల్లవెల్లనై చిదుముడిపడి చెల్లాచెదరై పొడవడంగి ప్రోవున నొక్కండై పోవిడిచి ... ఉ. హరి. ౧. ౧౪౭.

వెల్లమొదవు. వి. (వెల్ల + మొదవు.) తెల్లని యావు, కామధేనువు.

ఉ....క్షీరోదధిఁ బోలు వెల్లమొదవొక్కటి గన్పడఁజూచి మొక్కుచున్.
ఉ. రా. ౩. ౩౭౭.

వెల్లయెలుక. వి. (వెల్ల + ఎలుక.) తెల్లయెలుక.
గీ. ఉడుము గరిమిడి కొక్కుదండడియు వెల్ల, యెలుక కల్లెక్కు తలచును నేమిచెప్ప ...
మనుచ. ౪. ౨౫.

వెల్లవారువము. వి. (వెల్ల + వారువము.) ఉచ్చైశ్శ్రవము, వెలిమావు.

గీ. ... పొడమె, వెలవారువ మాపాల వెల్లి యందు. దశ. ౨. ౨౨౬.

వెల్లవాఱు. అ. క్రి. (వెల్ల + పాఱు.) వెల్లనగు, వెలవెలఁబోవు.

క. జిచ్చువడి వెల్లవాఱుచు, ముచ్చ ముడిఁగి మూర్ఛ తన్ను ముంచికొనంగా, వచ్చిన ధైర్యం బూఁతగ, నచ్చేడియ నిల్చుటప్పు డద్భుతమయ్యెన్. కేయూర. ౪. ౧౭౭.

వెల్లవేయు. అ. క్రి. (వెల్ల + వేయు.) (గోడలకు) సున్నముపూయు.

(వ్యవ.) వారి క్రొత్తయింటికి వెల్ల వేసినారు.

వెల్లవోవు. అ. క్రి. (వెల్ల + పోవు.) తెల్లపడు.
ద్వి. వెల్లవోవని పండు వెదురులు చూచి.
ద్వి. పరమ. ౨. ౬౬. పా.

వెల్లాటకత్తి(త్తె)య. వి. (వెల్లాటకము + కత్తియ.) ౧. వేశ్య.

గీ. మునుపు నే దాని కొసఁగిన కనకపాత్ర, తెచ్చితివి దేవదేవికిఁ దిరుగనిమ్ము, ఎందు వెల్లాట కత్తియ కిచ్చినట్టి, సొమ్ము మగుడంగఁ గొనుటయే సుగుడితనము.
విప్ర. ౫. ౮౭.

౨. జార స్త్రీ.

గీ. నీ జనని పుణ్యాజన వర్ణనీయ సాధ్వి,నీ జనకుఁ డెన్న నభిమాన నియత ధనుఁడు, నీ నగరు పోతుటీఁగకు నిలువరాని, దయ్యు వెల్లాట కత్తెవీ కాటయరిది. శుక. ౧. ౩౧౬.

వెల్లాటకము. వి. (వెల్ల + ఆటకము.) ప్రసిద్ధి.
గీ. సంభవించిరి గంధర్వజాతి ననినఁ, గలితనం బేల వెల్లాటకంబు సేయ... భీమ. ౧. ౭౭.
(శ. ర. పా. 'పెన్నాటకము' ముద్రి. పా).

వెల్లాపుఁగత్తె. వి. స్వైరిణి.

శా. ...ఘునాళుల్ మింట వర్తిల్లఁగా, దూపించున్ జెలఁగున్ దళుక్కునఁ దటిత్తుల్

దోఁచినట్టులై వెల్లాపున్ గత్తె చరింపుచున్
సురభి మల్లా ... మల్లభూ. ౨. ౭౪.

**వెల్లి**1 = వెల్లిక. వి. (త. వెళ్లం. ౧. ప్రవాహము.

క. అని యూరడిల్లఁ బలికిన, విని యాతఁడు
సంతసంబు వెల్లిం దేలెన్ ...
భార. శాం. ౧. ౨౬౨.

సీ. కల్పాంతవేళ నేకటకంబు మునుఁగదు
నింగితోఁ రాయు మున్నీటి వెల్లి ...
కాశీ. 3. ౧03.

క. అల్లారు బెల్లమై గలు, గల్లన నందియలు
మొరయఁగా వేడుకఁ బెన్, వెల్ల మునిఁగించె
ధరణీ, వల్లభనందనుఁడు చూచు వారల
చూడ్కుల్. రాజన. ౨. ౫.

౨. పరంపర.

క. కవిసినఁ గడంగి యేనును, గవియించితి నంప
వెల్లిఁ గడుఁ గ్రూరత ...
భార. ఉద్యో. ౪. 3౪౨.

ఆ. కదలి యాకసంబు పుడమియుఁ దఱుచుగ,
నంప వెల్లి పొడువఁ బొంపు మీఱి, యంధ
కుండు గొండ యల్లుఁడుఁ దార్కొని,
యదరునట్లు ప్రేటులాడు నెడల.
అచ్చ. రా. యు. 3౪౭.

వెల్లిఁ గలిపిన చింతపండు = ప్రవాహములోఁ
గలిపిన చింతపండు; నిష్ఫలము.

గీ. మాటిమాటికిఁ జేసిన మందులెల్లఁ, జెల్లెఁ
బోవెల్లిఁ గలిపిన చింతపండు, నీట వ్రాసిన
వ్రాలునై నెరయ వఱదఁ, బోవు గాకేమి
నెత్తురు పుట్టనేల. కాశీ. 3. ౧౧౧.

**వెల్లి**2. వి. (క. బెల్లి. త. వెళ్లి.) తెలుపు, శుక్ల
వర్ణము.

—విణ. తెల్లనిది, ధవళము, శుక్లము.
చూ: వెల్లిమెకము.

**వెల్లిఁజల్లు.** స. క్రి. (వెల్లిన్1 + చల్లు.) చెఱుచు,
పాడుచేయు.

వ. తల్లిమాట యించుకంతయు విననొల్లక
ప్రల్లదులై యెల్లధనంబు వెల్లిఁజల్లి బంధు
జనంబులు నిందింప నాతతాయులై చిత్త
విభ్రాంతిం దిరుగుచు. జాహ్నవి. 3. ౧౨.

**వెల్లిఁబోవు.** అ. క్రి. (వెల్లిన్ + పోవు.) వ్యర్థ
మగు, నిష్ఫలమగు.

సీ. పార్వతీపతిచేతఁ బడసిన దివ్యాస్త్ర భూరి
సంపద వెల్లిఁ బోయెనన్న ...
ఉ. హరి. ౪. 300.

సీ. మానక గుప్పించు మదన కోదండంబు
నిష్ఠురతను దన్ను నేలఁ గలయ, నెప్పుడు
జంకించు హ్యాజ్జాత శింజిని గారవంబునఁ
దన్ను గాలిఁబోవ, నూరక విరఁబడు మార
నారాచంబు దుండగంబునఁ దన్ను ధూళిఁ
గలయ, పనిలేని పని మిట్టిపడు మనోజ
పతాక ప్రల్లదంబునఁ దన్ను వెల్లిఁబోవ.
వరాహ. ౪. ౨౧.

(ప్రవాహమునఁ బడిపోవునని యర్థాంతరము.)

**వెల్లిక** = వెల్లి1. వి. ప్రవాహము.

శా. ఆ జాబిల్లి వెలుంగు వెల్లికలఁడాయన్ లేక
రాకానిశా, రాజశ్రీ సఖమైన మోమునఁ
బటాగ్రం బొత్తి యొగ్గెత్తి యా, రాజీవానన
యేడ్చె ... వసు. ౪. ౫౨.

**వెల్లికిలు.** అ. క్రి. వీఁపుక్రిందగు.

మ. తరుణీరత్న మొకర్తు వెల్లికిల నీఁదన్ గుబ్బ
చన్ బిందియల్, గరమొప్పెన్ ...
3శా. ౨. ౧౨౧.

**వెల్లిగొను.** అ. క్రి. (వెల్లి[1] + కొను.) ౧. ప్రవహించు.

ఉ. ఆ లలితస్మితాస్య లలితామల కోమల చంచలాల సాం,లోల నిశాల సంస్ఫురిత లోచన దృష్టిరస ప్రవాహమం, దోలిన పర్వి వెల్లిగొని యొక్కటఁ గ్రక్కున ముంచి...
కు. సం. ౫. ౫౧౩.

మ. ...హరిపే,రుర మగ్రోద్ధతిఁ జేరి నెత్తురులు సర్వోర్వీ నభోవిక్రతిన్, పరిమాణావాహంబుల నెల్ల వెల్లిగొనఁ బైపైఁ జల్లి ప్రేవుం బొదుల్ గర మాటోపముతో నతండు పొరి నాశ క్షీరాబ్ధి వర్షించుచున్. హరి. పూ. ౮. ౩౪.

శా. ఆమోదాశ్రు భరంబు వెల్లిగొన ...
నైష. ౫. ౧౩౪.

౨. వ్యాపించు, పచరించు.

గీ. శిరసు మకుటంబు సొగిఁ జిత్తరువు గొలుప, గల్లములఁ గుండలద్యుతి వెల్లిగొనఁగఁ, గలికి తెలిసొగ కన్నులఁ గరుణ చిలుక, జన వరుని ప్రోల శౌరి సాక్షాత్కరించె.
కవిక. ౬. ౧౭౦.

౩. పరంపరగా వెడలు.

ఉ. జింగను ప్రోఁత ప్రోఁగుచును జెక్కుల పాములువోలె శౌరిచే, సింగిణి వింట వెల్లిగొను చిత్రశరంబులు నూతునొంచి ...
పారి. ౫. ౧౬.

ఉ. పిల్లను నమ్మహారవము పేర్చి సరోజభవాండ భాండముల్, చిల్లులువోఁ బ్రచండ గతి సేన ధరాస్థలి యీనెనో యన, వ్వెల్లిగొనంగ నేర్పుతోఁచి నిర్భయతన్ నడిపించె...
రాజ. చ. ౨. ౪౧.

౪. మునుఁగు, మగ్నమగు.

సీ. పుష్కలావర్త కాంభోధరంబులవృష్టి విశ్వ ప్రపంచంబు వెల్లిగొనగ ...
శివరాత్రి. ౧. ౫౧.

౫. అతిశయించు.

క. తల్లియుఁ దండ్రియు బ్రమదము, వెల్లిగొనఁగఁ గౌఁగిలించి వేదీవల లీనుల్లమలర ... హరి. పూ. ౪. ౬౩.

**వెల్లిగొలు(ల్పు)పు.** స. క్రి. (వెల్లిగొను.) ౧. ప్రవహింపఁజేయు.

గీ. ఇట్లు శత్రుం తపునిఁ ద్రుంచి యివ్విధమున, నొక్కఁ డొక్కఁడ తలపడు టుడుపఁ దలఁచి, వివిధ బాణపరంపర వెల్లిగొలిపె...
భార. విరా. ౫. ౪౭.

ఉ. ప్రాచిన యొక్కపోఁక నును బోదియఁ జేరి విలోకనప్రభా, వీచికలం దదీయ పదవీ కలశాంబుధి వెల్లిగొల్పుచున్ ...
మనుచ. ౨. ౨౭.

౨. పరంపరగా వెడలించు.

సీ. సాత్యకి యత్యుగ్ర శరంబుల విందాను విందుల వెసఁ బరి వితతతనులఁ, జేయంగ నతనిపై నా యనంతీశులు వివిధాస్త్ర జాలంబు వెల్లిగొలిపి, విలుద్రెవ్వ రథహయంబులు నొవ్వ సారథి దలరఁ బ్రస్ఫుటశక్తి కలనఁజూప ... హరి. ఉ. ౨. ౫౧.

శా. ...పౌలస్త్యుఁడున్, భల్లంబుల్ వడి వెల్లిగొల్పి సమర ప్రారంభవేల్ల ద్ధను, ర్వల్లీ జ్యాఘన నాదమే దుర నభో రంధ్రంబుగా ... భా. రా. యు. ౧౮౭౦.

౩. వ్యాపింపఁ జేయు.

సీ. కొమరు జెన్నెల వెల్లిగొలుపు కట్టాణి పేరు, త్రికముల గంఠమాలికలు వైచి ...
వరాహ. ౩. ౧౧౧.

వ. మరాళంబులు....శోదోంతరం బంతయు నెంతయుం గలయ మలయు తను యమ లంపుఁ జెలిదళుకుఁ జిలికి యది తులయ జంపుఁ గలయంపి చెలువ నలవరింప నందుఁ గుందనంపు రంగవల్లి కామతల్లి కల యుల్లాసంబు వెల్లిగొలుపు గురుదంత కాంతి వల్లరుల చేత నతిశయిల్లుచు ... ప్రభా. ౨. ౧౦౫.

అ. క్రి. ఆనందము సేయు.

గీ. ఉల్లమునకును జాడ్యక్కి వెల్లిగొలుపు, నా వరదు మోమునందు మనంబుఁ జేర్చు, ననుచు గీత రూపములుగా నాశుకవిత, నుతుల రచియించి పాడుచు నతఁడు కొలిచె. కళా. ౨. ౧౮౪.

**వెల్లితల.** వి. (వెల్లి[1] + తల.) ప్రవాహ పురోభాగము, ప్రవాహమునకు ముందటి భాగము.

గీ. గ్రామ నికటంబు గాక దూరంబు గాక, చాటి పార గాక చిట్టూట చోటు గాక, వెల్లితలగాక క్రీఁ జెదల్ వేరుపురువు, రాత్రి పోటును లేని చాటాటి నేల. విప్ర. ౨. ౧౭.

**వెల్లిదొట్టు.** అ. క్రి. (వెల్లి[1] + తొట్టు.) అతిశయించు.

ఉ. ఎవ్వరమాట మమ్మెఱుఁగ నీదు యథార్థకథత స్వరూపమై, యెవ్వఁడు వోట విన్నెఱుఁగ నీదను భావ్యతఁ దోఁచిరైయనఁ దా, వెవ్వడి బాటఁ దన్నెఱుఁగ నీదు ధ్రువంబ వెల్లిదొట్టు నీ, ద్రెవ్వని మాయలో మునిఁగి తేలెడు మూలముగామె యీశ్వరా. కవిక. ౬. ౧౭౨.

**వెల్లిపొడుచు.** అ. క్రి. (వెల్లి + పొడుచు.) ౧. ప్రవహించు.

సీ. గంగ యాతని మఖాగారంబుపై వెల్లి వొడిచినదల్లి యద్భుత తపస్వి,యగున మ్మహాత్ముఁ డయ్యమర తరంగిణిఁ గనుఁగొని ... హరి. పూ. ౩. ౯౦.

(సువర్ణముఖరి) వ. భిల్ల వల్లభుల పల్లియలపై వెల్లివొడిచినం దల్లడపడి. కాళ. ౧. ౧౮౨.

౨. ఉప్పొంగు.

వ. పొంగి చింతాసాగరంబు వేగిరంబ వెల్లి వొడిచె ననన్. మనుచ. ౩. ౯.

**వెల్లిమెకము.** వి. (వెల్లి + మెకము) సింహము.

ఉ. వచ్చి యిదేమి చెప్ప కిటు వచ్చితి వప్పుడు కాలు పోతులోఁ, బొచ్చెపు బొల్లివెల్లి మెకముల్ దమ బెబ్బులిఁ గూడి గూడెముల్, సొచ్చితినంగ జెంచులాక చొప్పున నూర్గురు వోయిరన్న వాఁ, డచ్చెరుపాటు సిగ్గు నొలయన్ వినుచుం దల వ్రేల వైచినన్. కకు. ౪. ౫౯.

**వెల్లివడు.** అ. క్రి. (వెల్లి[1] + పడు.) ప్రవాహముగు.

శా. ... కన్నీరు మున్నీరై వెల్లివడంగఁ గాలికునిలో నింపాపుమన్ గూరిమిన్. వేం. పంచ. ౧. ౨౫౫.

**వెల్లివాఱు.** అ. క్రి. (వెల్లి[1] + పాఱు.) ఎడతెగక ప్రవహించు, అతిశయించు.

గీ. పాడి దప్పిరి నృపతులు ఇలుసుఁ గొండె, మడఁగె దాలిమి మాత్సర్య మతిశయిల్లెఁ, జెల్లె దయ పాతకంబులు వెల్లివాఱె, గ్రమ్మె దుర్వ్యసనంబులు దిమ్ము రేఁగె. వరాహ. ౭. ౩౧.

క. సమదాక్షీ మానసంచారమునఁ దొలంకుచును ముఖ సరస్సున లావణ్యము వెల్లి వాఱఁ గ్రేవల, నమరించిన పిల్లకొలఁకు లంగన వీనుల్. కళా. ౩. ౧౨౭.

**వెల్లివిరి.** విశే. (√ వెల్లి[1].) వెల్లడియైనది, ప్రకటితము.

క. జలతైల బిందువయి నా, వెలఁకువ వెల్లివిరి
యైన మేలగునే నిర్మల చరితుఁ డయిన
వాణుం, డలుగఁడే ప్రాణముల కింత యప
రాధమునన్. ఉ. హరి ౫. ౧౯౭.
(వీరేశ. పా.)

గీ. వెల్లి విరిగాఁగ భూజను లెల్ల నెఱుఁగ ...
దశకు. ౬. ౭౨.

క. ముల్లోకంబుల జనములు, కోల్లన్ కోకండ్లఁ
బాడ కోయక మఱియున్, వెల్లివిరి గాఁగఁ
దిరిగిన, గల్లకు నయగారి వెలఁతుకం గాని
పోయెన్. వరాహ. ౮. ౨౨.

వెల్లివిరియు. అ. క్రి. (వెల్లి[1] + విరియు.) ౧. ప్రవహించు.

క. ...మదీయ మార్గము, వెంటంగా నభ్రగంగ
వెల్లివిరియుటన్. హర. ౪. ౫౮.

గీ. పిడుగువడ్డ తెఱంగునఁ బుడమిఁ ద్రెళ్లి, సొమ్మ
గాని కొంతవడికి లోనుమ్మలికల, వెచ్చ
నూర్పుచుఁ దెప్పిరి వెల్లివిరియ, వేఁడి
కన్నీరు గానగోళ్లఁ దోఁడుకొనుచు.
అచ్చ. రా. యు. ౩౬౦.

౨. ఉప్పొంగు.

గీ. పెరిఁగి పాండవాంబుధి వెల్లి విరిసినపుడు,
నిలువ నిమ్మగు దీవిగా నిన్నుఁ దలఁచి ...
భార. భీష్మ. ౧. ౫౩.
(ప్రవహించు అని శ. ర.)

వ. ...ఆనంద ప్రవాహంబుల్లంబున వెల్లివిరిసిన
కతంబున ... కాశీ. ౧. ౧౦౦.

౩. వ్యాపించు.

సీ. చనుకట్టు విప్పఁ జొట్టును ఘన స్తన కాంతి
జల్లించి యురముపై వెల్లివిరియు ...
వైజ. ౧. ౧౩౧.

చ. ... అచ్చెరువుగఁ బోయి వెల్లివిరిసెం గపి
వాహిని లంకచుట్టునున్.
భా. రా. యు. ౪౯౫.

వ. జగదండ కర్పరంబునఁ గుంటువడి మగుడు
వేగం బడరఁ బుడమికి డిగి నలుగడల వెల్లి
విరిసి పెల్లగుచుం జాలుకొని యిద్దరులు నేరు
పడునుద్ద విడి నేఱుబడి వెడలి ...
చం. రా. ౩. ౨౫.

౪. వెల్లడి యగు, ప్రకటిత మగు.

ఆ. నీకడింది లావు నే నెఱుంగనె వాలి,
తోఁకఁ జుట్టి కడలిఁ ద్రోయుటయును,
జెఱను బెట్టి వేయి చేతుల రేకి మీఁదు,
విడుచుటయును జగము వెల్లివిరిసె.
అచ్చ. రా. యు. ౫౦౦.

౫. వృద్ధిపొందు, అతిశయించు.

వ. ఇట్టి మా యావులున్న చోట సత్యంబు
మాలఁబడి కల్ల వెల్లివిరియుఁ బింగళకుం
డును మదోత్కటంబు వడువునఁగు మంత్రి
మంత్రయంత్రంబునం దగులు వాఁడుగాఁడే.
వేం. పంచ. ౧. ౫౩౦.

౬. చెదరిపోవు.

వ. ...జీవనంబులు విడిచి విమల జ్ఞానవశంబున
ముక్తులగు పురుష రత్నంబుల చెన్నున
నన్ను వదలి మిన్ను విడిచి వాయువశం
బులై వెల్లివిరిసి చను మేఘంబులును ...
భాగ. ౧౦. పూ. ౮౬౪.

వెల్లిలిరిసేయు. స. క్రి. (వెల్లివిరి + చేయు.) ప్రకటించు.

క. వనితల పురుషుల యెడఁ బుట్టిన యది వెల్లి
విరిసేఁత డిమ్మరితన మెట్టి నికృష్టం
బైనను ... భార. శాం. ౬. ౨౦౭.

వ. కంఠగత ప్రాణంబు అగు జంతువులకుం
గాలకంఠుండు గరుణా వశంవదుండై

కర్ణోపకంఠంబుఁ జేరి యుపదేశించు తారక బ్రహ్మ మంత్రరాజంబు మంతనంబున విని యెఱుంగుటం జేసి మధు మదోల్లాసంబున నది వెల్లివిరిసేయుచున్న వియోగయువ నిందిందిరంబులు మంద్ర స్వరంబున ఝుంకారంబు సేయు. కాశీ. ౨. ౪౪.

గీ. ప్రౌఢ గోపాంగనలు తమ ప్రాఁతవలపు, వెల్లివిరిఁజేసి రిందిరావల్లభునకు ...
జై. భా. ౩. ౭౬.

వెల్లివీఁగు. అ. క్రి. (వెల్లి[1] + వీఁగు.) అతిశయించు, మిక్కుటమగు.

ఉ. ఆ సమయంబునన్ మదనుఁ డగ్గలికం గళికా ముఖంబులై, భాసిలు తూపులన్ హృదయ పద్మము లక్ష్యము సేసి యేసినన్, గాసిలి కోకిలుండు తమకంబునఁ దన్ గను పన్న చేసి యుల్లాసము వెల్లివీఁగ సఖులన్ నిలువ న్నిముమించి క్రక్కుచున్.
కృ. శకుం. ౨. ౧౨౪.

వెల్లిసూపు. అ. క్రి. (వెల్లి[1] + చూపు.) ప్రవహించు.

క. హరగిరి జల మనమున నత్యురరాగ రసంబు నిండి యుత్కటమై తత్పురి మీఁద వెల్లి సూపిన, పరుసునఁ గాశ్మీర వారి పొరలఁ గప్పెన్.
కు. సం. ౯. ౨౫౫.

వెల్లుల్లి. వి. (వెల్ల + ఉల్లి.) తెల్ల ఉల్లిగడ్డ, లశునము.

సీ. పగిలి బీటలువాఱి తగ డెత్తెఁ గుబుసంబు తోరంపు వెల్లుల్లి తునుకలట్లు. ...
భీమ. ౪. ౧౩౦.

సీ. ఉటజాంగణమునఁ గాపునిచిరి తవుటితో వెల్లుల్లి పొగయిచ్చి వీతిహోత్రు. ...
పి. శకుం. ౪. ౬౨.

వెల్లువ. వి. ౧. ప్రవాహము.

క. ...అతఁ డతని యరదము, మునుఁగంగాఁ జేసె బాణముల వెల్లువలన్.

క. ఆ వెల్లువ శరజిహ్వలఁ, ద్రావి ధనంజయు మహాగ్ని దరికొని కవియం,గా తెగడొందెడు కురుబల, దావము శాంతనవుఁ డంబుదము క్రియఁ గాచెన్.
భార. భీష్మ. ౨. ౪౪, ౪౫.

సీ. అమృతంబు వెల్లువయని నిలింపాదులు మునుకొని దోసిళ్ల ముంచిక్రోల. ...ఇట్టులంబుగ వెన్నెల నిట్ల వొడిచె. విక్ర. ౬. ౬౯.

చ. ఉడుగక తేరు చన్న దెస నూనిన చూడ్కులఁ గన్నెలంకులన్, విడువక పాఱు నశ్రువుల వెల్లువ లూఱట లేని యూర్పులున్...గలిగి కుందెడు జానకిఁ గాంచి కూరిమిన్.
ఉ. రా. ౬. ౩౦౯.

౨. వాహిని, సేన.

చ. అలఘుమతిన్ మహా వనచరావళి డెబ్బది రెండు వెల్లువల్, గొలువఁగ నేగి వారినిధిఁ గొండల చేతను గట్టి లంకపై,బలువిడి సేనతో విడిసి బాహుపరాక్రములైన దైత్యులంగల హములోఁ గులక్షయముగా నొనరించె మహానుభావుఁడై. వి. పు. ౫. ౩౨౫.

ఉ. కొమ్మ మెకంపు వెల్లువలు గొల్వఁగ వేగిర మేఁగుదెంచి సంద్రమ్ము కడన్ దగన్విడిసి రావణు తమ్ముఁడు జేరవచ్చినన్, రమ్మని...
యయా. ౩. ౨౮.

౩. పరంపర.

క. బకలు వడి యసురబలములు, పొడవడఁగ న్విభుని బాణముల వెల్లువలన్ ...
కవిక. ౨. ౨౦౭.

సీ. చెక్కుటద్దములందు జిగి వెల్లువలు చిందు
రమణీయమణి కుండలములతోడ ...
మనుచ. 3. ౭౧.

౪. బృందము, మంద.

క. ఉల్లములు గలఁగి మొదవుల, వెల్లువలన్నియును లేచి విచ్చలవిడితో, వెల్లా చెదరై పాఱెను, బెల్లుగనంజే యటంచు బెబ్బులి గాలిన్. భాగ. ౯. 3౮.

౫. ఇటిక గోడల యింటిచూరు. (శ.ర., వా.)

వెల్లువగట్టు = వెల్లువపెట్టు. అ. క్రి. (వెల్లువ+కట్టు.) ౧. ధారారూపముగా స్రవించు.

సీ. కలయ వెల్లువగట్టి జలజల ప్రవహించు శశికాంతవాంత నిర్ఝరము జలము ...
మనుచ. ౫. 3౯.

ఉ. ... చెక్కులన్, వెల్లువ గట్ట నశ్రువులు వెల్వెలఁ బోవ మొగంబు ...
దశా. ౫. ౧౨౯.

౨. మడుఁగు కట్టు.

సీ. నీళ్లు వెల్లువగట్ట నికటాగ్రహార ధరా సురుల్ నారికేరములు గొట్ట ... శుక. 3. ౪3౯.

చ. వికచ సరోజ మధ్యమున వెల్లువగట్టు మరంద బృందముల్, ప్రకట వినోదకేళి నొక పంకజగంధి విదిల్చె ... భాను. ౨. ౬౦.

వెల్లువపెట్టు = వెల్లువకట్టు. అ. క్రి. ధారారూపముగా స్రవించు.

చ. కనఁ గలిగె న్విలాసములు కమ్మని చక్కెర ల్లొల్కు పల్కులున్, వినఁగలిగెన్ సుధారసము వెల్లువ పెట్టెడు మోవియాన నింపున నును చెక్కుటద్దములు ముద్దుగొనన్ ...
దశా. ౨. 3౦౯.

వెల్లెకి. వి. వృక్షవిశేషము, ఒకానొక చెట్టు.

వెల్లెడ్లు. వి. బ. (వెల్ల + ఎడ్లు.) తెల్లని యాఁడు పశువులు. (మేకలు, గొఱ్ఱెలు, మొ. ఈ యర్థము ప్రాచీన శాసనములందే కానవచ్చుచున్నది. చూ. ఎడ్డు.)

చేబ్రోలు. శా. ...5 ... వెలనాంటి గొంకయ శ్రీ మూలస్థాన మహాదేవరకు మాఘమాసమున పున్నమయు సుక్రవారమున సోమగ్రహణ నిమిత్తమున నఖణ్డవత్తిన్ దివియ యొక్కొంటికిం బెట్టిన వెల్లెడ్ల యెంభదియు ఇనిమిత్తమునన వీర శ్రీ కుమారస్వామి దేవరకు నఖణ్డవత్తిన్ దివియలు రెంటికిం బెట్టిన వెల్లెడ్లు నూఱును వీరం జేకొని ...
ద. శా. ౯. ౧౦౯.

1. స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౦౭3 ణ్డగు నేంటి ఉత్తరాయణ సంక్రాన్తి నాండు ఱొంప్పి చెఱ్వుల ప్రోలినాయకు కొడుకు మల్లినాయకు ముదిసెలిచేతన్న 2. బోయుణ్డు తమతల్లి దంఁడ్రులకు ధర్మ్మువుగా కొట్యదొన త్రిభువన మల్ల శ్రీ కేశవదేవరకు అఖణ్డ దీపమునకు బెట్టిన వెల్లెడ్లు ఏంభ్భయేను పెద్ద నన్నె బోయిని కొడుకు పిన్న నన్నె వీనిం జేకొని ...
ద. శా. ౬. కొణిదెన. 636-(2.)

వెల్వ. వి. సంఖ్యావిశేషము ? ఒకానొక లెక్క ?

చ. మలయ నగంబు నుండి పలుమాఱును రాముని బేరుకొంచు వె.ల్వలు దళసంఖ్య దన్నుఁ గొలువంగ రణోచిత ఘోరవాక్యముల్, సలుపుచు నార్భటంబుల దిశావలయంబులు దల్లడిల్లఁగాఁ, జెలఁగుచు వచ్చె నప్పుడు సుషేణుఁడు భాను సుతుండు మెచ్చఁగన్. సీతావి. ౨. 3౨.

వెల్వాడము = వెలువడము. వి. సస్యవిశేషము.

సీ. బడఁతి విన్నంటి వెల్వాడము కోర్కి ఫలించె నన రాజభోగమే యఱికయిల్లు ...
రసిక. ౧. ౪౯.

**వెల్వడు = వెలువడు.** అ. క్రి. ౧. (క) నిర్గమించు, బయలుపడు, బయటపడు.

సీ.... అతిక్రమింప, కుండగం బోక యుట్లాడం గూడు నిస్వానభవన మెప్పాట వెల్వడంగం బోలు. భార. ఆది. ౧. ౧౧౪.

సీ. వారిపూరంబు వెల్వడి వచ్చి రుద్రుండు యజ్ఞకోలాహలం బాలకించి ... వరాహ. ౭. ౩౫.

చ. ఉవిద తదుక్తికింత చెవి యొగ్గక పోం బెనంగ న్విభుండు కేల్దవిలిచి చుట్టి నించుక యెడన్ భుజముల్ వలగొల్పి పొమ్మనన్, సుభదన వెల్వడం దిరుగ శ్రోణి భుజస్తన వేణి కాధర, శ్రవణ కపోలముల్ పతిని సారెకు సోంకు చుం దేల్చె నింపులన్. ప్రభా. ౫. ౪౧.

(చ.) బయటకు వచ్చు.

ఉ. విప్రకులుండ వెల్వడుము వేగమ నీవును నీ నిషాదియున్ ... భార. ఆది. ౨. ౬౩.

చ. అనుపమ దివ్య శస్త్రధరులైన యమర్త్యుల కాహవంబులో, మొనయక కాలకేయులు సముద్రముం జొచ్చి దివంబులెల్ల న,వ్వనధి నడంగి యుండి బలవంతులు వెల్వడి రాత్రులెల్ల భూ,జనులకు బాధసేయుచు భృశంబుగ నుండిరి క్రూరచిత్తులై. భార. అర. ౩. ౫.

చ. ఇలుకలనైన వెల్వడని యీలువుటాండ్రకుం దాంపికత్తెనై ... ఆము. ౫. ౭౦.

౨. బయలుదేఱు, వెడలు.

మ.... వరవైతాళిక వందిబృంద జయ జీవస్వార శబ్దంబులున్, వరశై పేర్చి చెలంగ వెల్వడియె సంప్రీతి న్నిజావాసమున్. హరి. ఉ. ౪. ౧౧౭.

మ. కలుచం గోశ బిలంబు వెల్వడి యుదః ఖడ్గాహిపై వచ్చుచో ... నైష. ౫. ౧౫౭.

సీ. విడుంచని పీడు వెల్వడి వచ్చి ఖాండిక్యుం డారాజుం గనుంగొని గారవమున ... ఆము. ౩. ౬౦.

౩. గాంభీర్యము విడుచు.

క. బలవంతుండుం బగవాండును, ఖలుండనంగాం జాలువాండుం గపటోక్తులం దాం, గలయుంగ వచ్చిన వెల్వడి, కలపికొనిర యేనిం గీడు గాకుండ దిలన్. కేయూర. ౩. ౭.

**వెల్వరించు = వెలువరించు, వెలువఱుచు.**
స. క్రి. ౧. వెలువడంజేయు, బయలుపడంజేయు. (ఒక శాసనమునందు శకటరేఫ యుక్తముగా గానవచ్చుచున్నది.)

ఉ. నిగ్రహమేది నన్ను ధరణీ వరరూపము వెల్వరించు నాండు ... భార. ఆది. ౩. ౧౬౦.

గీ. ఒక్కండడుగొత్తి గొరక వేయుచును దాంచి, నట్టిరిగి బెంకింగని వీంకం బట్టుటయును, మృగయు లందఱుం జని వెల్వరించి నిశిత, కాండములం జెండి రొక పెద్ద కాఱుపోతు. మనుచ. ౪. ౪౫.

౨. బయలుదేఱంజేయు.

ను.... వేడ్క నన్ను వెలువొందవన్ బ్రీతిం గైనేసి యం,త నిజావాసము వెల్వరించిన నరేంద్రా వచ్చి నే నిచ్చటన్. మార్క. ౫. ౧౫౧.

౩. బయటికిం బోంజేయు, వెడల నడంచు.

పంచచామరము. ఇనీ యినీ మొగంబు సూడ కిల్లు వెల్వరించినన్, వెసన్విసింగి పోవు సిగ్గు వీసమంత లేదు నీ, దెసం బసల్ ఘటించె దేర త్రిమ్మరీ మటిట్లు వచ్చి సారె సారె నన్నుం గెర్లం జేయ రాక పొమ్మికన్. విప్ర. ౪. ౫౫.

మధ్యాహ్న్ర...గలతాన పతులును రాజు పట్టంబు గట్టిన పతియు నలియం బయ్యార్యల వెల్వతించిన నశ్వమేధంబు ఫలంబు...
యుద్ధ. బెజ. శాని.

వెల్వాఱ(ఱు)చు=వెలువఱుచు. స. క్రి. వెలువడఁజేయు, బయలుపఱుచు.

సీ....ఎన్ని నేర్పులనైనఁ బట్టదీగంటి వెల్వాఱ చుటకును, గీ. దడవు మల్లాడ మీకింకఁ దగదు ..
పరమ. ౫. ౨౩.

వెల్వుచ్చు=వెలిపుచ్చు. స. క్రి. (వెలి + పుచ్చు.) బయలు సేయు.

ఉ. వచ్చి తదీయ మందిరము వర్తనలెల్ల నెఱింగి యక్కటా, సచ్చరితంబు గల్గు సతి చాడ్పున ముద్దతికంబు చూపుచు, న్మ్రుచ్చిలి రాత్రు లీ జరభి మూఁడుజగంబులు మ్రింగుచుండె, వెల్వుచ్చుక యున్న నా కొడుకు బోఁదఁ డెఱుంగునె దీని చెయ్దముల్.
కేయూర ౩. ౨౨౩.

వెల్వెల = వెలవెల.
చూ: వెల్వెలఁబాఱు.

వెల్వెలఁజేయు. స. క్రి. (వెల్వెల + చేయు.) వెలవెలఁ బోవఁజేయు, తెల్లఁబోవఁజేయు.

చ. విటిగినఁ జూచి నిశ్వాఁగు వెల్వెలఁజేయఁగ కుత్స్థుఁ డేటు నేమఱక యిదేమొకో కులిశ మంత్రము తప్ప గొడంగినాఁడనో...
కకు. ౫. ౧౩౦.

వెల్వెలఁబాఱు. అ. క్రి. (వెల్వెల + పాఱు.) ౧. వెలవెలఁ బోవు, వివర్ణమగు.

సీ. అని యుల్లసము దోఁప నాడు మాటలకు వెల్వెలఁ బాఱుచును దైత్యవిభు తనూజ, కలఁగి రహస్య భంగ భయంబుచేతఁ బ్రత్యుత్తరం బేమియుఁ దోఁపకునికి, నిట్టటు గ్రుక్కుచున్నట్టి లా గరసి ... ప్రభా. ౫. ౩౩.

సీ. ప్రాలేయ కిరణ బింబంబు వెల్వెలఁబాఱి యస్తాచలంబుపై నత్తమిల్ల ...
కాశీ. ౧. ౧౨౨.

మ. ...మోము వెల్వెలఁ బాఱన్ దనుఁగన్న తండ్రి గని పల్కెం బల్కు దొట్రిల్లఁగన్.
ఉ. రా. ౧. ౧౯౧.

౨. తెల్లపడు, వెల్లనగు.

ఉ. ... ముచ్చట నూనె నల్ల చను ముక్కులు వెల్వెలఁబాఱు చెక్కులున్.
ఉ. హరి. ౪. ౯.

మ. ఇనుఁ డస్తాద్రికిఁ బోవఁ గొల్లగొని నేఁడే తేర నద్రిస్థితిం, జన సంబంధజ బాంధవంబున రతి క్రాంతాంగ నా నేత్రకోణ నికాయం బుల డాఁచి తద్దవళిమన్ దాఁ బూనెనో చొప్ప మార్పన నన్ వెల్వెలఁ బాఱె దీపకళికా వ్రాతంబు శాతోదరీ.
మనుచ. ౩. ౫౬.

సీ. అమృతంబు దొలఁకున ట్లమరంగ వెల్వెలఁ బాఱు ముఖేందు బింబంబు తోడ....
కళా. ౩. ౧౪౬.

వెల్వెలఁబోవు. అ. క్రి. (వెల్వెల + పోవు.) ౧. వివర్ణమగు.

చ. కుల మపకీర్తిఁ జెంద జనకుండును వెల్వెలఁ బోవ బాంధవావళి దలవంప ...
ఉ. రా. ౧. ౧౯౦.

ఉ. ...చెక్కులన్, వెల్లువ కట్ట నశ్రువులు వెల్వెలఁ బోవ మొగంబు ...
దశా. ౫. ౧౨౯.

౨. తగ్గు, క్షీణించు.

సీ. ......ఖండ విజ్ఞాన నక్షత్ర తతుల,

గీ. తెలివి వెల్వెలఁబోవ నిర్మల మనళ్ళు, ఘోర తృష్ణానలంబు చల్లార నంత, ననితరముగ హృదాకాశమున వెలుంగు, మండితా ఖండ చిచ్చంద్ర మండలంబు.
సీతారా. ౧. ౧౪౭.

వెల్వెలన. వి. (వెలన + వెలన.) మిక్కిలి తెలుపు, అధిక ధావళ్యము.

చూ: వెల్వెల నగు.

వెల్వెలనగు. అ. క్రి. (√ వెల్వెలన,) వెలవెలఁ బోవు, తెల్లఁబోవు.

క. కావున నీవును వగవక, భావమ్మున సంత సిల్లి పనుపు కుమారిన్, నావుడు వెల్వెల నగుచున్, దేవేరియు ముద్దుకూఁతు దీనత తోడన్.
చంద్రా. ౬. ౫౫.

చ. త్రిదశుల కేమి చేటో యని దీనత వెల్వెల నా పురీందిరా, సుదతి వివర్ణభావ మనుచుం గననయ్యెడు నాదు చూడ్కికిన్ ...
ఉ. రా. ౪. ౨౬౨.

వెల్వెలుకఁబాఱు. అ. క్రి. (వెల్వెలుక + పాఱు.) మిక్కిలి వెల్లఁబాఱు, మిక్కిలి తెల్ల పడు.

సీ. హిమతుల మోములు వెలవెలఁ బాఱంగ విమలాస్య మోము వెల్వెలుకబాఱె ...
భాగ. ౧౦. పూ. ౩౧.

సీ. అలమి సెమ్మది నున్న యతివ లేనవ్వుచేఁ బఱె నొడలెల్ల వెల్వెలుకఁబాఱె ...
యయా. ౫. ౯౨.

వెల్వెల్ల. విశే. (వెల్ల + వెల్ల.) మిగుల వివర్ణము.

మ. ... కురు భూనాయకుసేన ... స,త్వరతన్ నల్లడఁ బాఱె నవ్విభుఁడు గర్వంబేది వెల్వెల్లగన్.
భార. శల్య. ౧. ౩౦౨.

శా. ... ఈ రాత్రి నీ, వింధ్యారణ్యమునందు వర్తిలి తగన్ వెల్వెల్లగా వేగినన్.
భా. రా. బాల. ౨౬౧.

వెల్వెల్లఁబాటు. వి. (√ వెల్వెల్ల.) మిక్కిలి వైవర్ణ్యము.

శా. తాపంబుం బెడఁబాపి దుర్దమ విషాదంబుం దిగం ద్రావి ని,ర్వ్యాపారత్వముఁ బోవఁ ద్రోచి వగలు ద్వాసించి వెల్వెల్లఁ బా,టే పొంతన్ మెలఁగంగ నీక మదికం దెల్లం దగం బుచ్చఁగా, నీ పెంపార్య జనంబు మెచ్చుధృతి కున్మేషంబు గావింపవే.
నిర్వ. ౯. ౩౮.

వెల్వాడుచు. అ. క్రి. (వెల్లి + పాడుచు.) పొంగు.

సీ. పదపల్లవంబునఁ బ్రకటిల్లు చదలేఱు కడ లెత్తి ధాత్రి వెల్వాడిచి పాఱ. ...
కాశీ. ౫. ౧౧౨.

వెళలు = వెళ్ళు. అ. క్రి. వెడలు.

సీ. దడదడ మన గుండె తాళి బొట్టదర గుబ్బలి పట్టి పడుక యిల్వెళల దయ్యె ...
కువల. ౨. ౧౧౫.

వెళుకు. వి. (సం. విలాసః.) విలాసము.

సీ. చిత్తిరము కులుకు బెడఁగు వెళుకు గునుపు... హొయ లనఁగ విలాస మొప్పుచుండు.
అం. భా. ౧. ౧౩౯.

వెళుపు = వెలుపు. వి. వెడలుపు.

సీ. వెడఁద వెన్నుదుటిపై వెమరాకు వెళుపుతో దిద్ది తీర్చిన పట్టె తిరుమణియును ...
వైజ. 3. ౧౩౬.

సీ. అల జేష్ఠ కిరవగు వెళుపు మొగఁబును బొడ కంత తలకాయ కుడిలిగూనఁ, బోలెడు బొజ్జయు ...
చంద్ర. వి. ౧. ౯౦.

**వెళ్లఁగొట్టు.** స. క్రి. (వెళ్లన్ + కొట్టు.) పోవునట్లు చేయు, విడిపించు.

గీ. పరధరాధిపు భార్యకుఁ బట్టినట్టి, భూతముల వెళ్లఁగొట్ట భూభుజుఁడు మెచ్చి, దన పరిష్కార వస్త్రము లొసఁగి, యంపకము సేయఁ దనయింటి కరుగుదెంచి.
హంస. 3. ౧౦౪.

**వెళ్లఁగ్రక్కు.** స. క్రి. (వెళ్లన్ + క్రక్కు.) వెడలఁ గ్రక్కు, బయటికిఁ బ్రసరింపఁజేయు.

సీ. సుడిగాడ్పు లేరి నల్పుట్టుఁ జొట్టలు వెట్టఁ గడిఁది మంటలు వెళ్లఁ గ్రక్క నక్క ...
ఉ. రా. ౬. ౨౩౫.

**వెళ్లఁజల్లు.** స. క్రి. (వెళ్లన్ + చల్లు.) పాఱఁజల్లు.

మ. ....మణిప్రాప్తిక, న్ని సముద్రంబులు వెళ్లఁ జల్లఁ దలచున్ మేఘాను రూపంబుగన్.
దశా. 3. ౧౪౨.

**వెళ్లఁదన్ను.** స. క్రి. (వెళ్లన్ + తన్ను.) వెళ్లఁగొట్టు, తఱిమివేయు.

గీ. ... వెడలించె రొప్పె, వీచెఁ దఱిమెను దోలెను వెళ్లఁదన్నె, నన(గ నుచ్చాటనముఁ జేసె ననఁదగుభవ. ఆం. భా. 3. ౧౧౯.

**వెళ్లఁబడు.** అ. క్రి. (వెళ్లన్ + పడు.) ౧. (కష్టము నుండి) బయటపడు.

క. బడలితి నెంతయు నేనుం, బడుచులు నేఁడెల్ల వెళ్లఁ బడుదుము దానిం, బాడగంటి వేని నీకుం, గడుపుణ్యము చూపుమనినఁ గరుణాపరతన్. వరాహ. ౧౨. ౩౫.

౨. (పశ్వాదులు.) ప్రసవించు.

(వ్యవ.) నిన్నరాత్రి మా బఱ్ఱె వెళ్లఁబడినది.

**వెళ్లఁబెట్టు.** స. క్రి. (వెళ్లన్ + పెట్టు.) పైకి ప్రసరింపఁజేయు.

సీ. వెళ్లఁబెట్టునొ పూర్ణవిధు కాంతి మెఱుగుమున దిగఁబాఱునో పైఁడి తెలివి మేన ...
నిరం. ౪. ౯౧.

**వెళ్లఁబొడుచు.** స. క్రి. (వెళ్లన్ + పొడుచు.) ఈవల నుండి యావలకు దూసిపోవునట్లు పొడుచు.

గీ. ఒకఁడు కుంతానఁ బగవాని యురము గ్రుమ్మ, వెంటనే యాతఁ డీఁటెచే వెళ్లఁ బొడువ, వెలసె నిద్దఱు నిల్చిన నిలుపు కదన, కాళికై కావడించిన కాను కనఁగ.
కువల. ౨. ౧౪౬.

**వెళ్లనాడు.** అ. క్రి. (వెళ్లన్ + ఆడు.) స్పష్టముగాఁ జెప్పు.

చూ: వెళ్లనాడించు.

**వెళ్లనాడించు.** స. క్రి. (√ వెళ్లనాడు.) స్పష్టముగాఁ బలికించు.

వ. తాను మాట పట్టు పుచ్చుకొని తన కార్య రహస్యంబుఁ దెలుపుటయుం దెలిపి యేను మీదాన నగుట మీచేత వెళ్లనాడించుకొని మీ కుపకారం బెక్కించి విడుచుటకు వచ్చిన దని చెప్పి ... ప్రభా. ౪. ౩౧.

**వెళ్లించు.** స. క్రి. (√ వెళ్లు.) ౧. వెడలఁజేయు, వెడలఁగ్రక్కు.

మ. జనుఁ డజ్ఞానమునన్ భుజించిన జుగుప్సంబైన యన్నంబు స,ద్యోన వెళ్లించి పవిత్రుఁడైన గతి ... భాగ. ౪. ౯౨.

౨. పోఁజేయు, తీర్చుకొను.

ద్వి. ఇల్లు సేరిన మీఁద నీ పగ యెల్ల, వెళ్లింప నున్న సే విప్రుండ నటజ ...
ద్వి. హరిశ్చ. ఉ. ౯౯౦. పం.

**వెళ్లు** = వెడలు, వెలలు. అ. క్రి. ౧. బయలు వెడలు.

శా. లావణ్యాంబులు సాభిషూపమున వెల్లందోడి
ముద్భీజవ, ద్యాభత్క్షేత్రమునందు వంపు ఘట
యంత్రం బో యనంగా జప,వ్యావృత్త స్ఫటి
కాక్షదామకము హస్తాబ్జంబునం దాల్చు
హా,ణీ వామేక్షణ నారసింహునికి సంధిం
చున్ వచో వైఖరుల్. వరహ. ౧. ౬.

ద్వి. తివిరి పుట్టలువెల్లి తిరిగె సర్పములు ...
ద్వి. పారిజా. ౧౦-౪౬.

ఉ....బల్లిదపున్ వరాహములు భద్రగజంబుల
మీఁద నాదికోఁ, బెల్లుగ నెక్కు-వాని
కొస చంద్రుక యొక్కొటి రెమ్మ తీసినన్,
జల్లున వెల్లుఁబో చమురు చిమ్మిన గ్రోవిని
జిమ్మె కైవడిన్. సారంగ. ౧. ౩౧.

౨. బయలుదేరు.

చ. సమధిక బాహుశౌర్య జిత చండవిరోధులు
వెల్లి రున్నత,క్షమ ...
భాగ. ౧౦. ఉ. ౭౪౪.

శా. కల్లైంబుల్ సవరింప కళ్వముల నెక్కం
బూను రాహుత్తులున్, బల్లెంబుల్ గొని
యర్థభోజనముః లజ్జన్ లేచు యోధాగ్రణుల్,
కల్లన్ బల్కుచు నొంటిఁ బంచలనగల్లన్
వెల్లు భూవల్లభుల్, బల్లింపం దలపోయు
మాటమి దొరల్ జవ్వాడి రవ్వాడికిన్.
రా. వి. ౫౦. ౪.

మ....కుయిశాంటన్ సెల్లు కూన్యోరు కూ,ప
వితానం బన ... ఆము. ౨. ౪౭.

౩. పోవు.

మ. ఘనతాపంబు హరింప నోప మనుచుం గానీ
క్రియా ద్వేష మొ,చినఁ గానీ హృదయేశుఁ
జన్నులపయిం జిత్రింపఁగా నీతమున్, వన
జాతుల్ నిరసింపఁగాఁ జనుట హైన్యం
బంచు మున్మున్న వె,ల్లిన రీతిం బడుఁ బ్రేలి
మా క్తికమణుల్ మెట్టించి దూరంబునన్.
వరాహ. ౪. ౩౫.

చ. ఉరమున నేగుఁ గుండలి పయోధర ధారల
నాను నెప్పుడున్, గిరులు కరల్ రజో
విహృతికిం జను వెల్లఁడు నేల కూర్మ కే,ఖరుఁ
డిది మేల చాల జనకల్పిత సౌఖ్య మటంచు
ధారుణీ, తరుణి సిరంగరాయ వసుధావరుఁ
జేరెఁ గుమార మన్మథున్. వసు. ౧. ౩౨.

ఉ. విన్నన నేఁగు తామరల విందుకి లాతపు
నీడ లెప్పుడున్, వెన్నెల రాచవాలఁ గని
వెల్లక నీళ్ల మునింగి యున్న వీ, మన్ను
లటంచుఁ జెంచెతలు మాటికి నవ్వులనేసి
నాటమిన్, మిన్నక సిగ్గునన్ గదలి మెల్లనఁ
బోవుదు రింధ్లపట్లకున్. యయా. ౨. ౩౯.

౪. కడచు, అతిక్రమించు.

ఉ. ఇంక శరీరవాయువు ధనేశ్వరుఁ డైన
విధంబు చెప్పెదం, బంకరుహ ప్రసూతికిఁ
బ్రపంచ వినిర్మితి వేళ వెల్లనా, తంకవిధాయి
తీవ్ర సికతల్ వెదచల్లుచు నూర్పుగాడ్పు
కూ,లంకష సప్త సాగర జలంబులు తువ్వ
రఁగాఁగ రువ్వఁగన్. వరాహ. ౩. ౩.

సీ. పురుడు వెల్లక మున్న పూతన విషదిగ్ధ కుచ
దుర్గముల నెల్లఁ గ్రోలి చంపె ...
చిత్ర. భా. ౫. ౧౩౨.

౫. పుట్టు, మొలచు.

క. మానిని యెఱుఁగవు గా కీ,క్ష్మానాయకు
వ్రతము మాన్పఁగా నీతరమా, ఏనుఁగకు
కొమ్ము వెల్లిన, నే నాఁటను మగుడఁ ద్రోయ
నెవ్వండోపున్. రుక్మాం. ౫. ౧౨౩.

౬. పైకి వచ్చు.

చ. మొలక లొకింత గానఁబడి మోసులు
మెల్లన వెల్లి సోగలై, నెలకొని వ్రేళ్లు గోళ్లను
జనించి చొకారములై మిటారి కెం,దలి
రుకు బొమ్మ కట్టి ... సారంగ. ౩. ౨౫౩.

చ. ...ఆ యన్నతోదరి రాజుచేత నుండిన బెడిదంపుఁ జాయల పిడెం బొరవెళ్ల జరీన దూసి గొబ్బున మెడమీఁదఁ బెట్టుకొన ... సారంగ. ౨. ౨౩౩.

**వెవ్వోఅలాడు.** అ. క్రి. వెవె యని యధిక్షేపించు.

ద్వి. కన్నులార్చుచుఁ జెవుల్ గత్తరించుచును, వెవ్వోఁఅలాడుచు వెక్కిరించుచును ... పండితా. పర్వ. ౩౪౧. పొ.

**వెస.** వి. (సం. వాజః.) వేగము.

వ. మనము వెసగల కాలరుల వేగంబ పుచ్చి. భార. ఉద్యో. ౧. ౩౪.

ఉ. వాయుజుఁడై వెసన్ వెకలి, వాయుగతిం జని కూలె సాలముల్. సమీర. ౩. ౫౩.

చ. ...ఎక్కుడు వెస రాహు మస్తకము గొన్న సుదర్శన దేవుఁ గొల్చెదన్. ఆము. ౧. ౯.

—క్రి. విశ. ద్రు. శీఘ్రముగా, వేగముగా.

శా. వేమారున్ మలయానిలుం డపరి యా వీటం బ్రసూనాన్వితా, రామంబుల్ వెస ముట్టి యందలి యలివ్రాతంబుఁ బోఁజోపి... విక్ర. ౧. ౭౬.

ఉ. ఆ దనుజాప హర్తయు భుజార్గళముల్ వెసఁజాచి యంచితామోద వికాసవన్నయన ముగ్ధ సరోరుహ పంక్తిఁ బూజల, త్యాదర లీలఁజేయు నమరాధిపుఁ గౌఁగిటఁ జేర్చి... పారి. ౩. ౬.

మ. పవనాశ్వంబు హరింపఁగా ముని జటాపాలిం జగత్ప్రాణ మూర్తి విరోధించి తదశ్వముం గొనిరయో నీకే ప్రొద్దు దాని న్మ్రడన్, దవులం గట్టి ఖవీధి త్రిప్పి వడి పాతం డబ్ధిఁ ద్రోయింప నీ,ని వెసన్ వచ్చితి కాక రాజెటుల దీంద్రించు నృపాగ్రాంకం బునన్. చంద్రా. ౫. ౭౪.

**వెసనము.** వి. (సం. వ్యసనం.) వ్యసనము, కామక్రోధాదుల వలన కలుగు దోషము.

క. తన కంటికిఁ బ్రియ మయ్యెడు, ఘనునొక్కని వెంటనంటి కౌతుక మొప్పన్, మనసంటి కౌఁగిలింపక, చన దింటికి దాని బల్వెసన మేమందున్. హంస. ౧. ౨౧౭.

గీ. కంతు మాయల నుమ్మెత్త కాయఁ దినిన, వెఱ్ఱి తెఱఁగున వెసనంపు వెఱపువొడమి, చికిలి నెఱి వన్నెకాండ్రకు బివము లెత్తి, నెనసి చరియించు వీఁట నా హేమరేఖ. హంస. ౧. ౨౨౦.

**వెసల.** వి. వంటపాత్రము, పాత్రము.

క. వడ్డింపఁగ నెంగిలి దొడిఁ, బడ్డ వెసల వంటకంబు సాయ నిడెఁ దగున్, వడ్డించు నతని సోఁకిన వడ్డింపక డించి వార్చి వడ్డింపఁ దగున్. విజ్ఞా. ౧. ౪౭.

క. వెస లలనామణి బంగరు, వెస లల దొంతరలు డించి వినయము మదికిం, బొసఁగఁగఁ గంకణ రవములు, పొసఁగఁగ సారసి రసాన్నములు వడ్డింపన్. విజ. ౨. ౧౫౨.

సీ. ...పొటించి యాగడపకు వెలపట, పొది కిల్లఁ దవుడు నిప్పును బ్రత్తిగింజలు నిడి యడ్డముగఁ జిట్టు బడిసి వైచి, వేపరెమ్మల నీళ్లు వెసల లోపలనుంచి గాపులు పురిటింటఁ గట్టి చేసి. ద్వా. ౩. ౪౫.

సీ. వెసలలో మూనాళ్ల వెన్నలుండఁగ నాఁడు కాఁచి డించిన నెయ్యిఁ గరఁగఁబెట్టు ... శుక. ౫౬౧.

సీ. ఏమిరా తాఁ జెడ్డకోమటి వెసుకయ్య చేతికి వెసల యిచ్చిన విధమున, మమ్ము మీ మతముఁ గైకొమ్మని చెప్పెదు ప్రాణికి మీ మతం బర్హమగునె, స్వర్గవైభవము విసర్జించి

రొక్కఁడు జనదూష్యమైన పైశాచవృత్తి.
నీవలెఁ దాల్చురా నిర్భాగ్య ...
ప్రబోధ. 3. ౨౯.

సా: తాఁజెడ్డ కోమటి వెనుకయ్యే వేరికి వెసల యిచ్చు = తాను చెడి యితరునిఁ గూడఁ జెఱుచుట.

# వే

వే1. స. వేయి, సహస్రము; అనేకము, పెక్కు.

సీ. విష్ణు నామంబులు వేయును నిత్యంబు విని నఁ బఠించిన మనుజుఁ డిహము, నందు ...
భార. అను. ౫. 3౨౬.

క. వేసేతుల నిడుపగు బాణాసనము గుణ స్వనోగ్ర మగు నట్లుగ నుల్లాసమునఁ ద్రిప్పు చును ... హరి. పూ. ౪. ౫౬.

(బాణాసురుఁ డీశ్వరునితో.) శా. దేవా కయ్యము లోడి వేడుక మదిం దిట్టాడు మర్త్యుండు నే, త్రోవం జేతుల తీఁట వుత్తు నని కోరన్ దానవుం డైన నా, కీవే చేతులు చేసితి కసిమి రిం కెట్లోర్తు(న్) ...
ఉ. హరి. ౫. ౨౧.

క...పతిస్నే,హమ కామినులకు బలవం,తము పెఱనెయ్యములు వేయుఁ దత్సదృశములే.
భార. ఆది. ౬. ౧౯౦.

క. కలిగె నొక జాంబవతి క,న్నెలవడఁ బడె దేల వలపు నీతలవేగెన్, బలియకు వే సవతులు గల, పొలఁతులచే పాటువడక పోరా దనినన్. ఉ. హరి. 3. ౧౧౫.

శా....ఈ కంథచే, వేలత్షల్ కనకంబురాలు విద్రుపఁ విశ్వంభరా ధీశ్వరా.
విక్ర. ౨. ౩.

(దీని యామ్రేడితరూపము ('వేవేలు'.)

క. ఏవేళఁ జూచి నందన, శ్రీవాకిటఁ బగటి వేళ శివయోగివరుల్, వేవేల సంఖ్యలుండె దరు ... హర. ౨. 3౫.

ఏవేలుంగులదొర. వి. (వేయి + వెలుంగులు + దొర.) సహస్ర కిరణుఁడు, సూర్యుఁడు.

సీ. ... తే. ... వేవెలుంగులదొర జోడు వేవె లుంగు. అము. ౧. ౧౯.

వే2. క్రి. విశ. (సం. వేగః.) ౧. వేగముగ, త్వరగా.

ఉ. వెండియు నేఁడు బాణములు వే తొడి ధర్మజు నొవ్వనేయ ...
భార. భీష్మ. 3. ౪౦

ఉ. ఓర్పొక యింత లేని విక చోత్పల లోచన చిత్తవీధిఁ జల్లార్పఁగ నీల నీరద శుభాం గుఁడు వే సనుదెంచె ...
పారి. ౧. ౧౧౨.

చ. చతురతఁ జెప్పి యప్పుర మొసంగఁగ వే చని యాడి రమ్మనన్.
ఉ. రా. ౨. ౨3౪.

౨. శీఘ్రముగా, వెంటనే.

క. ప్రముచ్చుల మూఢత్వమునం, జచ్చి నరక వాసమునకుఁ జనిన తనయు నేఁ, దెచ్చెద మగుడఁగ వే నీ, కిచ్చెద వగపుడుగు మింక సేనియు నధిపా.
భార. ద్రోణ. ౨. ౨౧౯.

క. ... ఈ యర్భకుపై, వే పడిన ఖలులు దహనుని, బైపున శలభములు పగిదిఁ బడిరి ధరిత్రిన్. భాగ. ౧౦. పూ. ౪౫౨.

మ. ...పెలుచున్ గంటు పుటుక్కునం దునిసి వే పృథ్విం బడెం జాలె... అము. ౪. 3.

మ. ధర కంధూకులు కృష్ణకాయల చమూ ధాటీగతిన్ వింధ్య గ,హ్వరముల్ దూఱఁగఁ జూచి తా రచటఁ గాపై యుండుటం జాల న,చ్చెరువై యొజ్జని వింత చీఁకటులు వచ్చెం

జూడకే యంచు వే,సారిదిం జూతురు వీర
రుద్రగజరా ట్ఛుంద్ధాంత ముగ్ధాంగనల్.
మను. ౧. ౩౯.

**వేంకటము.** సం. వి. అ. పుం. పర్వత విశే షము. ఒకానొక పర్వతము, తిరుమల.

**వేంకటాచలము.** సం. వి. అ. పుం. తిరుపతి కొండ.

క. శ్రీ నయన కువల యుగళా, నూన
జ్యోత్స్నాయిత స్మితోజ్జ్వల ముఖ దై,త్యా
నీత సుర శ్రీ పున,రా నయనక్రమణ వేంక
టాచల రమణా. అము. ౨. ౧.

**వేంకటేశుఁడు.** సం. వి. అ. పుం. ౧. తిరు మలకుఁ బ్రభువగు విష్ణుని యర్చావతారము, వేంకటరమణ మూర్తి.

సీ. ... గీ. ఇల్లు విడనాడి శ్రీ వేంకటేశుఁ
డుండు, పర్వతశ్రేష్ఠమున కథో భాగము
మునను, దనరు చుండెడు కపిల తీర్థంబు
చెంతఁ, జేరి స్నానంబు చేసి తత్తరమునను.
వేం. మా. ౧. ౧౬౯.

౨. వేదాంత దేశికుఁడను విశిష్టాద్వైత మత ప్రవర్తకుని మఱియొక పేరు.

వ. ... మఱియు హయవదన పదారాధకుండై
వేంకటేశుం డను నింకొక్క మనీషి ...
అము. ౬. ౬౬.

**వేంకి = వేఁకి.** వి. జ్వరము.

ద్వి. చిచ్చుకు వేంకియు నేతుకుఁ జలియు,
వచ్చిన మాన్పంగ వచ్చునే యనఘ ...
నవ. ౪. ౧౩౩. పా. ౨౦. పం.

**వేంచేపు.** వి. (దేవతలు, ప్రభువులు మొ. వారి) ప్రవేశము.

సీ. హరికి భూమికి నీళ కద్భుతన్యతు నూతనాం
బరాభరణంబు లర్పణములు, చేసి శృంగార
ముల్ చేసి హాటకరత్న దీధితు లొప్పిన
తిరుచయందు, వేంచేపు చేయించి వివిధ
మంగళవాద్యములు భూ నభోంతరంబు
నిసంగ ... వేం. మా. ౨. ౧౧౨.

మ. ... దరాం చన్మరజాన కాధి రవముల్
చెన్నొందఁదిర్వీధులన్. క. వేంచేపు చేసి
వేశ్యా, పంచానన మధ్య లాడ బ్రాహ్మణ
వర్గం, బంచిత వేదధ్వనితోఁ,జంచద్గతి
నడువనిల్పి జనపతి యంతన్.
భార్గవ పురాణ. ౫. ౨౩౨.

**వేంచేయు = విజయంచేయు.** అ. క్రి. ౧. (దేవ తలు, ప్రభువులు మొ॥ వారు) వచ్చు.

సీ. వింధ్య వాసినిగల వేంచేసి నీపుత్త్రి నేను
సింహాకృతి నెక్కు డేని, గొనిపోయి దాఁచితి
... ననిరొ. దశకు. ౧౨. ౨౫.

గీ. ఆకసంబున వేంచేయు హరికి సిద్ధ,సాధ్య
చారణ గంధర్వ సంయమీంద్ర, వివిధ సంస్తు
తుల్ చెవుల పండువులు చేసె, జయజయా
రావములతోడ సకల దిశల.
ఉ. హరి. ౬. ౧౪.

క. వేంచేయుము వాయింటికిఁ, బంచ శరాకార
యనుచు ... భాగ. ౧౦. పూ. ౧౨౪౭.

౨. (దేవతలు, ప్రభువులు మొ॥ వారు) వెళ్లు, పోవు.

మ. నలునిం బంచి నగంబులం బరపుగా నా
మీఁదఁ గట్టించ వే, వెలయన్ సేతువు
లంకకా నెరువునన్ వేంచేయ వే ...
రామా. ౪. ౦౨౦.

గీ. శివుఁడు మంథానగిరి తుంగ శృంగవీథిఁ,
కొలువు మీఱంగ స్వారి వేంచేయు నపుడు...
ఉ. రా. ౧. ౨౬౦.

క. జననాయకుఁ డంతట నతి, వినయతఁ దిరుమాళిగలకు వేంచేసెద రో, యని కేల్మోగుచుచు వైష్ణవ, జనులన్ వీడ్కొలిపి చనిరి యిలకంబులకున్. పరమ. ౩. ౫౧.

౩. (దేవతలు, ప్రభువులు మొ॥ వారు) కూర్చుండు.

గీ. ఉరగరిపు వాహనమున నెక్కొక్క వేళ, వేడ్క వేంచేసి మెఱయుఁ దిర్వీథు లందు,...విట్ఠలయ్య. పాండు. ౪. ౧౩౪.

౪. (దేవతలు, ప్రభువులు మొ॥ వారు) వసించు.

సీ. పీఠంబుపైఁ దీర్థ పెరుమాళ్లు వేంచేసి యున్నవా రపచార మోసరిల్లు ... విప్ర. ౩. ౬౬.

వ. ఔద్దాలక ఋష్యాశ్రమంబున వేంచేసి యున్నవాఁడు. శేష. ౪. ఆ. (శ. ర.)

**వేండ్రపడు.** అ. క్రి. (వేండ్రము + పడు.) కోపించు.

సీ. తల్లికిఁ గలదైన దయలేదు నామీఁదఁ దండ్రి యెప్పుడు చూచి వేండ్రపడును ...
హంస. ౩. ౧౫౦.

**వేండ్రము.** వి. వేఁడిమి.

క. జడనుం దాపము నిద్రయు, నిడు వేండ్రము తోడ నెగయు నిట్టూర్పులు సం,దడిగొని వడిగొని మదిలోఁ, జిడి ముడి పడి కన్నుఁ గవయుఁ జిడిముడి వడగాన్.
ఉ. హరి. ౬. ౪౮.

క. ... ఎటువలె, నే వచ్చితి రిటకు నెండ వేండ్రము చూపన్. సుద. ౨. ౨౩.

విశే. ౧. అత్యుష్ణము, మిక్కిలి వేఁడిమిగలైనది.

ద్వి. తండ్రి వాక్యములనై దారుణ శిఖల, వేండ్ర మౌ నగ్నిలో విషధిలో నైనఁ, బడియెద విష మైన భక్షించువాఁడ ...
రం. రా. అయో. ౯౬. పొ. ౨౩. పం.

సీ. తిలకింప ద్వాదశార్కుల కన్న వేండ్రమై జలజారి పందు వెన్నెలలు గాయ ...
దశా. ౩. ౪౪.

౨. తీక్ష్ణము, వాఁడిగలైనది.

క. ఉండ్రా యతఘాధమ నీ, తండ్రింగని తాళు కొంటిఁ దగఁగాకున్నన్, వేండ్రం బగు కత్తి నిఁకన్, జేండ్రంబునఁ బట్టి నిన్ను ఛేదింతు సుమీ. అహల్యా. ౧. ౯౬.

౩. పరుషము.

క. వేండ్రముగఁ దిట్టుటయు జవ,రాండ్రెవ్వరు మున్నెఱుఁగని యంగద యెదవన్, గుండ్రాతి రూపుఁ గైకొని, తండ్రీ పెక్కేఁడు లిందుఁ దరలకయుంటివ్.
అచ్చ. రా. బాల. ౧౪౮.

౪. శౌర్యవంతము.

శా. వాండ్రున్ వీండ్రును రాజులే యనుచు గర్వప్రౌఢితో యాదవుల్, వేండ్రంబైన బలంబుతో మధురకున్ వే వచ్చి ...
భాగ. ౧౦. పూ. ౧౫౨౨.

**వేంపమ్రాను.** వి. (వేము + మ్రాను.) ఒకానొక చెట్టు, నింబము.

**వేఁకటి = వ్రేఁకటి.** వి. గర్భము, చూలు.

మ. ... కాంత యొక్కట సంత్రాసము నొందుఁ జన్నుఁగవ యా కంపింపఁగా నిండు వేఁకటి భారంబునఁ జేసి ...
కాశీ. ౪. ౨౧౩.

సీ. గొంతి మాఁడపట్టి కోడలి నిండు వేఁకటిఁ గాచినట్టి చే కత్తివాఁడు ...
రా. వి. ౧. ౬౧.

క. ...వేఁకటి యగు లంజపడుపు విడువని బ్రతుకుం, బ్రాఁకొన్న నూతి యుదకము, మేఁకల పాడియును రోఁత మేదిని సుమతీ.
సు. శ. ౧౦.

**వేఁకరము.** వి. ఉపద్రవము. (శ. ర.)

**వేఁకరి = ఏఁకరి.** వి. (వ్రేఁకము + అరి.) కిరాతులలో నొక తెగకుఁ జెందినవాఁడు.

గీ. ...కోయచెంచు, పరికి యేనాది యేఁకరి
పట్రయెఱుకు, వేఁకరి యెఱుకరి యనఁదగ్భే
దములుగఁ, బొల్చును ...
అం. భా. ౨. ౨౮౯.

**వేఁకి.** (క. బేగ. త. వెక్క.) వి. ౧. జ్వరము.

క. బలదేవు మేను సోఁకిన, వెలిమిడిచే వేఁకి
సెఱచి విటతాటముగా, నిలుగుటలో ములు
గుటలో, నలమటలో నావులింత లంతంతకుఁ
గాన్. ఉ. హరి. ౬. ౪౪.

గీ. ...వేఁకి దలచూపె దాహ మావిర్భవించె.
కాశీ. ౩. ౧౨౧.

సీ. ...విస్మృతియును నంధతయు వేఁకియు
ననంగ, నట్లు ప్రమాదజలైన యూరుజలకు
రయమునఁ దగుఁ బ్రతిక్రియ లొనర్పు.
మార్క. ౩. ౩౨౪.

౨. వేఁడిమి.

తే. రుచిర శశికాంత రచిత సరోవరంబు,
నెలఁత సొచ్చిన మెయివేఁకి నీరువెల్ల, నింక
వదనేందు రుచి శిలలెల్లఁ గరఁగి, నిండెఁ
దోడ్తోవఁ గొల నతనుండు విసువ.
కు. సం. ౫. ౫౯౬.

క. మలయానిలునకుఁ గదళీ, దళముల వీచి
రొక వేఁకి దనుకఁగ నా పై, నలమెడు
మలయజ కర్దమ, మలఁదిరొకో యుడుకు
లేవ నమృతాంశుపయిన్.
కు. సం. ౫. ౬౪౦.

౩. అగ్ని.

క. చక్కని ప్రకోష్ఠ పీడన, మిక్కిలి కనువేఁకి
నుతికి మినుమినుకు మనన్ ...
హర. ౪. ౮౪,

**వేఁగఁబడు.** అ. క్రి. (వేఁగన్ + పడు - స్వార్థమున.) వేఁగు, పరితాపము నొందు.

గీ. నమ్మఁ దగదు మొదల నమ్మి తారాత్మ
కార్యమున కొరులఁ బనిచి యుందు వార,
లరయ సేసిరేని యడియాల మెఱుఁగక.
వేఁగఁబడుట యెల్ల వెఱ్ఱితనము.
కేయూర. ౩. ౧౮౪.

**వేఁగారు.** అ. క్రి. (వేఁగు + అరు.) భారమగు, బరువగు.

ద్వి. వేఁగారు గుబ్బల వ్రేఁకంబుతోడ, వేఁ
గౌను దీవియ లివలివ లాడ ...
ద్వి. పరమ. ౨. ౫౬. పా. ౧౧. పం.

**వేఁగి¹.** వి. (సం. వ్యాఘ్రి.) ౧. పులి.

సీ. ...వేఁగి నావ్యాళి మెసఁగు.
అం. భా. ౨. ౮౨.

౨. = వేఁగీ దేశవిశేషము, ఆంధ్రదేశములో నంతర్భాగము.

సీ. ఆటసాగి జమ్మిలోయఁ బడి వేఁగి దహించె...
అము. ౧. ౩౬.

**వేఁగి² = వేఁగిస.** వి. పీతసాలము, ఒకజాతి మద్ది చెట్టు. ‡.

సీ. ...వేఁగి వేఁగిస యన వెలయుఁ బీత,సాలా
ఖ్యగా ... అం. భా. ౨. ౪౪.

ఆ. ...వేఁగి వేము మొదలుగాఁ గల వ్రాఁకులఁ,
గానవగుచు నొక్క కానవెలయు.
వేం. పంచ. ౪. ౭౨౨.

సీ. ...దేవ,దారు గుమ్ముడుమావి తపసియుఁ
గుమ్మర పొల్కి గుగ్గిలమెట్టు పొల్కి వేఁగి.
హంస. ౪. ౧౧.

**వేఁగినాఁడు.** వి. (వేఁగి[1] + నాఁడు.) వేఁగి దేశము.

క. వెలనాఁడు వేఁగినాఁడును, బులుఁగుల నాఁ డ్పాకనాఁడు పొత్తపినాఁడున్, గల మురికి నాఁడు రేనాఁ,డలయక గనుఁగొంటి నచటి యబలఁ గంటిన్. హంస. ౧. ౫౩.

**వేఁగిస = వేఁగి[2].** వి. పీతసాలము, ఒకానొక చెట్టు. ‡.

వ. ఇప్పకప్పూర మద్ది గద్దగోరు గోరంట వెలమ యులిమిరి మూఁగ వేఁగిస మొదలుగాఁ బెక్కు తెఱంగుల మ్రాఁకులు ... పి. శకుం. ౨. ౧౪.

**వేఁగు = వ్రేఁగు.** అ. క్రి. ౧. (కాయధాన్యము మొ॥) తప్తమగు, భర్జితమగు.

(వ్యవ.) కందులు సరిగా వేఁగక పప్పు బాగుగా లేదు.

౨. తపించు, తాపము నొందు.

సీ. తొల్లి దాక్షాయణితోఁ బాసి శంభుండు విరహ సంతాపాగ్ని వేఁగుమండె ... కాశీ. ౪. ౨౪౩.

౩. పరితపించు, దుఃఖపడు.

ఉ. ...విశాల నరేశ్వరుండు పుత్రోద్భవ శోకు తాను భవ మొక్కటి లేమికి వేఁగి వాక్య సంపద్భుజగేంద్ర సన్నిభుల బ్రాహ్మణులం బిలిపించి వారితోన్. వరాహ. ౨. ౯౦.

సీ. ... అనయముఁ బ్రబలి,

ఆ. వె. కోటిలేనివాడు కొమరున కిప్పాటు, వలసె నకట యిది యవార్య మనుచు, వేఁగి వాని బావు వినియుంత జిష్ణుండు, బండితారిపంక్తి కంధరుండు. రాఘవ. ౪. ౧౪౩.

ద్వి. రాముని సతి దశరథరాజు కోడ,లిమ్మగ జనక మహీపాలుపుత్రి, వివిధ సంకటముల వేఁగుచున్నదియు ... రం. రా. అయో. ౧౩౯. పొ. ౧౧. పం.

౪. కాలము గడపు.

చ. ...బానలను గ్రమ్మనఁ గూలఁగఁ ద్రోచె నుట్టులు, న్వ్యాస నుఱుమాడె నేమిగతి వేఁగుదు నెక్కడఁ జొత్తుఁ జెప్పుమా. హరి. పూ. ౫. ౨౧౪.

౫. కాలు, దగ్ధమగు.

ఉ. ఏల మృగాక్షి నాలుక లేఁటికి నమ్మవు కూలి కొండరా, చూలి వివాహమైన యెడ శోభన మంగళవృత్తి నున్నచో, వేలుపు తెల్ల నంగజాఁడు వేఁగుటఁ జెప్పినఁ గాము నిచ్చునా. నీలగళాంకుఁ డీవిధము నిక్క మటంచు సభంబు మ్రోయఁగన్. వీర. ౨. ౧౫౫.

౬. చచ్చు, నశించు.

ఆ. దారుణాత్మకుండు తారక దైత్యుండు వేఁగుననుచుఁ జెప్పి వీడుకొలిపె ... వీర. ౨. ౭౦.

౭. క్షీణించు.

సీ. మానుషంబులు గ్రాఁగి మత్సరంబులు వేఁగి చెచ్చువారును మూఁక విచ్చువారు ... వరాహ. ౩. ౪౭.

౮. భారము, బరువు.

చ. గొరగొర లాడుచుం బుడమి గ్రుచ్చుచు బర్వెరతోడ నోరగాఁ, బిరిదికిఁ జూచుచుం గడుపు వేఁగున వంకర గాఁగఁ బోవుచున్... చెన్న. ౨. ౨౦.

**వేఁచిపోఁత.** వి. (√ వేఁచిపోవు.) వేఁగించుట, తపింపఁజేయుట.

క. వారలకు నగ్రగణ్యుం, డై రవి సంవర్త
సమయ హవ్యవహ శిఖా,దారుణ శరముల
భువనము, లీరేడును వేఁచిపోఁత నెఱిఁగి
సభయులై. వరాహ. ౬. ౧౦౩.

**వేఁచిపోయు.** స. క్రి. (వేఁచు + పోయు.) వేఁగఁజేయు, తపింపఁజేయు.

చూ: వేఁచిపోఁత.

**వేఁచు.** స. క్రి. (√వేఁగు.) ౧. వేఁగఁజేయు భర్జించు.

గీ. బిట్టుగాలిన పెనములఁ బెట్టివేఁప, మిట్టిపడి
యట్టె మూర్ఛిల్లు నట్టివారి ...
ఉ. రా. ౩.౩౨౩.

సీ. ఒనరవేఁపఁగ నెండు పెనఁగ లెత్తఁగఁ
బోవు నూరికిఁ బొమ్మన్న నులుకుఁ
జెందు ... శుక. ౨. ౨౦౮.

౨. తపింపఁజేయు.

ఉ. పూఁత పసిండివంటి వలపుం బచరించు
కులంబు నీతికిన్, లేఁతగదమ్మ యిత్తెఱఁగు
లేమ సురాంగన లెల్ల సిట్టి నీ, చేఁతకు మెత్తు
రమ్మ దయసేయక తిన్నని మేను వెన్నె
లన్, వేఁతురటమ్మ యింతకను వేఁడుఱు
చెల్లునటమ్మ యింతికిన్. మనుచ. ౩. ౩౩.

ఉ. ...మున్ను వారి ను,ద్వేజక తీవ్ర తేజమున
వేఁచిన సాహసిగాన వేగ నం,భోజ విరోధి
సేరెఁ బరభూధర కందర కోటరాంతమున్.
వసు. ౬. ౪౦.

ఉ. ...దురంత నిరంతర తాప మెంతయున్,
మెండయి సర్వ జంతువుల మేనులు వేఁచఁ
దొడంగె నత్తరిన్. ఇందు. ౩. ౯౫.

౩. పరితపింపఁజేయు.

మ. ...ప్రాణసఖాళై హంసీతుదన్ యుక్తమే,
విరసంబైన వచః ప్రపంచనముచే వేఁపంగ
నిందాశనిన్, సరసత్వంబునఁ బ్రాభవంచు
మదిలోఁ జాలంగ నే నమ్మితిన్.
ప్రభా. ౩. ౯౩.

**వేఁట.** వి. (క. బేఁటె. త., మ. వేట్టై.) ౧. మృగయ, అడవిలో మృగపక్షులను సంహరించుట. (ఇది మృగముల వేఁట, ఏదువేఁట, గంటవేఁట. తెరవేఁట, సివంగివేఁట మొదలగు పలువిధములు గలది.)

చూ: గంటవేఁట, పక్షులవేఁట రెండు విధములు – పాదివేఁట, విడివేఁట.

ఉ. వేఁటికి నొప్పుఁగాక రజనీచర యీ డెటు
లైన నెల్లిపో, దాఁటు కవాటముల్
విఱుఁగఁ దాఁచుచుఁ జేతుల తీఁటవోవ పై,
తీఁటలు వుచ్చి రక్కసులఁ దీర్చుట రాముఁ
డొనర్పు నున్న పెన్వేఁటకు రావణాది
మృగ బృందముఁ దార్చుటటంచు నార్చి
నన్. భా. రా. యు. ౪౫౫.

గీ. ...అగుడు సాళ్వంబు డేగలోనుగను గల్గు,
వేఁట పులుఁగుల విడిచిన వింటికెగసి
యయా. ౨. ౨౩.

తే. వెలఁది జూదంబు పానంబు వేఁటపలుకు,
ప్రల్లదంబును దండంబుఁ బరుసఁదనము,
సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ముసేత,
యనెడు సప్తవ్యసనములఁ జనదు తగుల.
భార. ఉద్యో. ౨. ౪౪.

౨. మేఁకపోతు, దేవతకు బలి యిచ్చుటకై యేర్పఱుపఁబడిన మేఁకపోతు.

గీ. శశము పిశితంబు పక్షి మాంసంబు పంది,
యామిషము వేఁట పలలంబు నధికమైన,
తృప్తి యొనరించు నొగిఁ బితృదేవతలకు,
నెలమి నాలుగు నేను నాఱేడు నెలల.
మార్కం. ౩. ౨౦౦.

ఉ...ఈ, తెక్కుని చెంచుసింగముల వేఁటల వేఁటల లీలఁ ద్రుంచుచున్.

చంద్రా. ౨. ౫౦.

మ. కొని చెంగాటము రాజులన్ నతులు చేకూర్చున్ మహావీర్లకున్, బాలమున్ రాజుల నెంత భక్తి పరతం బూజించె నాగంగకున్, తెలయన్ వేఁటలు బోనమున్ సిడులు గావించెన్ సుతోత్పత్తికై, చెలి యాలాగున సల్ప దైవము కృపన్ సిద్ధించెఁ దద్వాంఛయున్.

హంస. ౨౯౧.

౩. తగరు, పొట్టేలు.

గీ. వేఁట యన మేష మృగయలు తెలియు చుండు ... అం. భా. ౩. ౫౭.

వేఁటకరి. వి. (√ వేఁట.) వేఁటకాఁడు.

క. ...అధిపుకై పట్టిరి బెబ్బులి మహిష మెలుఁగుఁ గిటిఁ, డెలు మొదలగు వానిఁ గొన్నిఁటిని వేఁటకరుల్.

మనుచ. ౪. ౫౦.

వేఁటకాఁడు. వి. (వేఁట + కాఁడు.) మృగయుఁడు, వేఁటాడువాఁడు.

బ: వేఁటకాఱు, వేఁటకాండ్రు, వేఁటకాండ్రురు.

ఆ. తె. నల్లగ్రోల నిచ్చి మెల్లనె చివ్వంగి, నోరి జింకఁ దివియు నేరుపాదవు, వేఁటకాఁడు వోలె ... ఆము. ౪. ౧౯౩.

ఆ. వేఁటకాఱు ముట్టి తెనుకొనఁగా శ్వేత, నగము చఱికిఁ దారు నమిలి వోలె ...

వ. అప్పు డనిలసుతుని వేఁటకాఱులు మాంస భారంబులతోడఁ బరిభ్రాంతులై ...

భార. శల్య. ౨. ౩౬.

ఆ. దాని వాడవారు తవిలి చంపించిరి, కుక్క నంతఁ గినిసి కుక్క వేఁట, కాండ్రు రంద తోఁగి కత సవిస్తారంబు, నృపతితోడఁ జెప్ప నృపతి యలిగి.

కేయూర. ౨. ౧౧౪.

విణ. సంహారకుఁడు, నశింపఁ జేయువాఁడు.

తే. నిడుద త్రాళ్లూని బయల నెప్పుడుఁ దిరుగుచుఁ, బొసఁగ ముప్పొద్దు ముప్వేసములఁ జెలఁగుచు, తెలుఁగు లెల్లెడఁ గాచుచు నలరు నిర్గ, వేఁటకాఁ డప్పుడెంతయుఁ దేటమీఱె. అచ్చ. రా. అయో. ౪౨.

లోకోక్తి. – వేఁటకాఁడు మెత్త నగునపుడు లేఁడి మూఁడు కాళ్లను నడుచుట.

అధికారి యసమర్థుఁడైన సేవకులు స్వేచ్ఛగాఁ బ్రవర్తింతురనుట.

తే. పౌరుషఁబున దురకలఁ బొఱఁదఱుము, వేఁటకాఁడిల మెత్తనౌ వేళ లేడి, మూఁడు కాళ్లను నడుచు నిర్మూలితాంహ

సిం. నార. ౪. ౯.

వేఁటకుక్క. వి. (వేఁట + కుక్క.) వేఁటాడుట యందు నేర్పుగల కుక్క, విశ్వకద్రువు.

(శ. ర., బ్రౌ.)

వేఁటగిరి. వి. (√ వేఁట.) వేఁటాడి జీవించెడి బోయ, వ్యాధుఁడు.

క....వేఁటగిరుల్ వేఁటకరుల్, వేఁటమరుల్ దొరకు విడివడి యంతన్.

రా. వి. ౩. ౫౪. (శ. ర సా.)

(వేటినిరు త్రీటకరుల్, వేఁటమరుల్ దొరకు గొలుప నిడివడి యంతన్. ముద్రి. పా.

వేఁటచాళ్లు. వి. ఒక దినుసు వస్త్రములు.

సీ. సంపంగి కావులు చందురు కావులు తెలి పట్టు జీబులు వేఁటచాళ్లు ...

ప్రబంధ. ౨౪౨.

వ. వరకంచులును బొమ్మంచులును ముయ్యంచులును వేఁటచాళ్లును నిండు వన్నెలును సుర వన్నెలును ... ద్వా. ౩. ౨౦౬.

**వేఁటపట్టు.** వి. (వేఁట + పట్టు) మృగయాస్థానము, వేఁటాడుచోటు.

చ. తలఁపుల తిట్ల భావముల తానక మాసల పుట్టినిల్లు గో,ర్కుల నెలవీడు వల్వగల కూట మవస్థల జన్మదేశ ము,మ్మలికల వెంట వేదనలమందు మనోభవు వేఁటపట్టుమూర్ఛల సహవాసమన్విరహ సంతత తాపము వొందెఁ బార్వతిన్. కు. సం. ౫. ౫౭౪.

**వేఁటపల్లె.** వి. (వేఁట + పల్లె.) బోయగూడెము, పక్కణము.

సీ. వింధ్యాద్రి నడుమ నిర్వింధ్యాతటంబునఁ గానలో నొక్క పక్కణము గలదు, పింగాక్షుఁడనియెడు పేరివాఁడా వేఁట పలె యేలెడు భిల్ల పరివృఢుండు ... కాశీ. ౪. ౬౦.

**వేఁటపిట్ట.** వి. (వేఁట + పిట్ట.) దీమపు పిట్ట, పక్షులను పట్టుకొనుటకై వేఁటగానిచేఁ బెంపబడు పక్షి. (శ. ర.)

**వేఁటమ్ము.** వి. (వేఁట + అమ్ము.) వేఁటకుఁ బనికివచ్చు బాణము.

సీ. కంగు కంగున నేలఁ గైదప్పుగాఁ బడు వేఁటమ్ము లేఁటికి దాఁటిదాఁటి ... మనుచ. ౪. ౧౦౩.

**వేఁటయిట్టి.** వి. (వేఁట + ఇట్టి.) ఇట్టులను వేఁటాడుటకై పెంచఁబడిన యిట్టి. (లేడి.)

గీ. కొమ్ముటురులఁ గాలి గుండులు చిలుకూర, లఱుత గవ్వదండ లలఁతిగంట, లమరసారెఁ బెదవు లల్లార్చి గురగుర, మనుచు వేఁట యిట్టు లరుగుదెంచె. చంద్ర. ౨. ౨౨.

**వేఁటరి.** వి. (వేఁట + అరి[3]) వేఁటకాఁడు.

చ. ... నృపాల నందనుం, డలరుచు వేఁటకై చన రయంబున వేఁటరు లెల్ల నత్తఱిన్. ఇందు. ౨. ౫౪.

ఉ. అతమగంబుపై నరవరాగ్రణి సమ్ముఖవర్తి మానవ, వ్రాతముతోడ నెక్కి నిడు వాలిక తూఁపులు చాపతండమున్, జేతులఁ బూని వేఁటరులఁ జేరి మృగంబులఁ జోపఁబంపి ని,ర్భీత కిరాతులన్ వలల క్రేవల గొందలి నిల్పెఁ జాల్పుగన్. చిత్రభా. ౩. ౧౩౪.

**వేఁటలాడు** = వేఁటాడు. స. క్రి. (వేఁటలు + అడు.) ౧. వధించు, చంపు.

ఉ. ఓ నరవర్య రాముఁ డసురోత్కరముల్ మును వేఁటలాడుచుం, దా నచటన్ వసించుట శ్రుతంబగు రామవియత్పురంజనన్ ... పరమ. ౫. ౪౪.

౨. ఏయు, (బాణములను) ప్రయోగించు.

తే. అనుదినంబును రాజనందనులమీఁద, వేఁటలాడుచు నున్నాఁడు విషమశరుఁడు ... నైష. ౩. ౨౬.

**వేఁటలుపట్టు.** స. క్రి. (√ వేఁట.) మేఁకపోతులు పొట్టేళ్లు మొదలగు వానిని బలియిచ్చు.

తే॥ గీ॥ తల్లిదండ్రులు దాను సద్దైవమునకుఁ, బ్రణతు లొనరించి వేఁటలుపట్టి పిదపఁ, బక్కణము లోని శబర దంపతులతోడ, నన్నపానాదు లొనరించు నవసరమున. కాళ. ౩. ౪౦.

**వేఁటాడు.** స. క్రి. (వేఁట+అడు.) ౧. అడవియందు వలలు దీములు మొదలగువాని నొగ్గి మృగములను పక్షులను వధించు.

వ. పొలంబులన్ బులుఁగులన్ జోపుచు డేగ
వేఁటకాండ్రు వేఁటుపడి వేఁటాడన్ హొడంగి
రందు. మనుచ. ౪. ౫౫.

౨. వధించు, సంహరించు.

క. మీఁటుగల రాజరథికుల, నాఁటికి వేవుర
వధింతు నరుశరములు నో, నాఁటి పడవైచు
నంతకు, వేఁటాడెదఁ బ్రతిబలంబు వీరుల
నెల్లన్. భార. ఉద్యో. ౪. ౪౦౮.

౩. పోఁగొట్టు, నశింపఁజేయు.

ఆ. వేఁడివేలు పిపము వేఁటాడుపోటరి, ప్రొద్దు
తూర్పుమలను బొడమె నపుడు ...
నీలా. ౩. ౪౫.

వేఁడి1. వి. ౧. ఉష్ణత, వేఁడిమి.

గీ. వేఁడియొల్ల నుడిపి విబుధారి కినుకమై, భీతి
పాత్రుఁ జేసి వీతిహోత్రు ...
నృసిం. ౨. ౧౧౭.

క. వేసవి వేఁడి సహింపక, వేసరు జీవులకునెల్ల
విశ్రాంతికర, శ్రీ సంపాదనకరమై, యాస
న్నంబయ్యె నంబుదాగమమంతన్.
విక్ర. ౪. ౨౬.

తే. ...కందువారల నిట్టూర్పు గాడ్పు వేఁడి,
ముకురములు చారు మోహనమూర్తి యనఁగ,
బరఁగు దమయంతిచేతి దర్పణము దక్క.
నైష. ౧. ౮౦.

౨. సంతాపము, విరహ సంతాపము.

సీ. ...తన పరిపాలనంబునఁ బరమసుఖులఁ,

ఆ. గానొనర్చువాఁడు గానప్పగించిన, వాఁడ
నేను మీకు వేఁడి దాఁకు,నట్లుగాఁ జరిం
ప(ను) ... భార. ఆశ్ర. ౧. ౯౩.

గీ. కుచ్చితం బింత యెఱుఁగద మ్మెచ్చెకంటి,
కంటి విఖ్యాతి నాతిఁ గైకొంటి వనుచు,
నచటి జూటలు నస గొంటు లతని వేఁడి,
వేఁడిమీఁదను ద్రోచిరి వెట్టిరేఁచి.
బహు. ౫. ౧౦౭.

౩. తేజము, ప్రతాపము.

క. అపరిమితమైన నీ యుగ్రపు వేఁడిం
బ్రాణులెల్లఁ గ్రాఁగెడుఁ దేజం, బుపసంహ
రింపు సృష్టికి, విపరీతము పుట్టకుండ విశ్వ
మయాత్మా. మార్క. ౮. ౭౪.

చ. దనుజ బలంబుపై నడరి తచ్ఛిఖి వేఁడిన
కానసేర్చు చెన్నున నలిరేఁగి కాల్పఁగఁ
గనుంగొని యంతకుమున్నె వచ్చి య,య్యని
తెఱఁగెల్లఁ జూచు చతురాస్య గిరీశ సురేశ
ముఖ్యు ల,య్యనసుతు రోష శక్తి నుతియిం
చిరి యెంచిరి రాక్షసేంద్రునిన్.
ఉ. రా. ౩. ౩౫౫.

క. వీఁడే దిలీప భూపతి, వాఁడితనంబునను కాన
వచ్చునె మరుచేఁ, బోఁడిమి యతి యున్న
ప్పుడె, వేఁడి మెయిం బట్టి తెత్తు వేల్పులు
బెగడన్. సుద. ౫. ౬.

౪. తీక్ష్ణత.

ఆ. సప్తహయుఁడు మూర్తి సప్తకంబు ధరించి,
కరము వేఁడి మిగులు కరములొప్ప, నదనదీ
జలములును దధిజలంబులుఁ, బీల్చి జగము
లెల్లఁ బ్రేల్చుఁ గడఁగి.
భార. అర. ౪. ౨౪౩.

మ. తమ భోగార్థ పదార్థ సంతతుల నిత్తన్వంగి
కేళీవనిన్, రమణుల్ దానును జూఱలాడె
నిదిగో రాజీవ బాణాయటం,చు మదాళివ్రజ
కీరకోకిలము లచ్చో హెచ్చో నుచ్చైస్స్వనం,
బమరన్ ద్రోఁగెడి నాఁ దదీయ రవ
మొప్పారెన్ గడున్ వేఁడిమై.
ఇందు. ౩. ౮౩.

విణ. ౧. వెచ్చనిది, ఉష్ణము.

సీ. ఉడివోని వేఁడి నిట్టూర్పు గాడుపుల బల్వ
డలఁ గెంజిగిమోవి వాడువాఱ ...
నీలా. ౨. ౭౩.

ఆ. భామలార రండు నా ముద్దు తనయుండు,
వేఁడివేఁడి యనుచు వేఁడివేఁడి, వేఁడివేఁడి
నీరు వెడఁద కాటుకకంటె, కొలుకులండ
మాటి కొలుకుచుండ. సారంగ. ౩. ౪౯.

౨. తీక్ష్ణము, ఉగ్రము.

సీ. ఆయుధ ప్రభఁ గాంచి యలఁగు భీరువుఁబూను
వాఁడి ముమ్మొనల వేఁడియలుఁగు ...
పాండు. ౧. ౧౦౧.

గీ. చూచి యా దివ్యపురుషుండు నూఁచు వేఁడి,
చూపులకు జంకెలకుఁ జెంత సుడియఁజెఱచి...
ఉ. రా. ౪. ౧౧.

౩. పరుషము, కర్ణకఠోరము.

ఆ. ... అట్టిజెట్టి నిన్ని దినము లట్లు దొడరి
పెనఁగియు నీచేత, నేఁడు వినఁగ వలసె వేఁడి
పలుకు. భార. భీష్మ. ౩. ౧౭౩.

క....భరతునిఁ బట్టము, నిలుపం గట్టుటయు
రాము నీరేడబ్దంబులు కానకుఁ బొమ్మను
టయు, నిలువేల్పులు సాక్షిగాఁగ నిక్కే
కొండున్.

ఉ. వేఁడిన వేఁడిమాట నృపవీరుడు సైఁపక
కర్ణరంధ్రముల్, నూఁడిన భంగిఁ దాఁకు
టయు ... భా. రా. అయో. ౧౯.

౪. దుఃఖకరము, సంతాపకరము.

చ. అలఘుఁడు వాలి రామ వసుధాధిపు ఘోర
శిలీముఖంబుచే, నిలిగిన వేఁడిమాట విని
యెంతయు నుల్లము జల్లనంగఁ గొందల
వడి తార ... భా. రా. కిష్కిం. ౨౬౬.

ద్వి. ఎడపక నను విక్రయించి చెల్లింపు, కడఁ
బడుఁ గొంతెనఁ గౌశికు బుణము ... మది
రాకి యీ వేఁడి మాట నా చెవులఁ, గది
యించి పాపంబు గట్టుకోఁ దగునె.
ద్వి. హరిశ్చ. ఉత్త. ౨౧౩.

వేఁడి2(డీ). స. (వేఁడు3 + ఇ.) ఎక్కుడ నున్న
వాఁడు. (రూ. ఏఁడి, ఏఁడీ.)

ఉ. పోఁడిగ నెందునుం గలఁడు పొమ్మను
దానుని జిహ్వనుండి యో, వేఁడి రమా
విభుం డనెడి వీతేఁడి దైత్యుని దృష్టినుండి
యో, వాఁడిది ప్రేయునింక నని వావిరిఁ
గంబమునందు నుండియో, నాఁడటు లుద్భ
వించుట యనందగు సర్వగతాత్ముఁ
డల్పుఁడే. భోజరా. ౧౭౪.

ఎ. గీ. పాదఘట్టన మేదినీ భాగము గల, గంగ్ర
గొడ్డలి భుజమున గ్రాలవేఁడి, వేఁడి రాముఁ
డటంచును విలయరుద్ర రౌద్రమున వచ్చె
భార్గవ రాముఁ డపుడు. దశా. ౩. ౨౯౭.

క. పార్థుఁడు వేఁడీ పొడుపుఁడుఁ, బార్థుఁడ
యెట వోయెదిఁకఁ బార్థుఁడ రావే ...
భార. ద్రోణ. ౩. ౪౬.

ఆ. అచటి జనులనడిగె నయ్యె వేఁడీయని, గద్ద
దిక నెలుంగు గదలు కొనఁగ ...
భార. ఆశ్ర. ౨. ౩౧.

వేఁడించు. స. క్రి. (√ వేఁడు.) వేఁడఁజేయు,
ప్రార్థించునట్లు చేయు.

సీ...గీ. ఏ ఘనునినైన వేఁడించు నీశుభాంగి,
తనువు బంగార మేమొ యే ధన్యునైన,
మరులుఁ జెందించు నిది మరు మాయ
యేమొ, యనుచుఁ జూచిన జనములు వినుతి
సేయు. బిల్హ. ౧. ౫౩.

వేఁడికంటి. వి. (వేఁడి + కన్ను.) శివుఁడు, ఉగ్రా
క్షుఁడు.

ఉ. తొంగలి పువ్వుఁ దేనియలఁ దూకొని
మత్తిలి తుమ్మెదల్ పయిన్, బొంగుచు
వ్రాల నొప్పెసఁగు పూచిన పొన్నఁ గడంగి
కాంచి మున్, గ్రమ్మిన యా విసంబు పెస
మీఁదికిఁ బిచ్చిలు వేఁడి కంటె యా, జంగ
మటంచు మ్రొక్కె నొక చాన నెలంతలు
చూచి నవ్వఁగన్. యయా. ౮౧౫.

**వేఁడి(డు)కొను.** స. క్రి. (వేఁడు + కొను.-స్వార్థమున) ౧. యాచించు.

క. వేఁడికొని కృపణులై కను,పోఁడిమి యది యేల రాజపుత్రులు దమమై, వాఁడిమి దప్పిన నిప్పులు, వేఁడిమి సెడినట్లు జనులు విని యులుకుదురే. భార. ఉద్యో. ౩౯౪.

౨. ప్రార్థించు.

తే. వేఁడికొనియెదఁ జిరురాకు బోఁడినిన్ను... నైష. ౩. ౧౨౯.

సీ. కపురంపు విడెమిచ్చు కలికి ముచ్చటవిన వేడ్కయై మాటాడ వేఁడుకొనుచు ... ఉ. రా. ౮. ౮౭.

**వేఁడికోలు.** వి. (√వేఁడుకొను.) యాచించుట.

మత్త. వేఁడు టెంతయుఁ గష్టమైనను వేఱు లేని సుహృజ్జనున్, వేఁడికోలుచితంబు కావున వేడ్కతోఁ జని సోమకున్, వేఁడినన్ ... భార. ఆది. ౫. ౨౧౭.

**వేఁడిమి.** వి. (√వేఁడి.) ౧. ఉష్ణత, తాపము.

క. ...రాజపుత్త్రులు దమమై, వాఁడిమి దప్పిన నిప్పులు, వేఁడిమి సెడినట్లు జనులు విని యులుకుదురే. భార. ఉద్యో. ౩. ౧౯౪.

చ. విలయ కృశానుకీలముల వేఁడిమిఁ బోఁడిమి మారి ... మనుచ. ౨. ౧౦.

౨. సంతాపము.

క. ...ఏ, నేఁడు వధింతును నెవ్వగ, వేఁడిమి బడఁజాల కొక్క పెరవు దలఁచితిన్. భార. సౌప్తి. ౧. ౫౦.

౩. ప్రతాపము.

క. వీఁడొకఁడు కురుబలంబున, వాఁడి మగండనఁగఁ జాలు వాఁడిబ్బంగిం, బోఁడిమి సెడి యేను ద్రోణుల, వేఁడిమి యిట మనకు మునుమ విక్రమమునకున్. భార. విరా. ౫. ౧౧౦.

ఉ. ...నీ, వేఁడిమిఁజూపి యాధవుల విత్తడఁగం దునుమాడి ... భా. రా. యుద్ధ. ౪౩౩.

౪. తీక్ష్ణత, కఱకుఁదనము.

క. నేఁడీ బ్రాహ్మణుచేతం, బోఁడిమి సెడి యేను జిక్కి పోవక యుండన్, వేఁడిమి మెఱయు శరంబుల, వాఁడిమి సొంపెల్లఁ జూప వలయుం జుమ్మీ. భార. ద్రోణ. ౧. ౨౩౨.

౫. చుఱుకుఁదనము.

ఉ. ...నీ, వేఁడిమి జూపి రూపడంపు వీనిఁ బురందర పుత్త్రి యంతలో, బోఁడిమి మాలు నాతఁడు ప్రభూత జయోన్నతి నిల్చు నీ కడన్. భార. కర్ణ. ౧. ౬౭.

క. మూఁడవ విల్లెత్త నదియుఁ, బోఁడిమి చెడి పోవ నసుర పొలుపరి యలుకన్, వాఁడిమి యొసఁగఁగ నొక గద, వేఁడిమితోఁ జైచె వృష్ణి విభుసతి మీఁదన్. హరి. ఉ. ౮. ౧౫౪.

విణ. కఠినము.

ద్వి. వేఁడిమి హృదయ మీ విప్రున కపుడు, వీఁడు కొండికవాఁడు విపిన భూములకుఁ, గనికరింపక పంపఁగా నెట్లువచ్చు, ననక కృపాహీనుఁడై నిన్నుఁ బంపె ... ద్వి. హరిశ్చ. ఉత్త. ౧౭౬౧. పం.

వేఁడిమికన్దొర. వి. (వేఁడిమి + కన్ను + దొర.) శివుఁడు, ఉగ్రాక్షుఁడు.

క. ఓఁడుల రాయఁడ విను మి, వ్వాఁడిమిఁగ లయ్యాముసకు వచ్చినచో న,వ్వేఁడిమి కన్దొర యైనన్, బోడిమితో గెలుచుటకును బోలుదురు సుమీ. అచ్చ. రా. కిష్కి. ౧. ౩౫.

వేఁడివెలుఁగు. వి. (వేఁడి + వెలుఁగు.) ఉష్ణకిరణుఁడు, సూర్యుఁడు.

ఉ. వేఁడిననట్లు కాక పృథివిం జిరకాల మభీష్టసౌఖ్యముల్, పోఁడిగ మీరు గాంచి మఱి పొందుఁడు మద్గతియంచుఁ జెప్పియున్, వేఁడి వెలుఁగులోలిఁ బదివేల సహస్రములున్న భంగి నె,వ్వాఁడు వెలుంగునట్టి బుధవత్సలుఁ డేఁగె నదృశ్యమూర్తియై. భోజ. రా. ౩౫౧.

క. కడకడలి వేఁడి వెలుంగను, జడదారి వడిన్మనుంగఁ జనిజేగురు ప,చ్చడ మాఱఁ గట్టె దరిననఁ, బడమట నెఱసంజ నిండె బలువుగ మఱియున్. యయా. ౨. ౬౯.

వేఁడివేలుపు(ల్పు). వి. (వేఁడి + వేలుపు.) ౧. ఉష్ణకరుఁడు, సూర్యుఁడు.

ద్వి. వేఁడివేలుపుడిగి వెచ్చిద్వీపంబు, వేఁడేర్పు రీతి నింతింతనరాని, పటు రౌద్ర రేఖ చొప్పడ... ద్వి. హరిశ్చ. పూ. ౧౧౫౪.

ఆ. వె. తొగల యొదురుచుక్క ముగురు వేల్పుల యిక్క, జగము విందు తమ్మి మగుడ పొందు, కాఁడు వేఁడి వేల్పు గాముల యొకి మీఁడు, తూర్పు కొండమీఁదఁ దోఁచె నంత. అచ్చ. రా. అయో. ౪౧.

చ. ఉదిరి పసిండి చాయగల యొప్పుల కుప్పలు వేఁడి వేలుపుం, గొదమలు దావపావకుని కుఱ్ఱలు చిచ్చుఱకంటి నెచ్చెలుల్ ... వానర వీరు లొక్కటన్, బొదివిరి లంకచుట్టును భూగగనంబులు నిండ నార్చుచున్. రామా. ౭. ౧౩౦.

౨. అగ్ని దేవుఁడు, జ్వలనుఁడు.

ఉ. ...వేఁడి వేల్పునా, నొప్పెడు కప్పుఁ గ్రోవ దొరయున్ వలి గ్రుక్కి హసంతికాచలం, బుప్పతిలంగు రాశముల నొందెడు పొన్నుల క్రింద వర్తిలున్. సమీర. ౨. ౧౦౫.

సీ. జేజేయనుచు మ్రొక్కి జేజేల రాయఁడు వేఁడికోనని చూచు వేఁడివేల్పు ... దశా. ౧. ౨౩౭.

గీ. వేఁడివేల్పుత కనయగు వాఁడి ముల్కి, యొకటి సింగొణిఁ గూర్చి యేయుడుఁ గడింది, మీఱ నదివాని పెన్బొర దూఱి చనిన, నల్లతోఁ దోఁగి కడు సొమ్మసిల్లి తెలిసి. అచ్చ. రా. యు. ౩౪౩.

వేఁడు[1]. స. క్రి. (వేఁడ్డు.) ౧. యాచించు.

మత్త. వేఁడు టెంతయుఁ గష్టమైనను వేఱులేని సుహృజ్జనుల్, వేఁడికో లుచితంబ... భార. ఆది. ౫. ౨౧౭.

క. పదునాలుగు లోకంబులు, నుదరస్థములుగ జరించు చుండెడు లక్ష్మీశ, హృదయేశుఁడు నిను వేఁడఁగ, బ్రదికితి నీ బ్రదుకు బ్రదుకు బలి భూపాలా. విక్ర. ౨. ౧౫౦.

చ. ...నిన్ను దేవతా, విసరము యాచకత్వమున వేఁడఁగ వచ్చుట ... నైష. ౩. ౬౯.

౨. ప్రార్థించు.

ఉ. వీరకుమార యేను నిను వేఁడెదఁ బ్రార్థన సల్పుమయ్య పెం,పార మఖుం బొనర్పఁగఁ బ్రియంపడి దక్షిణలేమి వచ్చితిన్ ... మార్క. ౩. ౭౯.

చ. ...కొల్వున కేఁగుదెంచి మన్ననఁ బ్రజ
విన్నపంబులు వినంగదవయ్య నృపాలవేఁడె
దన్. విక్ర. ౩. ౪౪.

గీ. పోయి సేవింప లేకున్న పుణ్యతీర్థ, మహిమ
వినుటయు నఖిల కల్మషహారంబ, కాన
వేఁడెద ననిన నమ్మౌనివర్యుఁ, డాదరా
యత్త చిత్తుఁడై యతని కనియె.
మనుచ. ౧. ౬౯.

౩. కోరు, అడుగు.

గీ. ఇట్లు ప్రత్యక్షమై నీ యభీష్ట మెద్ది, వేఁడు
మిచ్చెద ననిన న వ్విప్రవరుఁడు ...
విక్ర. ౩. ౫.

క. నారించి నీకు నెయ్యది, కోరిక యే తెంచి
నాఁడ గురుదక్షిణ యా, భూరమణ వేఁడు
మనుటయు ... ఆము. ౩. ౫౪.

శా....దేవాపి సంజ్ఞావంతుఁడు సబాంధవుం
డగుచు ని, శ్శంకన్ ననున్వేఁడు వాఁడై ...
మనుచ. ౬. ౪౩.

రగడ. ననలు వేఁడిన మొఱఁగి తప్పుడు నాలి
నాలి కుచంబు ముట్టకు... పారి. ౪. ౧౬.

౪. తలఁచు.

ఆ. ఎక్కుడైన రవము నెసకంపు టుబ్బున,
బొదలు చున్న వారు ముదముకతన, నెదిరి
తమ్ము నించుకేనియు నెఱుగరు, వీరుఁగొవ్వి
చావ వేఁడిరకట. భార. ద్రో. ౧. ౨౩౫.

మ. లయకాలంబునఁ బ్రాణి జాతమున నాల
స్యంబుమై మ్రింగ వేఁడి యుదగ్రోద్ధతిఁ
దోఁచు దండధరు మాడ్కిన్ వచ్చు
దుర్వార నిశ్చయు నా శాత్రవుఁ జూచి...
హరి. ఉ. ౧. ౧౫౧.

గీ. వెదకి కానక వాఁడు నా హృదయ
మెఱుఁగ, వేఁడి దాగెనో యని బహిర్వేదిఁ
జూచి ... శుక. ౩. ౩౦౫.

వేఁడు[2]. స. ఎవఁడు. (బ. వేరు.)

గీ. నిలిచి చారుల రావించి యిలయు దివియు,
ముంచు కపివీరసేనల మించు గాంచి, వీరిలో
ముఖ్యులెవ్వారు వేఁడు రాముఁడతని యను
జన్ముఁ డెట్టివాఁడనుచుఁ బలుక.
రామా. ౩. ౧౯౨. (శ. ర.)

ద్వి. సారంగధర నీదు చక్కఁదనంబు, వేరికిఁ
దగునని ప్రియము లాడుచును ...
ద్వి. శ. సా. ౧. ౪౭౦. పం.

వేఁత = వ్రేఁత. వి. (√ వేయు.) ౧. వేయుట,
౨. దెబ్బ, హతి.

మ....వసుధాత్రీ భృన్నఖాగ్రంబు వేఁతకు
బిట్టోర్చిన గట్టు దా వెఱచునే దంభోళి
భృత్కేలికిన్. వసు. ౫. ౮.

౩. ఇది కొన్ని ధాతువుల కనుప్రయుక్త మగు
చుండును.

సీ. గడ్డంబు వపనంబుఁ గావించు మంగలి
కొఱఁత పెట్టునె తల గొఱిగివేఁత ...
రాఘ. ౪. ౯౯.

వేఁదుఱిది. విణ. (వేఁదుఱు + ఇది.) వెఱ్ఱిది,
పిచ్చియెత్తినది.

ఉ. వా నిని పల్కెఁ బంట చెలి నన్నిటు
వేఁదుఱి దానిఁజేసి నీ, వీవగ లీ వినోదగతు
లేటికిఁ జూపెదు తేటయయ్యె ...
మృ. వి. ౩. ౨౯.

వేఁదుఱు. వి. ౧. ఉన్మాదము, పిచ్చి.

ఉ. వేఁదుఱు గొన్న మానవుని వెమఱుగంటియు
బిట్టు గాల్చియున్, మోఁదియు నీటఁ
ద్రొక్కియును మున్కని తీర్పఁగడంగు
వెజ్జున, ట్లేఁదఁగ నిన్ని చందముల నీతనిఁ
దీర్చుటకై పెనంగితిన్... నృసిం. ౫. ౧౨.

గీ....విజయుపాలునితోడ నుచితభంగి మాట
లాడిన వేఁదురు మానవోపు ...
విక్ర. 3. ౧౦౮.

ద్వి. తొలుత వేఁదుఱుగన్న దుష్టమర్కటము,
సొలయక భూతంబు సోకిన రీతి ...
ద్వి. హరివ. పూ. ౧౪౮౪. పం.

౨. అవివేకము.

క. విను కొడుకు గొన్న వేఁదుఱు,కొని కొట్టిన
తిండి కాఁడు కుటిలుం డతఁడా, జనపతి
చందము ధర్మజా,ననుపమ శీలంబు నెఱుఁగు
దదియొట్లుండెన్. భార. ఉద్యో. ౧. ౫౬.

క. విను నాతండ్రికిఁ బుట్టిన, పెను వేఁదుఱు
నీకుఁబుట్టి పీతాంబరునిన్, వినుతించి కొలు
వఁగా వల, దని పలికెద వకట యెంత
యజ్ఞానివొకో. వి. పుం. ౨. ౨౯౦.

౩. పిశాచము.

క. నావుడు మురారి నవ్వుచు, నా వేఁదుఱు
నూఱడించి యనుచితము మహీ, దేవునిఁ
జంపుట యనుచుం, గైకెక్కిన వానిమేను
కరమున నిమిరెన్. ఉ హరి. ౨. ౧౫౦.

విశ. ౧. ఉన్మత్తుఁడు, పిచ్చివాఁడు.

ఉ. ప్రేఁకని బండివానికిని విప్రునికిం బతికి న్వి
వాదికిన్, ప్రేఁకని మోపువానికిని వృద్ధునకుం
గడుఁ జిన్న బిడ్డకున్, ప్రేఁకటి యాఁడు
మానిసికి వేఁదురు వానికిఁ దెవ్వుగొంటుకుం,
దేఁకువలోఁ దొలంగునది తెల్లముగా నెదు
రేఁగు దెంచినన్. విజ్ఞా. ౨. ౧౬.

వ. అతఁడు మరలిచూచి పైధూళి సల్లియు
నుమిసియు వేఁదుఱు చందంబు భావింప
నా భూవల్లభుండు... భార. అశ్వ. ౧. ౪౩.

౨. వివేకహీనుఁడు.

సీ. విజయుండు సచ్చునే వేఁదుఱులార యిం
ద్రునిచేతనైన నీతనికి నొక్క ప్రియము
సేయంగఁ గోరి ...
భార. అశ్వ. ౪. ౭౨.

ఆ. పరుల మర్మమెత్తి పలుకనివా రన్య, భామి
నులకు నాస పడని వారుఁ, దలఁచి చూడ
దేవతా సమానులనంగ, వినవె నీతి యేల
వేఁదువైతి. సారంగ. 3. ౭౯.

క. కులసతి నమ్మెడు వేఁదుఱు, గలడే యని
పరిహసింపఁ గావలదు నా, పలుకులఁవిని
ననుఁ గృపతో, తెలియఁగ రక్షింపరయ్య
వేఁడెద మిమ్మున్. హరివ. ౪. ౭౯.

వేఁదుఱుకొను. అ. క్రి. (వేఁదుఱు + కొను.)
పిచ్చియెత్తు.

చ. అఱువుడు కుప్పసంబమర నొఁదలఁ దాలిక
లైన పెండ్రుకల్, తఱుచుగఁ దూలి యాడ
దవు దవ్వులఁ గన్గొని సారమేయముల్,
మొఱుగఁగఁ బౌర బాలకులు మూఁకలు
గట్టి పిఱుంద రాఁగ వేఁదుఱుకొని వచ్చు
వానిక్రియఁ దూఁగుచు వచ్చె నొకండు
బిక్షుకున్. భోజ. రా. ౩. ౪౨.

వేఁదుఱులు. వి. బ. అకారణ హాసములు, పిచ్చి
నవ్వులు.

గీ. అద్యతన రాజ విభవంబు లపహసించు,
తెఱఁగుదోఁప నలంతి వేఁదుఱుల్ నవ్వఁ,
గాశ్యపర్షి మనంబునఁ గౌతుకంబు, సంత
తంబు జనింప శాకుంతలుండు.
పి. శకుం. ౪. ౬౪.

వేఁదుఱెత్తు. అ. క్రి. ఉన్మాదము పట్టు, పిచ్చి
పట్టు.

వ. ... అన్నాగవాసంబు నాగరక విలోకనం
బునం బెలరేఁగి మొగంబులు బిగించుకొని
వేఁదుఱెత్తిన గతిని ... ఆము. ౪. ౩౫.

వేఁపి. వి. (√వేఁగు.) కుక్క, వేఁటకుక్క.

ఉ. ... ఆమిషబుద్ధి వేఁపి యమరాలయ మూల్యముఁ గాదు దాల్చిన,ట్లామఘు వారి యాత్మపురి కాశ్రమధారణి నుండి తెచ్చి దు,ష్కామత నిల్పినట్టి మహికన్యను జూచె నధూషితాకృతిన్. చం. రా. ౪. ౩౩.

క. బొఱియవడ వేఁపు లోకికిటిఁ, గఱచి వఱచి కూర్చినపుడు ... శుక. ౧. ౧౨౩.

వేఁపికాఁడు. విశే. (వేఁపి + కాఁడు.) కుక్కలచే వేఁటాడువాఁడు.

ఉ. అత్తఱి వేఁపికాండ్రు యమునాంబు తరంగ పరంపరాకృతిన్, ముత్తరమైన సూకరస ముత్కరముం గని ... మనుచ. ౪. ౪౦.

వేఁపు = వ్రేఁపు. వి. (√వేఁగు.) వేఁచుట, వేఁపుడు. (శ. ర.)

వేఁపుడు = వ్రేఁపుడు. వి. (√వేఁగు.) ౧. వేఁచుట, భర్జనము, వేఁచినకూర.

మ. ... తాలింపు సొంపున్ నింపు వంకాయ వేఁపుడు గమ్మఁదనమందు కందయును పుంబొట్లల్ రుటంబైన చిక్కుడు జట్టల్ మొనలైన శాకములు నోలుక్రం బప్పు వడ్డింపఁగన్. రా. వి. ౨. ౧౦౦.

౨. వేఁచెడు చట్టి, బాణలి. (శ. ర.)

విశే. వేఁచినది.

క. అంపంపఁ దిరుగఁబోఁత బు,గుల దింపఁగ గుడము నిగుడఁ గమ్మని నేతం, బొందుగ వేఁచిన వేఁపుడుఁ, గందముకుందాదులకు నొకతె వడ్డించెన్. బహు. ౪. ౧౩.

గీ. ఎడమచెన దొడ్డుగాఁబెంచి యేకులెల్లఁ, గలనఁ బలువగ వేఁపుడు గింజ లునిచి, చేవ పీఁటల మీఁద నా సేనలైన, వారలై ... శుక. ౨. ౪౨౦.

వేఁబోఁక = వేగుఁబోఁక. వి. ఔ. (వేఁగు + పోఁక.) వేకువ, ప్రభాతము.

క. పూఁబోణులకును విటులకు, వేఁబోకలఁ దలరు సొంపు వీడ్కోలుపుఁ బురిన్, వేఁబోకఁ బోఁక లోఁటల, బూబాళల కమ్మ తావిఁ బొదలిన గాడ్పుల్. భీమ. ౧. ౯౫.

సీ. తరుణులుఁ బతులు వాతాయనంబుల నల్లఁ బొలయు వేఁబోకటి మలయపవను ... భార. విరా. ౨. ౨౩౭.

వేకటుఁడు. సం. వి. అ. పుం. ౧. హాస్యగాఁడు, విదూషకుఁడు. ౨. స్వర్ణకారుఁడు, అగసాలి. ౩. పడుచు వాఁడు, తరుణుఁడు.

వేకువ. వి. (√వేగు.) ప్రభాతము, తెల్లవాఱుజాము.

క. ...త,జ్జననీ జనకులు బహువిధ, వినతులఁ గొనియాడి రంత వేకువ యయ్యెన్. భార. ఉద్యో. ౪. ౩౯౦.

చ. ...గుబ్బనఁ బలి దివ్య భవ్య మణిపాదుక లంఘ్రుల సంఘటించి యక్కనకపురంబు చొచ్చి తమకంబున నన్నిసి పుచ్చి వేకువన్. విక్ర. ౨. ౧౦౫.

గీ. కమ్మ కస్తురి గుళికలు తమ్మిలేమ, నిదుర ముంపునఁ బుక్కిట నించి మేలు, కాంచి వేకువ నుమిసె నాఁగమల మమళ, కోటరంబుల నెలదేఁటి కొదమ లెగసె. పారి. ౨. ౬౩.

వేగ. వి. (సం. వేగః.) ౧. త్వర, వేగిరపాటు.

వ. ...అ, ధృతరాష్ట్రుం డవినీతి సేసినను సంధింపంగ రాదంచు వేఁగ తెగంబొఱుకు ... భార. ఉద్యో. ౩. ౨౫.

సీ. నెఱి దప్పి సలిల మన్వేషించుచును వేగ వచ్చుచో నొకచోట ... భాగ. ౧౦. ఉ. ౪౫౪.

౨. వేగము, వడి.

సీ. కుండలమ్ములు వేగ కొనిరమ్ము నాలవ
నాఁటికి నని పూని నన్నుఁ బనిచె ...
భార. ఆది. ౧. ౧౧౪.

ద్వి. బాణాధి రాజమై పరగు నాదివ్య, బాణంబు
సంధించి బలు వేగ దివియ ...
రం. రా. ఉ. కాం. ౧౪౮. పా. ౫. పం.

మ. ...వా,విరి బ్రహ్మాస్త్రము నిన్న రేశ్వరునిపై
వేగం బ్రయోగింపు సుస్థిరలీలన్నమకూరు
నీకు జయలక్ష్మి నిత్య సాంగత్యముల్.
విక్ర. ౪. ౧౨౩.

-క్రి. విశ. (క. బేగ.) దీని యామ్రేడితరూపము
వేవేగ = త్వరితముగ.

చ. ... అ, యత ధనువెత్తి నూతుతల యక్కు-
రుఘస్మరుఁ వేసె డొల్ల వే,గ తొలఁగ
నీడ్చెఁ దేగు దురగంబులు మూఁక గలంగి
సొంపఱన్. భార. శల్య. ౧. ౨౪౧.

చ. మసలక యామిషంబు గొని మార్గము పట్టిన
తుచ్ఛ సైన్యముల్, వెసఁజని ముట్టి గోధ
నము వేగ మరల్తము గాక ...
భార. విరా. ౪. ౫౮

క. మామా యన్నియుఁ దెచ్చితి, తేమాన
మిదేల వేగ దీపము వలదా, యాముదము
దెమ్ము పొమ్మన, నా మంద విచారుఁడప్పు
డంగడి గరిగెన్. శుక. ౩. ౧౯౦.

క. ... వేవేగ నయోధ్యనేల వే ం చేయుఁ
దగన్. భా. రా. కిష్కిం. ౪౯౩.

మ. నవరత్నోజ్జ్వల దివ్య పుష్పక విమానం
బెక్కి వేవేగ విశ్రవసుం జేరి నమస్క-
రించి ... ఉ. రా. ౨. ౨౪౫.

వేగంటి. వి. (వే + కన్ను) సహస్రాక్షుఁడు,
దేవేంద్రుఁడు.

సీ. వేగంటి తేరి కావిమెఱుంగు పరుగ వీవలిఁ
బాయఁజేయు నుజ్జ్వల రథముల ...
చంద్రి. ౬. ౭౫.

గీ. దీనిఁ గనుఁగొన్న వేగంటి దేవరకును, వెచ్చ
నిట్టూర్పు పుక్కిట వెడలకున్నె ...
రామా. ౬. ౧౦౪.

వ. కంసారి మునుపు సారి వెడలిన దారిని దుము
దారిగా వేగంటి దునేదారి రాజసమ్మునను
మాసగమ్మునఁ దచ్ఛుభ వాసరమ్మున వచ్చు
నప్పు డప్పుడ వార్లెతెంచి.
ప్రబంధ. ౬౦౫.

వేగంటి నగరి. మి. వి. (వేగంటి + నగరి.)
ఇంద్రుని రాజధాని, స్వర్గము.

గీ. కంటిమో వింటిమో యిటువంటి వాలు,
గంటి ధర యందె కాదు వేగంటి నగరిఁ,
గలుగు తెఱగంటి తెలిగంటి గములనైన...
దశా. ౮. ౨౧౨.

వేగంటివే(లుపు)ల్పు. వి. (వేఁగంటి + వేల్పు.)
సహస్రాక్షుఁడు, ఇంద్రుఁడు.

గీ. రమ్య గాంధర్వ విద్యాధర గురుబుధ క,వి
ప్రతతితోడ వేగంటి వేల్పుజాడ, సకల
సామంత బాంధవ సమితి తోడ, నవ్య
మౌక్తిక సింహాసనమునఁ జెలఁగి.
ఇందు. ౫. ౫.

వేగన్నులతేఁడు. వి. (వే + కన్నులు +
అతఁడు.) సహస్రాక్షుఁడు, ఇంద్రుఁడు.

గీ. చేరి జేజేలు మఱి జడదారిగములు, నచ్చరలు
గొల్వ వేగన్నులతని మొదలి, రాచవెల
వేలెఁ బేర్మి నే రాజు తండ్రి, యతఁడు గొని
యాడ నెగడె యయాతి పుడమి.
యయా. ౧. ౧౯.

**వేగన్నులదొర.** వి. (వే + కన్నులు + దొర.) సహస్రాక్షుఁడు, ఇంద్రుఁడు.

క. వేగరులు వేగవేగమె, వేగన్నుల దొరను గాంచి విన్నప మనుచున్ ...మల్లుపు. ౨.౫.

**వేగపడు.** అ. క్రి. (వేగ + పడు.) తొందరపడు, త్వరపడు.

ఆ. వేగపడకు మనుజ విభు చేతి బలుఁపును, జూతు గాక యనిన కూరరేఖ, నగుచు మంత్రి వరుల మొగములు గనుఁగొని, యిట్టులనియె దానవేశ్వరుండు. నిర్వ. ౭. ౨౯.

క....తును సంభా,వించు నెడ నాతఁ డప్పుడుఁ, బాంచాలిం జూపి వేగ పడి యిట్లనియెన్. భార. విరా. ౨. ౩౯.

క....తముఁ దారెఱుఁగుట వేగప,డమి దాలిమి విడుపు గలుగుటయు లేని ప్రభు,త్వము గలదె.... భార. ఉద్యో. ౨. ౨౭.

గీ. చలము లోభిల్లు నొండొరు సమయఁ జేయ వేగపడి పెల్లు నొంచుచో వ్రేటుఁ బోటు, నాటు నగపాటు నొండొరు లోటుపడక, దారుణంబుగఁ బోరి రవ్వీరవరులు. భా. రా. అర. ౨. ౧౩౭.

**వేగపాటు.** వి. (√ వేగపడు.) తొందర పడుట, వేగిరపడుట.

చ. వలదని యెంత సెప్పినను వావిరిఁ గ్రై కడు వేగపాటు మైఁ,బలుమఱు వేల్లెడం దొడరఁ బాఱెడు ... భార. విరా. ౨. ౨౬౦.

క. వాలిం గనుంగొని రఘు భూ,పాలాగ్రణి యపుడు వేగపాటునఁ జాలన్, బోలఁగ ధర్మార్థ సమే,తాలాపముల నిటు లనియె నాతని తోడన్. భా. రా. కిష్కిం. ౨౫౧.

గీ. ...వేగపాటేల యతఁడు నీ విభుఁడగుటకు, సర్పనాదుల నిర్వీటి హరిభజింపు ... ఆము. ౫. ౮౨.

**వేగము.** సం. వి. అ. పుం. ౧. తాఁకు, దెబ్బ. ౨. వడి, త్వర. ౩. క్షోభము, అలజడి. ౪. ఉద్రేకము, ఉగ్రత. ౫. ప్రవాహము. ౬. ఉత్సాహము. ౭. బలము, శక్తి. ౮. (విషాది) ప్రసరణము. (విషాదులు) దేహమున వ్యాపించుట. ౯. అతిత్వర, తొందర. ౧౦. బాణ ప్రసారము, అమ్ముల వడి. ౧౧. కామము. ౧౨. లోపల నున్న యుద్రేకమును వెలువఱుచుట. ౧౩. సంతోషము, ఉల్లాసము. ౧౪. మలవిసర్జనము. ౧౫. పురుషుని వీర్యము, శుక్రము.

ఉ. విప్రకులుండ! వెల్వడుము వేగమ నీవును నీ నిషాదియున్ ... భార. ఆది. ౨. ౬౩.

**వేగరి.** వి. (వేగు + అరి$^{3}$.) చారుఁడు, వృత్తాంతము దెలుపువాఁడు; తెల్పునది.

క. అట వేగరులగు వారలు, పటురయమున నేఁగుదెంచి పంక్తిముఖున క,చ్చటి రాము కార్యగతు లు,త్కటమున నెఱిఁగించి రతఁడు తల్లడ మందన్. భా. రా. యు. ౧౬౧౦.

చ. వేలుఁవడి త్రోకకున్ భగిని వేగరిగాఁ బదు నాల్గువేల జో,దులు పదునాల్గు చేరువలతో మునుకోననికేఁగు దేఁటఁ ... చం. రా. ౫. ౪౩.

క. కనుఁగొని నిశ్చాఱ పడి చే,య్యాన మగుడి దశాస్యుఁ జేరి యంజలి బంధం, బొనరించి నిలిచి దేవర, వినుడొక వింతయని యనిరి వేగరులంతన్. ఉ. రా. ౩. ౨౨౩.

**వేగలము.** వి. సంక్షోభము, కలఁత.

క. ఈ గతి నందఱు యజన,చ్ఛాగముఁ గుర్కు-రముఁ జేసి చనుచుండంగా, నాగరిక వేది

విప్రుఁడు, వేగలమున నిలిచి భ్రాంతి వికలుం
డగుచున్. వేం. పంచ. ౩. ౧౮౪.

**వేగవాహి.** సం. విణ. (న్. నీ. న్.) వేగము
గలది, వడిగలది.

**వేగసరము.** సం. వి. అ. పుం. వేసడము. కంచర
గాడిద.

విణ. (అ. ఈ. అ.) వేగముగాఁ బోవునది.

**వేగాలము.** వి. (క. వేగాల్లు.) వేగము.

చంద్రాంగద ముద్రితా ముద్రిత ప్రతులలో నీ
పాఠమే కానవచ్చుచున్నది. వేం. పంచ
ప్రతుల యందును వేగల మను పాఠము
కనఁబడుచున్నది. గ్రంథాంతర సంవాదము
లేదు. సందర్భాను సారముగ నీ యర్థము
చెప్పఁబడినది.

సీ. ఈ తరుకుక్కు వేగాల పెన్న శక్యమె పుల్గు
నొడిసెల వేసిన ట్లొడిసి పట్టె ...
చంద్రా. ౨. ౪౪.

**వేగా(గ)లము.** వి. వేగము.

క. ఈగతి నందఱు యజన,చ్చాగముఁ గుర్కు
రముఁ జేసి చనుచుండఁగా, నాగరిక మేది
విప్రుఁడు, వేగలమున నిలిచి భ్రాంతి వికలుం
డగుచున్. వేం. పంచ. ౩. ౧౮౪.

(ఇంకను విచార్యము.)

**వేగి.** సం. విణ. (న్. నీ. న్.) వేగము గలది,
వడిగలది.

—వి. న్. పుం. ౧. వార్తావహుఁడు, సమా
చారము తెచ్చువాఁడు. ౨. డేఁగ, స్యేనము.

**వేగించు.** అ. క్రి. (√ వేగు.) జాగరణము చేయు,
మేలుకొని యుండు.

ఉ. కొంచక నీవు మద్యములఁ గ్రోలితి వాత్మ
గలంగ నాకు వేఁగించిన వాఁడ వీవు కను
కెంపులు నాకుఁ దెలంగ నన్ను వంచించిన
నీకె పూఁబొదల శ్రీ ఫలముం గనుఁగొంటి
వయ్యయో, పంచ శరుండు నా పయిని
బాణము వైచె నిదేమి చెప్పుమా.
గంధ. ౫౨.

గీ. అనుచు నటవచ్చి చెలిపను లొనరఁ జేసి,
యలసి వేగింపఁ జాలక యతివలెల్లఁ, గన్ను
దమ్ములు మోడ్చ నక్కలికి యంతఁ, దనదు
దండకు రాజు రాఁదలఁచి లేచి.
యయా. ౫. ౧౧౬.

గీ. చేరి యవ్వారి యగు భాష్పవారి ధార, లరుణ
రుచి కన్నుదామర లాని నిదుర, మాన్పరే
యెల్ల వెతఁజెంద మనుజనాథుఁ, డలఁత
నట్టులె వేగించి రనుజులెల్ల.
ఉ. రా. ౬. ౨. ౨౫.

—స. క్రి. ౧. (కాలము.) కడవఁజేయు, కడుపు,
పుచ్చు.

ద్వి. ఆ రాత్రి వేగించి యమ్మఱునాఁడు, యా
రమణులఁ గన్న యవటి కేతేర ...
రం. రా. బాల. ౧౩. పా. ౧౯. పం.

వ. ఓ యవ్వ కుశలంబున నున్నదానవే నిర్మను
ష్యంబైన యీ శక్తి స్థానంబునఁ జిర కాలం
బునం బట్టి యెట్టు వేగించుచున్నదానవు ...
కళా. ౩. ౧౧౫.

౨. సహించు, ఓర్చు.

ద్వి. శశిముఖియైన కౌసల్య సంపదల, విఱ్ఱవీఁగఁగ
సరిపెలఁదివై యుండి, వెత్తిదానవె యెట్లు
వేగించెదీవు ...
రం. రా. అయో. ౯౦. పా. ౩. పం.

క. వేగింపరాని వేదన, వేగింపఁగ నంత ప్రొద్దు
వేగియు నతికిన్, వేగకయుండెను దైవ
ని,యోగంబున నంతఁ బతి వియోగము
కతనన్. విక్ర. ౬. ౧౧౮.

ద్వి. కొంచె పట్టుటకునై కొంచని యంచ, యంచయొ నీకు వే యలివేణి వేణి, పట్టినఁ గడునెగ్గు పుట్టిన నిచట, నెట్టు వేగించెద మిఁకనైన నీవు, కవకవ నగకు జక్కవకవ బెదరు ...

అ. మ. క. ౨. ౧౧౫. పా. ౧౩. పం.

3. చేయు, నిర్వహించు.

గీ. ఎట్లు వేగింతు సంసార మిచటనుండి, యేల నినుఁబాసి యొంటి నా కిచటనుండఁ, గలుగ నిమ్ము పెక్కండ్రు బంధులును నాకు, బందువు గలండె నాకు నీసాటి వాఁడు.

శివరా. ౩. ౧౨౫.

వేగితము. సం. విణ. (అ. ఆ. అ.) త్వరపెట్టఁబడినది.

వేగిని. సం. వి. ఈ. స్త్రీ. నది; ఏఱు.

వేగిరకత్తె. విణ. (వేగిరము + కత్తె.) వేగిరపాటు కలది, త్వరపడునది.

గీ. ఎంత వేగిరకత్తెవే యింతి కాన, మా మగువఁ గొల్వ వచ్చితిమో మిటారి, యేరిఁ బోలుదు కొలిచిన వారిలోన, సుదతి యాకార గరిమంబు చూచి పలుకు. కువల. ౪. ౧౬౩.

ఉ. ... వీరిఁ గటాక్షములంచె యేలఁజాల్, వేగిరకత్తె వీవుచిత లీలఁ దలంతువో వేళ యెంతువో ?... విజ. వి. ౩. ౨౦౪.

వేగిరకాఁడు. విణ. (వేగిరము + కాఁడు.) వేగిరపాటు కలవాఁడు, త్వరపడువాఁడు.

ఉ. వేగిరకాఁడు మన్మథుఁడు వెన్కను ముందును జూడఁడంతకున్, వేగిరకాఁడు నీ విభుఁడు వీరిఁ గటాక్షము లంచె యేలఁ జాల్, వేగిరకత్తె వీవు ... విజ. వి. ౩. ౨౦౪.

వేగిరపడు. అ. క్రి. (వేగిరము + పడు.) తొందరపడు, త్వరపడు.

గీ. నన్ను గెల్చెద పరిఁడను నిన్ను జనకు, కడకుఁ బుచ్చెద వేగిర పడక నిలుము ...

భార. కర్ణ. ౨. ౩౩౧.

చ. అరుగుట చెప్పిరా కతల నాఁకలి దీర్చెద నన్నుఁ జాల వేగిరపడు చున్కి నీయుదర గేహము సొచ్చితిఁ జక్క వచ్చితిన్ ...

భా. రా. సుం ౫౦.

వ. అంత నరుణ కిరణాం డవ్యర్థాభిధానుం డగుచు వచ్చిన వేగిరపడి వాయునందనుండు సుయోధను నేఁడ సమయింతు నను సంరంభంబున. భార. భీష్మ ౨. ౩౯౬.

వేగిరపఱుచు. స. క్రి. (√ వేగిరపడు.) త్వరపఱుచు, తొందరపెట్టు.

క. రాఁ బనుపుఁడు పార్థివులఁ, దేఁబనుపుఁడు తెఱఁగు పఱచి తేరిట సఱువం, గాఁ బనుపుఁడు జయభేరిన్, వేఁ బనుపుఁడు కర్మకరుల వేగిర పఱుపన్.

కృ. శకుం. ౧. ౪౯.

వేగిరపాటు. వి. (√ వేగిరపడు.) తొందర.

ఉ. ఉల్లము శంకితం బగుచు నుండఁగ వేగిర పాటు మేలె ...

భార. ఉద్యో. ౧. ౧౬౫.

ఉ....అయోధ్య మా భరతుఁ డేలఁగ నే నియమించి దేహముం, దక్కఁడు వాఁడనైతి నుచితస్థితి వేగిరపాటు లొప్పునే.

భా. రా. యు. ౪౯౦.

ద్వి. యాగ దీక్షితునకు నలుగంగఁ దగునె, వేగిర పాటేల విజ్ఞాని కనిన, ననుజూడ తన లోన ననిశంబు మండి, కనలెడు శత్రుండు గాద కోపంబు ...

రం. రా. ఉ. ౧౩౧. పా. ౫. పం.

వేగిరపెట్టు. స. క్రి. (వేగిరము + పెట్టు.) త్వర పెట్టు, తొందరపడఁ జేయు.

వ. ప్రతీహారి ససంభ్రమ గతిం జని భూవల్లభు నకుం బ్రణమిల్లి భూమింజయు ప్రవేశంబు తెఱంగు విన్నవించిన నా రథిక సారథులం జూచు వేడ్క మనంబు వేగిరపెట్టెడు న య్యుత్తరువుర నిర్యోఢకుం జయ్యనఁ దోడి తెమ్మను విభుని పలుకులు విని ...
భార. విరా. ౫. ౨౬౪.

**వేగిరము.** వి. (సం. వేగః.) ౧. వేగము.

క. పెరవు మెయిఁదాన కతిపయ, పరిజన సహితముగ నరిఁగె బటుతురగగతి, స్ఫురణాను మోదలీలా, భరితుఁడగుచు వేగిరంపుఁ బయనములఁ దగన్. భార. ఉద్యో. ౧. ౬౩.

చ. మునుకొని కోవిర స్థపతి ముఖ్యులు శిల్పము లుద్యమింప, న,ప్పుని తన వేగిరంపుఁ బ్రియ భావనకుం దగియుండ కుండినన్ ...
హరి. ఉ. ౨. ౧౫౦.

క. హరి తేజము హరి కాంతియు, హరి విభవము హరి భయంకరాకృతి హరివే,గిరము హరి విక్రమంబును, హరియను పేరిటికి లక్ష్మి నాపాదింపన్. ఉ. హరి. ౬. ౨౨.

౨. తొందర.

చ. విను మొక మాట రాత్రి చర వేగిర మేటికి...
ఆము. ౬. ౨౭.

చ. ...ఎం,దును గొరలేక ఫీకు నిచె దుస్సహ కర్ణ నిపాత మూచియై, వినఁబడు గుండె దిగ్గురన వేగిరమేల దురంబ కోరికన్.
రాఘు. ౪. ౧౧౨.

క. మదిరాక్షుల నమ్మకు నయ,విదుఁడవు గద వేగిరంబు పెరవరిఁ జెఱుచున్, బదరకు మీ తెస్స పదిం,బదిగ విచారించి సేయ మంచిది కుమ్మా. సారంగ. ౨. ౨౬౦.

—క్రి. విశ. త్వరితముగ.

గీ. కలని వాకిళ్లు రెండు వేగిరము మూసి, నడిమి వాకిలిఁ దెఱవ వెన్నండు నేర్చు ...
కాశీ. ౨. ౧౨౧.

ఆ. మరిసి మరిసి రాలె మునివేళ్ల నడుమక్క, చదుకఁ బడియెఁ జీమ జాలుకొనియెఁ, దనువు మీఁద ముసరె దోన దోన నీఁగలు, వేగిరంబె పెద్ద రోగమునకు.
వరాహ. ౯. ౪౯.

వ. చింతా సాగరంబు వేగిరంబ వెల్లివొడిచె ననన్ ... మను చ. ౩. ౯.

**వేగిరించు.** అ. క్రి. (√ వేగిరము.) వేగిరపడు, తొందరపడు.

శా. నీకున్నాకు నలంక్రియా కలనముల్ నెమ్మిం బ్రయోగించి యు,త్సేకం బిమ్మెయి నావహించుట రయన్ సిద్ధంబు కార్యార్థులై, నా కావాసులు వేగిరించెదరు నానాభైరి భూనాయకా, నీక ధ్వంస మొనర్చి మాన్పవలయున్ వేగంబ భూభారమున్.
హరి. ఉ. ౧. ౪౫.

ఆ... అల కన్న తండ్రియు, పెరవుమాలి యిటుల వేగిరించె. సారంగ. ౩. ౧౭౬.

క. పూఁట నగు కార్యగతు లొక, నాఁటన్ మఱి నాఁటఁ గనెడు నయ కార్యము లొ,క్కటం జేయుట మేలగుఁ, గోటల్లపై వేగిరింప కుము వేన్నైనన్. రా. వి. ౨. ౩౬.

ఆ. తామసించి చేయఁదగ దట్టి కార్యంబు, వేగిరింప నదియు విషమ మగును, పచ్చి కాయఁ దెచ్చి పడవేయ ఫలమౌనె, ...
వేమ. ౧. ౨౬.

**వేగు[1](వు.)** అ. క్రి. ౧. తెల్లవాఱు, ప్రభాత మగు.

క. వేగుటయు సత్వరంబుగ, నా గాంగేయుండు మించి యనికి నడచినన్, సాగర

తరంగముల గతి, వేగమ తరతరమ మొనలు
వెడలఁ దొడంగెన్.
భార. భీష్మ. ౨. ౧౬౮.

సీ. ...వేగునంతకుఁ జేసె జాగరంబు.
కాశీ. ౪. ౧౩౩.

ద్వి. ఆరాత్రి వేగంగ నంచిత స్తోత్ర, పారీణు
లగు పుణ్య పాఠకుల్ వచ్చి, వీరపుంగవ
రామ విజయాభిరామ భూరి విక్రమ నిత్య
మేల్కొనుము ...
రం. రా. ఉ. ౧౧౭. పొ. ౧౧. పం.

మ. వరుసన్ శుక్రుఁడు నాఁడు వేగఁదన చెల్వం
జూచి యీ కన్నెకున్, దొరయౌ రూపును
బ్రాయమున్ గలిగి చెన్నుం గల్గు నీ నేల
తోఁ, దరుణై కగ్గెఁ దలంచినట్ల యొస సేయం
బోలునే యింక నేర్పరులౌ కొమ్మలఁ
బంపుమా తగుపనుల్ గావింపఁ రాణింపఁ
గన్ ... యయా. ౪. ౭౪.

సీ. గీ. ...వేగనాఁగను దెలవారె నాఁగ
తేలె,ననఁగ నేకార్థములు గాఁగఁ దనరు
నభవ. అం. భా. ౩. ౯౯.

౨. ఉదయించు, పుట్టు, కలుగు.

ద్వి. ఇల జీవులకునెల్ల నిదె వేగెఁ బ్రొద్దు ...
ద్వి. హరిశ్చ. ఉ. ౧౧౫౫. పం.

క. కలిగె నొక జాంబవతి పె,న్నెల వడఁబడె దేల
వలపు నీతలవేగెన్, బాలియకు వేసవ తులు
గల, పొలఁతులచే పాటువడక పోరాదని
యొన్. ఉ. హరి. ౩. ౧౧౫.

ఉ. ...ఇట్టివి నీతల వేగనే చెలీ.
ఆము. ౫. ౫౬.

నీ తలనే వేగనా = నీయందే గలదా? అని
యర్థము.

క. వలపెక్కుడ లేదా యీ, యలికుంతల
తలనె వేగనా యోఁచకిఁకన్, జలికాలఁ
ద్రోఁచి విడువుము, చెలిమిక్కలి మనకు
పేద శీతలపాదా. విజ. వి. ౩౦. ౫౦.

౩. (కాలము) గడచు.

వ. అనిన విని యశోదాదేవి వేర్వేఱ ననూన
యించి.

క. మీ సేగులెల్ల నచ్చెద, వేసరకుఁడు మీరు
లేక వేగునె మాకుం, జేసెం జేయఁడు
బాలకుఁ, డా సురపుం బనులు నిజము లని
యొదరు బళే. హరి. పూ. ౫. ౨౩౦.

వ. నీవు కైటభారిం బాడిన నేఁటిపాట ఫలంబు
సజలంబుగా నాకిచ్చితేని బీభత్సకుత్సార్హం
బగు నీ జన్మంబు వేగు. ఆము. ౬. ౫౯.

చ. అలఘు విపన్మహార్ణవము నట్లు తరించి పున
ర్మహోద్ధతిన్, జెలిగెడు వారిఁదద్రజని వేగ
భయంకర లీలఁ దాఁకి పెం,పలరఁగ ...
రాఘవ. ౪. ౨౧౩.

౪. శుభోదయ మగు.

ఉ. కంసుని బాధలంబడు జగంబుల కింతటి
వేగుఁగాతఁ ద,ద్వంశము వేగ వేగుటయు...
హరి. పూ. ౯. ౭౩.

క. ఈ గతి నత్తఱిఁ దెలతెల, వేగిన గంధర్వ
పతికి వేగుట విని తా, రాగమున కేఁగి
కాంచిరి, రాగమ్మునఁ గొలిచి మను పురా
తన ఖచరుల్. మనుచ. ౫. ౪౧.

౫. బాధపడు, క్లేశము నొందు.

చూ: వేచు.

ద్వి. నా నిమిత్తంబున నారీలలామ, కీ నీచ దుర్దశ
నిటు వేగ వలసె ...
ద్వి. హరిశ్చ. ౧౬౦౮.

ఉ. అల్పపు బుద్ధి నీక్రియ మహాక్రతు తంత్రముఁ
బన్న గాధిపా, కల్పునిఁ బాయఁబెట్టి కను
గానక దక్షుఁడు చేయఁబొచ్చి యా, వెల్పులు

దాను దుర్దశల వేగ మహాప్రళయాగ్ని రుద్రునిం, బోల్పఁగ వచ్చునట్టి పటు భూరి విభుండగు వీరభద్రుచేన్. భీమ. ౨. ౯.

**వేఁగు².** వి. ౧. రాజకీయ సమాచారము.

క. మాకంటె వాఁడు మునుపుగ, నే కార్యము సేయఁగలఁడో యెఱుఁగము మీరల్, జోకగఁ దప్పరి మెలఁగుచు, నాకేదొక పనికి వేగు నడపగవలయున్. ప్రభా. ౧. ౧౧౪.

చ. అపుడు తమంబు చొప్పు దెలియన్ సముచిత వేషధారియై, తపనుని యాజ్ఞఁ గైకొని ముదంబున వేగున కేగుదెంచు దూత పగిదిఁ జూడ నొప్పె నుదితంబయి తూర్పున వేగుఁజుక్క యా, నెపమున నో తదాఖ్య ధరణిం బ్రతిపాదితమాట దానికిన్. కవిరా. ౫. ౨౧౭.

క. కింకరుల చేత నంతన్, అంకకు వేగందె నందిన న్వని యంకా, పొంకాలు దరిగొనఁగ ని,రంకుశ సాహస సమర్థుఁ డగు దశ ముఖుఁడున్. రామా. ౭. ౪౯.

౨. చారుఁడు.

సీ. పరిమిత పరిచార పరిగతుఁడని తన వేగులు చెప్పిన వివిధయాన, పాత్రమల్పమకట్టి ... దశకు. ౧౧. ౨౨.

గీ. అరులకడ నిజభూమియం దనుజ తనుజ, బాంధవామాత్య మిత్త్రులఁ జారవేష,ధరుల వేగులఁగాఁబెట్ట ధరణిపునకు, వలయు నొండొరు నెఱుఁగని వారిఁగాఁగ. భా. శాంతి. ౨. ౨౭౯.

**వేగుఁజుక్క.** వి. (వేగు¹ + చుక్క.) శుక్ర నక్షత్రము, వేకువజామున పొడుచు నక్షత్రము.

గీ. ఉదయగిరి మీఁదఁ గోపురంబుండి నిగుడ, నహిత రవి రశ్మిచే బద్ధుఁడగుచుఁ జోడి, బలఁగమైనట్టి చుక్కల వలస త్రోవఁ, జూప నేతెంచె నన వేగుఁజుక్క పొడిచె. మనుచ. ౩. ౫౪.

చ. ...ఒంటిమై బయట నుండక పొమ్మని వేగుఁదెల్ప వచ్చిన గతి వేగుఁజుక్క పొడిచెం జనె రాజును బశ్చిమాద్రికిన్. సారంగ. ౨. ౧౭౫.

క. కనుఁగొంటివె యది చుక్కన్, మనసిజనృప కీర్తి రుచి సమాజపు మొక్కన్, మినుకుల కులముల యిక్కన్, విను చక్కం జొక్కమైన వేగుం జుక్కన్. శుక. ౨. ౨౯౩.

**వేగుఁబోక = వేఁబోక.** వి. ఔ. (వేగు¹ + పోక.) ప్రభాతము, ప్రత్యూషము, తెల్లవాఱు జాము.

ఆ. వెలరు వాఱు దీవి యల నల్ల నల్లార్చు, సొర్ణ గండ్లయందుఁ జొచ్చి సుడిసి, తిరిగి వేగుఁ బోక తెమ్మెర వెలదీఁగ, కొనల వంకలొత్తు ననలఁ బ్రోచు. భార. ఉద్యో. ౨. ౧౧౨.

క. వేగుం బోకల మేల్కని, భాగవతోద్గీయమాన భగవద్గీతా, రాగంబులు విని మది ను,ద్వేగంబు వహించుఁ జేఁదుదినన్న పిన్న మునన్ ... నైష. ౭. ౧౨౯.

చ. ...ఇం,ద్రియముల పండువయ్యెను సతీపతి కోటికి వేగుఁ బోకటన్. కవిక. ౪. ౧౭౭.

క. ఈరేయి వేగుఁ బోకటఁ, బారాయణ యేమి చెప్పు జను లెన్నడు నె,వ్వారును నెచ్చుటఁ గానఁగ, నేరని చోద్యంబు గంటి నిక్కము వినుమా. కేయూర. ౪. ౨౯.

**వేగుజాము.** వి. (వేగు¹ + జాము.) తెల్లవాఱు జాము. సూర్యోదయమునకు ముందు ఏడున్నర గడియల కాలము.

ఆ. వేగుజాము గలుగ నిడనిద్రఁ బొందదు ...
భార. అర. ౫. ౩౦౫.

ఉ. కుప్పసముల్ వదల్చి వలి గుబ్బల నొత్తిరి హత్తి వేగుజామిప్ప లలర్చు గాడ్పుల కధీశు ...
అము. ౫. ౧౦౪.

మ. అకటా యేమని దూఱుదాన మిము నాథా వేగు జామయ్యె ...
కళా. ౪. ౧౧౨.

వేగుపాటు. వి. (వేగు[1] + పాటు.) వేఁకువ, ప్రభాతము.

ఉ. ఇమ్ములఁ బశ్చిమాంబు నిధి కేఁగు నెడం దగవారకన్ మయూఖమ్ముల నెన్ని కుంచి తముగా నొనరించిన వ్రేళ్లర క్తిలోఁ, గ్రమ్మఁగఁ బ్రాక్ప్రవృద్ధ రవి రశ్ములఁ బద్మిని వేగుపాటునం, గ్రమ్మఱ లెక్క బెట్టెననఁగా వికసించె సహస్ర పత్రముల్.
వేం. పంచ. ౪. ౩౧౬.

వేగురు = వేవురు. స. బ. వేయిమంది, సహస్ర సంఖ్య గలవారు. అనేకులు, పెక్కండ్రు.

వ. ...పదుండ్రు నూర్గురు వేగురు లక్షకోటి సంఖ్యాకులుం గూడికొన్న...
దశా. ౨. ౧౬౨.

గీ. అతని కూఁతురు శర్మిష్ఠ యనఁగ నొప్పు, గూర్మి సకియలు వేగురు గొల్వ నెపుడు, నా చెలియఁ గూడి యా కొమ్మ యాడు కొనుచు, నరమరలు లేని చెలుముల నసఁగి పెనఁగి.
యయా. ౩. ౫౦.

వ. ...అఖిలదేశాల నిలికి వేగురున్ను చేయించ్చిన ధమ్మగము.
దశా. ౪. ౭౭౪.

వేగురుఁజుక్క. వి. (వేగు[1] + చుక్క.) వేగుఁ జుక్క. 'సంధి ని వర్ణాగమము.'

మ. పొడమె న్వేగురుఁ జుక్క కాల ఫణ భృద్భోగోల్లస ద్రత్నమై ...
పారి. ౨. ౫౩.

క. రక్కసుల గురువు గురునకు, వెక్కసమగు మతికి నిరవు నెరవులకెల్ల, న్దిక్కు నుతికెక్కు వేగురుఁ, జుక్కదివి న్వెటులు గడును జొక్కనఁ బొడిచెన్.
వి. ప్ర. ౩. ౪౭.

ఉ. చుక్కలఱేఁడు తూర్పుదెస జొచ్చుతనుం గురు సంగరార్థమై, యుక్కున దారసిల్లునని యుక్కళమంపిన రీతి వేగురుం, జుక్క సురేంద్ర దిక్కునను శోభిలె ...
శశాం. ౪. ౧౨౬.

వేగు(ల)వాఁడు. వి. (√వేగు.) రాజ్య సమాచారము తెల్పువాఁడు, చారుఁడు.

క. మొదల నొక వేగువానిం, గదలరయఁగ బనిచి పిదపఁ గార్యము సేయం, బదిలమని పలికె శరభుఁడు, పదపడి మైందుండు నట్ల పలికెఁ బలుకుఁడున్.
భా. రా. యు. ౧౭౨.

ద్వి. పదపడి యుదు గ్రాజుపై దిననాథుఁ, డదె వచ్చెనని చెప్ప నరుదెంచు రీతి, వేగువాఁడును బోలె వేగురుఁజుక్క, బాగుగా బొడిచినఁ బలపల వేగ ...
ద్వి. హరిశ్చ. పూ. ౫౪౭.

గీ. ...మహనీయ వైభవ మెసక మెసఁగ, వఱలు నరపతి మందిర ద్వారభూమి, నేర వరిగి యా వేగుల వారు ప్రీతి.
భార. విరా. ౩. ౭౪.

ద్వి. వేగులవారిచే విన్న వార్తలకు, వేగ నిస్సాణంబు వ్రేయంగఁ బనిచి ...
రం. రా. యు. ౩౩౫. పం. ౨౫. పం.

వేచ. సం. వి. ఆ. స్త్రీ. జీతము, కూలి.

వేచేందము(లు). వి. (వేయి + చందములు.)

ద్వి. వేచందమునఁ గృపా వివశుఁడై యీనఁ, గాచిన పిదపఁ గుక్కల కిచ్చినట్లు ...
ద్వి. పరమ. ౨. ౭౧. పా.

**వేచు[1].** స. క్రి. ఎదురుచూచు, ప్రతీక్షించు.

చ. వినుమరిఁ జంపనుం దెలుప వేచుట లెస్స ప్రతాప భాషణం,బున కెడ నుల్లి కుట్టులను బొంకులవానిఁ గలంగఁ జేసి రేఁ,చినఁ దన పూఁపుదప్పు ... భార. శాం. ౩. ౨౦.

సీ. ధార్తరాష్ట్రులు సూత తనయ సౌబలు లును దెలుపన వేతురు చిన్నసన్న ... భార. విరా. ౧. ౪౭.

క. ఈ చందమునఁ దెలుపులు, వేఁచియుఁ బయిఁ బూఁచిలాంచి వేసియుఁ బ్రైపైఁ, ద్రోచు రుధిరమునఁ దడిసిరి, పూచిన మోదుపుల తోడఁ బుట్టువు లగుచున్. ఉ. హరి. ౩. ౬౩.

**వేఁచు[2].** స. క్రి. (√ వేగు.) బాధపెట్టు, క్లేశము నొందించు. (ఈ యర్థమునం దిది నిరనుస్వార మనుటకు ఈ క్రింది భారతప్రయోగము నిర్ధారకము.)

ఉ. కీచక కోటిచేత నొక కీడును బొందక వచ్చితమ్మ ని,న్వేచిన దుర్మదుండు జమునిం గొలువం జనెనమ్మ యంత బో,కేచిన సూతు లీ మొదలి కింత యపాయ మొనర్తురమ్మ వే,కాచి విరోధులం దునుమఁ గాని టు మట్టుదురమ్మ నీ పతుల్.

భార. విరా. ౩. ౪౪.

శ్లో. దిష్ట్యా సైరంధ్రి ముక్తాసి దిష్ట్యాసి పునరాగతా, దిష్ట్యా వినిహతా సూతా యేత్వాం క్లిశ్యన్త్యనాగసం.

సం. భార. విరా. ౨౫. ౨౫.

ఉ. కాక వెదిర్చి సంగర ముఖంబున హెచ్చిన రాజవంశముం, గూఁకటి వేళ్లతోఁ బెఱికి గోత్రవధంబును జేసినట్టి యా, వ్రేఁకపుఁ గీడుగాక ప్రజ వేఁచఁ దలంచిన గోఁచుచుట్టు పై, కోఁకటిపోటు చందముగ కోసి జనుల్ ననుఁ జూచి తిట్టరే.

జై. భా. ౧. ౬౪.

**వేచుంగులపాగ.** వి. (వేయి + చుంగులు + పాగ.) సహస్రఫణుఁడు, వేయి పడగలు గలవాఁడు, శేషుఁడు. (అప్ర. శ. ర.)

**వేటు = వ్రేటు.** వి. (√ వేయు.) ౧. దెబ్బ, హతి.

మ. మద దంతావళి దంతముల్ నఱకు నమ్మాంవంతు లుద్భ్రాంతతన్, బెదరం బల్లము గుల్లమున్ రవుతునున్ వేటారు తుండెంబులై, చెదరంగా ... విక్ర. ౬. ౨౯.

క. ఒకరొక టొక పో టొక వే,టొక యాటొక ముట్టిపాలు నొందక తం,డక క్రిడ పుటలు మాన్పె నొక్క్రం, డకలుష దివ్యాస్త్రతతుల నదియట్లుండెన్. కకు. ౨. ౧౦౪.

ద్వి. అరుదుగా రౌతును హయముఁ బల్లమును, దురమున వేటాఱు తునియలు గాఁగ ...

హరిశ్చ. పూ. ౧౩౨.

౨. వైచుట, వేయుట.

సీ.... అచ్చులోన నేయవచ్చెనఁ గైకొని వాఁట లాడిన యట్లు వేటు గలుగఁ, దలపు గతి వచ్చు గోరిన దాయమనఁగ, శుకుని జూదము దీని యచ్చొక యనఁగ, గెలుపు నా యది కాయొద్దు గెలుపనేర్చి, యేల్లఁ బిడి కెళ్ల విడిపించి యేనకొందు.

ద్వా. ౧౦. ౫౫.

**వేటుగజ్జెలు.** వి. బ. (వేటు + గజ్జెలు.) నాట్యమందు కాళ్లకు కట్టుకొను గజ్జెలు.

గీ. వేటు గజ్జెలు మద్దెలల్ వీణచెంగు, మురళి సారంగ తిత్తి కిన్నెర రబాబు, శంఖ తాళాది వాద్యముల్ సరసరీతి, పాటశ్రుతిఁ గూడి నాద మేర్పాటుచేయ.

మల్లుపు. ౪. ౬౪.

వేట్లాడు. అ. క్రి. (వేట్లు + అడు.) దెబ్బలాడు, కొట్లాడు.

వ. తలంకక బింకంబున నంకంబునకుఁ జంకిం చక వేట్లాడ నగ్గలిక దగ్గర నవియును. (ఇది చకోర విహార వర్ణనము.)
ఝుటికా. ౨. ౧౪౬.

వేడ. సం. వి. ఆ. స్త్రీ. ఓడ, పడవ.

వేడబము. వి. (సం. విడంబః.) ౧. వంచన, మోసము.

మ. కని యద్దేవుని తోడ వేడబమునం గప్పంబు గార్యంబుగా, ననుఁ బుత్తెంచుటఁ జెప్ప నోడితి ... ఉ. హరి. ౪. ౧౨౨.

మ. తలఁపుల్ చిచ్చులు మాట లుజ్జ్వల సుధాధారల్ విభుండైన పు,వ్విలుతున్ మెచ్చర యున్న్యలన్ వలతురే విశ్వాసమున్ లేదు క్రూ,రలు తోడుం బతినైనఁ జంపుదు రధ ర్మల్ నిర్దయల్ చంచలల్, జెలయాం ద్రెక్కుడ వారి వేడబములా వేదాంత సూక్తంబులే. భాగ. ౯. ౪౧౩.

ఆ. వేడ్క మీఱఁగాను విప్రులు చూడంగ, వచ్చి చక్రియజ్ఞ వాటిలోన, జేరి ద్విజుల నడుమ సిరితోడఁ గూర్చుండి, విడెము సేయుచుండె వేడబమున.
వేం. మా. ౧. ౧౩౯., కాశీ. ౬. ౭౯.

౨. మాయ, కపట ప్రవర్తనము.

ఆ. విలయ కాలమందు విశ్వంబు నీ పెద్ద,కడుపు లోన దాఁచు కడిమి మేటి, నటుఁడ వీవు నేఁడు నా గర్భజుఁడ వౌట, పరమపురుష వేడబంబుగాదె.
భాగ. ౧౦. పూ. ౧౨౯.

చ. సబలు నశక్తుఁ జేయుదు వశక్తు బలాఢ్యునిఁ జేయు దజ్ఞునిన్, విబుధు నొనర్తు నవ్వి బుధు నిన్ జడుఁగా నొనరింతు వెల్లయుం,గఁ బడు ధివత్ర్పభావ మజకంతుహరాదు లెఱుంగ లేరు వే,డబములు గాక యైహిక జడత్వము లున్న వె నీకు రాఘవా.
ఉ. రా. ౫. ౨౨౭.

౩. నడవడి, ప్రవర్తనము.

గీ. తపమునకు విఘ్న కరియించుఁ దలఁపఁ డర్కుఁ, డొలయు వర్షావధూటి పయోధ రముల, వేయి కరముల నింపె నవ్వేడబమున, నపుడ శాంతించె నతని మహాతపంబు.
కృ. శకుం. ౧. ౩౯.

౪. వేషము.

సీ. అస్త్రంబు ధరియించు నఁట తపస్వియు నట్టి యిట్టి వేడబము జెయ్యెడలఁ గలదె...
కాశీ. ౩. ౪౬.

చ. ప్రబలతర ప్రభుత్వమున భాసిలు ఫాదుష హా యొసంగఁగా, నిబిడ తమ ప్రభావమున నేర్పు మెయిం గొనినాము గాని సా,హెబు నవుబత్తుదీని నెవరేని యెఱుంగక యుండ దొంగ వే, బమునఁ దెచ్చికొంటి మెతడం బడకిట్టు లనంగ న్యాయమే.
రంగా. ౨. ౨౧౬.

—విశ. మనోజ్ఞము, చక్కనిది.

సీ. ఈ వేడబపు మొల్ల పూవు క్రొం బొదరింటఁ జాన యించుక సేపు సంచరించె, నీ నిగా రంపు ద్రాక్షాలత నికాయ కాయమానాంత రంబులకడ నొకింతసేపు నాళీక పత్రాక్షి సేదఁ దీర్చుకొనియెఁ గన్గొన రమ్మ యో కొమ్మలార. రసిక. ౪. ౪౩.

వేడము = వేలము. వి. మండలాగ్రము, ఖడ్గము.

చ. ...వేఁడి వేలుపుం, గొదమలు దార పొవ కుని కుట్టులు చిచ్చుబకంటి నెచ్చెలుల్, తుది

జము వేడములో పిడుగు తున్కలు వానర
వీరు లాక్కటన్.
రామా. ౩. ౧౫౦. (శ. ర. పా.)

(తుదజము వేఁడుముల్, అని ముద్రిపా.)

—సం. వి. అ. న. రంధ్రములు లేని గట్టి మంచి గంధపు చెక్క.

**వేడించు.** స. క్రి. పరివేష్టించు, ముట్టడించు.

ద్వి. అదె కపిసేనలో నా రాఘవుండు, విడిసినాఁడీలంక వేడించి యింకఁ, గడిమి సెన్నఁడు చూపఁ గలవాఁడ వీవు ...
రం. రా. యు. ౩౪౫. పా. ౨౯. పం.

ద్వి. అక్షీణబలకరి హరి రాజరాజ, దక్షౌహిణులు పదునైదు నెన్మిదియు, కూడికొల్వఁగ వచ్చి కుటిలుఁడై మధుర, వేడింప విని క్రొవ్వి వేడింపకున్న, గాదని బలుఁడు సంగత రమా బలుఁడు ...
అ. మ. క. ౩. ౧౭౦. పా. ౧౫. పం.

ద్వి. తవిలి యా వనదేవతలు వనశ్రీకి, సవరించు దీపికా స్తంభంబు లనఁగ, మొగళిరో మాణిక్యముల పాఁప తీలు, తగిలి వేడించు చందనములు గడచి ...
ద్వి. పరమ. ౫. ౩౭౧. పా.

అ. క్రి. వ్యాపించు, ప్రసరించు.

ద్వి. చనిన పిమ్మట నల సౌమదామములు, తన కొప్పునం బూని తన కొప్పుతోడ, మించులు జలదంబు మీఁద వేడించు, సంచున నొసపరి సవతుగాఁ జుట్టి ...
ద్వి. పరమ. ౫. ౩౫౧. పా.

ద్వి. చినుకు సోయగమున జీవరత్నములు, మెలఁగెడు జాడఁ బ్రామినుకు వజ్రములు, తులకింప జలజల తూర్పెత్తినట్టి, మెలపున వలపుఁ దెమ్మెరలు వేడించు, నలువున ...
ద్వి. పరమ. ౩. ౧౭౦. పా.

స. క్రి. చుట్టివచ్చు.

ద్వి. చటుల మృగాళిపై శార్దూల ముఖుకు, ఘటన నాఁబోతులఁ గడిమి వేడించి, మల్లడి గొన నొక్క మఱి మల్లరముల, దల్లుపల్గొమ్ము లుద్ధతి నొల్లగిల్ల ...
అ. మ. క. ౫. ౨౬౨. పా. ౪. పం.

**వేడుక = వేడ్క.** వి. (√ వేడు.) ౧. కుతూహలము, ఉబలాటము.

సీ. మునిదత్తమగు మంత్రమున గొంతి కన్నియ నాఁడు వేడుక దిననాథుఁ దనకుఁ, బ్రత్యక్షముగఁ జేసి పడయుట.
భార. శాం. ౧. ౧౬.

క. వేడుక పుట్టిన జూదం, బాడునె ధర్మజుఁడు ...
భార. ఉద్యో. ౧. ౨౪.

క. నామోహము నా వేడుక, నామానము నా ప్రియంబు నా తగులము నా, ప్రేమమ్మును నా తెగువయు, కామము బొందంగ నూరకయె పోవుదునే.
హర. ౩. ౧౩౧.

గీ. తెలియ నానతి యిమ్మ సందియము దీఱ, వినఁగ వేడుకయయ్యె సవిస్తరముగ ...
పారి. ౧. ౩౬.

౨. అభిలాష, కాంక్ష.

ఉ. ...లక్ష్మి గనుగందని వేడుకఁ గృష్ణరాయనిం, బేరునకాక వావిసెడఁ జెందునె సోదరుఁడైన రుద్రునిన్.
ఆము. ౧. ౩౫.

క. అనఘా యిది యెంతటి పని, విను నా దెస నీకు నింత వేడుక గలదే, గనుదెంచి చక్కఁ జూడుము, మనలో మనకింత గలదె ...
భోజ. ౪. ౨౩౫.

సీ. ......కుముద బాంధవుని తోడఁ,

గీ. దోడు నీడయి క్రీడించు వేడుకలర ...
దశా. ౧. ౪౫.

౩. సంతోషము.

గీ. సహజ కరుణా కటాక్ష వీక్షణ విశేష,
దీపితాశేష ధనకృతార్థి కృతార్థి, కలిత
చాటు సుధాపూర్ణ కర్ణుఁడగుచు, నిండు
వేడుకతోఁ గొలువుండు నపుడు.
విక్ర. ౧. ౧౦౬.

చ. విశదముగా నెఱింగి కడువేడుకఁ బొంగి
సుమాలి యయ్యెడన్ ...
ఉ. రా. ౨. ౨౧౧.

శా. ...శ్రీ నారీమణిఁ బోలు వేంకమ వరించె
న్వేడుకల్ మీఱఁగన్. దశా. ౧. ౫౫.

౪. వినోదము.

ఉ. లేమ యొకర్తు వేడుక నలీక నలీకరణంబు
జాలిగా, బూమియ దాను బన్నుకొని ...
నైష. ౩. ౯౭.

ద్వి. వేడుక జట్టి గావించి నాపూన్కి, వీడ
నాడకు ... ద్వి. హరిశ్చ. ఉత్త. ౧౪౯౫.

వ. ...వేడుకకుం జూడవచ్చిన ...
ఆము. ౪. ౩౫.

౫. ఉత్సవము, సంతోషకరమగు కార్యము.

ఉ. వేడుక నిట్లుగన్యారుచి విభ్రమ ధన్యయ
గేంద్ర కన్యలఁ, జూడఁ దలంచి నిల్చిరి
వసుక్షితిపాల పురీ పురంధ్రికల్ ...
వసు. ౬. ౬౪.

క. అని మధుర వచన రచనల, దనుజేంద్రుని
నలరఁజేసి తగ మజ్జన భోజన విధులతండు
వేడుక, లొనరింపఁగఁ దృప్తిఁ బొంది
యుండెడు వేళన్. విక్ర. ౨. ౧౫౨.

౬. విలాసము.

సీ. పెనిమిటి గలదాన నని కాటుక ధరింప
వేడుకలా యంచు విటచి కట్టు ...
శుక. ౨. ౧౧౫.

మ. బలి దైత్యేశ్వర కంటె యీ గిరిదరీ
భాగంబుల న్వేడుకల్, పొలయం గ్రీడలు
సల్పు కిన్నరసతుల్ ... దశా. ౨. ౧౫౩.

౭. అవలీల, హేల.

మ. కొనియెం గంచుకముల్ సముద్భట నట
ద్ఘోటీభట ప్రౌఢిఁ గై,కొనియె న్వేడుకఁ
జీడికోట యహిత క్షోణీశు లల్లాడ...
కాశీ. ౧. ౩౩.

వేడుక(ల)కత్తి(త్తె)యు. వి. (√వేడుక.) ౧.
వేశ్య.

చ. విను మది నాకలోకమున వేడుక కత్తియు
దాని దానవ,జనన విదాన మొక్క ముని
శాపము జెంది సుతోదయంబునన్, జను
నది ... కకు. ౪. ౧౪౧.

గీ. ...కలికి వేడుకకత్తె శ్రీ కామకోటి, గవ
యు నేకామ్రనాథునిఁ గరిగిరీశు.
కాశీ. ౩. ౧౦౭.

ఉ. వేడుక కత్తెనంచు రతివింతల నిన్ భ్రమ
యింపఁ జూతునో, మోడి వహింతునో
భువనమోహన నేనని కాకయేల పెంపగ్గా
డితి వంచు.
రాధా మాధవ సంవాదము. ౨. ౭౯.

౨. వ్యభిచారిణి, జారిణి.

ఆ. వారి వాదు నూచి వారింపఁగా వచ్చి, యోర్వ
రింపలేక యెల్ల మునులు, నమర వరుల నడుగ
నా వేడుకల కత్తె, యెఱుఁగఁ గాని
యితరు లెఱుఁగ రనిరి. భాగ. ౯. ౩౭౦.

వేడుకకాఁడు. విణ. (వేడుక + కాడు.) ౧.
కౌతుక వంతుఁడు, ఉబలాటము కలవాఁడు.

క. పాఱెడు నీరడ గ్రత్యగ, దాఱెడెడదమైన
యొండ దనుకఁ గని పురం,బాఱె మడు

వంత వేడుక, కాఱులు జాలరులు సొచ్చి
క్రందు కొనంగన్. భార. శాం. 3. ౧౯౨.

౨. కాంక్ష కలవాఁడు, అపేక్ష కలవాఁడు.

క. కయ్యంబుల వేడుక కాఁ, డయ్యున్నత కలహ
కేళికా కాంక్షుఁడై, నెయ్యమున వచ్చె
నారదుఁ, డయ్యెడ దివినుండి వారి సభ
దర్శింపన్. రాఘవ. ౨. ౩౭.

3. విలాసవంతుఁడు.

గీ. దండ తూఁకంబు కలలోనఁ దరుణిఁ గూర్చుఁ,
గాంత కలలోన దండ తూఁకంబునుంచు,
నెట్టి వేడుక కాఁడొ రత్నేశ్వరుండు, జంప
తులఁ జేయుదాఁకను జేలము కొనియె.
కాశీ. ౬. ౧౩౨.

౪. క్రీడాసక్తుఁడు.

ఉ. నెత్తము మీఁద గౌతుకము నిర్భరమై జని
యించె నిప్డు మా, చిత్తములందు నీవు గడుఁ
జిత్రపు జూదరి వాత్మలోన ను,ద్వృత్తుఁడు
సీరపాణి కడు వేడుకకాఁడతనిన్ జయిం
తు మే, మిత్తఱి మమ్మొకింత గదియింపు
మొనర్పుము తత్ప్రసంగమున్.
హరి. ఉ. 3. ౨౨౩.

ఉ. తోడి కుమారులున్ సఖులు దూరము నంద
కరార విందముల్, మోడిచి ఫాలభాగమున
మోపి నమస్కృతు లాచరింపఁగా,
నాడుచు నుండెగాని ముని కంజలి సేయఁగ
నేరఁడయ్యె న, వ్వేడుకకాఁడు పుట్టదొక
వేళ వివేకము దొడ్డవారికిన్. కాశీ. ౬. ౫.

౫. వినోదకరుఁడు.

క. ఆడెడు వారల కిచ్చును, పాడెడు వారలకు
నిచ్చు బట్లకు నిచ్చున్, బాడబ వరులకు
నిచ్చును, వేడుకకాండ్రురకు నిచ్చు వివిధా
ర్థంబుల్. విక్ర. ౨. ౧౬౪.

క. సంగడి లోకము లన్నియు, మ్రింగుచుఁ
గ్రక్కుచును బయల మెలగించుచు
ను,ప్పొంగడు వేడుకకాఁడటు, మ్రింగుడు
వడె బకునిచేత మోఁదటఁగి నృపా.
భాగ. ౧౦. పూ. ౪౪౬.

—వి. ౧. ఉపపతి, జారుఁడు.

వ ...మంత్రి నందనుండు జార చోరవిటధూర్త
వర్గంబులం గూడి వేడుకకాఁడై పుణ్య
స్త్రీల నిలువరుసఁ జెఱుచుచున్న వాఁడు...
శివరా. 3. ౧౭.

క....విను మే వగనైన నీదు వేడుకకానిం,
గొని తెచ్చెద మచ్చాతురిఁ, గనవే నేఁ
డనుచుఁ బల్కి గ్రక్కన వెడలెన్.
శశాం. ౪. ౪౫.

౨. విటుఁడు.

మ. ఒక యేకాదశి నాఁటిరేయి సముల్లై
యున్నట్టి గోపెట్టు వే,డుకకాం డ్రెవ్వరు
రామిఁ బల్లవుఁ డొకండున్ లేక లోఁ
గ్రాఁగి శ,య్యకడన్ నిల్వ సహింప కిల్వె
డలి యాతాయాతరీతిన్మనో, వికలత్వంబున
వాడవాడల విటాన్వేషంబు గావించుచున్.
హైజ. ౨. ౭౯.

ఉ. వేడుకకాండ్రకై తిరుగు వేశ్యల నాడిన
జాడ నన్ను ని, ట్లాడఁగఁ బాడియౌనె...
ఉ. రా. ౪. ౨౦౪.

**వేడుకచేయు.** అ. క్రి. (వేడుక + చేయు.)
కుతూహలపడు.

సీ. గంగానదీ విలోకన మాత్ర వాఙ్మనః
కాయ సంభవమైన కలుషమణఁగు, వినిన
వేడుక చేసినను గనుంగొనినఁ జే నంటిన
మునిఁగిన నఘ చరిత ...
జాహ్నవీ. ౧. ౨౬.

**వేడుకజూదము.** వి. (వేడుక + జూదము.)
వినోదమునకై యాడు జూదము.

వ్యవ. బలరాముఁడు రుక్మితో వేడుక జూద మాడె నందురు.

వేడుకపడు. అ. క్రి. (√ వేడుక.) కుతూహల పడు, ఉబలాట పడు.

క. నను నీతఁడు వేడుకపడి, కొనివచ్చెను వీని తోడి గోష్ఠికి దగుటై, యునికి తగ దితని కొక మే, లానరించి యథేచ్ఛఁ జనుట యుక్తము నాకున్. భోజరా. ౨. ౧౧౨.

క. వచ్చితి రథంబు దెచ్చితి, విచ్చేయుమ టన్న సీత వేడుక పడుచున్, బోచ్చెంబు లేని కృప సెల, విచ్చెద పతి యనఘు పోదమే వనములకున్. ఉ. రా. ౬. ౨౩౦.

—స. క్రి. కోరు, అపేక్షించు.

ఆ. విష్ణుఁ జూడ నీవు వేడుక పడితి నాకైన నజునకైన నరిది విష్ణు, దర్శనంబు ... భార. శాం. ౨. ౨౪౫.

వేడుకసలుపు. అ. క్రి. (వేడుక + చేలుపు.) క్రీడించు, భోగించు.

క. కావునఁ బరకాంతా రతి, గావింపక ధర్మ మార్గ గతిదప్పక యిచ్ఛావృత్తి నాత్మ భామినితో వేడుక సలుపవలయు దురిత విదూరా. వి. పు. ౪. ౨౨౪.

వేడెము. వి. (క. వేడె.) ౧. అశ్వగతి విశే షము, గుఱ్ఱముల మండలాకార గతి.

శా. ....గోత్ర ధరా ధరేంద్రములు క్రీలన్ లీలమై వేడెముల్, దోలున్ ధేయని యక్ష కిన్నర పురుస్తోమంబు లూటాడఁగన్. రాజ. చ. ౨. ౨౯.

చ. పతి యల తేజినెక్కి నరపాలురు గొల్వ హయాధి రోహ పాం,డితి సరిదాట్లు జోడ నలు నిబ్బరముల్ రవగాలు వేడెముల్, జత నము మీఱఁజూపి ... చంద్రా. ౨. ౩౦.

సీ. గడగడ వడఁకి నల్లడ గడల్ విడచి కకావికలై పోయి గిడల పౌఁజు, చేతి క్రోవులు వైచి భీతిఁ జైవులుజారె బగ్గము పాడై తుపాకి మూక,కేడెముల్ విడి మాని వేడెముల్ పంచ బంగాళమై పాఱె గుఱాల బారు. ... రా. వి. ౫. ౧౫.

౨. మండలగతి, చుట్టు తిరుగుట.

సీ. పద్మాలయోదర ప్రౌఢ సారసవీధి నంచల వేడెంబు లరసి కొనుచు ... వసు. ౬. ౯౩.

క. దాడింబ పండ్లకై వెస, వేడెంబులు వెట్టెఁ జిలుక విరిబోణీ నీ,కోడె చనుగుబ్బ కవకై, వేడుకఁబడి తిరుగు నమరవిభు మదిఁ బోలెన్. అహ. ౨. ౯౬.

సీ ధమ్మిల్ల సురతరు స్తబక వాసన కళుల్ బొమ్మని చుట్టు వేడెమ్ము గొనఁగ. ఘటికా. ౨. ౯౩.

వేడెవెట్టు. స. క్రి. (వేడెము + పెట్టు.) పరివే ష్టించు, ముట్టడించు, చుట్టుముట్టు.

ఆ. చాకలింప కుంపఁ జతురంగ బలముల, సారిది వేడెవెట్టి చుంచు బిగియఁబట్టి, చదివి నొసలిపట్టిక మీఁదఁ గన్నట్టి మెఱయు బిరుదపద్య మపుడు. జై. భా. ౩. ౧౪౩.

—పరివేష్టింపఁ జేయు. (శ. ర.)

వేడెవెట్టించు. స. క్రి. (√ వేడెపెట్టు.) పరివే ష్టించు, చుట్టుకొను.

వ. లంకకుఁ జని విడిసి వేడెవెట్టించి లగ్గలు పట్టించిన ... భాగ. ౯. ౨౭౯.

వేడెంపుగట్టు. వి. (వేడెము + గట్టు.) చక్రవాళ పర్వతము.

శా. కేళీలోలుఁడవై భుజాంగదముగాఁ గీలిం తునో కాక డా, కాలం బెట్టుదునో

నిజాంక కటకా కారంబునన్ గ్రాలఁగా,
త్రేలం ద్రిప్పుదునో యెఱుంగఁ బడ నవ్వే
డెంపు గట్టైత్తెదన్ ... రామా. ౭. ౬౫.

**వేడ్క = వేడుక.** వి. ౧. సంతోషము. (దీని యామ్రేడిత రూపము వేవేడ్క.)

గీ. ...బహు భక్ష్య భోజ్య లేహ్య, చోష్య
పానీయముల మధుసూదనుండు, సారెఁ
గొని యాడుచును వేడ్క నారగించె.
పారి. ౨. ౧౯.

గీ. ...జన్నయ సిద్ధమంత్రి, కొలువు గూర్చుండి
నను వేడ్కఁ బిలువఁ బంచి ...
విక్ర. ౧. ౧౯.

గీ. జానకీ నాథ సురలిట్లు శార్ఙ్గిచేత, నభయ
దానంబుఁ గొని వేడ్క నరిగి, రంత ...
ఉ. రా. ౨. ౨.

మ. ఎలమిం దుమ్మెద మ్రోఁత వాసె రవళై
యింపొంద మత్తిల్లు కో,వెల సీ కారుల కూఁక
పాట లమరన్ వేవేడ్కతో నాలిగా,డ్పుల
పేరం గల నట్టువుల్ గఱపఁ గోపుల్
నూపులేఁ దీవ పా,త్రల కయ్యామని పూవు
ముత్తెపుసరుల్ దాల్పఁగ నిచ్చెం గడున్.
యయా. ౪. ౧౨.

౨. కుతూహలము.

మత్త. వేఁడికో లుచితంబె కావున వేడ్కతోఁ
జని సోమకున్ ... భార. ఆది. ౫. ౨౧౭.

ఆ. అతఁడు చిఱుత నాఁడె యాచార్య కుల
మున, వేడ్క వేదశాస్త్ర విద్య లభ్య,సించు
చుండ ... ఆము. ౪. ౪౧

సీ. గీ. ...... మేనకాదేవి కుదయించె మేలు
వేడ్క. హర. ౩. ౨౦.

౩. అపేక్ష, కోరిక.

ఆ. బాలకేళి మీఁది భర ముగ్రమంబున, విడువఁ
గళల యందు వేడ్క సొనిపి, నయముతోడ
నర్తనంబుల శిక్షింపు, నెలఁత కేడుగడయు
నీవ కాదె. భార. విరా. ౧. ౨౫౧.

క. ఒదవెడు తృషపెల్లిదమున, వదనము వఱు
వట్లు వట్టె వాసితరాజ,న్మదిరా రస
మానఁగ నా, హృదయంబున వేడ్క
యొసక మెసఁగెడుఁ దరుణీ.
భార. విరా. ౨. ౭౭.

౪. వినోదము.

క. కలిమికి భోగముల కదా, ఫలమని తను
మెఱసి బయలు పడ బెల్లుగ వి,చ్చలవిడి
భోగింపక వే,డ్కలు సలుపఁగ వలయు
భటుఁ డడంకువతోడన్.
భార. విరా. ౧. ౧౪౦.

సీ. వేడ్కకై మానుషీ విగ్రహంబు ధరించి
విహరించు తొలు కారు వేళవోలె ...
శివరా. ౩. ౩౧.

౫. ఉత్సవము.

గీ....గొల్లవారింటి వేడ్కఁ గన్గొనఁగవలయు.
నీలా. ౩. ౪౬.

**వేడ్కకత్తె.** వి. (వేడ్క + కత్తె.) విలాసవతి యగు స్త్రీ.

సీ. ఘనుఁడైన జమదగ్ని మునినాథు కూరిమి
వెలయించు పెనుఁబాక వేడ్కకత్తె ...
క్రీడా. ౧. ౧౨౯.

**వేడ్కకాఁడు.** వి. జారుఁడు.

ద్వి. చను వేడ్కకాఁడు దోసం బెర్గఁడెందు,
నని యాడుమాట నీయందేను గంటి ...
పండితా. పురా. ౧౧౬. పొ.

సీ. తొలు మామ యగు దక్షు నెలదోఁట నడు
చక్క విహరణం బొనరించు వేడ్క
కాఁడు ... భీమ. ౩. ౩౬.

**వేడ్కపడు.** అ. క్రి. (వేడ్క + పడు.) వేడుక పడు, కుతూహల పడు.

గీ. వేడ్కపడె నెమ్మనంబులో విబుధ రాజు, భోజకన్యా స్వయంవరంబునకుఁ బోవ... నైష. 3. 33.

క. అతని సదాశివమూర్తి, ప్రతిమాన విలాసు వేడ్క పడి పరమ పతివ్రతలకు నగ్రేసర పార్వతి సైతము కంటి నెప్పు వాల్పక చూచెన్. వరాహ. ౬. ౫౭.

—స. క్రి. అపేక్షించు.

ఉ. అక్కట యేను వేడ్కపడి యానెడు నాసవ మర్థిఁ దేరగా ... భాగ. విరా. ౨. ౯౮.

**వేడ్కసేయు.** స. క్రి. (వేడ్క + చేయు.) అపేక్షించు.

చ......పూని యొకటెంగడ తేప్పఁగ పెంగి లేక యెల్లిదులగు వారికేటికి సలీల విహారము వేడ్కసేయఁగన్. ఉ. రా. ౮. ౭.

**వేణ(ణ్ణ).** సం. వి. అ. స్త్రీ. నదీ విశేషము, కృష్ణానదియొక్క యుపనది.

**వేణి.** సం. వి. ఈ. స్త్రీ. సొగసుగా నల్లిన జడ.

సీ....జడలు గటియు నింత సక్కనైనది వేణి దీర్చిన నెరులెంత శ్రేణి యగునె ... కు. సం. ౭. ౮౩౮.

౧. జట. ౨. అలంకార శూన్యమైన జేడెకట్టు, వ్రేలాడెడి జొట్టు. 3. ప్రవాహము. ౪. గంగా యమునా సరస్సుల సంగమస్థానము, ప్రయాగ క్షేత్రము.

**వేణిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. అల్లిన జెడ. ౨. ఎడతెగని ప్రవాహము, ప్రవాహము.

**వేణీబంధము.** సం. వి. అ. పుం. జెడగా నల్లిన జొట్టు.

**వేణీవేధని.** సం. వి. ఈ. స్త్రీ. జెలగ, జలూక.

**వేణీవేధని.** సం. వి. ఈ. స్త్రీ. దువ్వెన, కంకతిక.

**వేణీసంహారము.** సం. వి. అ. పుం. ౧. జొట్టు జెడగా నల్లుట, జొట్టు ముడివైచుట. ౨. భట్ట నారాయణ రచితమగు నొక నాటకము.

**వేణుఁడు.** సం. వి. అ. పుం. ౧. సంకీర్ణజాతి వాఁడు. వీనికి మురజాది వాదనము వృత్తి. ౨. వేనుఁడు. స్వాయంభువ మను వంశమున బుట్టిన 'అంగరాజు' పుత్త్రుఁడును, పృథు చక్రవర్తి దండ్రియు నగు నొకరాజు. ఇతఁడు వర్ణసంకర కారకుఁడు.

**వేణుకీయము.** సం. వి. అ. న. వెదురు పిడిగల యంకుశము.

**వేణుకర్కరము.** సం. వి. అ. పుం. కరవీరము, గన్నేరు. శ.

**వేణుజము.** సం. వి. అ. పుం. వెదురు బియ్యము. ఇక్లే: వేణుయవము. మొ॥

—విణ. (అ. ఆ. అ.) వెదురునందు బుట్టినది, దండము. మొ.

**వేణుధ్మఁడు.** సం. వి. అ. పుం. పిల్లనగ్రోవి యూఁదువాఁడు.

**వేణునము.** సం. వి. అ. న. మరిచము, మిరియము.

**వేణునిస్రుతి.** సం. వి. ఇ. స్త్రీ. ఇక్షువు, చెఱుకు. శ.

**వేణువాదు(దకు)డు.** సం. వి. అ. పుం. పిల్లన గ్రోవి యూఁదువాఁడు.

**వేణువు.** సం. వి. ఉ. పుం. ౧. వెదురు. ౨. రెల్లు. 3. పిల్లన గ్రోవి.

వేతనము. సం. వి. అ. న. ౧. జీతము, భృతి, కూలి. ౨. జీవిక, జీవనాధారము. ౩. వెండి- రజతము.

వేతనానపాకర్మము. సం. వి. న్. న. ౧. ఇచ్చెద ననిన జీతము, కూలి మొదలగునవి యియ్యకుండుట. ౨. జీతము, కూలి మొదలగు నవి యియ్యనందులకై తెచ్చెడి అభియోగము.

వేతనానపక్రియ. సం. వి. ఆ. స్త్రీ. వేతనా దానము.

వేతని. సం. విశే. (న్. నీ. న్.) జీతము గల వాఁడు, జీతము పుచ్చుకొనుచున్న వాఁడు.

వేతము. సం. వి. అ. పుం. బెత్తము, వేత్రము.

వేతలలపాము. వి. (వేయి + తలలు + పాము.) శేషుఁడు, అనంతుఁడు.

చ. జగములు గ్రుంక వే సెలయుఁ జాయ మగం డును దేటదప్పరే, పగులదె నేల వేతలల పాము దలంకదె తిప్పలుగ్ల వేఁపగ లిరు లెల్ల డస్ గవియుఁ బర్వదె సంద్రము లింకఁ బోలవే, రగులదె నల్వ గ్రుడ్డు గమి రాముని కించుక కీడు గల్గినన్.

అచ్చ. రా, అర. ౪౮.

వేతసము. సం. వి. అ. పుం. ౧. పేము, రెల్లు. ౨. ప్రబ్బలి. ౩. దబ్బచెట్టు. శ్రీ.

వేతసి. సం. వి. ఈ. స్త్రీ. పేము.

వేతసుఁడు. సం. వి. అ. పుం. అగ్ని. (అ. ని.)

వేతస్వంతము. సం. విశే. (త్. స్వతీ. త్) రెల్లుతో నిండినది. రెల్లు కలది. (దేశము.)

వేతాలుఁడు. సం. వి. అ. పుం. ౧. ఒక జాతి పిశాచము, శవము నాశ్రయించియుండు భూతము. ౨. ద్వారపాలకుఁడు.

వేత్త. సం. వి. ఇ. పుం. ౧. తెలిసినవాఁడు జ్ఞాని. ౨. ఋషి. ౩. భర్త, పెనిమిటి. ౪. పొందినవాఁడు, సంపాదించినవాఁడు.

వేత్రకీయము. సం. విశే. (అ. ఆ. అ.) పేముతో నిండినది. (దేశము.)

—వి. అ. పుం. వేత్ర సమూహము.

వేత్రధరుఁడు. సం. వి. అ. పుం. ౧. ద్వారపాల కుఁడు. ౨. అధికారికి ముందు వెండిబెత్తము పట్టుకొని పోవువాఁడు, వేత్రహస్తుఁడు, కట్టిక.

వేత్రము. సం. వి. అ. పుం. ౧. పేము. శ్రీ. ౨. చేతికఱ్ఱ, ద్వారపాలకుని చేతి కఱ్ఱ.

వేత్రయష్టి. సం. వి. ఇ. స్త్రీ. వేఁప బెత్తము.

వేత్రవతి. సం. వి. ఈ. స్త్రీ. ౧. ద్వారపాలకు రాలు. ౨. మాళవ దేశమందలి యొక నది.

వేత్రాసనము. సం. వి. అ. న. పేము కుర్చి.

వేత్రి. సం. వి. న్. పుం. ౧. ద్వారపాలకుఁడు, కావలి వాఁడు. ౨. వేత్రహస్తుఁడు, కట్టిక.

వేద(త)ండము. సం. వి. అ. పు. ఏనుఁగు.

వేదగర్భుఁడు. సం. వి. అ. పుం. ౧. బ్రహ్మ దేవుఁడు. ౨. వేదము చదివిన బ్రాహ్మణుఁడు. ౩. విష్ణువు.

వేదజ్ఞుఁడు. సం. వి. అ. పుం. వేదవేత్తయైన ద్విజుఁడు.

వేదదృష్టము. సం. విశే. (అ. ఆ. అ.) వేదముల యందుఁ జూడఁబడినది, వేదవిహితమైనది.

వేదన. సం. వి. ఆ. స్త్రీ. ౧. జ్ఞానము, తెలివి. ౨. సుఖ దుఃఖానుభవము. ౩. బాధ, యాతన.

౪. సంపద, ఆస్తి, ధనము. ౫. వివాహము, పెండ్లి. ౬. ఇచ్చుట, వితరణము.

వేదనము. సం. వి. అ. న. వేదన.

వేదని. సం. వి. ఈ. స్త్రీ. స్పర్శజ్ఞానము గలది. స్పర్శేంద్రియము.

వేదనిందకుఁడు. సం. వి. అ. పుం. వేదములు నిందించువాఁడు. ౧. నాస్తికుఁడు. ౨. బౌద్ధాది మతస్థుఁడు.

వేదపారగుఁడు. సం. వి. అ. పుం. వేదము తుదముట్టఁ జదివిన ద్విజుఁడు.
ఇట్లే: వేదాంతగుఁడు.

వేదపుగనివేల్పు. వి. వి. (వేదము + గని + వేల్పు) వేదములకు గనియైన దేవుఁడు, బ్రహ్మ.

చ. కృప దిలకింపఁ బెంపఁ బరికింపఁ గఁ దుదయించునంచు వే,దపుగనివేల్పు సెప్పినఁ బదంపడి నిన్నుఁ దలంపఁ జొప్పడెన్ ...
ఉ. హరి. ౨. ౧౯౩.

వేదమాత. సం. వి. ఋ. స్త్రీ. గాయత్రి.

వేదము. సం. వి. అ. పుం. ౧. జ్ఞానము, తెలవి. ౨. ప్రాఁజెదువు. శ్రుతి. (ఇది ఋగ్వేదము. యజుర్వేదము, సామవేదము. అథర్వవేదము అని చతుర్విధము.) ౩. దర్భ గడ్డిమోపు. ౪. మేడిచెట్టు, యజ్ఞాంగము. ౫. వివరణము, వ్యాఖ్యానము. ౬. ఛందస్సు.

వేదవాక్యము. సం. వి. అ. న. వేదమునందలి వాక్యము.

వేద(దా)వాసుఁడు. సం. వి. అ. పుం. వేదాధ్యయనము, తదర్థావబోధము, తదుక్తాచరణ ప్రచారణములును గల ద్విజుఁడు.

వేదవిదుఁడు. సం. వి. అ. పుం. ౧. వేదములు బాగుగాఁ దెలిసిన ద్విజుఁడు, వేదవేత్త. ౨. విష్ణువు.

వేదవిహితము. సం. విశే. (అ. అ. అ.) వేదములచే విధింపఁబడినది, వేదములందుఁ జెప్పఁబడినది.

వేదవ్యాసము. సం. వి. అ. పుం. ఋగ్యజురాది భేదములచే వేదమును విభజించుట.

క. అనుటయు లెస్సగఁ దలఁచితి, వినుమొక కీటంబునకును వేదవ్యాసం,బున లోకహిత మొనర్చిన, మునికి నయిన సత్కథనము ముని నుత చరితా. భార. అను. ౪. ౩౧౪.

వేదవ్యాసుఁడు. సం. వి. అ. పుం. పరాశర మునికి సత్యవతి యందుఁ బుట్టిన మహర్షి, ద్వైపాయనుఁడు. (ఇతఁడే వేదమును నాలుగు భాగములుగా విభజించినవాఁడు, అష్టాదశ మహాపురాణములను, భారత సంహితను రచించినవాఁడు.)

వేదసన్న్యాసము. సం. వి. అ. పుం. వేదోక్త కర్మముల విడుచుట.

వేదాంగము. సం. వి. అ. న. వేదమున కవయవము.

(వేదము యొక్క సరియగు నుచ్చారణము, నర్థము, మంత్రోపయోగము మొదలగు వానినిఁ దెల్పునది. శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము— అని వేదాంగము లాఱు.)

వేదాంతజ్ఞుఁడు. సం. వి. అ. పుం. ఉపనిషత్తుల (యర్థము) నెఱింగిన జనుఁడు, జ్ఞాని.

వేదాంతము. సం. వి. అ. పుం. (పరబ్రహ్మ ప్రతిపాదక మగు వేదము యొక్క తుది

భాగము.) ౧. ఉపనిషత్తు. ౨. షడ్దర్శనములలో నొకటి. ఉత్తర మీమాంసా శాస్త్రము.

**వేదాంతి.** సం. వి. న్. పుం. వేదాంతశాస్త్రము నెఱింగిన జనుఁడు.

**వేదాగ్రణి.** సం. వి. ఈ. స్త్రీ. సరస్వతి.

**వేదాది.** సం. వి. ఇ. పుం. న. ఓంకారము, ప్రణవము.

**వేదాధిపుఁడు.** సం. వి. అ. పుం. ౧. వేదాధిష్ఠాన దేవత: ఋగ్వేదమునకు-బృహస్పతి, యజుర్వేదమునకు - శుక్రుఁడు, సామవేదమునకు - అంగారకుఁడు, అథర్వవేదమునకు - బుధుఁడును అధిపతులు. ౨. విష్ణువు.

**వేదాభ్యాసము.** సం. వి. అ. పుం. ౧. వేదము చదువుట, వేదాధ్యయనము. ౨. వేదమును జదువుట, తదర్థము నెఱుంగుట, తద్విహిత కర్మముల నాచరించుట, తన్మంత్రముల జపించుట; శిష్యులకు బోధించుట. ౩. ప్రణవమును జపించుట.

**వేదారము.** సం. వి. అ. పుం. తొండ, ఊసరవెల్లి.

**వేది.** సం. విణ. (న్, నీ. న్.) ౧. తెలిసినవాఁడు. ౨. పెండ్లాడినవాఁడు.

—వి. న్. పుం. ౧. జ్ఞాని. ౨. ఉపాధ్యాయుఁడు. ౩. పండితుఁడు. ౪. బ్రహ్మదేవుఁడు.

—ఇ. పుం. విద్వాంసుఁడు, పండితుఁడు, జ్ఞాని.

—ఇ. ఈ. స్త్రీ. ౧. యజ్ఞవేదిక-యజ్ఞమునకై యేర్పఱుపఁబడిన వేదిక - (తిన్నె.) ౨. మధ్యభాగము సన్నముగా నుండునట్లు వేయఁబడిన యొక విధమగు తిన్నె. ౩. రాజగృహము యొక్క-గాని, దేవాలయము యొక్క- గాని యావరణములోఁ జదరముగా నేర్పఱచిన యరుగు. ౪. ముద్రిక, ముద్దుటుంగరము. ౫. సరస్వతి.

**వేదించు.** సం. అ. క్రి. వేదనపడు, నొచ్చు.

క. ఆ దురవస్థను నోర్వక, యో దైవమ మరణ
మేల యొసఁగవె యనుమన్, వేదించు
నృపతి వద్దను, నాదర మతి నారదుఁడు రయ
మ్మున వచ్చెన్. భా. రా. ౬. ౧౭౧.

**వేదిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. యజ్ఞవేదిక. యజ్ఞము నిమిత్త మేర్పఱుపఁబడిన తిన్నె. ౨. పెండ్లి కార్యములకై యింటి ముంగిటఁ జదరముగా, నెత్తుగా వేసిన తిన్నె. ౩. ఆసనము, పీఠము.

**వేదిజ.** సం. వి. ఆ. స్త్రీ. ద్రౌపది.

**వేదిత.** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ౧. తెలిసిన వాఁడు. ౨. బుద్ధిమంతుఁడు, చదువుకొన్న వాఁడు.

**వేదితము.** సం. విణ. (అ. ఆ. అ.) తెలుపఁబడినది.

**వేదు.** వి. ౧. దుర్గంధము.

ఆ. వెగటు వేదునాఁగ వికటగంధం బొప్పు...
ఆం. భా. ౧. ౧౦౯.

౨. గంధము.

క. ఆ దండ జవలదండను, వేదండుఁ జెలంగఁ
జెరివి వేదండ గతిన్, వేదండముచే వీచుచు,
నా దండధరారి పోలె నాడుచువచ్చెన్.
వి. పు. ౧. ౧౩౬.

౩. వైరస్యము, వెగటు. (శ. ర.)

౪. బ. వెగటుమాటలు.

ఉ. వేములు పల్కనన్న దర వ్రేయఁగఁ జూచెద
వింధునంతయం, బేదలు వేరు ...

సారం. ౩. ౫౬.

—విశే. దుస్సహము, వెక్కసము.

ఉ. వేదన మించు నీ విరహ వేదన తాళఁగఁ
జాలఁ గంతునిన్, సాదన రాదు గా తనదు
సాదన చూపఁ దోడుగ గాడ్పు గా, నీఁ
దన వచ్చునే పెదల నీదనలాకృతి వేఁడి
నూపుమన్, బోదనఁ జెల్లు నాకపుడుఁ బోదన
యంబు శుకంబు వ్రేలుమన్.

సారం. ౨. ౧౨౫.

వేదోక్తము. సం. విశే. (అ. ఆ. అ.) వేదముల
యందుఁ జెప్పఁబడినది.

ఇక్లీ: వేదోదితము. మొ॥

వేద్యము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. తెలియఁ దగి
నది. ౨. బోధింపఁదగినది. ౩. పెంద్లాడఁ
దగినది.

వేధ. సం. వి. ఈ. పుం. ౧. సృష్టికర్త, బ్రహ్మ
దేవుఁడు. ౨. బ్రహ్మ వెనుక సృష్టి కావించు
ప్రజాపతి. (దక్షుఁడు. కశ్యపుఁడు. మొ.)
౩. శివుఁడు. ౪. విష్ణువు. ౫. సూర్యుఁడు. ౬.
తెల్ల జిల్లేడు. ౭. ౮. పండితుఁడు. ౯. పురో
హితుఁడు. ౯. కవి.

వేధకము. సం. వి. అ. పుం. ౧. నాకభేదము.
౨. కర్పూరము.

—న. ఎన్నులోనున్న వరిగింజ, కంకెలోనున్న
ధాన్యము.

వేధనము. సం. వి. అ. న. ౧. గ్రుచ్చుట,
కుట్టుట. ౨. తూర్చుట, చొరఁజేయుట.
౩. ఉత్తదిగాఁ జేయుట, శూన్యముగాఁ జేయుట.
౪. కన్నము చేయుట. ౫. కన్నము యొక్క
లోఁతు.

వేధని. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఏనుఁగు చెవి
మీఁదఁ బొడిచెడి సాధనము. ౨. రత్నములు
మొదలగు వానికి తొలివేసెడి సూదివంటి పని
ముట్టు. ౩. లోఁతు.

వేధనిక. సం. వి. ఆ. స్త్రీ. రత్నములు మొద
లగువానికి రంధ్రము చేసెడి సూదివంటి సాధ
నము.

వేధము. సం. వి. అ. పుం. ౧. గ్రుచ్చుట,
కుట్టుట, తొలివేయుట, రంధ్రము చేయుట.
౨. గాయము చేయుట, గాయము. ౩. రంధ్రము,
బిలము. ౪. (బిలము యొక్క) లోఁతు. ౫.
కాల పరిమాణ విశేషము.

వేధసము. సం. వి. అ. న. కరతలము, అఱచేయి

వేధి. సం. విశే. (న్. నీ. న్.) ౧. గ్రుచ్చునది,
కుట్టునది. ౨. తొలిచేయునది, రంధ్రము చేయు
నది. ౩. లక్ష్యమును భేదించునది.

వేధించు. సం. స. క్రి. ౧. బాధించు. ౨. ఆక
ర్షించు.

—సం. విన్. బాధించు.

శా. ...భావివేళ మహిషున్ వేధించి సర్వా
మర, స్తోమత్రాసము మాన్పఁ బంపువడి...

వరాహ. ౧౨. ౫౦.

వేధితము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. గ్రుచ్చఁ
బడినది, కుట్టఁబడినది. ౨. తొలివేయఁబడినది.
రంధ్రము చేయఁబడినది.

వేధిని. సం. వి. ఈ. స్త్రీ. జేలగ. జలూక.

వేధ్యము. సం. వి. అ. న. లక్ష్యము, గురి.

వేనలి. వి. (సం. వేణీ.) ౧. జడ, వేణి.

మానిని. ఆనన లీల సుధాకర బింబ నవాంబు
రుహంబుల చెల్వగుటన్, వేనలిఁ గృష్ణ

భుజంగ కలాపి సవిస్తర భాసురమై చను
టన్ ... కు. సం. ౮. ౭౪౦.

ఉ. విక్కు ప్రసూనముల్ గురియు వేనలి వీడిచి
కొప్పు వెట్టుచోఁ, జొక్కులఁ బెట్టె భూవ
రుని చూపులఁ గోమలి బాహు మూల
ముల్ ... నైష. ౮. ౧౯౪.

క. ధరణి భరణ దీక్షకు వ్రా,విరిఁ బూనిన గెలుపు
లచ్చి వేనలి లీలన్, బరగు కరాళ భవ
చ్ఛుభ,కర నందక మభ్ధి కన్యకా చిత్తేశా.
ప్రబంధ. ౧౪౨.

౨. సిగ, జుట్టు.

సీ. వేనలి కప్పు పర్వీన మీఁదు నీల దుకూలంబు
మేల్కట్టు కొమరు వడయ ...
భార. విరా. ౧. ౩౦౭.

సీ. నిడుద వేనలి నూనె ముడివీడఁ జిగురాకుఁ
బొదఁ దూఱుఁ గార్చిచ్చుఁ గదియు కరణి ...
మనుచ. ౩. ౩౧.

సీ. డంబారు నెమ్మి పించెంబు లెచ్చుటఁ గన్న
ననబోఁడి నీదు వేనలియె తలఁచి ...
నీలా. ౩. ౧౦౬.

౩. కొప్పు, ధమ్మిల్లము.

మ. చెలువ ల్గొందఱు హేమకుంభములతోఁ
జేసే నొసంగ న్వి ని,ర్మల దోర్మూల రుమ
ల్వాలిం బొరయఁ దోరంబైన చన్దోయి సం,
దొలయ న్వేనలి జాఱ ... పారి. ౨. ౧౧.

చ. విరి సరి వేనలిన్ గళభువిన్ మణివల్లరి
యంఘ్రి వజ్రపున్, సరిపణినాఁ ద్రిలోకి
యను చానకు ... చం. రా. ౩. ౯.

సీ. చాన వేనలితోడ సరిగాక యొడలి చూపుల
దొరతనము ల్వారి గఱచె ...
నీలా. ౨. ౨౦.

వేనవేలు. స. బ. (వేలు + వేలు.) పెక్కువేలు,
అనేకములు. (హల్లు పరమగునపుడు దీని తుది
యుకారమునకు వికల్పముగ లోపము.)

గీ. విబుధ యువతులు సొక్కింప వేనవేలు,
వర్షములు నరుఁడుండు దివంబునందు ...
హరి. ఉ. ౧౦. ౨౭౪.

గీ. వేనవేలోయ్యజనంబుల విరివి నొప్పు, లక్షకోటి
శలాకి కాలంకృతంబు ...
కాశీ. ౪. ౨౯౪.

గీ. ... వేనవేల్సత్యములఁ పల్కు వినక యున్న ...
ఆము. ౬. ౪౨.

గీ. అబ్జ నాభుని తూగుటుయ్యెలలు గంటె, వేన
వేలు పయోరాశి వీచి ఘటలఁ ...
భీమ. ౩. ౫౨.

ద్వి. వేనవే ల్విధముల వేదాంతములకుఁ, గా
నంగ జాలని ఘన లింగమూర్తి ...
పండితా. దీక్షా. ౫౨.

వేనోళ్లు. వి. బ. (వేయి + నోళ్లు.) సహస్ర ముఖ
ములు.

గీ. అత్త మామలు మక్కువ నాదరింప, మగఁడు
నీమీఁదఁ జాల ప్రేమంబు నెఱపఁ, జల్లదన
ముగ మిగుల వర్ధిల్లు మెపుడు, సకల జన
ములు వేనోళ్ల సన్నుతింప.
ఇందు. ౬. ౭౨.

వేనోళ్లచిలువ. వి. వేయి నోరులు గల సర్పము,
శేషాహి.

గీ. పొసఁగి యున్నట్టి పొన్నారిఁ బొగడఁ
దరమె, నలువకైనను వేనోళ్ల చిలువకైన...
ప్రబంధ. ౨౯౬.

వేన్నీరు. వి. (వేఁడి + నీరు.) బ. వేన్నీళ్లు, వేన్నీ
రులు, వేన్నీరులు-ఉష్ణోదకము.

గీ. అరయ నుపహతి వాటిల్లి నట్టిచోట, నాజ్య
తైలాభ్యుపేత భాండావళులకు, నేల్లనీళుల
నొండె వేన్నీళ్ల నొండె, గడువఁజాలఁ
దోమిన నొండెఁ గలుగు శుద్ధి.
మార్క. ౩. ౨౫౪.

గీ. వట్టి కూడును వేన్నీళ్లు పెట్టి యొజ్జ, గీలుగు
వీష్యంబు లిప్పించి వలఁతియైన, వెజ్జు నెన
రించి యరయించె విప్ర సుతుని, కంట
వత్తిడుకొని సైరిక ప్రభుండు.
పాండు. ౩. ౫౬.

సీ. దినముఁ జన్నీళ్లు మజ్జనమాడఁ జలిదాఁకు
నీకంచు వేన్నీళ్లు నెమ్మిఁ గాఁచు ...
వైజ. ౩. ౫౧.

క. ఒడలంటఁ గాళ్లు పిసుకం, గడి వెఁడు
వేన్నీళ్లనీయఁ గంచము పెట్టన్ ...
శుక. ౩. ౩౪౪.

సీ. అలఁదు నలుఁగు దేహమున వేన్నీళ్లార్చుఁ
దడియొత్తు మెత్తని ధవళ వస్త్రమున ...
కాశీ. ౪. ౧౧.

**వేపధువు.** సం. వి. ఉ. పుం. కంపము, వణఁకు, ఒకానొక సాత్త్వికభావము.

**వేపనము.** సం. వి. అ. న. కంపము, వణఁకుట.

**వేపారి.** వి. (సం. వ్యాపారి.) మధ్వమతస్థుఁడైన ఉద్యోగస్థుఁడు.

క. నిలువంగి యొరమెలికల, తలపాగ ఖలీతి
కాలుతావి మెయిం బూఁతలు పోఁగు
లంఘ్రిరక్షలు, తెలయఁగ వేపారి మీఱి
తెలఁచుక కడకున్. హంస. ౩. ౯౯.

**వేపారికుడుకలు.** వి. స్త్రీభూష.

**వేబరము.** విణ. శూన్యము.

గీ. ... సంపద లుబ్బెనేని, వేబరము కాదె
బిడ్డలు లేని బ్రతుకు. ఉ. హరి. ౨. ౧౬.

**వేమము.** సం. వి. అ. న. సాలీలు నేఁత సరి దట్టెడు పలక, వాయ దండము.

**వేమఱు = వేమాఱు.** క్రి. విణ. పలుమాఱు.

ఉ. వేమఱు శత్రునిం బరిభవించుట రిత్తకు
రిత్తవారము, దా మదిఁ బెట్టికోలు సుఖ
తంత్రము గాదు ... భార. శాం. ౩. ౨౨.

ఉ. విష్ణుని మూల తత్త్వమును వేమఱు నయ్యయి
జన్మకర్మ వర్ణితత లాదరించుటలు దేవకి
కిన్ వసుదేవుకున్ ధరన్, గృష్ణుఁ డనంగఁ
బుట్టి ... హరి. ఉ. ౭. ౩౦౪.

చ. ... సింహ భూధర, ప్రభు తిరునాళ్లకుం
దిగు సురప్రకరంబు కళింగమేదినీ, విభునప
కీర్తి కజ్జలము వేమఱుఁ బెట్టి పఠించు నిచ్చ
లున్. మనుచ. ౧. ౩౯.

**వేమాఱు = వేమఱు.** విణ. ద్రు. (వేయి + మాఱులు.) మాటి మాటికి.

క. మీఱిన మానుల కినుకకు, మాఱులుగక
యున్న క్షమ సమగ్రక్షమ వేమాఱుఁ గొని
యాడఁగాఁ దగు, గీఱునె సాత్త్వికుల బుద్ధిఁ
గిల్బిష చయముల్. నృసిం. ౧. ౯౫.

శా. ...పటీరగిరి వన్యామంద వాతూలముల్,
వేమాఱుం గల శీతనూభవు వధూవేణీ
ధరాతః ప్రసూనామోదగ్రహయాళువుల్
పాలసె దక్షారామ మధ్యంబునన్.
భీమ. ౫. ౯౪.

సీ. కామ శాస్త్రంబులు వేమాఱు నియతిమైఁ
జదువకుండిన పువ్వుశరుని యాన ...
విక్ర. ౧. ౯౩.

**వేము.** వి. (త. వేంబు.) వేపచెట్టు, నింబము. ‡. దీని భేదములు : కరివేము, తురక వేము.

క. గురిజెంద వేము నడరిన, పరుసున ...
దశకు. ౭. ౪౪.

వ. తెలఁగల మొలగల బీరల గారల వేములఁ
బ్రేముల ... పా. శకుం. ౨. ౧౪.

ఆ. అనఁగ ననఁగ రాగ మతిశయిల్లుచు నుండుఁ,
దినఁగఁ దినఁగ వేము తీయనుండు. సాధక
మునఁ బనులు సమకూరు ధరలోన ...
వేమన. ౧. ౯౩.

- వేములఁ గలుపు = విడిచి పెట్టు.

ద్వి. నోములు గీములు వేములఁ గలిపి, నీ మఱ్ఱి
సొచ్చితి నిఖిలంబు నెఱుఁగి ...
బస. పు. ౧. ౩౫౬. పం.

**వేయంచులకైదువు.** వి. (వేయి + అంచుల + కైదువు.) సహస్రారము, విష్ణుచక్రము.

ఉ. అంచులు నూట నుగ్ర నిబిడానల కీలలు
గ్రక్కుకొంచు నేతెంచు రయంబు చూచి
పరతెమ్మిక నెన్నఁడు విష్ణుచక్రమా,యంచు
నతండు భక్తిపరుఁడై నగుచుండఁగఁ దత్క్ష
ణంబ వే,యంచుల కైదు వడ్డపడి యార్చి
పవిఁబడఁ గొట్టెఁ గొట్టినన్.
కకు. ౫. ౨౦౭.

**వే(యి)యంచులవాలు.** వి. విష్ణుచక్రము, సహస్రారము.

సీ. వేయి యంచులవాలు ప్రోయుచుద్ధతి
డాయు నపుడు పైకొనిన భియజ్వరంబు...
ఉ. రా. ౨. ౨౧౪.

**వేయి = వే.** బ. వేలు. స. జొ. పదినూఱులు, సహస్రము, అనేకము. పెక్కు. (బ. వేలు. హల్లు పరమగునపు 'డుత్వ' లోపము.)

క. న్యాయార్జిత మగు నన్నము, వేయింటికిఁ
బెట్టవలయు ...
భార. అను. ౪. ౨౩౧.

ద్వి. మున్నీటి మొలనూలి ముదితతో వేయి,
కన్నుల మేటి సంగడివారు దాను ...
అ. మ. క. ౧. ౧౧. పా. ౧౨. పం.

గీ. తెలఁది మిన్నలు పదియాఱువేలు గొలువ ...
ఉ. రా. ౧. ౪౪.

క. ముదిమియుఁ దెవులును నెఱుఁగక, పది
వేల్ సంవత్సరములు బ్రతుకుదురు
ప్రజల్ ... వరాహ. ౧౦. ౧౫౨.

క. ...పలుకులు వేయేల యధిక బలశౌర్యనిధీ.
నైష. ౨. ౧౬.

ఉ. ...వేయి విధంబులందుఁ బదివేవురు పెద్దలు
నత్ప్రబంధముల్, సాయక చెప్పిరట్లు ...
విక్ర. ౧. ౧౨.

వేయగుపాలు - సహస్రాంశము, వేయవవంతు.

చ. పుడమియు ధనంబు నాకము విభూతియుఁ
జేరెడయేని నల్లన,వ్వాడు నభిమన్యు నెమ్మొ
గము వేయగు పాలును బోలనేర్చునే ...
భార. ద్రోణ. ౨. ౧౪౫.

**వేయించు.** స. క్రి. (√ వేయు.) ౧. వేయునట్లు చేయు, పడవైచునట్లు చేయు.

క. కొలఁదిగిన కెట్టివానం, దెలపన దవుదివ్వ
లందు తెదరించియు మూ,లల వేయించి
కొనంగాఁ. దలఁచెదరి దికాల గుణమొ
దైవ ఘటనయో. రాఘవ. ౪. ౯౩.

౨. ప్రతిష్ఠించు, నెలకొలుపు.

సీ. వేయించె శీతల చ్ఛాయానపాయాభి రామ
ద్రుమా వృతారామ సమితి ...
ఘటికా. ౧. ౪౭.

౩. ప్రోగింపఁ జేయు.

గీ. మించి ప్రస్థాన భేరి వేయించి దండు, వెడలి
రసురులు జేజేల వీటి మీఁద ...
ఉ. రా. ౨. ౨౭.

వ. బ్రహ్మాండ భాండంబు లదరఁ బ్రస్థాన భేరి వేయించి వందిజనకైవారంబును మాగధ మంజుల గానంబును ... మై. ౩. ౫౬.

వేయిక(గ)న్నులవాఁడు. వి. (√వేయి.) సహస్రాక్షుఁడు, దేవేంద్రుఁడు.

సీ. వేయి కన్నులవాఁడు విమల వర్తనుఁడైనఁ దరమగు వైభవ స్ఫురణ నీకు ...
విక్ర. ౬. ౧౧.

ఇట్లు: వేయి కన్నులవేల్పు.

గీ. వేయికన్నుల వేల్పుతో విగ్రహించి, వనిత యింకేమి గానున్న వాఁడొ మరుఁడు ...
నైష. ౪. ౨౩.

గీ. తెలియు నల వేయి గన్నుల వేల్పువోలెఁ, బెంపుతో నిచ్చ కడలేని సొంపు మెఱయఁ, పుడమి నాతోడి సవతిగా నడపవయ్య ...
యయా. ౪. ౫౬.

వేయిచేతులఱేఁడు. వి. (వేయి + చేతులు + ఱేఁడు.) ౧. సహస్ర కిరణుఁడు, సూర్యుఁడు.

గీ. వేయి చేతుల ఱేఁడు వెలుఁగుల తొలఁకి మీఁదు ... ఆ. సం. దేవ. ౧౬.

౨. కార్తవీర్యార్జునుఁడు.

సీ. నినుగల్చుకొని వాఁడి నొనరెడి వేయి చేతుల ఱేనిఁ గడపిన బలియు గెలిచె ...
అచ్చ. రా. సుం. ౧౫౮.

వేయిచేతుల యెకిమీఁడు. వి. (వేయి + చేతులు + యెకిమీఁడు.) సహస్రబాహుఁడు, కార్తవీర్యార్జునుఁడు.

ఆ. ... చెఱను బెట్టి వేయిచేతుల యెకిమీఁడు, విడుచుటయును జయము వెల్లి విరిసె.
అచ్చ. రా. యు. ౫౦౦.

వేయిచేతులవాఁడు. వి. (వేయి + చేతులు + వాఁడు.) సహస్రబాహుఁడు, కార్తవీర్యార్జునుఁడు.

సీ. అడుగిడి త్రైలోక్య మాక్రమించుట యొక్కొ వేయిచేతులవాని వేయు టొక్కొ ... సిం. నార. ౧౮.

వేయిచేతులసామి. ని. (వేయి + చేతులు + సామి.) సూర్యుఁడు, సహస్రకరుఁడు.

గీ. ఇపుడు నీ దొడ్డతన మీరె యెఱిఁగికొనుచు, నదరి మీవంగడంబున కొడయఁడైన, వేయి చేతుల సామిని వేడుకొనుము ...
అచ్చ. రా. యు. ౫౨౭.

వేయిమోములవాఁడు. వి. (వేయి + మోములు + వాఁడు.) శేషుఁడు, సహస్ర ముఖుఁడు.

సీ. వేయి మోములవాఁడు విషముక్తుఁడైనను బ్రబలియగు నీకు భూ భరణ శక్తి ...
విక్ర. ౬. ౧౧.

వేయివేలు. స. (వేయి + వేలు.) పదిలక్షలు.

మత్తకోకిల. నేయిఁ బాలును దేనెయుం గుడు నిండిపాఱెడు నేఱులున్, వేయివేలు దలిగ్వ నొప్పెడు విప్రభోజనమున్ ...
హరి. పూ. ౮. ౧౫౨.

వేయు. స. క్రి. ౧. క్రింద పడవైచు, పడవైచు.

సీ. ఆయుధంబులు వేసి హాంకారములు రోసి మ్రొక్కువారును బుట్ట లెక్కువారు, సాహసంబులు మాని సంత్రాసములు పూని పఱచు వారును బ్రేళ్లు గఱచువారు ...
వరాహ. ౩. ౪౮.

చ.... పెనంగి లా, వెడలఁగఁ బట్టి వేయుటకు నెత్తెన నంజను మల్లుపోరునన్.
అము. ౨. ౯.

సీ. అమర తిర్యగ్జాతు లంరైన వేయక నరజన్మ మేల యందఁగ నొనర్చ ...
హంస. ౫. ౨౭౧.

(ఇట 'పుట్టించు' అని భావము.)

౨. ఉంచు, నిక్షేపించు.

ఉ. చేసె ననేక యాగములు జీవన సౌఖ్యము నెమ్మనంబునన్, రోసె వివస్వదాత్మజు తనూజానిపై నిజరాజ్య భారమున్, వేసె వివేక నిష్ఠుర లవిత్రముచే నఘపాశ బంధము ల్గోసె ... వరాహ. ౨. ౩౪.

3. ఉంచు, పెట్టు, చొనుపు.

సీ. కడపటఁ జొట్టాల గరితల పైటలోఁ జెయి వేసి యేమేమొ చేసె ననుచు ...

గీ. కృష్ణకథ లందు నిటువంటి కల్లవినఁడు ... శుక. ౨. ౫౮౪.

గీ. చంద్ర భీత ఘనధ్వాంత సంచయమున, కభయ మొసఁగి వేణీభరంబను నెపమునఁ, దన వెనుక వేసికొన్నది తరుణి మొగము... ప్రభా. ౨. ౭౪.

(వెనుక వేసికొను = ఒకని కభయమిచ్చి వానిని దనవెనుక నుంచుకొని వాని పక్షమునఁ దాను పోరాడుటకు సిద్ధపడు.)

౪. తోఁట–మొ॥ ప్రతిష్ఠించు, మొక్క–మొ॥ నాఁటు.

సీ. ...సకల మార్గంబులఁ జల్లగా వనములు వేయించె నే మంత్రి వేడ్క–మీఱ ... దశా. ౧. ౫౧.

మ. అలమాకందము కుండ్ల దింపఁదగు నియ్యెం ట్లొక్క–చో వేయఁగా, వలె సంపంగికిఁ ద్రవ్వటం బిడవలెన్ ...వానిఁ జూచి కెల నాగల్ విప్రనారాయణున్. విప్ర. ౨. ౭౯.

౫. మూయు.

గీ. చూచెఁ గనుఱెప్ప వేయక సోమయాజి... కాశీ. ౪. ౯౯.

ఉ. ...సపుల కస్తనిరై కనుఱెప్ప వేయక, క్కాంత మహాభిలాషఁ దటకాపడి చూచెఁ గుమార శేఖరున్. సారంగ. ౨. ౩౪.

చ. ఇపుడు గదా తపంబు ఫలియించె నటంచు మహాసురక్తి భావపరత రేఁబవల్లు తలవాకిలి వేసిన యట్టు లుండ ... శుక. ౨. ౨౧౩.

౬. తెగఁగొట్టు, నఱుకు, ఖండించు.

గీ. సుప్తుఁ డగుచుండి వానరుఁ జూచి నన్ను, డాయ వచ్చిన జీవుల వేయు ఖడ్గధారఁ దుని యంగ నని చెప్పి తా రెనిద్రఁ, గపియుఁ బనిపూని భూపతిఁ గాచి యుండె. కేయూర. 3. ౧౯౯.

క. ధరయెల్లను గశ్యపునకు, నరవరమును ధార వోసి నాఁడఁ జరింతున్, బోరిఁ బోరి మహేంద్ర శిఖరిన్, జరణము వేయకుము సుకృత కాలిని తలఁపన్. రామా. ౪. ౧౪౫.

౭. (బాణమును) ప్రయోగించు.

మ. కడుకోపించి దశాననుం డతని వక్షః పీఠమున్ జొచ్చి పో,యెడు నటుగ్ర శరంబు వేయుటయు ... ఉ. రా. 3. ౫౧.

౮. కొట్టు, ప్రహరించు.

మ. గాండీవంబునఁ బూన్చి వేయఁ దొడఁగె న్గాండీవి గంగాధరున్ ... హర. ౭. ౭౭.

౯. పందెము వైచు, పాచికను దొరలించు.

సీ. సవలయ ధ్వనిగాఁగ సారె వేయున దల్పు యతిసైన గుండె ఝల్లునఁ గలంప ... పాత్రముల్ సెత్తమాడు. అము. ౧. ౫౯.

౧౦. ఎగురవైచు.

సీ. చూపి వేసిన డేగ చోపి లేపినపుల్గు
మీఁదుగా మీఁదనే మిడిసి పడఁగ ...
కళా. ౪. ౯౮.

౧౧. పఱచు, ఒగ్గు.

గీ. వృక్షశాఖాంచలంబుపై వ్రేలుచున్న, కోటి
సంఖ్యల నీర్కావి గోవణములు, విఘ్న
మృగములఁ బట్టంగ వేసినట్టి, చీరతెరలను
సంస్మృతిఁ జిగురు గొల్పు.
కాశీ. ౨. ౫౫.

మ....భూరమణు లత్యంత ప్రమోదమ్మునన్,
గనఁగాఁ బల్లకిలోన నిందుమతి శృంగా
రాంగ సంపత్కళల్, దవరం బంగరు
తళుకు పావడలు చెంత న్నెచ్చెలుల్
వేయఁగన్. ఇందు. ౫. ౧౦౭.

౧౨. విసరు, ప్రక్షేపించు.

చ. వసుల వధించియున్ ముసల వర్గములం
బడ మోఁది వాలుకల్, మసలక వేసి వంచి
యును మందుల తిత్తులు గాల్చి వైచి
యున్ ... రా. వి. ౫. ౩౦.

౧౩. (వింజామరము - మొ.) విసరు, వీచు.

క. దురముం గనుఁగొనియెడు నిర్జర వరులకు
వేగుచు చామరంబులవలె నం,బరమున నాడె
శిలీముఖ, పరిఖండిత విమతకేతు పటపల్లవ
ముల్. వరాహ. ౫. ౩౭.

౧౪. కప్పు, ఆచ్ఛాదించు.

చ. భయపడి లేచి వేయదురు పాటునఁ
గట్టియుఁ గట్టుకున్న నీవియు నెలవంక
చన్నొనల వేసియు వేయని పైఁటకొంగు...
సారంగ. ౩. ౧౫౪.

౧౫. ధరించు.

ద్వి. మహిమ తోడను భూతి మైనిండ నలఁది,
యురుదైన రుద్రాక్ష హారముల్వైచి ...
ద్వి. నల. ౧. ౧౩.

౧౬. తొడుగు, ధరింపఁజేయు.

చ. ఢళిఢళి మెచ్చువచ్చు నిఁక బ్రహ్మను దీని
సృజించినప్పుడే, తెలయఁగఁ జేతికిన్
బిరుదు వేయఁగ వచ్చును ...
దశా. ౨. ౩౦౫.

౧౭. (సిగ) ముడుచు.

సీ. మందుల ముడిత్రాట మలఁచి వేసిన సిగ
పొల్పుగా నఁగనీని బొడిమికంబు ...
దశా. ౧. ౨౬౦.

౧౮. తాంబూలము నమలు.

క. సోగలగు తెండిటాకుల, లాగునఁ దెల
నాకు మడిఁచి లలన యొసంగన్, బాగాలు
వేసికొని తన, బాగాలున్నట్టి మేడ పజ్జకు
నేఁగెన్. సారంగ. ౨. ౧౯౪.

౧౯. ప్రయోగించు, కొట్టు, తముకువేయు, తముకు
వాయించు.

సీ. తముకు వేసిన తెన్కఁదాఁ జరించినఁ బట్టి
యునుపకుండఁ దలార్ల కొసఁగి యొసఁగి...
శుక. ౪. ౧౧౧.

౨౦. గణించు.

సీ. జనుల కర్మశరీర సంఖ్యలెల్ల దినాంతకము
వేసి లిఖియించు కరణికులను ...
దశా. ౧. ౨౬౪.

వేరకము. సం. వి. అ. పుం. కర్పూరము.

వేరము[1] = వేరిమి. వి. (సం. వైరం.) ౧. విరోధము, పగ.

ఉ. వీరును బాండుపుత్రులును వేరము దక్కి
పొసంగి మన్కికై, పోరితమాడి రేనటులు
బుద్ధులు సెప్పిన భంగియున్ ...
భార. ఉద్యో. ౪. ౩.

శా. వేరంబెత్తిన రాత చెద్దియుడుపన్ జెడ్జైవ్వఁ దూహింపఁగన్ ...
దశకు. ౨. ౭౯.

క. వారిరువురుఁ దమలోపల, వేరము గొని రాజ్యకాంక్ష విజిగీషువులై ...
ఆము. 3. ౧౫.

౨. వేగము.

సీ. ...వైరవేగములగు వేరమనఁగ ...
ఆం. భా. 3. ౪౭.

వేరము². సం. వి. అ. పుం. న. ౧. శరీరము. ౨. కుంకుమ పువ్వు. 3. వంగచెట్టు. శ్రీ.

వేరిమి = వేరము. వి. విరోధము, పగ. (ఇది నేరిమి వంటిది.)

ఉ. వేరిమి ధర్మజుం బరిభవించిన ద్రోహులు వధ్యులన్న నె,వ్వారికిఁ బోలదే ...
భార. ఉద్యో. 3. ౭౪.

('వేరమి' అని శ. ర. = గ్రహించినది.)

వేరు¹. వి. బ. వేరులు, వేళులు, వేళ్లు. (క. బేరు. త. వేర్.) వృక్షలతాదుల మూలములు.

ఉ. పాయక వేరు వెల్లఁకియుఁ బండులు నొండులుఁ గూరగాయలుం, గోయుచు...
హ. సం. ౬. ౬౯౨.

సీ. వానలు సరవితో వర్షించె సస్యముల్ వేళ్ల గొల్చుగ విఱ్ఱవీఁగి పండె ...
మనుచ. ౬. ౧౨౧.

చ....కలమములుండు...తృష్ణలోఁ, దలకొన వంగి మున్ జలముఁ ద్రావెడు క్రిందటి వేళ్లు మీఁదట, న్నిలిపి ...
ఆము. ౧. ౬౩.

వేరు². స. బ. వేఁడునకు బహువచన రూపము ఎవరు.

మ. పతకాంతన్ మదిలోన నైనఁ దలఁపం బాపంబు దుఃఖంబునన్, బరివాదంబును నొంది ఘోరనరక ప్రాప్తవ్యథల్ పెక్కు-వ,త్సరముల్ చెందుదు రట్టి యన్యవనితా సంభోగ దోషంబు దా, నరనాథోత్తమ యింత యంతయని యెన్న న్వచ్చునే వేరికిన్.
వి. పు. ౪. ౨౨3.

వేరుపనస. వి. (వేరు¹ + పనస.) వేళ్లయందుఁ బండ్లు పండెడు పనస. శ్రీ.

సీ. పరిపాకమున వేరు పనసపండుల తావి యిందిందిరములకు విందు సేయ ...
భీమ. ౨. ౫౪.

సీ. పొదగుఁ బొన్నలరాలు పుప్పొడి యిసుముపైఁ బగిలి యొప్పెడు వేరు పనస పంటి, నీటికాల్వలఁ ద్రోచి ...
చంద్రికా. ౨. ౨౦.

సీ. వేరుపనస గుత్తి వెట్టినారువ రేల పనస కరక కొమ్మి పలుకరేణి ...
హంస. ౪. ౧౧.

వేరుపురుగు(వు). వి. (వేరు¹ + పురుగు.) ౧. క్రిమి విశేషము, వృక్షలతాదుల మూలమున పట్టి వానిని నశింపఁజేయు పురుగు.

ఆ. వేరుపురుగు చేరి వృక్షంబు జెఱుచును, చీడపురుగు చేరి చెట్టుఁ జెఱుచు, కుత్సితుండు చేరి గుణవంతుఁ జెఱుచురా ...
వేమన. ౧. ౧౩.

గీ. గ్రామ నికటంబు గాక దూరంబు గాక, చాటి పొరగాక చిట్టూట చోటుగాక, వెల్లి తలగాక క్రీఁ జెదర్వేరు పురువు, రాలి పోటును లేని బారాటినేల.
విప్ర. ౨. ౧౫.

౨. సాళకము, సాళకుఁడు.

ద్వి. బలుగాలియును జండభాను రశ్మియును, బొలయ లోఁగడు మత్తపోవనంబునకు,... భూపకీటము వేరు పురుగవై తివు ...
ద్వి. హరిశ్చ. పూ. ౧౨౨౨.

**వేరువాఱు.** అ. క్రి. (వేరు¹ + పాఱు.) వేరు దిగు, నాఁటుకొను.

ఉ. నీటను దేమయొక్క సనినిల్చి యొకించుక వాడుదేఱి య,ప్పాటున వేరువాఱి ధృతి పాటన మొప్ప నతండొనర్చు న,ప్పాటునఁ జెన్ను మీఱి పరిపాటిగఁ గొంజిగురక్కడక్కడన్, మోటిక లెత్తి క్రొవ్విరులు మొగ్గలు పెగ్గలమయ్యె నయ్యెడన్.
విప్ర. ౨. ౨౩.

చ. తీఱి నుదయంబుఁ జెంది బలిగీమునకున్ వడి వేరువాఱి యు,న్నతమగు రూపుఁ బూని గగనస్థలిలోఁ గొని యచ్చటం దరు, ప్రతతి చెలంగు ... చం. రా. ౨. ౮౨.

**వేరువి(ర్వి)త్తు.** విశే. (√వేరు¹.) సమూలముగ నశింపఁ జేయువాఁడు; నశింపఁ జేయునది.

క. అనిన విని నవ్వి నాతో, నని సేఁతకుఁ దెంపు సేసి యడరెడు రథికుం, గనుట యది నాకుఁ బందువు, వినవే మీకెల్ల వేరువిత్తని నన్నున్.
భార. ద్రో. ౪. ౨౫౯.

గీ. విరహి జనముల పాలింటి వేరువిత్తు, దురితముల కేల వాయోడుఁ దుహినకరుఁడు...
పి. శకుం. ౩. ౧౮౨.

సీ......నోరి, వాకట్టు మందు గర్వలతాలవాలంబు వినయకృత్యంబుల వేరువిత్తు ...
రాజ. చ. ౨. ౨౧.

ద్వి. చివురుఁ బోఁడులు తపశ్శీల వృత్తులకు, వివరింపఁగా వేరు విత్తులు గారె ...
ద్వి. పరమ. ౨. ౬౧. పా.

(వైరాగ్యము.)

సీ. బలవదంతర్వైరోధులకును వేర్విత్తు శ్రేయోవధూటికి జీవగఱ్ఱ... విప్ర. ౧. ౮౪.

**వేరీ.** స. (వేరు² + ఈ.) ఏరీ, ఎక్కడ నున్నారు.

క. ఆ వచ్చిన వారలు వే,రీ వేరీ యనుచు సారెఁ బ్రియ సుత నడుగుం, దా తెలఁ బడు వారిని మీ,రే వారుం గనరె యనుచు నితరులఁ బలుకున్. పర. ౫. ౧౪౬.

**వేర్పడు=వేఱుపడు.** అ. క్రి. భేదపడు, ఏకీభవింపకుండు.

క......ఈ, పురుషులు గూడిన సృష్టికి, వెరువరు లది సంఘటిలదు వేర్పడి రేనిన్.
భార. శాం. ౫. ౬౧.

మ......నాభియు న్నిర్విషం,బును దోఁబుట్టువులయ్యు వేర్పడ గుణంబు ల్వ్యాపఁగాఁ జూడమే. ఆము. ౨. ౬౭.

**వేర్పఱచు=వేఱుపఱచు.** స. క్రి. (√వేర్పడు.) (వేఱు + పఱచు.) వేఱుపడఁ జేయు, వేఱుచేయు, ఎడఁ బెట్టు.

సీ. జను నవిశ్వాసంబు గనుఁగొని మెలఁగుట విశ్వసనీయుని వేర్పఱచుట ... వలదు పతికి ... ఆము. ౪. ౨౫౨.

ఉ. ఇందునిఁ గందు వేర్పఱిచి యిందునిచే సతి మోము చేసి యా,కందును గుంతలంబులుగఁ గంజభవుం డొనరించె ...
విక్ర. ౮. ౮౪.

చ. తిరుపతి కొప్పు లందముగఁ దీర్చిన బూడిద బొట్లు మంచి వే,ర్పఱచిన మించునట్టి రుదురక్కల పేరులఁ గావికోకలున్, హరశివ శబ్దము ల్దగ మృగాంక కళాధరు గేహ సీమ కే,గిరి గుడిమేళము ల్వాదలఁ గిన్నర కంఠియు దాని తల్లియున్.
శుక. ౩. ౯౧.

**వేర్పాటు.** వి. (√వేర్పడు.) ౧. భేదము.

క. ప్రకృతికి నాకును నుదకము, నకు మత్స్యంబు నకుఁ బోలె నైసర్గికమై, ప్రకటంబైనది వేర్పా, టకట యహంకారవశత నదియే నంటిన్. భార. శాం. ౬. ౫౦.

సీ. ద్వేష్యంబు ప్రియమను వేర్పాటు లేదు భూతముల యందెల్లను సముఁడ ... భార. శాం. ౪. ౨౪౨.

౨. విరోధము.

సీ. ...... అడవికేఁగి, తాపస వాక్యామృతములు వీనులఁ గ్రోలి చెలిమి వేర్పాటను చిరమర లకుఁ, జొరక ... భార. శాం. ౧. ౫౮.

**వేర్వాయు.** అ. క్రి. (వేరు¹ + పాయు.) మొన లూడు.

గీ. పండ్లు వేర్వాసి కదలు చూపకయున్న ... కాశీ. 3. ౮౪.

**వేఱగు.** అ. క్రి. (వేఱు + అగు.) ౧. తొలఁగు, దూరమగు.

ఉ. ...... వేఱగుం, దాను బ్రకాశసంపదకు ... భార. శాం. ౫. ౫౬౦.

౨. మఱియొక విధమగు, మాఱు.

క. ఉల్లము వేఱైన మరు, ద్వల్లభుఁ గని రంభ యపుడు దప్పకరామా, పల్లవకర ముఖ వీణా, వేల్లితతాన ప్రతాన వినిమయ ఫణితిన్. కవిక. ౬. ౪౮.

**వేఱడము.** వి. (√వేఱు.¹) భేదము.

క. ...... మాయి, ల్మేయిల్లని వేఱడ మిటు, సేయుదురే యిది సఖిత్వ శీలము తెఱఁగే. మార్క. 3. ౬౦.

క. ఒకనాఁడైనను మాతో, నొక యాలోచనముఁ జేయ కూరక మో, మెత్తి కొనక పోదురు మీ రాం, ద్రకు మగలకు నిట్టి వేఱడంబులు గలవే. భోజరా. ౬. ౧౨౮.

**వేఱీఁడి = వీఱీఁడి.** విశ. (వేఱు + ఈఁడి.) అవివేకి.

గీ. అడవిఁ గూరలు దుంపలు గుడుచుచుండు, కూళ మానినికమ్ముద్దరాలి నోలిఁ, దగులఁ గట్టిన వేఱీఁడి తమ్మిచూలి, చెయ్వులకు నెద్ది యిఁక గుఱిసేయవచ్చు. అచ్చ. రా. అర. 30.

**వేఱీఁడించు.** స. క్రి. (√వేఱీఁడి.) అవివేకమునఁ జెఱుచు.

మ. ...... పేరు నక్షత్రజపుం బెంపును వేఱీఁడింపఁడు గదా కర్ణుండు దీనాకృతిన్. భార. కర్ణ. ౧. 3౬.

**వేఱీఁడితనము.** వి. అవివేకము.

క. నీకైన నలుని తోడన, యాకె మదీయోగ్రరోష మవనీశ్వర నీ, వేఱీఁడి తనమున వచ్చిన, కాఱియ పడకేల పోవఁగా నగు నీకున్. మార్క. ౭. ౨3౮.

**వేఱిమి.** వి. (√వేఱు¹.) భేదము.

చ. వానిది గాక జన్మమను హారము నీ రమణీ లలామ య, య్యొవ్వా నగుబాటుగా నతని యొద్దకు నెచ్చెలిఁ బంచి పంచినం, దానిటు రాక వేఱిమి యొనర్చునో నావల పంచు నించు విల్, కానికి లొంగి నెమ్మదిఁ దలంచుకొనున్ వలపించె నెవ్వఁడో. కువల. 3. 3౮.

**వేఱు¹.** వి. (క. బేఱ్, త. వేఱు; మ. వేఱు.) ౧. భేదము, అన్యత.

మత్తకోకిల. వేఁడు కొంతయుఁ గష్టమైనను
వేఱు లేని సుహృజ్జనున్ ...
భార. ఆది. ౫. ౨౧౭.

గీ. వినుము సత్త్వాది గుణముల ననఘ యాత్మ,
తత్త్వమున లీనములఁ జేయఁ దన్మయత్వ,
దర్శనము దాన నవి మహోదధి నడంగు,
నేఱులట్టుల రూపఱు వేఱులేక.
భార. శాం. ౪. ౩౫౬.

సీ. ......మాలోన నిట్లు.
గీ. వేఱు లేకుంట తెలియక కాఱులాడు, పశు
పాతులు నరక కూపానఁ గూలుదురు ...
వరాహ. ౧౦. ౪౭.

గీ. అర్ధశశిభూషణుండు స్వయంప్రబుద్ధుఁ,
డున్నతుండు నిత్యోర్జిత జ్యోతి యతని,
సంతతానంద శక్తియా సరసిజాక్షి, విశ్వ
జనయిత్రి వారికి వేఱులేదు.
కాశీ. ౫. ౯౯.

౨. భేదోపాయము.

సీ....కొఱలు నవలఁ,జతురుపాయంబుల సంజ్ఞ
లై మంచిగి వేఱుకొట్టన నాల్గు వేఱువేఱు.
ఆం. భా. ౨. ౧౯౦.

వేఱు². క్రి. విశ. ప్రత్యేకముగా. (దీని యామ్రేడిత రూపము వేఱువేఱు, వేర్వేఱు.)

వ. నీ చిత్తంబున వర్తించు మా కృతార్థత్వంబు
వేఱె వర్ణింపనేల ... హర. ౪. ౪౫.

సీ. ఇమ్మలై మరుహజారమ్ములై పొదలుండఁ
బూజవికెలు వేఱె పూన వలదు ...
వసు. ౧. ౧౪౧.

వేఱువేఱు.

గీ. విష్ణు రాజేశ్వరులఁ జూడు వేఱువేఱ ...
కాశీ. ౫. ౧౪౯.

ఆ. ......కనుమలందు నిలువ, వేఱువేఱ యేర్చి
విలుమందిఁ బనిచి ... ఆము. ౩. ౨౪.

వేర్వేఱు.

మ. ...తదాస్థానంబులోఁ బాఠకుల్, వినుత
ప్రౌఢి వసుంధరాధిపతులన్ వేర్వేఱ
కీర్తించుచో ... నైష. ౧. ౪౨.

ద్వి. ......వారిఁ. గొమరార భూషించుకొఱకు
భూషాంబరములు జలములుఁ జూర్ణములు
మాలికలు, వేర్వేఱఁ బూని సవిస్మయా
కృతుల, పర్విన యచ్చర పడఁతులేనూఱు...
ద్వి. పరమ. ౧౨. పా.

వేఱు³. స. ఏ. అన్యము, ఇతరము. (క. బేఱ్, త. వేఱు, మ. వేఱు.)

ఆ. ......అలిగి బకుఁడు, వీనిబాగు నూచ
వేఱంచు డాసిన, తరువుఁ బెఱికికొనుచు...
భార. ఆది. ౬. ౨౯౨.

ఉ. అఱు రసంబులం జవులయందుల క్రొత్తలు
పుట్ట నిచ్చులున్, వేఱొక భంగిఁ బాకములు
విన్నను వొప్పుగఁ జేసిచేసి ...
భార. విరా. ౧. ౪౪.

గీ. అతివ యతఁడొండు కోదండ మందికొన్న,
నఱక వేఱె విల్లెత్తిన విఱుగనేసె ...
ఉ. హరి. ౧. ౧౬౫.

మ. సుడి వాల్దాలుపు కన్న వేఱు కలరే చుట్టంబు
లేవంకలన్ ...... నీలా. ౧. ౯౫.

వేఱుప(వ)డు = వేర్పడు. అ. క్రి. (వేఱు + పడు.) ౧. వేఱగు, విడిపోవు.

ఆ. అలిమాటలు విని యన్నదమ్ములఁ బాసి,
వేఱుపడెడు వాఁడు వెఱ్ఱివాఁడు.
వేమ. ౨. ౧౩౩.

వ. పొలంబులన్ బులుగులన్ జోపుచు డేగ వేఁటకాండ్రు వేఱు పడి వేఁటాడన్ దొడంగిరి ... మను.చ. ౪. ౫౫.

౨. దూరమగు.

క. నాకంబెట నలినాసన, లోకంబెట నిఖిల మౌని లోకేశ్వర యీ, లోకములలోన భవ దవ, లోకమునకు వేఱు వడిన లోకము గలదే. కకు. ౨. ౫౨.

వేఱుపాటు = వేర్పాటు. వి. (√వేఱుపడు.) వేఱగు.

వేఱుపెట్టు. స. క్రి. (వేఱు¹ + పెట్టు.) వేఱు చేయు, అన్యులఁగాఁ జేయు.

ఆ. ఏక నిశ్చయమున నిట యేగుదెంచితి, మనఘ నీవు నేము నధిపు పనికి, నిట్టి మమ్ము వేఱుపెట్టి యొక్కఁటి కార్య, మాచరించు వాఁడ వగుట దగునె.
భార. సౌప్తి. ౧. ౮౮.

వేఱుపోవు. అ. క్రి. (వేఱు¹ + పోవు.) వేఱు పడు. (శ. ర. వా.)

వేఱుబందము. వి. (√వేఱు.) భేదము, వేఱు పాటు, పక్షపాతము.
(చి. ని. శ. ర. బ్రౌ. వా.)

వేఱువాయు. అ. క్రి. (వేఱు¹ + పాయు.) వేఱుపడు.

క. పలువురు యువతులుఁ బుత్రులు, పలువురుఁ గల యతఁడు వేఱువాయఁ దలఁచినన్, లలనలుఁ బుత్రులుఁ దానను, తలకొని మెయి పాలు గొనుట ధర్మంబెందున్.
విజ్ఞా. వ్య. ౧౨౪.

వేఱుసేయు. అ. క్రి. (వేఱు¹ + చేయు.) భేదము నొందు.

క. పాంచాల రాజపుత్రియు, నంచితముగ నిన్నుఁ బొందు నార్వుర వరుసన్, సంచిత పుణ్యుఁడ వీ వొక, యించుకయును వేఱు సేయకే తెమ్మెలమిన్.
భార. ఉద్యో. ౪. ౩౧.

గీ. క్రమము దప్పక యుండ నా రాజ వరుఁడు, సకల లౌకిక వైదికాచార సరణిఁ, బ్రియ ముతో విప్రవరునకుఁ బెండ్లిసేసె, వేఱు సేయక ... విక్ర. ౧. ౧౬౦.

ఉ. వానిద వంధ్య జీవనము వానిది జన్మము వేఱుసేయ కెవ్వాని గృహాంతరంబున భవాదృశయోగి జనంబు పావన, స్నాన విధాన్నపానముల సంతస మందుచుఁ బోవు నిచ్చలున్ ... మనుచ. ౧. ౬౩.

ఆ. శంభు వేఱుసేసి సాగింప వచ్చునే, క్రియలు పెట్టి వేలయయితి సెపుమ......
కాశీ. ౭. ౭౨.

వేల. వి. (త. వేలై.) దాస్యము.

చ. అనుపమ రూప యౌవన మహారుణ వైభవ లీల నెవ్వరిం, గనుఁగొని మెచ్చకున్న వర కన్యక గల్గిన దానిఁ జెప్పు నీ, పనిచిన వాని వేల గొని పైఁబడఁ జేసెద ...
కు. సం. ౪. ౩౯౯.

సీ. హరిఁ దెత్తుమే నీకు నమ్ముడు పడియుండ ......దేవేంద్రుఁ దెత్తుమే నీవేల గొని యుండ ... కు. సం. ౬. ౬౭౪.

ఉ. దండుగు లిచ్చి వేలగొని దానిపయిం జెఱ లిచ్చి ... కు. సం. ౧౦. ౫౨౮.

—సం. వి. ఆ. స్త్రీ. ౧. చెలియలి కట్ట. ౨. కాలము, సమయము. ౩. అదను, తఱి, యుక్తసమయము. ౪. తెలుపి, విశ్రాంతి. ౫. సముద్ర జలప్రవాహము. ౬. సముద్ర తీరము. ౭. మేర, హద్దు. ౮. వాక్కు.

౯. రోగము. ౧౦. అనాయాస మరణము. ౧౧. బంక, జిగురు. ౧౨. అనురాగము. ౧౩. ఈశ్వర భోజనము. (మే. ని.) ౧౪. కాలవిశేషము, హోర. (ఒక గంట కాలము.)

శ్లో. చతుర్వింశతి వేలాభి రహోరాత్రం ప్రచ క్షతే. (వాచ.)

వేలము¹. వి. (సం. వేలా.) ౧. శిబిరము, స్కంధావారము, దండు విడియు చోటు.

ద్వి. అప్పుడు సుగ్రీవుఁ డాదిగాఁ గపులు, చెప్పి రప్పను లెల్ల శ్రీరామువోడఁ, జెప్పి వేలము నకుఁ జెచ్చెర నేఁగి, యప్పుడు సుఖనిద్ర నుండి యారాత్రి. గడపుటయును ...
రం. రా. యు. ౩౧౪. పు. ౨౨. పం.

చ. జెనుక నృపాలు రంగపుల వేలము చొచ్చి పధింతు మున్న యజ్జనకజుఁ డ్రుంతుఁ గాక ... రామా. ౮. ౧౮౩.

చ......బో,రనఁ గటకంబు జెల్వడి నృపా త్మజు వేలముఁ జొచ్చి ...
దశకు. ౪. ౨౨.

౨. విడిది, బస.

గీ. అమృత కుంభంబుఁ గైకొని యసుర వరులు, వేఱ యొకచోట వేలంబు విడిసియుండి,రి...
హరి. ౬. ౯౬.

ద్వి. గూడారములు దరల్గాల్లెనల్ బన్ని, వేరము ల్దప్పక విడిసె నుత్సుకత ...
పండితా. పర్వ. ౩౫౦. పు.
పండితా. పర్వ. ౩౩౬. పు.

౩. సేన, సైన్యము.

ఉ. ...... నిశాద,న్మాలము లంద నాతప సమూహము పేరిటి యిర్లవేలముల్.
వసు. ౪. ౫.

చ......చ,క్కని వని వేడ్క వేలమువిగన్ ఘటియించె జనేంద్రుఁ డయ్యెడన్.
చంద్రి. ౧. ౧౬౮.

(జలచరములు.)

ద్వి. గాలంబునకు నైనఁ గలఁగక క్రొవ్వి, దూలంబుల ననతి స్థూలంబులగుచు, వేలంబు విడిసిన విధమున సెరసి, వాలంబు లల్లార్చి వారి విహార, శీలంబులై విరసించి యొం డొంటి నాలంబులై డాయు నప్పరంబు లును ...
నవ. ౫. ౨౩౩. పు. ౨౩. పం.

౪. గుంపు, సమూహము.

చ....... ఓ వయస్య యీ, విడువని వేలమై కురియు వెన్నెల చిచ్చున కేమిసేయుదున్.
కవిక. ౪. ౧౪౬.

క. ఎడఁగుఁ దనంబున నీళ్లన్నడు మడఁచిన రెండుగాని నలువున బలి భిన్నృడు రెండు వేలుగారన్, విడువని వేలంబు చాటు వేదాంతంబుల్. వరాహ. ౯. ౫౭.

౫. (త. వేలై.) దాస్యము.

సీ. విడువని వేలంబు నుడిగంబులు గొనంగ నిచ్చలు నిద్రలే దచ్చరలకు ...
వరాహ. ౧౦. ౧౫.

౬. వేగము.

సీ. వేగంబు పాశంబు వెలయు వేల మనంగ...
ఆం. భా. ౩. ౪౮.

క. ఈ లీల వెండి మలకడఁ, బాశముడిగి వేల ముడిగి పరిసరవర కం,కేళీ పనసాళీఘన, కేళీవన దర్శనేచ్ఛ గిటికొన మెలఁగన్.
ఉ. రా. ౪. ౧౪౭.

౭. మండలాగ్రము, ఖడ్గము, కత్తి.

చ. చలిమిరి గాడ్పుచే నెగసి సన్నపు సుళ్లగు
చాకసంపు మం,దల వికసిల్లెఁ బుప్పొడులు
దట్టముగా మదిఁ గ్రమ్మ కూర్మిచేఁ, గలికి
విరాలిఁ గుందు తెఱగంటి నేలంతల మీఁదఁ
జొన్పు ప్రా, విలుతునిప్పైఁడి చుట్టలుఁగు
వేలములం బలె సొంపు పెంపునన్.
యయా. ౪. ౧౦.

**వేలము²** = ఏలము¹. హిం. వి. అమ్మటలో నొకవిధము, విక్రయ భేదము.

—సం. వి. అ. న. ఉద్యానము, చిన్నతోట.

**వేలముపట్టు.** వి. (వేలము¹ + పట్టు.) శిబిర ప్రదేశము.

చ. చిలుకలు కిమ్మ దెమ్మెరలు కీతమయూ
ఖుఁడు దేఁటు లాదిగాఁ,గల నన విల్తుసాధన
నికాయము వేలము పట్టులనంగ నా,కుల
ముటుగాన దాని విడగొట్టక తృట్టక దొట్ట
వీత రా,గుల మని విట్టిఁగొదరు కొందఱు
బోడలు నానగండలై.
పాండు. ౫. ౧౭౨.

**వేలాటము.** వి. చెర్లాటము.

ద్వి. తరులతో నతి శోభితంబగు నందు, హరిణ
ముల్ పులులు తేలాటంబు లాడు, ముంగుల
కెలుకలు ముద్దులు పెట్టు ...
ప్రభు. ౪. ౧౩౦. పా. ౬. పం.

**వేలార్చు.** స. క్రి. కుమ్మరించు.

గీ. ఘన పయోధర పదవి నక్షత్ర మాలి, కా
రుచులు పగ్వాశ్యామ యొకర్తు చంద్ర, కళశిఁ
బూని నవామృతమ్ములఁ జకోర, చపల
నయనకు వేలార్చు సమ్మదమున.
చంద్రి. ౬. ౧౯.

**వేలిమి** = వేల్మి. వి. (√ వేలుచు.) ౧. హోమము.

ఉ. వేలిమియున్ సురార్చనయు విప్రసప
ర్యయుఁ జొక్క ......
మను. చ. ౨. ౫౩.

క. తాలిమి మీఱఁగ నెప్పటి, మాలిమిలో
దేవగురుఁడు మంత్రము దెలుపన్, వేలిమి
చేసె ...　　దశా. ౫. ౭౫.
ఆం. భా. ౨. ౧౭౧.

౨. హోమకుండము.

వ... అతని వధంబునకై పాంచాల విభుని
వేలిమిం బుట్టిన వాఁడగుట నప్పార్ష
తుండు ...　　భార. ద్రోణ. ౫. ౩౨౧.

సీ. ......అగ్నియే స్వాహా యటంచు వేలిమి
యందు నొకఁడైన నాహుతి నొసఁగఁ
బోఁడు ...　　దశా. ౧. ౨౫౩.

౩. అగ్ని.

సీ. నెత్తంబు క్రిందటి నెత్తమ్మి కెంపుడాగని
పెంపు వేలిమి కన్నుగాఁగ ...
యయా. ౨. ౩౬.

**వేలిమికట్టె(ట్ట)యు.** వి. (వేలిమి + కట్టియ.) సమిధ.

సీ. విటకచా కృషికి విసువు నొక్క లతాంగి
వేలిమికట్టియ ల్వీటిచి తెచ్చు ...
కవిక. ౬. ౯౫.

**వేలిమిబొట్టు.** వి. (వేలిమి + బొట్టు.) హోమకుండమందలి భస్మముతోఁ బెట్టుకొనిన బొట్టు, రక్ష.

సీ. తూలాడు సిగయును వ్రేలు మాఱుటగొంచి
వేలిమి బొట్టును వ్రేళ్లదర్భ, దనర ...
భాగ. ౧౦. ఉ. ౧౨౫౩.

సీ. నొసటి వేలిమిబొట్టు మసి మీఁద మృగ
నాభి తిలకంబు బటువుగాఁ దీర్చవచ్చు ...
రామా. ౨. ౧౧౦.

వేలిమియొజ్జే. వి. (వేలిమి + ఒజ్జే.) పురోహితుఁడు.

సీ. మానితంబైన హోమద్రవ్యములు గొని
వేలిమి యొజ్జయై వేధ రాఁగ ...
కు. సం. ౯. ౨౨౪.

వేలు = వ్రేలు. అ. క్రి. వ్రేలాడు.

గీ. చులకఁ గాల్వట్టి యీడ్చినఁ జాఁగువట్టి, వేలు
దురు గాక తనవారి విడుతురెట్లు ...
కాశీ. ౫. ౨౯౩.

ద్వి. ఉడుపంక్తి చెదరె నూర్యుని వేగ మడరె,
వడఁకె శేషుఁడు ధరావలయంబువేలె ...
ద్వి. పరమ. ౨. ౧౧౫. పా,

—వి. జ్యో. అంగుళి.

సీ.....వేల్ వ్రేలన నంగుళియగు ...
సాం. ని. మాన. ౧౪.

సీ.....వేల్ వేలునా నంగుళీ సంజ్ఞ లెసంగు...
శంక. మాన. ౩౯.

సీ. వాలు డాలును ముష్ఠ చేలు ప్రాలును వేల్పు
చాలు మేలును గల వేలివాఁడ ...
ప్రబంధ. ౨౨౮.

వేలుచే = వేల్చు. స. క్రి. (అగ్నిహోత్రము నందు అజ్యాది హవిస్సులను) హోమము చేయు.

అ. ధర్మసంగరమున ధర్మజుచేఁ జచ్చి, పొలిచెఁ
జూడ మద్ర భూవిభుండు, విధియుతంబు
గాఁగ వేలిచి విడిచిన, నాఁటియున్న యగ్ని
ననుకరించి. భార. శల్య. ౧. ౨౭౪.

ఉ.....ధర్మరాజులో, దాలి మనోభవాగ్నిఁ
దన తాలిమి నాహుతిగాఁ గ్రమంబునన్,
వేలుచు చున్నవాఁడభినివిష్టసుఖైక ఫలాభి
కాంక్షియై. నైష. ౮. ౩౫.

ద్వి. ఓలి శివాగ్ని కాహుతులుగా నిట్లు, వేలఁతు
నిదియ తా విధి దీనికనుచు ...
పండితా. పురా. ౧౦౯. పా.

వేలుపించే. స. క్రి. (√ వేలుచే.) హోమము చేయించు.

ద్వి. సవరని గంధపు సమిధ లమర్చి, జాతిముత్తి
యపు లాజలు వేలుపించి ...
ద్వి. పరమ. ౫. ౩౭౦. పా.

వేలుపు = వేల్పు. వి. (√ వేలుచే.) ౧. దేవత.

సీ. తొలి వేలుపుల వేలుపుల పనుల్ గొను
చుఁడు ... మనుచ. ౫. ౮౩.

వ......అక్కక్క ౼ మొక్కవే మనపాలి
వేలుపని బుజ్జగించుచుయు ...
అము. ౮. ౩౫.

౨. దేవతా స్త్రీ.

చూ: వేల్పు.

౩. దోస్యము.

ద్వి. అహికంబులఁ బెట్టి యప్పులు వార,వృద్ధి
కొసంగుదు వేలుపు చెప్పు, పద్ధతి నేర్తు ...
నవ. ౩. ౧౫౩. పా. ౧౭. పం.

వేలుపుఁ గత్తళాని. వి. (వేలుపు + కత్తళాని.) దేవతాశ్వము, ఉచ్చైశ్శ్రవము.

ఉ. ఉప సుధర్మస్థాని నున్న వేలుపుఁ గత్త
ళానికిఁ బట్టు తలాట మనఁగ ...
వరాహ. ౮. ౧౮౫.

వేలుపుఁగమ్మరి = వేల్పుఁగమ్మరి. వి. (వేలుపు + కమ్మరి.) దేవశిల్పి, విశ్వకర్మ.

క. వేలుపుఁ గ్రమ్మరి ప్రొద్దుం, బోలె నలుఁగు
గమిని మేను బొరిఁబొరిఁ దునియల్,
ద్రీలంగ సానవట్టిన, పోలిక ...
అచ్చ. భా. ౫. ౯౦.

**వేలుపుఁజేన.** వి. (వేలుపు + చేన.) అప్సర స్త్రీ.

క. ఆడిరి వేలుపుఁ జానలు, పాడిరి గంధర్వ సతులు ప్రమదం బెసఁగన్, బ్రోడలగు మింటి తెరువరి, చేడియ లటు రలరు నేసలు వేడ్కన్. జాహ్నవీ. ౧. ౧౩౮.

**వేలుపుఁజెట్టు.** వి. (వేలుపు + చెట్టు.) కల్ప వృక్షము, దేవతరువు. (శ. ర.)

**వేలుపుఁజేడె.** వి. (వేలుపు + చేడె.) దేవతా స్త్రీ, అచ్చెర.

మధురగతి రగడ. వేలుపుఁ జేడెల వెలఁగొను వేశ్యలు, శ్రీలఁ గుబేరునిఁ జెనకెడు వేశ్యలు ... కుచేల. ౧. ౨౩.

**వేలుపుఁదిప్ప.** వి. (వేలుపు + తిప్ప.) మేరు పర్వతము.

ఉ. చెప్పెడి దేమి నవ్వుచు రచించిన మాటలు రాము బాణముల్, దప్పినఁ దప్పఁ డాశ్రిత కలాపము ముంగిట నున్న వేలుపుం దిప్ప వివేకశాలి యువతీ జన చిత్త వినూత్న దర్పకుం, డప్పన మంత్రి వానిఁ దగమా నుతియింప నిలింప కోటికిన్. రాజ. చ. ౧. ౩౫.

**వేలుపుఁదెరువు.** వి. (వేలుపు + తెరువు.) సుర పథము, ఆకాశము. (శ. ర.)

**వేలుపుఁదేజి.** వి. (వేలుపు + తేజి.) ఉచ్చైః శ్రవము.

సీ. అనికి వేలుపుఁదేజి సలరుక్కై జామోర లల్లా ర్పుచేఁ జీరు హయకులముల ...... చంద్రి. ఒ. ౭౫.

**వేలుపుఁద్రోవ.** వి. (వేలుపు + త్రోవ.) ఆకాశము.

క. ......మల్లియు, విరులసఁగా రిక్కలెసఁగ వేలుపుఁ ద్రోవన్ ... నీలా. ౩. ౬.

**వేలుపుఁబెద్ద.** వి. (వేలుపు + పెద్ద.) సుర జ్యేష్ఠుఁడు, బ్రహ్మదేవుఁడు.

ఉ. బుద్ధుల ప్రోడ నాల్గు మొగముల్గల విశ్రుత మూర్తి తమ్మిపూ, గద్దియ మీఁదనుండి త్రిజగంబులు నేలుచు నుండు వేలుపుం, బెద్ద వహోవధూటి వలపించిన సర్వగుణైక శాలి యు,ద్యద్దయఁ బ్రోచుఁ గాత సుగుణాం బుధిఁ దిమ్మయ మంత్రియప్పనిన్. రాజ. చ. ౧. ౩.

క. తద్దయుఁ బొగడెద వేలుపుఁ, బెద్దయనన్ జగములెల్లఁ బెంచుచుఁ బల్కు,న్ముద్దియలో నెఱతామర, గద్దియఁ గొలువుండు నల్మొగంబుల ప్రోడన్. నీలా. ౧. ౫.

**వేలుపుఁబొన్న.** వి. (వేలుపు + పొన్న.) సుర పొన్న. శ్రీ.

వ. బలు వేలుపుఁ బొన్నలం దొలఁగఁ ద్రోయు మిన్నేటి నీటి వరదపోటున...... అచ్చ. భా. ౨ ౩౧. పా.

**వేలుపుగమికాఁడు=వేల్పుగమికాఁడు.** వి. (వేలుపు + గమికాఁడు.) ౧. కుమారస్వామి. (శ. ర.)

౨. బ్రహ్మదేవుఁడు, సురజ్యేష్ఠుఁడు.

వ. అంతలోన నజీవుండు సజీవుండైన తెఱంగున నెనిమిది కన్నులుగల వేలుపుగమి కాఁడు తేటి తెప్పిటి కాలుఁగెలుఁ గద లించి కన్నులు విచ్చి చూడ సమర్థుండై... భాగ. ౧౦. పూ. ౫౪౨.

**వేలుపుగాణ = వేల్పుగాణ.** వి. (వేలుపు + గాణ.) గంధర్వుఁడు. (శ. ర.)

వేలుపుగిడ్డి = వేల్పుగిడ్డి. వి. (వేలుపు + గిడ్డి) కామధేనువు, దేవతల గోవు.

ఉ. వేలుపు గిడ్డియుం బరుస వేదియుఁ గల్ప కుజంబుఁ దోడరా. ......
భీమ. ౨. ౧౪౩.

వేలుపు జెక్కెర. వి. (వేలుపు + జక్కెర.) ఆకాశగంగ, సురదీర్ఘిక, స్వర్ణది.

క. జక్కెల దొర చెలికానికిఁ, గొక్కెహుమా జోదు నయ్యకుం జొక్కెపు లేఁ, జుక్కెల తేనిని వేలుపు, జెక్కెర సౌదలను దాల్చు జగవేల్పునకున్.
అచ్చ. రా. బాల. ౨౧.

వేలుపుజెడదారి. వి. (వేలుపు + జెడదారి.) సురమౌని, నారదుఁడు.

సీ. వేలుపు జెడదారి విందారగించువో నానంద బాష్పంబు లడ్డపడును ...
ఉ. హరి. ౬. ౧౩౯.

వేలుపుటిల్లు. వి. (వేలుపు + ఇల్లు.) మేరుపర్వతము.

ఉ. వేలుపుటిల్లు విల్లు జెడవీకల పోకల నారి రెండు చే, దోల బెలుంగు తూపె చటఁ దోలినఁ బాఱని తేరుమాటలై, గ్రాలెడు తేజిలెవ్వనికిఁ గల్గునతండు చళుక్య విశ్వ భూ,పాలు మనంబునం బర విభంజనుఁడై విహరించుచుండెడిన్. కావ్యా. ౫. ౯౭.

వేలుపుటేఱు = వేల్పుటేఱు. వి. జౌ. సురదీర్ఘిక, ఆకాశగంగ.

ఉ. వేలుపుటేఱుఁ గప్పురము వెన్నెల లంచలు ముత్తియంబులుం, బోలును మంచు నద్దములుఁ బయ్యెరమేపుడు తేఁడు గల్వ రా, తాలును రేబెలుంగు మగతాలును తిక్కెలుఁ దమ్మిచూలి యిల్లాలును జోడుగాఁగఁ దన రారు నసంబునఁ గేగు దయ్యమా.
అచ్చ. రా. బాల. ౨౧౪.

ఉ. ...కీలు జాళువా, మేలిపసిండి బొమ్మచను మిట్టలకున్ దెలిచల్వ పైఠిణీ, చేలచెఱంగులై యచటఁ జెల్వగు వేలుపు టేటి పెందెరల్. ఉ. రా. ౧. ౫౭.

వేలుపు(ల్పు)టొజ్జ. వి. (వేలుపు + ఒజ్జ.) సురాచార్యుఁడు, బృహస్పతి. (శ. ర.)

వేలుపుటొడయఁడు = వేల్పుటొడయఁడు. వి. (వేలుపు + ఒడయడు.) దేవేంద్రుఁడు.

సీ. ముని గౌతముఁడు నాఁగ నొనరు పంట వలంతి జేజే నిరాబారి సింగమునకు, గారాబు టిల్లాలఁ జే రహల్యయటందు రొకనాఁడు వేలుపుటొడయఁ డెమ్మె, ననుఁగోరి పుంజారూపునఁ జేరి నడురేయి తఱి నింటిదరిఁ బొంచి యఱచుటయును...
అచ్చ. రా. బాల. ౧౪౬.

వేలుపుదాయ= వేల్పుదాయ. వి. (వేలుపు + దాయ.) సురద్విషుఁడు, అసురుఁడు.
చూ : వేల్పుదాయ.

వేలుపుబానిస=వేల్పుబానిస. వి, (వేలుపు + బానిస.) వేశ్య. (శ. ర.)

వేలుపుమానికము = వేల్పుమానికము. వి. (వేలుపు + మానికము.) చింతామణి.

క. దాన సమగ్రత వేలుపు, మానికమును బోలు ననుచు మహనీయమణిన్, గానుక యిచ్చి నరేంద్రుని, వేనోళ్లం బ్రస్తుతించి వీడ్కొని చనియెన్.
విక్ర. ౨. ౨౫౩.

వేలుపుమావు = వేల్పుమావు. వి. (వేలుపు + మావు.) ఉచ్చైశ్శ్రవము, దేవాశ్వము.

సీ. ఒంట తిర్వున నేగు వివిధాశ్వ కంధరల్
దగిరి వేలుపు మావు వెలుఁగు బూన ...
చంద్రా. ౬. ౯౨.

**వేలుపుమిన్న.** వి. (వేలుపు + మిన్న.) దేవతా శ్రేష్ఠుఁడు.

సీ. ... వేలుపు మిన్నల వివిధ భూషణ కాంతి
శక్ర చాప స్ఫూర్తి సవదరింప ...
దశా. ౧. ౨౬౫.

**వేలుపు ముద్దరాలు = వేల్పు ముద్దరాలు.** వి. (వేలుపు + ముద్దరాలు.) దేవతా స్త్రీ.

క. ఈ విధమున నయ్యిరువురు, భావజ తంత్రైక
పరత బహుకాలము సౌ,ఖ్యావహ లీలల
నుండం,గా వేలుపు ముద్దరాలు గర్భము
దాల్చెన్. మనుచ. ౩. ౧౧౭.

**వేలుపు(నో)మొదవు.** వి. (వేలుపు + మొదవు.) కామధేనువు, దేవతల యావు.

క......కోర్కులు, పొలుపొదవఁగఁ బిదుకు
వేలుపు నొ్మదవునకున్.
నీలా. ౧. ౨౧.

**వేలుపురాచిల్కు=వేల్పురాచిల్కు(లుకు.)** వి. (వేలుపు + రా + చిల్కు.) ఐంద్రాస్త్రము, ఇంద్రుఁ డధిదేవతగాఁ గల అస్త్రము.

సీ. రాచూలి వేలుపు రాచిల్కు నిగిడించి యా
చెయ్యి డెగవైచి యపుడె సాము, నెల
ముల్కిదోయి నిచ్చలముగాఁ బఱగించి
కాళ్లు రెండును ద్రుంచి ...
అచ్చ. రా. యు. ౨౪౭.

**వేలుపురాపురువు.** వి. (వేలుపు + రా + పురువు.) ఇంద్రగోపము, ఆరుద్ర పురుగు.

ఉ......జడిగొన్న మంకెనన్, లిప్పఁగఁ జేయు
నట్లు దగ వేలుపురాపురు వుంగముల్
దతిన్. అచ్చ. భా. ౩. ౫౧.

**వేలుపుఱేఁడు.** వి. (వేలుపు + ఱేఁడు.) ఇంద్రుఁడు.

ఉ......వేలుపు ఱేనిగెల్చు టొక విక్రమమే
బలిదైత్య వల్లభా. దశా. ౨. ౪౨౩.

ఉ......జాబిలి రాల మేడలో, వేలుపుఱేఁడు
నల్వయును వెన్నుఁడు గొల్వఁగ ...
నీలా. ౧. ౧.

ఇట్లే: వేలుపుచేలిక, వేలుపురాయఁడు. మొ||

**వేలుపుచెట్టు.** వి. (√వేలుపు.) కల్పవృక్షము.

శా. ఏఁడీ పేదలపాలి వేలుపులచెట్టు ...
అచ్చ. రా. అయో. ౭౭.

**వేలుపులదారి.** వి. (√వేలుపు.) ఆకాశము.

చ. తడయుక వచ్చె వేలుపుల దారిని శాముల
వేఁటకాఁ డొగిన్ ...
అచ్చ. రా. యు. ౧౬౨.

**వేలుపులపెద్ద.** వి. (√వేలుపు.) బ్రహ్మ, సురజ్యేష్ఠుఁడు.

సీ. కెందమ్మి గద్దె యెక్కిన వేలుపుల పెద్ద
పలుకుఁ బూఁబోఁడికిఁ బ్రాణపదము ...
దశా. ౨. ౬౨.

**వేలుపులపెద్ద కొమరుఁడు.** (√వేలుపు.) నారద మహాముని.

క. అని పుట్టఁ బుట్టువునకుం, గొనకొని వేలు
పుల పెద్ద కొమరుఁ డెఱిఁగిం,చిన నాల
కించి యతఁ డా,యన నవ్వాలి కతయుఁ
దెల్పుని వేడుటయున్.
అచ్చ. రా. బాల. ౨౧౩.

**వేలుపుల ప్రోలు.** వి. (√వేలుపు.) అమరావతి, స్వర్గపట్టణము.

గీ. కూడు నిదురయు నెపుడుం లేకూఱకుండు,
వేలుపుల ప్రోలు నమ్మోటి వీటికెనయె ...
అచ్చ. రా. బాల. ౩౧.

**వేలుపువడ్రఁగి.** వి. (వేలుపు + వడ్రంగి.) విశ్వకర్మ, దేవశిల్పి.

క. వేలుపు వడ్రఁగి పెట్టిన, కీటనఁ బలు కాట
మాట క్రియ గనుపట్టుం, గాలోచితముగఁ
దద్ది, వ్యాలయరత్న ప్రతిమల కనురూపము
గన్. కవు. ౨. ౧౦.

**వేలుపువెలఁది.** వి. (వేలుపు + వెలఁది.) దేవతాస్త్రీ. అప్సరస స్త్రీ.

క. అని యాస గలుగఁ బలికిన, విని వేలుపు
వెలఁది మోము వికసిల్లంగాఁ, దనచేతి
చెఱఁగు బిగియన్, బెనచుచుఁ దలవాంచి
నగవు బెరయఁగఁ బలికెన్.
మనుచ. ౩. ౧౦౬.

**వేలుపుసాని = వేల్పు(ల)సాని.** వి. (వేలుపు + సాని.) ౧. జోస్యము చెప్పు స్త్రీ, సోదె చెప్పునాఁడుది, దైవజ్ఞ.

సీ. ......తగు దైవజ్ఞ సోదెకత్తె, యనఁగ
వేలుపు సాని యన ...
ఆం. భా. ౨. ౧౧౧.

**వేల్చు.** స. క్రి. అగ్నిహోత్రమందు అజ్యాదికము సమర్పించు, హోమము చేయు.

ఆ. ......ప్రయోగ దక్షుఁడగ్ని, ముఖము సేసి
వేల్వ నొనసి వివాహోప, కరణ వస్తు
చయము గాచి యుండె.
భార. ఆది. ౪. ౧౬౪.

గీ. హృదయ వేదికయందు సమిద్ధ మూర్తి,
వెలుఁగుచుండు తేజమునందు వేల్చుఁ బ్రాణ,
ములను యాజి యట్లంతరమున నొనర్చు,
యాగమున వీతకల్మషుఁడై వెలుంగు.
భార. శాం. ౫. ౧౪౯.

సీ. రేపు సూర్యుండును మాపు చుక్కలుఁ
దోఁచునంతదాఁక ను జపమాచరించి, యటు
మీఁద నాత్మ గృహ్యానురూపంబుగా
విధివంతముగ నగ్ని వేల్వవలయు ...
విజ్ఞా. ౧. ౬౩.

ఉ. పంకజనేత్ర గౌతముని పంపున లాజలు
దోయిలించి ధూ,మాంకుని యందు వేల్చె
దరహాసము లొప్పులలోన గాఁచుచున్ ...
నైష. ౬. ౧౦౨.

ఆ. అనిన సాహసాంకుఁ డంబిక నెళ్లని, ప్రము
దితాత్మఁ జేయఁ బ్రబలిన వట్టి, మధు నిషిక్త
మైన మాటార సత్ఫల, వితతిఁ దాను నట్ల
వేల్వఁ దొణఁగె. విక్ర. ౫. ౪౮.

౨. కాల్చు, తగులఁ బెట్టు.

గీ. అతని ముఖ గహ్వరంబుల నద్భుతముగ,
నుగ్రదహన శిఖావళు లుద్భవించి, వేల్పు
మూఁకల నరికట్టి వేల్వఁ దొడఁగె, నంత
నెంతయు సంభ్రాంతు లగుచు సురలు.
భార. అర. ౫. ౨౧౮.

గీ. మాడుగులు వేల్చె నొడ్డాది మసి యొనర్చె...
ఆము. ౧. ౩౬.

౩. భర్జించు.

వ. పర సంతాపకారి కటుక వచనుండగు
కుటిలబుద్ధి నిం గలంబున వేల్వఁడు ...
కాశీ. ౩. ౧౫౪.

**వేల్పించు.** స. క్రి. (వేల్చు.) హోమము చేయించు.

క. వేలుపుల ఱేఁడు గురుచే, వేలిమి వేల్పించి
బలిమి వెలయఁగ ......
భాగ. ౯. ౫౦౫.

క. పోల్పఁ దొలి మినుకు దెఱఁగున, వేల్పించిన
పిదప రాచ విరివింటి దొరన్, వేల్పులకున్
మ్రొక్కించిరి ......
యయా. ౪. ౧౧౩.

**వేల్పు[1] = వేలుపు.** వి. (√వేలుచు.) ౧. దేవత.

క......పొలుపుగ ధర్మం, దలఁపుము మఱి యాతఁడె వేల్పులలోపలఁ బెద్ద ధర్మవున సత్యమునన్. భార. ఆది. ౫. ౯౨.

క.....వేంకటపతి యిష్టమయిన వేల్పగుటఁ... ఆము. ౧. ౧౬.

క. వీఁడే దిలీప భూపతి, వాఁడి తనంబునను గానవచ్చును మరుచేఁ, బోఁడిమి యతి యున్నప్పుడె, వేఁడె మెయింబట్టి తెత్తు వేల్పులు బెగడన్. సుధ. ౫. ౬.

ఉ......ఈశుమంత్రంబున వేల్పు వ్రేల్చి ... దశకు. ౪. ౧౨౧.

**వేల్పు[2] = వ్రేల్పు.** వి. (√వేలు.) వ్రేల వేయుట.

గీ. ముసిది ముప్పునఁ బెండ్లికై మొగము వేల్పు, దగవు గాదని రాఁడయ్యెఁ దాతవేల్పు... నైష. ౪. ౧౨౯.

**వేల్పుఁగన్నియ.** వి. (వేల్పు[1] + కన్నియ.) దేవతా స్త్రీ.

సీ. ముదిమి యెన్నఁడు లేని కోదమ ప్రాయఁపుఁ జెల్వు నేర్పులు వేల్పుఁ గన్నియల కమరు ... ఉ. రా. ౪. ౯౦.

**వేల్పుఁగమ్మరి = వేలుపుఁగమ్మరి.** వి. (వేల్పు[1] + కమ్మరి) దేవశిల్పి, విశ్వకర్మ.

ద్వి. బొమ్మర వోయి వేల్పుల మూఁక వేల్పుఁ, గమ్మరిఁ బిలిచి యక్కజము చూచితివే ... ద్వి. పరమ. ౧. ౨౪. పొ.

**వేల్పుఁగలువకంటి.** వి. (వేల్పు[1] + కలువకంటి) దేవతా స్త్రీ.

వ. వేల్పుఁ గలువ కంటులు క్రొమ్ముడులు వీడ ... ఉ. రా. ౩. ౪౮.

**వేల్పుఁగొండ.** వి. (వేల్పు[1] + కొండ.) వేలుపు కొండ, మేరుపర్వతము.

గీ. కొండ మరధనమని వేల్పుఁ గొండ మహికిఁ, దెచ్చి దానంబు లొనరించు తెఱఁగుదనర, నాశ్రితుల కర్థమొసఁగెఁ బెదప్పవిభుని, భార్య కొండమ్మ తనదు సంపద చెలయ. ఇందు. ౧. ౪౦.

**వేల్పుఁజెట్టు.** వి. (వేల్పు[1] + చెట్టు.) కల్ప వృక్షము, సురతరువు.

వ. వేల్పుఁజెట్టు పూదండల దళడితనంబున ... ఉ. రా. ౪. ౧౬౩.

**వేల్పుఁ(లుపుఁ)దపసి.** వి. (వేల్పు[1] + తపసి.) దేవఋషి, నారదముని.

గీ. వినుము వాల్మీకిఁ జూచి యవ్వేల్పుఁ దపసి, వల్కె రా చందమామ లప్పగిదిఁ బంప, కడమెలంగఁగ నద్దరి గట్టుమీఁద, నుండి కన్గొని ప్రొద్దు కుఱ్ఱండు దలఁకి. అచ్చ. రా. కిష్కిం. ౨.

**వేల్పుఁ(లుపుఁ)దెరవు.** వి. (వేల్పు[1] + తెరవు.) సురవర్త్మము, ఆకాశము.

క. పొంగుచు నరదముపైఁ బోలఁతిం గూరిమి నునిచి వేల్పు తెరవునఁ బఱచెన్, బంగరు పిచ్చికఁ గొంచున్, నింగికి సాళువపుఁ బులుఁగు నెగయు తెఱఁగునన్. అచ్చ. రా. అర. ౬౨.

**వేల్పుఁ(లుపుఁ)దెఱవ.** వి. (వేల్పు + తెఱవ.) దేవతా స్త్రీ.

గీ. కలికి చూపులఁ బరువంబుగా నొనర్చి, తిల కమునఁ బూవులొక వేల్పుఁ దెఱవగొను... పి. శకుం. ౨. ౧౩౮.

**వేల్పుఁదొయ్యాలి.** వి. (వేల్పు[1] + తొయ్యాలి.) అప్సర స్త్రీ, అచ్చర.

చ. ......పెన్నిధిగలిన్ బ్రతికిన్ బొడకట్టె
వేల్పుఁ దొ,య్యలి చిఱుసాన బట్టిన యనం
గుని మోహన బాణమో యనన్.
మనుచ. ౬. ౩౧.

**వేల్పుఁబెద్ద.** వి. (వేల్పు+పెద్ద.) సురజ్యేష్ఠుఁడు, బ్రహ్మదేవుఁడు.

మ. పురుషుం డంచుఁ బరేశ్వరుం డనుచు వేల్పుం
బెద్ద యంచున్ ...
ఉ. రా. ౧. ౨౫౦.

రగడ. చిలువరాయఁడు ప్రొద్దు చూలియు జింక
తాల్పును వేల్పుఁబెద్దయు ...
అచ్చ. రా. యు. ౬౪.

**వేల్పుబెద్దన=వేల్పుఁబెద్ద.** వి. సురజ్యేష్ఠుఁడు, బ్రహ్మ.

క. మనసున సిగ్గును జెఱుపుం, బెనఁగొని నిండార
వేల్పుఁ బెద్దన యపు డల్లన నేలమీఁద
నాలికిన, తన శుక్లము వామపాద తలమునఁ
జమరెన్. జాహ్నవీ. ౧. ౧౬౫.

**వేల్పుకూఁటికుండ.** వి. (వేల్పు+కూడు+కుండ.) అమృత కలశము.

సీ. కొని పోవు నావేల్పు కూటికుండ సుపర్ణుఁ
డీ తేసె మావియుం జెఱఁగనేని ...
రా. వి. ౩. ౭౩.

**వేల్పుఁగట్టు.** వి. (వేల్పు¹+గట్టు.) మేరుపర్వతము.

ఆ. అంత వేల్పుగట్టు నలవి మీఱఁగ నొక్క,
జెనలఁ జూచు నిచ్చ దివుట నొక్క,
విన్ను దాఁటు నొక్క గన్నదీపాడవున,
నిక్కు-మంచు గొండఁ కొక్క నతఁడు.
అచ్చ. భా. ౨. ౨౬. పా.

**వేల్పు(లుపు)గాణ.** వి. (వేల్పు+గాణ.) ౧. దేవ గాయని, అప్సరస్త్రీ.

వ. వేల్పుగాణలు పాడు లక్ష్మీనారాయణుల
కల్యాణంపుఁ బాటలన్ ...
మనుచ. ౫. ౩౧.

౨. గంధర్వుఁడు.

చూ: వేల్పుగాణ తూపు.

**వేల్పుఁగాణతూపు.** వి. (వేల్పుగాణ+తూపు.) గంధర్వాస్త్రము.

గీ. మయుఁడు దబ్బర మీఱనేమమునఁజేసి,
యుడిన ముల్కి-గడంక నీరేనుతలల, తోడి
వేలుపు సిమ్మినఁ దోన వేల్పు, గాణతూపేసి
దొర దానిఁ గ్రమ్మరించె.
అచ్చ. రా. యు. ౩౫౧.

**వేల్పు(లుపు)గిడ్డి.** వి. (వేల్పు¹+గిడ్డి.) కామధేనువు.

సీ. దొడ్డిఁ బెట్టిన వేల్పుగిడ్డి కాఁపు ...
మనుచ. ౧. ౬౬.

**వేల్పు(లుపు)గుబ్బలి.** వి. (వేల్పు¹+గుబ్బలి.) మేరుపర్వతము.

ఉ. ముందు పసిండి తమ్మి బలు మొగ్గల మొగ్గర
మావరించు మేల్, చిందెడు వేల్పుగుబ్బలి
వజీరుని జీరు నధఃకరింపఁగాఁ, గ్రొందళి
రాకు బాకు దొరకున్ దొరకించు భవంబు
చెల్లరే, చందన గంధి చన్నుఁగవ
చంద్రుఁడో యింద్రుఁడో యాయుపేం
ద్రుఁడో. కృ. శకుం. ౨. ౧౨.

**వేల్పు(లుపు)గొంగ.** వి. (వేల్పు+గొంగ.) దేవద్వేషి, రాక్షసుఁడు.

గీ. వేల్పుగొంగయుఁ గడలేని వేడ్క-తోడ,
నపుడె తవదీవి కేఁగి సెయ్యమున నింటి,
చెంత పూఁదోఁటలోన నచ్చెలువ నునిచి,
కఱకు రాకాసి కొమ్మలఁ గాపుపెట్టె.
అచ్చ. రా. అర. ౪౪.

వేల్పుజడదారి = వేలుపుజెడదారి. వి. నారదుఁడు, సురమౌని.

గీ. వినుము కత వేల్పుజడదారి విన్నుచూలి, మేపరుల నట్టు పుట్టువు మేటికిత పసిఁ, గాంచి యిట్లనునంత నగ్గట్టు మీఁద, దరలి రాఁగ వుల వలికి దాటి చనుచు.
అచ్చ. రా. అర. ౨.

వేల్పు(లుపు)టావు. వి. (వేల్పు¹ + అవు.) కామధేనువు.

సీ. వేదాది విద్యలు విశ్రమించిన తావు విబుధకోటులపాలి వేల్పుటావు ...
రాజ. చ. 3. 8.

శా. హల్యన్ మోచి కొమాళ్లు దున్నఁగఁ దదీయక్రాంతి యొంతో మన,శ్శల్యంబై కనిపింప లంపటపడెన్ సంతాన బాహుళ్యమాం,గల్యం బొందియు వేల్పుటావనఁగ నింకం బుత్రశోకంబు కా,సల్యా దేవికి నేక పుత్రకుఁ దరించన్ శక్యమా యక్కటా.
చం. రా. ౪. ౯౪.

వేల్పు(లుపు)టూరు. వి. (వేల్పు¹ + ఊరు.) దేవపురి, అమరావతి.

ద్వి. దారుణీ స్థలి సంపద్దలచేత వేల్పు,టూరు గేలించు కోడూరు నా వెలయు ...
ద్వి. పరమ. 3. ౧౭౮. పా.

వేల్పు(లుపు)టేనిక. వి. (వేల్పు¹ + ఏనిక.) ఐరావతము.

సీ. వేల్ప టేనికలయ్యెఁ బోల్ప సేమఁగుఱ్ఱెలఁ గొండలన్నియు వెండి కొండలయ్యె ...
అచ్చ. రా. అయో. ౨౦.

వేల్పుటేఱు=వేలుపుటేఱు.వి.ఔ.(వేల్పు¹ + ఏఱు.) దేవనది, ఆకాశగంగ.

మ. కినుకం బుట్టిన యట్టి హాని హృదయక్లేశంబు శాంతంబుగా. ముని శిష్య ప్రకరంబుతోడ గమనాన్ముఖ్యంబునన్ ముచ్చటల్, తనియం జెప్పుచు వేల్పుటేటి నికటస్థానంబు నందుండఁగాఁ, వనజాతాప్తుని మండలంబు దిగియె స్వారాశి దిక్సీమకున్.
భీమ. ౨. ౨౩.

ద్వి. శ్రమము దీరఁగ నిల్చి జననాథ తిలకుఁ,డటఁ జని ముందట నా వేల్పుటేటి, తటమున ...
ద్వి. హరిశ్చ. ఉ. ౪౩. పం.

వేల్పు(లుపు)టొడయఁడు. వి. (వేల్పు¹ + ఒడయఁడు.) దేవేంద్రుఁడు.

ఉ. అత్తటి జోగి వేల్పుటొడయం డెద నాతని మెచ్చి కూర్మితో, నెత్తి కవుంగిలించుకొని హెచ్చుగ వేలుపులెల్ల సొంపు దల్కొత్తఁగఁ జేరి వ్రేలుముల నోరపుఁ బాళ్లు గొనంగ గిత్తరా, తత్తడి నెఁకెడదం దనియఁ దప్పక జన్న మొనర్చి యంతటన్.
అచ్చ. రా. బాల. ౧౨౩.

వేల్పు(లుపు)డిగ్గియ. వి. (వేల్పు¹ + డిగ్గియ.) సురదీర్ఘిక, గంగానది.

క. వేలిమి యగ్గి పొగల్లగు, వేలుపుడిగ్గియ మునింగి వెలువడు నమరీ,జాలము తిన్నని పెన్నెతి, వాలుఁగురుల కగరు ధూపవాసనఁ బొరి యగుచున్.
కువల. ౨. ౭౩.

వేల్పుడు. వి. ($\sqrt{}$ వేల్పు.) పూజ.

గీ. ... ... క్రూర మృగంబులఁ గార్ముకప్రముక్త నారాచములఁ గూల్చి భక్తితోడ, జనకునకు వేల్పు డొనరించి సకలలోక,సమ్మతము లగు కార్యముల్ సల్పుచుండ.
అధ్యా. బాల. ౧౩. పా.

వేల్పు(లుపు)దపసి. వి. (వేల్పు¹ + తపసి.) దేవఋషి, నారదముని.

గీ. వినుము వాల్మీకిఁ జూచి యవ్వేల్పుఁ దపసి,
వల్కెఁ రా చందమామ లప్పగిదిఁ బంప,
కడిమెలంగఁగ నద్దరి గట్టుమీఁద. నుండి
కన్గొని ప్రొద్దు కుఱ్ఱండు దలఁకి.
అచ్చ. రా. కిష్కిం. ౨.

**వేల్పు(లుపు) దొర.** వి. (వేల్పు[1]+దొర.) దేవేంద్రుఁడు.

సీ. మిగులుఁ గుప్పసము పన్నగ లోకభర్తకు
వేయొక్కఁ జెరిమావు వేల్పుదొరకు ...
రామా. ౧. ౪౬.

గీ. నూర నిభుఁడైన పింగళి నూరవిభుని,
దొరయఁ బోఁ డొరుఁడల వేల్పు దొరయ
కాని ... ప్రభా. ౧. ౨౬.

**వేల్పు(లుపు)దొరగారు.** వి. (వేల్పుదొర+గారు.) ఐరావతము.

చ. కనఁదగు తెల్లమానికపుఁ గప్పుల నొప్పెడు
చప్పరాలలోఁ, దన పాడపైన నీడఁగని
తాళక రేనుఁగటంచుఁ గొమ్ములన్, జెన
కఁగ వచ్చి కోటపయిఁ జేసిన ముత్తెపు
సింగపుంగమిన్, గనుఁగొని పొలుపు వేల్పు
దొర గారతఁ డొదల మస్తరింపగన్.
యయా. ౧. ౫.

**వేల్పు(లుపు)దొరమానికము.** వి. (వేల్పు దొర+మానికము.)

గీ. ......కోట, కొమ్మలం దాడు తెలిగంటి
కొమ్మలిడెడు, వేల్పుదొరమానికములు
నవ్వీటఁ దనరు. నీలా. ౧. ౩౧.

**వేల్పు(లుపు)దొరవిల్లు.** వి.ఔ. (వేల్పు దొర+విల్లు.) ఇంద్ర ధనుస్సు.

వ. కొంత వడికి మెల్లన నల్లుట తునకలగు వేల్పు
దొరవిల్లు నీ కొండకొండ తుదల బలువన్నె
రతనంబుల ... అచ్చ. భా. ౨. ౩౦. వా.

**వేల్పు(లుపు)ప్రోయాలు.** వి. (వేల్పు[1] + ప్రోయాలు.) దేవతా స్త్రీ, అచ్చర.

ఉ. వాలి సువర్ణ వేత్రకరు లంతకమున్న
పరాకు దేవ నీ, పాలి కనంగ రాజ్యరమ
భంగి వెలుంగుచు వచ్చె వేల్పు ప్రోయాలు...
పి. శకుం. ౧. ౨౨౪.

**వేల్పు(లుపు)ప్రోలు.** వి. (వేల్పు[1] + ప్రోలు.) స్వర్గము.

ఆ. అపుడు ముసలి వేల్పు టతివరాయి తన
తోంటి, కతయు నచటనున్న కల్లతపసి,
తెలుఁగు నతనితోడ నెతిఁగించి పసిఁడి
తే,రెక్కి వేల్పు ప్రోలి కేఁగె నంత.
అచ్చ. రా. యు. ౪౧౭.

**వేల్పుఁ(లుపు)బడవాలు.** వి. (వేల్పు[1] + పడ వాలు.) కుమారస్వామి, దేవతల సేనానాయకుఁడు.

గీ. తపసి యిల్లాండ్ర చెలువంబు దలఁచి తలఁచి,
మున్ను మెచ్చుచ్చును విరాలి గొన్నచోటు,
కనుపపులు వేలుఁ బడవాలుఁ గన్నచోటు,
హర్ష మునఁజూచి ప్రవరాఖ్యుఁ డాత్మలోన.
మనుచ. ౨. ౯.

సీ. అలవేల్పుఁ బడవాలు నలరు పొందొగడాలు
భాసిల్లు కొందమ్మి కేసరాలు ...
ఇందు. ౧. ౧౩౦.

**వేల్పు(లుపు)బాస.** వి. (వేల్పు[1] + బాస.) దేవభాష. సంస్కృతము.

ఆ. పుట్టఁ బుట్టినట్టి దిట్టయు దీవిని, బొడమినట్టి
పున్నెములగనియును, మొదలు గాఁగఁ
గబ్బములు వేల్పుబాసను, గూర్చినట్టి వారిఁ
గోరి తలఁతు. నీలా. ౧. ౭.

**వేల్పు(లుపు)బువ్వ.** వి. (వేల్పు[1] + బువ్వ.) చంద్రుఁడు, అమృతము.

గీ. భోగముల కండ యలవేల్పు బువ్వదండ, పతితులకు బొండ పేదలపైఁడికుండ, తమము రేయండ విబుధామృతంపుటుండ, కొండ మాత్రంబె తిమ్మప్పఁ డుండుకొండ.
రా. వి. ౧. ౩౧.

వేల్పు(లుపు)బోనము = వేల్పుల బోనము. వి. (వేల్పు[1] + బోనము.) ౧. అమృతము.

సీ. సెలదాల్పు సేవలంబులకున్న వేల్పుబోనమ్ము దెచ్చిన వారు వమ్మువాఁడు ...
రా. వి. ౧. ౪౧.

౨. చంద్రుఁడు.

చ. సెల......జా,బిలి చలిశెల్గు చందురుఁడు కెన్నెలరాయఁడు చందమామ రే, పొలఁతి మగండు వేలుపుల బోనము ... చంద్రుఁడగు మహేశ్వరా. అం. భా. ౧. ౪౩.

వేల్పు (లుపు) మన్నీఁడు. వి. (వేల్పు[1] + మన్నీఁడు.) దేవేంద్రుఁడు.

గీ. పగలు రేలును పౌలస్త్య భటులొనర్పు, దుడుకుచే వేల్పు మన్నీని కొడుకుఁ గుట్టి, కక్కటకక్కట పూన శక్యంబె వజ్రహరున కిటువంటి యంబేద తొరతనంబు.
చం. రా. ౨. ౨౫.

సీ. వేల్పు మన్నీనికై కెలఁచి పెన్బోదలలో నొదుగు కాటుక కొండ కొదమలనఁగ ...
యయా. ౨. ౧౨.

ఇక్లే: వేల్పు మన్నెవాఁడు.

వ. తలంపు తామిన్న గద్దియపై సెలకొన్న వేల్పు మన్నెవాని చెన్నున నున్నతిఁ గని...
ఉ. రా. ౫. ౨౪౯.

వేల్పు(లుపు)మల. వి. (వేల్పు[1] + మల.) మేరు పర్వతము.

చ. కదలి దశాననుండు లయకాల ఘనాఘన గర్జిత భ్రమ, ప్రద భట సింహ గర్జనల పార గుహా కుహారంబులానినన్, బదులుఁగ మ్రోయు వేల్పుమలపజ్జకుఁబోయెఁ దదీయ పాదముల్,. చిదురుపలై ధరం గలయఁ జేయుచు సేనలు గొల్వ నుద్ధతిన్.
ఉ. రా. ౪. ౨౫౬.

వేల్పుమల వింటిదేవర. వి. శివుఁడు, మేరు ధన్వుఁడు.

గీ. ఎపుడుఁ బాయకయున్న మిన్నేఱు దనరఁ, బేర్మి గొండల రేఁడను పేరుమెఱయ, వేల్పుమల వింటి దేవర పొల్పు దాల్చి, జన్నపుం దీవి విడిమట్టు చలువగట్టు.
యయా. ౨. ౩౬.

వేల్పు(లుపు)మిన్న. వి. (వేల్పు[1] + మిన్న.) సురజ్యేష్ఠుఁడు, బ్రహ్మదేవుఁడు.

సీ. సృష్టికర్త నటంచుఁ జెలఁగి నిన్ సృజియించి విడిచెనో మీ యన్న వేల్పు మిన్న ... ఇందు. ౪. ౪౯.

వేల్పు(లుపు)రాతోఁట. వి. (వేల్పు[1] + రాచ + తోఁట.) నందనవనము.

సీ. విహరించు నొకపూఁట వేల్పురాతోఁటలఁ బొదలు గొజ్జఁగ పూవుఁ బొదలయందు...
ఉ. రా. ౩. ౧౦౦.

వేల్పు(లుపు)రాయఁడు. వి. (వేల్పు[1] + రాయఁడు.) దేవేంద్రుఁడు.

సీ. పౌరుషంబున మించి పౌలోమి సెదనుంచి యులరెడు వేల్పురాయుని విలాస,ము ...
ఉ. రా. ౬. ౧౫౯.

వేల్పు(లుపు)రారాణి. వి. (వేల్పు + రాచ + రాణి.) శచీదేవి, ఇంద్రాణి.

గీ. వేల్పురారాణి సుతునకు వేడ్క—సేయ, సంత
రించిన వజ్ర పంజరమునందుఁ, దేజరిల్లెడు
శారికా రాజమనఁగ, జంద్రబింబాంతరాళి
లాంచనము దనరె. భాను. 3. ౧౩.

వేల్పు(లుపు)రాచాయి. వి. (వేల్పు + రాచ
చాయి.) ఇంద్రనీలము.

ఉ......వేల్పు,చాల జయించు వేనలి తెలుంగు
హారంగవురయ్య... రసిక. 3. ౫౫.

వేల్పుల గమికాఁడు. వి. (వేల్పులు + గమి
కాఁడు.) ఇంద్రుఁడు.

ద్వి. నీరథి సురనర నికర శైలాధి, ధారిణిగ్రా
నయాధారిణి వగచి, కనలి వేల్పులగమి
కాని చెంగటికిఁ, జని యింద్రునిఁ జూచి
వెచ్చని యూర్పులతోడ.
అ. మ. క. ౧. ౧౧. పొ. 3. పం.

వేల్పులదొర. వి. (వేల్పులు+దొర) ఇంద్రుఁడు.
చూ: వేల్పుల దొరవాలు.

వేల్పుల దొరవాలు. వి. (వేల్పులదొర +
వాలు.) వజ్రాయుధము.

సీ. వెన్నుని యన్నన్న వేల్పుల దొరవాలు
నలుపది మోముల నలరుసామి ...
గీ......గెబ్బు......యశము.
రామ. ౨౧3.

వేల్పుల బువ్వ. వి. (వేల్పుల + బువ్వ.) ౧.
అమృతము.

సీ. బొడ్డున వెన్నుని బొడ్డు బిడ్డని మెప్పు వలన
వేల్పుల బువ్వ గలిగియుండు ...
అచ్చ. రా. యు. ౫౫3.

౨. చంద్రుఁడు.

మ. అరలుం బున్నమరేలు మేల్ హాయలుచే
నవ్వీటిగాటంపు క్రొ,న్నెలతా మేడల
నాడుచేడియలు పూన్కి—న్ జెంతఁ గన్పట్టు
వే,ల్పుల బువ్వం జెలి నిల్వొటద్దమని కేలుం
దమ్ములం బట్ట ని,మ్ముల గందందెను గాక
యందుఁ గలదే మున్నిట్టియున్ మట్టి
యున్. అచ్చ. రా. బా. 3౫.

వేల్పుల బోనము. వి. (వేల్పులు+బోనము.)
అమృతము.

సీ. విన్ను కేళాకూళి వేల్పులబోనము తడవుల
నిడుపడు పుడుకు దొడుకు ...
అచ్చ. రా. యు. ౫౯౨.

వేల్పుల వెజ్జు. వి. (వేల్పు[1]లు + వెజ్జు) దేవ
వైద్యుఁడు, అశ్వి దేవతలలో నొకఁడు.

సీ. మఖ భోక్తృల యజీర్తి మాన్పగా వేల్పుల
వెజ్జు మందులసారె వెదకసాగె ...,
దశా. ౬. ౬౯.

వేల్పులేగిడ్డా. వి. (వేల్పు+లేఁత+గిడ్డి+రా.)
కామధేను శ్రేష్ఠము.

శా. దొడ్డా యీ కులమంచు నెంచుఁ దగు
సాధుస్తుత్య వంశంబునం, బొడ్రత్నంబునఁ
దేజరిల్లు జననంబుం బొందినన్ వేల్పు లే,
గిడ్డా పోష్యజనాళి కీమెయను సత్కీర్తిం
బ్రదీపించినన్, గొడ్డాలైన వధూటి జన్మ
మది పేర్కో— నిష్ఫలం బిమ్మహిన్.
వైజ. ౧. ౬3.

వేల్పువెలచాన. వి. (వేల్పు+వెలచాన) అప్సర
స్త్రీ, దేవవేశ్య.

ఉ. చక్కని దంచు వేల్పు వెలచానల కన్నను
నాటఁబాట వెం,పెక్కు నటంచు ...
ఉ. హరిశ్చ. ౪. ౧౧౩.

వేల్పువెలఁది. వి. (వేల్పు + వెలఁది.) దేవతా
స్త్రీ, అప్సర స్త్రీ.

ఉ. వీనుల కంటి తొయ్యలియొ వేల్పువెలం
దియొ జక్కిణెవార లేఁ, జానయొ పక్కిరా
చెలియొ జక్కుల వంగడపుం బడంతియొ...
అచ్చ. రా. బాల. ౧౪౪.

వేల్పువేల్పు. వి. (వేల్పు + వేల్పు.) దేవదేవుఁడు.

ద్వి. భువన మోహనమూర్తిఁ బుండరీకాక్షు,
నా వేల్పువేల్పు నెప్పాగ్రపక మఱియు,
సేవించి ... ద్వి. పరమ ౨. ౧౨౫.

వేల్పు(ల)సాని = వేలుపుసాని. వి. (వేల్పులు + సాని.) ౧. అప్సర స్త్రీ, రంభ.

క. ......సరభసమున వచ్చు వేల్పుసానిం
గాంచెన్. ఉ. రా. ౪. ౧౭౬.

౨. జ్యోస్యము చెప్పు స్త్రీ, సోది చెప్పు నాఁడుది.

చ. మన చరితంబుఁ జెప్పెను సమస్తము వేల్పుల
సాని చెప్పినట్లు నిజముగాఁగ ......
కళా. ౩. ౧౭౫.

వేల్మి = వేలిమి. వి. (√ వేల్చు.) హోమము.

గీ. ......సతియు నాలర్కకాక మంచితము
వండ, నిల్మ కుందన కర్పించి వేల్మి
దీర్చి ... ఆము. ౪. ౧౯౦.

ద్వి. చదువును సంధ్యయు జపమును వేల్మి,
మొదలు ముట్టఁగఁ బోయి మోటనై
బడలి ......
ద్వి. హరిశ్చ. ఉ. ౧౨౫౨.

క. శ్రీ కాళేశ్వరు సన్నిధి, నేకాంతము జపము
వేల్మి యాగియు శ్రాద్ధం, బేకైకము......
భీమ. ౩. ౧౧౭.

వేల్మిబొట్టు = వేలిమిబొట్టు. వి. (వేల్మి + బొట్టు.) హోమకుండము నందలి భస్మముతోఁ బెట్టికొనిన బొట్టు, రక్ష.

మ. గొనబై దండములందుఁ గ్రొం బసుపు
నిగ్గుల్ దేఱ కాపీన బంధనము ల్మొంజులు
వేల్మిబొట్లుఁ గడు నందంబొందఁ గృష్ణా
జినంబునఁ గీలించిన జన్నిదంబులు మనో
మోదంబు సంధింపఁగా, ఘనతం బొల్చు
సమిత్కుశా హరణ రింఖత్ బ్రహ్మచార్యో
ఘముల్. విప్ర. ౧. ౬౦.

వేల్లజము. సం. వి. అ. న. మిరియము, మరిచము.

వేల్లనము. సం. వి. అ. న. ౧. కంపము, వడఁకుట, కదలుట. ౨. (గుఱ్ఱములు మొదలగునవి భూమిపై) దొర్లుట, లుంఠనము.

వేల్లము. సం. వి. అ. పుం. ౧. చలనము, కదలిక. ౨. కంపము, వణఁకు. ౩. వాయువిళంగము.

వేల్లహాలుఁడు. సం. వి. అ. పుం. చెడునడత గలవాఁడు, పోకిరి.

వేల్లి. సం. వి. ఇ. స్త్రీ. వల్లి, తీఁగ, లత.

వేల్లితనము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వడఁకునది, కంపించునది. ౨. వక్రము, వంకరయైనది.

—వి. అ. న. ౧. గమనము, చలనము, కదలిక. ౨. కంపము, వణఁకు.

వేళ. వి. సమయము, కాలము, నాఁడు.

వేళము. క్రి. విణ. శీఘ్రముగ, త్వరితముగ.

గీ. ఒసఁగి యొడ పేర్పులోఁ గాఁగుచున్న
యాల, పాలు వడ్డించుటయు మానిపాల
వేళ. మవలివారల చేతికి నందియిచ్చు వడు
వున భుజించె వడు విపుర్వ్యంటకంబు.
పాండు. ౪. ౧౬౪.

క. వేళంబె సలిల విహరణ, కేళిరతిం దేలి
యా మృగీలోకనతా, చాల ముదమంది

యుండొరు, కేలూరుచు రథసమునఁ
గెరుచు నగుచున్. ప్రబంధ. ౨౬౮.

సీ. వేళంబుగా నభోవీధి దువాళించు గిబ్బ
తేజీక నా కృత్తివాస ...
నిరం. 3. ౧౨.

**వేళవాళి.** మి. వి. (వేళ+వాళి.) జీవిత కాలమున కయిన నిర్ణయము.

ద్వి. చోళ వాళిక కాక వేళవాళికిని, వత్తురే
యన్యదైవంబుల యిండ్లఁ, బోత్తురే ...
బస. పు. ౬. ౬౯3. పం.

ద్వి. చోళవాళిక కాక జోణితలేళ, వేళ
వాళికి కర్తవే యట్టులనిన, స్వార్థ జంగమ
పూజనార్థమై, యర్థమర్థ సంఘటనార్థ మది
నీదు సేవ ...
పండితా. మహిమ. ౨౯౪. పొ. ౧౧. పం.

**వేళాకోళము.** వి. ౧. పరిహాసము.

వ. తద్వృత్తాంతంబంతయు నడిగిన భృంగి
యిట్లనియె: నమ్మా నాకేల, నేనేమి జెప్పిన
వేళాకోళంబయి తోఁచుఁ బరిహాసకుని దేలు
బొడిచె నటన్న సామెత ...
మృ. వి. 3. ౯౫.

౨. చిక్కు. (శ. ర.)

—విణ. చిక్కులు పడినది.

క. వేళాకోళపుఁ దీగెలుఁ, బేలికలుఁ గళాస
ములును జీఱజడలుఁ దాఁ,దాలుచు బెట్టాకా
మింటన్, లీలాహరిఁ దోరె వింత నేర్పరి
యయ్యెన్. కళా. 3. ౪౨.

**వేళావుళి.** వి. (సంగీ) రాగ విశేషము.

వ. వసంతంబు మాళవి బంగాళి నాట దేవ
క్రియ మేఘరంజి వేళావుళి మలహరి
జాళి ... మత్స్య పురాణము. ౫. ౫౪.

ద్వి. సారంగ నాట గుజ్జరి మేఘరంజి వేళా
వుళియు ... బస. పు. 3. ౯౪౫. పం.

**వేవిలి**[1]. విణ. దున్ననిది.

క. దేవార్చనా నిమిత్తము, దా వేతోఁక తోఁట
వేయఁ దలఁచి యతం డా, తావు గృహ
స్థుల చేతన్, వేవిలి సుక్షేత్ర భూమి విలు
వకుఁ గొనియెన్. హైజ. ౧. ౮3.

**వేవిలి**[2]. వి. (బ. వేవిలులు, వేవిళులు, వే వి ళ్లు.)
పొలము.

సీ. సస్యకైదార్యమాశ్వచ్ఛటాఖుర పుటీ త్రుటి
తమై వేవిలి దుక్కిగాఁగ ...
రావి. ౨. ౬౪.

క. భావంబునఁ బుత్రావి, ర్భావము గాంక్షించు
పరమ పావనకా లీ,లావతికిఁ గోర్కి
పంటల, వేవిళ్లన వొప్పు మీఱి వేవిళ్లమ
రెన్. పరమ. ౨. ౧౬౯.

**వేవిళ్లు(ళులు).** వి. బ. ఏదైనఁ దినవలయు నని
గర్భవతికిఁ గలుగు కోరికలు, భక్షణ వస్తు
వాంఛాతిశయ రూప గర్భలక్షణ విశేషము.

గీ. అమరెఁ బుప్పొడి దిప్పలై యంత నంత,
మెట్ట దామరపాకుల మీఁదఁజాతి, పైఁడి
చూలాలి వేవిళ్లు వాయఁదోఁట, కలిమి చెలి
పెట్టుకల వంటకంబు లనఁగ.
యయా. ౪. ౯.

శా. ఆవామేక్షణ దైవయోగమున గర్భాధా
నముం బొందినన్, వేవిళ్లయ్యె నకోచికంబు
వొడమెన్ పెల్లందనం బాస్య రా,జీవ
వ్యాపకమయ్యె ... కాళ. ౪. ౪.

ఉ. మెచ్చితి వేఁడి కొమ్మనుడు మిత్ర
సహుండు కుమారుఁ గోర నీ, కిచ్చితి నంచు
నచ్యుతుఁడు నేఁగ ధరామరుఁ డాత్మ
కాంతకుం, బెచ్చెరఁ దోఁచు వేవిళులు

చెప్పఁగఁ బల్మెఱు వచ్చు నోటితోఁ, ముచ్చట
నూనె నల్ల చనుముక్కు-లు బెల్వెలఁ బాఱు
చెక్కు-లున్. ఉ. హరి. ౪. ౯.

ఉ. చిట్టుము లంకురించె జిగి చెక్కు-లఁ దెల్పు
నటించెఁ గోరికల్, మట్టు దొరంగ వెన్న
డల మాంద్యవిధంబు చెలంగెఁ గూర్కు-
లోఁ, బెట్టుగ మించె వెన్నడుము పెద్ద
తనంబు వహించె వేవిళుల్, దట్టములై
జనించె నిటు తామరసాక్షికి న్నాఁడు నాఁటి
కిన్. ఇందు. ౨. ౧౩౫.
పర. ౨. ౧౬౯.

**వేపు[1] = వేగు[1].** అ. క్రి. తెల్లవాఱు, ప్రభాత మగు.

క. వేవిన యంతకు నలువురు, జావంకంబులునుఁ
బోలె సైన్యము హాహా, రావములతోడఁ
జూడఁగ, దీవన వడయంగఁ దూర్పు తెల తెల
వాఱెన్. ఉ. హరి. ౩. ౭౪.

క. కావున నీ వీ రాతిరి, వేవెడు నీలోనఁ
బోయి వేస నౌషధముల్, దేవలయు ...
భా. రా. యు. ౧౦౯౪.

ఉ. వేవినమేడపై వలభి వేణికఁ జంట వహించి
విప్పఁగాఁ, బూవులు ...
ఆము. ౧. ౬౨.

**వేపు[2] = వేగు[2].** వి. రాజ్య సమాచారము.

సీ. జడనిధి బంధించి కడచి వత్తురు మాత్తరి
వార్త యరయంగ వేవు లేద, రాజు లేమఱి
యున్న రాజనీతిస్థితి సచివు లేమఱియుండు
టుచితమగునే ...
భా. రా. యు. ౨౯౧.

**వేపుజాము.** వి. (వేపు[1]+జాము.) వేకువజాము, వేగుజాము, తెల్లవాఱు జాము.

ద్వి. వేవుజామున నేఁగి వేఱొక్క- రేవు,
గావించి యుదుకుచు ఘట్టనల్ సేసి...
బస. పు. ౪. ౧౪. పం.

**వేవురు = వేగురు.** స. బ. (వేయి శబ్దమునకు మహన్మహత్త్వార్థక బహువచన రూపము.) వేయి మంది, సహస్ర సంఖ్యగలవారు, అనేకులు, పెక్కం్రడు.

ఉ. వీరుఁడు ధర్మజుండు పదివేవురు విప్రుల
కొప్పఁ బాయసా, హారము భక్తిబెట్టి...
భార. సభా. ౧. ౧౪.

ఉ. వేవురు చంద్రులొకిఁ బదివేవురు సూర్యులు
లక్షపావకుల్, ప్రోవయి యున్న యట్టి
దగు భూరితరం బగు తేజము ...
హరి. ఉ. ౯. ౧౯౮.

క. ఆవేళం బదునాలుగు, వేవురు గొలువంగ
వేఁట వెంబడి నొక భిల్లావని పతి
వచ్చుచు ... వరాహ. ౭. ౬౮.

చ. విరటుఁడు చూచుచుండ నిను వేవుర ముందట
నట్లు ద్రోవ ...
భార. విరా. ౨. ౨౫౮.

క. వేవురఁబోలెడు వాని మహావీర్య గుణాఢ్యు
నొక్క- యాత్మజుఁ బడయంగా వలతు
నపేత గుణుల్, వేవురు సుతులయ్యు
నొందు విఫలమ కాదే.
భార. అర. ౨. ౩౫౦.

చ. ......తన్వరునిగఁ గోరువారి లలనా
మణులం బదియారు వేవురం, బరిణయ
మయ్యె ... పారి. ౧. ౩౮.

**వేవెలుఁగు.** వి. (వే+వెలుఁగు.) వేయి కిరణములు గలవాఁడు, సహస్రాంశువు, సూర్యుఁడు.

చ. తిరముగ వింట వేవెలుఁగు దేవునిఁ గన్గొని
పట్టియూస నిబ్బరముగ నేఁగి చేఁగడిమిఁ

బట్టిన లావరి నేల చెల్వ కూతురి చలుకంపు
తేనియొద తుందుడు కెల్లను దీర్చినట్టి యా,
కరువలిపట్టి నాదుమది గల్గిన కోరిక లెల్ల
నీవుతన్. బహు. ౧. ౮.

**వేవెలుంగుల దొర.** వి. (వే+వెలుఁగులు+దొర.) సహస్రాంశువు, సూర్యుఁడు.

గీ. వే వెలుంగుల దొర జోడు రేవెలుంగు ...
మనుచ. ౧. ౧౮.

ఇట్లే : వేవెలుఁగుల వేల్పు.

క. ఆవేళ దివిజ కానన, దావాగ్ని సభ స్సరోభి
ధానుఁడు రక్షో, దేవుఁ డొక మహా రథమున,
వేవెలుఁగుల వేల్పు కంటె వెలుఁగుచు
నుండెన్. కకు. ౨. ౯౪.

**వేవే.** క్రి. విశే. వే యను దాని యామ్రేడిత రూపము. మిక్కిలి శీఘ్రముగా, అతిశీఘ్రముగా.

క. ఆ యస్త్రము వలన మహా, సాయకములు
శతసహస్ర సంఖ్యంబులు వే,వే యుప్పతిల్లి
పొదివెన్, త్రైయంబక మగు రథం బుదగ్ర
స్ఫూర్తిన్.
హరి. ఉ. ౮. ౧౩౭.

క. ఆ వసుధాధిప నందను, వేవే దోడ్తెమ్ము
మాధవీ గృహమునకున్ ...
దశకు. ౭. ౭౪.

క. కావేరి ధరలు గట్టంగ, వేవే పల్లవుండు
దనదు పెట్టికి రామినిం,దావాని నుడుటి
కనుపోం,గావడిం గరికాల విభుండు గాలం
దుడిచెన్. ద. కా. ౬౨౮.
౧౧౪౬. క.

**వేవేగ.** వి. (వేగ+వేగ.) అతిత్వర, అతివేగము.

క. వడముడి యరిగిన తెరు వే,ర్పడఁ గనివేవేగ
రథము వఱపెం గదియన్ ...
భార. భీష్మ. ౨. ౩౬౯.

గీ. పిలువఁ బంపుము వేవేగఁ బెండ్లికొడుకు...
నైష. ౬. ౩౬.

శా.......క్షమానాయకుల్, వేవేగ న్వినయం
బులోడ నిజతన్వీ మాళి రత్నాది నానా
వస్తువ్రజ మంపినన్ ...
కళా. ౮. ౧౧౬.

**వేవేలు.** స. బ. (వే+వేయి.) పెక్కువేలు, వేనవేలు, అనేకములు.

గీ. వేదములు నాల్గు వేవేల విధులఁ బొగడ...
నైష. ౩. ౧౨౯.

గీ. పటుపు టంగడివీధు లేర్పఱచి కొంచె,
పాటిన డగని సెక్కి యా పాలెమెల్ల,
విడియ నియమించి తిరిగి వేవేలు దివ్వ,టీల
వెలుఁగున సంగీత మేల మమర.
కువల. ౨. ౮౫.

శా. కావేరీనది మున్నుగా నదుల సంఖ్యల్
విశ్వ విశ్వంభరన్, వేవే లెవ్వరు గ్రుంకినం
దలఁచినన్ విన్నన్ మహాపాతక, గ్రాత
వ్రాతము వజ్రపాత హతి భగ్నంబై గతిన్
బోవుటల్, శ్రీవిష్ణుస్థల వాసవైభవ నగదా...
శ్రీరం. మా. ౨. ౬.

**వేశంతము.** సం. వి. అ. పుం. ౧. చిన్నసరస్సు, పల్వలము, నీటిగుంట. ౨. అగ్ని.

**వేశదానము.** సం. వి. అ. పుం. బ్రొద్దుతిరుగుడు పువ్వు.

**వేశనము.** సం. వి. అ. న. ౧. ప్రవేశించుట ప్రవేశము. ౨. ఇల్లు.

**వేశనారి.** సం. వి. ఈ. స్త్రీ. వేశ్య.

**వేశము.** సం. వి. అ. పుం. ౧. ప్రవేశము. చొచ్చుట. ౨. మార్గము. ౩. గృహము, ఇల్లు, ౪. వేశ్యాగృహము. ౫. వేషము. ౬. వస్త్ర

భూషణాదులచే రూపాంతరము నొందుట, మాఱువేషము. ౭. కూలి, జీతము.

**వేశ(శ్వ)రము.** సం. వి. అ. పుం. పేసడము, కంచరగాడిద.

**వేశ(స)వాసము.** సం. వి. అ. పుం. వేశ్యానివాసము, వేశ్యలుండు తావు.

**వేశ్మకర్మము.** సం. వి. న్. న. ఇల్లుకట్టుట, గృహనిర్మాణము.

**వేశ్మభువి.** సం. వి. ఊ. స్త్రీ. నివేశన స్థలము, ఇల్లు కట్టఁదగిన ప్రదేశము.

**వేశ్మము.** సం. వి. న్. న. ఇల్లు, గృహము, నివాసస్థానము.

**వేశ్య.** సం. వి. అ. స్త్రీ. భోగముది, పణ్యాంగన.

**వేశ్యము.** సం. వి. అ. న. వేశ్యాగృహము, వేశ్యానివాసము.

**వేశ్యాచార్యుఁడు.** సం. వి. అ. పుం. ౧. వేశ్యల గురువు. ౨. కుంటెనకాఁడు.

**వేశ్యాపణము.** సం. వి. అ. పుం. వేశ్యకిచ్చెడి సొమ్ము.

**వేశ్యాశ్రయము.** సం. వి. అ. పుం. వేశ్యల వాడ, భోగమువారి వీధి.

**వేషణము.** సం. వి. అ. న. స్వాధీనపఱచుకొనుట, భుక్తపఱచుకొనుట.

—పుం. ౧. కసివెంద. ‡. ౨. చేఁతిపొట్లు. ‡. ౩. ధాన్యము. ‡.

**వేష(శ)ధారి.** సం. విశే. (న్. తి. న్.) మాఱు వేషమువాఁడు.

—వి. న్. పుం. ౧. వంచకుఁడు, కపట సన్న్యాసి. ౨. నటుఁడు, నాటకమున వేషము వేయువాఁడు.

**వేషము.** సం. వి. అ. పుం. ౧. వస్త్రభూషణాద్యలంకారము.

గీ. తగిన వేషంబు దనుఁదాన పొగడు కొనమి,
నొచ్చియును గీడు పలుకమి యిచ్చి పగవ,
కునికి దనకెంత నడవక యున్నఁ బథము,
దప్పకుండుట నడవడి కొప్పు సేయు.
భార. ఉద్యో. ౨. ౪౫.

౨. వస్త్ర భూషణాదుల చేత నయిన యొప్పిదము, చక్కఁదనము. ౩. వస్త్రాలంకారాదులచే మాఱు రూపము నొందుట. ౪. వేశ్యాశ్రయము, భోగమువారి వీధి.

**వేష్టకము.** సం. వి. అ. పుం. ౧. ఆవరణము, కంచె, వెలుగు. ౨. గుమ్మడికాయ, కూష్మాండము.

న. ౧. తలపాగ, శిరోవేష్టనము. ౨. ఉత్తరీయము, పైబట్ట. ౩. చెట్టుబంక. ౪. కర్పూరతైలము.

**వేష్టనకము.** సం. వి. అ. పుం. రతిబంధవిశేషము.

**వేష్టనము.** సం. వి. అ. న. ౧. ఆవరించుట, నలుపైపులఁ జుట్టుకొనుట. ౨. చుట్టుకొనుట, చుట్టఁ బెట్టుకొనుట. ౩. కప్పు, మూఁత. ౪. తలపాగ, శిరోవేష్టనము. ౫. ఆవరణము, కంచె, వెలుగు. ౬. ఒడ్డాణము, నడికట్టు. ౭.బంధము, కట్టు. ౮. కర్ణశష్కులి, చెవి. ౯. గుగ్గులు వృక్షము, గుగ్గిలము. ౧౦. గ్రహించుట, పట్టుకొనుట.

**వేష్టము¹.** వి. డేగలలో నొకజాతి.

సీ. వలచేత మణిముద్రికల కాంతి దిశలందు
పెనయ వేష్టపు డేగ ముష్టిఁబట్టి ...
ప్రబంధ. ౨౩౩.

**వేష్టము².** సం. వి. అ. పుం. ౧. ఆవరణము వేయుట. ౨. ఆవరణము, కంచె. ౩. తలపాగ,

శిరోవేష్టనము. ౪. చెట్టుబంక. ౫. కర్పూర తైలము.

వేష్టసారము. సం. వి. అ. పుం. కర్పూరతైలము.

వేష్టవంశము. సం. వి. అ. పుం. ఒకజాతి వెదురు.

వేష్టించు. సం. స. క్రి. ౧. చుట్టుకొను, చుట్టువాఱు, వేడించు.

క. ...మునులను వేష్టింప భూతములు విను తింపన్. భార. శాం. ౪. ౪౫౨.

గీ. ఆ విధాత మునీంద్రులు దేవతలును, దన్ను వేష్టింప వచ్చె సత్వరముగాఁగ ... భార. శాం. ౬. ౪౪౪.

౨. పరివేష్టించు, చుట్టివచ్చు.

మ. ...విషధరుల్ వేష్టింపఁ గాల్చాఁదవో ... వసుచ. ౩. ౩౦.

వేష్టితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. చుట్టువాఱుకొనఁ బడినది, ఆవరింపఁ బడినది. ౨. మూయఁ బడినది. ౩. అఁపఁబడినది. అడ్డుపెట్టఁ బడినది. ౪. ముట్టడింపఁ బడినది.

—వి. అ. న. చుట్టుముట్టుట, ఆవరించుట.

వేష్టువ. వి. (సం. వేష్టనం.) ధోవతి.

సీ. నీ పుటగోచియు నీ కావివేష్టువ ల్వార కాంతకుఁ జట్టుచీర లౌనె ... హైజ. ౩. ౧౦౩.

సీ. పెన్నులి త్రాటఁ గీల్కొన్న కౌపీనంబు వితతంబు నీర్కావి వేష్టువలును ... హైజ. ౨. ౫.

వేష్ప(ష్య)ము. సం. వి. అ. పుం. జలము, నీరు.

వేసఁగి = వేసవి. వి. (సం. వైశాఖః.) ౧. ఉష్ణకాలము, గ్రీష్మర్తువు.

ఉ. వేసఁగి వెట్టఁగ్రాఁగి పృథివీతల మంతయు వేఁడి మంగలం, బై సెకలీనఁ బ్రాణి నివహంబులు లాజలు వోలెఁ బేలఁగా ... హైజ. ౧. ౯౯.

వేసగాఁడు. విణ. (వేసము + కాఁడు.) అన్యుల వేషములను ధరించువాఁడు. (బ్రా.)

స్త్రీలుం మున్నగువారి వేషములు వేయువాఁడు. (శ. ర.)

వేసట. వి. (√ వేసరు.) శ్రమము, అలయిక, అలసట.

ఉ. వేసటలేక భీమ పృథివీపతి నందన యానశాంబుజో,ల్లాస విరక్తి ముద్ర పదిలంబుగఁ గన్గొని ... నైష. ౫. ౧౬౩.

క. ఈ కరణి ధరణి పతియు వి,లాసవతీమణులు బహుకళా నిపుణతలన్, వేసటలేక లతాంతశ,రాసన సుఖవార్ధి నోలలాడుచు నుండన్. వరాహ. ౪. ౬౬.

క. ఇటు లెండకు వానకు ను,త్కట తరమగు చలికి వెఱక కంపింపక వే,సటఁ బడక కుంభకర్ణుఁడు, పటునిష్ఠ ఘటించె దపము పదివేలేడుల్. ఉ. రా. ౨. ౧౬౨.

క. అలపున్ సొలుపున్ వేసట, తలఁపున్ జన్మోనల నలుపు తను మధ్యమునన్, బలుపున్ పై తెలుపున్ వెలి, పొలుపున్ గాంచి గుసగుసలఁ బోవుచు గాంతల్. ఉ. హరిశ్చ. ౨. ౯౨. పం.

వేసటపడు. అ. క్రి. (వేసట + పడు.) శ్రమము నొందు, అలయికఁ జెందు.

చ. ......నన్ను మన్పుటకు గురుండ వీవె యని చొచ్చితి నీ యిలుగాన నింక వే,సట పడనీక నా కనులు చల్లన నిన్ గనఁ జేయు మెక్కుడన్. పెన్నబ. ౩౩౧.

**వేసడము¹.** వి. శ్యేనవిశేషము. ఒకజాతి డేగ.

గీ. మృగయు లంతటఁ దెచ్చిరి లడుగు గిడ్డు,
జాలె జలకట్టె కణుజు వేసడము భైరి,
కురుజు వాళిణ యను డేగ కోలము సాళు,
వముల ... పి. శకుం. ౧. ౧౧౧.

గీ. కఱకు టంట్రముల నిఱికించి గజ్జె గదలఁ,
గఱికి నెఱినెఱి కోలెమ్మకయును విఱుగ,
విఱిచె వఁడిగ్రాజు నొకపెద్ద వేసడంబు ...
మనుచ. ౪. ౫౯.

క. బలుసైన వేసడంబులు, జలకట్టెలు నోరణ
ములు సాళ్వంబులుఁ గిడ్డులు మొదలుగఁగల
విడివేఁటల పులుగులు పదనుతో మిటా
రింపంగన్. యయా. ౧. ౪౦.

**వేసడము².** వి. (సం. వేసరః.) కంచరగాడిద, అశ్వతరము.

అ. వారుల వేసడములఁ గరులను నెక్కి ...
భాగ. ౧౦. ఉ. ౭౨౨.

సీ. బలు వేసడములపైఁ బండ్లపైఁ బ్రబలోష్ట్ర
పంక్తిపై ముందుగా బరువులేఁగ ...
ఉ. రా. ౩. ౧౯౭

—విణ. సంకరజాతిది.

గీ. ఉవిద యధరామృతము గ్రోలుచున్న నాకుఁ,
బాన విఘ్నంబుగా బ్రోసెఁ బాపజాతి,
జాతి చండాలమైన వేసడపుఁ గోడి ...
క్రీడా. ౧. ౫౯.

ఉ. కత్తులలిత్తిఁ జెమ్మనినఁ గానక నాకిది
యొంటికత్తి నీవిత్తతి నేలయిచ్చితిది యేమి
పరాకున నున్నదానవో, తొత్తుల తొత్త
వేసడపు దూల పిసాచి యటంచు. ...
సా. పంచ. ౧. ౨౦౦.

**వేస్డము.** వి. ఒకజాతి డేగ.

గీ. వేస్డమును దళుకాదిగ వేలవేలు, యొప్పు
డేగల జత గూర్చుకుండుటయును ...
ప్రబంధ. ౧౯౧.

చూ: తలుకు². (నూ. ని.)

**వేసదారి.** వి. (సం. వేషధారి.) మాయలమారి.

గీ. ఓసి పాపాత్మురాల నీ వేసదారి, గాయ
కపు సుద్దులెల్ల నాకాశవాణి, తెలుప విన
వచ్చి ... సారం. ౩. ౨౦౪.

**వేసమన్నీఁడు.** వి. కొండజాతులలో ఒక తెగ వాఁడు.

సీ. వేసమన్నీఁడ నీవెకాన వెరఁజుమాగ్రతనీవా
జాడ గనఁగఁ జూపు ...
ప్రబంధ. ౧౯౩.

**వేసము.** వి. (సం. వేషః. క. వేసవు.) ౧. వేషము.

సీ. కోకిబికి వేసంపు గూని మూఁపుల మీఁద
మూఁడు పంగల యూఁటె మోపినాఁడు...
మనుచ. ౪. ౭౩.

సీ. సతబాస వాల్దంట కతలానిపోటు వేసము
గొన్న బోయ మాజాతిపెద్ద ...
ప్రబంధ. ౧౭౦.

క. చేసిన నాతఁడు తొల్లిఁటి, దోసంబులఁ
బాసి మొగిలు త్రోవను వేచె, వేసంబు నన
రుగుచు రా, కాసుల దొర సన్నదారి
క్రన్ననఁ దెలిపెన్.
అచ్చ. రా. అర. ౧౧౯.

౨. నటనము, లేనిసిగ్గు మొ॥ అభినయించుట.

క. వేసాలఁ బోకు రమ్మా, పూసజ్జకుఁ బ్రొద్దు
పోయెఁ బులియుట చాలున్, వాసవనందన
కుసుమ శ, రాసన కేళీ కలా విహారంబుల
కున్. హర. ౪. ౧౩౩.

సీ......ఓసి లేవే మల్లి వేసాలు వేయకు మగ
వార లెఱుఁగని మర్మ మెద్ది ...
శుక. ౨. ౪౨౨.

**వేసరము.** సం. వి. అ. పుం. కంచరగాడిద, అశ్వతరము. (శ. ర.)

**వేసరి.** విణ. (√వేసరు.) శ్రమపెట్టువాఁడు, అలయించువాఁడు.

ఉ. పున్నమ వన్నె శంభు తలపువ్వు ముకుం
దుని చూపు దట్టపు, వెన్నెల దుంప
జక్కవల వేసరి చీఁకటి మూఁకవిప్ప వా,
రాన్నిధి యుబ్బు తామరల రాయిడి వేల్పుల
పంట మింటిపైఁ, దిన్నని పూర్వ చంద్రికలు
దిక్కులకు న్వెదచల్లు చుండఁగన్.
వి. పు. ౭. ౨౭౪.

**వేసరించు.** స. క్రి. (√వేసరు.) వేసరఁజేయు, విసిగించు, శ్రమ కలిగించు.

ఉ. హోము హిరణ్య దానములఁ బుచ్చుకొనంగ
ధనంబు లేమియుం, దేము స వంచనంబు
లగ దీవన లిచ్చుచు వేసరింపఁగా ...
భాగ. ౧. ౪౬౩.

ద్వి. తనయుఁడ వలదంచుఁ దగు బుద్ధిచెప్ప,
వినకఁ బల్మఱు నిట్లు వేసరించుటయు...
రం. రా. ఉ. ౬౭. పా. ౭. పం.

**వేసరిల్లు(లు).** అ. క్రి. (√వేసరు.) ౧. విసుగుకొను.

గీ. తప్పుదేల విచార మతండె యితఁడు, విడువ
కేవేళఁ బవళించి వేసరిల్లి, యుబుసు పోకల
వనవీధి నబలఁ గూడి, మెలఁగు చున్నాఁడు
శ్రీరంగ నిలయవాసి.
శ్రీరం. మా. ౫. ౬౬.

౨. శ్రమపడు.

గీ. అంధకారంబు గాఢ మోహాంధకార,
మొక్క మొగి జవిలోఁ గ్రమ్మి పిక్కటిలఁగ, లేవుదప్పి చరించెడి నావకరణి,
వీడు కలయంగఁ దిరుగుచు వేసరిలఁగ.
చెన్న. ౨. ౨౯౨.

౩. చింతించు.

గీ. అనుచుఁ దేటపడిన యా వ్రాఁతఁ గనుఁ
గొని, వ్రాఁత యిట్టులయ్యె వసుధలోన,
నమ్మఁగూడ దెంత నమ్మినవారల, మోస
మయ్యె ననుచు వేసరిలుచు.
కృష్ణ. ౩. ౧౦౯.

**వేసరు = వేసారు.** అ. క్రి. (క. బేసఱు.)
౧. విసుగుఁ జెందు.

గీ. ఉత్తమ క్షత్రియులనెల్ల నుగ్రవృత్తి, నేఁడు
పదినాళు లేని నా నిశిత శర చ,యములఁ
గూల్చితి వేసరి నట్టులయ్యె, మునిలోడి
పాత్రింకిట మానుటొప్పు.
భార. భీష్మ. ౩. ౩౬౪.

(కొందఱు దీనిని శకటరేఫముతో ప్రయోగించిరి. వా. రా. ౧. ౧౩.)

చం. హరి నరయన్ గురుం డనుప నత్తతి సాగరు
లుర్విలోని వే,సరి ధరఁ ద్రవ్వి త్రవ్వి బలి
సద్మగులై హరిబుద్ధి దక్కి చి,క్కర ముని
ముచ్చటంచు గమకింపుచేఁ గపిలుం గెరల్చి
త,ద్దురుతర కోపదీపమునకున్ శలాభాకృతిఁ
జెంది రందఱున్.
చం. రా. ౩. ౧౪.

క. కఱికిది నీరసమని వే,సర కల్లన వినుఁడు
తుద రసాయనమగుఁ దాఁ, జెఱకుఁ దుద
నుండి నమలిన, తెలఁగున మదికింపుఁ
దనుపుఁ దీపున్ జూపున్.
వా. రా. ౧. ౧౩.

౨. శ్రమపడు.

క. సరస కవి విట విదూషక, పరిహాసక గాయ
కాది పరి జనములు వేసరుట పయి మేలు
దూఁకెడు, తురగము నడదూఁగఁ గాంతి
దొలుఁకాడంగన్. నిర్వ. ౭. ౨౫.

గీ. సోయగపుఁ జిత్రరూపంబుఁ జూచుచోట,
వేసరు విలోచనంబులు వికృతశైత్య,
లక్ష్య మీక్షించుటలు మొక్కలంపు గెలుపు,
కైకొనియె సత్యభామ సంగ్రామ సీమ.
ఉ. హరి. ౧. ౧౬౧.

ఉ. ......పరమేశ్వర నన్నలయింపఁ బూని
యే, దిక్కున డాగితో యడవిఁ ద్రిమ్మర వేసరి
నాఁడ నాఁకటన్, జిక్కితి దప్పి స్రుక్కి
తిని నేనొక పల్కఁ కన్నైనఁ బల్కవే.
చెన్న. ౩. ౬౯.

౩. నొచ్చు, బాధపడు.

క. వేసవి వేఁడి సహింపక, వేసరు జీవులకు
నెల్ల విశ్రాంతి కర, శ్రీ సంపాదన కరమై,
యాసన్నం బయ్యె నంబుదాగమ మంతన్.
విక్ర. ౪. ౨౬.

సీ. విరితీఁగ సోఁకి వేసరు బాలయొట్టు లీకాఱు
పూఁ బొదరిండ్లు దూఱనోపె...
రసిక. ౮. ౪౪.

వ. ......కుక్షింభరిత్వమున క్షుత్ క్షామునై
తిరిగి తిరిగి వేసరి యోసరిలిన దాసరిగుంపు...
అము. ౪. ౩౫.

౪. చింతిల్లు, విచారము నొందు.

క. మీ సేగులెల్ల నచ్చెద, వేసరకుఁడు మీరు
లేక వేగునె మాకున్, జేసెన్ జేయఁడు
బాలకుఁ, డా సురపుం బనులు నిజము లని
యెదరు బళే.
హరి. పూ. ౫. ౨౩౦.

క. ఈ సామర్థ్యము నీ కర, వీసంబును లేదు
మగుడి వేసఁజను మనినన్, వేసరిన భంగి
భోజుం, డా సింహాసన ముడిగి గృహంబున
కరిగెన్. ద్వా. ౧౦. ౨౯.

సీ. వేసరు నెడఁబాఱు లాసామిఁ గన్గొని యెడ
యఁడ వినుమొక యడవిలోన ...
అచ్చ. రా. బాల. ౫౪.

వేసవి = వేసఁగి. వి. గ్రీష్మర్తువు, ఎండకాలము.

చ. అవియని గండశైలమన నంఘ్రుల తోడన
యెండకున్న భూభవమన నింకి బీఁట గిలఁ
బాఱని యేఱన మస్తకం బొగిన్, బవులని
మార్గి సంఘమనఁ బట్టదు లోకములోన
నిట్టి వేసవి గలదయ్యె నా నఖిల సాధ్వస
మయ్యె నిదాఘ ముగ్రమై.
కు. సం. ౬. ౭౯౪.

క. వేసవియందును సులభము, ఘాసము గోవు
లకు ... హరి. పూ. ౬. ౨౭.

క. వేసవివేఁడి సహింపక, వేసరు జీవులకునెల్ల
విశ్రాంత కర, శ్రీ సంపాదన కరమై.
యా సన్నంబయ్యె నంబుదాగమ మంతన్.
విక్ర. ౪. ౨౬.

వేస(శ)వారము. సం. వి. అ. పుం. ఆవ, మిరి
యము, ధనియము, అల్లము, మున్నగు సంబా
రపు దినుసులు గలిసిన యొకానొక రుచ్య
పదార్థము.

(ఇది ఆఁకలి పుట్టించును.)

వేసారికొను. అ. క్రి. (వేసారు + కొను. స్వార్థ
మున.)

గీ. విటుల మఱియును వంచించు విధముఁజూచి,
యమ్మునీంద్రుండు కడుఁ జేద యగుటఁ
జూచి, తల్లి వేసారి కొనెడు చందంబుఁ
జూచి, సఖులు ముదుగుల్గఁ బోయెడు సరణిఁ
జూచి. విప్ర. ౪. ౧౮.

వేసారు = వేసరు. అ. క్రి. ౧. అలయు, శ్రమ చెందు.

క. ఆ సుఖమతి తరుణవయశ్శ్రీ సంగతి నరుల విటులఁ జేరి రతులకున్, వేసారక యుసి కొల్పఁగఁ, దా సుఖపడి వచ్చునట్టి ధన్యుల లోనన్. హంస. ౪. ౩౭.

సీ. మోపరి యెంతైన మోవ వేసారఁడు సారిది నా దాయమే చూచుఁ గాని ...
నీతి. ౪. ౪౩.

౨. విసుగు.

ఉ. ఈరలు ప్రేమమీఱ సుతనిచ్చు తెఱంగది నిక్కమైన సంసారము రోసి బంధుజన సంఘముఁ బాయుచు వచ్చియుండి వేసారక యెందుఁ బోయెద నిజంబుగఁ దల్లియు దండ్రి వీడెకా, గారవమొప్పఁ జెంచి కల కాలము నిచ్చటనే వసించెదన్.
ఉ. హరిశ్చ. ౨. ౩౬.

ఉ. తీరని కాఁగిలింత లెడ త్రెవ్వని కోరిక లంగకంబులన్, బేరిన చెమ్మటల్ మఱుఁగు బెట్టని కూరుము లొండొరుల్ల వేసారని జిట్టకంబులును శయ్య సమోపరి సంగమంబు లన్, మూరటయైన నెమ్మనము లొక్కటి యైనది యెంచి వెండియున్.
ప్రబంధ. ౬౩౧.

౩. బాధపడు, నొచ్చు.

మ. జడు డజ్ఞానమున్ సుఖంబనుచు సంసారాంధకారంబులోఁ, బడి దుఃఖంబుల వెంబడిం బడి సుఖంపన్లేక వేసారి నీయడుగుల్ చిత్తములోఁ దలఁచి నతిసేయన్ ...
దశా. ౧. ౨౧౬.

వేసికొను. స. క్రి. ($\surd$ వేయు.) అన్యాయముగాఁ దీసికొను, అపహరించు.

క. అరు దెంచి పలికె నిట్లని, గురువుల సతిసెట్లు వేసికొంటివి నీకున్, వరుసా కటకట దోషాకర యీ పాతకము సేయఁగాఁ గాదు సుమీ. హరాహ. ౩. ౨౫.

వేస్ట్రము[1] = వేసడము[1]. వి. ఒకజాతి డేగ.

గీ. వారణంబును జలకట్టె బైరిగిద్దు, చంచడము సాళువము శని శరము మించు, వేస్ట్రమును తరుకాదిగ వేరవేర, నొప్పు డేగల జత కూర్చు కుండుటయును.
ప్రబంధ. ౧౯౧.

వేస్ట్రము[2] = వేసడము[2] = వేస్టము. వి. ఒకజాతి డేగ. (శ. ర.)

చూ: తరుకు[2]. (సూ. ని.)

వేహత్తు. సం. వి. త్. స్త్రీ. గర్భధారణమైన వెనుక అంబో తెక్కఁగా ఈచుకొని పోయిన యావు. గర్భోపఘాతిని.

వేహారము. సం. వి. అ. పుం. దేశవిశేషము. నేఁడు 'బీహార్' అనఁబడు దేశము.

# వై

వైకక్షము. సం. వి. అ. న. ౧. యజ్ఞోపవీతమువలె ధరింపఁబడిన పుష్పమాల, ఎడమ బుజము మీఁదనుండి కుడిచేతిక్రిందికి వ్రేలునట్లు వేసికొనఁబడిన పూలదండ. ౨. ఉత్తరీయము, పైబట్ట.

వైకక్ష(క్షి)కము. సం. వి. అ. న. యజ్ఞోపవీతమువలె నెడమ బుజముమీఁదనుండి కుడిచేతి క్రిందికి వ్రేలునట్లు వేసికొనఁబడిన పూలదండ.

వైకటికుఁడు. సం. వి. అ. పుం. స్వర్ణకారుఁడు, కంసాలి.

అడ్డంకి. ౩. విలంబము, ఆలస్యము. ౪. (మనస్సు) చెదరుట, కలవరపాటు.

వ్యాక్షోభము. సం. వి. అ. పుం. క్షోభము, కలత.

వ్యాఖ్య. సం. వి. ఆ. స్త్రీ. ౧. వివరణము, టిప్పణము. ౨. కథనము, చెప్పుట.

వ్యాఖ్యాత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) వ్యాఖ్యానము చేయువాఁడు, వివరించువాఁడు, విప్పి చెప్పువాఁడు.

వ్యాఖ్యాతము. సం. విణ. (అ. ఆ. అ.) వ్యాఖ్యానము చేయఁబడినది, వివరింపఁ బడినది, విప్పి చెప్పఁ బడినది. ౨. చెప్పఁబడినది, కథితము.

వ్యాఖ్యానము. సం. వి. అ. న. ౧. కథనము, చెప్పుట. ౨. ఉపన్యాసము. ౩. వివరణము, సందర్భాదులతోఁ గూడ అర్థమును విశదపఱచుట. (ఇది నైదు లక్షణములు గలది:)

శ్లో. పదచ్ఛేదః పదార్థోక్తి ర్విగ్రహో వాక్యయోజనా, ఆక్షేపశ్చ సమాధానం వ్యాఖ్యానం పంచలక్షణమ్.)

వ్యాఘట్టనము. సం. వి. అ. న. ౧. మథించుట, త్రచ్చుట. ౨. రాపిడి, ఘర్షణము.

వ్యాఘాతకము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. తాఁకునది, కొట్టునది. ౨. ఎదిరించునది, ప్రతిఘటించునది, అడ్డగించునది.

వ్యాఘాతము. సం. వి. అ. పుం. ౧. తాఁకుట, కొట్టుట. ౨. దెబ్బ. ౩. విఘ్నము, అంతరాయము. ౪. ప్రతిబంధము, అడ్డు. ౫. వ్యతిరేకము. ౬. ఉల్లంఘనము, చెప్పినట్లు చేయమి. ౭. (జ్యోతి) విష్కంభాది యోగములలో నొకటి. ౮. అర్థాలంకార విశేషము.

క. నొకఁ డొకటి చేత నొకపని, యకలంకతఁ
జేయ దాని నాహేతువుచే, నొకఁడు మఱి
వేఱె చేయఁగఁ, బ్రకట వ్యాఘాతము ...
నరస. ౫. ౨౧౦.

వ్యాఘ్రము. సం. వి. అ. పుం. ౧. పెద్దపులి. ౨. (సమాసోత్తర పదమైనపుడు) స్వజాతి శ్రేష్టము.

ఉదా: పురుష వ్యాఘ్రము.

౩. రక్తైరండము. ఎఱ్ఱాముదపుఁజెట్టు. ౪. కానుగ కరంజము. †.

వ్యాఘ్రదలము. సం. వి. అ. పుం. ౧. ఆముదపుఁ జెట్టు.

వ్యాఘ్రనఖము. సం. వి. అ. పుం. న. పెద్దపులి గోరు, పులిగోరు. ౨. నఖమను సుగంధద్రవ్య విశేషము. ౩. నఖక్షతము, గోటిగీఱు.

వ్యాఘ్రనాయకము. సం. వి. అ. పుం. సృగాలము, నక్క.

వ్యాఘ్రపా(త్తు)దము. సం. వి. అ. పుం. ద్. పుం. పుల్ల వెలఁగ. †.

వ్యాఘ్రపాదుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ద్. పెద్దపులి పాదమువంటి పాదములు గలవాఁడు.

—వి. అ. పుం. ఒకానొక ముని. (వాచ.)

వ్యాఘ్రపుచ్ఛము. సం. వి. అ. పుం. ఆముదపుఁ జెట్టు.

వ్యాఘ్రశునము. సం. వి. న్. పుం. పెద్దపులిని బోలిన కుక్క.

వ్యాఘ్రాటము. సం. వి. అ. పుం. భరద్వాజ పక్షి.

వ్యాఘ్రాస్యము. సం. వి. అ. పుం. మార్జాలము, పిల్లి.

వ్యాఘ్రీ. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుపులి, వాఁకుడు. శ్రీ.

వ్యాజనింద. సం. వి. అ. స్త్రీ. ౧. అన్యాపదేశముగా నిందించుట. ౨. అర్థాలంకారవిశేషము. (ఒక నిందచే వేఱొక నింద వ్యక్తమగుట.

శ్లో. నిందాయా నిందయా వ్యక్తి ర్వ్యాజనిందేతి గీయతే.)

వ్యాజము. సం.వి. అ. పుం. ౧. కపటము, వంచన, మోసము. ౨. తన పనికై యొకటిచెప్పి ఒకటి చేయుట, అపదేశము. ౩. నటనము, లేనిది తెచ్చి పెట్టుకొనుట. ౪. తంత్రము, పన్నుగడ. ౫. దుర్మార్గత, చెడ్డతనము.

వ్యాజస్తుతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. కపటస్తుతి, పైకి స్తుతించునట్లు నటించుట. ౨. అర్థాలంకార విశేషము. "స్తుతిచే నిందయు, నిందచే స్తుతియు గలుగునట్లు చెప్పుట."

వ్యాజోక్తి. సం. వి. ఇ. స్త్రీ. ౧. కపటముగాఁ జెప్పుట. ౨. సూచన. ౩. ఒకానొక యర్థాలంకారము. వేఱు హేతువును జెప్పి నిజస్థితిని గప్పిపుచ్చుట.

వ్యాడ(ళ)ము. సం. వి. అ. పుం. ౧. క్రూర మృగము-పెద్దపులి మున్నగు మాంస భక్షక జంతువు. ౨. పాము.

వ్యాడి. సం. వి. ఇ. పుం. ౧. వ్యాకరణ శాస్త్రమున సంగ్రహ మను గ్రంథమును రచించిన వైయాకరణ శ్రేష్ఠుఁడు. ౨. ఒకానొక ముని.

వ్యాదు(ళు)ఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. దుర్మార్గుఁడు. ౨. మోసగాఁడు, వంచకుఁడు.

—వి. అ. పుం. ఇంద్రుఁడు.

వ్యాత్తము. సం. విణ. (అ. ఆ. అ.) తెఱవఁబడినది, విస్తృతమైనది.

—వి. అ. న. తెఱచిన నోరు.

వ్యాత్యుక్షి. సం. వి. ఈ. స్త్రీ. జలక్రీడా విశేషము. ఒకరిపై నొకరు నీరు చల్లుకొనుచు నీటిలో నాడుట.

వ్యాదానము. సం. వి. అ. న. తెఱచుట, విస్తరింపఁ జేయుట.

వ్యాధ భీతము. సం. వి. అ. పుం. మృగము, లేడి.

వ్యాధామ(వ)ము. సం. వి. అ. పుం. వజ్రాయుధము, ఇంద్రుని యాయుధము.

వ్యాధి. సం. విణ. (న్. సీ. న్.). గ్రుచ్చుకొను నది, గాయపఱుచునది.

—సం. వి. ఇ. పుం. ౧. రోగము, జబ్బు, తెగులు. ౨. కుష్ఠరోగము.

వ్యాధితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) రోగము గలవాఁడు, రోగి, జబ్బు చేసినవాఁడు.

వ్యాధుఁడు. సం. వి. అ. పుం. ౧. వేఁటగాఁడు, బోయవాఁడు, కిరాతుఁడు. ౨. సంకరజాతి పురుషుఁడు.

—విణ. (అ. ఆ. అ.) దుష్టుఁడు, చెడ్డవాఁడు.

వ్యాధూతము. సం. విణ. (అ. ఆ. అ.) కంపింపఁ జేయఁబడినది. కంపితము, చలింపఁ జేయఁ బడినది.

వ్యానతము. సం. వి. అ. న. రతిబంధ విశేషము.

వ్యానము. సం. వి. అ. పుం. ప్రాణాది వాయువు లయిదింటిలో నొకటి. (ఇది సర్వశరీరమును వ్యాపించి యుండును.)

వ్యాపకము. సం. విణ. (అ. పిశా. అ.) ౧. వ్యాపించునది, అంతటను బ్రసరించునది. ౨. (న్యాయ.) వాదాంశము లన్నియుఁ గలది. ౩. నిత్యసంబంధము గలది, ఎప్పుడును విడువకుండునది. ౪. వ్యాప్యము కంటె అధిక దేశమందుండునది. ౫. అచ్ఛాదనము, సహజగుణము.

—వి. అ. పుం. స్వాభావిక గుణము, సహజగుణము.

వ్యాపత్తి. సం. వి. ఇ. స్త్రీ. ౧. నాశనము. ౨. ఆపద, కష్టము. ౩. మరణము.

వ్యాపత్తు. సం. వి. త్. స్త్రీ. ౧. కష్టము, ఆపద, దుర్దశ. ౨. నాశము. ౩. మరణము, చావు.

వ్యాపనము. సం. వి. అ. న. ౧. వ్యాపించుట, అంతటను బ్రసరించుట. ౨. కప్పుట, ఆచ్ఛాదించుట.

వ్యాపన్నము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. చెడినది, పాడైనది. ౨. తప్పిపోయినది. ౩. ఆపద నొందినది, దుర్దశలో నున్నది. ౪. చచ్చినది, మృతినొందినది.

వ్యాపరించు. సం. అ. క్రి. ప్రవర్తించు, వర్తించు.

సీ. తన పదాబ్జములపైఁ దరుణి నిళ్ళలమైన
చూపులు తేటులై వ్యాపరింప ...
తపతీ. ౫. ౧౫.

వ్యాపాదకము. సం. విణ. (అ. ఆ. అ.) హింసించునది, చంపునది.

వ్యాపాదనము. సం. వి. అ. పుం. ౧. చంపుట, హింసించుట. ౨. నాశము, ధ్వంసము. ౩. దుష్టభావము, ద్రోహచింతనము, పరుల కనిష్టమును గోరుట.

వ్యాపాదితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. చంపఁ బడినది, నశింపఁ జేయఁబడినది. ౨. చెఱుపఁ బడినది, పాడు చేయఁబడినది, కీడు కలిగింపఁ బడినది.

వ్యాపారము. సం. వి. అ. పుం. ౧. పని, వ్యవహారము, కార్యము.

క. ఆ పురవర మణిలో గుణ,దీపక నామమున భూమి దేవుం డలరుం, జూపట్టి వేదశాస్త్ర, వ్యాపారము చేత రెండవ విధాతయనన్.

హంస. ౧. ౧౫౦.

౨. వృత్తి, జీవిక. ౩. వాణిజ్యము, వర్తకము, ౪. (బాణాదుల) ప్రయోగము. ౫. ఆచరించుట, పనిచేయుట. ౬. ప్రయత్నము. ౭. అభ్యాసము, నేర్చుట.

వ్యాపారి. సం. విశ. (న్. ణీ. న్.) ౧. వ్యాపారము చేయువాఁడు, వర్తకుఁడు, వణిజుఁడు. ౨. అభ్యసించువాఁడు, అలవఱుచు కొను వాఁడు.

వ్యాపారితము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. పని గలిగియున్నది, నియమింపఁ బడినది. ౨.ఉంచఁ బడినది, స్థిరము చేయఁబడినది.

వ్యాపి. సం. విశ. (న్. నీ. న్.) ౧. (సమాసాంతమున) వ్యాపించునది, నిండునది. ౨. అంతటను నిండునది, సర్వ వ్యాపకము. ౩. కప్పునది, ఆచ్ఛాదించునది.

—వి. న్. పుం. ౧. విష్ణువు. ౨. వ్యాపించు గుణము.

వ్యాపించు. సం. స. క్రి. పర్వు, అలముకొను.

వ......నేత్రాది పంచద్వార ప్రవిష్టుండై సర్వంబును వ్యాపించు ...

మార్క. ౧. ౯౯.

వ్యాపృతము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. పనిలో నున్నది, వ్యాపారము గలది, పని గలిగినది. ౨. ఉంచబడినది, దృఢముగా నిలుపఁ బడినది.

వ్యాపృతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. వ్యాపారము, పని, కార్యము. ౨. ఆచరించుట. ౩. ప్రయత్నము, పూనిక. ౪. వృత్తి, జీవిక. ౫. అభ్యాసము.

వ్యాపృతుఁడు. సం. వి. అ. పుం. ఉద్యోగస్థుఁడు, మంత్రి.

వ్యాప్తము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. వ్యాపించునది, ప్రసరించునది, క్రమ్మినది. ౨. అంతటను వ్యాపించునది. ౩. నిండినది. ౪. చుట్టి వాఱినది, ఆవరించినది. ౫. ఉంచఁబడినది, కూర్పఁబడినది. ౬. సంపాదింపఁ బడినది, పొందఁబడినది. ౭. అంతర్గతము, ఇమిడియున్నది. ౮. విడువకుండునది. ౯. ప్రసిద్ధమైనది. ౧౦. చేరఁబడినది, విస్తృతము.

వ్యాప్తి. సం. వి. ఇ. స్త్రీ. ౧. వ్యాపించుట, ప్రసరించుట. ౨. (తర్క.) ఎప్పుడును విడువకుండుట, నియత సాహచర్యము. ('ఎక్కడెక్కడ పొగ యుండునో అక్కడక్కడ యగ్ని యుండును,' అనెడి సాహచర్య నియమము వ్యాప్తి.) ౩. సర్వసామాన్య సూత్రము, సామాన్య నియమము. ౪. నిండుట, సమృద్ధి. ౫. సంపాదనము, లబ్ధి, లాభము. ౬. సర్వ వ్యాపకత్వము, అంతటను నిండియుండుట, అష్టవిభూతులలో నొకటి. ౭. పని, కృత్యము.

మ......మా యిండ్లలో, సకల వ్యాప్తులుడించి ...

భాగ. ౧౦. ౯౨౮.

వ్యాపృత్వము. సం. వి. అ. న. ఎప్పుడును విడువకుండుట, నిత్యసంబంధము.

వ్యాప్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. వ్యాపింపఁ దగినది. 2. వ్యాపించినది. 3. అల్ప దేశవృత్తి, కొంత ప్రదేశమందు మాత్ర ముండునది.

—వి. అ. న. 1. (తర్క.) అనుమితి సాధనము. 2. సాధనము. 3. ఓషధీ విశేషము.

వ్యాభ్యుక్షి. సం. వి. ఈ. స్త్రీ. వ్యాత్యుక్షి.

వ్యామనము. సం. వి. అ. న. వ్యామము.

వ్యామము. సం. వి. అ. పుం. అడ్డముగాఁ జాఁపఁబడిన చేతుల నడిమి కొలత, బార.

వ్యామిశ్రము. సం. విణ. (అ. ఆ. అ.) కలిసిపోయినది, మిశ్రమైనది.

వ్యామోహము. సం. వి. అ. పుం. 1. అత్యంత మోహము, మిక్కుటంపు ప్రేమ. 2. కలఁత, క్షోభము.

వ్యాయతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పొడవైనది, దీర్ఘమైనది. 2. విశాలమైనది, విరివియైనది. 3. వ్యాపారము గలది, పని గలది. 4. వినీతమైనది, శిక్షితమైనది, అలవఱుపఁ బడినది. 5. దృఢమైనది, బలము గలది. 6. లోఁతైనది.

—వి. అ. న. దైర్ఘ్యము, పొడువు.

వ్యాయామము. సం. వి. అ. పుం. 1. చాఁచుట. 2. శరీర పరిశ్రమము, ఒడలికష్టము. 3. మార్గాయాసము. 4. ప్రయత్నము. 5. పోరు, యుద్ధము. 6. పని, వ్యాపారము, వృత్తి, జీవిక. 7. కష్టము. 8. వ్యామము, బార.

వ్యాయామి. సం. విణ. (న్. నీ. న్.) దేహపరిశ్రమము చేయువాఁడు.

వ్యాయామికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) దేహ పరిశ్రమము చేయువాఁడు.

వ్యాయోగము. సం. వి. అ. పుం. ఏకాంకమగు రూపక విశేషము.

ఉదా: నరకాసుర వ్యాయోగము.

వ్యాలంబము. సం. వి. అ. పుం. ఒక జాతి, ఆముదపుఁ జెట్టు.

వ్యాలకము. సం. వి. అ. పుం. దుష్టగజము, చెడ్డ యేనుఁగు.

వ్యాలగ్రాహి. సం. వి. న్. పుం. పాములను బట్టుకొనెడి యొక జాతివాఁడు, పాములవాఁడు.

వ్యాలగ్రాహుఁడు. సం. వి. అ. పుం. వ్యాలగ్రాహి.

వ్యాలము. సం. విణ. (అ. ఆ. అ.) 1. దుష్టము, లోఁగనది. 2. చెడ్డది. 3. క్రూరమైనది.

—వి. అ. పుం. 1. దుష్టగజము. 2. క్రూర జంతువు, ఇతర జంతువులను జంపి తిను జంతువు. 3. పులి. 4. పాము.

వ్యాలమృగము. సం. వి. అ. పుం. 1. క్రూర జంతువు. 2. వేఁట కుపయోగపడు చిఱుతపులి.

వ్యాలీనము. సం. విణ. (అ. ఆ. అ.) సాంద్రము, దట్టమైనది.

వ్యాలుఁడు. సం. వి. అ. పుం. ౧. రాజు. ౨. శఠుఁడు, దుర్మార్గుఁడు. ౩. విష్ణువు.

వ్యాలోలము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. చలించునది, కదలునది. ౨. రేఁగినది, వీడినది, (కేశపాశము.)

వ్యావక్రోశి. సం. వి. ఈ. స్త్రీ. పరస్పర నింద, ఒండొరులు నిందించుకొనుట.

ఇట్లే: వ్యావభాషి.

వ్యావర్తకము. సం. విణ. (అ. ర్తికా. అ.) ౧. పరివేష్టించునది, చుట్టువాఱునది. ౨. ఇతరమునకుఁ జెందకుండ నియమించునది. వేఱుపఱుచునది. (ప్రత్యేక లక్షణము.) ౩. ఒకదాని నుండి మరలునది. ౪. గుండ్రముగాఁ దిరుగునది.

వ్యావర్తనము. సం. వి. అ. న. ౧. చుట్టువాఱుట, పరివేష్టనము. ౨. గుండ్రముగాఁ దిరుగుట. ౩. మడత.

వ్యావర్తము. సం. వి. అ. పుం. ౧. చుట్టువాఱుట, పరివేష్టించుట. ౨. గుండ్రముగాఁ దిరుగుట. ౩. నాభి కంటకము, ఉఱుకు బొడ్డు.

వ్యావర్ణించు. సం. స. క్రి. వర్ణించు.

వ. తదంశావతారంబుగా వ్యావర్ణించి నా చెప్పం బూనిన దివ్య కథామాత్రం బెట్టి దనిన ... ము. సం. ౧. ౬౩.

వ్యావల్గితము. సం. విణ. (అ. ఆ. అ.) కదలినది, తొట్రుపడినది.

వ్యావహారి. సం. వి. ఈ. స్త్రీ. పరస్పర హరణము, ఒండొరులిచ్చి పుచ్చుకొనుట.

వ్యావహారికము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. వ్యవహార సంబంధమైనది. ౨. న్యాయసంబంధమైనది. ౩. వాడుక యైనది, ఆచారములో నున్నది. ౪. మాయా ప్రపంచ సంబంధమైనది. వ్యతి: పారమార్థికము.

—వి. అ. న. ౧. ఆచారము, వాడుక. ౨. వ్యాపారము. (విల్యమ్సు.)

వ్యావహారికుఁడు. సం. వి. అ. పుం. వ్యవహార విషయములను దెలుపువాఁడు, మంత్రి.

వ్యావహాసి. సం. వి. ఈ. స్త్రీ. పరస్పర పరిహాసము, ఒకరి నొకరు వేళాకోళము చేసికొనుట.

వ్యావృతి. సం. వి. ఇ. స్త్రీ. కప్పుట, ఆచ్ఛాదించుట.

వ్యావృతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. కప్పఁబడినది, ఆవరింపఁ బడినది. ౨. ఆటంకపఱుపఁబడినది. ౩. తెఱవఁబడినది. ౪. తొలగింపఁ బడినది, బహిష్కరింపఁ బడినది.

వ్యావృత్తము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. మరలినది, నివృత్తము. ౨. విడఁదీయఁ బడినది. ౩. వేఱైనది, భిన్నము. ౪. లేనిది, కనఁబడనది. ౫. గుండ్రముగాఁ దిరుగునది. ౬. చుట్టువాఱుకొనినది, పరివేష్టించినది. ౭. మానుకొనినది, చాలించినది. ౮. ఆవృతము, కప్పఁబడినది.

వ్యావృత్తి. సం. వి. ఇ. స్త్రీ. ౧. ఆచ్ఛాదించుట, కప్పుట. ౨. విడఁదీయుట, వేఱు

చేయుట. ౩. కనఁబడమి, నష్టి, లేమి. ౪. చుట్టువాఱుకొనుట. ౫. తిరుగుట, భ్రమణము. ౬. మరలుట, స్తుతి, పొగడ్త.

**వ్యాసంగము.** సం. వి. అ. పుం. ౧. మిక్కిలియు నంటియుండుట. ౨. ఏకాయత్తత, తత్పరత. ౩. దీక్షగాఁ జదువుట. ౪. శ్రద్ధ, ఆసక్తి. ౫. ఎడఁబాటు. ౬. కలఁత, క్షోభము. ౭. సంకలనము, కూడిక.

**వ్యాసము.** సం. వి. అ. పుం. ౧. భాగములుగాఁ బంచిపెట్టుట. ౨. సమాసము విడఁదీయుట, విగ్రహ వాక్యము. ౩. భేదము, వేఱగుట. ౪. వ్యాపించుట. ౫. వైశాల్యము, విరివి. ౬. వలయాకారమగు వస్తువు, నడిమి కొలత. ౭. పరిమాణ విశేషము. ౮. ఉచ్చారణము నందలి దోషము. ౯. గ్రంథాంతరముల నుండి యెత్తి వ్రాయుట, కూర్చుట.

**వ్యాసక్తము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. దృఢముగా నంటియున్నది, సంలగ్నము. ౨. తత్పరము, తదేకాయత్తము, ఒకదానియందే దృష్టి గలది. ౩. విడఁదీయఁ బడినది, వేఱుచేయఁ బడినది. ౪. కలఁత నొందినది.

**వ్యాసిద్ధుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. నిషేధింపఁ బడినవాఁడు, బహిష్కరింపఁ బడినవాఁడు. ౨. రాజాజ్ఞచే నిరోధింపఁ బడినవాఁడు.

**వ్యాసుఁడు.** గ్రంథాంతరముల నుండి సంగ్రహించి వ్రాయునతఁడు, కూర్పరి. ౨. పురాణ బ్రహ్మసూత్రాది గ్రంథములు రచించిన మహర్షి, పరాశర పుత్రుఁడైన మహర్షి, పౌరాణికుఁడగు బ్రాహ్మణుఁడు.

**వ్యాసేధము.** సం. వి. అ. పుం. నిషేధము, బహిష్కారము, తొలఁగించుట.

**వ్యాహతము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. నిరోధింపఁ బడినది, అడ్డగింపఁ బడినది. ౨. కొట్టఁ బడినది. ౩. భంగపఱుపఁ బడినది. ౪. కలఁత నొందినది, తడఁబడినది.

**వ్యాహతార్థము.** సం. వి. అ. స్త్రీ. వాక్య రచనయందలి దోషవిశేషము.

**వ్యాహృతము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. పలుకఁ బడినది, ఉచ్చరింపఁ బడినది. ౨. తినఁబడినది, భక్షింపఁ బడినది.

—వి. అ. న. పలుకుట, మాటాడుట.

**వ్యాహృతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. ఉచ్చారణము. ౨. సంధ్యావందనాది సమయమున ద్విజులచే నుచ్చరింపఁ బడెడి ఊర్ధ్వలోక నామసంకీర్తన రూపమగు మంత్రవిశేషము.

**వ్యాహరణము.** సం. వి. అ. న. ౧. ఉచ్చారణము. ౨. కథనము, చెప్పుట.

**వ్యాహారము.** సం. వి. అ. పుం. ౧. ఉక్తి, వాక్కు, పదము. ౨. వాక్యము. ౩. కంఠస్వరము. ౪. హాస్యము, చమత్కార సంభాషణము.

## వ్యు

**వ్యుత్క్రమము.** సం. వి. అ. పుం. ౧. మంచి మార్గము నతిక్రమించుట, సన్మార్గము నుండి తొలఁగుట. ౨. అక్రమము, క్రమవైపరీత్యము. ౩. సంభ్రమము, తత్తరపాటు.

వ్యుత్క్రాంతము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. సన్మార్గము నుండి తొలఁగినది, హద్దు మీఱి వర్తించునది. ౨. విడిచిపోయినది. ౩. అశ్రద్ధ చేయఁబడినది, ఉపేక్షితము.

వ్యుత్థానము. సం. వి. అ. న. ౧. అధిక్రోత్సాహము, మిక్కుటమగు ఘటుకుఁదనము. ౨. ఎదిరించుట, ప్రతిఘటించుట. ౩. తన యిష్టమువచ్చినట్లు చేయుట. ౪. ప్రతికూలముగాఁ జేయుట. ౫. (యోగ.) ధ్యాన సంపూర్ణత. ౬. నృత్య విశేషము, నాట్యము. ౭. గజోత్థాపనము, ఏనుఁగును లేచునట్లు చేయుట.

వ్యుత్థితి. సం. వి. ఇ. స్త్రీ. వ్యుత్థానము.

వ్యుత్పత్తి. సం. వి. ఇ. స్త్రీ. ౧. ఉత్పత్తి, పుట్టుక. ౨. శాస్త్రజన్యమయిన శబ్దార్థజ్ఞానము వలనఁ గలిగెడు సంస్కార విశేషము. ౩. శబ్దములకుఁ గల యర్థాన బోధక శక్తి, అర్థమును దెలుపు శక్తి. ౩. నైపుణ్యము, నేర్పు. ౪. వైదుష్యము, పాండిత్యము.

వ్యుత్పన్నము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. పుట్టినది. ౨. వ్యుత్పత్తిచే నేర్పడినది. (శబ్దరూపము.) ౩ వ్యుత్పత్తి గలది. (పదము.) ౪. సంపూర్ణమైనది.

(వ్యతి: అవ్యుత్పన్నము.) ౫. నైపుణ్యము గలది.

వ్యుదస్తము. సం. విశ. (అ. ఆ. అ.) త్రోసి వేయఁబడినది, నిషేధింబఁ బడినది.

వ్యుదాసము. సం. వి. అ. పుం. ౧. త్రోసి వేయుట, నివారించుట. ౨. (వ్యాక.) నిషేధించుట. ౩. నిషేధము, బహిష్కారము. ౪. ఉపేక్ష. ౫. చంపుట.

వ్యుష్టము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. తగులఁబెట్టఁబడినది, దగ్ధము. ౨. పర్యుషితము, పదను తప్పినది, ప్రాఁచిదైయినది, ప్రభాతమైనది, వేకువయైనది. ౩. స్వచ్ఛము, పరిశుభ్రమైనది. ౪. నివసించినది. ౫. దాఁటినది. అతిక్రమించినది.

—వి. అ. న. వేకువ, ప్రభాతము, కాలము. ౨. దివాభాగము, పగలు. ౩. ఫలితము, పర్యవసానము.

వ్యుష్టి. సం. వి. ఇ. స్త్రీ. ౧. వేకువ, ప్రభాతము. ౨. సమృద్ధి. ౩. స్తుతి, పొగడ్త. ౪. ఫలితము, పర్యవసానము.

## వ్యూ

వ్యూఢము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. విశాలమైనది, పృథులము. ౨. సంహతము, దృఢమైనది. ౩. వ్యూహములు పన్ని నిలుపఁబడినది. (సేన.) ౪. క్రమరహితము. ౫. పెండ్లాడఁబడినది.

వ్యూతము. సం. విశ. (అ. ఆ. అ.) దారములతోఁ గూర్పఁ బడినది, కుట్టఁ బడినది.

వ్యూతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. నేఁత, కుట్టు. ౨. నేఁతకూలి.

వ్యూహ = వ్యూహము. సం. వి. ఆ. స్త్రీ. ఒక విధముగా నిలుపఁ బడిన సేన, వ్యూహము. లయగ్రాహి. ఆహరఁ దనూజుఁడు... పెక్కుల్, వ్యూహాలఁ బయల్పఱచి హాహాహాతిఁజనన్...

క. సం. ౧౨. ౯౫౧.

వ్యూహనము. సం. వి. అ. న. ౧. సేనలను బలు విధములుగా నేర్పఱిచి నిలుపుట. ౨. శరీరావయవముల నిర్మాణము.

వ్యూహపార్ష్ణి. సం. వి. ఇ. స్త్రీ. వ్యూహము లుగా నేర్పడి యున్న సేనయొక్క వెనుక భాగము.

వ్యూహము. సం. వి. అ. పుం. ౧. యోధుల సన్నివేశ విశేషము, యుద్ధము కొఱకు సైన్యములను శకటా ద్యాకారములుగ గలుగునట్లు నిలుపుట, శకట వ్యూహము, శ్యేన వ్యూహము, పద్మవ్యూహము. మొ॥ ౨. సేన. ౩. సంఘము, గుంపు. ౪. భాగము, అంశము. ౫. శరీరము. ౬. నిర్మాణము. ౭. హేతువాదము, తర్కము. ౮. విభజించుట, పంచిపెట్టుట.

వ్యృద్ధి. సం. వి. ఇ. స్త్రీ. అభివృద్ధి లేమి.

## వ్యో

వ్యోకారుఁడు. సం. వి. అ. పుం. లోహకారుఁడు, కమ్మరి.

వ్యోమకేశి. సం. వి. న్. పుం. శివుఁడు.

వ్యోమకేశుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

వ్యోమచారి. సం. వి. న్. పుం. ౧. వేలుపు, దేవత. ౨. పక్షి. ౩. ముని. ౪. గ్రహనక్షత్రాదికము.

వ్యోమధూమము. సం. వి. అ. పుం. మేఘము, మబ్బు.

వ్యోమ మంజరము. సం. వి. అ. న. టెక్కెము ధ్వజము.

ఇట్లే: వ్యోమ మండలము.

వ్యోమము. సం. వి. న్. న. ౧. ఆకాశము. ౨. జలము. ౩. సూర్య దేవాలయము. ౪. అభ్రకము.

వ్యోమముద్గరము. సం. వి. అ. పుం. గాలి దెబ్బ, గాలిపెట్టు.

వ్యోమయానము. సం. వి. అ. న. విమానము, దేవయానము.

వ్యోమ సదుఁడు. సం. వి. ద్. పుం. ౧. వేలుపు, దేవత. ౨. గంధర్వుఁడు. ౩. ఆత్మ.

వ్యోమ స్పృశము. సం. విశే. (శ్.) ఆకాశము నంటునది మిక్కిలి యెత్తైనది.

వ్యోమోదకము. సం. వి. అ. న. వర్షోదకము, వాననీరు.

వ్యోషము. సం. వి. అ. న. సొంటి, పిప్పలి, మిరియాలు, త్రికటుకములు.

## వ్ర

వ్రంత[1] = వంత[1]. వి. ౧. ఏఱు.

మ. అలుకం బేర్చి హలం బధోముఖముగా నత్యోత్కటికిం జాఁచి తత్సలిలౌఘం బొక వ్రంతయై తనకునై సర్వంబు నొండొండ యిమ్మల రావింపఁ దొడంగె భూరిభయ సమ్మోహంబునన్ ధాత్రి యగ్గలపుం గంపము నొంద ...

హరి. ఉ. ౨. ౮౫.

ఉ. అంతట గోపమాలిక రయంబునఁ గాళ్లను బట్టి వాని నత్యంత బలంబున న్విసరి యంబర వీధికి వైచె వైచినం గ్రొంతుక క్రిందుగా నిచటి కొండపయిం బడె నాటనుండియున్,

వ్రంతలు గట్టి పాఱు రుధిరంబు వినిస్రుతి
గైరికాకృతిన్.
భోజరా. ౫. ౨౬౨.

౨. పల్లము, గోయి.

సీ. మడువులు పసుల కాల్మడిఁ బ్రుచ్చెదారు
గండి వ్రంతలు పెను రొంపి వ్రంతలయ్యె...
హరి. పూ. ౬. ౫.

చ. కదిసిన భీతి వానరులు కన్కనిఁ బాఱియు
గహ్వరంబులం, దొదిఁగియు వాఁగు వ్రంతఁ
బడియుండియు ...
భా. రా. యు. ౯౧౨.

వ్రంత² = వంత². వి. (√ వ్రందు.) మనోవ్యథ.

గీ. ఎట్టి ఘట్టములను నెట్టి యాపదలను, నెట్టి
తీఱములను ముట్టఁబడిన వ్రంత లెల్లఁ బాయు
నింతులఁ బ్రజలను, నొనరఁ జూడఁగనిన
జనుల కెందు.
భార. ఆది. ౪. ౨౭౪. (చి. ని. పా.)

గీ. వ్రంత దురపిల్లి కన్నెల వగచి వగచి, గంధ
వతి పట్టి యొక భంగిఁ గన్ను మోడ్చె ...
భీమ. ౨. ౪౬. (చి. ని. పా.)

ఆ. నీదు వ్రంత చూచి నీవారలందఱు, దీన
లయిరి వీరిఁ దేర్పవలదె ...
భార. ద్రో. ౨. ౨౫౭. (చి. ని. పా.)

గీ. అనుచు సర్పాలంతి నాగడంబున నాడ,
నాలకించి యొడయఁడలుక పూని, యిట్టు
లట్టులనుచు నేమియు మాటాడ, నోడి
వ్రంత నూరకుండె నంత.
అచ్చ. రా. అయో. ౩౬.

వ్రందు. అ. క్రి. ౧. సంతాపించు.

సీ. దేవి యుపేక్షయ చూచె యీ యమకు
నిప్పాటు వచ్చుట యని వ్రందువారు ...
భార. విరా. ౨. ౧౪౬.

౨. తప్తమగు.

మ. అసురాధీశుఁడు రోహణాచల సముద్య
ద్రత్నముల్ చెక్క రమ్యసువర్ణాద్రిని
మూలిఁజేయఁ బరభూపావాప్తికై ఫాల దృ,
గ్వసుధాభృన్ముఖ లోహముల్ పుటములై
వ్రందన్ మణి ప్రాప్తి కన్ని సముద్రం
బులు వెల్లఁజల్లఁ దలచున్ మోహానురూపం
బుగన్.
దశా. ౩. ౧౪౨.

వ్రక్క. వి. (√ వ్రచ్చు.) ఖండము, ముక్క, తునుక.

క. ఎదిరింద మ యట్టుల కా, మదిఁ దలఁచినఁ
బోసఁగుఁ గాక మాకుం గుడిమిం, డిదె
మీరు వ్రక్కగొనుఁడని చదురడిచిన మనసు
పొందు చక్కంబడునే.
భార. ఉద్యో. ౧. ౩౧౨.

ఉ. ఈ దనుజుండు కోరిక వహింపని రంభను
బల్మిఁ బట్టి న,ట్టాదట నింక నొప్పని మృగా
క్షుల బల్మిని బట్టనేని స,మ్మోదము దీఱ
నంత శిరముల్ పదియున్ బదినూఱు
వ్రక్కలై, మేదిని గూలుఁగావుత నిమేష
ములో భువనంబు మెచ్చఁగన్.
ఉ. రా. ౪. ౨౩౫.

వ్రక్కలగు. అ. క్రి. (వ్రక్కలు + అగు.) బ్రద్ద
లగు, పగులు, భేదిల్లు.

సీ. దిక్కుంభి కుంభముల్ వ్రక్కలై ముక్తాఫల
ములు పైకెగయ వాలమునఁ గొట్టు ...
దశా. ౧. ౨౨౫.

**వ్రక్కలు చే(సే)యు.** స. క్రి. (వ్రక్కలు + చేయు.) ఛేదించు, నఱకు, ఖండించు.

చ. అతిశిత చక్రధార నరకాసురు వ్రక్కలు చేసి ... ఉ. హరి. ౧. ౧౨౩.

ఉ. చుక్కల రాణి వాసముల సోయగపుం జనుదోయి క్రొత్తెక్కునం, జిక్కన యైన యుక్కు యదుసింహుడు బాణ పరంపరా హతిన్, వ్రక్కలు సేయఁగాఱు రుధిరం బునఁ దోఁగుచు ...

పారి. ౫. ౧౦.

**వ్రక్కలించు.** స. క్రి. (√ వ్రక్క.) ౧. ఛేదించు, పగుల్చు.

ఆ. ...పదయుగములు నఱికి ప్రక్కలొత్తి, వ్రక్కలించి మేను చెక్కి వక్షస్స్థలి, పటు తరాస్త్ర తతులఁ బగులఁజేసి.

భా. రా. యు. ౧౯౫౪.

క. విను కడుపు వ్రక్కలించుచుఁ, జనుదేరఁగ బోలి బడ్డ సరగ నెకడకన్, నును బ్రతికింపఁగ సంజీవనిఁ జెప్పితిఁ గచున కపుడు వదలని కూర్మిన్. యయా. ౩. ౧౪౦.

సీ. గంభీర తరగాభిగర్త విభ్రమముల వ్రక్కలింతురు జలావర్తశోభ ...

భీమ. ౧. ౯౧.

(ఇట 'జయించు' అని భావము.)

ఉ. చిక్కిలి పొందుఁ బోయెదవు శ్రీహరి యంచు మృగేంద్ర వాహనుం, జక్కఁగఁ బైకి నూకి రభసంబున శూలము పూని జిక్కి యా పక్కిని వ్రక్కలింపఁ గని పక్కున శూలము నాఁచిత్రుంచె నా,చక్కని కాలనేమి తల చక్రధరుండు సురాళి మెచ్చఁగన్.

దశా. ౨. ౪౦౧.

**వ్రక్కలింత.** వి. (√ వ్రక్క.) ఛేదనము, చీల్చుట.

సీ. తత్తడి డెక్క గుద్దలి వ్రక్కలింతల నెగసిన దుమ్ము మిన్నెల్లఁ గప్పు ...

అచ్చ. రా. యు. ౧౭౪.

**వ్రక్కలువా(ల్వా)పు.** స. క్రి. (√ వ్రక్కలు వాయు.) ఛేదించు, పగుల్చు.

సీ. బ్రహ్మాండ కుతార కర్పరము వ్రక్కలు వాపి యావరణంబు లందంద చించి ...

శివరా. ౧. ౯౩.

క. ఊపిరి వెడలక కడుపున, వాపోదగఁ బాము ప్రాణ వాతంబులు సంతాపించి శిరము వ్రక్కలు, వాపికొనుచు వెడలి చనియెఁ బలు ఘోషములన్.

భాగ. ౧౦. పూ. ౪౭౦.

మ. ......చ, య్యన రా నిమ్ము సగర్వ దుర్విషహ బాహాశక్తి మున్ రాక్షసాంగనచే నందదుకైన యయ్యోదలు వ్రక్కల్ వాపెదం గ్రమ్మఱన్.

హరి. ఉ. ౧. ౧౫.

**వ్రక్క(లు)వాయు.** అ. క్రి. (వ్రక్క + వాయు.) తెగు, ఖండితమగు.

ఆ. త్రొక్కియున్న తీఁగె వ్రక్కవాసిన జాతి, పడియె గౌరి వాని యొడలి మీఁదఁ, దత్పదాబ్జ యుగము దాఁకి శాపము వీడి, వచ్చెఁ బాణి పాద వనరుహములు.

భోజరా. ౫. ౧౯౫.

వ్రక్కవాఱు=వ్రక్కలువాఱు. (శ. ర.)

వ్రక్కలువాఱు = వ్రక్కవాఱు. అ. క్రి. (వ్రక్కలు + పాఱు.) ముక్కలగు, తునకలగు.

క. ఋతుమతియై యుండిన కుల,సతిఁ గవయక వేఱె యుండు జలజాననతోఁ, రతి సల్పిన భ్రూణఘ్నుఁ, డ్రతుఁ జెఱఁబడఁ ద్రోయరేదు వ్రక్కలు వాఱన్.
రుక్మాం. ౨. ౩౫.

చ. గుసగుస వచ్చు లా వరులఁ గొమ్మల వ్రక్కలు వాఱఁ జీఱుచున్ ...
విక్ర. ౨. ౧౨౯.

వ్రచ్చు. స. క్రి. (సం. వ్రశ్చ.) (√వ్రయ్యు.) ౧. ఛేదించు, చీల్చు.

ఉ. వచ్చిన నీవ చూడఁగ నవార్య బలోన్నతిఁ జేసి వారలన్, వ్రచ్చి వధింతుగాక ...
భార. ఆది. ౬. ౧౯౯.

ఉ......ఘోటక, వ్రాతము నొంచి మైనుఱవు వ్రచ్చి శరంబులు మేనఁగ్రుచ్చి ...
భార. భీష్మ. ౨. ౩౧౬.

ఉ. ద్వారక సొచ్చెనేనియును వారక యుగ్రతఁ గిట్టి పట్టి య,ద్వారిధి దుర్గ మంతయును వ్రచ్చి విరోధి సబాంధవమ్ముగాఁ, బోర వధించి రుక్మిణిఁ బ్రభూత విభూతిఁ దలిర్పఁ దెత్తు ... హరి. ఉ. ౩. ౧౦౦.

గీ. వ్రత్త మొకని కడుపు వ్రయ్యంగ నందులోఁ, బసిఁడి లేకయున్నఁ బరుని బ్రతికి, యరుగ నిత్తముండి నట్లైన నితరుని, వ్రత్త మిదియె కార్య వృత్త మనుచు.
కేయూర. ౩. ౩౨౬.

౨. వఱకు, ఛేదించు, ఖండించు.

ఉ......పె,న్వాలుగ సై మహార్ణవమునం దొలఁ బల్కలు దొంగరక్కసున్, వాలిక వంక వాఁడి గతి వ్రచ్చి వెసన్నిగమాలిఁ దమ్మి పూ, చూలికిఁ దెచ్చి యీవె త్రిదశుల్ గొని యాడ మురా సురాంతకా.
పారి. ౩. ౨౭.

ఉ. అచ్చటి ద్వారపాలకుల నందఱ మ్రందఁగఁ జేసి వీటిలోఁ, జొచ్చి రణేచ్ఛ రావణ సూను లెదిరింగి యభంగురక్రుధన్, వచ్చి విరోధి సైనికుల వాలిక తూపుల ఖడ్గధారలన్, వ్రచ్చి రథాశ్వదంతి భటవర్గముతో వెసఁ జేర్చి యార్చినన్.
ఉ. రా. ౩. ౩౯౧.

అ. తన తలఁచిన యట్లు మనుజ శార్దూలున,వార్యమన్యు వికృత వదనుఁ గాఁగ, నవయవములు వ్రచ్చి యభ్రమ్మునకుఁ జాఱ, నడఁచె వాఁడు పిడుగు నట్ల మ్రోయ.
రాఘవ. ౪. ౧౯౯.

౩. ఊడఁబెఱుకు, పెకలించు.

ఉ......నెమ్మదిన్, వచ్చిరె కర్ణనందనుఁడు నా మనుమండును నంచుమేనిముల్, వ్రచ్చి వెడంద గాయములు పాణితలంబున నంటి చూచుచున్. జై. భా. ౩. ౭.

౪. హింసించు, నశింపఁజేయు.

క. విత్తము సంసృతి పటలము, వ్రత్తము కామాదివైరి వర్గంబుల నేఁ, డిత్తము చిత్తము హరికిని, జొత్తము నిర్వాణ పదము శుభమగు మనకున్. భాగ. ౭. ౨౪౯.

౫. పిసుకు.

సీ. వలుదలై మెఱయు పార్వణపు ముద్దలవంటి
వలి గుబ్బలెన్నఁడు వ్రచ్చికొందు ...
శుక. ౨. ౪౮౧.

**వ్రచ్చికొను.** స. క్రి. (వ్రచ్చు + కొను. స్వార్థమున.) చీల్చు, ఛేదించు.

చ. ఒకమరి బుద్ధగింప విలయోదకముల్ పయి
కుబ్బి చిప్ప వ్రచ్చుకొని మహాభ్రవీధిఁ
జన ... అము. ४. ౨౧.

**వ్రజకిశోరుఁడు.** సం. వి. అ. పుం. గొల్లపిల్లవాఁడు, శ్రీకృష్ణుఁడు.

**వ్రజకుఁడు.** సం. వి. అ. పుం. భిక్షువు, సన్న్యాసి

**వ్రజనము.** సం. వి. అ. న. ౧. సంచరించుట, తిరుగుట, దేశసంచారము. ౨. దేశభ్రష్టత, దేశము విడిచిపోవుట.

**వ్రజనాథుఁడు.** సం. వి. అ. పుం. కృష్ణుఁడు.

ఇట్లే: వ్రజవరుఁడు, వ్రజమోహనుఁడు, వ్రజవల్లభుఁడు. మొ॥

**వ్రజము.** సం. వి. అ. పుం. ౧. సమూహము, గుంపు, మొత్తము. ౨. గొల్లపల్లె. ౩. గోష్ఠము, గోశాల. ౪. నివాసము, ఉనికిపట్టు. ౫. మార్గము. ౬. మేఘము. ౭. మధురాపుర సమీపమందున్న దేశవిశేషము, గోకులము.

—అ. న. సంచారము, తిరుగుట.

**వ్రజాంగన.** సం. వి. ఆ. స్త్రీ. గొల్లత, గొల్లపడుచు, గోపిక.

**వ్రజాజిరము.** సం. వి. అ. న. గోష్ఠము, గోశాల.

**వ్రజ్యా.** సం వి. ఆ. స్త్రీ. ౧. భిక్షువుగాఁ దిరుగుట, పర్యటనము. ౨. దాడి వెడలుట. ౩. గుంపు, సమూహము, తెగ. ౪. రంగస్థలము.

**వ్రణము¹.** సం. వి. అ. పుం. న. ౧. గాయము, దెబ్బ. ౨. కురుపు, పుండు. ౩. పగులు, బీట.

**వ్రణము².** సం. వి. అ. న. ౧. దోషము, తప్పు.

మ. ......హరికిన్ మర్యాద లేదంచు దూషణమున్ జేయఁగ వాని దూషణముఁ గంస
ధ్వంసి యాలించి యే,వ్రణమున్ న్నాయెడ
లేదు నింద గలిగెన్ వారించు వేరీతియో.
భాగ. ౧౦. ఉ. ౫౮.

**వ్రణకృత్తు.** సం. విశే. (త్) ౧. గాయపఱుచునది. ౨. క్షీణింపఁ జేయునది.

వి. త్. పుం. నల్లజీడిచెట్టు.

**వ్రణహము.** సం. వి. అ. పుం. ఆముదపుఁజెట్టు.

**వ్రణారి.** సం. వి. ఇ. పుం. గోపరసము, బాలెంత బోళము.

**వ్రణితము.** సం. విశే. (అ. ఆ. అ.) గాయపఱుపఁబడినది.

**వ్రతచర్య.** సం. వి. ఆ. స్త్రీ. వ్రతము చేయుట, వ్రతాచరణము.

**వ్రతచర్యుఁడు.** సం. వి. అ. పుం. బ్రహ్మచారి.

**వ్రతతి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. ౧. లత, తీగె. ౨. వ్యాప్తి, వ్యాపించుట.

వ్రతపారణ. సం. వి. అ. స్త్రీ. ఉపవాసానంతర భోజనము.

వ్రతపారణము. సం. వి. అ. న. వ్రతపారణ.

వ్రతప్రతిష్ఠ. సం. వి. అ. స్త్రీ. వ్రతాచరణము, తా నవలంబించిన వ్రతము కొనసాగించుట.

వ్రతభంగము. సం. వి. అ. పుం. ౧. వ్రతము చెడుట. ౨. ప్రతిజ్ఞా భంగము, అన్న మాట తప్పుట.

వ్రతభిక్ష. సం. వి. అ. స్త్రీ. ఉపనయనమున కంగముగాఁ జేయు భిక్ష.

వ్రతము. సం. వి. అ. పుం. న. ౧. నోము, పుణ్య సాధనముగాఁ బురాణములందుఁ జెప్పఁ బడిన వ్రతము. ౨. శపథము, ప్రతిజ్ఞ.

ఉదా: సత్యవ్రతుఁడు, దృఢవ్రతుఁడు. మొ॥

౩. భక్తికి స్థానమగు పదార్థము.

ఉదా: పతివ్రత, దేవవ్రతుఁడు, పితృవ్రతుఁడు. మొ॥

౪. జీవన పద్ధతి, ప్రవర్తనము, నడవడి. ౫. శాసనము. ౬. యజ్ఞము. ౭. పని, కార్యము. ౮. వేద విహిత క్రియ, సంస్కారము. ౯. యుక్తి, పన్నుగడ.

వ్రతముచెడ్డ సుఖము దక్కకుండు. కాని పని చేసినను ఫలము గలుగకపోవు.

సీ. తురకల యీదునందు ముదంబు గల్గెనో భక్తి నిత్యోత్సవ పరత మాని ...

గీ. చాంద్రః దుర్మార్గు లయ్యెయో వ్రతము చెడ్డ, సుఖము దక్కదు వడి ఢిల్లి చొరఁగఁ ద్రోలు ... సిం. నార. ౮.

వ్రతస్నాతకుఁడు. సం. వి. అ. పుం. బ్రహ్మచర్యము పూర్ణము గావించిన ద్విజుఁడు.

వ్రతాదేశము. సం. వి. అ. పుం. (ద్విజుల) బాలుర కుపనయన సంస్కారము చేయుట.

వ్రతి. సం. విశే. (న్. సీ. న్.) వ్రతము గలవాఁడు, తపోనియమము గలవాఁడు. భక్తుఁడు.

—వి. న్. పుం. ౧. బ్రహ్మచారి. ౨. సన్న్యాసి. ౩. యజమానుఁడు, యజ్ఞము చేయువాఁడు.

వ్రతోపవాసము. సం. వి. అ. పుం. వ్రతనిమిత్తమైన భోజనాభావము.

వ్రప్పు. వి. (√ వ్రగ్గు.) పరియ, బద్ద, చీలిక.

సీ. తలఁ బడ్డ గుదియ వ్రప్పులఁ బొఁత మసి యిడి యంటి గిజిండ్ల నడుగువారు ... ఆము. ౬. ౫౫.

వ్రయించు. సం. స. క్రి. వ్యయము చేయు, ఖర్చించు.

సీ. బంగారు తలుపులు పాయంగ ధట్టించి లావణ్య విత్త మేలా వ్రయించె, లావణ్య విత్త మేలా వ్రయించును గాక ... క్రీడా. ౨. ౮౭.

సీ. ముదల ముట్టక వీసమును వ్రయింపఁగ రాదు కోపించెనని మదిఁ గుందరాదు ...

క. ఇంచుకయు నే వ్రయింపక, సంచితముగ
ధనము విభుఁడు సానుల కొసఁగెన్ ...
రుక్మాం౧. ౪. ౭౩. ౧౦౫.

**వ్రయ్య.** వి. (√వ్రయ్యు.) వ్రక్క, బ్రద్ద, ఖండము.

సీ......పమ్మిన కృష్ణు బీరమ్ములు వొగడుచు
నున్న నీ నాలుక యొక్కఁడయున్, ...

ఆ. వ్రయ్యవలయు నూఱు వ్రయ్యలుగాఁగ
నట్లయినఁగాని చాల వతనిఁ బొగడ ...
భార. సభా. ౨. ౪౧.

గీ. దివిజపతి నీకు నిచ్చిన తీవ్రశక్తి, చేతఁ గవ్వడి
వడునని చూతువేని, వాసుదేవునిచే నది
వ్రయ్యలయ్యెఁ, దునియలయ్యెను బొడి
యయ్యెఁ బొరఁగు ధరణి.
భార. ఉద్యో. ౨. ౨౩౨.

సీ. విమల హేమాకృతి నమరు మహాండమై
కరమొప్పఁ దద్భూరి గర్భమూర్తి, యై
యుండి బహువత్సరాత్మకం బగు కాల
మేగిన నది యువియించు కొనుచు, బుట్టె
నజుఁడు క్రిందటి వ్రయ్య భువియు మీఁది,
వ్రయ్య దివియును నడుమంబరంబుఁ జేసి,
దిశలు కాలంబు మనసు బుద్ధియును వాక్కు,
గామరోష రత్యాది సర్గము నొనర్చె.
హరి. పూ. ౧. ౫౩.

శా. అయ్యంబంచుఁ దదార్య దంపతుల
నెయ్యంబొప్ప సేవించుచున్, వ్రయ్యల్గా
సకలాఘముల్ హరి వినిర్మాల్యంబు ధమ్మిల్ల
సాహయ్యం బొంద ...
ఘటి కా. ౨. ౨౩.

**వ్రయ్యఁబుచ్చు.** స. క్రి. (√వ్రయ్యఁబోవు.) వ్రయ్యఁ బోఁజేయు, భేదించు, బయలు పఱుచు.

సీ. కడలేని ప్రేమంబు గప్పెద మంటిమా
పులకాంకురంబులు పులుగు చెప్పు, బెడి
దంపు వెగడు పాటడఁచెదమంటి వైవర్ణ్య
భావంబు వ్రయ్యఁ బుచ్చు ...
వరాహ. ౪. ౧౭.

**వ్రయ్యఁబడు.** అ. క్రి. (వ్రయ్యన్ + పడు. స్వార్థమున.) వ్రయ్యు, భేదిల్లు.

శా......తదుద్భూత ధ్వనుల్ దాఁకిలోఁ,
కాలోకాద్రి గుహాల్ ప్రతిధ్వను లొసంగం
బోయి వ్రయ్యంబడన్.
రామా. ౬. ౩౨.

**వ్రయ్య(లు)వాఱు.** అ. క్రి. (వ్రయ్య+వాఱు.) భేదిల్లు, తునియలగు.

ద్వి. విప్రుండవై యిట్లు విపుల కోపమున, నీ
ప్రాణి నొప్పింప నేలనా కనక, తక్క
నీకుక్క తల వ్రయ్యవాఱ, మొక్కలంబుగ
నీకు మోదంగఁ దగునే ...
రం. రా. ఉ. ౧౩౫. పా. ౨. ౫౦.

**వ్రయ్యలు వాపు.** స. క్రి. (√వ్రయ్యలు వాయు.) చీల్చు, భేదించు, పగుల్చు.

సీ. గోరఁ బోఁజీనమాడ్కిఁ గొన్నింటిఁ
జక్కసాఁ బాలుగా వ్రయ్యలు వాపి
వాపి ... భార. విరా. ౫. ౩౫.

వ. పాద జాను జంఘోరు కటి మధ్యోదరాంస
కర్ణనయనంబులు వేఱువేఱు భాగంబులుగా
వ్రయ్యలు వాపి యార్చిన ...
భాగ. ౧౦. ఉ. ౩. ౪౨.

వ్రయ్యలు పాయు. అ. క్రి. (వ్రయ్యలు + పాయు.) భేదిల్లు, పగులు.

చూ : వ్రయ్యలు వాపు.

వ్రయ్యు. అ. క్రి. (సం. వ్రశ్చ్.) బ్రద్దలగు, భేదిల్లు, పగులు.

క. సునిశిత తుండహతిని వ్రస్సిన పర్ణపుటంబు వాసి చెదరుచు నృప నందను వీర్యము యమునానది, వన మధ్యము నందు వాయు వశమున బడియెన్.

భార. ఆది. ౩. ౩౦.

సీ. శ్రవణ పుటంబులు వ్రయ్యంగఁ దాఁకి సంక్షోభంబు గావించె గుణము మ్రోఁత ...

భార. విరా. ౪. ౧౮౦.

గీ. రాలు నాకుల తాకున వ్రస్సి యొడళు, లవనిఁ గూలంగఁ గుక్కలు గవిసి కఱవ ...

మార్కం. ౨. ౬౯.

క. ఇయ్యకొని నగరు గట్టుచు, నయ్యెడ నొక దేవదూల మది పలకలుగా, వ్రయ్యుటకు నాడె నాడను, జయ్యనఁ గీలములు గాడఁ జఱచిన పిదపన్.

పంచ. నా. ౧. ౫౫.

వ్రశ్చనము. సం. వి. అ. పుం. ౧. చిన్న అంపము. ౨. లోహకారుఁ డుపయోగించెడి యాకురాయి. ౩. చెట్టు గంటు (నఱకు) నుండి స్రవించు రసము, జిగురు.

—న. ౧. ఛేదనము, నఱకుట. ౨. నఱకు, గంటు.

## వ్రా

వ్రాఁకుడు = వాఁకుడు. వి. కంటకారి. శ్రీ. (శ. ర.)

వ్రాఁత. వి. (√వ్రాయు.) ౧. లిపి, లేఖనము, బ్రహ్మలిపి.

సీ. ...వ్రాలునా వ్రాఁతనా లిపియొప్ప ...

ఆం. భా. ౨. ౧౮౪.

ఉ. ఆ సరసీ తటాంతిక శిలాక్షర పంక్తిఁ బఠించి చూచి యీ, వ్రాసిన వ్రాఁత యుజ్జయిని రాజ్యము చేరుటఁ జాటి చెప్ప ...

విక్ర. ౨. ౫౫.

క. హా ధాత వ్రాఁతయని శర,బాధం గలఁగఁ గనువారి పజ్జకుఁ జనియెన్ ...

రాఘవ. ౧. ౨౩.

క. మనసు నిలుపఁ జాలక కడు,పునఁ బుట్టిన దోసమునకుఁ బొగులుచు వేఁడం, జనుదేర నానఁ బెట్టితి, పనిలేదిఁక నాని వ్రాఁత ఫలమిటు లుండెన్.

సారంగ. ౩. ౪౪.

౨. రేఖ.

ద్వి. పసిబిడ్డ నాఁడు నీ పాద పద్మముల, నెసఁగు వ్రాఁతలు జూచి యెఱిఁగిన వారు,యెన్నిక మీఱ ననేక కాలంబు, చెన్నొంద మను నని చెప్పిరి కాని ...

నవ. ౨. ౯౯. పౌ. ౩. ౫౦.

క. అజ్ఞానంబున హరున క,వజ్ఞ దలఁచి యతని నొసలి వ్రాఁత ఫలమునన్, యజ్ఞము సేసెను

సురల యశుజ్జ్వలాంబర వృద్ధి కప్పుసులు సమ
కొనుసే. భీమ. ౨. ౭.

౩. వస్త్రాదుల యంచుల యందు వేసిన చిత్రము, నకిషీ.

సీ. పసిఁడి వ్రాఁత చెఱంగు మిసిమి దోఁపఁ
జెలంగు నరుణాంశుకో త్తరీయుంబులోఁడ ...
మను. ౩. ౪౧.

సీ. అపర దిక్సతి కట్టినట్టి సాగర మను పుట్టంబు
తుది వ్రాఁత మొగడ యనఁగ ...
ప్రభా. ౧. ౫౪.

మ. చెఱుఁగు ల్వ్రాఁత పసిండి వ్రాఁత మిసిమిం
జిత్రాతి చిత్రంబులై ...
వసు. ౫. ౯౪.

౪. చిత్ర లేఖనము, చిత్తరువు వ్రాయుట.

ఉ. ......నీ, నెచ్చెలితోఁడు సుమ్ము సఖి
నిక్కము చెప్పుము వ్రాఁత నేర్పుగా,
కిచ్చెలువంబు గల్గు ఘనుఁ డెక్కడనే నొక
డుండెనేని ...
ప్రభా. ౧. ౧౪౪.

వ్రాఁతకాఁడు. వి. (వ్రాఁత + కాఁడు.) వ్రాయువాఁడు.

సీ. తలుకు బంగారు టెక్కల వారువము జోదు
బ్రతుకుఁ బ్రొద్దుల లెక్క వ్రాఁతకాఁడు...
దశా. ౨. ౬౨.

సీ. ...లిపికారకుండొప్పు లే కరియున వ్రాఁత
కాఁడనఁగను ...
అం. భా. ౨. ౧౭౪.

వ్రాఁతచోవడి. వి. (వ్రాఁత + చోవడి.) వ్రాసెడి చోటు, గ్రంథకుటి. (శ. ర.)

వ్రాఁతపని. వి. (వ్రాఁత + పని.) వస్త్రాదుల యందు వ్రాసెడి చిత్రపుఁ బని, నకిషీపని.

గీ. పికిలి పూబంతి దంతపుఁ బిడి కడాని, పోఁత
యొరవంక మొలవంక పొంకపఱచి, తమ్మి
దోడుమ్మి జోడు సాదనల హరువు, వ్రాఁత
పవి దుప్పటీ వలివాటు వైచి.
కువల. ౨. ౪.

చ. ......మినుకు కడాని వ్రాఁతపని మేలరి
గల్ పయిపై నటింపఁగన్ ...
దశా. ౪. ౨౭.

వ. చౌసీతి బంధపు వ్రాఁతపని ప్రతిమల చుట్టంచు
చందురు కావి దుప్పటి బంగరు చెఱంగుల
వలెవాటులును ...
ప్రబంధ. ౪౭.

వ్రాఁతబల్ల. వి. (వ్రాఁత + బల్ల.) వ్రాయస
కాండ్రు కాగితము లుంచుకొని వ్రాసికొనెడి
నాలుగు కాళ్ల బల్ల. (వా. శ. ర.)

వ్రాఁతసాకిరి. వి. (వ్రాఁత + సాకిరి.) పత్రములు
వ్రాసికొను వానిచే రప్పింపఁ బడి పత్రము
నందు సంతకము చేసిన సాక్షి. (శ. ర.)

వ్రాజము. సం. వి. అ. పుం. గమనము, నడక.

వ్రాతము. సం. వి. అ. పుం. గుంపు, సమూహము, మొత్తము.

—న. ౧. శరీరశ్రమము. పాటుపడుట. ౨. దినకృత్యము, రోజు కూలి. ౩. తాత్కాలిక
కోద్యోగము.

వ్రాతీనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. రోజు కూలీ వలన బ్రదుకువాఁడు. ౨. సంఘజీవి, సంఘము వలన బ్రదుకువాఁడు. ౩. త్రిమ్మరుల గుంపునకు సంబంధించినవాఁడు. (విల్యమ్సు.)

వ్రాత్యా. సం. వి. ఆ. స్త్రీ. జాతిభ్రష్టుని కూఁతురు.

వ్రాత్యస్తోమము. సం. వి. అ. పుం. విధి విహితము లయిన సంస్కారముల నాచరింపక పోవుటచేతఁ బోయిన యధికారమును మరల గలిగించు కొనుటకై చేయు యజ్ఞవిశేషము.

వ్రాత్యుఁడు. సం. వి. అ. పుం. ౧. ఉపనయనాది సంస్కారములు లేని ద్విజుఁడు, జాతిభ్రష్టుఁడైన ద్విజుఁడు. ౨. నీచపురుషుఁడు. ౩. శూద్రునకు క్షత్రియ స్త్రీయందు బుట్టిన పురుషుఁడు.

వ్రాయసము. వి. (√వ్రాయు.) ౧. వ్రాత. (శ. ర.)

౨. ఉత్తరము, జాబు.

ఆ. కూర్మి నతని నెదురుకొని కౌగిలించి యే, కాంత మండపమున నధివసించి, యటఁ గుశలంబు నేమ మరయుచుఁ దండ్రి, వ్రాయ సముఁ జూచి భక్తినంది యందు.

జై. భా. ౧. ౧౨.

౩. అజ్ఞాపత్రము.

మ. విభవేంద్రుండు విరూరి శాసన మహా విఖ్యాతి రామానుజ, ప్రభు వేదాద్రి లిఖించు వ్రాయసము లౌరా పెద్ద సంగావనీ, విభు చిత్తంబు నెఱింగి గంటమురవల్ విద్యా వధూ నూపుర, ప్రభవప్రౌఢ ఝుళం ఝుళా రభటి సౌభాగ్యంబు దీపింపగన్.

పాండు. ౧. ౧౧.

వ్రాయసకాఁడు. వి. (వ్రాయసము + కాఁడు.) లేకరి, వ్రాఁతకాఁడు.

సీ. ......లిపికారకుం డొప్పు లేకరి యన వ్రాఁతకాఁడ నఁగను ...

ఆ. భా. ౨. ౧౭౪.

వ్రాయి. వి. (వ్రాయు. బ. వ్రాలు.) ౧. అక్షరము, వర్ణము.

క. సుకుమారము శ్రుతి సుఖదము, నకలంకము నైన వర్ణమాద్యక్షర సృష్టికి రెండవ వ్రాయి సుమీ, సుకర ప్రాసంబనంగ సుల భము కృతులన్.

కావ్యా. ౪. ౪౮.

గీ. నక్షల జగదింద్ర జాలంబు నెఱపు మాయి, యచ్చులకు నెల్ల మొదలవైచిన వ్రాయి, కొలుచు వారల పాలిఁటి తలఁపురాయి, రావణానుజ దాయి శ్రీరంగ శాయి.

వాల్మీ. ౨. ౩౧.

సీ. అణి ముత్తెముల సోయముగ మించిన వ్రాలు వరుసతో నిరుగేల వ్రాయనేర్చె ...

విక్ర. ౧. ౫౦.

సీ. అల చుక్క లనియెడి వలరాజు గెలుపు వ్రాల్దెలియఁ బూసిన మషీ లేప మనఁగ...

పారి. ౨. ౩౮.

౨. లిఖి. గీత.

ఉత్సాహ. చేతి వ్రాలు చూచి యిది యశేష రాజ్య విభవ భోగాతిశయము గలిగి యలరు ననియు ... కళా. ౬. ౧౯౨.

వ్రాయించు. స. క్రి. (√వ్రాయు.) ౧. లిఖింపఁ జేయు, వ్రాయునట్లు చేయు.

క. మించుతమిఁ గణజముల్ చెఱి,పించుచుఁ
గై జీతములకు పేర్వేరఁ ప్రా,యించుచు
నెల కొలువునకుం, బంచి యిడుచు మందు
గుండు బాణము లెల్లన్.
కువల. ౨. ౫.

౨. చిత్రింపఁజేయు.

గీ. మగని మగువను ప్రాయించి మదిఁ దలంచు,
నిషధ రాజును దన్నుఁగా నీరజాక్షి ...
నైష. ౧. ౪౮.

క. వనిత చతుర్జాతి వయో, వనజాక్షుల బంధ
వైభవము భద్రుని దత్తుని గూచి మారుఁ
బాంచాలుని ప్రాయించెన్ గృహంబు
లోపలి గోడన్. కాళ. ౪. ౧౫.

ప్రాయు. స. క్రి. ౧. లిఖించు.

చ. శతధృతి ప్రాసినట్టి లిపిజాల మనర్థము గాని
యట్లుగా ... నైష. ౧. ౫౫.

గీ. ప్రాయ నేర్చిననాఁడె సద్వర్ణసమితి, నర్థి
నర్థులు ప్రబల ప్రాయంగ నేర్చె ...
విక్ర. ౧. ౪౯.

గీ. సకల సీమంతినీ లోక సమితికాయి, భాగ్య
వర్ణావళులు ప్రాసెఁ బద్మగర్భుఁ, డనఁగ ...
అము. ౫. ౧౦.

౨. గీయు.

శా. ఈ లాతంబున ప్రాయఁ బట్టణములో నీ
పాదుకల్ మెట్టఁగా, నేలోకంబున నేగ
సులభంబు ... విక్ర. ౨. ౪.

౩ చిత్రించు, (రంగులో) బొమ్మువేయు.

గీ. ఒరగి రతిదేవి పాలిండ్ల నొత్తగిలిన, యించు
విలుకాని ప్రాసినారిదుఫు నందు ...
నైష. ౪. ౧౫౦.

చ. వనిత కుచద్వయంబు పయి ప్రాసిన కుంకుమ
పత్రభంగముల్ ...
పారి. ౧. ౧౧౩.

చ. అదిమొదలీ వధూటి విరులంటదు కస్తురి
గీరుబొట్టు పెట్టదు పువుఁదోట డాయదు
పటంబులు ప్రాయదు వీణచెంతఁ జేరదు
నెనరైన చిల్కను గరంబున దాలిచి ముద్ద
టించుఁ దాఁ, గదియదు కంజకాండ కర
కార్ముక కర్మహతా హతాంగియై.
కువల. ౩. ౪౭.

౪. రాయు, సంఘర్షణము చేయు.

క. నేల బదాంగుళి ప్రాయుచు, బాలామణి
నిల్చెఁ దలిమ పర్యంతమునన్ ...
నైష. ౪. ౧౭౪.

ఎ. గీ...... నాగకన్యలతోడి కలహ,మునకుఁ
గాల్ద్రవ్వదవో లేక బొటనవ్రేలఁ,
బుడమి ప్రాసెద విజయేల పువ్వుఁబోఁడి.
దశా. ౨. ౩౭౪.

ప్రాయఁగా రానిది = బూతు.

గీ. జపము సన్నంపు పెలుఁగును జరుపు వతనిఁ,
జేరి వేలోక వికచ రాజీవ నేత్ర, మొగము
మొగమునఁ జేరిచి నగవులొలుక, ప్రాయఁ
గా రాని పలుకులు పలికెనపుడు.
చిత్రభా. ౩. ౩౦.

ప్రాలు[1]. వి. ౧. సంతకము.

గీ. ప్రాసి నాతండు తుదిఁ దన ప్రాలుపెట్ట, నమ్మఁగల పత్ర మిదియంద్రు నాగరి కులు ... విజ్ఞా. ౩. ౧౦౯.

సీ. కలుగు విద్వజ్జనంబుల నెల్లఁబట్టి తెప్పించి యత్యాగ్రహ భీమకర్ముఁడై, 'దివాత్పరతరం నాస్తి' యటంచును ప్రాలు పెట్టించు ...
పరమ. ౫. ౩౫౦.

(౧౦౩-౨.) దా. శా. ౧౧౦-౨.

(౧౦౩-౨.) దా. శా. ౧౧౦౪.

౨. అక్షరములు. (ప్రాయి శబ్దమునకు బహు వచన రూపము.)

ఆ. నీటి ప్రాలకరణి నేటికి దోడ్తోన, సృష్టి నష్టమయ్యెఁ గష్టమనుచు ...
వరాహ. ౧౧. ౨౨.

గీ. తెలిసెను భయాన్వయంబులు వృద్ధిఁబొంద, ప్రాలుఁ బ్రాలును గల మంత్రి ప్రోల మంత్రి ... భీమ. ౧. ౪౫.

౩. రేఖలు.

క. అఱచేత ప్రాలు గను న, త్తఱిఁ బడె నొక యంప కట్టె ... అము. ౬. ౭౪.

క. అఱచేతి ప్రాలుచూచిన, దొరయొందును లేని దొడ్డ దొరఁ జేకొని ... నీలా. ౧. ౭౩.

ప్రాలు². అ. క్రి. ౧. పక్షి మొదలగునవి క్రిందికి దిగు.

ఉ. .....పురవరోప వనంబులు సొచ్చి యిచ్చఁ బూ, గుత్తుల ప్రాలి తేనియలు కుత్తుక బంటిగఁ గ్రోలి లీలమై, నొత్తిలి ప్రాయుచింపు దళుకొత్తుచు నుండు మదాళి దంపతుల్. విక్ర. ౧. ౯౪.

సీ. ఘనసాను శృంగ శృంగాటకంబులఁ గాంచి యమరులు హేమాద్రి యనుచు ప్రాల ...
మను.చ. ౩. ౧౧.

ద్వి. పిండాన్న శేషముల్ ప్రిదుకల మెసఁగి, యొండొండ ప్రాలుచు నున్న ఘూకములు...
ద్వి. హరిశ్చ. ఉ. ౧౬౪-౨.

౨. దుముకు, ఉఱుకు.

ఉ. నాఁడును గంటిఁ బోకుమని ప్రాలె మహీన్ విటపాళి నుగ్గుగా ...
అము. ౬. ౨౧.

౩. పడు.

ఉ. క్రంగన ఘంటమైఁ గొడపు ప్రాలుట యన్నఁడొ నాఁటనుండియున్, సంగరముం గరంబుగ మనంబున భావనసేయనైరి ... మహీపతుల్. నైష. ౩. ౨౫.

సీ. ముడి విప్ప నడుగుఁ దమ్ములపైనె ప్రాలు పెన్నెఱులఁ దేఁట్లగుట సందియము గలదె ... అము. ౨. ౩౦.

సీ. పై మిన్ను ప్రాలినఁ బదరని ధైర్యంబుఁ గటకటా కలఁచి చీకాకు చేసె ...
చంద్రా. ౪. ౯౬.

గీ. మును గళావంతుఁ డానతిచ్చిన సుభాషి, తము లిఖించిన చీటి దోర్దండ చండ, మండలాగ్రంపు టొఱలోన మాటి యుండెఁ, గాన నది నేల ప్రాలుటఁ గని యతండు.
శుక. ౧. ౧౨౧.

౪. పూలు.

ఉ. వాలిక దొడ్డ నారసము వజ్రము శైలముఁ
దాఁకు నాకృతిన్, ఫాలము మీఁదఁ దాఁకిన
నిభంబు కొసంబడి కొమ్ము లూఁత గా,
వ్రాలుడు నర్ధచంద్ర రుచిర ప్రదరంబునఁ
ద్రుంచె బాణ వి,ద్యాలసితుండు గ్రీడి భగ
దత్తుని కంఠ మకుంఠితోద్ధతిన్.

భార. ద్రోణ. ౧. ౩౫౮.

చ. ఘనశర వేదనల్ బలియఁగా వసుకుంభిని
వ్రాలియున్న య,మ్మని యుగళంబు
దొట్రుపడ ... రాఘవ. ౧. ౨౭.

ద్వి. చావుతో సరిపోల్పఁ జను మూర్ఛ నొంది,
భూవర పుత్రుండు భూమిపై వ్రాలె ...

ద్వి. హరిశ్చ. ఉ. ౧౮౨౦. పం.

౫. ఒఱగు.

ఉ. నెట్టన యాపగా సుతుఁడు నేలకు వ్రాలె
ననంగ విన్న నా, కట్టఁడి వీనులేమి విను
కాఱియ కోర్వవు ...

భార. భీష్మ. ౧. ౬౫.

గీ. ......తల్లడిల్లి, వారలందఱుఁ దలలటు
వ్రాలవైవ, నింద్రజితుఁ డంత తండ్రితో
నిట్టులనియె.

భా. రా. యు. ౨౯౧.

గీ. పూల పానుపుపై వ్రాలి వాలుగంటి ...

నీలా. ౨. ౮౩.

౬. వంగు.

గీ. నరసి వ్రాలిన బొమలెత్తి పరమవృద్ధు ...

హర. ౨. ౪౮.

ఉ. ...... సాంధ్యవారి భృ,త్కాందళముల్
దవోదళ యుతంబులునై గొల పండి
వ్రాలెఁ బూ,ర్ణేందుని పేరఁ బ్రాచి ...

పారి. ౨. ౪౧.

క. వ్రాలిన ఱెప్పలు జెతఁ గై, వ్రాలిన హృద
యాంబుజంబు వసుమతి మీఁదన్, వ్రాలిన
చూపులు ...

సారంగ. ౨. ౨౫౫.

౭. పక్షపాతము వహించు.

క. కావునఁ గౌరవ పాండవు, లీ వసుధకునై
పెనంగు టెగ్గే దైవం, బేవంక వ్రాలె
వారిక, పోవుం గా కిది నరేంద్ర పొగులకు
మింకన్.

భార. భీష్మ. ౧. ౪౩.

సీ. దేవల సప్తగోదావరీ తీర్థైక వాసుండు మన
వంక వ్రాలెఁ జూవె ...

భీమ. ౩. ౨౧౫.

౮. నమస్కరించు.

సీ. అనఘ నేఁ దురగంబు గొనివచ్చు నందాఁక
నంగ రక్షకుఁడవై యధిపుఁ గాచి. ...

గీ. యుండుమని మాద్రి పుత్రుల నుపచ్ఛరించి,
ద్రౌపదికిఁ జెప్పి మఱియును దానవారి,
యడుగులకు వ్రాలి యద్దేవు ననుమతమున,
నరిగె ననుమోదమున యౌవనాశ్వ పురికి.

జై. భా. ౧. ౧౩౮.

ఉ. ...నొగల్ తదంఘ్రులం, దుండరొదన్
మహా గిరులు హోరనఁ బ్రస్తుతి వ్రాలి ...

ఆము. ౬. ౪౭.

౯. క్రుంకు.

సీ. అతి దరిద్రాణ దేహద్యుతి ప్రాణమై
ప్రాలేయ కిరణ బింబంబు వ్రాలె ...

నైష. ౮. ౫.

గీ. పూచెయునఁ గ్రుంకు కడలిలోఁ బ్రొద్దు
వాలె ... నీలా. ౩. ౩.

ఉ. కూళ తనంబునం బ్రభులకుం దను మర్దన మాచరించుచున్, బ్రాలుడు ప్రొద్దులోన గృహవాటికిఁ జేరునతండు నిత్యమున్ ...

శుక. ౨. ౩౬౩.

౧౦. అతిశయించు.

క. ఆలోఁ గర్ణుని చేతం, దూలని చతురంగము లను దొరలను ధరణీ, పాలమన మొనలఁ గానను, బ్రాలిన దర్పమున మెఱయు పడ ముడిఁ దక్కన్.

భార. కర్ణ. ౨. ౪౫.

ఉ. తారకు డన్మహాసురుఁడు తామర సాసన దత్తమైన దు,ర్వార వరాను భావమున బ్రాలి త్రిలోకము నేలుచుండు ...

హర. ౩. ౩.

క. వాలి నిరాతంక మహః, కేలిని వారింపఁ గరుణ గ్రేఁగంట నిడన్, బ్రాలిన వారని మీకడ, కేలిన వాఁడని చెనను మహీవరు లారా. చంపూరా. ౬. ౧౭.

౧౧. విజృంభించు.

ఉ. చిచ్చుఱ కన్ను మూసికొని చేతి త్రిశూలము డాచి లీలమై, వచ్చిన రుద్రచండమున బ్రాలుడు వీవనిలోన నోర్వఁగా, వచ్చునె నిన్ను నెట్టి మగవారికి....

భార. భీష్మ. ౩. ౩౦౦.

సీ. పెనుగొండ కడ బ్రాలి పిక్కట్లు మొదలైన ప్రతి పక్షులను హతా హతము చేసి ...

జై. భా. ౧. ౪౫.

౧౨. వ్యాపించు.

సీ. కదలి కరళ్ల రాయిడిఁ గీడ్పడి తటాంత వన రాజిమై నంటి బ్రాలె ననఁగ ...

వసు. ౫. ౩౬.

క. మేలిమి సంధ్యారాగము, బ్రాలిన చీఁక టియుఁ గలసి వరుణుని వంకన్, నీలముఁ గెంపును నతికిన, పోలికఁ జూపట్టె నట నభోమణి తలఁగన్.

మొ. రా. అయో. ౭.

౧౩. ప్రకాశించు.

సీ. వలుద చీఁకట్లలో బ్రాలు చుక్కలు వోలె వేణీ భరమ్ములో విరుల ప్రేల ...

ఉ. హరి. ౫. ౨౭౬.

౧౪. ప్రసరించు.

సీ. పైపై మహాశ్చర్య పర్యుత్సుకంబులై తన మీఁద నృపుల నేత్రములు బ్రాల ...

నైష. ౪. ౧౩౪.

క. ...వసుమతి మీఁదన్, బ్రాలిన చూపులు...

సారంగ. ౨. ౨౫౬.

౧౫. సంభవించు.

గీ. రాజు లేని కతంబున రాష్ట్రములకు, నన్నిటికి బాధగా ధరిత్ర్యంతరమున, బ్రాలె నటువది రేఁడులవగ్రహంబు ...

కాశీ. ౫. ౨౬౮.

౧౬. ప్రసిద్ధి కెక్కు.

ఉ......బోరిలో, వాడిమిఁ గొంతకాల మిల బ్రాలుట లావరి యాట ...

ఆము. ౬. ౨౧.

గీ. వ్యసన సప్తక మెప్పుడొప్పఁ దని రొతిఁగి,
వాని వర్జించి ధరనెల్ల ప్రాలిచియేలి, సార్వ
భౌమత్వమంద నజ్జన విభుండు ...
కేయూర. ౪. ౨౦౩.

౧౬. తగ్గు, క్షీణించు.

క. పొంగుచు మూఁడు జగంబులు, రంగసఁగఁగ
నేలుచుండి ప్రాలని బలుకీ, వింగేరదు నీ
కిప్పుడా, బంగరు చిటిపాప చెలిమి పాటిల
వలదే. అ. రా. అర. ౩౨.

౧౭. మూర్ఛిల్లు.

సీ. అరదంబుపై ప్రాలి యాలోన దెలిసి
తన్నెసి నాతనిఁ బడనేయువారు ...
భార. విరా. ౩. ౧౯౮.

౧౮. చచ్చు, మృతినొందు.

సీ. ఘనభేరికా ధ్వనుల్ విని గుండియలు ప్రేల
ప్రాలు మల్కులకు గోలీలు సేసె.
వసు. ౧. ౪౯.

సీ. భర్తృ జామాతృ సౌభ్రాత్రాదు లాజిలో
ప్రాలుట కొఱలు బిబ్బిల కతన ...
రంగా. ౩. ౨౩౯.

ప్రాలుచు(ల్చు). స. క్రి. (√ప్రాలు.) ప్రాలఁ
జేయు, క్రిందికి దించు.

ఉ. వాసవుఁ డొయ్య నొయ్య నఱ ప్రాలిచె
ఱెప్పలు వేయుఁ గన్నులన్ ...
నైష. ౬. ౪౭.

గీ. అనిన వినియును ప్రాల్చె పక్ష్మాంచలములు,
బాల ... నైష. ౫. ౧౦౧.

ఉ. .........నృపాలు రొండొరుల్,
ఱెప్పలు ప్రాల్ప కంతయు మఱిన్ దని
వారక చూడ నంతన,య్యొప్పుల కుప్ప
మెప్పగు శుభోదయ వైభవలీల రంజిలన్.
ఇందు. ౫. ౮౭.

౨. పడఁజేయు.

ఆ. ......పుత్ర, నిన్ను వంప ప్రాల్ప సేసెర
ననియె నీ,విట్టు క్రింద మీఁదు నెఱుఁగ
కునికి. భాగ. పూ. ౧౦. ౩౬౬.

సీ. వాలాగ్రమున గిరుల్ ప్రాల్చె నీతనిధైర్య
సంపద కిఁక నెవ్వి సాటి యనుచు ...
ఉ. రా. ౧. ౭.

౩. కూలుచు.

సీ. ......వడిఁగల తేజీలఁ బుడమి ప్రాల్చి...
ఉ. రా. ౪. ౩౫౦.

౪. వంగఁజేయు, వంచు. (మేరువును ధను
వుఁగాఁజేసి వంచినాఁడు.)

సీ. బర్హిర్ముఖార్థమై పర్వతేశు నితండు దాల్చి
నాఁ డీతండు ప్రాల్చినాఁడు ...
ఉ. హ. ౧౭౦.

గీ. ప్రాల్చె నెమ్మోము లజ్జాభరంబు పేర్మి ...
హర. ౩. ౭౧.

౫. తొలఁగ జేయు, తొలఁగించు.

మాలిని. ......నీ, యన్నకు మృత్యువు నన్ను
నెఱుంగ నా ప్రాణము లిప్పుడు ప్రాల్చెద
నం,చున్నత శాతకృపాణముఁ ద్రిప్పుచు ...
మార్క. ౧. ౩౬.

క. నవలా కుచ రేఖలకున్, నవలాకుచ రేఖ లీడు నకు రాకున్నే, యవనీ జనములు మఱి గా, రవ మొదలఁగ వీ పు తో లు వ్రా ల్ప క యున్నన్. చంద్రా. ౨. ౧౨౪.

వ్రాలించు. స. క్రి. (√ వ్రాలు.) వ్రాలఁజేయు, వాలించు.

సీ. సాలింద్ల దను వెడ వ్రాలింపఁ జెన్నొందు నసదుఁ గొఁ దీఁగె యల్లాడు చుండ ... భార. విరా. ४. ౨౬.

వ్రాసి వ్రాయక. అసమా. క్రి. సగము వ్రాయు చునే, వ్రాయుట పూర్తి కాకుండఁగనే.

సీ. ...కులశైల తనయ చెక్కులయందు మకరి కల్ వ్రాసి వ్రాయక వచ్చె వామదేవుఁడు... దశా. ३. ౧౦.

## వ్రి

వ్రిక్కు. వి. కలుగు, విరియుట యందలి ధ్వని కనుకరణము.

ద్వి. వ్రక్కలై మేనెల్ల విక్కన విరియ ... బస. పు. ३. ४౧౫. పం.

## వ్రీ

వ్రీడ. సం. వి. అ. స్త్రీ. ౧. లజ్జ. సిగ్గు. ౨. అడఁకువ, వినయము.

వ్రీడనము. సం. వి. అ. న. ౧. లజ్జ. ౨. అడకువ.

వీడము. సం. వి. అ. పుం. వ్రీడ.

వ్రీడితము. సం. విశ. (అ. అ. అ.) సిగ్గు పడినది.

వ్రీలు. అ. క్రి. అ. బ్రద్దలగు. ఛేదిల్లు.

క. ఒదవిన కినుకం గొదగొని, గదగొని హాల ధరుండు రథము కండ్లును నొగలుం, జదిపి పతాకయు సారథి, విదారణము చేసి మిన్ను వ్రీలఁగ నార్చెన్. ఉ, హరి. ४. ౨४౬.

చ. చటుల కృపీట సంస్థిత రసాస్థలి వ్రీలక యుండఁ గార యి,చ్చుటకును బోలె ... మను చ. ౬. ౧౦౮.

మ. కని యత్యుద్ధతి శంఖ మొత్తుటయు...విని యోగంబులు దప్పె భూత చయముల్ వ్రీలెన్ దిశా భాగముల్. హర. ३. ౧౫३.

ఉ. మాళవ మాగధుల్ పఱపు మార్గణ మొక్కటి పెక్కురూపులై, వ్రాలిన వాజి రాజి మహి వ్రాలె రథధ్వజ పాళి నుగ్గులై, వ్రేలె భట చ్ఛటాంగములు వ్రీలె మదావళి దంత కుంభముల్, గూలె ... రా. వి. ౫. ౧౦.

౨. నశించు, చెడు.

శా. ఆలో మాయ ఘటించి యా దితిసుతుం డా ఖిల కాలానల, జ్వాలో దగ్ర విషంబు గ్రక్కుచు ఫణ వ్యాకీర్ణ రత్నప్రభల్, క్రాలన్ గ్రూర భుజంగమై యగురు దేరం జూచి యమ్మాయ వే,వ్రీలం జేసె మునీంద్ర సూచిత మహా విద్యా ప్రభావంబునన్. రాజ. చ. ౨. ౮౦.

క. వాలం పతాఁకునకు ధృతి, వ్రీలఁగ హా తాత యనుచు వెలువడు తన్మ,త్స్యాళీ లాపమునకు,

నా జన, పాల కులోత్తంసు గుండె భగ్గునఁ గలఁగన్. రాఘు. ౧. ౨౨.

**వ్రీలి(లు)పడు.** అ. క్రి. (√వ్రీలు.) సత్వహీన మగు, దౌర్బల్యము నొందు.

క. అనల సుతుఁ డనల కణములు, పెనఁగొన నమరారి దూత వ్రీలి పడంగాఁ, గనుఁగొని... కు. సం. ౧౦. ౫౪౦.

**వ్రీల్చు(లుచు).** స. క్రి. (√వ్రీలు.) చీలుచు, వ్రద్దలు చేయు.

వ. ...మిమ్ము నాలుకలు గోయక పెలవులు వ్రీల్పక ప్రాణంబులు గొనక యెట్లు సైరింప వచ్చు ... నైష. ౩. ౭౭.

**వ్రీళ = వ్రీడ.** సం. వి. ఆ. స్త్రీ. లజ్జ, సిగ్గు.

శా. ...బాలా రత్నము కేళి కా కుతుక సామర్థ్య శ్రీ క్రియా దూరిత, వ్రీళా సూచక సానురాగ వికస ద్వీక్షారుచుల్ మీఱఁగా ... దశా. ౩. ౬౬.

**వ్రీహి.** సం. వి. ఇ. పుం. ౧. వరిధాన్యము. (వడ్లు.) ౨. ధాన్యపు గింజ, వడ్లగింజ.

**వ్రీహికాంచనము.** సం. వి. అ. న. ధాన్య విశేషము, ఒక విధమగు కాయధాన్యము, మసూరము.

**వ్రీహిరాజికము.** సం. వి. అ. న. కంగువు, కొఱ ధాన్యము.

**వ్రీహ్యాగారము.** సం. వి. అ. న. ధాన్యపుకొట్టు.

## వ్రే

**వ్రే.** వి. గొల్లకులము, ఆ కులమునకుఁ జెందిన వాఁడు.

ద్వి. తెరవునఁ బాలించు వ్రేతోఁడు నతఁడ... బస. పు. ౪. ౬౯. పం.

గీ. వీఁడెపో వ్రేల గీముల వెన్న జున్ను, గములు గొల్లఁగ మెక్కిన గండిదొంగ ... నీలా. ౩. ౫౨.

**వ్రేఁకటము.** వి. వ్రేకము, భారము.

ఉ. వెన్నలి వ్రేలఁగాఁ బిటేఁది వ్రేఁకట మెయ్యనఁ గ్రింది కీడ్వఁగాఁ, జన్నుల మీఁదఁ గ్రిక్కిటిసి సందెటి దండలు పొంత నిక్కఁగా, సన్న పుఁ గౌనుదీఁగ గడు సన్నముగా ముని వ్రేళ్ల నిల్పి తాఁ, బొన్నలు గోసెఁ జేతులను బుప్పొడి యొప్పెడు కొమ్మ కొమ్మలన్. ద్వా. ౩. ౧౭౪.

**వ్రేఁకటి = వేఁకటి.** వి. (వ్రేఁగు + కట్టు.) గర్భము, చూలు. (సంధిని వర్ణలోప వర్ణాదేశములు.)

ఉ. వ్రేఁకని బండివానికిని విప్రునికిం బలికిన్ వివాదికిన్, వ్రేఁకని మోపువానికిని వృద్ధునకుం గడుఁ జిన్న బిడ్డకున్, వ్రేఁకటియాఁడు మానిసికి వేఁడుఱు వానికి దెవ్వ గొంటుకుం, దేఁకువతోఁ దొలంగు నది తెల్లముగా నెదురేగు దెంచినన్. విజ్ఞా. ౨. ౧౬.

ఉ. శాశ్వత కీర్తులన్ దిశలు సారణసేయఁ దలంచు సర్వభూ, మీశ్వర భామినీ జనము

సెల్లబనుల్ గొన నిచ్చగించు నీ, విశ్వము
నేలుకోఁ దివురు ప్రేఁకటి కోరికలందు
నాది గర్భేశ్వరుఁ గుక్షిలోన ధరియించిన
యట్టి మహానుభావతన్.
పి. శకుం. ౪. ౫౩.

ప్రేఁకదనము. వి. (ప్రేఁక + తనము. వృత్తి ని వర్ణవికారము.) ౧. గౌరవము, గొప్పతనము.

క. కని కొలువు సేసికొని మా,లిని నాఁ జని
సాధ్వి యిది మలీమ సవృత్తం, బున పొంతఁ
బోవదెన్నఁడు, నన్ను ప్రేఁకఁ దనంబు
దోఁచునట్లు చరింతున్.
భార. విరా. ౧. ౧౦౬.

౨. బరువు, భారము.

ఉ. ఒక్క శరాసనంబు దగ నున్నది యెక్కుడు
లావు చూడ్కికిన్, వెక్కసమైన రూప
మును ప్రేఁకఁ దనంబును గల్గి చేవమై,
నెక్కుడదివ్వ నెవ్వరికి నేగతి మానము
గాక ... భా. రా. బాల. ౩౦౦.

సీ. తారా చలము వేఁకఁ దన మెంత వింతటి
బాహుని చే నెత్తువడియె నట్టె ...
కు. సం. ౩. ౨౪౭.

(ఇది ౧. ౨. అర్థముల కుదాహరణము.)

ప్రేఁక. విశే. ౧. భారవంతము, బరువైనది. (కర్మధారయమునందు దీనికి నిగాగమము నిత్యముగా నగును.)

వ......ప్రేఁగు లాఁగలేక మూఁగి వీఁగి ప్రేఁక
లగు మ్రాఁకుల ప్రోకలకుఁ చేఁటలగు పెద్దోఁ
టలను ... భాగ. ౭. ౪౪౩.

క......అతం, డాఁక గొనక యతని ధనువు,
ప్రేఁకని భల్లమునఁ ద్రుంచి వైస వగ్గతి
యన్. భా. ద్రోణ. ౧. ౨౦౧.

ఉ. వేనలి పాటపాట నర చంద్రుకతోఁ దిల
తండులాన్వయ, శ్రీ నటియింపఁ గై సడలి
ప్రేఁకని చన్నులు పాలవంకలై, కానని
యార్పు వాలుఁ దెలి కన్నులఁ గల్గు తనంబు
వీడ్కొనన్, మానిని హస్త మూఁది యొక
మంజుల భాషిణి వచ్చె వీథికిన్.
కాశీ. ౩. ౧౫౯. విజ్ఞా. ౨. ౧౬.

౨. పెద్దది, అధికము.

ఉ. అఁక యొకింత లేక విప్పృతాస్యరటత్
స్ఫుట వహ్ని కీలముల్, దాఁక దిగంతముల్
గమియ దాడలు దీటుచు వాఁడికిన్కఁ
జే,రాఁకలి నీ జగత్త్రయము నాహుతి
చేయఁ దలంచెనో యనన్, వీఁకఁ గడఁగి
కృత్య యొక ప్రేఁకని శూలముఁ గేలఁ
దాల్చుచున్. నృసిం. ౪. ౧౩౩.

సీ. ప్రేఁకని యలుక కల్పించి మంచము కోఁదు
గాఁగిలించుచొకమ్మ గాని వింత ...
కువల. ౫. ౩౫.

చ. ......సర్వ భూజనములు సన్నుతింప విల
సన్మతి బంధులు సంతసింప ప్రేఁకని విభ
వంబు పెంపెసఁగఁ గట్టె సుతున్ యువ
రాజ పట్టమున్.
పి. శకుం. ౪. ౧౫౬.

సీ. కలదె యీ చందంబు చెలులెవ్వరికి నృపో
ద్భవుల కానోపుదు రవయవముల, తీరునై

ప్రేకని తేజంబుగడిఁదిరిగు పాలు పారు
దర్పంబుఁ బొల్చెఁ జూడ ...

హరి. పూ. ౯. ౫.

ప్రేకన. వి. (√ప్రేక.) భారము.

చ. ......దృష్టికిఁ గడు ప్రేకనై తనదు
చెల్వులుఁ జుట్టలుఁ దాను సంతసం,బు
కలిమి నేచి మిన్నడిచి పుణ్య పరావృతుఁడై
కెలింగెడున్.

భార. స్వ. ౧. ౨౫.

సీ. ...అత్యద్భుతంబు, నగు కృష్ణ దుష్కర
వ్యాపార మాత్మకు ప్రేకనై వెలసిన
విబుధనాథుఁ, డా త్రిదివమున ...

హరి. పూ. ౭. ౧౯౦.

గీ. నిడివి గాఁగ బ్రదుకు విడువంగ ముడువంగ,
ప్రేకనైన కలిమి వృద్ధిఁ బొందు ...

కాశీ. ౬. ౧౯౯.

ప్రేకము. వి. భారము, బరువు.

ఉ. కాకర పండు వంటి జిగి గల్గిన మేలి పసిండి
ధాత్రికిన్, ప్రేకము ద్రవ్వి పోసినను
వేయి యుగంబులు చెల్లు ధాన్యముల్,
పోఁకకుఁ బుట్టె డమ్మినను పోనొక కల్పము
పట్టుఁజూడ్కి పే,రేఁకటి వీర వైశ్యపతు
లిండ్లు గనుంగొన నొప్పు రప్పురిన్.

రాజ. చ. ౧. ౫౦.

చ. చనుఁ గవ ప్రేకమున్ జఘన చక్ర భరం
బును మోవలేక ...

పారి. ౪. ౨౫.

ఆ. కోర్కి ప్రేకమునను గులశైలము బోలె,
నిశ్చలత నతండు నిలిచెఁ గాక, ధృశ
తపంబు వలనఁ గృశుఁ డతం డొకమంద,
పవను చేత నెగని పాఱఁడెట్లు.

కవిక. ౬. ౪౦.

—విశే. ౧. పెద్దది, గొప్పది.

ఉ. తాఁకినఁ జూచి వాఁ డతనిఁ దారసిలంగ
రథంబు దోలి నీ, యాఁకకు నిల్వ దీ యరద
మన్నఁ బిఱిందికిఁ బోవఁగా నొగల్,
దాఁకెడు దేవదంతిఁ బడఁ బాఁకె దురం
బునఁ ద్రొల్లి నావుడున్, ప్రేకపు నారసం
బుల హరించె నతండు శతాంగ వేగమున్.

రామా. ౮. ౧౬౮.

గీ. కాను గడగడ వడఁక ప్రేకపుఁ బిఱుందు,
భారమున నెన్నడలు తొట్రుపడఁ దటాక,
మవని కన్యక వెలువడి యధిపుఁ గూడి, దరిని
నిల్చిన సకియ లందఱును జేరి.

ఉ. రా. ౬. ౧౧౪.

చ. ...యే, వెరవున నిల్చు దీని వగు ప్రేకపు
గుబ్బల ప్రేఁగునన్ జదల్, దొరసిన యట్టి
నెన్నడుము తోరపు నల్వ కడంక మెచ్చితిన్.

యయా. ౪. ౪౬.

—౨. అధికము. (ప్రేఁగు యొక్క రూపాంత
రము.)

వ. రక్కసి యొడయుని బెడిదంబున కోర్చి
యతని ప్రేఁకంబులైన మాఁకల నేలం
గూల్చి యంత. యయా. ౩. ౩౫.

౩. దుర్భరము, దుస్సహము.

ఉ. కాఁక నెదిర్చి సంగర ముఖంబున హెచ్చిన రాజ వంశమున్, గూఁకటి వేళ్లతోఁ జెఱికి గోత్ర వధంబును జేసినట్టి యా, వ్రేఁకపుఁ గీడుగాక ప్రజవేఁచఁ దలంచిన గోరు చుట్టుపై, రోఁకటిపోటు చందముగ రోసి జనుల్ ననుఁజూచి తిట్టరే.

జై. భా. ౧. ౬౪.

ఉ. కానఁగ రాని దుఃఖములు గాంచఁగ నయ్యెడు మత్త బంభరీ, గానము పూను నీ సురభి కాల మదేటికిఁ వ్రేఁక మయ్యెనే...

గంధ. ౧. ౯౩.

వ్రేఁగడరు. అ. క్రి. (వ్రేఁగు + అడరు.) భార పడు.

క. ఎఱకలు విచ్చుచుఁ దుండము, తెఱచుచు వ్రేఁగడరి సొగసి వ్రెల్లి వివశుఁడై, యఱచిన నోడకుమని హరి, నెఱి సక్కఁగఁ ద్రోచి యొత్తె నెనయంగఁ గృపన్.

భార. ఉద్యో. ౩. ౩౦౧.

వ్రేఁగడుపు. వి. (వ్రేఁక + కడుపు.) స్థూలోదరము, పెద్ద కడుపు.

చ.......గౌరి ముందఱన్, గురువులు వాఱు వ్రేఁగడుపుఁ గుఱ్ఱఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడిన్. వీర. ౧. ౫.

వ్రేఁగు. అ. క్రి. ౧. తపించు.

చ. చెదరక నామసంబు నృపశేఖర నీయెడ నిల్చి మన్మథ, ప్రదర పరంపరా నిహతి పాల్పడి వ్రేఁగెడు...

మనుచ. ౬. ౯౪.

సీ. తడవుల నుండియుఁ దపము సేయఁగఁ బూని మణికంధరుఁడు పాట మాని యునికి, నుపవాస ఖేదంబు నపనయింపఁగ లేక వ్రేఁగుచున్నవి నాదు వీను లిపుడు...

కళా. ౨. ౫౩.

గీ......దైవకృత్యంబులకును, విఘ్నవేఁగుట వ్రేఁగుట వెఱ్ఱితనము...

దశా. ౨. ౪౧౮.

౨. బాధపడు.

గీ. విశ్వ మందిర యిందిర వివిధ గతుల, వారిచే నిట్లు మదిఁ గ్రాఁగి వగల వ్రేఁగి, విరహ శిఖి నాపఁ దరమె యే కరణినైన, నీ కరుణ లేక యంచుఁ గన్నీరు నించు...

లక్ష్మీవి. ౪. ౧౦౫.

—వి. భారము, బరువు.

ఉ. ఎందును నెవ్వరుం బడని యెంతయుఁ గష్టము పాటు వచ్చినం, గొందలమంది పాండువిభు కోడలు దవ్వుల నున్న నన్ను గో,విందుఁడ కావుమంచుఁ బలవించుట యూఁగఁగ రానియప్పుఁ బో,లెందల పోయ వ్రేఁగయి చలింపక యున్నది యొప్పుడున్ మదిన్. భార. ఉద్యో. ౨. ౧౨౮.

క. కేలుం బగలును మొగమున, బ్రేఁలుచుఁ
బలి వాయకున్న బ్రేఁగునతో......అ,బ్బా
లిక మొగమెత్తదు ...
కు. సం. ౫. ౬౫౦.

—విశ. ౧. భారము కలది, బరువైనది.

ఉ. వేడుక వేల్పు దొయ్యలుల ప్రేఁగు చనుం
గవ మీఁద మన్మథ, క్రీడల ప్రాలి నిద్రల
సుఖించి ప్రభాతములందు ...
హరి. ఉ. ౧౦. ౨౯౧.

౨. దుస్సహము.
సీ. చూపఱెల్లను దన రూపంబు చూడ్కికి
ప్రేఁగైన నత్యంత విస్మయంబుఁ బొందు
చుండ ... భార. విరా. ౧. ౨౧౧.

ప్రేఁగుఁదనము. వి. (ప్రేఁగు + తనము.) బరువు, భారము.

వ. ఒక్కయింటి మన్నెకంటి పంచాశద్వర్ష
దేశీయ పలిత సారంబైన వేణికాభరంబు
గైవడ ముదుసలి చక్రవాకంబులతో నెక
సక్కెంబాడు వీఁగు చన్నుల ప్రేఁగుదనం
బునఁ దన తనూవల్లి జలదరింప.
భీమ. ౨. ౧౧౦.

ప్రేఁగుప(వ)డు. అ. క్రి. (ప్రేఁగు + పడు.) బరువెక్కు, బరువు కలవగు.

గీ. ఒండొరువుల లేఁజెమటలు నూనిప్రేఁగు,
పడిన చాడ్పున నవయవ భంగులందుఁ,
దగిలి మఱువునఁ దడయు ...
భార. విరా. ౫. ౩౯౫.

క. నీవ నిను నెఱుఁగకుండిన, నే వారికిఁ దెలుప
వచ్చు నిట సకల లోక,భావహ మగు నీ
యుగ్రపు, భావమునకుఁ జాలప్రేఁగు పడినవి
జగముల్. హరి. ఉ. ౭. ౧౫౩.

మ. జగతీజంబుల శాఖలెక్కి మురళీ శబ్దామృత
స్యందమున్, మిగులన్ వీనులఁ ద్రావి
ప్రేఁగువడి నెమ్మిం గృష్ణు రూపంబు చిత్త
గమై యుండఁగ ...
భాగ. ౧౦. పూ. ౩౯౦.

ప్రేఁచు = వేఁచు. స. క్రి. (√ప్రేఁగు.) వేఁగఁ
జేయు. (శ. ర.)

ప్రేఁడు. వి. గొల్లవాఁడు. (బ. ప్రేలు.)

ఉ. రేపటి పూఁట నెన్నికొని ప్రేఁడు పసిం
గొని పోయి మేపి తా, మాపటి పూఁట
నెన్నిన క్రమంబున నీఁదగుఁ జచ్చెనేనియుం,
గోపరిపాలకుండు చెవిఁ గొమ్ము నిజంబుగఁ
జూపి శుద్ధుఁడౌఁ, జేపడి ముచ్చుకొన్న
యెడఁ జెచ్చెరఁ జెప్పకయున్నఁ దప్పగున్.
విజ్ఞా. ౨. ౧౦.

ఉ. ప్రేని తనూజుఁ డొక్కరుఁడు వీర్య సమ
గ్రుఁడ పోలె వచ్చి నా, పూనిన పూన్కి
యంతయును బొంకగు నట్లుగఁ జేసె నేను
నా, సేనయు దాడి పెట్టెద విశృంఖలతం
బ్రతిపక్షుపెంట మీ, రీ నెతికిన్ సహాయ
పడు టీప్సిత మేనిఁ గడంగుఁ డుక్కునన్.
హరి. ఉ. ౩. ౯౯.

గీ. అకట యెచ్చోటనున్నవాఁ డతని తండ్రి,
వేగ యెఱిఁగింపరే లాభు నెఱవు గలుగు,

త్రేలు విడిపింపఁ గలయట్టి విధము లెల్లఁ,
జేయఁ దగవు రాకే యని కూయుటయును.
హరి. పూ. ౪. ౨౮.

శా. ఆలాపించుచు త్రేలు త్రేఁతలుఁ బ్రభూతా
ళ్ఛర్యులై రందఱున్ ...
భాగ. ౧౦. ౨౫౪.

త్రేఁత. వి. (√త్రేయు.) ౧. దెబ్బ.

క. ఆ సూర్యభానుఁ డీక్రియ, త్రేసిన యప్పరిఘు
దనుజవిభుఁ డధిక బలో,ల్లాసనమునఁ
బుచ్చుకొని పొడి, సేసె నసురు లార్వ నతని
శిరమొక త్రేఁతన్. నిర్వ. ౮. ౫౬.

౨. త్రేయుట.

క. కొండొక సేపునకుఁ దెలిసి, చండ గదా
దండమున నసహ్య క్రోధో,ద్దండత బలు
త్రేయఁగ నా,తండా గద విఱుగఁ జేసెఁ
దనగద త్రేఁతన్.
హరి. ఉ. ౧. ౧౨౯.

భోగినీ దండకము. తల్లి రాజుల్ బహు వ్యాజులే
భోజులే చంచల చ్ఛిత్తులే మత్తులే త్రేఁత
కాయత్తులే నూతనాసక్తులే లోభ సంయు
క్తులే దోష సంసిక్తులే ...

త్రేఁపు = వేఁపు. వి. (√త్రేఁగు.) త్రేఁపుడు,
వేగఁజేయుట. (శ. ర.)

త్రేఁపుడు = వేఁపుడు. (శ. ర.

త్రేటు. వి. (√త్రేయు.) ౧. (కత్తి మొదలగు
వానితో) కొట్టుట, త్రేయుట.

గీ. పోరి రేటును త్రేటును బోటు నొక్క,
యలవిఁ జెలఁగంగ నుభయ సైన్యముల
వారు ... భార. భీష్మ. 3. ౨౨౫.

గీ. చలము శోభిల్ల నొండొరు సమయఁజేయ,
వేగపడి పెల్లునొంచుచో త్రేటుఁ బోటు,
నాటు నగపాటు నొండొరు లోటుపడక,
దారుణంబుగఁ బోరి రవ్వీర వరులు.
భా. రా. ఆది. ౨. ౧౩౪.

సీ. త్రేటున కనుకైన రీతిమైఁ దమ వాగ సన్న
కెంబడిగ నశ్వములు మెలఁగ ...
కళా. ౮. ౬౮.

౨. దెబ్బ.

గీ. అలుక యంతంత కెక్కఁగ హలధరుండు,
విమతఁ బొరిగొందు నింకొక్క త్రేటుత్రేసి,
యని తలంచుచుఁ దెను గద హస్తతలము,
నందమర్చి యుగ్రపు దృష్టి నతనిఁ జూడ.
హరి. ఉ. ౨. ౬౨.

క. దగ్గఱి రొసిన చాంద్రుఁడు, స్రగ్గక గదఁ
గొనుచు త్రేటు సరగునఁ గొన్నన్, మొగ్గ
రము లోన నిరువుర, యగ్గలికలు మెఱసె
గదలు నాశ మంటన్.
ఉ. హరి. 3. ౬౧.

చ. అన విని త్రేటుపడ్డ యురగాంగనయుం బలె
నేయి వోయ భగ్గన దరికొన్న భీషణహుతా
శన కీల యనంగ లేచి ...
పారి. ౧. ౭౨

